# రామాయణము

# యుద్ధకాండ






ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణము

## వచనము

## యుద్ధకాండము.

మొదటిభాగము.

దేవరాజసుధీప్రణీతము.



మద్రాసు:

ఆనందముద్రాయంత్రాలయమునందు

ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెనీవారిచే ప్రకటితము.

1912.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.




పుట.

పుట.

# పటముల పట్టిక.

శ్రీ రఘునన్దన పరబ్రహ్మణేనమః.

# శ్రీమద్రామాయణము

## యుద్ధకాండము.




రాముండు, హనుమంతుండు కలిగినది కలిగినట్లుగాఁ జెప్పిన వృత్తాంతము నంతయు విని మిక్కిలియుఁ బ్రీతుండై యట్టి ప్రియవార్తఁ విన్నపిదపఁ జెప్పందగిన పలుకుల హనుమంతుంగూర్చి సుగ్రీవాదులతో 'హనుమంతుండు చేసినకార్యము * గొప్పది; మిక్కిలియు గొప్పది.ఇట్టిది భూమియందెవ్వరికిని జేయ నలవికాదు; చేయుటకే కాక మనస్సునఁ దలంచుటకుఁగూడ వేఱెవ్వరికిని భూతలమున శక్యముగాదు (గరుత్మంతుండును వాయుదేవుండును నొక్కటిగాఁగలసి మహాసముద్రమును దాఁటుదురు.

అవతారిక. సుందరకాండమున భగవత్ప్రాప్తికి పురుషకారభూతయగు లక్ష్మి చేసిన కార్యము చెప్పఁబడినది. ఇఁక నుపాయకృత్యము చెప్పుటకై యుద్ధకాండ మారంభింపఁబడుచున్నది. ఇందు, కార్యము సాధించివచ్చిన భృత్యునియెడల స్వామి యిట్లునడచుకొనవలయునని యుపదేశించుటకై సుగ్రీవాదులను నుత్సాహయుఁజెంచుచు సీతావృత్తాంతమును దెచ్చిన హనుమంతుని రాముఁడు ప్రథమసర్గమున సత్కరించుచున్నాఁడు. ఇందు 'శ్రుత్వా హనుమతో వాక్యమ్' అను ప్రథమశ్లోకమున 'హనుమతః' అనుశబ్దమునంగల 'మ' కారముచే గాయత్రి పదునైదవయక్షరము గ్రహింపఁబడినది. కాన పదునాలుగువేలగ్రంథము ముగిసి పదునైదవగ్రంథసహస్రము ఆరంభింపఁబడుచున్నదని తెలియునది.

* సముద్రమును దాఁటుటచే గొప్పది; లంకను బ్రవేశించుటచే మిక్కిలియుగొప్పది. లంకను ధర్షించుటచే దుర్లభమైనది; లంకనుండి మరలి వెడలివచ్చుటచే మనస్సునఁ దలంచుటకుఁగూడ శక్యముగానిది యనుట; అనఁగా మొదట సముద్రమును దాఁటుట శక్యముకానిది. దాఁటినను లంకను బ్రవేశించుట యశక్యము. ప్రవేశించినను దానిని ధర్షించుట యశక్యము. ధర్షించినను దానిని వెడలివచ్చుట యశక్యమనిభావము. మఱియు 'ప్రత్యక్షే గురవః స్తుత్యాః పరోక్షే మిత్రబాన్ధవాః। కర్మాన్తే దాసభృత్యాశ్చ నకదాచన పుత్రకాః॥' 'గురువులను బ్రత్యక్షమున స్తుతింపవలయును. మిత్రులను బంధువులను పరోక్షమునఁ బొగడవలయును. దాసులను భృత్యులను, కార్యముతీర్చినపిదపఁ గొనియాడవలయును. పుత్రుల నెప్పుడుగాని స్తుతింపఁగూడదు' అన్నట్లు రాముఁడు దాసుండగు హనుమంతుని, కార్యసాధనానంతరము కొనియాడుచున్నాఁడని తెలియునది.

యట్టి మహాసముద్రమును దాఁటి దానిదక్షిణపుగట్టు నెట్లు పొందఁగలరు? * సీతకు, సముద్రమును దాఁటివచ్చున ట్లీవృత్తాంతము చెప్పఁబడియేయున్నది. అయినను వానరులు సముద్రమునుదాఁటి యవ్వలిదరిచేరుటకు నిఁకమీఁదటఁ జేయవలసిన యుపాయ మేమిగలదు? ఏమియును లేదే ' యనెను. పగవారిని రూపుమాపు మహాబాహుఁడు రాముఁడు, హనుమంతుం జూచి యిట్లుచెప్పి యంత శోకంబునఁ దత్తఱపడుచు చింతించుచుండెను. ఇది మొదటిసర్గము.

†సుగ్రీవుఁడు రామునిదుఃఖమును జూచి దుఃఖనివారకము లగువచనములం జెప్పుట.

అంత దశరథమహారాజపుత్రుఁడు గాన శోకావేశమునకుం దగనిరాముఁడు సంతోషయుక్తుఁడై యున్నసమయమునసే శోకమునఁ బొక్కుచుండుటంజూచి సకలమిత్రగుణసంపన్నుఁడగు సుగ్రీవుఁడు, అతనిదుఃఖమును బోఁగొట్టుమాటల 'వీరోత్తమా! ప్రాకృతునియట్లు నీవును బరితపించుచున్నావేమి? ఇట్లుండవలదు కృతఘ్నుఁడు సౌహృదమును విడుచునట్లు నీవు దుఃఖమును దిగవిడువుము. సీతవృత్తాంతమును శత్రువుండుస్థలమును దెలిసియైనపిదప, రాఘవా! నీకు దుఃఖము గలుగుటకుఁ గారణమేమో నాకుఁ దోఁచలేదు. నీవు రాఁగలవృత్తాంతమును గనుంగొనునట్టి సూక్ష్మబుద్ధిగలవాఁడవు, నీతిశాస్త్రముఁ దెలిసినవాఁడవు, ఊహాపోహములందు నాఱితేఱినవాఁడవు, ఇది యిట్లగునని నిర్ణయించు జ్ఞానమును గలవాఁడవు. (ఇట్లు నీగుణములనుబట్టిచూచినను శోకము గలుగరాదు.) యోగి యగువాఁడు మోక్షపురుషార్థమునకు దూషకమగుబుద్ధిని విడుచునట్లు నీవు నీయుత్సాహమును దూల్చుటచే

హనుమంతునికిచ్చితిని వేన్యుద్ధ్రిభవసమయమున సీతను రక్షించెను.'అవగాహ్యార్ణవం స్వప్స్యే' 'సముద్రములోఁజొచ్చి నిదురించెదను' అని నను ప్రాణములు విడువదున్న దశలో నన్ను సీతాసందేశమునుజెప్పి రక్షించెను. ఇట్లు మాయువురకును దేహము లొసఁగినవానికి నాయొక్క దేహమిచ్చుట యుచితమా యే ముయభిప్రాయము.

* ఇందులకు 'యస్య త్వేవతువృత్తాన్తో వై దేహ్యాగదితో మమ। సముద్రపారగమనే హరీణాంకిమివోత్తరమ్' అనిమూలము. దీనికి నాసీతయొక్క యీవృత్తాంతము నాకుఁ జెప్పఁబడినదే! అయినను సముద్రమును దాఁటుట కుపాయ మెట్లు? అని యర్థాంతరము.

† ఇట్లు శోకసంభ్రాంతుఁడగు రాముంజూచి సమదుఃఖితుఁడుగాన సుగ్రీవుఁ డాశోకమునకుఁ దాళక 'అపద్యున్మార్గగమనే కార్యకాలాత్యయేషుచ। అపృష్టోఽపి హితాన్వేషీ బ్రూయాత్కల్యాణభాషితమ్' 'ఆపదయందును తప్పుమార్గమునఁ బ్రవర్తించినపుడును, కార్యమునకుఁ గాలము మించిపోవునపుడును, హితముగోరువాఁడు తన్నడుగకున్నను మంచిమాటలు చెప్పవలయు' ననియుండుటచే దుఃఖనివారకమగు వచనమున 'శుచిత్వా త్యాగితా శౌర్యం సమానసుఖదుఃఖితా। అనురాగశ్చ దాక్షిణ్యం సత్యతాచ సుహృద్గుణాః' అన్నట్టి మిత్రలక్షణములన్నియుఁ గలవాఁడుగాన రామునికి సమాధానము చెప్పుచున్నాఁడని తెలియునది.

పాపాత్మకమయిన యీబుద్ధిని దిగవిడువుము (సముద్రము దుస్తరమేయనియు సంతాపమక్కఱలేదు.) మేము మహానక్రములు నెఱసియున్న సముద్రమును దాఁటి లంకాపురికోటలపయి నెక్కి నీపగవానిని రావణునిం జంపెదము. కాన సముద్రమెట్లు దాఁటుదుము? లంక నెట్లెక్కుదుము? శత్రువు నెట్లు చంపుదుము? అని సంతాపమువలదు. *శోకమున మనస్సు వ్యాకులమై, దానిచేత నుత్సాహముదూలి, దైన్యమునొందినవానికి సమస్తప్రయోజనములును నశించును. అందువలన నతనికి శోకమే కాక యాపదయు సంభవించును; (ఇట్లు శోకమునకుఁ గారణమే కలుగదు కారణమున్నను దానిని విడువవలయును.) సహాయములేదనియు శోకము వలదు. శూరులును సమర్థులును నగునీమావానరయూథనాథులందఱును, నీకుఁ బ్రియంబునకై, యగ్గినుఱుకుటకయినను నుత్సహించియున్నారు. ఇఁక తక్కినదానికిఁ జెప్పనేల. వారల కట్టియుత్సాహమున్నదని యెట్లు దెలిసికొంటివందువా? వీరల యుబ్బునుజూడఁగా నట్టియుత్సాహము గలవారని నాకుఁ దెలియుచున్నది. నాకీవిషయమై దృఢమైన తర్కముగలదు. నేను పరాక్రమించి, సీత నపహరించిన పాపకృత్యమున కొడిగట్టిన నీపగవానిని రావణునిఁ జంపి సీతం దెచ్చునట్లు, నీవుత్సాహంబు సేయవలయు. ఆయుత్సాహము మఱేమికాదు. రామా! సముద్రమునందు సేతువు గట్టునట్లును, మనము రాక్షసేశ్వరుఁ డగు రావణుని లంకాపట్టణమును జూచునట్లును నీవుత్సాహము సేయవలయును. త్రికూటపర్వతశిఖరమునఁ బ్రతిష్ఠితమై యున్నయాలంకాపట్టణమును జూచినం జాలును. ఆ చూచినంతమాత్రనే, రావణుండు యుద్ధమున హతుఁడైనట్టే నిశ్చయింపుము. భయంకరమై వరుణాలయమగు సముద్రమున సేతువునుగట్టక, దేవేంద్రసహితులగు దేవాసురులయినను, లంకాపురిని దేఱచూడఁ జాలరు. లంక దాపటివఱకు, సముద్రమున సేతువు గట్టినతత్క్షణముననే, యీవానరసైన్యమంతయు సముద్రమునుదాఁటి జయమునుబొందినదని యెంచుకొనుము. ఈవానరులు, యుద్ధమునందు శూరులును గామరూపులు నగుదురు (లంకాపట్టణమును రాక్షసులతోఁగూడఁ బెకలించి తెచ్చుటకును శక్తులయియున్నారు.) రాజా! అందువలన శోకముపాలై సమస్తకార్యములను నశింపఁజేయునట్టి యీ బుద్ధిని, ఈ దుఃఖమును, వదలుము. లోకమునందంతటఁ బురుషుండు దుఃఖమునొందునేని, అతని శౌర్యము నశించును. మహాప్రాజ్ఞా! శౌర్యమే ముఖ్యముగా నవలంబించియుండు పురుషుఁ డిట్టికాలమున, దేనిని నోడఁగూర్చుకొనవలయునో యట్టిధైర్యమును పరాక్రమమును నవలంబించియుండును. నినుబోఁటిశూరులును మహాత్ములు నగు పురుషులు, అగపడకుండు దానివిషయమైకాని, నశించినదానివిషయమైకాని, ఏవిషయమునందును ఎంతమాత్రము దుఃఖమునొందఁగూడదు. అట్లు దుఃఖమునొందిరేని

* శోకమువలన అనుత్సాహము, అనుత్సాహమువలన దైన్యము, దైన్యమువలన అర్థనాశము, అర్థనాశమువలన ఆపద, ప్రాపించునుగాన యిన్నిటికి మూలమయిన శోకము వదలుమనిభావము.

సమస్తకార్యములును జెడును. నీవు సమస్తబుద్ధిమంతులలోను నుత్తముఁడవు. సమస్తశాస్త్రములను దెలిసినవాఁడవు. మఱియు నాయట్టిసహాయులంగూడి, యిప్పుడు శత్రువునువధింపుము. రామా! యుద్ధంబున నీవు విలుఁదాల్చియుండఁగా, నీయెదుట నిలువఁజాలినవాఁడు, ముల్లోకములం దెవ్వఁడును నాకగపడలేదు. వానరులుపయిమోపియున్న యీ కార్యము, ఎంతమాత్రము చెడలేదు. ఇఁక ననంతమగుసముద్రము దాఁటి శీఘ్రముననే సీతాదేవింజూడఁగలవు. రాజా! అట్లుగావున నింతవఱకు దుఃఖంబూనినది చాలు. ఇఁక క్రోధము గయికొనుము. క్షత్రియులు నిరుద్యోగులయినచో మందభాగ్యులగుదురు. మిక్కిలియుఁ గోపముగలవానికి నందఱును భయపడుదురు. మమ్ముంగూడి యిఁక నీవు భయంకరుఁడును నదీనాథుండునగు సముద్రుని దాఁటునట్టి యుపాయమును నిచటనే సూక్ష్మబుద్ధితో విచారింపుము. నాసైన్యమంతయు సముద్రము దాఁటెనేని సిద్ధముగా జయమునొందినట్లె యని నిశ్చయింపుము. కాన సేతువుగట్టునుపాయమే ముందు చింతింపవలయును. యుద్ధమున శూరులును గామరూపులునగు నీవానరులు శిలలను వృక్షములను జడిగాఁగురియించి యాశత్రువులనందఱను ధ్వంసము సేయుదురు సుమా. రామా! నీవు యుద్ధోత్సుకుఁడవుగదే. సేతువుగట్టియే కానున్నను మఱెట్లోయొకవిధముననయినను, సముద్రమును దాఁటుదము. దాఁటవలసినదే యడ్డి. అంతట వాఁడు (రావణుఁడు) యుద్ధమున హతుఁడయ్యెననియే తలఁచెదను. పెక్కుమాటలు చెప్పి ప్రయోజనమేమి? అన్నివిధములను నీకుఁ దప్పక జయము సిద్ధించును. అట్లని నాకు శుభనిమిత్తములు తోఁచుచున్నవి. నామనస్సును మిక్కిలియు హర్షించుచున్నది' అనిచెప్పెను. ఇది రెండవసర్గము.

{* రాముఁడు హనుమంతుని లంకాపురము దుర్గాదుల స్వరూపమడుగుట. హనుమంతుఁడు వానిని వివరించుట.

కాకుత్స్థకులతిలకుండగు రాముఁడు సారమును నెఱుఁగునువాఁడు, గాన సుగ్రీవుఁడు యుక్తియుక్తముగాఁ జెప్పినమాటనువిని యొప్పుకొని, యంత హనుమంతుం జూచి 'తపము పెంపునఁగాని, సేతువునుబంధించికాని సముద్రము నింకించికాని, ఏవిధముచేతనయినఁగాని యీసముద్రమును దాఁటుటకు నేను మిక్కిలి సమర్థుఁడనై యున్నాను. ఇఁక నీవిషయమై చింతలేదు. హనుమంతా! ప్రవేశింపరానియీ లంకాపురికి దుర్గప్రాకారము లెన్నియున్నవి? వానిని నాకుంజెప్పుము. మఱియు సైన్యము పరిమాణమును, ద్వారములందు చీలలు మొదలగువానిచే నెవ్వరికిఁ జొరరాకుండునట్లు చేసియున్న రక్షణక్రియయును, లంకాపురగుప్తికైన ప్రాకారపరిఖాదుల

* ఇట్లు రాముఁడు మానుషభావము ననుసరించి సముద్రము దుస్తరమేయని శోకము నొందినను మహోత్సాహుండగు సుగ్రీవుని యుపదేశముచే ధైర్యమూఁది నీతిశాస్త్రముచొప్పున సంసారికవలెనే పగవాని దుర్గస్వభావము తెలియ నడుగుచున్నాఁడని తెలియుచున్నది.

నిర్మాణమును, రాక్షసులగృహములును, ముందు నీవు చెప్పఁగా నన్నివింటినిగాని మరల వానినెల్లఁ గన్నారఁజూచినట్లు, విశదముగాఁ దెలిసికొనఁగోరుచున్నాను. నీవు లంక లోనంతయు, అనాయాసంబున, ఉన్నది యున్నట్టుగానే చూచియున్నావు. దానినం తయు నాకు నున్నది యున్నట్టుగానే వివరింపుము. నీవుచూచుటకును చెప్పుటకును అన్నిటికిని సమర్థుఁడనగుదువే కదా!' అని యడిగెను. రాముఁ డడిగినదివిని వాయుపు త్రుఁ డాహనుమంతుఁడు, వాక్యవిదులందు మేటిగావున మరల రాముంజూచి 'లంకా పురము, దుర్గకర్మములగు ప్రాకారము లగడ్తలు మొదలయినవాని నిర్మించుటచేత రక్షిం పఁబడుచున్నవిధమును, సైన్యములు దానిం గాచువిధమును, రాక్షసులకు తమస్వామి యందుఁగల భక్తిప్రకారమును, లంకకు రావణుని తేజముచే సంపాదితమైన యత్యంతస మృద్ధియు, సముద్రముభయంకరత్వమును, లంకయందు చతురంగబలసమూహము లయ్యెయెడల విభజించి యుంపఁబడుటయు, రథగజతురగాది వాహనములసంఖ్యయు నన్నియుఁ జెప్పెదను వినుఁడు' అని చెప్పి యంత నాకపితిలకుఁడు వానినంతయుఁ గలరూ పునఁ జెప్పువాఁడై 'లంకలోని జనులందఱును పెంపుసొంపున మిక్కిలియు సంతుష్టులై యుందురు. అందు మత్తిల్లిన యేనుంగులునిండియుండును. అది మిక్కిలియు విశాలమ యినది. అందు రథములును గుఱ్ఱములును మిక్కిలియు నెఱసియుండును. రాక్షసస మూహములు గ్రిక్కిఱిసియున్నవి. కాన పరులకు నాపురమును ప్రవేశింప నలవిగాదు. అందు విశాలములగు ద్వారములు నాలుగుగలవు వానితలుపులు ఇనుపచీలలు మొ దలగువానిచే దృఢముగా రచితములై యుండును వానికి మిక్కిలియుం బెద్దవి యైన గడియమ్రాకులుండును. మఱియు నవి మిక్కిలియు నున్నతములైనవి. ఆ ద్వారములందు, బాణములను శిలలను రువ్వునట్టి యంత్రములు మిక్కిలియు దృఢ ములును విపులములునై యుండును. పగవారిసైన్యములు నచ్చినపుడు అవి శిలల ను బాణములను నిగిడించి వారిని జొరనీక యాఁపివైచును. ఆద్వారములందు వీరు లగు రాక్షసులనేకులు, ఒక్కమాఱు నూర్గురం జంపునవై బెడిదములుగానుండు వాఁడిమొనల యినుపగుదియలను నూఱులకొలఁది నుంచియున్నారు. ఆలంక చుట్టు ను బంగారుమయమైన పెద్దప్రాకారమున్నది. దానినెక్కుట కష్టము. దానియం దచ్చటచ్చట, పద్మరాగములు పగడములు వైడూర్యములు ముత్తెములు, వీనిచే పొదుగంబడిన ప్రదేశములుగలవు. ఆప్రాకారముచుట్టును మహాభయంకరములయిన చక్కనియగడ్తలు గలవు. అవి దిగుటకు నలవిగానంతటిచల్లనినీళ్లు గలిగి మిక్కిలి యు లోఁతయి, మొసళ్లతోను మత్స్యములతోను గూడియుండును. ద్వారముల యొద్ద, ఆయగడ్తలమీఁదుగా రాకపోకలకై పలకలతో చేయఁబడిన నాలు గువంతెనలుగలవు. అవి మిక్కిలియు విశాలములయినవి వలసినపుడు వానిపల కలనెత్తి చిమ్మివైచుటకై ఆవంతెనలందు పెద్దయంత్రములు పెక్కులున్నవి. మఱి యు నచ్చటఁగావలియుండు భటులకుఁగాను గృహములు వరుసగానున్నవి. అచ్చటికి

శత్రుసైన్యములు వచ్చునపుడు, ఆవంతెనలు పట్టణమును రక్షించుచున్నవి. ఎట్లనఁగా, హాయంత్రములగడ్తలమీఁదనెల్ల అంతటను ఈవంతెనలపలకలను జిమ్మివైచుచున్నది. కాన శత్రువులకగడ్తను దాఁటనలవిగాకుండును అందు ఉత్తరద్వారమునందలి యొకవంతెనమాత్రము మిక్కిలియు స్థూలమై, ఎంతయు దృఢముగాఁ గట్టంబడియున్నది; కాన దానిని గదల్ప నలవిగాదు. దానికాధారముగా బంగరుస్తంభములు పెక్కులు అగడ్తలలో నిలుపంబడి యున్నవి. దానిఁ గాచువారి కాధారముగా వేదులును ప్రకాశించుచున్నవి. * రామా! రావణుఁడు ద్యూతాదివ్యసనములచే కలంగని మనంబుగలిగి, ఎచ్చరికతోడ, సైన్యములను ప్రతిదినమును జూచుకొనుటయందు జాగరూకుఁడై తా నెప్పుడును యుద్ధంబునకే యుద్యతుఁడై యుండును. మఱియు లంక త్రికూటపర్వతముపయి నుండుటవలన దాని నెక్కి పయికిఁ బోవుటకు నూఁత యేమియు లేదు. అచటకిఁ బోవుట దేవతలకయిన నలవిగాదు. దానిని జూచుటయు భయముఁ గలిగించుచున్నది. జలదుర్గమును, పర్వతదుర్గమును, వనదుర్గమును, ప్రాకారపరిఘాదిమయం బగుకృత్రిమదుర్గంబును అని నాలుగు విధములయిన దుర్గములుగలవు. రామా! లంక, మిక్కిలియు విశాలమగు సముద్రమునవ్వలితీరమున నున్నది. ఈసముద్రమును దాఁటుటకు నోడదారియు లేదు. మఱియు నిచ్చటివారికి నచ్చటి వార్త తెలియు నుపాయమును లేదు. కాన లంకకు జలదుర్గమున్నది. దేవపురముంబోని యాలంక, పర్వతాగ్రమున నిర్మితమై హయములచేతను గజములచేతను సంపూర్ణమై, యెవ్వరికిని బోవ నలవిగాకున్నది; కాన యెంతమాత్రమును జయింపరానిదై యున్నది. ఇట్లు పర్వతాగ్రముననుండుటచే దానికి పర్వతవనదుర్గములునుగలవు. అగడ్తలును శతఘ్నులను శిలలనుగుప్పు పలువిధముల యంత్రములును, దురాత్ముఁడగు రావణుని లంకాపురమును మిక్కిలియుఁ బ్రకాశింపఁ జేయుచున్నవి. ఈలంకయందు పూర్వద్వారమునఁ బదివేలరాక్షసు లున్నారు. వారందఱు శూలపాణులు, ఎవ్వరికి నెదిరింప నలవిగానివారు, యుద్ధమున ముందునిలిచి ఖడ్గంబులం బోరుదురు. అందు దక్షిణద్వారమున చతురంగసైన్యముతోఁ గూడ లక్షరాక్షసు లున్నారు. ఆచతురంగబలములోనిపదాతులు మిక్కిలియు శూరులగుదురు. అందు పడమటిద్వారమున పదిలక్షల రాక్షసులున్నారు. వారలందఱును చర్మమును కవచమును ఖడ్గములును దాల్చి సమస్త్రాస్త్రంబుల నెఱింగి వెలుఁగుచుందురు.. అందలియుత్తరద్వారమున నూఱుకోట్ల రాక్షసులున్నారు అందు గొందఱు రథికులును గొందఱు గుఱ్ఱపురౌతులును, గొందఱు గజవాహకులునుగా నున్నారు. వారలు సత్కులంబునంబుట్టి రావణునకు విశ్వాసపాత్రులై యతనిచేత మిక్కిలియు గౌరవింపఁబడుచుందురు మఱియు నెవ్వరికిని మార్కొనరానిరాక్షసులు

* ఇట మూలము 'స్వయంప్రకృతి మాపన్నో యుయుత్సూ రామ రావణః। ఉత్థితశ్చాప్రమత్తశ్చ బలానామనుదర్శనే' రావణుఁడు యుద్ధము గోరినపుడు సేనంజూచుట కావంతెనపై వచ్చి నిలుచు ననియునర్థము.

పెక్కువేలకోలఁదిని పట్టణమధ్యమస్థానమున నున్నారు. లంకయం దంతటను జేరి కాపున్నవారు నిండుగా నొకకోటియగుదురు. నే నావంతెనలను విఱుగఁ గొట్టితిని. ఆయగడ్తలను బూడ్చివైచితిని. ఆలంకనంతయుఁ గాల్చితిని. ఆప్రాకారములను గూలఁద్రోచితిని. కనుక నిపు డంతకష్టము లేదు. నేను మఱియు రావణునిసైన్యములో పాతికపాలయి మహాపరాక్రమశాలురగు రాక్షసులను రూపుమాపితిని. ఏయుపాయముచేతనయినను సముద్రమును దాఁటుదము. ఇఁక వానరులు లంకను హతముచేసిరనియే నిశ్చయింపుము. రామా! అంగదుఁడు ద్వివిదుఁడు మైందుఁడు జాంబవంతుఁడు పనసుఁడు నలుఁడు సేనాపతియగు నీలుఁడు సముద్రము నెగురుచు దాఁటిపోయి లంకను దానిపర్వతములతోను, వనములతోను, అగడ్తలతోను, బహిర్ద్వారములతోను, ప్రాకారములతోను, గృహములతోను పెల్లగించి యిచటికిఁ దేఁగలరు. కాన తక్కినసైన్యముతో నీకుఁ బనేమి? సైన్యములన్నింటిలోను సారభూతులయినయంగదాదులకు వేగ యిట్లానతిమ్ము. యాత్రకు యుక్తంబగుముహూర్తమునఁ బయనంబగునట్లు సమ్మతింపుము' అనెను. ఇది మూఁడవ సర్గము.

(రామునియనుజ్ఞచే సుగ్రీవుఁడు దండు వెడలుట; సైన్యభాగములం దయ్యయోధుల రక్షకులుగా నియమించుట; దండు వెడలుట; రాముఁడు హనుమంతుని లక్ష్మణుఁ డంగదుని నెక్కి బయలుదేఱుట; మార్గమున శుభనిమిత్తములు సైన్యములు సముద్రతీరమును జేరుట; నీలుఁడు సైన్యములను సముద్రతీరమున విడియించుట.)

మహాతేజుండును సత్యపరాక్రముఁడు నగురాముఁడు, హనుమంతుఁడు చెప్పినదంతయు మొదటనుండియు యథాక్రమముగా విని, హనుమంతుంజూచి, 'నీవిపుడు భయంకరుఁడగు రావణునిపట్టణ మగులంకం జెప్పుచున్నావే. దానిని శీఘ్రముగానే హతముసేసి కలంచి నలంచివైచెదను. సత్యమునకుఁ జెప్పెద' నని యంత సుగ్రీవునింజూచి 'సుగ్రీవా! ఈముహూర్తమునందే పయనము కావలయునని కోరుచున్నాను. ఇప్పుడు సూర్యుఁడు పట్టపగలింటనున్నాఁడు గాన ఈయభిజిన్ముహూర్తము ప్రయాణమునకు మనకు యుక్తమయినది; జయమును గలిగించునది. సూర్యుఁడు మధ్యగతుఁడై యుండునపుడు, విజయనామం బగునీయభిజిన్ముహూర్తమున నేను బయనమగుదునేని, సీతను దొంగిలికొనిపోయిన యారాక్షసుఁడు ఎప్పుడుగాని యెచ్చటికిఁ బోయి తప్పించుకొనఁగలఁడు? వాఁ డెక్కడకుఁ బోయినను విడువక వెంటఁబడి గీటడంతును. విషము ద్రాఁగి పీడితుఁడైన యొకఁడు చావఁబోవునంతటిసమయమున, నమృతపుస్పర్శమునొంది కొంత జీవించునట్లు, సీత నేను బయనమైవచ్చుటనువిని జీవితమందు.

గాంతయాశం బొందఁగలదు. సుగ్రీవా! *నేఁడుత్తరానక్షత్రము. పునర్వసునం బుట్టిన నాకిది సాధనతారయగును. రేపు హస్తతో చంద్రుఁడు గూడుచున్నాఁడు. అది నాకు నైధనతారయగును. కాన సమస్తసైన్యములం గూడి నేఁడే పయనమయ్యెదము. మఱియు శుభసూచకములగు శకునములును తోఁచుచున్నవి. అవశ్యము రావణునివధించి జనకరాజకూఁతును సీతం దెచ్చెదము. ఇదిగో నానేత్రము మీఁదుగా నదరుచున్నదిగాన యవశ్యము నామనోరథ మగుజయము సిద్ధించునని తెల్పునట్లున్నది' అనెను. అంత ధర్మాత్ముఁ డగు రాముఁడు కార్యంబుల నిపుణుండుగాన వానరరాజగు సుగ్రీవుండును లక్ష్మణుఁడును దానాడినవాక్యముల నభినందింపఁగా మరల సుగ్రీవునితో 'నీలుఁడు బలవంతులగు లక్షవానరులు వెంటరాఁగా, మార్గమును జూచుటకై యీసైన్యమునకు ముందు నడచుఁగాక' అని యట్లు చెప్పినమాత్రనే నీలుఁడు సన్నిహితుఁడు కాఁగా నతనిం జూచి 'నీలా! సేనాపతీ! మిక్కిలియు ఫలమూలములుగలిగి, చల్లనియడవులతోను జలములతోను గూడి, తేనెయు నవ్వారిగా దొరకుమార్గమున శీఘ్రముగా సేనం దీసికొనిపొమ్ము. దురాత్ములగు రాక్షసులు మార్గంబున ఫలమూలములను జలములను విషాదులుగలిపి చెఱచివేయుదురు. నీవు ప్రాలుమాలిక లేక వారలట్లు సేయకుండునట్లు నిత్యము లెస్స రక్షించుచుండుము. (ఒకవేళ పగవారు పల్లపుపట్టులందును, జలదుర్గములందును, అరణ్యములందును సందుఁ జూచి మనలం గొట్టుటకై సేనల నుంచియుందురు.) వానరులు నలుగడల నాకసంబున కెగిరి యాయాకందువలందు పగవారు సేనలుంచియున్నారో లేదో చూడవలయును. ఏదేని నిస్సారమయిన బలమున్నయెడల దానినిచ్చటనే యుపయోగమునకై నిలిపివేయుఁడు. మన మిప్పుడు పూనినకార్యము భయంకరమైనది సుఁడీ కాన యందఱును దప్పక పరాక్రమము మెఱయవలయును. మహాబలురగు వానరసింహులు నూఱులకొలఁదిని వేనవేలుగాను గూడి, మహాసముద్రము ప్రవాహమువలెఁ జూపట్టు మన సేన యగ్రభాగమును నడపించికొని పోదురుగాక. పర్వతాకారుఁడగు గజుఁడును మహాబలుఁడగు గవయుఁడును, గవాక్షుఁడును, గర్వించియున్న యాఁబోతులు గోవులముందటం బోవునట్లు, సేనకుముందు నడతురుగాక. ఎగురువారిలో నెల్లఁ గన్నాకయి వానరులకెల్ల మిన్నయగు ఋషభుండు, వానరసైన్యము †దక్షిణపార్శ్వమును (అనఁగా పడమటిప్రక్కను) పాలించుచువచ్చుఁగాక. మత్తగజముం బోలె ధర్షింపరాని బలవంతుం డగు గంధమాదనుండు వానరసైన్యము నెడమప్రక్కను పాలించుచు వచ్చుఁగాక. నేను, ఐరావతమును దేవేంద్రుఁ డారోహించునట్లు, హనుమంతునిపయి నారోహించి, సేనాసమూహముల కుత్సాహంబు గలి

---

* ఈ ఉత్తరఫల్గునీ యందుఁ బ్రయాణము చెప్పుటచే ఫాల్గునమాస పూర్ణిమయందు ప్రయాణమని తెలియుచున్నది.

† సైన్య మేదిక్కుం గూర్చిపోవుచున్నదో యాదిక్కు తూర్పుగా గ్రహించుటచే ఇట దక్షిణము పడమరగా గ్రహింపనగు.

గించుచు సైన్యముమధ్యమున వచ్చెదను. యక్షనాథుఁడగు కుబేరుఁడు సార్వభౌమమనుదిగ్గజము నెక్కి పోవునట్లు, అంతకసమానుఁడగు నీలక్ష్మణుఁడును, అంగదు నారోహించివచ్చుఁగాక. జాంబవంతుఁడును సుషేణుండును, వేగదర్శియు ననువీరుమువ్వురును భల్లూకరాజును మహాబలుండు నగు ధూమ్రుఁడును సేనకుక్షిని (వెనుకటి భాగమును) రక్షింతురుగాక' అనెను. వానరోత్తముఁడగు వానరనాథుఁడు సుగ్రీవుఁడు, రాముండు చెప్పినదివిని మహావీర్యులగు వానరులకుఁ బయనముకండని యాజ్ఞాపించెను. అప్పుడు వానరులందఱును యుద్ధోత్సాహులయి గుహలనుండియు పర్వతశిఖరములనుండియు నెగిరి గంతులువైచిరి. అంత నీతిధర్మనుఁను జక్కఁగా నెఱింగిన రాముఁడు, వానరరాజగు సుగ్రీవుని చేతను లక్ష్మణుని చేతను బూజితుఁడై వానరసైన్యంబుఁగూడి దక్షిణపుదిక్కుంబట్టిపోయెను. అతఁడు వానరసైనికులు తన్ను నూర్లకోలఁదిని, లక్షలకోలఁదిని, కోట్లకోలఁదిని, పదివేలుపదివేలుగాను, మత్తగజంబులవలెఁ జూపట్టుచు బరివేష్టించిరాఁగా నపుడు పయనమైపోయెను. అప్పుడు రాముఁడు పోవుచుండఁగా నతని వెంట వేఱొకగొప్పవానరసైన్యము పోయినదయ్యె. ఆవానరులు గర్వితులై సంతోషమునుపట్టలేక సుగ్రీవుని ప్రాపున, అందఱును ఎగురుచు, గంతులువైచుచు, గర్జించుచు, సింహనాదములుసేయుచు, పరుగులువాఱుచు, సుగంధులగు ఫలములం దినుచు దేనియలంద్రావుచు, వేడుకకొఱకు, పువ్వులగుత్తులజొంపములతో నివ్వటిల్లు పెద్దవృక్షములను జేతం బట్టికొనుచు దక్షిణదిక్కుపోయిరి. అప్పుడు వానరులు గర్వంబున విఱ్ఱవీఁగుచు, బలంబునఁ గొందఱు, ఇతరులం బయికెత్తిరి. కొంద ఱితరులం బడఁద్రోసిరి. కొందఱు త్రోపువడి యశక్తులుగాన యట్లు ద్రోసినవారి నాక్షేపించిరి. శక్తులగువారు కొందఱు తమ్ముఁ ద్రోసినవారిని మరలఁ బడఁద్రోసిరి. వానరులు రామునిసమీపమున 'మనము రావణుని రాక్షసులనందఱును జంపివేయవలయును' అని గర్జిల్లుచుండిరి. వీరుండగు ఋషభుండును నీలుఁడును కుముదుఁడును పెక్కువానరులంగూడి, సేనకు ముందునడచి మార్గము శోధించుచుండిరి. పగవారిం బీఁచమడఁచు వానరరాజు సుగ్రీవుఁడును, రాముఁడును లక్ష్మణుఁడును, బలశాలురును భయంకరులు నగువానరులు పెక్కండ్రు పరివేష్ఠించిరా, సేనామధ్యంబునం బోయిరి. వీరుండగు శతవలియను వానరుండును, పదికోట్ల వానరవీరులు బలసిరాగా, నొక్కండే వానరసైన్యమునంతయు నధిష్ఠించి రక్షించుచుండెను. కేసరియుఁ బనసుండును గజుండును, మహాబలుండగు నర్కుఁడును నూఱుకోట్ల వానరులతోఁ గూడి, వానరసైన్యము నొకపార్శ్వమును రక్షించుచుండిరి. సుషేణుఁడును జాంబవంతుఁడును బహుభల్లూకములచేఁ బరివేష్టితులై, సుగ్రీవుని ముందటనుంచుకొని, వానరసేన పశ్చిమభాగమును రక్షించుచుండిరి. వానరసేనానాయకుఁడును వీరుఁడును, వానరతిలకుండును, ఉత్పతనశాలురలో నుత్తముఁడు నగునీలుఁడు నలుప్రక్కలం దిరుగుచు, వానరసైన్యమును రక్షించుచుండెను. మఱియు వీరులగు దరీముఖుఁ

డును, ప్రజంఘుఁడును, రంభుఁడును, రభసుఁడును నలుప్రక్కలం దిరుగుచు వానరుల నెల్లఁ ద్వరపెట్టుచుం బోయిరి. ఆ వానరసింహులు, అట్లు బలంబున విజృంభించుచుఁ బోవుచు, మార్గమునందు వృక్షంబులును లతలును గలిగి యున్న పర్వతరాజంబగు సహ్యపర్వతమును, మఱియు తామరలు మొదలగునవి చక్కఁగా వికసించియున్న సరస్సులను తటాకములను వనములనుం జూచిరి. సముద్రప్రవాహముంబోలె నపారంబై భయంకరముగు నా పెనువానరసైన్యము, భయంకరకోపుఁ డగు రాముని యాజ్ఞకు భయపడి, నగరంబులమీఁదను గ్రామములమీఁదనుం బడక, మహాధ్వని మీఱ, మహాఘోషంబగు సముద్రముంబోలె పోవుచున్నదయ్యె. రాముని సుఖోల్లాసము గలిగించుటకై యశనిప్రక్కల శూరులయిన వానరోత్తములు చోదితంబులగు నుత్తమాశ్వంబులకైవడి, శీఘ్రంబునం బోయిరి. పురుషోత్తములౌ రామలక్ష్మణులు హనుమదంగదులపయి నుండుటం జేసి, *గొప్ప గ్రహములగు శుక్రబృహస్పతులతోఁ సంబంధించిన చంద్రసూర్యులుంబోలెఁ బ్రకాశించిరి. అట్లు ధర్మాత్ముం డగు రాముఁడు, వానరనాథుఁడగు సుగ్రీవుఁడును లక్ష్మణుఁడును బూజింప, వానరసేనంగూడి, దక్షిణపు దిక్కునకుఁ బోయెను. అంత నంగదునిపైఁ గూర్చుండియున్న లక్ష్మణుఁడు, పరిపూర్ణమనోరథుఁడై నిమిత్తశాస్త్రస్మృతియు ప్రతిభయుఁ గలవాఁడుగాన, హనుమంతునిపయి నున్న రామునుంజూచి మంగళవాక్యమున 'నీవు రావణుని శీఘ్రముగాఁ జంపి, వాఁడపహరించిన సీతను మరలఁబొంది, మనోరథం బీడేఱి, సర్వపదార్థసమృద్ధం బయినయయోధ్యానగరమునకుఁ బోఁగలవు. రామా! ఆకాశమునందును భూమియందును, గొప్ప శుభనిమిత్తము లేవిగలవో, అవియన్నియు నిప్పుడు ఆవిర్భవించి నీకార్యసిద్ధిని సూచించుచున్నవి. వాయువు, మృదువై, హితంబై, సుఖకరమై మంగళంబుసూచించుచు మెల్లమెల్లగా సేనవెంబడి వీచుచున్నది ఈమృగములును బక్షులును నివిగో, మధురధ్వనులు నిండార ధ్వనించుచున్నవి. దిక్కులన్నియుఁ దేటగానున్నవి. సూర్యుఁడును నిర్మలుఁడై వెలుంగుచున్నాఁడు సకలవేదవిదుం డగు భార్గవుఁడు శుక్రుఁడును పాపగ్రహసంయోగము లేక ప్రసన్నతేజుఁడై నీకు వెనుకం బ్రకాశించుచున్నాఁడు. మఱియుఁ బరిశుద్ధులగు సప్తర్షులును కాంతులునింప దక్షిణదిశకుం బోయి మరలుచుం (ధ్రువునకుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచు) నెంతయుఁ బ్రకాశించుచున్నారు. మహాత్ములు నిక్ష్వాకువంశ్యులు నగు మనకుఁ బ్రధానకూటస్థుఁడును రాజర్షియునగు త్రిశంకుండును విశ్వామిత్రుఁడు సృజించిన సప్తర్షులలోని వసిష్ఠునితోఁ గూడి, నిర్మలుఁడై ప్రకాశించుచున్నాఁడు. మహాత్ములగు మనయిక్ష్వాకువంశీయుల మేలినక్షత్రమయిన విశాఖయను రెండునక్షత్రములును క్రూరగ్రహముచే నాక్రమింపఁబడక నిర్మలమై ప్ర

* శుక్రబృహస్పతులతోఁ గూడిన చంద్రసూర్యులవలె ననుటచే నాలుగుగ్రహములకూడిక బహుజనవినాశహేతువుగాన రామలక్ష్మణులు హనుమదంగదులు నెక్కుట బహుశత్రువినాశకసూచకమని వ్యంజితమగుచున్నది.

కాశించుచున్నవి. ఇదిగాక నిర్ఋతిదైవత్యమును రాక్షసుల నక్షత్రమునయిన మూలా నక్షత్రము దాపుననున్న ధూమకేతువుచే స్పృశింపఁబడినదై మిక్కిలియుఁ బీడిత మగుచున్నది. ఇవి అంతయు రాక్షసుల వినాశమునకే దాపరించినవి. ఏలయనఁగా మృత్యుగ్రస్తు లగువారి నక్షత్రము అట్టియంత్యకాలమున, దుష్టగ్రహముచేఁ బీడితమగును. మఱియు జలములు స్వచ్ఛములును మంచిరుచిగలిగియున్నవి. వనములు ఫలములచేఁ బరిపూర్ణములై యున్నవి. వృక్షములన్నియు ఋతుమర్యాద నతిక్రమింపక చక్కఁగాఁ బుష్పించి మిక్కిలియు వాసనలు గుబాళించుచున్నవి. ప్రభూ! వ్యూహములుగా నేర్పఱుపఁబడియున్న యీవానరసైన్యములు, మున్ను తారకాసురయుద్ధమున (లేక చంద్రుఁడు బృహస్పతిభార్యను దారంగొనిపోయినప్పుడు తన్నిమిత్తకమైన యుద్ధమునందు) దేవసైన్యములవలె మిక్కిలియుఁ బ్రకాశించుచున్నవి ఆర్యా! ఇట్లు శుభనిమిత్తముల నన్నిటిం జూచి సంతోషమునొందియుండవలయు' ననెను. ఇట్లు లక్ష్మణుఁడు సంతుష్టుఁడై తనయన్నను రాముని నాశ్వాసించి చెప్పెను. అట్లు నఖదంతాయుధులగు నాఋక్షవానరసింహముల మహాసైన్యము భూమినంతయు వ్యాపించి పోవుచుండెను. వానరులు చేతులచేతను కాళ్లచేతను, రేఁచిన దుమ్ము, సూర్యుని ప్రకాశము నావరించి, యందఱకు భయము గలుగునట్లు లోకమంతయుఁ గ్రమ్ముకొన్నదయ్యె. భయంకరమగు నావానరసైన్యము, మేఘపటలము ఆకాశమును గప్పునట్లు పర్వతములతోను వనములతోను ఆకాశముతోను గూడిన దక్షిణభూమినంతయు నావరించుచుఁబోయెను. అప్పు డావానరసైన్యము నదులను నెడతెగక దట్టముగా దాఁటుచుండఁగా, అందలి నీళ్లు రికట్టినట్లు పోవుటకు వీలులేక నిలిచియుండుటం జేసి, వాని ప్రవాహములు విపరీతముగా తిరుగఁబడి చుట్టు పెక్కుయోజనములవఱకుఁ బాఱెనవి. ఆవానరులు తేటజలములుగల సరస్సులు, జిలుజిలుమని నీళ్లుగలవిగాన, వాని నడుమదిగి దాఁటిరి. వృక్షములు నెరిసియున్న పర్వతములు ప్రాప్తించినపుడు, వానిని నడ్డముగాఁ జుట్టుదిరిగి దాఁటిరి. సమతలములయిన భూములు వచ్చునపుడు, వానియందంతటను వ్యాపించి నడచిరి. ఫలవంతములగు వనములు వచ్చినపుడు, ఫలములందికొని తినవచ్చునని మూఁచట్లక్రిందుగాఁబోయిరి. మిక్కిలియు గొప్పదియగు నావానరసేన యట్లు భూమినంతయు నావరించిపోవుచుండెను. వాయువేగు లగు నావానరులందఱును రామకార్యము నిమిత్తమై, పరాక్రమము పెచ్చుపెరుఁగఁగా, సంతుష్టంబులగు మనంబులతో మార్గమునందు, ఒకరికొకరు తమతమహర్షాతిశయమును వీర్యాతిశయమును బలాతిశయమునుం జూపుకొనుచు, యౌవనోత్సేకంబునం గలుగునట్టి పలువగల కావింపుఁజేష్టలు పెక్కులు గావించుచుం బోయిరి. అందు వనచారులగు వానరులు గొందఱు, వేగం బరుగులువాఱిరి. మఱికొందఱు ఎగిరిరి. వేఱుకొందఱు కిలకిలధ్వనులు గావించిరి. కొందఱువానరులు తోఁకల నేలంగొట్టిరి. కొందఱు పాదంబులను నేలఁగొట్టిరి. కొందఱు చేతులుచాఁచి, వృక్షంబులను విఱిచి పర్వతంబులను బగులఁగొట్టిరి. పర్వతచరు

లగు వానరులు గొందఱు, పర్వతశిఖరములపయి నెక్కి, పెద్ద కేకలు వైచిరి. కొందఱు సింహనాదములు చేసిరి. కొందఱు తమయూరువేగములచే తీఁగజొంపములను నానావిధముల వికావికలుగా మర్దించివైచిరి. కొందఱు విజృంభించి, పరాక్రమమున తాలను వృక్షములను దీసికొని క్రీడలాడిరి. భయంకరములగు వానరసైనికులు నూర్లకొలఁదిని, వేలకొలఁదిని. లక్షలకొలఁదిని, కోట్లకొలఁదిని భూమిని సిరిగులుకునట్లు వ్యాపించియుండిరి. మిక్కిలిగొప్పదియగు నావానరసైన్యము, ప్రభుండగు రామునింగూర్చి, మీఁదుమిక్కిలియు సంతుష్టినొంది, సుగ్రీవుఁడు పరిపాలించుచుండఁగా, రేయుంబవలును బయనమై పోవుచుండెను. వానరులందఱు, యుద్ధమునందలి యుత్సాహమున, మిక్కిలియు త్వరితముగాఁబోయిరే కాని సీతాదేవి చెఱ నెప్పుడెప్పుడు విడిచిపుత్తుమా యని యాతురతచే నడుమ నెచ్చటను గొంచెము సేపయినను నిలువరైరి. అంత నావానరులు, వృక్షములు గ్రిక్కిఱిసియు, నానావిధమృగములతోఁ గూడియు నున్న సహ్యపర్వతమును మలయపర్వతమును జేరిరి. రాముఁడు సహ్యపర్వతమునను మలయపర్వతమునను, నానావిధములగు వనములను, ఏఱులను సెలయేళ్లను, జూచుచుఁ గడచిపోయెను. వానరులు మార్గంబున, పొగడ చెట్లను, బొట్టుగు చెట్లను, మామిడి చెట్లను, అశోకవృక్షములను, తెల్ల వావిలి చెట్లను, గన్నేఱు చెట్లను, నేమి చెట్లను, నంతంత భంజించుచుఁబోయిరి. మఱియు వారు, ఊడుగు చెట్లను, క్రానుగు చెట్లను, జువ్వి చెట్లను, మఱ్ఱి చెట్లను, తుమ్మికి చెట్లను, నేరేడు చెట్లను, ఉసిరిక చెట్లను, కడిమి చెట్లను భంజించుచుంబోయిరి. రమణీయములయిన శిలలయం దున్న నానావిధములయిన యడవివృక్షములు, వానరసైన్యవేగమువలనఁ బుట్టి వాయువునురవడిచే నల్లలాడి యావానరులపై పువ్వులు గురిసినవి. అప్పుడు తేనెలతావులు గుబాళించుచుండు వనములందు, మందమారుతము, తుమ్మెదలు ఝుంకారములతోఁ వెంటఁదగుల, సుఖస్పర్శమై, చందనమువలెఁ జల్లనై వీచెను. పర్వతరాజమగు సహ్యమును మీఁదుమిక్కిలియు ధాతువులచే భూషితమైయుండునది. ఆవానరుల త్రొక్కుడులవలన ఆధాతువులనుండి పుట్టినదుమ్ము, గాలి సుడియువేగమునకు రేఁగి, మిక్కిలియు గొప్పదియగు నావానరసైన్యమునంతటిని నలుగడలఁ గ్రమ్ముకొన్నదయ్యె. అచ్చట రమణీయములగు కొండనెత్తములందంతటను జక్కఁగాఁ బుష్పించియుండు మొగలిపొదరులు, తెల్లవావిలిచెట్లును, మనోహరములై. వసంతమునఁ బూచుగురివెందచెట్లును, పుష్పించి వాసనలు నిండార గుబాళించుచుండు మొల్లపొదరులును కుసుమపూచెట్లును, దుంపరాశ్మ చెట్లును, కానుగు చెట్లును, ఇప్ప చెట్లును, పొగడ చెట్లును, వేఁగిస చెట్లును, తుమికి చెట్లును, బొట్టుగు చెట్లును, నాగకేసరవృక్షములును, మామిడిమ్రాఁకులును, కలిగొట్టుచెట్లును, కోవిదారములును, ఖర్జూరములును, మద్ది చెట్లును, శింశుపావృక్షములును, అడవిమల్లెలును, చంద్రచెట్లును, బూరుగుచెట్లును, ఎఱ్ఱగోరంట చెట్లును, శ్రీతాళపుమ్రాఁకులును, నేమిచెట్లును, ఉసిరికచెట్లును, కదంబవృక్షములును, నల్లపువ్వు

లయిరుగుడు మ్రాఁకులును, ఉలిమిరి మ్రాఁకులును, ఊడుగుచెట్లును, మెట్టదామరలును, పుష్పితములయిన యీవృక్షములన్నియు ఆవానరు లెగిరివైచు దాఁట్లకు చీకాకయ్యెను. ఆసహ్యపర్వతమునందు, నడబావులు చల్లనిజలములు నిండుగాఁగలిగి, చక్రవాకకారండవములచేత వన్నెగులుకుచు, నీరుకాకులు కొంగలు మొదలగుపక్షులచే నొప్పుచు, పందులు మొదలగు జలవాసిమృగంబులచే వెలయుచు, ఎలుఁగుబంట్లును, సివంగులును, సింగములును, పెద్దపులులును, దుష్టములగుగజములును మున్నగు, భయంకరమృగములు తీరమందలి వనములందంతటను వెలయు, విరిసినతామరలును చెంగలువలును, తెల్లగలువలును, నల్లగలువలును మొదలగు నీటఁబుట్టు పలువగల పువ్వులలో నివ్వటిలుచుండెను. అట్టి నడబావులును పడియలును ఆవానరులచే కలగుండు గావింపఁబడినవయ్యె. ఆపర్వతపు నెత్తములందు నానావిధములగు పక్షిగణములు, ఆసేనంజూచి కూయిడినవి. వానరు లాపర్వతమునందలి సరస్సులందు స్నానములాడి, నీళ్లుద్రావి, యొకరిపై నొకరు జల్లులాడుచుఁ గ్రీడించిరి. వానరు లంత పర్వతముపయి నెక్కి నిక్కుటంపుమదంబున నందలి వృక్షములలో అమృతమువలెఁ జవులుగులుకు ఫలములను మూలములను పుష్పములను భుజించిరి. తేనెయుంబోలె గోరోచనపువన్నె గలయావానరులు అచ్చటచ్చట తూమెడంత తేనియలు గలవై వ్రేలాడుచున్నట్టి తెట్టలతేనెలనును యథేచ్ఛముగాఁ ద్రాగుచు బరమసంతోషంబునఁ బోయిరి. వానరోత్తములు వృక్షముల విఱుచుచు, తీఁగలనుబట్టి లాగుచు, గొప్పకొండలను బగులఁగొట్టుచుఁ బోయిరి. కొందఱు వానరులు తేనియలందాగ్రి మత్తిల్లి, యఱచుచు, వృక్షములులేనిచోట నడచిరి. కొందఱు వృక్షముల నెక్కిరి. కొందఱువృక్షములనుండి నేలకు దుమికిరి. వానరయూథపరులచేత నిండియున్నభూమి, పండిన వరిపైరులచే నిండియున్న భూమివలె నొప్పుచుండెనది. అంత తామరరేకులవంటికన్నులు గలమహాబాహుఁడు రాముఁడు మహేంద్రపర్వతము సేరి, నానావృక్షములచే వన్నె గులుకుచానిశిఖరము నారోహించెను. అంత దశరథకుమారుఁడు రాముఁడు, మహేంద్రశిఖరము నారోహించి, తాఁబేళ్లను మత్స్యములును నిండియున్నసముద్రము జూచెను. ఆవానరు లట్లు సహ్యపర్వతమును [illegible]ర్వతమగు మలయమును దాఁటి, క్రమమున, భయంకరముగా మ్రోఁగుచున్నసముద్రమును సమీపించిరి. పరులను రంజించువారిలో నెల్ల మిన్నయగు రాముండు, సుగ్రీవునిని లక్ష్మణునింగూడి పర్వతము డిగ్గి, సముద్రమును జూచుకుతుకమున పాటిలేక నీటుగులుకు దానితీరపువనమునకు వేగపోయెను. పెనుకరుళ్లు తటాలునఁ బయికి చెంగలించి యాతీరమందలిత్రాలఁ గడుగుచుండెను. అంత విశాలమై యట్లు వెలయుచున్నయీసముద్రతీరమును జేరి, రాముఁడు సుగ్రీవునిం జూచి 'సుగ్రీవా! ఇదిగో! మనము సముద్రమునొద్దకు వచ్చితిమి. మును పేది మనకుఁ దోఁచియుండెనో యీయాలోచనము నిపుడు చేయవలయును. ఇఁక మీఁద తీరముగానరాదు; పట్టెజలమయ మగునదీ

పతి సముద్రమే కానఁబడెడిని. మఱియు నీ సముద్రము నుపాయము లేక దాఁట నలవి గాదు. అట్లు గావున నిచ్చటనె విడియుదము. వానరసైన్యము సముద్రము నవ్వలిగట్టుం జేరున ట్లాలోచనము సేయవలయును' అనెను. సీతాపహారణంబువలన మిక్కిలి కృశించి యున్నమహాబాహుఁడు రాముఁడు, సముద్రమును జేరినపిదప నచట విడియుటం గూర్చి యపుడు సుగ్రీవునితో 'వానరపుంగవా! మనసైన్యములనెల్లను సముద్రతీరమున విడియ నియమింపుము. ఈసముద్రము దాఁటునుపాయమును గుఱించి యాలోచించునవసరము మనకుఁ గలిగినది. ఎవ్వఁడుగాని దన సేనను విడిచి యెచ్చటికినిఁ బోఁగూడదు. శూరులగు వానరులుమాత్రము, అంతటను దిరుగుచుండవలయును. ఏలన, ఎచ్చటనైన మాటున శత్రువులు దాఁగి యుండి ఛిద్రము మనకు వెదకుచునుందురు గాన మాటున నున్న యట్టిభయములను దెలిసికొనవలయును.' అనెను. సుగ్రీవుఁడు రామునిమాటను విని, లక్ష్మణుండును దానును నానావృక్షయుతం బగుసముద్రతీరమునందు, వానరసైన్యమును విడియించెను. సముద్రమునకు దాపున విడిసి తేనెవన్నియఁ జెన్నారుచున్న యావానరసైన్యము, తేనియవన్నెగల జలములుగలిగి కాంతిఁ దళుకొత్తుచున్న రెండవసముద్రమువలెఁ బ్రకాశించుచుండెను. ఆవానరపుంగవులు, సముద్రతీరమందలి వనమును బొంది,యంత, సముద్రము నవ్వలితీరముం జేరఁగోరుచు, నచ్చటచ్చట విడిసిరి. అట్లు వానరసైన్యము విడియుచుండఁగా నచట నాసన్నాహమునఁ బుట్టినమహాధ్వని సముద్రపుమహాశబ్దమునుగూడ నతిక్రమించి వినఁబడినదయ్యె. సుగ్రీవపరిపాలితంబయిన యావానరసైన్యము, మూఁడువలయములుగా నమరియుండుటవలన మూఁడువిధములుగా (లేక వానరు లొక్కతట్టును, కొండముచ్చు లొక్కతట్టును, ఎలుఁగుబంటులొకతట్టునుగా నిట్లు మూఁడువిధములుగా)విడిసి రామునికార్యమునకై పూని యుత్సహించుచుండెను. ఆవానరసైన్యమును మహాసముద్రమును జేరి, యందు వాయువేగమున నలలు వెల్లుగా చిమ్మిరేఁగుచుండుటం జూచుచు సంతోషమునొందిరి. ఆసముద్రము నవ్వలిగట్టు యిది యని చెప్పరావంతదవ్వయినది. దానిని గలంపఁ దరముగాదు. రాక్షసగణము లందు వాసము సేయుచుందురు. అది వరుణునికి నునికిపట్టు. అది ప్రచండములయిన మొసళ్లుగలిగి సందెలయందు మిక్కిలి చిమ్మిరేఁగుటచే భయంకరమై, తెల్లని నురుఁగుగుంపులచే నవ్వుచున్నట్లును, అలలయసియాటలచే నర్తనము గావించుచున్నట్లును, జూపట్టుచు, చంద్రోదయకాలమున మిక్కిలియుఁ బెల్లుబ్బి, ప్రతిబింబితంబులగు పెక్కుచంద్రబింబములచే నెఱసియుండును. అందు ప్రచండవాయువునకుంబోలె వేగముగల పెనుమొసళ్లును, తిమితిమింగిలములును, మణులచే ధగధగలాడు పడగలుగల సర్పములును నెరసియుండును. మఱియు నది శింశుమారాదులగు మహాజంతువులును, నానాపర్వతములును నందంద కలిగి,చొరరానిదై, (ఓడలుపోవు) మార్గము లేనిదై యగాధమై యసురుల కాలయమైయుండును. ఇట్టిసముద్రమును జూ

చుచు, వానరవీరులు దీని నెట్లు దాఁటఁగలమని విషాదమునొందినవారయిరి. గొప్పగొ
ప్పతరంగములు, మకరంబులతోను సర్పకాయములతోను గూడినవై వాయువేగం
బునఁ జలితంబులై మిక్కిలి యున్నతములుగా నెగురుచును బడుచు నుండెను. రాత్రి
కాలమున సముద్రము చంద్రకిరణసంపర్కమువలనఁ దళతళ వెలుఁగు నీటితుంపరలు
గలదై యగ్నికణసమూహములు వ్యాపించియున్నట్లు చూపట్టుచుండును. ఆకాశ
మును అట్లె ప్రకాశించు తెలిమంచునీరుగలదై నెరసియున్న నక్షత్రములచే నగ్ని
కణములు వ్యాపించినట్లు లుండును. సముద్రమును మహానాగులుగలది. ఆకాశంబును
మహానాగులుగలదియే. సముద్రంబునను నసురులుందురు. ఆకాశమునను అసురులుం
దురు. సముద్రము భయంకరమైనది. ఆకాశమును భయంకరమైనది. సముద్రము పా
తాళమువలె గంభీరముగ నుండినది. ఆకాశము నెప్పుడు నట్లెయుండునది. కాన య
ప్పుడు సముద్ర మాకాశమువలెను, ఆకాశము సముద్రమువలెను, నుండెను. ఇది సము
ద్రమనియు నిది యాకాశమనియు నెంతమాత్రము భేదమగపడదయ్యె. సముద్రపు
జలము ఆకాశమువలె నుండినది. ఆకాశము సముద్రజలమువలె నుండినది. ఆకాశ
మునందు నక్షత్రములు వెలుఁగుచున్నవి. సముద్రమున రత్నములు వెలుఁగుచున్నవి.
కాన నా యాకాశసముద్రములు రెండును ఒక్కటివలెనే మఱొక్కటి భేదములేక
చూపట్టుచుండినవి. పయిని మేఘసమూహము వ్యాపించియున్న యాకాశమునకు, త
రంగసమూహములు వ్యాపించియున్న సముద్రమునకును, రెంటికిని ఎంతమాత్రము భే
దమగపడలేదు. ఆమహాసముద్రమునందలి యలలు ఒండొంటిం దాఁకి మోఁదికొన్న
వై, యుద్ధమునందు పెద్దభేరులుంబోలె, భయంకరారావంబున, ధ్వనించుచుండినవి.
రత్నసమూహములును జలసమూహములునుగలిగి, మిక్కిలియు బిట్టుగా మ్రోఁగుచు,
వాయుహతమై యేకీభూతమయినట్టును. ఆకాశమున కుద్గమించునట్టును, కోపంబు
నొందియున్నట్టును, జూపట్టుచు, జలజంతుగణములచే వ్యాప్తమయి, వాయువే
గంబునను లేచుతరంగంబులచే నాకాశమున దాఁట్లువైచుచున్నట్లు గాన్పించుచు
వాయుహతిం జేసి మహాజలంబు లల్లకల్లోలమగుచు నున్నసముద్రమును మహోత్సా
హముమీఱ నావానరులు చూచిరి. అంత నప్పుడు వానరులు, జలతరంగముల తిరు
గుళ్లచే మహాధ్వనిం బొల్చుచు, నుద్భ్రాంతమయినట్లు చూపట్టుచున్న సముద్రముం
జూచి యాశ్చర్యముఁ బొందినవారయిరి. ఇది నాలుగవసర్గము.

---

## శ్రీరాముఁడు సముద్రమును జూచి సీతం దలంచి దుఃఖింపఁగా లక్ష్మణుం డతనిని నాశ్వా

వానరసేనాపతియగు నీలుఁడు, చక్కఁగా రక్షకుల నేర్పఱచి, నిర్భయముగా
వించి, సముద్రపు నుత్తరతీరమునందు, నీతిశాస్త్రోక్తవిధంబున లెస్సగా సేనను విడి
యించినవాఁడయ్యె. అప్పు డచ్చట మైందుఁడును ద్వివిదుఁడును ననెడి వానరతిలకు

లిరువురును, వానరసేన యన్నిప్రక్కలను కాపుదలకై తిరుగుచుఁ గాచుచుండిరి. అట్లు సైన్యమంతయు సముద్రతీరమున విడిసినంతనే రాముఁడు తనపార్శ్వభాగంబునఁ గొలిచి యున్నలక్ష్మణుం జూచి, "శోకము, కాలము కడచిపోఁగాపోఁగా, తానును,తీసిపోవునని లోకులు చెప్పుదురు. అయినను సీతనుజూడకుండుటవలన నాకుఁగలశోకమో, లోకులు చెప్పినట్లు తీసిపోవునదికాదే! నాఁడునాఁటికి మఱిమఱి హెచ్చుచున్నదే! 'సీతను మఱలఁ దేఁజాలినవాఁడవె శోకింపఁదగునా' యందువా? ప్రియురాలు దూరముననున్నదని నాకుదుఃఖము లేదు. రాక్షసుఁడు గొనిపోయినాఁడని గాని దుఃఖము లేదు. ఏలన నచ్చటికిఁబోయి వానిని జంపి దేనెత్తునుజుమీ. కాని, యాచెలువ ప్రాయంపు వయసు తిన్ననుభవించుటలేక వ్యర్థముగాఁ గడచిపోవుచున్నదే యని యిందులకు మాత్రమే శోకించుచున్నాను." అనిచెప్పి యంతవాయువుం జూచి 'వాయూ! నా ప్రియురాలెచ్చటనున్నదో యచటికిఁబోయి వీవుమా! అట్లచ్చట వీచి యాచెలువను స్పృశించి నన్నును స్పృశింపుము. దానిస్పర్శము మఱియొకవిధమున సిద్ధింపదు. ఎట్లన ఆచెలువ చంద్రునిఁజూడఁగా ఆచంద్రుని నేనుజూడఁగా, ఆమూలమున నేను దానిని జూచినవాఁడ నగునట్లు, ఆచెలువను నీవుస్పృశింపఁగా, అట్టి నిన్ను నేను స్పృశింపఁగా, ఆమూలమున ఆచెలువనే స్పృశించినవాఁడనగుదును. ఇట్లు మేమొకరినొకరు చూచుకొనుట చంద్రునివశమున నున్నట్లు, ఒకరొకరి గాత్రములను స్పృశించుట నీవశమున నున్నది. సమస్తభోగములను దిగవిడిచి నా వెంట నడవికివచ్చినట్టి ప్రియురాలు, రావణుఁడు గొనిపోవుచుండఁగా, తాను తనపాతివ్రత్యాగ్నిచే వానిని నీఱుసేయం జాలినదయ్యు, నాయందలి భక్తివలన నన్నేగతిగా నెన్ని 'అయ్యో నాథా!' అని యాక్రోశించిన పలుకు,నాహృదయమున నాఁటి విషముం ద్రాగినట్లు అవయవములనెల్ల దహించుచున్నది. మన్మథుండనునగ్ని, *ప్రియావియోగమే కట్టెయలుగా, ఆచెలువనుచింతించుటయే జ్వాలగా, నా దేహమునంతయు రేయుంబవలును చల్లనికాలమనియు వెచ్చనికాలమనియు భేదములేక దహించుచున్నది. లక్ష్మణా! ఈమన్మథతాపమో మఱొకవిధమునఁ దీఱదు. నిన్నుఁజూడఁగాఁ గొంత తలంపునకు వచ్చుచున్నది. †కనుక నిన్నువిడిచి సముద్రముఁజొచ్చి పరుండెదను. అట్లు నీళ్లలోఁబరుందునేని, యిప్పుడు ప్రజ్వలించుచున్న మన్మథుండు, నన్నెంతో కష్టము మీఁదనే దహింపఁగలవాఁడగును గాన మందగిల్లును. సీత బ్రతికియున్నదని తెలిసెను గనుక నేనును సొగసుందొడలుగల యాసీతయు, ఒకభూమినే యాశ్రయించి యున్నవారముగదా. ఇదియే, ఇట్లతి

---

* ఇట మదనాగ్నికి వియోగము వర్ధిల్లఁజేయుటచే యది దానికి కట్టెలుగాను చింత యెడతెగక సాఁగుచుండుటచే దానికి జ్వాలగాను రూపితము లయినవని తెలియునది.

† ఇట రాముఁడు లక్ష్మణునివిడిచి సముద్రమునఁ బరుండుట విపరీతప్రక్రియగాఁ జెప్పినాఁడు. దీనిచే లక్ష్మణునితోఁ బరుండుట సహజప్రక్రియగా ధ్వనించుచున్నది. శేషియు సముద్రమునఁ బరుండువాఁడు గాన యతనితో సాటిగా సముద్రమునఁ బరుండులక్ష్మణుఁడు శేషావతారమేయగుట తెలియుచున్నది.

దుఃఖాక్రాంతుఁడ నయియున్న నాకు ప్రాణములు నిలఁబెట్టుకొనుటకు నిప్పటికి పెద్ద సాధనమయినది. ఇట్లది నాతోఁబాటు, ఏకశయ్యయందుండునటువలె ఏకభూమియందు బ్రతికియున్నదిగదా యని యూఱటగలుగుటచే, దానిం బాసి యుస్సిళ్లూరుచున్న నాకు బ్రతికియుండుట శక్యమైనది. కాని యీపాటియూఱటయు లేనిచో బ్రతుకుట నాకు శక్యమేకానేరదు. నేను, ఆసీత బ్రతికియున్నదని వినుచున్నాను. నీళ్లులేనిచేను నీళ్లుగలచేని తేమతగులుటచే నెండకుండునట్లు, అది బ్రతికియున్నదని వినుటచేత నేనును బ్రతికియున్నాను. నేను పగవారినెల్ల గెలిచి, యందములయిన పిఱుందులును తామరపూరేకులవంటి కన్నుంగవయుఁగలిగి చెన్నారు నాచిన్నారి సీతను, పెంపుసొంపారు లక్ష్మినింబోలె, నెప్పుడుచూతునో! సొగసయి దొండపండువలె నుండు క్రిందిపెదవిగలిగి, తామరవలె ముద్దుగులుకు సీత నెమ్మొగమును గొంచెముపయికెత్తి, రోగి రసాయనమును ద్రాగునటువలె, అధరామృతము నెప్పుడు ద్రావుదునో! ఆచెలువ నన్నుఁ గవుంగలించుకొనఁగా, ఒండొంటితోఁ గ్రిక్కిఱిసి, కండబలుపు గలిగి తాటిపండులతోఁ బురుడించుచుండు దానిగుబ్బపాలిండ్లు, నల్లలాడుచు నామేన నెప్పుడు సోఁకునో! నల్లనికడగన్నుల నుల్లసిలునాసతి, ఆసీత, రాక్షసులనడుమఁ జిక్కి, నాథుండనై నేనుండియు, అనాథవలె రక్షించు దిక్కుగానకయే యున్నదిగదా! ఆపడఁతి జనకమహారాజుకూఁతురయ్యు, నాకుఁ బ్రియురాలయ్యు, దశరథ మహాచక్రవర్తికోడలునయ్యు, రాక్షస స్త్రీలనడుమఁ జిక్కి స్రుక్కుచున్నదేమి! శరత్కాలమందు, చంద్రరేఖ, నల్లనిమేఘములం ద్రోసికొని, బయలువెడలునట్లు, సీత కలఁచిపుచ్చరాని రాక్షసులం ద్రోసిపుచ్చి నాయెదుట నెప్పుడు పొడసూపఁగలదు! సీత స్వభావముచేతనే యొల్లియమేనుగలది. ఇప్పుడును దేశమును కాలమును విపరీతములై ప్రతికూలింపఁగా శోకమునను ఉపవాసమునను మఱియు మిక్కిలి కృశించియుండఁగలదు. ఇదినిజము. నేను రాక్షసులకెల్ల ప్రభుండగు రావణునిఱొమ్మున బాణములనాటి, సీతను మరలఁ దోడ్కొని యెప్పుడు మనసునందలి దుఃఖమును దిగవిడువఁగలను? దేవకన్యయుంబోలె చూపట్టు నాపతివ్రత యాసీత మిక్కిలి తహతహతో నామెడనుఁ గవుంగిలించుకొని యానందబాష్పముల నెపుడు విడువంగలదు? సీత నెడఁబాయుటచేఁ గలిగిన యీభయంకరశోకమును మలినవస్త్రమును దీసి పుచ్చున ట్లతిశీఘ్రముగా, నెప్పుడు దిగవిడువఁగలను'? అని విలపించెను. ఇట్లు బుద్ధిమంతుఁడా రాముఁడచట విలపించుచుండఁగా పగలుతీఱి సూర్యుండు కాంతితగ్గి యస్తమించినవాఁడయ్యె. అంత సంధ్యాసమయమయ్యె. పిదప, రాముఁడు లక్ష్మణునిచే నాశ్వాసితుఁడై కమలపత్రాక్షిని సీతం దలంచుకొనుచు శోకంబున నాకులపడుచు, సంధ్యావందనము గావించినవాఁడయ్యె.

* ఇది యైదవసర్గము.

---

* తమ్ముఁడగు లక్ష్మణునిముందట రాముఁడిట్లు కామోక్తులు చెప్పఁదగదుగాని, యాలక్ష్మణుఁడు సర్వవిధసేవకుఁడగుటచే నట్లు చెప్పికొనుట అనుచితముగాదని తెలియునది.

### రావణుఁడు, లంకయందు హనుమంతుఁడు చేసిపోయిన కార్యములకుఁ జింతితుఁడై మీఁద శత్రువులెత్తి వచ్చుటకుమున్న చేయవలసిన యాయితపాటులను మంత్రులతో నాలోచించుట.

* లంకయందు దేవేంద్రసమాన పరాక్రముఁడగు మహాత్ముఁడు హనుమంతుఁడు, ఎందును జూడరానట్టు గావించిన భయంకరకార్యమును రాక్షసేశ్వరుండగు రావణుఁడు చూచి, సిగ్గుచేఁ గొంచెము దలవాంచి, రాక్షసు లందఱితో "కేవల మొక కోఁతియంతవాఁ డా హనుమంతుఁడు, పగవారి కెంత మాత్రము నోర్వఁదరముగాని పురిని లంకను, లక్ష్యపెట్టక దిట్టతనమునఁ జొచ్చినాఁడు; మఱి సీతనుజూచియుఁ బోయినాఁడు. చైత్యప్రాసాదమును గూల్పఁబడినది. ఉత్తములగు రాక్షసులు పెక్కండ్రు హతులయిరి. ఇట్లొక హనుమంతునిచేత లంకాపురమంతయు నాకులపఱుపఁబడినది. ఇఁక మీఁద యుక్తమైనదేది? మన కెల్ల నేది హితమో, ఏది చేసిన కార్యము చక్కఁగా నొడఁగూడునో యట్టిదేది? చెప్పుఁడు చేసెదను. మీకు శుభము కలుగుఁగాత. 'బలవంతుఁడవగు నీకు మంత్రాలోచనమేల' యందురా? బలవంతులారా! గొప్పమనస్సుగల పెద్దలు, మంత్రమే జయమునకు మూలమని చెప్పెదరు. కావున రామునివిషయమై మంత్రము సేయఁగోరుచున్నాను. లోకమునం బురుషులు, ఉత్తములు, మధ్యములు, అధములు, అని మూఁడువిధములనుందురు. వారలు కలకూరగంపగా నుండుటచే వేఱువేఱ తెలియుటకష్టము; కాఁబట్టి నేను వారల గుణదోషములను జెప్పెదను. ఎవ్వఁడు మంత్రము (ఆలోచనము) తీర్చుటయందు నిపుణులును, తనహితము గోరువారు నగుమంత్రులతోఁగాని తన సుఖదుఃఖములే తమ సుఖదుఃఖములుగాఁ గల స్నేహితులతోఁగాని, తనహితమును గోరునట్టి బంధువులతోఁగాని, కూడి యాలోచనము చేసి, యారంభింపవలసిన కార్యములను నడపుచును, దైవముమీఁదను భారము వేసియుండునో యతఁ డుత్తమపురుషుఁ డండ్రు. ఎవ్వఁడు తానొక్కఁడే కార్యమును ఆలోచనము చేసి, యొక్కఁడే మనఃపూర్వకముగా దైవము నాశ్రయించి, యొక్కఁడే కార్యములం జేయునో, . అతఁడు మధ్యమపురుషుఁడని చెప్పుదురు. ఎవ్వఁడు మంచి చెడుగులను నిశ్చయించుకొనక, దైవము నాశ్రయించుటయు దిగవిడిచి, చేసెదనని కార్యమునకుఁ బూని, దానిని తుదముట్టం జేయక యుపేక్ష సేయునో యతఁ డధమపురుషుఁడు. పురుషులిట్లు ఉత్తమ మధ్యమాధములని మూఁడువిధము లగునట్లు, మంత్రములును ఉత్తమ మధ్యమాధమము లని మూఁడువిధములగుట తెలియవలయును. మంత్రులందఱును ఐకమత్యమునొంది చక్కఁగా శాస్త్రము లభ్యసించుటచే శాస్త్రజ్ఞాన మనుదృష్టితోఁ గూడి, యాసక్తితో నేమంత్రమును జేయుదురో యది

* ఇంతవఱకు రామునివృత్తాంతమును జెప్పి యిది మొదలుగా లంకయందు హనుమంతుఁడు పోయిన వెనుక జరిగిన రావణునివృత్తాంతమును కవి చెప్పుచున్నాఁడు.

యుక్తను మంత్రమందురు. ఏమంత్రమునందు, మంత్రులు, కార్యము నిర్ణయించు విషయమున మొదట పరస్పరము మతభేదములు పెక్కులుగలిగియుండి, యాపిదప, తుదకు నైకమత్యము నొందుదురో, యది మధ్యమమంత్రమని నీతిజ్ఞులెన్నుదురు. ఏమంత్రమందు, మంత్రులొక్కొక్కఁడు తనతన యభిప్రాయమునే ముఖ్యముగాఁ జేసికొని దానినెంతమాత్రము వదలక, వాదముసేయుచుందురో, మఱియు నైకమత్యము నొందవలయునని ప్రీతియు లేకుందురో, యది, యధమమంత్రమని చెప్పఁబడుచున్నది. అందువలన బుద్ధిమంతులలో మేలుబంతులగు మీ రందఱు నైకమత్యముతో నాలోచించి యుక్తమయినకార్య మిదియని చక్కఁగా నిశ్చయించి తెలిసికొనుఁడు. ఇట్లైకమత్యముతో చక్కఁగా నిశ్చయించినట్టికార్యమే నాకు మిక్కిలి చేయఁదగినదని యభిప్రాయము. 'జరిగినదిపోనీ. ఇఁక మంత్రము సేయనేల; ఇఁక మనకు భిన్నమేమున్నది?' యందురా? అట్లుకాదు, రాముఁడు వీరులగు వేలకొలఁది వానరులంగూడి మనల నరికట్టుటకు లంకాపురికి రాఁగలఁడు, 'సముద్రముండఁగా నెట్లువచ్చి యరికట్టఁగలఁడందురా?' రాముఁడు, తమ్మునిఁగూడి, సైన్యములును సుగ్రీవాదులయిన యనుచరులును వెంటరా, తనకు యుక్తరూపంబగు శక్తి నెఱపి, తనవీర్యమున సముద్రము నెండించియో లేక సేతువుగట్టుట మొదలగు వేఱుకార్యముగావించియో, ఎట్లో సుఖముగా దాఁటిరాఁగలఁడని మిక్కిలి స్ఫుటముగాఁ దోఁచుచున్నది. ఇట్లు లంకను నేను జెప్పినట్లు రాముఁడువచ్చి నిరోధించుట కలుగఁగా, దానిచే వానరులకును మనకును విరోధముగలుగును. అప్పటికి నాపట్టణమునకును, సైన్యమునకును మేలుగలుగు నుపాయములనెల్లను నాలోచింపుఁడు" అనెను. ఇది యాఱవసర్గము.



### రావణుని మంత్రులు శత్రుబలము నెఱుంగక రావణుని పరాక్రమాదు లుగ్గడించి యుబ్బఁగలిగించుట.

రాక్షసేంద్రుఁడగు రావణుఁ డిట్లు చెప్పఁగా మహాబలశాలు రగునారాక్షసులు విని, నీతిబాహ్యులును బుద్ధిహీనులు నగుదురుగాన శత్రుబలముం దెలియక యందఱును రాక్షసేశ్వరుఁడగు నారావణుం జూచి చేమోడ్పుగీలించి, 'రాజా! పెక్కండ్ర నొక్కుమ్మడిం జంపు పెనుగదలును, ఈఁటెలును, ఖడ్గములును, శూలములును అడ్డగత్తులును, మెండుగాఁగలిగి మన సైన్యము మిక్కిలియు గొప్పదిగానున్నదే! ఎందులకు నీవు విషాదపడుచున్నావు? సైన్యములతోడేల? నీ వొక్కఁడవే చాలవా! నీవు పాతాళమున భోగవతికింబోయి యుద్ధమునఁ బన్నగుల జయించితివి. కైలాసశిఖరమున పెక్కుయక్షులచేఁ బరివేష్టితుఁడై యున్నకుబేరునితో మిక్కిలియు గొప్పయుద్ధము గావించి యతని నీకు లోఁబఱచుకొంటివి. ప్రభూ! ఆ కుబేరుఁడు ఈశ్వరునికి చెలికాఁడని పొగడంబడుచుండువాఁడు, లోకపాలుఁడు, మహాబలుఁడు, అట్టి కుబేరునిం

గూడ, నీవు రోషముగొని యుద్ధమున జయించితివి. మఱియు యక్షులను గుంపులు గుంపులుగాఁ జంపియు, నానావిధంబులఁ గలఁచియు, పట్టుకొని చెఱఁబట్టియు, కైలాస శిఖరమునుండి యీపుష్పకవిమానమును దెచ్చితివి. రాక్షసపుంగవా! దానవేంద్రుఁడగు మయుఁడు నీవలనిభయమున, నీతోడిస్నేహమును గోరి, నీకు భార్యగాఁ దనకూఁతురు మండోదరి నొసంగెను. పరాక్రమంబున విఱ్ఱవీఁగుచు నెట్టివారికిఁ జెనక రాకుండిన దానవేంద్రుని మధుఁడనువానిని, నీయప్పసెల్లెలు కుంభీనసకు సుఖముగూర్చు ప్రియుని, యుద్ధముసేసి వశము గావించుకొంటివి. మహాబాహూ! నీవు రసాతలమునకుఁ బోయి వాసుకిని, తక్షకుని, శంఖుని, జటిని, ఈనాగేంద్రులను నోడించి వశులం జేసికొంటివి. ప్రభూ! అరిందమా! కాలకేయులు చూర్ణముగాఁ జేయఁబడినను మరల లేచునట్టినాశదూరులు, బలవంతులు, శూరులు, బ్రహ్మవలన వరంబులు వడసినవారు. ఆదానవులు తమబలమునంతయు నెఱపి, నీతోడ నొక్కసంవత్సరము యుద్ధముసేసి తుదకు నీకు వశులయిరి. రాక్షసాధిపతీ! మఱియు వారలయొద్ద నీవు మాయలను పెక్కింటిని గూడ నేర్చికొంటివి. (నీవు రోషంబున యుద్ధంబున మహాబలవంతులగు దిక్పాలకులను నోడించితివి. ఇచ్చటనుండి దేవలోకమునకుఁ బోయి యింద్రునిఁ గూడ జయించితివి) మహాబాహూ! మఱియు నీవు శూరులును, మహాబలశాలులును, చతురంగబలసహితులు నగువరుణునిపుత్త్రుల యుద్ధంబున గెలిచితివి. రాజా! నీవు యమదండమె భయంకరమైన పెద్దమొసలిగాను, శాల్మల్యాయుధములే వృక్షములు గాను, యమపాశమే పెద్దతరంగముగాను, యమకింకరులే పన్నగములుగాను, నిట్లు సముద్రమువలె విలసిల్లుచున్న యమునిమహాసైన్యమును జొచ్చి యుద్ధమున యమునిం బాఱఁదోలి, మిక్కిలి గొప్పజయమును గొంటివి. అచ్చట నీవు సేసిన స్వల్ప యుద్ధమునకే లోకములన్నియు వడవడ వడంకినవి. వీరులును దేవేంద్రునివంటి పరాక్రమశాలురు నగుక్షత్త్రియు లనేకులు, భూమియంతయు, మహావృక్షములు నిండియుండునట్లు, నిండియుండిరి. రాముఁడు, పరాక్రమంబునను గుణంబులను నుత్సాహంబునను, యుద్ధంబునందు వారల కెంతమాత్రమును సమానుఁడుగాఁడు. రాజా! అట్టి పరమదుర్జయులైనయారాజులనే నీవు బలిమిని చంపియున్నావు. ఇఁక నీకుఁ రాముఁడెంత! మహారాజా! ఊరక యిచ్చటనే యుండుము. నీవు శ్రమంపడనేల? మహాబాహుఁడయిన యీయింద్రజిత్తు, ఒకఁడే, వానరులనెల్ల రూపుమాపఁగలఁడు. మహారాజా! ఈయింద్రజిత్తు, మహేశ్వరుంగూర్చి యెందును సాటిలేనియజ్ఞమును యజించి, లోకంబునం దెట్టివారికిని లభింప నలవిగాని వరమును బడసి యున్నాఁడు గదా. శక్తితోమరము లనెడి యాయుధములు మత్స్యములు; చెల్లచెదరైన పేఁగులే పాఁచితీఁగలు; మొండైన యేనుఁగులే క్రిక్కిఱిసిన తాఁబేళ్లు; గుఱ్ఱంబులే కప్పలు; రుద్రుఁడును ఆదిత్యుఁడునే పెద్దమొసళ్లు; మరుత్తులును వసువులునే మహాసర్పములు; రథగజతురగములే జలసమూహము; పెనుకాలుబంట్లు, పెద్దయిసుక

దిబ్బలు. ఇట్లు సముద్రమువలె నతిభయంకరమై యున్న దేవతా మహాసైన్యముం జొచ్చి యీయింద్రజిత్తు దేవేంద్రుం బట్టి బంధించి లంకకుం గొని వచ్చెఁగదా. రాజా! అంత బ్రహ్మయాజ్ఞం జేసి, శంబరవృత్రాసురులను జంపినట్టి యీ దేవేంద్రుని విడిచిపుచ్చితివి. పిదప నతఁడు సమస్తదేవతలుం గొలువ స్వర్గమునకుం బోయెను. మహారాజా! అటువంటి నీకొడుకును నింద్రజిత్తునే పోరికి విడువుము; రాముని వానికిం గలయీవానరసైన్యమునంతటిని, అవలీల రూపుమాపి పుచ్చును. రాజా! కేవల క్షుద్రుఁడైన యొకానొకనివలన (హనుమంతునివలన) ఈ యాపద ఉన్నట్టుండి సంభవించినది; కాన చెల్లిపోయె. కనుక దీనిని నీవు మనసునం దెంతమాత్ర ముంచుకొనఁగూడదు. నీవు తప్పక రాముని వధింపఁగలవు' అనిరి. ఇది యేడవసర్గము.

ప్రహస్త దుర్ముఖ వజ్రదంష్ట్ర నికుంభులు తమతమ పరా
క్రమంబులు పొగడుచుఁ దా మొక్కొక్కరే రా
ముని జయించి రాఁగలమని రావణునకుఁ జెప్పుట.

అంత నప్పుడు నీలమేఘమువలె నల్లనైన పెనుకాయము గలిగి శూరుఁడును సేనాపతియు నగు ప్రహస్తుఁ డను రాక్షసుఁడు, రావణుం జూచి చేమోడ్పుగీలించి 'దేవతలుగాని దానవులుగాని గంధర్వులుగాని, పిశాచులుగాని, పతగులుగాని, నాగులుగాని, యెవ్వరును యుద్ధంబున నిన్నుమాఱుకొన శక్తులుగారు. ఇఁక వానరులనఁగా నెంత! మనమందఱు పరాకుగొని మనల నెవ్వరు నెదిరింపఁజాలరను నమ్మికతోనే మఱియుంటిమి. కావున హనుమంతుఁడు వచ్చి మనలను వంచించి పోయినాఁడు. లేనియెడల, నేను బ్రతికియుండఁగా, ఆవానరుఁ డిచటనుండి ప్రాణములతో నెట్లుపోఁగలఁడు? సముద్రము నాల్గుచెఱఁగుల నడుమ నున్న యీభూమండలమునం దంతయు, అందుఁ గలపర్వతములను వనములను మహారణ్యములను అన్నిటనుం గలవానరుల నందఱను జంపి యిఁక భూమిలో వానరులే లేకుండునట్లు గావించెదను. దేవర నన్నాజ్ఞాపింపవలయును; ఇంతే. రావణా! నే నీలంకాపురమును గాచుచునే యుండెదను. అప్పుడు నీవు సీత నపహరించినయపరాధమునకుఁగాను వానరులవలన నీకు దుఃఖమేదియుఁ గలుగఁ జాలదు' అనెను. అంత దుర్ముఖుం డను రాక్షసుఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై 'వానరమాత్రుఁ డొకఁడువచ్చి,మనకందఱ కిట్టితిరస్కారము గావించినాఁడు. ఇదిమాత్రము క్షమింపఁదగినదిగాదు. ఇంతటితోఁబోక మనపట్టణమును, మఱియు నంతఃపురమును అవమానించినాఁడు. శ్రీమంతుఁడగు రాక్షసేంద్రునిం గూడఁ దిరస్కరించినాఁడు. ఇది యెంతమాత్రము క్షమింపరాదు. నేనొక్కఁడనే యిప్పుడేపోయి, వానరుల నందఱను, భయంకరమైన సముద్రమును జొరఁబడినను, ఆకాశమున కెగిరిపోయినను, పాతాళమున దాఁగినను, విడువక వధించి మరలి వచ్చెదను'

అనెను. అంత మహాబలవంతుఁడగు వజ్రదంష్ట్రుఁడు మీఁదు మిక్కిలియుఁ గ్రుద్ధుండై మాంసమును నెత్తురునుం బూసియున్న బెడిదంపునినుపగుదియను దీసికొని, 'రాముఁడు సుగ్రీవునిని లక్ష్మణునింగూడి ధర్షింపరానివాఁడై యుండఁగా, భయముచే రాత్రికాలమున రహస్యముగావచ్చి పోయినదీనుఁ డగుహనుమంతుఁడు జాలికిఁ దగినవాఁడే కాన వానితో మీకేమికార్యమున్నది? ఇప్పుడు నే నొక్కఁడనే పోయి రామునిని సుగ్రీవునిని లక్ష్మణునిని బరిఘంబున సంహరించి వానరసైన్యము నంతయుఁ గలంచి వైచివచ్చెదను. రాజా! నే నింకొకమాటం జెప్పెదను. చిత్తమేని యవధరింపుము. ఉపాయకుశలుఁడే పగవారిని జయించును. పరాకుపడక యుపాయంబుల నేర్పునఁ బన్నియే పగవారిం జయింపవలయును. రాక్షసేశ్వరా! కామరూపులును శూరులును అతిభయంకర స్వభావులును భయంకరాకారులు నగు రాక్షసులు నిశ్చయము చేసికొని వేలకొలఁదిగా, మనుష్యదేహముందాల్చి, రామునొద్దకుఁబోయి, యందఱును తొట్రుపడక యారఘుతిలకునిఁజూచి 'మేము నీతమ్ముఁడు భరతుఁడు పంపఁగా వచ్చితిమి' (నీవు వచ్చుటనుగుఱించి వలయు ప్రయత్నము చేయవలయును) అని చెప్పుదురుగాక. ఆరాముఁడు సేనను విడిచి శీఘ్రముననే వారితోఁ బోఁగలఁడు. అంత మేమిచ్చటనుండి శూలములను శక్తులను గదలను ధనువులను బాణములను ఖడ్గములనుందాల్చి శీఘ్రముగా నచ్చటికిఁ బోయెదము. మేము, గుంపులు గుంపులుగా నాకాశముననుండి, ఱాలను, ఆయుధములను పెద్దవర్షముగాఁ గురిసి యావానరసైన్యమునంతయు హతముసేసి యమలోకము నొందించెదము. ఇట్లు రామలక్ష్మణులు మనము పన్నినకిటుకును గనుఁగొనలేమిచే మనవారిని తనవారినిగా నమ్మి నీతిమాలుదురేని, నీతిమాలినయట్టి యానమ్మికచేత అవశ్యము వారిరువురు ప్రాణములను విడుతురు' అనెను. అంత వీరుఁడును వీర్యవంతుఁడు నగు కుంభకర్ణపుత్త్రుఁడు నికుంభుఁడనువాఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుండై, లోకరావణుం డగురావణుంజూచి 'మీరందఱును మహారాజుతోఁగూడ నిచ్చటనే యూరకయుందురుగాక. నే నొక్కఁడనే పోయి, రాముని లక్ష్మణునిని, సుగ్రీవునిని, హనుమంతుని, వానరులనందఱును, జంపిపుచ్చెదను.' అనెను. అంతఁ బర్వతాకారుఁడగు వజ్రహనుండను రాక్షసుఁడు క్రుద్ధుఁడై, (తిండిం దలఁచుకొని నోరూర,) నాలుకచే నోరంతయు నాఁకికొనుచు 'మీరందఱును తుందుడుకు విడిచి మీయిచ్చకు వచ్చిన కార్యములు చేసికొను చుండుఁడు. నే నొక్కఁడనే యావానరసత్తములనెల్లను భక్షించివైచెదను. మీరేచింతయు లేక, మధురూపం బగుమద్యముం ద్రావుచు * స్వస్థులై క్రీడించుచుందురుగాక. నే నొక్కఁడనే పోయి, సుగ్రీవుని, లక్ష్మణునిని, అంగ

* ఇట 'స్వస్థులై' అనఁగా 'స్వర్గస్థులై' యనియు నర్థము దోఁచుచున్నదిగాన నిది యమంగళోక్తి యని తెలియునది.

దుని, హనుమంతుని, రణంబున మార్కొన రాకుండు రామునిని వధించివచ్చెదను' అనెను. ఇది యెనిమిదవసర్గము.

(నికుంభుఁడు చెప్పినట్లు తక్కిన ప్రధానులెల్ల లేచి యుద్ధమున కుద్యుక్తులుకాఁగా విభీషణుఁడు వలదని వారించుట.)

అంత నికుంభుఁడును, రభసుఁడును, మహాబలవంతుఁడగు సూర్యశత్రుఁడును సుప్తఘ్నుఁడును, యజ్ఞహుండను, మహాపార్శ్వుఁడును, మహోదరుఁడును, దుర్ధర్షుఁడగు నగ్నికేతుఁడును, రశ్మికేతుఁడును, మహాతేజుండును బలవంతుఁడు నగు రావణపుత్త్రుఁ డింద్రజిత్తును, ప్రహస్తుఁడును, విరూపాక్షుఁడును, మహాబలుఁడగు వజ్రదంష్ట్రుఁడును, ధూమ్రాక్షుఁడును, అతికాయుఁడను, దుర్ముఖుఁడును అనెడి యీ రాక్షసులందఱును, పరిఘములను, పట్టిసములను, ప్రాసములను, శక్తులను, శూలములను, గండగొడ్డండ్రను, విండ్లను, బాణంబులను, వాఁడియగు పెనుఖడ్గములను, దాల్చి పరమకుపితులై యాసనములనుండి చెంగున లేచి, తేజంబున మిక్కిలియు వెలుంగుచు, రావణుఁ జూచి 'మన మిపుడేపోయి రామునిని, సుగ్రీవునిని, లంకాపురిని రహస్యంబునఁ జొచ్చి చెఱిచిన యానీచుని హనుమంతుని వధించివచ్చెదము' అనిరి. అంత నట్లాయుధముల నందుకొని ప్రయాణమున కుద్యుక్తులై యున్న యారాక్షసులనెల్ల విభీషణుండు నిలిపి, మరలఁ గూర్చుండఁబెట్టి, యంజలిఘటించి, రావణుంజూచి 'నాయనా! సామదానభేదము లనెడి మూడుపాయములచేతంగూడ నేది లభింప నశక్యమో, యది సిద్ధించుటకై విక్రమము చూపవలసినకాలములు (అనఁగా దండకాలములు) నీతిశాస్త్రంబులం జెప్పఁబడియున్నవి, యుక్తములని బుద్ధిమంతులు చెప్పుదురు. మనమింకను సామాదులం బ్రయోగింపలేదు గాన దండమునకు కాలముగాదు. ఇంతేకాక పగవాఁడును దండ్యుఁడుగాఁడు. * విషయాసక్తులై పరాకు తప్పియుండువారియందును, విరక్తులై జ్ఞానులగువారియందును, సామంతులచే నాక్రమింపఁబడినవారియందును, దైవప్రాతికూల్యమున సంపద క్షీణించుచున్నవారియందును, మఱియు బాలురు వృద్ధులు మొదలగువారియందును నీతిశాస్త్రోక్తప్రకారమున మంత్రులతో విచారించి, ప్రయోగింపఁబడువిక్రమములే (దండ

* ఇందులకు 'బాలో వృద్ధో దీర్ఘరోగీ తథా జ్ఞాతిబహిష్కృతః । భీరుకో భీరుకజనో లుబ్ధో లుబ్ధజనస్తథా ॥ విరక్తప్రకృతిశ్చైవ విషయేష్వతిసక్తిమాన్ । అనేకచిత్తమంత్రశ్చ దేవబ్రాహ్మణనిన్దకః ॥ దైవోపహతకశ్చైవ దైవచిన్తక ఏవచ । దుర్భిక్షవ్యసనోపేతో బలవ్యసనసంయుతః । అదేశస్థో బహురిపుర్యుక్తో కాలేనయశ్చసః । సత్యధర్మవ్యపేతశ్చ వింశతిః పురుషా అమీ । ఏతైస్సన్ధిం నకుర్వీత విగృహ్ణీయాత్తు కేవలమ్' అన్నట్లు యీ యిరువది పురుషులతోడనే విగ్రహము పెట్టుకొనవలసినది గాని తక్కినవారితోఁ దగదని కామందకము.

ములు) సిద్ధినొందును. మఱియొక్కచోఁ బ్రయోగింపఁబడినయెడల నవి యెంతమాత్రమును సిద్ధినొందవు.' అని యంత రాక్షసులంజూచి 'రాముఁడో యట్టివాఁడుగాఁడు, అతఁ డెంతమాత్రమును విషయాసక్తుఁడై యేమఱియుండువాఁడుగాఁడు, జయింపఁ దివురుచుండువాఁడు, స్థిరబలముగలవాఁడు, అకాలమున రోషముదెచ్చుకొనువాఁడును గాఁడు. కాన యతని నెదిరింప నలవిగాదు. అట్టివానినిగూడ నెదిరింపఁగోరెదరే! ఎట్లు? హనుమంతుఁడు భయంకరమయిన నదీనాథుని మహాసముద్రుని దాఁటి, యెట్టివారికిని జేయనలవిగానికార్యముం జేసినాఁడే! ఇట్లగునని యెవ్వఁడేని తలంపనయినను దలంచునా? కావున రామునకు దైవమును బ్రతికూలమునుగాదు. రాక్షసులారా! శత్రువులబలంబులును బరాక్రమములను గొలఁదిలేనివి కాన ముందువెనుకఁజూడక మీరు తటాలున నవి తక్కువయని యవమానోక్తి చెప్పరాదు. రాముని దండించుట కష్టమగునని తెలిసెఁగదా. కీర్తిమంతుఁడగు రామునిభార్యను, రావణుఁడు జనస్థానమునుండి తెచ్చెనే! ఇందులకు రాముఁడీ రాక్షసరాజునకు నేమి యపకారము గావించియున్నాఁడు? 'ఖరునిఁ జంపినాఁ'డందురా? ఖరుఁడు తానే యతిక్రమించి రామునిఁ జంపఁబోఁగా రాముఁడు వానిని యుద్ధంబునఁ జంపినాఁడు. అట్లు చంపెనేని యందు దోషమేమి? ప్రాణులకు తమతమప్రాణములను శక్తికొలఁది రక్షించుకొనవలయునే కదా. కాఁబట్టి రాముఁడు దండనమున కనర్హుఁడుగూడ నగును. రాముఁ డపకారమే చేసియుండినను గూడ నతనిభార్య నపహరించుట దగదు. పరదారనంటుట అపకీర్తిం గలిగించునది, ఆయుఃక్షయము గూర్చునది, ధననాశమును గావించునది, భయంకరమయినది, పాపమునకు మఱియొకమూర్తి యనందగినది. ఈ నిమిత్తముంబట్టి మనకు సీతవలన మిక్కిలియు గొప్పభయము సంభవించును. సీతం బట్టి దెచ్చియైనది. ఇఁక నాబెడను విడిచి పుచ్చవలసినది. 'మేలినస్తువును విడువందగునా' యనఘుఁడు మంచిదయినను కలహంబు గలిగించునట్టిదేని యట్టిదానినిగుఱించి కార్యమేమి చేసినను బ్రయోజనమేమి? రాముఁడు మహాపరాక్రమశాలి, ధర్మంబునఁ దప్పక నడచువాఁడు, అట్టివానితో వ్యర్థముగు వైరమును బెట్టుకొనుట మనకు యుక్తముగాదు. అతనికి సీత నిచ్చివేయుము. ఈలంక గజంబులతోను నశ్వంబులతోనుం గూడి పెక్కు రత్నములచే నెరసి మెరసి యుండునది. ఇట్టి పట్టణమును రాముఁడు వచ్చి బాణములచే విదారించుటకుమునుపే యతనికి సీత నొసంగుము. మిక్కిలియు భయంకరమును, మార్కొన నశక్యంబును నగు గొప్ప వానరసైన్యము వచ్చి మనలంకం జుట్టుముట్టి యరికట్టుటకుమునుపే, రామునకు సీత నిచ్చివేయుము. రాముని గారాబుపత్నిని సీతను మనమే యతనికిఁ గొంపోయి యొసంగమేని, మనలంకాపురమంతయు నాశమునొందును. పట్టి పట్టణమేకాదు. శూరులగు నిందలిరాక్షసులందఱును నాశము నొందుదురు. నీవు నాకన్న దమ్ముఁడగుట చుట్టఱికంబున నయిన నిన్నుఁ బ్రసన్నుఁడగునట్లు ప్రార్థించుచు

న్నాను. నేను జెప్పినట్లు చేయుము. నేను హితకరమును యథార్థంబు నగుదానిం జెప్పుచున్నాను. రామునకు సీత నిచ్చివేయుము. రాజకుమారుఁడు రాముఁడు మీఁద శరత్కాలసూర్యకిరణంబులంబోలె మిక్కిలి తీక్ష్ణములై, క్రొత్తయలుగులును పింజలును గలవగుటం జేసి మిక్కిలియు గట్టివై యమోఘంబులై యొప్పుబాణములను నిన్ను వధించుటకై విడువంగలఁడు. కావున రామునకు సీతనిమ్ము. కోపము, సుఖమును ధర్మమును నాశము సేయును. కావున దానిని దిగవిడుము. సుఖంబును గీర్తిని వర్ధిలంజేయు ధర్మము నవలంబింపుము. ప్రసన్నుఁడవై నేను జెప్పినట్లు చేయుము. అట్లు సేయుదువేని మనము పుత్రబంధుసహితముగాఁ బ్రతికియుందుము. రామునకు సీత నొసంగుము' అనెను. రాక్షసేశ్వరుం డగు రావణుఁడు విభీషణుఁడు చెప్పినదివిని, యా సభ్యులందఱిని వీడుకొల్పి తానును స్వగృహంబునకుం బోయినవాఁడయ్యె. ఇది తొమ్మిదవసర్గము.

విభీషణుఁడు రావణునిగృహంబునకుఁ బోయి సీతం దెచ్చి, నది మొదలుగా లంకలోఁ గలుగు నానాదుర్నిమిత్తంబులను జెప్పి సీతను రామున కొసంగుమని బోధించుట. రావణుఁడు దాని నంగీకరింపకుండుట.

అంత * తెలతెలవాఱెను. విభీషణుఁడు ధర్మాధర్మంబుల నిశ్చయించుకొని, రావణునికి హితోపదేశము సేయుట యనెడు భయంకరకృత్యంబునకుఁ బూని యా రాక్షసేశ్వరునిగృహమునకుం బోయెను. ఆగృహము పర్వతశిఖరంబులఁబోని పెక్కుశిఖరములుగలిగి పర్వతశిఖరముంబోలె మిక్కిలియుం బొడవై యుండెను. అందు పెద్దతోటకట్లు వేలువేలు చక్కఁగా విభక్తములై యుండెను. అందు పెక్కండ్రు పండితజను లధిష్ఠించియుండిరి. మఱియు బుద్ధిమంతులును స్వామియుక్తులును కార్యకరణనిపుణులునగు ప్రధానులు దానిని నలుగడల రక్షించుచుండిరి. అందలి మదపుటేనుఁగుల నిశ్శ్వాసత్కారములకు వాయువుకలఁగి సుళ్లుగొనుచుండెను. శంఖధ్వనులు మిక్కిలియు బిట్టుగా బోరుకొనుచుండెను. వాద్యధ్వనులు ప్రతిధ్వను లిచ్చుచుండెను. అందు స్త్రీజనములు మెండుగాఁగలిగి మహాపథములందు కలకలములు మిక్కుటముగా నుండెను. అది మేలిబంగారు నిర్యూహములుగలిగి, యుత్తమాలంకారములచే నలంకృతమై ఆటపాటలు చెలరేఁగుచుండుటచే గంధర్వావాసస్థలమువలెను, సర్వైశ్వర్యసంపన్నమగుటచే దేవతాస్థానమువలెను, రత్నసమూహములు మెండుగాఁ గలిగియుండుటచే భోగవతీపురము చెలువునను బ్రకాశించుచుండెను. వీరుండును మహాకాంతిమం

* ఇట తెలతెలవాఱె ననుటచే హనుమంతుఁడు లంకనువిడిచిపోయి యొకదినమయ్యెనని తెలియునది.

తుఁడునగు నావిభీషణుఁడు తన తేజఃకాంతులే విరివిగా నిగుడుకిరణంబులుగా, సూర్యుండు మహామేఘమును జొచ్చునట్లు, తనయన్నయగు రావణునిగృహముం బ్రవేశించెను. మహాతేజుండగు విభీషణుఁడు, అచ్చట రావణునకు విజయముగలుగుటకై, వేదవిదులగు రాక్షసు లుచ్చరించునట్టి పుణ్యములగు పుణ్యాహమంత్రములధ్వనులు వినెను. అమ్మహాబలుఁడు, మంత్రిబ్రాహ్మణవిదులగు బ్రాహ్మణులు పెరుఁగుపాత్రములు నేయి పువ్వులు అక్షతలు మొదలగువానిచేతం బూజితులై యుండఁ గాంచెను. మహాబాహుండగు నవ్విభీషణుండు రాక్షసులు గొనియాడుచుండఁగా, నిజతేజంబున వెలుంగుచు లోనికిం బోయి, సింహాసనాసీనుఁడై యున్నకుబేరానుజునకు రావణునకు నమస్కరించెను. విభీషణుఁడు సాంప్రదాయికములయిన యాచారములనెల్ల బాగుగ నెఱింగినవాఁడుగాన యప్పుడు దా నాచరింపవలసిన జయశబ్దప్రయోగమును గావించి, రాజు కనుసన్నచేఁ జూపినట్టియు కాంచనాలంకృతమయినట్టియు నాసనంబునం గూర్చుండెను. అంత నతఁడు మఱియెవ్వరును లేక మంత్రులుమాత్రము సమక్షమందుండునపుడు మహాపరాక్రమవంతుఁడగు రావణుంజూచి పెక్కుయుక్తులచే చక్కఁగా నిశ్చితమై మిక్కిలియు హితంబగుమాటం జెప్పవాఁడయ్యె. విభీషణుఁడో, మాటలక్రమము నెఱింగినవాఁడు; ఏదేశమునం దేకాలమున నేప్రయోజనము ననుసరింపవలయునో యతనికిఁ జక్కఁగాఁ దెలియును; మఱియు లోకంబునందు నుత్కృష్టమిదియని అపకృష్టమిదియనియు కనుఁగొన్నవాఁడుగాన రావణుఁ డధర్ముఁడనియు రాముఁడు ధార్మికుఁడనియు దెలియును. కాన యతఁడు స్తుతివచనంబుల నన్నను బ్రసన్నునింజేసి తిన్ననిమాటల నతనితో 'సీత మన యీపట్టణమునకు వచ్చినదిమొదలుగా, అశుభనిమిత్తములు పెక్కులు కనఁబడుచున్నవి. అగ్నిహోత్రమును మంత్రయుక్తముగా హవిస్సులతో వేల్చినను, అగ్నికణములతోఁగూడి, పొగలతోఁగూడిన జ్వాలలుగలిగి, పొగగ్రమ్ముటచే చల్లాగిచల్లారి నుండుచున్నదే కాని చక్కఁగా ప్రజ్వరిల్లుట లేదు. వంటప్రొయ్యులందును, అగ్నిహోత్రశాలలందును, వేదాధ్యయనస్థలములందును, సర్పములగపడుచున్నవి. మఱియు వేల్చుటకుంచియున్నహవిస్సులకుఁ జీమలు పట్టుచున్నవి. ఆవులకు పాలు ఎండిపోయినవి. మదపుటేనుంగులు, మదంబు దక్కియున్నవి. గుఱ్ఱములు దీనముగా సకిలించుచు, ఆహారంబుపయిని రుచిలేకున్నవి. రాజా! మన గాడిదలును లొట్టియలును, కంచరగాడిదలును, రోమంబులూడ, కన్నీళ్లు గార్చుచున్నవి; నానాచికిత్సలు గావించినను, ఎప్పటిస్థితికి రాకున్నవి. కాకులు క్రూరములై యెచ్చటఁజూచినను గుంపులుగాఁగూడి కూయుచు విమానశిఖరములందును గుంపులుగుంపులుగాఁగూడి కనఁబడుచున్నవి. గద్దలు పట్టణమున నింటింటిపై మండలములుగా గుంపులుగట్టి నిలుచుచున్నవి. నక్కలు రెండుసందెలయందు పట్టణముదాపునకువచ్చి యమంగళముగాఁ గూయుచున్నవి. మఱియు మాంసాహారములగు కుక్కలు మొదలగు క్రూరమృగములును, పట్టణద్వారములందు గుంపులుగట్టి పిడుగు

మ్రోసినట్లు పెనుధ్వనులు గావించుచున్నవి. ఇట్లు దుర్నిమిత్తము లగపడుచుండుటం బట్టియు, ఇవి సూచించు నపజయము లంకాదహనాదులచే మనకుఁ బ్రవర్తించియేయున్నది గావునను, ఈ యశుభమును వారించుటకుఁ దగిన ప్రాయశ్చిత్త మిదియే. ఇది మతేదిగాదు. ఇష్టపడి సీత రామున కొసంగదువుగాక. మహారాజా! నేను కార్యతత్త్వము తెలియకయో, బ్రతుకుమీఁది పేరాసచేతనో, యిది చెప్పినను గాని, నాయందపరాధముగాఁ గొననగదు. దుశ్శకునము లగపడుచున్నదే. ఇదె యవి సూచించు ననర్థము ఒకరికే కాదు; సమస్తరాక్షసులకును, రాక్షసస్త్రీలకును, అంతఃపురస్త్రీలకును, పట్టణమున నుండువారికందఱకును, దెలిసియున్నది. 'ప్రహస్తాదులుండఁగా నీవే యిది చెప్పనేల' యందువా? మంత్రులందఱును, కేవలము నీమనస్సువచ్చినట్లు నడచుకొనువారు మాత్రమే యగుదురు. నీమోమాటమునకై నీకు వినిపించుటకుఁగూడ పూనక యూరకుందురు. 'నీకుమాత్రము చెప్పునంత దిట్టతన మె' ట్లందువా? నీతమ్ముండనగుటచేఁ జూచినది విన్నదియంతయు, నవశ్యము నాకు చెప్పకతీఱదు. నీవు న్యాయముచొప్పున మనస్సునందే యాలోచించి నిశ్చయించి, యట్లు నిశ్చయించిన కార్యమును జేయఁదగును' అనెను. ఇట్లు తమ్ముఁడగు విభీషణుఁడు తన యన్నయగు రాక్షసేశ్వరునకు రావణునకు, మంత్రులమధ్యంబున పథ్యంబగు వచనముం జెప్పెను. విభీషణుం డిట్లు హితమై గొప్పప్రయోజనముం గూర్చునదై, సాంత్వపూర్వమై, యుక్తియుక్తమై, భూతభవిష్యద్వర్తమానకాలములు మూఁడింటను మేలుగలిగించునట్లు చెప్పిన యప్పలుకువిని, మిక్కిలి కోపంబున నెఱియుచు, తనపట్టునం దభినివేశము వదలక యతనితో 'నాకు నెవ్వనివలనను భయంబు గానరాదు. నాచేతం జిక్కిన సీత రామున కెన్నఁటికిఁగాని మరల దక్కదు. ఏలన దేవేంద్రుఁడును దేవతలును సహాయులై వచ్చినను రాముఁడు యుద్ధంబున నాయెదుట నిలువనుగూడఁ జాలఁడు. ఇఁక యుద్ధముసేయుట యెక్కడిది! మఱి సీతను బొందుటయు నేడ?' యనెను. దేవతాసైన్యముల రూపుమాపు మహాబలవంతుఁడును యుద్ధంబున భయంకరపరాక్రముండునగు రావణుం డిట్లుపలికి యపుడు హితముపదేశించుచున్న తమ్ముని విభీషణుని పీడుకొలిపినవాఁడయ్యెను. ఇది పదియవసర్గము.

### రావణుఁడు వ్యాకులహృదయుఁడై మరల నాలోచించుకొఱకు మంత్రులంగూడి మంత్రసభం బ్రవేశించుట.

*రాక్షసరాజగు నారావణుండు సహజముగానే పాపి. మఱియు సీతపట్లంగల

* ఇందులకు 'సబభూవకృశోరాజా మైథిలీ కామమోహితః। అసమ్మానాచ్చసుహృదాం పాపః పాపేనకర్మణా॥' అనిమూలము. దీనికి వాస్తవార్థమున (మైథిలీ కామమోహితః) సీతకు భృత్యుఁడ నయ్యెదనని యాశచే మోహితుఁడయ్యెనని యర్థము. ఇట్టి నచ్చటచ్చట సామాన్యముగాఁ దోఁచునర్థములకెల్ల విశేషార్థములు గ్రహించుచు రావలయును.—మహేశ్వరతీర్థులు.

కామమోహమునను, అతనిసుహృదాదులు తాముచెప్పెడుమాట వినఁడని యనాదరముచూపుటవలనను, సీత నపహరించిన పాపకర్మమునను, చింతాకులుఁడయ్యెను. *మంత్రాలోచనమునకుఁ దగినకాలము తప్పిపోయినపిదప, యుద్ధమును ప్రాప్తించియుండఁగా, రావణుఁడు మంత్రులను సుహృదులనుంగూడి యాలోచించుట కప్పుడు యుక్తకాలముగాఁ దలఁచెను. అమ్మహారథుఁడు, నలుగడల బంగారుకిటికీలుగలిగి, రత్నములచేతను పగడములచేతను నలంకృతమై, చక్కఁగా శిక్షితములయిన గుఱ్ఱములు పూన్పఁబడియున్న మహారథంబును జేరి ప్రదక్షిణము గావించి యారోహించెను. రాక్షసోత్తముఁడగు రావణుండు మహామేఘగర్జనమునవలె మొరయుచున్న యుత్తమరథము నారోహించి మంత్రాలోచనసభకుం బోయెను. కొందఱు రాక్షసయోధులు వాలును బలుకయుఁ దాల్చియు, కొందఱు సర్వాయుధముల ధరించియు, రాక్షసేశ్వరుండగు రావణునిముందు నడచిరి. ఆరావణాలయమునుండి కొందఱు రాక్షసులు నానావిధంబులుగా నుండునట్లు వేఱువే అలంకారములుసేసి నానావిధభూషణముల భూషితులై, యారావణుని పార్శ్వభాగంబులను పిఱుందనుం బరివేష్టించి పోయిరి. అంత నతిరథులగు రాక్షసులు గొందఱు, రథంబుల నారోహించియు, కొందఱు మత్తిల్లిన మేటియేనుంగుల నెక్కియు, కొందఱు నానావిధగతివిభ్రమములం గ్రీడించు గుఱ్ఱంబుల నెక్కియు, రావణుని వెంటం బోయిరి. కొందఱు గదలను పరిఘములనుం దాల్చియు, కొందఱు శక్తితోమరంబులం బూనియు, కొందఱు గండగొడ్డండ్రం బట్టుకొనియు, కొందఱు శూలంబుల ధరించియుఁ బోయిరి. రావణుఁడు స్వగృహమునుండి సభకుఁబోఁగానే, వేలకొలఁది వాద్యముల పెనుధ్వనులును, శంఖధ్వనులును తుములమై చెలంగినదయ్యె. మహనీయమైన యామహారథము, నేమిధ్వనిచే దిక్కులు ప్రతిధ్వను లిచ్చునట్లుగా, తోడనే కాంతిం దళుకొత్తుచున్న రాజమార్గమును బ్రవేశించెను. అప్పుడు రాక్షసేంద్రుఁడగు రావణునిపయిని పట్టంబడిన స్వచ్ఛంబగు శ్వేతచ్ఛత్రము, పూర్ణచంద్రుండునుంబోలె వెలుంగుచుండెను. † బంగారుపాత్రములు నడుముంగలిగి శుద్ధస్ఫటికములవలె స్వచ్ఛము లయినయాకారముల

---

*ఇందులకు 'అతీతసమయేకాలే తస్మిన్వై యుధిరావణః । అమాత్యైశ్చ సుహృద్భిశ్చ ప్రాప్త కాల మమన్యత' అనిమూలము. దీనికి (కాలే అతీతసమయే) రావణుని ఆయుః కాలము మించిపోయినది కాఁగా, (యుధి) యుద్ధమునందు, [అమాత్యైస్సుహృద్భిశ్చ సహ(ఆత్మానం)] అమాత్యులతోడను సుహృదులతోడను గూడినతన్ను, (ప్రాప్తకాలం) ప్రాప్తమృత్యునిఁగా, (అమన్యత) తలఁచినవాఁడయ్యె. రావణుఁ డాయుష్కాలము తీఱుటచే తనకును తనయమాత్యాదులకును మృత్యువు ప్రాప్తించినదని తలఁచినట్లు వాల్మీకిమునిహృదయము. గోవిందరాజులు.

† ఇందులకు 'హేమమఞ్జరిగర్భేచ శుద్ధస్ఫటికవిగ్రహే । చామరవ్యజనే' అనిమూలము. 'హేమమఞ్జరిగర్భే' అను విశేషణమునకు బంగారుమయములైన చిగుళ్లతోఁగూడినతీఁగె చిత్తరుపని నడుమం గలవింజామరములని తెలియునది.

తో నొప్పువింజామరలు రెండు రావణుని కుడిప్రక్కను ఎడమప్రక్కనుం బ్రకాశించుచుండినవి. అచ్చట రాక్షసులందఱును క్రింద నిలుచుండి, చేతులు మొగిడ్చుకొని, రథంబున నున్నరాక్షసోత్తముఁడగు నా రావణునకు శిరమువాల్చి నమస్కారము గావించిరి. పగవారినెల్లం బీఁచమడంచు నాపరాక్రమవంతుఁడు రావణుఁడు, రాక్షసులు జయజయశబ్దంబులచేతను ఆశీర్వచనములచేతను దనుఁ గొనియాడుచుండఁగా చక్కఁగా నిర్మితమై సొగసుగులుకుచున్న సభను జేరెను. ఆసభకు బంగారుస్తంభములును వెండిస్తంభములును వెలయుచుండెను. నడుమనడుమ నచ్చంపుఁబటికపురాల నెలకట్టులుండెను. దానియందు బంగారు సరిగమయమైన పట్టువస్త్రము క్రిందఁ బఱవంబడియుండెను. ఆసభను, ఆఱువందల పిశాచములు రక్షించుచుండెను. విశ్వకర్మముచే మిక్కిలియుం జక్కఁగా నిర్మితమై సొగసుగులుకుచున్న యాసభను, నిజదేహకాంతిచే వెలుంగుచు మహాతేజుం డగురావణుఁడు ప్రవేశించినవాఁడయ్యె. అందు వైడూర్యమణిమయమైన యొకపెద్దసింహాసన ముండెను. దానిపయిని * ప్రియక మృగపు మెత్తనిచర్మము పఱవంబడియుండెను. దానికి, ఒఱగుదిండుగూడఁ బెద్దదియొకటి వైవంబడియుండెను. రావణుఁడు సభనుజొచ్చి యా సింహాసనముపైఁ గూర్చుండెను. అంత నా రావణుఁడు చుల్కఁగా నడవం గలదూతలం జూచి రాచఱికమునకుం దగునట్లుగా 'మనకిప్పుడు మిక్కిలిగొప్పగా ప్రయత్నపడి నిర్వహింపవలసిన † పెద్దపనియొకటి గలిగియున్నది. ఈనగరమందలి రాక్షసులను నాయొద్దకు శీఘ్రముగాఁ దోడ్కొనిరండు' అని యాజ్ఞాపించెను. రావణుండుచెప్పిన యామాటవిని రాక్షసులు విహారస్థలములందును, శయనగృహములందును, ఉద్యానవనములందును, విహరించుచున్న రాక్షసులను నిర్భయముగాఁ బిలుచువారై లంకయందుఁ బ్రతిగృహమును దిరిగిరి. దూతలవలన రాజాజ్ఞనువిని యారాక్షసులు కొందఱు సుందరములయిన రథములను, కొందఱు మత్తిల్లియున్నగుఱ్ఱములను, మఱికొందఱు గజములను నెక్కిపోయిరి. కొందఱు కాలినడకంబోయిరి. ఉత్తమంబగు నాపురము, అట్లు రథములును గజములును తురగములును నెరసి బెరసి వేగమునం బోవుచుండఁగా, పక్షిసంఘములతోఁ గూడిన యాకాశమువలెం బ్రకాశించుచుండెను. అంత నారాక్షసులు పల్లకీలు మొదలగు నానావిధవాహనములును అశ్వములు మొదలగు వివిధయానములనును బయటనే నిలిపి సింహములు పర్వతగుహను బ్రవేశించునట్లు, కాలినడతో సభను బ్రవేశించిరి. వారందఱును రాజగురావణునిపాదములను బట్టుకొని నమస్కరింపఁగా రావణుఁడు వారలం బూజించెను. అందు పురోహితాదులగు కొందఱు బంగారుమొ

* 'ప్రియకో లోమభి ర్యుక్తో మృదూచ్చ మసృణై ర్ఘనైః' అని మృదువులై పొడవులై నిగ్గు గలిగియుండు వెండ్రుకలతోఁగూడినది ప్రియకమృగమని వైజయంతి.

† మిగుల గొప్పకార్య మొకటియున్నది యనుటచే రావణునికి చారులమూలముగా రాముఁడు సముద్రతీరమునకు వచ్చి యుండుట తెలిసియున్నదని తెలియుచున్నది.

దలగువానితో రచింపఁబడిన పీఠములందును, శ్రోత్రియులగు మఱికొందఱు దర్భమయము లయినయాసనములందును, పుత్రాదులగువారు కొందఱు సామాన్యములగు జముకాణములు పఱచియున్న భూమియందును గూర్చుండిరి. రాజాజ్ఞవలన నారాక్షసు లట్లు సభకువచ్చి వారివారికిం దగునంతరువుక్రమంబున రాక్షసేశ్వరుఁడగు రావణునిసమీపంబునం గూర్చుండిరి. అచ్చటఁ గార్యములు నిశ్చయించుటయందుఁ బండితులును ముఖ్యులునగు *మంత్రులును గుణవంతులు సర్వజ్ఞులునై బుద్ధియే కన్నులుగాఁ గలిగి యున్నయమాత్యులును వందలకొలఁదిని వచ్చిచేరిరి. అప్పుడు శూరులు ననేకులు సమస్తకార్యములక్షేమము విచారించుటకై బంగారువన్నె గలిగి చెలువు గులుకుచున్న రాక్షసేశ్వరునిసభయందు గుంపులుగుంపులుగాఁ జేరిరి. అంత మహాత్ముఁడును మహాయశస్కుఁడునగు విభీషణుఁడు విఱివిగయె మంచిగుఱ్ఱములం బూన్చినదై, యవయవములెల్ల బంగారముచేఁ జిత్రింపఁబడి సుందరమైయున్న యుత్తమరథము నారోహించి, యన్నసభకుఁ బోయెను. (ఇట్లు రాక్షసులెల్ల రాక్షసేశ్వరుని పరివేష్టించి కొలిచియుండిరి) అంత తమ్ముఁడు విభీషణుఁడు, తనయన్నకుఁ బ్రవరచెప్పి పాదములకు నమస్కరించెను. అట్లె శుకుఁడును ప్రహస్తుఁడును నమస్కరించిరి. అంత రావణుఁడు వారలమువ్వురకును వేఱువేఱ వారియంతస్తులకుఁ దగినట్లు, ఆసనంబుల నొసంగెను. అంత నక్కొలువున నానారత్నఖచితములయిన సువర్ణభూషణములందాల్చి, మంచివస్త్రంబులం దొడిగి,ఉత్తమములయిన యగరుచందనములం బూసికొని, పుష్పమాలికలను దాల్చియున్నయారాక్షసుల పూదండల సుగంధములు అంతటను గుబాళించుచుండినవి. సభ్యులెవ్వరు సద్దు గావింపకుండిరి. ఎవ్వఁడును నబద్ధమాడలేదు. ఎవ్వరును గుజగుజలుగూడఁ బోవరైరి. అందఱును కోరికలన్నియు నీడేఱి, మహావీర్యశాలురై యుండిరి. అప్పు డందఱును ప్రభుండగు రావణుని ముఖంబును జూచిరి. మనస్వియగునారావణుఁ డట్లు, ఆసభయందు, ఆయుధధారులును ధీరహృదయులును, మహాబలవంతులు నగు రాక్షసులనడుమ వసువులనడుమ దేవేంద్రుఁడుంబోలెఁ దన దేహకాంతిచేఁ బ్రకాశించుచుండెను. ఇది పదునొకండవ సర్గము.

రావణుఁడు సీతను రామునకొసంగక యే యతనిని జయించుట కుపాయంబు నాలోచించుట. కుంభకర్ణుఁడు నిజపరాక్రమముచే పనులన్ని సరిపెట్టునట్లు చెప్పుట.

అప్పుడు, యుద్ధంబున జయశీలుఁ డగునారావణుఁడు, ఆసభనంతయుం జూచి యందు సేనాధిపతి యగుప్రహస్తునితో 'సేనాపతీ! ధనుర్విద్యను జక్కఁగా నభ్యసించిన యోధులను, రథికులు, హస్తిపకులు, సాదులు, పదాతులు అను నా

* అమాత్యులు కార్యసహాయులనియు, మంత్రులు బుద్ధిసహాయులనియు భేదము తెలియునది.

లుగు తెగలవారిని, మునుపటికన్న మఱింత యెచ్చరికతో పట్టణమును రక్షించుట యందు జాగరూకులై యుండున ట్లాజ్ఞాపింపుము' అని యాజ్ఞాపించెను. రావణునకు మిక్కిలియు విశ్వాసపాత్రుఁడగు నా ప్రహస్తుఁడు, బుద్ధినిశ్చయముతో రాజాజ్ఞ సేయం గోరి సైన్యమునంతటిని నా రావణుని గృహములోపలను వెలుపలను గాపుంచెను. అంత పురరక్షణమునకై వేఱుగా సైన్యమునిలిపి, ప్రహస్తుఁడు రాజగు రావణునిస మ్ముఖమునకు వచ్చి కూర్చుండి యతనితో 'బలవంతుఁడవగు నీదు సైన్యమును వెలుప లను లోపలను నంతటఁ గావలియుంచియున్నాను. ఇఁక మనస్సు కుదురుగలిగి చేయఁ గోరినదానిని .జేసికొనుము. అది నీకు సిద్ధించుఁగాత' మనెను. రాజ్యమునకు హితము గూర్చుటయందే రతి గలయా రాక్షసరాజు రావణుఁడు ప్రహస్తుఁడు చెప్పినమాటవిని విజయంబుగోరక, కామసుఖమునే కోరి, సుహృదులంజూచి 'ధర్మము, అర్థము, కామము అనుమూఁటిలో నేది సేవింపవలయునో యని సంకటముగలిగినపుడు, మీ రయ్యెదాని ననుష్ఠించుటవలన ఫలముగాఁగలుగు ప్రియాప్రియములను, సుఖదుఃఖములను, లాభ నష్టములను, మంచి సెబ్బరలను దెలిసికొనుటకు సమర్థులరుగావున, ఆ ఫలములంబట్టి సేవింపందగిన దిదియని సందేహముదీర్ప శక్తులరగుదురు. ఎట్లన మీరలు, సర్వవిధముల చక్కఁగా నాలోచనముసేసి నిశ్చయించి యారంభించినకార్యములం దొక్కటిగాని నాకెప్పుడును విఫలమైనది లేదు. అన్నియు సఫలములే యైయున్నవి. ఇంద్రుఁడు, చంద్రసూర్యాదిగ్రహములతోను నక్షత్రములతోను దేవతలతోనుంగూడి జయలక్ష్మి నొందినట్లు, నేను మిమ్ముఁగూడి మిక్కిలియు జయలక్ష్మి నొందెదను. మీకందఱకు మాత్ర మింతకుమునుపే యీసంగతిం దెలుపఁగడఁగితిని. కుంభకర్ణుఁ డప్పుడు నిద్రించుచుండినందున, అతనికి మాత్ర మీసంగతిని జెప్పలేదు. మహాబలుఁడును ఆయుధ ధారులందెల్ల మిన్నయునగు నీకుంభకర్ణుఁడు ఈయాఱుమాసములుగా నిదురించు చుండెనుగదా. అతఁడిప్పుడే నిదురలేచియున్నాఁడు. కాన యింతకు ముందు తెలుపం గూడక పోయెను' అని కుంభకర్ణుంజూచి 'రామునిగారాబుపత్నియు, జనకరాజు కూఁ తురునయిన యీసీతను దండకారణ్యమున రాక్షసులు చరించు జనస్థానమునుండి యిచ్చటికిఁ బట్టితెచ్చి యున్నాను. ఆమందగమన, ఆసీత, నే నెంత వేఁడినను * నా సెజ్జ నెక్క నిచ్చగింపకున్నది (నన్ను బొందుటకు నొల్లకున్నది). ఒల్లకున్న దానిని విడిచిపెట్ట

* ఇట వాస్తవార్థమెట్లన:— రావణుఁడు తాను పూజార్థము దెచ్చిన తనయిష్టదేవతయు త్రైలోక్యమోహినియునగుసీత భూశయ్యాంబరుండి దుఃఖాక్రాంతె యగుటంజూచి తానును మిగులదుఃఖితుఁ డగుచున్నట్లు తెలుపుచున్నాఁడు.'సా మే నశయ్యామారోఢు మిచ్ఛత్యలసగామినీ|త్రిషులోకేషు చాన్యా మే నసీతాసదృశీమతా' అనిమూలము.'అట్టినాయిష్టదేవత నేలంబరుండుటను జూడలేక, (మేశయ్యా) నేను సమర్పించినశయ్యను, ఆ మెయంగీకరింపకున్నది. అట్టిబిడ ముల్లోకంబులందుఁ గలుగదని యర్థము.

రాదా! యందురో. ముల్లోకములందును సీతకు సాటియైనది మఱియొక్కతియు లేదని నాయభిప్రాయము. * ఆచెలువనెన్నడుము సన్ననై నకనకలాడుచుండెను. దాని పిఱుఁదులు దద్దయుం బెద్దవి. ఆబిడ, శరత్కాలచంద్రబింబమువంటి మొగముగలిగి బంగారుబొమ్మవలెఁ జూపట్టుచు నొప్పులకుప్పయై మయుఁడు ప్రతిక్షణమును వింత వింతగాఁ జూపట్టునట్లు నిర్మించిన మాయవలె (ఆశ్చర్యవస్తువువలె) దళుకొత్తుచుండును. మిక్కిలియు నెఱ్ఱనయిన యడుగులుగలిగి, మృదువులును సమతలములునై యెఱ్ఱనిగోళ్లతోఁ గూడియున్న యాబిడ యడుగులనుం జూడఁగా నామరులు చెలరేఁగుచున్నది. వేల్వఁబడిన యగ్నియొక్క జ్వాలవలెను, సూర్యుని ప్రభవలెను, జూడంజూడ నాకు మరు లెచ్చుచున్నది. (వాలుంగన్నులవన్నెలాఁడిని, సీతను, జూచి మరునిబారిం జిక్కితిని) † నిక్కుగల ముక్కుగలిగి, సొగసై, విశాలమై, చక్కని కన్నుంగవతోఁ జెన్నారునాచిన్నారి ముద్దుమొగమును జూడంజూడ, నేను వివశుఁడనై మన్మథునిబారిం బడియున్నాను. మన్మథుఁ డెవ్వరినిగాని, వారికి కోపము వచ్చియున్నపుడును సంతోషము కలిగియున్నపుడును ఒకేవిధముగ బాధించుచుండును; మనోవ్యథ వారికిఁ గలిగినను శరీరపీడ పయికొనియున్నను జాలిపడి విడిచి తొలఁగక యెడతెగక పట్టి కారించుచుండును; మేనును వన్నెఁ దప్పునట్లు గ్రాఁచుచునుండును. ఇట్టివాఁడు గనుక నతఁడు నా యీదుర్దశను జూచియు దయ మాలి నామనసు నిట్లు వ్యాకులపెట్టినాఁడు. 'అట్లని బలవంతముగానైన సీత ననుభవింపరాదా' యందురా!

---

* ఇటువంటిలక్షణములుగలసీత దుఃఖమునొందుట తగదనుటకై 'తనుమధ్యా పృథుశ్రోణీ శారదేందునిభాననా । హేమబింబనిభా సౌమ్యా మాయేవ మయనిర్మితా' అనివర్ణించి 'సులోహితతలౌ శ్లక్ష్ణౌ చరణౌ సుప్రతిష్ఠితౌ। దృష్ట్వా తామ్రనఖౌ తస్యా దీప్యతే మే శరీరజః।హుతాగ్నే రర్చిసంకాశా మేనాం సౌరీమివప్రభామ్' ఏవంవిధలక్షణములుగలిగి సకలపాపహరణములైన యా మెచరణములనుజూచి హుతాగ్నిజ్వాలవలెను సూర్యప్రభవలెను నుండు నాబిడ దుఃఖించుచుండుటయుఁజూచి (శరీరజః)నాదేహమునంబుట్టినదుఃఖము-అట్టిబిడ నేలంబరుండుచున్నదే యనునాదుఃఖము-(దీప్యతే) మఱిమఱి హెచ్చుచున్నది.

† ఇందులకు 'ఉన్నసం వదనం వల్గు విపులం చారులోచనమ్।పశ్యం స్తథావశ స్తస్యాః కామస్య వశమేయివాన్॥ క్రోధహర్షసమానేన దుర్వర్ణకరణేనచ । శోకసంతాపనిత్యేన కామేన కలుషీకృతః' అనిమూలము. వాస్తవార్థము. నీకిట్టిచింతయేల! నీభార్యలతోరమించి సుఖముగానుండుమీ యనఁగా చెప్పుచున్నాఁడు. క్రోధహర్షసమానత్వాది లక్షణములుగల మన్మథునిచేత కలుషీకృతుఁడనై (అవశః) పరవశుఁడైయున్నను, (తస్యాః దుఃఖితాయాః అనిశేషము) దుఃఖితయైయున్న యాసీతయొక్క (వదనం పశ్యన్) మొగమును జూడఁగా, (కామస్యవశమేయివాన్) అని కాకువు. మన్మథునిబారిం బడుదునా-పడననుట. నే నట్టిమన్మథపరవశుఁడనైయున్నను,నాసీతాదేవి ముఖమునుజూడఁగా కామబాధయంతయు నశించుచున్నదనియర్థము.

* వాలుంగన్నులు గలయాచెలువ తనపెనిమిటి రాముఁడు వచ్చునేమోయని యతని రాక నెదురుచూచుచు 'సంవత్సరములోపల రాముఁడు రానియెడల నీవు చెప్పినట్లు చేసెద' నని న న్నొకసంవత్సరకాలము గడువు వేఁడికొనియున్నది. ఆచెలువ చక్కనికన్నుంగవ చెన్నునకుఁ బరవశుఁడనై యాబిడ ముద్దులుగులుక నడుగుకొన్న మాటకు నట్లేకానిమ్మని యొప్పుకొంటిని. † చాలదూరము నడచినగుఱ్ఱమువలె మన్మథునిచే నెడ తెగక గాసిపడి పడి యలసియున్నాను. 'ఆసీతం గొనిపోవుటకు రామలక్ష్మణులు సేనాసహితులై రానుండఁగా నీకది యెట్లు దక్కు' నందురా? సముద్రమో కలఁచివచ్చి లోఁబఱచుకొన నలవిగానిది; తిమితిమింగలాది మహాజంతువులు నెరసి బెరసియుండునది. అట్టిదానిని వానరు లెట్లు దాఁటిరాఁగలరు? ఆ రామలక్ష్మణులుగాని యెట్లు దాఁటఁగలరు? ఒకవేళ దాఁటుదురనియే తలంతము. ఒక్కవానరుఁ డంతటి వాఁడే మనతో నింత పెద్దయుద్ధము చేసిపోయినాఁడే. కార్యము లెట్లెట్లు పోవునో తెలియుట కష్టముగానున్నది. మీలో నెవ రెవరిబుద్ధికి నెట్లు దోఁచుచున్నదో చెప్పుఁడు. అప్పుడు మిమ్ముం దోడు సేసికొని, దేవాసురయుద్ధమున గెలుపునొందితిని. అప్పుడు సహాయభూతులై గెలిచినమీరును నట్లె యిప్పుడును సహాయులైయున్నారు. ఇట్లు దేవేంద్రునే గెలిచిన నాకు, విభీషణుఁడు చెప్పినట్లు మనుష్యునివలన భయ మేమాత్రమును గలుగదు. అయినను చక్కఁగా విమర్శించిచూడుఁడు. అచ్చట సముద్రము నవ్వలిగట్టున, రామలక్ష్మణులు సీతయున్న స్థలమును దెలిసికొని సుగ్రీవాదులగు వానరులం బురస్కరించుకొని సముద్రతీరముఁ జేరియున్నారు. చేరనీ. దానిచే మనకు నెబ్బర యేమి? ‡ మిమ్ము విమర్శించిచూడుఁడన్నది మఱేమికాదు. సీతను నొసంగకుండునట్లును దశరథకుమారులగు రామలక్ష్మణులను జంపునట్లును మీర లాలోచనము చేయుఁడు. అట్లుచేసి చక్కఁగా నిశ్చయించి యుపాయము నాకుఁ జెప్పుఁడు.

* నీయింట జగదంబయగు సీతయుండఁగా నీకేమిహాని యనియడుగఁగా ఆసీతయు నాగృహమునసుండుకాల మించుమించుగా సమాప్తమయినదేయని చెప్పినాఁడని వాస్తవార్థము తెలియునది-మహేశ్వరతీర్థులు. 'సా మే న శయ్యా మారోఢు మిచ్ఛతి' 'ఆబిడ నాసెజ్జనెక్క నిచ్ఛగింపకున్నది' అని సీతకు తనయందనురాగము లేకుండుటను తాను పరవశుఁడై వెలపుచ్చి మరల దానిని గప్పిపుచ్చుటకై తానే పెట్టినగడువును సీత యడుగుకోఁగా నిచ్చినట్టుగా ఆబిడయం దారోపించి చెప్పినాఁడని తెలియునది-గోవిందరాజులు.

† ఇందులకు 'శ్రాంతోఽహం సతతం కామా ద్యాతో హయఇ వాధ్వని' అనిమూలము. ఈమన్మథునివలనఁ గలుగు సౌఖ్యములనెల్ల ననుభవించి విసిగియున్నాను. ఇఁక నాకవి యక్కఱలేదు; కడతేఱునుపాయము వెదకుచున్నానని వాస్తవార్థము.

‡ ఇందులకు 'అదేయాచ యథాసీతా వధ్యౌ దశరథాత్మజౌ। భవద్భి ర్మన్త్ర్యతాం మన్త్రస్సునీతంచాభిధీయతామ్' అనిమూలము. వాస్తవార్థమున 'అవధ్యౌ' అనిభేదము. నేను సీతాదేవి నీయకయుండునట్లును, దానిచే రామలక్ష్మణులచే నాకు మరణము గలుగునట్లును మీరు చక్కఁగా నాలోచించి యుపాయముఁ జెప్పుఁడని యర్థము.

'సముద్రమును దాఁటివచ్చి మనలను జయించుటకు రామునికి శక్తి లేకున్నను నతని సహాయుని కెవ్వనికేని యట్టిశక్తి యుండవచ్చు' నందురా? *వానరులను సహాయులుగాఁ జేసికొని, సముద్రమును దాఁటి యిచ్చటికి వచ్చుటకు రామునికే కాదు, జగంబున మఱెవ్వనికిని శక్తి లేదు. కాఁబట్టి నిశ్చయముగా నాకే జయము గలుగును' అనెను. అట్లు రావణుఁడు మన్మథవికారముచేత విపరీతబుద్ధినొంది, ప్రలాపించినట్లు చెప్పినమాటవిని, కుంభకర్ణుఁడు మిక్కిలియుఁ గోపమునొంది యతనితో 'నీవు, నీయంతనే యొకమాటు ఆలోచించి యపుడు రామలక్ష్మణుల ప్రాపుననుండిన సీతను బలవంతముగా నిచ్చటికిఁ బట్టిదెచ్చితివే. అట్లు దెచ్చునపుడే మాతో నాలోచించియుందువేని నీమనసు, యమునానది యామునపర్వతము నొందునట్లు, చక్కని నిశ్చయమునొంది నిమ్మళముగా నుండునే కదా. అప్పుడే మాతో నాలోచింపవలసినకాలము. ఇప్పుడు మించిపోయిన వెనుక నాలోచించుటయంతయు వ్యర్థమే గాన నీమనసు కుదుటఁబడకున్నది. 'అప్పుడే మీతో నాలోచించి యుండినచో ఫలమే' మందువా? మహారాజా! ఇప్పుడు చేయు నాలోచన మంతయును, సీతఁ బట్టితెచ్చుటకు మునుపే మాతోఁ జేసియుందువేని, మిక్కిలియుఁ జక్కఁగా నుండియుండును. దశకంఠా! ఎవ్వఁడు మునుపే యాలోచనముచేసి న్యాయమును గనుఁగొని పిమ్మట నాన్యాయముచొప్పున రాజకార్యములను జేయుచున్నాఁడో యారాజు తనమనసు కార్యనిశ్చయమునొంది నిమ్మళముగా నుండుటచే నీయట్లు వెనుకఁ బరితాపమునొందఁడు. కార్యములను విపరీతమైన యుపాయముతోఁ జేయుచున్నను, లేక వానిని విపరీతముగాఁ జేసినను, అవి నిష్ఫలములగుటయే కాక, అపాత్రులకుఁ బెట్టంబడు హావిస్సులవలె దోషముగూడఁ గలుగఁజేయును. ఎవ్వఁడు కార్యములకు మునుపు చేయవలసిన యాలోచనములను కార్యములకు పిదపను, ఆలోచనములకు పిదప పూనవలసిన కార్యములను ఆలోచనమునకు మునుపును జేయఁగోరునో, వాఁడు మంచిసెబ్బరలు దెలిసినవాఁడుగాఁడు. హంసలు, తమ కెగిరి దాఁటరాకుండు క్రౌంచపర్వతమును, కుమారస్వామి దానియందుఁ జేసినరంధ్రముమూలమున దూఱి దాఁటిపోవునట్లు, శత్రువులు తమకంటె నెక్కుఁడు బలముగలవానిని ఎదుర్కొని గెలుచుట శక్యముగాదని విచారించి వాఁడు కార్యముల నాలోచించి చేయనిచపలుఁడుగా నుండెనేని, అట్లాలోచించి చేయనిసందుఁ జూచి తటాలున వానిపైఁబడి క్రిందుపఱుతురు. ఇట్లు సీత నపహరించి తెచ్చినకార్య మెంతయు నపాయకరమైనది. ఇది నీ వాలోచింపక చేసితివి. ఈరంధ్రము నీయందుండియు భాగ్యవశమున, నిన్ను రాముఁడు విమ

* ఇందులకు 'నహిశక్తిం ప్రపశ్యామి జగత్యన్యస్య కస్యచిత్ । సాగరం వానరైస్తీర్త్వా నిశ్చయేన జయోమమ' అనిమూలము. వాస్తవార్థము..వానరులతోఁగూడి సముద్రమును దాఁటివచ్చుటకు (అన్యస్య కస్యచిత్) రాముఁడుదప్ప మఱియొక్కనికి శక్తి లేదు. రాముఁడు దాఁటివచ్చుట (నిశ్చయే) నిశ్చయమేని, (నజయోమమ) నాకు జయము గలుగుటలేదు. అనియర్థము.

ముతోఁగూడిన మాంసమువలె, ఎవ్వరికిని దెలియనట్లు ఇదివఱకుఁ జంపకున్నాఁడు. 'అయిన నింక గతియేమి' యందువా? ఇట్లునీవు నీకుఁదగనట్టికార్యమును జేసితివిగావున, అది నేనుదక్క మఱి యితరులెవ్వరిచేతను జక్కఁబెట్టనలవిగాదు. నేను నీశత్రువులనుజంపి దానిని సరిపెట్టెదను. నీవు నిర్వ్యసనముగా నుండుము. రాజా! నేను నీపగవారినందఱను రూపుమాపెదను. 'అతిమానుషవిభవులగువారిని గెలుచుట యెట్లు శక్య' మందువా? వారు, ఇంద్రసూర్యులయినను, అగ్నివాయువులయినను, కుబేర వరుణులయినను, వారలతో నేను యుద్ధముచేయుదును. నేను పర్వతమంతటికాయముతో గొప్ప యినుపగుదియందాల్చి, వాఁడికోఱలతో సింహనాదములు సేయుచు, యుద్ధంబునకుఁ దలపడఁగా దేవేంద్రుఁడు గూడ భయపడిపాఱునే. తక్కినవారెంత! *ఆరాముఁడు నాపై నొకట నొకబాణమువేసి మరల రెండవబాణము నేసి కొట్టునంతలోపలనే నేనతనినెత్తురు త్రాగెదను. నీవు నిచ్చలు నూఱడిలియుండుము. †నేను రామునిం జంపి నీకనాయాసమున జయముగలుగునట్లు ప్రయత్నముసేసెదను. అట్లు రామునిని

*ఇందులకు 'పునర్మాం స ద్వితీయేన శరేణ నిహనిష్యతి। తతో౽హం తస్య పాస్యామి రుధిరం కామమాశ్వస' అనిమూలము. ఇందు అశ్లీలమును ధ్వనించుచున్నది. ఎట్లన:—(పునర్మాం...నిహనిష్యతి) రాముఁడు రెండవబాణముచే నన్నవశ్యము చంపఁగలఁడు. (తస్య) ఆరామునియొక్క, (తతః) ఆచంపుటవలన—రాముఁ డట్లు నన్నుఁ జంపుటవలన, (రుధిరం) నానెత్తురును (పాస్యామి) త్రాగుదును. నీవు (కామం) మిక్కిలియు, (ఆశ్వస) నిట్టూర్పువిడువుము అనియర్థము. గోవిందరాజులు. (పునర్మాం...హనిష్యతి) రాముఁడు నన్నొకబాణమునఁగొట్టి రెండవబాణమునఁ జంపునేని, (తతః) ప్రాగేవ=అంతకుమునుపే, (తస్య) వానరాణాం=ఆరాముని సంబంధించిన వానరులయొక్క, (రుధిరంపాస్యామి) నెత్తురు త్రాగెదను. నీవూఱడిలుము. రాముఁడు నన్ను రెండవబాణముననే చంపువాఁడేని యంతకుమునుపే వతనివానరుల నెత్తురు త్రాఁగివైచెద. ఊఱడిలుమని యర్థము. మహేశ్వరతీర్థులు.

† ఇందులకు 'వధేన వై దాశరథే స్సుఖావహం జయం త వాహర్తు మహం యతిష్యే। హత్వా చ రామం సహ లక్ష్మణేన ఖాదామి సర్వాన్ హరియూథముఖ్యాన్' అనిమూలము. అశ్లీలార్థము:-(వధేన) నావధముచేత-నేను రామునిచేత వధమునొందుటచే, (దాశరథేః) రామునికి, (తవ) సకాశాత్ =నీవలననుండి, (సుఖావహం జయం ఆహర్తుం అహం యతిష్యే) సుఖప్రదమైన జయముగలుగుటకు ప్రయత్నించెదను. నేను చచ్చుటచే రాముఁడు నిన్ను సుఖముగా జయించునట్లు చేసెదననుట. (రామం) రాముని, (హత్వా) 'హనహింసాగత్యోః' అన్నట్లు గత్యర్థకము గలదుగాన, పొంది, (ఖాదామి) అనికాకువు; బ్రతుకుదునా యేమి-రామునితోఁ దలపడి బ్రతుకలేననిభావము. గోవిందరాజులు. (దాశరథేర్వధేనతి) రాముఁడు వధమునొందఁగా, (తవ సుఖావహం జయం ఆహర్తుం న యతిష్యే) నీకు సుఖమైన జయము గలుగుటకు యత్నింపను-రాఘవునిఁ జంపి నీకనాయాసముగా జయము గలుగునట్లు చేయఁజాలననుట. రామునిఁ జంపఁజాలననిభావము. అయితే, (రామం) వినా అనిశేషము. రాముఁడుతప్ప, (లక్ష్మణేనసహాసర్వాన్ హరియూథముఖ్యాన్ హత్వాఖాదామి) లక్ష్మణునిని, తక్కినవానరశ్రేష్ఠులను జంపి తినెదను-రాముని గెలువఁజాలను; రామునిఁదప్పఁ దక్కినవారినెల్లఁబట్టి భక్షింపఁగలనని వాస్తవార్థము. మహేశ్వరతీర్థులు.

లక్ష్మణునినిం జంపి మేటివానరులనెల్ల భక్షించెదను. * నీవు నీయిచ్చవచ్చినట్లు క్రీడింపుము. మేలయినమద్యముం ద్రాగుము. నీవు తుందుడుకులేక నీకిష్టము లయినకార్యములం జేసికొనుము. నేనుబోయి రాముని యమునిపురికిం బంపెద. అంత సీత చిరకాలము నీకు వశమైయుండంగలదు' అనెను. ఇది పండ్రెండవసర్గము.

{ మహాపార్శ్వుండు సీతను బలవంతముగా ననుభవింపుమని రావణునకుం జెప్పుట. రావణుండు బ్రహ్మశాపమున పరస్త్రీని దనకు బలాత్కరింపరాదని చెప్పుట. }

రావణుండు కుంభకర్ణుని నయవచనములకుం గోపమునొందినాండని, మిక్కిలి బలవంతుండగు మహాపార్శ్వుండు తెలిసికొని కొంచెము సేపు అతనిని బ్రసన్నునిగాం జేయునుపాయము నాలోచించి యంతం జేతులుమొగుడ్చుకొని 'ఎవ్వండు తేనియను త్రాంగుటకై మృగములును సర్పములును నెరసియుండునడవికిం బోయి యచ్చట నెట్టకేలకు దానిని సంపాదించియుం ద్రాగకుండునో వాండు మూఢుండే యగును. అట్లు సీతంగోరి యతిప్రయాసంబున నాబిడను దెచ్చియు ననుభవింపక యూరకుండందగదు. 'పగవారు కలిగియుండంగా వారినిగెలువక యధర్మావహమైన యిట్టిపని యెట్లు చేయవచ్చు'నందువా? †నీవు పగవారినెల్లరూపుమాపువాండవు. నీవే సర్వమును నియమించువాండవే; నిన్ను నియమించువాండెవ్వండు? కాన ధర్మమునకు భయపడవలదు. శత్రువులం దల

---

* ఇందులకు 'రమస్వ కామం పిబ చాగ్ర్యవారుణీం కురుష్వ కార్యాణి హితాని విజ్వరః। మయాతు రామే గమితే యమక్షయం చిరాయ సీతా వశగా భవిష్యతి' అనిమూలము. శ్లిష్టార్థము-(మయా) నాచేత, (రామే) విషయే=రామునివిషయమందు, (అక్షయం) అక్షయముగా, (గమితా) చేర్పంబడిన-రామునితోం జేర్పంబడిన, (ఇయంసీతా) ఈసీత, (వశగా) రామునకు వశవర్తినిగా, (భవిష్యతి) కాంగలదు. నేను, (రమస్వ) ఇత్యాదిక్రియలు కాక్వర్థకములు. రమింపుము—అనంగా రమించుట మొదలైనవి నీవెట్లు చేయంగలవనుట. నేనేమో సీతను రామునితోం జేర్చివైతును కాన యాబిడ యతనివశమున నే యుండంగలదు. అప్పుడు నీవు రమించుట త్రాగుట హితకార్యములను జేసికొనుట యెట్లో చూచెదనని యర్థము—గోవిందరాజులు. (మయా) నాచేత, (రామే) విషయే=రామునివిషయమై, (యమక్షయం గమితే సతి) యమపురమును పొందింపంబడినవాండవుకాంగా- నేను జచ్చి నిన్నును రామునిచే జంపింపంగా, (ఇయంసీతా) ఈసీత, (అ+వశగా) విష్ణురూపుం డగురామునివశమును బొందినదై, (భవిష్యతి) ఉండంగలదు. అంతట నీవు నీయిచ్చవచ్చిన హితాదులు గావించుకొనుమా చూతమని వాస్తవార్థము—మహేశ్వరతీర్థులు.

† ఇందులకు 'ఈశ్వర స్యేశ్వరః కోఽస్తి తవ శత్రునిబర్హణ। రమస్వ సహ వైదేహ్యా శత్రూ నాక్రమ్య మూర్ధసు' అనిమూలము. అర్థాంతరము. (ఈశ్వరస్య ఈశ్వరః కోఽస్తి) ఈశ్వరుండగురామునకు ఈశ్వరుండెవండు? రామునినిగ్రహించుట ఎవనికి శక్యముగాదనుట, (శత్రూన్) పూజయందు బహువచనము, నీపగవాండగురాముని, (మూర్ధసు) దశస్వపి = పదితలలచేతను, (ఆక్రమ్య) ఆక్రమించి=శిరసా ప్రణమిల్లియనుట.

లు ద్రొక్కి సీతంగూడి క్రీడింపుము. 'అది నన్నొల్లకున్న దే! ఏమిసేయుదు' నందువా? * నీవు మిక్కిలియు బలవంతుఁడవుగదా. సీతయొప్పకున్నను వంచనతో వెంటినాక్రమించు కుక్కుటమువృత్తిని బలవంతముగా నాచెలువను పలుమాఱు పయిఁకొని యనుభవింపుము. అట్లు భోగములనొంది విచారము లేక సుఖముండుము. 'పిదప భయము వచ్చిన వారించుట యె' ట్లందువా? ఇట్లు నీవు నీకామము దీర్చుకొన్న పిదప నీకేదైన భయము సంభవించునేని యది యప్పుడే వచ్చినను రానిమ్ము. లేక మీఁద రానున్న నుండనిమ్ము. నీకన్నియు నొకసరకుగాదు. ఇంతేల! నీ విచటనేయుండుము. కుంభకర్ణుఁడును మహాబలుఁ డగునింద్రజిత్తును, వీ రిద్దఱే నుమ్ముఁదోడుసేసికొని వజ్రాయుధధరుండై దేవేంద్రుఁడు వచ్చినను నిలిచి యోర్వఁజాలుదురు. యుద్ధముసేయఁ జేతఁగానివారలు, దానమును సామమును భేదమును నేర్పఱిచిరి. కాన విభీషణుఁడు చెప్పిన యామాటయం దేదియుఁ దోసిపుచ్చి దండోపాయమునఁ గార్యముల నీడేర్చుకొను ఉపాయమే నీమనసున కెక్కినదిగా నుండనిమ్ము. నికుంభుఁడు చెప్పినట్లు రామాదులున్న చోటికిఁ బోవలదు. నీవు మహాబలుండవుగద. నీశత్రువు లీలంకదాపున రాఁగానే మేము వారినందఱను మాశస్త్రబలమున నీకు వశులంగా నిగ్రహింపఁగలము. ఇందులకు సందేహము లేదు' అనెను. మహాపార్శ్వుఁ డిట్లు చెప్పఁగా నప్పుడు రాక్షసరాజగు రావణుఁడు తనచిత్తమునకుఁ దగునట్లు చెప్పినాఁడని వానిని మిక్కిలియుఁ బొగడుచు, వానితో 'మహాపార్శ్వుఁడా! సంతోషించితిని. నాయందొక్కరహస్యముగలదు, నీకది తెలిసియుండదు. అదిజరిగి చిరకాలమైనది. పూర్వము జరిగినది చెప్పుచున్నాను. ఒకానొకప్పుడు ఆకాశమున పుంజికస్థలయను నప్సర నన్నుఁజూచి భయమున నొదిఁగియొదిఁగి దాఁగి యగ్నిజ్వాలవలె వెలుఁగుచు బ్రహ్మదేవుని భవనమునకు నద్దేవునికి వందనముసేయుటకై పోవుచుండఁగాఁ జూచితిని. అంత నే నాచెలువను, బలవంతముగాఁబట్టి వలువయూడ్చి భోగించితిని. అది వాడినతామరతూఁడువలె కలఁగి నలఁగి బ్రహ్మదేవునొద్దకుఁ బోయినది. అట్లాచెలువను చెఱుపుట యపుడు మహాత్ముఁడగు బ్రహ్మదేవునకుఁ దెలిసినట్లు నాకుఁ దోఁచుచున్నది. అంత బ్రహ్మ మిక్కిలియుఁ గోపమునొంది, నన్నుంగూర్చి 'ఇదిమొదలుగా, నీవిట్లు పరస్త్రీని బలాత్కార

(వైదేహ్యాసహ రమస్వ) వైదేహితోఁబాటుగా రమింపుము. వైదేహి తనభర్తతో రమించునట్లే నీవు నీభార్యలతో రమింపుము—లేక వైదేహితోఁగూడ నున్న రాముని నిగ్రహించుట యశక్యము. కాన పదితలలునోఁక రామునికిని సీతకును (త్రొక్కుము' అని గోవిందరాజులు.

* ఇందులకు 'బలాత్కుక్కుటవృత్తేన వర్తస్వసుమహాబల। ఆక్రమ్యాక్రమ్య సీతాం వై తథాభుఙ్క్ష్వరమస్వచ' అనిమూలము అర్థాంతరము. (కుక్కుటవృత్తేన వర్తస్వ) కుక్కుటవృత్తితో నితరస్త్రీల యొడవర్తింపుము. సీతనో (బలాత్) బలముకొలఁదిని, (భుఙ్క్ష్వ) 'భుజపరిపాలనాభ్యవహారయోః' అను ధాత్వర్థముంబట్టి, పరిపాలింపుము. నీవు కుక్కుటవృత్తితో నితరస్త్రీలతో రమింపఁదగునుగాని సీతనో బలముకొలఁది రక్షింపవలయును అని మునిహృదయము. గోవిందరాజులు.

తును బొందుదువేని, యప్పుడే నీతల నూఱుతునియలుగా పగులఁగలదు. ఇందులకు సందేహములేదు' అని శాప మొసఁగెను. * ఇట్లతఁడు బలవంతముగా శాప మొసంగి నందులకు నేను మిక్కిలియు భయపడియే, పరస్త్రీయగుసీతను అందును మహావిదేహ కులంబునఁ జనించినదానిని, బలాత్కారమున నా మేలిసెజ్జ నెక్కింపకున్నాను. నాకు మఱొక్కరితో డక్కఱలేదు. నాకు సముద్రమునకుంబోలె వేగమును వాయువునకుంబోలె గమనమును గలదు. ఈసంగతి రాముఁ డెఱుఁగఁడు. కావుననే నా పయి సేనతో నెత్తివచ్చుచున్నాఁడు. పర్వతగుహాయందు నిదురించుచున్న సింహమును నిదురలేపునట్లును, నిద్రవోయియున్న మృత్యువును మేలుకొలుపునట్లును, ఊరకయున్న పరమకోపార్హుఁడనగునన్ను రాముఁడు కావలయునని రేఁచుచున్నాఁడే! వాఁ డెంతయు తెలివిమాలినవాఁడు. వాఁడు నాపరాక్రమము దెలియకున్నను బోనీ. రాముఁ డింతవఱ కెన్నఁడును, యుద్ధంబున రెండునాలుకలతో సెలవులు నాఁకికొను చున్న క్రూరసర్పంబులం బురుడించు నావాఁడిబాణములనుగూడఁ గని యెఱుంగఁడు. కావుననే నాపయి నెత్తివచ్చుచున్నాఁడు. ఇఁక, శీఘ్రంబుననే, యేనుంగును గొఱవి కట్టియలచేతంబోలె, రాముని, పందలకొలఁదిని వింటనుండి నిగిడించిన వజ్రముల వంటి బాణములచేత, సంతాపపెట్టి పాఱునట్లు చేసెదను. వాఁడు పలాయితుఁడుకాఁ గా, మఱి ప్రాతఃకాలమున నుదయించుచున్న సూర్యుఁడు నక్షత్రములకాంతినెల్లం గొల్లగొనునట్లు, నేను గొప్పసేనంగూడి, రామునికిం గలయావానరబలమునుగూడఁ జక్కాడి వ్రక్కలుసేసెదను. వేయికన్నులు గలదేవేంద్రునికిఁగాని, మఱి వరుణునికిఁ గాని, యుద్ధంబున నన్ను గెలువఁ దరముగాదయ్యె. మఱియు నేను బాహుబలంబునఁ గుబేరునింగూడ జయించి యతఁడు మున్ను పాలించుచుండిన యీలంకాపురిం గొంటిని. ఇఁక మనుష్యుండగు రాముఁడు నాకెంతమాత్రము' అనెను. ఇది పదుమూఁడవసర్గము.

విభీషణుఁడు శ్రీరాముఁ డెట్టివారికిని గెలువ నలవిగాని
వాఁడనియు సీత నతని కొసఁగుటయే సర్వరాక్ష
సులకు క్షేమకరమనియుఁ జెప్పుట.

అంత, విభీషణుఁడు రాక్షసేశ్వరుఁ డగురావణుఁ డాడినమాటను కుంభకర్ణుఁడు గర్జించిన నిరర్థకవచనములను, విని, యంత రాక్షసరాజముఖ్యుం డగురావణు

---

* రావణునకు రంభనుబట్టి నలకూబరుఁ డొసంగిన శాపముండినను, ఆ నలకూబరుఁడు ప్రాకృతదేవతయగుటవలనను రావణునికి పుత్రుఁడగుటవలనను, అతనిశాపమును పాటింపక బ్రహ్మ పిదప రావణుఁడు పుంజికస్థలనుగూడఁ బట్టిచెఱుపఁగాఁ జూచి తాను శాప మొసంగెను. కావుననే రావణుఁడు ఉల్లంఘింపరాని పితామహవాక్యము నే యిట చెప్పినాఁడని తెలియునది.

నితో కర్తవ్యార్థమును బోధించుహితవచనంబుల 'రాజా! సీత నొసంగకయే రాముని జంపు నుపాయ మడిగితివి. సీత యంటినమాత్రనే చంపు పెనుసర్పముసుమీ! దానికి, వక్షమే మేనివిరివి; చింతయే విరోధిప్రాణములను హరించునది గావున విషము; సహజం బయినచిఱునగవే, తెలిమెఱుంగుచే చుఱుక్కున కాముకహృదయములం గాఁడి హరించుటచే వాఁడియైన తెలికోఱపండ్లు; చింతావశమున మొగము వాల్చిన చేతియైదువ్రేళ్లే అయిదుతలలుగాఁ గలపెద్దయురువు. ఇట్టిసర్పము నేమని కోరితివి? ఇది నీకుమాత్రమే యనర్థముగాదు. పర్వతశిఖరములం బోలి భయాకారములు గలిగి, దంష్ట్రలును నఖములునే యాయుధములుగాఁ గలిగి, వెలుఁగు వానరులు లంకపై నెత్తి రాకమునుపే సీతాదేవిని రామున కొసంగుము. రాముఁడు వజ్రకఠోరములును వాయుసమానవేగంబులు నగుబాణములను బ్రయోగించి రాక్షసపుంగవులశిరంబులం దునుమాడకమునుపే, సీతాదేవిని రామున కొసంగుము' అని యంత ప్రహస్తునిం జూచి 'ప్రహస్తా! ప్రాణహరంబులై పిడుగులంబోలె నుగవసించునట్టి రాముని వాఁడిబాణములు ఇంకను నీదేహంబును నుచ్చికొనిపోవకున్నది. కావుననే నిన్నిట్లు పొగడికొనుచున్నావు. 'కుంభకర్ణాదులు రాముని వారింతు'రందువా? కుంభకర్ణుఁడు గాని, యింద్రజితుఁడుగాని, మనరాజుగాని, మహాపార్శ్వ మహోదరులుగాని, నికుంభుఁడును కుంభుఁడునుగాని, అతికాయుఁడుగాని, ఎవ్వరును రామునెదుట యుద్ధంబున నిలువఁజాలరు? నీవు సూర్యునికాపుదల నున్నను దేవతలందఱు నిన్ను గావవచ్చినను, నీవు దేవేంద్రునితోడపయి బిడ్డనివలెఁ గూర్చున్నను, మృత్యువుతోడ నక్కినను, ఆకాశమున కేఁగినను, పాతాళముఁ జొచ్చినను, నీవు ప్రాణములతో నుండువఱకు నిన్ను రాముఁడు విడిచిపెట్టఁడు; చంపియే విడుచును' అనెను. విభీషణుండు చెప్పినమాటవిని యంతఁ బ్రహస్తుఁడు, 'మాకు దేవతలవలనఁగాని, దానవులవలనఁగాని, మఱి యెవ్వరివలనఁగాని భయములేదు. యక్షులవలనఁగాని, గంధర్వులవలనఁగాని. మహోరగంబులవలనఁగాని, గరుడులవలనఁగాని యుద్ధంబున నాకెంతమాత్రమును భయములేదు. ఇఁక యుద్ధంబున రామునివలన, మనుష్యుఁడగు నొకరాచపిల్లవానివలన, భయమెట్లుగలుగును?'' అనెను. విభీషణుఁడు మహాబుద్ధిమంతుఁడు, రాజుమేలు గోరువాఁడు; స్వామి ధర్మార్థకామంబుల మూఁడింటిని జక్కఁగా నాలోచించువాఁడు; కాన ప్రహస్తుఁడు రాజునకుఁ గీడుగలిగించునట్టిమాటం జెప్పఁగా విని, యతనితో 'ప్రహస్తా! నీవును మనరాజును మహోదరుఁడును కుంభకర్ణుఁడును రామునివిషయమై యేయేకార్యము లెట్లెట్లు చేయవలయునని చెప్పితిరో యవి యతనిపట్ల నట్లట్లు చేసి తీర్చుట, అధర్మాత్మునకు స్వర్గగమనమువలె, యెంతమాత్రము శక్యముగాదు. ప్రహస్తా! తెప్పకొయ్యయైనను లేనివానికి మహాసముద్రమును దాఁట నలవియగునా? అట్లె, నాకుఁగాని, నీకుఁగాని, రాక్షసుల కందఱకుఁగాని, కార్యదక్షుం డగురాముని వధింప నెట్లు శక్యమగును? ఎట్లును శక్యముగాదు. కాన వారు వధ్యులనుట మాను

ము. రాముఁడో ధర్మమునకు విరుద్ధమైన యెట్టి పురుషార్థము నేని తృణీకరించి ధర్మమునే ముఖ్యముగాఁ గల పరమధార్మికుఁడు; యుద్ధంబునఁ దన్నును సారథిని రక్షించుకొనుచునే పగవారిని గీటడంచునట్టి మహారథుఁడు; మహాపరాక్రమవంతమగు నిక్ష్వాకువంశమునఁ బుట్టినవాఁడుగాన జన్మసిద్ధముగా నిరతిశయపరాక్రమశాలి; సకల ప్రకృతిమండలమును రంజించువాఁడు; మఱియు విరాధకబంధాదుల నట్లు చంపి ప్రసిద్ధిఁగాంచినవాఁడు; కార్యసమర్థుఁడు. అట్టి రాముని రణవ్యాపారములు దేవత లెఱుంగనైనఁజాలరు. ఇఁక మీకోఁటు లెంత! ప్రహస్తా! వాఁడిమొనలుగలిగి, చుఱుక్కనఁ గాఁడిపోవంజాలినవై గణువులువంగి చక్కఁ జాఁగియుండుటచే తటాలున నుచ్చి వెడలంజాలునవై రాఁబులుగుఱెక్కలే గఱులుగాఁ గట్టఁబడియుండుటచే మహావేగంబుగలిగి దురాసదములై, రామునిచే ప్రయుక్తము లగు బాణములు, నీ దేహమును భేదించి చొరంగలవు. కావుననే నీవిట్లు నిన్నుఁ బొగడికొనుచున్నావు. రావణుఁడుగాని, మహాబలుఁడగు త్రిశీర్షుఁడుగాని, కుంభకర్ణుఁడుగాని, యతనికొడుకు నికుంభుండుగాని, యింద్రజిత్తుగాని, నీవుగాని, మీరెవ్వరును, దేవేంద్రసమానుఁడగు రామునితో యుద్ధంబున నెదుర్కొని నిలువఁజాలరు. దేవాంతకుఁడుగాని, నరాంతకుఁడుగాని, అతిశయించిన రథమును మెనుకాయంబును గలయతికాయుఁడుగాని, పర్వతసమానబలుఁడగు నకంపనుండుగాని, యుద్ధంబున రామునెదుట నిలువంజాలరు. ఇతండు మనకు రాజు; మఱియు విమర్శించి చేయువాఁడుగాఁడు; అందును వ్యసనములచే గీడుపడియున్నవాఁడు; అని తలఁచి హితముచెప్పక మీరు పేరికిమాత్రము మిత్రులై కార్యమున శత్రువులతో సాటియైయై యతని యుగ్రస్వభావుఁడనిమాత్రము తలఁచి యతని పోయినదారినే పోవుచున్నారు. అందువలన సర్వరాక్షసులకు నాశము తేఁగలరేకాని వేఱులేదు. ఇది మీరెఱుఁగరు. రాక్షసరాజగు రావణుని, తుదిలేని దేహంబుగలదియు, వేయితలలతోఁ గూడినదియు, భయంకరమైనదియు, మహాబలముగలదియు, నగు రామద్వేషమను మహాసర్పము చుట్టుకొనియున్నది. మీరలాసర్పమును దోలి యితని విడిపింపుఁడు. 'సమయముమించిపోయెనే. ఏమిచేయుదు' నందురా? రాజు దుర్మార్గముఁ జొచ్చునేని,అతనిచే సమస్తకామితార్థములు పూర్ణముగాఁ బడసిన సుహృదులందఱును ఏకమత్యమునొంది, అతనిని, బెడిదంపుబలముగల భూతములచే నావేశింపఁబడిన పురుషునింబోలె, బలవంతముగా తలవెండ్రుకలంబట్టి యీడ్చియైనను, శత్రువు లతని తలవెండ్రుకలు పట్టుకొనుపర్యంతమును బలాత్కరించి రక్షించి మంచిదారికిఁ దేవలయును. మీకు సకలసుఖంబులు గూర్చినయీరాజు ఇప్పుడు వినాశమునొందుటకై లక్ష్మణుండను మహాసంహారియగు సముద్రమున మునుంగువడి, రాముఁ డనుబడబాగ్నిముఖమునఁ బడనున్నాఁడు. కాన మీరందఱు మునుముందుగానే యొక్కటిగాఁజేరి యతనిని జేయిచ్చి గట్టెక్కించుట తగును. రాజు సీతను రామున కియ్యకుండిననుండనీ. నాయీమాట యీలంకాపుర



1293. ఇంద్రజిత్తు విభీషణుని హితములను తిరస్కరించుట. విభీషణుఁడు ఇంద్రజిత్తును దూషించుట, రావణునకు హితమును బోధించుట.

మునకును, రాజునకును, అతని సుహృదులగు మీకందఱకును, దక్కినరాక్షసులకును, హితమై లెస్సగానున్నది. అట్టినామతమును జెప్పెద వినుఁడు. రాజకుమారునకు రాముని నతనిభార్యను సీతను, రాజియ్యకపోయినను, మనమె యిత్తము. 'మేమును శత్రువును జంపవలసినదే యని చక్కఁగానే చెప్పెద' మందురా? మంత్రియగువాఁడు శత్రురాజుబలమును తనరాజుబలమును పరిశీలించికొని యట్లె శత్రువునకు సంపదయందలి * సామ్యమును వృద్ధిక్షయంబులను అట్లె తనపక్షమునందుఁ గలసామ్యవృద్ధిక్షయముల ను సూక్ష్మదృష్టితో నాలోచించి యుక్తంబయినదియు స్వామికి హితమైనదియు స్వామి కిఁ జెప్పవలయును' అనెను. ఇది పదునాలుగవయధ్యాయము.

---

## ఇంద్రజిత్తు విభీషణునిమతమును ఖండింపఁగా విభీషణుఁ డింద్రజిత్తుదుర్బుద్ధి నుపన్యసించి దూషించుట.

అచ్చట రాక్షసులలో రాక్షసయోధుల కెల్ల ముఖ్యుండును, మహాబలుండునగు నింద్రజిత్తు, బృహస్పతివలె మహాబుద్ధిమంతుఁ డగువిభీషణుఁడు చెప్పినయప్పలుకును కష్టముతో విని, యంత నతనితో 'పినతండ్రీ! నీవు కడపటఁ జెప్పితివే యామాట, అట్లు ఎవ్వరునడచుకొనఁబోవునది లేదుగాన, వట్టి పనికిమాలినది; నీవు మిక్కిలి భయ మునొంది చెప్పినది. ఇసీ! ఇదేటిమాట! ఈ పులస్త్యవంశమునఁబుట్టక మఱియొకవం శమునఁబుట్టినవాఁడుగూడ నిట్టిమాటం జెప్పఁడే. మఱి చేయనుం జేయఁడే! ఇఁక నిందుఁ బుట్టిన నీకుఁ జెప్పఁదగునా?' అని యంత రావణుంజూచి 'ఈకులమునందు మాపినతండ్రి యగు యీవిభీషణుఁ డొక్కఁడుమాత్రమే బలమును, ప్రభావమును, పూనికయు, తెగువయు, పట్టుదలయు, గర్వంబును మాలియున్నవాఁడు' అని మరల విభీషణునింజూచి 'ఓరాక్షసా! ఆరాచపిల్లకాయ లెంతమాత్రమును కొఱగాని యతిదుర్బలులు. మాలో మిక్కిలియల్పుండైన యొకరాక్షసుఁడుగూడ వారిని జంపివేయఁజాలును. పిఱికి వాఁడా! నీవు భయపడుటే కాక మమ్మునేల యూరక భయపఱిచెదవు? ఓయీ! ఇం ద్రుఁడు ముల్లోకములకు నాథుఁడుగాన యతనియైశ్వర్యము చెప్ప నక్కఱలేదు. దేవతలకెల్లరాజు. కాన యతనిసైన్యసామగ్రియు కేవలమైనదిగాదు. అట్టియింద్రుని నేను నేలంబడఁద్రోసితిని. మఱియు దేవతులందఱును నావలన భయపీడితులై గుం పులుగుంపులుగా, ఒక్కఁడును మిగులక దిక్కులకుఁ బాఱిపోయిరి. నేనుబట్టితోయఁగా

* పరక్షయమును స్వవృద్ధియు నగునప్పుడు యానమును, పరవృద్ధియు స్వక్షయము నగునప్పుడు, సంధియు, పరునకును తనకును సామ్యమున్నపుడు ఆసనమును, స్వామికిఁ జెప్పవలయుననిభావము. ఇట ప్రకృతమందు పరుఁడగురామునకు వృద్ధియు రావణునకు లంకాదహనయక్షకుమారనాశనాదులచేత క్షయమును గవఁబడుటవలన సీతనొసంగి సంధిచేసికొనుటయే సాధువని మంత్రులగు మీరు మీస్వామి కిఁ దెలుపవలయునని భావము.

యైరావతము వికృతస్వరమున బిట్టుగానఱచుచు నేలంబడినది. నేను దానిదంతములు రెంటిని బలవంతముగా నూడఁబెఱికి వానిచే దేవతాగణము నెల్లను మిక్కిలియు భయపఱచి పాఱఁదోలితిని. అట్టినేను దేవతలదర్పములుగూడఁ దూలపుచ్చితిని. మేటిదైత్యులుగూడ నన్నుఁదాఁకఁగా దుఃఖము పాలుపఱిచితిని. ఇట్టి మహావీర్యశాలినగు నేను, దేవాదులుగాక కేవలమనుష్యులేయై యింద్రుఁడుంబోలె నతిశయించినవారునుగాక సామాన్యులై యున్న యీరాచపిల్లకాయల గెలువ నెట్లు సమర్థుఁడనుగాను? ఊరక యేల భయపెట్టెదవు?' అనెను. అంత ఇంద్రసమానుఁడును పగవారికిఁ జెనక నలవిగానివాఁడును, మహాతేజుండు నగునింద్రజిత్తుండు చెప్పినమాటవిని, యతఁడు చెప్పినట్లు పిఱికివాఁడుగాక శస్త్రధారులలోనెల్ల శ్రేష్ఠుఁడగు విభీషణుఁడు, ఇంద్రజిత్తునకును నెఱుఁగ శక్యముగాని మహార్థముగలమాటల వానితో 'ఓరీ! నాయనా! నీవు మొన్నటివాఁడవు. నీ కాలోచనముసేసి మంచిది యిదియని నిశ్చయించుకొనుశక్తిలేదు. పసివాఁడవు. ఇంకను నీబుద్ధి పరిపక్వముకాలేదు. కావుననే, నీవు నీకే వినాశముగలుగుటకై, కొఱమాలినమాట లిట్లు పెక్కులుప్రేలితివి. ఇంద్రజిత్తూ! ఈరావణునకు రామునివలన పుత్రమిత్రాదిసహితముగా వినాశముకలుగునని నేను చెప్పఁగావినియు నజ్ఞానమున నందులకు సమ్మతించుచున్నావే! కావున, నీవు రావణునకు పుత్రుఁడను పేరుపెట్టుకొని మిత్రునివలె వయికి నగపడుచున్న శత్రుఁడ వగుదువు. ఇట్లు పితృవినాశమునకు సమ్మతించిన యతిదుర్బుద్ధివని నిన్నే దండింపవలయునా? కాదు. నిన్ను బాలుఁడనియు నట్టిబలవంతుఁడుమాత్రమేయనియు తెగుదారియనియు తెలిసి యీసభకు యిపుడాలోచనసేయువారిపొంతకు నిన్ను పిలుచుకొనివచ్చి ప్రవేశింపఁజేసినవానినే వధింపవలయును? ఓరీ! ఇంద్రజిత్తూ! నీవు మంచిచెడుగులు తెలిసికొనుపాటి వివేకము లేనివాఁడవు; తెలిసినవాఁడనని విఱ్ఱవీఁగుచుమాత్రముందువు, శిక్షితుఁడునుగావు, క్రూరప్రకృతివి, నీబుద్ధి యల్పము; మనస్సు దుష్టము; ఏది యాలోచించి చేయువాఁడవుగావు. (ప్రహస్తుఁడు దుర్మతి; మహాపార్శ్వుఁడు సుదుర్మతి; నీవో)అత్యంత సుదుర్మతివి. ఇట్టి పసితనముచేత నేమియుఁదెలియక వదరెదవు. బ్రహ్మదండమువలె మెఱయుచు, జ్వాల లెసకొల్పుచు, అంతకునింబోలె భయంకరముగా చూపట్టుచు, యమదండములవలె నుద్దండములైన బాణములు రాముఁడు యుద్ధంబున దారసిలి ప్రయోగింపఁగా నెవ్వఁడు సహింపఁగలఁడు?' అని యంత రావణుంజూచి 'రాజా! ధనములను, శ్రేష్ఠములయినపదార్థములను, భూషణములను, దివ్యములయిన వస్త్రములను, నానావిధములయిన రత్నములను సీతాదేవితోఁగూడ రామునకు సమర్పించి, మనమిచ్చట దుఃఖముమాలి సుఖముగా నుండుదము' అనెను. ఇది పదియేనవసర్గము.

## రావణుఁడు విభీషణు నవమానింపఁగా నతఁడు నలుగురు మంత్రులతో వీడ్కొని యాకాశమున కెగసి రావణునకు లంకను దన్నును రక్షించుకొమ్మని మఱొకమాఱు హిత ముపదేశించుట.

* అట్లు మనస్సునకుఁ జక్కఁగాఁ దగులునట్లు తెలివిడిగా హితమగువాక్యము నుజెప్పిన విభీషణుంజూచి, రావణుఁడు అట్టి హితము చెప్పినందులకు నతనిని పొగడి తా నను తాపపడవలసినవాఁడయ్యు, మృత్యుప్రేరితుఁడై యుండుటవలన పరుషం

* ఇందులకుమూలము.-'సునివిష్టం హితం వాక్య ముక్తవన్తం విభీషణమ్ । అబ్రవీత్పరుషం వాక్యం రావణః కాలచోదితః' విశేషార్థము:—(సునివిష్టం) అర్థము తెలిసికొనకున్ననుగూడ వినుచుండఁగానే అతిప్రీతికరముగానుండునట్లు, సుందరమైన సన్నివేశముగలవార్తను-అనఁగా అర్థము అనిష్టముగానున్నను వినకయుండరానిదనుట, (సునివిష్టం) ఇది 'ఉక్తవన్తమ్' అనుటకుఁ గ్రియావిశేషణమునుగావచ్చును. అప్పుడువార్త సుందరమైనదయ్యును, మనస్సునందు తగులనియెడల ఆనాదరణీయమైన దగును కాఁబట్టి మనస్సునందు చక్కఁగా తగులునట్లు చెప్పినాఁడని యర్థము, (హితం) కేవలము చెవుల కింపయినదిమాత్రమే కాదు. మిక్కిలి దుర్దశను తొలఁగింపఁజేయు నుపాయముగుటచే పథ్యమైనది. అది పథ్యముగా నుండుట నాలోచింపఁగా, చెవులకు కటువుగానుండినను విడువరానిది. ఇట్టిమాట ఒక్కనికి అసహ్యముగానున్నదే! (వాక్యమ్) చెప్పవలసిన హితమంతయు పరిపూర్ణముగాఁగలది, వాక్యమనఁగా అర్థమును పరిపూర్ణముగాఁ జెప్పునదిగదా. ఇట్టివాక్యమును (ఉక్తవన్తమ్) చెప్పినవానిని, 'నాసంవత్సరవాసినే ప్రబ్రూయాత్' అన్నట్లు గురువుకడకుఁబోయి పాదములంబడినవానికి చెప్పవలసినట్టివార్తను వీనిదుర్గతినిజూచి తానేచెప్పినట్టివానిని, (విభీషణమ్) మఱియొకఁడు దూరస్థుఁడుచెప్పిన వార్తయైనయెడల, అది ఆప్తమోకాదో యని శంకించి విడువవచ్చును. 'సాక్షాత్తుగా తమ్ముఁడైన దాపటివాఁడు చెప్పినవార్త నెట్లువిడువవచ్చును. (పరుషం వాక్యమబ్రవీత్) ఇట్టివార్త విన్నతోడనే 'నాసందేహము తీఱినవాఁడ నైతిని' అని చెప్పవలయును. లేక 'నీవు గొప్పయుపకారము చేసితివి' అనికాని పొగడవలయును. లేక, ఇట్టివార్త చెప్పినందులకు తగినప్రత్యుపకారము చేయుటకు లేదేయని అనుతాపమైనను పడవలయును. ఇవన్నియు విడిచి పగవారినిజూచి చెప్పఁదగినమాటను జెప్పినాఁడు, (వాక్యమ్) అతఁడు చెప్పవలసినహితములను పూర్ణముగాఁ జెప్పినట్లు వీఁడు పరుషములలో ఇఁక చెప్పవలసినదిలేదు అన్నట్లు చెప్పినాఁడు. అతఁడు హితము చెప్పినప్పుడు సునివిష్టముగా చెప్పినట్లే, వీఁడును మనసులో వ్రణమగునట్లు సువ్యక్తముగా పరుసులాడినాఁడు. ఇట్లు వీఁడు బదులు చెప్పుటకు హేతువేమనఁగా, (రావణః) 'రావయతి రోదయతీతి రావణః' 'ఏడ్పించువాఁడగుటచే రావణుఁడు' అని పరహింససేయుటయందు జగత్ప్రసిద్ధుఁడు. లేక 'రౌతీతి రవణః సఏవరావణః' ఏడ్చువాఁడనియర్థము. కైలాసమును గదల్చుట వాలితోయుద్ధము సేయుట ఇత్యాదిగా తగనిచోట కాలుపెట్టి తానును ఆక్రందనము సేయువాఁడనియర్థము. దీనిచేత తనకును పరులకును హితమెఱుఁగని దుష్ప్రకృతియనుట, (కాలచోదితః) కాలప్రేరితుఁడైనవాఁడు—భ్రాత రాముని శరణుఁజొరుమనఁగా కాలుఁడు 'అందువలదు నాదారి నేపొమ్ము' అన్నాఁడు. భ్రాతచెప్పినమాట 'ద్విధా భజ్యేయమప్యేవం ననమేయమ్' 'రెండుగా చీలియైనపోదునుగాని రామునికి లొంగను' అన్నట్లు వినక తనప్రకృతికిఁ దగునట్టుగా కాలునిత్రోవనే పోయినవాఁడనియర్థము.—తనిశ్లోకి.

క్యముల శత్రువునుంబోలె దూషించువాఁడై యతనితో ' వెలుపటి శత్రువుతోఁ గాని మిక్కిలి కోపముగొని యున్న క్రూరసర్పముతోఁగాని సహవాసము చేయవచ్చును; కాని మిత్రునివలె నగపడుచు శత్రుపక్షపాతి యగుతోడఁబుట్టినశత్రువుతో మాత్రము నెప్పుడును సహవాసము చేయరాదు. రాక్షసా! సమస్తజనులలోపల జ్ఞాతులస్వభావము నాకుఁ దెలియును. ఈజ్ఞాతులు తమజ్ఞాతులకు వ్యసనములు కలిగినప్పుడెల్ల సంతోషము నొందుచుందురు. కాన జ్ఞాతివగు నీవు నావ్యసనమునకు సంతుష్టుఁడవై యిట్లు గర్జించుచున్నావు. రాక్షసా! జ్ఞాతులు తమజాతిలో శ్రేష్ఠుఁడగువానిని, కార్యసాధకుఁడగువానిని, విద్వాంసుఁడగువానిని, ధర్మశీలుఁడగువానిని, శూరుఁడగువానిని, గొప్పగా నెన్నరు; అవసరముచూచి పరిభవింతురు. వారికి, జ్ఞాతుల వ్యసనమందు సంతోషమును ఉత్కర్షమందు అసూయయుఁ గలిగియుండుటమాత్రమే కాక మఱొకశీలము గలదు. వారు తమయభిప్రాయములను వెలిపుచ్చక గూఢముగానే యుంచుకొని పయికి నొకరిపై నొకరు స్నేహముగలవారివలె నభినయించుచు, క్రూరకార్యములు సేయుచుందురుగావున వ్యసనములు కలిగినప్పుడు ద్రోహముగావింతురు. కావున వారివలన భయము తప్పక గలుగును. (కాన నీవు మావ్యసనములందు మమ్ముఁ గొట్టఁ జూచుచున్నావు) ఒక్కచో పద్మవనమను నొకయరణ్యమునందు ఏనుంగులు తమ్ముఁబట్టుటకై పాశములు గొనివచ్చినపురుషులు తమజ్ఞాతులగు గజములకు పాలకులయినవారినింజూచి కొన్నిశ్లోకములు చెప్పినవని వినికిగలదు. వానిని జెప్పెద వినుము. 'మాకు నిప్పువలన భయములేదు. అగ్నికంటెను క్షణములో నాశముసేయు నితరాయుధములవలనను భయములేదు. మరణమునకంటె నతిదుస్సహమయిన పరవశత్వము కలిగించి బాధపెట్టుపాశములవలనను భయములేదు. అయితే, దయమాలినవై తమకార్యమునే చూచుకొనుచు మనలఁబట్టనున్న పురుషులయొద్దనుండునట్టి మనజాతి యేనుఁగులవలననే మనకు భయముగలుగుచున్నవి. ఎట్లనఁగా ఈ మనజ్ఞాతులే వీరికి మనలంబట్టుటకు నుపాయములు చెప్పునవి. ఇందులకు సందేహములేదు. అగ్ని మొదలగు నన్నింటివలని భయమునకన్నను, జ్ఞాతులవలనిభయమే మిక్కిలియు నధికమగు భయము. ఇది మనకుఁ దెలిసియున్నది. 'జ్ఞాతులు నెయ్యముగలవారే. వారివలన భయమెట్లందువా? గోవులయందు సంపదయున్నది. బ్రాహ్మణులయందు ఇంద్రియనిగ్రహమున్నది. స్త్రీలయందు చాపలమున్నది. అట్లె జ్ఞాతులవలన నవశ్యము భయమున్నది' అనియీశ్లోకములం బఠించినవఁట. విభీషణా! సౌమ్యుఁడవుగదరా నీవు; అట్లు జ్ఞాతివిగావున నేనిట్లు లోకపూజితుఁడనై మిక్కిలి యైశ్వర్యమునొంది, జ్ఞాతులకెల్ల తలదండ్రిగానుండుట నీకు నిష్టముగాదు. 'చిరకాలము కూడ వసించియున్న విభీషణుఁ డట్టి కార్యమును జేయునా' యందురా? తామరాకులందుఁబడిన జలబిందువులు, ఒకటితో నొకటి చేరనట్లు, దుష్టులతో నెంతకాలము సహవాసము చేసినను, స్నేహముపట్టువడదు. 'నిన్నే కొలిచి బ్రతుకువానికి స్నేహము గుదురకుందునా' యందువా? తుమ్మెద

పువ్వులయందలి తేనియ మిక్కిలియాశతోఁ ద్రావి యంత నా పుష్పమునందు తేని య నొసంగినయుపకారమును దలఁచి యించుకయు నిలువదుగదా. అట్లె నీవును నా వలన సమస్తసుఖము లనుభవించి నామేలు గోరకున్నావు. దుష్టులకు మంచిమనస్సు తమ్ము మనుచువారియందుఁ గలుగదు. 'అయినను చేసినస్నేహమును ఉపలపించుట యెట్లందువా? ఏనుఁగు మొదట చక్కఁగా స్నానముచేసి, యంత తనతొండముచేత నే దుమ్ము నెత్తికొని తనదేహమును జెఱుపుకొనునట్లు, దుష్టులు మొదట స్నేహముచేసి నను పిమ్మట దామే దానిని జెఱిపికొందురు. మఱియు శరదృతువునందు మేఘములు పలుచగాఁ జినుకులు కురియుచు నెంతయుఱుముచూపినను నేల చక్కఁగా దడియ కుండునట్లు, దుష్టులతో నెంత స్నేహముచేసినను వారివలన నుపకారము గలుగదు. రాక్షసా! నీవుగాక మఱియొకఁ డిట్టిమాటలాడు నేని, వాఁ డీక్షణములోనే ప్రాణము తో నుండియుండఁడు. నీవు కులమును జెఱుపఁబుట్టినవాఁడవు. ఇసీ! పో! అవతల!' అనెను. విభీషణుఁడు న్యాయమేయెత్తిచెప్పినను, ఇట్లు తన యన్న పరుషములా డఁగా, యట నిలువనోపక, గదచేతం బూని, నలువురు రాక్షసులతో తాను నాకా శమున కుద్గమించెను. అట్లు విభీషణుఁడు, క్రోధమునొంది యంతరిక్షముఁ జెందిన వాఁడై ప్రతికూలమగు రావణసహవాసమును వదలి యనుకూలమగు రామసమా శ్రయణమున కభిముఖుఁడై యుండుకాంతి పెంపున సొంపారుచు, తనయన్నయగు రా క్షసాధిపతిని రావణునింజూచి యింతకును మంచిబుద్ధిపుట్టదా యనుతలంపున 'రాజా! నీవు నాకు నన్నవు. కాన నన్నేమేమిచెప్పఁగోరెదవో చెప్పుము. నేను బదులాడం గూడదు. నీవు నాకు జ్యేష్ఠభ్రాతవు, తండ్రివలెఁ బూజనీయుఁడవు. అయినను నీవు ధర్మ మార్గమున నిలిచినాఁడవుగావు. మఱియు నామీఁద లేనిదోషముపెట్టి పరుషవచన ములాడితివి. దీనినిమాత్రము సహింపను. రావణా! నేను నీమేలుగోరి చక్కఁగా నిశ్చ యించి నీకు హితమైనమాటఁ జెప్పితిని. అయినను బుద్ధిహీనులు మృత్యువశమునఁ జి క్కినవారై హితము గయికొనరు. రాజా! ఎట్లయిన ప్రియముగ నుండుమాటను చెప్పువారును వినువారును ఎల్లప్పుడును గావలసినంతమంది దొరకుదురు. అప్రియ ముగానున్నను హితమగుదానిని జెప్పువాఁడును జెప్పిన వినువాఁడును ఒక్కఁడయిన దొరకుట యరిది. సర్వభూతసంహారకమై దయమాలిన కాలపాశమునఁ గట్టువడి నా శము నొందుచున్ననిన్ను, మండుచున్న గృహముంబోలెఁ జూచి యూరకుండఁజాలక యింతదూరము చెప్పితిని. మండుచున్న యగ్గివలె ధగధగ మెఱయుచున్నవై వాఁడులై బంగారుచే నలంకృతములై యొప్పు బాణంబుల రాముఁడు నిన్ను గొట్టఁగాఁ జూడ నా మన సొల్లకున్నది. యుద్ధరంగంబున శూరులును బలవంతులును నస్త్రవిదులును నగు వారలందఱు కాలగ్రస్తులయినప్పుడు ఇసుకచే, నయినయనకట్టలవలె, నిమిషమున రూపు మాయుదురు. అన్నవని నీమేలుగోరి, నేనేమిచెప్పితినో దానిని నీవు సహింప వలయును. నీ వన్నివిధంబులను నిన్ను రక్షించుకొనుము. ఈ రాక్షసులను ఈ లం

కాపురమునుగూడ రక్షించుకొనుము నీకు శుభంబగుఁగాక. నేను బోయెదను. నేను పోయినపిదప, నేను లేనుగదా, యిఁక సుఖముండుము. (రావణా! ఇందఱు రాక్షసులలో నీకు హితముపదేశించి యాలోచనము చెప్పి యీపాపమునుండి తానై ముందుపడి నిన్ను వారించునట్టి సుహృదుఁడుగాని స్నేహితుఁడుగాని నీకెవ్వఁడును లేఁడు. ఇది నిజము) 'రాక్షసా! నేను హితముగోరి వలదని నిన్నెంతవారించిచెప్పుచున్నను నామాట నీమనసున కెక్కకున్నది. మృత్యువు దాపించినవారలు చచ్చినట్టి గదా. చచ్చినవారివలె వారును సుహృదులు చెప్పుహితోక్తులను వినరు' అనెను. ఇది పదునాఱవసర్గము.

*విభీషణుఁడు మంత్రిసహితుఁడై రామలక్ష్మణులున్నయెడకుఁ
బోఁగా వానరులు ప్రహరింపఁదలఁచుట.
సుగ్రీవుఁడు విభీషణునిరాక రామునకుఁ దెలిపి వాఁడు వధ్యుఁ
డనుట. రాముఁడు విభీషణునిగుఱించి సకలవానరుల
మతములడిగి తుదకు హనుమంతునిమతము
చొప్పున విభీషణునిఁ గయికొనఁదలఁచి
యతనిఁ దోడ్తేర నియోగించుట.

† రావణునితమ్ముఁడగు విభీషణుఁడు రావణునితో నిట్లు పరుషవచనములాడి యంతముహూర్తమున రాముఁడును లక్ష్మణుఁడును నున్నచోటికి వచ్చినవాఁడయ్యెను.

---

◂ అభయప్రదానసారము.

* 'ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్ । రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా । ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః' శరణాగతికి అనుకూల్యసంకల్పము మొదలయిన యంగములు ఆఱు. శరణాగతి సేయుచున్న యీవిభీషణుఁడు ఆయంగములలో ఆనుకూల్యసంకల్పము ప్రాతికూల్యవర్జనము అనురెండును జేయుట ఈయెనిమిదిసర్గములచే చూపఁబడెను. రామునకు సీతనిచ్చి శరణుచొచ్చుటయే ఆనుకూల్యమును సంకల్పించుకొనుట. అనఁగా తనస్వరూపమునకు అనుకూలమయినదానిని జేయుఁదలఁచుకొనుట. రావణుని వానిదేశమును విడుచుటచే ప్రాతికూల్యమును వర్జించుట. అనఁగ ప్రతికూలమైనదానిని విడుచుట. విభీషణుఁడు మాటిమాటికి రావణున కుపదేశము సేయుటవలన (రక్షిష్యతీతి విశ్వాసః) రక్షించు ననెడి విశ్వాసమును చూపఁబడెను. ఇఁక కార్పణ్యమును జూపుచు శరణాగతి స్వరూపమును దెలుప నుపక్రమించుచున్నాఁడని తెలియునది.

† ఇందులకు 'ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణం రావణానుజః । ఆజగామ ముహూర్తేన యత్ర రామస్సలక్ష్మణః' అని మూలము. విశేషార్థము —(ఇతి) ఇట్లు 'ప్రదీయతాం దాశరథాయ మైథిలీ' 'రామునకు సీతనిమ్ము' అని రామునకు సీతనిచ్చు కర్తవ్యమైనది మిగుల సుకరముగా నుండుటనుు 'యావన్న గృహ్ణన్తి శిరాంసిబాణాః' 'రాముని బాణములు నీతలలను దీయకమునుపే' అని యాకర్తవ్యమును చేయనియెడఁ గలుగు ప్రత్యవాయమును (ఇతి) అని ఋషి మరల ననువదించుచున్నాఁడు. (పరుషం) ప్రియ

రాంద్రతోఁ గూడియున్నవారలకు సుఖావహమయిన మలయమారుతము విరహిజనులకు దుఃఖకరమయినట్లు, విభీషణుఁడు చెప్పినమాట హితమగుటచే సుఖకరముగా నుండవలసినదయ్యు రావణుఁడు దుష్టుఁడుగాన యతనికిఁ బరుషముగానే యుండినది. (వాక్యమ్) అర్థపూర్ణమైనది వాక్యమనఁబడును. హితోపదేశము పరిపూర్ణముగాఁ గలది—ఇట్టివాక్యమును (ఉక్త్వా)' చెప్పి-'హితము దెలిసినతోఁబుట్టువయినవాఁడు తనయన్నను ఆపదనొంది యుండఁగా దిగవిడిచినాఁడు' అను నపకీర్తిని దొలఁగించుకొనశక్యమగునంతవఱకును జెప్పి, ఆచెప్పినహితము పరుషముగా నుండుటకు హేతువేమనఁగా (రావణమ్) తనపరబల భుజబలములవలన ప్రబలులని దుర్బలులని విచారింపక యెల్లవారిని నలిపి యేడ్పించునట్టివానికి పగవారిబలమును జెప్పఁగా పరుషముగానుండునని చెప్పనేల. (రావణానుజః) రావణాసురుఁడుపుట్టిన కడుపునుండియె పుట్టినవాఁడేచుఁడీ సత్పుత్త్రుఁడైనవాఁడు చెప్పఁదగినట్టిహితమును చెప్పుచున్నాఁడని ఋషి విభీషణుని పొగడుచున్నాఁడు. హితము చెప్పువిషయమున పెద్దపిన్నయని విభాగ మక్కఱలేదు. తెలిసినవాఁడు తెలియనివానికిఁ జెప్పవలసినదంతయే న్యాయము, (ఆజగామ) వచ్చెను. 'జగామ' అనుట యొప్పి యుండఁగా 'ఆజగామ' అననేల యనఁగా రావణునిగోష్ఠియందు తనకు సంబంధము లేనందువలనను రామగోష్ఠి తనకు స్వగృహమగుటచేతను, స్వగృహమునకు 'వచ్చె' ననుటయే యొప్పును గాన 'ఆజగామ' యన్నాఁడుగాని 'జగామ' యనలేదు. (ముహూర్తేన) కొంతసేపటిలో 'వరంహుతవహజ్వాలాపఞ్జరాన్తర్వ్యవస్థితిః । నశౌరిచిన్తావిముఖజనసంవాసవైశసమ్' 'అగ్నిజ్వాలలనెడి పంజరమునడుమ నుండుటయు మంచిదికాని విష్ణుధ్యానపరాఙ్ముఖులగువారితో నుండుటమాత్రము మంచిది కాదు.' అను న్యాయముచొప్పున నిప్పుపడినయింటిలో కాలుపెట్టలేనట్లు రావణునిగోష్ఠిలో నిమిషమయినను నిలువఁజాలకుండుటయు, దూడను కట్టినత్రాటినుండి విడిచిపుచ్చఁగానే యది తల్లిపాదుఁగును మూతితో ముట్టకయును వడుమ నెచ్చట నెచ్చోటును గన్నెత్తియుఁ జూడక పరుగిడివచ్చునట్లు విభీషణుఁడు అతివేగముగ రామునొద్దకుఁ బోవుటయు తెలియుచున్నవి. (యత్ర రామః) రాముఁ డెచ్చటఁగలఁడో యచ్చటికి, రామసంబంధముకంటెను రాముఁడున్నదేశమే యుద్దేశ్యమని చెప్పఁబడినది. 'సుభగశ్చిత్రకూటోఽసౌ గిరిరాజోపమోగిరిః । యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవనన్దనే' అని రామవాసమువలన చిత్రకూటము ప్రాప్యమయినటువలె దీనిని దెలియునది. (సలక్ష్మణః) లక్ష్మణునితోడఁ గూడినరాముఁడున్నాఁడో-ఇందు రామునికి లక్ష్మణుఁడు నిరూపకుఁడుగా నుండువిధము చెప్పఁబడినది. దీనిచే ఆశ్రయింపఁబడినవానికి తన్నాశ్రయించినవాని విడువఁజెల్లదని తెలియుచున్నది. ఆశ్రయించుటకుఁ బోవువానికి రాముఁ డపూర్వుఁడుగా నుండకుండునట్లు అతనియొద్ద లక్ష్మణుఁడు పురుషకారభూతుఁడై యున్నాఁడనుటయు చెల్లును. తమ్మునిమాట వినని రావణుగోష్ఠిలోనుండిన తుంమదుకుతీఱ తమ్మునిమాటచొప్పున నడుచు రామునిగోష్ఠిలోఁ బ్రవేశించినాఁడనియుఁ జెప్పవచ్చును. ఈశ్లోకమునలన భగవద్రుచి గలవానికి భగవద్విముఖులుండుచోటు త్యాజ్యమనియు భగవత్సన్నిధిగల ప్రదేశమే ప్రాప్యమనియుఁ జెప్పఁబడినది. లేక భగవద్దేశమయినను భాగవతాభిమానము లేనిదేని పరిత్యాజ్యమగునుగాన భాగవతుఁడగు లక్ష్మణునిసాన్నిధ్య మిట చెప్పఁబడినది.

ఇట విచారింపవలసిన దేమనఁగా:—విశ్రవస్సు వరప్రదానమువలన సమస్తధర్మసమూహముల నెఱింగి, 'విభీషణస్తు ధర్మాత్మా నతు రాక్షసచేష్టితః' 'విభీషణుఁడుమాత్రము ధర్మాత్ముఁడేకాని రాక్షసచేష్టలు గలవాఁడుగాఁడు' అని యచ్చటచ్చట ధార్మికుఁడుగాఁ బొగడంబడియున్న విభీషణుఁడు తనకు నన్నయగుటచే 'జ్యేష్ఠభ్రాతా పితృసమః' అన్నట్లు తండ్రివంటివాఁడై తన్ను చిన్ననాఁటనుండి పోషిం

చినవాఁడు నగురావణుని, వానిశత్రువు మిక్కిలి సమీపించియుండఁగా, అల్పబుద్ధి గలవానివలె తటాలున నెట్లు దిగవిడిచినాఁడు? ఎట్లో దిగవిడిచినను విడుచుఁగాక. అతనిని ప్రహరింపనున్న రామునొద్దకుఁ బోవుట యుక్తముగాదు. అటపోయినను బోవుఁగాక. అన్నయొక్క స్థానముఁగోరుట యుచితముగాదు. కోరిననుగోరనీ. అన్నను వధించునుపాయమును దెలుపుట యుక్తముగాదు. ఇందులకు కొందఱు "రావణుఁడు మితిలేనిదోషములచే దూషితుఁడుగాన 'గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః। ఉత్పథంప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే' గర్వితుఁడై మంచిచెడుగులు తెలియక తప్పుదారిని ద్రొక్కువాఁడు గురుఁడయినను పరిత్యజింపవచ్చును' అనున్యాయముచే విభీషణుఁ డతనిని దిగవిడిచినాఁడందురు. వేదాంతగురువులు చెప్పున దేమన్నను:—బ్రహ్మవరప్రసాదమువలన విభీషణుఁడు విజ్ఞానమును బడసినవాఁ డగుటవలన రాముని సర్వవేదాంతవేద్యునిఁగాను, సర్వలోకేశ్వరభూతునిఁగాను, సర్వలోకశరణ్యునిఁగాను, ముక్తప్రాప్యునిగాను నారాయణాఖ్యపరబ్రహ్మముగాను, లోకముల ననుగ్రహింపఁగోరి యవతరించినవాఁడని నిస్సంశయముగా తెలిసియున్నాఁడు. అట్లే మండోదరి మొదలగువారును దెలిసియున్నవారు. ఇట్లు తత్త్వజ్ఞానసంపన్నుఁడైన యతనికి విశేషధర్మముయొక్క ప్రాబల్యమును సామాన్యధర్మముయొక్క దౌర్బల్యమును వివేచనచేఁ దెలిసియుండుటచే సామాన్యధర్మమును పరిత్యజించి విశేషధర్మమును పరిగ్రహించుట యొప్పియున్నది. జ్యేష్ఠభ్రాత్రనువర్తనము త్రివర్గఫలసాధనమగుటచే జ్యేష్ఠానువర్తనము మూలమున పరమాత్మారాధనమందు పర్యవసించునని చెప్పఁదగియుండుటవలనను మోక్షమందు పర్యవసించినను పరమాత్మోపాసనమునకు అంగమగుటవలనను సామాన్యధర్మమగును. రామానువర్తనమన్ననో సాక్షాత్పరమాత్మనే యారాధించునట్లగుటవలనను, యజ్ఞాదిధర్మసాధ్యమగుటచే ప్రధానమగుటవలనను, విశేషధర్మమగును. ఈ రెండుధర్మములకును విరోధములేనపుడు, రెంటినిని అనువర్తింపవలయును. విరోధము కలిగినపుడు, సామాన్యధర్మమును పరిత్యజించి విశేషధర్మమును అనువర్తింపవలయును. కాఁబట్టి విభీషణుఁడును 'నేనింతకాలమువఱకును జేసిన రావణానువర్తనమును పరిత్యజింపకయే నాకు రామానువర్తనముగూడ సిద్ధించునా' యనెడియాశచేత ఆరావణునికి హితము మాటిమాటికి నుపదేశించెను. అట్లుచేసినను ఆరావణుఁడు ఆసురప్రకృతియగుటచే రామవైరమును పోఁగొట్టఁ దరముగాదని నిశ్చయించి 'ఇంకమీఁద నితనిని అనువర్తించుటచేత నాకు ఆత్మవినాశమగును. వీనింబట్టి నాకును రామునియెడల వైరముగలుగును' అని భయపడినవాఁడై 'వరంహుతవహాజ్వాలా' అను న్యాయముచొప్పున అగ్నియందు కాలుపెట్టినట్లు అతిదుస్సహముగానున్న రావణునితోడిసంగతిని త్యజించెను. విశేషధర్మమయిన రామానువర్తనమును అంగీకరించెను. కాఁబట్టి యిట్లుచేయుట పరమధర్మమే యగుటవలన విభీషణుఁడు కృతఘ్నుఁడనెడి శంక కింతమాత్ర మవకాశములేదు. మఱియు నితఁడు రాజ్యకాంక్షచేత రాముని శరణుఁజొచ్చినవాఁడునుగాఁడు. రాజ్యమపేక్షించివచ్చినట్లు కానరాకున్నది ఎట్లన, శరణాగతిసమయమందు 'త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చ రాఘవం శరణంగతః' 'ఆలుబిడ్డలను దిగవిడిచి రాముని శరణుసొచ్చెను' అని యితరవిషయములందు తనకుఁగల వైరాగ్యమును అతఁడే కంఠోక్తముగా చెప్పియున్నాఁడు. పిమ్మట రామునితో నతఁడు విజ్ఞాపనము చేసికొనునపుడు, 'పరిత్యక్తా మయా లఙ్కా మిత్రాణిచ ధనానిచ। భవద్గతంచ మే రాజ్యం జీవితంచ సుఖానిచ' 'నేను లంకను మిత్రులను ధనములను దిగవిడిచితిని. నీయందే నారాజ్యమును జీవితమును సుఖములును ఉన్నవి' అని రామునే రాజ్యము మొదలయిన సర్వవిధపురుషార్థభూతునిఁగా పొందినట్లు చెప్పుటవలనను రాజ్యకాంక్షనుబట్టి వచ్చినవాఁడుగాఁడని తెలియుచున్నది. అయినను రాముఁడు విభీషణునితో 'అహం హత్వా దశగ్రీవం సప్రహస్తం సబాంధవమ్। రాజానం త్వాం కరిష్యామి సత్య మేతత్ బ్రవీమి

తే' అని యతఁడు కాంక్షింపని రాజ్యమును అతనికిఁ గావించునట్లు చెప్పుట రాముని కతనియందుఁగల ప్రేమాతిశయము పట్టఁగూడలేక పొంగి పొరలివచ్చి యట్లు ఆనుషంగికభోగమును నొసంగునట్లు చెప్పనయ్యెఁ గాని వేఱు కాదు. విష్ణుదేవుఁడు స్వప్రాప్తిరూపమగు ముక్తినేకాక భక్తులకు ఆనుషంగికములయిన భోగములనుగూడ 'ఆయురారోగ్యమర్థాంశ్చభోగాంశ్చైవానుషంగికాన్ । దదాతి ధ్యాయతాం నిత్య మపవర్గప్రదో హరిః' అని యిచ్చునట్లు చెప్పుదురు. కాన విభీషణుఁడు కోరకున్నను రాజ్యమును రాముఁడే ఆనుషంగికభోగముగా తానే యిచ్చినాఁడని తెలియునది. కాఁబట్టి హనుమంతుఁడు విభీషణుంగూర్చి 'రాజ్యం ప్రార్థయమానస్తు బుద్ధిపూర్వ మిహాగతః' అని రాజ్యమును వేఁడి వచ్చినాఁడనుటయు, రాముఁడు 'రాజ్యకాంక్షీ విభీషణః' అని విభీషణునికి రాజ్యకాంక్ష గలయట్లు చెప్పుటయు, ఇదంతయు, రామభక్తివలన విభీషణుని నిజస్థితి గనుఁగొనలేక మనస్సు కలఁతనొందియున్న సుగ్రీవునకు అవ్యామోహము ఉపశమించుటకై నీతిశాస్త్రోక్తమగు రాజవృత్తాంతమును ప్రదర్శించుమాత్రమే యగును గాని వేఱుగాదని తెలియునది. హనుమద్రామవాక్యములకును విభీషణునివాక్యములకును పరస్పరవిరోధము ప్రసక్తించినపుడు అంతరంగ బహిరంగములయందు అంతరంగమే బలీయమైనదను న్యాయమున అంతరంగమగు విభీషణునివాక్యమే ప్రబలమైనది. కాన విభీషణునివాక్యముచొప్పున రాజ్యకాంక్ష యతనికి లేదనుటయే యంగీకరింపఁదగును. ఇట్లుండుటంబట్టియే 'నిన్ను రాజునుజేయుదును' అని రాముఁడు చెప్పినందులకు బదులేమియుఁ బలుకక విభీషణుఁడు 'రాక్షసానాం వధేసాహ్యం లఙ్కాయాశ్చ ప్రధర్షణే । కరిష్యామి యథాప్రాణం ప్రవేక్ష్యామిచవాహినీమ్' 'రాక్షసులను వధించువిషయమునను లంక నెదిరించుటయందును తోడుపడెదను. నాబలముకొలఁదిని, శత్రుసైన్యములంజొచ్చి యుద్ధమునుజేసెదను' అన్నట్లు పరిచరించుటమాత్రమే ప్రార్థించినాఁడు. ఉత్తరకాండమున రాముఁడు 'యావత్ప్రజాధరిష్యన్తి తావత్త్వంవై విభీషణ। రాక్షసేన్ద్ర మహావీర్య లఙ్కాస్థస్త్వం ధరిష్యసి॥ శాసితస్త్వం సఖిత్వేన కార్యంతే మమ శాసనమ్। ప్రజాస్సంరక్ష ధర్మేణ నోత్తరంవక్తుమర్హతి' 'రాక్షసేంద్రా! మహావీర్యా! విభీషణా! ప్రజలెందాఁకనుందురో యంతకాలము నీవును లంకయందు నుండుము. నీవు చెలికాఁడవని నీకీయాజ్ఞ చేసితిని. నాయాజ్ఞను నీవుచేయవలయును. అదియేదన - ప్రజలను ధర్మముచొప్పున సంరక్షింపుము. దీనికిమాఱాడ నీకుఁదగదు' అని చెప్పుటచే విభీషణుని యనుమతిలేకయే బలవంతముగా నతనిని రాజ్యమును స్వీకరింపఁజేయుట తెలియుచున్నది. ఇట్లు విభీషణుఁడు రామునిఁదప్ప మఱియొకరిని ప్రయోజనముగా లేనివాఁడు (అనఁగా అనన్యప్రయోజనుఁడు) అగుటంబట్టియే యితనికి రాముఁడు తనకులధనమగు శ్రీరంగనాథుని నొసంగెను. మఱియు రాముఁడు ధర్మసంస్థాపనార్థమే యవతరించినవాఁడు గావున లంకయందు హతశేషమయిన రాక్షసజాతిని సన్మార్గమందు ప్రవర్తింపఁజేయుటకై నియోగించుటచేత విభీషణుఁడు రాజ్యము నంగీకరించినవాఁడయ్యె. ఇదికూడ ఆజ్ఞను అనుసరించి చేయుట యగుటంబట్టి కైంకర్యములో చేరినదే యగునని విభీషణునితాత్పర్యము. కాఁబట్టి ధర్మమును యథావత్తుగాఁ దెలిసిన లక్ష్మణుఁడును సామాన్యధర్మమునకన్న విశేషధర్మము బలియమగుట తెలిసి, 'అహంతావన్మహారాజే పితృత్వం నోపలక్షయే। భ్రాతాభర్తాచ బన్ధుశ్చ పితాచ మమ రాఘవః' యని సోపాధికపితయగు దశరథుని పరిత్యజించి నిరుపాధిక సకలవిధబంధుఁడగు రామునే తండ్రిగాఁ గయికొన్నవాఁడయ్యె. మఱియు 'అగ్రతస్తేగమిష్యామి పన్థానమనుతోభయం। అహంసర్వంకరిష్యామి జాగ్రతస్స్వపతశ్చతే' అని ఎందునుభయముగలుగనట్టిమార్గముగా నీముందుపోయెదను. నీవు మేలుకొన్నపుడును నిదురించునపుడును నీకు సర్వవిధకైంకర్యములను జేసెదను.' అని రామపరిచరణమునే ఫలముగా ప్రార్థించినవాఁడయ్యె. 'సభ్రాతుశ్చరణౌగాఢం నిపీడ్య ర

*అంత నట్లు అగ్గినుండి చల్లనికొలంకులోఁ బడుటకుంబోలె నతిత్వరతో వచ్చుచున్న వాఁడును పొడవునను బలుపునను మణులు పొదిఁగినకాంచనాభరణములను మేరు

ఘునన్దనః’ అని రామునిశరణమునుఁ జొచ్చినాఁడు. అట్లె విభీషణుఁడును సోపాధికబంధుఁడగు భ్రాతను త్యజించి కైంకర్యాపేక్షచేతనే సర్వవిధసహజబంధుం డగురాముని శరణుసొచ్చెనని తెలియునది. కావుననే రామప్రాప్తి నపేక్షించి యతఁడు రావణుని పరిత్యజించువేళయందు ‘అన్తరిక్షగతశ్శ్రీమాన్’ అని శ్రీమంతుఁడుగా ప్రశంసింపఁబడెను. ‘సతు నాగవరశ్శ్రీమాన్’ అని శేషుఁడును, ‘లక్ష్మణోలక్ష్మిసంపన్నః’ అని లక్ష్మణుఁడును శ్రీమంతులుగా ప్రశంసితులయినట్లె విభీషణుఁడును ‘శ్రీమాన్’ అనఁబడెనని తెలియునది. కాఁబట్టి విభీషణునియందు అధర్మము గలదని శంకింపరాదు. అయినను విభీషణుఁడు రామలక్ష్మణులు నాగపాశబంధములచే మూర్ఛితులై యున్నపుడు వారలంజూచి ‘యయోర్వీర్యముపాశ్రిత్య ప్రతిష్ఠా కాంక్షితా మయా। తౌ వుభౌ మమనాశాయ ప్రసుప్తౌ పురుషర్షభౌ॥ జీవన్నద్య విపన్నోఽస్మి నష్టరాజ్యమనోరథః। ప్రాప్తప్రతిజ్ఞశ్చ రిపుస్సకామో రావణః కృతః’ ‘ఎవరిపరాక్రమమును నమ్మి నేను రాజ్యమున ప్రతిష్ఠ గోరితినో యాపురుషతిలకు లిరువురును నేను నశించుటకై నిదురపోయిరి. నేను జీవించి యున్నను రాజ్యమునుగూర్చి యాశనశించి విపత్తిపాలయితిని. పగవాఁడయిన యారావణుఁడు తన ప్రతిజ్ఞను చెల్లించుకొని కోరిక యీడేరినవాఁడయ్యె’ అని తనకు రాజ్యము నశించెనని నిర్వేదపడుట యెట్లు పొసఁగు” నని యడుగవచ్చును. కాని యీప్రశ్నము సరికాదు. ఇందు ప్రతిష్ఠాశబ్దమునకు రామకైంకర్యపరముగా నర్థమగును. ‘నష్టరాజ్యమనోరథః’ అనుచోటఁగూడ ‘భవద్గతంచ మేరాజ్యమ్’ ‘నారాజ్యము నీయందున్నది’ అని చెప్పఁబడిన కైంకర్యసామ్రాజ్యమే యగునుగాని లంకారాజ్యము గాదు. దీనింబట్టి ‘రాజ్యం ప్రాప్స్యసి ధర్మజ్ఞ లఙ్కాయాం నాత్ర సంశయః’ ‘ధర్మజ్ఞా! లంకారాజ్యమును బొందఁగలవు. ఇందుకు సందేహములేదు’ అని సుగ్రీవుఁడు విభీషణునితో చెప్పినమాట విభీషణుని హృదయము తెలియనందుచేతఁ జెప్పినదిగా గ్రహింపవలయును. కాన దోషమేలేదు అందురు. కావుననే విభీషణుఁడు ఎనుబదినాలుగవసర్గమున ‘యదాజ్ఞప్తం మహాబాహో త్వయా గుల్మనివేశనమ్। తత్తథానుష్ఠితం వీర త్వద్వాక్యసమనంతరమ్’ అని చెప్పుచున్నాఁడని తెలియునది.

* ఇందులకు ‘తం మేరుశిఖరాకారం దీప్తామివశతహ్రదామ్। గగనస్థం మహీస్థాస్తే దదృశుర్వానరాధిపాః’ అనిమూలము. విశేషార్థము:—రావణునొద్దనుండి విభీషణుఁడు పయికెగిరినపుడే సుగ్రీవాదులతనిని జూచిరనుచున్నాఁడు—(తం) కారుచిచ్చునుండి తప్పించుకొన్నవాఁడు నల్లనిమడుఁగులోఁ బడుటకై వచ్చినట్లు, తనయభినివేశమంతయుఁ దోఁచునట్లుగా వచ్చువానిని, (మేరుశిఖరాకారమ్) మేరుపర్వతపుశిఖరమువంటి యాకారముగలవానిని, పొడవు బలుపు మిక్కిలిగా నుండుట మొదలగువానిచే మేరుశిఖరముతోఁ బోలిక చెప్పఁబడెను. మఱియు, ప్రతిపక్ష త్యాగలాభముచే (అనఁగా అక్కలుపోవుట గలుగుటచేనని పర్వతపరముగా నర్థము. పగవానిని విడుచుట లభించుటచేనని విభీషణపరమైనయర్థము.) స్థిరుఁడైయుండుట ప్రకాశించుచుండుట పారతంత్ర్యమును దోఁపించుట యను నీస్వభావములచే మేరుశిఖరాకారుఁ డనఁబడెను. ఇట్లు మేరుశృంగమువలె రామునియొద్దకు వచ్చుటచే రామునికి శృంగము (అతిశయము) లభించుటయు రావణునికి శృంగము (అతిశయము) భంగమగుటయు చెప్పఁబడినవయ్యెను. (దీప్తామివ శతహ్రదామ్) మెఱయుచున్న మెఱపుఁదీఁగవలె నున్నవాఁడు—మిక్కిలి తేజస్సువలనను ఆకాశమున సంచరించుటవలనను మెఱపుఁదీఁగ దృష్టాంత మియ్యఁబడెను. దీనిచే రామభక్తులగువానరులు మమ్ము ప్రవేశింపఁజేయరో యని మెఱపువంటికంపమును, ప్రవేశపెట్టినయెడల నిలు

శిఖరమువలె నున్నవాఁడును ప్రతిపక్షులనుమాలి తనపక్షము నొందుటంబట్టి మేరు శిఖరమువలె స్థైర్యమునొందినవాఁడును అతిప్రకాశముతో నాకాశమున సంచరిం చుటవలన 'రామభక్తులగు వానరులు నన్ను రామునొద్దకుఁ బోనిత్తురో పోనియ్యరో' యని భయమున వడవడవడంకుటచే మెఱపుంబోలె నున్నవాఁడును నాకాశగతుండు నయినవిభీషణుని లంకనుండి యాకాశమునకు లేచినపుడే నేలనున్న వానరులందఱు చూచిరి. (అతఁడు మేఘమువలెను పర్వతమువలెను గనుపట్టుచు, దేవేంద్రునకుఁబోలె పరాక్రమంబుగలిగి సమస్తాయుధములుధరించి దివ్యభూషణభూషితుఁడై యుండెను. భయంకరపరాక్రము లయినయతనియనుచరులు నలుగురుగూడ సర్వాయుధములనుదాల్చి నానాభూషణభూషితులై యుండిరి) * ఎట్టివారికిని నెదిరింప

పోఁజాలమని మెఱుపువలె త్వరపడుటయు వ్యంజితము లగుచున్నవి. ఇతని కాంతికి పట్టిమెఱపు దృష్టాంతముగాఁ దోఁపమిచే 'దీప్తామ్' అని దానికి విశేషణ మెక్కువగాఁ గూర్చినాఁడు. దీప్తమైనమెఱపే అతనితో సాటిచెప్పిన చెప్పవచ్చునని అభిప్రాయము. దీనివలన 'మేరుశిఖరాకారమ్' అనుపదమందు అర్థసిద్ధమైన ప్రకాశము, ఇచట 'దీప్తా...హ్రాదామ్' అని శబ్దసిద్ధము చేసినాఁడు. (గగనస్థమ్) ఆకాశమందున్నవానిని-లంకనుండి కాలెత్తిపెట్టి యాకాశమున కెగిరినపుడే చూచినవారనుట, (మహీస్థాః) భూమియందున్నవానరులు చూచిరనుట. భూమియందు చుట్టు కావలి యుండుటకుమాత్రమే నియమింపఁబడినవారయ్యును ఆకాశమందును కావలి కాఁచువారై యందున్నవానినిగూడఁ జూచిరి; అని వారియెచ్చరికయొక్క యతిశయమును చెప్పుచున్నాఁడు. లేక అచ్చటచ్చట వృక్షములందున్న వానరులు అందఱును అప్పుడే ఆకాశమందున్నవానినిజూచి రామునిఁ జుట్టుకొనిరి. (తే దదృశుః) వారు చూచిరి—ఒకరు చూచి యొకరికి చెప్పినను అందఱును తుదకు చూచినట్టివారే యగుదురు; కాని యట్లు చూచినవారుకాక అందఱును ఒక్కుమ్మడిగానే కన్నారఁ జూచిరనుట; (వానరాధిపాః) వీరు మిక్కిలి యెచ్చరికతో నుండుటంజూచి ఋషి వానరాధిపులని పొగడుచున్నాఁడని తెలియునది. దీనిచేత విభీషణుఁడు ప్రతికూలురసమూహమునుండి వెడలివచ్చుట యను ప్రయోజనమేకాక యనుకూలురకటాక్షములకును గోచరుఁడగుటయు లభించినాఁడని చెప్పఁబడినదయ్యె.

* ఇందులకు 'తమాత్మపఞ్చమందృష్ట్వా సుగ్రీవోవానరాధిపః । వానరైస్సహదుర్ధర్షశ్చిన్తయామాసబుద్ధిమాన్' అనిమూలము. విశేషార్థము:—సుగ్రీవుఁడు లంకాపురినుండి వచ్చుటయు ఆయుధసన్నాహముతో నుండుటయుఁజూచి విభీషణుఁడు ప్రహరించుటకే వచ్చుచున్నాఁడని యీవిషయము వానరులతో నాలోచించుచున్నాఁడు. (తమ్) మిక్కిలి యభినివేశముతో వచ్చియేకాక నిలుపోఁజాలకున్నట్టి యనుకూలునిఁజూచియే అతిమాత్రము సుగ్రీవుఁడు శంకించినాఁడుచుఁడీ, (ఆత్మపఞ్చమమ్) ఆనలుగురితోడ తా నైదవవాఁడు. అనలుఁడు శరభుఁడు సంపాతి ప్రఘసుఁడు అను నలుగురుమంత్రులతోఁ గూడినవాఁడనుట. విభీషణుఁడు వారలసంఖ్యను పూరించినమాత్రముచే వారలలో ప్రధానుఁడైయుండుట చెప్పఁబడినదిగాని రామవిషయమందలి ప్రేమనుజూడఁగా అందఱును సమానులే. (సుగ్రీవఃదృష్ట్వా) సుగ్రీవుఁడుచూచి-సుగ్రీవుఁడు తటాలున తలయెత్తిచూచినపుడు అతనికంఠశోభ యేమందునని ఋషి పొగడుచున్నాఁడు. (వానరాధిపః) వానరులకెల్ల నధిపతియైనవాఁడు—అట్లుశీఘ్రముగా లేచిచూచుట వానరసేనకుఁగూడ తానే రక్షింపవలసినవాఁడగుటచేతను రామునియందలి ప్రీతిచేతను అని తెలియునది. మఱియు 'రాఘవార్థేపరాక్రాన్తాః నప్రాణే కురుతే దయామ్' 'రాముని ప్రయోజనమువిష

రానివాఁడగు వానరాధిపతి సుగ్రీవుఁడు, నలుగురుమంత్రులతోఁ దానైదవవాఁడై వచ్చువిభీషణుం జూచి బుద్ధిమంతుఁడు నగునుగాన వానరులతోఁగూడి యాలోచనము సేసెను. * అతఁడు ముహూర్తము సేపు ఆలోచించి హనుమంతుఁడు మొదలగు నావానరుల నందఱునుజూచి యుత్తమంబయిన వాక్యమును † 'ఈరాక్షసుఁడు సర్వాయుధములను ధరించినవాఁడై నలుగురు రాక్షసులతోఁ

---

యమందే పరాక్రమము చూపువారలై, తమప్రాణమునందును దయచూపరు' అని రామవిషయమం దింతప్రావణ్యముగల వానరులకంటెను తానే నిరవధికప్రీతి రామునియెడలఁ గలవాఁడనుట తెలియుచున్నది. (దుర్ధర్షః) ఎదిరింపరానివాఁడు—శరణుసొచ్చినవానికిఁగూడ వెనుకకాలుపెట్టి నడుంకునట్లుగా క్రిందుపఱుపరానివాఁడైయుండువాఁడు, అట్టి తనక్రిందుపఱుపరానివేంద్రమ్యుం దోఁపనట్లు చింతయందు మునిఁగినాఁడనుట. (బుద్ధిమాన్ వానరైస్సహ చిన్తయామాస) బుద్ధిమంతుఁడగు సుగ్రీవుఁడు వానరులతోఁగూడి యాలోచించెను. తానొక్కఁడేయాలోచింప సమర్థుఁడైయుండియు కార్యగౌరవమునుబట్టి వారలతోఁగూడి యాలోచించెననుట. (బుద్ధిమాన్ చిన్తయామాస) దూతయో, ఆర్తుఁడో, ఎదిరియో యని చింతించెను. వచ్చువానియొక్క ముఖవికాసాదులచేత దుష్టుఁడుగాఁడని నిశ్చయింప సమర్థుఁడయ్యును రామవిషయమునఁగలప్రేమపారవశ్యముచే చింతయందు మునిఁగినాఁడు. స్వామికి ఏమివచ్చునోయని చింతనొందుటయె ప్రశస్తబుద్ధికలిమిగాన 'బుద్ధిమాన్' అనఁబడియెనని తెలియునది.

* ఇందులకు 'చిన్తయిత్వా ముహూర్తం తు వానరాంస్తానువాచ హ। హనుమత్ప్రముఖాన్ సర్వానిదం వచన ముత్తమమ్' అనిమూలము. విశేషార్థము.-విభీషణుఁడు సపరికరముతో సమీపమునకువచ్చియుండఁగా ఆలోచనముచే జాగుతగదు. జడితిగా మనస్సున నిశ్చయించి మంత్రులు మొదలగువారికి తాను నిర్ణయించినది చెప్పుచున్నాఁడు.—(చిన్తయిత్వా) చింత నిశ్చయమునందే పర్యవసించినది గనుక నిచట చింతించియనఁగా 'వీఁడు చారుఁడుగాఁడు దూతయుఁగాఁడు మఱి బాధకుఁడే'యని నిశ్చయించి యనియర్థము. (ముహూర్తం) అల్పకాలమున-రావణుఁడు 'సముద్రపునవ్వలిగట్టున కోటమఱుఁగులేని వట్టిబయలునందు రాముఁడున్నాఁడు. వానిని శీఘ్రముగా చంపిర'మ్మని వీనినిబంపినాఁడు. కావున ఆలోచించుచు ఆలస్యముచేసినయెడల వీఁడు మీఱిపోవు నని జడితిగా ఆలోచించినవాఁడనుట. ఇట 'తు'శబ్దము'నిశ్చయము చేసినపిమ్మట పూర్వదశకంటె విలక్షణమైన దశయందుండుట తోఁపించుచున్నది. (తాన్ వానరానువాచ) ప్రేమపరవశులయిన యావానరులతో చెప్పెను. (హ) స్వామి యగు సుగ్రీవునియొక్కయు అతనిపరికరముయొక్కయు సదుపాయముప్రకారమును ఋషి ఆశ్చర్యకరముగా నున్నదని యభినందించుచున్నాఁడు. (హనుమత్ప్రముఖాన్) హనుమంతుఁడు మొదలగువారికి చెప్పెను. గౌరవింపవలసినకాలమున 'జామ్బవత్ప్రముఖాన్' 'జాంబవంతుఁడు మొదలగువారు' అనవలయును. ఆలోచన సేయుకాలమున బుద్ధిమంతుఁడే ప్రధానుఁడుగాన బుద్ధిమంతుఁడగుహనుమంతుఁడు మొదలగువారిని జెప్పినాఁడు. (సర్వాన్) రామునియెడల ప్రేమాతిశయమున అందఱును సమానులే కావున 'సర్వాన్' అన్నాఁడు. (ఇదంవచనమ్) ఈమాటను—మాటయొక్కయర్థ మటుండనిచ్చి యా పలుకుపొందికచేతనే చెవుల కింపయియుండుటను ఋషి యభినందించుచున్నాఁడు. (ఉత్తమం) సర్వోత్కృష్టమైనమాటను జెప్పినాఁడని యర్థము

† ఇందులకు 'ఏష సర్వాయుధోపేత శ్చతుర్భి స్సహరాక్షసైః। రాక్షసోఽభ్యేతి పశ్యధ్వ మస్మాన్హన్తుం నసంశయః' అని మూలము. విశేషార్థము:—తాను నిర్ణయించినప్రకారము యుక్తియుక్త

గూడ నెదురుగా వచ్చుచున్నాఁడు. చూడుఁడు. మనలను జంపుటకే వచ్చుచున్నాఁడు. ఇందులకు సందేహములేదు' అని చెప్పినవాఁడయ్యెను.* సుగ్రీవుఁడు చెప్పినమాటను విని యా వానరోత్తములందఱును తటాలున నిది యది యని పాటింపక చేతికందిన

ముగఁ జెప్పుచున్నాఁడు:—(ఏషః) బాధపెట్టుటకు నెప్పుడును మూలమై యుండు క్రౌర్యము వీని యాకారమున దోఁచుచున్నదే. (సర్వాయుధోపేతః) మనస్సునందు క్రౌర్యమునకు ననుకూలములయిన హింసాపరికరములచేతను పూర్ణుఁడైనవాఁడు-'ఉత్పాతగదాపాణిః' అని ఒకగదను పట్టుకొని వచ్చినవాఁడైయుండఁగా సర్వాయుధోపేతుఁ డనుట యెట్లు? అన్నచో అనుకూలుఁడైనయతనిని ప్రతికూలుని గాశంకించినట్లె అతనియొక యాయుధమే రామునిపలని ప్రేమాంధత్వముచేత సుగ్రీవునికి అనేకాయుధములుగాఁ దోఁచియుండవచ్చును. లేక ఆయుధమును చేతపట్టుకొనియున్న చాతుర్యమునుజూడఁగా సమస్తాయుధములందు పరిశ్రమము గలవాఁడని చెప్పినట్లును దలఁపవచ్చును. స్వామి యగురాముని పీడించుటకు చక్ర బ్రహ్మాస్త్రములవంటిదయిన శరణాగతి వీనిహస్తమునన్నదనుతలంపుచే నట్లు చెప్పియుండవచ్చును. (రాక్షసః) రాక్షసుఁడు, 'సర్పజాతిరియంక్రూరా' అన్నట్లు రాక్షసుఁ డనుట క్రింద జెప్పిన క్రౌర్యము జాతిప్రయుక్తమని తెలుపుటకు, (చతుర్భిస్సహరాక్షసైః) నలుగురు రాక్షసులతోడ—వీని యుద్ధకౌశలము చూడుఁడు. పెద్దసేనతో వోయినయెడల కాలుకట్టుపడును. ఒంటిగా వచ్చినచో తప్పించుకొని పోవరాదు. అని పరిమితమైన బలముతో వచ్చినవిధము చూచితిరా! (రాక్షసైః) తన క్రౌర్యమునే యనుసరించు సజాతీయులనే తోడ్కొనివచ్చినాఁడు. (అభ్యేతి) వెనుదీయక తనయింటిలోఁ జొచ్చునట్లు లక్ష్యపెట్టక చొచ్చి వచ్చుచున్నాఁ డనుట. దీనిచే చటుక్కున పరిహరింపవలయునట్లు వచ్చినాఁడనుట, (పశ్యధ్వమ్) నేను మీకు చెప్పవలెనా? మీ ముఖములందు కన్నులులేవా? (అస్మాన్ హన్తుం) మనల నందఱను జంపుటకు-మనలో నెవ్వరినయినను జంపినయెడల తక్కినవారు జీవింపఁగలరు. మన కందఱకును మూలభూతుఁడైనరాముని నే చంపవచ్చినాఁడుగాన యతఁడు లేనిచో మన మందఱిని జంపినట్లెయని బహువచనము. ఆరాముఁ డుండెనేని మన మెల్లవారును లేకపోయినను కలిగింప సమర్థుఁడు. (నసంశయః) సాయుధుఁడై సపరికరుఁడై వచ్చుటచేత బాధకుఁడే యనుటకు సందేహములేదు. దూతలగువారు సాయుధులును సపరికరులును గాకయే కదా వత్తురు.

* ఇందులకు 'సుగ్రీవస్య వచశ్శ్రుత్వా సర్వేతేవానరోత్తమాః । సాలానుద్యమ్యశైలాంశ్చ ఇదం వచనమబ్రువన్' అనిమూలము. విశేషార్థము:—సుగ్రీవుని యాజ్ఞచొప్పున వానరు లుద్యోగించిరనుచున్నాఁడు—(సుగ్రీవస్య) సాహసకృత్యముల నిర్వహించువాఁడైన తమమహారాజుయొక్క, (వచః శ్రుత్వా) అనుమతినిబొంది, (సర్వేతే) వారందఱును - ఈరాక్షసుల వధింపవలయునని ప్రధానులును అప్రధానులును తారతమ్యములేక సమానముగా నుత్సాహము గలిగియుండిరి. (సర్వేవానరోత్తమాః) అన్నంతయే చాలియుండఁగా (తే)అనియుఁ జెప్పుటచే 'వారు' అని యింతమాత్రమే చెప్పవచ్చునుగాని, వారియుత్సాహ మింతయని కొలఁదియిడ నలవిగాదని భావము. (వానరోత్తమాః)రామభక్తివిషయమున సుగ్రీవునికంటె నతిశయించినవారు— ఉత్కర్షమునకు శేషిత్వమును అపకర్షమునకు శేషత్వమును హేతువుగాదు. రామభక్తియే ఉత్కర్షమునకు సాక్షాత్తుహేతువుగాన వానరోత్తము లనఁబడిరి. (సాలానుద్యమ్యశైలాంశ్చ) చెట్లను కొండలను ఎత్తికొని, చెట్లనియుఁ గొండలనియుఁ జూడక చేతికందినవెల్ల నెత్తికొనిరి. వానిని వధించువిషయమున తమకుఁ గలిగిన యాదరాతిశయముచే ఒక్కొక్కఁడును వేఱువేఱ యుభయపరికరయుక్తు లయిరనుట. రామకైంకర్యమున కనుకూలముగా వర్తించు

వృక్షములను పర్వతములను నెత్తికొని యతనితో *'రాజా! శీఘ్రముగా నాజ్ఞ యిమ్ము. నీవు రాజవుగాన నీయాజ్ఞ లేక మాకేమియుఁ జేయరాదు. ఈ దురాత్ముల మఱేమి చేయుటకుఁగాదు; వధించుటకే వేగ యాజ్ఞయిమ్ము. వీరు మరల నాకాశమున కెగురనట్లు భూమిపైఁ గూలి త్రెళ్లుదురుగాక. మనకు గెలుపే గలుగునా యనవలదు. వీ రల్పతేజులుగాన గెలుచుట యొకకష్టముగాదు' అనిరి. † వారిట్లు మాటలాడుకొనుచుండఁగా విభీషణుఁడు ఎవ రేమియాడినను రాముఁడు రక్షింపక విడువఁ డనువిశ్వాసముచేత నామాటలన్నియుఁ బాటింపక యాసముద్రపు నుత్తరపుగట్టునకు వచ్చి యాకసమునందె కంప మెంతమాత్రమును లేక నిలిచి

---

చుండు లక్ష్మణుఁడు ఒక్కతూరనే ఛత్రచామరములను రెంటిని రెండుచేతులం దాల్చినట్లని తెలియునది. ఈరాక్షసులను జంపుటయే రామకైంకర్య మనికదా వీరున్నారు. కావుననే యట్టి కైంకర్యమున కుపయుక్తములయిన పరికరములను గయికొన్నారు. (ఇదంవచనమ్) ఈమాటను-తమకు శేషత్వము సిద్ధించుటకై శేషియగు సుగ్రీవుని యనుమతి యపేక్షితమైయుండఁగా దానినిగూడఁ గోరక వారివధమును నిశ్చయించుమాటను, (అబ్రువన్) చెప్పిరి. ప్రధానాప్రధానభావమునుగాని ఔచిత్యమునుగాని పాటింపక యందఱు నొక్కగుమిగాఁ జెప్పిరని యర్థము.

* ఇందులకు 'శీఘ్రం వ్యాదిశ నోరాజన్ వధాయైషాందురాత్మనామ్। నిపతన్తు హతా యాపద్ధరణ్యామల్పతేజసః' అనిమూలము. విశేషార్థము - (శీఘ్రం వ్యాదిశ) శీఘ్రముగా ననుమతియిమ్ము వీరిని జంపితీఱవలయును. మేమో అస్వతంత్రులము. నీవనుమతియిచ్చుటకు జాగుచేసినయెడల స్వతంత్రులై చంపితిమని మాపారతంత్ర్యస్వరూపమునకు హానికలుగును. కాన యాహాని రాకుండునట్లు చటుక్కున అనుమతి యియ్యవలయును. (నః) మమ్ము-చెట్లు కొండలెత్తికొని వీరినిజంప నుద్యుక్తులై యున్నమమ్ము శీఘ్రముగా ఆజ్ఞ సేయుమనుట. మీరే వధోద్యుక్తులై యుండఁగా నాయనుమతియేల? యనఁగా (రాజన్) రాజాజ్ఞనుగదా అనువర్తింపవలయును. (వధాయ) చంపుటకై పట్టి యూరక కట్టిపెట్టినయెడల నిచ్చటనుండి యెట్లయిన ననర్థము చేయుదురు. కాఁబట్టి వధించుటకే యనుమతి యియ్యవలయును. (ఏషాం దురాత్మనామ్) ఈదుర్మార్గులయొక్క వధమునకు-ఆకారముచేతనే వీరిదురాత్మత్వము తెలియుచున్నదిగదా. (నిపతంతుహతాః) హతులై పడుదురుగాక-అంతటను మరల ఆకాశమునకు నెగురనట్లు భూమియందే పడియుండునట్లు గూల్తము. 'యుద్ధమున జయమని అపజయమని నిశ్చయములేదే. ఎట్లు వారితో యుద్ధము చేయవచ్చును?' అన్నచో (అల్పతేజసః) వారు అల్పబలులు-మనబలమందలి గజములకు కబళము లగునంతటివారే కాన వారిని గెలువవచ్చును.

† ఇందులకు 'తేషాం సంభాషమాణానా మన్యోన్యం సవిభీషణః। ఉత్తరంతీరమాసాద్య ఖస్థఏవ వ్యతిష్ఠత' అనిమూలము. విశేషార్థము:—విభీషణుఁడు 'ఈ వానరులేమైనను ఆడనీ. సర్వజ్ఞుఁడును పరమకారుణికుఁడును సర్వలోకశరణ్యుఁడును నగు రాముఁడు నన్ను అవశ్యము రక్షించియేతీఱును' అని మహావిశ్వాసముతో వారలొండొరులతో నాడికొనుమాటలను బాటింపక ప్రహరించుటకు వారు ఉద్యుక్తులై యుండినను వారికెదురుగా వచ్చెను. అట్లు సమీపించి వచ్చియు జంకులేనివాఁడై యందఱికిని తాను తెలియవచ్చునట్లుగా ఆకాశమునందే నిలిచెను. ఇట 'ఖస్థః' 'వ్యతిష్ఠత' అని రెండుమాటలు 'స్థా'అనుక్రియను ప్రయోగించుట భయములేనందున కంపింపకయే నిలిచియుండుటను సూచించుచున్నది.

యుండెను. *విభీషణుఁడు ప్రాప్యంబగు నుపాయమును జక్కఁగా నెఱింగిన మహానుభావుఁడుగావున ఆకాశమునందుండియే యావానరోత్తములను వారిరాజగు సుగ్రీవునినిం జూచి యందఱును వినునట్లు పెద్దయెలుఁగున నిట్లనెను. † 'ఆహారనిద్రాభయమైథునములందు నియతిలేక దుర్మార్గమున నడచుచుండు రావణుఁడను

---

* ఇందులకు 'ఉవాచచ మహాప్రాజ్ఞః స్వరేణ మహతా మహాన్ । సుగ్రీవం తాంశ్చ సంప్రేక్ష్య ఖస్థఏవ విభీషణః' అనిమూలము. విశేషార్థము.-తన్ను నిరసించుటకై పూనిన సుగ్రీవునిని యతిసపరికరమును నుద్దేశించి తనయార్తి యంతయు పెద్ద కంఠధ్వనిలో తోఁచునట్లుగా విభీషణుఁడు ఒకవార్త చెప్పుచున్నాఁడు.-(ఉవాచచ) చెప్పెనుగూడ-రాముఁడు స్వీకరించుటకు తనరాకయే చాలియుండఁగా మాటగూడఁ జెప్పినాఁడనుట. 'పద్భ్యామభిగమాచ్చ' 'కాలనడచి వచ్చుటవలనను' అని గుహుఁడు నడచివచ్చుటయె తనకు భారముగాఁ దలఁచుచున్న రామునకు అటుపై వాక్యముగూడ చెప్పుట ఉరిసినపుంటిలో ఉప్పువెట్టిన ట్లనుట. (మహాప్రాజ్ఞః) మిక్కిలిప్రాజ్ఞుఁడు- ప్రాజ్ఞుఁడనఁగా హేయమిదియనియు ఉపాదేయమిదియనియు విభాగము తెలియుట. మహాప్రాజ్ఞుఁడనఁగా హేయమునుత్యజించి ఉపాదేయమును లభించుటకు వలయు నిశ్చితమైన యుపాయమును తెలియుట-అనఁగా రావణుని స్వభావమును రాముని పేర్మియు తెలిసి రావణుని విడిచి రాముని శరణుఁజొచ్చుటఁదగునని తెలియుట, రామలాభమునకు రామపాదములే నియతమైనయుపాయమని యుండుటయునగును.(స్వరేణమహతా) పెద్దస్వరముతో-స్వరమునకు మహత్త్వమనఁగా ధ్వనిని విన్నపుడే శరణ్యుఁడే కాక దారిని పోవువారుగూడ మనస్సుకరఁగునట్టియార్తితోఁగూడియుండుట.(మహాన్)స్వరమువలనఁ దోఁచు ఆర్తికొలఁదిలేకుండుటే కాక ఆశ్రయించుటయందుఁ గల యార్తియు కొలఁది లేకున్నదనుట. ఆశ్రయము ఆర్తితో సమానమైనదనుట;(సుగ్రీవం తాంశ్చ సంప్రేక్ష్య)సుగ్రీవునిని వారలనునుజూచి-'మనలఁజంపవచ్చినాఁడన్న సుగ్రీవునిని చెట్లుమొదలగువానిం గొని చంప నుద్యుక్తులయినవానరులనును, గొప్పగా చూచినాఁడనుట. ఏలనఁగా రామునిభక్తులు తన కుద్దేశ్యులు; మఱి వారే తనకు పురుషకారభూతులు గావలయును. మఱియు భక్తులైనవారు తప్పేమిచేసినను గాని 'జ్ఞానీత్వాత్మైవ మేమతమ్' అని వారే తనకు ఆత్మవలె ధారకముగా భగవంతుఁడు చెప్పికొని యున్నాఁడుగాన యామాటను త్రోసిపుచ్చుటకు సాధ్యముకాదు. కాన భగవంతుని బహుమానమున కట్లు పాత్రులయిన యాభక్తులను గొప్పగా చూచినాఁడనిభావము. లేక:—(మహాప్రాజ్ఞః) రాజు కృపాళుఁడేయైనను అతనియంతరంగునియొక్క పురుషకారముచేతనే అతనిని శరణుఁజొరవలయు నను పరిజ్ఞానమును—వానరులు నాకు ప్రతికూలురై సంరంభించుటయు నావలనిద్వేషమునఁగాదు; రామభక్త్యతిశయముచేతనే కాన యది గుణమె యనుజ్ఞానమును—రామపరిచారకులయిన వీరు నన్నంగీకరింపరేని రాముం డంగీకరించిన నేమి? కాన రామునియంగీకారముకంటె రామభక్తులగు వీరిలో నంతర్భూతుఁడగుటయే పరమపురుషార్థము అనుజ్ఞానమును—గలవాఁడనుట. (స్వరేణ మహతా) పురుషకారభూతులయిన యావానరుల కందఱకును సర్వలోకశరణ్యుఁడగు రామునకును తనయార్తరవము వినునట్లు మహాస్వరమునఁ జెప్పినాఁడనుట. రామవిషయమం దిట్టి యార్తరవము నుచ్చరించుట భాగ్యాధికునకే కలుగునని చెప్పఁగోరి యట్టిస్వరమును 'మహాన్' అన్నాఁడు.

† ఇందులకు 'రావణోనామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః । తస్యాహ మనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః' అని మూలము. విశేషార్థము:-ఇదిమొదలుగా నైదుశ్లోకములచే శరణాగతికి అంగమైన స్వనికర్షమును (తనతక్కువపాటును) పరిగ్రహ పరిత్యాగమును (పరిగ్రహించియుండిన రావణా

నకు మరలఁ జక్క నిచ్చివైవుము' అని హేతుయుక్తము లగునానావిధవాక్యములచే మాటిమాటికి బోధించితిని. * చావఁగోరువాఁడు ఔషధమును వలదనునట్లు, ఆరావణుఁడు కాలునిచే ప్రేరితుఁడై నేను తనకు హితముగాఁ జెప్పుచున్న వాక్యమును జెవిఁ బెట్టఁడయ్యెను. † అతఁడట్లు హితము చెప్పిన నన్ను పరుసుమాటలాడి

---

మరల సీత నిచ్చివేయుము. (సాధు) అనుతాపముతోను ఆకించన్యముతోను శరణుఁజొచ్చి యిచ్చుట, (సీతా) రామునిసొమ్మును అతని కే యియ్యవలసిన దింతే కాని, నీవు వేఱొకటి యియ్యవలసినది లేదు. తనసొమ్మే తన కియ్యఁబడినప్పటికిని, రాముఁడు అపహృతమైనదానిని పొంది 'వీనిచేత నే దీనిని బడసితి' నని తలఁచు గుణాధికుఁడనుట. తనసొమ్మును మనవలనఁ బొందినను మన అపరాధమును సహించునో యనఁగా 'సతన్నిపతితం భూమౌ శరణ్యశ్శరణాగతమ్। వధార్హమపి కాకుత్స్థః కృపయాపర్యపాలయత్' అన్నట్లు చంపఁదగిన కాకాసురుని యపరాధమును సహించి రక్షించినవాఁడుగాదా. (ఇతి పునఃపునః) అని మాటిమాటికి బోధించితిని-వాని కిచ్ఛలేకుండినను, నామాటచొప్పున చేయునా యనెడి యాశచేత పలుమాఱును పదరి చెప్పితిని. తనిశ్లోకము.—ఇందు 'చరాచరాణిభూతాని సర్వాణి భగవద్వపుః। తతస్తదానుకూల్యం మే కర్తవ్యమితినిశ్చయః' అన్నట్లు చరాచరాత్మకములగు భూతములు భగవంతునికి శరీరభూతములగుటచే అన్నిటికిని ఆనుకూల్యమే చేయవలయునని సంకల్పించుట ఆనుకూల్యసంకల్పమనెడి యంశము చెప్పఁబడినది. మహేశ్వరతీర్థులు.

* ఇందులకు మూలము. 'సచ న ప్రతిజగ్రాహ రావణః కాలచోదితః। ఉచ్యమానం హితం వాక్యం విపరీత ఇవౌషధమ్' అని మూలము. విశేషార్థము.—(సచ న ప్రతిజగ్రాహ) వాఁడు మాటను గయికొనను గూడలేదు. చెప్పినట్లు చేయకపోయినను, మాటకు చెవియొగ్గిన వాల్చినవాఁడు గాఁడయ్యె. ఇందులకు హేతువు- (కాలచోదితః) మృత్యుప్రేరితుఁడగుటచే నట్లు చేసినవాఁడు గాఁడు. (రావణః) దుష్ప్రకృతి యగువాఁడు గావున లోఁబుట్టువును హితాభిలాషియు నగు నావార్తను కాలఁదన్ని క్రొత్తవాఁడును శత్రువునగు కాలుఁడు చెప్పినదారిని పోయినాఁడు, (ఉచ్యమానం వాక్యమ్) చెప్పఁబడుచున్న వాక్యమును-మాటను జెప్పుచుండఁగా నే యనుట. 'త్వాంతు ధిక్కులపాంసనమ్' అని నన్ను కాలూన నీయక చేసినను, అంతటితో విడువక నేను 'ఆత్మానం సర్వథా రక్ష' 'నిన్ను సర్వవిధముల రక్షించుకొను' మని వాని యుజ్జీవనమే ప్రయోజనముగా చెప్పినమాటను, (హితం వాక్యమ్) నేను జెప్పినదయ్యును అహితముగా నుండెనేని విడువవచ్చునుగదా; అట్లుకాక తనయుజ్జీవనమునకు ఇంతకన్న వేఱొక యుపాయములేకున్న యీ పరమహితమైనవార్తను, ఎట్లు గయికొనలేదనఁగా (విపరీత ఇవౌషధమ్) చావఁగోరువాఁడు మంచివైద్యుఁడు చెప్పినమాటను కాలఁదన్నినట్లు, నామాటను గయికొనఁడయ్యెననుట. వీఁడపరాధముచేసినపుడు వీనిని దిగవిడిచి స్వరూపమును పొందనయితిని. మఱి నేను చెప్పినమాటకు చెవివాల్చి వినుటయు పొందనైతిని. వీనిం ద్రిప్పి జీవింపవలెనని యుండిన నాకు స్వరూపహానియే ఫలించెనని భావము.

† ఇందులకు 'సోఽహం పరుషితస్తేన దాసవచ్చావమానితః। త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః' అని మూలము. విశేషార్థము.—నేను చెప్పినవార్తను వినకపోవుటయేకాక హితము చెప్పినదే హేతువుగా తాను పరుషములాడి పరికరముచేతను అవమానపెట్టుటవలనను తక్కిన యాపాశకముల నెల్ల విడిచి రాముని పాదములను శరణముఁజొచ్చితి ననుచున్నాఁడు. (సోఽహమ్) విముఖుఁడు

మఱి దాసునివలె మిక్కిలి యవమానపఱుపఁగా, ప్రాప్యాభాసములయిన పుత్త్రులను పెండ్లమును దిగవిడిచి రాఘవుని రామునే శరణుఁజొచ్చితిని. * సకలలోకశరణ్యుఁ

గానున్నాఁడే యనర్థము పాలగునని హితము చెప్పిన నేను-నన్ననుట, (పరుషితః) హితము చెప్పినదే కారణముగా వాగ్వజ్రముచే మనస్సు గాయపడునట్లు పరుసులాడినాఁడు. (తేన) నేను చెప్పినది హితమని తలఁపక పోవుటేకాక మృత్యువువార్తను హితమని పరిగ్రహించిన యారావణునిచే, (దాసవచ్చావమానితః) దాసునివలె అవమానపెట్టఁబడితిని, నేను చెప్పినది అహితమయినను, పెద్దవాఁడగుతాను పరిభవించి విడుచునంతటితో పోక తనపనివాఁడగు ప్రహస్తుని విడిచియు, పసివాఁడగు నింద్రజిత్తును విడిచియు, ఎంగిలి తినుపనివాండ్రను అవమానపెట్టునట్లు నన్ను అవమానపెట్టినాఁడు. ఇట్లు సోపాధికులయిన బంధువులను విడిచి నిరుపాధికబంధువగు రామునే శరణాఁజొచ్చితి ననుచున్నాఁడు, (పుత్త్రాంశ్చ) నరకనిస్తారకులగు పుత్రులనును, (దారాంశ్చ) సహధర్మచారిణులగు భార్యలును, దీనివలన ప్రపత్తి సేయువానికి ప్రాప్యాభాసములును ప్రాపకాభాసములును త్యాజ్యములని తెలియుచున్నది. (త్యక్త్వా) త్యజించి. దీనిచే చేయు ప్రపత్తికి త్యాగము అంగమనుట తెలియుచున్నది. (రాఘవం శరణం గతః) 'భ్రాతా భర్తాచ బన్ధుశ్చ పితాచ మమరాఘవః' అని సర్వవిధబంధువగు రామునే శరణుఁజొచ్చితిని. 'కింత్వర్థినామర్థితదానదీక్షాకృతప్రతిశ్లాఘ్య మిదం కులంతే' అన్నట్లు, ఆశ్రితుల సర్వాభీష్టముల నొసంగు కులమునఁ బుట్టినవానిని జేపట్టితినని రాఘవశబ్దార్థము-తనిశ్లోకము. ఇందు ఈశ్వరుని నిర్హేతుక కరుణాపరిపాకమువలననే విభీషణునికి రావణుచేనవమానము కలిగినదనియు దానివలననే యితనికి ప్రయోజనాంతరములందు వైముఖ్యము సిద్ధించెననియుఁ దెలియునది. మఱియు దానివలన పరమపురుషార్థరూప రామప్రాప్తికొఱకు రామునే శరణుఁజొచ్చితి ననుచున్నాఁడు. 'త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ' అనుటచే ప్రాతికూల్యవర్జనమనెడి యంగమును, 'రాఘవంశరణంగతః' అనుటచే ఆత్మనిక్షేపమనెడి యంగమును ప్రదర్శితములయినవి. మహేశ్వరతీర్థులు.

* ఇందులకు 'నివేదయత మాంక్షిప్రం విభీషణముపస్థితమ్। సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే' అని మూలము. విశేషార్థము.—ఇట్లు శరణ్యుఁడగు రామునకు విజ్ఞాపింపవలసిన యర్థమును జెప్పి యిఁక దానిని విజ్ఞాపించుటకై పురుషకారభూతులను ప్రార్థించుచున్నాఁడు. (సర్వలోకశరణ్యాయ) కులము విద్య వృత్తి మొదలగువానివలని భేదములను జూడక సమస్తలోకులకును రక్షకుఁడైనవాఁడును, ఇట్లతఁడు సర్వులకును శరణ్యుఁడు గాన యతని సర్వశరణ్యత్వమందు నానావిధాపరాధములు సేసిన రావణునకుఁగూడ మీకువలెనె భాగమున్నది. అనఁగా సజ్జనులగు మీవలెనే దుష్టుఁడగు రావణునకుఁగూడ అతఁడు శరణ్యుఁడనుట. ఇఁక నతనిసంబంధియైనవానికి అందు భాగము గలదని చెప్పనేల? అయితే రావణుఁడు ఆశరణ్యత్వమందు రుచి యుంపకపోవుటచే అందలి తనభాగమును పోఁగొట్టుకొన్నాఁడు. నేను ఆభిముఖ్యముతో వచ్చుటచే నాకందలిభాగమును బోఁగొట్ట మీకుఁ దరముగాదు అనిభావము. ఇట శరణ్యత్వమునకు అంగభూతములగు సులభత్వము పరత్వము అను రెండు గుణములు ప్రధానములుగా చూపఁబడినవి. (రాఘవాయమహాత్మనే) సౌలభ్యముమాత్ర ముండినచో అనిష్టమె యగునుగాన ప్రయోజనములేదు. మేరుపర్వతాదులవలె పరత్వముమాత్రమె యుండినను దుర్లభుఁడగుటచే నిదియు ప్రయోజనకరముగాదు. కాన సౌలభ్యపరత్వములు రెండును గలవాఁడనుట. (రాఘవాయ) రఘువంశమునఁ బుట్టినవాఁడు. 'యత్తదద్రేశ్యమ్' అని యిత్యాదివేదాంతములకు గోచరుఁడగు పరబ్రహ్మము సకలమనుజ తిర్యక్సజాయనసాక్షాత్కారమున కర్హమగునట్లు రఘువంశమున మను

దును మహాత్ముఁడును రఘువంశమునం దవతరించి యున్నవాఁడగు రామునకు,

---

ష్యుఁడై యవతరించినవాఁ డనుట. ఇంతకన్న సౌలభ్యాతిశయ మేమియుని భావము. (మహాత్మనే) మహాత్ముఁడైనవాఁడు. ఇట్లు మనుష్యుఁడై యవతరించినను తనయప్రాకృతస్వభావమును విడువకయే యుండుటచే నిఖిలహేయప్రత్యనీకుఁడును జ్ఞానశక్త్యాద్యనంతకల్యాణగుణైకతానుఁడు నగు రామునికి, (నివేదయత) తెలుపుఁడు. ఇచట తనరాక ప్రత్యక్షమైయుండఁగా దానిని విజ్ఞాపింపుఁడనుటచే ప్రయోజనము లేదు. కాన స్వాపరాధపరిపూర్తి, ఇహాముత్రఫలభోగవిరాగము, శరణాగతి యనెడు నిరపాయమగు నుపాయమును పరిగ్రహించుట, రామకైంకర్యాభిలాషము, అతనిపరిచారకులం దంతర్భవించుట. అను నివియే విజ్ఞాపనము సేయవలయునని విభీషణుని యభిప్రాయము. (క్షిప్రం) శీఘ్రముగా-శరణ్యుఁడగు రాముఁడు తాన్నె పరిగ్రహించుటకు మునుపే మీరు విజ్ఞాపనముచేసి సుహృత్కార్య మాచరింపవలయునని భావము. (విభీషణం) రావణునివలె నేను ప్రతికూలుఁడనుగాను, 'విభీషణస్తు ధర్మాత్మా' అన్నట్లు నేను అనుకూలుఁడనే. (ఉపస్థితం) పొంతకు వచ్చినవాఁడను. అతిహీనుఁడైనవాఁడును దాపునకువచ్చుటయే రాముఁ డంగీకరించుటకు బీజమని భావము. గోవిందరాజులు.

(సర్వలోకశరణ్యాయ) అధికారభేదములేక సురనరవానరతిర్యక్స్థావరాంతములగు సమస్తప్రాణులకును సమాశ్రయణీయుఁ డయినవాఁడు. (రాఘవాయ) 'కింత్వర్థినా మర్థితదానదీక్షాకృతవ్రతశ్లాఘ్య మిదం కులంతేన్' ఇత్యాదివచనములచే ప్రసిద్ధవిభవమగు రఘువంశమునందు అవతరించినవాఁడు- దీనిచే అర్థులయాచన విఫలము గాదనుట సూచితము. (మహాత్మనే) పరమాత్ముఁ డయినవాఁడు అగు రామునికి, (మాం) రామునే సర్వవిధబంధువుగా నాశ్రయించిన నన్ను, (క్షిప్రం) చల్లనైవాననగల జలముతోఁగూడిన తామరకొలఁకునుజూడఁగా దప్పిగొన్నవాఁడు నిలుపోపఁజాలనియట్లతిశీఘ్రముగా, (నివేదయత) తెలుపుడు. 'వాచాధర్మమవాప్నుహి' అన్నట్లు నేనువచ్చిన యీమాటమాత్రము చెప్పుటచేతనే అతిసులభముగా మీకు గొప్పయుపకారము చేసినఫలము సిద్ధించుచున్నదని భావము. 'అప్రార్థితో నగోపాయే దితి తత్ప్రార్థనామతిః। గోపాయితా భవత్యేవం గోప్తృత్వవరణం స్మృతమ్' అన్నట్లు గోప్తృత్వవరణమనెడి యంగము చెప్పఁబడినది. (ఉపస్థితం) సమీపమునకు వచ్చినవాఁడు. దీనిచే రక్షిష్యత్యనుకూలాన్న ఇత్యేవం సుదృఢా మతిః। సవిశ్వాసో భవేచ్ఛాత్ర సర్వదుష్కృతినాశనః' అనెడి విశ్వాసమను నంగము ప్రదర్శితము. కేవలము ఇక్ష్వాకువంశపురాజయిన రామభద్రునకు సర్వలోకశరణ్యత్వమును పరత్వమును విభీషణుఁ డెట్లు చెప్పె నన్నచో బ్రహ్మదేవుఁడు రామునింజూచి 'పరమాపద్గతస్యాపి ధర్మే మమ మతిర్భవేత్। యాయా మేజాయతే బుద్ధి ర్యేషు యే ష్వాశ్రయేషుచ। సాసా భవతుధర్మిష్ఠా తంతం ధర్మంచపాలయేత్' 'పరమాపదవచ్చినపుడును నామనస్సు ధర్మమందే యుండవలయును. ఏయేదానియందు ఏయేబుద్ధి నాకుఁ గలుగుచున్నదో అదియెల్ల ధర్మిష్ఠముగానే యుండుఁగాక. ఆయాధర్మమును పాలించుఁగాత' అని వేడఁగా రాముఁడు 'ధర్మిష్ఠత్వం తథా వత్స తథాచైత ద్భవిష్యతి' 'నాయనా! నీవుకోరినట్లె నీకు ధర్మిష్ఠత్వము కలుగును' అని వరము నొసంగియుండుటచే రాముఁడు సకలజగద్రక్షణార్థము ఇక్ష్వాకువంశమునం దవతరించిన పరమధర్మరూపుఁడును, పరమపురుషుఁడునగు నారాయణుఁ డని తెలిసి, యట్లు చెప్పినాఁడుగాన అదియంతయు సమంజసమేయని తెలియునది. మహేశ్వరతీర్థులు.

లేక:—రాముని మనస్సునకు ప్రియముగాను రావణుని కనభిమతముగాను కొన్ని హితవచనములు చెప్పితిని. అందుల కతఁడు కృతజ్ఞుఁడై నన్ను పొగడవలసియుండఁగా దుష్ప్రకృతిగాన 'త్వాంతు

విభీషణుండను నేను వచ్చియున్నానని శీఘ్రముగాఁ దెలుపుఁడు' అనెను.

---

ధిక్కులపాంసనమ్' అని పరుసులాడి 'అస్మిన్ ముహూర్తేనభవేత్' అని తన యూడిగములకుఁ జెప్పు మాటలు చెప్పఁగా పెద్దవాఁడుగాన యేమయినను చెప్పనీ యనియుంటిని. అతఁడు నంతటితోఁబోక తనకడుపునఁ బుట్టినవానిని ఇంద్రజిత్తునిగూనియు నన్నవమానింపఁజేసినాఁడు. దానివలన నేను నాభార్యాపుత్రాదులు అనుకూలురేయైనను రావణునివలనఁ గలిగినవారుగాన సమస్తము రాముఁడేయని యతని శరణుఁ జొరవచ్చినాఁడను. అయినను రాజనీతి మర్యాదచొప్పున వానరు లతనితో 'పగవానితమ్ముఁడు శరణమని వచ్చినంతనే చేపట్టవచ్చునా?' అని యుదరి పల్కిరి. దానికి విభీషణుఁడు 'మీరట్లనుట స్వామికార్యమా? రాక్షసులచే నలఁగుడుపడి శరణమన్నవారికి పట్టుఁగొమ్మయైన రఘుకులమునం దవతరించిన రామునకు రావణునితమ్ముఁడు విభీషణుఁడు శరణుఁ జొచ్చినాఁడని చెప్పుటయే స్వామికార్యము కాఁబట్టి మఱొకరు చెప్పకమునుపే మీరు విన్నవింపుఁ'డనఁగా వానరులు 'దర్శనము సేయావలసినమర్యాదను జూడఁగా 'విదితస్సహి సర్వజ్ఞశ్శరణాగతవత్సలః' అని రాముఁడు శరణాగతవత్సలుఁడని విన్నవాఁడవుగావా? కాన నీవే చక్కఁబోయి చెప్పుకొననేరవా?' యనఁగా విభీషణుఁడు 'అట్లు దారితప్పి పోవువాఁడనుగాను 'తవభరోఽహమకార్షిహిధార్మికైః' 'ధార్మికులచేతఁగదా నీభరముగాఁ జేయఁబడితిని' అనఁగా 'ధార్మికులు పురుషకారభూతులై నన్ను నీకప్పగించిరి' అన్నట్లు వేదజ్ఞులంగొని స్వామిపాదముల మ్రొక్కువాఁడను. కాన మీరు పురుషకారముసేసి రాముని పాదములం జూపుఁ' డనుచున్నాఁడు—(నివేదయత)తెలుపుఁడు. 'యఃప్రజాపతిర్వేద స పుణ్యోభవతి' 'పరమపురుషునికిఁ దెలిసినవాఁడే పుణ్యుఁడగును' అన్నట్లు, రామునిమనస్సున కెక్కినపుడే నాకు స్వరూపము దక్కఁగలదు. అదియు మీవలనఁ బొందినవాఁడుగాఁ గోరెద. పోయి తెలుపుఁడు. (నివేదయత) 'ఉపదేక్ష్యన్తితేజ్ఞానమ్' 'వారు జ్ఞానమును-అనఁగా భగవత్స్వరూపాదులను-ఉపదేశింతురు' అన్నట్లు అతనిని మాకు తెలుపునంతమాత్రము మమ్మును అతనికిఁ దెలుపవలయును. (నివేదయత) 'స్వరేణ మహతా మహాన్' అని నేనే పెద్దయెలుఁగున పిలుచునపుడే రాముఁ డనుగ్రహించును. మీరును మీయంతటఁ దెలుపుడు రేని స్వరూపమును బొందఁగలుగును. (నివేదయత) తెలుపక పోయితిరేని భాగవతాపచారము చేసినట్లు మీకు స్వరూపహాని; తెలుపఁగా రాముఁడు రానియెడల శరణాగతపరిత్యాగముచే నతనికి స్వరూపహాని; రెండుపక్షములును ఇట్లయినపిదప, శేషికి అతిశయము గూర్చుటయే శేషభూతుని స్వరూపముగాన శేషియగు రామునికి నన్నురక్షింపమిచే అతిశయమునుగాక అపద్యమును గలిగించినవాఁడ నగుచున్నానుగాన శేషభూతుఁడ నగునాకును స్వరూపహాని; ఇవన్నియు కలుగకుండునట్లు యతనికిఁ దెలిపి నన్నుఁజేరనిండు (నివేదయత) వ్యాఘ్రవానరసంవాదము విని యెఱుఁగరా (పులి తఱుమఁగా నొకఁడు ఒకచెట్టెక్కి యందున్న వానరమునుజూచి భయపడఁగా అది వానికభయమిచ్చెను. పులి, ఆవానరముతో 'మనుష్యునిఁ బడద్రోయుము. లేనిచో వాఁడు నిన్ను సమయముచూచి చంపును. నేనును వదలను' అనఁగా 'శరణాగతునిఁ బడఁద్రోయ'నని యది చెప్పి యంత నిద్రించెను. అప్పుడు పులి వానితోఁ గ్రోఁతిని బడఁద్రోయుమని పురికొలుపఁగా వాఁడు కృతఘ్నుఁడై యట్లత్రోసియు నది క్రిందఁబడక చెట్టుకొమ్మనూని మరల వానితప్పును గొనక యభయమిచ్చి కాపాడె ననుకథ యిట యూహ్యము.) ఇట్లు శరణాగతరక్షణము గావించిన జాతిలో జనించిన మీరు శరణాగతి పోయి తెలుపుఁడు. (నివేదయత) (నిభృతమ్ వేదయత) వినయముతో తెలుపుఁడు. మూర్ఖుఁడని తోఁచునట్లు ఉరవడితోఁ జెప్పక సాత్వికుఁడని తగునట్లు సవినయగతి ప్రశ్నములచే విన్నవింపుఁడు. (నివేదయత) (నిభృ

రాం నివేదయత) మిక్కిలియుఁ దెలుపుఁడు. మంత్రవ్యాపారాదులచే రాముఁడు పరాకుననుండును గాన మనస్సులో తగులునట్లు ఒత్తిచెప్పుఁడు. (నివేదయత) ఆసమూహముతో మునుపు పరిచయము లేనందున అందు నాథుఁడెవఁడో తెలియఁగూడమిచే ఒక్కరినిజూచి చెప్పక బహువచనముచే సముదాయమునుజూచి తెలుపుఁడన్నాఁడు. (నివేదయత) 'తత్రభాగవతా స్సర్వే శ్లాఘ్యాః పూజ్యాశ్చభారత' 'అచట అందఱును భాగవతులు శ్లాఘ్యులు పూజ్యులు' అన్నట్లు రామసంబంధము వానరులకెల్ల సమానమగుటచే అందఱును మనకు గౌరవ్యులేయని సముదాయమునుజూచి తెలుపుఁడన్నాఁడు. (నివేదయత) ఇంతకెల్ల నిర్వాహకుఁడగు రాజును సుగ్రీవుని బహువచనముచే తెలుపుఁడన్నాఁడు. (నివేదయత) రావణగోష్ఠియందు దూతవధముగూడదని తానుజెప్పి హనుమంతునికి నుపకారముచేసినవాఁడగుటవలన నతనిని మనస్సుననుంచుకొని చెప్పఁదలఁచి ఒకనికిఁ జెప్పినయెడల తక్కినవారు విపరీతముచేయుదురని తలఁచి సామాన్యముగా చెప్పినాఁడు. (నివేదయత) రాముఁడు నన్నుగుఱించి యడుగఁగా యూరకుండక నమ్మఁదగుదుననియో దగననియో పరిగ్రహింపఁదగుదుననియో, ఏదేని తోఁచినట్లు తెలుపుఁడు. (నివేదయత) 'విద్లలాభే' అనుధాతువువలన లభించునట్లు చేయుఁడనియు నర్థము. 'సమహాత్మా సుదుర్లభః' అని జ్ఞానియైనవాఁడు తనకు మిక్కిలి దుర్లభుఁడని మనస్సున కొంచలపడుస్వామికి ఒకఆత్మలాభమును జేసిపెట్టుఁడు. 'విదసత్తాయామ్' అనుధాత్వర్థమున ఉండఁజేయుఁడు. సత్త కలిగింపుఁడని యర్థము. 'అప్యహం జీవితం జహ్యామ్' అని యాశ్రితుల రక్షింపనిచో ప్రాణములవిడిచి తనసత్తను దొలఁగఁజూచుస్వామికి నన్నుఁజేర్చి సత్తను గలిగింపుఁడు, లేక (విద విచారణే) అనుధాత్వర్థమున అంగద శరభ జాంబవత్ప్రముఖులతోఁ గలసి విచారింపుఁడనియు నర్థము. "నీవు చెప్పినట్లె విన్నపము చేసెదము. అయితే 'సోహం పరుషిత స్తేన' అని వానిచే పరుషితుఁడైతిననియు 'రాఘవం శరణం గతః' రాముని శరణుఁజొచ్చితిననియు రెండుచెప్పితివిగాన రావణుఁడు పరుషించినది మొదటఁ జెప్పవలయునా? శరణాగతుఁడవైతివని నిన్నుఁ దెలుపవలయునా?" యని యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు. (మామ్నివేదయత) నన్నుఁ దెలుపుఁడు. రావణుఁడు పరుషించినందులకు ప్రతికారముచేసి నన్ననుగ్రహించుట నేను రామునకంతరంగుఁడైననెకదా. కాఁబట్టి శరణుఁజొచ్చితినని నన్నే యుపేక్షింపుఁడు. 'నిన్నుఁ దెలుపఁగా నీవిచ్చు బంగారుకుండయేమి' అని యడుగఁగా (మామ్) నాగపాశ బ్రహ్మాస్త్రములచే నీవు నలిఁగినందులకు నింపరాకుండునట్లు నిలుపుటకై ఒక సేవకుఁడు వచ్చినాఁడని విన్నపముసేయుఁడు. 'ఇది యింకమీఁదఁ జేయునదిగదా. ఇంతవఱకుం దేమిచేసితివి?' అని వారడుగఁగా (మామ్) 'ప్రదీయతాం దాశరథాయ మైథిలీ' అని యిక్కడివారికి మంచియగువార్త చెప్పిన నన్ను, 'కొననాలుకతో ఒకమాట నీవుచెప్పఁగా మాకు వచ్చినలాభమేమి? సీత యిక్కడికి బయలువెడలి వచ్చినదేమి?' అని వారడుగఁగ (మామ్) 'యావన్నగృహ్ణన్తి శిరాంసి బాణా రామేరితా రాక్షసపుఙ్గవానామ్' 'రామప్రయుక్తములయిన బాణములు రాక్షసవరుల శిరసులను దీయకమునుపే రామునకు సీతనిమ్ము' అనియు, 'విధమేచ్ఛ పురీం లఙ్కామ్' 'లంకాపురమును ధ్వంసముసేయును.' అనియు నతనికీర్తిని జాటించి వేదములవలెనే యతనికీర్తిపటహమగు నన్ను, "ఇదియును 'గురుత్వాద్ధితమిచ్ఛతా' 'గౌరవమువలన హితముగోరువాఁడు' అన్నట్లు అన్నయగుటచే రావణునియందుఁ గలస్నేహమువలన వానికి వచ్చుప్రత్యవాయము మున్నెత్తిచూపి హితము చెప్పితి వింతేకాని మఱేమికాదు. ఇట్లు రావణభక్తుఁడవైయున్న నిన్నా యెటెంగించుట" యని వానరులడుగఁగా, (మామ్) 'పరుషిత స్తేన' 'అవమానితశ్చ' అని ఆయుత్కర్షమును చూపోపమివలన పరుషించి తఱిమివేయఁబడిన నన్ను, "నీవే 'జ్యేష్ఠోమాన్యః పితృసమః' 'జ్యేష్ఠుఁడైనవాఁడు పూజ్యుఁడు తండ్రిలోసాటియైన

వాఁడు' అని చెప్పితివే. అన్న ఒకమాటచెప్పె నేని అదేమితప్పని వచ్చితివి'' అని వానరులడుగఁగా (మామ్) 'త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చ' అని వానిపారుష్యమునకు సహింపలేక నాతోఁబాటియైన యాలుబిడ్డలనును వానితోడ దిగవిడిచివచ్చిన నన్ను—'నీవు వానితోడిసంబంధము వీడినచో మాకేమిలాభము. ఈమాప్రక్క నీకేమైనను పట్టులేదో'యని యడుగఁగా,(మామ్)'రాఘవం శరణం గతః'అని మీప్రక్కను రాముని శరణాగతిఁ జొచ్చియున్న నన్ను-(మామ్) 'ఆత్మానం సర్వథారక్ష పురీంచైవ సరాక్షసామ్' 'నిన్నును నీపురమును అందలి రాక్షసులను సర్వవిధముల రక్షించుకొనుము' అని పరుషించుచున్న రావణునికిని వానిని జేరినవారికిని భేదములేక హితము చెప్పుటవలన'ఆనుకూల్యమితి ప్రోక్తా సర్వభూతానుకూలతా' 'సర్వభూతముల కనుకూలుఁడై యుండుటయే ఆనుకూల్య మనఁబడును' అన్నట్లు ప్రపత్త్యంగమయిన ఆనుకూల్యసంకల్పమును, 'జాతక్రోధో విభీషణః' 'విభీషణుఁడు క్రుద్ధుఁడయ్యె' ననియు, 'క్రుద్ధోహన్యాద్గురూనపి' అన్నట్లు అట్లు క్రుద్ధుఁడైనవాఁడు గురువులనుగూడఁ జంపునని యున్నదిగాన రావణునిఁ జంపుట ప్రాప్తమైయుండఁగా, 'ఉత్పపాతగదాపాణిః' అని చేతిలో గదయుండియుఁ జంపకయే వచ్చినవాఁడుగాన 'ప్రాతికూల్యంచ భూతానాం సర్వేషాం నసమాచరేత్' 'ప్రాణులందుఁ దేనికిఁగాని ప్రతికూలమైనది చేయరాదు' అనెడు ప్రాతికూల్యవర్జనమును, 'సుగ్రీవశ్చాభిషేచితః' 'సుగ్రీవుఁడభిషిక్తుఁడయినాఁడు' అని సుగ్రీవుని యభిషేకమును నుదాహరణముగాఁ గొని మనలను నట్లే రక్షించునని నమ్మిక నొందుటచే 'రక్షిష్యత్యనుకూలాన్న ఇతి యాసు దృఢామతిః। స విశ్వాసోభవేత్' 'అనుకూలురనుగు మనలను రక్షించునని మిక్కిలి దృఢముగాఁ గలబుద్ధి విశ్వాసమగును' అన్నట్లు రక్షించుననెడి విశ్వాసమును 'భవన్తం శరణం గతః' 'నిన్నే రక్షకునిఁగా నేపట్టితిని' అనుటచే 'గోపాయితా భవేత్యేవం గోప్తృత్వవరణం తథా' 'రక్షకుఁడవు గమ్ము అని యిట్లు రక్షకుని వరించుట'- అన్నట్లు రక్షకునిగా వరించుట యనఁబడు గోప్తృత్వవరణమును 'భవద్గతం మే రాజ్యంచ జీవితంచ సుఖానిచ' 'నారాజ్యమును జీవితమును సుఖములును నీయందేయున్నవి' అని ఫలభరన్యాసమును జేయుటచే 'ఫలేస్వామ్యవియుక్తతా। కేశవార్పణపర్యన్తాహ్యాత్మనిక్షేపఉచ్యతే' 'ఫలమునకుఁ దాను స్వామియగుట విడిచి దానిని విష్ణువునందే యర్పించుట ఆత్మనిక్షేప మనఁబడును' అనఁబడిన ఆత్మనిక్షేపమును, 'తేనచాస్మ్యవమానితః' అని రావణునిచే పరభవమునొంద చేయుత్తి మ్రొక్కుటచే 'ఇతరగర్వహానిస్తు దైన్యం కార్పణ్యముచ్యతే' 'అనెడి గర్వహానిరూపమగు దైన్యము కార్పణ్య మనఁబడును.' అన్నకార్పణ్యమును, ఇట్లు శరణాగతియొక్క యాఱువిధములును కొలఁది పడనుండునట్లు చేసిన నన్ను, (మామ్) 'అహమస్మ్యపరాధానా మాలయోఽకిఞ్చనోఽగతిః' 'నేను అపరాధములకు ఆలయము, అకించనుఁడను, అగతికుఁడను' అన్నట్లు,విభీషణుఁడై దుష్టుఁడగు రావణునికి తోఁబుట్టువగుటచే అపరాధముల కాలయమై, ఉపాయాన్తరము లేమిచే అకించనుఁడై రావణుఁడును తఱిమివేయుటచే అనన్యగతికుఁడై స్వామి నే యుపాయముగా పట్టుటచే 'త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః' 'నీవే నాకుపాయభూతుఁడవు గమ్ము అనుట ప్రార్థనామతి యనఁబడును.' అన్న ప్రార్థనామతి గలవాఁడగు నన్ను, 'మంచిది ! నీ యుపేక్షను తెలుపుదువేని స్వామితో విన్నపముచేసెద' మని వానరులు చెప్పఁగా (క్షిప్రమ్) అదికూడదు. ఇప్పుడేపోయి విన్నపముచేయవలయును. ఇట్లు పదరుట యేలనఁగా (క్షిప్రమ్) 'చఞ్చలమ్ హిమనః' 'చలాహిప్రాణినాం మతిః' అన్నట్లు మనస్సు చంచలమైనది. నాకిప్పుడు మనస్సునఁ బుట్టియున్న యానుకూల్యము అది చంచలమగుటచే మాఱిపోవచ్చునుగాన యట్లు గాకమునుపే పోయి విన్నపముచేయుఁడు. (క్షిప్రమ్) 'క్షిప్రం రామాయ శంసధ్వం సీతాం హరతిరావణః' సీతను రావణుఁ

దు దొంగిలికొని పోవుచున్నాఁడని శీఘ్రముగా రామునకుఁ జెప్పుఁడు.' అని దేవతలంజూచి సీతాదేవి మొ
ఱయిడినపుడు దేవతలు తెలియకుండుట వలనఁగా సీత రాక్షసునివశమునఁ జిక్కినది. అట్లే నేనును నా
మనస్సునెడు రాక్షసునివశమునఁ జిక్కకమునుపే పోయి తెలుపుఁడు. (క్షిప్రం మాం నివేదయత) 'జీవన్తం
మాం యథా రామస్సంభావయతి కీర్తిమాన్ । తత్త్వయా హనుమన్ వాచ్యః' 'నేను ప్రాణములతోనుం
డఁగానే రాముఁడు నన్నువచ్చి మన్నించి కీర్తి గాంచునట్లుగా హనుమంతా! నీవు చెప్పవలయును'. అని
సీతచెప్పినట్లు నాసత్తయున్నపుడే యతఁడు చేపట్టి కీర్తి గాంచునట్లుగా పోయి తెలుపుఁడు. (క్షిప్రం
నివేదయత) 'దత్తమస్యాఽభయమ్' అని యతఁడే ముందుపడి యభయమిచ్చుటకుమునుపే మీరు
ముందుపడి తెలుపుఁడు (క్షిప్రం నివేదయత) నేను నిలుపోపఁజాలమిచే మఱియొకమాఱు శరణాగతి
చేయఁగా 'తద్ద్వయం సకృదుచ్చారో భవతి' అనియు 'సకృదేవ ప్రపన్నాయ' అనియు, 'సకృత్' అని
ఒకమాఱు చేయవలసినదిగా నేర్పడియున్న శరణాగతి స్వరూపమునకు హానివచ్చును. కాఁబట్టి ముం
దుగానే తెలుపుఁడు. (మామ్ నివేదయత) 'తమేవ శరణంగచ్ఛ' 'వానినే శరణుఁజొరుము' అని శర
ణ్యుని తెలుపునట్టిమీరు శరణాగతుని దెలుపుఁడు. 'ఇట్లు చటుక్కున తెలుపుట యెవరికి? లంకలో
నీకు పరిచితుఁడయిన హనుమంతునకా? సైన్యమునకెల్ల నిర్వాహకుఁడైన మహారాజు సుగ్రీవునకా?' అని
యడుగఁగా, (రాఘవాయ) ఇక్ష్వాకూణామియం భూమి స్సశైలవనకాననా' అన్నట్లు ఆహనుమంతుని
కిని మహారాజు సుగ్రీవునికిని మాల్యవంతమునకును చిత్రకూటమునకు భేదములేక యన్నిటికిని రక్షకుఁడై
నవానికిని, (రాఘవాయ) శరణాగత రక్షకులవంశమునఁ బుట్టినరామునికి శరణాగతుఁడగు నన్ను దెలు
పుఁడు. (రాఘవాయ) 'సకృదేవ ప్రపన్నాయ... అభయమ్ సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతంమమ'
అని శరణాగత రక్షణమునకు కంకణముగట్టుకొని యున్నరామునకుఁ జెప్పుఁడు. (రాఘవాయ) 'అప్యను
ప్రణయినాం రఘూణాం కులే న వ్యాహన్యతే కదాచిదర్థితా' 'రఘుకులమువారిని ప్రాణములడిగినను తప్పక
యిత్తురు?' అన్నట్లు కోరినవారికి కోరినదిచ్చి కీర్తిపడసిన మేటికులమువానికిఁ జెప్పుఁడు. (రాఘవాయ)
'అప్యహం జీవితం జహ్యామ్' 'నహి ప్రతిజ్ఞాం సంశ్రుత్య' 'ప్రాణములనయినను విడుతునుగాని ప్రతిజ్ఞ చే
సి తప్పను' అని తనకు నాశమువచ్చినను ఆశ్రితరక్షణము సేయువానికిఁ జెప్పుఁడు, (రాఘవాయ మాం క్షి
ప్రం నివేదయత) 'రాఘవస్య యశో హీయేత్' 'రామునికీర్తి తీసిపోవును' అని సీతచెప్పినట్లు ఋషులను
సుగ్రీవుని, కాకాసురుఁడు మొదలగువారిని, రక్షించి వెదకితెచ్చికొన్న పొగడ్తయంతయు నన్ను రక్షిం
పకుండుటవలనఁ బోఁగొట్టుకొనవలసివచ్చును. కాన యంతకుమునుపే చటుక్కునపోయి చెప్పుఁడు.
ధర్మియుండిననేకదా ధర్మములు దక్కును. ధర్మి యగునతఁడు తన్నుఁ బడసిననేకదా ధర్మమగుపొగ
డ్త గావలసియుండునది. 'పరవాఁడైయున్ననిన్ను తెలుపుట యేమిట' నఁగా సమస్తమును అతనివి
భూతికాన యతనికి విభూతిగా శత్రువులుండినను ఒకకీఁడును వారికిఁ దలఁపకుండుటయే యతనిపెద్ద
ఱికము చుఁడీ. (మహాత్మనే). 'మర్త్యానామ్ మరణాద్భయమ్' 'మనుష్యులకు మరణమువలన భయము'
అన్నట్లు కేవలమరణమునకు భయపడు మీవలెఁగాక 'ఉత్తమానాం తు మర్త్యానా మవమానాత్పరం
భయమ్' 'ఉత్తములయిన మనుష్యులకు అవమానమువలననే మిక్కిలియు భయము' అన్నట్లు శరణా
గత రక్షణము చేయక పోయితిమని నిందించిరేని ఏమిచేయుదును అని భయపడునట్టి పెద్దఱికము గల
రామునకుఁ దెలుపుఁడు. (రాఘవాయ మహాత్మనే) ఇట ఆత్మశబ్దము పరమాత్మవాచకము. రఘుకులము
నఁ బుట్టినవాఁడై తన్ను నవతరింపఁజేసినను, అతఁడు పరమాత్ముఁడని తెలియుఁడు. వేదపురుషుఁడును
'వేదాహమేతం పురుషం మహాన్తమ్' అని యిట్లు సులభుఁడైయున్న వస్తువే 'మహాన్తమ్' అని పెద్ద

విస్తువుగా చెప్పినాఁడు. వైదికపురుషుఁడగు విశ్వామిత్రుఁడును 'రామం మహాత్మానం వేద్మి' అని మహాత్ముఁడుగా చెప్పినాఁడుగదా! అట్టివానిని చెప్పవలెనా? ఒకానొకని పెండ్లామగు తారయనునది 'అయం సకాకుత్స్థ ఇతి ప్రజజ్ఞే' 'రాముఁ డితఁడే' యని తెలిసికొనెను. 'త్వమప్రమేయశ్చ' 'నీవింతింతని కొలఁది పెట్టరానివాఁడవు' అని యామెయతనిని తెలిసికొన్నంతే మీకుఁ దెలియకున్నదా? "మంచిది. నీవే 'మహాత్మనే' అనిన యతనిమహాత్త్వము చెప్పితివిగదా. పర్వతమువంటి యతనికి పరమాణువువలెనున్న మనకు ఆవస్తువును పట్టను శరణువేఁడను శక్యమగునా?" యనఁగా (సర్వలోకశరణ్యాయ) రాముని గుణమునకుకానివారునుగలరా? (సర్వలోకశరణ్యాయ) 'కౌసల్యాలోకభర్తారం సుషువేయం మనస్వినీ' అని కౌసల్యగన్న లోకభర్తయగువాఁడు అతనిచే సర్వలోకమంతయు భరింపఁబడుచుండఁగా ఆసర్వలోకములో నేను నొకఁడుగాదా. (సర్వలోకశరణ్యాయ) 'సప్తలోకైకవీరస్య దశకణ్ఠకులద్విషః' అన్నట్లు భూర్భువస్సువర్మహర్జనస్తపస్సత్యలోకములనెడి సప్తలోకములకును శరణ్యుఁడైనవానికి, (సర్వలోకశరణ్యాయ) అంతమాత్రమే కాక ఆభూర్భువరాదులతోఁగూడ అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళములతోఁగూడ భేదములేక పదునాలుగులోకములకును శరణ్యుఁడయినవానికి, (సర్వలోకశరణ్యాయ) ఇట లోకశబ్దము జనవాచకము. సర్వవిధజనులకు—అనఁగా దేవయోనులుగాను మనుష్యయోనులుగాను స్థావరయోనులుగాను ధర్మార్థులుగాను కామార్థులుగాను మోక్షార్థులుగాను అనుకూలురుగాను ప్రతికూలురుగాను ఉత్కృష్టులుగాను అపకృష్టులుగాను ఇట్లు అనేకవిధము లగువారికెల్ల శరణ్యుఁడైనవానికి విన్నవింపుఁడు. అతని నిట్టివాఁడుగా నెక్కుడఁగంటి మనఁగా 'అభీష్టఫలప్రదాన్యైః కో౽న్యః ప్రజాపశుపతీ పరిపాతి' 'అభీష్టఫలముల నొసంగి మఱి యెవ్వఁడు బ్రహ్మరుద్రులను బాలించును' అని దేవతలగు బ్రహ్మాదులకును పోఁగొట్టుకొన్న పదము నొసఁగినవాఁడు 'విష్ణుభక్తిపరో దేవః' అన్నట్లు నేనును అతనికి భక్తుఁడనగుటచే దేవుఁడనే యగుదునుగాన ఆబ్రహ్మాదిదేవులనువలె ఈదేవుఁడనగు నన్నునూ నేనుఁ బోఁగొట్టుకొన్న రాజ్యమిచ్చి ప్రోవఁడా 'సుగ్రీవమేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్' 'సుగ్రీవునే యారాజ్యమందుఁ బట్టముగట్టెను' అని తిర్యక్కులయిన సుగ్రీవాదులకు పోయినరాజ్యము నొసంగినవాఁడు 'జ్ఞానేన హీనః పశుభిస్సమానః' అని జ్ఞానశూన్యుఁడగుటచే పశుప్రాయుఁడై అనఁగా తిర్యక్కువంటివాఁడై యున్న నాకును పోయినరాజ్యము నొసఁగఁడా? 'అధ్యాసతే చీరభృతో యథాస్వం చిరోజ్ఝితా న్యాశ్రమమణ్డలాని' నారచీరలు గట్టుఋషులు రాక్షసాక్రమణముచే చిరకాలము దాము దిగవిడిచియుండిన యాశ్రమమండలములను మరల తమతమభాగములచొప్పునఁ బడసి వాసము చేయువారైరి' అని మనుష్యశరీరులగు జనస్థానవాసిఋషులకు పోయినప్రదేశముల నొసఁగినవాఁడు, మానుష్యమును కొనియాడి వచ్చిన నాకుఁ బోయినదేశము నొసఁగఁడా? 'శైలరూపం పరిత్యజ్య ప్రతిపేదే స్వకాం తనుమ్' 'రాతిరూపమునువిడిచి తనయెప్పటిదేహమును బొందెను' అని స్థావరముగా నుండిన యహల్యను తనయెప్పటిస్థితిలోఁ గూర్చినవాఁడు 'ఖస్థఏవ వ్యతిష్ఠత' 'ఆకాశమునందే నిలిచియుండెను' అని యాకాశమునందే స్థావరమువలె నిలఁబడియున్న నన్ను నాయెప్పటిస్థితిలోఁ గూర్పఁడా? 'రక్షితవ్యాస్త్వయా శశ్వద్గర్భభూతాస్తపోధనాః' తపోధనులమగు మేము నీకు కడుపులోని బిడ్డలవలె నెప్పుడు రక్షింపఁదగినవారము' అని తపోనుష్ఠానమువలన ధర్మార్థులయిన ఋషులకు రక్షకుఁడయినవాఁడు. 'విభీషణస్తు ధర్మాత్మా' అని ధార్మికుఁడయిన నాకును రక్షకుఁడుగాఁడా 'రుదద్రాజ్యమయాచత' 'రోదనము సేయుచు రాజ్యము యాచించెను' అని అర్థనాఫలమయిన రాజ్యమును మృతుఁడయినచక్రవర్తికి నిచ్చినవాఁడు రాజ్యకాంక్షి యగునాకు నియ్యఁడా? తాఁరు

మలనుగోరి కామపరవశుఁడయినసుగ్రీవునకు దారముల నిచ్చినవాఁడు 'త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చ' అన్నట్లు సీతవలన ఆనుకూల్యము నెఱిపిన ధర్మదారలను దిగనాడిన నాకు నియ్యఁడా? 'గచ్ఛలోకాననుత్తమాన్' అనియు 'అవహాత్సరమాంగతిమ్' అనియు జటాయువునకును వాలికిని మోక్షము నొసంగినవాఁడు నాకు మోక్షమొసఁగఁడా? 'మఙ్గళాని ప్రయుఞ్జానాః' 'మంగళములను ప్రయోగించుచున్నవారై' అని యానుకూల్యము నెఱిపిన ఋషులకు రక్షకుఁడైనవాఁడు ఆనుకూల్యసంకల్పాదులను గావించిన నాకు రక్షకుఁడు గాఁడో? 'కబన్ధన్నామరూపేణ వికృతంఘోరదర్శనమ్। తన్నిహత్యమహాబాహుర్దదాహస్వర్గతశ్చసః' అని ప్రతికూలుఁడయిన కబంధుని శాపజన్మమైన విరోధశరీరమును బోఁగొట్టియు స్వదేశము నొసంగినవాఁడు 'పిదదారస్తనాన్తరే' అని సీతాస్తనమును గీఱిన కాకాసురునికి విరోధనిపోఁగొట్టి 'ప్రతిపేదేస్వమాలయమ్' అని స్వదేశము నొసంగినవాఁడును, 'ప్రాప్తశ్శత్రురతర్కితః' 'శత్రు వొకఁడు మన మెదుటఁదాఁడ కయే వచ్చినాఁడు' అన్నట్లు ప్రతికూలుఁడయిన నాకు నాదేశము నొసఁగఁడా? 'తమబ్రువన్ సురాస్సర్వే సమభిష్టూయసన్నతాః' అన్నట్లు ఉత్కృష్టులయిన దేవతలకు రక్షకుఁడయినవాఁడు ప్రపన్నుఁడనగుటచే ఉత్కృష్టుఁడనగు నాకు నొసఁగఁడా? 'కపిత్వఞ్చప్రదర్శితమ్' 'పాషాణగౌతమవధూపవురాప్తిహేతుః' అని అపకృష్టములయిన తిర్యక్స్థావరములకు ఆపన్నివారకుఁడైనవాఁడు. 'ప్రకృత్యారాక్షసోఽప్యహః' అపకృష్టుఁడ నగు నాకును ఆపన్నివర్తకుఁడు గాఁడో? ఈయుదాహరణములచే వాఁడట్టివాఁడని కనుంగొనునది. 'ఎవరిని తెలుపవలయు' ననియడుగఁగా (విభీషణమ్) విరోధులకు విభీషణుఁడయినవానిని - ఇది పరాశరపరాశర్యాదిశబ్దములవలె విరోధభయంకరుఁడని యవయార్థము తెలుపుటచే రావణాది విరోధులను భయపెట్టువాఁడనని తెలియుఁడనుట. (విభీషణమ్) 'భీషాస్మాద్వాతఃపవతే-భీషోదేతిసూర్యః' అనియు 'భయంభయానామపహారిణీ' అనియు పరులకు భయంకరుఁడై, ఆశ్రితులకు అభయంకరుఁడైన రాముని పరికరమునకును మఱొకరికిని భయపడవలయునా? (విభీషణమ్) ఆజ్ఞయు ఏలుబడియు నడపుటను 'గదాపాణిః' ఒకదుడ్డుకఱ్ఱవాఁడని చెప్పెఁడు. ఇదిగాక (విభీషణమ్) అని అనుకూలునిఁగా ఎంచఁగింపరేని 'ఉత్పాతగదాపాణిః' అని చేయును కఱ్ఱయునుగా ఒక్కడు భయముగలుగునట్లు నిలిచియున్నాఁడనియైనను జెప్పెఁడు. రోగతత్త్వము దెలిసిన వైద్యునియుంగల రోగి తానుజేసిన యపథ్యములనుజెప్పి అందుఁగీడును పరిహరించుకొనునట్లు సర్వజ్ఞునియుంగల సంసారియగువాఁడు స్వదోషమును మున్నిడి రక్షించునట్లు చేసికొనవలయు నింతేకాని మంచిది మున్నిడికొనుటకు ఒకటియు లేదుగదా. కావుననే 'ననిన్దితంకర్మతదస్తిలోకే సహస్రశోయన్నమయాన్యధాయి' 'నేను వేలకొలఁదిమార్లు చేయని నిందితకార్యము ఏదియు లోకమునలేదు. లోకమునఁగల ఒక్కొకనిందితకార్యమును వేలకొలందిమార్లు చేసియున్నాననుట' 'అన్నట్లు అని నాముపటివృత్తిని జ్ఞానమును జెప్పెఁడు.—'నీవృత్తము జ్ఞానమును ఇవియైనయెడల రాముని శ్రీసన్నిధానమునఁ దెలుపుట యెట్లు?' అనియడుగఁగా (ఉపస్థితమ్) 'దురాచారోపి సర్వాశీకృతఘ్నోనాస్తికఃపురా। సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయాశరణంయది॥ నిర్దోషంవిద్ధితంజన్తుమ్' 'మునుపు దురాచారుఁడయియుండినను సర్వభక్షుఁడయినను, కృతఘ్నుఁడయినను నాస్తికుఁడయినను ఆదిదేవుని శ్రద్ధతో నాశ్రయించునేని యాప్రాణి నిర్దోషుఁడని యెఱుఁగుము' అన్నట్లు ముందట్లున్నను భగవదాశ్రయము చేసినచో నిర్దోషుఁడుగా నుండునుగదా. (విభీషణముపస్థితమ్) ముందువచ్చి నిలిచినానని చెప్పెఁడు—నాలుగడుగులును వచ్చి స్వామి కుపకరించితినని చెప్పెఁడు. ఇచటికి రాక లంకలోనేయుండి శరణమని చెప్పితి నేనియు, సముద్రతీరము మడుఁగుగట్టు పడుపాట్లుపడి మేను వడఁక తలవడఁక నతఁడు అచటికితానై వచ్చి పడవలసియుండదా? (ఉపస్థితః) ఎల్లకులోపల వచ్చినపిదప

* విభీషణుఁ డిట్లు 'రాముని శరణుఁజొచ్చితి' నని చెప్పినమాటనువిని సుగ్రీవుఁడు

---

'స్థితోఽస్మి గతసన్దేహః' అన్నట్లు నిలుకడనొందితిని. (ఉపస్థితన్ని వేదయత) మఱిమాలి నునుపడఁజొరఁబడక స్వామిహృదయము నూచి చేరవలయునని మీపొంత నిలిచియున్న యునికిని చెప్పెఁడు. (ఉపస్థితన్ని వేదయత) రాముఁడు తానే వెదకికొనిరాఁగా 'జగ్మ్ర గ్గిరితటా దస్మా దన్యం శిఖరముత్తమమ్' అన్నట్లు భయపడి సుగ్రీవుఁడు కొండనుండి కొండకుఁ బాఱిపోయినట్లుగాక ఉన్నచోటు వెదకి నేనైవచ్చిన నన్ను ఎఱింగింపఁగూడదా? (విభీషణముపస్థితన్ని వేదయత) రావణునితమ్ముఁడై నడుమ నొకచోటనుండి దూతనంపి సంధివిగ్రహము చేయుటకై వెనుకరాక ఫలమును వెనుక దిగవిడిచి చక్కనే నేనే తన్ను శరణము చొరవచ్చినవాఁడని విన్నపము సేయుఁడు—అనియర్థము. దీనివలన భగవత్సమాశ్రయణము చేయువారికి భాగవతులు ముందువచ్చువారై రావలయు ననునర్థము ప్రతిపాదితమయ్యెను—తనిశ్లోకము.

* ఇందులకు 'ఏతత్తువచనం శ్రుత్వా సుగ్రీవో లఘువిక్రమః । లక్ష్మణస్యాగ్రతో రామం సంరబ్ధమిద మబ్రవీత్' అనిమూలము. విశేషార్థము.—సుగ్రీవుఁడు రామునివలని ప్రేమాతిశయమువలన వ్యామోహితుఁడై 'అతిస్నేహః పాపశంకీ' యనునట్లు, అతఁడు సర్వశక్తుఁడుగాన విభీషణునివలన అతనికేమియుఁ గలుగనేరదనుట మఱచి, రాముఁడు శరణాగతవత్సలుఁడుగాన 'శరణాగతి' యన్నపలుకు విన్నమాత్రనే గూఢహృదయుఁడగు వీనిని పరిగ్రహించును. అంత క్రూరహృదయుఁడగు వీఁడు రామున కేదేని పాపము చేయును' అని తగనిభయమును శంకించి కలఁగి వేగ రామునొద్దకుఁబోయి రామునియెడల తనవంటి హృదయముగలవాఁడగు లక్ష్మణునిఁగూడ సహాయముచేసికొని విభీషణుని నిగ్రహించుటయే తగునని విన్నపముచేయుచున్నాఁడని చెప్పుచున్నాఁడు. (ఏతత్తువచనం శ్రుత్వా) చారుఁడు గాఁడు దూతగాఁడు శత్రువేయని నిశ్చయించినపుడు జంకుచేఁ గలిగిన వికృతివంటిదిగాక 'రాఘవం శరణం గతః' అన్నమాట విన్నపిదప విభీషణుఁడు తనసాత్త్వికత్వము మఱుఁగుచేసికొని రాముఁడు తన్ననుకూలునిగా స్వీకరించినట్టియీమాటంజెప్పి తన్నూలమున పీడింపవచ్చినాఁడని పుట్టినవికృతిగలవాఁడని తుశబ్దముచే పూర్వోక్తవైలక్షణ్యము తెలియునది. (సుగ్రీవో లఘువిక్రమః) వీఁడు 'శరణు' అనుమాట రామునిచెవిలోఁబడెనా వీనిని విడిచిపుచ్చఁదరముకాదు. నే నామాట వినఁబడుటకు మునుపే పోవలయునని చటుక్కునఁ బోయినాఁడనుట. (లక్ష్మణస్యాగ్రతః) తనవలెనె రామునియెడ ప్రేమగల లక్ష్మణునియెదుట-లక్ష్మణుఁడును రామునివలన ప్రేమాతిశయముచే భరతునియెడ తగనిభయమున శంకించి 'భరతస్య వధే దోషం నాహం పశ్యామి' 'భరతునిఁజంపుటలో నాకు దోషము తోఁపకున్నది' అన్నాఁడు. అట్టి లక్ష్మణునివలెనే సుగ్రీవుఁడును విభీషణునియెడ తగనిభయముచే శంకితుఁడై వధింపఁదగునన్నాఁడనుట. (రామమ్) 'రాఘవం శరణంగతః' అన్నవాక్యము విన్నంతనే కలిగిన సంతోషమువలన అభిరాముఁడై యున్నవానిని, (సంరబ్ధమ్) రామునికిఁ దాను జెప్పుదారితప్ప వేఱుదారి త్రొక్కఁగూడనట్లు మీఁదుపడి—అనఁగా, రాజ్యమువిడిచి బహుదినములయినదా? రాజనీతి మఱచిపోతిరా? ఇచ్చోటు లంకాద్వారముగాదా! రావణుఁడు సేయు అనీతి తెలియదో? ఒకఁడు శరణమనఁగానే యివన్నియు మఱవఁబడెనా? అని చెప్పుటయే తనదారినే త్రొక్కించుట, (ఇద మబ్రవీత్) వచ్చినవాఁడు రాక్షసేంద్రుఁడుగా నున్నాఁడు. అనుకూలభాషణమును జేసినాఁడు ఇతఁ డెవఁడగునో యని సందేహించి రామునికి వానిరాక చెప్పుటకు మాఱుగా పగవాఁడనియే నిశ్చయించి తత్పరిహారమునకై చేయవలసినది చెప్పుచున్నాఁడు. (రామం లక్ష్మణస్యాగ్రత స్సంరబ్ధ మిదమబ్రవీత్) సీత, లక్ష్మణునియెదుట రామునితోఁ జెప్పినట్లు తానును లక్ష్మణునియెదుట రామునితో విజృంభించి యీమాట చెప్పినాఁడనియర్థము. తనిశ్లోకి.

రామునియొద్దకు శీఘ్రగమనుఁడగుచుఁ బోయి తనకు సమానహృదయుఁడగు లక్ష్మణునియెదుట ప్రేమాతిశయముచే నక్షరములు తొట్రిల్లఁబడ నతనితో రావణుని తమ్ముఁడు విభీషణుఁ డనువాఁడు నలుగురు రాక్షసులును దానును నిన్ను శరణుఁజొచ్చి వచ్చినాఁడు 'పరంతపా! కార్యాకార్యవిచారముసేయు మంత్రమందును, సేనలనొడ్డులు తీర్చి నిలుపు వ్యూహమందును, విచారముచే నిశ్చయించిన యుపాయములను నయ్యై విషయములందుఁ బ్రయోగించునయమందును, ఎదిరి రహస్యములం దెలియుటకై గూఢముగా వేగులవారిని బంపుచారమందును, ఇవి వానరులవిషయమందైనను పగవారలగు రాక్షసులవిషయమందయినను. నీ వెచ్చరికతో నుండవలయును. వానరులకు మంత్రాదులను ప్రయోగించుచు శత్రువులమంత్రాదుల నెఱుంగుచును జాగ్రత్తగలిగి యుండుము. ఇట్లుండువేని నీకు భద్రముగలుగును.'కొందఱు అనుకూలురై రాఁగా నీవిట్లు తొందరపడ నేల'యందువా? ఈ రాక్షసులు కామరూపులగుట చేకోరినట్లు కంటికిఁ గనఁబడకయే సంచరించుచుందురు గాన యీకనఁబడువారు మాత్రమేకాక పెక్కండ్రు కనఁబడక వచ్చియుందురు. వీరు కపటోపాయములను దెలిసినవారలు;(నీవు రక్షించుటయందు శూరుఁడైనట్లు వీరు వంచించుటయందు)మిక్కిలియు శూరులు. కాఁబట్టి (వేయిమార్లు ప్రపత్తిచేసినను) వీరియెడల నొకప్పుడును విశ్వాసముంపరాదు. కాన వీఁడు అనుకూలుఁడుగాఁడు. 'అనుకూలుఁడుగా డేని వీఁడు మఱెట్టివాఁడై వచ్చినాఁడు. ఎట్లయివచ్చినను నెచ్చరికగల మనలను వీఁడుచేయుకార్యమేమి?' యందువా? (వీఁ డనుకూలుఁడుగాక) రాక్షసేశ్వరుఁడగు రావణుని వేగువాఁడుగానుండును. (చారుఁ డేని విభీషణుఁడని చెప్పి నిన్ను వెలిపుచ్చుకొనునా'యన్నచో తానొక్కఁడై యుండి మఱొక్కఁడుగాఁ జెప్పికొని వేఱొక్కఁడుగానై సీత నెత్తికొనిపోయినరావణుని చారుఁడు) గనుక ననుకూలునివలె నటించి మనయందుఁ బ్రవేశించి సమయముఁజూచి మనయొండొరులకు మిత్రభేదము గలిగించును. ఇందులకు సందియము లేదు కాన వీఁడు ప్రతికూలుఁడై వంచింప వచ్చినవాఁడే. 'మనమందఱము పరస్పరానురక్తులమై యుండఁగా వీనికి బుద్ధిభేదము కలిగింపఁదరమా? యందువా' బుద్ధిభేద మొకవేళ చేయలేకపోయినను, మనము విశ్వాసము చూపునపుడు మనతోఁ బాలునీరుగాఁ గలసిమెలసియుండి, మనము విశ్వాసము చూపఁగానే బుద్ధిసూక్ష్మతగలవాఁడుగాన మన మేమఱియుండుసందుఁ గనిపెట్టి వీఁడు తానే యొకవేళ మనలనుగొట్టినను గొట్టవచ్చును. 'మన మెదిరిపై దండెత్తివచ్చినంతనే వారిప్రక్కనుండి వచ్చినవాఁడు గతిమాలివచ్చినవాఁడు గావలయును. అట్టివానిని చేకొనకుండుట రాజనీతిగాదే. అట్టివానిని మనముదీసికొనుటచే శత్రునకు బలక్షయమును మనకు బలవృద్ధియుఁగాదా' యందువా? మిత్రులను సంబంధించిన బలమును, ఆటవికజనులబలమును, పరంపరగా నేర్పడియున్న మూలబలమును, అప్పటి వేతనములఁ బుచ్చుకొనుచు బ్రతుకు భృత్యులబలమును, ఇట్లయినయూ బలములనన్నిటిని బరిగ్రహింపవచ్చునుగాని శత్రుసంబంధియైన బలమునుమాత్రము

పరిగ్రహింపక త్యజింపవలయును. వీఁడు శత్రుబలములోనివాఁడుగాన త్యాజ్యుఁడే 'శత్రుబలములోనివాఁడని సామాన్యముగా ననాదరింపవచ్చునా? అక్కడిసంబంధము మానివచ్చినవాఁడు విశ్వాసపాత్రుఁడుగాఁడా!' యందువా? ప్రభూ! వీఁడు శత్రుబలములోనివాఁడుమాత్రమేకాదు. జాతియందు రాక్షసుఁడు, మఱి మనపగవానికి తోఁబుట్టువు. (ఇది వీనినోటనుండియె వినియున్నారము.) 'నీవును తోఁబుట్టువును విడిచియే కదా నన్నుఁ జేపట్టితి' వందువా? నావలెతోఁబుట్టువుచే తఱుముఁగొట్టఁబడి రాలేదు. వీఁడు మనపగవానికొలువునుండియే వచ్చినాఁడు. ఇట్లు వీనిని పరిగ్రహింపరాదనుటకు పెక్కుహేతువు లుండఁగా వీనియందు విశ్వాస మెట్లుంపవచ్చును? 'వీఁడు శరణనివచ్చినాఁడే! శరణాగతుని విడుచుటఁదగునా' యందువా? విభీషణుఁడు రావణునిచే చారకర్మమునందు నియుక్తుఁడై వచ్చినవాఁడు; కాన వీనిశరణాగతి పయివేషమని తెలియుము. నీవు యుక్తవ్యాపారములు గలవారిలోనెల్ల మేటివిగాన నీకుఁ దెలియనియుక్తకార్యము లేదు. కాన యట్టిమాయకానిని పరిగ్రహింపక నిగ్రహించుటయే యుక్తమని నాకుఁ దోఁచుచున్నది. 'చారులనుజంపుట యుక్తమా' యందువా? రాఘవా! వీఁడు కేవలము చారుఁడే. సంగతులు తెలిసికొని పోవుటకుమాత్రము వచ్చినవాఁడుగాఁడు. రావణుఁడు పంపఁగా కుటిలబుద్ధిచే ప్రేరితుఁడై పూని శరణాగతునివలె మాయవేషమువేసి వాఁడు తనగుట్టుమఱుఁగుపుచ్చి, మనసెఱుఁగక మాటమాత్రమునకు నీవు విశ్వాసము చూపినంతనే నిన్నును లక్ష్మణాదులను సమయముఁజూచి లెస్సఁగొట్టుటకై దాపునవచ్చియున్నవాఁడు. 'వీనియందు కపటవిప్రియము గనఁబడినపుడు వీనిఁబట్టి చంపుదము' అందువా? అది గనఁబడుట యెక్కడిది? శత్రువయినవాఁడు ప్రాజ్ఞుఁడగుటచే మనలను జంపవచ్చినవాఁడు అని తనయెదిరివారలకుఁ దోఁపనట్టుగానటించి దానింబట్టి వారిసైన్యమును జొచ్చినవాఁడై యెప్పుడేనొకప్పుడు తెఱపినొంది, వారినెల్లం జంపును. 'అట్లు వాఁడు చొచ్చినను ఒక్కఁడు పెక్కండ్ర నెట్లు చంపనేర్చు' నందువా? ఒక్కకాకి పెక్కుగుడ్లగూబలను తన కవకాశమయిన పగటిపూఁటఁ జంపునట్లు చంపును. కనుక వానిప్రతికూలత్వము కనఁబడుట యెక్కడిది? 'అయిన నిపుడేమి చేయవలయు' నందువా? వీనింబట్టి వధింపనే వలయు. (కేవలము నిరసించి పంపినచో మారీచునివలె మరల ననర్థమునే కలిగించును. వాలినిజంపినట్లు ఒక్కబాణముచేఁ జంపరాదు. శిరసునందు వత్తియిడి దివ్వెపెట్టినట్లు) తీవ్రదండమున వీనిమంత్రుల తలలు ద్రుంచి వీనిచేత ముందుగాఁ బెట్టి వారితోడ వీనిని జంపవలయును. ఏలనఁగా నీవిభీషణుఁడు క్రూరుఁడగు రావణుని తోఁబుట్టువుగదా' యనెను. ఇట్లు (రామునియెడ నత్యంతపరతంత్రులగు) వానరసేనలకెల్ల నధిపతియై (రాముఁడు నోరెత్తినట్లుచేయు) వాక్యములనెల్ల నెఱింగి (తనకుఁదోఁచిన సిద్ధాంతమును స్థాపించి యితరులకు బుద్ధిలోఁ బడునట్లు) మాటలాడుటయందు నిపుణుఁడై (రాముని యిష్టముచొప్పునఁబోక ప్రేమపారవశ్యమువలన తానై హ

రాత్కరించి సుగ్రీవుఁ డిట్లు చెప్పి యంత రాముఁడు చెప్పునదివిని బదులుచెప్పదమని మిన్నకుండెను. రాముఁడు తనలో (సుగ్రీవుఁడు ప్రేమాంధుఁడు గాన మనమాట వినఁడని యెంచి) మహాధైర్యముగలవాఁడుగాన సుగ్రీవుఁడు చెప్పినయప్పలుకువినియు మనసున కలంగక సమీపమం దున్నహనుమంతుఁడు మున్నగు ప్రముఖులయిన వానరోత్తములంజూచి 'కపిరాజగు సుగ్రీవుఁడు రావణునితమ్ముఁ డగువిభీషణునిం గూర్చి యుక్తియుక్తముగను నర్థవంతముగను జెప్పినవాక్యమును మీరుగూడ వింటిరి. అయినను మీరు నాకును సుగ్రీవునకును ఉభయులకును పరతంత్రులగుటచే ఎట్లు ఎవరి ప్రక్కఁ జెప్పవచ్చునని సందేహింపవలదు. సుహృదుఁ డొక్కఁడు ఒకటి చెప్పఁగా విని మఱొకఁ డేమియుఁ జెప్పక యూరకుండరాదు. ఇదితగును ఇదితగదు అని నిర్ణయింపఁజాలినబుద్ధి సంపత్తిగలవాఁడై నిర్ణయించినదానిని ఎదిరి మాఱునోరెత్తకుండునట్లు చెప్పుటకును సమర్థుఁడై శాశ్వతం బయిన శ్రేయస్సును గోరునట్టివాఁ డగు సుహృదుఁ డితరుఁడు సైతము * కార్యసంకటములందు ఉపదేశము చేయవలసినది యుక్తమే. కాఁబట్టి మీరును మీకుఁదోఁచినది చెప్పుఁడు' అనెను. ఇట్లు అనునయించినవిధమున రాముఁడు వారిని(జక్కనడుగక వారిమనస్సునఁ దగులునట్లు తటస్థముగా) నడుగఁగా నపుడు వారు రామకార్యమునం దెచ్చరికగలిగి యతనికి హితము చేయఁ గోరినవారై, యతనిమహిమను నుపచారపూర్వకముగఁ గొండాడుచు తమతమమతములను జెప్పువారయి యతనితో †'రఘుకులదీపా! రామా! ముల్లోకములందును నీకుఁ

*ఇచ్చట విభీషణుఁడు 'రాఘవం శరణంగతః' యని రాముని శరణు వేఁడి యది లభింపనియెడల జీవింపలేనన్నాఁడు. సుగ్రీవుఁడు విభీషణుని 'తస్యాహం నిగ్రహం మన్యే' అని విభీషణుని హింసింపనియెడలఁ దాను జీవింపలేనన్నాఁడు. ఇదియే ప్రకృతకార్యసంకటము. ఈశ్లోకమున భగవంతునికి ఆశ్రితులయినవారు తనయిచ్ఛ ననువర్తింపక కలఁతకలిగించినను ఆకలఁత వారలచేతనే తీయింపఁజేయవలయునన్న యాశ్రితపారతంత్ర్యము చెప్పఁబడినదయ్యె.

† ఇందులకు 'అజ్ఞాతం నాస్తి తే కిఞ్చిత్ త్రిషు లోకేషు రాఘవ । ఆత్మానం సూచయన్ రామ పృచ్ఛస్యస్మాన్ సుహృత్తయా' అని మూలము. విశేషార్థము.—నీవు సర్వజ్ఞుఁడై యుండియు మమ్ము నడుగుట 'ఆశ్రితులు చెప్పిననేకాక చేయఁడు' అను అతిశయము నీకు కలుగుటకేయని చెప్పుచున్నారు. (అజ్ఞాతం నాస్తి తే కిఞ్చిత్ త్రిషు లోకేషు) నీకుఁ దెలియనిది మూఁడులోకములం దొక్కటియు లేదు. (ఆత్మానం సుహృత్తయా సూచయన్ అస్మాన్ పృచ్ఛసి) ఇతఁడు వానరులకు సుహృదుఁడు అనుకీర్తిని లోకమునఁ బ్రకటించుటకై నీవిట్లు మమ్మడుగుట. (ఆత్మానం సుహృత్తయా పూజయన్) అనుపాఠమున మమ్మును ఒక్కొక్కని వేఱువేఱ బహూకరించుచు మమ్మడుగుచున్నావనుట; ఇట 'ఆత్మానమ్' అని యేకవచనము ఒక్కొక్కని వేఱువేఱ బహూకరించు నభిప్రాయమునఁ బ్రయుక్తమైనది, లేక (ఆత్మానం) ఆత్మస్వభావమును—అనఁగా రాజనీతిని, (పూజయన్) పరిపాలించుటకై మమ్మడుగుచున్నావని యర్థము. లేక (సుహృత్తయా) శోభనహృదయుఁడవగు హేతువుచే, (ఆత్మానం) నిన్ను, (పూజయన్) గౌరవించుటకు మమ్మడిగితివి—అనఁగా కార్యవిచారములందు మాకంటె నీవే శోభనహృదయుఁడ వని నీప్రభావమును తెలుపుటకై మమ్మడుగుచున్నావు. మామతములను పూర్వపక్షములు నేసి స్వమతమునే సి

దెలియనిది యొక్కటియు లేదు. తెలిసియు నీవు వానరులకు సుహృదుఁడను కీర్తిని లోకమునఁ బ్రకటించుటకై మమ్ము నిట్లడుగుచున్నావు. నీవు శరణాగతరక్షణవ్రతము నమోఘముగా నాచరించువాఁడవు. ఆరక్షణమునకు విఘ్నములు పందలకొలఁది వచ్చినను, వానిని నశింపఁ జేయునట్టి శూరత్వముగలవాఁడవు, (వానిని ధర్మయుద్ధము చేతనే చేయువాఁడవు. మఱి యారక్షణధర్మమును స్వప్రయోజనమునకై కాక వారిరక్షణమునకే చేయువాఁడవు; గాన) ధార్మికుఁడవు. నీవుచేయు రక్షణాది పరాక్రమకార్యములు ఆశ్రితులు మొదలయినవారికిఁగూడ చెఱుపరానంత దృఢములయినవి. (అట్లు పరాక్రమము నెఱపవలసినచో పగవారివలనఁ గలిగినవిరోధము పరాక్రమము చేతను, ఆశ్రితులవలనఁగలుగు విరోధము క్షమచేతను నివారింతమని) విమర్శించిచేయువాఁడవు; (మఱి యాశ్రితులు బుద్ధిపూర్వకముగాఁ జేయు నపరాధములను సహించుటకు హేతువుగా వారలంతకుమును పుగావించిన యాభిముఖ్యమును) స్మరణసేయువాఁడవు; (నీవిట్లు సర్వప్రకారముల రక్షకుఁడవై యుండియు నీవు చేసిన కార్యములు ఆశ్రితులు నీకుఁ బెట్టిన యేర్పాటులవలె) సుహృదులందు సమర్పించుకొనువాఁడవు. (పూర్వగుణములకు పారముండినను ఈయాశ్రితపారతంత్ర్యమునకు పారము గానిపింపదు. (మఱియు నెన్నియోకల్యాణగుణములు గలిగియున్నాఁడవు.) (ఇట్లాశ్రితపారతంత్ర్యమువలన నీకు మేము చెప్పినదివిని యట్లు చేయుటయే యిష్టముగానుండుటంబట్టి నీమంత్రులు, కార్యనిర్ణయమందు మతిసంపత్తియు, తాము నిర్ణయించినది మనస్సునందగులునడునట్లు సేయుసామర్థ్యమును గలవారుగాన క్రమమున నొక్కొక్కఁడుగా తమకుఁ దోఁచినది సహేతుకముగాఁ జెప్పుదురుగాక' అనిరి. ఇట్లు మంత్రులు చెప్పఁగాఁగా సుగ్రీవునికిపిదప వానరులకెల్ల యువరాజగుటచే ప్రధానుఁడుగాన మతిమంతుఁడగు నంగదుఁడు విభీషణునివిషయమై (సుగ్రీవుఁడు చంపుమనియు రాముఁడు త్యజింపననియు నున్న యీరెండుపక్షములను పరీక్షింపక చేయుట యుక్తముగాదని) పరీక్షగావించుటకుఁ దాను మొదటఁ దనమతమును జెప్పఁబూని రామునితో *'వీఁడు శరణాగ

ద్ధాంతము సేయుటకై మమ్మిట్లడుగుచున్నావు. లేక 'యాశ్రితులు చెప్పినట్లు కాక చేయఁ' డని యీయతిశయము లభించుటకై సర్వజ్ఞుఁడవగు నీవు మముబోంట్ల నల్పుల నడుగుచున్నావనుట.

* 'శత్రోస్సకాశాత్సంప్రాప్త స్సర్వథా శఙ్క్యఏవహి। విశ్వాసయోగ్య స్సహసా నకర్తవ్యో విభీషణః' అనిమూలము. విశేషార్థము. (శత్రోస్సకాశాత్సంప్రాప్తః) శత్రువునొద్దనుండి వచ్చినవాఁడు. రావణునివలని ద్వేషాధిక్యముచే వాని పేరు చెప్పక శత్రువనిమాత్రము చెప్పినాఁడు. భగవద్విరోధులు శత్రువులనియే తలంపఁబడుదురు. ఆభగవంతుఁడును, భాగవతులయొక్క శత్రువులనే తనశత్రువులుగాఁదలంచును. శేషి శేషభూతులకును గల ప్రేమాతిశయప్రకార మిట్లు. (సకాశాత్)వానియొద్దనుండి-'వాఁడు శత్రువయినను. వీనికేమి' యనఁగా వానియొద్దనుండి వచ్చినాఁడుగాన వీఁడును శత్రువేయనుట. (సర్వథాశఙ్క్యః) సర్వవిధముల వీనినిగూర్చి సందేహపడవలసినదే. 'వధింపవలసినదే' అని చెప్పఁదగియుండఁగా రామునికి విభీషణునియందుఁగల కృపనుజూచి యట్లుచెప్పక 'సందేహపడవలసినదని' మృదువుగాఁ జెప్పినాఁడు. తక్కినవి యథోక్తముగా గ్రాహ్యము.

తుఁడయినను, శత్రువునొద్దనుండి వచ్చినవానినిగూర్చి యనుకూలుఁడో కాఁడో యని శంకింపవలసినదేచుమీ. కాఁబట్టి విభీషణుని పరీక్షింపక తోడనే మనవిశ్వాసమునకు పాత్రునిగాఁజేయరాదు. విశ్వాసముంచితిమా యనిష్టమేకలుగును. ఎట్లన, కుటిలబుద్ధు లయినవారు చంపుటకై వచ్చిన తమయభిప్రాయమును గప్పిపుచ్చుకొని, యభిప్రాయ ములను సూచించునింగితాదులనుగూడ నాఁపి, రంధ్రముదొరకువఱకు నిచ్చలుతిరుగు చుందురు. మన మేమఱిపాటుననుండఁగా సందుకనిపెట్టి పయిఁబడి కొట్టుదురు. పరీక్షిం పక తోడనే విశ్వాసముచూపుటవలన నిట్టిమహానర్థము మిక్కిలియుఁగలుగును. వీనిని పరిగ్రహింపఁగా వీఁడుచేయు ప్రయోజనమును అప్రయోజనమును నివియని నిశ్చయిం చి పిదప త్యజించుటకుఁగాని పరిగ్రహించుటకుఁగాని నిశ్చయము చేసికొనవచ్చునుగాని ముందు వెనుకఁజూడక తోడనే త్యజించుటయు పరిగ్రహించుటయుఁ దగదు. గుణము న్నదని నిశ్చయించినచో నంగీకరింపవచ్చును. దోషమున్నదని నిశ్చయించినచో వర్జింప వలయును. 'అయినను సర్వవిధముల గుణవంతుఁడే యైనవాఁడుగాని దోషవంతుఁడే యై నవాఁడుగాని లోకమునఁ గలుగఁడు గాన యంగీకరించుటగాని వర్జించుటగాని యొగ్గు' అందువారి రాజా! (ఏది యెక్కువగానున్నది యనిమాత్రమే చూడఁదగునుగాన) ఆవిభీషణునియందు దోషము గొప్పదిగానుండెనేని ముందు వెనుకఁజూడక వానిని త్యజింపవలయును. లేక గుణములే వెక్కులున్నవని తెలిసి యంగీకారము సేయవచ్చు ను" అనెను. (ఒకనిని వినియోగించుకొనక వానిగుణదోషములు దెలియవు. తోడనే వినియోగించుకొన్నచో వానివలన మంత్రహానికలుగును గాన యంగదునిమతము చేయుటకు సాధ్యము గాకుండుటంజూచి) శరభుఁడు చేయుటకు సాధ్యమైనకర్తవ్య మును నిశ్చయించి రామునితో 'రాజసింహమా! వీనిని తోడనే వినియోగించుకొ నక మునుపు వీఁడు దుష్టుఁడో కాఁడోయని స్వరూపమును దెలిసికొనుటకు వీనియొద్దకు చారుని నొకని శీఘ్రముగాఁ బంపుదురుగాక. చారునిఁ బంపి, సూక్ష్మబుద్ధియగు నాచా రునిచేత నీతిశాస్త్రోక్తరీతిని వీనిగుణదోషములను పరీక్షించి పిదప న్యాయముచొప్పున ననుకూలుఁడగునేని విభీషణుని * పరిగ్రహింపవచ్చును' అనెను. (ఇట్లు వినియోగ ముచేఁగాని చారునిచేఁగాని పరీక్షింపఁదగదు. వానినమ్మకుండుటకుఁ బెక్కు హేతువు లున్నవని) జాంబవంతుఁడు (అంగదశరభులకన్న నీతిశాస్త్రపరిచయమునం దధికుఁ డుగాన రాముబుద్ధి ననుసరించియె చెప్పవలయుననెడి పక్షపాతములేక) శాస్త్రబుద్ధిచే విమర్శించిచూచి సందేహాదులులేమిచే గుణయుక్తమై పక్షపాతాదిశూన్యమగుటచే దోషరహితమై యొప్పువాక్యంబున రామునితో 'మనతో బద్ధవైరముగలిగి యట్లు వంచకుఁడయిన పాపకర్ముఁడును పాపరాక్షసులకెల్లఁ దలమిన్నయగువాఁడునునగురావ

* 'గుణమున్నచో పరిగ్రహింపవచ్చును దోషమున్నచో వర్జింపవచ్చును' అని చెప్పవలసియుం డఁగా 'పరిగ్రహింపవచ్చును' అనిమాత్రము శరభుఁడు చెప్పుట రామునికి విభీషణునందలి కృపాతిశయ మునుబట్టి యని తెలియునది.

ణునొద్దనుండి విభీషణుఁ డిటవచ్చినవాఁడు. 'వాఁడు దుష్టుఁడయినను వీఁడు దుష్టుఁడుగా కుండు నన్నచో' వచ్చిన* దేశమును,వచ్చినకాలమును యుక్తమైనవిగావు. కాన సర్వ విధముల వీనినిగుఱించి శంకింపవలసినదే!' యనెను. (విభీషణుఁడు సర్వవిధముల శంకిం పఁదగినవాఁడైనను సుకరమైన యుపాయమున వానిగుణదోషములను బరీక్షింపని యెడల సులభముగాఁ దనంతవచ్చినమిత్రుని‌ఁ బోఁగొట్టుకొనుట గలుగఁగూడు ననెడి మతముతో)నంత మైందుఁడు న్యాయాన్యాయముల నిశ్చయింపఁజాలు పండితుఁడును దాను నిశ్చయించినదాని నుపపాదించునట్టి వచనసంపత్తి గలవాఁడునగును గాన విభీ షణుని శోధింపవలసినప్రకార మిదియని లెస్సఁగనుంగొని సుగ్రీవుఁడు చెప్పినదానికం టె మిక్కిలియు హేతుయుక్తమయినవాక్యమున రామునితో 'నరవరేశ్వరా ఆరా వణుఁడు మనవిషయమై యేమిచెప్పుచున్నాఁడని యీ విభీషణుని, తెలియని యొకపు రుషునిమూలముగా, వానికి సందేహము కలుగనట్లుగా, త్వరపడక మెల్లఁగా, మధు రవచనముల నడుగవలయును. పురుషతిలకా! ఇట్లు దుష్టుఁడో గాఁడో పరీక్షించి వీని భావమును కలరూపున నెఱింగి దుష్టుఁడేని యందులకుఁ దగినట్లును, దుష్టుఁడుగాఁడేని యందులకుఁదగినట్లును,ఒకరిమాటయేల, నీబుద్ధికిఁ దోఁచినట్లుగాఁ జేయుము' 'శరణు' అనుటమాత్రమే యెదురుచూచెదవుగాని పురుషతిలకుఁడవగు నీమహత్త్వమును నర యవలదా?'అనెను.అంత శాస్త్రాభ్యాసమువలన మంచిసంస్కారము నొందియున్న మం త్రిసత్తముఁడగు హనుమంతుఁడు శబ్దార్థములు పొందికగలిగి యర్థవంతమై వినుటకింపై విస్తరములేక పరిపాటియగు వచనమున రామునితో 'నీవు మతిమంతులలో నెల్లఁ దల మిన్నవు. సమర్థుఁడవు. మాటనేర్పరులందును మేటివి. ఇట్టినిన్ను మేమెకాదు బృహ స్పతిమాటలాడినను నతిశయింపఁజాలఁడు. రామా!తర్కకౌశలంబునఁగాని; నానుం దట నొకఁడు మాటలాడునా యను స్పర్ధచేఁగాని, నేను మతిమంతుఁడను వాగ్మినని నాకతిశయము గలుగఁ దలఁచిగాని, నాయిచ్ఛచేతఁగాని చెప్పుటగాదు. రాజా! అయినను రాముఁడు 'నీమతముచెప్పుము' అని నాయందుఁ జూపిన గౌరవముం బట్టి యథార్థమగుమాటం జెప్పెదను. గుణదోషములును ప్రయోజనాప్రయో జనములును పరిగ్రహించుటకు త్యజించుటకు నుపాయములుగా † నీమంత్రులు (అనఁగా అంగదుఁడు) చెప్పిరే! దానియందు నాకు దోషము కనఁబడుచున్నది.

* ఋశ్యమూకపర్వతమే వీఁడువచ్చి శరణుఁ జొరవలసినప్రదేశము. కాలమును అప్పుడే. లంక యొద్దను లంకను ముట్టడించు రాత్రిసమయమునను వచ్చుట తగదు - తనిశ్లోకి. మన మింకను లంకకు దూరముగానుండుటచే తత్కాలమున వీనికి మనవలన భయములేదుగాన యిపుడిచ్చటికి రావలసిన ప్ర యోజనములేదు మఱి తన స్వామియగు రావణునియుద్ధము ఆరంభింపనుండఁగా నతనిని త్యజించివచ్చు టకు నిది కాలమును గాదు- అని గోవిందరాజులు.

† అంగదుఁడనిచెప్పక సామాన్యముగాను బహువచనముగను జెప్పుట నతని మనసు నొవ్వకుండుట కుఁగాని లేక యంగదుని మతములోని వారినందఱిని గుఱించుటకుఁగాని యుండునని తెలియునది.

ఆప్రకారముఁ బరీక్షించు కార్యము పొసఁగిరాదు. ఎట్లన నొకనిని రాజకార్యములందు నియోగింపకున్నచో వానివలని ప్రయోజనముగాని గుణముగాని దెలియుట శక్యముగాదు. ప్రయోజనమును గుణదోషములును తెలియక తటాలున నియోగించుటయు దోషమని నాకుఁ దోఁచుచున్నది. ఇట్లు గుణదోషములఁ బరీక్షించియే నియోగింపవలయుననియు నియోగించియే గుణదోషములు పరీక్షింపవలయుననియు నన్యోన్యాశ్రయముండుటచే నీమతమునరికాదు. చారునిఁబంపి రహస్యముగా నతనిసంగతి తెలియుటయుక్తమని నీమంత్రులు (శరభుఁడు) చెప్పిరే! అదియు యుక్తముగాదు. దూరమున నున్నవానియొద్దికిఁగదా రహస్యముగ చారుఁడుపోయి మఱఁగియుండి వానిసంగతి తెలిసికొనవచ్చును. మనకు మిక్కిలిదాపున కంటికెదుట మాటులేని యాకాశమధ్యమున నున్నవానియెడ చారునిపనయే పనికిరాదుగాన యీయుపాయమును నుపపన్నముగాదు. ఈవిభీషణుఁడు అయుక్తమైన దేశంబునను అకాలమునను వచ్చినాఁడన్నారుగదా. ఆవిషయమై నాకు యథార్థముగా నిదియె తగినదేశమును కాలమునునగునని నాబుద్ధికిఁ దోఁచినంత కొంచెము చెప్పవలయునని గోరికయున్నది. అది వినుము. విభీషణుఁడు అధముఁడగు రావణుని ఉత్తముఁడగు నిన్నును మనస్సున విమర్శించి యట్లె వానియందలిదోషమును నీయందలిగుణమును విచారించి, రావణుని యందు సీత నపహరించుట మరల నాబిడనిమ్మని యెంతచెప్పినను వినకుండుట మొదలగు దుర్మార్గత్వమును, నీయందు ఖరదూషణాదులవధించుట వాలినివధించి సుగ్రీవునకు రాజ్యమొసంగుట మొదలగు పరాక్రమంబులనుం జూచి, బుద్ధినాలోచించి రావణునివిడిచి నీయొద్దకువచ్చుట యతనికిఁ దగియున్నది. (ఇట్లు ప్రతికూలురందు దోషమును దర్శించుటయు అనుకూలురందలిగుణములను దెలియుటయు నెప్పుడెచ్చటఁగలుగునో యదియే తగినకాలమును దేశమునుగాన యుక్తదేశకాలములందే యతఁడు వచ్చినవాఁడు). రాజా! విభీషణుని కెవరిస్వరూపాదులు పరిచితములుకావో యట్టి తెలియనిపురుషులను కొందఱినిబంపి విభీషణుని నడుగవలయుననియు చెప్పఁబడినదిగదా. ఆవిషయమందును, ఈమతము నీతివిరుద్ధమని నిరూపించుటకు నేను చక్కఁగా పరీక్షింపఁగా నాకొకయుక్తి దోఁచియున్నది. *అదియేమన: అతనిని స్వీకరించుటకుమునుపే రావణుని

---

* ఇందులకు 'పృచ్ఛ్యమానో విశఙ్కేత సహసాబుద్ధిమాన్వచః। తత్రమిత్రం ప్రదుష్యేత మిథ్యాప్రష్టస్సుఖాగతమ్॥ అశక్యస్సహసారాజన్ భావోవేత్తుం పరస్యవై। అన్తస్స్వభావైర్గీతైస్తైర్నిపుణం నపశ్యతో భృశమ్' అని మూలము. ఇది తనిశ్లోకిపాఠము. 'మిథ్యాపృష్టం సుఖాగతమ్' అనియు, 'నిపుణం పశ్యతాభృశమ్' అనియు గోవిందరాజ మహేశ్వరతీర్థులపాఠము. అప్పు డర్థమెట్లనఁగా:— బుద్ధిమంతుఁడగువాఁడును అపరిచితులైనవారు తన్ను మాటికి ప్రశ్నములడుగఁగా 'మనయందు విశ్వాసము లేనందుననే వీరిట్లడుగుచున్నారు. ఏమాటచెప్పిన నేమియనర్థము పుట్టునోయని తాను బదులుచెప్ప విషయమై పలుశంకలు పడును. కాఁబట్టి దోషరహితుఁడగుటచే విశ్వాసముతో తనంతటనే వచ్చినమిత్రుఁడు, మనము కపటప్రశ్నలు సేయఁగా, దుష్టుఁడగునుగాన వానిని బోఁగొట్టుకొనవలసివచ్చును. మఱి

సంగతులు చటుక్కున నడిగినయెడల, బుద్ధిమంతుఁడగునతఁడు అవి తన్ను స్వీకరించిన పిదప కార్యవిచారసమయమున నడుగవలసినవియని యెఱింగి 'మనము వినయముతో శరణముచొరరాఁగా,మనలను శత్రువుగాఁ దలఁచిరో'యని మిక్కిలి శంక నొందినవాఁడగును.అట్లు వాఁడుశంకించుటవలన,మన మొకటితలంచుకొని మనస్సునలేని మఱియొకటినడిగినందులకు,అనాయాసముగావచ్చినయామిత్రుని పోఁగొట్టుకొనవలసివచ్చును. ఇంతేకాక రాజా! పరుఁడు దుష్టస్వభావుఁడై స్వార్థమును మిక్కిలియు నిపుణముగాఁ గనువాఁడుగా నుండునేని, తనయభిప్రాయములు వెలువడక లోపలనేయుండునట్లు బదులుమాటలాడును గాన యట్టిమాటలవలన వానియభిప్రాయమును చటుక్కునఁ దెలిసికొనుట శక్యముగాదు; చిరపరిచయముచేతనే తెలిసికొనఁగూడును; కాన మిత్రుని బోఁగొట్టుకొనుటయేకాక వానిభావము తెలియలేకపోవుటయుఁ గలుగుచున్నది. ఇతఁడు పెక్కులుమాటలాడుచున్నను, దుష్టభావము గలవాఁడనుటకు లక్షణములగు ముఖవికారము చెమట తొట్రుపాటు మొదలగునవి యొకటియు నొకప్పుడును గనఁబడలేదు. అందులకుమాఱుగా శుద్ధుఁడగుటకు సూచకముగా నితనిముఖము ప్రసన్నముగానేయున్నది. కాఁబట్టి తక్కినవారికి శంకనీయుఁడని తోఁచినట్లు నాకు సందేహమేమియుఁ దోఁచలేదు. వానరులు చెట్లుచేకొని పెకిఁదలపడఁజూచినను నితఁడు ప్రతికూలుఁడని శంకింపకయే వచ్చినాఁడు. గూఢముగా దురభిప్రాయముగలవాఁడు ఇట్లుజంకులేక నెమ్మదితో నెదుర్కొనిరాఁడు. మఱియు నితనిమాటలును తొట్రుపడుట మొదలగునవిలేక నిర్దుష్టములుగానున్నవి.కాఁబట్టి నాకేకాక మఱియితరులకును నితనివిషయమున సందేహపడవలసినదిలేదు. 'పరమవంచకుఁడయినవాఁడు భావమును గప్పిపుచ్చుకొనునుగాన వానినెట్లునమ్మవచ్చు'నందువా? ముఖవికారము నెంతదాఁచినను, నది దాఁగియుండనేరదు. మనుష్యులకు హృదయంబున నుండుభావము వానినిమీఱి యావికారమును బలాత్కారమునఁ దప్పక బయలుపుచ్చియే తీఱునుజుమీ. రామా! నీవు కార్యవిదులలోనెల్ల నుత్తముఁడవుగాన నీకుఁ దెలియనికార్యము లేదు. కర్తవ్యమైనదానిని, తగినదేశమునను గాలమునను తగినపురుషులయందును బ్రయోగముచేసినయెడల, నుచితఫలము నేయడ్డియులేక శీఘ్రమునఁ గర్తకు నొడఁగూర్చును. 'ఇట్లు తనబంధువులను ఐశ్వర్యమును దిగవిడిచి యూరక మనమైత్రినిమాత్రము గోరివచ్చునా? వచ్చుటకు మఱేదేని ప్రయోజనము గోరియుండవలయు'నందువా? ఖరదూషణాదులను ముహూర్తమునఁజంపి సేనలతో యుద్ధమునకై సముద్రతీరమున రావణునివధించుటకై వచ్చియున్న నీయుద్యమమునుజూచి, నీకెదిరియగు నారావణుని కపటవ్యాపారమునుజూచి, రావణునికంటె ప్రబలుఁడయిన

యు నీయుపాయమువలన నే ప్రయోజనమునులేదు.ఎట్లన:—రాజా!అట్లు కల్లప్రశ్నములు సేయువాఁడు తన్నెంత నిపుణుఁడుగా తలఁచుకొన్నను, పరుఁడు తనయభిప్రాయము లోపలనేయుంచుకొని బదులు మాటలాడునుగాన యతనియభిప్రాయము తటాలునఁ దెలియుట శక్యము గాదు.

వాలిని నొక్కమ్మునసే నిన్నాశ్రయించిన యతనితమ్మునికిఁగాఁ గూల్చుటయు, వాలిరాజ్యమందు నభిలాషముంపక నిన్నాశ్రయించిన యతనితమ్ముని సుగ్రీవునిఁ బట్టముగట్టుటయు వినియు నుండుటవలన, అట్లె తనయన్ననుజంపి యీరాజ్యమునుగోరక సుగ్రీవునివలె నాశ్రయించిన తనకిత్తు వనుతలంపున బుద్ధిపూర్వకముగా రాజ్యము నపేక్షించియే యిటవచ్చినవాఁడు. కాన ప్రయోజనమునుగోరియే వచ్చినాఁడు. ఇట్లు బంధుత్వాదులనుబట్టి వచ్చినవాఁడు గాఁడు గాన శంకనీయుఁడని తమపరికరమునకుఁ దోఁచినను, రాజ్యకాంక్షియై వచ్చినాఁ డన్నయింతమాత్రమును మున్నిడుకొనియైనను నితనిని పరిగ్రహింపవచ్చును. ఇతని నంగీకరించుటకు నింతమాత్రమె చాలియున్నది. వానరులు రాక్షసుఁడని జాతిమాత్రమునుబట్టి శంకించినయీవిభీషణుని ఋజుత్వమునుగూర్చి నేను నాశక్తికొలఁది, నాకుఁ దోఁచినంత, చెప్పితిని. బుద్ధిమంతులలో నెల్ల నీవుమిన్నవు. నేనుజెప్పినదంతయు విన్నావు. అయినను నితఁడు గుణాధికుఁడో, పరిగ్రహింపఁదగునో కాఁడో యంతటికిని నీవే నిర్ణేతవు సుమీ' అనెను. ఇది పదునేడవసర్గము.



శ్రీరాముఁడు శరణాగతరక్షణమే తనమహావ్రతమని చెప్పి
సుగ్రీవునకుఁ గపోతాఖ్యానకండుగాథలం జెప్పి
విభీషణునిఁ దోడ్తేర నియోగించుట.

* అంత రాముఁడు వాయుకుమారుండగు హనుమంతునిమనంబున నున్నయభిప్రాయమునువిని సుగ్రీవునివాక్యముచే కలంగినమనస్సు కలఁతదేఱఁగా, వసిష్ఠాదులవలన కపోతకండూపాఖ్యానాదులు వినియున్నవాఁడు గావున పూర్వపక్షములచే

---

* ఇందులకు 'అథరామః ప్రసన్నాత్మా శ్రుత్వా వాయుసుతస్యహ। ప్రత్యభాషత దుర్ధర్షః శ్రుతవా నాత్మని స్థితమ్' అనిమూలము. విశేషార్థము:-(అథ) అనంతరము రాముఁడు ఉన్నవాఁడయ్యె. రామునికి సత్తకలిగినదనుట. రాముఁడు రక్షకత్వమే స్వరూపముగాఁ గలవాఁడు. 'శరణు' అన్నమాట విన్నపుఁడే రక్షింపకయున్నందున రక్షకత్వస్వరూపమునకు హాని కలిగినదయ్యె. అది యిప్పుడే నివర్తించినదనుట. సంసారియగు చేతనుఁడు, భగవజ్జ్ఞానమువలన సద్భావమును భగవదజ్ఞానమువలన అసద్భావమును నొందునట్లు, రక్షకునకును రక్షకత్వమువలన సద్భావమును రక్షకత్వములేనందున అసద్భావమును గలుగుచున్నవి. సర్వప్రాణులకు సామాన్యముగా నాశ్రయించుటకుఁగాను చక్రవర్తిపుత్రుఁడై యవతరించినట్టివాఁడుగాన ఆశ్రయించుటకు సుముఖుఁడై వచ్చినవానిని విషయీకరింపనందున లేనట్టివాఁడై (అసత్ప్రాయుఁడై) హనుమంతునివాక్యమువలన ఉన్నట్టివాఁడయ్యెను (సత్తను బొందెను.) (ప్రసన్నాత్మా) ధర్మికి సత్తకలుగఁగా ధర్మమునకును సత్త కలుగును. రామునికి సత్తగలుగఁగా మనశ్ప్రసన్నతకును సత్తగలిగెననుట. సుగ్రీవునివాక్యముచే కలుషితమైన మనస్సు ఇప్పుడు ప్రసన్నమయ్యెననుట. (వాయుసుతస్య) సర్వప్రాణులకు ప్రాణభూతుఁడైన వాయువలన - సర్వప్రాణి ప్రాణభూతుఁ



1329. విభీషణుఁడు తనమంత్రులతో రాముని శరణుఁజొచ్చుటకై ఆకాశమునుండి వానరులను ప్రార్థించుట. రాముఁడు విభీషణుని దోస్తేర నియోగించుట.

బుద్ధికలంగఁబడక తనచిత్తముననున్నమతమును జెప్పువాఁడై 'నాకుఁగూడ విభీష ణునిగుఱించి కొంతఁజెప్పవలయునని కోరికయున్నది. మీరు నాశ్రేయస్సును గోరు నట్టివారు గాన నేను జెప్పునదంతయును తుదముట్ట వినవలయునని కోరుచున్నాను. * శరణాగతుఁడయి వచ్చినవానిని, అతనియం దెంతదోష ముండిననుగాని, యెట్లును

---

డై యతనివలెనె పుట్టిన హనుమంతునియొక్క, (ఆత్మనిష్ఠితం శ్రుత్వా) మనస్సునున్నదానిని విని-శేష తనమతముచొప్పున చెప్పిన హనుమంతునివాక్యమును విని, (హ) సర్వరక్షకునకుఁ గూడ ఒకానొక రక్షకుఁడు గలిగినాఁడని ఋషి స్తోత్రము చేయుచున్నాఁడు. (దుర్ధర్షః) పూర్వపక్షములచే ధర్షింపఁబడ క స్వమతస్థాపన సమర్థుఁడయినాఁడనుట. (శ్రుతవాన్) వసిష్ఠాదులవలన కపోతకండూపాఖ్యానా దులు విన్నవాఁడు కావున (ప్రత్యభాషత) వానరులకు బదులుచెప్ప సమర్థుఁడయినాఁడు. (ఆత్మనిష్ఠి తం ప్రత్యభాషత) తన మనస్సునున్న యర్థమును వానరులకుఁ జెప్పినాఁడనియు నర్థము.

* ఇందులకు 'మిత్రభావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన। దోషోయద్యపి తస్యస్యాత్ సతామేతదగర్హితమ్' అని మూలము, విశేషార్థము.—(మిత్రాత్త్రాయతే ఇతిమిత్రమ్)అను వ్యుత్పత్తిం బట్టి ఈశ్వరుఁడుచేయు నుపకారమును కొలఁదిపెట్టి దానికిఁ దగిన ప్రత్యుపకారము చేయవలయునని యర్థమగునుగాని యిది యిట యర్థముగాదు. మిత్రమనఁగా 'తన్మిత్రం యత్ర విశ్వాసః' అన్నట్లు విశ్వసిం పఁదగినస్థలము-అదియు తన నైచ్యమును అనుసంధించుచు 'రాఘవం శరణంగతః' అని శరణాగతినొందు ట యగును. అనఁగా మిత్రమనఁగా విశ్వాసపూర్వకముగా శరణుఁజొచ్చుట. 'ఇది మోసగాండ్ర కును సాధారణమేకదా?' యన్నచో (భావేన) భావమనఁగా క్రియ. విశ్వసనీయులు శరణుఁ జొచ్చి తినని వచించు వ్యాపారమే స్వీకరించుటకుఁ జాలును. (సంప్రాప్తమ్) లంకయందు నిలిచి 'రాఘవం శరణం గతః' అని యీమాటచెప్పెనేని, గజేంద్రరక్షణమందువలె ముందువెనుకఁజూడక పరివారము ను బాటింపక మన మక్కడికి పోవలసియుండఁగా ఇక్కడకేవచ్చి యీమాటఁ జెప్పుటచే మనప్ర యోజనమేకదా చేసినట్టయినది (సంప్రాప్తమ్) ఇక్కడికి కేవలము వచ్చుటకాక 'త్యక్త్వా పుత్రాం శ్చ దారాంశ్చ' అని ప్రాతికూల్యపరిత్యాగాది పూర్వకముగా సమ్యక్ప్రాప్తుఁడైనవాఁడు. (నత్యజే యమ్)త్యజింపను-ఇతనిని వచ్చినంతమాత్రకే శ్లాఘింపవలసియుండఁగా,త్యజింపవలెననిసంభావించుటగాని యెక్కడిది. త్యజింపవలయునని సంభావించినంగదా పరీక్షింపఁగలుగును. 'త్యజింపవలయునని సంభావన కూడ లేకయే తీయుట యెట్లు?' అనఁగా వీనిని బరిత్యజింపఁగా ఉనికి (సత్తి) గలిగియుండువారికిఁగదా పరీక్షించుటకు సంభావన యుండును? సత్తయేకలుగనపుడు,పరీక్షించుట కుద్యోగించుట యెట్లు?అనఁగా 'పరీక్షింపకయే స్వీకరించువారు తమ్ము నపేక్షించి స్వీకరింపరుగదా?మిమ్ము నపేక్షించి వానిని స్వీకరింపఁ జూచితిరేని, మిమ్ము విడిచి నిలుపోపఁజాలని మమ్మును దిగవిడుచుటగాదా?' యనఁగా (కథంచన) అట్లు దుష్కరములు చేసినను వీనిని విడువననుచున్నారు. రావణభ్రాత, రాక్షసుఁడు, లోకభయంకరుఁ డనుట యొప్పుకొనఁదగినదే. మనకు వధభేదనాదులను జేయనుగూడును. ఇట్లు దోషయుక్తుఁడైయున్న వీనిని సర్వప్రకారములచేతను విడువననుట యెట్లనఁగా, (దోషోయద్యపి తస్యస్యాత్) దోషములు వీనికుండి నను శరణాగతికి జన్మనియమముగాని వృత్తినియమముగాని లేనందున, ప్రపత్తిచేసినవీనియెడల నాపక్షమున దోషములేదు. మీపక్షమున దోషముండినను నేనును వానిని విడువను. వీఁడు దుష్టుఁడని తెలిసియు స్వీకరించినయెడల జనులు నిందింపరా యన్నచో, (సతామేత దగర్హితమ్ స్యాత్) తగని చో భయమును శంకించు మీకు గర్హింపఁదగిన విషయమేయైనను, సజ్జనులకు వీనిని స్వీకరించుట

దిగవిడువను. ఇట్లుసేయుట సత్పురుషులకుఁ బూజనీయమేకాని నిందితముగాదు. గర్హితముగాదు ఒకవేళ (దోషోయద్యపి) దోషముండినను, వానిదోషమేకదా (స్యాత్) ప్రార్థనాయాం లిఙ్. మేము ప్రార్థింపయుంచునది. గుణవంతుని రక్షించితిమేని అది వానిగుణమునకు వెలయగును గాని దుష్టుని రక్షించితిమనెడి యతిశయము మనకుఁ గలుగునా? లేక, (దోషోయద్యపి) మనల పీడింపఁ దలఁచి మనను స్వీకరించుకొనుము 'రాఘవం శరణం గతః' అన్నవాఁడయినను, (తస్యస్యాత్) వాఁడు తలఁచిన కార్యము తలకూడినదయ్యెను. వాఁడు మనల హింసింపఁదలఁచినది నెఱవేఱుఁగాక. మీఁద కపోతాఖ్యానము వచ్చుటంబట్టి యిదియే యిట యర్థమగుట యుచితమని శ్రీవత్సాంకమిశ్రులు చెప్పిరి. ఈయర్థమున 'తస్మాదపివధ్యం ప్రపన్నం నప్రతియచ్ఛతి' అని శ్రుతి. ఇట్లు దుష్టుఁడగువానిని దిగవిడువకుండుట విడిచినచో ప్రత్యవాయమనియా? పురుషార్థసిద్ధికొఱకా? పాపక్షయార్థమా? అనఁగా (సతామేతదగర్హితమ్) ఇది యొక్కటియుఁగాదు. సద్గోష్ఠియందు మమ్ము ఛీఛీ అనకుండుటకుఁగాను-సత్తులనఁగా తమకుఁ దాము నాశము నొందియైనను ఇతరులఁగావ నుద్దేశించు కపోత విశ్వామిత్రాదులు.

ఈ విభీషణశరణాగతికి 'అహమస్మ్యపరాధానా మాలయోఽకిఞ్చనోఽగతిః । త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః॥ శరణాగతిః' అన్నట్లు శరణాగతి లక్షణముగలదా యన్నచో లక్షణము చక్కఁగాఁ గలదు. 'రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః। తస్యాహ మనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః॥' అని స్వయముగా నార్జించినదియు రావణసంబంధముచేఁ గలిగినదియునగు తనదోషాధిక్యమును జెప్పుటవలన 'అహమస్మ్యపరాధానామ్' అన్నయర్థము చెప్పినట్టయినది. రాముఁడు తనకు యుద్ధసాహాయ్యమునకు పిలువఁగా వచ్చినవాఁడుగాక, 'రాజ్యం ప్రార్థయమానశ్చ బుద్ధిపూర్వ మిహాగతః' అని తాను రాజ్యమువేఁడి వచ్చినవాఁడై యిక్కడకు నొకయుపకారమును లేమిచే 'అకిఞ్చనః' అనునర్థము చెప్పఁబడినదయ్యెను. 'సోఽహం పరుషితస్తేన దాసవచ్చావమానితః' అనియు 'త్వాంతు ధిక్కులపాంసనమ్' అనియు భ్రాతయగు రావణునిగోష్ఠియుండ నసహ్యుఁడై వచ్చుటచే 'అగతిః' అను అనన్యగతిత్వము చెప్పఁబడినదయ్యె. 'రాఘవం శరణం గతః' అని రాముని ఉపాయముగాఁ బట్టుటచే 'త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః। శరణాగతిః' అనునర్థము చెప్పఁబడినదయ్యెను. కాఁబట్టి శరణాగతిలక్షణము పుష్కలముగా నున్నది.

మహాభారతమందు కృష్ణచరమశ్లోకమువలె శ్రీరామాయణమునకు నిది యొకచరమశ్లోకమై ముగించుటచే చరమమగుచున్నది. ఇట సర్గమునడుమ చరమము (కడపటిది) యగుట యెట్లు? అన్నచో ఇచట ఆద్యంతములు గాదు చరమార్థమగుటకు హేతువు. భారతమునందు కర్మజ్ఞానాద్యుపాయములను విశేషిగా ముందువిధించి పిదప చరమోపాయముగా ప్రపత్తిని విధించుటవలన చరమముగా నయినది. ఇందును అంగదుఁడు శరభుఁడు మొదలగువారు విభీషణుని స్వీకరింపరాదని వేఱువేఱ చెప్పఁగా, వారి మతముల పూర్వపక్షముచేసి, చరమముగా సిద్ధాంతీకరించిన శ్లోకమగుటచే నిది చరమమగుచున్నది. అచ్చటను ఐశ్వర్యము పోఁగొట్టుకొన్నవానిని ఐశ్వర్యము లభించునట్లు చేయనయ్యెను. ఇచ్చటను ఐశ్వర్యముఁ బోఁగొట్టుకొన్నవానిని ఐశ్వర్యము లభించునట్లు చేయనయ్యెను. అచ్చటను సేనకు నడుమనిలిచి చెప్పినవార్త. ఇచ్చటను సేనకునడుమ నిలిచి చెప్పువార్త. అచ్చటను శోకనివృత్తికై చెప్పినవార్త. ఇచ్చటను శోకనివృత్తికై చెప్పినవార్త. అచ్చట నొకగోపాలుని (గొల్లవాని) వాక్యము. ఇచ్చటను నొకగోపాలుని (భూపాలుని) వాక్యము. అచ్చట 'యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహితన్మే' 'ఏది నాకు శ్రేయస్సుగా నిశ్చయింపఁబడినదో దానినిఁ జెప్పుము' అని శ్రేయోర్థియడుగఁగా చెప్పినవార్త. ఇచ్చటను

'శ్రుతమిచ్ఛామి తత్సర్వం భవద్భిః శ్రేయసి స్థితైః' 'నా శ్రేయస్సునందే వర్తించుచున్న మీరు నేను దానినంతయుఁ జెప్పఁగా వినఁగోరుచున్నాను' అని శ్రేయోర్థియకుఁగా చెప్పినట్టివార్తయే.

అందలి చరమశ్లోకమునకును ఇందలి చరమశ్లోకమునకును వాసిగలదు. ఎట్లనఁగా అందు అడుగువానికి తేరిమీఁదనుండి చెప్పినవార్త. ఇందు భూమిమీఁదనుండి నెలకొని చెప్పువార్త. అందు 'మాం వ్రజ' అని 'నన్నుఁబొందు' మని శరణ్యుఁడు ఆశపడినట్లు చెప్పఁబడెను. ఇందు 'సంప్రాప్తమ్' అని యెదరి తానై సమ్మతించిపొందినట్లు చెప్పఁబడినది, అందు 'ధర్మాన్ పరిత్యజ్య' అని ధర్మత్యాగము చేయఁబడెను. ఇందు 'పరిత్యక్తా మయాలఙ్కా మిత్రాణిచ ధనానిచ' అని ధర్మిత్యాగము చేయఁబడుచున్నది. అందు 'షోడశ స్త్రీసహస్రాణి' అని బహుదారపరిగ్రహము చేసినవానివార్త. ఇందు 'న రామః పరదారాంశ్చ చక్షుర్భ్యామపి పశ్యతి' 'రాముఁడు పరభార్యలను కంటంగూడఁ జూడఁడు' అన్న ఏకదారవ్రతుని వార్త. అందు 'పైతైకకృష్ణాయమితిత్రు' 'ఒక్కతికి గల్ల చెప్పి' అనియు 'ఒకువుక్కు మెయ్యనల్లై' 'ఒక్కరికిని సత్యవంతుఁడుగాఁడు' అనియు అసత్యుఁడగు కృష్ణునివాక్యము ఇందు 'సత్యవాక్యః' అనియు 'రామోద్విర్నాభిభాషతే' అనియు సత్యుఁడయిన రామునివాక్యము. అచట చేత ములుకోలదాల్చిన సారథివాక్యము. ఇచట చేత విలుదాల్చిన దాశరథివాక్యము. అందు శరణాగతుని యధ్యవసాయము చెప్పఁబడినది. ఇందు శరణ్యునియధ్యవసాయము చెప్పఁబడుచున్నది. అందు శరణాగతుని పాపములనుండి విడిచిపుత్తునన్నాఁడు. ఇందు నేను శరణాగతుని విడువను అన్నాఁడు. అందు సదోషుని విడుపింతుననియున్నది. ఇందు దోషవంతుఁడైనను విడువననియున్నది. అందు కాలాంతరమునఁ గలుగఁగూడు అదృష్టఫలమును చెప్పఁబడినది. ఇందు సద్యఃఫలమైన దృష్టఫలము చెప్పఁబడుచున్నది. అందు ప్రతిబంధకులు లేకయేయుండ రక్షించినది చెప్పఁబడినది. ఇందు ప్రతిబంధకులుండియునుగూడ రక్షించినవిధము చెప్పఁబడుచున్నది.

ఇఁక ఈశ్లోకమువలన 'బుద్ధిపూర్వకముగాఁగాని అబుద్ధిపూర్వకముగాఁగాని నన్నుఁ జేపట్టినవారిని దోషముండినప్పటికిని విడుమటలేదు' అనుచున్నాఁడు. 'నిన్ను బంధుభావముతో వచ్చి యాశ్రయించినంగదా నీవింతయుఁ జేయవలయుననఁగా (మిత్రభావేన సంప్రాప్తమ్) సోదరుఁడయిన రావణునిఁగూడ విడిచి వచ్చి నన్నే బంధువుగా ఆశ్రయించినయునికిఁ జూచితిరా' యనుచున్నాఁడు. (మిత్రభావేన సంప్రాప్తమ్) శత్రుభావమున రాలేదు. 'ప్రాప్తశ్శత్రురతర్కితః' అని వానరులబద్ధముచెప్పిరి. మిత్రుఁడుగానే వచ్చినాఁడుమఁడీ. (మిత్రభావేన) దూతగావచ్చినాఁడుగాఁడు. మిత్రుఁడుగావచ్చినాఁడు. (మిత్రభావేన) 'మితాత్ త్రాయతే ఇతి మిత్రమ్' అన్నట్లు చేసినయుపకారముకొలఁది యెఱిఁగి, దానికిఁ దగిన ప్రత్యుపకారము చేయుటయేకదా మిత్రశబ్దార్థము. అట్లు మీరు తాటకాతాటకేయ విరాధఖరదూషణకబంధప్రభృతులను చంపి చక్కాడి ప్రాతికూల్యము చేసి యొక యుపకారమును జేయకుండుటచే నితఁడు మీకు ప్రత్యుపకారము చేయవలసినదిలేదు. మీరు తామై యుపకారము సేయఁజూచితిరేని, 'ఏష సర్వస్వభూతస్తు పరిష్వఙ్గః' అన్నట్లు, ఉభయవిభూతులనుగాని విభూతిమంతుఁడగు మిమ్మేకాని యిచ్చివేయుదురు. అప్పుడు దీనికిఁదగినట్లు చేయఁగూడినప్రత్యుపకార మొకటియు లేనందున మిత్రభావమితనికిఁ గలిగిన దెట్లు? అన్నచో మైత్రియనఁగా 'పరసమృద్ధిని సహించు చిత్తపరికర్మము. కాఁబట్టి మనయందింతటియతిశయముండుటఁ జూడఁగా మాపోపకుండుటలేక యిష్టపడియుండుటయేచుమా మిత్రభావము. (మిత్రభావేన) 'భావోలీలాక్రియాచేష్టాభూత్యభిప్రాయజన్తుషు' అనిభావమున కిన్నియర్థములుగలవు. అందు లీలయనునర్థమున నితఁడు రాజాత్ముఁడగు నిక్కచేత, మిత్రునివలె లీలార్థము వేషమువేసికొనివచ్చి యుండవచ్చును.

లేక (మిత్రభావేన) క్రియార్థక మైనచో బుద్ధిపూర్వముగాఁ గాక వాయుజలములచే ప్రేరితులైనవారివలె మిత్రులగు వారిచేయుచేఁతలు చేసినవాఁడు గావచ్చును. (మిత్రభావేన) భావశబ్దము చేష్టార్థక మైనచో స్నేహములేకపోయినను 'రాజ్యకాంక్షీ' అని ఒకప్రయోజనము నుద్దేశించియైనను ఇంతటిచేష్టలు చేసియుండవచ్చును. (మిత్రభావేన) లేక భావశబ్దము భూతియై భూతియనఁగా సంపత్తగునపుడు తనబుద్ధిచేత మనఁ మిత్రునిఁగాఁదెలిసి మనకెల్ల మంచిచేయవలయునని వచ్చియుండవచ్చును (మిత్రభావేన) భావశబ్దము సత్తావాచియగునపుడు మిత్రులగ మనకు సత్తలభించుటకై వచ్చినవాఁడుగావచ్చును. (మిత్రభావేన) భావశబ్దము అభిప్రాయవాచియగునేని, పోయినరాజ్యమును గోరవచ్చుటయేకాక, 'పరిత్యక్తామయా లఙ్కా మిత్రాణిచ ధనానిచ । భవద్గతమ్మేరాజ్యంచ జీవితంచ సుఖానిచ' అని అన్నిటిని దిగవిడచి మనమేయుద్దేశ్యమనెడి యభిప్రాయముతో వచ్చినవాఁడు గావలయును. (మిత్రభావేన) భావశబ్దము జన్మవాచియగునేని, 'చతుర్భిస్సహరాక్షోభి ర్భవన్తం శరణంగతః' అని తానువచ్చుటయెకాక బంధుజనులతోడను వచ్చినవాఁడనుట. దీనిచేమాత్రమైన పీడింపవచ్చినవాఁడేని యింతమందితో రానొప్పదనుట. (మిత్రభావేన) వచ్చునపుడు రావణునితో మిత్రభావము గలిగియేవచ్చినవాఁడు-అనఁగా నతనితో రోషముగ పరుషములాడి పోరాడక 'సత్వంభ్రాతాసిమేరాజన్ బ్రూహిమాంయద్యదిచ్ఛసి । జ్యేష్ఠో మాన్యః పితృసమో నచ ధర్మపథేస్థితః' 'రాజా! నీవు నాకుఁ దోఁబుట్టువు అగుదువు. కాన యేమేమి యనఁగోరెదవో యనుము. నాకు పెద్దవాఁడవు. పూజ్యుఁడవు. తండ్రితోసాటియైనవాఁడవు. కాని ధర్మమార్గమున వర్తింపవైతివి' అని నీతోడఁబుట్టినందునఁ గౌరవ్యుఁడగుటంబట్టి నీనోటికి వచ్చినదంతయు చెప్పుదువుగాక. నేను దీనికి విరోధపడలేదు. నీవు ధార్మికుఁడు గాకపోవుటచేత ధర్మాత్ముఁడగు నాకు సరిపడకుండుటవలన బోవుచున్నానంతే; 'ఆత్మానం సర్వథారక్ష' 'నిన్ను సర్వవిధముల రక్షించుకొనుము' 'స్వస్తితేఽస్తుగమిష్యామి సుఖీభవమయావినా' 'నీకు భద్రమగుఁగాక పోయెదను; నేనులేనందున నీవు సుఖుఁడవుగమ్ము.' అని నయముతో వచ్చినాఁడనుట. (మిత్రభావేన) 'రాఘవంశరణం గతః' అనికదా చెప్పియున్నాఁడు. కాఁబట్టి 'శరణాగతభావేన' అని చెప్పక 'మిత్రభావేన' అననేల యనఁగా ఇతరులను తక్కువపఱచి తమ్ము హెచ్చించుకొను నీచులవలెఁగాక గౌరవముగ మిత్రుఁడని చెప్పినాఁడు. గుహునియెడల మిత్రునిఁగాఁ గొండాడినవాఁడు విభీషణునిఁ బడయఁగా నిడుచునా. రాముఁడు 'ఆత్మసమస్సఖా' అనియితరులు తన్నుఁజెప్పి 'సోహంప్రియసఖారామః' అని తానును జెప్పనట్లుగాఁగదా తనయాధిక్యమును జూపక వారలయెడ నడచుకొన్నాఁడు. సీతయు రామునివలెనే రావణునితో 'తేనమైత్రీభవతుతే' 'రామునితో నీకు స్నేహముగలుగుఁగాక' 'మిత్రమౌపయికంకర్తుమ్' 'రాముని మిత్రునుగాఁజేసికొనుట యుక్తము' అని తమయాధిక్యమును దెలుపక చెప్పినది.

'మిత్రభావము చేయుటవలనఁ బ్రయోజనమేమి? వాఁడు లంకలోఁగదాయుండునది' యని యడుగఁగా (సంప్రాప్తమ్) ఇక్కడికేవచ్చి కంటికెదురుతిరిగినాఁడనుచున్నాఁడు. (సంప్రాప్తమ్) 'ఆజగామ ముహూర్తేన' అని లంకను మీఁద లేవఁగాఁ జూచితిమి. ఈగట్టున నిలువఁగాఁ జూచితిమి. వచ్చినత్వరచూడుము. (సంప్రాప్తమ్) ఆగట్టుననుండి శరణమన్నాఁడేని ముందువెనుకఁ జూడక పరివారాదులను జూడక మన కక్కడికిఁ బోవలసియుండును. ఈనాలుగడుగులును నడచి యిక్కడికేవచ్చి మన కుపకరించినాఁడుచుఁడీ,(సంప్రాప్తమ్) 'పద్భ్యామభిగమాచ్చైవ' అని గుహునిఁ జూచి కాలితో నడచివచ్చినందులకు సంకటపడినవాఁడు వేళకానివేళలో దారికానిదారిలోఁ బడివచ్చినందులకు మనస్సున కొందలపడుచున్నాఁడు. (సంప్రాప్తమ్) మనమిక్కడికి వచ్చునపుడు నడుమ

శృంగిబేరపురము, భరద్వాజాశ్రమము, చిత్రకూటము, పంచవటి, మాల్యవంతము మొదలగునెన్నిచోట్ల నిలిచి తామసించి వచ్చితిమి. ఇతఁడట్లుగాక దారిలో నొకచోటను నిడియక యొకముహూర్తములో వచ్చుటను జూడుఁడు. (సంప్రాప్తమ్) వచ్చునపుడు సొగసుగావచ్చినాఁడు. అనఁగా సీతకు తనకూఁతురును అనలనుంచి యూఱటచెప్పించియు హనుమంతుని పీడింపఁజూచినపుడు దూతవధను కూడదని దానివి తొలఁగించియు 'ప్రదీయతాం దాశరథాయ మైథిలీ' అని రావణునకు మంచివార్త చెప్పియు, ఇట్లు పలువిధములుగా ఉపకారకుఁడైయే వచ్చినాఁడు (సంప్రాప్తమ్) వచ్చునపుడు లంకనశించి పోఁబడి తెలియకుండుటకుమాఱుగా, లంకసొంపు దూలకుండునట్లు మనల నుద్దేశించివచ్చినాఁడు. (సంప్రాప్తమ్) తానున్నచోటికి మనమేపోఁజూడఁగా 'జగ్రాహ ఖం స్థిత్వా తస్మాదన్యం శిఖరముత్తమమ్' యన్నట్లు ఉన్నకొండనుండి మఱియొకకొండకొమ్మునకు సుగ్రీవుఁడవలెఁ బాఱిపోవక మనమున్నచోటికి తానేవచ్చినాఁడు. (సంప్రాప్తమ్) వచ్చునపుడు 'బాహూ రేవ ప్రసారితః' అన్నట్లు చేతులుచాఁచి మనలను సామ్యబుద్ధితో కౌఁగిలింపఁజూచుటకు మాఱుగా 'పాదయోశ్శరణాన్వేషీ' అని యడుగులుపట్టుకొని తన్ను తగ్గించుకొని వచ్చినాఁడుసుఁడీ. (సంప్రాప్తమ్) 'విజితారిస్సదారశ్చ రాజ్యే మహతి సంస్థితః' అన్నట్లు తన్ను విడిచియుండరాని మనుష్యులను (రామలక్ష్మణులను) ఆఱుమాసములు మొఱయుముల పాలుచేసి పట్టిరాజ్యముతోను భార్యలతోను వర్ధిల్లు సుగ్రీవుఁడుగాఁడు. 'త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః' అన్నట్లు రాజ్యమును భార్యలను కాలందన్ని మనలనే పొందవచ్చినాఁడు సుఁడీ. (సంప్రాప్తమ్) తన్నుఁ జూచి 'అంతరంగుఁడై వచ్చినాఁడో పీడింపవచ్చినాఁడో నిగ్రహింపఁదగినవాఁడో అనుగ్రహింపఁదగినవాఁడో స్వీకరింపఁదగినవాఁడో తఱుమఁగొట్టఁదగినవాఁడో వధ్యుఁడో అవధ్యుఁడో' అని (సుగ్రీవునివలె) అనేకవిధములు చెప్పుకొనుటకుమాఱుగా మొట్టమొదటనే దృఢచిత్తుఁడై మనలను విశ్వసించి వచ్చినాఁడు. (సంప్రాప్తమ్) 'సమ్ ఇత్యేకీకారే' అన్నట్లు, తాను రాక్షసుఁడనియు నేను క్షత్రియుఁడనియు వేఱుపాటులేక 'అస్మాభిస్తుల్యో భవతు' అన్నట్లు మనలో నొకఁడగునట్లు మనతో నేకరసుఁడై వచ్చినాఁడుసుఁడీ.

'వీఁడు తానే వచ్చినాఁడనుట యొకయర్థమో? మన కాలిచేతనా వీఁడు నడచిరావలె? రావణునితమ్ముఁడై బాధకుఁడగువీనిని 'ఆతతాయినమాయాన్తం హన్యాదేవా విచారయన్' అని శాస్త్రములు ఆతతాయిని సంపవలయునని చెప్పుచుండుటంబట్టి, వచ్చినపుడే చంపవలసినది ప్రాప్తమై యుండఁగా, చంపకపోయినను విడిచిపెట్టుటయైనను ప్రాప్తముగాదా' యనఁగా, (నత్యజేయమ్) మీరు చెప్పుమాటను విడుతు నింతేకాని వానిని ఒకప్పుడును విడువను. (నత్యజేయమ్) 'శకిలిక్' అన్నట్లు లిజ్జాలన సుగ్రీవునిమాటతో నిపుచ్చరాకుండుటంబట్టి విడువఁదలంచినప్పటికిని శక్తియోలేదు. (నత్యజేయమ్) సుగ్రీవుఁడు మహారాజగుటచే త్యాగము సేయుచున్నాఁడు. తాపసులమైన మేము ఏమిత్యాగము సేయఁగలము. (నత్యజేయమ్) నేను విడువఁజూచినను 'చరణౌ గాఢమ్ నిపీడ్య' అన్నట్లు అతఁడు సేసిన ఆర్తివలన నాకు విడువఁ దరముగాకున్నది.

'అయితే వానిని విడువఁగూడదేని విడువరాని వారిని (మమ్ము) విడుచుటెంతేకదా' యనఁగా (కథంచన) ఎట్లును విడువను. 'అప్యహం జీవితం జహ్యామ్' 'ప్రాణములనైనను నేను విడుతును చేసిన ప్రతిజ్ఞను తప్పను' అన్నట్లు, మన ప్రాణములను నొకపెట్టున విడిచినను వానిని విడువను." 'నజీవేయం క్షణమపి వినా తామసితేక్షణామ్' 'అనల్లని కన్నులసీత లేనిచో క్షణకాలమయినను జీవింపను' అన్న సీతాదేవిని విడువవలసివచ్చినచో ఏమి చేయవలయును" అన్నచో (కథంచన) 'త్వాం వా సీతే' 'సీతా! నిన్నుఁగాని విడు

తును' అన్నట్లు 'ప్రాణేభ్యోఽపిగరీయసీ' అని ప్రాణములకంటె నెక్కుడయిన సీతనువిడిచినను వీనిని విడువను." 'అద్యైవాహంగమిష్యామి లక్ష్మణేన సతాంగతిమ్' అని లక్ష్మణుండు రావణునిశక్తిచే మూర్ఛితుండైనపుడు అతండు పోయినగతికి తానును బోవునట్లుగదా చెప్పితివి. 'లక్ష్మణేవామహాభాగే' అన్నట్లు అట్టి లక్ష్మణునికి ఒకకీడుగలుగు నేని చేయునదేమి?" అనంగా (కథంచన) 'సలక్ష్మణామ్' 'లక్ష్మణునిని సీతా! నిన్నుఅయినను విడుతును' అన్నట్లు అంతఃపురమునే విడువంజూచినపుడు అంతఃపురపరికరమును గూడ విడుచుటయేకదా. అట్లు వనవాసబంధువయిన లక్ష్మణుని విడిచినను వీనినివిడువంజాలను." "త్వయికించిత్సమాపన్నే కింకార్యం సీతయాసమమ' 'నీకు ఏదేని కొంచెము కీడుగలిగెనేని సీతతో నాకుంబనేమి' అని కదా సుగ్రీవుండనగు నాయెడల మీరు దయగలిగియున్నారు. అట్లు మిమ్ముం జేపట్టియున్న దాసునికొకకీడు కలుగునేని చేయునదేమి?" యనంగా (కథంచన) సీతనుగూడ దిగవిడిచి చేపట్టునట్టి నిన్నుంగూడ విడువం గలుగును. వానిని విడువంజాలను.

'అదేమి? శరణాగతుని విడువరాదనుటయేంగదా మీరుచెప్పునది. నాశరణాగతిలో పాముచొచ్చినదా!' యనంగా అప్పుడీనిన దూడకుంగా మునుపీనిన దూడను కొమ్ములతోను గొరిజలతోను తన్నును' అన్న క్రొత్తమాట మఱచితిరా! 'పూర్వాపకారిణాం త్యాగే నహ్యధర్మోవిధీయతే' 'పూర్వ మపకారము చేసిన వారిని విడిచినచో అధర్మమగునని విధింపంబడలేదు' అనియున్నది. దారాపహారము చేసిన రావణునితమ్ముండు అంతరంగుండై వచ్చినచోటు దొరసి పీడింపవచ్చినాండు. మనము తనపై నాశవిరమునకు పోకుండంగా తానేమనపాలముతోనికి వచ్చి కీడు చేసిన యింతటిదోషదుష్టుని విడువక చేకొనుట యెట్లు? అనంగా (దోషోయద్యపి) దోషములున్నను—'మిత్రభావేన సంప్రాప్తమ్' అని అతండు నిర్దోషుండగుట మీకుపదేశించితిని. అనేకవ్యాటియు చెవినిబెట్టక సదోషుండనియు మీకు బుద్ధిగలుగునేని మీరుచెప్పిన దోషములేకాక యింకను కొన్నిదోషములుండినను వానిని విడువను. (యద్యపిదోషః) మీరుచెప్పినట్లు దోష ముండెనా, (తస్యస్యాత్) అది వానికి అధికారసంపత్తికలిగించునదగును. అనంగా 'అహామస్మ్యపరాధానా మాలయోఽకించనోఽగతిః । త్వమేవోపాయభూతో మేభవ' అనియు 'నధర్మనిష్ఠోస్మి ...శరణంప్రపద్యే' అనియు శరణాగతునియొక్క దోషమేకదా వానిని శరణాగతికి అధికారింగాం జేయుచున్నది. అంతేకాక ఒకధర్మిని చేకొనునపుడు వానిని ధర్మమును విడిచియా చేకొనునది. ఇటగాక (దోషోయద్యపి తస్య) అని వానికి దోషముండునాయని శంకించి, (స్యాత్) ఉండనీ! అనిపరిహారము చెప్పినట్లయినది ఔపాధికబంధము కలిగినచోట ప్రజచేసిన తప్పును ఓర్చుకొనవలసినదాయున్నది. అంతమాత్రమును ఓర్వదా వానిదోషమనుచున్నాండు. మఱియు వానికి మొదలే దోషములేదు. ఉండెనా? (తస్యదోషః) వానిదోషమేకదా వానికంటెను శ్లాఘ్యమై మనకున్నది. అభిమతులయిన వారియందలి మాలిన్యమును సమ్మతముగానే యుండునట్లని తెలియునది. (దోషో యద్యపి) దోషముండినయెడల, (తస్య స్యాత్) వానికభిమతసిద్ధియగును - వాండు తలచివచ్చినది యీడేఱినవాండగును-(దోషోయద్యపితస్యస్యాత్) దోషముండెనేని యది వానితప్పగుచున్నది; కాని రక్షించిన మనతప్పుగాదే. (దోషోయద్యపిస్యాత్తస్య) 'నమః' అన్నట్లు 'దురాచారోపి సర్వాశీకృతఘ్నో నాస్తికః పురా । సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయాశరణంయది । నిర్దోషం విద్ధితం జన్తుమ్' అనియు 'జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే' అనియుం జెప్పునట్లు మునుపు సదోషుండేయైనను శరణాగతుండయినపుడే యవియెల్ల నశించి నిర్దోషుండైమీయుండునది. (తస్యదోషోయద్యపి) 'అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా' అన్నట్లు మనము నాశమునైన నోర్చి శరణాగతరక్షణము చేసితిమని పేరుపడయుటకు చుమీ.

ఇట్లు సదోషుఁడేయైనను విడువకుండినయెడల ప్రయోజనమేమి యనఁగా (సతామేతదగర్హితమ్) సాధుకోటిలో చేర్చుకొనఁబడుటయే. అన్నట్లు శరణాగతుఁడయిన యయాతినిరక్షించిన శైబ్యాదుల గోష్ఠికిని శునశ్శేఫాదులను రక్షించిన విశ్వామిత్రాదిగోష్ఠికిని వెలిగాకపోవుదును. (సతామేతత్స్యాత్) ఇది సత్తులయిన భాగ్యవంతులకు సిద్ధించునేకాని సుగ్రీవునకు పరతంత్రుఁడయిననాకు లభింపఁగలుగునా. (నతామేతత్స్యాత్) కపోతవానరాదులయిన తిర్యక్కులకు సిద్ధించునేకాని మనుష్యశరీరమును పరిగ్రహించినమనకు సిద్ధింపఁగలుగునా. (అగర్హితమ్) సంధ్యావందనాదులు చేయఁగా నొకవేళ ఫలము లేకయేపోయినను, చేయనియెడల ప్రత్యవాయముమాత్రము తప్పకకలుగునట్లు, 'క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్యశబ్దో భువనేషురూఢః' అని క్షత్రియులయిన మనకు పరులరాకాత్తు నివారించుట స్వరూపప్రయుక్తము; అదిచేయనపుడు నిందపుట్టును. ఆనింద నివర్తించుటయేఫలము. ఇట్టిశ్లోకమువలన "ఈప్రపత్త్యధికారికి కావలసినది. స్వల్పమైన యానుకూల్యము ఇంతమాత్రమునకే 'నస్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా । కథంచిదుపకారేణ కృతేనైకేనతుష్యతి' అనియు 'తేషాం ప్రపత్త్యభిసిద్ధరి' అనియు, 'మాం వ్రజ... సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' అనియు, 'మద్భక్తంనయామిపరమాం గతిమ్' అనియు నిత్యాదులచేఁ జెప్పినట్లు ఆయధికారికి ఏదేని యెవరేనియు ప్రతిబంధకము గలిగించినను ఎంతమాత్రమును జేవిడువక తన్నేయిచ్చుకొను" ననెడి యర్థము ప్రతిపాదితమైనది.

మంత్రులను నుపలాలించి తనస్వభావమును జెప్పువ్యాజమున తనమతమును దెలుపుచున్నాఁడు:- సుగ్రీవాదులు 'విభీషణుఁడు దుష్టుఁడు గావున వానిని పరిగ్రహింపఁదగదు' అనిరి. అంగదాదు 'విభీషణుని పరీక్షించి దుష్టుఁడు గానిచో పరిగ్రహింపవచ్చును' అనిరి. హనుమంతుఁడు 'విభీషణుఁడు దుష్టుఁడుకాఁడు; కావున పరిగ్రహింపవచ్చును' అనెను. రాముఁడు 'దుష్టుఁడయినను కాకున్నను శరణు అనుమాట చెప్పినవానిని పరిగ్రహించియే తీఱవలయును' అనెను. దీనింబట్టి సుగ్రీవుఁడు 'దుష్టుఁడ'న్న కారణమును సరికాదు. 'పరిగ్రహింపరా'దన్న మతమును మంచిదికాదు. దుష్టుఁడయినను శరణాగతుని పరిగ్రహింపవలసినదియే యని దానికి ఖండనము. అంగదాదులు 'పరీక్షించి దుష్టుఁడు కానిచో' అన్న నిబంధనయు సరికాదు. శరణాగతుని విషయమై దుష్టుఁడా కాఁడా యని పరీక్షించుటయేతగదు అని దీనికి ఖండనము. హనుమంతుఁడు 'పరిగ్రహింపవచ్చును' అన్నమతము సరికాని 'దుష్టుఁడుకాఁడు' అన్నకారణము సరికాదు. దుష్టుఁడు కాకుండుట కాదు. 'శరణంగతః' అనుమాట చెప్పుటయే పరిగ్రహించుటకు ముఖ్యమైనకారణము అని దీనికి ఖండనము తెలియునది. ఇట్లందఱిమతములు లలితముగా నిరసించి పరిగ్రహించుటకు ముఖ్యకారణమగు 'శరణాగతిని' 'మిత్రభావేన' అని చెప్పుచున్నాఁడు:— (మిత్రభావేన) వాస్తవమయిన మిత్రత్వము లేకపోయినను, మిత్రత్వమును అభినయించునంతమాత్రమే పరిగ్రహించుటకు చాలును. (మిత్రభావేన) ఇట మిత్రభావమనఁగా 'రాఘవం శరణంగతః' 'శరణ్యం శరణంగతః' అని పూర్వోత్తరములందుఁ జెప్పఁబడుటంబట్టి శరణాగతత్వమని యర్థము. (మిత్రభావేన) స్నేహితునియొక్క భావముచేత—ఆశాలేశమాత్రముచే ద్వేషములేకుండుటగాని ఆభిముఖ్యమాత్రముగాని కలిగియుండినను నే నంగీకరించుటకు చాలును; పూర్ణభక్తియుక్కఱలేదనిభావము. ఇదియే 'త్వామామనన్తికవయః కరుణామృతాబ్ధే జ్ఞానక్రియాభజనలభ్య మలభ్యమన్యైః । ఏతేషు కేనవరదోత్తరకోసలస్థాః పూర్వం సదూర్వమభజన్తహి జన్తవస్త్వామ్' అనియున్నది. (మిత్రభావేన) మిత్రభావనచేత-మనఃపూర్వకముగాఁగాక పయికి 'శరణు' అని చెప్పినను అనుట. ఇదియే 'శరణవరణవాగియం యోదితానధవతి బతసాపి ధీపూర్వికా' 'శరణన్నమాటయును నక్కటా! బుద్ధిపూర్వకమైనదిగాదు' అనఁబడి

నది. (మిత్రభావేన) 'శరణాగతభావేన' అని చెప్పఁదగియుండఁగా 'మిత్రభావేన' యనుట యెట్లన్నచో తన్నాశ్రయించుటకు కొన్ని యడుగులుమాత్రమే యెవఁడేని పెట్టినను వానిని తనకు సమానునిగా భగవంతుఁడభిప్రాయపడునుగాన యీ భగవదభిప్రాయమునుబట్టి 'మిత్రభావేన' అనఁబడెను. ఈ కారణమునుబట్టియే దేవికూడ రావణునితో శరణాగతినే తలఁచి 'తేనమైత్రీ భవతు తే యది జీవితుమిచ్ఛసి' అని దానిని మైత్రిరూపముగాఁ జెప్పినది. లేక (మిత్రభావేన) 'సుహృదం సర్వభూతానామ్' 'సర్వభూతములకు సుహృదుఁడు' అని నాయొక్క సహజసౌహార్దమును బురస్కరించుకొని వచ్చినవాఁడు. (సంప్రాప్తం) 'తస్యాశా లేశమాత్రేణ హ్రీరేషా హిమవాగులా' 'వానికి రవ్వంత యాశ కలిగినమాత్రనే నా కెక్కడలేని యాసిగ్గు కలుగుచున్నది' అన్నట్లు వానియొద్దకుఁ బోవుటయే నాకు ప్రాప్తమై యుండఁగా తానే ప్రాప్తించినప్పుడెట్లు విడుతునవనుట. (సంప్రాప్తం) 'సమ్యక్ ప్రాప్తం' పాదుకలు ద్వారమునఁబెట్టి దేవునియొక్క లోనికిఁ బోయినవానివలె—అనఁగా 'చేయునది విష్ణునేవ భక్తి చెప్పులమీఁద' అన్నట్లు మఱియొక్క చోట మనస్సును నుంపక 'పరిత్యక్తా మయాల ఙ్కా మిత్రాణిచ ధనానిచ' అని విరోధినివృత్తిపూర్వకముగా ఏకాగ్రమయినచిత్తముతో ప్రాప్తించినవాఁడనుట. (సంప్రాప్తం) 'మాతా పితా భ్రాతా నివాసశ్శరణం సుహృత్ । గతిర్నారాయణః' అను చొప్పున నాయందే సర్వవిధబంధుత్వము నర్పించవచ్చినవాఁడు. (సంప్రాప్తం) నాయంతరంగులగు ననుచరులయిన మిమ్ముఁ బురస్కరించుకొని వచ్చినవాఁడు, (సంప్రాప్తం) ప్రాప్తియే మాకు కావలసినది. స్తుతి అర్చనము ధ్యానము ప్రణామము మొదలగునవి గావు. (నను) అనుటచే మానసవాచికకాయికరూపముగు ప్రార్థన ప్రపత్తి చెప్పఁబడినది. నత్యజేయం) త్యజించుటకు శక్తుఁడనుగాను. సర్వశక్తుఁడనయ్యును 'శరణు' అన్నమాటవినఁగనే అంతమాత్రమున పరిత్యజించుటకు నాకు శక్తియుండుటలేదు యుతోఁపకున్నది. (సంప్రాప్తం నత్యజేయం) 'శరణాగతస్య మాతాయం న్యవసత్తైలేశ కృపణవత్సలో' అన్నట్లు రక్షాపేక్ష నెదురుచూచుచుండు నేను సంప్రాప్తుఁడయిన వానినెట్లు త్యజింతును. (నత్యజేయం) సంప్రాప్తుఁడయిన యీ విభీషణునితోడి సంబంధము గలవాఁడగుటంబట్టి రావణునిఁగూడ విషయీకరింపవలయునని కోరుచుంటి నేను ఆవిభీషణునినే యెట్లు త్యజింతును. కావుననే ఘంటాకర్ణునివలని పక్షపాతమున నాతనితమ్ముఁడయినట్టివానికిని ముక్తినొసంగెను. కావుననే మాలాకారునివలన పక్షపాతముచే 'నీ సంతతియందుఁ బుట్టువారికి దీర్ఘాయువుగలుగు'నని చెప్పినాఁడు. 'వానిని పరిగ్రహించినచో నీకు సత్తగలుగనందువేని వానిని పరిగ్రహించనచో మాకు సత్త గలుగకపోవునేని యేమి చేయుదువు' అనఁగా (కథంచన) ఏనిటిలేమయినను వానిని విడువననుట, (దోషో యద్యపి తస్యస్యాత్) దోషములను భోగ్యములుగాఁ గొను వాత్సల్యమే స్వరూపముగానుండు నాకు ఆశ్రితులదోషము లుపాదేయములేకదా. సుకుమారుఁడగు రాజకుమారునకు సుగంధమూలమందలి మృత్తయొక్క లేశమువలె వీనిదోషములు భోగ్యములే. (దోషో యద్యపిస్యాత్) దోషములున్నను శరణాగతుఁడయినవానికి దోషములుగా నేరవు. 'యథైషీకాతూలమగ్నౌప్రోతం ప్రదూయేతైవం హాస్యసర్వే పాప్మానః ప్రదూయన్తే' అన్నట్లు దోషమే వాని కంటదనుట. లేక (దోషో యద్యపి తస్య) వానికి దోషము లుండెనేని, ఆదోషములు వానిని సంబంధించినవిగదా- కాఁబట్టి యవి వానికంటెను శ్లాఘ్యమైనవి. (స్యాత్) ప్రార్థనయందు లిఙ్. అట్టిదోషములనే మేము ప్రార్థించునదిగదా. నిర్దోషుని రక్షించుటలో గుణములేదు. శరణాగతుని దుష్టుఁడయినను రక్షించినచో నా శరణాగతరక్షణ బిరుదమునకు మెఱుఁగుపెట్టినట్లగును. కరుణచే దుష్టపరిగ్రహము చేసినచో శిష్టగర్హ కలుగునే యనఁగా, (సతామేత దగర్హితమ్) దుష్టుఁడయిన శరణాగతుని పరి

అంత వానరోత్తముఁడగు సుగ్రీవుఁడు రాముఁడు చెప్పిన యవ్వాక్యమును అనువదించి చక్కఁగా విమర్శించి నీతిశాస్త్రరహస్యమూలమైనదియు స్వామియందలి ప్రేమాతిశయమునుచేఁ బ్రయుక్తమైనదియు నగుటంబట్టి మిక్కిలియు శుభంబగునవాక్యమున రామునుంజూచి * 'దోషములు మిక్కిలిగలవాఁడైననుగానీ, దోషములే లేనివాఁడయిననుగానీ, యీరాక్షసుఁడు మనకేల? వీనివలన మనకుఁ బ్రయోజనమేమి? తనయన్నకు లంక కాలి పుత్రులు హతులై పగవా రవ్వలిగట్టున నెత్తివచ్చియుండఁగా నిట్టి

గ్రహించుట అస్థానభయశంకితులగువారికి నిందితముగాఁ దోఁచినను పరమార్థదృష్టిగల కపోతాదులంబోలు సత్పురుషులకు నిందితముగాదు, పూజితమే యనిభావము. లేక దుష్టజనపరిగ్రహము శిష్టగర్హితమగుటచే శాస్త్రనిందితమగుటవలన అయుక్తమని శంకరాఁగా ఇది సరియే. దుష్టజనులను త్యజింపవలయు ననుట సామాన్యముగాఁ జెప్పనది. 'తిష్ఠన్నపివధ్యం ప్రపన్నం న ప్రతిప్రయచ్ఛేత్' ఇత్యాది విశేషశాస్త్రముండుటవలన దుష్టుఁడయినను శరణుఁజొచ్చినవానిని రక్షించుటచే శిష్టగర్హణగలుగదు. శ్రేయస్సే కలుగునని భావము. (సతాం) సామాన్యవిశేషశాస్త్రవేత్తలగువారికి, (అగర్హితమ్) గర్హితముగాదు. పూజనీయమనియర్థము. ఇందు సర్వశక్తుఁడగువానికి కొంచెము అశక్తియు సర్వజ్ఞుఁడగువానికి కొంత యజ్ఞానమును 'మిత్రభావేన' అనుశ్లోకముచే తెలియవచ్చెనని గోవిందయతులానతిచ్చిరి.

* ఇందులకు 'సుదుష్టోవా ప్యదుష్టోవా కిమేష రజనీచరః । ఈదృశం వ్యసనం ప్రాప్తం భ్రాతరం యః పరిత్యజేత్ । కో నామ సభవే త్తస్య యమేష నపరిత్యజేత్ ॥' అనిమూలము. విశేషార్థము:—(సుదుష్టో వా ప్యదుష్టోవా) గుణముల విషయమునందుఁగదా ఉభయులము అభిప్రాయభేదము గలిగి యున్నారము. 'సర్వజాతిక్రూరో' అన్నట్లు క్రూరజాతియగు రాక్షసుఁడనుట ఉభయులకు నంగీకరింపఁదగినదియే కదా. (కిమేష రజనీచరః) ఈరాక్షసునిచే మనకుఁ బ్రయోజనమేమి? వీఁడు రాక్షసుఁడయినను 'కిమేషః' అనఁగునా? తన నికృష్టమునున్నదుకొని శరణుఁజొచ్చినవాఁడు మనకు సహాకారి గావచ్చును. అని రాముఁడు చెప్పఁగా (ఈదృశమ్) రాజగుటచే సర్వైశ్వర్యసంపత్తిగలవాఁడును, (వ్యసనం ప్రాప్తమ్) లంకాదహనము బంధువధము మొదలగువ్యసనములను బొందినవాఁడును, లేక 'ఈదృశమ్' అనుట వ్యసనశబ్దమునకు విశేషణముగా గ్రహించినచో తల్లిదండ్రులకును బరిత్యజింపఁదగినవారై వధార్హులైయుండువారికి ఎవనినీడలో నొదిఁగి యుండఁదగునో యట్టినీవే బెట్టులివలెకిఁక పయినెత్తి సముద్రతీరమున విడిసియున్నవే. ఇట్టి మహావ్యసనమును ప్రాప్తించినవాఁడనుట. (భ్రాతరమ్) వ్యసనము లేకుండినను గాని తనకు విడువఁగూడని సంబంధముగలవాఁడును అగు రావణుని, (యః పరిత్యజేత్) ఎవఁడు సహాసముగా విడిచివాఁడో, సంపత్తి, వ్యసనము, బంధుత్వము అను వానిలో ఒక్కొక్కటియున్నను విడువరాదనుటకు హేతువై యుండఁగా అన్నియు నున్నవానిని విడిచినట్టివానిచే మనకుఁ బ్రయోజనమేమి? యనిపూర్వముతో నన్వయము. 'అట్టివానితో సంబంధమువీడునట్లు మనప్రక్కఁజేరినవాఁడు మనకు సహాకారి కాఁగూడదా' యనఁగా చెప్పుచున్నాఁడు. (కో నామ సభవేత్ యమేష విభీషణో నపరిత్యజేత్) ఈవిభీషణునికి విడువరానివాఁడు కెవ్వఁడు? ఎవ్వఁడునులేఁడు. వీఁ డందఱిని విడుమనే యనుట. పూర్వోక్తములయిన సంపత్తి వ్యసనము బంధుత్వము అనువానిలో ఒక్కొక్కటిగలవారు ముగ్గురు. రెండేసిగలవారు ముగ్గురు. మూఁడునుగలవాఁడు ఒక్కఁడు. ఇట్లు మొత్తమునకు ఏడుగురున్నారు. అందు మూఁడునుగల రావణుని విడిచినవీనికి విడువరానట్టి యేనిమిదవవాఁడు లేనందున విడువఁగూడనివాఁడు మొదటనే లేదనిభావము.

వ్యసనము కలిగినపుడు, ఎవఁడు పరిత్యజించునో యట్టివానికి పరిత్యజింపరానివాఁడెవ్వఁడు? అట్టియన్నను పరిత్యజించినట్టివాఁడు అందఱిని బరిత్యజించునే.! కాన వీఁడు కృతఘ్నుఁడే' యనెను. సత్యపరాక్రముఁడగు కాకుత్స్థకులుఁడు రాముఁడు వానరనాథుండగు సుగ్రీవుఁడు చెప్పినవాక్యమునువిని అందఱినినిజూచి 'నాపరమశక్తియగు నాశ్రితరక్షణవ్రతమిది యనియెఱుంగక యేమోవదరుచున్నాఁడ'ని యొకింతచిఱునవ్వునవ్వుచు రాజనీతిమర్యాదచొప్పుననే యుత్తరము చెప్పువాఁడై పుణ్యలక్షణుండగు *లక్ష్మణునితో 'వానరేశ్వరుఁడగు సుగ్రీవుఁడుచెప్పిన యిటువంటిమాట శాస్త్రములను జదువకయు పెద్దలనుసేవింపకయు నుండువానికిఁజెప్ప శక్యముగాదు. సకలశాస్త్రములను జదివి పెద్దలనుసేవించినవానికే చెప్ప శక్యమగును. † అన్నను విడిచి వీఁడు వచ్చినందులో నీతిశాస్త్రానుసారియై అతిసూక్ష్మమయిన రాజధర్మమొకటి యున్నదే కాని లేకపోలేదు. అది ప్రత్యక్షముగాఁ గనఁబడుచును లోకవ్యవహారసిద్ధమయ్యును న్నదియే. అది రాజులందఱియందును గలిగినదియె. నాకునుఁ దోఁచుచున్నదియేకాని వేఱుగాదు. అదియేదియనఁగా జ్ఞాతులును నిరుగుపొరుగు దేశపురాజులును వ్యసనములు ప్రాప్తించినపుడు పైఁబడి ప్రహరించువారుగాన పగవారుగానే వ్యవహరింపఁబడుదురు. ఈవిభీషణుఁడును వ్యసనమునఁ బ్రహరించునట్టి జ్ఞాతియగుటచే వ్యసన మిపుడు ప్రాప్తించియున్న రావణునిఁ గొట్టుటకై యిటవచ్చినాఁడు. లేక, యిట్టివ్యసనమున రావణుఁడు దన్నుఁ గొట్టునను భయమున వచ్చియుండును. ఎట్లుచూచినను మనకు పరిగ్రహింపవలసినవాఁడే. జ్ఞాతికులమునందుఁ బుట్టినవారై మహాత్ములెంత మాత్రమును గాకుండు రాజేంద్రులు తమకు హితపరులైనజ్ఞాతులను తప్పక గారవింతురు. అట్టిపుణ్యాత్ములగు రాజులకుఁగూడ, లోకము పాపభూయిష్ఠముగా నుండుటంబట్టి, మంచిగుణవంతుఁడయినజ్ఞాతినిగూడ బహుతరముగా శంకింపవలసివచ్చు

* ఇట 'లక్ష్మణుఁడ'ని చెప్పుటవలనను ఉపసంహారమున 'సహలక్ష్మణః' అని 'లక్ష్మణుఁడును దానును' అని చెప్పుటవలనను సుగ్రీవ లక్ష్మణు లిరువురునే యీవచనము చెప్పిరనియు వారిరువురినిగూర్చియె రాముఁడీయుత్తరమును జెప్పెననియు గ్రహింపనగు.

†ఇందులకు 'అతిసూక్ష్మతరం కిఞ్చిద్యదత్ర ప్రతిభాతి మే।ప్రత్యక్షం లౌకికం వాపి విద్యతే సర్వరాజసు) అని మూలము. విశేషార్థము:—(అతిసూక్ష్మతరమ్) సుగ్రీవునివాక్యము సూక్ష్మము. ఇది యీ సూక్ష్మతరము. దీనికిపయి సౌక్ష్మవాక్యము లేదనుట. (కించిత్) తనవాక్యము సుగ్రీవునివాక్యమునకంటె మేలయినదయ్యును తాను జెప్పినదిగావున 'కించిత్' అని లఘువుగాఁ జెప్పుచున్నాఁడు. (యదత్ర ప్రతిభాతి మే) విభీషణు విషయాకారమందు (ప్రత్యక్షమ్) సర్వప్రత్యక్ష సిద్ధమైనది-జ్ఞాతివధమనుట, (లౌకికం వాపి) ప్రత్యక్షమైనదయ్యును జ్ఞాతివధము దోషము కాకపోవునా యనఁగా లోకమునం దెల్లవారికి నిది కలదే కదా. ఎక్కడ? యని యడిగినచో (విద్యతే సర్వరాజసు)సమస్తరాజులయందును ఇది జరుగుచున్నది.'సర్వ' అనుటచే సుగ్రీవునియందును జ్ఞాతివధమున్నది. వాలిని ప్రేమాంధ్యముచే నిప్పుడతఁడు మఱచినాఁడు. ఈ విభీషణునిరాకయందు సర్వరాజులందును ప్రత్యక్షముగాఁ గాఁపట్టుచున్న జ్ఞాతివధమను నర్థవిశేష మొకటికలదు. ఇది సుగ్రీవుఁడు నాచరించియున్నాఁడని భావము.

చున్నది. ఇఁక పాపియగురాజునకు నట్టిజ్ఞాతి శంకనీయుఁడని చెప్పనేల? కాన పాపియగు రావణుఁడు తన్నుగుఱించి శంకింపఁగా వానితో విరోధముగొనియే వచ్చినాఁడు. (రావణుని వీఁడు పరిత్యజించుటకు హేతువట్లుండఁగా నేను వీనిని బరిత్యజింపరామికి హేతువు వినుము.) శత్రుబలమగు విభీషణునిఁ జేకొనువిషయమై శత్రుబలమును వర్జింపవలయునని గొప్పదోషముఁ జెప్పితివే! ఆదోషములోనే వానిఁ జేకొనుటకు నీతిశాస్త్రము చొప్పున నొకహేతువుగలదు. దానిని నీమనస్సునకెక్కునట్లు చెప్పెద. వినుము. మనము వీనికులములోనివారము గాము గాన వీనిరాక్షసరాజ్యమున కర్హులము గాము. ఇట్లు దానిం గోరమిచే రావణునియందుఁబోలె వీనియందు మనకు పగవాఁడను శంకయుఁ గలుగనేరదు గాన వీఁడు మనల విడువఁడు. వీని కిరుగుపొరుగు రాజులమును గాము గాన వీఁడు సందు వెదకి మనలను బ్రహరింపఁడు. మఱియు * రాక్షసుఁడగు నీవిభీషణుఁడు రాజ్యకాంక్షచే వచ్చినవాఁడు గావున సందులకై మనచేత రావణునిం జంపింపనున్నాఁడుగానఁ దనయీకార్యము చెడుననుభయమునంబట్టియు మనకపకారము చేయఁడు. మూర్ఖులగు రాక్షసుల కింతయాలోచన మెక్కడిదందువా? రాక్షసులందును గొప్పపండితులు గలరు. కాన విభీషణుని పరిగ్రహించుట తగును. † అజ్ఞాతు

---

* రావణునకు రాజ్యభ్రంశము కలిగినయెడల వానికులమునందుఁ బుట్టినరాక్షసుఁడు వానిరాజ్యమున కాశపడవలయును గాని యిక్ష్వాకువంశమునందుఁ బుట్టిన మనకు వాఁడాశపడఁడుగదా. కనుక మనకు సాహాయ్యముగ నుండి శత్రువులమీఁద తనప్రతాపమును జూపి వారి నోడించి రాజ్యము గయికొన వచ్చుచున్నాఁడు. అని తనిశ్లోకము.

† ఇందులకు 'అన్యోన్యాశ్చ ప్రదుష్టాస్తే నభవిష్యన్తి సఙ్గతాః। ప్రణాదశ్చ మహానేష తతోఽస్య భయమాగతమ్। ఇతి భేదం గమిష్యన్తి తస్మాద్గ్రాహ్యో విభీషణః' అని మూలము. 'ప్రదుష్టాః' అనుటకు 'ప్రహృష్టాః' అని గోవిందరాజులపాఠము. (ప్రదుష్టాస్తే) మిక్కిలి దుష్టులైనవారు, త్రికరణములను వేఱుపడి యుండునట్టివారనుట, (అన్యోన్యాశ్చ నభవన్తి) పదటము లేకయుండరు. మనవారో కొందఱు 'చంపుడు' అనిరి. కొందఱు 'విచారింపుఁడు' అనిరి. అంతేకాని పదరినవారు గారనుట. (సంగతాశ్చ నభవిష్యన్తి) వారు కలసిమెలసియు నుండరు-మనవారో విభీషణుఁడు 'సుగ్రీవం తాంశ్చ సంప్రేక్ష్య' 'సుగ్రీవుని వారిని జూచి' యనునప్పుడును 'నివేదయత మామ్' 'నన్ను రామునకుఁ దెలుపుఁడు' అన్నపుడును ఒక్కమొగమై యుండిరి. ఇట్లు దుష్టులు పదరికయు కలసియు నుండరుగాన రావణ విభీషణులు పదటమువలనను కలయిక లేమివలనను వేఱుపడఁగూడునని భావము. (ప్రణాదశ్చ) 'ప్రణాదస్తు శబ్దస్స్యాదనురాగజః' అన్న యమరోక్తి చొప్పున వీనిధ్వని నాయందలి యనురాగాతిశయమును సూచించుచున్నది. (మహానేషః) వీనిధ్వని విన్నవారికి వీని యపేక్షితమును బూరింపక నిలుపోపఁజాలనియార్తి తోఁపించునట్టిది. (ఏషః) నేను మీకుపదేశింపవలయునా? మీరుగూడ వినలేదా. (తతోఽస్య భయమాగతమ్) 'వ్యసనేషు ప్రహర్తారః' అన్నట్లు రావణుఁడు మనలను జంపునని భయపడివచ్చినాఁడు. (ఇతి భేదం గమిష్యన్తి) ఇతి= ఈకారణమునుబట్టి, భేదం గమిష్యన్తి= కొందఱికి మఱికొందఱివలన భయముగలుగఁగా వారు వారినుండి వేఱుపడుదురు. (తస్మాత్ గ్రాహ్యో విభీషణః) కాఁబట్టి యట్లు అన్నను వేఱుపడిన విభీషణుఁడు పరిగ్రహింపఁ దగినవాఁడే.

లు ఎప్పటికిని పరస్పరము కలఁత లేక సంతుష్టులగుచునేయుందురుగాని యొకరితోనొకరు కలసిమాత్రముండరు. ఈకారణమునుబట్టి యవసరముకలిగినపుడు, పరస్పరము వేఱుపడుదురు. వీనికంఠధ్వనిఁజూడఁగా మిక్కిలి బెట్టిదముగా వినఁబడుచున్నది గాన బలీయుఁడగు రావణునివలన వీనికి భయముగలిగియున్నది. ఆభయమువలన ఆత్మరక్షణముగోరి మనయొద్దకు వచ్చినవాఁడగును గాన వీనిని బరిగ్రహించుటయేతగును. * 'దుష్టుఁడైనను జ్యేష్ఠునిని అనువర్తించుటయేకదా ధర్మము' అందువా? నాయనా? తోఁబుట్టువులందఱు భరతునివంటివారలుగారు. తండ్రికిఁ గొడుకులు నావంటివారును

---

* ఇందులకు 'నసర్వే భ్రాతరస్తాత భవన్తి భరతోపమాః। మద్విధా వా పితుః పుత్రాః సుహృదో వా భవద్విధాః' అనిమూలము. విశేషార్థము:-దుష్టుఁడైనను జ్యేష్ఠుని అనువర్తింపవలయునేకదా. యని యడుగఁగా ఈధర్మము సర్వత్ర గలుగదనుచున్నారు. (సర్వేభ్రాతరః భరతోపమానభవన్తి) తోఁబుట్టువులందఱును భరతునివంటివారు గారు. తనతల్లి కైకేయి రాజ్యశుల్కయగుటవలనను, కైకకు వరమొసంగి యుండుటవలనను తనతండ్రి రాజ్యమొసంగినను దానిని బరిత్యజించినవాఁడై వనమునకుఁబోయిన నన్ను వెంటఁబడి 'రాజ్యము నీదియే నీవే గయికొనుము నేను నీకు దాస్యముసేసెదను' అను చెప్పువాఁడు భరతునికంటె వేఱొకఁడుగలఁడా యనుట. ఇటువంటప్రసక్తి లక్ష్మణునికి లేనందున నతని నిట గ్రహింపలేదు. (మద్విధావా పితుః పుత్రాః) తండ్రికి నాయట్టిపుత్రులుగాని కలుగరు. ఇట రాముఁడు కలిగినది కలిగినట్టుగా యథార్థమును జెప్పుటచే ఆత్మప్రశంసాదోషములేదు. 'కృపావానవికత్థనః' అని డంబము చెప్పికొనకుండుట ధీరోదాత్తుని లక్షణమయినను దుష్యంతుఁడు 'సతాంహి సన్దేహపదేషు వస్తుషు। ప్రమాణమన్తఃకరణప్రవృత్తయః' 'సందేహాస్పదములయిన వస్తువుల విషయమున సజ్జనులయినవారికి తమమనోగతులే నిర్ణయముసేయు ప్రమాణము' అని తన్ను సజ్జనునిగాను తనమనోగతిని ప్రమాణముగాను జెప్పికొనుటయు హనుమంతుఁడు 'పన్నగాశన మాకాశే పతన్తం పక్షిసేవితే। వైనతేయ మహంశక్తః పరిగన్తుం సహస్రశః' అని తనగమనశక్తివర్ణించుకొనుటయు యథార్థోక్తి యగుటంబట్టి ప్రశంసాదోషము నొందరు. లేక (మద్విధా వా పితుః పుత్రాః) తండ్రిగలవారిలో నావంటివా రెవ్వరునులేరు. అఱువదివేలయేండ్లు రాజ్యముసేసి 'మహతాతపసా' అని పెనుతపముచేసి నన్నుఁగని నన్నుఁబాసినంతనే నిలువోపక లోకాంతరగతుఁ డయినటువంటి తండ్రిగలవాఁడు నేనుదప్ప మఱెవ్వఁడును లేఁడనుట. లేక రాజ్యమున కర్హుఁడనై తండ్రి తనయిచ్ఛచే నొసంగిన యౌవరాజ్యమునకు కైకవలన విఘ్నము కలుగఁగా అందులకు కలహింపక పితృవచనమునే పాటించి పెక్కుదినములు వనవాసము సేయ సమ్మతించి వచ్చిననావలె మఱి రాజపుత్రులుగలరా యనియు నర్థము. ఇట సుగ్రీవునికి తెలియఁబఱచు యథార్థోక్తి యగుటంజేసి యాత్మప్రశంసకాదు. (సుహృదోవా భవద్విధాః) స్నేహితులుగాని నీవంటివారు గలుగరు. నీ సౌహార్దమును సామాన్యముగా సుహృదులకుఁ గలుగునదిగాదు. వర్షాకాలము గడవఁగా నీవు వచ్చునట్లు చెప్పినగడువు కొంత యతిక్రమించినంతనే సైఁపక కుపితుఁడనై నేను 'త్వాంతు సత్యాదతిక్రాన్తం హనిష్యామి సబాన్ధవమ్' 'సత్యము నుల్లంఘించిన నిన్ను నీబంధువులతోఁ జంపెదను' అని కోపించి లక్ష్మణునిఁబంపఁగా వాఁడును చెప్పఁగూడనిమాటలెల్ల నిన్నాడినపుడును మాయెడల ప్రేమాతిశయమునే ప్రకటించినవాఁడు నీవంటి సుహృదుఁడు లేఁడనుట. ఇటువంటి పురుషులు లోకవ్యవహారమునం దరుదుగాన రావణుఁడు వీనిని వలుపంజాడఁగా వానినుండి వీఁడు వేఱుపడి వచ్చి యుండఁగూడుననిభావము.

గలుగరు. సుహృదులు నినుఁబోలినవారలుగాని కలుగఁజాలరు. ఇట్టిధర్మాత్ములు లోకమున నరుదుగాన రావణుఁడు తోఁబుట్టువనిచూడక వీనిని బీడింపఁజూడఁగా వానినుండి వేఱుపడియే వీఁడు రాఁగూడునుగాన పరిగ్రాహ్యుఁడే' అనిచెప్పెను. *రాముఁడిట్లు చెప్పఁగా మహాప్రాజ్ఞుండగుసుగ్రీవుఁడు, లక్ష్మణుఁడును దానును లేచి, ప్రణతుఁడై శరణాగతిపూర్వకముగ రామునితో † 'ఆరాక్షసుఁడు రావణునిచే రహస్యముగాఁ బంపఁబడినవాఁడని యెఱుంగుము. నీవు ఉచితకార్యము లాచరించువారలలో నుత్తముఁడవు. కాన నీకుఁ దెలియనిదిగాదు. వానిని నిగ్రహించుటయె యుక్తముగా నాకుఁ దోఁచుచున్నది. అనఘా! మహాబాహూ! ‡ఆరాక్షసుఁడు, కుటిలబుద్ధిచే రావ

* అంత సుగ్రీవుఁడు నీతిమూలమున విభీషణుఁడు త్యాజ్యుఁడని నిరూపింపఁజాలక విభీషణుని యెడల రామునకుఁగల పక్షపాతాతిశయమును జూచి వానిని పరిగ్రహించినయెడల వానిభావము తెలియకున్నందున వాఁడు రామున కెప్పు డేమి యనర్థము సేయునో యని ప్రేమపరవశుఁడై వ్యాకులుఁడై విభీషణుని శరణాగతి యొకటికంటెను తానును లక్ష్మణుఁడును జేయు శరణాగతులు రెండును ప్రబలముగాఁ దలఁచి లక్ష్మణునిగూడఁ జేర్చుకొని శరణాగతిపూర్వకద్వయముగా విభీషణుని నిగ్రహింపఁ బ్రార్థించుచున్నాఁడు. ఇందులకు మూలము. 'ఏవముక్తస్తు రామేణ సుగ్రీవస్సహలక్ష్మణః। ఉత్థాయేదం మహాప్రాజ్ఞః ప్రణతో వాక్యమబ్రవీత్' అనిమూలము. (రామేణ ఏవముక్తః సుగ్రీవస్తు) ఇట తుకారము వైలక్షణ్యమును జెప్పునదిగాన రాముఁడు తమతో ఆనుకూల్యము చెప్పటంబట్టి అతఁడు పోయినదారికే పోవుట ప్రాప్తమైయుండఁగా మఱియు నతనికి వేఱుపడి యతనిని తనదారికే తెచ్చుటకు ప్రయత్నపడు భేదమును సూచించుచున్నది. (సహలక్ష్మణః) లక్ష్మణునితోఁగూడ- తనకంటెను ఆప్తతముఁడని లక్ష్మణుని 'లక్ష్మణస్యాగ్రతః' అని మొదటనే కూర్చుకొన్నట్లు ఇప్పుడును ప్రపత్తికి నతనిని గూర్చుకొన్నాఁడు. (ప్రణతః) శత్రువుచేసినప్రపత్తియే ప్రపత్తియా? అనుకూలురుచేయు ప్రపత్తికిని మనసు కరఁగవలదా? అని విభీషణుని యొకప్రపత్తికి అపవాదముగా రెండుప్రపత్తులు చేసినాఁడనుట. (మహాప్రాజ్ఞః) తనకు బదులుచెప్పశక్యముగాని స్థితియందును రాముఁడు శరణాగతిసాధ్యుఁడు అనుజ్ఞానము గలవాఁడు. (ఉత్థాయ ప్రణతః ఇదంవాక్యమబ్రవీత్) రాముఁడు తానేవచ్చి నీవు చెప్పినది చేసెదను అని చేతులార తనశిథిలావయవములనివిరి లెన్ను లేవనెత్తునంత జాలిపుట్టునట్లుగా ప్రణతుఁడై యీవార్తను జెప్పినాఁడనుట.

† ఇట్లు సుగ్రీవుఁడు ప్రపన్నుఁడై ప్రపన్నులవాక్యమును రాముఁడు వినునవధరించునని 'రావణేన ప్రణిహితమ్' అని ముందు విన్నవించినదానినే మరల విన్నవించుకొనుచున్నాఁడు. 'రావణేన ప్రణిహితం తమవేహి నిశాచరమ్। తస్యాహం నిగ్రహంమన్యే క్షమంక్షమవతాంవర' అని మూలము. మునుపు చెప్పినదే మరలఁజెప్పటకుఁ బ్రయోజన మేమనఁగా విభీషణుఁడు శరణుఅన్నమాటచే అపహృతచిత్తుఁడై యుండినప్పుడు నే నామాట చెప్పితినిగాన యది మనస్సునఁ దగిలియుండదు. విభీషణునివలెనే నేనును శరణుఁజొరఁగా పిదప తెలిసియే నామాటను వినునని మునుపుచెప్పినదే మరల మనసునఁదగులఁ జెప్పుట. (నిశాచరమ్) దొంగలవలె నడిరాత్రిలో బయలుదేఱి పరహింస సేయుచుఁ దిరుగుజన్మమని వీనిస్వభావమును మనస్సునఁ దగులనందుననేకదా వీనిని మనకు సహకారి యని చెప్పినట్లయ్యె ననుట. కావుననే (నిశాచరమ్) రాత్రిందిరుగు రాక్షసుఁడన్నాఁడు.

‡ ఇందులకు 'రాక్షసోజిహ్మయాబుద్ధ్యా సన్దిష్టోఽయమిహాగతః। ప్రహర్తుం త్వయి విశ్వస్తే ప్రచ్ఛన్నో మయి వానఘ। లక్ష్మణేవామహాబాహో సవధ్యస్సచివైస్సహ' అనిమూలము. ఇట 'సవధ్యస్సచివై

ణుఁడు పంపిపుచ్చఁగా నిటవచ్చి తనకలరూపు గప్పిపుచ్చుకొని మనకు నమ్మికగలిగించి యాననుకముచే నేమఱియుండఁగానిన్నో, లేక నన్నో, మఱి లక్ష్మణునినో, ప్రహరించుటకున్నాఁడు. కాన మనము మంత్రులతోఁగూడ, అట్లు వధమునకు పాలు గావలసి వచ్చును. ఏలన వీఁడు క్రూరుండగు రావణునితమ్ముఁడుగదా! ఎట్లు నమ్మవచ్చును!' అనెను. * మాటలపొం దెఱింగినవానర సేనాపతి సుగ్రీవుఁడు రఘుకులతిలకుండును వాక్యకుశలుండునగు రామున కిట్లు చెప్పి యంత ప్రణయరోషమున మాటాడక యూరకుండెను. † రాముండును సుగ్రీవుఁడు చెప్పిన యాపలుకువిని యందులకు పరిహారమేమియని విమర్శించి యంతకంటెను శుభంబగు వాక్యంబున వానరోత్తము

స్సహ' అనిమూలము. ఇట 'సవధస్సచివైస్సహ' అని గోవిందరాజాదులపాఠము. విశేషార్థము:— (అయంరాక్షసః జిహ్మయాబుద్ధ్యాసన్దిష్టః ప్రచ్ఛన్నః ఇహ ఆగతః) ఈరాక్షసుఁడు కుటిలబుద్ధిలో రావణునిచే పంపఁబడి ప్రచ్ఛన్నుఁడై యిటవచ్చినాఁడు. నీచజాతియగువీఁడు స్వజాతికి కార్యము చేయునే కాని ధార్మికులగు మనకు కార్యము చేయఁడుసుమీ. (ప్రహర్తుంత్వాయివిశ్వస్తే) నీవునమ్మినట్లు వీఁడుసహకారికాఁడు. అట్లుకాకపోవుటమాత్రమే కాక నిన్ను బాధలును పెట్టును. 'దోషోయద్యపితస్యస్యాత్' అని వానియందు దోషములున్నను మాకు సమ్మతమే యన్నట్టివాఁడుగనుక నట్లు చెప్పుటను పరిహరించుటకై (మయిన) 'నన్నునుగొట్టును' అన్నాఁడు. 'త్వయికిఞ్చిత్సమాపన్నే కింకార్యం సీతయామమ' 'నీకుఁ గొంతవిపత్తుగలిగెనేని సీతతో నాకుఁబనేమి' యనియు 'సుహృదోవాభవద్విధాః' 'నినుబోఁటిసుహృదులు గాని గలుగరు' అనియు నీవు తలఁచియున్న నావిషయమందుఁగూడ బాధపెట్టునుసుమీ వీఁడు. (లక్ష్మణేవా) 'ముహూర్తమపి జీవామః' 'లక్ష్మణునివిడిచి ముహూర్తముగూడ బ్రతుకము' అని నీవు చెప్పిన లక్ష్మణునిఁగూడ బాధపెట్టును. శరణాగతరక్షణమనెడి యొకనెపమున ఒకరాక్షసునికిఁగాను మమ్మిరువురను నీవు పోఁగొట్టుకొనుటకుఁగదా పూనుచున్నావు. ఇట సుగ్రీవుండు 'మయి' 'లక్ష్మణే' అని తనకును లక్ష్మణునకును అనర్థములు రాఁగూడునని చెప్పుట రామునకు స్వవ్యసనముకంటె స్వాశ్రితులవ్యసనము మఱింత మర్మముల నొప్పించునని తలఁచి దానిని జెప్పి విభీషణుని సంగ్రహించుటను సమర్థించుటకై యని తెలియునది. (అనఘ) ఈసెబ్బరలు నీకు రాకుండుఁగాక. (మహాబాహో) నీబాహువుల నీడనున్నమమ్ము పగవానిచేతికి పట్టియియ్యవచ్చునా-మాయెడల దయయు వానియెడల బాహుబలమును జూపుటగదా యుక్తము. కాఁబట్టి (సః సచివైస్సహవధ్యః) వానిని సపరికరముగా వధింపవలయును.

* ఇందులకు 'ఏవముక్త్వా రఘుశ్రేష్ఠం సుగ్రీవో వాహినీపతిః। వాక్యజ్ఞోవాక్యకుశలం తతోమౌనముపాగమత్' అనిమూలము. విశేషార్థము.—(రఘుశ్రేష్ఠమ్) శరణాగతునకై తన్నువాళముసేసికొనఁజూచిన రఘువుయొక్క కులమువారికిని పొగడఁదగినవాఁడన్నట్లు శరణాగతసంరక్షణమునందు ప్రశస్తుఁడైనవాఁడు రాముఁడు. (సుగ్రీవోవాహినీపతిః)తానుపోయినదారి ననుసరించు పరికరముగలవాఁడు సుగ్రీవుఁడు. (వాక్యజ్ఞః) సమస్తవచనవ్యక్తులయొక్క గుణదోషములను డెలియువాఁడగు సుగ్రీవుఁడు, (వాక్యకుశలమ్) ఎదిరివారియభిప్రాయము మున్నిడుకొని మాటాడనేర్చురామునితో, (ఏవముక్త్వా తతోమౌనముపాగమత్) తనయాధిక్యమును తెలియనివానికి మనముచెప్పున దేమిగలదు. అని ప్రణయరోషమువలన మాటాడకుండెననుట.

† పిదప రాముఁడు నిదానజ్ఞుఁడుగావున సుగ్రీవుఁడు తన్నిట్లు నిర్బంధించుటకు హేతువిదియని మనస్సులో నిరూపించి తెలిసికొని దానికనురూపముగా నొకవార్తఁ జెప్పుచున్నాఁడు. ఇందులకు మూ

నితో * 'ఈరాక్షసుఁడు మిగుల దుష్టుఁడైనంగానీ దుష్టుఁడు గాకయేపోనీ ! వీఁడేమి చేయఁగలఁడు ? నాకును నాయాశ్రితులకును నాసంబంధిసంబంధులకును వీఁడహితము రవ్వంతఁగాని యేవిధమున నేనియుం జేయ శక్తుఁడుగాఁడు. † వానరగ

---

లము. 'సుగ్రీవస్యతు తద్వాక్యం రామశ్శ్రుత్వా విమృశ్యచ । తతశ్శుభతరం వాక్య మువాచ హరిపుఙ్గవమ్' విశేషార్థము:—(రామస్తు) రాముఁడు (సుగ్రీవస్య తద్వాక్యమ్ (శ్రుత్వా) సుగ్రీవుఁడు ప్రేమాంధుఁడై హృదయమెఱుంగక చెప్పినయామాటను విని; (విమృశ్యచ) ప్రేమాంధుఁడైనవానికి పరిహారమేది యని విచారముసేసి, (తతః) సుగ్రీవుఁ డిఁక రామునకు తన్నుగుఱించి చెప్పుటను వార్తకలుగదని నిశ్చయించుకొన్నపిదప, (శుభతరమ్) ప్రేమాంధ్యమటుచెల్లుచుండఁగా తనతో మాటాడునట్టి కలఁకయెల్లను దీఱి తన్ను అనువర్తించునట్లు చేయఁజాలుమాటను, (హరిపుఙ్గవమ్) సుగ్రీవునింగూర్చి-రాజయ్యును నీతికిలోనై ప్రేమాంధుఁడయ్యు నుండుటంబట్టి హరిపుంగవుఁడని ఋషి కొనియాడుచున్నాఁడు (ఉవాచ) చెప్పెను.

* సుగ్రీవుఁడు విభీషణుఁడు క్రూరజాతియగు రాక్షసుఁడుగాన జాతిక్రౌర్యముచే రామునకేమి యనర్థముగలిగించునో యని భయపడఁగా రాముఁడు తనసర్వశక్తిని తెలిపి యట్లు భయపడ నక్కఱలేదని చెప్పుచున్నాఁడు. 'సుదుష్టోవాప్యదుష్టోవా కిమేషరజనీచరః । సూక్ష్మ మప్యహితం కర్తుం మమాశక్తః కథంచన' అని మూలము. (సుదుష్టోవాప్యదుష్టోవా) మీరు చెప్పినట్లు దుష్టుఁడైనఁగానీ నేను చెప్పినట్లు అదుష్టుఁడైననుగానీ ఈ రెంటివలనను ప్రయోజనములేదు. ఏలనఁగా శరణాగతుని విషయమున మీ రెన్నివిధముల దోషములుచెప్పినను దుష్టుఁడని నామనస్సునకుఁ దగులదు. మీకు నే నెన్నివిధముల వాఁడు నిర్దోషియని హేతువులెత్తి బోధించినను అస్థానభయశంకులగు మీకు అదుష్టుఁడని బుద్ధికిఁదగులదు. (కిమేషరజనీచరః) మీరు తలఁచినట్లు వీఁడు బాధకుఁడే యగుఁగాక. ఈయొకరాక్షసునికే భీతులయిన మీరు రావణునిఁ జంపుటకై దండెత్తుట యెట్లు ? పంచకులయినవారు దుర్బలులని యుపేక్షింపవచ్చునా యందురేని (మమసూక్ష్మమప్యహితం కర్తుమశక్తః) నాకు అతిసూక్ష్మమైన యపకారమును జేయుటకును వీనికి శక్తిలేదు. 'బాహుచ్ఛాయామవష్టబ్ధో యస్యలోకో మహాత్మనః' అని చూచువారు కవనములు పాడునాబాహువులను జూడఁగా మనస్సుచేతఁగాని యహితముసేయ వీఁడు శక్తుఁడుగాఁడు. నీవు వీనిని యనుకూలునిగా నమ్మి యేమఱియుండునపుడు వీఁడు నిన్ను బాధింపశక్తుఁడుగాఁడా యనఁగా (కథంచన) ఎట్లును శక్తుఁడుగాఁడు—పులియుండుగుహనుంబోలె నాబాహుబలమును జూచి వాఁడెప్పుడును అట్లు చేయఁడు.

† ఈ రాక్షసజాతి క్రూరమనితలఁచి భయపడుదునా? ఈ జాతియే కాదు లోకమున క్రూరజాతియని పేరుగలవానినెల్ల అనాయాసము నొక్కపెట్టనడఁపఁజాలుదుంజుఁడీ! యని తనవీర్యమును తెలుపుచున్నాఁడు. 'పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం యేచరాక్షసాః । అంగుల్యగ్రేణ తాన్ హన్యామిచ్ఛన్ హరిగణేశ్వర' అని మూలము. విశేషార్థము.-(పిశాచాన్ దానవాన్ యక్షాన్) 'దొంగలు బోయలు ఎఱుకలు' అన్నట్లు పిశాచాదులు హింసకజాతిలోని యవాంతరభేదములు. ఈ దుష్టవర్గములు పరస్పరముగల పగమఱచి మనల పీడించుటకై యొక్కటిగాఁ జేరివచ్చినను అనుట. (పృథివ్యాంయేచరాక్షసాః) లంకలోనుండు రాక్షసులేకాదు పంచాశత్కోటివిస్తీర్ణమయిన భూమియందుఁగల రాక్షసజాతియంతయు పూర్వోక్తులయిన పిశాచాదులతో నేకకంఠులై చేరివచ్చినను, (అఙ్గుల్యగ్రేణ తాన్ హన్యామ్) వీరల నొక్కపెట్టఁ జంపుటకు మనబలమెల్ల వలదు. అస్త్రమువలదు. శస్త్రమువలదు. మఱి రెం

ణపతీ! ఈరాక్షసజాతి యొకటియేకాదు. క్రూరజాతు లనఁబడుపిశాచులును దానవులును యక్షులును మఱి లంకలోనిరాక్షసులేకాక భూతలమందలి సమస్తరాక్షసులును ఒక్కటిగాఁగూడి పయినెత్తివచ్చినను, నాకిచ్ఛపుట్టెనా! వీరినం దఱిని, ఆయుధాదు లక్కఱలేక వ్రేలికొనతో అనాయాసముగఁ జంపివైతునుజుమీ. *మునుపు ధర్మాధికారములేనట్టి తిర్యక్కగు పావురము తా నొక్కటి, తన పగవాఁ

---

డవ్రేలియనలదు. ఒకవ్రేలేచాలును. ఆ ఒకవ్రేలంతయుఁగలదు దానియం దొకానొకభాగమగు కొనమాత్రము చాలు. ఒక యాయుధముచేఁ జంపనర్హముగాని క్రిమికీటాదులను వ్రేలికొనతో రాచినట్లు రాచివైతునట. అంతేకావాఁడనేని నానరకవానికొఱకు నాపనివలయునేమి? అన్నచో (ఇచ్ఛన్) ఇచ్ఛయుండినఁ జేయుదును. ఇచ్ఛలేకుండినఁ జేయలేనుగాని శక్తిలేకుండుటగాదు. అయితే మనకు ప్రాణహానియయినచోట బాధపెట్టిన వానినిఁ జంపుట కిచ్ఛలేకుండ నేల? యన్నచో విభీషణుని నీ వాఁడును ఈసుగ్రీవునితో నీ తలవాంఛ కొఱకుఁజొచ్చె నని స్వార్థముగాఁ జంపుటయేల యని తలంచి చంప నిచ్ఛగింపలేను. (ఇచ్ఛన్) జంపుటకు వ్రేలికొనయుండినఁ జాలును. నాసంకల్పముచేతనే నాశముసేయఁజాలుదును. అని సుగ్రీవునిభయమును నివర్తించుటకై రామయాత్మసామర్థ్యమును విశదీకరించుచున్నాఁడనియు గ్రాహ్యము. (హరీశ్వర) నేను శక్తుఁడనగా నాయందుల పనికిరుఁడనుగా నీవు పరీక్షించుచున్నాఁడవా? లేదా. క్షేమాంక్షముచేత నాబలమెఱుఁగకపోయిన నీబలము నాకుఁ దెలియఁబోవలెయునా? యనుట.

*ఇట్లు నాబలమును ప్రకటించి దానివలన సుగ్రీవుఁడు మనసు తిరిగి సూక్ష్మబుద్ధియుక్తమునొందిన యుపసరముఁజూచి, 'నేను బలహీనుఁడనే కాని, వాఁడు బాధకుఁడే కాని, వానియుపకారముచే నాప్రాణముపోయినే, అప్పటికిని నాతని నిగ్రహింపరాదు; పరిగ్రహించినయే తీఱవలయును' అని 'యిందులకుఁ బ్రమాణముగా నాత్రిప్రమలనుష్ఠించిన యొకయితిహాసమును జెప్పెద వినుమ'ని కపోతాఖ్యానమును జెప్పుచున్నాఁడు. 'శ్రూయతే హి కపోతేన శత్రుః శరణమాగతః । అర్చితశ్చ యథాన్యాయం స్వైశ్చ మాంసైర్నిమన్త్రితః ॥' అని మూలము. విశేషార్థము.— (శ్రూయతే) 'స్మర్యతే' అనక 'శ్రూయతే' అనుట శ్రుతివాక్యప్రసిద్ధమైనదని తెలుపుటకు. ఇట్టి వ్యవహారమును నిర్దేశించుటచే సంప్రదాయవిచ్ఛేదము లేక వచ్చినదిగా తెలుపుటకు, (శ్రూయతే) శ్రవణముచేయుటకే శక్యముగాని అనుష్ఠింప శక్యము గానిది (హి)ఇక్ష్వాకురాజ్యమునందుఁబోలె వానరరాజ్యమునందును ఇది ప్రసిద్ధముకాదా యేమి? (కపోతేన) శాస్త్రాధికారులుగా విశక్తులగు మనము మాకునా కాదా యని విచారము సేయుచున్నాము. శాస్త్రాధికారములేని యొంటితిర్యక్కగు పావురము విచారము సేయక యిది యనుష్ఠించినది. ఇట్టిదే యనుష్ఠింపఁగా ఇఁక మనకుఁజెప్ప నేల? (కపోతేన) అనియొక్కటి యసహాయమైనది యిట్లు చేసినది. ససహాయులమైన మనము చేయవలయునని చెప్ప నేల? (కపోతేన) ఈ యేకవచనమువలన, స్వారస్యమేమన- ఈకపోతము తానొంటరియై శత్రువును నిషేధించుటకు మనవలె సహకరము లేకుండుటవలనను తన యభిమానముఁజేరిన పెంటిపక్షి సన్నిహితమైయుండి ప్రేరేపించుటచేతను శరణాగతరక్షణము దానికి సిద్ధించినదని సూచితము.(శత్రుః)పావురమునకు బోయవాఁడు సాక్షాచ్ఛత్రువు అయినను అది విచారము సేయదయ్యె. విభీషణుఁడు మనకు సాక్షాచ్ఛత్రువుగాక శత్రువును సంబంధించినవాఁడుమాత్రమేయయినను విచారము సేయుచున్నాము. సాక్షాచ్ఛత్రువునే ఒకతిర్యక్కు రక్షింపఁగా శత్రుసంబంధిమాత్రుని మనబోంట్లు రక్షింపనియెడల మనపౌరుష మెందులకు? ఇట్టి మనపౌరుషమునకన్న దానితిర్యక్త్వమే మేలు. (శరణమాగతః) 'శరణంగృహరక్షిత్రోః' అన్నట్లు శరణమనఁగా గృహము-లేక వాసస్థలము.అబోయవాఁ

ఆపావురమువంటిది, తనభార్యనుజంపినయాబోయ తనయొద్దకురాఁగానే ప్రతిగ్రహించెనుగదా? ఇఁక ననుబోఁటివాఁ డేమిచేయవలయునో చెప్పనేల? * కణ్వమహర్షి పు

క్షణము జేయవలయునట్లు పరిగ్రహించినది. ఇట (భార్యాహర్తారం) అనుటవలన భార్య నపహరించిన శత్రువును బోయయుకూడ పావురమువంటిది పరిగ్రహించినదిగాన ఈశిష్టాచారమువలన ననుబోఁటికి భార్యాపహారియైన రావణుఁడువచ్చినను పరిగ్రహింపవలసియుండును జుఁడీ. అని రాముఁడు చెప్పినట్లయినది. (ఆగతం) పావురము బోయవాని నంగీకరించుటకై వాఁడనుష్ఠించిన యుపాయమంతయు అది వాసముచేయు వృక్షముకడకు వచ్చుటమాత్రమే. ఇదిగాక వృక్షదేవతనుగూర్చి 'శరణు' అన్నమాట కపోతము వినలేదు. ఇట 'సహి' అనుటచేతనే కపోతము గ్రహింపఁబడఁగా మరల 'కపోతః' అని చెప్పనేల? యన్నచో 'శ్యేనకపోతాఖ్యానమందువలె కపోతశరీరముదాల్చిన దేవుఁడుగాని మునిగాని యిదికాదు. పూర్వోక్తమైన ప్రాకృత కపోతమేయని తెలుపుటకని తెలియునది. ఈకపోతము పురాతనధర్మవిశేషములచే గజేంద్రాదులవలె తిర్యక్కయినను ధర్మానుష్ఠానమునకు యోగ్యమయ్యెను. 'కపోత' అనుటచే తిర్యక్కగుటయు, శాస్త్రానధికారిత్వమును బుద్ధిమాంద్యమును దెలియునది. (వానరశ్రేష్ఠ) వ్యాఘ్రవానరసంవాదమును వినవా. అందు కేవల వానరము శరణాగతుని రక్షించెను. వానరశ్రేష్ఠుఁడవగు నీవు స్వజాతిధర్మమగు శరణాగతరక్షణము నేలపూనవు. ఆసంవాదమునుబట్టిచూడఁగా నేను శరణాగతరక్షణము దప్పినను నీవు దిద్దవలసినవాఁడవైకదా యున్నావు. (కింపునర్మద్విధోజనః) తిర్యక్కుయొక్క యనుష్ఠాన మిట్లగు నేని, రఘువంశమునఁబుట్టిన ననుబోఁటికి నాకు మఱి యెంతచేయవలయును. (మద్విధః) శరణాగతరక్షణమునకై పడగయెత్తియున్న రఘువంశమునఁబుట్టి 'షష్టిర్వర్షసహస్రాణి లోకస్య చరతాహితమ్ । పాండురస్యాతపత్రస్య ఛాయాయాం జరితంమయా' అని యఱువదివేలసంవత్సరములు లోకరక్షణమందు దీక్షితుఁడై యుండిన దశరథునకు పుత్రుఁడనై, వసిష్ఠ విశ్వామిత్రాదులకు శిష్యుఁడనై, మహాయోగియగు జనకునితోడ సంబంధముచేసి, 'రామోవిగ్రహవాన్ ధర్మః' అని రూపొందిన ధర్మమే నేనుగాఁ బ్రసిద్ధిగాంచి 'మర్యాదానాంచ లోకస్య కర్తాకారయితాచసః' అని సర్వలోకములును అనుకరించుపట్టి ధర్మానుష్ఠానములు గలిగియున్నట్టి నేను, ఇప్పుడు శరణాగతుని హింసింతునేని లోకమెట్టిదగును. (మద్విధః) నావృత్తము వెనుకఁజెప్పెను. సామాన్యముగా 'ధర్మసేతుర్నృపాణామ్' అను మాబోఁటివారికి సమ్మతుఁడైనవాఁడు. (మద్విధః) నాబోఁటివాఁడు శరణాగతుని త్యజింపఁడు— అవధ్యులైనవారిని వధించు రావణాదులకుఁగదా నిట్టికార్యము సరిపడును. (జనః) శరణాగతుని త్యజించువానిజన్మ మెట్టిదగును? (కింపునర్మద్విధోజనః) 'దోషోయద్యపితస్యస్యాత్' అని దోషములున్నను శరణాగతుని త్యజింపరాదని నేనుచెప్పిన యతిశయము ఆతిర్యక్కు తీసికొనిపోయినది. ఇఁకమీఁద నదియే నేనుచేసినను ఆతిర్యక్కు చేసినదేచేసితి మింతేకాని మఱి యెచ్చులేదే యనిభావము.

* శాస్త్రమునం దధికారములేని తిర్యక్కుల యనుష్ఠానము ఉపాదేయముగాదు. ఆతిర్యక్కులు తమస్వభావమును బట్టిమాత్రము చేసినది ధర్మమగునా. శాస్త్రవిధి ననుసరించి చేసిననే ధర్మమగును. కాన శాస్త్రచోదనము దీనికేమి? యనఁగా కపోతానుష్ఠానమును బట్టియేకాక ఆప్తతముఁడగు కండుముని వాక్యమునుబట్టియు. చోదనము కలదని రూపించి శరణాగతరక్షణము కర్తవ్య మనుచున్నారు. ఇందులకు మూలము. 'ఋషేఃకణ్వస్యపుత్రేణ కణ్డునాపరమర్షిణా । శ్రుణుగాథాంపురాగీతాం ధర్మిష్ఠాం సత్యవాదినా' విశేషార్థము:— జ్ఞానహీనమయిన తిర్యక్కును జ్ఞానులందగ్రేసరుఁడైన ఋషియును శరణాగతరక్షణమునకు ప్రమాణముగా చెప్పుటంబట్టి శరణాగతరక్షణము చైతన్యము గలవస్తువునకెల్లఁ గలదియే.

త్రుఁడును బరమర్షియును సత్యవాదియునగు కండుముని పూర్వకాలమునందు శరణాగతిపరమధర్మబోధక మగునొకగాథను జెప్పియున్నాఁడు. దానింజెప్పెద వినుము. *'పరంతపా! చేతులు మొగిడ్చుకొని శరణువేఁడుచున్న శరణాగతుని 'క్రూరుఁ'డనితన

---

కాన ఆచైతన్యవస్తువునకు కపోతమువలె జ్ఞానసంకోచముండినను ఋషివలె జ్ఞానవికాస ముండినను ఒకటేగాని ఈ సంకోచవికాసములవలన ఎక్కువతక్కువలు గలుగవని చెప్పఁబడినదయ్యెను. (ఋషేఃకణ్వస్య) సకలవేదాన్తతాత్పర్యమయిన తత్త్వహితములను సాక్షాత్కరించినకణ్వమహర్షియొక్క, (పుత్రేణ కణ్డునా) 'సహోవాచవ్యాసఃపారాశర్యః' అని పరాశరపుత్రుఁడుగాన వ్యాసుఁడు ఆ తత్త్వము జెప్పినట్లు కణ్వపుత్రుఁడనుటచే కణ్డువునకు ఆ తత్త్వము చెప్పినాఁడు. (పరమర్షిణా) కణ్వునకు తపోబలమువలన వచ్చిన సాక్షాత్కారము. ఇతనికి అతనికడుపునఁ బుట్టుటవలె సర్వసాక్షాత్కారమునుబుట్టిన యతిశయమును జెప్పుట. (శృణు) మునుపు వినుచున్నవానినే 'వినుము' అన నేలయన్నచో తనపరత్వమును జూపినపుడు సుగ్రీవునకు జ్ఞానముపుట్టెనేకాని యదితప్ప విభీషణుని విషయీకరించువిషయమునఁ దాను చెప్పిన వచనజాలము అతనిమనసునఁ బగులముచే గజునకు 'గృహాణ గృహాణ' అని పలుమాఱు చెప్పినట్లు వినుమని చెప్పినాఁడని తెలియునది. (పురాగీతామ్) నీమనస్సునఁ దెలివికిఁగాను ఇప్పుడు కల్పించి చెప్పినదిగాదు. విలక్షణులనుష్ఠించుటకై పూర్వమే చెప్పఁబడినది. 'ఉక్తామ్' అనక 'గీతామ్' అనుట భగవద్గీతలవలె నిందుఁగల అతిగౌరవమునుబట్టి చెప్పఁబడినది. ఋక్కులే పూర్వముండునట్టివే యిప్పుడు సామములు గానము సేయఁబడుటంబట్టి గీతలనుట. దీనింబట్టి వేదములవలె నిదియు ననాదిసిద్ధమైనదనుట. (ధర్మిష్ఠాం గాథామ్) ధర్మములలో అసారము తీసివేసినధర్మము శరణాగతరక్షణమని చెప్పుటంబట్టి (ధర్మిష్ఠాం) అన్నాఁడు. (సత్యవాదినా) మోసపుచ్చుమాటలవాఁడుగాఁడు. యథార్థవాదియైనవాఁడు భూతహితవాది యైనవాఁడు చెప్పినదిది యనిభావము.

* ప్రపత్తి పూర్ణముగా సిద్ధింపకపోయినను వేఱుగతి లేనందున ఆత్మనిక్షేపాభిప్రాయమును సూచించు శరణాగతి శకలములగు చేమోడ్పు మొదలగునవిమాత్రము చేసినను హానిగాదు; అనుగ్రహమే కలిగించును. మఱియు శరణుఁజొచ్చినవాఁడు శత్రువయినను వానికి ముఖ్యమైన శరణాగతి లేకపోయినను, హింసింపఁగూడదని చెప్పుచున్నారు. ఇందులకు 'బద్ధాఞ్జలిపుటందీనం యాచన్తంశరణాగతమ్। నహన్యాదానృశంస్యార్థమపి శత్రుం పరన్తప' అనిమూలము. విశేషార్థము.-(బద్ధాంజలిపుటందీనం యాచన్తమ్) కాయికమైన యంజలిగాని, మానసికమైన ఆదరముగాని, వాచికమయిన ప్రార్థనముగాని, ఇందేదేనియొకటిగాని శరణాగతియని చెప్పవచ్చును. (శరణాగతం) గృహమునుగూర్చి వచ్చినవానిని, లేక— అంజలిమొదలయినవి అముఖ్యములు (శరణాగతమ్) అని అధ్యవసాయరూపమైన జ్ఞానవిశేషమే ముఖ్యమనిభావము. (శత్రుమపి నహన్యాత్) క్రిందఁజెప్పినట్లు అముఖ్యముగా శరణుఁజొరనీ. ముఖ్యముగా శరణుఁజొరనీ. శరణుఁజొచ్చినవాని నెట్లయినను రక్షింపవలసిన దింతేకాని వానియందు శత్రుత్వమున్నదేయని హింసింపరాదు. (ఆనృశంస్యార్థమ్) హింసింపకుండుట రక్షకుఁడని ప్రసిద్ధికొఱకా? పాపము పోవుటకా? పుణ్యము సిద్ధించుటకా? యనఁగా ఇన్నిటికినిగాదు. లోకులు క్రూరకర్ముఁడని కూపెట్టకుండుటకు. కేవలము శత్రువయినంగదా నీవు హింసింపవలయును. వాఁడుశరణాగతుఁడుగూడ నైయుండఁగా హింసింపఁదగునా. లేక:—(బద్ధాంజలిపుటం) అనుకూలమగు బుద్ధిగాని మాటగాని నడతగాని లేకున్నను అంజలిమాత్రమే చాలును. 'అఞ్జలిఃపరమాముద్రాక్షిప్రందేవప్రసాదినీ' అని స్వతంత్రునకుఁగూడ వేగ దయను బుట్టించునదిగదా యీయంజలిముద్ర. (దీనం) ఇట్లు అంజలిబంధమాత్రము లేకపోయినను కార్పణ్యా

శత్రువు పగనుమాత్రము లోఁపలనేయుంచుకొని పయికి శరణు అనిమాత్రముచెప్పుచు శరణు జొచ్చినయెడల, గురుకులవాసశిక్షితుఁడై ధర్మశాస్త్రవిశ్వాసముగలవాఁడు తనప్రాణములను పరిత్యజించియైన, వానిని రక్షింపవలయును. *శరణు అని వచ్చిన వానిని, రక్షించినయెడల తనకుఁ బ్రాణహానిగలుగునను భయమువలనఁగాని, శాస్త్రము తెలియనందునఁగాని, వానిపగవలన నేదియేని లాభముగోరియో విచ్చలవిడిగా నడచుకొను స్వభావముంబట్టియో కాని; తనకుఁగలశక్తికొలఁది వాస్తవముగ మఱియే నెపముననువంచనసేయక వానిని రక్షింపకుండుట ప్రత్యవాయమునకు హేతువగు. ఇంతేకాక యిందు నెల్లవారిచేతను నిందగలుగును. †ఒకఁడొకని రక్షింపుమని శరణు

---

యొక అతిశయముగానని తెలుపుటకు, అతిశయమైనప్రాణానపి 'ప్రాణములనుగూడ'నని యుండును. (కృతాత్మనా) నిశ్చితమనస్కుఁడైనవానిచేత—గురుకులవాసముచే సుశిక్షితమనస్కుఁడై ధర్మశాస్త్రములందు విశ్వాసముగలవానిచేత రక్షింపఁబడఁదగినని భావము.

* ఇట్లు శరణాగతరక్షణధర్మమును శాస్త్రిచోదనము జెప్పి అట్లు శరణాగతుని ప్రాణవాపలనుండిన రక్షింపనియెడల పరలోకప్రాప్తికి ప్రత్యవాయము గలుగుటయేయు నిందయు లోకమునందు వచ్చుననియుఁ జెప్పుచున్నారు. 'సచేద్భయాద్వా కామాద్వా మోహాద్వాపి నరక్షతి। స్వయాశక్త్యా యథాతత్త్వం తత్పాపం లోకగర్హితమ్' అనిమూలము. 'యథాతత్త్వం' అనుటకు యథా 'సత్త్వమ్' అని గోవిందరాజాదులు. విశేషార్థము.-(భయాద్వా) ప్రాణభయమువలనఁగాని, శరణాగతుని రక్షించినయెడల వానిశత్రువు నన్ను హింసించును అను భయమువలనఁగాని, శరణాగతుఁడు తనకు శత్రువగుటచే అప్పుడు రక్షించినచో తనకు కీడు వచ్చునను భయమువలనఁగాని, (కామాద్వా) ఇచ్చవచ్చినట్లు నడచుకొను స్వభావముంబట్టి కాని, లేక వానిశత్రువువలన కొంచెములాభము నపేక్షించుటవలనఁగాని, (మోహాద్వా) ఇది చేయఁదగును ఇది తగదు అని తెలియమివలనఁగాని, (స్వయాశక్త్యా) తనకుఁగల సామర్థ్యప్రకారము రక్షింపలేనిచోఁగాని, తనపరాక్రమము నొడఁబడకుండుట, ధనధాన్యము నిచ్చుట మొదలుగా తనకుఁ జేయఁదగిన యుపాయములను చేసి, (యథాతత్త్వం) యథార్థముగా, (యథాసత్త్వం) అనుపాఠమున శక్తియుండియు ఏదేని నెపముచేత శక్తిని వంచనసేయక యుండుట, (నరక్షతిచేత్) రక్షింపఁడేని, (తత్) ఆరక్షింపమి, (పాపమ్) ప్రత్యవాయహేతువైనది. దీనిచే నరకమునకు హేతువైనదని తెలియుచున్నది. ఇట్టిది పరలోకబాధకమగుటమాత్రమేకాదు. (లోకగర్హితమ్) ఇహలోకమందును, సర్వజనులచే నిందగలుగును. లేక (తత్పాపమ్) శరణాగతుని రక్షింపక విడుచునాపాపము. 'సతామేతదగర్హితమ్' అని సజ్జనులకు అగర్హితముగా నుండుటయేకాక (లోకగర్హితమ్) అందరికిని గర్హింపఁదగినది యగునని భావము.

†శరణాగతుని రక్షింపమి—కేవలము ఐహికానర్థమునకు హేతువగుట మాత్రమేకాక, పూర్వసంచితమగు సకలసుకృతమును నాశముసేయునదగు ననుచున్నారు. ఇందులకు 'వినష్టః పశ్యతస్తస్య రక్షిణః శరణాగతః। ఆదాయ సుకృతంతస్య సర్వంగచ్ఛేదరక్షితః' అనిమూలము. 'తస్యారక్షిణః' అని గోవిందరాజాదిపాఠము. విశేషార్థము:—(రక్షిణస్తస్య పశ్యతః అరక్షితః వినష్టః శరణాగతః తస్యసుకృతం సర్వమాదాయగచ్ఛేత్) అని యన్వయము. రక్షకుఁడైనవాఁడు చూచుచుండఁగా వాఁడొనరింపనందువలన రక్షితుఁడుగాక నాశమునొందిన శరణాగతుఁడైనవాఁడు, అంతకు మునుపు అరక్షకుఁడైనవాఁడు ఆర్జించియుండిన సుకృతమునంతయుఁ దీసికొని వానికాసుకృతములవలనఁ గలుగవలసిన యుత్తమ

చోరఁగా వాఁడు రక్షింప సమర్థుఁడయ్యు వానిని రక్షింపక యూరక చూచుచునుండునేని, దానిచే వాఁడు తనశత్రువుచేత నాశముఁబొందినయెడల, ఆ రక్షింపనివాని యనాదికాల సంచితమయిన సుకృతమునంతయుఁ దాను దీసికొని, వాఁ డందులకు ఫలముగాఁ బొందవలసినయుత్తమలోకమును తాను బొందును. ఇట్లు శరణాగతుని రక్షింపనియెడల గొప్పదోషము గలుగునుజుమీ. అట్లు రక్షింపకుండుట స్వర్గవిరుద్ధమై నరకమునకు హేతువగును; ముందనేకుల రక్షించి సంపాదించిన యశస్సునెల్ల నశింపఁ జేయును; శరీరమున బలవీర్యము లుండియును రక్షింపనిచో ఆబలవీర్యములను నాశము సేయును'. *కాఁబట్టి కండువు సకలలోకాదృతముగా ప్రశంసాదులులేక యథార్థమైనదిగాఁ జెప్పిన యాయుత్తము వచనమును జేసెదను. ఏలనఁగా నది పాపముల నివర్తింపఁ జేయునది; ఆనృశంస్యమను పరమధర్మముతోఁ గూడినది; లోకు లెల్లరచేతను కీర్తి గలిగించునది; ఫలము నొసంగుకాలమున స్వర్గము నొసఁగునట్టిది ఇట్లు ఐహికాముష్మికశుభములు రెండు నొసంగునది గానఁ జేయఁదగినది. †ఒక్కమాఱు

---

లోకములను తాను బొందును. 'తస్యారక్షితః' అనుపాఠము 'యః కశ్చిత్స్వం కంచిచ్ఛరణ ముపాగతః' ఎవఁడు ఎవనిని శరణుఁబొందినవాఁడో, 'తం' 'వానిని' అని యధ్యాహార్యము, (అరక్షిణ స్తస్య పశ్యతః) రక్షకుఁడుగా నుండియు రక్షింప సమర్థుఁడయ్యు వాఁడు రక్షింపక యూరక చూచుచుండునేని, అట్లు ఆరక్షకుఁడు రక్షింపకయుండ నా శరణాగతుఁడు, తన శత్రువులవల్ల నశించినవాఁ డగునేని, (తస్య సుకృతం) ఆరక్షింపనివానికి సంబంధించిన యనాదికాలసంచితమగు సుకృతము సర్వమును, ఆశరణాగతుఁడు గైకొనిపోవును. రక్షింపనివాఁ డార్జించిన సకలసుకృతములు క్షయించినవగు నని భావము.

*ఏని చేయకపోవుటచే ప్రత్యవాయము బహుళముగాఁ గలుగుటయేకాక చేయఁగా ఐహికాముష్మిక శ్రేయములు పెక్కులు గలవనియు కండువు చెప్పినందులకు తాత్పర్యము రాముఁడు తానే చెప్పుచున్నాఁడు. 'కరిష్యామి యథార్థంతు కణ్డోర్వచన ముత్తమమ్। ధర్మిష్ఠం చ యశస్యం చ స్వర్గ్యం స్యాత్తు ఫలోదయే' అని మూలము. విశేషార్థము. (కరిష్యామి యథార్థంగు) చెప్పఁబడిన యర్థములందు ప్రశంసామాత్రముగానట్టి యట్లు చెప్పఁబడినదిగాక యథార్థముగనే యుండినది. (కణ్డోర్వచన ముత్తమమ్) వచనము ఉత్తమమగుట యెట్లనఁగా, శరణుఁ జొచ్చినవాఁడు శత్రువైనను రక్షించునపుడు తనకు ప్రాణహాని గలుగనున్నను వానిని రక్షింపవలయునను అర్థ గలిగియుండుట, (ధర్మిష్ఠం) వాని యనుష్ఠానము ధర్మమును విడకుండుట. ఆనృశంస్యమను పరమధర్మముతోఁ గూడియుండుట. (యశస్యంచ) లోకులందఱును కొనియాడునట్టి యతిశయము గలిగి యుండునది. (స్వర్గ్యం స్యాత్తు ఫలోదయే) ఫలము నిచ్చుకాలమున స్వర్గము నొసంగఁగూడినది. స్వర్గమనఁగా 'నిరస్తాతిశయాహ్లాద సుఖభావః' అన్నట్లు నిరతిశయ సుఖమైనది. ఇట ప్రతిపాద్యగతమైన ధర్మిష్ఠత్వాదులు ప్రతిపాదక మగువచనమం దుపచరింపఁబడుచున్నవని తెలియునది.

†ఇట్లు చెప్పఁగా సుగ్రీవుఁడు చక్కఁ దెలియక హృదయము కరఁగకుండుటం జూచి రాముఁడు తన ప్రకృతికిఁ దగినట్లు ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు. 'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే। అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ' అని మూలము. విశేషార్థము:—(మిత్రభావేన సంప్రాప్తమ్) అనుశ్లోకమున తనప్రకృతిని రాముఁడు చెప్పెను. ఈశ్లోకముచేత అప్రకృతి కనుగుణమైన ప్రతిజ్ఞను చెప్పె

**'శరణు' అని శరణుఁజొచ్చి 'నీవాఁడను' అనిచెప్పి యాచించుచున్నవానికి, సమస్త భూతములవలనను భయము లేకుండునట్లు అభయ మొసంగుదును; ఇది నావ్రతము.**

---

చున్నాఁడు. (సకృత్ ఏవ ప్రపన్నాయ) ఇచట సకృచ్ఛబ్దమునకు 'సహసా' అని యాదేశము. 'సహసైవ ప్రపన్నాయ' యనుట. అనఁగా తన యయోగ్యతనుజూచి వెనుదీయక శరణ్యుఁడగు నాగుణమును జూచి తొందిరిబడి విశ్వసించి శరణుఁజొచ్చినవాఁడని శ్రీవత్సాంకమిశ్రులు. పూర్వ మనాదికాలముగా సంసారము చేయుచుండువాఁడుగాన మీఁద అనంతకాలమందులకు ఫలమును అనుభవింపఁగలఁడు గాన ప్రపత్తిని అనుష్ఠించినది మొదలుగా ఆయుష్యము గలంతవఱకు ననువర్తించినను 'సకృత్' యొకమాటే యనఁ జాలునంతేయగునని గోవిందాచార్యులు. ఈశ్వరుని విషయీకరించుటకు ప్రపత్తి 'సకృత్' అని ఒకమాటే చాలును. అయితే దానిని పైపైని ఆవర్తించుట ఆ యుపాయ వైభవమువలనఁ గలిగిన ఆస్వాద్యతనుబట్టియే యని పరాశర భట్టాచార్యులు. (సకృదేవ) ఇందలి ఏవకారముచేత ఒకసారియే కాని పలుమాఱు ఆవర్తించుట తొలఁగింపఁబడినది. (తవాస్మీతి చ యాచతే) నీకు నియతముగా కింకరుఁడ నయ్యెదనని ఉపాయమునుగూడ ప్రార్థించువానికి, (సకృదేవ ప్రపన్నాయ) అనుటవలన ప్రపత్తి 'తవాస్మీతి చ యాచతే' అను వర్తమాన నిర్దేశమువలన అనవరత భావనారూపమయిన భక్తియు జెప్పఁబడుచున్నదని కొందఱాచార్యులు. (అభయం సర్వభూతేభ్యో దదామి) ఇట హేతువునందు పంచమి. సర్వభూతములవలనను గలుగు భయమును నివర్తింపఁజేయుదును. సుగ్రీవుఁడు అడ్డపడినను నేవిడువను. వీఁడు తానే పరాఙ్ముఖుఁడయినను విడువను. (ఏతద్వ్రతం మమ) నాకు మాఱింపరానిసంకల్ప మిది. అమోఘసంకల్పుఁడ నయిన నాకు సంకల్పములన్నియు నశించినను నశింపరానిసంకల్ప మిది యగునని భావము.

లేక 'శ్రుతిస్స్మృతిస్సదాచారస్స్వస్య చ ప్రియమాత్మనః। సమ్యక్సంకల్పజః కామో ధర్మమూలమిదం స్మృతమ్' 'శ్రుతి, స్మృతి, శిష్టాచారము, తన మనస్సునకు ప్రియమగుట, మంచి సంకల్పమువలనఁ గలిగినకోరిక; ఇవి ధర్మమునకు ప్రమాణములు.' అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పిన అయిదుప్రమాణములలో శరణాగతికి, 'నిస్తారనిర్మాణం ప్రపన్నం పతిప్రయచ్ఛతి' ఇత్యాదులచే శ్రుతియు కందుగాథమూలమున స్మృతియు, కపోతాదులచే శిష్టాచారమును, ప్రతిపక్షము నెదిరించి బలవంతముగా ప్రపన్నత్రాణమే యుపపాదించుటచే తనమనస్సునకు ప్రియమగుటయు అని నాలుగుప్రమాణములు ప్రపన్నరక్షణమను పరమధర్మవిషయముఁ బ్రదర్శింపఁబడినవి. ఇప్పుడు, 'సమ్యక్సంకల్పజః కామః' అనెడి ఐదవప్రమాణము నందులకు నిరూపించుచున్నారు. (సకృదేవ) ఒకమాఱే, భక్తి మొదలయిన యుపాయములందు రెండుమూఁడు ఆవృత్తులు చెప్పఁబడి శాస్త్రార్థమగుచుండగా ప్రపత్తివిషయమందు మరల నావృత్తిలేమియే శాస్త్రార్థము. 'సకృదేవహి శాస్త్రార్థః కృతోయమ్ తారయేన్నరమ్' అని ప్రపత్తిశాస్త్రము. (ప్రపన్నాయ) పొందినవానికొఱకు—ప్రపత్తిచేసినవానికొఱకనుట, 'పదేర్గత్యర్థాత్ జ్ఞానార్థా' 'పొందుట యనునర్థముగలవి ఏవేని అన్నియు తెలియుట అను నర్థముగలవి' అను న్యాయమున (ప్రపన్నాయ) అనుట జ్ఞానరూపమైన మానసిక ప్రపత్తి చెప్పఁబడినది. (తవాస్మీతి చ) నీవాఁడను అనుటచే వాచిక ప్రపత్తి చెప్పఁబడినది. ఈ రెంటిలో నేది గలవానికొఱకుఁగాని యనుట. లేక (ప్రపన్నాయ) అని యుపాయము చెప్పఁబడుచున్నది. (తవాస్మీతి చ యాచతే) అని తచ్ఛేషవృత్తి యనెడు ఫలవిశేషమును ప్రార్థించుట చెప్పఁబడుచున్నది. ఇట్టివాఁడయిన యధికారికొఱకు, (సర్వభూతేభ్యః) సర్వభూతములవలనను, ఎవ్వరెవ్వరివలన భయముగలుగునని శంకదోఁచునో వారియందఱివలననుండి యనుట. (అభయం) భయములేకుండుట, (దదామి) ఇచ్చెదను. అభయమే మోక్షమనఁబడు

సూక్ష్మస్థూలావస్థలందు విశిష్టుఁడైనబ్రహ్మ మొకఁడే యగుటంబట్టి యతని నిత్యత్వనిర్వికారత్వ ఏకత్వా దులకు బాధకములేమి నిర్వహింపఁబడినది. అట్లె యిచటను 'ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్' అనియు 'తస్మిన్ ప్రసన్నే క్లేశసంక్షయః' అనియు ప్రసాదవిశిష్టుఁ డుపాయముగాను, 'ప్రహర్షయిష్యామి' యనియు 'త్వత్ప్రీతయే' అనియు ప్రీతివిశిష్టుఁ డుపేయముగాను, ఇట్లు ఉపాయోపేయములు ప్రసాదము ప్రీతియను విశేషములచేఁ గలిగినదిగాన విశేషణములచే అభేదమును, వానిచే విశిష్టుఁడై యుండు,తనకు ఐక్యమును - అనఁగా ఆరెంటను ఏకభూతుఁడే యగుటను-గ్రహించుటచే భగవంతుఁడే ఉపాయమును ఉపేయమును కాఁగూడును. అనఁగా పూర్వభావియగు కారణమును పశ్చాద్భావియగు కార్యమును ప్రసాదము ప్రీతి అను రెంటివలననే భగవంతునకుఁ గలుగుచున్నదిగాని స్వరూపమునందుఁ గాదు గాన దానిచే భగవంతునకును పూర్వముండి యిప్పుడు లేకుండుటయు, ఇప్పడుండి పూర్వములేకుండుటయు నను దోషము గలుగదు. కావుననే 'ప్రసాద ముపాయము ప్రీతి ఉపేయము' అని పెద్దలు చెప్పిరి. 'అనన్యసాధ్యేస్వాభీష్టే' అని ప్రపత్తి మొదలయినవానిచే సాధ్యమైనదిగదా మోక్షము. సాధ్యమనఁగా మునుపు లేకుండి పిదప ఉత్పన్నమైనది. 'ఉత్పన్నస్య వినాశయోగాత్' అని ఉత్పన్నమునకు నాశముగలదుగాన ఉపేయమైన భగవత్ప్రాప్తిరూపమగు మోక్షము 'సాధ్యమ్' అనుటంబట్టి ఉత్పన్నమైనదిగాన నశించునదిగానున్నదే! ఇదెట్లు? అన్నచో అది నశింపదు. అది నశింపకుండుటకు రెండు ప్రకారములు గలవు. అందొక ప్రకార మెట్లన-సాధ్యము- ఉత్పాద్యము, ప్రాప్యము, వికార్యము, సంస్కార్యము అని నాలుగువిధములై యుండును. వానిలో ఉత్పాద్యమనఁగా 'ఘటంకరోతి పటంకరోతి' అన్నట్లు కుండవలెను గుడ్డవలెను మునుపులేకయే పిదపఁ గలుగునది. ప్రాప్యమనఁగా 'గ్రామంగచ్ఛతి రాజానంగచ్ఛతి' 'గాందోగ్ధి పయః' 'ఆవును పాలు పిదుకుచున్నాఁడు' అన్నట్లు గ్రామము రాజు పాలు మొదలయినవానిని తొలుత సిద్ధమై యుండువస్తువును అధికారికిచ్చుట. వికార్యమనఁగా 'క్షీరమభ్యఞ్జయతి' పాలుపెరుగు చేయుచు పెట్టుచున్నాఁడు. 'త్రపుసీసే ఆవర్తయతి' తగ్రని సీసమును కరఁగించుచున్నాఁడు. అన్నట్లు, పాలను పెరుఁగు చేయుట సీసమును కరగించుట. సంస్కార్యమనఁగా 'వ్రీహీన్ ప్రోక్షతి' 'వడ్లను ప్రోక్షించుచున్నాఁడు' 'వ్రీహీనవహన్తి' 'వడ్లను దంచుచున్నాఁడు' అని వస్తువును మఱియొకకార్యమునకుపయుక్తమగునట్లు చేయుట. ఇచ్చటను 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' అనియు 'పరాత్పరం పురుషముపైతి దివ్యమ్' 'పరంజ్యోతి రుపసంపద్య' అనియు పూర్వమే సిద్ధరూపుఁడై యున్న పరమాత్మను వీఁడు పొందుటచే ప్రాప్యము నిత్యమేయగును. ఇదియు మోక్షము సాధ్యమయ్యు నిత్యమగుట కొక ప్రకారము. మఱియొక ప్రకార మెట్లనః—'నిత్యోనిత్యానామ్' అనియు 'అజో హ్యేకః' 'అనియు' 'నహి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే' అనియు ఆత్మలు నిత్యులగుటచేతను, వీనికి ధర్మములయిన జ్ఞానానందాదులు నిత్యములు నగును. ఇట్టి నిత్యములయిన యాత్మలకు 'తమసా గూఢమగ్రే ప్రకేతమ్' అనియు 'తయా తిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా' అనియు ఆత్మస్వరూపమునకు ఆత్మధర్మములకును తిరోధానము గలిగించునది ప్రకృతి సంసర్గము. ఆ సంసర్గము నశింపఁగా 'స్వేన రూపేణాభి నిష్పద్యతే' అనియు 'ఆవిర్భూతస్వరూపస్తు' అనియు 'అవబోధాదయోగుణాః' అనియు 'ప్రకాశ్యన్తే నజన్యన్తే నిత్యా ఏవాత్మనోహితే' అగుణములు ఆత్మకు నిత్యము లయినవిగాన మఱుఁగుపడియుండి యపుడు ప్రకాశించుచున్నవేకాని యపుడు క్రొత్తగా పుట్టినవి కావు. అనియు ఆత్మల స్వాభావికమైన యాకారము ఆవిర్భవించినదేకాని క్రొత్తగా ఉత్పాద్యము కాకపోవుటవలనను ఆత్మలు నిత్యములేకాన పరమాత్మప్రాప్తిరూప మగుమోక్షమును నిత్యమే యగుచున్నది.

అది యట్లుగాఁగాక. ఇచ్చట వేదోక్తమైన ప్రపత్తికి ఉపబృంహణము సేయఁబడు నేని, 'అహమస్మ్యపరాధానా మాలయోఽకిఞ్చనోఽగతిః । త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః । శరణాగతిః' అన్నట్టి ప్రపత్తిలక్షణము లభించినదా యన్నచో 'రావణో నామదుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః । తస్యాహమనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః' అని రావణసంబంధమువలనను 'భీషయనేస్మభీరో' అని నామనిర్వచనమువలనను, తనదోషమును మున్నిడుకొనుటచే 'అహమస్మ్యపరాధానామాలయః' అన్న యర్థము చెప్పఁబడినది. 'రాజ్యం ప్రార్థయమానశ్చ' అని తనకు రాజ్యము గోరివచ్చినవాఁడై రామున కొక కించిత్కారమును జేయుటకు రానివాఁడగుటచేత 'అకిఞ్చనః' అన్న యర్థము చెప్పఁబడినది. 'త్వాంతు ధిక్కులపాంసనమ్' అని తఱుమఁగొట్టిన తోఁబుట్టువు ప్రాపును లేకుండుటచే 'అగతిః' అన్న యర్థము చెప్పఁబడినది. 'భవన్తం శరణంగతః' అనుటచే 'త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః । శరణాగతిః' అన్న యర్థము చెప్పఁబడినది. 'పాదగోః శరణాన్వేషీ నిపపాత' అని పాదములందు శరణుగోరి పడినాఁ డనుటచే 'పాదేవేఽక్ష్మిక్ ప్రయుజ్యతామ్' అన్న యర్థము చెప్పఁబడినది. కాఁబట్టి యీలక్షణము చక్కఁగనే సిద్ధించినది. ఆనుకూల్యసంకల్పాదులును సిద్ధించినవోయనఁగా ఆలక్షణమును పుష్కలముగానే యున్నది. 'అత్మానంసర్వథా రక్ష పురీంచేమాం స రాక్షసామ్ । స్వస్తి తేఽస్తు' అని రావణునకి వానిపట్టణమునకు మంగళమును ఆశాసించుటచే ఆనుకూల్యసంకల్పము చెప్పఁబడినదయ్యెను. 'ఉత్పపాత గదాపాణిః' 'గద చేతియందు దాల్చి పైకెగసెను' అని చేత గదయుండఁగా తన్ను పరిభవించినవానిని గొట్టిపోకుండుటవలన ప్రాతికూల్యవర్జనము చెప్పఁబడినది. 'వాలినంచ హతం దృష్ట్వా సుగ్రీవం చాభిషేచితమ్ । రాజ్యం ప్రార్థయమానశ్చ' అని సోదాహరణముగా రాజ్యము నొసంగ శక్తుఁడని నమ్మివచ్చుటచే 'రక్షిష్యతీతి విశ్వాసము' చెప్పఁబడినది. 'భవన్తం శరణం గతః' అనుటచే 'గోప్తృత్వవరణ'ము చెప్పఁబడినది. 'భవద్గతం మే రాజ్యంచ జీవితంచ సుఖానివై' 'నీయందే నారాజ్యమును జీవితమును సుఖములునున్నవి' అనుటచే అఖిలభరసమర్పణము చేయుటంబట్టి ఆత్మనిక్షేపము చెప్పఁబడినది. 'ప్రణాదశ్చ మహానేష తతోఽస్యభయమాగతమ్' 'వీనిధ్వని మిగుల పెద్దదిగానున్నది. కాన వీనికిభయముగలిగియున్నది' అని స్వరము తొట్రుపడుటవలనను, 'శీఘ్రం వ్యాదిశనో రాజన్ వధార్థమేషాం దురాత్మనామ్' అని రామునియొద్దకు పోనీయక వానరులు నడిత్రోవనే తన్నుఁ జంపుటకు సుగ్రీవుననుమతి వేఁడి నిలుచుండుటంబట్టియు 'దైన్యం కార్పణ్యముచ్యతే' అన్న దైన్యరూపమగు కార్పణ్యమును జెప్పఁబడెను. కాఁబట్టి యీలక్షణమును పుష్కలముగానే యున్నది. ఇట్లు పుష్కల లక్షణమయిన ప్రపత్తిగావించి దీనికిఫలముగా, కొల్లకుఁబోయి కుప్పయెత్తినట్లు, నేనుండఁగా ఫలాంతరముల వాంఛపడక మనలనే నమ్మివచ్చినవానికి సకలభయనివృత్తియును జేయవలయును. ఇదివాకు వ్రతమనుచున్నాఁడు:—ఇట్లు అభయప్రదానము సేయుట యెవరికన్నచో (సకృదేవప్రపన్నాయ) సలక్షణమయిన ప్రపత్తిచేసినవానికి, సలక్షణమయిన ప్రపత్తి సేయుట యనఁగా 'సకృదేవ ప్రపన్నుఁడయి యుండుట' సకృత్తునకు అర్థమేమనఁగా 'ఆవృత్తిరసకృదుపదేశాత్' అనియు 'అనేకజన్మసంసిద్ధః' అనియు భక్తివలె స్వరూపనివృత్తియు ఫలనివృత్తియు చిరకాలసాధ్యముగా నుండక 'తద్ద్వయం సకృదుచ్చారో భవతి' అనియు, 'ఉపాయోఽయం చతుర్థస్తే ప్రోక్తశ్శీఘ్రఫలప్రదః' అనియు స్వరూపనివృత్తియు ఫలనివృత్తియు నొకసారియేయైయుండుట. 'సకృదేవప్రపన్నాయ' అనుచో 'ఏవ' అను అవధారణము ప్రపన్నుఁడేయనియు వాని ప్రపత్తి ఒకతూరియే రెండుతూర్లవలసిలేదు అనియు అయోగవ్యవచ్ఛేదమా? ప్రపన్నునికే కాని భక్తుఁడు మొదలైన యన్యులకుఁగాదు

అని అన్యయోగవ్యవచ్ఛేదమా? అని యడుగవచ్చును ప్రపన్నుఁడే యని యిట యవధారణముగూర్చిన చో ప్రపన్నుని అనువదించి, వానికభయప్రదానము చేయుదుననుటయే యిట వాక్యమునకు విధేయము. కాని, ప్రపన్నుఁడో అప్రపన్నుఁడోయని విమర్శించి ప్రపన్నుఁడేయని విధేయముగా నిట నిర్ణయించుటకాదు. కాన ప్రపన్నుఁడేయని యవధారణముచే నిశ్చయింపవలసినది లేదు. మఱియు 'సకృదుచ్చారో భవతి' అనియు 'సకృదేవహి శాస్త్రార్థమ్' అనియు ప్రపత్తి సకృత్ప్రయోజ్యయై (ఒకసారి ప్రయోగింపఁదగినదై) అసకృత్ప్రయోజ్య (పలుమాఱు ప్రయోగింపఁదగనది) కానేరదు. అసకృత్ప్రయోజ్యయగుటకు నయితియుండినంగదా అది అట్టిది కాదని వ్యవచ్ఛేదించి సకృత్ప్రయోజ్యయేయని యవధారణము చెప్పఁగూడును. కాన ఒకతూరియే రెండుతూర్లుకాదు అనిచెప్ప నక్కఱలేదు. కనుక నీయవధారణము అయోగవ్యవచ్ఛేదముగాదు. 'అభయంగతో భవతి' అని అప్రపన్నుఁడయిన భక్తిష్ఠునకును అభయప్రదానము చేయుటంబట్టి 'వీనికేతప్ప మఱియొకనికి అభయప్రదానము గలుగదు' అను అన్యయోగవ్యవచ్ఛేదమునుగాదు. ఇట్లు రెండునుగానందున ఇదియే మఱొకటిగాదు అని వ్యావర్తించుటకు మఱియొకటి లేమిచే 'సకృదేవప్రపన్నాయ' అనుచో అవధారణము వ్యర్థము. లేక 'సకృత్ + ఏవ' అని కేవలసకృత్తుతో అవధారణమును గూర్చితిమేని యిట 'సకృదేవకుర్యాత్ నాసకృత్' అని ప్రపత్తిస్వరూపమును చెప్పుటయగుననరే. ఆచెప్పుటలేక యిట ప్రపన్నుని అనువదించి అభయప్రదానములో తాత్పర్యముగా పర్యవసించుటంబట్టి సకృత్తుతోఁ గూర్చినను వ్యర్థమే. ఈయుపపత్తులవలన సకృత్పదమును ప్రయోగించుటయు వ్యర్థము. 'సకృదేవాభయందదామి' అని యిట్లు అన్వయముచేయఁగూడదా యన్నచో ఒకశరీరికి పుట్టఁగలిగినభయములన్నియు ఒకసారిగా నేకూడుకొన్నవై వానియొక్క నివృత్తిని ఒకసారిగానే చేయుటకానేరదు. భూతకాలమందలి భయములు పూర్వమే యనుభవించి యైనవి భవిష్యత్కాలమందలి భయములు ఇంకను ఉత్పన్నములుకానందున వానినివృత్తి నిపుడు సేయ శక్యముగాదు ఇంకను 'దదామి' అని ప్రారంభించినది పరిసమాప్తిఁ బొందని కొన్నిభయములు ఉత్పన్నములుకానందున, మీఁదవచ్చువానికెల్లను రానురాను పోఁగొట్టెద ననువర్తమానమునకును, ఒకసారియె అను సకృత్పదమునకును, వ్యాహతిగలుగును. అభయప్రదానము సేసినది యాదినము మొదలుకొని రావణవధపర్యంతముగాఁ గలుగుభయములకును పరిహారములకును మితిలేనందునను అనుష్ఠానవిరుద్ధమయినందునను 'సకృత్' 'ఏవ' అనుపదములకు వ్యర్థతకలుగుచున్నదియనఁగా కలుగదు. ఎట్లనః-

రాముఁడు విభీషణుని ప్రపన్నుఁడన్నాఁడు. అందులకు అనుపపత్తిగా సుగ్రీవుఁడు సకృత్ప్రయోజ్యమగు ప్రపత్తిని 'రాఘవంశరణంగతః' అనియు 'భవన్తంశరణంగతః' అనియు 'పాదయోశ్శరణాన్వేషీ నిపపాత' అనియు, మూఁడువార్లు ప్రపత్తిచేసి ప్రపత్తిలక్షణహానియు, ప్రపత్తిస్వరూపహానియు, ప్రపత్తవ్యస్వరూపహానియు చేసినాఁడని దూషణముచెప్పఁగా, రాముఁడు 'సకృదేవప్రపన్నాయ' వాఁడు పలుసార్లు చేయలేదు ఒకతూరియే చేసినాఁడనుచున్నాఁడు. 'అయితే నాలుగు మూఁడుమార్లు చేసినట్లుగా చెప్పినప్రమాణముల కేమి చేయవలయు' ననఁగా 'రాక్షసోఽభ్యేతి పశ్యధ్వమస్మాన్ హన్తుం నసంశయః' అని యభిశాపమును జెప్పినమిమ్ముంజూచి 'సోఽహంపరుషితస్తేన దాసవచ్చావమానితః । త్యక్త్వాపుత్రాంశ్చ దారాంశ్చ రాఘవంశరణంగతః' అన్నట్లు విరోధినైవచ్చినవాఁడనుగాను. అన్నయే అవమానించి పొమ్మని చెప్పఁగా వానితోడి సంబంధములను విడిచి రాముని శరణుఁజొరవచ్చితిని అని తన స్థితిని జెప్పికొన్నాఁడు మొదట 'శరణంగతః' అని; పిదప మీమాటలచేత నేను కలఁగితినో యని శంకించిన మ్మఁదెలవిడుచుటకై 'భవన్తంశరణంగతః' అని విన్నపముచేయుటచే బాధించువాఁడనై రాలేదు.

తడిజుట్టుతోను ధౌతవస్త్రముతోను నిలిచినాఁడు? అట్లె విభీషణుఁడును 'యోవిష్ణుం సతతం ద్వేష్టి తం విద్యాదన్త్యరేతసమ్' అని విష్ణుద్వేషియై కర్మచండాలుఁడయిన రావణునిగోష్ఠిలోనుండి పోరువడుచు 'ఖస్థఏవ వ్యతిష్ఠత' అని ఆకాశములో నిలిచినాఁడింతేకాని ఏమున్నీటిలో పెన్నేటిలో మునిఁగివచ్చినాఁడు. 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్' ఏనాఁడు విరక్తి పుట్టెనో యానాఁడే యూరువిడిచి పోవలయును. అనియు 'నాస్తి నాక్షత్రసంబన్ధో ననిమిత్తపరీక్షణమ్। శ్రద్ధైవకారణం నిత్య మష్టాక్షరపరిగ్రహే' 'మంచినక్షత్రమా కాదాయని నక్షత్రయోగముచూచుటలేదు. మంచిశకునమా కాదా అని నిమిత్తములను పరీక్షించుటయులేదు. అష్టాక్షరమును పరిగ్రహించువిషయమున శ్రద్ధయె (అనఁగా రుచియే) నిత్యకారణము' అనియు రుచిపుట్టఁగా నే వచ్చినాఁడింతే. గంగలో మునుఁగుటకు, నొకసముద్రములో మునుఁగవలయునో, 'భగవాన్ పవిత్రం వాసుదేవః' 'పవిత్రమ్' 'పవిత్రాణాం పవిత్రమ్' 'పావనస్సర్వలోకానాం త్వమేవ రఘునన్దన' అని పరమపవిత్రునిగాఁ జెప్పఁబడు నాకడకు, వచ్చువానికి ఒకపురశ్చరణముగాని ప్రసన్నుఁడయినచో నక్కఱలేదు. అనుచున్నాఁడు. "ఇది యెట్లు? భక్తికి శాస్త్రవిహితమైన వర్ణాశ్రమధర్మము లున్నవి. వీనికి 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని ఉన్నధర్మములను విడుమనట్లు చెప్పఁబడియున్నది. కాఁబట్టి ప్రపత్తికంటెను భక్తియే శ్రేష్ఠముగా తోఁచుచున్నదే" యనఁగా అట్లు చెప్పరాదు. 'శబ్దప్రమాణకే హ్యర్థే యథాశబ్దం వ్యవస్థితిః' అని శాస్త్రప్రమాణమయినచో అది చెప్పినట్లు గ్రహింపవలసినవారము. అనఁగా 'బహవోహియథామార్గావిశన్త్యేకం మహాపురమ్। తథాజ్ఞానాని సర్వాణి ప్రవిశన్తి తమీశ్వరమ్' అన్నట్లు ఒకయూరికి పోవలసినపుడు, పలుత్రోవ లుండునట్లు, భగవత్ప్రాప్తికి పలు ఉపాయములు గలవనిచెప్పి, ఒకయుపాయము తనంతట అశక్తమగుటచే దానికి వేయుకొన్ని సహకారులను శాస్త్రము విధించుచున్నది; ఒకయుపాయము సర్వశక్తియగుటచే దానికి సహకారులు వేఱు అక్కఱలేదనుచున్నది. ఈప్రకారభేదమువలన వానికొండొంటికి వైలక్షణ్యమురాదు. కాని, స్వరూపనిరూపక ధర్మములనియు, నిరూపితస్వరూపమునకు విశేష నియామకములయిన ధర్మములనియు రెండు తెగలు గలవు. అవిశేషనియామకములను జూడఁగా ప్రపత్తియే విలక్షణ(శ్రేష్ఠ)మైనది. ఎట్లనఁగా 'సోఽన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః' అనియు 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' అనియు, 'జ్ఞాత్వా దేవమ్ముచ్యతే సర్వపాపైః' అనియు 'తమేవైకంజానథాత్మానమ్, అన్యావాచో విముఞ్చథ, అమృతస్యైషసేతుః' అనియు 'ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే' అనియు భక్తిప్రపత్తులు రెండును వేదాన్తవిహితములుగాను మోక్షాది సాధనములుగాను నుండుటయందు సమానములే యైనను భక్త్యుపాయస్వరూపమువలె 'సాధ్యభక్త్యైకగోచరః' అని భగవంతునిచే సాధ్యముగా నుండక ప్రపత్త్యుపాయస్వరూపము, 'సిద్ధరూపం పరంబ్రహ్మ' అనియు 'నిత్యంనిత్యాకృతిధరమ్' అనియు, పూర్వమే సిద్ధరూపమై 'ధ్యాయతే' 'ధ్రువాస్మృతిః' అని స్మృతిసంతానరూపమగు జ్ఞానమై, అచేతనమగుట లేక 'యస్సర్వజ్ఞస్సర్వవిత్' 'సత్యం జ్ఞానమ్' 'సర్వం సర్వత్ర సర్వదాజానాతి' అని జ్ఞాతయై సదాతనజ్ఞానస్వరూపమై, స్వీకరించునెడల 'ఆవృత్తిరసకృదుపదేశాత్' 'అనేకజన్మసంసిద్ధమ్' అన్నట్లు చిరకాల సాధ్యమయినదిగాక 'తద్ద్వయం సకృదుచ్చారోభవతి' 'ఉపాయభూతో మే భవేతి ప్రార్థనామతి శ్శరణాగతిః' అని సకృత్ప్రయోగము గలదై 'తస్యతావదేవ చిరం యావ దధికారమ్' అని విలంబముగా ఫలము నిచ్చునదిగాక 'ఉపాయోయం చతుర్థస్తే ప్రోక్తశ్శీఘ్రఫలప్రదః' 'తావదార్తి స్తథా వాఞ్ఛా తావన్మోహ స్తథా సుఖమ్। యావన్నయాతి శరణమ్' అని శీఘ్రఫలప్రదమై 'తపసాఽనాశకేన' అనియు 'యజ్ఞోదానం తపశ్చైవ' అనియు, 'పఞ్చాగ్నయోయేచ తృణాచికేతాః' అనియు 'తపస్స్వాపలబ్ధ

శ్రీ సోయం ధర్మసంగ్రహః' అనియు 'కార్యస్త్రిష్వభిషేకశ్చ కాలేకాలేచ నిత్యశః' అనియు వాన యెండ యని లేక ఉప్పునీట చవ్వనీటను వేడినీటను మంచునీటను తోఁగి నాలుగుప్రక్కలను తలమీఁదుగాను నిప్పు విసరగా నిలిచి క్లేశముపడునట్లు తపస్సు మొదలయినవి చేయుటకాక, 'ఆనన్దో బ్రహ్మ' 'ఆనన్దం బ్రహ్మ' 'కం బ్రహ్మ ఖం బ్రహ్మ' అనియు 'సర్వగన్ధ స్సర్వరసః' అనియు, సుఖరూపమైనదై 'మిథ్యాప్రయుక్తో యజమానం హినస్తి' 'తప్పుగా ప్రయోగముచేసినయెడల యాగకర్తను హింసించును' 'జ్ఞానదోషపరిభ్రష్ట శ్చణ్డాలీంయోనిమాగతః' 'జ్ఞానమందలిదోషముచే పరిభ్రష్టుఁడై చండాలయోనిం బుట్టవచ్చును' అన్నట్లు రవ్వంతతప్పుపడినయెడల కర్త నశించునట్టిదియుఁగాక 'యథాతథావాపి సకృత్కృతోఽఞ్జలిః। తదైవనుష్ణాత్యశుభాన్యశేషతః।శుభానిపుష్ణాతినజాతుహీయతే' అనియు ఎట్లోయొక యట్లు ఒకసారిచేసినయంజలి యప్పుడే అశుభములనన్నింటిని హరించుచున్నది. శుభములను వర్ధిల్లఁజేయుచున్నది. మఱియెప్పుడును క్షీణింపదు' అనియు 'దురాచారోఽపిసర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా। సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయాశరణంయది। నిర్దోషంవిద్ధితంజన్తుం ప్రభావాత్పరమాత్మనః' అనియు,పద్ధతితప్పిజేసిన దోషములనుబోఁగొట్టెదిద్ది అనుష్ఠాతను ఉజ్జీవింపఁజేయునదై 'అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే' 'కషాయపక్తిః కర్మాణి జ్ఞానన్తుపరమాగతిః। కషాయేకర్మభిఃపక్వే తతోజ్ఞానంప్రవర్తతే' అనియు 'తరతిమృత్యుమవిద్యయా' అనియు, తనయుత్పత్తికి ప్రతిబంధకములగు వానిని నివర్తించునదై 'అన్తవదేవాస్యతద్భవతి' 'నహ్యధ్రువైః ప్రాప్యతే' 'ప్లవాహ్యేతేఅదృఢాయజ్ఞరూపాః'అనియు నశించుచున్నప్రత్యయమే యుపకరణముగాఁగలిగి,నశ్వరమైన క్రియారూపమై, తనంతట ఫలమిచ్చుటకు అశక్తమై నిలిచెగలదై స్వర్గపశుపుత్రాది ఫలసాధారణముగానుండునట్టి కర్మాదులను అంగముగా అపేక్షించునదగాక 'తమేవైకంజానథాత్మానమ్ అన్యావాచోవిముఞ్చథ' 'సర్వధర్మాన్పరిత్యజ్య మామేకంశరణంవ్రజ' అనియు 'తస్మిన్నేపాయతాయాంగ' అనియు 'మామేవైష్యసి' యనియు, సృష్టియందు మూఁడువిధములయిన కారణములును దానెయైనట్లు ఆత్యంతికప్రళయమైన మోక్షమందును, అంగమును అంగియును ఉపాయమును ఉపేయమును ఒకటెయై, యెల్లవారికి ముక్తికలుగుట నైషమ్యము నైర్ఘృణ్యము మొదలగుదోషములు రాకుండుటకుఁగాను అధికారిస్వరూపయోగ్యతను గలిగించుటకు వలయు అనుకూల్యసంకల్పాదిమాత్రముల నపేక్షించునదియై, యిటువంటి యనేకగుణపౌష్కల్యములవలన భక్తికంటెను ప్రపత్తియే మిక్కిలియు విలక్షణమగుచున్నది. ఇటువంటిప్రపత్తిని చేసినవానికి, (ప్రపన్నాయైవ) 'మన్త్రివ్యూహేనయేచారే యుక్తోభవితుమర్హతి'! అని కర్మయోగనిష్ఠులయిన మీకును నేనుగాను'జామ్బవాం స్త్వథసంప్రేక్ష్య శాస్త్రబుద్ధ్యావిచక్షణః'అనిజ్ఞానయోగనిష్ఠులయిన జాంబవంతునకును నేనుగాను 'భక్తిశ్చ యతా వీర' అని భక్తియోగనిష్ఠుఁడయిన హనుమంతునకును నేనుగాను 'రాఘవంశరణంగతః' అని ప్రపన్నుఁడయిన విభీషణునికే యగుదును. (ప్రపన్నాయైవ) 'అకారార్థాయైవ' అన్నట్లు వాఁడు నాకేయైయుండునట్లు నేనును ప్రపన్నునకే కావలసినవాఁడనగుదును.

వాఁడు ప్రపన్నుఁడగుట క్షుద్రప్రయోజనమునకేకదా? 'రాజ్యంప్రార్థయమానశ్చ బుద్ధిపూర్వమిహాగతః' అని హనుమంతుఁడేకదా చెప్పినాఁడు అనఁగా, (తవాస్మీతిచయాచతే) అనన్యప్రయోజనుఁడైయే వచ్చినాఁడుసుమీ యనుచున్నాఁడు. అనఁగా చకారము అవధారణార్థకము. విభీషణుఁడు దూతవధము కూడదని తనకుఁ జేసినయుపకారమునకు ప్రత్యుపకారముగా రాజ్య మియ్యవలయునని యభిప్రాయముతో హనుమంతుఁడు చెప్పినాఁడింతేకాని విభీషణుఁడు చెప్పినాఁడో?'నదేవలోకాక్రమ

కొనిరమ్ము. శరణన్నపుడే వానికి నే నభయమిచ్చితినైనది. వాఁడు విభీషణుం డయినంగానీ లేక విభీషణవేషము వేసికొని రావణుఁడు తానే వచ్చినవాఁడయినంగానీ, విభీషణుఁడు గాఁడు రావణుఁడని నాకు చెప్పకొఁఅకును నూరక మరలిరాక యెవఁడుగానుండినను పిలుచుకొని యేరమ్ము' అనెను. వానరేశ్వరుండగు సుగ్రీవుం డట్లు రాముఁడు చెప్పినమాట విని, 'రావణుఁడైనను దోడ్కొనిరమ్ము' అని యెంతటిదుష్టుఁడయినను శరణాగతుని యం దతఁడు చూపుసౌహార్దమునకును అభయమిచ్చియు తన్నే (సుగ్రీవునే)పోయి తోడ్కొనిరావలయుననుటచే తాను సమ్మతించిననే విభీషణుని స్వీకరించునట్లు తనయందుఁ జూపిన సౌహార్దమునకును మిక్కిలియాశ్చర్యమునం బురికొని యట్టిసౌహార్దముగల యతిశయమునకు మూలముగా కాకుత్స్థవంశమునఁ బుట్టుకనొందిన యారామునిం జూచి * 'రామా! నీవు ధర్మసూక్ష్మముల నెఱింగినవాఁడవు. లోకములనెల్ల రక్షించు

స్వీకర్తానులక్ష్యలేదనుటెంచు మాటచేత, (అభయం దత్తం) శరణు అన్నపుడే అభయము ఇచ్చితినైనది. 'అభవసోఽభయం బోధవతి' నేను స్వీకరించువాఁడగుటకును వాఁడును స్వీకరింపఁబడినవాఁ డగుటకును అనుమతియున్నది. ఇట్లు రాముఁడు చెప్పఁగావిని ఎట్లు పిలుచుకొని వత్తునని యాలోచించుటతో పిలుచుకొనివచ్చుటకు పోవుచుండఁగా మరల రాముఁడు పిలిచి సమాధానము చెప్పుచున్నాఁడు. (విభీషణో వా రావణస్స్వయం యదివా) విభీషణుఁడే కాదా లేక తెమ్మన్నను మరలక రావణుఁడైనను పిలుచుకొనిరమ్ము. విభీషణుని స్వీకరించితిమేని 'విభీషణస్తు ధర్మాత్మా' అని ధర్మాత్ముని స్వీకరించుటవలన మనకొకయుత్కర్షము గలుగును. 'రావణస్యనృశంసస్య' అన్నట్లు అనృశంసుని స్వీకరించినచో యుత్కర్షము కలుగును. మఱియు విభీషణుని స్వీకరింపఁగా వానితోడి నలుగురే రక్షితులగుదురు. రావణుని స్వీకరింపఁగా లంకలోని వారందఱును రక్షితులగుదురుగాన మనకు పెద్దలాభమగును. (సుగ్రీవ) 'ఏకం సుఖం సుఖంవినో' అని యుద్ధమునకును సుఖమునకును లోకములకును నాకుఁగలుగు సంతోషమును సమానముగాఁ గలుగునుగదా. (యదివా రావణస్స్వయమ్) స్వయము సంబంధముగలవాఁడగుటచే విభీషణుఁడు యిందు శంక గలుగుచున్నచో యుష్టి రావణుఁడే వాఁడగుఁగాక! (స్వయం) లేదు మున్నయు రావణుమాత్రమే వచ్చిన రావణుఁడయినను గాని, లేక (స్వయం) వాఁడు విభీషణుఁడు కాఁడు. రావణుఁడయిన రావణుఁడే విభీషణవేషము దాల్చివచ్చినప్పటికి అభయము నేనిచ్చితిని. నీవును 'వాఁడు రావణుఁడే కాని విభీషణుఁడుగాఁడు' నాకు తెలుపుటకుఁగూడ మరలి యూరక రావలదు. తోడ్కొనియే రమ్ము' అనియర్థము.

* ఇందులకుమూలము. 'కిమత్రచిత్రంధర్మజ్ఞ లోకనాథసుఖావహ। యత్త్వమార్యప్రభాషేథాః సత్త్వవాన్ సత్పథేస్థితః' విశేషార్థము.—రాముని స్వాభావికకల్యాణగుణగణముల నాలోచించి యివి సహజధర్మములగుటచే రామునియందుఁ జూపట్టుట యొకయాశ్చర్యముకాదని సుగ్రీవుఁడు చెప్పుచున్నాఁడు. (కిమత్రచిత్రమ్) నీవుగాక యితరు లీమాటను జెప్పిన నేకదా యాశ్చర్యమగును. నీవు చెప్పితివనఁగా ఆశ్చర్యమా? ఆశ్చర్యముగాదనుటకు మీఁద హేతువులు చెప్పుచున్నాఁడు. (ధర్మజ్ఞ) ధర్మసూక్ష్మతత్త్వములను దెలిసిననీకు ధర్మానుష్ఠానమొకయాశ్చర్యమా? ధర్మములందెల్ల చేవయెక్కినధర్మము శరణాగతరక్షణమని తెలిసినవాఁడవుగదా. ఇంతమాత్రమా? (లోకనాథ) లోకములకు స్వామివి. భృత్యవర్గమును రక్షించుట స్వామికి ఒకవిచిత్రమా? చిన్నదానిని పెద్దది బాధింపకుండు

స్వామివి, పరులకు సుఖము గూర్చుటకే యుదయించినవాఁడవు. నీయధ్యవసాయము ప్రశంసనీయము. నీవు సర్వశక్తివి. ధర్మసంస్థాపన మనుసన్మార్గమందు స్థిరముగా నెలకొన్నవాఁడవు. ఇట్టినీవు ఇట్లింతయు నొప్పిదముగాఁ జెప్పుటలో నాశ్చర్యమేమున్నది? 'నన్నుఁ బొగడి యేమి? నీకు మనస్సు గలిగిననే కదా విభీషణుని గ్రహించుట!' యందువా? *నీ యంతరాత్మకే కాక తీవ్రదండమునఁ జంపుమన్న నాయీయంతరా

నట్లు మామకానియమునకుఁ గొంతింతయగునట్టి సర్వసర్వాహకత్వము గలవాఁడవుగదా. (సుఖా...) నీసర్వాహకత్వము దుఃఖపద్రుక్తమైనదిమాత్రమా? సుఖహేతువుగాఁ గూడఁ గదా యున్నది. అవాప్తసమస్తకాముఁడవయ్యును పరప్రయోజనైకపరాయణుఁడవై సర్వసుఖకారుఁడవగు నీవు శరణాగతులందును సమాశ్రితులగు వారియందును సుఖకారివగుట యేమిచిత్రము! (సత్త్వవాన్) 'త్వయుక్తిశ్చైవ సమాపన్నే' 'నీకు కొంచెపు మనస్సు గలిగినదేమో యుక్తులతో నాకుఁ జెనెను' యన్ననీవు నేను 'వధ్యతామ్' 'విభీషణుఁ జంపుఁడు' అనఁగా అట్టి నాయందుఁ గూడ ప్రేమను చూపఁగడఁచి 'సత్యజేయమ్' 'విడువను' అనుమనస్సునందు స్వధార్హ్యవసాయము గలవాఁడవుగదా. స్వప్రయత్నమైనవారికి ప్రయోజనమును చింతయా? (సత్త్వవాన్) సత్త్వమనఁగా బలము. సర్వశక్తివగు నీకు సమాశ్రితులభయము వారించుట యాశ్చర్యమా? (సత్పథే స్థితః) ఆశ్రితులందరివారికొఱకు బహుమానించి చేయఁబడునట్లు శరణాగతరక్షణమందు నిష్ఠుఁడవుగదా. ధర్మసంస్థాపనార్థమే యవతరించినవానికి శరణాగతరక్షణమనెడు విశేషధర్మము ననుష్ఠించుట యాశ్చర్యము కాదు. శరణాగతరక్షణవిషయమై ధర్మజ్ఞత్వమునం బెదేనొకటియే చాలియుండఁగా అన్నియును గూడియుండఁగా చెప్పనేల? యనుట. (ఆర్యవృత్తం ప్రభాషేథాః యత్) సమస్తలోకమును నీమాట నీవలోనే కొలుచుకొనునట్లు నీవు చెప్పినదేదియో—అనఁగా 'దోషోయద్యపి తస్యస్యాత్' అనియు 'అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ' అనియుఁ జెప్పినమాట ఉత్కృష్టస్వభావములుగల నీవు చెప్పితివనుట యొక యాశ్చర్యమా? నీవుగాక మఱొకరు చెప్పిననే కదా యాశ్చర్యమగును. (ఆర్యం ప్రభాషేథాః) అని గోవిందరాజాదిపాఠము. సమీచీనముగా చెప్పితివనుట యొక యాశ్చర్యమాయను యర్థము.

*ఇందులకు మూలము. 'మమ చాప్యన్తరాత్మాయం శుద్ధం వేత్తి విభీషణమ్। అనుమానాచ్చ భావాచ్చ సర్వతః సుపరీక్షితః' విశేషార్థము:— 'నామాటను నీవు కొనియాడుటచే ప్రయోజనమేమి? నీమనస్సు తేలికనే కదా యతని స్వీకరించుట' యని రాముఁడనఁగా నా మనస్సు తేలికవిషయమందు ఒకనాఁటికేయు లేదనుచున్నాఁడు. (మమ చాపి అన్తరాత్మా) నీయంతరాత్మయేకాక 'వధ్యతాం తీవ్రదండేన' యన్నట్టి నా యొక్క యీయంతరాత్మయు, (విభీషణం శుద్ధం వేత్తి) విభీషణుని దోషరహితునిగాఁ దెలియుచున్నది. విభీషణుఁడు శుద్ధుఁడను విషయమందు నాయంతఃకరణగతి యొకటియే ప్రమాణము కాదు. ఇతరప్రమాణములు గూడఁ గలవనుచున్నాఁడు. (అనుమానాచ్చ) నీవును హనుమంతుఁడును జెప్పినయుక్తులవలనను, (భావాచ్చ) లోపలిభావమును దెలుపు ముఖప్రసాదాదులవలనను, లేక (అనుమానాచ్చ) ముఖవికారాదిచిహ్నములవలనను, (భావాచ్చ) వీనిమాటలచేతను ధ్వనిచేతను తేటపడిన మనస్సుయొక్క మృదుస్వభావముచేతను, (చ) చకారమువలన నేను 'వధ్యతామ్' అన్నపుడును, నీవు 'సత్యజేయమ్' అన్నపుడును, హనుమంతుఁడు 'విద్యతేత్వస్య సజ్జ్రీహః' 'వీనిని బరిగ్రహించుటకు వీలున్నది' అన్నపుడును ఎక్కువతక్కువలేక ఒకరూపుగానుండుటవలనను, (సర్వతః) ఇట్లు సర్వప్రకారములచేతను, (సుపరీక్షితః) సంశయవిపర్యయములు లేనట్లు పరీక్షింపఁబడినాఁడు. పరీక్షించి పరిశుద్ధుఁడని తెలిసికొంటిననుట.

త్మకుసయితము విభీషణుఁడు పరిశుద్ధుఁడుగానే తెలియుచున్నాఁడు. నాయంతరాత్మను బట్టియేకాదు. హనుమంతుఁడును నీవును జెప్పినయుక్తులను మనస్సునుబట్టియి చ్చ్యుముఖవికాసాదిలక్షణములనుంగొని యనుమానించుటంబట్టియు,వీనియర్థధ్వనిచే ప్రకాశితమయిన మృదుస్వభావముంబట్టియు. నేను జంపు మన్నపుడును నీవు దిగవిడువనన్నపుడును నొక్కతీరుగానేయున్న వీనియునికింబట్టియు, లోపలను వెలుపలను వీనిని జక్కఁగా పరీక్షించి యైనది. కాఁబట్టి, రాఘవా! *మహాప్రాజ్ఞుండయిన విభీషణుండు శీఘ్రంబున మాతోపాటిగా నొక్కండై యుండుఁగాక. మాకు స్నేహితుండు నగుఁగాక' యనెను. † అంత నరేశ్వరుండగు రాముఁడు సుగ్రీవుఁడు చెప్పినమాటను

* ఇట్లు శుద్ధస్వభావుఁడగుటచేతను మేమంతయును పొందఁదగు పెంపును ఇతఁడొక్కఁడుకూడ పొందవలయు ననుచున్నాఁడు. ఇందులకు 'తస్మాత్ క్షిప్రం సహాస్మాభి స్తుల్యో భవతు రాఘవ । విభీషణో మహాప్రాజ్ఞ స్సఖిత్వం చాభ్యుపైతు నః' అనిమూలము. (తస్మాత్ క్షిప్రమ్) కాఁబట్టి శీఘ్రముగా-'ఆగామ ముహూర్తేన' అని యితఁడు పలికియుండుటచేతను, 'దత్తమస్యాభయం మయా' అని నీవు అభయమిచ్చియుండుటచేతను విలంబమునకు హేతువేలేదు. ఇట్లుండ నాచలనసె వానిని స్వీకరించు విషయమున విలంబమునకు లేదు. ఇంక నాకు స్థితిలేకయుండ నతనిని నాతోఁ గూడ స్వీకరింపవలయునుగాను క్షణకాలమును విలంబము లేదు. (సహాస్మాభిస్తుల్యోభవతు) మమ్ము నెల్లవారిని కంకరులనుగాఁ గొన్నట్లు ఇతనిని నొకనినిగూడ కింకరునిగాఁగొని స్వీకరింపవలయును. (సహాస్మాభిః) ఇతనిని కింకరునిగాఁ గొనునప్పుడు ఇతఁడు ప్రధానుఁడుగాను మేమితనికి పరికరియుగాను కైంకర్యముచేయునట్లు స్వీకరింపవలయును. 'సహాయు క్తేప్రధానే' (రాఘవ) శరణాగతరక్షణము చేయనపుడు స్వరూపము నశించునట్టి వంశమునందుఁ బుట్టినవాఁడవుగదా. (విభీషణః మహాప్రాజ్ఞః) జ్ఞుఁడు అనఁగా 'మనలను ఆకించన్యమే యూఁతగా రాముఁడు స్వీకరించు' ననియుండువాఁడు. ప్రాజ్ఞుఁడనఁగా 'రావణసంబంధమువలని దోషములనుచూడక స్వీకరించు'నని యుండువాఁడు. మహాప్రాజ్ఞుఁడనఁగా 'ఎంతయు అంతరంగులయినను 'వధ్యతామ్' అని తన్నుఁజంపుమన్నను తాను వెనుదీయకయే నన్ను జేటపట్టి స్వీకరించు' నని యుండువాఁడు. ఇట్లు నన్ను ఉన్నరీతిని తెలియునట్టి మహాజ్ఞానముగలవాఁడుగదా, (తుల్యోభవతు) 'నివేదయత మామ్' అని పురుషకారముసేయుటకై యాచింపఁబడిన క్రూరులమగు మాకు పురుషకారత్వము సంపాదించుటకొఱకే నీవెత్తుకొన్న యీప్రయాసమును సిద్ధమైనది. ఇఁకమీఁద మే మీపురుషకారవ్యాపారము జేయుదుము. అనియర్థము. ఇట్లు విభీషణుని పురుషార్థత్వమునువేఁడి వానితో స్నేహమనెడి తమయొక్క పురుషార్థమును వేఁడుచున్నారు. విభీషణుఁడు (నఃసఖిత్వ ఞ్చాభ్యుపైతు) 'సఖాదాసోస్మి' యన్నట్లే నేనుపొందిన పెంపు పొందవలయును. మాకు సఖిత్వమును పొందవలయును. (మహాప్రాజ్ఞః) ఫలమునుసాధించుట కుపయుక్తమైన జ్ఞానముగలవాఁడు. (నః) నాకుమాత్రమే కాదు. ఎల్లవారికిని ఈఫలము సమానమని తెలుపుటకు (నః) అన్నాఁడు.

† ఇందులకు 'తతస్తుసుగ్రీవవచో నిశమ్య తద్ధరీశ్వరేణాభిహితం నరేశ్వరః । విభీషణేనాశు జగామ సఙ్గమం పతత్రిరాజేన యథాపురన్దరః' అని మూలము.విశేషార్థము.- ఇట్లు సుహృత్తరుఁడయిన సుగ్రీవుఁ డనుజ్ఞచేసినయనంతరము శరణ్యుఁడగు రామునికి శరణాగతునితోడి సంగమమును జెప్పుచున్నాఁడు. (తత్ సుగ్రీవవచః నిశమ్యతు) ఆసుగ్రీవునిమాటనువిని - 'వధ్యతామ్' అన్న సుగ్రీవునియొక్క అను

విని, యంత నా వానరశ్రేష్ఠుఁడు పోయి తా నభయమిచ్చి రమ్మన్నమాట విభీషణునకుం జెప్పి దోడ్కొనిరాఁగా, దేవేంద్రుఁడు గరుత్మంతునితోడం బోలె రాముఁడు శీఘ్రంబునఁ దానే విభీషణునితోఁ గలసికొనెను. ఇది పదునెనిమిదవసర్గము.

---

{ రామవిభీషణ సమాగమము; శ్రీరాముఁడు వానర మధ్యమున విభీషణుని లంకకుఁ బట్టముగట్టుట, సముద్రమును దాఁటఁ జింతించుట.

*రఘుకులుండగు రాముఁ డభయము నొసంగఁగానే మహాప్రాజ్ఞుండును రావణునితమ్ముండునగు విభీషణుఁడు, ఇష్టసిద్ధికి సంతుష్టుండై తనయందు భక్తిగల యనుచరుల

---

కూలమయిన ఆమాటను విన్నపిమ్మట (పితృచేఁ) బుట్టిన విశేషము 'తు' శబ్దము తెలుపుచున్నది. (నిశమ్య తతః నరేశ్వరః అభూత్) విని యంత నరేశ్వరుఁడయ్యెను. హనుమంతునిమాట విన్నపుడు సత్త్వగలవాఁడయ్యెను. సుగ్రీవునిమాట విన్నపుడు నరేశ్వరుఁడు అనఁగా సర్వనిర్వాహకుఁడయ్యెను. (హరీశ్వరేణాభిహితం విభీషణేన సఙ్గమ మాశుగాగాను) సుగ్రీవుఁడు 'విభీషణా ! నీకు రాఘవుఁ డభయమిచ్చినాఁడు. రామునికడకుఁ బొమ్ము' అని చెప్పినట్టి విభీషణునితోడి సంగమమును శీఘ్రముగాఁ బొందినాఁడు. (హరీశ్వరేణాభిహితమ్) వానరపరికరమును దానును ప్రవేశింపఁజేయును అన్నవాఁడే యిప్పుడు ఆవానరపరికరమును దానును స్వీకరింపవలయు ననుచున్నాఁడనుట, (ఆశుగాగాను) కట్టువిడఁబడ్డ లేఁదూడ యాపుదూడవలెఁ బరువెట్టు చటుక్కున విభీషణునితోఁ గలసినాఁడు. సుగ్రీవుని ముందు సమ్మతించి యేదియు నాకు కూల్యము తిరుగఁబడునేని ఏమిచేయుదునని అతఁడు సమ్మతించినపుడే చటుక్కునఁబోయి కలసికొన్నాఁడనుట. 'సత్యాజేయం కథంచన' ఇత్యాదులచే సుగ్రీవాదివాక్యరూపములగు విరోధులను నిరసించి శ్రీవిభీషణ స్వీకారమును ప్రతిజ్ఞచేసి యెట్లో కష్టమునిమాఁడ సుగ్రీవాదుల మాటలవలనఁ బుట్టిన విలంబము నోర్వలేక త్వరతో రక్షించుటకు తానే పోయి కలసికొన్నాఁడనుట. (ఆశు) ఆశ్రితులతోడి సంశ్లేషమునందు త్వరాతిశయము గలవాఁడనుట, (పురన్దరః పతత్రిరాజేన యథా) ఇంద్రుఁడు తానే గరుత్మంతునితోఁ గలసినట్లు రాముఁడు తానే కలసినాఁడనుట.

*ఇట్లు శరణ్యుఁ డగువానికి శరణాగతునితోఁ గలయుట యనెడి ఫలమునుజెప్పి యిప్పుడు శరణాగతునికి శరణ్యుని సేవసేయుట యనుపురుషార్థలాభమును జెప్పుచున్నాఁడు. రాముఁడును స్వీకరించి సుగ్రీవుండును సమ్మతించినపిదప విభీషణుఁడు చేసినది చెప్పఁబడుచున్నది. 'రాఘవేణాభయే దత్తే సన్నతో రావణానుజః । విభీషణో మహాప్రాజ్ఞో భూమిం సమవలోకయన్ । ఖాత్పపాతావనింహృష్టో భక్తైరనుచరైస్సహ' అని మూలము. విశేషార్థము.— (రాఘవేణ) శరణాగతరక్షణము తన కొక యతిశయము గాక సామాన్యముగా కులాగతధర్మముగాఁ గలిగినవాఁడు. రఘుకులము శరణాగతరక్షణమునఁ బేరుగన్నదిగదా. (అభయేదత్తే) స్వాపేక్షితమయిన సర్వభూతాభయము ఇయ్యఁబడఁగా, 'దత్తమస్యాభయంమయా' అన్నమాట జీవించినది సుగ్రీవుఁడు సమ్మతించినపిదపనే యనియర్థము. అంతకుమునుపు అది అసత్ప్రాయమై యుండెననుట. (రావణానుజో విభీషణస్సన్నతః) రావణునితమ్ముఁడగు విభీషణుఁడు మిక్కిలి వినయవినమితాంగుఁడై, 'నన మేయమ్' అని లోఁబడనని యుండిన రావణునికిఁ దమ్ముండయియుండి యితరులు చేపట్టి త్తవలయునట్లు రామపాదములందు పడినాఁడుగాయని బుషి

తోఁగూడ కాళ్లు ముందుగాదిగుట యనుచితమని పూర్వకాయమును మిక్కిలియు వినయమున వంచి రామునిచుట్టి ప్రక్కకుఁజేసి యున్న బలంగమునడుమ తనకుఁ దెలిపియిచ్చిన నేలను సూటిగాఁజూచుచు, ఇట్లాకాశమునుండి క్రిందికి గొబ్బున దిగెను.*శరణాగతిధర్మమున సర్వావస్థలందును నెలకొనియుండు నావిభీషణుఁడు శరణు

కొనియాడుచున్నాఁడు. (స॰ ౨౮॰) 'గుణైర్దాస్యముపాగతః' 'గుణములచేత దాస్యమును బొందినాఁడు' అన్నట్లు పూర్వము తాను విన్నదానికన్న నధికముగా రామకల్యాణగుణములను సాక్షాత్కరించుటచే మిక్కిలియు వినయవినమ్రములైన యంగములు గలవాఁడనుట. (మహాప్రాజ్ఞస్సన్న తః) రాముని కభిమానులుగా నుండిన సుగ్రీవాదులు 'నిహన్యతామ్' అనఁగా రాముఁడు 'సత్కృతేయమ్' అని స్వీకరించినయుపకారియును నగు రామునియం బడినాఁడనుట. (మహాప్రాజ్ఞః) నిరపాయమయిన యుపాయమును పరిగ్రహించుటచేత పరమపురుషార్థమును లభించుటంబట్టి వేదశాస్త్రముల నభ్యసించుటవలనఁ గలిగిన ప్రజ్ఞాతిశయ మిప్పుడు సఫలమయిన దనభావము. (భూమింసమవలోకయన్ సన్నతః) నారదర్శనము బాధింపక తానే వచ్చుబడినాఁడేయు, లజ్జనొందినవాఁడై సోపానమునం బడినాఁడనుట. (భూమింసమవలోకయన్) రాముని యంగప్రదేశము అంతరంగులగు పరిజనులు గుంపులుగొని ప్రక్కచేసి యుండుటచే నెవరు లేపించెను, మంత్రులతో నాకు విభీషణునకు నున్న బలియున్న కొలువు నడుమ భూమియం దిచ్చినయెడమును చక్కఁగాఁ జూచుచు వలఁదు దిగినాఁ డనుట. (ఖాత్ పపాతావనిం హృష్టః భక్తైరనుచరైస్సహ) సుగ్రీవుఁడు 'నిహన్యతామ్' అన్నపుడు నేలను గాలూనకయే ఆకాశమునందే నిలిచినవాఁడు. ఆసుగ్రీవుఁడు తానే పోయి పిలిచినపిదపఁ గలిగిన ప్రీత్యతిశయము వలన రామునిపాదము లంత మేరవెనుబోక పరిచరకరములతో ఆకాశమునుండి భూమిపైఁ బడినాఁ డనుట, (ఖాత్ అవనింపపాత) మొట్టమొదటఁ గావించిన ప్రణామము. దూరమునఁ గావించినది ప్రణామములకుఁ దగినచోటగు నాకాశమును విడిచి పాణి పాదము శిరస్సు మొదలయిన యష్టాంగములతో భూమిని బొందినాఁ డనుట. విభీషణుఁ డపేక్షించిన యభయమును, సత్తమెయుండఁగా, నరుల నెందులకు ప్రణామము చేసినాఁ డనఁగా (హృష్టః) రాముని స్వరూపరూపగుణవిభవముల ననుభవించుటచేఁ బుట్టినహర్షమున శరీరము వివశమై ప్రణమిల్లినాఁడుగాని మఱొకప్రయోజన ముద్దేశించికాదు. (భక్తైరనుచరైస్సహ) 'ఉత్పపాత గదాపాణిశ్చతుర్భిస్సహ రాక్షసైః' అని విభీషణుఁడు లంకాసంబంధమును విడిచినపుడు అప్పుడు మంత్రులును అసంబంధమును విడిచినవారయిరి. మఱియు 'సద్యోతామేవ శ్రీవేణ పక్షేనసచివైస్సహ' అని వధోద్దేశమునందు భాగమునొందిరి. కాఁబట్టి యిప్పుడు స్వీకారమునందును అంతర్భూతు లయిరి. మఱియు 'నివేదయతమామ్' అని విభీషణుఁ డొక్కఁడే యుపాయము నాశ్రయించినవాఁడైయుండఁగా వానిని సంబంధించినవారికి అప్పయుండవలిభక్తివలన నే రామపరిగ్రహము సమానముగుచున్నదని తెలియుచున్నది. దీనివలన ఒకనిని నిశ్చయముగా వైష్ణవుఁడని నిర్ణయించినయెడల అతని విడిచియుండ నేరని స్నేహము గలవారిని పరీక్షింప నక్కఱలేదని యభిప్రాయము.

* పూర్వము వాచికమైన ప్రపత్తి చేయఁబడినది. ఇపుడు కాయికమగు శరణాగతిని ప్రయోగించుచున్నాఁడు. మఱియు ఆ రీతిని రామునిపాదముల పట్టుఁగొమ్మగాఁ దలఁచి సపరికరముగాఁ బడుచున్నాఁడు. 'సతురామస్యధర్మాత్మా నిపపాతవిభీషణః । పాదయోశ్శరణాన్వేషీ చతుర్భిస్సహరాక్షసైః' అనుమూలము. విశేషార్థము:—(సతు) మునుపు కలంగియున్నట్లుగాక యిపుడు కలఁత లేకున్నవాఁడు. సంశయవిపర్యయము తీఱఁగా అనుకూలుఁడు అని సుగ్రీవాదులచే నిర్ణయింపఁబడినవాఁడు. (విభీషణః

గోరి, రాక్షసులు నలుగురుం దానును రాముని చరణంబులం బడెను. *అట్లు పడునపుడు, అందఱు నైకమత్యము నున్నయాసదస్సున, విభీషణుఁడు శరణ్యుఁ డగు రామునే చక్కఁజూచి శరణాగత్యంగము లయిన యనుకూలసంకల్పాది ధర్మములతోఁ గూడినవియు, సమర్థుండును కారుణికుండు నగు శరణ్యుని గూర్చిన వగుటచే యోగ్యంబయినవియు, మునుపు సుగ్రీవాదులకు శ్రుతికటువు గానుండినను నిప్పు డయ్యందఱకును మిక్కిలియు హర్షంబు గూర్చునట్టివియు నగు పలుకుల†'నేను రావణుని తమ్ముండను. అతఁడు

ధర్మాత్మా) సర్వావస్థలందును శరణాగతిధర్మమునందే మనసు కలుగకరోనే యున్నవాఁడు. అనఁగా 'వక్ష్యతామ్' 'శక్యతామ్' 'సర్వ్యజేయమ్' 'ఆనయ్యేతామ్' 'అస్మాకం స్తూన్యభవతు' అన్నయిన్ని యవస్థలయందును భేదములేక 'రాఘవంశరణంగతః' అని తాను పట్టినపట్టు విడువనివాఁ డనుట. దీనిచే విభీషణునకు మహావిశ్వాసము చెప్పఁబడినది. (రాఘవన్య) దేవయుగ ఆపరాతిశయము నోఁచుసట్లు అతిరాఘవాయ్యే ప్రియసాను గలిగియున్న రామునియొక్క, సర్వలోకశరణాన్వేషి యన్నఁబడు గుణము) సుగ్రీవాదులనంబరోతె హానముతో రిడయ ప్రత్యక్షముగానుగాఁ దలఁచినాఁ డనుట. (శరణాన్వేషి) శరణవరణముతో, (వహాతి) ఇరువురుకచ్చి భిగిరూపిన నియమయతములను చక్కఁగా పొందికపట్టిని రేసినత్తునట్లుగా పడినాఁ డనుట. (చతుర్భిస్సహరాక్షసైః) తాను పడుటలో వారుకూడ నంతియూర్భవు లగునట్లు పడినాఁ డనుట. (చతుర్భిస్సహరాక్షసైః) దినమ కరసరణాన్యనయమయములనౌ పరతంత్రు లయినవారితోఁ గూడ పాదములం బడినాఁ డనుట. ఇట, ఆనుకూల్యసంకల్ప ప్రాతికూల్యవర్జనము కలిగియుండుటయు 'ధర్మాత్మా' అని మహావిశ్వాసమును 'శరణాన్వేషి' అని గోప్తృత్వవరణమును, 'వహాతి' అని ఆత్మనిక్షేపమును, ఇట్లు సాంగముగా శరణాగతి సేయఁబడినదని తెలియునది.

*ఇట్లు కాయికమగు శరణాగతిని జెప్పి మరల వాచికమును జెప్పుచున్నాఁడు. 'అబ్రవీచ్చ తదా రామం వాక్యం తత్ర విభీషణః । ధర్మయుక్తం చ యుక్తం చ సాంప్రతం సంప్రహర్షణమ్' అని మూలము. విశేషార్థము.—(విభీషణః అబ్రవీచ్చ) 'పాదయోర్న్యపతత్' కాయికమగు శరణాగతిని జేసియంతే రామునకుఁ జాలియున్నను అంతమాత్రము తనకు చాలకుండుటవలన వాచికమగు శరణమును జొచ్చినాఁ డనుట. (తదా) పాదములం బడుసమయమం దనుట. (తత్ర) రాముఁడును సుగ్రీవాది వానరులును ఏకకంఠులై యున్న గోష్ఠియందు, (రామం వాక్యమ్) 'సుగ్రీవం తాంశ్చ సంప్రేక్ష్య' అని తన్నుఁ దెలుపుటకు పురుషకారభూతులయిన సుగ్రీవాదులను గూర్చి చెప్పుటకాక శరణ్యుఁ డగు రామునే చక్కఁజూచి చెప్పినమాట (వాక్యమ్) సర్వార్థమును సంపూర్ణముగా చెప్పునది. (ధర్మయుక్తం చ) శరణాగతికి అంగములయిన ధర్మములతోఁ గూడినది, (యుక్తం చ) సమర్థుఁడును కారుణికుఁడు నయిన శరణ్యుని గూర్చి ప్రయోగింపఁబడునది గాన యుక్తమైనది, (సాంప్రతం సంప్రహర్షణమ్) 'రాఘవం శరణంగతః' అన్నమాట సుగ్రీవాదివానరులకు శ్రవణకటుకమై యుండినట్లుగాక ఇప్పుడు అందఱకును హర్షజనకముగా నుండునది చెప్పినాఁడు.

† ఆవాక్యమును జెప్పుచున్నాఁడు. 'అనుజో రావణస్యాహం తేన చాస్మ్యవమానితః। భవన్తం సర్వభూతానాం శరణ్యం శరణం గతః' అని మూలము. విశేషార్థము.—(అహం రావణస్యానుజః తేనావమానితోఽస్మి చ) ఈ శ్లోకమును జెప్పి మునుపే శరణుఁ జొచ్చియుండలేదా. మరల నిట్లు శరణుఁ జొచ్చుట యేలయనఁగా 'సుగ్రీవం తాంశ్చ సంప్రేక్ష్య' అని సుగ్రీవుని అతనిపరికరమును గూర్చి 'నివేదయత' అని

నన్నవమానించినాఁడు. కావున సమస్తభూతంబులకు రక్షకుండ వయిననిన్ను శరణుఁ జొచ్చితిని. *నేను నావాసస్థానమగు లంకను మిత్రులను వారివలనిధనములను బరిత్యజించి నీవేగతియని వచ్చితిని. ఇఁక నారాజ్యమును నాజీవితమును నాసుఖములును నీయధీనములు. ఇవియన్నియు నాకు నీకైంకర్యమెయగును' అనెను. †ఆవిభీషణుఁ

---

రామునికిఁ దెలిపెడి ప్రయోజనమునకుఁగాను, 'రాఘవంశరణంగతః' అని మునుపు పరోక్షరూపముగాఁ జెప్పినాఁడు; ఇచట 'భవన్తంశరణంగతః' అని చక్క రామునేగుఱించి ప్రత్యక్షరూపముగా చెప్పటచే పునరుక్తిలేదు. (అనుజః) అని స్వదోషమును జెప్పట ఆకించన్యమునకును ఉపలక్షణము. (సర్వభూతానాంశరణ్యమ్) పాపప్రచురుఁ డయినరావణుఁడు పుట్టినకడుపులోనే పుట్టి 'రావణస్య నృశంసస్య భ్రాతా' అని నిగోష్ఠిక కానివాఁ డగుటయేగాక 'త్వాంతుధిక్కులపాంసనమ్' అని ఆరావణునికిని కానట్టి నాకు శరణార్హుఁ డయినట్టి నీకు కానివారుగలరా? (సర్వభూతానాంశరణ్యం) రావణునికిఁగూడ శరణమయ్యెదనని సంకల్పించుకొన్నవానిని, (భవన్తం) జ్ఞానశక్త్యాది పరిపూర్ణుఁ డయినవానిని, (శరణంగతః) శరణుఁ జొచ్చితిని.

* అనంతరము ఇతరములయిన ప్రాప్యములను నిరసించి నీవే ప్రాప్యుఁడని చెప్పుచున్నాఁడు. "పరిత్యక్తామయాలఙ్కా మిత్రాణిచధనానిచ । భవద్గతం మేరాజ్యంచజీవితంచసుఖానివై' అనిమూలము. విశేషార్థము.—(పరిత్యక్తామయాలఙ్కా మిత్రాణిచధనానిచ) రావణుని సంబంధమువలన వచ్చినలంక యేమి? దానిని సంబంధించిన మిత్రులేమి? వారివలన సంప్రాప్తమైన ధనమేమి? మఱియు సోపాధికము లయినసంబంధములను సవాసనముగా విడిచి వచ్చితిని. ఇది ముముక్షువునకు శాస్త్రసిద్ధముగా త్యాజ్యములయిన ప్రాప్యాభాసములకు ఉపలక్షణము. (భవద్గతం మేరాజ్యంచ జీవితంచసుఖానివై) రాజ్యము అని పరిగ్రహములకెల్ల ఉపలక్షణము. 'జీవితమ్' అనుట ధారకపోషకభోగ్యములకు ఉపలక్షణము. 'సుఖాని' అని ఐహికాముష్మికసుఖములు, అన్నియు నీశ్రీచరణములే. సకలభోగ్యములును నీశ్రీపాదకైంకర్యసుఖమునందంతర్భూతము. 'మాతాపితాయువతయః' అన్నట్లును 'భ్రాతాభర్తాచబన్ధుశ్చ పితాచ మమరాఘవః' అన్నట్లును సమస్తము నీవే. నీకైంకర్యముతప్ప తక్కినవేదియు నాకిష్టము గాదనుట. 'సమ్బన్ధోఽపి న సమ్బన్ధ ఆత్మనః ప్రాణకాయయోః । పుత్రమిత్రకళత్రాదిసమ్బన్ధః కేన హేతునా' తన ప్రాణమునకును కాయమునకును సంబంధ ముండినను సంబంధములేనిదై యుండఁగా, ఇఁక పుత్రమిత్రకళత్రాదులతోడి సంబంధమెట్లు? కావు సర్వవిధబంధువు స్వామియగు నీవే. 'పితృమాతృసుహృద్భ్రాతృదారపుత్రాదయోఽపివా । ఏకైకఫలలాభాయ సర్వలాభాయ కేశవః' 'తల్లితండ్రి మొదలగువారు ఒక్కొక్కలాభమునకే యగుదురు. కేశవుఁడు సమస్తలాభములకొఱకు నగుననియున్నది.

† ఇట్లు విభీషణుఁడు నిజస్వరూపానురూపముగా చెప్పినమాటనువిని, తనకు నతనియెడలఁ గల యాదరాతిశయమంతయు కటాక్షమునం దోఁచునట్లుగా విశేషకటాక్షమునేసి రాముఁ డొకమాటం జెప్పుచున్నాఁడు. 'తస్య తద్వచనం శ్రుత్వా రామో వచన మబ్రవీత్ । వచసా సాన్త్వయిత్వైనం లోచనాభ్యాం పిబన్నివ' అనిమూలము. విశేషార్థము:—(తస్య) తనసకలపరిగ్రహములను దిగవిడిచి రాముని చరణములే శరణముగా చేపట్టినవానియొక్క, (తద్వచనం శ్రుత్వా) రామునిచరణములందలి కైంకర్యమే నాకు సకలభోగ్యజాలము అన్నమాటనువిని,(ఏనం వచసా సాన్త్వయిత్వా) నాపూర్వవృత్తమేమి యని విచారింపక నన్నిట్లు స్వీకరింపనయ్యెనా? యని హర్షించియున్న విభీషణుని రాముఁడు తానే యపరాధివలెఁ దలఁచి తన్ను మన్నింప వేఁడుకొనునట్లు ఇంపయినమాటలాడి—అనఁగా సాన్త్వైభవమును జెప్పిన

డట్లు న్యస్తభరుఁడై చెప్పినమాటవిని యతనిని 'శరణు అన్నపుడే నిన్నుస్వీకరింపవల యును. ఇంతవఱకు జాగు సేసినందులకు మన్నింపు'మని తిన్ననిమాటల నాశ్వాసించి, యతనిమనస్సు చల్లఁబఱిచి కన్నులంగవచేఁ ద్రాగునట్లు లతని సత్యాదరంబునఁ జూచుచు * 'నాకు రాక్షసులబలాబలములను ఉన్నదియున్నట్టుగాఁ జెప్పుము. అనియడిగెను. అంత విభీషణుఁడు ఏకార్యమును ననాయాసంబునఁ గావింపఁజాలు రాముఁడప్పుడు చెప్పినమాటను విని రావణునిబలమునంతయును జెప్ప నారంభించెను. "రాజకుమారా! రావణుఁడు బ్రహ్మదేవునివలన వరమువడసియుండుటచే గంధర్వులకును అసురులకును రాక్షసులకును మఱియుఁ దక్కిన సమస్తప్రాణులకును నతనిని వధింపశక్యముగాదు. రావణునకు పిదప వీర్యవంతుఁడగు కుంభకర్ణుఁడు నాకన్నయగును.అతఁడు మహాతేజుఁడు,యుద్ధమునందు దేవేంద్రునకుంబోలె బలముగలవాఁడు. రామా!ఆరావణునికి సేనాపతి ప్రహస్తుఁడు. కైలాసమునందు జరిగిన యుద్ధమునందు అతఁడు మాణిభద్రుని నోడించినవాఁడు. అతనిని హనుమంతునివలన నీవు వినియునుండవచ్చును.రావణునికొడుకు ఆయింద్రజిత్తు ఎప్పుడును శరసంధానము చేయుచుండువాఁడు గావున నారిదెబ్బ తగులకుండుటకై యల్లమును వ్రేళ్లకవచమును దొడుగుకొని భేదింపరాని కవచముందాల్చి వింటిఁగొని యుద్ధమున నిలిచియు నదృశ్యుఁ

కారణముంబట్టి రావణుఁడు 'యోఽన్యస్త్వేనం విధింబ్రూయాత్ తస్మిన్నేతన్నిశాచర! అస్మిన్మహాత్రే సభవే త్త్వాం శత్రుకులపాంసనమ్' అని నీనిని పరిభవించినప్పుడే నేను నిన్ను రక్షింపవలసినది; లేక 'శరణం గతః' అన్నప్పుడే యట్లు చేయవలసియుండెను. ఇంతకాలము ఆలస్యము చేసితిని. నేరగాంప్రము చేసినది మన్నింపుటకై దాయినది యని యనుయూఅడించినాఁ డనుట. లోచనాభ్యామ్ పిబన్నివ సామా సహ (బభౌత్) ఆ తిన్ననిమాటలచే అతనిని నిరుగావించి కన్నులచేఁ ద్రాగువానివలె విశేషకటాక్షముచేయ నవధరించినవాఁడై రాముఁ డొకమాట చెప్పినాఁ డనుట.

* నీవిరోధులను నాశము సేసి లంకారాజ్యమున నిన్ను పట్టముగట్టెదను. నీశత్రుబలము ఉన్న స్థితి చెప్పుము. అని రాముఁ డడుగుచున్నాఁడు. లేక నాకానుకూల్యము సేయుటయే నీవు ప్రయోజనముగా చెప్పితివే. కాయికమైన యానుకూల్యము పిదపఁ జేయుదువుగాక. వాచికమైనది యిప్పుడు చేయుమని చెప్పుచున్నాఁడు. 'ఆఖ్యాహిమమ తత్త్వేన రాక్షసానాంబలాబలమ్' అనిమూలము. విశేషార్థము.- (ఆఖ్యాహి రాక్షసానాంబలాబలమ్) ఆరాక్షసులలో నొకఁడవగు విభీషణుఁ డనేకజన్యజాతు లయిన వారిబలము నడుగువానివలె రాముఁ డడుగుట యెట్లు? అనఁగా 'నతు రాక్షసచేష్టితః' 'రాక్షస చేష్టితములులేనివాఁడు' అన్నట్లు రాక్షసచేష్టలు లేనివాఁ డగుటయే కాక రాక్షసజాతీయుఁడును గాఁడు. ఇతఁడు ఇక్ష్వాకువంశ్యుఁడు అని రాముఁడు విభీషణునిం దలఁచుటంబట్టి 'రాక్షసానాంబలమ్' అని రాక్షసులను అతనికి విజాతీయులైనవారినిగా నెన్ని వారిబలమును జెప్పుమని యడిగెనని తెలియునది. దీనిచే భగవత్సమాశ్రయణమువలనఁ గలుగు వైభవము తెలుపఁబడినది. (మమతత్త్వేనఆఖ్యాహి) రాక్షసబలమును సంహరింపనున్న నాకు వారిబలమును విశేషించి తెలియక చంపుట శక్యముగాదు. పగవారియుత్కర్షమును వర్ణించినయెడల నాకుఁ గోపము గలుగునని సంకోచింపక ఉన్నది యున్నట్లు చక్కఁగాఁ జెప్పుము. నీవాగోష్ఠిని జొచ్చియుంటివిగాన యందలిసర్వము నీకుఁ దెలిసియుండునని భావము.

డయియుంచును. 'అదృశ్యుఁడగుట యెట్లందువా? రామా! అతఁడు అగ్నిహోత్రుని హోమములచే తృప్తిపఱిచి యుద్ధసమయమునఁ బన్నియున్న వ్యూహములందు ఆయగ్ని ప్రభావమువలన పగవారికంటికిఁ గానరాకయె వారిం జంపును. మహోదరుఁడు మహాపార్శ్వుఁడు అకంపనుఁడు ననెడి యీ రాక్షసులతనికి సేనాపతులు; యుద్ధమున లోకపాలురకు సాటియైనవారు. కామరూపులును మాంసరక్తాహారులు నగు నిట్టిరాక్షసులు పదివేలకోట్లు లంకాపురమం దున్నారు. రాజగు రావణుఁడు వీరలం గూడియే లోకపాలురతో యుద్ధము సేసెను. యుద్ధము సేయుటయే కాదు; మహాధీరుఁ డగు రావణుఁడు వారిని వారికి సహాయులగు తక్కిన దేవతలును భంజించియున్నాఁడు" అనెను. దృఢపరాక్రముఁ డగు రాముఁడు విభీషణుఁడు చెప్పినమాట విని, అంతయు మనస్సునందు చక్కఁగా నాలోచించి యతనితో 'విభీషణా! రావణుఁడు శౌర్యముచే నేయే కార్యములు చేసినాఁడని కలరూపున జెప్పితివో వాని నెల్ల నే నొకసరకు సేయను (వానినెల్ల శౌర్యకృత్యములుగా నేను నిశ్చయింపను) జుమీ. నేను రావణుని ప్రహస్తుని రావణునిబంధువులను జంపి నిన్ను రాజుగాఁ జేయుచున్నాను. ఇది సత్యముగా నీకుఁ జెప్పుచున్నానుగాని నవ్వులాటలకుఁ గాదు. రావణుఁడు భూవివరములోఁ గాని పాతాళమునఁ గాని చొచ్చినను, తనకు వర మిచ్చిన బ్రహ్మదేవుఁ డుండు సత్యలోకమునకుఁ బోయినను గాని ప్రాణములతో నన్నుఁ దప్పించుకొనలేఁడు. నేను యుద్ధమున రావణునిని, వానిపుత్రులతోను బలములతోను బాంధవులతోను జంపక అయోధ్యను ప్రవేశింపను. ఇట్లని ప్రసిద్ధులగు నాముగ్గురుతమ్ములమీఁద నొట్టు పెట్టుచున్నాను' అనెను. ఎట్టికార్యము ననాయాసముగఁ జేయుదిట్ట యగు నా రాముఁడు చెప్పినమాటను విని శరణాగతిధర్మనిష్ఠుఁ డగు విభీషణుఁడు శిరముచే మ్రొక్కి చెప్పఁదొడంగినవాఁడై * 'నీవు రాక్షసులను వధించునపుడు నేను తోడుపడెదను. లంకను నాబలముకొలఁది నెదిరించి ముట్టడించెదను. శత్రుసైన్యమును నాచే నయినంతవఱకుఁ

* రాముఁడు 'అహత్వా రావణం సఙ్ఖ్యే సపుత్త్రం సహబాన్ధవమ్। అయోధ్యాం న ప్రవేక్ష్యామి త్రిభిస్తైర్భ్రాతృభిశ్శపే'॥ అని విభీషణునకు యుద్ధోత్సాహమునకు ప్రయోజకముగా శపథము నొనర్చియుంచినాఁడు. విభీషణుఁడును 'రాక్షసానాం' అను శ్లోకముచే తాను కైంకర్యము సేయువిధమును జెప్పుచున్నాఁడు. రాముఁడు చెప్పినట్లే విభీషణుఁడును చిన్న ఇందు రాక్షసులకు విజాతీయుఁడుగా ననుసంధించి చెప్పుచున్నాఁడు—'రాక్షసానాం వధే సాహ్యం లఙ్కాయాశ్చ ప్రధర్షణే। కరిష్యామి యథాప్రాణం ప్రవేక్ష్యామి చ వాహినీమ్' అను మూలము. విశేషార్థము.—(సాహ్యం) నీ వారంభించిన కార్యమునకు సహాయాంతరమక్కఱలేదుగాని రాక్షసవధమునకై నీవు పూనెడికార్యమందు నినుబోటికి నేను సాహాయ్యము చూపవలసినది లేకపోయినను, నా స్వరూపసిద్ధికొఱకై యుద్ధమునందు బాణము లెత్తియిచ్చుచున్నాను. (యథాప్రాణమ్) 'రాఘవార్థే న ప్రాణేషు కురుతే దయామ్' అని వానరులు రామునివిషయమై తమ ప్రాణములందును దయఁజూపనట్లు తానును వారిస్థితియందుండి చెప్పుచున్నాఁ డనిభావము.

శ్రీవత్సాంకమిశ్రుల సన్నిధియందు ఈ అభయప్రదానప్రకరణమును విన్న యొక వైష్ణవుఁడు ఈ ప్రకరణము తాత్పర్య మేమనియడుగఁగా 'సదోషులు శరణాగతులు కారు' అన్న సుగ్రీవుపక్షమును

జోరఁబడి యుద్ధముసేసెదను’ అనెను. ఇట్లు చెప్పుచున్న విభీషణుని రాముఁడు బిగ్గఁ గౌఁగిలించుకొని సంతుష్టుఁడై లక్ష్మణుంజూచి ‘సముద్రమునుండి జలమును దెమ్ము. ఆజలముచే మహాప్రాజ్ఞుం డగునీవిభీషణుని రాక్షసులకు రాజుగా, అతఁడు కోరకపోయినను నాకట్లు సేయవలయునని ప్రసాదము గలిగియున్నది గావున, నభిషేకింపుము. నేను ప్రసాదము చూపఁగా దానికిఁ దగుఫలమునిచ్చి బహుమానించువాఁడవు నీవే’ అనెను. రాముఁ డిట్లు చెప్పఁగానే లక్ష్మణుఁడు * రాజాజ్ఞం జేసి వానరముఖ్యులనడుమ విభీషణుని రాక్షసులరాజుగా నభిషేకించెను. రాముం డట్లు శీఘ్రముగా విభీషణుని యందుఁ జూపినప్రసాదముం జూచి వానరు లందఱును పరమహర్షమున నార్చుచు, మహాత్ముం డగురాముని ‘బాగుబాగ’ ని కొనియాడిరి. అంత మఱియొకపుడు మంత్రనమున హనుమంతుఁడును సుగ్రీవుఁడును విభీషణునింజూచి ‘సముద్రమును దాఁటుదమన్న దాని నట్లు గలంచుట కెవ్వరికిని దరముకాదు. ఏలన నది వరుణదేవుని కాటపట్టయినది. మహాతేజులయిన యీవానరుల సైన్యములతోఁగూడ మనమందఱమును దీని నెట్లు దాఁటఁగలము? మనమందఱము సైన్యములతోఁగూడ నదనదీపతియు వరుణాలయము నగుసముద్రమును శీఘ్రముగా నెట్లు దాఁటఁగలమో, ఆయుపాయము మాకుఁ దోఁపలేదు. నీవే చెప్పవలయు’ ననిరి. ధర్మజ్ఞుం డగువిభీషణుఁడు వారట్లు చెప్పఁగావిని, మరల వారలతో ‘రఘుకులుం డగురాజు రాముఁడు సముద్రమును శరణు సొరవలయును. ఈ మహాసముద్రుఁడు రాముని కూటస్థుఁ డయిన సగరుని (కొడుకుల) చే త్రవ్వంబడి యింతంతని కొలఁది యిడరానియట్లు పేర్పఱుపంబడినవాఁడు. కాఁబట్టి యతఁడా యుపకారమును గొప్పగా బుద్ధి నెన్ని, శరణమును వ్యాజముగాఁ జేసి యీయుపకారమునకు బదులుగా రామునికార్య మిదియని యెఱింగి తప్పక చేయవలసినవాఁడు’ అనెను. రాక్షసుండగుటచే సలజ్జుండయి పండితుండగుటచే నప్పటికిం దగినబుద్ధి మెఱయుచున్న విభీషణుండు చెప్పినమాటనువిని, యంత సుగ్రీవుఁడు, రాముఁడును లక్ష్మణుఁడు నున్నస్థలమునకువచ్చెను. పిదప సుగ్రీవుఁడు కుతూహలమున విశాలం బగునిజగ్రీవంబు మెఱయ, రామునకు సముద్రమునుపాసింపఁదగునని విభీషణుఁడు చెప్పిన శుభవచనము జెప్పనారంభించెను. రాముఁడు స్వభావంబుననే ధర్మశీలుఁడుగాన ధార్మికమైన యీయుపాసనమునకు సమ్మతించెను. రాముఁ డప్పటిసంతోషాతిశయమున మేనికాంతి మఱింత తేజరిల్లుచుండఁగా తాను తనంతటనే కార్యము చేసికొన దక్షుండయ్యును, న్యాయమునుబట్టి, వానరాధీశ్వరుండుగావున సుగ్రీవుఁడును విభీషణుని యాలోచనమును బహుమానించునట్లు

---

నిరసించి ‘దోషగుణములు శరణాగతికి ప్రయోజకములుగావు చేసినత్వమే ప్రయోజకము’ అని రాముఁడు సిద్ధాంతముచేసెనని తెలిసినవారయిరి.

* ‘మధ్యేవానరముఖ్యానామ్’ అని వానరుల గొప్పసభయందుఁ జెప్పంబడుటంజేసియు ‘రాజశాసనాత్’ అని రాజాజ్ఞ యగుటంజేసియు త్రోయరాక విభీషణుఁ డనుమతించెనని భావము.

చేయుకొఱకు నతనిని లక్ష్మణునింజూచి చిఱునవ్వునవ్వుచు, 'లక్ష్మణా! విభీషణుఁడు చెప్పిన యీ యాలోచనము నాకిష్టముగానున్నది. నీకును సుగ్రీవునకునుగూడ నిది యే యిష్టమగునేని మీ యభిప్రాయమును జెప్పుఁడు. సుగ్రీవుఁడెప్పుడు నాలోచనములందు సమర్థుఁడు. నీవును మంత్రములందు ఆఱితేఱినవాఁడవు. ఏది మీయుభయులకు నిష్టమో దాని నిశ్చయించి నాకుఁ జెప్పుఁడు' అనెను. ఇట్లు రాముఁడు చెప్పఁగా వీరులయిన సుగ్రీవలక్ష్మణు లిరువురును, చేతులు మోడ్చుట మొదలయిన యుపచారములతో 'పురుషసింహమా ! మఱి యేయుపాయమును దోఁపని యీ కాలమున విభీషణుఁడు సుఖముగా కార్యమును సాధించునట్లు చెప్పిన యుపాయము మా కెందులకు నిష్టముగాదు? భయంకరమై వరుణుని కాలయ మగునిమ్మహాసముద్రమున సేతువుగట్టక, దేవాసురులకును దేవేంద్రునకును లంకాపురికిఁ బోయి చేర నలవిగాదు. ఇఁక మము బోఁటికిఁ జెప్పనేల? మంత్రములందు శూరుండగు విభీషణుఁడు చెప్పినమాట యథార్థమే; కాన యట్లు చేయుఁడు. కాలముపుచ్చవలదు. చాలును. మనము సైన్యములతోఁగూడ రావణుఁడు పాలించు లంకాపురమును జేరునట్లు లీసముద్రునిం బ్రార్థింపుఁడు' అనిరి. వారిట్లు చెప్పఁగా నపుడు రాముఁడు నదనదీపతి యగుసముద్రముతీరమున దర్భలుపఱిచి దానిపయిని వేదియం దగ్నిహోత్రుండుంబోలె శయనించినవాఁడయ్యె. ఇది పందొమ్మిదవసర్గము.

---

రాముఁడు సేనలతో సముద్రతీరమునకువచ్చుటను శార్దూలునివలన రావణుఁడు విని సుగ్రీవుని రామునుండి వేఱుపఱచుటకై శుకునిఁ బంపఁగా వానిని వానరులుగొట్టుట.
రాముఁడు వలదని వారించుట.

అంత శార్దూలుం డనునొక రాక్షసుఁడువచ్చి సుగ్రీవునికాపున సముద్రతీరమున విడిసి యున్న వానరసైన్యమును, కనుఁగొనుటయందు సామర్థ్యముగలవాఁడు గాన యంతయుం జూచెను. ఆకాలమందు చారునిఁబంపిన దురాత్ముఁడును రాక్షసరాజును నగు రావణునికి వాఁడు వేగువాఁడు. ఆ రాక్షసుఁడు అట్లు ఎచ్చరికతో నా వానరసైన్యమునంతయు నలుగడలఁ గలయంగఁ జూచి మరల వేగ లంకకుఁబోయి రావణునింజూచి 'అదిగో! వానరభల్లూకసైన్యము, అగాధమును అప్రమేయమునై, రెండవసముద్రమువలె నొప్పుచు లంకపయి నెత్తివచ్చుచున్నది. దశరథమహారాజు కుమారులయిన యన్నదమ్ములు రామలక్ష్మణు లిరువురును, మేలయిన యాయుధములను ధరియించి సీత యున్నస్థలమునకు రానున్నారు. మహాకాంతిఁ దళ్కొత్తుచు నాయిద్దఱును సముద్రముం జేరి యచట విడిసియున్నారు. వానరసైన్యము నలుప్రక్కల నెటుచూచినను పదియామడలవఱకును భూప్రదేశము నావరించియున్నది.



1375. వానరులు శుకునిఁ గొట్టుట; రాముఁడు వారిని వలదని వారించుట.

మహారాజా! నేను సామాన్యముగాఁ జూచివచ్చితిని. ఉన్నదియున్నట్టుగా శీఘ్రమున సంగతిని నీవు తెలిసికొనఁదగును. కాన నీవంపున దూతలు త్వరితముగాఁబోయి వారిం జక్కఁగాఁదెలిసికొని రావలయును. ఈ విషయమున దానముగాని సామముగాని భేదముగాని ప్రయోగింపఁబడుఁగాక. దండమున కయితియె లేదు' అనెను. రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు శార్దూలుఁడు చెప్పినమాటనువిని, యంత జాగుసేయక యెచ్చరిక మీఱ,తోడనే తాను జేయవలసినకార్యమిది యని నిశ్చయించుకొని యపుడు కార్యవిదులలోనెల్ల కన్నాకయిన శుకుండను రాక్షసునింజూచి "నీవుపోయి. వానరరాజగు సుగ్రీవుంజూచి, పరుసుగాక మృదువయి యింపుగా నుండుపలుకుల వెనుదీయక దిట్టతనముతో చెప్పినంతకు మించక నామాటలుగా నిట్లనుము.'వానరమహారాజా! నీవు గొప్పకులమునఁ బుట్టినవాఁడవు;కావున నిష్కారణవైరము పెట్టుకొనఁదగదు.మఱియు మహాబలుండవు; కాన యల్పబలుం డగురామునిఁబట్టఁదగదు. ఇంతేకాక బ్రహ్మపుత్రుండయిన ఋక్షరజునిపుత్రుండవు;కావున నాకు బంధుండవయితివి. అదియట్లుండ నీవు రాముని నాశ్రయించుటవలన లాభ మేదియు లేదు. ఆశ్రయింపనందున నష్టముగాని లేదు. కాన నిష్ఫలమయిన వైర ముచితముగాదు. నాకును నీయన్న వాలికిని మిక్కిలియు స్నేహము. ఆసంబంధమునుబట్టి నీవు నాకు తోఁబుట్టువు వంటివాఁడవయితివి.కాన వానరేశ్వరా! రామునివిడిచి నాతోనే నెయ్యము గావింపఁదగుదువు. 'సీత నపహరించి మహానర్థము చేసితివే?'యందువా? సుగ్రీవా! నేను ధీమంతుఁడగు నారాజపుత్రుని రామునిభార్య నపహరించి తెచ్చితినేని వానరేశ్వరుఁడవగు నీ కావిషయమున హానియేమి? నీవు బుద్ధిమంతుఁడవు యోజించుకొనుము. మఱేమియువలదు. నీ వూరక కిష్కింధకుఁబొమ్ము,'ఆరంభించినపని నెట్లు విడువవచ్చు'నందువా? ఈ లంకాపురమును నరులకును వానరులకును నేవిధమునను బ్రవేశింపనలవిగాదు. దేవతలును గంధర్వులునుంగూడ ప్రవేశింపఁజాలరనఁగా నిఁక నరవానరులసంగతిని జెప్పనేల?' అని చెప్పితినని చెప్పుము" అనెను. రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు అట్లు చెప్పి పుచ్చఁగా నారాక్షసుఁడు శుకుఁడు పక్షిరూపముఁదాల్చి శీఘ్రముగ నాకాశమున కెగిరి సుగ్రీవాదులున్నచోటికివచ్చెను. అట్లు శుకుఁడు సముద్రమునకు కొంత మీఁదుగా నాకాశమార్గమున బహుదూరముపోయి, సుగ్రీవాదులున్న యెడఁజేరి, యాకాశముననేయుండి సుగ్రీవునఁజూచి దురాత్ముఁడగు రావణుఁడు తనతోఁజెప్పిపుచ్చిన మాటలన్నియును ఒక్కటియయినను విడువక క్రమంబుగాఁజెప్పెను. అట్లామాటలు శుకుఁడు వినిపించుచుండఁగా, వానరులు వానిని బిడికిళ్లం గొట్టి ఱెక్కలు దూల్చుటకై శీఘ్రంబున నాకాశమున కెగసి వానిం జుట్టుకొనిరి. వారు బలవంతముగా నారాక్షసుని నొడిసిపట్టుకొని త్రోయఁగా వాఁడాకాశముననుండి నేలపయి గొబ్బునఁ బడెను. వానరులట్లు పీడించుచుండఁగా శుకుఁడు రామునిఁజేరొని 'కాకుత్స్థా! దూతల నెవ్వరును జంపరు. వన్నీవానరులు చంపనున్నారు

గాన వలదని లెస్స వారింపుమా ! ఎవ్వఁడు తన యేలినవాఁడు చెప్పి పుచ్చిన యభిప్రాయమును జెప్పక తనమతమును జెప్పునో వాఁడు తనకుఁ జెప్పినట్లు చెప్పని దూత యగును. అట్టి దూతనుమాత్రము చంపుటయే యర్హము' అనెను. శుకుం డట్లు పలవించుచు చెప్పినమాటను విని, రాముఁడు కరుణించి వానినిం గొట్టుచున్న వానరోత్తములంజూచి 'వీనిని జంపకుఁడు' అని యాజ్ఞాపించెను. అట్లు వానరులు పీడించి విడువఁగా వాఁడు భయముమాని, కొంత విఱువంబడుటచే తేలికగా నున్న ఱెక్కలతో నాకాశమునొంది, సుగ్రీవుంజూచి మరల నతనితో 'సుగ్రీవా ! నీవు శక్తిసంపన్నుఁడవు, మహాబలుఁడవు, పరాక్రమశాలివి. రావణుఁడు లోకమునంతయు నేడ్పించువాఁడుగాన నీవలన బదులు తెలిసికొనక పోయితినేని నన్నుఁ జంపును. కాన యతనికి నే నేమిచెప్పవలయును? చెప్పుము' అనెను. వాఁడట్లు చెప్పఁగా వానరులకెల్ల నధిపతియు మేటివానరుఁడును మహాబలుండునగు సుగ్రీవుఁ డపుడు మనంబున విన్నఁదనము లేక రావణుని వేగులవాఁడగు శుకునితో వేగ 'నీవు నాకు మిత్రుఁడుగావు. కాన నీయెడ నాకు దయచూపవలసినది లేదు. మఱి నీవు నా కేయుపకారమును జేసినవాఁడవుగావు. నాకు ప్రియుండవునుగావు. కాన తోఁబుట్టువువంటివాఁ డెట్లగుదువు? మఱి నామిత్రుఁడగు రామునకు నీవును నిన్ను సంబంధించినవారందఱును శత్రువులగుటచే నాకును శత్రుఁడవే యగుదువు. 'ఉపకారాదులనుబట్టి కాకపోయినను వాలితోడి చెలిమినిబట్టియైనను తోఁబుట్టువువంటివాఁడను గానా?' యందువా? నా శత్రుండగు వాలికి మిత్రుఁడవు గావున, నాకు శత్రుండవు. కాన వాలియుంబోలె వధకర్హుండవు. వధింపవలసినవాఁడవు. కాన రామునిభార్య నపహరింపఁగా నీకేమిహాని యనకుము. లంకను జొరరాదంటివే. నిన్నును, నీవు రాక్షసులకు రాజవుగాన నీ యపరాధమునుబట్టి నీకొడుకులను, బంధువులను, నీ దాయాదులను, అందఱను వధించి పుచ్చెదను. గొప్పసైన్యముతో శీఘ్రముగావచ్చి లంకాపురమునంతయు నీఱుగావించెదను. 'నేను లంకలో నుండినం గదా యిట్లు చేయుదువు. మఱియొకస్థలమునకుఁ బోయెద' నందువా? రావణా ! నీవు మూఢుఁడవు. నీకు దేవతలును దేవేంద్రునితోఁ గూడివచ్చి కాచినను, నీ వంతర్ధానము నొందిపోయినను, సూర్యద్వారము నొందినను, అట్లె పాతాళమును జొచ్చినను రామునినుండి తప్పించుకొనఁజాలవు. అవశ్య మతనివలనఁ జత్తువు. రాముని బాణముల బాధింబడిన నిన్ను ముల్లోకములందును, దేవేంద్రుఁడే కావ నశక్తుఁడై యుండఁగా నిఁక నంతకంటెను తక్కువయగు పిశాచులుగాని, రాక్షసులుగాని, గంధర్వులుగాని, యసురులుగాని, రక్షింపఁ గలవారెవ్వరును నాకుఁ గానఁబడరు. ముదిసి ముదుకఁడై అసమర్థుఁడై యున్న జటాయువును జంపుటలో నీకేమివీర్యము? నే నట్టి వాఁడను గాను. 'భార్యను దెచ్చినప్పు డేమియుఁ జేయలేనిరాముఁ డిపు డేమి సేయఁ గలఁ'డందువా? వాలుంగన్నుల రామునికి వన్నెఁజూపు నాసీతను రాముఁ డున్నపు

డుగాని లక్ష్మణుఁడున్నప్పుడుగాని యపహరించితివా యేమి? వారొక్కరును లేనపుడేకదా దొంగిలి తెచ్చితివి. అట్లా బిడను దెచ్చి రానున్న యనర్థము తెలియకున్నావు. మహాబలుఁడును, మహాబుద్ధిమంతుఁడును, దేవతలకయిన నెదిరింపరానివాఁడును, రఘుకులతిలకుఁడు నగు రాముఁడు నీప్రాణములు గొనువాఁడని నెఱుంగవు.' అనుము" అనెను. అంత వానరోత్తముండును వాలికుమారుఁడునగు నంగదుఁడు సుగ్రీవునిఁజూచి 'మహారాజా! వీఁడు దూతగాఁడు. రావణుని చారుఁడని నాకుఁ దోఁచుచున్నది. వీఁడిచ్చటనే మనయెదుట నున్నట్లై యుండి, మనసేనకొలఁది యంతయు గనుఁగొన్నాఁడు చుమీ! వీనిం బట్టికొనుఁడు, లంకకుఁ బోనియ్యరాదు. ఇదియే నాకిష్టముగానున్నది' అనెను. అంత రాజగు సుగ్రీవునియాజ్ఞచే వానరు లాకాశమున కెగిరి, యనాథునింబోలె విలపించుచున్న యాశుకునిం బట్టికొని బంధించిరి. మిక్కిలియు కోపనులగు వానరు లట్లుచటఁ దన్నుఁబట్టి బిట్టుగా పీడించుచుండఁగా శుకుండు రాముని 'మహాత్మా! దశరథకుమారా!' యని పేర్కొని యఱచుచు, 'మిగిలియున్న నారెక్కలను బలవంతముగాఁబట్టి మాపుచున్నారు! నాకన్నులం బెఱికి వేయుచున్నారు! నేను అపరాధిగానట్టిదూతను గాన యిట వానరపీడచే ప్రాణములు విడుతునేని, నేను బుట్టినదినము మొదలుకొని చచ్చుదినమువఱకును, ఈ నడిమికాలమున నేయే పాపములం జేసి యుందునో యవి యన్నియు నట్లు చంపించిన నిన్నుఁ బొందును' అని యాక్రోశించెను. రాముఁ డప్పుడు శుకుని విలాపమును విని వానిని జంపనీయక వానరులతో 'వచ్చినదూతను కట్లు విడిచిపుచ్చుఁడు' అని యాజ్ఞాపించెను. ఇది యిరువదియవసర్గము.



రాముఁడు దర్భశయనమున మూఁడురాత్రులుండి యారా
ధించినను సముద్రుండు ప్రసన్నుఁడు గాకుండఁగా
కోపించి బాణప్రయోగమునకుఁ బూనుట.
లక్ష్మణుఁడు వలదని వారించుట.

*అంత సర్వశరణ్యం బయినరఘుకులంబునం దుదయించినరాముఁడు మిక్కిలి మొరముగానుండు సముద్రతీరమున వాఁడి మొనలుగల దర్భలను బఱచి మహాసముద్రమున కంజలి గావించి పాముశరీరమువలె మిగుల మృదువయిన బాహువును దలగడఁగా నుంచుకొని, తూర్పుమొగంబై, మహాసముద్రమున కెదుర నున్నమఱియొకసముద్రునివలెఁ జూపట్టుచు, శత్రువులకు నప్పటికిని జెనకరానివాఁడయి తోఁచు

* ఇందు విశేషణమహిమచే అతిసుకుమారునకు అతికఠినమగు భూతలమునఁ బరుండుటయు, అఖిలరక్షకునకు అన్యునివలన రక్షణ మపేక్షించుటయుఁ గలిగెనుగా యని వాల్మీకి ఖేదపడుట సూచితమగుచున్నది.

చుం బరుండెను. *రాముని దక్షిణబాహువు, మున్ను, అయోధ్యయం దుండునపుడు, బంగారు మణులను రత్నమయములు నయిన యాభరణములచే నలంకృతమై యుండినది; ఉత్తమపురంధ్రులగు సైరంధ్రులు మేలిబంగారు బాహుపురులును మంచి ముత్తియపుసొమ్ములును దాల్చియున్న తమ హస్తములచే స్నానాలంకరణాది సమయముల పెక్కువిధముల చందనాగురుకుంకుమాదులచే నలుఁగిడుట పూఁతలు పూయు

---

* ఇట 'భుజైః పరమనారీణా మభిమృష్టమనేకధా' అని రాముని భుజము ఉత్తమస్త్రీలు పెక్కండ్రచే సమ్మృష్టమైనదని చెప్పటంబట్టి రామునికి సీతకంటె వేఱుభార్యలునుగలరని కొందఱు చెప్పెదరు. ఇది సరికాదు. బాలకాండమున నెచ్చటఁగాని రాముఁడు మఱియొకభార్యను బెండ్లాడినట్లు లేదు. మఱి 'రామస్తుసీతయాసార్ధం విజహార బహూనృతూన్ । మనస్వీ తద్గతస్తస్యా నిత్యంహృది సమర్పితః' అని సీతతోడి యెడతెగనిభోగమే చెప్పఁబడినది. కాఁబట్టియే సీతయు 'సమాద్వాదశతత్రాహం రాఘవస్యనివేశనే । భుఞ్జానామానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ' అన్నది. ఇట 'సమాద్వాదశ' అని పన్నెండేండ్లును, అత్యంతసంయోగవ్రతీయంబట్టి నిరంతరమైనభోగమును సీత చెప్పినదిగాన మఱియొకభార్య కవకాశ మెక్కడిది? అయినను 'రామస్యదయితాభార్యా' 'రామునికిఁ బ్రియురాలయిన భార్య' యని ప్రియురాలని విశేషణ ముండుటచే అంతటి ప్రియురాండ్రుకాని భార్యలు నుండవచ్చును. 'రోహిణీయథా' 'రోహిణివలెన్' యని తారలలో నొకటి యగురోహిణిని దృష్టాంతీకరించుటచే భార్యలలో నొక్కతెగా సీతయుండుట సూచితము. కాఁబట్టి రామునకు భార్యాంతరముండుట స్పష్టమగుచున్నదని అన్నచో నట్లుగాదు. 'దయితోభ్రాతృః' అని లక్ష్మణుని దయితునిగాఁ జెప్పినట్లు, గ్రహింపవలెను. ఇట సన్న వెంబడించుటకుఁ దగినదని తెలుపుటకై 'దయిత'విశేషణముంపఁబడినది. ఏలన నిట లక్ష్మణుఁడే దయితుఁడన్నచోఁ దక్కినతమ్ములు అట్లు దయితులుగారనియభిప్రాయముగాదు. అట్లే 'తామేవేక్ష్వాకునాథస్య భరతస్యకథాంకురు । న సర్వేభ్రాతరస్తాత భవన్తి భరతోపమాః' అని భరతుఁడుగూడ దయితుఁడుగాఁ జెప్పఁబడియుండుటవలన దీనిలో విరోధము గలుగును. కాఁబట్టి 'దయిత' అను విశేషణము పలువురిలో నొక్కతె దయిత యను యర్థమును గ్రహింపక రామునకుఁగల వాల్లభ్యాతిశయముబట్టియు సౌందర్యాతిశయముబట్టియు సాహచర్యమునందేయుండి దివ్యసుఖముల ననుభవింపఁ దగినవారై యుండిరి యు సీతాలక్ష్మణులు రామునివెంటఁ బోయిరి యని వాల్మీకహృదయము. 'రోహిణీయథా' అనుచో చెప్పఁబడిన రోహిణి వేఱొక్కతియేకాని ప్రసిద్ధురాలయిన రోహిణిగాదు. ఏలన ఈరోహిణి చంద్రుని నిత్యమును అనుగమించుటలేదు. అయినను 'హృష్టాఃఖలుభవిష్యన్తి రామస్య పరమాఃస్త్రియః । అప్రహృష్టాభవిష్యన్తి స్నుషాస్తే భరతక్షయే'అని మంథర కైకతో రామునికి పట్టాభిషేక మగునేని యుత్తమస్త్రీలు సంతోషింతురనియు భరతుఁడు క్షయింపఁగా కైకకోడండ్రు, సంతోషము మాలుదురనియుఁ జెప్పెను. 'స్నుషాః' అని కైకకోడండ్రతోపాటిగా రామునిస్త్రీలను జెప్పుటచే వారు రాముని భార్యలుగానే యుండవలయునుగాని అతనిని సంబంధించిన కౌసల్యాదులుగానేరరు. కాన రామునకు పత్నులు పెక్కండ్రగుదురు. సుందరకాండమునందును 'స్త్రీభిస్త్వమన్యే విపులేక్షణాభి స్త్వం రంస్యసే వీతభయఃకృతార్థః' అని సీత రాముని పెక్కుస్త్రీలతో రమింపఁగలవానిగాఁ జెప్పినది. ఇచ్చట 'భుజైఃపరమనారీణా మభిమృష్టమనేకధా' అని చెప్పఁబడినది. కాఁబట్టి రామునకు పత్నులు పెక్కండ్రు గలరని తెలియుచున్నది. అన్నచో నట్లుగాదు. 'రామస్యపరమాస్త్రియః' అని రాముని సంబంధించిన కౌసల్య సీత మొదలగువారే చెప్పఁబడిరి.



1378. రాముఁడు మూఁడురాత్రులు దర్భశయనమునుండి సముద్రుని శరణుఁజొచ్చుట.

ట పినుకుట మొదలయినవి గావించియుండునది; మున్ను, అది చందనాగరుగంధములచే శౌవులు గుబాళించుచుండినది. మఱియు బాలసూర్యునివంటి యెఱ్ఱచందన

లేక 'భరతునకు పెక్కండ్రు భార్యలున్నట్లు ప్రమాణములేదు గావున 'తేస్నుషాః' 'నీకోడండ్రు'అని పూజనుబట్టి కైకకోడలగు భరతునిభార్యకు బహువచనము చెప్పఁబడినట్లే, 'పరమాః స్త్రియః' అని రాముని భార్య యగుసీతకును బహువచనము చెప్పఁబడియుండవచ్చును. 'త్వాంరంస్యసే' అన్నచోట సీత తాను రావణునిచేఁ జంపఁబడినపిదప రాముఁడు వేఱుభార్యలను బెండ్లాడి క్రీడించుఁగాక యని లోకరీతినిబట్టి చెప్పినమాటయేకాని వేఱుగాదు. 'భుక్తైఃపరమనారీణామ్' అని యిచ్చటఁగూడ అలంకరించు స్త్రీలుగా నర్థము యుక్తము. అట్టి స్త్రీలయొక్క 'అభిమృష్టమ్'అభిమర్శనమునకు అర్హమయినదిగాని అభిమర్శింపఁబడినదిగాదనియు నర్థము సేయవచ్చును. ఇచట చెప్పఁబడిన 'పరమనా' రులు శ్రీభూమి నీళలును గావచ్చును. రాముఁడుమాత్రమే తన్ను మనుష్యునిగాఁ దలఁచుచున్నాఁడుకాని ఋషిమాత్రము రాముఁడు విష్ణువగుటనే వ్యక్తీకరించుచున్నాఁడు. 'జజ్ఞే విష్ణుస్సనాతనః' అని బాలకాండమున విష్ణువే రాముఁడుగాఁ బుట్టుటను జెప్పియున్నాఁడు. 'అయితే రాజసూయాశ్వమేధాదులను అనుష్ఠించుట భార్యలేక మఱియొకవిధమునఁ బొసఁగదుగాన రామునకు పెక్కుపత్నులుండవలయును' అన్నచో, ఉండిన నుండనీ. ఇచట వారికి సంబంధములేదు. వారలు కేవలధర్మార్థము వరింపఁబడినవారగుటచే రాముని పరిమర్శించుటకును రమించుటకునుఁ దగరు. వాస్తవమునకు వారుగలరని కల్పించుటయే తగదు. ఏలనఁ ఉత్తరకాండమున సీతాప్రతిమయే యజ్ఞమునందు పత్నీకార్యము నిర్వహించినట్లు, చెప్పఁబడినది. 'అయితే భట్టాచార్యుఁడు పత్నికి ప్రతినిధిభావము చెప్పలేదే' యనరాదు. వచనవిరోధము కలిగినపుడు న్యాయము నిలువదు. హేమాద్రిస్మృతియందు 'యదిముష్టభార్యో దూరభార్యోవాస్యాత్తదా దర్భపుంజీలం తత్ స్థానే నిధాయాగ్నిమాధాయ కుర్యాత్' అని ప్రతినిధిభావ వచనముగలదు. ఇది యట్లుండ ధర్మసంస్థాపనార్థము ప్రవృత్తుఁ డయిన రామునియొక్క యాచారమునకన్న మఱి వేఱుప్రమాణము వలయునాయేమి? వాస్తవమునకు ఆచారమే ప్రథమప్రమాణము. శ్రుతియు పూర్వాచారమును ప్రవర్తించియే కర్మమును విధించుచున్నది. కాఁబట్టియే ఆపస్తంబుఁడును 'ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదాశ్చ' అని ధర్మజ్ఞసమయరూపమయిన యాచారమునే ప్రథమప్రమాణముగాఁ జెప్పినాఁడు. కాఁబట్టియే స్మృతికారులును 'శ్రుతిర్విభిన్నాః స్మృతయో విభిన్నాః నైకో ఋషిర్యస్య మతం ప్రమాణమ్ । ధర్మస్య తత్త్వం నిహితం గుహాయామ్ మహాజనో యేన గతస్సపన్థాః'అని మహనీయుల పథమయిన యాచారమే ముఖ్యప్రమాణమన్నారు. కాఁబట్టి 'చాతుర్వర్ణ్యంచ లోకేఽస్మిన్ స్వేస్వేధర్మే నియోక్ష్యతి' అన్న రామునియొక్క యాచారమే సమీచీనమయిన ప్రమాణము. దానికి విరుద్ధమయిన న్యాయములు నిలువవు. రాజసూయాశ్వమేధాదులందు పట్టమహిషివలె వావాతయు పరివృత్తియు నుండవలసినవారయ్యు వారు లేనందున వారికార్యము లనుష్ఠింపక పోవుటయేకాని దానివలన కర్మమునకు వైకల్యము కలుగదు. ఎట్లన కుంటి గ్రుడ్డి మొదలగువారికి యజ్ఞమందు విష్ణుక్రమము ఆజ్యావేక్షణము మొదలగునవి లోపించుటవలన యజ్ఞమునకు లోపము గలుగదు. ఏలన ఆయామంత్రముల నుచ్చరించుటయే కార్యము కాఁబట్టి కేవలన్యాయసంచారముచేత అపన్యాయమయిన మార్గమును అనుసరింపరాదు. మఱి సర్వాచారప్రవర్తకుఁడై సర్వకర్మధురంధరుఁడై భగవదవతారభూతుఁ డయినరామచంద్రుని యాచారమే వివేకిజను లనువర్తింపవలయును. కాన రామునకు సీతయొక్కతితప్ప నితరభార్యలు లేరనుట సిద్ధాంతము.

ములును నలందంబడి నన్నె గులుకుచుండినది. పూర్వము హంసతూలికాతల్పమున నుండునపు డది గంగాజలము లందున్న తక్షకుని కాయమువలె సోయగంబై, సీతాదేవిశిరము పయి నుంచియుండఁగాఁ బ్రకాశించుచుండెను. యుద్ధంబున నది పగవారికి గోపురపుగడియ మ్రాఁకువలె వారింపరానిదై శోకము గొలుపుచుండినది; సుహృదులకో యానందము గూర్చునది. అది మిక్కిలి దీర్ఘమై సముద్రపర్యంతమయిన భూమండలమునకుఁ బట్టయి. అప్రదక్షిణముగా బాణములు విడుచునపుడు అల్లెత్రాటి దెబ్బలచేత తోలుదోఁగి కాయలుకాచి యుండునది. ఇట్లు పెద్ద యినుపగుదియం బోలినదై వేలకొలఁది గోవుల దానము సేసి నాసిగన్న యా యుత్తమమగు దక్షిణబాహువును దాక్షిణ్యవంతుఁ డగు మహాబాహుఁడు రాముఁడు దలగడగాఁ జేసికొని, 'ఇప్పుడు నాకు మరణమైన లేక సముద్రతరణమైన కలుగుఁగాక' యని దృఢబుద్ధి సంకల్పించుకొని స్నానాదులచే కాయికశుద్ధి నావించుకొని వాచికనియతి నిం బూని, మౌననియమంబును గలవాఁడై, శాస్త్రోక్తవిధానంబున సముద్రమునకెదురుగా శయనించెను. ఇట్లు నియమంబులతో నేమఱక యా రాముండు దర్భలపరచిన నేలపయి శయనించియుండఁగా మూఁడురాత్రులు గడచినవి. *రాముఁడు నయజ్ఞుండును ధర్మవత్సలుండు నగుటం జేసి. అచ్చట సముద్రతీరమున నిట్లు మూఁడురాత్రులు శయనించి, యా మూఁడురాత్రులును జగన్నాథుం డగుసముద్రు నారాధించుచుండెను. సముద్రుఁడు తెలివి లేనివాఁ డగుటవలన, నపుడు రాముఁడు పరిశుద్ధుఁడై యథాయోగ్యముగ తన్నారాధించినప్పటికిని తాను సాక్షాత్కరింపఁ డయ్యె. అంత రాముఁడు సముద్రునియెడ నించుక క్రుద్ధుఁడై కనుఁగొనల నెఱ్ఱఁదనము గదుర సమీపమునఁ దనకోపమును దెలిసి చిఱునవ్వు నవ్వుచున్న శుభలక్షణలక్షితుని లక్ష్మణునిఁ జూచి, 'సముద్రుఁడు తా నింతకును తన్నుఁ జూపకున్నాఁడు. ఇది నీచగర్వము. కోపము లేకుండుట, అపరాధము సైచుట, కుటిలత లేకుండుట, ప్రియముగాఁ బలుకుట, ఇవి మొదలయిన సత్పురుషగుణములు నిర్గుణులయెడఁ జూపినచో వారు వానిని జూపినవానిని అసమర్థుఁడని తలంతురు. కాన నేనియసామర్థ్యమే ఫలితమగును.

* [illegible] 'స [illegible] తాంపులకో [illegible] ప్రయం [illegible] అ మా [illegible] [illegible] 'స [illegible] అను [illegible] నాశ్రయ [illegible] పురుషకార [illegible] యున్నాఁ డనుట. [illegible] శరణాగతి [illegible] డందు [illegible] యథకారి. కాన బ్రాహ్మణుఁ [illegible] నది ఫలింపదయ్యె.

'వారికి సమర్థుఁ డైన' రందువా? తెలివిమాలినజనులు, తన్నుఁ దాను స్తుతించుకొను వానిని, నిర్దయుని, వంచకుని, అందఱను తఱుమఁగొట్టువానిని, మంచివాఁడు చెడ్డ వాఁడని వివేచనములేక యందఱియెడ దండము నెఱపువానిని, సమర్థునిగా గౌరవింతురుగాని శమాదులు గలవాని నట్లు గౌరవింపరు. లక్ష్మణా! ఈలోకమున సామముచేత బలవంతుఁడను కీర్తి గలుగఁజాలదు. సామముచేత పరాక్రమవంతుఁడను యశస్సును రానేరదు. రణాగ్రమున జయముగాని సామముచేతఁ బొందనలవి గాదు. దండమే వీనికెల్ల సాధనము. లక్ష్మణా! ఇప్పుడు మకరముల కాలయమయిన యీసముద్రమున నాబాణములచే మకరములు చిన్నభిన్నములుగాఁ దెగి పయినిదేలుచు నంతటను సముద్రజలముల నావరించి యుండఁగలదు; చూడుము. లక్ష్మణా! ఇదిగో మహాకాయములగు సర్పముల పెనుశరీరములను, గజాకారములయిన మత్స్యముల తొండములను ఛేదించెదను జూడుము. ఇప్పుడు బాణములు ప్రయోగించి, గొప్పయుద్ధము గావించి సంకువులయు ముత్తెపుఁజిప్పలయు కుప్పలతోను చేఁపలతోను మొసళ్లతోను, సముద్రమునంతయు, శోషిల్లునట్లు చేసెదను. 'క్షమైకనాథులగు మిముబోఁటుల కిట్లు లాడుట తగ' దందువా? క్షమగలిగి యుండుటచేతంగదా యీ సముద్రుఁడు, ఇతరుల నపేక్షింపకయే కార్యము తీర్చుకొనం జాలుబలుసమర్థుని నన్ను అసమర్థునిగాఁ దలఁచినాఁడు. ఇస్సీ! ఇఁక క్షమదగునా? 'ఇక్ష్వాకువుల కెప్పుడుగాని క్షమవిడువరా' దందువా? ఇటువంటి వానివిషయమై, రక్షస్సహవాసము గల యిట్టి వానియెడల, క్షమ చూపఁదగదు; కోపమే తగునుగాని. సామ మెంతచూపినను సముద్రుఁడు నాకుఁ దనరూపు చూపినవాఁడుగాఁడు. *'లక్ష్మణా!

* ఇందులకు 'చాపమానయ సౌమిత్రే శరాంశ్చాశీవిషోపమాన్ [illegible] సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః' అనిమూలము. విశేషార్థము:—[illegible] చూపనందున నన్ను [illegible] అసమర్థ[illegible] చెప[illegible] నన్ను [illegible]గాఁ జూచెను. [illegible] సముద్రుఁడు [illegible] కరుణవలన సముద్రుని [illegible] యిప్పుడు కార్యము [illegible]చున్నాఁడు. ఇట్లువిలంబము సేయుట [illegible] కార్యము సేయుంమటుకు; [illegible] శోషిల్లఁజేయుదును. (చాపమానయ) [illegible] నియమించుటకు గుణము గల వింటిని తెమ్ము. (చాపమానయ) [illegible] బ్రహ్మాస్త్రమును [illegible] వింటిని తెమ్ము. (చాపమానయ) [illegible] వింటిని తెమ్ము. (చాపమానయ [illegible] వింటిని తెమ్ము. [illegible] సముద్రుఁడు [illegible] చేత [illegible]రియగు లక్ష్మణుని [illegible] కొంచెము సౌహార్దము గలిగి త్వరగా జాగుసేయఁగా రాముఁడు [illegible]చున్నాఁడు. (సౌమిత్రే) తల్లి సుమిత్ర చెప్పినదే చేయవలయునుగాని యన్న చెప్పినది చేయరాదో, (సౌమిత్రే) 'రామే ప్రమాదమ్మా కార్షీః' అని మీతల్లి చెప్పినట్లు చేయఁగూడదా. (సౌమిత్రే) 'ఏకం దుఃఖం సుఖంచ నౌ' అన్న మైత్రిని జూడఁగా నాకుఁగల పరిభవము నీకునులేదా? అనియనుకొంగా భయపడి వింటినిమాత్రము తెచ్చియిచ్చెను. (శరాంశ్చ) ఇఁక తక్కువదియుఁ దెమ్ము అనుచున్నాఁడు. (శరాంశ్చ) 'కణ్టకేనైవ కణ్టకమ్' అన్నట్లు

ము కలంచి పుచ్చరానిదయ్యును క్రుద్ధుఁడనై దానిని గలంచివుచ్చెదను జూడు. అలలచే చిమ్మిరేగుచుండు సముద్రము నాలుగుప్రక్కల చెలియలికట్ట యెల్లగా నేర్పరుపఁబడి వాని నెప్పు డతిక్రమింపకుండును. అట్టిదానిని బాణములు వైచి దానియెల్లను దూల్చి భూమియందంతయుఁ బ్రవహించునట్లుగాఁ జేసెదను. 'సముద్రముచే చిరకాలముగా రక్షితులయిన దానవులు దానిని రక్షింతు ' రందువా? మహాసముద్రమును అందు నెరసియుండు దానవులతోఁగూడఁ గలంచివుత్తును జూమా' అనెను. ఇట్లు చెప్పి, రాముఁడు ధనువుందాల్చి, మిక్కిలియుఁ గోపంబునఁ గన్నులు గిఱగిఱంద్రిప్పుచు, ప్రలయకాలాగ్నివలె వెలుంగుచు, ఎవ్వరికిని జెనకరాక చూపట్టుచుండెను. అంత రాముఁడు బెడిదంబయినవింటినడుము గట్టిగా పిడికిటఁబట్టి, జగంబునందలి జంతువులెల్ల బాణంబులకు గడగడవడంక, దేవేంద్రుఁడు వజ్రాయుధములను బెక్కింటిని బ్రయోగించునట్లు ఉగ్రము లయినబాణములను బ్రయోగించెను. అంత నామేటిబాణములు మిక్కిలి వేగముతో తేజంబుఁ ధగధగ జ్వలించుచు సముద్రజలములందు, అందలి సర్పములెల్ల బెదరునట్లు, చొచ్చినవి. అప్పుడు సముద్రమునందు మిక్కిలియు విఱివియైన యలలపఱపు, వాతఘుట్టనలచేఁ బుట్టిన ధ్వనితోఁగూడి నక్రమకరములతోడ మహాభయంకరమై యుండెను. అంత సముద్రమున, తోడనే యపుడు, తీరమునందు పెద్దపెద్దకెరుళ్ళ పరంపరలు వచ్చి గొట్టుచుండెను. లోపల కలంగిన యలలచే పయికి నాకర్షింపఁబడి సంకువులును ముత్తెపుచిప్పలును నావరించియుండెను. నడుమ బాణజ్వాలలకూడికచే పొగయుచును బాణాగ్నిచే శోషిల్లుచు నుండుటచే నలలు నుడివడుచు నుండెను. బాణములు పాతాళమునకుఁ జొరఁగా సముద్రమునందలి సర్పములు, మూతులు వెలుంగి, కన్నులు మిలమిలమెఱయఁగా, ముఖముల విషములుగ్రక్కుచు, మిక్కిలియుఁ బీడనొందినవి. అట్లు పాతాళమున నుండుమహావీర్యవంతు లయినదానవులును పీడితులయి అప్పుడు సముద్రమున నక్రమకరములతోఁ గూడిన పెద్దతరంగములు వింధ్యమందరపర్వతములవలె నత్యున్నతములై వేలకొలఁదిని బుట్టినవి. అంత అలలగుంపులు తిరుగుడువడ, సర్పములును రాక్షసులును తొందరపడ, పెద్దపెద్దమొసళ్లు తలక్రిందులయి తత్తఱపడ, ఆసముద్రమంతయు చూపట్టినది. అంత, మిక్కిలియు నుగ్రముగా నురవడించుచు, కొలఁదియిడరాని వైభవముగల వింటిని అమోఘబాణంబుఁ దొడుగుటకై సారించుచు కోపమున నిట్టూర్పులు పుచ్చుచున్న రామునింజూచి, లక్ష్మణుఁడు 'ఇఁక నుపేక్షించిన లోకములన్ని దగ్ధములగును' అని తటాలున వచ్చి 'వలదు వలదు' అని వేఁడియు నతఁడు విరమింపకుండుటను జూచి యాధనువును బట్టుకొనెను. ఇది యిరువది యొకండవసర్గము.

రాముఁడు సముద్రునిపై బ్రహ్మాస్త్రమును వేయఁదొడఁగుట. సముద్రుండు రామునకుఁ బ్రత్యక్షమై సేతువుగట్ట నలుని నియోగించి బ్రహ్మాస్త్రమును తననడుమనున్న ద్రుమకుల్యముపై సేయించుట. నలుఁడు సేతువు నిర్మింపఁగా రాముఁడు సమస్త పరివారముతో సముద్రమును దాఁటి సువేలా ప్రాంతమున సైన్యముతో విడియుట. దేవతలు రాముని స్తోత్రము సేయుట.

అంత రఘుకులతిలకుం డగురాముఁడు అప్పటికిని బొడసూపకున్న సముద్రునింజూచి, భయంకరమగు వచనమున 'సముద్రా ! ఇదిగో నిన్నిపుడే పాతాళమువఱకు శోషిల్లునట్లుచేసెదను. సముద్రా! నాబాణములచే జలమంతయు దగ్ధమై యిగిరిపోవఁగా భూమిలోపలనున్న జలముగూడ నెండిపోవఁగా, జలజంతువులన్నియుఁ గాలిపోవఁగా, ఎంతవర్షము గురిసినను నొకబొట్టుగూడ నిలువనట్లు, మిక్కిలియు సూక్ష్మమైన దుమ్ము రేఁగునట్లుగాఁ జేసెదను.'జలమంతయు నెండించినచో పాతాళమువఱకు నెండిపోవును. పాతాళమునకుఁ బోవుట యశక్యముగాన యాకాశమునఁ బోవలసివచ్చును. కాన యిప్పుడే యాకాశమునఁ బోవుట మేలుగాన కోపమేల?' యందువా? సముద్రా ! నేను సేతువుగట్ట శ్రమంపడ నక్కఱలేదు. నేను వింటినుండి గురియించిన బాణవర్షమున బాణములే సేతువగునుగాన యిప్పుడే వానరులు కాలినడకనే నిన్ను దాఁటి యవ్వలిదరిఁ జేరఁగలరు. నీవు దానవులకు పట్టయినవాఁడవు. వారితోడిసహవాసమువలన నాబలముగాని పరాక్రమమునుగాని మిక్కిలి యాలోచించి కనుఁగొనకున్నావు. మఱియు నావలనం గలుగనున్న సంతాపమునుగూడఁ దెలిసికొనకున్నావు' అనెను. మహాబలుం డారాముఁడు * బ్రహ్మదండముతో సాటియై బెడిదంబగు బాణమును దీసి దానిని బ్రహ్మాస్త్రమంత్రముచే నభిమంత్రించి మేటివింటఁ దొడిగి యాకర్ణాంతము లాగెను. అట్లురాముఁడు వింటిని లాగఁగానే యాకాశమును భూమియును బ్రద్దలువాసినట్లుండెను. పర్వతములన్నియు వడంకినవి. లోకమంతయు జీఁకట్లుగ్రమ్మినది. దిక్కులు కాంతిమాసినవి. సరస్సులును నదులును నలుగడల కలంగినవి. చంద్రసూర్యులును నక్షత్రములును భయమునవక్రముగాఁ గూడుకొని చరించినవి. అప్పు డాకాశమున నధికముగా చీఁకటి గ్రమ్ముకొని దానిచే కాంతి మందటిలి యుల్కలవలె నున్న సూర్యకిరణములు కొంత వెలుతురు గలిగింపఁగా అప్పుడది నూ

* బ్రహ్మదండమనఁగా బ్రహ్మశాపము. బ్రహ్మశాపమువలె అమోఘమయినది. లేక బ్రహ్మదండమనఁగా ఒక కేతువిశేషము. నారదసంహితయందు 'పితామహాత్మజః క్రూర స్త్రివర్ణ శ్శిఖరాన్వితః । బ్రహ్మదణ్డాహ్వయః కేతు స్సర్వభూతవినాశనః' 'బ్రహ్మకుఁబుట్టి క్రూరమై మూఁడువర్ణములుగలిగి శిఖరములతోఁగూడి సర్వభూతవినాశనము సేయునది బ్రహ్మదండ మనుకేతువు' అనియున్నది.



1395. సముద్రుఁడు కనుపట్టకపోయినందున రాముఁడు బ్రహ్మాస్త్రమునుఁ
బ్రయోగింప సన్నద్ధుఁడగుట.

టులకొలఁది యుల్కలచేత వెలింగింపఁబడినట్లు ప్రకాశించెను. అంతరిక్షమునుండి మహాధ్వనితోఁ గూడి*నిర్ఘాతములు పడినవి. మఱియు నాకాశంబున శ్లాఘ్యములయిన గొప్పవాతములు వరుసగా వీచినవి. వాయువునురవడిచే ఆకాశమున మేఘములు వ్యాపించినవి. అపుడు గొప్పవృక్షములు విఱిగినవి; పర్వతశిఖరములును ఖండపర్వతములును పీడనొందినవి. అప్పుడు మహామేఘములు ఆకాశంబునం గూడికొని మహాధ్వని చెలంగ వైద్యుతములగు నగ్నులం గ్రక్కినవి అవి యపుడు పెద్ద †యశనులయి నేలంబడినవి. దృశ్యములగు మనుష్యాదిభూతములును అదృశ్యములయిన పిశాచాదులును మొదలగు సమస్తభూతములును మిక్కిలి బెదరుగదురఁగా వడనడనడంకుచు. పిమ్మట మ్రాఁతతోఁ పాటిగా భయంకరధ్వనుల నఱచుచు నిద్రఁజెందినట్లు భూమిపయింబడి యందును చింతచేదుఃఖితములై భయమున నిటునటు గదలక మెదలకుండెను. అంత రాముఁడు బ్రహ్మాస్త్రమును సంధింపఁగానే సముద్రము భూతములతోను సర్పములతోను రాక్షసులతోను గొప్పగొప్ప తిరంగములతోను గూడినదై, పూర్వము కేవలబాణములు రాముఁడు వైచినపుడు కలంగిన యురవడికంటె మిక్కిలి భయంకరమైనయురవడితో జలప్రవాహము కలంగినదయ్యె. అంత సముద్రజలప్రవాహము చెలియలికట్టనుండి యామడదూరము(ప్రలయము లేక యే)దాఁటివచ్చినది. (లోనికిఁ బోయినది) అప్పుడు పగవాగిని రూపుమాపురాముఁడు అట్లు మిక్కిలి యుద్ధతితో వేలను గడచి పలాయన మగుచు నున్నయా సముద్రునిపయి మించి బాణప్రయోగము సేయఁ దెగింపఁడయ్యె. అంత, పొడవుగా లేచిన జలముమధ్యమున నుండి సముద్రుఁడు లేచి మహామేరుపర్వతమున నుదయించుచున్న సూర్యునివలెఁ బ్రకాశించెను. ఆసముద్రుఁడు దీప్తముఖములు గలసర్పములతోఁగూడ పొడకట్టెను. అతఁడు నిద్దంబగు వైడూర్యమణివన్నె గలిగి, నేరటేటి బంగారుసొమ్ముల నలంకృతుఁడై రత్నములు దాపినమెులనూలును ఎఱ్ఱనిపూదండలును వస్త్రములును ధరించియుండెను. అతనికన్నులు తామర రేకులం బురుడించుచుండెను. అతఁడు శిరమున సర్వపుష్పములు గ్రువ్వఁబడియున్న దివ్యంబగు పూదండనుదాల్చి, గనియందుఁ బుట్టిన బంగారుసొమ్ములను కుందనపుసొమ్ములను తనయందుఁ బుట్టిన

* వరాహమిహిరుఁడు 'ఉల్కా శిరసి విశాలా నిపతి నీవర్ధతేచ తనుపుచ్ఛా' విశాలమైనతలయు చిన్నతోఁకయుఁ గలిగి పడుమనే పెరుఁగును' అనియు నిర్ఘాతమునకు 'పవనః పవనాభిహతో గగనా దవనౌ యదా సమాపతతి । భవతి తదా నిర్ఘాతస్సచ పాపోదీర్ఘఖగవిరుతః' 'వాయువు వాయువుతో మోది ఆకాశమునుండి భూమికి పతెంచునపుడు పెద్దపక్షికూఁతగలిగి పాపాత్మకమై నిర్ఘాతము పుట్టుచున్నది' అనియు చెప్పియుండుట తెలియునది.

†వరాహమిహిరుఁడు అశనినింగూర్చి 'అశనిస్స్వనేన మహతా యుక్తా నృగజాశ్వతిరుపశుషు ఖేషు। నిపతతి విదారయన్తీ ధరాతలంచక్రసంస్థానా' 'అశని పెద్దధ్వనితోఁగూడి చక్రమువలె రూపుగలిగి మనుష్యగజాశ్వములమృగంబులం బడుచు భూతలమును భేదించుచున్నది' అని చెప్పియున్నాఁడు.

రత్నములచేతను మఱియుఁ దగిన యుత్తమభూషణములచేతను భూషితుఁడై పలు విధములయిన ధాతువులచే విలసితుండగు హిమవంతునివలె నొప్పుచుండెను. అతఁడు విశాలంబగు వక్షస్థలమున దాల్చియున్న ముత్తెములహారమునకు నడుమ దివ్యం బగు నొక నాయకరత్నము వెలయుచుండెను. అది కౌస్తుభమునకుఁ దోఁబుట్టువయి యెఱ్ఱని మెఱుంగులు దుఱంగలించుచుండెను. సముద్రుఁడు, తరంగసమూహములు నలుదెసల ఘూర్ణిల్లఁగా తనకు సహచరములయిన మేఘపంక్తులచేతను వాయువు చేతను కలగి నెఱుంగుచుండెను. ప్రభుండగు సముద్రుఁడు పెద్దపెద్ద మొసళ్లు నుడి వడ సర్పములును రాక్షసులును తోఁగ్రాలంబడ (నానావిధసుందరరూపములయిన గంగ సింధు మొదలగు నదీ దేవతలు చుట్టుఁ బరివేష్టించియుండ) *సాక్షాత్కరించెను. వీర్య వంతుఁడగు సముద్రుండు దాపసిలివచ్చి ముందుగా తానే రాముని బిలిచి, యంజలి గీలించి బాణపాణియగు రఘుకులగ్రామణిని రామునింజూచి 'సౌమ్యా! రామా! నన్ను లోఁతు గాకుండు మనెదవ? భూమియు, వాయువును, ఆకాశమును, జలము ను, అగ్నియును, అనెడి యీ పంచభూతములును, శాశ్వతంబగు మార్గమునాని, †తమతమ స్వభావములను వదలకుండును. కాఁబట్టి, నే నిల్లు మిక్కిలియు లోఁతుగ లిగి దాఁటరాకుండుట నాకును స్వభావమై యున్నది. కనుక నేను నిల్లు యుండవల సినాఁడను లోఁతులేక దాఁటనులువై యుండుట నాకు అన్యథాభావము: అది నాస్వ భావమునకు విరుద్ధమగుచున్నది ఈ కలస్థితి నీకుఁ జెప్పితిని. నీవింబట్టియే నేను నీ స మక్షమునకు రాకుంటిని. 'లోఁతుగానే యుండుము. జలమునయినను స్తంభింపఁజేసి మాకు దారియియ్యరాదా' యందువా? రామా! నీవు రాజకుమారుఁడవు గాన యయ్యె మర్యాదలనెల్ల స్థాపించువాఁడవు. నేను ద్రవ్యాశవలనఁగాని, లభించినవస్తు వును విడువనోపని లోభమువలనఁగాని, దండనము గలుగు ననుభయమువలనఁ గాని, మొసళ్లు నక్రము మొదలగుజంతువులు నెలసియుండు నాజలములను స్తంభింపఁ జేసినయెడల వానికిఁ బీడగలుగునే! కాన యొంతమాత్రము స్తంభింపఁ జేయఁజాలను. రామా! అయినను నాచేత నైనచొప్పునఁ జేయుచున్నాను. అదియెట్లన, నీసేన సముద్రము దాఁటువఱకు జలములం బోవువారిని గ్రాహాది జలజంతువులు బాధింప కుండును. ఇదిచేసెదఁ వానరులు సముద్రమును దాటువిషయమై, సేతువును గట్టుటకు నయిన సామగ్రులను చెల్లాచెదరుసేయక, సేతువుదారి యొడఁగూడునట్లు చేయుచు

* సముద్రుఁడు తనకు విరోధులయిన మరుకాంతారవాసులను రామునిచేఁ జంపించుటకును, తానును రామునివలన భయముగలవాఁడగుటంబట్టి రామునకి వానిని సంహరింపఁజాలు పరాక్రమము గల దాయని పరీక్షించుటకును, యింతకాలముతా నగపడక యాలస్యము నేసినాఁడని తెలియునది.

† భూమికి కఠినత్వమును, వాయువునకు తిర్యగ్గమనమును—అడ్డముగా సంచరించుట, ఆకాశము నకు, అవకాశప్రదానమును—ఎడమిచ్చుట, అప్పునకు అగాధత్వమును—లోఁతుగలిగియుండుట, అగ్నికి ఊర్ధ్వజ్వలనమును—మంటలు పయికిలేచుట, స్వభావములని తెలియునది.

న్నాను' అనెను. అప్పుడు రాముఁడు సముద్రునింజూచి 'సముద్రా! అట్లగునేని, నా యీ మహాబాణము అమోఘమయినది. దీనిని వింట సంధించి వేసితిని. దీనినెచ్చట విడుతును? చెప్పుము' అని యడిగెను. సముద్రుఁడు, రాముఁడు చెప్పినదివిని వింటం గూర్చియున్న యా మహాబాణమునుం జూచి తనయభిమతము సమకూరినందున మిక్కిలియు కాంతిం దేజరిల్లుచు, రామునితో 'ఇచ్చటికి దాపుగా నుత్తరభాగమునందు, ద్రుమకుల్యమని మిక్కిలి రమణీయమైన యొక ప్రదేశముగలదు. అది లోకమున నీవలెఁ బ్రఖ్యాతిఁ గాంచినది. అచట, చెండడివాండ్రు మున్నగు పాపాత్ములు నాశత్రువు లనేకులు చూచుటకు భయంకరాకారులయి భయంకరకార్యములను జేయుచు నాజలముఁను ద్రావుచున్నారు. రామా! పాపకర్ములయిన యట్టిదుష్టుల సంస్పర్శము నాకు సైఁపరానిదగుచున్నది. కాఁబట్టి అమోఘమయిన యీ మేటిబాణము ను నచ్చటి వారలపయి విడిచి నా [illegible] గాపాడుము' అనెను. అట్లతఁడు చెప్పిన మాటవిని, పిమ్మట రాముఁడు, సముద్రుని యిష్టముచొప్పున, అతఁడు త్రోవఁజూపఁగా, ఆ ద్రుమకుల్యమునుగూర్చి, వెలుఁగుచున్న యాబాణమును బ్రయోగించెను. రాముఁడు పిడుగువలెఁ దళతళకాంతిని మిఱుమిట్లు గొలుపుచున్న బాణమును బ్రయోగించినస్థలము భూమియందు మరుకాంతారమని ప్రసిద్ధిఁ జెందినది. అప్పుడు ఆ బాణమువలని యదురుచే భూమి నుచ్చికొనిపోవఁగా, ఆదెబ్బ తగిలినచోటు మూలమున పాతాళమునుండి జలము పయికెగసెను. దానిచే నచటనెల్ల మహాధ్వని గలిగెను. ఆబాణపాతముచే నేర్పడినకూపము వ్రణకూపమని ప్రసిద్ధిఁ జెందినది. అందు పాతాళమునుండి పయి కెగసిన జలము, ఎగదిగసి వచ్చుచు సముద్రజలమువలె నెప్పుడును గాఁపట్టుచుండును. అట్లు బాణపాతమున నచటిభూమి వ్రయ్యలగునపుడు భయంకరమగు ధ్వని గలిగినది. అట్లు రాముఁడు బాణపాతముచే ద్రుమకుల్యమున పల్లపు ప్రదేశములందు బూర్వ మాభీరాదిపాపులచే స్పృశింపఁబడుచుండిన జలములనెల్ల నివర్తింపఁ జేసెను. అట్లు జలములింకియు నెండిపోవుటవలన నా ప్రదేశము మరుకాంతారమని ముల్లోకములందును బేరువడసినది. విద్వాంసుఁడును పరాక్రమమున దేవసముఁడు నగు *దశరథకుమారుఁడు రాముఁడు, సముద్రము మధ్యప్రదేశమయిన మరుకాంతారము నట్లుదహించి యంతట నమ్మరుకాంతారమునకు వరం బొసంగినవాఁడయ్యె. అట్లు రాముఁడు వరమొసంగుటవలన ఆ మరుకాంతారము, పశువులకుఁ గావలసిన పచ్చిక మొదలయినవి సమృద్ధముగాఁ గలిగి, రోగము లారంభించునపుడే నశించునది, వలుగ

* ఇందులకు 'శోషయిత్వాతతః కుక్షిం రామోదశరథాత్మజః । తస్మైవరం దదౌ విద్వాన్ మరవేఽమరవిక్రమః' అని మూలము. 'మోక్షయిత్వాతతః కుక్షిం' అనుపాఠమున 'సముద్రప్రదేశము నుండి ఆభీరాదిపాపులను తొలఁగించి' యని యర్థము. ఇట మనుష్యత్వము నభినయించు రాముఁడు దేవతలవలె వరదానమిచ్చుట యెట్లు? అన్నచో 'అమరవిక్రమః' అన్నాఁడు. 'సత్యేనలోకాన్ జయతి' అన్నట్లు సర్వలోకములను వశీకరించుకొన్నవాఁడు గావున నట్లు వరమిచ్చినాఁ డనభావము.

డల ఫలమూలములతోను మధువులతోనుం గూడి, మిక్కిలి నేయియు అవ్వారిగా పాలును మంచితావులు గుబాళించుచుండు నానావిధములయిన మూలికలును గలిగి, యిట్లు, ఇటువంటి భోగ్యములు పెక్కింటిచే నెప్పుడును నొప్పుచు, శోభనమయిన ప్రదేశముగలిగి వెలయునదయ్యె. అప్పు డట్లు, ఆసముద్రమధ్యప్రదేశమంతయు దగ్ధము కాఁగా, నదీపతియగు సముద్రుఁడు సర్వశాస్త్రవిదుఁడగు రామునిఁజూచి 'సౌమ్యా! ఈ నలుండనువాఁడు విశ్వకర్మకుమారుఁడు. ఇతనితండ్రి 'నావంటికుమారుఁడు నీకుఁ బుట్టు'నని యితనితల్లికి వరమియ్యఁగా పుట్టినవాఁడు, శ్రీమంతుఁడు, శిల్పవిద్యలందు విశ్వకర్మకు సాటియైనవాఁడు. ఈవానరుఁడు మిక్కిలి యుత్సాహమున నాయందు సేతువు నిర్మించుఁగాక. ఆసేతువును మునుఁగకుండ నేను ధరించెదను ఏలన నితఁడు తండ్రియంతటివాఁడు' అనిచెప్పెను. సముద్రుఁ డిట్లుచెప్పి యంతర్ధానము నొందెను. అపుడు వానరశ్రేష్ఠుఁడును మహాబలవంతుఁడునగు నలుఁడులేచి రామునిఁ జూచి 'నేను నాతండ్రి యొసంగిన సామర్థ్యము నూని విస్తీర్ణమైన సముద్రమునందు సేతువునుగట్టెదను. సముద్రుండు కలిగినదియే చెప్పినాఁడు' అని యంత వానరులం జూచి 'లోకమునఁ బురుషునకు దండమే మిక్కిలి మేలయిన యుపాయమని నా యభిప్రాయము. నెవరు లేనివారియెడల, క్షమముగాని సామముగాని లేక దానముగాని, ఇసీ! యుపాయముగాదు! భయంకరుఁడయిన యీ మహాసముద్రుఁడు సగరులచే త్రవ్వఁబడినవాఁడు. అయినను ఆ యుపకారముఁ బట్టికాక రాముఁడు దండించునను భయమునుబట్టియే సేతువుగట్టఁగాఁ జూచుకోరికతో స్థలమునొసంగినవాఁడయ్యెఁ జూడీ విశ్వకర్మ మందరపర్వతమున నాతల్లికి తనవంటిపుత్త్రుఁడు గలుగునట్లుగా వరమొసంగెను. నే నావిశ్వకర్మకు ఔరసపుత్త్రుఁడను. శిల్పవిద్యను విశ్వకర్మకు సమానుఁడను. 'అయిన నింతవఱకు నిట్టివాఁడవు యేల చెప్పకొనవైతి' వందువా? సముద్రుఁడు నాకు దీనిని జ్ఞప్తికిఁ దెచ్చినాఁడు. అతఁడు కలిగినదే చెప్పినాఁడు. మఱియు నితరులెవ్వరునుజెప్పక నాగుణములను నాయంతట నేనే చెప్పకొనువాఁడను గాను. అట్లు చెప్పితినేని యిట్టి మహాకర్మము నారంభించువిషయమై నాయందు నమ్మిక గలుగదు. నే నిట్లూరక చెప్పకొనుటమాత్రమే కాదు. సేతువును సముద్రమందుఁ గట్టితీర్చుటకును సమర్థుఁడనుగూడ నగుదును. ఇచ్ఛ యుండునేని, యిప్పుడే వానరోత్తములు సేతువుగట్టుటకు శిలాదులు దెత్తురుగాక' అనెను అంత రాముఁడు నియోగింపఁగా వానరవరులు, మిక్కిలియుబ్బున నూర్లవేలకొలఁదిని గుంపులు చేరి, నలుగడల గొప్పయడవులకుఁ బోయిరి. అప్పుడు వానరులకెల్ల నధిపతులయిన యావానరులు పర్వతాకారులయినవారు, అయ్యడవులందలి నానావృక్షములను బెఱికి సముద్రమున కీడ్చుకొని వచ్చిచేర్చిరి. వారు అట్లు, మద్దిచెట్లను, ఇనుమద్దిచెట్లను, ఏఱుమద్దిచెట్లను, చంద్రచెట్లను, వెదుళ్లను, కొండమల్లెచెట్లను, తాటిచెట్లను, బొట్టుగుచెట్లను, తిమిశవృక్షములను, మారేడుచెట్లను, ఏడాకులయఁటిచెట్లను, పూచిన కొండగోఁగుచె



1389. నలుఁడు వానరసహాయుఁడై సముద్రముపై సేతువును గట్టుట.

ట్లను, మామిడిచెట్లను, అశోకవృక్షములను, దీసికొనివచ్చి సముద్రము నిండించిరి. ఆ వానరసత్తములు కార్యత్వరంబట్టి, వృక్షములను గొన్నింటిని వేళ్లతోను గొన్నింటిని వేళ్లువిడిచియుఁ బెఱికి యింద్రధ్వజములవలె పయికెత్తి తెచ్చి సముద్రమునం బడవైచిరి. వారు నలుగడలనుండి తాటిచెట్లను, దానిమ్మచెట్లను, టెంకాయచెట్లను, తాండ్రచెట్లను, పొగడచెట్లను, తుమ్మచెట్లను, వేఁపచెట్లను, తీసికొనివచ్చి యందువైచిరి. అట్లు చెట్లన్నియు నయిపోవఁగా, మహాకాయులును మహాబలులునగు నావానరులు, ఏనుఁగులంతేసి పాషాణములను పర్వతములను బెకలించి బండ్లు మొదలయిన యంత్రములచేఁ గొనిపోయిరి. పర్వతములను సముద్రమునం బడవైచుచుండఁగా చెఱుక్కున జలముపయికెగసినది. అట్లెగయుచు నది యాకాశమునం దచ్చటచ్చట వ్యాపించినది. మఱి వానరులును సముద్రమును నలుగడల కలగుండు పఱిచిరి. కొంద ఱెచ్చుతక్కువలు లేక చక్కఁ సరిగానుండుటకై నూఱుయోజనముల నిడివికి సూత్రములను బట్టుకొనిరి నలుఁడు నదనదీపతి యగుసముద్రుని నడుమ పెద్దసేతువును గట్టెను. వానరులు నొక్కపెట్ట పెక్కుపర్వతములను బెట్టిదముగాఁ దెచ్చుచు నలుఁడు గట్టుచొప్పున సేతువును దోడుపడి కట్టుచుండిరి. కొందఱు ఆసూత్రములం గట్టినకొయ్యలను, తమతమకుకట్టవలసిన భాగములనుజూపు కొలఁతకొయ్యలను, బట్టుకొనియుండిరి. కొందఱును కోలలు పట్టుకొని వానరులను ద్వరపెట్టుచుండిరి. మఱికొందఱు సేతువుమీఁద ఱాలు గుప్పలు గూర్చుచుండిరి. కొందఱు,బడలికచే నందందనీడల మఱఁగియుండు వానరుల వెదకుచుండిరి. కొందఱు మిట్టపల్లములు పరీక్షించుచుండిరి. నలునకు సహాయులయి వందలకొలఁది వానరులు రామునియాజ్ఞను మున్నిడుకొని, మేఘసమానములయినపర్వతశిఖరములచేతను తృణములచేతను కాష్ఠములచేతను నలుఁడుగట్టిన సేతువుమీఁదిప్రదేశములనుగట్టిరి. వానరులు పయిని మృదువుగానుండుటకై పుష్పితాగ్రములయిన వృక్షములనుగూడ వైచి సేతువుఁగట్టిరి. ఏనుంగులంతేసి వానరులు, కొండలవలెఁ జూపట్టు పెద్దఱాలను పర్వతశిఖరములనుం గొని యిటునటు పరుగెత్తుచుఁ జూపట్టిరి. అపుడు ఆసముద్రమునఁ బెద్దపెద్దఱాలను విసరివేయుచుండఁగా పర్వతములను బడద్రోయుచుండఁగా దొమ్మిగా మహాధ్వనిగలిగినది ఏనుఁగులంతేసి పెనుకాయములుగల వానరులు మిక్కిలియు నుబ్బున వేగిరపడుచు, మొదటిదినమునఁ బదునాలుగుయోజనములదూరము సేతువును గట్టిరి. భయంకరాకారులును మహాబలులునగు వానరులు రెండవదినమున నిరువదియోజనముల దూరము సేతువును గట్టిరి. మహాకాయులయిన యావానరులు, మిక్కిలి వేగిరపాటుతో మూఁడవదినమున నిరువదియొక్కయోజనములదూరము సేతువును నిర్మించిరి. సహజముగానే మహావేగులయిన యవ్వానరులు నట్లు నాలుగవదినమున మిక్కిలియుఁ ద్వరపడి యిరువదిరెండు యోజనములదూరము సేతువును గావించిరి. ఆవానరులు శీఘ్రముగాఁ బనిసేసి యైదవదినమున సువేలపర్వతమువఱకు నిరువదిమూఁడుయోజనములదూరము నిర్మించి సేతు

బంధమును సమాప్తిసేసిరి. శ్రీమంతుఁడును విశ్వకర్మకుమారుఁడును బలవంతుఁడునగు నావానరతిలకుఁడు నలుఁడు తండ్రియంతటిశక్తిగలవాఁడు గావున, నట్లు సముద్రమున సేతువును గట్టినవాఁడయ్యె. నలుఁడు మకరాలయమగు సముద్రమునఁగట్టిన సేతువు, మాహాత్మ్యమున శోభిలుచు, శ్రీమంతమై, *ఆకాశమున ఛాయాపథమువలెఁ బ్రకాశించుచుండెను. అప్పుడు దేవతలును గంధర్వులును సిద్ధులును మహర్షులును, ఆయద్భుతమును జూచుటకై వచ్చి యాకాశమున నుండిరి. దేవతలును గంధర్వులును పదియోజనముల వెడలుపును నూఱుయోజనముల నిడుపును గలిగి మిక్కిలియు దుష్కరమై నలునిచేఁ గట్టఁబడియున్న సేతువును జూచిరి. వానరులు, సేతువుగట్టుటంజూచి యొండొరుల కభిముఖముగా దాఁట్లువైచుచు దవుదవ్వునకు గంతులిడుచు బొబ్బలువెట్టుచును బరమసంతోషముననుండిరి. ఇంతకుమున్ను మనస్సునఁగూడ చింతింపరానిదై, ఎవ్వరికిని యత్నము సేయ నశక్యమై యాశ్చర్యకరమై గగురుపుట్టించుచున్న యాసేతుబంధనమును, సముద్రమునఁ గట్టఁబడినదానిని, సమస్తభూతములను దర్శించినవి. సముద్రమున సేతువుగట్టుటకు సహకారులయియుండిన మహాతేజులగు వానరులు, కోట్లువేలుగా మహాసముద్రపుదక్షిణతీరమును జేరిరి. అమ్మహాసేతువు విశాలమై దృఢముగాఁ గట్టంబడినదై సరిగానుండుటచే కాంతిం దళుక్కొత్తుచు, మిట్టపల్లములు లేక, రంధ్రములును బడకయు, సముద్రమునఁ బాపటవలెఁ బ్రకాశించుచుండెను. అంత విభీషణుఁడు చేత గదందాల్చి, మంత్రులంగూడి, శత్రువులు వచ్చిఁబడినచో వారలఁ గొట్టుటకై సముద్రపుదక్షిణతీరమునఁ గాచియుండెను. అంత సుగ్రీవుఁడు సత్యపరాక్రముఁడగు రామునిఁజూచి 'నీవు హనుమంతు నారోహింపుము. లక్ష్మణుఁ డంగదుని పయినెక్కుఁగాక. ఏలన, వీరా! మకరముల కాటపట్టయిన యీమహాసముద్రము మిక్కిలి విశాలమయినదిచుఁడీ. కాన మీరింతదూరము నడచివచ్చుట సరిగాదు. ఈ వానరులిరువురును మిమ్మిద్దఱిని ఆకాశగమనంబునం దీసికొనిపోయి దాఁటింపఁగలరు' అనెను. ధర్మాత్ముండైన యాశ్రీమంతుఁడు రాముఁడు విలుదాల్చి లక్ష్మణుని సుగ్రీవునింగూడి † యాసైన్యమునకు ముందటఁ బోయెను. అప్పుడు కొందఱు వానరులు

* ఇందులకు 'శుశుభే సుభగశ్రీమాన్ స్వాతీపథ ఇవామ్బరే' అనిమూలము. 'స్వాతీపథ' మనఁగా ఛాయాపథము. లేక అసూర్యాదుల మధ్యమార్గమునందలి మధ్యమవీథియగు స్వాతీవీథి. ఇది 'సూర్యాదీనాం త్రయోమార్గా దక్షిణోత్తరమధ్యమాః' అని దక్షిణము ఉత్తరము మధ్యమము అని సూర్యాదుల మూఁడుమార్గములను జెప్పి, 'తథాద్వే చాపి ఫల్గున్యౌ మఘా చైవార్షభీ స్మృతా। హస్తశ్చిత్రా తథా స్వాతీ మధ్యవీథ్యభివిశ్రుతా। జ్యేష్ఠా విశాఖానూరాధా వీథిరాజగవీ మతా। ఏతాస్తు వీథయస్తిస్రో మధ్యమో మార్గ ఉచ్యతే' అన్నట్లు ఆర్షభి మధ్య ఆజగవి యని మూఁడువీథులును మధ్యమమార్గమనియు నందు స్వాతీనక్షత్రము మధ్యమవీథియనియు వాయుపురాణమునఁ జెప్పఁబడియున్నది.

† ఆకాశగమనమునఁ బోవు రామలక్ష్మణులతోఁగూడ సుగ్రీవుఁడును బోయెననుటచే సుగ్రీవుఁడు కూడ ఆకాశగమనమునఁ బోయెనని తెలియుచున్నది.



1390. రామలక్ష్మణులు సేతువుమీఁదుగా సముద్రమును దాఁటుట;
వానరులు వెంబడించుట.

నడుమం బోయిరి. కొందఱు పార్శ్వభాగంబుల నడచిరి. కొందఱు నడచుటకు నెడము లేక జలములంబడి లేచిరి. మఱికొందఱు వానరులు మార్గము చాలక కొంతకాలము తీరముననే యుండి యవ్వలఁబోయిరి. కొందఱు వానరులు గరుడులుంబోలె నాకాశగమనంబునంబోయి సముద్రమును దాఁటిరి. భయంకరమయిన యావానరసైన్యము దాఁటుచుండఁగాఁ బుట్టిన మహాధ్వని భయంకరమై, మిక్కిలి బెట్టిదముగా రేఁగుచున్న యాసముద్రధ్వనిని నడఁగఁద్రొక్కి మించినదయ్యె. ఆవానరసైన్యమును రాజగు సుగ్రీవుఁడును, నలుఁడు గట్టిన సేతువుచే సముద్రమును దాఁటి సముద్రవు దక్షిణతీరమున మిక్కిలియు ఫలములును మూలములును జలములును గలచోట విడిసిరి. దేవతలును సిద్ధులును చారణులును మహర్షులును రామునికిఁదక్క మఱెవ్వరికిని మనస్సునఁగూడఁ జేయనలవిగానిదై యాశ్చర్యకరంబై యున్న యారాముని కార్యమునుజూచి వేగ రామునొద్దకువచ్చి యందఱును వేఱువేఱ రాముని మంగళజలముల నభిషేకించి 'నరదేవా! రామా! నీశత్రువులనెల్ల గెలువుము. సముద్రము మేరగాఁ గలభూమండలమునంతయు పెద్దకాలము పరిపాలింపుము' అని యిట్లు నరదేవపూజితుఁ డయినయతనిని పలువిధములగు శుభవచనములం బూజించినవారయిరి. ఇది యిరువదిరెండవ సర్గము.

—·—

శ్రీరాముఁడు యుద్ధసూచకము లయినమహోత్పాతములను గాంచి వానిని లక్ష్మణునకుం జూపుట.

లక్ష్మణాగ్రజుఁ డగురాముఁడు * నిమిత్తములను జక్కఁగా నెఱింగినవాఁడుగాన కొన్నినిమిత్తంబులనుజూచి చిరకాలము కోరియున్నయుద్ధము సమీపించెనని సంతోషముపట్టక లక్ష్మణుని బిగ్గఁ గౌఁగిలించుకొని యతనితో 'లక్ష్మణా! మనము చల్లనిజలములును మంచిఫలములును గలవనంబులతోఁ గూడిన ప్రదేశములను సస్థానముగా నేర్పఱచుకొని సేనాసమూహమును, కోఁతులు ఎలుఁగుబంట్లు కొండముచ్చులని అయ్యైభాగములుగా విభజించి గరుడవ్యూహముగాఁబన్ని స్వస్థముగా నుందము. క్షుద్రజనులను క్షయింపఁజేయునదియు, విశేషించి వానరభల్లూకరాక్షసులలో మిక్కిలి వీరులయినవారిని నాశముసేయునట్టిదియు, భయంకరమైనదియునగు యుద్ధము సమీపించియున్నదని నాకుఁ దోఁచుచున్నది. వాయువులు కలుషములయి వీచుచున్నవి. భూమియు † వడవడ వడఁకుచున్నది. పర్వతాగ్రములు నల్లలా

---

* 'నిమిత్తాన్యేవ శంసంతి శుభాశుభఫలోదయం। తస్మాదేతాని శాస్త్రజ్ఞో రాజాసముపలక్షయేత్' అన్నట్లు నిమిత్తములే శుభాశుభఫలములను సూచించునుగాన రాజు వాని నవశ్యము చూడవలయు నని తెలియునది.

† ఇచట మిక్కిలి యనిష్టకరమయిన భూకంపము సంధ్యాకాలమునఁ గలుగునదని తెలియునది. ఇదియే వసిష్ఠుఁడు 'యామత్రయాచ్చ భూకంపో ద్విజాతీనా మరిష్టదః। అరిష్టదః క్షితీశానాం సంధ్యయోరుభయోరపి' అని రాజుల కరిష్టకరమైనది సంధ్యాకాలపుభూకంపముగాఁ జెప్పియున్నాఁడు.

డుచున్నవి. వృక్షములు నాకస్మికముగా విఱిగిపడుచున్నవి. *మేఘములు, తోఁడేలు వన్నెగలిగి, డేఁగలు మొదలగువాని యాకృతులతో నొప్పుచుఁ దేఱిచూడ నలవిగాక, పరుషధ్వనులతోఁగూడి యుండుటంబట్టి భయంకరములయి, రక్తబిందువులతోఁ గూడిన జలమును గ్రూరముగాఁ గురియుచున్నవి. సంధ్య రక్తచందనమువలె నున్న మేఘములతోఁగూడి మిక్కిలి భయంకరమగుచున్నది. సూర్యుఁడు జ్వలించుచుండఁగా నతనినుండి యిదిగో యగ్నిపిండములు దొరఁగుచున్నది. సూర్యుఁడు జ్వలించుచు నిప్పులను గురియించుచున్నాఁడు మృగములును పక్షులును విన్ననయిన రూపులతోను విన్ననిమెలుఁగులతోను, దీనములయి నలుగడల సూర్యునిం జూచి బిట్టుగా నఱచుచు మహాభయమును సూచించుచున్నవి. రాత్రియందుఁ జంద్రుఁడు, ప్రభదూలి, †సంతాపము గలిగించుచున్నాఁడు. ‡ సూర్యునిచుట్టు చివరయందు నల్లని కిరణమండలమును, దానికి వెనుకఁ గొంత యెఱ్ఱనికిరణమండలమును, నడుమ మిక్కిలియు నెఱ్ఱఁదనమును గలదై, హ్రస్వమును భయంకరమునై, యింతవఱకెన్నండును జూడఁబడినదిగాక, ప్రళయకాలమునందుఁ గలుగునట్టిపరివేషమువలె, పరివేషము గనుపట్టుచున్నది. § లక్ష్మణా! మఱియు నిర్మలమయిన సూర్యమండలమునడుమ ఛిద్రమువలె నల్లనికళంకము గనఁబడుచున్నది. లక్ష్మణా! నక్షత్రములు మిక్కుటమైన దుమ్ము బ్రుంగి యెంతయు మలినములయి, కాంతిదూలి లోకములకు ప్రళయమును సూచించుచున్నట్లున్నవి చూడుము. కాకులును, డేఁగలును, గద్దలును మున్నగు బలవంతములగు పక్షులను దుర్బలపక్షులు క్రిందుపఱుచుచున్నవి. నక్కలు, మిక్కిలియు భయంకరములును అమంగళకరములునగు ధ్వనులను గావించుచున్నవి. ఇఁక శూరులయిన వానరులును రాక్షసులును నొండొరులపయిఁ బ్రయోగించుకొను పర్వతములచేతను శూలములు ఖడ్గములు మొదలయిన యాయుధములచేతను, భూమి యంతయుఁగప్పఁబడి నెత్తురుమాంసముల ఱొంపిగాఁగలదు. ఇఁక జాగువలదు. ఇప్పుడే

* 'విప్పల్యాఙ్గపాటంచైవ దివాకరసహస్రాంశవః । ... స్తథా కాష్ఠ ... రక్తపర్జనమ్' అని రక్తవర్షము గురియుట మిక్కిలి ముప్పుగా మహర్షులు చెప్పియున్నారు.

† చల్లని చంద్రుఁడు సంతాపమును గలుగఁజేయుట ముప్పు సూచకము.

‡ ఇటు మూఁడువర్ణములచే మూఁడుమండలములుగాఁ జెప్పఁబడినను, సాయంకాలముబట్టియుండుట చెప్పఁబడిన పరివేషము రాజునకు క్షయకరమగుట సూచితము. ఇందులకు కాశ్యపుఁడు 'ద్విమణ్డలశ్చ మూషకాన్ని ... యస్త్రిమణ్డలః' అని త్రిమండలము నృపక్షయకరముగా చెప్పియున్నాఁడు. 'దినకరపరివేషః ... మేకపీడా । దినకరపరివేషో వృష్టియుద్ధం ద్వితీయే। దినకరపరివేషం క్షేమమాహుస్తృతీయే । దినకరపరివేషస్సర్వనాశశ్చతుర్థే' అని నాలుగవయామమునఁ బరివేషము సర్వనాశకరము తెలియునది.

§ 'సన్ధ్యార్కమణ్డలచ్ఛిద్రం దృష్ట్వా జనపదక్షయః' అన్నట్లు సూర్యునందు ఛిద్రము రాజనాశకము తెలియునది.

శీఘ్రమున వానరులందఱును పరివేష్టించి రాఁగా, ఎవ్వరికి నెదిరింపరాని లంకాపురికి వేగమునఁ బోవుదము' అనెను. ధర్మాత్ముండగు రాముఁడిట్లు చెప్పి యుద్ధంబు గలుగుట కెంతయు హర్షమునొంది. సమర్థుఁడుగాన కేల విలుదాల్చి లంకాభిముఖుఁడై వానరసైన్యములకు ముందటం బోయెను. అంత విభీషణుఁడును సుగ్రీవుఁడును మున్నుగా, వానరోత్తములందఱును, శత్రువులను వధించువిషయమయి దృఢనిశ్చయము గలిగి సింహనాదములు సేయుచుం బోయిరి. రాఘవునకు సంతోషము గలుగుటకై ధైర్యవంతులును వీర్యశాలురు నగువానరులు తోఁకలాడించుట మొదలుగా యుద్ధకర్మమునందుఁగల యుత్సాహమును సూచించుచేష్టలు గావింపఁగా రఘునందనుఁ డగు రాముఁడు * సంతోషించినవాఁడయ్యె. ఇది యిరువదిమూఁడవసర్గము.

రాముఁడు సేనను గరుడవ్యూహముగాఁ బన్నుట. రావణుని చారుఁడైన శుకుఁడు వానరులచే పట్టువడి రామునిచే విడుదలనొంది రావణునొద్దకుఁబోయి మనకు గెలుచుట యసాధ్యము సీతను రామునకిమ్మని విన్నవించుట.

రామునిచే నేర్పాటుగా వసతినొంది యున్నయా వానరవీరసంఘము, చంద్రునిచే నేర్పాటుగలిగి శుభనక్షత్రములతోఁ గూడియున్న శరత్కాలపు పున్నమరాత్రివలె మిక్కిలియుఁ బ్రకాశించినది. సముద్రమువలె నపరిచ్ఛిన్నమై తేజరిలుచున్న యా వానరసైన్యముచేఁ బీడనొంది భూమియదిరి మిక్కిలియల్లలాడినది. అంత సైన్యము వీడుఁబట్టు లేర్పఱచుకొన్న యనంతరము, లంకనుండి సైనికుల యాక్రోశమును భేరీమృదంగములధ్వనియుఁ దుములమై గగురుపాటునొందించుచు వానరులకు వినవచ్చినవి. వానరయూథపతులు, ఆఘోషమునకు మిక్కిలి సంతుష్టులయిరి; మఱియు నా ధ్వనికి విన సైఁపఁజాలక యంతకన్న నధికధ్వని గలుగునట్లుగా సింహనాదములు గావించిరి. రాక్షసులుగూడ, అట్లు వానరులు విజ్ఞృంభించి యార్చుచు, ఆకాశంబున మేఘంబులుంబోలె గర్జించుచుండుటను వినిరి. రాముఁడు చిత్రములగు ధ్వజములచేతను పతాకలచేతను వెలుంగుచున్న లంకాపురమునుజూచి మనసు మిక్కిలియుఁ గంది కుందుచుండఁగా, నంత సీతంగూర్చి 'సాకేతమున సకలభోగములకుఁ దగినదై యుండి జింకపిల్లకుంబోలె బెళుకుంగన్నుఁగవ వన్నెగులుకుచు నుండిన యాసీత, ఈ లంకాపురమున, దుష్టగ్రహమగు నంగారకునిచేఁ గీడ్పఱుపఁబడిన రోహిణియుఁబోలె, రావణునిచే చెఱపెట్టం బడియున్నదిగా' యని తలంచుకొన్నవాఁడయ్యె. అంత నావీరుఁడు, యుద్ధమునకుఁ బయనమైనపుడు ప్రియురాలిం దలఁచుకొని

* రామునకు 'ఈదుర్గమునుజూచి వానరులు నిరుత్సాహు లగుదు'రని తలంపుండెను. అది యిప్పుడు వారి యుత్సాహచేష్టలను జూడఁగా నివర్తించి సంతోషము కలిగెనని తెలియుచున్నది.

దుఃఖించుట తగదు గావున దాని నడంచుకొని వేఁడినిట్టూర్పులు నిగిడించి లక్ష్మణునింజూచి తత్కాలమునకు హితంబగువాక్యమున 'లక్ష్మణా! ఆకాశము నొఱయుచున్నట్లు అత్యున్నతమై విశ్వకర్మచే త్రికూటపర్వతశిఖరమునందు మనస్సుచేతంబోలె నిర్మింపఁబడియున్న లంకాపురిని జూడుము. ఈలంక పెక్కునిలువుల ప్రాసాదములనేకము లావరించియుండఁగా, తెల్లనిమేఘములు గప్పిననడిమి యాకాశమువలెఁ బ్రకాశించుచున్నది. ఈలంక, మేలయిన మల్లెలు మొదలగునవి గలవై చైత్రరథముం బోలుచున్నట్టి పూచిన వనములచేతను పలువిధములయినపక్షుల కలకలధ్వనులచేతను నెంతయు నొప్పుచున్నది. పండ్లుదిని మత్తిల్లియున్న కోకిలములును, పూఁదేనియలు గ్రోలి సోలి కదలక మెదలకున్న తుమ్మెదలును, కోకిలలు నెరసిబెరసి యుండుపువ్వుజొంపములును, గలిగి యున్నవనములు మేలయిన గాడ్పులచే మాటిమాటికిఁ గదలుచున్నవి' అనెను. ఇట్లు దశరథకుమారుఁడు రాముఁడు లక్ష్మణునకుఁ జెప్పి యంత, నీతిశాస్త్రజ్ఞానమునను బ్రయోగకౌశలమునను సేనను నొడ్డుతీర్చువాఁడై వానరపతులతో 'వీర్యవంతుఁడును పగవారికి దుర్జయుఁడు నగునంగదుఁడు నీలుంగూడి, తన కపిసైన్యముందీసికొని సేనకు వక్షఃస్థలమున నుండుఁగాక. వానరశ్రేష్ఠుఁడగు ఋషభుఁడు, తనవానరసమూహమునుగూడి, వానరసేన దక్షిణపార్శ్వమునం గాచియుండుఁగాక. మదపుటేనుఁగుంబోలెఁ జెనఁకరానివాఁడై బలవంతుఁ డగుగంధమాదనుఁడు తనసైన్యముతో వానరసేన వలపలిపార్శ్వమున నుండుఁగాక. నేనును లక్ష్మణుఁడు నెచ్చరికతో శిరస్సున నుండెదము. జాంబవంతుఁడు సుషేణుఁడు వానరుఁడగు వేగదర్శి యనెడి మహాబుద్ధిమంతు లయిన యీ భల్లూకవానరముఖ్యులు మువ్వురును కుక్షిస్థానమును రక్షింతురుగాక. నలుగడల తేజంబు రాజిలుచుండు వరుణుఁడు పశ్చిమదిక్కును బాలించునట్లు, వానరరాజు సుగ్రీవుఁడు కపిసైన్యము పుచ్ఛభాగమును రక్షించుఁగాక' అని యాజ్ఞాపించెను. ఆవానరసైన్యము గరుడవ్యూహమున చక్కఁగా నొడ్డు తీర్పఁబడి, గొప్ప వానరవీరులచే రక్షితమయి, మేఘములు సంచరించుచున్న యాకాశమువలెఁ బ్రకాశించుచుండెను. వానరులు పర్వతశిఖరములను గొప్పగొప్పవృక్షములం దీసికొని యుద్ధంబున రాక్షసుల నందఱును మర్దింప నువ్విళు లూరుచు లంకకుం బోవ నుద్యుక్తులయిరి. ఆ వానరోత్తములు 'పర్వతశిఖరములు వైచికాని పిడికిళ్లంబొడిచికాని లంకనంతయు నుగ్గునూఁచ గావింతము' అని మనముల నిశ్చయించుకొనిరి. అటుపిమ్మట మహాతేజుండగు రాముఁడు సుగ్రీవుంజూచి, 'సైన్యములనెల్ల చక్కఁగా నొడ్డుతీర్చి యైనదిగదా. ఇఁక నీశుకుని విడిచిపుచ్చుము' అనెను. రాముఁడు చెప్పినదివిని మహాబలుఁ డగువానరేంద్రుఁడు సుగ్రీవుఁడు, అతనియాజ్ఞచొప్పున ఆరావణుదూతను శుకుని విడిచిపుచ్చెను. అట్లు వానరులచే పలువిధముల పీడితుండై మిక్కిలియు బెదరుగదిరి యున్నశుకుఁడు రాముని యాజ్ఞచే విడుమర నొందఁగానే నిమిషమయిన నచటఁ గాలూనక రాక్షసాధిపతియగు

రావణునొద్దకుఁబోయెను. రావణుఁడు నవ్వుచునే శుకునింజూచి 'నీఱెక్కలు ఛేదింపఁబడినట్లు గాన్పించుచున్నవే. అవి బంధింపఁబడినవా యేమి? వానరులు చపలచిత్తులగుటచే దొరకినవానిని గట్టుచును విడుచుచు నుందురుగాన యట్టివారి చేతం జిక్కలేదుగదా' అని యడిగెను. అంత రాక్షసరాజగు రావణుఁడు 'సుగ్రీవుఁడు నాకేమిబదులు చెప్పె' నని శుకు నడుగఁగా, వాఁడు భయమునఁ దొట్రిలఁబడుచు నా మేటిరాక్షసాధిపునిం జూచి 'నేనిచటనుండి సముద్రమునుత్తరతీరమునకుఁ బోయి, యచ్చట సుగ్రీవునిం జూచి, మృదుమధురవచనముల ననునయించుచు, నీవు చెప్పిపుచ్చినసంగతి యొక్కటియుఁదప్పక చక్కఁగా తేటపడునట్లు చెప్పితిని. ఆవానరులు, నన్నుఁ జూచినమాత్రనే మిక్కిలి క్రుద్ధులై పయికెగసి నన్నొడిసిపట్టుకొనిరి; అంతేకాదు; పిడికిళ్లం బొడుచుచు రూపుమాపను దొడఁగిరి. రాక్షసేశ్వరా! వానరులతో మాటాడుటకే యవకాశము లేకపోయెను. అడిగి బదులు తెలిసికొనుట యెక్కడిది? కాన యదియు లేదయ్యె. వానరులు స్వభావముననే మిక్కిలియు కోపస్వభావులు, అతికౄరులు. విరాధునిని, కబంధునిని, ఖరునిని వధించిపుచ్చిన ప్రసిద్ధవీరుండగు రాముఁడు సుగ్రీవసహితుఁడై సీతయున్నయిప్పట్టునకు వచ్చియున్నాఁడు. అట్టిమేటివిలుకాఁడు, ఆరాముఁడు, సముద్రమున సేతువుగట్టి, లవణసముద్రమును దాఁటి రాక్షసులం దృణీకరించి యిదె లంకాద్వారమున నున్నాఁడు. పర్వతములవలెను మేఘములవలెను జూపట్టు ఋక్షవానరముఖ్యుల సైన్యసమూహములు, వేలకొలఁదిని భూతలమునంతయు నావరించియున్నవి. రాక్షససైన్యములకును వానరసైన్యములకును రెంటికిని దేవదానవులకుంబోలె నెంతమాత్రము సంధికుదురదు. ఇదిగో వారు లంకప్రాకారముల పయికి రాఁబోవుచున్నారు. శీఘ్రమున సీతనయినను రామున కిమ్ము. చక్కఁగా యుద్ధమునైన నొసంగుము. ఈరెంటిలో నేదేనొకటి శీఘ్రముగాఁ జేయుము' అనెను. శుకుఁడు చెప్పినమాటవిని రావణుఁడు కోపంబున కన్నులెంతయు నెఱ్ఱఁబాఱ, చుఱచుఱం గాల్చునట్లు చూడ్కులు నిగుడ్చుచు వానితో "దేవతలును గంధర్వులును దానవులును అందఱును నాపయినెత్తి యుద్ధముగావించినను, సర్వలోకమును నాకు భయముగలిగించినను, సీత నెంతమాత్రము నియ్యను. వసంతర్తువునందు, పూచినవృక్షముకడకు మత్తిల్లిన తుమ్మెదలు తుప్పునఁ బాఱి ముసరునట్లు, నాబాణములు రాముని కెదు రెప్పుడు పాఱునోగదా. చాలఁగాలముగా యుద్ధము లేనందున నమ్ములపొదులం దూరకపడి యున్న నామెఱుంగుబాణములు వింటంగూర్చి వేనవేలుగాఁ బరఁగించి కొఱవులచే నేనుంగును వెలుఁతురుగొలిపి కారించునట్లు, రామునిని వానివెలుతురు గ్రమ్ముకొన, కారింపఁగలను. 'రాముఁడు విరాధాదులను జంపినాఁ'డని వానిబలమును జెప్పితివే! మహాబలపరివృతుఁడనై వానికిఁ గలయాబలమునంతయు, సూర్యుఁడుదయించుచునే చంద్రనక్షత్రాదులకాంతినిఁ దిరస్కరించునట్లు నేను క్రిందుపఱిచి వైచెదను. నాకు జగంబుల ముంచునప్పటి సముద్రమునకుంబోలె

వేగమును వాయువునకుంబోలె గమనమును గలదని రామునకుఁ దెలియదుచుమీ. కావుననే నాతో యుద్ధముసేయఁగోరుచున్నాఁడు. రాముఁడు, క్రూరవిషములుగల సర్పములవంటివై నాయంపపొదులం దున్న బాణములను యుద్ధమున నెప్పుడును జూచినవాఁడు గాఁడు. కావుననే నాతో యుద్ధముసేయఁ గోరుచున్నాఁడు. రాముఁ డింతవఱకు మున్ను యుద్ధమున నాపరాక్రమము నెఱుంగఁడు. నావిల్లే వీణియ. నాబాణములనెడికోణుపులచే దానిని వాయించుచున్నాను. అందులకు నల్లెత్రాటిచప్పుడును, ఆర్తులును భీతులును గావించు మహారోదనమును, బాణములయు నస్త్రములయు వెనుఘోషములును, ననుమూఁడను మంద్రమధ్యమతారములనెడిస్వరములు. శత్రుసైన్యమే విశాలమయిన నృత్తరంగము. ఆవీణ నుత్తెవ్వనికిని వాయింప నలవిగానిది. అట్టిసైన్యరంగమును జొచ్చి యీచాపవీణను గోని యుద్ధమందలివారు వినుచుండఁగా వాయించెదను. నాకు యుద్ధము వినోదము. వేయికన్నులు గలదేవేంద్రుఁడుగాని సాక్షాద్వరుణుండయినను గాని, యముఁడుగాని, కుబేరుఁడుగాని, మహాయుద్ధంబున నిప్పులవంటి బాణములం బ్రయోగించియు, నన్నుఁ జెనకం జాలరయిరి సుమీ!" యనెను. ఇది యిరువదినాలుగవసర్గము.

(రావణుఁడు శుకసారణు లనుచారులం బంపుట. విభీషణుఁడు
వారలను బట్టుకొని రాముని కప్పగింపఁగా నతఁడు
కరుణతో వానరసైన్యముఁ జూపించి వారిని విడిచి
పుచ్చుట. వారు పోయివచ్చిన వృత్తాంతమెల్ల
రావణునకుం జెప్పుట.)

దశరథకుమారుఁ డగురాముఁడు, వానరబలముతోఁగూడ సముద్రము దాఁటి వచ్చుటను విని, శ్రీమంతుఁ డారావణుఁడు తనమంత్రు లగుశుకసారణులం జూచి వానరసైన్యమంతయు దుస్తర మగుసముద్రమును దాఁటి వచ్చినది. ఇంతవఱకు మున్నెప్పుడును కనియు వినియు నెఱుంగని సేతువును రాముఁడు సముద్రమున బంధించినాఁడు. సముద్రమున సేతువుగట్టుట నా కింకను నెట్లును నమ్మఁగూడ లేదు. మఱియు నాకు ఆవానరసైన్య మున్నవిధమంతయుఁ దెలియవలయును. మీరలు వానరులకుఁ దెలియకుండునట్లుగా, రహస్యమున వారిసైన్యమునుజొచ్చి వారిసేన పరిమాణమును, వారల వీర్యమును, అందు ముఖ్యులయినవా రెవ్వరగుటయు, రామునిమంత్రులును సుగ్రీవునిమంత్రులును నెవ్వరయినదియు, వానరసేనయందు యుద్ధమున ముందు నిలుచుశూరు లెవ్వరగుటయు, అట్టి మహాజలాశయ మగుసముద్రమున సేతువును గట్టినవిధమును, మహాత్ములగు నయ్యాయివానరుల వీడుఁబట్లును, రాముని వ్యవసాయమును పరాక్రమమును ఆయుధములను, లక్ష్మణుని పరాక్రమమును, ఇవి

యన్నియు నున్నది యున్నట్లుగాఁ దెలిసికొని రావలయును. మహాతేజు లయినయా వానరులకు సేనాపతియెవ్వఁడు? మీర లీవిషయమంతయు కలరూపునఁ దెలిసికొని శీఘ్రమున నిచ్చటికిఁ రాఁదగును.' అని యానతిచ్చెను. వీరులయిన యా శుకసారణులు, ఇట్లు రావణునిచే ఆజ్ఞాపింపఁబడి, వానరరూపములం దాలిచి వానరసైన్యమును జొరఁబడిరి. అంత నప్పుడా శుకసారణులు, అచింత్యమై చూచువారికి గగురుఁబుట్టించు చున్నయవ్వానర సేనలంజూచి యచ్చెరువునొంది వానిని లెక్కపెట్టఁ దెలియని వారయిరి. ఏలనఁగా నవ్వానరబలము పర్వతశిఖరములందును, పర్వతములు పగుళ్లు వాఱిన పట్లయందును, గుహాలయందును, సముద్రతీరములందును, వనములందును, ఉద్యానవనములందును, నెలకొన్నదై, కొంతభాగము సముద్రమును దాఁటుచును, గొంత దాఁటియుఁ,గొంత దాఁటనుంకించుచును,గొంతవిడిసియుఁ,గొంతవిడియుచును,ఇట్లు పలుగడల పలుప్రకారములనొప్పుచు భయంకరమగు చప్పుడు గొలుపుచుండెను.ఇట్లు మహాబలసంపన్నమై యక్షోభ్యమై యీవానరసైన్యము, సముద్రమువలె నారాక్షసులకుఁ జూపట్టినదయ్యె.అట్లు ప్రచ్ఛన్నవేషులై యున్నయా శుకసారణులను, మహాతేజుండగు విభీషణుఁడు గనుఁగొనెను. అంత, నతఁడా శుకసారణుల నిద్దఱను బట్టి రామునకు 'రామా! శత్రుపురంబుల గెలుచుశూరా! ఇదిగో చూడు! వీరిద్దఱును రాక్షసేశ్వరుఁడగు రావణుని మంత్రులు; శుకసారణులనువారు, లంకనుండి మనరహస్యములను దెలిసికొనిపోవుటకై వచ్చినవేగువాండ్రు' అనెను. అప్పుడా శుకసారణులు మిక్కిలి దుఃఖితులయి బ్రతుకునం దాశవిడిచి యంజలిగీలించి భయమున రామునింజూచి 'సౌమ్యా! రఘునందనా! మేమిరువురును రావణుఁడు వేగుపంపఁగా నీ యీసైన్యము నంతయుఁ జూచి తెలిసికొనుటకె యిచ్చటికివచ్చితిమి'అనిరి. రాముఁడు మహాపురుషుఁడగు దశరథునికుమారుఁడుగాన సహజకరుణుఁడు; సమస్తభూతములకును హితము సేయుటయం దాసక్తుఁడుగాన శత్రువులపట్లను వాత్సల్యముగలవాఁడు; కాఁబట్టి యతఁడు ఆశుకసారణులు చెప్పినమాటనువిని,రావణుని బుద్ధిమాంద్యమునకు నవ్వుచు,వారితో 'ఈసైన్యమునంతయుఁ జూచి మమ్మును జక్కఁగా పరీక్షించి రావణుఁడు చెప్పినట్లు కార్యమంతయు చేసియైనదేని యథేచ్ఛముగా మరలి మీపురికి పొండు.అట్లుగాక మీకింకను జూడనిది కొంచెముండునేని మరల దానిని జూచుకొనవచ్చును. లేక, విభీషణుఁడే మీకు మరల సైన్యములనంతయుఁ జూపఁగలఁడు. మీ రిట్లు మాచేతఁ బట్టువడినందున బ్రతుకు దక్కదని యెంతమాత్రమును భయపడవలదు.ఆయుధము విడిచిన వారలంగాని, దూతలంగాని, వధింపఁదగదు. మీరు నిరాయుధులుగాన వధ్యులుగారు' అని,విభీషణునితో 'విభీషణా! వీరు తమశత్రుపక్షమువారిని పలువిధములయిన సామాద్యుపాయములచే నాకర్షించునట్టిచారులు.అయిననుఅభయమడుగుచున్నారు. అడుగుచున్నపుడును తమశత్రుపక్షమును బాధించువారలే. అడుగుకొనుచున్నారు గావున వీరి నిద్దఱిని విడిచిపుచ్చుము.' అని చెప్పి యంత నాచారులం జూచి 'మీరిద్ద

ఱు లంకాపురికిఁ బోయి, కుబేరునితమ్ముండును రాక్షసరాజు నగురావణునిఁజూచి నే నిపుడు చెప్పినమాటలన్నియు నట్లె చెప్పవలయును. "నీవు, ఏబలమును నవలంబించి నాసీతను నపహరించితివో, ఆబలమును నిప్పుడు నీవును నీసైన్యమును నీబాంధవులును యథేచ్ఛముగాఁ జూపుఁడు. రేపు ప్రాతఃకాలమున లంకాపురమును దాని ప్రాకారములను బహిర్ద్వారములను రాక్షససైన్యమును బాణములచే పటాపంచలుచేసెదను జూడు. రావణా! రేపు ప్రాతఃకాలమున వజ్రాభ్యాసి యగునింద్రుఁడు దానవులపయిని వజ్రాయుధమును బ్రయోగించునట్లు, నీపయిని నీసైన్యముపయిని భయంకరమగు నాక్రోధముం బ్రయోగింపనున్నాను. నీబలమంతయు సమకట్టుకొనియుండుము అనుఁడు" అనెను. ఇట్లు రాముఁడు బదులు సందేశము చెప్పఁగా రాక్షసులు శుకసారణులు, ధర్మవత్సలుం డయినరఘుకులదీపకుని రాముని జయజయశబ్దంబులఁ బొగడి, లంకాపురికి వచ్చి రాక్షసాధిపతి యగు రావణునిఁజూచి 'రాక్షసేశ్వరా! విభీషణుఁడు మమ్ముఁబట్టుకొని వధార్హులుగా రామునియొద్దకుఁ దీసికొనిపోయెను. అయిన నతఁడు ధర్మాత్ముఁడుగాన దూతవధము నిచ్ఛగింపఁడయ్యె. మఱియు నపారప్రతాపుఁడుగాన మము విడిచిపెట్టిన నేమిగలుగునోయని భయపడువాఁడు గాఁడు. కాన మమ్ము విడిచిపుచ్చెను. శ్రీమంతుఁడును దశరథకుమారుఁడు నగురాముఁడును, లక్ష్మణుఁడును, విభీషణుఁడును, మహాతేజుండును మహేంద్రునివంటి పరాక్రమశాలియునగు సుగ్రీవుండును, ననెడి యీ నలుగురును లోకపాలురవంటివారును, శూరులును, అస్త్రములం దాఱి తేఱినవారును దృఢపరాక్రములునగుదురు. ఇట్టి పురుషసింహులు నలుగురును లంకను మర్దించుటకై యేకస్థానముఁ జేరి యైకమత్యమును గలిగియున్నారుగాన, తక్కిన వానరులందఱు నటుండనీ, ఈ నలుగురే లంకాపురమును దాని ప్రాకారములతోను బహిర్ద్వారములతోను పెకల్చి మఱియొకచోట విసరివైవఁజాలుదురు. రాముని రూపమును, ఆయుధములును ఎట్టివో చూడఁగా, తక్కినయీముగ్గురు నటుండనీ, అతఁడొక్కఁడే లంకాపురినంతయు ధ్వంసము సేయగలఁడని మాకు తోఁచుచున్నది. 'రాముఁ డసహాయశూరుఁడైనను వానిసేనను హతము సేయఁగా నతఁడు నిరుత్సాహుఁడగును గాన యట్లుసేయుఁ' డందువా? సుగ్రీవుతోను అంగదాదులతోను గూడినదై యింతింతని కొలఁది యిడరాకున్న యాకపిసైన్యమును, రామునికి కుడిబుజమయిన లక్ష్మణుఁడు గాఁపై యుండఁగా, మనస్సునఁగూడ నెదిరించుటకు నెట్టివారికిని, కేవలము మనుష్యాదులే కాక సురలకును, సురలుమాత్రమే కాక వైరముమాని యసురులుగూడఁ గలిసికొనివచ్చినను, ఈ యిరుతెగలును దమ యిచ్ఛమాని తమతమనాయకులయాజ్ఞ చొప్పున నెత్తివచ్చినను, ఎంతమాత్రము నలవిగాదు. (అట్లు పదియోజనముల వెడలుపును నూఱుయోజనముల నిడుపునుంగల సేతువు సముద్రమున గట్టఁబడుట స్పష్టముగాఁ దెలిసియున్నది. వానరసేనయు సముద్రమును దాఁటినది. రాముఁడు సముద్రము దక్షిణ



1398. శుకసారణులు రామసైనికులచేఁ బొందిన పరాభవమును రావణునకు విన్నవించి సీతను రామున కిమ్మని ప్రార్థించుట.

తీరమున విడిసియున్నాఁడు. సైన్యములు కొంత దాఁటియుఁ గొంత దాఁటుచునున్నవి. వానికి తుది గానరాదు). దృఢంబగు మనస్సుతో తోడనే యుద్ధము సేయఁగోరుచు వానరసైనికులందఱును హర్షము చెలంగుచున్నవారు. కాన వారితో విరోధము చాలును కోపము దిగవిడిచి సీతను రామున కొసంగుము' అనిరి. ఇది యిరువది యేనవసర్గము.

(వానరసేనను జూచుటకై మిక్కిలియున్నతమైనప్రాసాదము నెక్కినరావణునకు సారణుఁడు నానావానరయూథపతులను వారిబలపరాక్రమాదులను వేఱువేఱఁజూపి చెప్పుట.)

సారణుఁడు హితం బయినయీమాటను నిర్భయముగాఁ జెప్పఁగా రాక్షసరాజగు రావణుఁడు విని వానిని నిందించుచు 'దేవతలును గంధర్వులును దానవులును అందఱు నొక్కటై నన్ను మాఱ్కొని యుద్ధముసేయవచ్చినను, సమస్తలోకములును నన్ను భయపెట్టినను గాని, సీతను నెంతమాత్రము నొసంగను. సారణా! నీవు సౌమ్యుఁడవే కాని శూరుఁడవు గావు. వానరులచే కొట్లుపడి క్రిందుపడి మిక్కిలియు దిగులు చెందియున్నావు. కాన సీతనిప్పుడే యిచ్చివేయుట మంచిదని తలఁచుచున్నావు. నన్ను యుద్ధమున జయింపఁ గలశత్రువుదా నెవ్వఁడు?' అనెను. శత్రురావణుం డయిన యారాక్షసేశ్వరుఁడు రావణుఁడు, ఇట్లు పరుషముగాఁ జెప్పి, యెంతనెంతయు సిరిదొలఁక వానరసైన్యమునంతయుఁ జూడఁగోరినవాఁడై, మంచువలె తెల్లనై పెక్కుతాటిచెట్లపొడవు గలప్రాసాదముపయి నారోహించెను. రావణుండు క్రోధము పయికొనఁగా, చారు లయినయాశుకసారణులంగూడి, ప్రాసాదముమీఁదనుండి. సముద్రమును పర్వతములను వనములనుం జూచుచు, త్రికూటాచలమునకుఁ గ్రిందనున్న భూప్రదేశమంతయు వానరులచే నిబిడముగా నిండియుండుటం జూచెను. రాక్షసరాజగు రావణుఁడు, కొలఁదిలేనందున నింతింత యని లెక్కింప నలవిగాకున్న యా వానర మహాసైన్యమును జూచి సారణుని 'ఈవానరశ్రేష్ఠులలో నెవ్వరుశూరులు! ఎవ్వరు మహాబలవంతులు? వీరిలో, మిక్కిలి యుత్సాహంబున నెల్లయెడల యుద్ధంబున ముందునిలుచువారెవ్వరు? సుగ్రీవుండు వీరిలో నెవ్వరిమాటల వినును? మఱియు వీరిలో మేటియూథపతులెవ్వరు? సారణా! వీరిలో సేనాపతులగు వానరులెవ్వరు? అన్నియుఁ గలదావున నాకుఁ జెప్పుము' అని యడిగెను. రాక్షసేశ్వరుండగు రావణుం డడిగినమాట విని సారణుఁడు వానరులలో ముఖ్యులనెల్లఁ దెలిసికొనియున్నవాఁడుగావున ముఖ్యులయిన యా వానరులను దెలియఁ జెప్పువాఁడై యతనితో 'ఇదిగో! ఈవానరుఁడు లంకాపురమున కభిముఖుఁడై సింహనాదము సేయుచు నూఱువేల యూథపతులు పరివేష్టించియుండఁగా నున్నాఁడు చూఁడు. వీనిమహాధ్వనికి

లంకయంతయు ప్రాకారములతోను బహిర్ద్వారములతోను పర్వతవనకాననముల తోనుంగూడ వడవడ వడంకుచున్నది. సమస్తవానరులకును రాజగు మహాత్ముని సుగ్రీవుని సేనకు నగ్రభాగమున నున్నవీరుఁ డయినయీయూథపతి నీలుండనువాఁడు. బాహువులు పయికెత్తి భూమిపై నిలుచున్న యీవీర్యవంతునిఁ జూడుము. వీఁడు లంక కభిముఖుఁడై క్రోధంబున మిక్కిలియు నొడలు విఱుచుకొనుచున్నాఁడు. పర్వతశిఖరమువలె నొడ్డుఁబొడువుఁ గలిగి తామరయకరువులవలె పసిమివన్నె గులుకుచున్న వీఁడు మిక్కిలియుంగుపితుండై లాంగూలమును మాటిమాటికి నేలపయిం గొట్టఁగా ఆశబ్దమునకు దశదిశలును ప్రతిధ్వనించుచున్నవి. వీని నే వానరరాజగు సుగ్రీవుఁడు యౌవరాజ్యమున కభిషేకించినాఁడు. వీని పే రంగదుఁడు; నిన్ను యుద్ధమునకుఁ బిలుచుచున్నాఁడు. వీఁడు వాలికిఁదగినట్టి పుత్త్రుఁడు; సుగ్రీవునకెప్పుడును బ్రియుఁడై యుండువాఁడు; దేవేంద్రునికొఱకు వరుణుఁడుంబోలె రామునినిమిత్తమై పరాక్రమముఁ జూప నుద్యమించియున్నవాఁడు హనుమంతుఁడు మిక్కిలివేగంబు దీపింప రాముని హితముగోరి లంకకువచ్చి సీతనుంజూచినాఁడే. అందుల కంతయు నితనిబుద్ధియే మూలము. వీర్యశాలి యగునీయంగదుఁడు, వానరోత్తముల యూథములను పెక్కింటిని దీసికొని, ఆతనసైన్యమువలన నెట్టివారికి జయింపనలవిగానివాఁడై నీపయికివచ్చుచున్నాఁడు. వాలికుమారుఁ డగునంగదునకు వెనుక మహాబలముచే పరివృతుఁడై నలుఁడున్నాఁడు. ఈవీరుఁడు యుద్ధమునకై వచ్చియున్నవాఁడు. వీఁడే సేతువు నిర్మించినవాఁడు. ఇదిగో అవయవములు నిక్కించి సింహనాదములు సేయుచు గర్జించుచును, ఆసనములనుండి లేచి కోపమున నొడలు విఱుచుకొనుచునున్నయీ వానరపుంగవులను జూడు. వీరి నెదిరించి నిలుచుట కడిఁది. వీరు భయంకరాకారులును నతిక్రూరులు నుగ్రులునై చండపరాక్రమమున నొప్పుదురు. ఈపదినూఱుకోటుల యెనిమిదిలక్షల వానరులును, మఱియు చందనవనమునుండు వీరులగు వానరులును నలుని వెంబడించు పరివారము. ఈనలుఁడు తానొక్కఁడే తనసేననుగూడి, లంకను మర్దింపఁ గోరుచున్నాఁడు. వెండివలెఁ దెల్లనిదేహము గలయీవానరుఁడు శ్వేతుఁడు. ఇతఁడు మిక్కిలి యుద్ధచపలుఁడు, భయంకరపరాక్రముఁడు, బుద్ధిమంతుఁడు, వీరుఁడు, ముల్లోకములం బ్రసిద్ధిగాంచినవాఁడు. శ్వేతుఁడు శీఘ్రమున సుగ్రీవునొద్దకు యుద్ధచపలుఁడుగాన యిప్పుడే లంకను ధ్వంసముసేసెదనని చెప్పవచ్చి యతఁ డనునయింపఁగా మరలి, దట్టమగు వానరసేనను పాయదీసికొని సైన్యములను బ్రోత్సాహపఱచుచు త్వరితముగా మరలఁ బోవుచున్నాఁడు. ఇతండు కుముదుఁడను యూథపతి. ఇతఁడు మున్ను, గోమతీతీరమున రమణీయమును నానావృక్షసమన్వితము నగు సంకోచనమను పర్వతమున నలుగడల సంచరించుచు నచట రాజ్యమును బాలించుచుండెను. ఇప్పుడు సుగ్రీవునియొద్దనున్నాఁడు. వీఁడు వేయిలక్షలవానరులం దీసికొని వచ్చుచున్నాఁడు. వీనితోఁకయందలి వెండ్రుకలు పెక్కుబారలకొలఁదిని నిడుదలయి కొన్ని



1400. వానరసైన్యమునుజూచుటకై రావణుండున్నతప్రాసాదమునెక్కుట;
సారణుండు రావణునకు రామాదులను వేలువేలచూపి చెప్పుట.

నెఱ్ఱనయిన తనదేహమును యుద్ధంపుసొంపుచేఁ బెంచుచు బలదర్పితులయిన వానరుల నందఱను నెప్పుడును దృణీకరించుచు నున్న యితఁడు గవయుండనువాఁడు, మిక్కిలియుఁ దేజస్వి; క్రోధంబున నీపయికి వచ్చుచున్నాఁడు. ఈ గవయుని డెబ్బదిలక్షలమంది వానరులు గొలుచుచున్నారు. ఈయొక్కఁడే తనసైన్యముతో, లంకాపురినంతయు మర్దింప నువ్విళులూరుచున్నాఁడు. యూథపతులయినయీ యంగదాదులను యూథపతిశ్రేష్ఠులయినయీసుగ్రీవాదులను మార్కొని నిలుచుటయెట్టివారికి నశక్యము. వీరు భయంకరులు, బలవంతులు, మఱియుఁ గామరూపులు. వీరలం దొక్కొకరికిని యూథములు వేఱువేఱ యున్నవి.' ఇది యిరువదియాఱవ సర్గము.

## సారణుఁడు రావణునకు నుత్కృష్టులయిన ప్రధాన వానరయూథపతులం జూపుట.

'రాముని నిమిత్తము పరాక్రమంబు నెఱపువారై ప్రాణంబుల దాఁపకుండునట్టి ప్రసిద్ధులగు యూథపతులను జెప్పెదను.నీవు చూచుచుండుము. ఇతఁడు హరుఁడను యూథపతి. భయంకరకర్ముఁడగు నితనితోఁకయందున్న నిద్దంపు నెండ్రుకలు పెక్కుబారలనిడుపై ఎఱ్ఱగాను పచ్చగాను తెల్లగాను మిక్కిలియుఁ దెల్లగాను, నిట్లు వర్ణములుగలిగి పయికి నిక్కింపఁబడి విరళములై, మేఘములందు నింద్రాయుధము మొదలగువానిరూపమున నానావర్ణములతోఁ బ్రసరించుసూర్యకిరణముల వలెఁ బ్రకాశించుచున్నవి. ఒక్కొక్కప్పుడు నిది నేలపయి జీరాడుచును బోవుచుండును. హరునకు కింకరులుగాన వానరరాజగు సుగ్రీవునకును గింకరులగువానరశ్రేష్ఠులు, నూర్లకొలఁదిని వేలకొలఁదిని గుంపులుగొని వృక్షములనెత్తికొని శీఘ్రమున లంకాపురి నారోహింపఁ దహతహపడుచు నీహరునివెంట వచ్చుచున్నారు. (ఇతఁడు మహాతేజులయిన వానరులు వేయికోట్లతోఁగూడి పరపురములను గెలుచు నిన్ను యుద్ధంబున గెలువఁ గోరుచున్నాఁడు) రాజా! అదిగో నల్లనయిన మహామేఘములవలెను, నల్లని కాటుకయుంబోలెను నిలుచున్న యెలుంగుబంట్లను జూచుచున్నావే! ఇవి లెక్కింపశక్యముగాక, వేఱువేఱ నిర్దేశింపను నలవిగాక, యుద్ధమున సత్యపరాక్రమములై మహాసముద్రము నవ్వలిదరివలెఁ జూపట్టుచున్నవి. ఇవి పర్వతములందు గొన్నియు విషమప్రదేశములందుఁ గొన్నియు నదీతీరములందు గొన్నియును నుండునవి. మిక్కిలియు భయంకరములయిన యీభల్లూకములు నీపయికి వచ్చుచున్నవి. రాజా! భయంకరములయిన నేత్రములును భయంకరమైన యాకారమును గలిగి యీభల్లూకముల నడుమ, పర్జన్యుని మేఘములుంబోలె నివి దన్నుచుట్టును బరివేష్టింపఁగా, నున్న యితఁడు ధూమ్రుఁడను యూథపాలుఁడు. ఇతఁడు

సమస్తభల్లూకములకును నధిపతి; నర్మదానది జలములం ద్రావుచు ఋక్షవంతమను మేటిపర్వతంబున నుండును. పర్వతాకారుండయిన యితనిం జూడుము. ఇతఁడు ధూమ్రుని తమ్ముఁడు. రూపమునం దన్నవంటివాఁడుగాని పరాక్రమములం దతనికంటె మిగుల నధికుఁడు. ఇతఁడే జాంబవంతుఁ డనువాఁడు. ఇతఁడు మేటియూథపులలో ముఖ్యుండు, పరాక్రమవంతుఁడు, గురుశుశ్రూషకుఁడు, యుద్ధములం దెదిరిబింకము రూపుమాపక యుండ నోర్వఁడు. బుద్ధిమంతుఁడయిన యీజాంబవంతుఁడు మున్ను దేవాసురులయుద్ధమున దేవేంద్రునకు మిక్కిలియు గొప్పసాహాయ్యముగావించి పెక్కువరములను బడసియున్నవాఁడు. ఈ జాంబవంతుని సైన్యములు లెక్కకు మిక్కిలియై పెద్దయాకారములును పెద్దరోమంబులును గలిగి, అగ్నియుంబోలెఁ దేజంబున వెలుంగుచు, రాక్షసులకును పిశాచులకు సాటియై పర్వతశిఖరములపయికి నెక్కి యచ్చటనుండి మహామేఘములవంటి పెద్దఱాలను బడఁద్రోయును; మృత్యువునకుఁగూడ భయపడవు. మిక్కిలియు సంరంభంబున సదా మొగురున ట్లున్నయితఁడు దంభుఁడను యూథపతి. ఈ మేటియూథపతిని, ఉన్నవానరులందఱును నాశ్చర్యంబునఁ జూచుచు నిలుచున్నారు. రాజా! ఈ వానరేశ్వరుఁడు మిక్కిలి బలసంపన్నుఁడుగాన తనబలంబుఁ జూపి దేవేంద్రునకు సంతోషము గావించుచున్నాఁడు. ఇతఁడు సన్నాదనుం డనువాఁడు; వానరులకెల్లఁ బితామహుఁడు. ఇతఁడు నడచునపుడు ఒక్కయడుగిడఁగానే యోజనదూరమున నుండు పర్వతము ప్రక్కఁ జేరి నిలుచునుగాన యోజనము వెడలుపుగల శరీరముగలవాఁడు మఱియు పైకిలేచి నిలువఁగా నొక్కయోజనము పొడవునకుఁ జాఁగునుగాన యోజనము పొడవుగల దేహముగలవాఁడగును. ఇతనికన్న పెద్దరూపముగలది చతుష్పాత్తులలో నేదియు లేదు. మున్ను దేవేంద్రుఁ డసురులతో చేసినయుద్ధమున బుద్ధిమంతుఁడగు నితఁడు నాయకులఁ దలపడి యుద్ధము గావించినాఁడు. అప్పు డెంతమాత్రము నీ మేటియూథపతి పరాజయము నొందలేదు. ఇతఁడు విక్రమించునపుడు దేవేంద్రునకు సాటిగానుండును. ఇతఁ డగ్నిదేవునికి నొకగంధర్వకన్యయందుఁ బుట్టినవాఁడు. అప్పుడు జరిగినట్టి దేవాసురయుద్ధమందు దేవతలకు సాహాయ్యముచేయుటకే యగ్ని యితనిని బుట్టించినాఁడు. రాక్షసేశ్వరా! క్రథనుండను పేరుగల యీ వానరోత్తముఁడు, కుబేరుఁడు పాలించునదియు జంబూవృక్షముతోఁ గూడినదియు, పెక్కు కిన్నరులు సేవించుచుండు పర్వతరాజములకెల్ల రాజును, నీయన్నయగు నాకుబేరునికి నెప్పుడును విహారసుఖంబుల నొసంగునదియు, నగుహిమవంతమున వాసము సేయుచుండును. శ్రీమంతుఁడయినయీ బలవంతుఁడు వానరసింహుఁడు, యుద్ధములం దెప్పుడును నాత్మస్తుతి చేసికొనఁడు. ఇతఁడు వేయికోట్లవానరులు పరివేష్టించిరా వచ్చియున్నవాఁడు. ఈతఁడు తా నొక్కఁడే లంకాపురినంతయు మర్దింపఁగోరుచున్నాఁడు. ఇదిగో నిచట

నొకయూథపతియున్నాఁడు. ఇతఁడు ప్రమాథియనఁబడును.* ఇతఁడు గజములకును వానరములకును బూర్వము గలిగిన వైరమును స్మరించుచు గంగాసమీపముననుండు గజయూథపములను బెదరించుచు నలుగడలఁ జరించుచుండును. ఈ యూథపతి నిలిచి యుద్ధప్రయాసము నొంద నక్కఱలేక యూరకి పోవుచునే శత్రువుల నాశము సేయును. పర్వత గుహలయందుండి, గజములనుబట్టి పర్వతములను, పర్వతములచే గజములను,వృక్షములచే గజములను, గజములచే వృక్షములను,గొట్టుచుండును. ఈ సేనాముఖ్యుఁడు గంగానదీసమీపమున, మందరపర్వతమునకు సాటియగు నుశీరబీజమను పర్వతమున దేవలోకమున దేవేంద్రుఁడుంబోలె, విహరించుచుండును. ఈ వానరశ్రేష్ఠుని క్రింద వేయిలక్షల వానరులున్నారు. మహాపరాక్రమశాలురును నుత్సాహవంతులును నై నుత్తిల్లి సింహనాదములుసేయుచు బలవంతులును మహాధీరులు నగుసీ వేయిలక్షల వానరుల కితఁడు నాయకుఁడు. రాజా! వాయువుచేతఁ బయికి రేఁగిన మేఘమువలె నీకుఁ గనఁబడుచున్న యీ యూథపతి (ప్రమాథి యనువాఁడు) పగవారికి నెదిరింప నలవిగానివాఁడు. వాయువుచే నలుప్రక్కల రేఁగి మిక్కిలి యెఱ్ఱనికాంతి గలిగియున్నయీ పెనుదుమ్ము పలువిధముల చుట్టిచుట్టి నుఁసియుచున్న యీ సేనయు నీకుఁ గనఁబడుచున్నది. మిక్కిలి సంరంభించినదై బలవంతమై యొప్పు నా వానరసైన్యము ప్రమాథిది. నల్లని ముఖములుగలిగి భయంకరములై మహాబలవంతములైయున్న యీ గోలాంగూలములు సేతుబంధనమును జూచి యుత్సాహమున నూఱులక్షలగుచు మహావేగుండును యూథపతియు నగుగవాక్షుండను గోలాంగూలుని పరివేష్టించి పరాక్రమమున లంకను మర్దించుటకై వచ్చుచున్నవి చూడుము. ఏపర్వతమున గోరినవానిని నన్నింటిని నొసంగునవై,యెల్లప్పుడు పూవులు పూచుచుండుటచేఁ దుమ్మెదలతోఁ గూడియుండునట్టివృక్షములు వెలయునో, దేనిసమీపంబున సూర్యుఁడు దానివలెనే బంగారువర్ణముగలవాఁడై సంచరించునో, దేనికాంతి సోఁకిన యచ్చటిమృగములును పక్షులు అదే బంగారువన్నెగలిగి వెలుఁగుచుండునో, దేని నెత్తమున మహాత్ములగుమహర్షులు విడువక నెప్పుడును వసించుచుందురో,ఎందతిగుచ్యములగు ఫలముల నొసంగుచు నెల్లకాలములందును ఫలములు పండుచుండు వృక్షములను మిక్కిలియు మేలయిన తేనియలును గలిగియుండునో, రమణీయమైన యీ మేరుపర్వతమునందు వానరముఖ్యులలోనెల్ల మేటియైన కేసరి యనెడి యీయూథపతి క్రీడించుచునుండును. అనఘా! కొండలు అఱువదివేలున్నవి. అవియన్నియు రమణీ

* పూర్వము శంబసాదనుఁడను నొకయసుర గజాకారమున మునులను బాధించుచుండఁగా నామునులు హనుమంతునితండ్రియగు కేసరిని ఆయసురం జంపునట్లు పురికొలుపఁగా నతండు వానిని జంపెను. అందులకు మునులు సంతోషించి మహాపరాక్రమశాలియగు హనుమంతుఁడు పుత్రుఁడుగాఁ బుట్టుఁగాక యని కేసరికి వరమిచ్చిరి. అదిమొదలుగా గజములకును వానరములకు పరస్పరము వైరము గలిగెనను కథ యిట యనుసంధించునది.

యములయిన బంగారుకొండలగును. వానినడుమ, రాక్షసులయందు నీవు సర్వోత్తముండవై యుండునట్లు, ముఖ్యమైన మేరుపర్వతమున్నది. నలుపు గలసినయేఱుపువన్నెగలవారును, తెల్లనిరంగుగలవారును, ఎఱ్ఱనిమొగములుగలవారును, తేనెవంటి గోరోచనపువన్నె గలవారును, వాఁడియైన కోఱలును గోళ్లును నాయుధములుగాఁ గలవారునైన యీవానరులు ఆపర్వతరాజమున వాసముసేయుచుందురు. వీరు నాలుగుకోఱల సింగములవలెను, దారసింపరా నంతజెడిదములయిన పులులవలెను నుందురు. వీరందఱును నగ్నివలె నుగ్రులై, కుపితములయిన సర్పములవలెఁ గోపస్వభావులై, మిక్కిలి నిడుదలయి యొప్పుచున్నలాంగూలములు గలిగి, మదపుటేనుంగులం బురుడించుచు, మహాపర్వతాకారులయి, పెనుమేఘములవలె గర్జిలుచు, గుండ్రనయి గోరోచనపువన్నెగలిగి కడలనెఱ్ఱనయిన కన్నులతో భీమసదృశులై భయంకరమగు గమనమును కంఠధ్వనియు నెలయుచునుందురు. వీరందఱు నీలంకాపురిఁ జూచి యిపుడే మర్దించునట్లున్నారు. రాజా! ఈవానరుల కధిపతి యిదిగో వీరలనడుమ నున్నాఁడు చూడుము. ఇతఁడు వీర్యశాలి; ఇతనిపేరు శతవలియని భూతలమున ప్రఖ్యాతినొందియున్నది. బుద్ధిమంతుఁడగు నితఁడు జయముగోరి సూర్యుని కెప్పుడును బూజగావించుచుండును. ఇతఁడొక్కఁడే తనసేనంగొని లంకాపురినంతయు మర్దింపఁ గోరుచున్నాఁడు. ఇతఁడు పరాక్రమవంతుఁడు,బలవంతుఁడు, శూరుఁడు, పౌరుష మెంతమాత్రము వదలకుండువాఁడు. ఈశతవలి రామునికిఁ బ్రియముసేయుపట్ల తనప్రాణములనుగూడ నెంతమాత్రము పాటింపఁడు. గజుఁడును గవాక్షుఁడును గవయుఁడును నలుఁడును నీలుఁడును నను వీరలలో నొక్కొక్కనికిని పదిగోట్లసైన్యము బలసియున్నది. అట్లు వింధ్యపర్వతమున వాసముసేయు మహావేగగతులగు వానరోత్తములు నున్నారు. వారలనేకులుగాన వారిని లెక్కపెట్ట నలవిగాదు. మహారాజా! ఈవానరులందఱును మహాప్రభావులు, అందఱును మహాపర్వతాకారులు, అందఱును క్షణమాత్రమున భూతలమునందలిపర్వతముల నెల్ల నుగ్గునూఁచ గావించి విసరివైవం జాలునట్టి దిట్టలు' అనెను. ఇది యిరువదియేడవసర్గము.



సారణుండు రావణునకుఁ జెప్పినదానిని సంపూర్ణముగాఁ
జెప్పనందున శుకుండు తాను దక్కినవారినెల్లఁ
జూపి చెప్పుట.

అంత సారణుఁడు చెప్పినదెల్ల విని శుకుఁడు అతఁడు సంపూర్ణముగాఁ జెప్పలేదని, తాను రాక్షసేశ్వరుఁ డగురావణునకు వానరసైన్యమునంతయు వేఱంజూపి యంతయుఁ జెప్పువాఁడై 'రాజా! మదించిన మహాగజంబులవలెను, గంగాతీరమునందలి మఱ్ఱిమ్రాఁకులవలెను, హిమవంతమునందలి మద్దిచెట్లవలెను, మహాకా

యులై యున్న యీవానరులను జూచుచున్నావే! వీరల నెదిరించి నిలుచుట కడిఁది. వీరు బలవంతులు, కామరూపులు, దైత్యదానవులకు సాటియగువారు, యుద్ధమున దేవతలుంబోలె పరాక్రమవంతులు. వీరలు తొమ్మిదివేలకోట్లును, అయిదువేలకోట్లును, ఏడువేలకోట్లును వెక్కువేలశంఖములును, వెక్కునూఱుల బృందములును గా నున్నారు. ఈవానరులు సుగ్రీవుని సహాయులు, ఎప్పుడు నతనితోఁ గూడ కిష్కింధయం దుండువారు, దేవగంధర్వులకుఁ బుట్టినవారు, పుట్టుకచేతనే కామరూపులయి యుందురు. దేవా! సుందరరూపులును యౌవనవంతులు నగువారిద్దఱిని జూచుచున్నావే! వారు మైందద్వివిదు లనువారు. ఆ యిరువురికి యుద్ధమున సాటివచ్చువాఁ డెవ్వఁడును లేఁడు. ఈ యిద్దఱును బ్రహ్మదేవు ననుజ్ఞవలన యమృతము ద్రావియున్నవారు. వీరు యుద్ధమున తామే తేజంబు నీపించి లంకను మర్దింపవలయునని కోరుచున్నారు. ఈయిద్దఱకుఁ బార్శ్వమున పర్వతాకారు లగునిద్దఱు పదికోట్లసైన్యములు తమ్ముఁ గలసియుండఁగా లంకానగరముం జూచుచున్నారు చూడుము. వీరు సుముఖుఁడును దుర్ముఖుఁడు ననువారు; మృత్యువు కొడుకులు; తండ్రియగు మృత్యువుం బోని పరాక్రమవంతులు. ప్రభూ! మత్తిల్లిన గజమువలె నిలుచున్న యీ వానరుని జూచుచున్నావే! ఇతఁడు క్రుద్ధుఁడయ్యేనేని, సముద్రమునయినను కలఁచివుచ్చం జాలును. ఇతఁడే లంకకువచ్చి సీతనుజూచి సీతతో మాటలాడి పోయినవాఁడు. మునుపు నీ వితనిని జూచియున్నావు. ఇప్పుడు మరల వచ్చియున్నాఁడు చూడుము. ఇతఁడు కేసరికి క్షేత్రజుండగు జ్యేష్ఠపుత్రుఁడు. వాయుదేవునకుఁ బుట్టినవాఁడని వినికి. ఇతనిని హనుమంతుఁ డందురు. ఇతఁడే సముద్రమునుదాఁటి లంకకు వచ్చినవానరోత్తముఁడు, కామరూపి, మహాబలుఁడు, పర్వతాకారుఁడు, సర్వవ్యాపకుఁ డగువాయువువలె నప్రతిహతగమనము గలవాఁడు, మిక్కిలి సమర్థుఁడు. మున్నితఁడు బాల్యమున చన్నుఁగుడుచు నాఁకలిగొని, యప్పు డుదయించుచున్న సూర్యునింజూచి బలవత్సమున 'నా కాఁకలి యగుచున్నది. సూర్యునిఁబట్టి భక్షించెదను' అని మనంబునఁ దలంచి *మూఁడువేల యోజనములు మేరుపర్వతమునుండి క్రిందికిదిగి దేవర్షులకును దానవులకునయినను జేరఁగరానిదగు సూర్యునియొద్ద కరుగువాఁడై, యతని తేజంబువలన సమీపమునకుఁ బోవఁజాలక యే యుదయపర్వతముపయిఁ బడెను. బటువులయిన చెక్కిలిమీఁది పల్లుగల యీవానరుఁడు, అట్లు ఉదయగిరియందు శిలాత

* ఇట 'త్రియోజనసహస్రంతు అధ్వానమవతీర్యవా' అని మూలము. మూఁడువేలయోజనములు దిగినాఁడని యర్థము. అనఁగా హనుమంతుని తండ్రి కేసరి మేరుపర్వతమున వాసము చేయువాఁడు. మేరుపర్వతము మిక్కిలి పొడవయినది. కాన సూర్యునికి దానిశిఖరమునకును నడుమనున్న మార్గము మూఁడువేలయోజనముల పరిమితిగలదని చెప్పఁబడినది. కావున నే దిగినాఁడనఁబడినదిగాని యెగిరినాఁడనలేదు. లేక సూర్యుఁడు భూమికి మీఁదుగా లక్షయోజనములందుండుటచే 'త్రియోజనసహస్ర'మనుట అనేకసహస్రములకు నుపలక్షణముగా గ్రహింపవచ్చును. పెక్కువేలయోజనములు పోయినాఁడనుట.

లముపయిఁ బడఁగా, ఆ చెక్కిలిమీఁదిపట్లలో నొకటి, కొంచెము భిన్నమయినది. కావుననే యతనికి హనుమంతుఁడని పేరు వచ్చినది. నాకు నమ్మఁదగిన యొక యాప్తునివలన ఈ హనుమంతునిసంగతి తెలిసినది. ఇది సత్యము. ఈ హనుమంతుఁడు కామరూపిగాన యితనిరూపముగాని, బలముగాని ప్రభావముగాని చెప్పనలవిగాదు. ఇతఁ డొక్కఁడె తన తేజంబుదీపించి లంకాపురమునంతయు మర్దింపవలయునని కోరుచున్నాఁడు. రాజా! ఈ హనుమంతునిమూఁపు నెక్కి యితని కెంతయు దాపుననున్నాఁడే! అతనిం జూడుము. హనుమంతుని మూఁపుపయి నెక్కియుండుటవలననే యితఁ డెట్టిశూరుఁడో తెలియుచున్నది. బంగారుశిఖరముపయి నెక్కిన నల్లని మబ్బువలె నింపయిన విగ్రహముగలిగి, తనదివ్యవిగ్రహమనెడి తటాకమున విరిసిన తామరలవలె వలపుగొలుపుచున్న కన్నుఁగవఁ జెన్నారుచున్నవాఁడు. ఇతఁ డిక్ష్వాకులలో ననరణ్యునివలెఁ గాఁడు; అపరాజితరథుఁడు సుమీ. ఇట్టివాఁ డగుట నామాటలఁ బట్టికాదు. ఖరవధాదులచేతను నీవైరి యగువాలిని వధించుటవలనను నితని పౌరుషము లోకమునందంతట ప్రఖ్యాతమైయున్నది. పౌరుషమేకలవాఁడు గాఁడు. జాబాలి మొదలగువారు చలింపఁజేసినను*ధర్మమీతనియందు నెంతమాత్రమును జలింపక నెలకొనియుండును. భరతుండు సీత మొదలగువా రెన్ని ప్రతిబంధములు చేసిన నితఁడు పితృవచనమును ముని ప్రతిజ్ఞను దీర్చుధర్మము నతిక్రమింపఁడు. పౌరుషమును ధర్మమునుమాత్రమేకాదు; బ్రహ్మాస్త్రమంత్రమును వేదములను నెఱుంగును. వేదవిదులగు వసిష్ఠాదులకన్న నుత్కృష్టుఁడు. ఇతనిపౌరుష మెట్టిదనఁగా నితఁడు బాణములచే నాకాశమునందలి విమానాదులను భేదింపఁగలఁడు. పర్వతములనయినను బ్రద్దలు వాపఁగలఁడు. మఱి మృత్యువునకుంబోలె మహాకోపమును, దేవేంద్రునకుంబోలె పరాక్రమంబునుగలవాఁడు. ఇతనిభార్యయగు సీతనే జనస్థానమునుండి నీ వపహరించి తెచ్చితివి. ఇతఁడే రాముఁడు. రాజా! అట్లు భార్య నపహరించుటవలన నీపయి యుద్ధము సేయ నత్తి వచ్చుచున్నాఁడు. ఈ రామునిదక్షిణపార్శ్వమున, అచ్చపు బంగారువంటి మేనిరంగుగలిగి, విశాలమగు వక్షమును కోపమువలన నెఱ్ఱఁబాఱియున్న కన్నులును నల్లని నెఱులుగల వెండ్రుకలును నలరి వెలుఁగుచున్నవానిని జూడుము. ఇతఁడే లక్ష్మణుఁడు; ఈ రామునికిఁ దమ్ముఁడు; రామునకు ప్రాణమువలె నెంతయుఁ బ్రియుండు. ఇతఁడు నీతిశాస్త్రమునందును యుద్ధమునందును కుశలుఁడు; తక్కినశాస్త్రముల నన్నింటియందును పండితుఁడు, పగవారింజూచి యోర్వఁడు, దుర్జయుఁడు, జయశీలుఁడు, పరా

---

* ఖరునితో యుద్ధమున వెనుకడుగు పెట్టలేదా? కపటమున వాలిని జంపలేదా? కాన రాముఁడు ధర్మము నతిక్రమింపఁడనుట యెట్లు? అన్నచో బాణములవేయ నెడముగలుగుటకై ఖరయుద్ధమున వెనుకడుగు పెట్టినాఁడు. కాంచనమాలను ధరించియున్న వాలిని మఱియొకవిధమున నెదిరించి చంప నలవిగాదు గావునను ఆశ్రితుఁడైన సుగ్రీవునికిఁ జేసినప్రతిజ్ఞ తీర్పక తప్పరాదు గావునను కపటంబునఁ జంపుటయు నధర్మముగాదు. కాన దోషములేదని తెలియునది.

క్రమవంతుఁడు, బుద్ధిమంతుఁడు, బలవంతుఁడు, రాముని కుడిబుజము, మఱియు రామునకు నెప్పుడును బయటనున్న ప్రాణమువంటివాఁడు. ఇతఁడు రామునివిషయమై ప్రాణములనేని దాఁపఁడు; తా నొక్కఁడే యుద్ధమున సమస్తరాక్షసులను వధింపవలయునని యున్నాఁడు. ఒక్కొక్కఁడును ఒక్కొక్కరాక్షసగణమువలె నున్ననలుగురురాక్షసులు తన్నుఁ బరివేష్టించియుండఁగా రాముని నెడమప్రక్కనున్నాఁడే! * ఆయితఁడు నీరాజ్యమునకు రాజయిన విభీషణుఁడు సుమీ. సమస్తకామములను బడసియున్నవాఁ డగుటచే లంకారాజ్యము నభిలషింపని శ్రీమంతుఁడును, విభీషణాదులను రాజులను జేయసిచోఁ దాను రాజరాజు కాఁజాలనని తలఁచునట్టి రాజరాజునగు రాముఁడు, ఈ విభీషణుని, లంకారాజ్యమునకు రాజుగా నభిషేకించినాఁడు. ఇతఁడు సంరంభించి నీపయినే యుద్ధమునకొఱకు నెత్తివచ్చుచున్నాఁడు. ఈ రామవిభీషణుల నడుమ నొకఁడు పర్వతమువలె నిశ్చలుఁడై నిలుచుండఁగాఁ జూచుచున్నావుగదా ! ఇతఁడు సమస్తవానరముఖ్యులకును రాజగు సుగ్రీవుఁడు; పరాజయము నొందనివాఁడు. హిమవంతము సమస్తపర్వతముల నతిశయించి యుండునట్లు, నితఁడు తేజమునను యశస్సునను బుద్ధిని జ్ఞానమునను ఆభిజాత్యమునను సమస్తవానరుల నతిశయించి వెలుఁగుచున్నవాఁడు. ప్రాకారాది దుర్గమమై పర్వతదుర్గమునై, వనవృక్షములుచుట్టును గలిగి, గుహారూపమున నుండు కిష్కింధయందు నితండు ప్రధానులయిన యూథపతులను గూడి వాసము సేయుచుండును. ఈతని వక్షమున నూఱుకమలములు గలకాంచనమాల వెలుఁగుచున్నది చూడుము. ఇది దేవతలకును మనుష్యులకును గూడ కామింపఁదగినది. ఇందు వీరలక్ష్మి నెలకొని యుండునుగాన దీనిం దాల్చినవాఁ డెన్నటికి నపజయము నొందఁడు. రాముఁడు యుద్ధమున వాలినిజంపి సుగ్రీవునకు నీ కాంచనమాలికను తారను శాశ్వతమయిన వానరరాజ్యమును నొడఁగూర్చినాఁడు. పండితులయినవారు నూఱులక్షలు కోటియని చెప్పుదురు. నూఱువేలకోట్లు శంఖ మనఁబడుచున్నది. నూఱువేలశంఖములు మహాశంఖ మగుచున్నది. నూఱువేలమహాశంఖములు బృందమని చెప్పఁబడుచున్నది. నూఱువేలబృందములు మహాబృందమని చెప్పఁబడినది. నూఱువేల మహాబృందములు పద్మం బనఁబడును. నూఱువేలపద్మములు మహాపద్మమగును. మహాపద్మములు నూఱువేలు ఖర్వ మనఁబడును నూఱువేలఖర్వములు మహాఖర్వమగును. మహాఖర్వములు నూఱువేలు సముద్రమనఁబడును. నూఱువేలసముద్రములు ఓఘమగును. నూఱువేలయోఘములు మహౌఘ మనఁబడును. ఇట్లు అయ్యోసేనాపతులక్రింద వేఱువేఱ వేయికోటులును నూఱుశంఖములును, వేయి మహాశంఖములును నూఱు

* ఇందులకు 'రాజా హ్యేవ విభీషణః' అని మూలము. ఇట 'హి' అను నక్షరముచే గాయత్రి పదాఱవ యక్షరము గ్రహింపఁబడినదిగాన పదియాఱవగ్రంథసహస్ర మిఁక నారంభింపఁబడుచున్నదని గ్రాహ్యము.

బృందములును వేయి మహాబృందములును నూఱుపద్మములును వేయి మహాపద్మములును నూఱుఖర్వములును నూఱు సముద్రములును నూఱుమహౌఘములును కోటి మహౌఘములును గలిగి సముద్రమువలె నపారమై యొప్పుసేనంగూడి, విభీషణుఁడును నతని మంత్రులయిన రాక్షసులును బలసి నడవ, మహాసైన్యపరివృతుండును ఎప్పుడును మహాబలపరాక్రమశాలియు నగువానరరాజు సుగ్రీవుండు నీపైకి యుద్ధము సేయవచ్చుచున్నాఁడు. మహారాజా ! జ్వలించు క్రూరగ్రహముంబోలె వచ్చుచున్న యీ మహాసైన్యమును జూచి యిఁక మనకు జయము గలుగునట్లును శత్రువులచే నపజయము రాకుండునట్లును జక్కఁగా గొప్పప్రయత్నమును గావింపుము' అనెను. ఇది యిరువదియెనిమిదవ సర్గము.

---

రావణుఁడు శుకసారణులను ధిక్కరించి శార్దూలాది చారులను బంపఁగా వారు వానరసేనం బ్రవేశించి విభీషణునిచేఁ బట్టువడి రామునిచే విడివడి మరల లంకకువచ్చుట.

రావణుఁడు శుకుఁడుచెప్పిన వానరయూథపతులనందఱను, రాముని సమీపమున నున్నతనతమ్ముఁడగు విభీషణుని మహావీర్యశాలిగావున రామునికిఁ గుడిబుజమగు లక్ష్మణుని, భయంకర పరాక్రముఁడును సమస్త వానరులకును రాజునయిన సుగ్రీవునిని, (గజుఁడు గవాక్షుఁడు గవయుఁడు మైందుఁడు ద్వివిదుఁడు బలవంతుఁడును వాలికుమారుఁడునగు నంగదుఁడు పరాక్రమవంతుఁడగు హనుమంతుఁడు దుర్జయుఁడగు జాంబవంతుఁడు సుషేణుఁడు కుముదుఁడు నీలుఁడు వానరతిలకుఁడగు నలుఁడు మొదలగువారినిని) జూచి మనంబునఁ గొంత బెదరుగదిరినను పరస్తోత్రము చేయుటంబట్టి కోపముగొని, అంతయుఁ జెప్పి ముగిసినపిదప వీరులయిన యాశుకసారణులను పరుషవాక్యముల బెదరించెను. అతఁడు తనకుమ్రొక్కి తలవాంచియున్న యాశుకసారణులంజూచి కుపితుండై రోషంబునఁ బలుకు దొట్రిలఁ బరుషవాక్యముల 'అన్నిటికిమొదట, నిగ్రహముగాని యనుగ్రహముగాని సేయ సమరుండగు రాజునకు నతనియొద్ద బ్రతుకుచుండు మంత్రులు ఇట్లు అప్రియవార్తలం జెప్పుట యెంతమాత్రము సరికాదుగదా. ఇది యటుండ, మనకుఁ బ్రతికూలురై మనపగవారు యుద్ధము సేయ మనపయి నెత్తివచ్చుచుండఁగా, అనవసర మయినయట్టి యుద్ధారంభసమయమున మీరిరువురు నిట్లు పరస్తోత్రముసేయుట యుక్తమగునా ? మీరు రాజనీతిశాస్త్రంబున సారభూతమయిన భృత్యకృత్యమును దెలియకున్నారు. కాన పెద్దలయి జ్ఞానవయశ్శీలసంపన్నులయి నీతిశాస్త్రోపదేశము సేయుగురువులను మీరారాధించినదంతయు వ్యర్థము. 'చిరకాలము గురువు నుపాసించినవానికి నజ్ఞానముండునా' యందురా? ఒకవేళ మీరు దానిని చదివినను దానియర్థమును విశే

షించి తెలిసికొనలేదు. లేక యర్థమునుదెలిసియు దాని యనుష్ఠానము లేనందున వట్టి జ్ఞానభారమును మోయుచున్నవారుగాని జ్ఞానమువలని యుపయోగములేదు. ఇట్టి మూర్ఖులయినమంత్రులతోఁ గూడియున్నందున నే నెప్పుడో శత్రువులచేత హతుఁడై యుండవలసినవాఁడను. అయిన దైవయోగమున చెడక నిలిచియున్నాను. నే నాజ్ఞసేయఁగా నా నాలుకయందే నామాటమాత్రనే శుభముగాని యశుభముగాని గలుగునుగదా. అట్లుండఁగా మీకు మృత్యువు గలుగునని భయములేదా యిట్టి పరుషవచనములు నాయెదుటఁ జెప్పుటకు! అడవియందుఁ గారుచిచ్చుదగిలి వృక్షములయినను క్షేమముగా నుండవచ్చును; కాని రాజునెడ దోషము చేసినట్టు సంబంధించిన యపరాధులుమాత్రము క్షేమము నొందఁజాలరు. వీరలు నాకు మున్ను చేసిన యుపకారములు తలఁపునకు వచ్చుటంబట్టి నాకోపము తీవ్రముగాక మెత్తంబడెను; కానిచో, నే నిప్పుడే శత్రుపక్షమును బొగడిన యీపాపాత్ములను శుకసారణులను వధించి పుత్తును. స్థానభ్రష్టులు గండు, పొండు. నాకంటియెదుట నుండవలదు. మీరు మున్నుచేసియున్న యుపకారములు నాతలంపునకు వచ్చుటచే మిమ్మును జంప నాకు బుద్ధిపుట్టకున్నది చుఁడీ. మీరు కృతఘ్నులనియు నాయెడల స్నేహము లేనివారనియు దిగవిడుచుటయే మిమ్ము వధించుటయగుచున్నది. వేఱు వధ మక్కఱలేదు' అనెను. ఇట్లు రావణుఁడు చెప్పఁగావిని యా శుకసారణు లిరువురును లజ్జనొంది రావణుని 'జయజయ' అనిపొగడి యంత వెడలిపోయిరి. అంత రావణుఁడు తనసమీపమున నున్నమహోదరునిఁ జూచి, 'రాజనీతియందు మిక్కిలియుఁ బండితులయిన చారులను నాయొద్దకుఁ దీసికొనిరమ్ము' అని యానతిచ్చెను. అట్లు రావణుఁడు చెప్పఁగానే మహోదరుఁడు వేగులవాండ్రను శీఘ్రముగా వచ్చునట్లాజ్ఞాపించెను. అంత వేగులవాండ్రు రాజాజ్ఞచొప్పున వేగిరమున వచ్చి యంజలిగీలించి 'జయజయ' అని యాశీర్వదించి కొలిచియుండిరి. రాక్షసేశ్వరుఁ డగురావణుఁడంత విశ్వాసపాత్రులును శూరులును శత్రువులకు భయపడనివారును భక్తిగలవారునగు నాచారులనుజూచి 'మీ రిచ్చటనుండి రామునొద్దకుఁ బొండు. పోయి యతఁడు చేయవలసినదిగా నిశ్చయించి యున్నకార్యమేది యని పరీక్షింపుఁడు. అట్టి నిశ్చయము శిథిలమైనయెడల నతనిని బెదరింతము. మంత్రులలో నతనికంతరంగభూతులును ప్రీతితోఁ గలసిమెలసి యున్నమిత్రులు నగువా రెవ్వరో వారిని గూడఁ బరీక్షింపుఁడు. ఆమైత్రియు శిథిలమైనయెడల వారిని నతనినుండి వేఱుపఱుతము. అతఁ డెట్లు నిదురపోవుచున్నాఁడు. ఒంటిగనా? మెలఁకువగలిగి పెక్కండ్రు బలసి కాచుచుండఁగనా? ఒంటిగ నిదురించునేని యుద్ధము నడపవచ్చును. ఎట్లుమేలుకొనియున్నాఁడు? చింతాకులుఁడైయా? ఆకులతలేకయా? ఆకులుఁడగునేని పయిఁబడి కొట్టవచ్చును. ఇంకను నేమిచేయనున్నాఁడు? పట్టణమును కొంతకాలము జాగుచేసి ముట్టడించునా? ఇప్పుడే యట్లుచేయునా? జాగుసేయునేని యట్లె సాగునట్లు

క్రమముగా వంచింపవచ్చును. మీరు ప్రచ్ఛన్నులై యుండి నేను చెప్పినదంతయు,అన్ని విధముల చారులందఱును తెలిసికొని రావలయును. నిపుణులయిన రాజులు, చారునిమూలముగా, శత్రువు తెఱంగంతయుఁ బూర్ణముగానెఱిఁగి యుద్ధమున స్వల్పయత్నముచే వానిఁబట్టి యోడింతురు' అనెను. అంత నావేగులవాండ్రు రావణునితో నట్లే చేసెదమని చెప్పి మిక్కిలియు సంతుష్టులయి శార్దూలుని మున్నిడుకొని రాక్షసేశ్వరుఁడగు రావణునకుఁ బ్రదక్షిణము గావించిరి. అట్లాచారులు మహాధీరుండగు నారాక్షసోత్తమునికిఁ బ్రదక్షిణము సేసి తోడనే రాముఁడును లక్ష్మణుఁడు నుండు చోటికిఁబోయిరి. ఆచారులు మఱియొక వేషము దాల్చిపోయి సువేలపర్వతముసమీపమున సుగ్రీవ విభీషణులతోఁగూడియున్న రామలక్ష్మణులను జూచిరి. వారు ఆరామలక్ష్మణులను ఆవానరసేననుం జూడఁగానే భయమున విలవిలఁబోయిరి. ధర్మాత్ముఁడగు రాక్షసేంద్రుఁడు విభీషణుఁడు ఆచారులను గనుఁగొనెను. వా రాసేనయందుఁ దిరుగుచుండఁగా నాకస్మికముగా విభీషణుఁడుగని తర్జించెను. శార్దూలుం డొక్కనినిమాత్రము మిక్కిలియు దుష్టుఁడయిన రాక్షసుఁడని విభీషణుఁడు వానరులచేతికి పట్టియిచ్చెను. వానరులాశార్దూలుని చావఁగొట్టుచుండఁగా రాముఁడు వానిని విడిచిపుచ్చెను. రాముఁడు దయచేత నితరచారులగు రాక్షసులనుగూడ వానరులు కొట్టుటనుండి విడిచిపుచ్చెను. ఆచారులు, అట్లు మిక్కిలి చుల్కనిగతియుఁ బరాక్రమమును గల యా వానరులు తమ్ముం బట్టి పీడింపఁగా నిట్టూర్పులుపుచ్చుచు మనస్సుదిటతప్పి మరల నెట్టకేలకు లంకను జేరిరి. అంతఁ బరరాష్ట్రములందలి వృత్తాంతములను దెలియుటకై యెల్లప్పుడు బయటిదేశములందు సంచారముచేయుచుండు మహాబలవంతు లయినయాచారరాక్షసులు రావణునియొద్దకుఁబోయి రాముఁడు భయంకరమగు సైన్యముతో సువేలపర్వతముసమీపమున నున్నవాఁడని తెలియఁజేసిరి. ఇది యిరువదితొమ్మిదవసరము.

### శార్దూలాదులు రావణునితో రాముఁడు వానరవీరసహితుఁడై సువేలాద్రిప్రాంత విడిసి యున్నాఁడని చెప్పుట.

అంత నాశార్దూలాదిచారులు రాముఁడు కలఁచి పుచ్చరాని మహాసైన్యముతో సువేలపర్వతమునొద్ద విడిసియున్నవాఁడని లంకాధిపతి యగురావణునకుం జెప్పిరి. రావణుఁడు చారులవలన మహాబలుం డగురాముఁడు వచ్చినాఁడని విని కొంత భయమునొంది శార్దూలునిం జూచి 'శార్దూలా ! నీముఖకాంతి యెప్పటివలె లేదు. మిక్కిలియు దీనుఁడవై యున్నావు. క్రుద్ధులయిన శత్రువులబారిం జిక్కవుగదా. వారికిఁ జిక్కుటచే వారిస్వరూపము తెలియదయ్యెనా యేమి?' యని యడిగెను. ఇట్లు రావణుం డడుగఁగా నపుడు శార్దూలుఁడు తాను వానరులచే పడినపాట్లకు భయమున

నవయవములు విరవిరఁబోవఁగా ఆరాక్షససింహునింజూచి మెల్లనిమాటల 'రాజా! ఆ వానరోత్తముల రహస్యములను కనుఁగొనుట వేగువాండ్రకు శక్యము గాదు. వానరులు తమంతటనే మిక్కిలి పరాక్రమవంతులు, మహాబలవంతులు; మీఁదు మిక్కిలి రామునిచేత రక్షితులుంగావున వారితోమాటాడుటయే శక్యముగాకున్నది. ఇఁక వారలను బరీక్షించుట యెక్కడిది? అది లభ్యముగాదు. నలుప్రక్కల నెటుచూచినను పర్వతాకారులగువానరులు మార్గంబునకుఁ గాపై కాచియున్నారు. కనుకనే నాసేనలోఁ జొచ్చితి నింతే. మఱియెచ్చటను జూడనుగూడలేదు. ఇంతలోపలనే నన్నుఁ గనుఁగొనిరి. ఆవానరసేన వేగుచూచుటకు నలవిగానిది. విభీషణునిమంత్రులగు రాక్షసులు నన్ను బలాత్కారమునఁ బట్టికొని బహువిధముల నేలం బొరలించిరి. మఱి బలవంతులగు వానరులు నన్నుఁజూచి సైఁపలేక, బెట్టిదముగా మోఁకాళ్లం దన్నియుఁ బిడికిళ్లం బొడిచియు, పండ్లంగొఱికియు, నఖచేతఁ జఱచియు, నిట్లుపీడించి నాసైన్యముచుట్టును నన్నుఁదీసికొని చుట్టించిరి. అట్లు సర్వాంగములు నెత్తుటం దోఁగి మూర్ఛిలి తెప్పిఱియు నింద్రియములు కళవళించుచున్న నన్ను వానరులు చావఁ గొట్టుచు సైన్యమునందంతటను 'చారుఁడు వీఁడుచారుఁడు' అని చాటుచుఁ ద్రిప్పి రాముఁడు కొలువున్నచోటికిఁ గొనిపోయిరి. నేను జేతులుమొగుడ్చుకొని రక్షింప బతిమాలుకొనుచుం బోయితిని. అంత రాముఁడు నన్నురక్షించెను. ఇట్లు అదృష్టవశమున బ్రతికివచ్చితిని. రాముఁడిదిగో, కొండలచేతను బండలచేతను మహాసముద్రమును బూడ్చి గట్టగట్టి దాఁటి సాయుధుఁడై వచ్చియున్నాఁడు. ఇఁక శీఘ్రముగానే లంకాద్వారమునకు రాఁగలఁడు. రాముఁడు గరుడవ్యూహముగాఁ బన్నియున్న వానరసైన్యముచే నంతటను బరివృతుఁడై నన్నువిడిచిపుచ్చి యిఁక మిక్కిలి తేజము దీపింపఁదప్పక లంకాపురిపై నెత్తివచ్చుచున్నాఁడు. రాముఁడు త్వరలోనే ముందుప్రాకారము నాక్రమించును. నీవు రామునకు సీతనిమ్ము. లేక చక్కఁగా యుద్ధమునైనఁ గావింపుము. శీఘ్రముగా నీరెంట నేదయిననొకటి సేయుము.' అనెను. అంత రాక్షసాధపతియగు నారావణుఁడు శార్దూలుఁడు చెప్పినదివిని మనస్సున నాలోచించి, మిక్కిలియు గొప్పవాక్యమున నాశార్దూలునితో 'సీత నిమ్మనెదవా? దేవతలును గంధర్వులును దానవులును ఒక్కపెట్టి నన్నెదుర్కొని యుద్ధముసేసినను, నాకు సర్వలోకములవలనను భయము గలిగినను, రామునకు సీతనెంతమాత్రమియ్యను' అనిచెప్పి మరల నమ్మహాతేజుఁడు వారలతో 'నీవు వానరసేననంతయు చక్కఁగా చూచితివిగదా. అందు శూరులగు వానరు లెవ్వరు? సౌమ్యా! శార్దూలా! అందుఁ జెనకరాకున్నవానరులయాకారము లెట్లుండును? వారిప్రభావము లెట్టివి? వారెవ్వరికొడుకులు? ఎవ్వరిమనుమలు? వారల భావమంతయు నున్నదియున్నట్టుగాఁ జెప్పుము. నీవట్లుచెప్పఁగా ఆవానరులబలాబలములనెఱింగి, వారలవిషయమై చేయువలసినదానిని దెలిసికొనెదను. యుద్ధముసేయఁగోరువారలు అవశ్యము శత్రుబలమును దెలిసికొనవలయును' అనెను. అంత నుత్తమ

చారుఁడగు శార్దూలుఁడు రావణుఁ డట్లడిగినంతట నతనికిఁ జెప్పఁబూనినవాఁడై, 'రాజగు సుగ్రీవుఁడు ఋక్షరజునికొడుకు, మిక్కిలియు దుర్జయుఁడు. * జాంబవంతుఁడను నితఁడు గద్గదునికొడుకు. గద్గదునికొడుకు మఱియొకఁడు ధూమ్రుఁ డనువాఁడు గలఁడు. యుద్ధమున నక్షాదిరాక్షసులను బెక్కండ్రను తానొక్కఁడే చంపిన హనుమంతుఁడు ఎవ్వని పుత్త్రుఁడో యా కేసరి యనువాఁడు బృహస్పతిపుత్త్రుఁడు. రాజా! † ధర్మాత్ముఁడును వీర్యవంతుఁడు నగు సుషేణుఁడును ధర్మదేవతపుత్త్రుఁడు. రాజా! ఇందు, సౌమ్యుఁడగుదధిముఖుఁ డనువానరుఁడు చంద్రునిపుత్త్రుఁడు. సుముఖుఁడును దుర్ముఖుఁడును వేగదర్శియు ననెడి యీవానరు లొక్కొక్కరును ‡ వానరరూపమున బ్రహ్మచే సృజింపఁబడిన మృత్యువే యన మృత్యుసమానులై యున్నారు. ఇది నిజము. మఱియు వానరసేనాపతియగు నీలుఁడు అగ్నిదేవునికొడుకు. ఇందు మున్ను కేసరిపుత్త్రుఁడని చెప్పఁబడిన హనుమంతుఁడనువాఁడు వాయుదేవుని కౌరసపుత్త్రుఁడు. ఎవ్వరికిని జెనకం దరముగానివాఁడై బలవంతుఁడును యౌవనవంతుఁడు నగునంగదుఁడు దేవేంద్రునిమనుమఁడు. బలవంతులగు మైందద్వివిదు లిరువురును అశ్విదేవతలకొడుకులు. ఇందు గజుఁడును, గవాక్షుఁడును, గవయుఁడును, శరభుఁడును, గంధమాదనుఁడును, ఈయైదుగురును ప్రలయకాలాంతకునకు సాటియగువారు. వీరలు యమునికొడుకులు. ఇట్లు శ్రీమంతులును దేవతలకుఁ బుట్టినవారలును యుద్ధంబునకుఁ గాలుద్రవ్వుచుండు మహాశూరులును నగువానరులు పదికోటులున్నారు. వీరలు పుట్టినచోటు మొద లగుతక్కినవిశేషములు చెప్ప నాకలవిగాదు. ఖరునిని దూషణునిని త్రిశిరునిని జంపిన యీరాముఁడు దశరథుని కుమారుఁడు, సుందరమయిన యవయవముల కుదిరికగలవాఁడు, యౌవనవంతుఁడు. విరాధునిని యమునిం బోలెడి కబంధునిని వధించినట్టి రామునకుఁ బరాక్రమంబున సాటియగువాఁడు భూతలమున నెవ్వఁడును

* జాంబవంతుఁడు బ్రహ్మ యావులింతవలనఁ బుట్టినవాఁడయ్యు, గద్గదునిచేఁ బోషింపఁబడుటచే పాంచాలీన్యాయమున గద్గదునికొడుకుగా చెప్పఁబడెనని తెలియునది.

† ఇందులకు 'సుషేణశ్చాపి ధర్మాత్మా పుత్రో ధర్మస్యవీర్యవాన్' అనిమూలము. ఇట సుషేణుఁడు ధర్మదేవతపుత్రుఁడుగా చెప్పఁబడెను. బాలకాండమున 'వరుణోజనయామాస సుషేణంనామ వానరమ్' అని సుషేణుఁడు వరుణునిపుత్రుఁడుగా చెప్పఁబడెను. ఈ విరోధమెట్లు? అన్నచో ఆవరుణుఁడే యిట ధర్ముఁడని చెప్పఁబడెనని గ్రహింపవలయును. లేక శార్దూలుఁడు భయముచే కలవరపడి యున్నందున మఱియొకవిధముగా నిది వినియుండును. లేక యీసుషేణుఁడు మఱొకఁడనియుఁ గొందఱు చెప్పెదరు. ఇట్లె తక్కినయెడలఁ దెలియునది.

‡ ఇందులకు 'మృత్యుర్వానరరూపేణ నూనం సృష్టః స్వయంభువా' అని మూలము. వీరు వానరరూపమున బ్రహ్మచే సృజింపఁబడిన మృత్యువుగా అనఁగా మృత్యువు పుత్రులుగానున్నారని యర్థాంతరము.

లేఁడు. జనస్థానమునం గల రాక్షసుల నెల్లవారిని నొక్కఁడే వధించినట్టి మహాశూరుండగు రాముని గుణములను వర్ణింప భూమియం దేమనుష్యునికిఁగాని యలవిగాదు. ఇందు, ధర్మాత్ముండగు లక్ష్మణుఁడును దశరథునికుమారుఁడు. మేటియేనుంగు మిన్నవంటివాఁడు. అతనిబాణములబారిం బడి దేవేంద్రుఁడయినను జీవింపఁజాలఁడు. ఇందు, శ్వేతుఁడును జ్యోతిర్ముఖుండు ననెడి యీ యిద్దఱును సూర్యపుత్త్రులు. వరుణునకు మఱియొకపుత్త్రుఁడు హేమకూటుండను వానరుఁడు గలఁడు. వీరుఁడును వానరోత్తముఁడునగు నలుఁడు విశ్వకర్మకుఁ బుట్టినవాఁడు. ఇందు, వానరులలో పరాక్రమవంతుఁడును బలవంతుఁడునగు సుదుర్ధరుఁడు వసుపుత్త్రుఁడు. లంకారాజ్యమును రామునివలనం బడసి యతనికి హితము సేయుటయం దాసక్తుఁడై యున్న రాక్షసశ్రేష్ఠుఁడు విభీషణుఁడు నీకుఁ దమ్ముఁడుగాన యతనిజన్మాదులు చెప్పవలసినదిలేదు. సువేలపర్వతమునొద్ద విడిసియున్న యీ వానరసైన్యము తెఱంగంతయు నిట్లు నీకెఱింగించితిని. ఇఁక మిగతకార్యమునకు దేవరయే ప్రమాణము' అనెను. ఇది * ముప్పదియవసర్గము.

( రావణుఁడు మాయావి యగువిద్యుజ్జిహ్వునిచే ఖండితమయినరామశిరస్సును, మోపెట్టఁబడిన ధనుస్సును, సీత మున్ను హనుమంతునిచేఁ బంపిన చూడామణిని మాయచే నిర్మింపఁజేసి సీతకుఁ జూపుట.

అంత, శార్దూలాదిచారులు, రాముఁడు కలంచి పుచ్చరాని మహాసైన్యముతో సువేలశైలమునొద్ద విడిసి యున్నాఁడని లంకాధిపతియగు రావణునకుఁ జెప్పిరి. రావణుఁడు మహాబలుఁడగు రాముఁడు వచ్చియున్నాఁడని చారులవలన విని, కొంచెము భయమునొంది, మంత్రులనుజూచి, 'మన మాలోచింపవలసినకాల మిదె వచ్చినది. కావున మంత్రులును నీతికుశలులు నగురాక్షసులందఱును, శీఘ్రంబున నిట వత్తురు గాక' యని యాజ్ఞాపించెను. ఆరావణుఁ డట్లాజ్ఞాపించుటనువిని మంత్రులెల్ల వేగ మతనికడకువచ్చిరి. అంత నతఁడు మంత్రులతోఁగూడ నాలోచనముసేయువాఁడయ్యె. అంత దుర్ధర్షుఁడగు నారావణుఁడు, రాముఁడు సమీపించి వచ్చినపిదప చేయుట కేది యుచితమో చక్కఁగా నాలోచనముసేసి, మంత్రులను వీడుకొలిపి తనగృహమునకుఁ బోయెను. అంత మహామాయుఁ డగు నారావణుఁడు మాయలందు నిపుణుఁడును మహాబలుఁడు నగువిద్యుజ్జిహ్వుఁ డను రాక్షసునిఁ బిలిచి యతఁడు

* ఇట చెప్పఁబడిన వానరజన్మవిధము, తఱచుగా బాలకాండమునఁ జెప్పఁబడినదానికి విరుద్ధముగా నుండుటచేతను, ఈసర్గము లేకపోయినను పూర్వోత్తరకథ యొనఁగూడియుండుటచేతను, ఈసర్గము కల్పితమని కొంద ఱందురు.



1415. రావణుఁడు రామునిమాయాశిరస్సును సీతకుజూపుట; సీత వ్యసనపడుట.

తనవెంటరా, సీతయుండుస్థలమునకుఁ బోయెను. రాక్షసరాజగురావణుఁడును మాయల నెఱింగినవిద్యుజ్జిహ్వునిం జూచి 'మనము మాయసేసి జనకరాజసుతను సీతను మోసపుత్తము. రాక్షసా! నీవు మాయచేత రామునిశిరసు నొకటిని జేసి, దానిని, బాణముతోఁగూడిన మహాధనువునుం దీసికొని నాయొద్దకురమ్ము' అనెను. రావణుఁ డిట్లు చెప్పఁగా రాక్షసుఁడు విద్యుజ్జిహ్వుఁడు 'అట్లే చేసెద' ననెను. అందులకు నారాక్షసరాజు సంతుష్టుఁడై యతని కొకవిలువగల భూషణము నొసంగెను. మహాబలుఁడగు నా రాక్షసాధిపతి రావణుఁడు, సీతను జూడ నువ్విళ్లూరుచు నయ్యశోకవనమునకే పోయెను. అంత కుబేరునితమ్ముఁ డారావణుఁడు దుఃఖమున కెంతమాత్రము దగనిదయ్యు దుఃఖితయై మొగము వాంచి శోకముపాలై భూమిపయిం గూర్చుండి భర్తనే ధ్యానముసేయుచు భయంకరాకారలగు రాక్షసస్త్రీ లిటునటు గాచుచుండఁగా నశోకవనికయం దున్నసీతం గాంచినవాఁడయ్యె. (నిండుచందురునివంటి నెమ్మొగంబుగల యాసీత రాక్షసస్త్రీలచేతం బరివృతయై, ఉత్పాతమేఘసమూహములచేత నావరింపఁబడినచంద్రరేఖవలెఁ జూపట్టుచు మంగళార్థముగాఁ దాల్చినట్టి యుత్తమభూషణములు గొన్నిటిచేమాత్ర మలంకృతయై, గాలి యెగురఁగొట్టఁగా నల్లలాడు పూఁదీఁగవలె నిటునటు దిరుగుచు, కొంతసేపు రామునిం బొందినట్లు సంకల్పించికొని హర్షమును, కొంతసేపు రామునిఁబాసినది దలంచుకొని శోకమునుం బడుచు, విషాదమునకు వేఱుతెఱంగై, లోఁతువలన స్తిమితయైయున్న గంగానదివలె దుఃఖాతిశయమువలన నేమియుఁదోఁచక స్తిమితయై యుండెను.) అంత రావణుఁడు సీతను సమీపించిపోయి మంచి సంతోషవార్తను జెప్పువానివలె *నటించుచు, నాచెలువనుజూచి మిక్కిలి తెగడెం పయిన యీమాటను జెప్పువాఁడై † 'కల్యాణీ! నే నెంత మంచిమాటల నడుగుకొనుచున్నను, నెవ్వనియాశ్రయము నమ్మి నన్నట్లు నిష్ఠురము లాడితివో ఖరాదులనువధించి నాతో వైరముగొన్న నీ పెనిమిటి యా

---

* ఇట వార్తవార్థ మెట్లన:—రావణుఁడు సీతాదేవిని స్పష్టముగా దేవతయని తెలిసియు, రాముని చేతులార వధమునుగోరియు, రాముఁడు రావణునితోడ విరోధముపెట్టుకొని మృతుఁడయినాఁడని రాక్షసులను మోసపుచ్చందలఁచి దేవి నట్లు మోసపుచ్చుటకుంబోలె శ్రీరాముని మాయాశిరస్సు మొదలయినవానిని చూపి, రాముని హతునిగా శంకించి మోసపోయిన సీతాదేవిని రహస్యమున ప్రియవచనముల నాశ్వాసించుచున్నాఁడు. 'ఉపసృత్య తత స్సీతాం ప్రహర్షం నామకీర్తయన్। ఇదంచ వచనం దుష్ట మువాచ జనకాత్మజామ్' ఇట 'దుష్టంవచనమ్' అనఁగా ఇతరరాక్షసులబుద్ధికి దుష్టముగానుండు వచనములు-సీతకు సంతోషకరములయినవి యనుట. అట్టిమాటలను జెప్పినాఁ డనుట.

† ఇందులకు మూలము. 'సాంత్వ్యమానా మయా భద్రే యముపాశ్రిత్యవల్గసే। ఖరహన్తా స తే భర్తా రాఘవ స్సమరే హతః' వార్తవార్థము.—(సాంత్వ్యమానా)రామునికి హాని యేమియులేదని నే నూరడించుచున్నను (యముపాశ్రిత్యవల్గసే) ఎవ్వని నుద్దేశించి దుఃఖమునఁ బరుగిడుచున్నావో, (ఖరహన్తా స తే భర్తాసమరేహతోధికిమ్) ఖరునిఁ జంపినయట్టి నీమగఁడు సమరహతుఁ డయినాఁడా, లేదనుట. కాన దుఃఖమును బొందకు మనుట.

రాముఁడు, నా పగవాఁడు, యుద్ధమున హతుఁడయ్యె. *నీ కుండిన యాధారమునంతయు మూలముట్టుగఁ ద్రుంచివైచితిని. నీకావరమునంతయు రూపుమాపితిని. ఇఁక నా ప్రార్థనగూడ పక్కఱలేదు. నీ వ్యసనము చేతనే వేఱుగతిలేక నీవు నాకు భార్యకాఁగలవు. † మూఢురాలా! ఇఁక నీబుద్ధివిడువుము. చచ్చినవానితో నేమిపని? కల్యాణీ! నా భార్యలకందఱికిని నీశ్వరివై యుండుము. అల్పపుణ్యురాలవుకాన యింతవఱకును పురుషార్థము మాలియున్నదానవు. ఏమియుఁ దెలియకపోయినను నన్నియుఁ దెలిసినట్లు నెన్నుకొనెదవు. సీతా! వృత్రాసురుండు చచ్చినట్లు ఘోరముగా నీమగఁడు రాముఁడును జచ్చెను. ‡ఆవిధము వినుము. రాముఁడు నన్నుఁ జంపుటకై వానరేంద్రుఁడు సుగ్రీవుఁడు తీసికొనివచ్చిన మహాసైన్యము బలసిరాఁగా, § సముద్రతీరమునకు వచ్చినాఁ

*ఇందులకు 'ఛిన్నం తే సర్వతో మూలం దర్పస్తే నిహతో మయా। వ్యసనేనాత్మనస్సీతే మమ భార్యా భవిష్యసి' అని మూలము. (హే సీతే) ఓసీతా! (ఆత్మనః) నీయొక్క (వ్యసనేన) వ్యసనము కారణముచేత (తే) (త్వయా) నీచేత, (తే మమ) నీభృత్యుఁడనయిననాయొక్క (దర్పః) గర్వము, (మయా) లక్ష్మితోఁగూడ (సర్వతో నిహతః) సర్వప్రకారముల హతమయ్యెను. (మూలం) లక్ష్మిరాకకు నిమిత్తమైనదియు, (ఛిన్నమ్) ఛిన్నమైనది. కాఁబట్టి, [భార్యా - (భర్తవ్యా) - భవిష్యసి - (రామేణైవ)] రామునిచేతనే భరింపఁదగినదానవు కాఁగలవు. కాఁబట్టి దుఃఖమును బొందకుము. నీవు వ్యసనపడుటచేత నీ భృత్యుఁడనైన నాగర్వమును సంపదను సర్వప్రకారముల నీవు హతముగావించితివి. లక్ష్మిరాకకు మూలమైనదానిని ద్రుంచితివి. ఇఁక నిన్ను నాకు భరింపనలవిగాదు. రాముఁడే నిన్ను భరింపఁగలఁడు కాన దుఃఖింపకు మనిభావము.

† ఇందులకు 'విసృజేమాం మతిం మూఢే కిం మృతేన కరిష్యసి। భవస్వ భద్రే భార్యాణాం సర్వాసామీశ్వరీ మమ' అని మూలము. వాస్తవార్థము:—(హే భద్రే) కల్యాణీ (అమూఢే) సర్వజ్ఞురాలా! (ఏతాం) దుఃఖకారణమైన రామవిపత్తును గుఱించిన యీ, (మతిం) బుద్ధిని, (విసృజ్య) విడిచి—రామునికేమియు విపత్తి గలిగినదను బుద్ధిలోఁ దలంపకయనుట. (మమ మద్భార్యాణాంచ) నాకును నా భార్యలకును, (ఈశ్వరీభవ) ఈశ్వరివి - నియమించుదానవు-గమ్ము. (అల్పపుణ్యే) అల్పపుణ్యుఁడును, (నివృత్తార్థే) నష్టమైన పురుషార్థము గలవాఁడును, (పండితమానిని) పండితునిగా తన్నుఁదా నెన్నుకొనువాఁడును, (మూఢే) మూఢుఁడును, (మృతే) మృతకల్పుఁడును, ఇట్టి విశేషణములతోఁ గూడినవాఁడనగు, నాయందు (కృపయా) అనిశేషము-కృపచేత, (కిం నకరిష్యసి) ఇట 'కిం' శబ్దము యప్యర్థకము—ఇట్లు చేయవే-దుఃఖము విడువవే యనుట. (అహం సద్యో మరిష్యామి) అనిశేషము—నేను తోడనే చచ్చెదను. అనియర్థము.

‡ ఈ రాక్షసస్త్రీలు ఎందుకు రామునికి విపత్తి కలిగెనని చెప్పుచున్నారు? అనియాశంకించి యందులకు సైపలేక చెప్పుచున్నాఁడు. 'శృణు భర్తృవధం సీతే ఘోరం వృత్రవధం యథా' అని మూలము. వాస్తవార్థము—(భర్తృవధం) భర్తయొక్క వధమును గుఱించినమాటలను—భర్త వధింపఁబడినాఁడన్న మాటలను, (త్వం శృణు) నీవే వినుము. నే నిట్టికల్లమాటలను వినసహింపనని శేషము.

§ రాముఁడు వధింపఁబడినాఁడని రాక్షసస్త్రీలు చెప్పినమాటలు అసంగతములని 'సముద్రముతీరమునకు' అనుట మొదలుగా 'నెత్తుటం దోఁగి దుమ్ముబ్రుంగియున్న యతనిశిరము నిదె తేఁబడినది' అను

డఁట. అంత రాముఁడు, సముద్రము నుత్తరతీరమున పెను సైన్యముతో దానికి రారాపుగలుగ, సూర్యుఁ డస్తమించుచుండఁగా విడిసెను. ఆ సైన్యమంతయు దారినడచి యలసియుండుటచే విడిసినదై యర్ధరాత్రమున సుఖనిద్రఁ జెందియున్నపుడు మొదట చారులనుబంపి యందలి జాడలన్నియుఁ గనుఁగొంటిమి. రాముఁడును లక్ష్మణుఁడునున్న యావానరసైన్యమంతయు ప్రహస్తుఁడు నాగొప్పసైన్యమును దీసికొని రాత్రియందు హతము గావించెను. రాక్షసులుఅడ్డగత్తులను గుదియలను చిన్నచక్రములను బెద్దయినుపదండములను, ఖడ్గములను; బాణసమూహములను, శూలములను, ప్రకాశించుచున్నవై యినుపచీలలుగల గదలను, దండములను, స్థూలాగ్రములయిన గదలను, ఈఁటెలను, పెద్దచక్రాయుధములను, ముసలములను వానరులపయి నెత్తియెత్తి వేలకొలఁదిని బ్రయోగించిరి. అంత యుద్ధంబులఁ బగవారిం జక్కఁ బ్రహారించువాఁడును. కృతహస్తుఁడు నగు నా ప్రహస్తుఁడు ఎంతమాత్రమును జాగుసేయక పెద్దఖడ్గమునుగొని నిదురించుచున్న రామునిశిరమును ఖండించెను. విభీషణుఁ డాకాశమున కెగిరిపోవఁ జూడఁగా రాక్షసులు దైవికముగా నొడిసిపట్టుకొనిరి. లక్ష్మణుఁడును తక్కినవానరులందఱును, దిక్కులకుఁ బలాయితులయిరి. సీతా! ఇప్పుడు వానరాధిపతియగు సుగ్రీవుఁడు కుత్తుక విఱిగిపడియున్నాఁడు. హనుమంతుఁడు హనువుపగిలి రాక్షసులచే హతుఁడై పడియున్నాఁడు. అంత జాంబవంతుఁ డెగిరిపోవనుండఁగా యుద్ధమున నతని మోఁకాళ్లను విఱుగఁగొట్టి పోనియ్యరైరి. అంత రాక్షసు లతనిని పెక్కు లడ్డగత్తులచే ఖండింపఁగా నఱుకంబడి కూలినవృక్షమునవలె నున్నాఁడు. పెనుకాయంబులుగలిగి పగవారిని జంపుదిట్టలగు మైందద్వివిదు లనెడి వానరతిలకుల నిద్దఱును, రాక్షసులు కటిస్థానమున ఖడ్గముచే ఖండింపఁగా, నెత్తుటం దొప్పదోఁగి నిట్టూర్పులు పుచ్చుచు, రోదనము సేయుచుఁ బ్రాణములు విడిచిరి. పనసుఁడు పనసపండువలె, చిత్రవిధముగా ఖండింపఁబడి నేలంబడియున్నాఁడు. దరీముఖుఁడు, పెక్కుబాణములచే ఛిన్నుఁడై యొకగుహయందుఁ బడియున్నాఁడు మహాతేజుండగు కుముదుఁడు బాణములచే ప్రాణములెడలి నిశ్శబ్దముగా నున్నాఁడు. రాక్షసులు తలపడి పెక్కుబాణములేసి ఛేదింపఁగా, అంగదుఁడు నెత్తురులు గ్రక్కుచు బాహుపురులు తూలిపడ నేలంబడినాఁడు. పరుండి నిదురించుచుండిన వానరులు కొందఱు ఏనుఁగులచేత త్రొక్కంబడియు రథసమూహములచే చదుపంబడియు చిందరవందరలయిరి. మఱికొందఱు వాయువును రవళ్లచే మేఘములవలె అశ్వముల త్రొక్కుళ్లచే నలఁగినవారయిరి. మఱికొందఱు కొట్లువడుచు దిగులుగొని నలుగడల పరుగిడఁగా, రాక్షసులు, సింహములు మహాగజంబులనుం బోలె, వారి వెనుదగిలి ప్రహరించి కూల్చిరి. కొందఱు వానరులు సముద్ర

వఱకు రాక్షసస్త్రీలు చెప్పినమాటలనే యనువదించుచున్నాఁడని తెలియునది. 'అయితే రాక్షసస్త్రీలాడిన మాటలు సర్వవిధముల మిథ్యయాయేమి?' అని సీతయడుగఁగా 'కాదు నిన్ను మోసపుచ్చుటకై రాక్షసులచేత మాయచే రామశిరస్సు మొదలయినవి కల్పింపఁబడెనని చెప్పినాఁడని తెలియునది.

మునఁబడిరి. కొందఱాకాశమున కెగసిపోయిరి. ఎలుఁగుబంట్లు నైజంబగు వానరస్వభావము నాశ్రయించి వృక్షములనారోహించినవి. మఱియుఁ బెక్కండ్రు రాక్షసులు, సముద్రతీరప్రదేశములందును, పర్వతములందును, వనములందును, వానరులను వెదకివెదకి పెక్కండ్రనుబట్టి చంపిరి. ఇట్లు నా సైన్యము నీభర్తనును నతనిసేనను జంపిరి. నెత్తుటందోఁగి దుమ్ము గ్రుంగియున్న రామునిశిరస్సునుగూడ నిదిగో తెచ్చియున్నారు' అనెను. అంత మిక్కిలియు దుర్ధర్షుండగు రాక్షసరాజు రావణుఁడు, సీత వినుచుండఁగా, దాపుననున్న * యొకరాక్షసింజూచి, 'ఓసీ! యుద్ధరంగమునుండి రామునిశిరస్సు నిచటికిఁ దానై తెచ్చి బెట్టిదంపుకార్యమును గావించిన రాక్షసుని విద్యుజ్జిహ్వునిఁ దోడ్కొనిరమ్ము' అనెను. ఆరాక్షసి పోయి రావణుఁ డానతిచ్చినది చెప్పినపిదప విద్యుజ్జిహ్వుఁ డారామునిశిరస్సును ధనుస్సునుం దీసికొనివచ్చి తల వాంచి నమస్కరించి రావణునియెదుట నిలుచుండెను. అంత రాక్షసరాజగు రావణుఁడు పెనుజిహ్వగలిగి సమీపమున నున్న విద్యుజ్జిహ్వునిఁజూచి 'సీతయెదుట శీఘ్రమున రామునిశిరస్సును నుంపుము. ఈ దరిద్రురాలు తనపెనిమిటికిఁ గలిగిన కడపటియవస్థను (మరణమును) చక్కఁగాఁ జూచుఁగాక' యనెను. ఇట్లతఁడు చెప్పఁగా రాక్షసుఁడగు విద్యుజ్జిహ్వుఁడు చూచుటకు నింపుసేయునారామునిశిరస్సును సీతముందఱఁబెట్టి వేగ నవ్వలికిఁ దొలఁగియుండెను. అంత రావణుండును ముల్లోకములఁ బ్రసిద్ధంబై తేజంబు దొలఁకుచున్న యా మహాధనుస్సును విద్యుజ్జిహ్వుని చేతినుండి లాఁగికొని, సీతనుజూచి 'అల్లెత్రాటితోఁ గూడిన యీధనుస్సు నీరామునిది ఇది గోచూడుము. ప్రహస్తుఁడు కేవలమనుష్యుఁడైన యారాముని రాత్రి వధించి దీని నిచ్చటికిఁ దెచ్చినాఁడు' అనెను. ఆరావణుఁడు విద్యుజ్జిహ్వుఁడును దానును వరుసగా రామునిశిరస్సునను ధనుస్సును నొక్కవెట్ట సీతముందఱ నేలవైచి పాతివ్రత్యంబున యశస్సుగాంచిన విదేహరాజునుతను ఆసీతనుజూచి † 'ఇఁక నాకు వశముగమ్ము' అనెను. ఇది ముప్పదియొకండవసర్గము.

—•—

## సీత మాయారామశిరస్సును జూచి వలవించుట.

ఆసీత యారాముని శిరస్సును ఉత్తమంబగు నాధనువును జూచి, హనుమంతుఁడు మునుపుచెప్పిన రామసుగ్రీవులసంబంధమును రావణుని మూలముగాను నెఱిం

* సీత యాశిరస్సునుజూడఁగోరఁగా దానిని దెచ్చుటకై రాక్షసుని బిలుచుటకు రాక్షసిని నిటఁ బంపుచున్నాఁడు. ఇందు 'నీపెనిమిటి యంతిమావస్థనుజూడుము' అనుట రాక్షసులను వంచించుటకని తెలియునది.

† ఇందులకు 'భవమేవశానుగా' అనిమూలము. వాస్తవార్థము.—(హేమే) ఓలక్ష్మీ. (అవశానుగా) అ=విష్ణుఁడగురామునకు (వశానుగా) వశమననుసరించుదానవు. (భవ) కమ్ము - రామునివశమువనే యుండుము. అనియర్థము. శ్రీ మహేశ్వరతీర్థులు.

గి, రామునికిం దగియున్నయాకన్నుఁగవను, ఆముఖవర్ణమును, ఆముఖమును, ఆతల వెండ్రుకలను, వెండ్రుకలచివరలను, మేలయిన యాచూడామణిని, జూచి ఈ యడియాలములన్నింటిచేతను నది రామునితలయేయని గుఱుతెఱింగి మిక్కిలియు దుఃఖితయై కురరివలె పలవించుచు రామునింగూర్చి కైకను మిక్కిలియు నిందించునదై 'కైకేయీ! కోర్కి యీడేఱినదానవు గమ్ము. రఘుకులమునకెల్ల నానందము గూర్చువాఁ డిదిగో హతుఁడయినాఁడు! నీకోర్కి యీడేఱెఁగా! కలహమే ప్రయోజనముగా నింతలు సేసితివి. ఎంతలా? ఊరు వెడలఁగొట్టునెపమున రామునిఁ జంపనెంచితివి* తుదకు కులమునంతయు హతము సేసితివే! నీవు తలఁచినదానికి విపరీతముగా వట్టి కలహమే కులనాశమే ప్రయోజనముగా ఫలించినది. కైకా! నీవు రాముని నారచీరలుకట్టించి నాతోఁగూడ నడవికిఁబంపితివే! సర్వప్రియకరుఁడగు రాముఁడు నీకంతటియప్రియము నేమిచేసెను' అని నిందించెను. మిక్కిలియు జాలిగొలుపుచున్న యాసీత యిట్లు నిందించి దుఃఖభయములవలన వడవడ వడంకుచు నఱుకంబడిన యరఁటిచెట్టువలె నేలంబడెను. అంత నాసీత కొంతసేపటికిఁ దెప్పిరి తెలివినొంది యాశిరస్సును మూర్కొని కన్నీరు గ్రమ్ముటచే చక్కఁగాఁ జూచుకొఱకు తనవాలుఁగన్నులను నెఱయ విచ్చుచు, 'అయ్యో! హతనైతినే! మహాబాహూ! శత్రువును జంపక మరలనని వీరవ్రతమును బట్టినవాఁడవే! నీవ్రత మిట్లు విఫలమయ్యెనా? నీవిట్లు మరణావస్థనొందఁ జూడనయితినో! విధవనయితినే! మొదట భార్యకు ముందుగా భర్త మరణించినయెడల, నందులకు భార్యయందు గుణములేమియే హేతువు అని చెప్పుదురు. నేను జక్కఁ బ్రతికియుండ నాకు ముందుగా నీవు మరణము నొందితివి. ఇట్లగుటకు హేతువు నాయందు గుణములేమియే; కాని మంచి నడవడిగల నీయందలి దోషముగాదు. నాగుణములేమికి నిదర్శనములయునా? † నేను దుఃఖముపయిదుఃఖము నొందుచువచ్చితిని, ఇప్పుడు శోకమహాసముద్రముననే మునిఁగి పోయితినే! ఏలన, నన్నుఁ గాపాడఁబూనివచ్చినట్టి నీవుగూడ హతుండవయితివే! మునిఁగినదానుగానా? ఇఁకేమిసేయుదును. రామా! నాయత్తగారు ఆ కౌసల్యాదేవి దూడయందు మిక్కిలి మక్కువగల యావు దూడను బోఁగొట్టుకొని దుఃఖమునొందునట్లు, పుత్రుఁడగు నిన్నుఁ బోఁగొట్టుకొన్నదై పరమదుఃఖము నొందఁగలదు. రామా! అచింత్యపరాక్రమా! మున్ను నీవు చిరకాలము దీర్ఘాయువైయుందు వన్నజ్యోతిషికులమాట యిప్పు డసత్యమయినది. నీ వల్పాయువయితివి.

---

* కులతంతుభూతుఁడగు రాముఁడు హతుఁడుకాఁగా అతఁడేదిక్కుగాఁ గలిగి తత్పరులై యున్న భరతాదులందఱును హతులయినట్టె. కావున కులమంతయు హతమయినదని భావము.

† వనమునకు వెడలుట మొదటిదుఃఖము, రావణుఁ డపహరించుట అంతకంటె దుఃఖము. ఇప్పుడు భర్త మృతిఁజెందుట దానికంటె దుఃఖమనిభావము.

* అట్లు వారి నబద్ధము చెప్పినా రననేల? సమస్తభూతములకును కారణభూతుఁడయిన యీకాలము (పరమాత్మ) నీవు గావించిన దుష్కర్మములను పరిపక్వము సేయు రీతికిఁ దగినట్లుగా భవిష్యదర్థములఁ దెలియు ప్రాజ్ఞుఁ డగుసత్పురుషునికి నిన్ను గుఱించిన ప్రజ్ఞ నశించిపోవుచున్నది; కాన యసత్యము చెప్పినవాఁ డగుచున్నాఁడు. నీవు వ్యసనములను వారించుటకు నలయునుపాయము లెల్లఁ దెలిసిన నిపుణుఁడవు. మఱి నీతిశాస్త్రవేత్తవు. ఇట్లు నిద్రచే కనుఁగొనరాని మృత్యువు నేమఱిపాటున నెట్లు పొందితివి? నీవు సముద్రతీరమునందు విడిసిన యారాత్రి † క్రూరమును భయంకరము నయిన యీకాళరాత్రి, తామరరేకులవంటి కన్నులుగల నిన్నుఁజూచి మోహించి నిన్నట్లు కౌఁగిలించి నన్నుండి తటాలున వెడఁబాపి యపహరించికొనిపోయినది కాఁబోలు. మహాబాహూ! దిక్కులేనిదాననై జాలిఁబుట్టించు నన్ను విడిచి భూమిని నాకంటెను బ్రియురాలింబోలెఁ గౌఁగిలించుకొని పరుండియున్నావే. పురుషతిలకుండవగు నీకిది తగునా? వీరా! బంగారుచే రంగారుచు, నీవును నేనును గూడి గంధమాల్యములచేత నెప్పుడును బూజించుచు నుండినయీధనువు, నాకు మిక్కిలి ప్రియమైన నీధనువు, ఇప్పు డిట్లయినదే! అనఘా! నీవు స్వర్గమున సమస్తపితలతోఁ గూడియున్న నామామగారగు నీతండ్రితో దశరథమహారాజుతోఁ జేరియున్నావు. ఇది నిశ్చయము. ఇంకుతమును పే స్వర్గము నొందినవారై, గొప్పకార్యములు సేయువారికి నట్టికర్మములకు ఫలముగాఁ గోరందగినపదవియం దుండువారై, పుణ్యులై, యొప్పు నీవంశము వారిని రాజర్షు లగు నిక్ష్వాకుప్రముఖులను నీవు స్వర్గమున విమానస్థుఁడవై చూచుచుందువు. రాజా! పసిదానను; పసితనముననే నిన్ను జెట్టఁబట్టినదానను, నీకే భరింపఁదగినదానను, నీయిల్లాలను, నిన్నెపుడెడఁబాయక నీతోఁగూడనే మెలఁగుదానను, ఇట్టి నన్ను, ఈదురవస్థపాలై యుండఁగా కన్నెత్తి చూడవేల? మఱి మాటాడవేల? కాకుత్స్థా! నీవు వివాహమున నాపాణిని గ్రహించునపుడు నాతోఁగూడ చరించునట్లు ప్రతిజ్ఞ చేసితివే! దానినిప్పుడు స్మరించుకొను

---

ఇందులకు 'అథవా నశ్యతి ప్రజ్ఞా ప్రాజ్ఞస్యాపి సతస్తవ । పచత్యేనం యథాకాలో భూతానాం ప్రభవో హ్యయమ్' అనిమూలము. అచింత్యపరాక్రముఁడగు నీకు విపత్తియెట్లని శంకరాఁగా 'కాలము ఈరాముని నెట్లు పాకము సేయునో యట్లు ప్రాజ్ఞుండైనను ఇతనికి ప్రజ్ఞ నశించుచున్నది. కావున నే యీవిపత్తి' యని యర్థాంతరము.

† ఇందులకు 'తథా త్వం సంపరిష్వజ్య రౌద్ర యాతినృశంసయా । కాళరాత్ర్యా మమాచ్ఛిద్య హృతః కమలలోచన' అనిమూలము. అత్యంతనిర్దయురాలయిన కాళరాత్రి నన్ను సాధనముగాఁగొని బలాత్కారమున నిన్నట్లు కౌఁగిలించి యపహరించికొని పోయినది కాఁబోలు? అని యర్థాంతరము. లేక ఇట కాళరాత్రియనఁగా సర్వభూతాపహారిణియగు నొకశక్తి. ఘోరవైధవ్యలక్షణములోఁ గూడియుండుటచే నతిక్రూరురాలై కాళరాత్రి నగునేను కౌఁగిలిందుటయే నిన్నిట్లు బలవంతముగా హతునిఁ గావించినదనియు నర్థాంతరము.

ము. స్మరించి దుఃఖితనై యున్న నన్ను నీయొద్దకుఁ దీసికొనిపొమ్ము. రామా ! నీవు ఉత్తమగతి గలవారిలోనెల్ల నుత్తముఁడవు. నిన్నుఁ బాసి కంది కుంది యున్న నీగా బుపడఁతినయ్యును, నన్నాదిగవిడిచి యేల యీలోకమునుండి పరలోకమునకుఁబో యితివి. మున్ను మంగళద్రవ్యములగు చందనాదుల కెంతయు నలవడియుండినదై *నాయొక్కతిచేతనే కౌఁగిలింపఁబడుచుండిన యీశరీరమును ఇప్పుడయ్యో! గ్రద్దలు మొదలగునవి యిటునటు పట్టి యీడ్చుచుండుట తప్పదయ్యెనే. †వనవాసము నివర్తిం చినపిదప సంపూర్ణదక్షిణలతో నగ్నిష్టోమాదియాగముల దేవపూజనము గావించి యాజ్ఞీయమైన యగ్నిహోత్రముచే సంస్కారము నేలపొందవయితివి? అయోధ్యను వెడలి యడవికిఁబోయిన మువ్వురిలో లక్ష్మణుఁడొక్కఁడేరాఁగా కౌసల్యచూచి శోక మున మందటిలి యతనిని 'సీతయు రాముఁడు నెక్కడ' యని యడుగఁగలదు. అట్లు కౌసల్య యడుగుచుండఁగా,ఆలక్ష్మణుఁడు ఆమెతో రాత్రికాలమున రాక్షసులువచ్చి నిన్నును నీమిత్రముసైన్యమును వధించిపోయిరని చెప్పఁగలఁడు. రామా! ఆయమ, నీవునిదురించుచుండునపుడు హతుండవగుటను, నేను రాక్షసగృహమునఁ జిక్కియుం డుటను, విని గుండియ లవిసి యిఁకనుండదు. ప్రాణములు తప్పకవిడుచును. ఇట్లు నిద్రావస్థయందు వధమునొందఁదగని యీరాజకుమారుఁడు బలవంతుఁడగు రాముఁ డు సముద్రమువంటి యతిప్రచండులయిన ఖరాదిభయంకర రాక్షసులనందఱఁ జంపి సముద్రమునుదాఁటియు తుదకు,దుశ్శీలనయిన నానిమిత్తమై,ఆవుపాదమంతటి ప్రహ స్తునిచే హతుఁడయినాఁడే! ఏ మందును! రాముఁడు నన్నుఁ దనకులమును జెఱుపునట్టి దిగా తెలియక యజ్ఞానమునఁ బెండ్లాడెను. కాన యయ్యార్యపుత్రునకు రామునకుఁ జెట్టపట్టినయిల్లాలే మృత్యువయ్యెను. నేను పూర్వజన్మమున నెవ్వరో కన్యాదానము సేయఁదలఁచినపుడు దానికి విఘ్నము గావించియుందును. కావుననే సర్వరక్షకుఁడును సర్వాతిథిపూజకుఁడునగు నిట్టిరామునకు భార్యనయ్యు నీజన్మమున నిట్టిభోగకాలము నందె దుఃఖపడుచున్నాను. రావణా! నన్నిఁక శీఘ్రమున రామునిపై చక్కఁబడవై వుము. ఇదిలెస్స. ఇట్లు పతిని పత్నితోఁగూర్పుము. ఇది యుత్తమమగు కల్యాణ ముగావునఁ దప్పక చేయుము. రావణా ! రామునిశిరస్సుతో నాశిరస్సును, అతనిమేని తో నామేనును జేర్పుము. మహాత్ముఁడగు పెనిమిటిపోయినపోకడనే వెంటనంటిపోయె

* నాయొక్కతిచేతనే కౌఁగిలింపఁబడుచుండిన దనుటచేత రామునకు భార్యాంతరము లేదని తెలియుచున్నది.

† వనవాసమునకుమునుపు రామున కగ్నియాధానములేదు. కనుక నది నివర్తించినపిదప అగ్నిష్టో మాదు లనుష్ఠించి పిదప క్రమముగ నాయువుతీరినంత యాజ్ఞీయమైనయగ్నిచే సంస్కారమునొందవలసిన నీవు నడుమనే యిట్లేల మరణమునొందితివని యర్థము. దీనిచే రాముఁడు వనవాసమునకుమునుపు యజ్ఞా దు లనుష్ఠింపలేదని తెలియుచున్నది. ఇదియే అయోధ్యాకాండమునఁ బ్రస్ఫుటముగా బ్రతిపాదింపఁబడి యున్నది.

దను. వెనిమిటిగతి ననుగమించెదను. (వెనిమిటిపోయినపిదప నిట్లనాథనై పాపంపు బ్రతుకు ముహూర్తముసేపయినను బ్రదుకనొల్లను. నేను నాతండ్రియింటనున్నపుడు వేదవేత్తలయిన బ్రాహ్మణులు 'ఏ స్త్రీలు భర్తను బ్రేమింతురో వారికి, మిక్కిలి శ్రేయస్కరములగు లోకములు కలుగునని చెప్పఁగా వినియున్నాను. క్షమయు, ఇంద్రియనిగ్రహమును, దానమును, సత్యమును, ధర్మమును, కృతజ్ఞతయు, భూతములను హింసింపకుండుటయు నెవ్వనియందుఁగలవో అట్టిమగనిని బాసినచో నాకు వేఱుగతియేది?)యని యిట్లు విశాలములగు నయనములువిచ్చి యాసీత పతిశిరస్సును ధనుస్సును మాటిమాటికిఁజూచి దుఃఖమున పురపురంబొక్కుచు విలపించెను. సీత యిట్లు మిక్కిలియుఁ బలవించుచుండఁగా దౌవారికుఁడగురాక్షసుఁ డొకఁడు చేమోడ్పుగీలించి యధిపుఁడగు రావణునొద్దకు వచ్చెను. వాఁడు 'ఆర్యపుత్ర! జయజయ' అని నమస్కరించి ప్రసన్నునింజేసి 'సేనాపతియగు ప్రహస్తుఁడు వచ్చియున్నాఁ'డని తెలిపెను. వాఁడు "ప్రభూ! ప్రహస్తుఁడు మంత్రులందఱితోఁగూడి మీయొద్దకువచ్చియున్నవాఁడు. అతఁడు దేవరను జూడఁగోరి మమ్ముఁబంపినాఁడు. 'ప్రహస్తుఁడు పంపిననుగాని యవసరముగానపు డెట్లువచ్చితివి?' యందువా? మహారాజా! గొప్పకార్యమొకటి నిజముగానున్నది.అది యిప్పుడే చేయవలయునదయినను నీవు రాజవగుటంజేసి నీయాజ్ఞ నెదుకుచూడవలసియున్నది. అది మిగుల కష్టసాధ్యమయినది. కాన వారలకు దర్శనమొసఁగుము" అనెను. ఆరాక్షసుఁడు తెలిపినయీమాటవిని రావణుఁడు అశోకవనమునువిడిచి మంత్రులను జూడంబోయెను. ఆరావణుఁడు రాముని పరాక్రమమును దెలిసికొని సభను బ్రవేశించి, తాను జేయవలసిన కార్యమునంతయు మంత్రులతో నాలోచించి నిశ్చయించి యప్పటికి వలయుకార్యమును గావించినవాఁడయ్యె. రావణుఁడు వెడలిపోయిన వెంటనే, ఆరాముని తలయును ఆమేటివిల్లును అంతర్ధానము నొందినవి. అప్పుడు రాక్షసేశ్వరుఁ డగురావణుఁడు భయంకరపరాక్రములగు మంత్రులతోఁగూడ నాలోచించి రామునిఁగూర్చి తాను జేయవలసిన కార్యమును నిశ్చయించెను. కాలసమానుఁడగు రాక్షసేశ్వరుఁడు రావణుఁడు తనమేలు గోరువారై సమీపంబున నున్న సేనాధ్యక్షులనుజూచి 'భేరిని కొడుపుతో స్ఫుటముగా వాయించి శీఘ్రముగా నాసైన్యముల నన్నింటిని రావింపుఁడు. * కారణమేమియుఁ జెప్పవలదు' అనెను. అంత నాసేనాధిపతులు వల్లెయని యతనిమాట నంగీకరించి, తమతమ సైన్యములను రావించి,అట్లవియన్నియు వచ్చియుండుట

---

* రాక్షసులను యుద్ధమునకై రండని పట్టణమున సేనాపతులు చెప్పిరేని, అప్పుడు సీతయెదుట తానుచెప్పిన రామసైన్యవధవృత్తాంతము అసత్యమని యామెకుఁ దెలియవచ్చునుగాన కారణము యుద్ధమని చెప్పవలదన్నాఁడు.

## (విభీ)షణునిభార్య యగుసరమ సీతాదేవి నూఱడించుట.

అంత విభీషణుని భార్యయగు సరమ యనురాక్షసి సీత మోహితయై రాముని గుఱించి విపరీతముగా భ్రమించియుండుటను జూచి యాబిడ తనకు మిక్కిలి గూర్చునదై తనతో నెయ్యము గావించి యున్న చెలికత్తె యగుటంజేసి యామె యొద్దకుఁ బోయెను. సీత రాక్షసేశ్వరుఁడగు రావణునిచే రాముఁడుమృతుఁడయినట్లు మోసపుచ్చంబడి మిక్కిలియు దుఃఖించుచుండఁగా, అపుడు సరమ మృదువచనముల నాయమ నూఱడించునదయ్యె. *ఆసరమ యచ్చట రావణునాజ్ఞచే సీతను రక్షించుచుండెను. ఆమె కనికరము మిక్కిలి గలది గాన తద్రక్షణముక్రింద నున్నసీత యాయమను చెలికత్తెఁ గావించుకొనెను. మఱియు నాసరమ పూనినపట్టు వదలనిది గాన సీతతోడ చెలిమి తప్పకుండెను. అంత నాసరమ రామునివిషయమై విపరీతముగా భ్రమించియున్నయాసీత, నేలంబొరలి దుమ్మున బ్రుంగిలేచి యున్నయాఁడుగుఱ్ఱము వలె దూళి గ్రమ్మియుండం గాంచెను. సువ్రతయగు నాసరమ పూర్వము కరస్పర్శాదులచే నూఱడించి యిపుడు చెలికత్తియ నెయ్యమున రావణవృత్తాంతమును దెలిపి యూఱడించునదై 'సీతాదేవీ! ఊఱడిలుము. మనస్సున కందికుందవలదు. నీవు పిఱికిదానవుగాన భయపడెదవు. రావణుండు నీతో చెప్పినదియు, అందులకు నీవతనికి బదులు చెప్పినదియు, అంతయు నేను చెలికత్తె వగునీవలని నెయ్యమున వింటిని.' అప్పుడు నీవుదగ్గఱ లేదే! ఎట్లువింటి' వందువా? అప్పుడు నే నాకాశమున నొకానొకవృక్షరంధ్రములో నెవ్వరును లేనిచోట మఱఁగియుండి వింటిని. 'రావణుఁడు భయంకరుఁడే! భయము మాలి యెట్లు వింటి' వందువా? నీ నిమిత్తమయి నేను ప్రాణములమీఁదఁగూడ ప్రీతి యుంపను. కాన రావణునివలన భయముమాలి వింటిని. నీ వాలుంగన్నుల చెన్నుఁజూడఁగా నీ పీడకు నేనెట్లు సైఁతునే! సీతా! మఱియు నెందుకొఱకై రాక్షసరాజు రావణుఁడు తొందరపడిపోయెనో యాకారణమునుగూడ నేను వెడలిపోయి యంతయుఁ దెలిసికొంటిని. మాకుఁ దెలియకయే పోనీ. రాముని వధించుట కుపపత్తియు లేదు. రాముఁడు విదితాత్ముఁడు. అతనిని నిదురించునపుడు మోసమునఁ జంపనలవిగాదు. మఱియు నతఁడు పురుషసింహుఁడుగాన యెట్టిదశనున్నను, నతనిని

---

* విభీషణునిభార్యను రావణుఁడు సీతను రక్షించుపనికి నియోగించుట యథార్థమెట్లు? నియోగించినచో నప్పుడామె రావణునికి భయపడి గూఢముగా నుండ నేల? యన్నచో విభీషణుఁడు లంకలో నున్నపుడు సీతయొక్క యోగక్షేమములు విచారించుటకై సరమ అంతరంగురాలుగా నియోగింపఁబడినది. విభీషణుఁడు వెడలిపోయినవెనుక రావణునకును సీతకును జరిగెడి యంతరంగవార్తలు వినుటకు సరమ భయపడినది గాన గూఢముగా విన్నది. సరమను నియోగించుట యనఁగా సరమ తనదాసినిపంపి తెలిసికొనునట్లు నియోగింపఁబడినదని గ్రహించునది. బావయెదుట తమ్మునిభార్య కోడలువంటిదిగాన కనఁబడరామిచే గూఢముగా నుండి విన్నదనియు గ్రహింపవచ్చును. ఈసరమ మఱియొక్కతె యని కొందఱభిప్రాయపడుచున్నారు.

యశ్రువులనంతయు దిగవిడువఁగలవు. సీతా! సుఖార్హుఁడగు రాముఁడు, ఇంక శీఘ్రము నసే యుద్ధమున రావణునిఁజంపి సంపూర్ణమనోరథుఁడై ప్రియురాలవగు నిన్నుంగూడి సుఖము నొందఁగలఁడు. సస్యముతోఁ గూడినభూమి మంచివర్షముచే నుల్లసిల్లునట్లు, నీవు మహాత్ముండగు రామునింగూడి యతనిపరాక్రమముచే నెంతయు సంతోషింపఁగలవు. పర్వతశ్రేష్ఠం బగు మేరువుచుట్టును బ్రదక్షిణముగాఁ దిరుగుచు గుఱ్ఱమువలె మండలగతిని ముప్పదిముహూర్తములలోనే శీఘ్రముగాఁ జేయుచు, వెలుంగులు వెదచల్లుచున్న సూర్యుని నిప్పుడు శరణమునొందుము. ఏలన నీదేవుఁడు సమస్త ప్రజలకును గారణభూతుఁడుగదా. కాన సమస్తశుభముల నొసంగును' అనెను. ఇది ముప్పదిమూఁడవసర్గము.

## సరమ రావణునియభిప్రాయమును దెలిసికొని సీతకువచ్చి చెప్పుట.

అట్లుసీత, మును పారావణుఁడు చెప్పిన వాక్యముచే మోసపోయి రాముంగూర్చి సంతాపమునొంది కుందుచుండఁగా, సరమ తా నట్లాడినయూఱటమాటలచే, ఆకాశము జలముచే భూమిని జల్లఁజేయునట్లు, ఆబిడను సంతోషపెట్టెను. అంత సరమ యెప్పుడేది చేయవలయునో చక్కఁగాఁ దెలిసినదిగాన యపుడు తన చెలికత్తెయగుసీతకు హితముచేయఁగోరుచు చెలిమిదొలఁక, చిఱునవ్వు మున్నుగులుకుపలుకులతో "అసితేక్షణా! సీతా! ఎవ్వరికిని దెలియకుండునట్లుగా నేను రామునియొద్దకుఁబోయి, నీవు క్షేమముగానున్నావని చెప్పినమాట నతనికిం జెప్పి మరలిరావలెనని కోరెదను. ఇందులకు సమర్థురాలను. 'బహుదూరమెట్లు పోఁగల' వందువా? నిరాధారమయిన యాకాశమున నేను బోవుచుండఁగా నాతోసరిగా వెంట నడచుటకు వాయువుగాని గరుడుఁడుగాని సమర్థులుగారుసుమీ!" అనెను. సరమయిట్లు చెప్పఁగా సీత మున్ను దుఃఖమునఁ దొట్రిలుపలుకు పలుకుచుండి యిప్పుడామాటకు సంతోషము దొలఁకుచు నింపయి వెలయు తియ్యనిపలుకుల నాసరమతో "నీవాకాశమునకుఁగాని పాతాళమునకుఁగాని పోఁజాలుదువే. సందేహము లేదు. *నావిషయమై మఱియెవ్వరికిని జేయశక్యముగానిదానినిగూడ నీవు సేయఁజాలుదువని నే నెఱుఁగుదును. నాకు ప్రియము సేయవలయునని నీకున్న దేని, నీతలంపు స్థిరముగానుండునేని, నీవు రావణునియొద్దకుఁ బోయి యతఁ డేమిసేయుచున్నాఁడో తెలిసికొనిరమ్ము. 'అట్లు తెలిసివచ్చుట వలన ప్రయోజనమే'మందువా? వాఁడు మాయాబలముగలవాఁడు, క్రూరుఁడు, పగవారి

* ఇట సరమ రామునకు సందేశము తీసికొనిపోయెదనని సీతతో చెప్పినది. సీత పోవలదన్నచోఁ చెలిమికి హానివచ్చును. 'తత్తస్యసదృశం భవేత్' రాముఁడు వచ్చి నన్నుతీసికొనిపోవుటయే యతనికిఁ దగునన్న, సీతకు రామునియొద్దకు పుచ్చుట యుక్తముకాదు. కాన సీత నెపమున నీ యిక్కట్టును నిపుణముగా పరిహరించుచున్నదని తెలియునది.

నేడ్పించువాఁడు, దుష్టాత్ముఁడు. కావున నప్పుడుత్రాగిన మద్యమువలె వాఁడు నన్ను మాటికి తోడనే మోసపుచ్చుచున్నాఁడు. వాఁడు నన్ను నిత్యమును గావలిగాచుచుండు నతిభయంకరాకారలగు రాక్షసస్త్రీలంగొని నిత్యమును * తర్జింపఁజేయుచున్నాఁడు. మాటిమాటికి మాటలచే భర్త్సింపఁ జేయుచున్నాఁడు. నేను మిక్కిలి భయపడి సంశయమును బొందియున్నాను. నామనస్సును నెమ్మదిగాలేదు. రావణుని భయమువలననే ఉద్విగ్నయయి యున్నాను. మఱి యీయశోకవనమునుండుటంబట్టియే నాకు సంశయముకలుచున్నది. ఆరావణుని సమాచారమేమో, అతఁడేమిసేయ నిశ్చయించి యున్నాఁడో, అదియంతయు నాకుఁ జెప్పుము. అందుచే నాకు మిక్కిలి యుపకారముచేసినట్లగును' అనెను. తియ్యనిపలుకులాడు సీత యిట్లు చెప్పఁగా, ఆ సరమ కన్నీళ్లచే కలఁక నొందినయాబిడనెమ్మొగమును దుడుచుచు 'సీతా! నీకిట్లభిప్రాయముండునేని, యిపుడే పోయెదను. పగవానియభిప్రాయమును దెలిసి మరల తప్పక వచ్చియె తీఱుదును సందేహమువలదు. చూడుము' అనెను. ఆసరమ యిట్లు చెప్పి యంత నా రావణుసమీపమునకుం బోయి యతఁడును మంత్రులును మాటాడుకొన్న మాటల నన్నింటిని వినెను. సరమ ఒకరినిశ్చయము నెఱుంగుటయందు సమర్థురాలుగావున దురాత్ముఁడగు నారావణుఁడు గావించుకొన్న నిశ్చయమును చెవులార విని తెలిసికొని మరల నపుడశోకవనమునకు వచ్చెను. అది యిట్లశోకవనమును జొచ్చి యట తనరాకకే యెదురుచూచుచు తామరగద్దియను మాలియున్న మహాలక్ష్మివలె విలసిల్లుచున్న జనకరాజసుతను సీతను జూచినదయ్యె. సీత, తియ్యనిపలుకు లాడునాసరమ మరల వచ్చుటనుజూచి, సంతుష్టయై, మిక్కిలియు నెయ్యముదొలఁక నాబిడను కౌఁగిలించుకొని తానే యాసనమొసంగెను. అంత సీత సరమతో 'నీవిందు సుఖముగాఁ గూర్చుండి క్రూరుఁడును దురాత్ముఁడు నగునారావణుని నిశ్చయమంతయు నాకుఁ గలిగినది కలిగినట్టుగాఁ జెప్పుము' అనెను. సీత యేమిబెడిదముచెప్పునో యని వడంకుచు నిట్లడుగఁగా సరమ రావణుఁడును అతని మంత్రులును మాటలాడికొన్నదంతయుఁ జెప్పనదై 'సీతా! తల్లి కైకేసియు, మంత్రి వృద్ధుఁడగు నవిద్ధుఁడును, నిన్ను విడిచి పుచ్చుటకై రాక్షసేంద్రుఁడగు రావణునికి మిక్కిలియుఁ జెప్పిరి. వారతనితో 'నీవు రామునకు సత్కారపూర్వముగా సీతం గొనిపోయి యిమ్ము. అట్లు సేయవేని, యిఁక నీపయి రాముఁడు చూపనున్న పరాక్రమమునకు, జనస్థానమున నద్భుతముగాఁ జేసినఖరవధాదిక మొకనిదర్శనమే చాలును. రాముఁ డటుండనీ. సముద్రముదాఁటుటయు, సీతం జూచుటయు, రాక్షసుల నెల్ల నొక్కఁడే యుద్ధమునఁ జంపుటయు, అతనిభృత్యుఁడు హనుమంతుఁడు గావిం

* తర్జనమనఁగా ముక్కుమీఁద వ్రేలిడుకొనుట, కన్నుగిఱ్ఱునఁద్రిప్పుట, పండ్లుచూపుట మొదలయిన ముఖచేష్టలచే బెదరించుట. చంపెదను, కాల్చెదను అని యిట్టిమాటలచే బెదరించుట భర్త్సనమని తెలియునది.

చినాఁడే! * అట్లు భూమండలమున మఱి మనుష్యుఁడగువాఁ డెవఁడు చేయఁగలఁడు.' అని చాలవఱకు బోధించిరి. ఇట్లు మంత్రివృద్ధుఁడగు నవిద్ధుఁడును బెక్కువిధముల బోధించినను, ఆరావణుఁడు, ధనలుబ్ధుఁడు ధనమును విడువలేనట్లు నిన్ను విడువఁబూనఁడయ్యె. సీతా! క్రూరుండగు రావణుఁడు తానును మంత్రులును గూడి యిట్లు నిశ్చయము చేసికొని యున్నాఁడు కాఁబట్టి యుద్ధంబున మృతినొందక కాని నిన్ను విడిచిపుచ్చ నొల్లకున్నాఁడు. వాని కిట్లు నిశ్చితముగా నున్నబుద్ధి మరణమునొందుటకే సంభవించినదిగాని వేఱుగాదు. వాఁడు తన రాక్షసులందఱును తానును యుద్ధమున వధమునొంది తూలిననే కాని యూరక వట్టిభయమువలననే నిన్ను విడిచిపుచ్చఁజాలఁడు. అసితేక్షణా! రాముఁడు తప్పక యుద్ధమున వాఁడిబాణములచే రావణునివధించి,నిన్నయోధ్యకుఁ దోడ్కొని పోవఁగలఁడు. ఇట్లని నీనల్లనికన్నుంగవ సౌభాగ్యమే చెప్పుచున్నది' అనెను. ఇట్లు సరమ సీతతో చెప్పుచుండఁగా, ఇందుల కుపశ్రుతిగా భేరీ శంఖధ్వనులతో నెరసి బెరసి వానరసైన్యముల సింహనాదము భూతలమును వడంకించుచు వినంబడెను. లంకయందలి రావణుని సైన్యభటులు వానరసైన్యముల యాసింహనాదమునువిని, మనరాజయిన రావణునిదోషములచే మనకు బ్రతుకుమేలు గలుగదు; మరణమే గతియని తేజంబులుడూలి దైన్యంబునఁ జేష్టలు తొట్రిలువారయిరి. ఇది ముప్పదినాలుగవసర్గము.

---

మాల్యవంతుఁడు రామునకు సీతనొసంగుటయే కర్తవ్యమని రావణునకు బోధించుట.

అప్పుడు శత్రుపురంబుల జయించుమహాబాహుండును రఘుకులదీపకుండునగు రాముఁడు, శంఖధ్వనులును భేరీభాంకారములును తుములమై చెలంగ లంకపయినెత్తివచ్చెను. అంత, రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు ఆధ్వనినివిని, కొంతసే పాలోచించి మంత్రులవంకఁ జూడ్కినిగిడ్చెను. అంత మిక్కుట మయినబలము పెంపున జగమునెల్లఁ బరితపింపఁజేయుక్రూరుఁ డగురాక్షసేశ్వరుఁ డారావణుఁడు, మంత్రులనందఱను బిలిచి, సభయంతయుఁ బ్రతిధ్వనించునట్లు, వారితో నిందాత్మకమగువచనముల 'మీరు, రాముఁడు సముద్రమును దాఁటుటయు, నతనిపరాక్రమమును, సైన్యసమూహమును జెప్పితిరి. అదంతయు వింటిని. యుద్ధంబున బీఱువోని పరాక్రమముగలవారయ్యు, రాముని పరాక్రమమును విని, యొకరినొకరు చూచుకొనుచు నిరుత్సాహులయి మీ రుండుటయుఁ గూడ నెఱుంగుదును' అనెను. అంత రావణునితల్లికిఁ బినతండ్రియు ముక్కిలియుఁ బ్రాజ్ఞుండును నగుమాల్యవంతుఁడను రాక్షసుఁడు, రావణుఁ డాడినమాటలువిని, 'రాజా! ఏరాజు ఆన్వీక్షకి, త్రయి, వార్త,

* ఇట్లు దూతముఖముననే యనేకకార్యములు చేసికొన్న రాముఁడు దేవుఁడే యనిభావము.

దండనీతి యనెడి నాలుగువిద్యలయందుఁ జక్కఁగా శిక్షితుఁడై నీతిశాస్త్రము ననుసరించి నడచుకొనునో యతఁడే చిరకాలము రాజ్యమును బాలించును. అతఁడే శత్రువులనెల్ల నడఁగఁద్రొక్కును. అట్టిరాజు, తనబలము క్షీణించినకాలమున శత్రువులతో సంధిసేసికొనుచు, తనబలము వర్ధిల్లియుండుకాలమున వారితో విరోధము పెట్టుకొనుచును, నిట్లు కాలమునననుసరించి తనపక్షమును వృద్ధిఁబొందించుచు, నందులకు ఫలముగా మిక్కిలి గొప్పయైశ్వర్యము ననుభవించును. ఒకరాజు, తనశత్రువుబలముకన్నను తనబలము తక్కువయగుచున్నవాఁడయినను,తనశత్రుబలముతో సమానమయిన బలముగలవాఁడయినను,తానట్టి శత్రువుతో సంధి యవశ్యము చేసికొనవలయును. ఆరాజు తనశత్రువుకంటె నధికబలముగలవాఁ డగునేని, ఆశత్రువు నుపేక్షించియుండక వానితో వైరము పెట్టుకొనవలయును. 'ఇది సరిగాని యిప్పుడు దీనిని జెప్ప నేల'యందువా? రావణా! నీతి శాస్త్రపద్ధతి యిట్లుండుటచే బలము క్షీణించుచున్న నీకు బలవంతుఁడగు రామునితో సంధిగావించుట నా కిష్టముగానున్నది. దానము లేక బలవంతునితో సంధి పొసఁగదు. రామునకును నీకును నెవ్వతికొఱకు విరోధముగలిగినదో యాసీతను నతనికి నిచ్చివేయుఁదగును. 'రాముఁడు బలవంతుఁ డెట్లందువా? దేవర్షులు గంధర్వులు మున్నగువార లందఱును నతనికి జయము గలుగవలయునని గోరుచున్నారు. అట్టి దేవబలము గలయారాముఁడు బలవంతుఁడగును గాన యతనితో విరోధము పెట్టుకొనకుము; సంధిగావింప నియ్యకొనుము. 'దేవాదులు రామునిజయముగోరుటకుఁ గారణ మే'మందువా? సర్వజ్ఞుఁడగు బ్రహ్మదేవుఁడు సురలకును అసురలకును అవలంబనముగా ధర్మము అధర్మము అను రెంటిని సృజించినాఁడు. కాఁబట్టి ధర్మమును అధర్మమును, ఆసురాసురులు అవలంబించున వయినవి. ఆరెంటిలో రావణా! చక్కని ప్రకృతిగలదేవతలు అవలంబించునది ధర్మమని వినఁబడుచున్నదిగదా. దుష్టప్రకృతు లయినయసురులును రాక్షసులు నవలంబించునది యధర్మము. ఇట్లు దేవాదులు ధర్మపక్ష మవలంబించుటం జేసియు రాముఁడును ధర్మము నాశ్రయించినవాఁడు గావునను దేవత లారాముని పక్షపాతులగుదురుగాన యతఁడు బలవంతుఁడగును. అతఁడు బలవంతుఁడగుటకు మఱియొకకారణమును గలదు. ఎప్పుడు ధర్మము అధర్మమును కీడ్పఱచునో, అప్పుడు కృతయుగము జనులయందు వర్తించును. ఎప్పుడు అధర్మము ధర్మమును గ్రిందుపఱచునో యపుడు కలి ప్రవర్తించుచున్నది. 'అందువలన నేమి'యందువా? నీవు దిగ్విజయార్థము లోకములన్నియుఁ దిరుగునపుడు, పరదారపరిగ్రహాదులచే గొప్పదియగు ధర్మమును దూలఁగొట్టి యధర్మమును జేపట్టితివి. అధర్మప్రవర్తకమగు కలికన్నను ధర్మప్రవర్తకమగు కృతము బలియమైనది. అధర్మముచేఁ గలి ప్రవేశించియున్న నీకంటె ధర్మమున కృతము వర్తించురాముఁడు బలవంతుఁడు. జయాదిశుభహేతు వగుధర్మము ప్రబలముగాఁ గలరామాదులైన మనశత్రువులు అపజయాద్యశుభహేతు వగునధర్మము మిక్కిలి గలమనకంటె

బలీయులు. 'అయిన నధర్మమును జేపట్టి ధర్మమును దూలగొట్టితినిగాన దాని నవలంబించి యున్నసురల కది నశించియుండుటచే బల మెక్కుడి'దందువా? ఆయధర్మము నీవు ముందు వెనుకఁ జూడక కావించి వృద్ధిఁ బొందించుకొంటివి. కాన యది మనల మొదలంట దిగ మ్రింగుచున్నది; దేవతల కనుకూలమై వారల పక్షమును వర్ధిల్లఁజేయుచున్నది. ఇట్లధర్మము మనలనే నాశముసేయునుగాని దేవతలబలము తఱుఁగనీయదు. 'నేనుజేసిన యధర్మము దేవతలపక్షమునకు వృద్ధిఁజేయుట యెట్లు' అందువా? నీవు విషయలోలుఁడవై, దేవాదులకన్యలను బత్నులను బట్టుట మొదలుగా దేనిని తలఁచినను దానినెల్లఁ గావించుచుండుటచే అగ్నిహోత్రములవంటి మహర్షులకు మిక్కిలియు మనస్తాపము గావించితివి. వారల ప్రభావమో మండుచున్న యగ్నివంటిది. దానిని జెనకఁ దరముగాదు. అట్లు నీవు మనసాపము గావించుటవలన, పూతాత్ములగు నా మహర్షులు ధర్మాభివృద్ధియందే యాసక్తులుగావున, తపం బాచరించుచు, అగ్నిష్టోమాదులయిన శ్రేష్ఠములగు నయ్యాయజ్ఞములుగావించుచు, యథావిధిగా నగ్నుల హోమము వేల్చుచు, వేదముల గట్టిగా నధ్యయనము సేయుచు, నుండెదరు. రాక్షసులను గణింపక వారిని గ్రిందుపఱుచుచు నట్లు వేదఘోషముల నుచ్చరింతురు. అట్లు వారు సేయుటవలన రాక్షసులందఱును గ్రీష్మకాలమున మేఘములవలె, నలుదిక్కులకు భయపడి పాఱిపోవుచున్నారు. అగ్నికల్పులయిన ఋషులు వేల్చు నగ్నిహోత్రములనుండి వెడలినధూమము, దశదిశలను వ్యాపించి రాక్షసుల తేజస్సును మ్రింగుచున్నది. అయ్యా పుణ్యదేశములందు ఋషులు దృఢనియమమునఁ గావించుచున్నట్టి తీవ్రతపస్సులవలన రాక్షసులు మిక్కిలియుఁ దపించుచున్నారు. ఇట్లు మనయధర్మమువలన ఋషులకుఁ గలిగిన మనస్తాపముచే మనకే నాశముగలిగి దేవాదులకు బలము వర్ధిల్లుచున్నది. నీవు దేవతలు దానవులు యక్షులు మున్నగు వారివలన మరణము లేకుండునట్లు వరమును బడసితివి. ఇప్పుడు బలవంతులును మహాపరాక్రమశాలురునగు, మనుష్యులును వానరులును భల్లూకములును గొండముచ్చులును పెనుసైన్యములతో నిచ్చటికి వచ్చి గర్జించుచున్నవి. నీకు వీరివలనఁ జావు గలునట్లు వరములేదు. శత్రుల రాకను బట్టియేగాదు. దివ్యాంతరిక్షభౌమములని నానావిధములుగలవై యొక్కొక్కవిధమునను పెక్కువగలతోఁ గూడియున్నవై భయంకరములై యున్న యుత్పాతములను జూచియు సమస్తరాక్షసులకు వినాశము కలుగునని యూహించుచున్నాను. విరూపములును భయంకరములునగు మేఘములు మిక్కిలి పరుషముగా గర్జించుచు, లంకయందంతటను వేఁడినెత్తురులు గురియుచున్నవి. గుఱ్ఱములు మున్నగువాహనములు రోదనముసేయుచుఁ గన్నీళ్లు విడుచుచున్నవి. ధ్వజములన్నియు దుమ్ముబ్రుంగి వన్నెమాసి మునుపటివలెఁ బ్రకాశింపకున్నవి. దుష్టములగు నక్కలును గద్దలును లంకనుజొచ్చి యెల్లప్పుడును భయంకరముగా నఱచుచు గుంపులుగుం

వులుగాఁ గూడుచున్నవి. నల్లనిస్త్రీలు ఎదుటనిలిచి తెల్లనిపండ్లు తేటపడ లపుమాటలాడుచు గృహములందలి వస్తువులను దొంగలించుచు పకపకన స్వప్నములందుఁ గనుపట్టుచున్నారు. ఇండ్లయందు బలికర్మమునకై గా హవిస్సులను గుక్కలు వచ్చి తినిపోవుచున్నవి. ఆవులయందు గాడిదలు పు వి. పందికొక్కులు ముంగిసలతోఁగూడఁ దిరుగుచున్నవి. పిల్లులు పులుల యున్నవి. ఊరఁబందులు కుక్కలతోఁ గూడుచున్నవి. కిన్నరులు రాక్షస ఉత్పాతజనితులగు మనుష్యులతోను గలసియున్నారు. తెలుపు నలుపు వన్నె పాదములుగల పావురములు దైవప్రేరితములయి, రాక్షసులకు కలుగునని సూచించుచుఁ దిరుగుచున్నవి. ఇండ్లయందు మధురసల్లాపముల పఁబడిన గోరువంకలు, మధురముగా పలుకుటమాని, యిప్పుడు వీచికూచి క్రూరముగా కూయిడుచున్నవి. పక్షులును మృగములును పోరాడి యోడిపోయిన వయ్యును మరల కలహమునుగోరి గుంపులుగట్టి శత్రువులపయి వేగ పరుగెత్తుచున్న వి; మఱియు సూర్యునింజూచి రోదనము చేయుచున్నవి. భయంకరాకారుఁడును, వికలాంగుఁడును, ముండితుఁడును, పరుషవర్ణుఁడును, కృష్ణపింగళుఁడు నగుమృత్యువు రాక్షసుల గృహములన్నియుఁ బ్రాతస్సాయంకాలములయందుఁ జూచుచున్నట్లు కనఁబడుచున్నాఁడు. ఇవియు,ఇంకను నిట్టి దుష్టనిమిత్తము లనేకములును, బుట్టుచున్న వి. (ఈరాముని మనుష్యరూపముదాల్చిన విష్ణుదేవుఁడని నేను తలఁచుచున్నాను. సముద్రమునందు మిక్కిలి యద్భుతమైన సేతువునుగట్టినదృఢపరాక్రముఁడగు నీరాముఁడు మనుష్యమాత్రుఁడు గానేరఁడు. కాఁబట్టి రాజగు నారామునితో రావణా! సంధి గావింపుము.) కాన యిది తెలిసి తక్కినకార్యములను జక్కఁగా నాలోచించి నిశ్చయించుకొని యిఁకమీఁదట నేమిచేయఁదగునో చేయుము' అనెను. ఉత్తములలోనెల్ల నుత్తమపౌరుషుండును బలవంతుఁడు నగు నామాల్యవంతుఁడు ఈమాట నాసభయం దెల్లవారికి వినిపించి, రావణుని యింగితాకారాదుల చక్కఁగా చూచి నతనిమనస్సు తిరుగఁబడదని పరీక్షించి తెలిసికొని యంత నుపదేశించుట మాని యూరకుండెను. ఇది ముప్పదియైదవసర్గము.

—••◆రావణుఁడు లంకానగరసంరక్షణమునకై యేర్పాటులుగావించుట.

దుష్టాత్ముఁడగు రావణుఁడు మృత్యువశమునం జిక్కి, మాల్యవంతుఁడు హితముగాఁ జెప్పినయప్పలుకు విన సహింపఁడయ్యె. అంత నతఁడు క్రోధముబారింబడి, మొగంబున బొమలు ముడిచి, యమ్మాటకు సైఁపఁజాలక గ్రుడ్లు గిరగిరం ద్రిప్పుచు నామాల్యవంతునింజూచి 'నీవు శత్రుపక్షము ననుసరించియే, వారికనుకూలముగా, నేను హితముగాఁదలంతునని యభిప్రాయముతో,నహితంబగుపరుషవచనమును జెప్పితివి.

బలీయుఁడనదిహితవుగా నాచెవుల కెక్కినదిగాదు. రాముఁ డొకమనుష్యుఁడే కాన జాతి నవలంబించి దుర్బలుఁడు; దీనుఁడుకాన స్వభావముననే బలహీనుఁడు, ఒంటివాఁడు, కోఁతులు ము నీవు ఘనముగా నాశ్రయించినవాఁడుగాన మంచిబలములును లేవు. తండ్రిచేతను మగొట్టఁ మనల మైనవాఁడు గాన రాజ్యమును లేదు. అడవులందుఁ దిరుగుచుండు నిట్టి రాముఁడు వర్ధిల్లుఁ జేఁడని తలంచుచున్నావే! అందులకు కారణమేమి? నేనో, రాక్షసుల కధీశ్వరుఁడ తఱుఁగనీశ్వలకును భయంకరుఁడను. సమస్తపరాక్రమములందును నించుకయు తక్కువ అందువాఁ డన్నవాఁడను. ఇట్టినన్నుఁ దక్కువగాఁ జెప్పితివే! ఎందుచేత? నీసజాతీయులలో లుగా దేఁ కఁడున్నాఁడని ద్వేషముచేతనో, శత్రువులవలని పక్షపాతముచేతనో, లేక హర్తృప్రవులు ప్రోత్సాహపఱుచుటచేతనో, నీవు నన్నిట్లు పరుషవచనము లాడితివని నాకు శంకగలుగుచున్నది. శత్రుప్రోత్సాహము లేనిచో పండితుఁడును శాస్త్రతత్త్వముల నెఱింగినవాఁడునగు నెవ్వఁడు ప్రభావయుక్తుఁడును పరిపక్వబుద్ధియునగు వానినిట్లు పరుషవచనములాడును? నీవు చెప్పినది యథార్థముగానే యుండుఁగాక. *అయినను నేను తామరగద్దియలేని లక్ష్మీదేవివలె నున్నసీతను, వనమునుండి దెచ్చి మరల రామునకు భయపడి యేలయిత్తును? దుర్లభమగువస్తువును గడించి విడుతురా? † ఇఁక రాముఁడు వానరకోట్లు పరివేష్టింప సుగ్రీవునిని లక్ష్మణునినిగూడి, యిటవచ్చి నాచే హతుం డగుట కొన్నిదినములలోనే చూడుము. ఎవ్వనితో దేవతలు సైతము ద్వంద్వయుద్ధమున నిలువఁజాలరో యట్టి రావణుఁడు రామయుద్ధమున భయమేలపడును?' అని యంత మిక్కిలి హితపరుఁడగు మాతామహుని నిట్లు పరుషముగాఁ జెప్పితి నని యనుతాపమున, 'రాముఁడే వచ్చి భయపెట్టినను పెట్టనీ. భయమే కాదు నన్ను రెండుతుండెములుగా తుండించినను తుండింపనీ. నేను రామునికే కాదు మఱియెంతటివానికిఁగాని లొంగను. 'ఇది నీతికి విరుద్ధ' మందువా? అయినను, ఇది నాకు స్వభావసిద్ధమైనదోషము. 'అది దోషమని యొప్పికొంటివేని దిగవిడువవలదా' యన్నచో స్వభావము నతిక్రమింప నలవిగాదు. వేము తీపుగాదు చూమీ. రాముఁడు సముద్రమున సేతువుగట్టుటచేతఁగదా నీకు భయము గలిగినది. ఆ రవ్వంతసముద్రమున నెట్లో దబ్బాటున వాఁడు సేతువుగట్టినను అదియొక

* రామునిహస్తమువలన వధమునుగోరియే వనమునుండి సీతను దెచ్చి రామునికి భయపడి మఱల నెందుల కిత్తును? అని వాస్తవార్థము.

† ఇట 'వృతం వానరకోటీభి స్ససుగ్రీవం సలక్ష్మణం। పశ్యకైశ్చిదహోభి స్త్వం రాఘవం నిహతంమయా' అనిమూలము. ఇట్లు చేసినచో రాముఁ డిచ్చటికి వచ్చునా? యనఁగా (కైశ్చిదహోభిః) కొన్ని దినములలో (మయా హేతునా) నన్నుఁబట్టి (నిహతం) 'హనహింసాగత్యోః' అని హనధాతువునకు గత్యర్థమునుండుటగాన-ఇట వచ్చినట్టివాఁడును వానరకోట్లచేతఁ బరివృతుఁడై సుగ్రీవలక్ష్మణులతోఁ గూడియున్నవాఁడునగు రాముని జూడఁగలవని యర్థము.

యాశ్చర్యమా ! అందులకని భయపడవలదు. * వానరసైన్యముతో సముద్రమును దాఁటివచ్చి యున్నరాముఁడుమాత్రము, మరలఁ బ్రాణముతోఁ బోవుట లేదు. ఇది సత్యము. ఇట్లని శపథముసేయుచున్నాను' అనెను. ఇట్లు పలుకుచున్న రావణుఁడు అహంకారమున కుపితుఁడయి యున్నాఁడని మాల్యవంతుఁడు తెలిసికొని తనయుపదేశము విఫలమయినందులకు లజ్జనొంది బదులుమాట యొక్కటియుఁ జెప్పఁడయ్యె. మాల్యవంతుఁడు యథోచితముగా రావణునకు జయము గలుగవలయునని యాశీర్వదించి సెలవుపుచ్చుకొని తనయింటికిఁ బోయెను. రావణుఁడంత మంత్రులతోఁగూడి కర్తవ్యమును విచారించి నిశ్చయించి లంకకు ససమానమైన రక్షణమును గావించెను. అతఁడు తూర్పుద్వారమునందు ప్రహస్తునిఁ గాచియుండ నాజ్ఞాపించె. దక్షిణపువాకిలియందు మహావీర్యులయిన మహోదర మహాపార్శ్వుల నుండ నానతిచ్చెను. పడమటి గవనియందు మహామాయుఁడును బహురాక్షసపరివృతుఁడునగు నింద్రజితుని గావలియుండ నియమించెను. అతండు పట్టణపునుత్తరద్వారమున శుకసారణుల నుండ నియమించి తానును నచ్చటనే యుండునట్లు మంత్రులతోఁజెప్పెను. పట్టణము నడిమి†గుల్మమున మహావీర్యపరాక్రమశాలియగు విరూపాక్షుఁడను రాక్షసుని అనేకరాక్షససహితముగా నుంచెను. రాక్షసశ్రేష్ఠుఁడగు రావణుఁడు ఇట్లు లంకాపురికి గుప్తికార్యమును నేర్పాటుచేసి మృత్యుచోదితుఁడై తన్నంతవఱకుఁ గృతార్థునిగాఁ దలంచుకొని యుండెను. అంత నారావణుఁడు లంకాపురమునకు సమగ్రమగు రక్షణవిధానముఁ జేయ నాజ్ఞాపించి మంత్రులకు సెలవొసంగఁగా, వారలందఱును నతనిని జయాశీర్వాదంబులఁ బూజించి తమయిండ్లకుం బోయిరి. రావణుఁడును సమస్తసంపదలపెంపు మిక్కిలియు సొంపారుచున్నయంతఃపురమునకుఁ బోయినవాఁడయ్యె. ఇది ముప్పదియాఱవ సర్గము.

## రాముఁడు వానరసైన్యమునకు గుప్తివిధానము గావించుట.

ఆరామలక్ష్మణులును వానరరాజగు సుగ్రీవుఁడును, వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడును, భల్లూకరాజగు జాంబవంతుఁడును, విభీషణుఁడును, వాలిపుత్త్రుఁడగు నంగదుఁడును, శరభుఁడును, సుషేణుఁడు నతనిబంధువులును, మైందుఁడును, ద్వివి

* ఇట 'సతు తీర్త్వార్ణవం రామ స్సహవానరసేనయా । ప్రతిజానామి తే సత్యం నజీవన్ ప్రతియాస్యతి' అనిమూలము. వాస్తవార్థము.—రాముఁడు వానరసైన్యముతోడ (అర్ణవంతీర్త్వా) సముద్రమును దాఁటి, (జీవన్ ప్రతియాస్యతి ఇతి) ప్రాణములతోనే మరల సుఖముగాఁబోవును అని, (సత్యం ప్రతిజానామి) సత్యముగా శపథము సేయుచున్నాను. (న-సందేహః) ఇందులకు సందేహములేదని భావము. గ్రాహ్యము.

† గుల్మమనఁగా నగరమధ్యముననుండు చైత్యస్థానమని తెలియునది.

దుఁడును, గజుఁడును, గవాక్షుఁడును, కుముదుఁడును, నలుఁడును, పనసుఁడును మొదలగువారు శత్రుదేశమగు లంకాద్వీపముచేరి యందఱునుగూడి 'రావణుఁడు పాలించుచున్న లంకాపురి పూర్వము హనుమంతుఁడు చెప్పినది ఇదిగో కనఁబడుచున్నది. ఈపట్టణము,సురాసురులకును ఉరగులకును గంధర్వులకునయినను జయింపనలవిగాదు. ఇందు, రాక్షసేశ్వరుఁడగురావణుఁడు నెప్పుడును సన్నిహితుఁడై యున్నాఁడు. కాఁబట్టి మనకు జయసిద్ధి గలుగుటయే ముఖ్యముగాఁగొని యందులకై వలయుకార్యములనిర్ణయించుటకై చక్కఁగా నాలోచనను సేయుఁ'డని యోజించిరి. అట్లు వారు చెప్పుచుండఁగా, రావణునితమ్ముఁడగువిభీషణుఁడు, వారలంజూచి యందఱికిని స్ఫుటముగాఁ దెలియుటకొఱకు స్వదేశభాషాపదములనుమాని యగ్రామ్యములగు సంస్కృతపదములతో మిక్కిలియ నర్థము గలుగునట్లుగా 'నా మంత్రులయిన యనలుఁడు శరభుఁడు సంపాతి ప్రఘసుఁడు అనువారు లంకాపురికిఁబోయి మరలి యిచటికి వచ్చినారు. వారు అందఱును పక్షిరూపములుదాల్చి పగవారిసేనం జొచ్చి, యందు నగరరక్షణమునకై చేయఁబడి యున్న యేర్పాటులన్నియుఁ జూచివచ్చియున్నారు. రామా! వారు దురాత్ముఁడగురావణుఁడు నగరరక్షణమునకై కావించిన యేర్పాటునంతయుఁ జెప్పిరి. అదియంతయు నే నున్నదియున్నట్లుగాఁ జెప్పెదను వినుము. ప్రహస్తుఁడు తనసైన్యముతో తూర్పుద్వారమున నున్నాఁడు. మహావీర్యశాలు రగు మహోదర మహాపార్శ్వు లిరువురు దక్షిణద్వారమునఁ గాపున్నారు. రావణునికుమారుఁడగునింద్రజిత్తు, అడ్డగత్తులు ఖడ్గములు విండ్లు శూలములు ముద్గరములు మొదలయిన యాయుధములు దాల్చిన ప్రధానరాక్షసులు పెక్కుండ్రుతోడను నానాయుధపాణు లయినశూరులతోనుం గూడి పడమటిద్వారమున నున్నాఁడు. రావణుఁడు మనస్సున నెంతమాత్రమును జలింపక, ఆయుధపాణు లయిన పెక్కువేలరాక్షసులును పెక్కండ్రు ప్రధానరాక్షసులును గొలువఁ, దానే లంకయుత్తరద్వారమున నున్నాఁడు. విరూపాక్షుఁడు శూలములును ఖడ్గములును ధనువులును దాల్చియుండు గొప్పసైన్యముతోఁగూడి, ప్రధానులగు పెక్కురాక్షసులు గొలువ మధ్యమగుల్మమున నున్నాఁడు. లంకయందు నీవిధమున సంవిధానము నొంది యున్నయీయీ సైన్యములను నామంత్రు లందఱునుజూచి మరల శీఘ్రమున నిచ్చటికి వచ్చిరి. గజయోధులు వేవురును, రథికులు పదివేవురును, గుఱ్ఱపు రౌతు లిరువదివేవురును, కాల్వురు నిండుకోటియునుగా, నిట్లు పరాక్రమవంతులును బలవంతులును యుద్ధములందుఁ గ్రూరులును నయిన యీరాక్షసులు రాక్షసరాజగు రావణున కెప్పుడు నొద్దసేవసేయుచు నంతరంగు లయియుందురు. రాజా! ఈ రాక్షసులలో నొక్కొక్కనికిని, పదిలక్షలమంది పరిజనులు ఇప్పుడు యుద్ధమునకుఁగాను వత్తురు' అనెను. మహాబాహుఁడగువిభీషణుఁడు తనకు మంత్రులు చెప్పిన యీ లంకావృత్తాంతమునంతయు నిట్లు రామునకుఁజెప్పి యతనికిఁ దనమం

తులైనయారాక్షసులను జూపెను; అట్లు చూపినపిదప లంకయందలి వృత్తాంతమం తయు తనమంత్రులచేతనుగూడ రామునకుఁ దెలిపించెను. శ్రీమంతుం డగు రావణానుజుఁడు విభీషణుఁడు తామరరేకులవంటి కన్నులుగల రామునిఁ జూచి యతనికిఁ బ్రియముసేయఁగోరి 'రామా! మున్ను రావణుఁడు కుబేరునితో యుద్ధము సేయఁబోయినపుడు, పరులను క్రిందుపఱుచు పరాక్రమమునను, యుద్ధమున వికారము నొందకుండు వీర్యమునను, ప్రతాపమునను, ధైర్యాతిశయమునను, దర్పమునను, దురాత్ముఁ డగు రావణునకు సమానులయిన *రాక్షసు లఱువదిలక్షల మంది యతనివెంట వెడలిపోయిరి. ఇట్లు శత్రుబలమును వర్ణించుచున్నానని నా మీఁదఁ గోపము సేయవలదు. శత్రుల నిరసించుటకై నీకు గోపమును బుట్టించుచున్నానుగాని శత్రుబలమును వర్ణించి నిన్ను భయపెట్టుటకుఁగాదు 'గోపమును బుట్టింపనేల' యన్నచో నీవు పిన్యమున దేవతలను సయితము నిగ్రహించుటకుఁ జాలినవాఁడవుగదా. నీవును గొప్పసైన్యములచేఁ బరివృతుఁడై యున్నవాఁడవు. అట్లు రాక్షసులు పన్నియుండుటవలన నీవును నీవానరసైన్యమును రావణునిసేనవలె నాలుగవయవములుగా విభజించి రావణుని కలంచిపుచ్చుము' అనెను. రావణుని తమ్ముఁడగు విభీషణుఁ డిట్లు చెప్పుచుండఁగా, రాముఁడు పగవారి పీఁచమడంచుటకై యతనితో 'వానరతిలకుఁ డగునీలుఁడు వానరులు పెక్కండ్రుగూడి లంకతూర్పు ద్వారమునుండి ప్రహస్తునితో యుద్ధము సేయును. వాలిపుత్రుఁ డయినయంగదుఁడు, గొప్పవానరసైన్యముతోఁగూడి, దక్షిణద్వారమునుండి మహాపార్శ్వ మహోదరుల నుక్కుమడంచుఁగాక. హనుమంతుఁడు కొలఁదిలేని బలాదులుగలవాఁడుగాన యింద్రజితుని కతఁడే తగినప్రతి. కాఁబట్టి యావాయుకుమారుఁడు పెక్కండ్రు వానరులు పరివేష్టింప పడమటిద్వారమున బలువిడిఁజొచ్చి యుద్ధము సేయుఁగాక. దైత్యదానవ సమూహములకును మహాత్ములగు ఋషులకుఁ బీడసేయుటయందే ప్రీతిగలిగి, క్షుద్రబుద్ధియై బ్రహ్మయిచ్చిన వరముబలముతోఁగూడి ప్రజలకు సంతాపము గలిగించుచు సమస్తలోకములను గ్రుమ్మరుచున్నట్టి రాక్షసరాజగు రావణుని నేనే వధింప నిశ్చయించితిని; కాన యారావణుఁడు సైన్యసమేతుఁడై యున్నపట్టణపు నుత్తరద్వారమును, నేనును లక్ష్మణుఁడును బలువిడిఁజొచ్చి యుద్ధము సేసెదను. బలవంతుఁ డగువానరరాజు సుగ్రీవుఁడును, వీర్యశాలియగు జాంబవంతుఁడును, రావణానుజుం డగువిభీషణుఁడును, వీరు ముగ్గురు రావణుఁడు నింద్రజిత్తు నున్నయుత్తరపశ్చిమములకు మధ్యమమగు సేనగా నుందురుగాక. వానరులు, ఇప్పుడుండునట్లు ఇఁక యుద్ధమునందు మనుష్యరూపము ధరించియుండరాదు. యుద్ధమున మన వానరసైన్యమునందు ఈ

---

* రావణుఁడు దిగ్విజయమునకుఁ బోయినప్పటిబలములకన్నను నిప్పటిబలము లధికములని తెలుపుటకై యప్పటిబలముల గణనసేయుచున్నాఁడని యిటఁ దెలియునది. ఇప్పు డంతకన్న నెక్కుడని సూచితమగుచున్నది.

సంకేత ముండవలయును. అదియేదన - ఈ మనజనములో మనవారు అని తెలియుటకు * వానరులుగా నుండుటయే మనకు గుఱుతగును. ఇదిగో నేనును, మహాతేజుఁ డయిన నాతమ్ముఁడు లక్ష్మణుఁడును, నాస్నేహితుఁడగు నీవిభీషణుఁడును, నతనిమంత్రులు నలువురును, మొత్తమున కీయేడ్వురముమాత్రము మనుష్యాకృతులతోనే పగవారితో యుద్ధము సేయుదుము' అనెను. మతిమంతుఁ డగురాముఁ డిట్లు కార్యసిద్ధికొఱకు విభీషణునితోఁ జెప్పి సువేలాద్రితటము మిక్కిలియు రమణీయముగానుండుటనుజూచి యపుడు దాని నారోహించు తలంపేకాని వేఱొకతలంపు లేనివాఁ డయ్యెను. అంత మహాబుద్ధిమంతుఁడును మహాధీరుండు నగురాముఁడు మిక్కిలియు సంతుష్టుఁడై యెంతయు గొప్పది యగువానరసైన్యము సువేలకటకభూమి నంతయుఁ గ్రమ్మి వెంబడింప, శత్రువును వధింపఁగట్టి తలంపుగొని లంకలోని సువేలమునకుఁ బోయినవాఁడయ్యె. ఇది ముప్పదియేడవసర్గము.

## శ్రీరాముఁడు లంకను జూచుటకై సువేలాద్రి నారోహించుట.

రాముండు, లక్ష్మణుఁడు వెంబడింపఁగా, నట్లు సువేలపర్వతము నారోహింపఁ దలంచి, ధర్మవిదులును తనయం దనురక్తులును, ఆలోచనములఁ దెలిసినవారును, కార్యముల నెఱింగినవారునగు సుగ్రీవునిని విభీషణునిం జూచి మధురములయిన యుత్తమవచనముల 'మనమందఱము పలువిధము లయినధాతువులు వెక్క వ్యాపించి యున్నయీ పర్వతోత్తమమును సువేలమును జక్క నారోహించి యీరాత్రి యంతయు నిందు వసించియుందము. మఱియు దురాత్ముఁడై, మరణమును బొందుటకై నాభార్య నపహరించి, ధర్మమును దెలియక, ధర్మశాస్త్రవిహితమై యున్న తనకులాచారమును బాటింపక, తనకులము పెంపును గుణింపక, యుండురాక్షసుఁడగు రావణునకు నివాసస్థాన మయినలంకాపురిని జూతము. ఆ రావణుఁడు కేవలరాక్షససాధారణమయిన నీచబుద్ధి గలవాఁడుగాన తనకులాదులను జూడక పరభార్యాపహరణమనెడి యీ యతినిందితకార్యమును జేసినాఁడు. రాక్షసాధముఁడగు నారావణుని పేరు

* 'వానరులు కామరూపులగుటచే తమకిష్టమువచ్చిన రూపములతో యుద్ధము సేయఁగా రాక్షసులును కామరూపులగుటచే తలంచినరూపములెత్తి యుద్ధము సేయుదురు. కాన యపుడు మనవారు పరులు అని వేఱుపఱుప నలవిగాకుండును. రాక్షసులు వానరరూపము తక్కువైనదగుటచేఁ గయికొనరుగాన, వానరులందఱును తమవానరరూపములతోనే యుద్ధము సేయవలయును. వానరుఁడుగానుండుటయే మనవాఁడు అని తెలియుటకుగుఱుతు' అని రాముండు సంకేతముచేయుట తెలియునది. అప్పుడు రాముఁడు మనుష్యరూపమును దాల్పరాదని నిషేధించుటచే నంతకుమునుపు వానరులు మనుష్యరూపము దాల్చి యుండిరని తెలియుచున్నది. విభీషణాదులు మనుష్యరూపసంస్థానములు గలవారగుటచే మనుష్యులుగా గణింపఁబడుట తెలియునది.

చెప్పినమాత్రనే నాకు మిక్కిలియు రోషముపుట్టుచున్నది. 'అయిన వాని నొక్కనినే చంపుద మన్నచో' ఆ యొక్కనీచుని యపరాధమునుబట్టి యీ రాక్షసులనందఱను జంపవలయుట చూపట్టుచున్నది. 'ఒక్కనిదోషమునకు మఱియొక్కనిఁ జంపనేల' యన్నచోఁ? ఒక్కఁడుమాత్రమే మృత్యుపాశముబారిం జిక్కి పాపకార్యముచేయును. ఆనీచుని యపరాధముచే వానిని సంబంధించినవా రందఱును నాశము నొందుదురు' అనెను. రాముఁడు రావణునిపయి కోపమున నట్లు చెప్పుచు వింతలుగులుకు నెత్తములుగల సువేలపర్వతము నారాత్రి వసించుటకై యారోహించెను. లక్ష్మణుఁడును బరాక్రమంబు నెఱపుటయం దాసక్తుఁడై మిక్కిలి మేటియగువిల్లును బాణములునుగొని, యెంతయు నెచ్చరికమీఱ రామునిపిఱుఁదం బోయెను. అంత సుగ్రీవుఁడు నతనిమంత్రులును విభీషణుఁడును లక్ష్మణుని వెంబడిని కొండ నారోహించిరి. హనుమంతుఁడును, అంగదుఁడును, నీలుఁడును, మైందుఁడును, ద్వివిదుఁడును, గజుఁడును, గవాక్షుఁడును, గవయుఁడును, శరభుఁడును, గంధమాదనుఁడును, పనసుఁడును, కుముదుఁడును, హరుఁడును, రంభుఁ డనెడి యూథపతియు, జాంబవంతుఁడును, సుషేణుఁడును, మహామతియగు ఋషభుఁడును, మహాతేజుఁడగు దుర్ముఖుఁడును, శతవలియు మొదలగు వీరును మఱియు నితరులును వాయువేగంబువంటిగతి గలిగి పర్వతములం దెప్పుడును దిరుగుచుండువారు గావున రాముఁ డెక్కియున్న యాసువేలపర్వతమును వందలకొలఁదిని నారోహించిరి. అంత నారామాదులు శీఘ్రకాలముననే * యా సువేలపర్వతము నలుగడల నారోహించి, త్రికూటపర్వతపు శిఖరమున నాకాశమున వ్రేలుచున్నట్లున్నలంకాపురమును జూచిరి. వానరవీరు లందఱు, రమణీయమై మేలయిన ద్వారములు గలిగి, ప్రాకారముచే మిక్కిలియు నొప్పుచు, రాక్షసులచే నెంతయు నిండియున్నలంకను జూచిరి. అప్పుడు నల్లనిరాక్షసులు ప్రాకారపుకొఱడులచుట్టు నుండి, కట్టంబడిన మఱియొక ప్రాకారమువలె వెలయఁగా, నవ్వానరోత్తములు చూచినవారైరి. అచ్చట నావానరులందఱును నారాక్షసులం జూచి యుద్ధంబుసేయ కుతుకపడుచు రాముఁడు చూచుచుండఁగా నానావిధములయిన సింహనాదములు సేసిరి. అంత సూర్యుఁడు సంజకెంజాయచే నెఱుపువన్నెగదిరి యస్తమించెను. రాత్రియు, †పూర్ణచంద్రప్రకాశముచే నెంతయు వెలుంగుచుఁ బొడసూపినది. అంత వానర సేనానాయకుండయిన

* సువేలపర్వతము, లంకయంతపొడవుగల యొకపర్వతము. లంకనుజూచుటకై దీనిని రాముఁ డెక్కి మరల దిగుట తెలియునది.

† ఇందులకు 'పూర్ణచన్ద్రప్రదీప్తా చ క్షపా సమభివర్తతే' అని మూలము. దీనిచే పున్నమనాఁడు సువేలారోహణమనియు మఱునాఁడు ప్రథమను యుద్ధారంభ మనియుఁ జెప్పెదరు. 'పూర్ణచంద్రప్రదీపా' అను పాఠమును గ్రహించి 'పూర్ణచంద్రునివంటి దీపములుగలది' యనియు నర్థము సేయవచ్చును. వానరసేనయందును వెలుతురునకై యెత్తినదీపము లుండవచ్చును. గోవిందరాజులు.

యారాముఁడు, విభీషణుఁడు తన్నభినందించి పూజింప, లక్ష్మణునిఁగూడి వానరయూథపతులు బలసి కొలువఁగా నారాత్రి సువేలపర్వతాగ్రమున సుఖంబుండెను. ఇది ముప్పదియెనిమిదవసర్గము.

---

## రాముఁడు లంకానగరమును జూచుట.

వీరు లయినయావానరోత్తములు అట్లారాత్రియంతయు నాసువేలపర్వతమునందుండి పెండలకడ లంకయందలి వనములను నుద్యానవనములనుం జూచిరి. మిట్టపల్లములులేక సమములై (క్రూరమృగములును లేక) స్నిగ్ధములై యుండుటచే రమణీయములై వెడలుపును నిడివియును గలిగి కన్నుంగవ నాకర్షించుచున్నయందలి వనములను నుపవనములనుం జూచి యావానరు లాశ్చర్యమునొందిరి.ఆలంకయందు, సంపెఁగచెట్లును, అశోకవృక్షములును, పొన్నచెట్లును, మద్దిచెట్లును, తాటిచెట్లును, నెరసిబెరసియుండెను. అందు చీఁకటిచెట్లతోఁపులు గ్రమ్ముకొనియుండెను. నాగకేసరవృక్షములు వరుసలుగా నావరించి యుండెను. అందంతటను గిఱకతాటిచెట్లును, ఏఱుమద్దిచెట్లును, మంకెనచెట్లును, పూచినయేడాకులయరంట్లును, బొట్టుగుచెట్లును, కొండగోఁగుచెట్లును, కలిగొట్టుచెట్లును వెలయుచుండెను. మఱియు నది, కొసలుపూచి తీఁగెలువెనఁగొని వింతవింతలగు పువ్వులతోఁగూడి యెఱ్ఱనగు మెత్తనిచిగుళ్లను గలిగి వెలుఁగు పలువిధములగు పారిజాతాది దివ్యవృక్షములచే దేవేంద్రుని యమరావతివలె వన్నెగులుకుచుండెను. మఱియు,నందు నల్లని పచ్చికపట్లచేతను, జవుకుపట్లచేతను,వింతవింతలగువనపంక్తులును విలసిల్లుచుండెను.ఆవనములందు వృక్షములు, మనుష్యులు భూషణములను ధరించునట్లు,మంచివాసనలుగలిగి యంతటను రమణీయములగు పువ్వులును పండ్లును దాల్చియుండినవి.సమస్తఋతుధర్మములతోను గూడి మనోహరమై, యంతటను తుమ్మెద లెమ్మెలుచూప, రమణీయమై లంకయం దున్నయావనము, కుబేరుని చైత్రరథవనమువలెను, దేవేంద్రుని నందనవనముచందమునను, బ్రకాశించెను.ఆవానరులు,అవ్వనమునందలి సెలయేటియందు,నీరుకోళ్లును చీకుఁగొక్కెరలును, నర్తనముసేయుచుండు నెమిళ్లును, గోయిలలును,గూయిడుచున్న ధ్వనులను వినిరి. ఆలంకలోని వనములందును ఉపవనములందును, ఎప్పుడును దక్కినపక్షులు మత్తిల్లి కేరుచుండును. తుమ్మెదలు గ్రుమ్మరుచుండును. కోకిలలు వృక్షసమూహములందు నెరసియుండును. పక్షులకొలకొలధ్వనులును మేటితుమ్మెదల జుంజుమ్మనుపాటలును నలుగడల వినఁబడుచుండును. గండుతుమ్మెదలు దాని నెప్పుడును గొలుచుచుండును. అందు మందపిచ్చుకల ధ్వనులును దాపున కొలంకులందలి బెగ్గురుపిట్టల రవళియును, మొరయుచుండును. ఆవానరులు ఆవనరామణీయకమునకు పులకితగాత్రులై మిక్కిలిసంతుష్టితోడ వీరులుగాన నెంతమాత్రమును భయములేక కామరూపులుగాన యయ్యైపట్టులఁ జొరఁబడుటకుఁ దగినట్లు చిన్నపెద్దదేహములుదాల్చుచు

నంత నావనములను నుపవనములనుం బ్రవేశించిరి. మహాతేజు లగునా వానరులు, అందుఁ బ్రవేశించుచుండఁగా పుష్పలతావులు గొల్లగొని మూర్కొనుటకు నింపై గాలి పొలసెను. మఱికొందఱు వానరయూథపతులు, సుగ్రీవుని యాజ్ఞనొంది, వానరయూథమునుండి బయలువెడలి, మిక్కిలి యార్పులుగలవారిలో మేటులు గాన తమసింహనాదములచే పక్షుల నదలించుచును, మృగములను గజములను భయపెట్టుచును, ఆలంకనంతయు వడఁకించుచును, మిక్కిలి వేగమునం బోవునుర వడికి తమయడుగులచే భూమిని బీడించుచును, బలాకాశోభిత మగులంకాపురికిఁ బోయిరి. అంత వారికాలితొక్కుళ్లచే రేఁగినదుమ్ము నిమేషమాత్రమునం నాకాశమున గ్రమ్మినదయ్యె. లంకావనములనుండునట్టి యెలుఁగుబంట్లును, సింహములును, పందులును, ఎనుఁబోతులును, ఏనుఁగులును, జింకలును, వారిభీకరాకారములను జూడఁగానే మొదలే భయపడియున్నవి గాన మఱి వారల సింహనాదములను విన్నంతనే మిక్కిలియు బెదరుగొని దశదిశలకుఁ బాఱిపోయినవి. త్రికూటపర్వతమునఁ బ్రసిద్ధమై యున్నయామధ్యమశిఖరము కనుపట్టెను. అది ప్రక్కల నున్న రెండుశిఖరములకంటెను బొడవై, అద్వితీయమై, ఆకాశము నంటుచుండును. అదిచుట్టును పుష్పలచే నావరింపఁబడియుండుటచే బంగారువన్నె (గొప్ప వెండివన్నె) గలిగి, నూఱుయోజనములు విశాలమై నిర్మలమై చూచుటకు సొబగై యుండును. అది మఱియు రమణీయమై సిరిపెంపు దళుకొత్తుచు, పెద్దదియై పక్షులకేనియుఁ జేరరానియు మనస్సునైన నెక్కఁదరముగాకయు చూపట్టుచుండును. ఇంక జను లందులకు నడచిపోలేరనుటను జెప్పవలయునా ? రావణుఁడు పాలించుచున్నలంక యాశిఖరమున నూఱుయోజనముల నిడుపును ముప్పది యోజనముల వెడలుపును గలిగి యేర్పడియుండెను. ఆపట్టణము తెల్లనిమేఘములవలె నొప్పుచున్న యున్నతపురద్వారములును, బంగారుమయమగు ప్రాకారమును వెండిమయ మగుప్రాకారమును గలిగి, వెలుంగుచుండెను. వర్షారంభసమయమును, త్రివిక్రముని నడిమిపదమగు నాకాశము మేఘములచేతం బ్రకాశించునట్లు, ఆలంక ప్రాసాదములచేతను విమానములచేతను మిక్కిలియు వన్నెగులుకుచుండెను. మఱియు నాపురమునందు మధ్యచతుష్పథమునందు నొకప్రాసాదముగలదు. అది వేయి స్తంభములచే మిక్కిలియు నలంకృతమై పొడవై కైలాసశిఖరమువలె నాకాశమున వ్యాపించియుండెను. అది రాక్షసేంద్రుఁడగు రావణుని లంకాపురమున కంతయు నొకభూషణమై వెలుంగుచుండెను. దానినెల్లప్పుడు సరిగా నూఱుగురు రాక్షసులు గావలిగాచుచుందురు. అది మనోహరమై మంచియడవులును నానావిధ ధాతువులచే చిత్రితమైన క్రీడాపర్వతములును గలిగి వెలుఁగుచుండెను. అందు కృత్రిమవనములును శోభిలుచుండెను. మఱియు నందు పలువిధములయిన పక్షుల కలకలధ్వనులు మ్రోయుచుండెను; నానావిధమృగములును వెలయుచుండెను. ఇట్లు అడవులు పెక్కులుగలిగి యనేకరాక్షసులతోఁగూడి,

యున్నతమై, సమస్తపదార్థములచేనిండి గండరించుచు రావణుని పురమైయొప్పు నాలంకను లక్ష్మణుని యన్నయగు రాముఁడు,చూచు వేడ్కచేఁ గాంతి వికసిల్ల, తానును వానరులును జూచినవాఁడయ్యె. వీర్యవంతుఁడును దేవసదృశుండు నగులక్ష్మణాగ్రజుఁడు రాముఁడు గొప్పగృహములచేఁ గ్రిక్కిఱిసియున్న యాలంకానగరమును జూచి యాశ్చర్యమునొందెను. మేలయినవస్తువులచే నిండి, నానావిధ మయినకాపుదలనొంది,ప్రాసాదపరంపరలచే నలంకృతమై, గొప్పయంత్రములతోను మేటికవాటములతోనుం గూడి యున్నయాలంకానగరమును రాముఁడు మహాసైన్యసమేతుండై చూచినవాఁడయ్యె. ఇది ముప్పదితొమ్మిదవసర్గము.

## సుగ్రీవరావణులద్వంద్వయుద్ధము.

అంత, రాముఁడు సుగ్రీవునింగూడి వానరయూథపతులు పరివేష్టించిరా, రెండుయోజనముల విస్తారముగల ప్రదేశముతోఁగూడిన సువేలపర్వతశిఖరము నారోహించెను. అతఁడు, ఆ సువేలశిఖరమునందే కొంచెముసేపుండి, దశదిశలను జూచుచు, రమణీయమైన త్రికూటపర్వతశిఖరమున విశ్వకర్మచే నిర్మితమై చక్కఁగా నివేశితమై, రమణీయములగు వనములతో వెలయుచు నున్నలంకాపురమును జూచెను. రాముఁ డాలంకాపురి గోపురశిఖరమునందు దురాసదుఁడైన రాక్షసేశ్వరుఁడు రావణుఁ డుండఁగాఁ జూచెను. ఆరావణుని యిరుప్రక్కల రెండుతెల్లని వింజామరలును, పయిని విజయసూచక మగు శ్వేతచ్ఛత్రమును వన్నెగులుకుచుండెను. అతఁడు రక్తచందనమును జక్కఁగాఁ బూసికొని రత్నాభరణములచే నలంకృతుఁడై యుండెను. అతఁడు నల్లనిమేఘమువలెఁ గనుపట్టుచుండెను; మఱియు బంగారుసరిగపోఁగులవలువ మొలను గట్టికొనియుండెను. దేవేంద్రునితోడి యుద్ధమున నైరావతగజము కొమ్ములకొనలచేఁ బొడువఁగా నాపోట్లచేఁ గలిగినగాయ లతనిఱొమ్మున నెమ్మెగులుకుచుండెను.కుందేటినెత్తురువలె మిక్కిలియు నెఱ్ఱనయిన పయిదుప్పటము వైచికొని, యతఁడు, ఆకాశమున సంజయెండ సొలసిన మేఘసమూహముంబోలెఁ బ్రకాశించుచుండెను. అంత, సుగ్రీవుఁడు రాక్షసేంద్రుఁ డగురావణునిఁ జూచినంత మాత్రనే '.నాస్వామియెదుట నీదురాత్ముఁడు రాజోపచారముతో నెట్లుండవచ్చును?' అని కోపాతిశయ మురువడింప మనోబలమును దేహబలమును మీఱ, వానరపుంగవులును రాముఁడును జూచుచుండఁగానే యాపర్వతశిఖరమునుండి తటాలున లేచి రావణుఁ డున్నగోపురముపయికి నెగిరెను. సుగ్రీవుఁడు మనమున నెంత మాత్రము భయములేక యారావణునిఁ గొంచెముసేపు చూచుచుండి, యారాక్షసునిఁ దృణీకరించి, పరుషవచనమున నతనితో 'ఓరీ రాక్షసా! నేను రాముని స్నేహితుఁడ; మఱి యాలోకనాథునికి దాసుఁడను. ఆరాజశ్రేష్ఠుని తేజోబలమున

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణము

## వచనము

## యుద్ధకాండము.

రెండవభాగము.

దేవరాజసుధీ ప్రణీతము.



మద్రాసు:

ఆనందముద్రాయంత్రాలయమునందు

ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెనీవారిచే ప్రకటితము.

1912.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# యుద్ధకాండ విషయసూచిక.

## రెండవ భాగము.

పుట.

పుట.

# పటముల పట్టిక.





1441. కోటపై రావణుఁడుండఁగా, సుగ్రీవుఁడు రావణునికిరీటమును ఎడమకాలితోఁ గూలఁదన్నెను.

నిన్నిపుడు నేను విడిచిపెట్టను' అనెను. ఆసుగ్రీవుఁ డిట్లు చెప్పి, తటాలున నతనిపయి కెగిరి, చిత్రం బగునతనికిరీటమును బట్టిలాగి నేలంబడఁ ద్రోసి, తాను గ్రిందికి వ్రాలెను. మరల నతివేగమునఁ దనపయికి వచ్చుచున్నసుగ్రీవునిం జూచి రావణుఁడు 'ఓరీ! నాకనుమఱుఁగున (సుగ్రీవుఁడవై) మంచికంఠము గలవాఁడవై యుంటివి, ఇఁక నాయెదుటకువచ్చితివిగావున నాకంటియెదుట కంఠములేనివాఁడవగుదువు' అనెను. రావణుఁ డిట్లు చెప్పి యతిశీఘ్రముగా లేచి, యాసుగ్రీవునిని జేతులంబట్టి నేలం బడఁద్రోసెను. సుగ్రీవుఁడును చెండువలెఁ దటాలున బయికి చెంగలించి తనరెండు చేతులతో నారావణునిఁ బడఁద్రోసెను. వారిరువురును ఒకరినొకరు గట్టిగాఁ గౌఁగిటం బట్టుకొనుటచే దేహమంతయుఁ జెమటగాఱ, నంత వాఁడిగోళ్లం జీఱుటచే నవయవములెల్ల నెత్తుటం దోఁగ, ఒకరినొకరు గట్టిగ్గానిట్టటు గదలనీక పెనఁచుకొనుటచే కదలక మెదలక చేష్టలుడిగియుండి, యంత నొకరినొకరు పట్టువిడువఁగా పూచిన బూరుగుమోదుగులవలె నుండిరి. ఇట్లున్నమహాబలు లగునావానరరాజును రాక్షసరాజును ఒకరినొకరు పిడికిళ్లంబొడిచియు, పిడికిలి నొవ్వఁగా నఱచేతులం జఱచియు, నఱచేతులును గందఁగా మోఁచేతులంగొట్టియు, నవియు నలఁగఁగా గోళ్లం జీఱియు నిట్లు నానావిధంబుల మిక్కిలియు సైఁపరానియట్లు యుద్ధముగావించిరి. వారిరువురును మిక్కిలి యుగ్రమగువేగ మురవడింపఁగా, గోపురవేదినడుమ చాలసేపు మల్లయుద్ధముగావించి, యొండొరులను మీఁదికిఁ జిమ్ముచు, మరలఁ బట్టిలాగుచు, ఒండొరులదేహముల నడఁచి వంచుచు, వెనుకకుగునిడి మరల పయిఁబడఁ దెఱపిచూచుచునే గోపురవేదిపయి కదలకమెదలక నిలుచుండుచు, ఒండొరులపయి చేతులువైచి పెనఁచుకొని,ఒకరినొకరు దేహముల బిగికౌఁగిటం బట్టుకొనియే ప్రాకారమునకును పరిఖకును నడుమంబడిరి. వారిరువురు నట్లుపడియు లాఘవాతిశయమున భూతలమును ముట్టకయే పయికెగిరి యంత ముహూర్తముసేపు మిన్నకుండి శ్రమము వలన నిట్టూర్పులుపుచ్చుచు, మరలఁ దమ్ముఁదామే కౌఁగిలించుకొని యెగిరి,యుద్ధంబునకుఁదలపడి బాహుపాశముల నొండొరులదేహములను గట్టిగా బంధించిరి. వారిద్దఱును, అభినివేశమును అభ్యాసమును బలమునుం గలిగి, గర్వంబున విజృంభిఁగుచున్న పెద్దపులులవలెను ఏనుఁగుగున్నలవలెనుం జూపట్టుచు,చతురముగా నొకరినొకరు పట్టుకొనుట కనుపయినమార్గములం దిరుగుచుఁ బెనంగిరి. వారు, ఒకరినొకరు గదిసి, ఱొమ్ములతో మోఁది యొండొరులను గట్టిగా నదుముకొని, యొక్కపెట్ట నేలంబడిరి. అంత మరల నొండొరులఁబట్టి పయికెత్తి నేలంబడఁద్రోయుచు నిట్లు నానావిధములయిన యుద్ధప్రకారముల పెనంగిరి. మదపుటేనుంగులం బోలునావీరు లిరువురును, చక్కఁగా గరిడీసాధన చేసినవారు గావున యాసాదనబలిమివలన కట్టఁగంబములంబోని తమ మేటిబాహువులచే నొండొరుల నురవడిగా నడంచుచున్నవారయ్యును, నలసట నొందరయిరి. వారిట్లు చాలసేపుగాఁ బోరుచుండి యంత నురవడిగా మండలాది నానా

మార్గంబుల మెలఁగుచు యుద్ధముగావించిరి. వారొకరినొకరు గదిసి యొండొరుల రూపుమాపుటకుం బ్రయత్నపడుచు, ఆహారమునకై యెచ్చరికతోఁ బొంచియున్న పిల్లులవలె మాటిమాటికి నొండొరులతెలిసిపట్టుటకై యూరక కదలక మెదలక నిలఁబడుచు, నడుమనడుమ మండలాదుల సంచరించుచు నుండిరి. సుగ్రీవుఁడును రావణుఁడును యుద్ధమార్గములం దాతితేఱినవారు గావున సవ్యము అపసవ్యము మొదలగు నానావిధములగు మండలములను, వ్యాఘ్రసింహాదులవలె నిలఁబడు వైష్ణవము సమపాదము మొదలగు స్థానములును, నానావిధములగు గోమూత్రగతివంటి గమనములను, ఉపసర్పణాపసర్పణములను, తిర్యగ్గమనములను, సవ్యాపసవ్యవక్రగమనములను, తానున్నచోటు దప్పించి యెదిరిదెబ్బలను వ్యర్థముగావించు పరిమోక్షమును, బదులుదెబ్బచే నెదిరిదెబ్బను పరిహరించు వర్జనమును, ఎదిరినిలుచుండఁగా వాని చుట్టును దిరుగు పరిధావనమును, ఎదుర్కొని వేగదలపడు నభిద్రవణమును, ఒకయంగమును ముడుఁచుకొని మఱొకటి నిక్కించి వంగి మండూకమువలె పయికిఁబోవుట యను నాప్లావమును, ధైర్యమున నెదిర్చి పట్టియాసనముగఁ గొని నిర్భయముగా నిలిచియుండుట యను నాస్థానమును, వెనుమొగముగాఁబోవుట యను పరావృత్తమును, నిలుచున్నట్లే వెనుకకుజరుగుట యను సపావృత్తమును, ఎదిరిని బట్టుకొనఁగోరి యొడలు ముడుఁచుకొని వంగి పయికిపోవుట యను నవద్రుతమును, ఎదిరిని గాలం దన్నుటకై మొగము వాంచి యెగురుట యను నవప్లుతమును, ఎదిరిచేతిని బట్టుకొనుటకై తనచేయిచాఁచుట యను నుపన్యస్తమును, ఎదిరిపట్టుకొనుటను తప్పించుకొనుటకై తన చేతులు చిమ్ముకొనుట యను నపన్యస్తమును మొదలగు మార్గముల మెలఁగుచుండిరి. అంత నట్లు పోరుచున్నపుడు రావణుఁడు పోలి చుట్టఁ బెక్కురావణులను దోఁపించు *తనమాయాబలమును జూప నారంభించెను. జయశీలుఁడగు వానరాధిపతి యాసుగ్రీవుఁడు జితశ్రముఁడై యారావణునితలం వెక్కి తటాలున నాకాశమున కెగసెను. రావణుఁడు సుగ్రీవుఁడు మరలవచ్చునని మోసపోయి యచ్చటనే నిలిచియుండెను. †అంత వానరనాథుఁడగు సుగ్రీవుఁడు, తానే రావణునితో యుద్ధముసేసినాఁడన్నకీర్తిని

---

* రావణుఁడు మాయకుఁ జొడంగుటయే సుగ్రీవుఁడు గెలుపునొందెననుటను సూచించుచున్నది.

† ఇందులకు 'అథహరివరనాథః ప్రాప్యసంగ్రామకీర్తిం, నిశిచరపతి మాజౌ యోజయిత్వా శ్రమేణ। గగనమతివిశాలం లఙ్ఘయిత్వార్కసూనుః, హరివరగణమధ్యే రామపార్శ్వం జగామ' అని మూలము. విశేషార్థము.-(హరివరనాథః) క్షణములో రావణుని హరింపఁదగిన వానరపరికరమునకు నియామకుఁడైనవాఁడు. ఇట్టి పరికరముండఁగా తానే రావణునిపయిఁబోవుటకు రామభక్తియే హేతువని భావము. (ప్రాప్యసంగ్రామకీర్తిం) రామునకు యుద్ధమువలన వచ్చినకీర్తిని తానే లాగికొన్నాఁడని భావము. (నిశిచరపతిం) రాక్షసనాథుని-రావణునివంటివారనేకులున్నను వారినెల్ల తృణీకరించి వానితోనే యుద్ధము చేసినాఁడనుట, (ఆజౌ) యుద్ధమునందు-రావణునివలె కపటయుద్ధము సేయువాఁడు గాఁడు. మర్యాదచొప్పున యుద్ధముసేయువాఁడు. (యోజయిత్వా శ్రమేణ) ఇంతవఱకును వానికిఁ

బొంది, రాక్షసులను నరకుసేయక వారిపతియగు రావణునే కపటంబునఁగాక ధర్మయుద్ధమునఁ దలఁపడి, వానిం జంపఁజాలినవాఁ డయ్యె నది రాముఁడు గయికొన్న కార్యముగాన తా నట్లు సేయలేక యూరక వానికి శ్రమముమాత్రము పెట్టి, మిక్కిలియు విశాలమయిన యాకాశమును, సూర్యుఁడుంబోలె సూర్యనికుమారుఁడే యగుటం జేసి తా నవలీలఁ గడచివచ్చి యుద్ధతిమాలి వానరవీరులసమూహములో తాను కేవలము సామాన్యుఁడగు నొకనివలెఁ జూపట్టుచు రావణునితలను దేకవచ్చితినే రామునియెదుట నెట్లు నిలుతు నని యతనిపార్శ్వభాగమును జేరి నిలుచుండెను. సూర్యకుమారుఁడగు నాసుగ్రీవుఁడు, అట్లు అతీరకార్యమును గావించి, మిక్కిలియు సంతుష్టుఁడై రఘుకులరాజకుమారుఁడగు రామునకు యుద్ధోత్సాహమును వర్ధిల్లఁ జేయుచు వానరగణపతులు తన్నుఁ బూజించుచుండఁగా వాయువేగమున వానరసేనం జొచ్చినవాఁడయ్యెను. ఇది నలువదియవసర్గము.



రాముఁడు భయంకరనిమిత్తములం గాంచుట; అంగదుని రాయబారము; రాముఁడు వానరసైన్యములతో లంకను ముట్టడించుట.

అంత నపుడు, లక్ష్మణాగ్రజుఁడగు రాముఁడు, సుగ్రీవుని యందు యుద్ధము చేసిన చిహ్నములను జూచి యతనిని బిగ్గఁ గవుంగలించుకొని 'నీవు నాతో నాలోచింపక యిట్లు గొప్ప సాహసము చేసితివి. రాజులు, మాబోఁటిపరిజను లుండఁగా, నిట్లింత మాత్రమును సాహసకార్యములు సేయరు. వీరా! నీవు సాహసప్రియుఁడవు. కావుననే, నన్నును, విభీషణుని, ఈ వానరసైన్యమును, గొప్పసందేహపదమున నిల్పి మిక్కిలి కడిందిదైన యీ సాహసకార్యమును జేసితివి. నీవు సాహసమునకుఁ బూనితేని మాబోఁటులకు బ్రతుకుట దుర్లభముసుమీ. వీరా! ఇఁక నిదిమొదలుగా నయినను

---

దెలియకుండిన శ్రమముతోఁగూర్చి, యోజనము నెంతెసుయుండు గ్రింపుపడనిరావణునకు శ్రమము ఫలము. తనకో కీర్తియుఁభావను. (గగనమతినిశాలం లఙ్ఘయిత్వార్కసూనుః) తాఁ సూర్యపుత్రుఁడగుటం దెలుపుటకై ఆకాశము ననాయాసముగ దాఁటెను. (అర్కసూనుః) సూర్యునివలె తెలియఁబడనియమనవేగముగలవాఁడు (హరివరగణమధ్యే) మేటివానరసమూహముననుమ—అనఁగునతో తనయతిశయమును ప్రకటింపక వానరులం దొకానొకనివలె నుండెననుట, (రామపార్శ్వంజగామ) రాముని పార్శ్వమునకుఁ బోయెను. రావణుని శిరస్సును దేకయేవచ్చిన నేను రామునియెదుట నెట్లు నిలుతునని ప్రక్క నిలుచుండెను. రావణునకు శ్రమముమాత్రము గలిగించి మరలివచ్చినాఁ డనుటచే రాముఁడు తానే రావణునిఁ జంపవలయునన్న ప్రతిజ్ఞకు హాని సంభవింపకుండుటకై రావణునిఁ జంపకయే వచ్చినాఁడనుట సూచితము. రావణుఁడు మాయాప్రయోగమునకుఁ దొడంగఁగానే తానును మాయను బ్రయోగించినచో రామునకుఁ గోపము కలుగునని వచ్చివేసినాఁడని యాశయము. గోవిందరాజులు.

ముందువెనుక విచారింపక యిట్టువంటి సాహసమును జేయకుము. ఏలన ! *మహాబాహుబలమున శత్రువులం జీచమడంచునట్టి నీకు నేదయిన హానికలుగునెడ, నాకు సీతతోఁగాని, భరతునితోఁగాని, పిన్నతమ్ముఁడగు లక్ష్మణునితోఁగాని, శత్రుఘ్నునితోఁగాని, తుదకు నాదేహముతో నయినఁగాని పనేమి? నీవు దేవేంద్రవరుణులం బోనివాఁడవు. మహాబలా ! ఇంతకుమునుపు నీవు రాకుండఁగా, నాకు నీపరాక్రమము తెలిసియున్నను, వాత్సల్యాతిశయమున నీ కేదేని యపాయముకలుగునో యని శంకించి, యట్లు కలిగెనేని, ప్రతిజ్ఞను తీర్పకపోరాదుగాన రావణుని పుత్రబంధుసైన్యసహితముగాఁ జంపి, శరణాగతుని విఫలునిఁ జేయఁదగదుగాన లంకయందు విభీషణుని బట్టముగట్టి, కులధర్మము నెడతెగిపోకుండునట్లు అయోధ్యకుఁబోయి భరతుని రాజ్యమునందు నిలిపి, పిదప దేహము విడిచెదనని యిట్లు నామనన్సున నిశ్చయించుకొని యుంటిని' అనెను. రాముఁ డిట్లు చెప్పఁగా సుగ్రీవుం డతనితో 'రఘుకులవీరా ! రామా ! నీకు దాస్యముసేయవలసినది నాకు పురుషధర్మమని తెలిసియుండి, నీభార్య నపహరించినదురాత్ముని రావణునిఁజూచి యెట్లు సహింతును? ఇది దాసకర్మమేకాని సాహసముకాదు' అనెను. ఇట్లు వీరుండగు సుగ్రీవుండు చెప్పఁగా విని యారాముఁడు కాంతిలక్ష్మిం దేజరిలుచున్న లక్ష్మణునిఁజూచి 'లక్ష్మణా ! మనము చల్లని నీటిపట్టులను మంచిఫలములు గలవనములనుం జేరి, యీసైన్యము నయ్యైయూథపతులకు వేఱువేఱ విభజించి పాలుపుచ్చి గరుడాదిరూపముల నొద్దులు తీర్చుకొని యుందము. ఘోరమైన యొకభయనిమిత్తము నిద సంభవింపఁగలదని నాకుఁ జూపట్టుచున్నది. అది లోకమునకంతయు క్షయముసూచించుచున్నది. లోకమునకే కాదు; ఋక్షవానరులందును రాక్షసులందును మేటివీరులగువారికినింగూడ వినాశమును సూచించుచున్నది. వాయువులు బిరుసుగా వీచుచున్నవి. భూమి వడఁకుచున్నది. పర్వతశిఖరము లల్లలాడుచున్నవి. వృక్షములు డ్రెళ్లిపడుచున్నవి. మేఘములు డేగమొదలయినవాని యాకారములుగలిగి, క్రూరవేషములగుచు, బెడిదముగా నుఱుముచు, లోకక్షయసూచకములై క్రూరముగా నెత్తురుబిందువులతోఁడి జలము గురియుచున్నవి.

---

* 'త్వయి కిఞ్చిత్సమాపన్నే కిం కార్యం సీతయామమ । భరతేన మహాబాహో లక్ష్మణేన యవీయసా । శత్రుఘ్నేనచ శత్రుఘ్న స్వశరీరేణవాపునః' అని యిందులకు మూలము. విశేషార్థము:— (త్వయికిఞ్చిత్సమాపన్నే) నీవు వానరా ! అని పిలుపును బొందఁగా, (మమ సీతయా కింకార్యం) నాకు సీతతో నేమిప్రయోజనము. క్రొత్తగా నీనినదూడయందలి వాత్సల్యమున మునుపటిదూడను గోరకుండు వత్సలయగు గోవువలె నిత్యానపాయిని యగు సీతనుగూడ నాదరింపక యప్పు డాశ్రయించిన యొకవానరమాత్రునియందు అత్యంతాభినివేశముగు నెంపు రాముని వాత్సల్యాతిశయము చెప్పఁబడుచున్నది. (సీతయా) 'అర్ధోవా ఏషఆత్మనో యత్పత్నీ' అని అర్ధశరీరభూతయగు సీతతోఁగూడ నాకు పనిలేదు. (భరతేనయవీయసా) 'భ్రాతా స్వామూర్తిరాత్మనః' అన్నట్లు తనమూర్తియేయైన భరతాదులతోను నాకు ప్రయోజనములేదు. (స్వశరీరేణవా) 'ఆత్మాసం సర్వంధారకేష్వద్దారైరపి ధనైరపి' అన్నట్లు అన్నిటికంటె నెక్కుడుగా రక్షించుకొనవలసినశరీరముతోఁగాని ప్రయోజనములేదఁట.—గోవిందరాజీయము.

సంధ్య, ఎఱ్ఱనిచందనమువలెఁ జూపట్టుచు మిక్కిలియు దారుణముగానున్నది. ఇదిగో సూర్యమండలమునుండి మండుచున్న యగ్నిపిండములు పడుచున్నవి. హీనములగు నక్కలు మొదలయినవి దీనవేషములతో దైన్యసూచకములగు స్వరములు గలిగి యుండుటచే భయంకరములై గొప్పభయమును బుట్టుట సూచించుచు సూర్యుని కెదురై యఱచుచున్నవి. చంద్రుఁడు, ప్రలయకాలమునందుంబోలె రాత్రికాలమున కాంతిహీనుఁడై నడుమ నలుపును చివరలందు నెఱుపును గలిగి సంతాపము గలిగించుచున్నాఁడు. చంద్రునిపరివేషము, బారెఁడంతయై, భయంకరమై యశుభకరమునై నడుమ మిక్కిలియు నెఱుపుగలిగి ప్రళయకాలమునందుంబోలె చూపట్టుచున్నది. లక్ష్మణా! సూర్యమండలమున చంద్రునియందుంబోలె నల్లనయిన కళంకము చూపట్టుచున్నది. లక్ష్మణా! నక్షత్రము లెప్పటియట్లుగాక మలినములుగా చూపట్టుచున్నవి. ఈ చెప్పిన దుర్నిమిత్తములన్నియు లోకమునకుఁ బ్రళయమునుఁ జెప్పుచున్నట్లున్నవి; చూడుము. కాకులును డేఁగలును గద్దలును క్రిందుగా వేదికాస్థానమును జేరుచున్నవి. నక్కలును పెద్దయెలుంగున నశుభధ్వనులు గావించుచున్నవి. ఇఁక మనము నలుగడల వానరసైన్యములు పరివేష్టింపఁగా నిపుడే కదలి రావణుఁడు పాలించుచుండుటచే నెవ్వరికి నెదిరింపరాకున్నయీలంకాపురికి నతివేగముగఁ బోవుదము' అనెను. ఇట్లు వీరుఁడును మహాబలుఁడు నగులక్ష్మణాగ్రజుఁడు రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పుచు శీఘ్రమున నా సువేలపర్వతశిఖరమునుండి దిగెను. ధర్మాత్ముఁ డగునా రాముఁ డాపర్వతమునుండి దిగి పగవారికి నెంతమాత్రమును జెనకరాక వెలయుచున్న * తనవానరబలమును జూచెను. రాముఁ డన్యోన్యకాలములఁ జేయవలసినదానినెల్ల నెఱింగినవాఁడు గావున దానును సుగ్రీవుఁడును మిక్కిలి గొప్పదయిన యా వానరవీరసైన్యమును బ్రోత్సాహపఱిచి యుద్ధమునకుఁ గాలముగుటయు, యుద్ధమున కాజ్ఞాపించెను. అంతఁ బ్రాతఃకాలమున మహాబాహుఁడగు రాముఁడు విలుదాల్చి, గొప్పసైన్యము బలసి వచ్చుచుండఁగా, ముందు లంకాపురముంగూర్చి పయనమై పోయెను. అప్పుడు విభీషణుఁడును, సుగ్రీవుఁడును, హనుమంతుఁడును, జాంబవంతుఁడును, నలుఁడును, సుషేణుఁడును (ధూమ్రుఁడును), నీలుఁడును; లక్ష్మణుఁడును రాముని వెంబడించిరి. అంత మిక్కిలియు గొప్పదియగు ఋక్షవానరసైన్యము బహువిశాలమయిన భూమిని గ్రమ్మి రాముని వెంబడించిపోయినది. ఏనుఁగులంతటిదేహములు గలిగి, ఎదిరిని వారింపఁజాలువానరులు వందలకొలఁదిని పర్వతశిఖరములును పెనువృక్షములును బట్టుకొనిపోయిరి. పగవారిభీషణమడంచు నాయన్నదమ్ములు రామలక్ష్మణులు, అట్లు సైన్యసహితముగాఁ బోవుచు దీర్ఘకాలమునకు రావణునిపుర మగులంకను జేరిరి. ఆపట్టణము, పతాకాపంక్తులచే నలంకృతమై మనోహరమై, మేలయినయుద్యానవనములచే నొప్పుచుండెను. అది, చిత్రమగుకోటయు

* దీనిచే వానరబలమంతయు సువేలపర్వతము నెక్కలేదని సూచితమగుచున్నది.

మిక్కిలి పొడవులైన ప్రాకారమును బహిర్ద్వారములును గలిగియుండుటచే పగవారికి నెంతమాత్రము నెదిరింప నలవిగాకుండెను. ఇట్లు దేవతలకుఁగూడ నెదిరింప శక్యము గాని యాలంకాపురమును వానరులు రాముని మాటచొప్పునఁ దమతమస్థానములను గడవక ముట్టడించి విడిసిరి. రాముఁడు లక్ష్మణుఁడును దానును, పర్వతశిఖరమువలె మిక్కిలి పొడవైన లంక యుత్తరద్వారమును,తనబలమును గాఁచుచు*ముట్టడించెను. వీరుఁ డగుదశరథకుమారుఁడు రాముఁడు, లక్ష్మణుఁడు వెంబడించి రాఁగా, రావణుఁడు పాలించు లంకాపురియందు ఆ రావణుఁ డుండు నుత్తరద్వారమును జేరి యట ముట్టడి గొనియుండెను. రావణుఁ డధిష్ఠించియున్న యాద్వారము భయంకరమై వరుణుఁ డధిష్ఠించియున్న సముద్రమువలె వెలయుచు, ఆయుధధారులును భయంకరాకారులు నగురాక్షసులచేతఁ జుట్టును జక్కఁగా రక్షితంబై యుండుటచే నల్పబలముగల వారికి దిగులుగొలుపుచు దానవులచే రక్షితం బగుపాతాళమువలె నుండెనుగాన, దానిని పదిలముగా ముట్టడించుటకు రాముఁడుదక్క మఱియెవ్వఁడును సమర్థుఁడు గాఁడు. రాముఁ డాద్వారమునందలి వేదికలపయిని రాక్షసయోధు లుంచియున్న నానావిధములగు నాయుధసమూహములను పెక్కింటిని గవచములనును జూచెను. వీర్యవంతుఁడును వానరసేనాధిపతియు నగు నీలుఁడు, తూర్పుద్వారమున †మైందద్వివిదులతోఁగూడి నిలిచియుండెను. మిక్కిలియు బలవంతుఁ డగునంగదుఁడు ఋషభగవాక్షులను గజగవయులనునుగూడి దక్షిణద్వారమును ముట్టడించియుండెను. బలవంతుఁడగు హనుమంతుఁడు ప్రమాథిని ప్రఘసునిని, మఱియు వీరులయిన యితరవానరులనునుగూడి పడమటిద్వారమును రక్షించుచుండెను. సుగ్రీవుఁడు గరుడునిని వాయుదేవునిని బోలువానరశ్రేష్ఠు లనేకులతోడంగూడి, బలవంతులగు రావణేంద్రజిత్తులతోఁ బోరు ,రామహనుమంతుల కిద్దఱలో నెవరికి వలసినను వారికి తోడుపడుటకై యుత్తరపశ్చిమద్వారముల నడిమిగుల్మమునఁ దానుండెను. మిక్కిలి ప్రఖ్యాతిగాంచిన యూథపతులక్రింద ముప్పదియాఱుకోట్ల వానరులు లంకాపురిని ముట్టడించి సుగ్రీవుఁ డున్నయెడ నుండిరి. రాముని యాజ్ఞంజేసి, లక్ష్మణుఁడును విభీషణుఁడును, ఒక్కొకద్వారమందును ఒక్కొక్కకోటివానరులను నిలిపిరి. రామునకుఁ బడమట, దాపుననే సుగ్రీవుఁడు జాంబవంతునింగూడి, బహుసైన్యపరివృతుఁడై నడిమిగుల్మమున నుండెను. ఆవానరసింహులు కోఱలతోఁగూడిన పెబ్బులులుంబోలె, వృక్షములను పర్వతశిఖరములనుం బట్టుకొని యుబ్బుచు,యుద్ధమునకుఁ గాచియుండిరి. ఆవానరు లందఱును, తోఁకలను బయికి నెత్తికొనియుండిరి. అందఱకును గోఱలును

---

*ఇట 'ముట్టడించె' ననుటచే సువేలపర్వతమును దిగినవెనుక త్రికూటపర్వతశిఖరము నెక్కె ననుట అర్థసిద్ధ మగుచున్నది.

† ఇట ప్రతిద్వారమునను పూర్వము నియుక్తులైనవారిశాఖ యొక్కవకొందఱు యూథపతులను బోవుటను జెప్పుటచే వీరందఱును నట్లు రామునిచే పూర్వమే నియోగింపఁబడుట తెలియునది.

గోళ్లునే యాయుధములు. అందఱకును మొగమును కన్నులును గోపవికారమున నెఱ్ఱనగుటంజేసి యవయవములు నానావర్ణములుగానుండెను. అందఱును మొగములను వంకరగాఁద్రిప్పి రాక్షసులు వెక్కిరించుచుండిరి. వారిలోఁ గొందఱు పదియేనుఁగుల బలముగలవారుగను, కొందఱు నూఱేనుంగుల బలముగలవారుగను, గొందఱు వేయేనుంగుల బలపరాక్రమములుగలవారుగను నుండిరి. మఱి యాసేనయందు వానరోత్తములు గొందఱు, ఓఘసంఖ్యయేనుంగుల బలముగలవారును కొంద ఱందులకు నూఱింతలు బలముగలవారును, కొందఱు ఇంతింతయని కొలందియిడరాని బలముగలవారలును నుండిరి. ఆలంకయం దవ్వానరసైన్యములు వచ్చి గుంపులుగూడఁగా, ఆగుంపు, శరభములు గుంపులుగూడినట్లు భయంకరముగాను, మిడుతలు గుంపులుగట్టివచ్చునట్లు ఒక్కుమ్మడివచ్చుటచే ఆశ్చర్యముగాను, కోఁతులనియు గొండముచ్చులనియు నెలుఁగుబంట్లనియు నుండుటచే నానావర్ణములుగలదిగాను నుండెను. లంకచుట్టునువచ్చి విడిసియున్న వానరులచే భూమి గప్పఁబడినట్లును, భూమియం దవకాశములేనందున పయిగా విడియువచ్చుచున్న వానరులచే నాకాశము నిండినట్లును, జూపట్టినవి. మును పుంచినసైనికులుగాక కోటిబుక్షవానరులు ప్రతిలంకాద్వారమునందును జేరియుండిరి. మఱియు వేఱువానరు లనేకులు, అచ్చటచ్చటివారికిఁ దోడ్పడి యుద్ధముసేయుటకై నలుగడల వచ్చియుండిరి. అవ్వానరులచే నాత్రికూటపర్వతమంతయు నలుగడల నావరింపఁబడియుండెను. ఇట్లు ద్వారముల నావరించినపిదప, మఱియుఁ గోటివానరు లాపట్టణముచుట్టును బరివేష్టించియుండిరి. అట్లు బలవంతులయినవానరులు వృక్షహస్తులయి లంకచుట్టును ముట్టడించి యుండుటవలన నాపట్టణము వాయువునకైనను జొర నలవిగాకుండెను. ఇట్లు మేఘములవంటిదేహములు గలిగి, దేవేంద్రునకుంబోలె పరాక్రమంబు లొప్పువానరు లతిశీఘ్రమునవచ్చి చుట్టుముట్టడింపఁగా రాక్షసు లాశ్చర్యమునొందిరి. అప్పుడచ్చట వానరసేనాసమూహములు వచ్చుచుండఁగా సముద్రము కట్టఁద్రెంచుకొని దానిజలములు వచ్చినప్పటియల్లకల్లోలమువలె మహాధ్వని గలిగినది. ఆమహాధ్వనికి లంకయంతయును ప్రాకారతోరణములతోను, పర్వతవనకాననములతోను మిక్కిలియుఁ జలించినది. రామలక్ష్మణులచేత రక్షితమై సుగ్రీవసహితమై యున్నయావానరసైన్యము సమస్తదేవాసురులకు నయినను నెదిరింప నలవిగాకుండెను. రాముఁ డిట్లుతనసైన్యమునంతయువిడియించి, రాక్షసులను రావణుని వధించువిషయమై యిఁకఁ జేయవలసినకార్యమును జేయఁగోరి, మంత్రులతోడ దూతను బంపవలయునని యాలోచనముసేసి, అంగదుఁడే యట్లు పంపఁదగినవాఁడని మాటికి నిశ్చయించి సామాద్యుపాయములకుఁ గల యమైత్యఫలములనుగలరూపున నెఱింగినవాఁడుగాన రాజధర్మమును దలంపుననిలిపి విభీషణుఁ డనుమతింపఁగా వాలిపుత్త్రుఁడగు నంగదునిం బిలిచి యతనితో 'సౌమ్యా! నీవు కపివిగావున శ్రమములేక లంకాపురిప్రాకారమునుదాఁటి భయమువిడిచి రావణునియొద్దకుఁబోయి



1449. అంగదరాయభారము; అంగదుని పట్టుకొనునట్లు రావణుడు నియోగించుట ;
అంగదుడు తప్పించుకొనిపోవుట.

పీసి, పరిశుద్ధుఁడగుదువు. అట్లుగాక, నీవు పక్షివై మనోవేగమున మూఁడులోకములకుఁబోయినను, నాకంటిబారింబడి, పిదప ప్రాణములతోఁ బోఁజాలవు. నీకొకహితమయినమాటను జెప్పెదను. ఇఁక లోకమునం దొక్కరాక్షసునిఁగూడ నుంపను గాన నీకు నపరక్రియలు సేయువాఁడుండఁడు. కనుక నిప్పుడు,నీకు నీవే యపరక్రియలను గావించుకొనుము. నీవింకఁ జూడఁబోవునది లేదు గావున నిప్పుడే లంకనంతయుఁ జక్కఁగాఁ జూచుకొనుము. నీప్రాణములు నాచేతనున్నవి సుమీ! అనుము" అని చెప్పెను. ఎట్టికార్యము ననాయాసముగాఁ జేసి తీర్చురాముఁ డిట్లు చెప్పఁగా తారాపుత్త్రుఁడగు నాయంగదుఁడు, ఆకాశమున కెగసి, కరచరణాదిమయమైన రూపునొందిన యగ్నిహోత్త్రుండుంబోలెఁ బోయెను. ఆయంగదుఁడు హర్షమునఁ గాంతియెంతయు వికసిల్ల, ముహూర్తకాలమున రావణుని భవనము చేరి, యచట మంత్త్రులతోఁగూర్చుండియున్న రావణుని నెచ్చరికమెయిం జూచెను. అంత బంగారుబాహుపురులు రంగారు నావానరపుంగవుఁ డంగదుఁడు, ఆరావణునకు సమీపమున వ్రాలి, మండుచున్న యగ్నికైవడి వెలుంగుచు నిలుచుండెను. ఆయంగదుఁడు మొదట తనపేరునూరును దానే తెల్పి యంత రావణునకును నతనిమంత్త్రులకును రాముఁడు చెప్పినహితవచనములన్నియు నెక్కువతక్కువ లెంతమాత్రము లేకుండునట్లుగా "నేను కోసలదేశమునకుఁ బ్రభుఁడును కార్యముల నతిసులభముగాఁ జేసి తీర్చువాఁడునగు రామునికి దూతను, వాలికుమారుఁడను, నాపేరు అంగదుఁడండ్రు. నన్ను నీవు వినియున్నావా? రఘుకులంబునఁబుట్టి కౌసల్యకడుపు చల్లఁజేయుచుండు రాముఁడు నీతో 'క్రూరా! పట్టణమునుండి వెడలివచ్చి యెదురనిలిచి యుద్ధముసేయుము. శూరుఁడవుగమ్ము. నిన్నును నీకొడుకులను దాయాదులను బంధువులను మంత్త్రులనందఱను జంపువాఁడను నేను. నీవు హతుఁడవయినపిదప ముల్లోకములును నిర్భయములై సుఖముండును. దేవతలకును దానవులకును యక్షులకును గంధర్వులకును ఉరగులకును రాక్షసులకును పగవాఁడును ఋషులకు బాధకుఁడునగు నిన్నిపుడు వధించివచ్చెదను. నీవు నన్ను సత్కరించి సీతనుసమర్పించి నాయడుగులంబడవేని, నిన్ను వధించి విభీషణునకు లంకాధిపత్యమును గలిగించెదను' అని చెప్పు"మనెను. వానరపుంగవుఁడగు నంగదుఁ డిట్లు పరుషవాక్యము లాడుచుండఁగా రాక్షసగణేశ్వరుఁడగు రావణుఁడు కోపవివశుఁడయ్యెను. అంత రావణుఁడు కోపమునఁ గన్నెఱ్ఱఁబాఱ మంత్త్రులనుజూచి 'ఈదుర్బుద్ధిని బట్టికొనుఁడు. చంపుఁడు. చంపుఁడు' అని పలుమాఱు నానతిచ్చెను. రావణుఁ డట్లానతిచ్చినదివిని, మండుచున్న యగ్నివలెఁ దేజరిలుచున్న భయంకరాకారులగు రాక్షసులు నలువు రంత నాయంగదునిం బట్టుకొనిరి. అప్పుడు వీరుఁడగు నాయంగదుఁ డతిధీరుఁడుగాన రాక్షసగణములకుఁ దనబలమును జూపుటకై తానే వారిని తన్నుఁ బట్టుకొననిచ్చెను. అంగదుఁడు ఆరాక్షసులను తనరెండుచేతులలోఁ బక్షులవలె నిఱికించుకొని యపుడు పర్వతాకారమగు ప్రాసాదము పయికి

నెగసెను. ఆరాక్షసులందఱును, రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు చూచుచుండఁగానే, ఆయంగదునివేగమున నాకాశమువనుండి విదుర్పంబడి నేలంబడిరి. అంతఁ బ్రతాపశాలియగు వాలిపుత్త్రుఁ డంగదుఁడు, పర్వతశిఖరమువలె మిక్కిలి పొడవై యున్న రావణుని ప్రాసాదపుశిఖరమునుజూచెను. అది, యంగదుని పదఘాతమున రావణునికన్నులయెదుటనే, మున్నింద్రునిచే పగుల్పఁబడిన హిమవంతపుశిఖరముంబోలె, బ్రద్దలువాఱెను. ఆయంగదుఁడట్లు ప్రాసాదశిఖరమును భగ్నముసేసి తనపేరందఱకును జక్కఁగా వినిపించి,మిక్కిలియు ధ్వనిగలుగునట్లు సింహనాదముసేసి, యాకాశమున కెగసెను. అట్లతఁడు, రాక్షసులకందఱకును దుఃఖముగలిగించుచు, వానరులకెల్లను సంతోషమునుబుట్టించుచు, వానరులనడుమం జొచ్చి రామునిపార్శ్వమును జేరెను. రావణుఁడు తనప్రాసాదము నట్లు భగ్నమగుటకు మిక్కిలియుఁ గ్రోధావేశమునొంది, 'వీఁ డొక్కఁడయ్యును నానిండుబలమును నిరసించి నిర్భయముగాఁ బోవుచున్నాఁడే. ఇట్టివారు పెక్కండ్రు *నన్ను నాశముసేయఁ బూనఁగా బ్రదుకుట యెట్లు!' అని తననాశము గలుగుటంగూర్చి వితర్కించుచు మిక్కిలియు నిట్టూర్పుపుచ్చెను. అంగదుఁడు వచ్చుటంజూచి యంత మిక్కిలి సంతుష్టులయి సింహనాదములు సేయుచు వానరులు పెక్కండ్రు పరివేష్టించియుండ, రాముఁడు, పగవాని వధింపఁగోరి యుద్ధమునకై పూనియుండెను. అపు డచ్చట మహావీర్యశాలియు పర్వతశిఖరాకారుఁడునగు సుషేణుఁడు, కామరూపులగు వానరులు పెక్కండ్రచే పరివేష్టితుఁడై యుండెను. పగవారి కెదిరింప నలవిగానియాసుషేణుఁడు, సుగ్రీవునాజ్ఞచేత, చంద్రుఁడు నక్షత్రరాసులం దిరుగుచుండునట్లు, లంకాద్వారములు నాలుగింటను చుట్టి తిరుగుచుండెను. అట్లు లంకనువిడిసి సముద్రముదాపున వర్తించుచున్న నూఱక్షౌహిణుల యవ్వానరసైన్యమునుజూచి, ధీరులయిన రాక్షసులుగొందఱు, ఆశ్చర్యమునొందిరి. ధీరులుకాని వేఱుకొందఱు భయపడిరి. శూరులగు మఱికొందఱు సమరగర్వమునంజేసి హర్షమునే పొందిరి. ప్రాకారమునకు నగడ్తకును నడిమిప్రదేశమంతయు వానరులచే వ్యాప్తమై మిక్కుటముగా వానరులు నిండియుండుటంజేసి యది వానరిమయమైన మఱియొకప్రాకారమువలె దీను లగురాక్షసులకుఁ జూపట్టెను. రాక్షసులందఱును భయమున నోడలుమఱచి హాహాకారములు గావించుచుండిరి. రాక్షసులరాజధానియగు లంకాపురమునందు, మహాభయంకరమైన యట్టికోలాహలము గలిగియుండఁగా, శూరులయిన రాక్షసులు, గొప్పయాయుధములనుధరించి ప్రళయకాలవాయువులుంబోలెఁ గ్రుమ్మరుచుండిరి. ఇది నలువదియొకండవసర్గము.

## వానరరాక్షసుల యుద్ధారంభము.

అంత నపు డారాక్షసులు, రావణునిమందిరమునకుఁ బోయి రాముఁడు వానరులంగూడి, లంకాపురినంతయు ముట్టడించెనని యతనికిఁ దెలిపిరి. ఆరావణుఁడు, లం

కానగరమును వానరులు ముట్టడించుటనువిని, మిక్కిలియు క్రుద్ధుఁడై, నగరరక్షణము రెండింతలుగాఁ గావించి, ప్రాసాదముపయి నెక్కెను. అతం డట్లెక్కి, లెక్కింపవలవిగానివానర సేనాసమూహములు, యుద్ధమును గోరి లంకయందు నలుగడల పర్వతములను వనములను కాననముల నావరించి యుండుటను జూచెను. అతఁడు భూమినంతయు వానరులు కబళించునట్లు గప్పియుండుటనుజూచి 'వీరల నెట్లు నాశము సేయవచ్చును' అని చింతనొందెను. ఆరావణుఁ డట్లు చాలసేపు చింతించి యంత ధైర్యము నవలంబించి, కన్నులంతయు విఱివిగా విచ్చి రామునిని వానరయూథములనుం జూచెను. రాముఁడు సంతుష్టుఁడై మునుపున్నచోటు విడిచి ప్రాకారము దాపటికిఁ బోయి లంకయంతటను రాక్షసులచేఁ బరివృతమై సురక్షితమై యుండుటం గాంచెను. రాముఁడు చిత్రములగు ధ్వజపతాకలచే నలంకృతమై యున్న లంకాపురమునుజూచి తోడనే మనస్సుగుందుచుండ సీతను దలఁచుకొని 'లేడిపిల్లకుంబోని బెళుకుంగన్నుఁగవగల యాచిన్నారి, ఆజనకరాజకూఁతురు, సీత యిచ్చట రాక్షసులచే పీడితయై, నానిమిత్తము శోకమునం బొక్కుచు నుపవాసములఁ గ్రుశించి భూమియే శయ్యగా కష్టపడుచున్నదే' యని దుఃఖించెను. ఆరాముఁడు ధర్మాత్ముఁడుగాన, రాక్షసులచేఁ బీడింపఁబడుచున్న యాసీతను దయమీఱఁ దలంచుకొని రోషమినుమడింపఁగా వానరులను శీఘ్రముగా శత్రువధము గావింపుఁడని యాజ్ఞాపించెను. ఎట్టికార్యము నేని సులువుగాఁ జేయునట్టిరాముఁ డిట్లాజ్ఞాపింపఁగా వానరు లొకరినొకరు మచ్చరమున నేను ముందని త్రోపాడుచు, యుద్ధమునకుఁ గడఁగి సింహనాదములు గావించిరి. వానరోత్తములు 'ఈలంకను పర్వతశిఖరములవైచికాని పిడికిళ్లం బొడిచికాని నుగ్గునూచ గావింతము' అని మనస్సునఁ దలంపుగొనిరి. అమ్మేటివానరులు పెద్దవియగు పర్వతశిఖరములను పర్వతఖండములను నెత్తికొనియు నానావిధములయిన వృక్షములనుఁ బెకల్చి పట్టుకొనియు యుద్ధసన్నద్ధులై యుండిరి. అప్పుడు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు చూచుచుండఁగా నా వానరసేనలన్నియు భాగములుభాగములుగా వేఱువేఱ రామునకు సంతోషముగూర్చుటకై లంకాప్రాకారము నెక్కిరి. ఎఱ్ఱని మొగములును బంగారుచాయయుఁ గలిగిన యావానరులు రామునికొఱకు ప్రాణములను విడుచుటకైనను నిశ్చయించి సాలవృక్షములను తాలవృక్షములనును శిలలను నాయుధములుగాఁగొని లంకాపురిపయికిం బోయిరి. ఆవానరులు వృక్షములతోను పర్వతశిఖరములతోఁ గొట్టియు పిడికిళ్లం బొడిచియు నాలంక ప్రాకారశిఖరములను ఉద్యానవనములనును బురద్వారములనును కలంచి నలంచి వైపసాగిరి. వానరులు మట్టికుప్పలుపోసియు, పర్వతశిఖరములను దృణకాష్ఠములను వైచియు, తేటజలముల నీటుగులుకుచున్నయగడ్తలను బూడ్చిరి. అంత వానరులు గొందఱు వేయిమంది వానరులతోను గొందఱు కోటివానరులతోను మఱికొందఱు నూఱుకోట్లవానరులతోనుం గూడి లంకాప్రాకారము నారోహించిరి. గొప్పదేమంగు

లం జేసియాకారములుగల వానరులు బంగారుమయము లయినపురద్వారములను జీకాకుపఱుచుచు, కైలాసశిఖరములవంటి గోపురములను నలంచివైచుచు, నిటునటు గంతులువైచి పోవుచును వచ్చుచును బొబ్బలిడుచును నా లంకపయికిం బోయిరి. కామరూపులగు వానరులు 'మహాబలవంతుఁడగు రాముఁడును లక్ష్మణుఁడును సర్వోత్కృష్టులయి యున్నారు. వానరరాజగు సుగ్రీవుఁడును రామునిసాయమున సర్వోత్కర్షమున నున్నాఁడు.' అని దిగ్ఘోషించుచును సింహనాదములు సేయుచును లంకాప్రాకారముమీఁదికిఁ బోయిరి. అందు వీరబాహుఁడును సుబాహుఁడును నలుఁడు ననెడి యీ వానరయూథపతులు లంకాప్రాకారమును ముట్టడించుచు విడిసిరి. ఈ నడుమ దండునకుఁ దగిన వీడుఁబట్టును నిర్మించి సేన నయ్యెవ్యూహములుగా నెలకొల్పిరి. బలవంతుఁడగు కుముదుఁడు జయశీలురయిన పదికోట్లవానరులచేఁ బరివృతుఁడై యీశానకోణమందుండి తూర్పుద్వారము నాక్రమించియుండెను. ప్రఘసుఁడును మహాబాహుఁడగు పనసుఁడును పెక్కువానరులంగూడి, యాకుముదునికి సాహాయ్యమునకై పూర్వద్వారముననే యుండిరి. వీరుఁడును బలవంతుఁడునగు శతవలి, యిరువదికోట్ల వానరులతోఁ గూడి యాగ్నేయకోణమునందుండి దక్షిణద్వారము నావరించి నిలిచెను. బలవంతుఁడును తారకు తండ్రియునగు సుషేణుఁడు, అఱువదికోట్ల వానరులతోడం గూడి, నైరృతకోణమందుండి పశ్చిమద్వారము నావరించి నిలిచెను. బలవంతుఁడగు రాముఁడు లక్ష్మణసహితుఁడై యుత్తరద్వారము నావరించి యుండెను. *వానరరాజగు సుగ్రీవుఁడును వాయవ్యకోణమందుండి యాయుత్తరద్వారము నావరించినిలిచెను. మహాకాయుఁడై చూచువారికి భయమును బుట్టించుచు, మిక్కిలి వీర్యమున వెలయు గవాక్షుఁడను గోలాంగూలుఁడు కోటిగోలాంగూలముల చేపరివృతుఁడై రాముని పార్శ్వభాగమున నిలిచెను. పగవారిని బీఁచమడంచు మహావీర్యశాలియగు ధూమ్రుఁడు కోటిభల్లూకములనుఁగూడి రాముని పార్శ్వభాగమున నుండెను. మహావీర్యశాలియు బలవంతుఁడునగు విభీషణుఁడు, కవచముదొడిగి, గద కేలం దాల్చి యుద్ధమున కాయత్తుఁడై మంత్రులంగూడి రామునితోఁడ నుండెను. గజుఁడును, గవయుఁడును, గవాక్షుఁడును, శరభుఁడును, గంధమాదనుఁడును, నలు ప్రక్కల నంతటను జుట్టితిరుగుచు వానరసైన్యమునంతయు రక్షించుచుండిరి. అంత రాక్ష

---

* సుగ్రీవుఁడు పూర్వము 'పశ్చిమేనతు రామస్య సుగ్రీవస్సహజాంబవాన్ । అదూరాన్మధ్యమే గుల్మే తస్థౌ బహుబలానుగః' అని ఉత్తరదిక్కుఁగాచు రామునకును పడమటిద్వారముగాచు హనుమంతునకు నడుమను రామునకు పడమటను అనఁగా వాయవ్యకోణమునను న్నట్లు చెప్పఁబడియున్నది. ఇట ఉత్తరద్వారము నావరించియున్నట్లు చెప్పఁబడినది. సుగ్రీవుఁడు వాయవ్యకోణమునుండి యుత్తరద్వారమును గాచినాఁడని తెలియుచున్నది. దీనింబట్టి తక్కినయూథపతులు నయ్యేకోణముల నుండి యాయాద్వారములను గాచినారని యూహింపఁదగియున్నదిగాన యట్లె వ్యాఖ్యాతమయ్యెనని తెలియునది.

నరాజగు రావణుఁడు, వానరసేనల సన్నివేశక్రమము నంతయునుజూచి, మిక్కిలియు కోపము వహించినఁగా, తన సమస్తసైన్యములను శీఘ్రముగా నపుడే యుద్ధమునకు వెడల నాజ్ఞాపించెను. రావణుని నోరనుండి యీయాజ్ఞ వెడలఁగా విన్నంతనే, రాక్షసులందఱును, భయంకరమగు ధ్వనిగలుగునట్లుగా తోడనే సింహనాదములు గావించిరి. అంత రాక్షసులందుఁ జంద్రబింబమువలె శుభ్రములైనముఖములుగలిగి భయంకరధ్వనులీనుభేరులను నలుగడల రాక్షసులు సేనాగ్రమునఁ గొంపోవుచు బంగారుకోడుపులచే వాయింపఁగా మోరుకొన్నవి. మిక్కిలియు భయంకరాకారులగు రాక్షసులు లక్షలకొలఁదిని, ముఖవాయువులఁబూరింపగా శంఖములను మహాధ్వనితో మొరసెను. ఆభరణప్రభలచే వెలుఁగుచున్న నల్లని దేహములతో శంఖములు ధరించియున్న యా రాక్షసులు, మెఱుపుపటలముతోను గొంగలతోను గూడియున్న మేఘములవలెఁ బ్రకాశించిరి. అంత రావణునిపనుపున, సైనికులు సంతుష్టులయి, ప్రళయకాలమునఁ జెలరేఁగుచున్న మహాసముద్రప్రవాహములుంబోలె బయలుదేఱిరి. అంత వానరసైనికులు, ప్రసిద్ధమగు త్రికూటపర్వతమునందలిచఱియలు నెత్తములు గుహలును వ్యాపించునట్లు నలుగడల భయంకరముగా సింహనాదము గావించిరి. బలవంతులగు రాక్షసులు గావించు సింహనాదములు శంఖదుందుభిధ్వనులతోను ఏనుఁగులఘీంకారములతోను, గుఱ్ఱముల సకిలింతలతోను రథనేమిఘోషములతోను తక్కినరాక్షసుల యార్పులతోనుగూడి, భూమ్యాకాశములును సముద్రమునంతయుఁ బ్రతిధ్వనింపఁగా, వ్యాపించినది. ఈనడుమ మున్ను దేవాసురులకుంబోలె, రాక్షసులకును వానరులకును భయంకరమయిన యుద్ధ మారంభించినదయ్యె. భయంకరులయిన యారాక్షసులు, తమపరాక్రమముల నుగ్గడించుకొనుచు, తలతలమెఱయు గదలచేతను, శక్తులచేతను, శూలములచేతను, గొడ్డండ్రచేతను వానరులను బ్రహరించిరి. (మహావీర్యవంతులగు వానరులును యుద్ధంబున రాక్షసులం బ్రహరించిరి. 'అతిబలవంతుఁడగు రాముఁడును మహాబలవంతుఁడగు లక్ష్మణుఁడును సర్వోత్కర్షమునను న్నాఁడు) రాజు సుగ్రీవుఁడు సర్వోత్కృష్టుఁడై యున్నాఁడు' అనిపెద్దధ్వని వానరసైన్యమునఁ జెలఁగుచుండెను. మహాకాయులగు వానరులు, 'రాజా! జయజయ' అని జేపెట్టుచు తమతమపేళ్లను వృత్తాంతముల నుగ్గడించుచు, నురవడిగా వృక్షంబులను బర్వతాగ్రములను వైచియు గోళ్లంజీఱియు పండ్లంగొఱికియు నారాక్షసులను హింసించిరి. భయంకరులగు మఱికొందఱు రాక్షసులు ప్రాకారముపైనుండి భిండివాలములచేతను, ఖడ్గములచేతను, శూలములచేతను నేలనున్న వానరులను తుండించిరి. క్రింద నేలపయి నున్నవానరులును మిక్కిలియుఁ గ్రుద్ధులై మహావేగులుగాన ప్రాకారాగ్రమువఱకు పయికినెగిరి యందున్నరాక్షసులను బడఁద్రోసిరి. అపుడు రాక్షసులకును వానరులకును గలిగిన యాతుములయుద్ధము నెత్తురును

మానేములును మిక్కుటమై తాంపిగొనఁగా నెందును సాటిలేక ప్రవర్తించినదయ్యె.
ఇది నలువది రెండవసర్గము.

---

## వానర రాక్షసుల ద్వంద్వయుద్ధము.

అంత మహాధీరులగు నవ్వానరు లెదురులేక యుద్ధము సేయుచుండఁగా రాక్షససైనికు లెంతమాత్రము సైఁపక మిక్కిలియు భయంకరమగు కోపావేశము నొందిరి. భయంకరకర్ములును రాక్షసశ్రేష్ఠులునగు నా రాక్షసులు రావణునికి జయముగోరుచు, బంగారు శేఖరములతో నొప్పు గుఱ్ఱములతోను, అగ్నిజ్వాలలవలె వెలుఁగుచుండు ధ్వజములతోను, సూర్యబింబమువలె ధగధగ మెఱయుచుండు రథములతోను, సుందరములగు కవచములతోనుం గూడి, దశదిశలును ప్రతిధ్వనించునట్లు సింహనాదములు సేయుచు, యుద్ధమునకు బయలువెడలిరి. మిక్కిలి గొప్పదియగు వానరసేనయును, జయముగోరి, కామరూపులగు నా రాక్షసులసేన పయికి నతివేగమునఁ దలపడెను. ఇట్లు రాక్షసులును వానరులును ఒండొరులమీఁదికిఁ గవియుచుండఁగా, ఇందు నడుమ నిరుప్రక్కలవారికిని ద్వంద్వయుద్ధము జరిగినది. మహాతేజుఁడగు నింద్రజిత్తు వాలికుమారుఁడగు నంగదునితో ముక్కంటితో మృత్యువుపోరునట్లు, యుద్ధముగావించెను. యుద్ధంబున శత్రువులకెప్పుడును సహింప నలవిగాకుండు విభీషణసచివుఁడు సంపాతి ప్రజంఘునితోఁ బోరెను. హనుమంతుఁడును జంబుమాలిని రూపుమాప నుంకించెను. రావణునితమ్ముఁడగు విభీషణుఁడు మిక్కిలియును వెనుగోపము మీఱ, అతితీవ్రవేగుఁడయిన మిత్రఘ్నుఁడను రాక్షసునితోఁ దలపడి యుద్ధముచేసెను. మహాబలుఁడగు గజుఁడు తపనుఁడను రాక్షసునితోఁ బోరెను. మహాతేజుఁడగు నీలుఁడు నికుంభునితోడ యుద్ధముగావించెను. వానరరాజగు సుగ్రీవుఁడు, ప్రఘసుఁడను రాక్షసునిపై కవిసెను. శ్రీమంతుఁడగు లక్ష్మణుఁడు విరూపాక్షునితో యుద్ధముగావించెను. దుర్ధర్షుఁడగు నగ్నికేతుఁడును రశ్మికేతుఁడును సుప్తఘ్నుఁడును యజ్ఞకోపుఁడును, రామునితో యుద్ధముగావించిరి. వజ్రముష్టియను రాక్షసుఁడు, మైందునితోను, అశనిప్రభుఁడనువాఁడు ద్వివిదునితోను, ఇట్లు ఇయ్యిరువురు కపిముఖ్యులు మిక్కిలి భయంకరులగు నీయిద్దఱు రాక్షసులతోఁ దలపడిరి. వీరుఁడును భయంకరుఁడునై యుద్ధంబున నిగ్రహింప నలవిగాకుండు ప్రతపనుఁడను రాక్షసుఁడు యుద్ధమునఁ దీవ్రప్రతాపుఁడగు నలునితో యుద్ధముగావించెను. బలవంతుఁడును ధర్మపుత్రుఁడునగు మహాకపి సుషేణుఁడనువాఁడు, విద్యున్మాలితో యుద్ధముగావించెను. మఱియు భయంకరాకారులగు వానరులు పెక్కండ్రు, ఇతర రాక్షసులు పెక్కండ్రతో నానావిధముల ద్వంద్వయుద్ధము గావించిరి. అపుడచ్చట వీరులై యొండొరులను గెలువఁగోరుచున్న యా రాక్షసులకును వానరులకును గగుర్పాటుఁబుట్టించునట్లు తుముల

ముగా యుద్ధము జరిగినది. ఆయుద్ధమున వానరరాక్షసదేహములనుండి, వెండ్రుకలె పచ్చికలుగాను, దేహావయవములే కాష్ఠసంచయములుగాను గలవై యవ్వారిగా రక్తనదులు ప్రవహించినవి. ఇంద్రజిత్తు క్రుద్ధుఁడై దేవేంద్రుఁడు వజ్రమునుగొన్నట్లు తానుగదను జేకొని, పగవారిసైన్యములఁ బటాపంచలు సేయు వీరుఁడగు నంగదునిఁ బ్రహరించెను. అంత శ్రీమంతుఁడును మహావేగుఁడునగు నంగదుఁడు కాంచనచిత్రితం బగు నంగములు గలయా యింద్రజిత్తురథమును సారథితోను గుఱ్ఱములతోనుగూడ నుగ్గుగావించెను. ప్రజంఘుఁడు సంపాతిని మూఁడుబాణములచే నొప్పింపఁగా, నాతండు యుద్ధంపు మొనను నినుమద్దిచెట్టువైచి ప్రజంఘుని వధించెను. మహాబలుఁడగు జంబుమాలి రథగతుఁడై యుద్ధమునఁ గ్రుద్ధుఁడై రథముమీఁదనే మెలఁగుచుండుశక్తిం జేసి హనుమంతుని వక్షస్స్థలమును భేదించెను. వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు త్వరితముగాఁ దా నాజంబుమాలిరథముమీఁది కుఱికి యా రాక్షసునిని రథమును నఱచేతం జఱిచెను. భయంకరుఁడగు నాప్రతపనుఁడు గర్జించుచు నలునిపయికి నడరెను. ప్రతపనుఁడు హస్తలాఘవము గలవాఁడుగావున వాఁడిబాణముల నలునియవయవముల గ్రుచ్చఁగా ఆనలుఁడు నతిశీఘ్రమున వానికన్నులంబెఱికివైచెను. వానరేశ్వరుఁడగు సుగ్రీవుఁడు సైన్యమునంతయు మ్రింగునట్లు నోరుదెఱచుకొని వచ్చుచున్న ప్రఘసుని, ఒకయేఁడాకుల యరఁటిచెట్టునఁ బ్రహరించి చంపివచ్చెను. దుర్ధర్షుఁడగు నగ్నికేతుఁడును రశ్మికేతుఁడును సుప్తఘ్నుఁడును యజ్ఞకోపుండును రామునిం బెక్కుబాణముల గాఁడనేసిరి. రాముఁడు, అగ్నిజ్వాలలవంటి నాలుగు వాఁడిబాణములచే, ఆ నలుగురు రాక్షసుల తలలను ద్రుంచెను. మైందుఁడు యుద్ధమున వజ్రముష్టిని పిడికిటం బొడువఁగా వాఁడు రథముతోను అశ్వములతోనుగూడ పట్టణపుఁగోటబురుజువలె నేలంగూలెను. సూర్యుఁడు కిరణములచే మబ్బును భేదించునట్లు, నికుంభుఁడు కాటుకరాసివలె నల్లనిచాయ దొలఁకునీలుని యుద్ధమున వాఁడిబాణములేసి నొంచెను. ఆనికుంభుఁడు చుఱుకుచేయిగలవాఁడు గాన మరల నూఱుబాణముల నీలుని యుద్ధంబుననొప్పించి కేరినవ్వెను. నీలుఁడు యుద్ధమున విష్ణుదేవుఁడునుంబోలె, ఆనికుంభునిరథచక్రమునే కొని వానిసారథితలను తెగనేసెను. వజ్రమునకును బిడుగునకును సాటియగు గాత్రస్పర్శముగల ద్వివిదుఁడును, రాక్షసులందఱును చూచుచుండఁగా యుద్ధంబున, అశనిప్రభుఁడనువానిని, పర్వతశిఖరముగొని ప్రహరించెను. అశనిప్రభుఁడు, పర్వతములచేఁ బోరుచున్న వానరోత్తముని ద్వివిదుని, పిడుగులంబోని వాఁడిబాణముల గాఁడనేసెను. ద్వివిదుఁడు మేనంతయు బాణములు గాఁడఁగా నొచ్చి మిక్కిలియుఁ గుపితుఁడై సాలవృక్షమున నాయశనిప్రభుని రథముతోను నశ్వములతోనుం గూడఁ గొట్టివధించెను. విద్యున్మాలి రథముననుండి బంగారుచే నలంకృతములయిన బాణములచే సుషేణునిఁ బ్రహరించి, మాటిమాటికి సింహనాదములు గావించెను.

అంత వానరోత్తముఁడగు సుషేణుఁడు, జంబుమాలి రథంబున నుండుటయు తాను క్రిందనుండుటయుం జూచి పెద్దపర్వతశిఖరమును వేసి వానిరథమును వేగ నుగ్గు గావించెను. రాక్షసుఁ డావిద్యున్మాలి మిక్కిలియు లాఘవముగలవాఁడు గావున గద చేతంగొని శీఘ్రమున రథముననుండి దూకి నేలపయి నిలిచెను. అంత వానరశిరోమణియగు సుషేణుఁడు కోపము మిక్కిలియుం బయిగొన పెద్దఱాతి నొకటిం గొని విద్యున్మాలిపయి వేగవచ్చెను. వానరశ్రేష్ఠుఁడగు సుషేణుఁడు అట్లు పయిని వచ్చుచుండుటంజూచి విద్యున్మాలి గదచే నతనిఱొమ్మునఁ గొట్టెను. వానరోత్తముఁడగు నా సుషేణుఁడు ఆ గదపెట్టును సరకుసేయక గొప్పయుద్ధము సలుపుచు విద్యున్మాలి ఱొమ్మపయి నాశిలను బడవైచెను. రాక్షసుఁడు విద్యున్మాలి ఆ ఱాతిదెబ్బ దగిలి ఱొమ్మంతయు నజ్జుగుజ్జుకాఁగా, ప్రాణము లెడలి నేలంబడెను. ఇట్లు శూరులగు నా వానరులు శూరులయిన యారాక్షసులను దేవతలు దైత్యులనుంబోలె నా ద్వంద్వయుద్ధంబున నలియఁగొట్టిరి. అప్పు డాయుద్ధభూమి తునిసిపడినఖడ్గములును గదలును శక్తులును తోమరములును పట్టిసములును గలిగి, విఱిగినరథములును నఱుకంబడిన యుద్ధయోగ్యములగు గుఱ్ఱములును, హతములయిన మదగజములును, గూలిన వానరరాక్షసులును, భగ్నములై నేలంబడియున్న చక్రములును బండికన్నులును గాఁడిమ్రానులును, గలిగి నక్కగుంపులచే నెరసి బెరసి, చూచుటకు భయంకరముగా నుండెను. దేవాసురయుద్ధమునకు సాటియైన యాదొమ్మియుద్ధమున వానరులయు రాక్షసులయు మొండెములు నలుదిక్కుల నెగిరి పడుచుండెను. అప్పుడు రాక్షసులు వానరవరులు తమ్ముఁ బట్టి త్రుంచుచుండఁగా, దేహములంతయు నెత్తుటం దొప్పదోఁగ తమకు బలకరమగు సూర్యాస్తమయము నెదురుసూచుచు, బలవంతముగా పెనుయుద్ధము గావించుచుండిరి. ఇది నలువదిమూఁడవసర్గము.



## రాత్రియుద్ధము.

ఆ వానరులును రాక్షసులును అట్లు యుద్ధము సేయుచుండఁగానే యపుడు సూర్యుఁడస్తమించెను. అంత వానరులకుఁ బ్రాణహారిణి యగు రాత్రియుఁ బొడతెంచినది. అప్పుడు పరస్పరబద్ధవైరులై భయంకరాకారులై యొండొరులం గెలువఁగోరుచున్న యావానరులకును రాక్షసులకును రాత్రియుద్ధము జరిగెను. భయంకరమైన యా యంధకారమునందు వానరులు రాక్షసుఁడని వానరుని, రాక్షసుని వానరుండని రాక్షసులును, నిట్లు గన్నుదెలియక యుద్ధమున నొకరినొకరు గొట్టుకొనిరి. 'చంపు; చీల్పుము; ఇటురా; ఏల పరుగెత్తెదవు.' అని యి ట్లాయంధకారమునందు మిక్కిలియు తుములమయినమహాధ్వని వినఁబడినది. ఆ చీఁకటిని నల్లనిమేనులుగలిగి బంగారు కవచములు దొడిగియున్న రాక్షసులు రాత్రులు జ్వలించునట్లు మెఱయుచుండ నోష

ధి వనములతోఁగూడిన మేటిపర్వతములవలెఁ జూపట్టుచుండిరి. అనంతమగు నాయంధకారమున, రాక్షసులు క్రోధపరవశులై, మహావేగమున వానరుల భక్షించుచు యుద్ధభూమిని విహరించుచుండిరి. ఆ వానరులును బెడిదంబగు కోపమునొంది పయికెగసి, తీక్ష్ణములైన తమపండ్లచే బంగారు శిరోభూషణములుగల గుఱ్ఱములను, అగ్నిజ్వాలలవలెఁ బ్రకాశించుచున్న ధ్వజములను, జీల్చివైచిరి. బలవంతులగువానరులు క్రోధమూర్ఛితులై, యేనుంగులను, ఏనుఁగులపయి నున్నవారిని, పతాకలును ధ్వజములును గట్టిన రథములనును, నీల్చివైచి, పండ్లం గొఱికి యిట్లు యుద్ధమున రాక్షససైన్యమును నానావిధంబులఁ గలఁచివుచ్చిరి. రాముఁడును లక్ష్మణుఁడును నపుడు చక్కఁగాఁ గానరాక క్రొంచెము కనఁబడుచున్న మేటిరాక్షసులను వెక్కండ్రను క్రూరసర్పములంబోని వాఁడి బాణముల వధించిరి.అప్పుడు గుఱ్ఱపుగొరిజ త్రొక్కుళ్లచే పొడిపొడియై, రథచక్రముల తిరుగుళ్లచే పయికి రేఁగిన నేలదుమ్ము యుద్ధము సేయుచున్న వారిచెవులను గన్నులను గ్రమ్మెను. అట్లు చూచువారికి గగురుబుట్టించునట్లు మహాభయంకరముగా యుద్ధముజరుగుచుండఁగా ఆ యుద్ధభూమిని మహాభయంకరములయిన రక్తనదులు ప్రవహించినవి. అంత భేరీమృదంగములయు, పణవములయు ధ్వనులును, శంఖములయు వేణువులయు ధ్వనులును,గలసి యొందును సాటిలేనియట్లు వింతయై వినవచ్చినవి. వానరులచేఁ గొట్టువడి కూయిడుచున్న రాక్షసులయు, రాక్షసులచే హింసితులై యఱచుచున్న వానరులయు ధ్వనులు, మిక్కిలిభయంకరముగా చెలంగుచుండెను. అప్పు డాయుద్ధభూమియందు రాక్షసుల శక్తిశూలములచేతను గొడ్డండ్రచేతను హతులయి కూలిన వానరవీరులును, వానరులువైచిన పర్వతశిఖరములచే హతులయి త్రెళ్లిన కామరూపులగు రాక్షసులును, కుప్పలుగొనియు, నానావిధములయిన యాయుధములు పుష్పబలులు చల్లినట్లు నెరసియు,నుండుటచే నది తెలియుట కష్టమై, నెత్తుటం దడిసి బురదగొని యుండుటచే ప్రతియోధుల ప్రవేశించుట కశక్యమై యుండెను. ఘోరమై వానరరాక్షసుల ప్రాణముల హరించుచున్న యారాత్రి *కాళరాత్రియుంబోలె సమస్తప్రాణులకును గడచిపుచ్చరాక నీక నెట్లు తెల్లవాఱునో యనునట్లు భయముగలిగించినదయ్యె. అంత నపుడు భయంకరమైన యాయంధకారమున, నారాక్షసులు బాణవర్షములు గురియించుచు రామునిపయిఁ దలపడిరి. ఆ రాక్షసులు క్రుద్ధులయి గర్జించుచు రామునిపయి నడరుచుండఁగా,ఆధ్వని ప్రళయకాలమున నుప్పొంగివచ్చు సప్తసముద్రములధ్వనియుంబోలె భయంకరమై వినవచ్చినది. రాముఁ డొక్కటెప్పపాటున ఆ రాక్షసులలో నార్వురను అగ్నిజ్వాలలవలె నతితీక్ష్ణములయిన యాఱుబాణములచే నొప్పించెను. ధర్షింపరాని యమశత్రుండును, మహాపార్శ్వుఁడును,

* ఇట కాళరాత్రియనఁగా భీమరథిరాత్రి. 'రాత్రి ర్భీమరథిర్నామ సర్వప్రాణిభయావహా' అనియున్నది. లేక 'సతీచ కాళరాత్రిశ్చ భైరవీ గణనాయికా' అన్నట్లు శక్తియుఁగావచ్చునని తెలియునది.

మహోదరుఁడును, మహాకాయుఁడగు వజ్రదంష్ట్రుఁడును, రావణునిచే నుత్తరద్వారము గాను నియుక్తులయిన యాశుకసారణు లిరువురును, ఇట్లు మున్ను చెప్పఁబడిన యారాక్షసప్రముఖులును, రాముఁడు మర్మములందెల్ల బాణసమూహములఁ జొప్పించి నొప్పింపఁగా, నంత యుద్ధమునుండి తొలఁగి కొంతయాయుస్సును దక్కించుకొన్న వారయిరి. మహాబలుఁడగు రాముఁడు అంధకారమున బంగారుచే నందంద చిత్రితములయి యగ్నిజ్వాలలవలె వెలుఁగు బాణములను బరపి దిక్కులను విదిక్కులను వెలుతురు గలుగఁ జేసెను. (ఆ యుద్ధమండలము రామనామాంకితము లయిన బాణములచే వ్యాప్తమయ్యెను) భయంకరాకారులగు రాక్షసులు మఱియు నెవ్వరెవ్వరు రాముని నెదుర్కొని నిలిచిరో వారందఱును నగ్నియందు బడుమిడుతలవలె నాశమునొందిరి. బంగారు పింజలు గల బాణములు వేలకొలఁదిని ప్రయోగింపఁబడుచుండుటవలన, ఆరాత్రి, మిడుఁగుఱుఁగురువులతోఁగూడిన శరత్కాలపురాత్రివలె విలసిల్లుచుండెను. ఇంతకే యారాత్రి భయంకరముగానుండెను. ఇపుడో రాక్షసులును వానరులును జేయుచున్న సింహనాదములచే నది మఱింత భయంకరమయ్యెను. ఆగొప్పధ్వని పయింబయివర్ధిల్లి యంతటను వ్యాపింపఁగాఁ బెక్కుగుహలు నెరసియున్న త్రికూటపర్వతము ప్రతిధ్వనులు చేయుచు బదులు మాటలాడినట్టు చూపట్టినది. మహాకాయులై చీఁకటివలె నల్లనిచాయదొలఁకుచుండు కొండముచ్చులు, రాక్షసుల రెండుచేతుల నిఱియంబట్టుకొని భక్షింపసాగిరి. అంగదుఁడు యుద్ధమునం దనకు ప్రతియగు నింద్రజిత్తును వధింపఁబూని వేగమ వానిని బ్రహరించి, వానిసారథిని గుఱ్ఱములనుంగూడఁ గొట్టిచంపెను. అప్పుడట్లు మహాదారుణముగాను భయంకరముగా యుద్ధము జరుగుచుండఁగానే, మహాకాయుఁడగు నింద్రజిత్తు మాత్రము అంగదునిచే గుఱ్ఱములును సారథియు జచ్చినందున, రథమునువిడిచి యచ్చటనే యంతర్ధానమునొందెను. అంగదుఁడు పొగడ్తకుం దగినట్లు గావించినయాకార్యమునకు దేవతలును ఋషులు నందఱును, ఆ రామలక్ష్మణు లిరువురును, స్తోత్రములుసేసిరి. సమస్త భూతములకును యుద్ధమున నింద్రజిత్తుప్రభావము దెలియును: (వాఁ డదృశ్యుఁడై సర్వభూతములకును యుద్ధమున జయింపఁ దరముగాకుండెను.) కావున వా రట్టిమహాధీరుఁడుగూడ నంగదునిచే ధర్షింపఁబడుటంజూచి సంతుష్టినొందిరి. అంత సుగ్రీవుఁడును, విభీషణుఁడును, వానరులును, పగవాఁడగు నింద్రజిత్తు ధర్షింపఁబడుటనుజూచి మిక్కిలియు సంతుష్టులై యంగదుని 'బాగు బాగ'ని బిగ్గఁ గొనియాడిరి. అపుడు ఇంద్రజిత్తు, అట్లు భయంకరపరాక్రముఁ డగునంగదునిచే యుద్ధంబునఁ బరాజితుఁడై మిక్కిలియు దారుణమయినకోపము నవలంబించెను. ఈ నడుమ రాముఁడు వానరులంజూచి 'మీరందఱును వానరరాజగు సుగ్రీవునితోఁగూడ నెచ్చరికతో నుండుఁడు. ఆ యింద్రజిత్తు బ్రహ్మవలన వరమునొంది ముల్లోకములును మిక్కిలియు బాధించుచున్నాఁడు. ఇప్పుడు వీనికి మృత్యువు సమీపించుటవలన వీనిని రూపుమాపవలయునను మీకార్యము

సిద్ధించుటకై వచ్చినాఁడు. ఇప్పుడుమాత్రము మీరు నాకుఁగా నోర్చియుండవలయును. మీరేమి తుందుడుకు పడవలదు' అనెను. పాపాత్ముఁడై యుద్ధమునందు గడిదేఱియున్న యాయింద్రజిత్తు అంతర్ధానవిద్యచే నదృశ్యుఁడై, పిడుగులవంటి మిక్కిలి వాఁడిబాణములను బ్రయోగించెను. ఆ రాక్షసుఁ డింద్రజిత్తు, యుద్ధంబునఁ గ్రుద్ధుఁడై, రాముని లక్ష్మణుని సర్పరూపములయిన బెడిదంపు బాణములును సమస్తావయవములందును గాఁడనేసి నొప్పించెను. అపుడు, ఆ యింద్రజిత్తు కపటయుద్ధము నేయువాఁడై మాయ నవలంబించి సమస్తభూతములకును నదృశ్యుఁడై యుద్ధంబున రఘుకులోద్భవులగు రామలక్ష్మణులను మోహము నొందించుచు, ఆయన్నదమ్ములఁ బాణములచే బంధించెను. అట్లు క్రుద్ధుఁడై యాయింద్రజిత్తు సర్పమయములగు బాణములచే తటాలునఁ గాఁడనేసి బంధింపఁగాఁ బురుషసింహములయిన యావీరులు రామలక్ష్మణు లిరువురును పరవశులగుట నపుడు వానరులు చూచిరి. రాక్షసరాజగు రావణుని పుత్త్రుండగు నాయింద్రజిత్తు, స్పష్టముగాఁ దా నెదుటనిలిచి రామలక్ష్మణుల బాధింప నశక్తుఁడయి మిక్కిలి బుద్ధిమంతుఁడు గావున మాయను బ్రయోగించుటకుఁ దొడంగి యా రాజకుమారులను బంధించినవాఁడయ్యె. ఇది నలువదినాలుగవసర్గము.



### ఇంద్రజిత్తు నాగపాశముల రామలక్ష్మణులను బంధించుట.

ప్రతాపవంతుఁడును మహాబలుండు నగు నా రాజపుత్త్రుఁడు రాముఁడు, ఆయింద్రజిత్తున్నచోటును దెలియఁగోరి వానరయూథపతులను పదుగురి నాజ్ఞాపించెను. ఆపరంతపుఁడు రాముఁడు, సుషేణుని కొడుకులిద్దఱిని, వానరశ్రేష్ఠుండగు నీలుని, వాలిపుత్త్రుం డంగదునిని, బలవంతుఁడగు శరభునిని, వినతుని, జాంబవంతుని, మహాబలశాలియగు సానుప్రస్థుని, ఋషభుని, ఋషభస్కంధుని, ఇట్టి పదుగురిని నింద్రజిత్తున్నచోటు దెలిసి రా నాజ్ఞాపించెను. ఆ వానరులందఱును మిక్కిలియు సంతుష్టులై పెట్టిదములగు వృక్షములనుగొని, దశదిశలందును నింద్రజిత్తును వెదకుటకై యాకాశమున కుద్గమించిరి. ఇంద్రజిత్తు ఆ వానరులు మిక్కిలి వేగవంతులయ్యును, దా నస్త్రంబులనెల్లఁ దెలిసినవాఁడుగాన యంతకన్న వేగము గలపరమాస్త్రరూపములగు బాణములచే నట్టివారి వేగమును నివారించెను. ఆ వానరులు భయంకరవేగముగలవారయ్యును, బాణంబులచే తమగాత్రములుభిన్నములై, మబ్బులచే గ్రమ్మఁబడిన సూర్యుంబుఁబోలె నంధకారంబునున్న యాయింద్రజిత్తును గానరయిరి. యుద్ధముల జయశీలుఁడయిన యాయింద్రజిత్తు సమస్తావయవములను మిక్కిలియు భేదించునట్టి కఱకుబాణములను రామలక్ష్మణులమీఁదనే గుఱిపెట్టి ప్రయోగించెను. ఇంద్రజిత్తు అట్లు క్రుద్ధుఁడై వీరులగు నాయన్నదమ్ముల రామలక్ష్మణులపయి బాణరూపములగు సర్పములను వేయఁగా వారిదేహములు సూదిమోపనుగూడ నవకాశము లేకుండెను. ఆ రామలక్ష్మణుల

గంట్లదారిని మిక్కిలియు *నెత్తురుగాఱెను. అప్పుడు వారిరువురును, పూచినమోదుగుచెట్లవలెఁ బ్రకాశించిరి. అంత విరిసినకాటుకరాశివలె మిక్కిలియు నల్లనైన యింద్రజిత్తు, అంతర్ధానగతుఁడై యించుకకోపమునఁ గడకన్నులెఱ్ఱఁబాఱ, ఆయన్నదమ్ముల రామలక్ష్మణులం జూచి 'నే నదృశ్యుండనై యుద్ధముసేయుచుండఁగా, త్రిదశనాథుఁడగు నింద్రుఁడుగూడ, నన్నుఁజూచుటకుఁగాని నిరూపించుటకుఁగాని శక్తుఁడుగాఁడు. ఇఁక కేవలమనుష్యులగు మీయిరువురసంగతి చెప్పనేల? రామలక్ష్మణులారా! కోపంబు పయిఁకొనియున్న నేను, కంకపక్షి ఱెక్కలు గట్టినబాణములసమూహములచే మఱియును మీయిరువురను గప్పి, యిదిగో యిపుడే యమపురికిఁ బంపెదను. నాకోపము వ్యర్థముగాదు' అనెను. ఆయన్నదమ్ములు రామలక్ష్మణు లిరువురును ధర్మజ్ఞులుగాన శబ్దమును గుఱిపెట్టి యేయువారలుగారు. కనుక నా యింద్రజిత్తు దా నిట్లుచెప్పి వారిద్దఱను వాఁడిబాణములఁ గాఁడనొప్పించి మిక్కిలియు నుబ్బి సింహనాదము గావించెను. విరిసినకాటుకరాశివలె నల్లనగు నా యింద్రజిత్తు, అమ్మహాయుద్ధమున విశాలమగువింటిని సారించి మాటిమాటికి తీక్ష్ణములయిన బాణములం బ్రయోగించెను. అంత వీరుఁడా యింద్రజిత్తు, ఆయపట్టులఁ జక్కఁగా నెఱింగినవాఁడుగాన రామలక్ష్మణుల మర్మస్థానములందు మిక్కిలివాఁడియగు బాణములునాటి మాటిమాటికి సింహనాదముసేసెను. ఆ రామలక్ష్మణు లిరువురును యుద్ధాగ్రమున శరబంధమునఁ గట్టువడి క్షణమాత్రమునఁ గన్నెత్తి చూచుటకుఁగూడ నశక్తులయిరి. అంత గొప్పవిలుకాండ్రును వీరులు నగునాభూవరులు రామలక్ష్మణు లిరువురును, బాణముల యలుఁగులెక్కి సమస్తావయవములును నొవ్వఁగా, మర్మస్థానములందును బాణములు నాటుటచే మిక్కిలియు స్రుక్కి, యెంతయు చలనమునొంది, దారము లూడ్పఁబడఁగా నెంతయు నుర్లిపడు నింద్రధ్వజములవలె నేలంబడిరి. ఆ వీరు లిరువురును, బాణరూపములగు సర్పము లవయవములందెల్లఁ బెనఁగొన బద్ధులయి

---

* 'నభూతసంఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః। నతస్య ప్రాకృతామూర్తి ర్మాంసమేదోఽస్థిసంభవా' అన్నట్లు రామలక్ష్మణుల దివ్యవిగ్రహములు అప్రాకృతములుగావున నెత్తురువచ్చుట యెట్లన్నచో వాస్తవమునకు నెత్తురులేకున్నను మనుష్యత్వమును భావించుటకు ననుగుణముగా నటునివలె నెత్తుటఁజూపిరని తెలియునది. అయిన నిట్లు సర్వాంశములో మనుష్యభావము నభినయించుటవలనఁ బ్రయోజనమేమి? యన్నచో సర్వవిధముల మనుష్యభావమునే యభినయింపనియెడల జనులు 'ఇతఁడు మనుష్యుఁడుగాఁడు దేవుఁడు కాన యితనివలె మనకు ధర్మములననుష్ఠించుట శక్యముగా' దని తలంతురు. సర్వవిధముల మనుష్యభావము నభినయించుచు మహాజనులయనుష్ఠానమును జేసి చూపుటచే లోకులు తామును నట్లె యనుష్ఠింతురని రహస్యము. రావణుఁడు మనుష్యుఁ డొక్కనిచేతనే వధ్యుఁడగుటవలన నట్లు మనుష్యత్వము భావించుటయనియు నందురు. నాగపాశబద్ధులై యుండుట ధర్మనిరతులయినవారికిని ఆపద లొకప్పుడు గలుగుచు తోడనే నివర్తించునని లోకమునకుఁ దెలుపుకొఱకె. ఇట్లే రాముని మోహాదులకును కారణము తెలియునది.

నెత్తుటఁ దొప్పఁదోఁగి,వీరశయనంబగు యుద్ధభూమిని శయనించి మనంబునసలఁగుచు, మేనెంతయు నొవ్వఁగదురగా నుండిరి. వారియవయవములందు నిలువెల్ల చేతిమొనల వఱకును, బాణములు గ్రుచ్చుకొననిదియు నిశ్చలముగానిదియు భిన్నముగానిదియు అంగుళమంత చోటుగూడ లేదయ్యెను. కామరూపియగు నా రాక్షసుఁడు క్రూరుఁడై యట్లు బాణములఁగొట్టఁగా రామలక్ష్మణుల దేహములనుండి సెలయేటి (ప్రస్రవణము) నుండి నీరుగాఱునట్లు, అతివేగముగా నెత్తురు మిక్కిలియుం గాఱినది. ముందు నింద్రుని జయించి యింద్రజిత్తను పేరువడసిన యా రాక్షసుఁడు క్రుద్ధుఁడై మర్మములందు బాణములను గ్రుచ్చఁగా, మొదట రాముఁడు నేలంబడెను. వాఁడు నాగాస్త్రమును ప్రయోగించినపిదప చక్కనై గుండ్రనిమొనలు గలనారాచములను, నడుమనగము తునిఁగిననారాచములవలెనుండు నర్ధనారాచములను, గొడ్డలివంటిమొనలుగల భల్లములును, అంజలివంటి యగ్రములుగల యంజలికములును, వత్సదంతములవంటి కొనలుగల బాణములును, సింగపుకోఱలవంటి కొనలుగల సింహదంష్ట్రములను, మంగలికత్తివంటి మొనలు గలక్షురములును, ఇట్లు బంగారుపింజలుగలిగి కొనలుతీటఁబడిన యీబాణములనెల్ల పయినుండి క్రిందికింబరపి, రామునిగాత్రము నొప్పించెను. ఆ రాముఁడు, పిడికిలిపట్టు శిథిలమై, నడుమను బ్రక్కలనువంగి, రత్నములచేరంగారు తనవింటిని నూని, యుద్ధభూమిని బరుండెను. అంత నచ్చట శరతల్పమునం బడియున్న పురుషసింహుని రామునింజూచి లక్ష్మణుఁడు బ్రతుకుపయి నాశవిడిచెను. లక్ష్మణుఁడట్లు తామరరేకులవంటికన్నులు గలతనయన్న రాముఁడు, బాణంబులు గాఁడి బంధింపఁగా, నేలంబడియుండుటను జూచి మిక్కిలియు దుఃఖించెను. వానరులు నట్లతండు పడియుండుటనుజూచి మిక్కిలియు సంతాపమును బొందిరి. హనుమంతుఁడు మొదలయిన యావానరులందఱును గూడి యట్లు నాగపాశబద్ధులయి పడియున్న యావీరులం బరివేష్టించి నిలుచుండి యార్తులయి మిక్కిలియు దుఃఖించిరి. ఇది నలువదియేనవసర్గము.



సుగ్రీవ విభీషణాదులు నాగపాశబద్ధులగు రామలక్ష్మణుల యవస్థంజూచి దుఃఖించుట; ఇంద్రజిత్తు సుగ్రీవాదుల నొప్పించుట; విభీషణుఁడు సుగ్రీవునాశ్వాసించుట; ఇంద్రజిత్తు రామలక్ష్మణులఁ జంపివచ్చితినని రావణునితోఁ జెప్పుట.

అంత వానరులాకాశమును భూమినిం జూచుచు అట్లు బాణములు మేనంతయుఁ బర్వి పరుండి యున్నయాయన్నదమ్ములను రామలక్ష్మణులనును జూచిరి. వర్షముగురిసి నిలిచియున్న మేఘమువలె, ఇంద్రజిత్తు శరవర్షము కురిసి యుడిగినవెనుక, రాముండున్న యాప్రదేశమునకు విభీషణుఁడును సుగ్రీవుఁడును వచ్చిరి. అంతకుమునుపే, హను

షభుండును, నీలుఁడును, ద్వివిదుఁడును, మైందుఁడును, సుషేణుఁడును, కుముదుఁడును, అంగదుఁడును, వచ్చుటచే వచ్చియుండి రామలక్ష్మణులంజూచి మిక్కిలియు దుఃఖించుచుండిరి. ఆ రామలక్ష్మణులు చేష్టలుడిగి, యిట్టట్టు కదలక మెదలక నడుమనడుమ మెల్లగా నూర్పులువిడుచుచుమునుముక్కునుచుము చేష్టలుమీఱుచు నెత్తుటిచెల్లువ వడయుచున మెల్లఁ దొప్పఁదోఁగ, దేహమంతయు బాణసమూహములు వర్వియుండఁగా, ఒక్కొక్కప్పుడు సర్పములవలె నిట్టూర్పులువుచ్చుచు, పరాక్రమము నుండటచే, అంగములెల్ల నెత్తుటందడిసి మొత్తని యుండుటచే బంగారుధ్వజములవలెఁ జూపట్టుచు శరతల్పంబులఁ బరుండియుండిరి. అట్లు ఆ వీరులు ఒక్కొకప్పుడు సల్లల్ల కాలుసేతులు మెదల్చుచు, బాణసమూహములు దేహమంతయు వ్యాపించియుండఁగా, అయాయూథపతులు కన్నులనిండ కన్నీళ్లు కలగొనఁ దమ్ముఁబరివేష్టించియుండఁగా; యుద్ధభూమినిబడి పరుండియుండుటను, విభీషణుఁడును వానరులు నందఱునుజూచి మిక్కిలియు మనములఁ గంది కుందిరి. ఆ వానరులు యుద్ధరంగముననుండి, యాకాశమును దిక్కులనన్నిటిని వెదకినను, మాయచేత మఱుఁగుపడియున్న యింద్రజిత్తును జూడఁజాలరయిరి. విభీషణుఁడు మాయచేత నాచ్ఛాదితుఁడయిన తనయన్న కొడుకు నింద్రజిత్తును, నలుగడలంజూచుచు, నంత మాయచే మఱుఁగుపడియున్నవానినిఁ గనుఁగొనుమాయావిద్య నవలంబించి వాఁడొక్కచోనుండఁ గాంచెను. వీర్యకర్మంబుల నెందునుసాటిలేకయు యుద్ధంబున నెదురులేకయు, వరదానబలమున నంతెర్హితుఁడై తేజంబును యశంబును పరాక్రమమును మిక్కిలి గలిగియున్న వీరుండా యింద్రజిత్తు, విభీషణునకుఁ జూపట్టినవాఁడయ్యె. ఇంద్రజిత్తు తననాగాస్త్రబంధనకర్మమును రామలక్ష్మణులట్లు పరుండియుండుటనుం, జూచి, మిక్కిలియు సంతుష్టుఁడై, రాక్షసులనందఱిని సంతోషపెట్టుచు వారితో 'దూషణుని ఖరునిని జంపిన మహాబలులయిన యన్నదమ్ములు రామలక్ష్మణులు నాబాణములచే బ్రుక్కినారు చూడుఁడు సురలును అసురులు, ఋషిసమూహములు నందఱు నొక్కటిగాఁ గూడి వచ్చినను వీరిద్దఱను ఈ నాగపాశముల కట్టునుండి విడిపింప శక్యముగాదు. ఎవ్వనిపౌరుషమునకు భయపడి నాతండ్రి రావణుఁడు దుఃఖార్తుఁడై రాత్రి మూఁడు జాములలో నొక్కజామయినను నిదురపట్టమిచే పడుకను మేనితో ముట్టకయే చింతించుచునే ప్రొద్దుగడపునో; మఱియు నెవ్వనినిమిత్తమై యీ లంకలోని జనమంతయు, వర్షాకాలములందు నదీజల మాకులమగునట్లు వ్యగ్రమైయున్నవో, అట్టివానిని, మనలనెల్ల సమూలముగా నాశము సేయ నవకమున కొడిగట్టిన రాముని, నే నిదో వధించివుచ్చితిని. రాముఁడును లక్ష్మణుఁడును సమస్తవానరులును సేతుబంధాదులచేఁ జూపిన పరాక్రమములన్నియు శరత్కాలమున మబ్బులంబోలె నిష్ఫలములయ్యెనవి' అనెను. ఇంద్రజిత్తు ఇట్లు తనముట్టుఁబ్రక్కలనున్న, రాక్షసులకెల్లను జెప్పి, యంత నా సుగ్రీవాది వానరయూథపతులనుగూడ నందఱను బాణముల నొప్పించుచు నగరాభిముఖుండగుచు నాయింద్రజిత్తు నీలుని తొమ్మిదిబాణముల నొప్పించి మైందద్వివిదుల



1463. రాత్రియుద్ధము ; ఇంద్రజిత్తుయొక్క నాగపాశములచే రామలక్ష్మణులు మూర్ఛితులగుట ; విభీషణుఁడు దీపము నెత్తుకొని వెదకుట.

లనొక్కొక్కరిని మూఁడేసి మూఁడేసి మేటిబాణములేసి తపింపఁజేసెను. ఆగొప్ప విలుకాఁడు జాంబవంతుని ఱొమ్మున నొక్కబాణము గాఁడనేసి వేగవంతుఁడగు హనుమంతునిపై పదిబాణములు ప్రయోగించెను. యుద్ధమున మహావేగుం డాయింద్రజిత్తు, అపారతేజులయిన గవాక్షశరభుల నిరువురను రెండేసిబాణములువైచి గ్రుచ్చెను. అంత నింద్రజితుఁడు వేగిరముమీఱఁగా, మరల నాగోలాంగులపతియగు గవాక్షునిని, వాలిపుత్త్రుఁడగు నంగదునిని, పెక్కుబాణములఁ గాఁడనేసెను. బలవంతుఁడును మహాధైర్యశాలియునగు నాయింద్రజిత్తు అట్లాయుద్ధమున, అవ్వానరవరులనెల్ల అగ్నిజ్వాలలవంటి వాఁడిబాణముల నొప్పించి సింహనాదము చేసెను. అమ్మహాబాహుఁడు, ఆ వానరులను బాణజాలములచే నలంచి, యందఱును భయపడునట్లు గావించి పకపకనవ్వుచుఁ దోషిరాక్షసులనుజూచి 'రాక్షసులారా! అదిగో సేన కన్నులయెదుటనే, భయంకరమగు బాణపాశములచే నేను బంధింపఁగా బద్ధులై యున్నదమ్ములా రామలక్ష్మణులిరువురు నొక్కటఁబడి యున్నారు చూడుఁడు' అనెను. ఇట్లతఁడు చెప్పఁగా కపటయుద్ధములుసేయు నారాక్షసులందఱును నతఁడుచేసిన వీరకార్యమునకు సంతుష్టులై మిక్కిలియు నాశ్చర్యమునొందిరి. మేఘాకారులయిన యారాక్షసులు, రాముఁడు హతుఁడయ్యెనని తలఁచి, యంతటను మహాధ్వనిగలుగునట్లు సింహనాదముసేయుచు, నింద్రజిత్తును బూజించిరి. అప్పు డాయింద్రజిత్తు రామలక్ష్మణులిరువురును నిట్టట్టు కదలక మెదలకయు నూర్పులువిడువకయు, నేలంబడియుండుటనుజూచి హతులయిరని తలంచుకొనెను. యుద్ధమున జయశీలుఁడగు నింద్రజిత్తు పరమసంతుష్టుఁడై సమస్తరాక్షసులకును సంతోషముఁ గలిగించుచు, లంకాపురమును బ్రవేశించెను. రామలక్ష్మణుల శరీరములు హస్తపాదాద్యంగములును వ్రేళ్లు మొదలయిన యుపాంగములును బాణమయములుగా నుండుటనుజూడఁగా సుగ్రీవునకు భయము గలిగెను. సుగ్రీవుండట్లు మిక్కిలియు దిగులుపడి దుఃఖముచే కన్నులు కలఁగి బాష్పముల మొగము దడిసియుండుటనుజూచి, విభీషణుఁ డతనితో 'సుగ్రీవా! భయమువలదు. చాలును. కన్నీళ్లయురవడి నాఁగుము. యుద్ధములన్నియు తఱచుగా నిట్టివే. జయమే యెప్పుడును గలుగునని నియతి లేదు. వీరా! మనకు భాగ్యశేషము గలదేని, మహాత్ములును మహాబలవంతులునగు నీయుద్దఱు మూర్ఛదేఱఁగలరు. నీవు దిట తెచ్చుకొనుము. మఱి వేఱు దిక్కులేకున్న నాకును దిటగలిగింపుము. సత్యమును ధర్మమును నవలంబించి యుండువారికి నెప్పుడును నపమృత్యుభయము గలుగదు' అనెను. విభీషణుఁడిట్లు చెప్పి యంత కన్నీళ్లుగార్చినయమాంగల్యము నివర్తించుటకై చేత నీళ్లుదీసికొని యాసుగ్రీవుని శుభనేత్రములను దుడిచెను. అంత ధర్మాత్ముఁ డావిభీషణుఁడు రాక్షసమాయం దెలిపి ధైర్యము గలిగించుటకై, మరల జలంబు దీసికొని, మాయామోహనివారకమగు విద్యచే నభిమంత్రించి దానిచే నాసుగ్రీవునికన్నులను దుడిచెను. అట్లతఁడు, బుద్ధిమంతుఁడగు నాకపిరాజు సుగ్రీవుని మొగమును దుడిచి, యంత

తో ట్రువడక యక్కాలమునకుఁ దగినమాటల నతనితో "వానరరాజేంద్రా! అధైర్య పడుటకిది కాలముగాదు. 'నేనేమి సేయుదును. అతిస్నేహమిట్లు బోధించుచున్న దే'యందువా? అతిస్నేహమున కిది యకాలము. ఇట్టికాలమున నదిగూడ మరణమునకుఁ గారణమగును. కావున, నను స్తకార్యములను నాశముసేయునట్టి యధైర్యమును విడిచి, రాముని నండఁగొనివచ్చిన వానరసైన్యములకు హితమగుదాని నాలోచింపుము. అటుగాదేని, రాముఁడు మూర్ఛదేఱువఱకు, నతని రక్షింపుఁడు. కాకుత్స్థకులులారామలక్ష్మణులు, మూర్ఛదేఱినంత నే మనభయమును బోఁగొట్టఁగలరు. 'ఇట్లు పడియున్నవారికి మరలఁ దెలివివచ్చుటయెట్లు'అందువా? ఈబంధము రామునేమియుఁ జేయఁజాలదు. కాన యతఁడు మృతినొందునని శంకయువలదు.'ఇది యె' ట్లందువా? కాంతిసొంపు రాముని విడువకున్నది చూడుము. ఇట్టిసొంపు మృతినొందినవారికిఁ గలుగుట యరుదుసుమూ. కావున నేను జేయవలసినకార్యములనెల్ల మరల కుదురుపఱచునంతకు, నీవు ధిట దెచ్చుకొని నీసైన్యమునకుఁగూడ ధిటఁ గలిగింపుము. 'కార్యములను కుదురుపఱుపనేల' యందువా? వానరోత్తమా! ఈ వానరులు, కన్నులువిచ్చి నన్ను నింద్రజిత్తని భ్రమించి దిగులుగొని గగుర్పొడుపుగు భయవికారములు పుట్టఁగా ఒకరిచెవిలోనొకరు పలాయనమునకై గుసగుసలాడుకొనుచున్నారు. చూడు. ఇట్లు నన్నుఁజూచి పరుగిడఁ జూచుచున్నయీసైన్యమునకు భయము దొలఁగించుటకై పోవుచున్నాను. వానరులందఱును, మునుపుదాల్చియైన ప్రాధాన్యమును బొఱవై చునట్లు, ఇంతకుఁబుట్టియున్న దిగులును దిగవిడుతురుగాక' యనెను. రాక్షసేంద్రుఁడగు విభీషణుఁడు సుగ్రీవుని నట్లాశ్వాసించి యంత భయంబునఁ బరుగిడుచున్న వానరసైన్యముంజూచి 'నే నింద్రజిత్తుగాను విభీషణుఁడను' అని చెప్పి యాశ్వాసించెను. మహామాయుఁడగు నింద్రజిత్తు సమస్తసైన్యములును తన్నుఁ బలసివచ్చుచుండ, లంకాపురమును బ్రవేశించి, తండ్రిసమ్ముఖమునకుఁ బోయెను. అట్లతఁడుపోయి యచట సభయందాసీనుఁడయి యున్నరావణునకు నమస్కరించి చేతులు మొగుడ్చుకొని, 'రామలక్ష్మణులను వధించితిని' అని యీప్రియవార్తను జెప్పెను. రావణుఁడు రాక్షసులమధ్యమునఁ దనశత్రువులగు రామలక్ష్మణులు కూల్పంబడిరని విని, యుబ్బుపట్టలేక, యాసనమునుండి దిగ్గనలేచి కొడుకును బిగ్గఁ గౌఁగిలించుకొనెను. రావణుఁడు మనంబున సంతసముప్పొంగ కొడుకుశిరను మూర్కొని రామలక్ష్మణులు హతులయినవిధము నడిగెను. అట్లడుగుచున్న తండ్రికి నింద్రజిత్తుఁడు తా నారామలక్ష్మణుల నాగపాశములబంధించి చేష్టలుడిపి కాంతి సొంపు దూలించినవిధమంతయు జరిగినది జరిగినట్టుగానే తెలిపెను. ఆరావణుఁడు, మహా[illegible]డగు నింద్రజిత్తుచెప్పిన మాటనువిని మనంబున సంతోషాతిశయము నిండఁగా,

రామునివలనఁ గలిగిన తొందుడుకును దిగంద్రావి మిక్కిలి సంతుష్టినొంది కొడుకు నెంతయు పొగడెను. ఇది నలువదియాఱవ సర్గము.



రావణాజ్ఞచే రాక్షసస్త్రీలు సీతను బుష్పకవిమాన మెక్కించి యుద్ధభూమికిఁ దోడ్కొనిపోయి నాగపాశబద్ధులై పడియున్న రామలక్ష్మణులం జూపుట.

రావణునికుమారుఁ డింద్రజి త్తట్లు కృతార్థుఁడై మరల లంకాపురిని బ్రవేశించినపిదప, హనుమంతుఁడు, నంగదుండును, నీలుఁడును, సుషేణుఁడును, కుముదుఁడును, నలుఁడును, గజుఁడును, గవాక్షుఁడును, గవయుఁడును, శరభుఁడును, గంధమాదనుఁడును, జాంబవంతుఁడును, ఋషభస్కంధుఁడును, రంభుఁడును, శతవలియు, పృథుఁడు ననెడి యీవానరసింహులు ఆర్తులై రామునిఁ బరివేష్టించి రక్షించుచుండిరి. తక్కిన వానరులు సేనలనన్నియు వ్యూహములుగాఁ దీర్చి, నలుగడల ప్రయత్నపరులై వృక్షములు చేతం దాల్చి సమస్తదిక్కులను దిర్యగూర్ధ్వప్రదేశములనుం జూచుచు, తృణములు గదలినను రాక్షసులు వచ్చిరనితలంచుచు జాగ్రత్తతో నుండిరి. అపుడు రావణుఁడును మిక్కిలిహర్షమున నింద్రజిత్తును వీడుకొలిపి, యంత, సీతకుఁ గావలియున్నరాక్షసస్త్రీలను బిలిపించెను. అంత రాక్షసస్త్రీలును త్రిజటయును రాజాజ్ఞచొప్పున వచ్చిరి. అంత రాక్షసరాజగురావణుఁడు సంతోషమున నారాక్షసస్త్రీలం జూచి 'ఇంద్రజిత్తుచే రామలక్ష్మణులు హతులయిరని సీతకుం జెప్పుఁడు. ఆబిడను పుష్పకముపై నెక్కించుకొనిపోయి హతులయి పడియున్న రామలక్ష్మణులను జూపుఁడు. ఎవ్వనిప్రాపున నిది గర్వితయై నాకు వశురాలు గాకుండినదో, ఆరాముఁడు, దీనిమగఁడు, తమ్ముఁడును దానును యుద్ధాగ్రమున హతుఁడయ్యెను. ఇంక సీత విచారముడిగి, శోకమును మాని రాముఁడువచ్చునని యాశయుఁ దూలి, సర్వాభరణముల నలంకృతయై నన్నుఁ బొందఁగలదు. వాలుంగన్నులు గల యీవన్నెలాఁడి యుద్ధమున రాముఁడును లక్ష్మణుఁడును నిపుడు హతులగుటనుజూచి, నాకంటె మఱి వేఱుగతి గానలేమిచే రామునినుండి మనస్సును ద్రిప్పి, నేనుగోరకయే తానే తనంతట నన్నుఁ బొందఁగలదు' అనెను. ఆరాక్షసస్త్రీలు దురాత్ముఁడగు రావణునియాజ్ఞనువిని, 'అట్లే చేయుదు' మని చెప్పి పుష్పకవిమాన మున్నచోటికిం బోయిరి. అంత రాక్షసస్త్రీలు రావణుని యాజ్ఞచే పుష్పకవిమానమును దీసికొని యశోకవనమునను న్న సీతయొద్దకుం బోయిరి. అపుడు, రాక్షసస్త్రీలు, భర్తృదుఃఖమునఁ గీడ్పడి స్రుక్కుచున్న సీతనుదీసికొని యాపుష్పకవిమానము నెక్కించిరి. అంత నాస్త్రీలు సీతను త్రిజటనును పుష్పకము నెక్కించి యాబిడకు రామలక్ష్మణులం జూపుటకై తీసికొనిపోయిరి. మఱియు, నారాక్షసేశ్వరుఁడు రావణుఁడు సంతోషమున లంకయందంతయు పతాకలును ధ్వజము

లును వరుసలుగా నర్తించి యలంకారము చేయునట్లు గావించి లంకయందంతయు 'రాముఁడును లక్ష్మణుఁడును నింద్రజిత్తుచేత యుద్ధమున హతులయిరి' అని చాటించెను. సీత త్రిజటతోఁగూడ నాపుష్పకవిమానము నెక్కిపోయి, నేలంబడియున్న యావానరసైన్యమునంతయుం జూచెను; రాక్షసులు మనమున మిక్కిలి సంతోషము నొందియుండుటయు, వానరులు రామలక్ష్మణుల పొంతల దుఃఖార్తులై యుండుటయుం జూచెను. అంతసీత, క్రింద భూమిని, వీరులగు రామలక్ష్మణులు, బాణవిక్షితులై, కవచములు పటాపంచలై, విండ్లు జాఱిపడి, బాణములచే సమస్తావయవములును భిన్నములు కాఁగా, శరగుల్మమయులై శరతల్పంబులం బడి పరుండి యుండఁగాఁ జూచెను. ఆసీత, యచట వీరులును తామరరేకులవంటి కన్నులుగలవారును నన్నదమ్ములు నగు నాపురుషసింహులు రామలక్ష్మణులిరువురును, నగ్నిపుత్త్రులగు స్కంధవిశాఖులంబోలెఁ దేజరిల్లుచు నట్లు శరతల్పగతులయి యట్టిదురవస్థం బొంది పరుండియుండుటను జూచి మిక్కిలియు దుఃఖమునఁ బల్లటిల్లుచు, చాలసేపు విలపించెను ఏకందును లేని సర్వావయవముల నొప్పుచు నల్లనికన్నులు వన్నెగులుకు నాజనకరాజసుత సీత, తనభర్తయగు రాముఁడును లక్ష్మణుఁడును, నేలదుమ్మునం బొరలుచుండుటనుజూచి రోదనము గావించెను. ఆసీత, శోకంబున బాష్పములు కలంచి పుచ్చఁగా, దేవతలుంబోలె మహాప్రభావసంపన్నులగు నారామలక్ష్మణులం జూచి, హతులయిరని యూహించుచు, పరమదుఃఖితయై యిట్లని పలవించెను. ఇది నలువదియేడవసర్గము.

---

## సీత రామలక్ష్మణుల యవస్థనుజూచి నానావిధములఁ బలవించుట.

సీత, తనభర్తయగు రాముఁడును, మహాబలుఁడగు లక్ష్మణుఁడును హతులగుటంజూచి, శోకంబున స్రుక్కుచు విను వారికి మిక్కిలియు జాలిపుట్టునట్లు, ఇట్లని పలవించెను. "సాముద్రిక లక్షణములను దెలిసినవారెవ్వరు, మున్ను నన్నుఁ బుత్త్రవతియనియు విధవగాదనియుఁ జెప్పిరో, ఆలక్షణజ్ఞానులందఱును, నిపుడు రాముఁడు హతుఁడగుటచే నబద్ధము చెప్పినవారయిరి మును పెవ్వరు, నాభర్త యశ్వమేధాది యాగములు సేయుననియు సత్త్రములు గావించుననియును జెప్పిరో, అట్టిజ్ఞానులందఱును ఇప్పుడు రాముఁడు హతుఁడుగాఁగా, నబద్ధము చెప్పినవారయిరి. మున్ను మహావార్తికులగు బ్రాహ్మణులెవ్వరు, నేను చెవులార లెస్స వినునట్లు, నాయెదుట, నన్ను మాంగల్యవతియని చెప్పిరో, ఆజ్ఞానులందఱును, ఇప్పుడు రాముఁడు హతుఁడగుటచే అబద్ధము చెప్పినవారయిరి. ఎవ్వరు నన్నుఁజూచి నీవు మహావీరుఁడయినరాజునకుఁ బత్నివగుదువు, ధన్యురాలవు, అని చెప్పిరో ఆవేత్తలందఱును, ఇప్పుడు, రాముఁడు హతుఁడగుటచే నబద్ధము చెప్పినవారయిరి. ఇవిగో నాకు పాదముల పద్మరే

ఖలు స్పష్టముగాఁ జూపట్టుచున్నవి. ఈరేఖలుగల స్త్రీలు, మహారాజులకు పత్నులై వారితోఁగూడ సామ్రాజ్యమున నభిషిక్తులగుదురఁట. ఇవి నాయందు నేల నిష్ఫలములయ్యెనో! దౌర్భాగ్యవతులగు స్త్రీలు ఏలక్షణములున్నచో వైధవ్యము నొందుదురో, యా దుష్టలక్షణము లెంత వెదకినను నాయందుఁ గనఁబడలేదు. కాని నాయందుఁ గనఁబడు శుభలక్షణములన్నియు నిష్ఫలములే యైనవి. ధ్వజకులిశాదులయిన యితరలక్షణములతోఁ గూడి, రేఖలరూపముగా నున్న పద్మములు, పద్మ (లక్ష్మి) గలవి యనెడి తమయర్థమును సత్యముగా చెల్లించునని లక్షణశాస్త్రములఁ జెప్పఁబడియున్నది. ఇప్పుడు రాముఁడు హతుఁడగుటచే నాకుమాత్ర మవి నిష్ఫలములయినవి. నాకురులు సూక్ష్మములును సమములునై నల్లగానున్నవి. నాకనుబొమలు ఒండొంటితోఁ గలియకున్నవి. నాపిక్కలును గుండ్రములై వెండ్రుకలు లేకున్నవి. నాపలువరుస విరళముగాక దట్టముగా నొండొంటం గలసియున్నది. నాకన్నులదాపటి నుదుటిపట్టులును, కన్నులును, చేతులును, అడుగులును, చీలమండలును, దొడలును దప్పములుగా నున్నవి. నావ్రేళ్లును గుండ్రనిగోళ్లతో నిద్దములై చేతికొలఁదికి తగునట్లు సమములై యున్నవి. నా యీచన్నులు నొండొంటి నొరసి, బలుపు గలిగి, కొనలు కొంత పల్లముగా నున్నవి. నాపొక్కిలియు చుట్టును నిక్కగలిగి నడుమ లోఁతయియున్నది. నాప్రక్కలును రొమ్మును దగుకొలఁదియై కండబలుపు గలిగి యున్నవి. నామేనిచాయ మణియుంబోలె నిద్దమై మెఱుఁగుదేఱుచున్నది. నామేని వెండ్రుకలును మృదువుగానున్నవి. శాస్త్రజ్ఞులు, నా యీపాదముల పదివ్రేళ్లును, పాదతలములును జక్కఁగా నేల నాని యుండుటవలన నన్ను శుభలక్షణములు గలదానిగాఁ జెప్పిరి. నాహస్తములును బాదములును పూర్ణమగు యవరేఖతోఁగూడి నడుమ సందులులేక గుత్తములై, గుత్తిముగా నమరినవ్రేళ్లు గలిగి, కాంతిం దళుకొత్తుచున్నవి. కన్యాలక్షణము దెలిసిన బ్రాహ్మణులు, నన్నిప్పుడును జిఱునవ్వుగలదిగాను జెప్పిరి. జ్యోతిషికసిద్ధాంతమునందు నిపుణులైన బ్రాహ్మణులు నాకుఁ బెనిమిటితోఁ గూడ సామ్రాజ్యమునకుఁ బట్టాభిషేకము గలుగునని చెప్పిరి. ఇప్పు డదియంతయు వ్యర్థమయినది. అన్నదమ్ములు రామలక్ష్మణులు, జనస్థానమంతయు నన్ను వెదకి, తుదకు నావృత్తాంతమును దెలిసికొని, నన్నుఁ జేపట్టుటకై యక్షోభ్యమగు మహాసముద్రమునుంగూడ దాఁటివచ్చి యెద్దుకాలియంతమాత్రమయిన యింద్రజిన్మాయచే హతులయిరి. రామలక్ష్మణులు వారుణాస్త్రము, నాగ్నేయాస్త్రము, ఐంద్రాస్త్రము, వాయవ్యాస్త్రము, బ్రహ్మశిరోనామకాస్త్రమునుం బొందియుండిరే. ఆయస్త్రములన్నియు నిపు డెచ్చటికిఁ బోయినవి? ఇంద్రజిత్తు యుద్ధమున మాయచే నదృశ్యుఁడై కపటమున దేవేంద్రసమానులును నాకు దిక్కునయిన రామలక్ష్మణులను వధించినాఁడు. నేను దిక్కులేనిదాన నయితిని. యుద్ధమున రామునికంటఁబారింబడిన పగవాఁడు, తా నెంతి మనోవేగముగలవాఁడయినను, ప్రాణములతో నురలి పోనఁజాలఁ

డు. అతిబలపరాక్రమశాలియగు రాముఁడుగూడ తమ్ముఁడును దానును యుద్ధమునఁ గూల్పంబడి నేలంబరుండి యున్నాఁడే! కావున, కాలమునకు మిక్కిలి బరువైనది యేదియు లేదు. మఱిదైవమును గెలుచుటయు నెంతమాత్రము దరముగాదు. వాలి గోలుపుచున్న నాయత్తగారిని దలఁచుకొన్న నాకు దుఃఖము గలుగునట్లు రామునిఁగాని, మహాబలుఁడగు లక్ష్మణునిఁగాని, నన్నుఁగాని, నాతల్లినిగాని, తలంచుకొన్నను అంత దుఃఖము గలుగదు. ఆయమ కౌసల్య, 'పదునాలుగేండ్లు . వనవాసవ్రతమును గడపి, సీతయును లక్ష్మణుఁడును, రామునితోఁ రాఁగా నెప్పుడుచూతునా' యని యెల్లప్పుడు చింతించుచునే యుండునే" అని విలపించెను. అట్లు పలవించుచున్న యాసీతంజూచి, త్రిజటయను రాక్షసి 'అమ్మా! నీవు దుఃఖపడవలదు. నీభర్త యితఁడు బ్రతికియున్నాఁడు అమ్మా! ఈయున్నదమ్ములు రామలక్ష్మణు లిద్దఱును బ్రతికియున్నారని తెలియఁగూడునట్లు స్ఫుటములై యనుభవసిద్ధములయిన కారణములుగూడ నాకగపడుచున్నవి. వానిని జెప్పెదవినుము పతి హతుఁడయ్యెనేని యుద్ధమున యోధులముఖములు, ఇట్లు కోపావేశము గలవిగాను సంతోషముచే ప్రసన్నములైనవిగాను, నుండఁజాలవు. సీతా! మఱియు నీరామలక్ష్మణులు ప్రాణములు విడిచియున్నచో పుష్పకంబనెడునీవిమానము దివ్యంబైనదిగాన నిన్నిట్లు వహించియుండదు. ప్రధానుఁడగు వీరుఁడు చంపఁబడనేని, యట్టిసైన్యము ఉత్సాహముదూలి, ప్రయత్నముమాలి, జలములందు కర్ణధారుఁడులేని యోడవలె, యుద్ధంబుల నడపువాఁడులేక తబ్బిబ్బుపడుచుండును. ఈ వానరసేన యట్లులేదు; ఇది తొట్రుపడక, భయమునొందక, బలంబుమీఱి, నేను బ్రతికియున్నారని నీకుఁ దెలిపిన యారామలక్ష్మణులను సంతోషమున నెచ్చరికతో రక్షించుచున్నది. ఇట్లు సుఖముగాఁ దెలియఁదగిన యాచిహ్నములచేత, రామలక్ష్మణులు బ్రతికియున్నారని నెఱనమ్మకము గలిగియుండుము. రామలక్ష్మణులు మృతిఁబొందినవారుగారు చూడుము. నీయందలిస్నేహమున నీకింతదూరము చెప్పుచున్నాను. నేనిదివఱకు నబద్ధము చెప్పినదిలేదు. ఇంక నెప్పటికిఁగాని చెప్పుటయు నుండదు. నీవు నీపాతివ్రత్యముచే మనస్సునకుల్లాసము గూర్చు స్వభావము గలదానవుగాన నీయందు నాకు మిక్కిలియు మనస్సు తగిలినది. యుద్ధంబున దేవేంద్రునిఁగూడి దేవాసురులు వచ్చినను, ఈ రామలక్ష్మణుల గెలువ నలవిగాదు. బ్రతికియుండుటకు సూచకములయిన సైన్యముఖప్రసాదాది లక్షణములనుజూచి, యటువంటికలనుంగని, నీకుఁ జెప్పితిని. సీతా! ఇది మిక్కిలియు గొప్పచిహ్నము. దీనిని మెల్లగాఁ జూడుము. వీరిద్దఱును మూర్ఛనొందియున్నను, వీరల ముఖకాంతి పెంపు, ఎంతమాత్రము విడువకున్నది. ఆయుస్సుతీఱి ప్రాణములు విడిచినవారికి, తఱచుగా, ముఖములను జూడఁగా, నవి మిక్కిలియు వికారము గలిగియుండును. సీతా! నీవు రామలక్ష్మణుల విషయమై, యిట్లు శోకమున ముఖవికారము నొందకుము. వారు హతులయిరనియు భ్రమనొందకుము. మనస్సునను గుందకుము. వారలిపుడు బ్రతికియుండుట శక్యమేకాని యశక్యముగాదు' అ

నెను. దేవకన్యయుం బోని సీత, యా త్రిజట చెప్పిన మాటనువిని, చేమోడ్పుగీలించి 'నీవు చెప్పినట్లు వీరలు జీవించి యుందురుగాక' యనెను. త్రిజట మనోవేగముగల యా పుష్పకవిమానమును మరల్చి దీనురాలైన సీతను లంకాపురిలోపలికిం దీసికొని పోయెను. అంత రాక్షసస్త్రీలు సీతను త్రిజటనుపు పుష్పకమునుండి దింపి, యశోకవనమును జేర్చిరి. పెక్కువృక్షసమూహములతోఁగూడి, రాక్షసేంద్రుఁడగు రావణునికి ప్రమదావనమైన యశోకవనమును సీత ప్రవేశించి రాచకొమారులగు రామలక్ష్మణులను దాను జూచినవిధమునే యెంతయుఁ జింతించుకొనుచు, మిక్కిలియు దుఃఖము నొందినదయ్యె. ఇది నలువదియెనిమిదవ సర్గము.



రాముఁడు కొంతమూర్ఛదేఱి లక్ష్మణునిఁగూర్చి దుఃఖించుట; రాముఁడు సుగ్రీవుని మరలఁ గిష్కింధకుఁ బొమ్మనుట ; విభీషణుఁడు వానరసైన్యముల నిలువరించి మరల రామునొద్దకు వచ్చుట.

సుగ్రీవుఁడు మొదలుగా మహాబలశాలు రగునా వానరోత్తములందఱును, భయంకరమగు నాగపాశములచే బద్ధులై పాములవలె నిట్టూర్పులుపుచ్చుచు, నెత్తుటం దోఁగి భూమిని బరుండి యున్న మహాత్ములను దశరథకుమారులగు రామలక్ష్మణులను బరివేష్టించి శోకపరిపూర్ణులయి యుండిరి. ఇంతలో వీర్యవంతుఁడగు రాముఁడు, బాణపాశములచే బద్ధుఁడై యున్నను, ధీరుఁడును బలవంతుఁడు నగుటచే మూర్ఛదేఱెను. అంత, బాణములు గాఢముగాఁ గ్రుచ్చుకొని, నెత్తుటం దోఁగి దుఃఖితుఁడై దీనవదనంబున నున్నతమ్ముని లక్ష్మణునింజూచి రాముఁడు దుఃఖము పట్టలేక 'నాతమ్ముఁడు యుద్ధమున నిర్జితుఁడై నేలంబడియుండ నిపుడు చూడఁగంటినే ! ఇఁక నాకు సీతతోఁ బనేమి? నాప్రాణముగాని యిఁక నెందులకు? భూలోకమున వెదకినయెడల, సీతకు సాటియైనపడఁతిని సంపాదించుకొనవచ్చును. కాని, సహాయుఁడును యుద్ధమున సమర్థుఁడు నగులక్ష్మణునివంటితమ్మునిమాత్రము పొంద నలవిగాదు. సుమిత్ర కన్నుల కానందము గూర్చుచుండులక్ష్మణుఁడు మరణమునొందెనేని, నేను, ఈవానరులు చూచుచుండఁగానే ప్రాణములు విడిచెదను. నే నయోధ్యకుఁబోయి తల్లి కౌసల్యకేమి చెప్పుదును? కైకేయి కేమని చెప్పుదును ? లక్ష్మణుఁడులేక నేనుమాత్ర మక్కడకుఁ బోదునేని, కన్నకొడుకును గన్నారఁ జూడవలయునని తుకతుకపడుచు, కొడుకు పోయినది తెలిసి దూడలేని యావువలె తత్తఱపడుచు, కురరింబోలె నఱచుచు, నున్నతల్లిని సుమిత్ర నెట్టులాశ్వాసింపఁగలను? శత్రుఘ్నునికి మహాయశుఁడగు భరతునికి నోరాడి యెట్లు చెప్పుదును? నాతోఁగూడ నడవికి వచ్చినలక్ష్మణునివిడిచి నేనుమాత్రము మరలి యయోధ్యకుఁబోఁగా సుమిత్ర 'నీతోఁగూడ నడవికి లక్ష్మ

ణుడు వచ్చెనా? లక్ష్మణుఁడు లేక నీవు మరలివచ్చితివా?' యని నన్ను నెత్తిపొడుచునే! అయ్యో! దానికి నేను సైఁపఁజాలను నాకు జీవింప నిష్టము లేదు ఇచటనే ప్రాణములు విడిచెదను. లక్ష్మణుని నడవికిఁ దోడ్కొని వచ్చుదుష్కార్యమున కొడిగట్టితినే. ఇసీ! నే నెంతటి యపూజ్యుఁడను. నా బ్రతుకు పాడగుఁగాక! నన్నుఁబట్టికదా లక్ష్మణుఁ డిట్లు నే లంబడి ప్రాణములుపోయినట్లు శరతల్పమున శయనించి యున్నాఁడు.' అని పలవించి యంత లక్ష్మణు నుద్దేశించి 'లక్ష్మణా! నేను దుఃఖితుఁడ నగుచునేని, నీ వెప్పుడును నన్నాశ్వాసించుచుందువు. ఇఁక నీవు మృతినొందఁగా, ఇపుడు నే నెంతదుఃఖితుఁడ నయినను నాతో మాటాడనైనం జాలవుగదా. ఎవ్వఁ డిప్పుడు యుద్ధమున రాక్షసులం జంపి పడఁగూల్చెనో, యావీరుఁడే, ఆరాక్షసులం గూల్చిన భూమియందే, పగవారిచే హతుఁడై పరుండియున్నాఁడే! ఏమందును? ఇతఁ డిట్లు నెత్తుటఁ దొప్పఁ దోఁగి బాణములు దేహమంతయుఁ గ్రుచ్చుకొనియుండ, ఈ శరతల్పంబునఁ బరుండి, యస్తమయము నొందుసూర్యుఁడుంబోలె చూపట్టుచున్నాఁడు. మర్మములం దెల్ల బాణములు నాటియుండుటచే నితఁడు మాటలాడ నేరకున్నాఁడు. ఇతఁడు చెప్పక పోయినను, ఇతనిచూపునందలి ప్రేమవలననే యితనిబాధ సూచితమగుచున్నది. మహాకాంతిం బెళుకొత్తు నీలక్ష్మణుఁడు నే నడవికివచ్చునప్పుడు నన్నెట్లు వెంబడించివచ్చెనో యట్లే నేనును నితఁడు యమునియొద్దకుఁబోవునపుడు, నితని వెంటం బడిపోయెదను. ఈలక్ష్మణుఁడు బంధుజనులం దెప్పుడును ప్రీతిగలవాఁడు నన్నెపుడు నియమమున ననుసరించుచుండువాఁడు. ఇట్టివాఁ డపూజ్యుఁడగు నాయక్రమములచేత నిప్పు డీ దురవస్థనుబొందినాఁడు. వీరుఁ డగులక్ష్మణుఁడు తా నెంతరోషము నొందెనేని, నాతోఁ బరుషముగాఁ గాని, యప్రియముగాఁ గాని, పలుకఁగా నెప్పుడును విన్నది లేదు. ఇది నాకు జ్ఞప్తికివచ్చుచున్నది. వేయిచేతులు గలవాఁడగుటచేత నొక్కతూరినే యేనూఱు బాణంబులం బ్రయోగించుకార్తవీర్యార్జునునికన్నను, బాణములు విడుచుట యందు లక్ష్మణుఁ డధికుఁడు. ఎట్లన లక్ష్మణుఁడు రెండుచేతులు గలవాఁడయినను, వేయిచేతుల కార్తవీర్యుఁ డేనూఱుబాణములు విడుచునంతకాలములో నన్నిబాణములను తానును విడుచుచున్నాఁడుగాన, ఇషువులందును అస్త్రములందును నతనికన్న నధికుఁడు. ఎవ్వఁడు బాణములచే మహాత్ముఁడగు నింద్రునిబాణములనుగూడఁ గొట్టివైవఁజాలునో, యట్టిలక్ష్మణుఁడు, మిక్కిలియు మేలయినశయ్యపైఁ బరుండఁదగినవాఁడు, ఇప్పుడు హతుఁడై వట్టినేలపైఁ బరుండియున్నాఁడు. నేను విభీషణుని రాక్షసరాజుగాఁ జేయనయితిని. కాఁబట్టి, యట్లతని చేసెదనని చెప్పిన బొంకుమాటయు నన్నుఁ దప్పక దహింపఁగలదు. వానరరాజా! సుగ్రీవా! నీ వీగడియలోనే యిచ్చట నుండి కిష్కింధకుఁ బోఁదగును. నేను లేకున్నానని తెలిసి బలవంతుఁడగు రావణుఁడు నిన్నుఁ దఱిమికొట్టును. సుగ్రీవా? నీ వంగదునిఁ దోడ్కొని సైన్యములను సుహృజ్జనులనుం గూడి, నీలుఁడు నలుఁడు మున్నగువారలతోడ సముద్రము దాఁటుము.

హనుమంతుఁడు యుద్ధమున నితరులకుఁ జేయనలవిగానికార్యమును జేసినాఁడు. ఋక్ష రాజగు జాంబవంతుఁడును గొండముచ్చుల యధిపతియగు గవాక్షుఁడును జక్కఁగా యుద్ధము సలిపినందులకు సంతోషించుచున్నాను. అంగదుఁడును మైందుఁడును ద్వివిదుఁడును నెంతయు మంచియుద్ధము చేసిరి. కేసరియు సంపాతి యను వాఁడును, భయంకరముగా యుద్ధము సేసిరి. గవయుఁడును, గవాక్షుఁడును, శరభుఁడును, గజుఁడును, మఱియు నితరులయిన వానరవీరులును, నాపిషయమై ప్రాణములకుఁ దెగించి చక్కఁగా యుద్ధము సేసిరి. సుగ్రీవా! ఎంత తెన్ని ప్రయత్నములు సేసిననేమి? తుదకు దైవము నతిక్రమింప మనుష్యుల కలవిగాదుగదా. పరంతపా! సుగ్రీవా! చెలికాఁడును శ్రేయోభిలాషియు నగువానిచే నెంతమాత్రము చేయ శక్యముగునో యంతమాత్రమును, నీవుధార్మికుఁడవుగాన, ధర్మము నశించునని భయపడియు, అధర్మము చేయుటకు వెఱచియు, శక్తివంచనములేక చేసితివి.' అని యంత వానరవీరులం జూచి 'వానరశ్రేష్ఠులారా! మీరు మేనుదాఁపక మీస్నేహితునికార్యము చేసితిరి. ఇఁక మీకుఁ బోవ ననుజ్ఞ యొసంగితిని. యథేష్టముగాఁ బోఁదగును' అనెను. ఆవానరులందఱును అట్లు రాముఁడు పలవించుటనువిని, దుఃఖమున కన్నులెఱ్ఱఁబాఱ కన్నీళ్లువిడిచిరి. అంత విభీషణుఁడు గదాపాణియై, వానరసైన్యముల నన్నిటిని నిలువరించి వేగమున రాముఁ డున్నచోటికి వచ్చెను. అట్లు గదాపాణియై కాటుకరాశివలె కటికినలుపుదేహముతో త్వరితముగా వచ్చుచున్న విభీషణునింజూచి, వానరులందఱును, ఇంద్రజిత్తని తలంచి భయమున పరుగులెత్తినవారయిరి. చేష్టలుడిగి యొఱుక తప్పి పొలిగలనిదుష్ముల బ్రుంగి, శరతల్పమునం బడియున్న వారినిం జూడ విభీషణుఁడు వచ్చెను. వానరు లట్లా రాజకుమారులు నేలం బడియుండుటను వచ్చు విభీషణునిం జూచి యింద్రజిత్తని శంకించి వాయుహతము లయిన మేఘములుం బోలె పిక్కిలివ్యథ నొందినవారయిరి. ఇది నలువదితొమ్మిదవసర్గము.



విభీషణుఁడు రామలక్ష్మణులయవస్థంజూచి దుఃఖింపఁగా సుగ్రీవుఁ డాశ్వాసించుట; గరుత్మంతుఁడు వచ్చి రామలక్ష్మణులకు నాగపాశవిమోచనము గావించుట; వానరులు రామలక్ష్మణులు స్వస్థులగుటం జూచి యానందమున సింహనాదములు గావించుట.

అంత మహాతేజుఁడును, బలవంతుఁడునగు వానరరాజు సుగ్రీవుఁడు, వానరుల ప్పుడు పలాయితులగుటకుఁ గారణముదెలియక 'మన యీవానరసేన, జలమున నెదురు గాలిచేఁ గొట్టఁబడిన యోడవలె వ్యాకులమయి యున్న దేల' యని యడిగెను. సుగ్రీవుఁడు చెప్పినదివిని, వాలిపుత్త్రుఁ డంగదుఁ డతనితో 'దశరథకుమారులును మహాత్ములు

నగు నారాముండును మహాబలుఁడగు లక్ష్మణుఁడు నిరువురును, దేహమంతయు బాణస మూహములు గ్రుచ్చుకొన, నెత్తుటం దొప్పఁదోఁగి శరతల్పమునంబరుండి యున్నారే! నీవు చూడవాయేమి? నేనకలంగుటకు మఱివేఱు కారణము లేదు' అనెను. అంత వానర రాజగు సుగ్రీవుఁడు పుత్త్రుఁడగు నంగదునితో 'ఇట్లు రామలక్ష్మణులు పడియుండుట యిందులకుఁగారణము గాదని తలంపలేదు. ఇదియుఁ గారణమే. మఱియొకభయము కూడ నిందులకుఁ గారణమై యుండవలయును. ఏలన, ఈ వానరులు మొగంబుల దుఃఖములుదోఁప, భయమున గన్నులువిచ్చి తేఱిచూచుచు, శిలాద్యాయుధములు పాఱవైచి దిక్కులకుం బరుగెత్తుచున్నారు చూడుము. వీరు ఒకరినిజూచి యొకరయిన సిగ్గుపడక వెనుకకుఁ దిరిగిచూడక, శీఘ్రముగాఁ బోవుటకై యొండొరుల నీడ్చుకొనుచు, నేలంబడినవానిపయి దాఁట్లువైచుచుఁ బాఱుచున్నారు. చూడుము' అనెను. ఈలోన వీరుఁడగు విభీషణుఁడు, గదాపాణియై వచ్చి, సుగ్రీవు నాశీర్వదించి రాముంజూచెను. సుగ్రీవుఁడు విభీషణునింజూచి వానరులట్లు భయపడుచున్నారని తెలిసికొని తన పొంతనున్న భల్లూకరాజగు జాంబవంతునింజూచి, 'ఇదిగో విభీషణుఁడువచ్చినాఁడు. వానరోత్తము లితనినిజూచియే, యింద్రజిత్తని శంకించి దిగులుగొని పరుగులెత్తుచున్నారు. మిక్కిలియు భీతులై నానావిధములం బరుగెత్తుచున్న యీవానరులందఱను నీవు శీఘ్రముగా నిలువరించి 'వచ్చినవాఁడు విభీషణుఁడు. ఇంద్రజిత్తుగాఁడని వీరలకుఁజెప్పుము' అనెను. సుగ్రీవుఁడిట్లు చెప్పఁగా భల్లూకరాజగు జాంబవంతుఁడు పరుగెత్తుచున్న వానరులను నడ్డగించి మరల్చి వారల నందఱ నాశ్వాసించెను. ఆవానరులందఱును భల్లూకరాజగు జాంబవంతుఁడు చెప్పినదివిని, విభీషణునిఁజూచి తొందఱపాటు విడిచి, మరల వచ్చిరి. ధర్మాత్ముఁడగు విభీషణుఁడు రామలక్ష్మణుల దేహములంతయు బాణములు గ్రుచ్చుకొనియుండుటను జూచి, యింద్రియములు కళనళించినవాఁడయ్యెను. అంత విభీషణుఁడు, చేత నీళ్లుదీసికొని యారామలక్ష్మణులకన్నులం దుడిచి శోకమున మనసు మిక్కిలియుఁ గంది కుంద, రోదనముసేయుచు 'ఈ యిరువురును బలవంతులు, పరాక్రమవంతులు, యుద్ధప్రియులునయ్యు, రాక్షసులు కపటయుద్ధము సేయువారుగావున, వారలచే నిట్టి దురవస్థను బొందిరి. ఈ రామలక్ష్మణులో కపటములేక పరాక్రమము సేయువారు; కాన, నాయన్నకొడుకును, కపటయుద్ధము సేసి తండ్రికడుపు చెఱుపునట్టి దురాత్ముఁడును, నగు నా యింద్రజిత్తు రాక్షససాధారణమయిన కుటిలబుద్ధిచే వీరలను వంచించెను. ఈ యిరువురును నెత్తుటందోఁగుచు, దేహమంతయుఁ జాలినంతవఱకు బాణములు గ్రుచ్చుకొని నిండియుండుటం జేసి నేలపయి నిదురించుచున్న ట్లున్నముండ్లపందులుంబోలెఁ జూపట్టుచున్నారు. నేనెవ్వరి పరాక్రమము నాశ్రయించి ప్రతిష్ఠ నొందవలయునని (కుదుటం బడవలయునని) కోరితినో యట్టి పురుషసింహులగు రామలక్ష్మణు లిద్దఱును దేహమువీడుటకై పెద్ద నిదురపోయినారు. నాకు రాజ్యము పొందవలయునన్న కోర్కియుఁ బోయినది. ఇంక

ప్రతికియున్న మిక్కిలియు విపత్తుగలుగును. నాపగవాఁడు రావణుఁడు తనప్రతిజ్ఞను తీర్చుకొన్నాఁడు. వానికోర్కియు నెఱవేఱినది' అని విలపించెను. వానరరాజగు సుగ్రీవుఁడు ధైర్యసంపన్నుఁడుగాన, యిట్లు విలపించుచున్న విభీషణునిఁ గౌఁగిలించుకొని, 'ధర్మజ్ఞా ! నీవు లంకారాజ్యము నొందఁగలవు. ఇందులకు సందేహములేదు. రావణునకును నతనికొడుకునకు నింతకు కోర్కి యీడేఱినదిగాదు. ఈ రుజచే రామలక్ష్మణులిరువురకు మరణాంతకమగు బాధగలుగదు; వట్టి మూర్ఛమాత్రమే. వీరలు మూర్ఛదేఱి యుద్ధమున రావణుని రాక్షసగణ సహితముగా వధింపఁగలరు' అనెను. సుగ్రీవుం డిట్లు చల్లనిమాటలాడి విభీషణుని నాశ్వాసించి, తనప్రక్కనున్న మామను సుషేణునిఁజూచి 'నీవు * పగవారి నడంచెడియీయున్నదమ్ములు రామలక్ష్మణులు, మూర్ఛదేఱినపిదప, వీరలం దీసికొని, శూరులగు వానరులు కొందఱితోఁగూడ గిష్కింధకుఁబొమ్ము. నే నన్నో, రావణుని, వానిపుత్త్రులను, బంధువులనును జంపి, నశించిన తనరాజ్యలక్ష్మిని దేవేంద్రుఁడుదెచ్చినట్లు సీతను దీసికొనివచ్చెదను' అనెను. వానరేంద్రుఁడగు సుగ్రీవుఁడు చెప్పిన యీమాటనువిని సుషేణుఁడు 'మున్ను దేవాసురులకు మిక్కిలియు భయంకరముగా జరిగినమహాయుద్ధమును నాకుఁ దెలియును. అప్పుడు, బాణప్రయోగమందుఁ గుశలులును ఆయుధవిద్యావిదులు నగునసురులు, దేవతలను మాటిమాటికి మాయచేఁ గప్పుచును బ్రహరించిరి. అట్లు దేవతలు కొందఱు బాణపీడితులును, కొందఱు మూర్ఛితులును, గొందఱు మృతులునై యుండఁగా, బృహస్పతి మంత్రప్రచురములైన మృతసంజీవిని మొదలగు విద్యలచేతను మూలికలచేతను వారలకుఁ జికిత్సచేసెను. ఆ యౌషధములను దెచ్చుటకై సంపాతియు పనసుఁడును, మున్నగువానరు లతివేగమున క్షీరసముద్రమునకుఁ బోవుదురుగాక. వానరులకుమాత్రము పర్వతమున నుండునట్టి యామహౌషధులు దెలియును. దేవతలచే నిర్మితమయిన సంజీవకరణి విశల్యకరణి యనెడియీదివ్యమూలికలను దేర వారు పోవుదురుగాక. సముద్రోత్తమమగు క్షీరసముద్రమునందు, మున్ను దేవత లమృతముచిలికినస్థలమున, చంద్రమనియు ద్రోణమనియు రెండు పర్వతములున్నవి. ఆ పర్వతములందు ఆ మహౌషధులున్నవి. దేవత లత్యుత్తమములయిన యామూలికలను ఆ పర్వతములు రెంటనుంచిరి. రాజా ! వాయుకుమారుఁడగు నీ హనుమంతుఁ డచ్చటికిఁ బోవుఁగాక' యనెను. ఇంతలో మెఱపులతోఁగూడ మేఘముల నెగురఁగొట్టుచు సముద్రమున జలంబులఁ జల్లివైచుచు భూమినంతయు వడంకించునదియుంబోలె నొకపెనుగాలి వీచెను. అది గరుత్మంతుని ఱెక్కలగాలి. ఆ ఱెక్కలవలనఁ బుట్టిన పెనుగాలిచే, లంకాద్వీపమునందలి మహావృక్షములన్నియుఁ గొమ్మలువిఱిగి వేళ్లతోఁగూడ సముద్రమునం బడినవి. ప్రశస్తకాయములుగలిగి యా

* 'శూరులయిన వానరసమూహములును, పగవారి నడంచు నీయున్నదమ్ములు రామలక్ష్మణులును, మూర్ఛదేఱినవెనుక నీవు వీరిరువురను దీసికొని కిష్కింధకుఁబొమ్ము' అని మహేశ్వరతీర్థులు.

లంతలో నున్న సర్పములన్నియు భయమునొందినవి. జలజంతువులన్నియు భయము నొంది శీఘ్రమున సముద్రములోనికిం జొచ్చినవి. అంత మఱికొంతసేపునకు వానరులం దఱును, జ్వలించుచున్న యగ్నివలెనే వడిని దేజరిల్లుచున్న మహాబలుఁడగు గరుత్మంతు నిం జూడఁగాంచిరి. మహాబలులగు పురుషతిలకులను రామలక్ష్మణులను బాణరూపములై బంధించియుండిన సర్పములన్నియు, ఆగరుత్మంతుఁడు వచ్చుటనుజూచి, భయమునఁ బాఱిపోయినవి. అంత గరుడుఁడు, రామలక్ష్మణులంజూచి, వారలచేఁ బూజితుఁడై తన రెండుచేతులతోను జంద్రబింబమువలెఁ గాంతి దళ్కొత్తువారి మొగములను దడ వెను. గరుత్మంతుఁడు హస్తములచే దడవఁగానే వారిరువుర దేహములందలి గా యములన్నియు మచ్చుమాసిపోయినవి. వారల దేహములును, శీఘ్రమున, మంచివ న్నెగులుకుచు నిద్ధములై నిగ్గుదేఱుచుండెను. అంత వారిరువురకు పరులను గ్రిందు పఱచు తేజమును, పరాక్రమమును, శరీరబలమును, కాంతియు, మిక్కిలి గుణము గల పట్టుదలయు, * సూక్ష్మార్థపరిజ్ఞానమును, వివేకమును స్మృతియును మునుపటి కంటె రెట్టింపులయినవి. గరుత్మంతుఁడు, మహాపరాక్రమశాలులయి దేవేంద్రసమా నులై యున్న యాయిరువురను లేవనెత్తి పరమసంతుష్టులై యున్నవారలం గవుఁగి లించుకొనెను. అంత రాముఁడు గరుత్మంతునిఁజూచి 'మీయనుగ్రహమువలన మే మి రువురును నిపుడింద్రజిత్తువలనఁ గలిగిన మహావ్యసనమును గడచితిమి. మునుపటివలె బలవంతులము నయితిమి. నిన్నుఁజూడఁగా, నాతండ్రియగు దశరథమహారాజును నా తాతయగు నజమహారాజును జూచినట్లు నామనస్సు మిక్కిలియుఁ బ్రసన్నమగుచున్న ది. మిక్కిలియురూపసంపన్నుఁడవై దివ్యములగు పుష్పమాలికలు దాల్చి మంచియను లేపనమును బూసికొని, నిర్మలములగు వస్త్రములనుగట్టి, దివ్యాభరణముల నలంక రించుకొనియున్న నిన్నుఁజూడ నాశ్చర్యము గలుగుచున్నది. నీ వెవ్వఁడవు?' అని యడిగె ను. మహాతేజుఁడును మహాబలుఁడునగు పక్షిరాజు గరుత్మంతుఁడు మనంబున నెంతయు సంతుష్టినొంది హర్షమునఁ గన్నుఁగవ లానందబాష్పములఁ గలంగఁగా, రామునిఁజూ చి, 'రామా! †నీకు సఖుఁడను, ప్రియుఁడను, నీకు వెలుపలి ప్రాణమువంటివాఁడను. నా పేరు గరుత్మంతుఁడు. మీ యిరువురకు సాహాయ్యముచేయుటకై యిచ్చటికివచ్చితిని. క్రూరకర్ముఁడయిన యింద్రజిత్తు ఆశ్చర్యశక్తిరూపమగు మాయాబలమున మిక్కిలి భయంకరముగా నిర్మించిన యీ బాణపాశ బాధమును విడిపించుటకు మహావీర్యుల యిన యసురులుగాని, మహాబలవంతులగు దానవులుగాని, దేవేంద్రునితోఁ గూడిన దేవతలును గంధర్వులునుగాని, శక్తులుగారు. ఇవి వాఁడికోఱలుగలిగి, విషముచే వేం

* ఇచట 'ప్రదర్శవంచ బుద్ధిశ్చ స్మృతిశ్చ ద్విగుణంతదా' అనిమూలము. 'బుద్ధిశ్చ' అనుచోఁ గల ధి యనునక్షరము గాయత్రి పదునేడవ యక్షరముగాన పదియేడవ శ్లోకసూత్ర మారంభించు తెలియునది.

† నీకు వాహనమగుటచే సఖుఁడ నని గూఢోక్తి యగుట తెలియునది.




1474. గరుత్మంతుఁడు రామలక్ష్మణులకడకు వచ్చుట ; రామలక్ష్మణులను బంధించిన సర్పములు వీడి పాఱిపోవుట.



1475. రామలక్ష్మణులు గరుత్మంతునిఁజూచి నీ వెవఁడవని యడుగుట ;
అతఁడు మీ స్నేహితుఁడనని చెప్పుట.

ద్రములయి కద్రువకుఁ బుట్టినట్టిసర్పములు, ఇంద్రజిత్తు మాయాప్రభావముచేత బాణరూపములై నిన్నుఁ బొందినవి. రామా! నీవు ధర్మజ్ఞుఁడవు, సత్యపరాక్రముఁడవు, నీతమ్ముఁడు లక్ష్మణుఁడును, యుద్ధమున పగవారిని రూపుమాపువాఁడు. కాన మీ యిరువురును భాగ్యవంతులరు. మీకేమియు భయములేదు. మీరిట్లు నాగపాశబద్ధులై యున్న వృత్తాంతమును విన్నంతనే, నేను మీయందలి స్నేహమువలన మిత్రధర్మమును పాలించుచు, వేగమున నిచ్చటికి వచ్చితిని. ఇట్లు మహాభయంకరమగు నీ నాగపాశబంధమునుండి మిమ్ము విడిపింపను విడిపించితిని. మీర లెప్పుడును నేమఱుపాటులేక అదైవ్యయస్త్రమునకు ప్రత్యస్త్రమును వేయుటయందే యెచ్చరిక గలిగియుండవలయును జుఁడీ. రాక్షసులందఱును యుద్ధమునఁ గపటముగాఁ బోరువారు. ఇది వారలకు స్వభావమే. శూరులును నిర్మల హృదయులు నగుమీరెంత మాత్రమును కపటము లేనివారు. అదియే మీకుబలము. కాఁబట్టి మీరు యుద్ధరంగమున రాక్షసుల నెంతమాత్రము నమ్మరాదు. ఈ దృష్టాంతముచేతనే రాక్షసులు కుటిలులుగాన వారి నెప్పటికి నమ్మరాదని తెలియవలయును జుఁడీ' అనెను. మిక్కిలియు బలవంతుఁడగు గరుత్మంతుఁ డిట్లు చెప్పి, యంత, రాముని, స్నేహితుఁడుగాన నెయ్యముదొలఁకఁ గవుంగలించుకొని, పోయివచ్చెదనని చెప్పఁదొడఁగి 'చెలికాఁడా! రామా! నీవు సమస్తధర్మముల నెఱింగినవాఁడవు, పగవారిదోషములనుగూడఁ జాటింపక ప్రేమించువాఁడవు, నాకు సెలవునొసంగఁగోరెద. నేను మరలి పోవలయును. వీరా! రామా! నాకును నీకును నెట్లు స్నేహమని తెలియుటకై యిప్పుడు తుకతుకపడవలదు. నీవు యుద్ధమునఁ గృతకృత్యుఁడవయినపిదప మనకు చెలిమి యెట్లుగలదో తెలిసికొనఁగలవు. లంకయందలి బాణపరంపర లవ్వారిగాఁ బఱపి, బాలురును వృద్ధులును దక్క నందుఁ గలతక్కినవారిని పగవాఁడగు రావణునిని జంపి సీతను బొందఁగలవు. మహావీర్యశాలియు శీఘ్రగమనుఁడు నగుగరుత్మంతుఁడు నిట్లీమాటంజెప్పి రామునికిని లక్ష్మణునికిని తెవులువాపి, యంత నావానరులు చూచుచుండఁగా, వారిరువురకుఁ బ్రదక్షిణముగావించి, కౌఁగిలించుకొని వాయువుంబోలె నాకాశమార్గమున నెగసిపోయెను. అంత నపుడు వానరయూథపతులు రామలక్ష్మణులు * పీడవాసి సుఖ

---

* ఇట యొకవిషయము తెలియఁదగియున్నది. 'పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవరాక్షసాన్ । అంగుళ్యగ్రేణ తాన్ హన్యామ్' అని 'పిశాచదానవ యక్షరాక్షసాదులనెల్లను వ్రేలికొనతోనే చంపఁజాలుదునని చెప్పిన నిరవధికశక్తిసంపన్నుఁడును సర్వజ్ఞుఁడునగు రాముఁడు అశక్తునివలెను అజ్ఞునివలెను ఇంద్రజిత్తుచేఁ గొట్టుబడి సొత్తుటఁదోఁగి భూమియందుఁ బడియున్నట్లు నటింపవలె' యున్నదో;—లోకమునందు సదాచారమును ప్రవర్తింపఁజేయుటకై యిట్లుండెనని తెలియునది. ఇంద్రజిత్తువలన నాగపాశముపొందుటచేఁ దోషమువచ్చె నేమనఁగా-శుచులును శుద్ధహృదయులును నిష్కపటులు నగువారికి ప్రాణసందేహము గలిగించునంతటియాపత్తువచ్చినను నాశముగలుగదు. అట్లుగాన సత్పురుషులకు కార్యసిద్ధి ఆలసించినను తప్పిపోవదు. కాన పురుషులు శుచిత్వము నిష్కపటత్వము మొదలగు గుణ

ముగా నుండుటం జూచి, సంతోషమున సింహనాదములు సేసి, లాంగూలముల నల్లలార్చిరి. అంత వానరు లెప్పటియట్లు సంతుష్టులయి, భేరులు వాయించిరి, మృదంగములను వాయించిరి, శంఖములు పూరించిరి, సింహనాదములనుం గావించిరి. వృక్షములం గొని పోరునట్టి వానరులు, పరాక్రమమున విజృంభించి మాటికిమాటికి బుజములప్పళించుచు, నానావిధములయిన వృక్షములం బెకలించి వానిని జేత నిడుకొని లక్షలకొలందిని యుద్ధసన్నద్ధులయి నిలిచిరి. వానరులు, మహాధ్వని గలుగునట్లుగా నార్చుచు, రాక్షసులకు భయము గలిగించుచు, యుద్ధంబు సేయంగోరి, లంకాద్వారముల నరికట్టిరి. అంత నర్ధరాత్రమున నా వానరయూథపులు సింహనాదములు సేయంగా, భయంకరమైన యా తుములధ్వని, వర్షర్తువునందలి మేఘముల యుఱుములుంబోలె మిక్కిలియు భయంకరముగా నుండెను. ఇది యేఁబదియవసర్గము.

---

రావణునిపంపున ధూమ్రాక్షుఁడు చతురంగబలసహితుఁడై వచ్చి వానరసేనం జూచుట.

అప్పుడు, బలవంతులయిన యా వానరు లట్లు సింహనాదములు సేయుచుండఁగా మిక్కిలియు దొడ్డగా నున్న యాధ్వనిని రావణుఁడును రాక్షసులును వినిరి. ఆరావణుఁడు మిక్కిలి స్నిగ్ధమును గంభీరమునయిన యాధ్వనిని విని యామంత్రులనడుమ వారలనుజూచి 'వానరులు పెక్కండ్రు మిక్కిలియుబ్బునఁ జేరి, పెనుమేఘములు గర్జించుచున్నట్లు లెంతయు గొప్పధ్వని గలుగ సింహనాదములు సేయుచున్నారు. కావున వీరలకు మిక్కిలియు సంతోషము గలిగినట్లున్నది. ఇది స్పష్టము. ఇందులకు సందేహము లేదు. అది యట్లుకదా. అమ్మహాధ్వనులచే సముద్రమును క్షోభమునొందినది. అచ్చట నన్నదమ్ము లారామలక్ష్మణులు వాఁడిబాణములచే బద్ధులయి యున్నవారు. మిక్కిలియు గొప్పధ్వని యిదిగో వినవచ్చుచున్నది. ఇవి యొకటికొకటి

---

ములుగలవారై యుండవలయునని సజ్జనులకు ధర్మనిశ్చయమును దెలియుట గలుగుచున్నది. 'రావణుని వధించుటకేకదా దేవతలు ప్రార్థింపఁగా విష్ణుఁడు రాముఁడై యవతరించినాఁడు. అతని కాకార్యమే వలయును గాని యీనటన లేల?' యన్నచో దుష్కృతులను నాశము సేయుటవలెనే ధర్మమును స్థాపించుటయు నవతారమునకుఁ బ్రయోజనము. రావణునివధముమాత్రమే ప్రయోజనమగునేని యపుడింత ప్రయాసపడవవలెంతయు వ్యర్థమగును. కాఁబట్టియే 'చాతుర్వర్ణ్యంచ లోకేఽస్మిన్ స్వే స్వే ధర్మే నియోక్ష్యతి' అని చెప్పఁబడినది. చాతుర్వర్ణ్యమును ధర్మమునందు నిలుపుట, కేవలము ధర్మోపదేశము సేసినంతమాత్రమున సిద్ధింపదు. అట్టి యుపదేశము శ్రుతిస్మృతులే చేసియున్నవి. తాను ఆచరించు ఆచారముమూలముగా ధర్మమును బ్రవచనము సేయుటకుఁగదా మనుష్యభావనటనమును జేయఁబడెను. లేకున్న నీనటన మావశ్యకము గాదు. కాఁబట్టి తా నాచరించు నాచారముమూలమున ధర్మమును బ్రవర్తించుటకే రాముఁ డీబాధాదుల నభినయించినాఁడని తెలియునది. గోవిందరాజులు.

విరుద్ధముగానున్నవి. ఈధ్వనివలన వారికి శరబంధము వీఁడినదేమో యని శంకకలు గుచున్నది' అనెను. రాక్షసేశ్వరుఁ డగురావణుఁడు, ఈమాటను మంత్రులతోఁ జెప్పి యచట దాపున నున్న రాక్షసులను జూచి 'ఇప్పు డీ వానరులకందఱకును శోకింపవలసిన కాలమైయుండఁగా వీరెల్ల వారును సంతోషముగా నుండుటకుఁ గలిగియున్న కారణ మేమో శీఘ్రముగాఁ దెలిసికొనిరండు' అని యాజ్ఞాపించెను. రావణుఁ డట్లు అజ్ఞాపిం పఁగా ఆ రాక్షసులు సంభ్రాంతులై ప్రాకారమునెక్కి, మహాత్ముఁడగుసుగ్రీవుఁడు పరి పాలించుచున్న వానరసేనను జూచిరి. మఱియు, మిక్కిలి భయంకరమైన నాగపాశబం ధమునువీడి మహాభాగు లగురామలక్ష్మణులు లేచి సుఖముగనుండఁగా నా రాక్షసులు చూచి విషాదమునొందిరి. భయంకరులగు నారాక్షసులు, గుండియలు భయమున నదు రఁగా, అందఱును ప్రాకారమునుండి దిగి, ముఖములు వెలవెలంబోవ రాక్షసేంద్రుఁ డగురావణునొద్దకుఁ బోయిరి. వారు, మాటలాడుటయందు నిపుణులుగావున, రావణునితో ముఖములు విన్ననై యుండ, రామలక్ష్మణులు శరబంధము వీఁడియున్నా రని యప్రియంపుసమాచారమునంతయు జరిగినది జరిగినట్టుగాఁ దెలుపువారై 'ఇంద్ర జిత్తు యుద్ధమున నాగపాశముల బంధించి యిటునటు చేతులు గదలింపరానట్లు గావిం చిన యాయన్నదమ్ములు, మేటియేనుంగులవలె గంభీరపు నెన్నడగల యారామలక్ష్మ ణులు, యుద్ధరంగమున నాగపాశబంధములు వీఁడి కట్టుత్రాళ్లం ద్రెంచుకొన్న మద గజములవలెఁ జూపట్టుచున్నారు' అని చెప్పిరి. మహాబలవంతుఁడగు రాక్షసేశ్వరుఁ డా రావణుఁడు ఆ రాక్షసులు చెప్పినదివిని చింతయు శోకమును మిక్కిలియుఁ బయికొ నఁగా, ముఖము వెలవెలంబోవ 'ఇంద్రజిత్తు, తాను వరబలమున సంపాదించినవియు భయంకరములును తీక్ష్ణవిషములగు సర్పములవంటివియు అమోఘములును సూర్య సమానములునగు బాణములచే బలాత్కరించి యారామలక్ష్మణుల యుద్ధమున బం ధించినాఁడు. నా పగవా రాయిద్దరును అట్టి బాణములచే బంధింపఁబడియు విడి వడినయెడల నిఁక నీరాక్షససైన్యమునకంతయుఁ బ్రాణసందేహము కలిగినట్లు నాకుఁ దోఁచుచున్నది. మున్ను పెక్కుమార్లు యుద్ధమున నాశత్రువుల ప్రాణములు గొన్న ట్టివై వాసుకింబోని తేజంబున వెలుంగుచుండు బాణములు తుదకు నిష్ఫలము లయి నవిగదా!' అనెను. రావణుం డిట్లు చెప్పి మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై సర్పమువలె నిట్టూ ర్పులు విడుచుచు, రాక్షసులనడుమ ధూమ్రాక్షుఁడను రాక్షసునింజూచి 'నీపరాక్ర మ మతిభయంకరము. నీవు గొప్పరాక్షససైన్యము దీసికొని రాముని వానరులనును వధించుటకు వెడలుము' అని యాజ్ఞాపించెను. రాక్షసరాజగు రావణుఁడు యోధుల బలాబలముల నెఱుంగు బుద్ధిమంతుఁడు గాన యిట్లాజ్ఞాపింపఁగా ధూమ్రాక్షుఁడు మిక్కిలి సంతుష్టుఁడై యతనికి నమస్కరించి రాజభవనమునుండి బయలు వెడలెను. వాఁ డారాజగృహద్వారమునుండి వెలువడి యచ్చటనున్న బలాధ్యక్షునితో 'నేను యుద్ధముసేయఁ గోరియున్నాను. నాబలమునంతయు శీఘ్రముగా నాయత్తపఱుపు

ము. ఆలస్యమెందుకు?' అని చెప్పెను. సేనవెంబడి నున్నయాబలాధ్యక్షుఁడు రావణుని యాజ్ఞఁ జొప్పున ధూమ్రాక్షుఁడు చెప్పినమాటవిని శీఘ్రంబున సైన్యమునంతయు నాయత్తము గావించెను. భయంకరాకారులును బలవంతులు నగు నావానరులు తమతమ శౌర్యములకు సూచకముగా నడుమునఁ గట్టుకొన్న గంటలొప్ప, శూలములు ముద్గరములు మున్నగు నానావిధాయుధములు కేలందాల్చి, మిక్కిలియుబ్బున గర్జించుచు, ధూమ్రాక్షునిఁ బరివేష్టించిరి. రాక్షసులు గదలు, పట్టిసములు నినుపదండములు, ముసలములు, పరిఘములు, భిండివాలములు, భల్లములు, ప్రాసములు, గొడ్డండ్రు మున్నగునవి మెండుగా ధరించి మేఘములవలె గర్జించుచు, నలుదిక్కులనుండియు వెడలిరి. మఱికొందఱు రాక్షసులు కవచధారులయి, ధ్వజాలంకృతములును నానావిధముఖంబులగు ఖరములు పూన్పఁబడినవియు బంగారుకిటికీలతో నొప్పుచున్న రథముల నారోహించి వెడలిరి. బెబ్బులులుంబోలె జెనకరాని రాక్షససింహులు, మిక్కిలి వేగవంతములగు గుఱ్ఱముల నెక్కి కొందఱును, మిక్కుటముగా మత్తిలియున్న యేనుఁగుల నెక్కి కొందఱునుంగా, వెడలిరి. తీవ్రధ్వని గల ధూమ్రాక్షుఁడు బంగారుచే నలంకృతమై, తోఁడేళ్లవంటిముఖములును సింహములవంటిముఖములును గల గాడిదలు గట్టిన దివ్యంబగు రథము నారోహించెను. మహావీర్యశాలియగు నా ధూమ్రాక్షుఁడు బెడిదముగా శబ్దించుచు గాడిదలు బూన్పంబడి యున్న మేటిరథము నెక్కి రాక్షసపరివృతుఁడై పకపకనవ్వుచు దళపతియగు హనుమంతుఁ డున్న పశ్చిమద్వారమునకుఁ బోయెను. భయంకరపరాక్రముఁడును మహాఘోరుండు నై నయారాక్షసుఁ డట్లుపోవుచుండఁగా, వానికడ్డముగా నాకాశమున దుర్నిమిత్తసూచకములయిన పక్షులు నడ్డపడినవి. రథశిరస్సునందు మహాభయంకరమగు గ్రద్దయొకటి వాలినది. పీనుఁగులందినునట్టి బెడిదంపుపక్షులు గుంపులు గట్టి ధ్వజంబు మొనపై వ్రాలినవి. నెత్తుటం దడిసిన తెల్లని పెను మొండె మొకటి వికృతధ్వనిగా రోదనముసేయుచు ధూమ్రాక్షునకు సమీపముగా నేలపయిఁ బడినది. మేఘము నెత్తురువాన గురిసినది. భూమి వడనడ వడంకినది. పిడుగుపడినట్లు మహాధ్వనితో నెదురుగాలి మహావేగంబున వచ్చెను. మఱియు నప్పుడు దిక్కులన్నియుఁ జీఁకట్లు క్రమ్ముటంజేసి యెంతమాత్రము ప్రకాశము లేకుండెను. ఆధూమ్రాక్షుఁడును, రాక్షసభయంకరములును మహాఘోరములు నగు నాయుత్పాతములు పుట్టుటనుజూచి దుఃఖితుఁడయ్యెను. ధూమ్రాక్షునికి ముందుగావచ్చిన రాక్షసులందఱును దుఃఖమున నేమియుఁ దోఁచకుండిరి. అంత నతిభయంకరుఁడును బలవంతుఁడునగు ధూమ్రాక్షుఁడు, ఆయుత్పాతములను సరకుసేయక, రాక్షసులు పెక్కండ్రు పరివేష్టింప యుద్ధోత్సాహంబున పురము వెలువడి, రామబాహుపాలితమై బహువానరమయమై మహాసముద్రమువలె నున్న యవ్వానరసేనం *జూచినవాఁడయ్యె. ఇది యేఁబదియొకఁడవసర్గము.

* రామలక్ష్మణులు నాగబద్ధులయినరాత్రి పాడ్యమియందురు. విదియ తెల్లవాఱఁగా ధూమ్రాక్షుఁడు యుద్ధమునకు వెడలెనని తెలియునది.

—ధూమ్రాక్షుఁడు హనుమంతునిచే హతుండగుట.—

వానరులందఱు, యుద్ధంబుగోరుచు నుండినందున, భయంకరపరాక్రముఁడగు ధూమ్రాక్షుఁడు వెడలివచ్చుచుండఁగాఁజూచి, మిక్కిలి సంతుష్టులయి సింహనాదములుగావించిరి. వానరులు వృక్షములంగొనియు రాక్షసులు శూలములను ముద్గరములనుగొనియు నొకరినొకరు బెట్టిదముగాఁగొట్టుకొనఁగా నయ్యిరువాఁగునకు మిక్కిలియు తుములైనయుద్ధము కలిగెను. భయంకరులగు రాక్షసు లొక్కటిగాఁగూడి భయంకరములును నానావిధములు నగుపరిఘములచేతను త్రిశూలములచేతను నలుగడల వానరులను కండతుండెములు గావించిరి. వానరులును వృక్షములంగొని రాక్షసులను భూమియందుఁ జాపుగాఁ గూలనేసిరి. రాక్షసులును నందులకు మిక్కిలియుఁ గ్రుద్ధులై, ఘోరంబగు కాలాగ్నింబోలినవై కంకపత్రములు గట్టంబడి వంకరలేకుండువాఁడిబాణములఁ గాఁడనేసి నొప్పించిరి. రాక్షసులట్లు, బెడిదములయిన గదలను, పట్టిసములను కూటముద్గరములనుంగొని వానరులను జక్కాడుచుండఁగా వారు మహాబలవంతులుగావున, రోషంబున నుత్సాహం బతిశయిల్ల, నించుకయు వెనుదీయక పోరాడిరి. అట్లా వానరవీరు లపుడు బాణములచేతను శూలములచేతను భిన్నదేహులయి మహారోషమున వృక్షములను శిలలనుం జేకొనిరి. అవ్వానరవీరు లంతకంతకు బెడిదముగా నురవడించుచు, సింహనాదములు సేయుచుఁ, దమతమపేళ్లు గ్గడించుచు భయంకరాకారులగు రాక్షసులం బ్రహరించిరి. అప్పుడు వానరులును నానావిధశిలలును వృక్షములనుంగొనియు రాక్షసులు నానావిధాయుధములనుఁ గొనియు,నొండొరులపయిఁదలపడఁగా,ఆయుద్ధమాశ్చర్యకరమును భయంకరమునయ్యె. కొందఱురాక్షసులు జయశాలురగువానరులచేఁ గొట్టువడి నజ్జుగుజ్జయిరి.కొందఱు రాక్షసులు నోట నెత్తురుగ్రక్కుకొనిరి.వానరులు రాక్షసులను గొందఱను బ్రక్కలంబట్టి రెండుగాఁజీల్చిరి; కొందఱను వృక్షములచే నలియఁగొట్టి పుప్పగావేసిరి. కొందఱను శిలలచేఁ జూర్ణముగావించిరి. కొందఱను దంతములం గొఱికిచీల్చిరి. వానరులువైచిన పర్వతశిఖరములచే, విఱిగి నుగ్గునూచమైనధ్వజములును,కూలినగాఁడిదలును, విధ్వంసితములయిన రథములును, నేలం ద్రెళ్లినరాక్షసకళేబరములును, పర్వతాకారములగు మేటిగజములును, నజ్జుగుజ్జయినగుఱ్ఱములును వానిరౌతులును, ఆయుద్ధభూమియంతయు నిండియుండెను. భయంకరపరాక్రము లగువానరులు మిక్కిలి వేగమున నెగసి యెగసి, తీక్ష్ణము లయిననఖములచే రాక్షసులముఖములను ఛేదింపఁగా, ఆరాక్షసులు, మొగములు విరవిరఁబోవ, తలవెండ్రుకలు విరిసియాడ, నెత్తురుకంపుతో మూర్ఛితులై భూతలమునం బడిరి. మఱికొందఱు రాక్షసులు మిక్కిలియుఁ గుపితులై భయంకరముగ నార్పులిడుచు వజ్రంబులుంబోలె కఠినస్పర్శము లగునఱచేతులనే యాయుధములుగాఁగొని వానరులపయి వేగ దలపడిరి. అట్లారాక్షసులు వేగమునం బయిపయిరాఁగా వానరులు వారికంటెను వేగముగలవారగుటచే, ఆరాక్షసులను బి

డికిళ్లం బొడిచియు, కాళ్లందన్నియు, దంతములం గొఱికియు, వృక్షంబుల మోదియు, హింసించిరి. అట్లు వానరులు ప్రహరించుచుండఁగా నిలువఁజాలక యారాక్షసులు పరుగెత్తిరి. రాక్షసశ్రేష్ఠుఁడగు ధూమ్రాక్షుఁడు, అట్లు రాక్షససైన్యమంతయుం బాఱుచుండుటంజూచి, కుపితుఁడై యుద్ధముసేయ నుత్సుకులయి యున్న వానరులను హింసింప నారంభించెను. వానరులు కొందఱు రాక్షసులచేఁ బ్రాసములఁ గొట్టువడి నెత్తురు గాఱ నేలంబడిరి. మఱికొందఱు ముద్గరములం దాడితులై పుడమిం గూలిరి. కొందఱు వానరులు పరిఘములం గొట్టువడిరి. కొందఱు భిండివాలంబుల తుండెములుగా చీల్పంబడిరి. కొంద ఱడ్డకత్తుల నఱుకంబడి పరవశులై ప్రాణములు విడిచిరి. కొందఱు వానరులు రాక్షసులచే శూలములం దాడితులై నెత్తుట దోఁగియుండిరి. కొందఱు బలవంతులగురాక్షసులకు యుద్ధమున నోర్వంజాలక పాఱిపోయిరి. కొందఱకు ప్రక్కవాటునఁ గొట్టుటచే గుండెకాయలు పగిలినవి. కొందఱు త్రిశూలములచేఁ బొడువంబడి ప్రేఁగులు వెలికి వచ్చునట్లు వెఱుకఁబడి చీల్పఁబడిరి. అట్లు వానరులును రాక్షసులు నొండొరులు నెరసి పెరసి శిలలను వృక్షములును ఆయుధములను వైచి పెనంగఁగా నమ్మహాయుద్ధంబున మిక్కిలియు చప్పుడుగలిగి యెంతయు భయంకరమైనది. అల్లెత్రాళ్లధ్వనులె వీణాధ్వనులుగా, ఆయాసంబున నెక్కిళ్లె తాళంబులుగా, మందగిలినమాటలె గానముగా, ఆ యుద్ధసంగీతమెంతయుఁ బ్రకాశించినది. అప్పుడు ధూమ్రాక్షుఁడు యుద్ధాగ్రమున ధనుర్ధరుఁడై వీర్యాతిశయమునఁ బకపకనవ్వుచు బాణవర్షములు గురియించి వానరులను దిక్కులకుం దఱిమెను. ఇట్లు ధూమ్రాక్షునిచే పీడితమై దుఃఖమునొందియున్న వానరసైన్యమును జూచి, హనుమంతుఁడు, మిక్కిలి క్రుద్ధుఁడై, విశాలమయిన యొకశిలను జేకొని, ధూమ్రాక్షునిపయికిఁ బోయెను. తండ్రియగు వాయుదేవునిం బోలు పరాక్రమశాలియగు హనుమంతుండు కోపంబున కన్నులయెఱుపు రెండింతలు కాఁగా, ఆశిలను ధూమ్రాక్షుని రథముపయిఁ బడవేసెను. అట్లు తనపయికి నాశిలవచ్చుచుండుటంజూచి, ధూమ్రాక్షుఁడు తత్క్షణమున గదచేతంగొని, వేగమున రథమునుండి నేలకులంఘించి నిలుచుండెను. ఆపెనుశిల, ధూమ్రాక్షునిరథమును దానిచక్రములను, నొగలను, గుఱ్ఱంబులను, ధ్వజములను, విల్లుతోనుంగూడ నుగ్గు గావించి పడినది. వాయుకుమారుఁడు హనుమంతుఁడు, అట్లా రాక్షసునిరథమును భగ్నము గావించి, యంత, బోదెలతోను కొమ్మలతోనుం గూడినపెనువృక్షములంగొని, రాక్షసులతో యుద్ధము గావించెను. మఱికొందఱు రాక్షసులు, వృక్షములఁ గొట్టువడి, తలలుపగిలి, నెత్తుటం దోఁగి, నేలంబడిరి. వాయుకుమారుఁడు హనుమంతుఁడు, అట్లు రాక్షససైన్యమును బాఱదోలి పర్వతశిఖరము నొకటింగొని ధూమ్రాక్షుపయి నడరెను. ధూమ్రాక్షుండు వీర్యశాలిగావున నట్లు తనపయికి హనుమంతుఁడు వచ్చుచుండఁగా, తానును గదం జేకొని తోడనే సింహనాదముగావించుచు నాహనుమంతునిమీఁది కడరెను. అంత ధూమ్రాక్షుఁడు క్రుద్ధుఁడై పెక్కుమేకులతోఁగూడిన యాగదను, వేగ

మున హనుమంతునితలపైఁ బడవైచెను. భయంకరాకారముగునాగదచే హనుమం తుఁడు గొట్టువడినవాఁడయ్యెను. హనుమంతుఁడు వాయుసమానబలుఁడుగాన, యా దెబ్బను సరకుసేయక, ధూమ్రాక్షుని నడితలపయిని, ఆపర్వతశిఖరమును బడవైచె ను. ఆధూమ్రాక్షుఁడు పర్వతశిఖరముచే తాడితుఁడై, సమస్తావయవములు విరవిర వ్రేవఁగా, వటాపంచలయిన పర్వతమువలెఁ దటాలున నేలంగూలెను. అంత, హత శేషులగురాక్షసులు, ధూమ్రాక్షుఁడు హతుఁడగుటనుజూచి వానరులు మఱియు పయిఁబడి చంపుచుండఁగా నోర్వఁజాలక భయంబుగొని లంకకుఁ బాఱిపోయిరి. మహాత్ముఁడగు వాయుకుమారుఁ డాహనుమంతుఁడు పగవానిం జంపి నెత్తురుటేఱులు పరపి, శత్రువుఁ జంపుటవలన నలసటనొంది వానరులెల్లఁ బూజింప ముదంబునొంది యుండెను. ఇది యేఁబదిరెండవసర్గము.



## రావణుఁడు వజ్రదంష్ట్రునిఁ బంపుట; అంగదుఁడు వజ్రదంష్ట్రుని సేనను నాశము సేయుట.

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు, ధూమ్రాక్షుఁడు హతుఁడగుటను విని, సర్ప మువలె నిట్టూర్పులు పుచ్చుచు, మిక్కిలియు కోపావేశమునొందెను. అతండు కోపంబున మిక్కిలికలఁగి, వేఁడినిట్టూర్పులు విడుచుచు, శూరుఁడును మహాబలుఁడు నగు వజ్రదంష్ట్రుఁడను రాక్షసునింజూచి 'వీరా! ఇచటనుండి కదలుము. పట్టణము నుండి వెలువడి,రాక్షససేనాపరివృతుఁడవై పోయి,దశరథకుమారునిరాముని సుగ్రీవుని వానరులనెల్లను వధించిరమ్ము' అనెను.మాయావి యగునావజ్రదంష్ట్రుఁడు,రాక్షసరా జగు రావణునిం జూచి'యట్లే'యనిచెప్పి, బలంబులంగూడి పెక్కుబలాధ్యక్షులు పరివే ష్టించిరాఁగా, బయలువెడలెను. అంత నావజ్రదంష్ట్రుఁడు, ఏనుఁగులతోను, గుఱ్ఱ ములతోను, గాడిదలతోను, ఒంటెలతోను, పతాకాధ్వజచిత్రములై యొప్పు రథ ములతోనుంగూడి, చందనకుసుమాదుల నలంకృతుఁడై, విచిత్రములగు బాహుపురు లను మకుటమునను గయిసేసికొని, కవచంబులు బిగించి, విల్లుగొని మిక్కిలియెచ్చరి కతో వేగ బయలువెడలిపోయెను. సేనాపతియగు వజ్రదంష్ట్రుఁడు,పతాకలచే నలం కృతమై,అపరంజిచే రంగారుచు ధగధగమెఱయుచున్నరథమునకుఁ బ్రదక్షిణముగా వించి దానినారోహించెను.అంత పదాతులు,నానావిధములయిన యష్టులును,తోమర ములును, శూలములును, ముసలములును, భిండిపాలములును, పాశములును, శక్తు లును, పట్టిసములును, ఖడ్గములును, చక్రములును, గదలును, వాఁడిగండగొడ్డండ్రు ను మున్నగు నాయుధములను జేకొని వెడలిరి. ఆరాక్షసోత్తములందఱును మంచిమం చివస్త్రములనుదాల్చి యెంతయుఁ బ్రకాశించుచుండిరి. యుద్ధమున సమర్థులగు రాక్ సవీరులు, తోమరములను నంకుశములను చేతం బూని, మిక్కుటంపుమదముగలవై

ఘోరములై, తిరుగుచున్న పర్వతములవలె నొప్పుచున్న యేనుంగుల నారోహించి వెడలిరి. మఱికొందఱు రాక్షసులు, శుభలక్షణయుక్తములును ఘోరములును మహాబలములునగు గజంబులనెక్కి వెడలిరి. అప్పుడట్లు నల్లని దేహములును గాంచనభూషణములునుగలిగి సింహనాదములు సేయుచు వెడలినయాఘోరరాక్షససైనికులు, వర్షాకాలము నల్లనై కారుకొని మెఱపులతోఁగూడి గర్జించుచు నవ్వారిగాఁ బొడతెంచిన మేఘములవలె నొప్పుచుండిరి. వారు, యూథపతియంగదుఁ డుండులంకదక్షిణద్వారమున వెడలిరి. వారలు వెడలుచుండఁగానే యశుభనిమిత్తములు పొడసూపినవి. అప్పుడు మేఘశూన్యమగు నాకాశమునుండి తీవ్రములగు నుల్కలు పడినవి. నక్కలు, అగ్నిజ్వాలలు గ్రక్కుచు భయంకరముగా నఱచినవి. అప్పుడు భయంకరములగు క్రూరమృగములు రాక్షసులమరణమును సూచించెను. రాక్షసయోధులును బోవునపుడు భయమోహితులయి తొట్రిలంబడిరి. మహాతేజుండును బలవంతుఁడునగు వజ్రదంష్ట్రుఁడు, ఈయుత్పాతములన్నియుఁజూచి, ధైర్యమును దిగవిడువక, యుద్ధోత్సుకుఁడై బయలువెడలెను. అట్లారాక్షసులు వచ్చుచుండుటం జూచి జయశీలురగు వానరులు దశదిశలును నిండునట్లు, మిక్కిలి ధ్వనిగా సింహనాదములు గావించిరి. అంత భయంకరులును భయంకరాకారులు నగువానరులు రాక్షసులపై నడరి నొండొరులను వధింపఁగోరుచు, తుములమగు యుద్ధమునుగావించిరి. వారిరుదెగలును మిక్కిలి యుత్సాహంబున నొండొరుఁపయిం గవిసిపోరి, దేహములుదునిఁగి మెడలువిఱిగి, సర్వాంగములు నెత్తుటఁ దోఁగుచుండఁగా, నేలంబడిరి. మఱియుఁ గొందఱు రాక్షసులును, యుద్ధముల వెనుదీయనిశూరులుగాన, పరిఘంబులుగొని వానరులపై నడరి యొండొరులం గవిసి నానావిధము లగునాయుధములను బ్రయోగించిరి. అప్పు డిరువాఁగు, వృక్షములను శిలలను ఆయుధములను బ్రయోగింపఁగాఁ బుట్టినచప్పుడు, మిక్కిలి గొప్పదై భయంకరమై హృదయముల భేదించునట్లుగా నచట వినఁబడినది. అప్పుడు రథనేమిధ్వనియును, ధనుర్ధ్వనియును, శంఖభేరీమృదంగములధ్వనియు తుములమయ్యెను. కొందఱు తమయొద్దం గలయస్త్రముల నన్నిటిని వైచి యవి విఱిగిపోఁగా, బాహుయుద్ధము గావించిరి. వానరులు కొందఱు రాక్షసులను, అఱచేతులంజఱచియు, కాళ్లం దన్నియు, పిడికిళ్లంబొడిచియు, వృక్షములంగొట్టియు, మోఁకాళ్లంగ్రుమ్మియు, వధింపఁగా వారలు భిన్నదేహులయి కూలిరి. యుద్ధమున మిక్కిలియు మదించియున్న వానరులుకొందఱు, రాక్షసులను శిలలచేతఁ జూర్ణముగావించిరి. వజ్రదంష్ట్రుఁడు యుద్ధమున వానరులను బాణములచే నొప్పించి బెదరించుచు ప్రళయకాలమునఁ బాశహస్తుఁడగు యమునివలె, భయంకరాకారుఁడై సంచరించుచుండెను. బలవంతులును నాయుధవిద్యయందుఁ బండితులునగు రాక్షసులు యుద్ధమున క్రోధముచే నొడలు దెలియక నానావిధములయిన యాయుధముల వానరసైన్యములను వధించిరి. అట్లు రాక్షసులు వధించుచున్న రాక్షసుల నెల్లంజూచి, వాలిపుత్త్రుఁడగు నంగదుఁడు, ప్రళయ

కాలాగ్నియుంబోలె క్రోధమినుమడించినవాఁడై యాక్రోధమువలన కన్నులెఱ్ఱఁబా ఱ,వీర్యశాలిగావున, వృక్షమునొకటి పెకల్చికొని, సింహము క్షుద్రమృగములంబోలె, వారి నందఱను జక్కాడెను.ఆ యంగదుఁడు దేవేంద్రుఁడుంబోలె పరాక్రమము మెఱ యుచు భయంకరముగా యుద్ధముగావించెను. అప్పు డంగదున కెదురుపడినరాక్షసు లు భయంకరపరాక్రములయ్యు,నతనివ్రేటునం దలలుపగిలి, వేళ్లుత్రెగినవృక్షములవ లె నేలంగూలిరి.అప్పుడు యుద్ధభూమి,విఱిగినరథములచేతను, అశ్వములచేతను,నానా విధములగు ధ్వజములచేతను, వానరరాక్షసుల దేహములచేతను, రక్తప్రవాహము చేతను గప్పఁబడి భయంకరముగానుండెను. అప్పుడు యుద్ధమున, భూమి,హారకేయూ రాది భూషణములచేతను, వస్త్రములచేతను, శస్త్రములచేతను నలంకృతమై, నక్షత్ర చంద్రాలంకృత మగుశరద్రాత్రివలెఁ బ్రకాశించినది. అప్పుడచ్చట మిగుల గొప్పది యగు నారాక్షససేన, అంగదుని యురవడికి నిలువఁజాలక వాయువేగంబునకు మేఘ ముచలించునట్లు మిక్కిలి చలించినదయ్యె. ఇది యేఁబదిమూఁడవ సర్గము.



## వజ్రదంష్ట్రుఁ డంగదునిచే హతుఁడగుట.

అంత మహాబలుఁ డగునావజ్రదంష్ట్రుఁడు తనసైన్యము కొట్టువడి పాఱుట యు, అంగదుఁడు జయంబున చెలరేఁగుటయును జూచి, మిక్కిలియు క్రోధావేశము నొంది, బెడిదమయినవింటిని వజ్రాయుధమువలె మ్రోరయునట్లు భయంకరముగా సా రించి, వానరసైన్యములపై బాణవర్షములను బరఁగించెను. అప్పుడు శూరులైన యా ముఖ్యరాక్షసులును, రథారూఢులై నానావిధాయుధములంగొని చక్కఁగా యుద్ధముసేసిరి. వానరులలోపల శూరులయిన వానరతిలకు లందఱును, శిలలను జేతులందాల్చి నలుప్రక్కలం గ్రమ్మి చక్కఁగా యుద్ధముగావించిరి. అప్పు డమ్మహా యుద్ధమున రాక్షసులు కపిముఖ్యులపై వేలకొలఁది నాయుధములు వైచిరి. మిక్కిలి యు వీరులై మదపుటేనుంగులం బోలు వానరులు పర్వతములను వృక్షములను మహాశిలలను రాక్షసులపై వైచిరి. శూరులునై యుద్ధంబుల వెనుదీయనివారునై పోరుచున్న యావానరులకును రాక్షసులకును పయిపయిని యుద్ధమధికముగాఁ బ్రవర్తించెను. కొందఱు వానరులును రాక్షసులును దలలుపగిలి, చేతులును గాళ్లు ను విఱిగి, దేహములం దాయుధములు గ్రుచ్చుకొనియుండ, నెత్తురుటందోఁగి, కంకప క్షులు గద్దలుఁ గాకులును ముసరుకొన, నక్కలు గుంపులుకొని నెరసియుండ, నేలంబడి పరుండియుండిరి. మొండెములు పిఱికివారలకు భయంబుపుట్టించుచు నాకాశమున కెగసినవి. అప్పుడు యుద్ధమునందు, వానరులును రాక్షసులును, చేతులును, అఱ చేతులును, తలలును దెగియు, దేహములు నడుమ రెండు తుండెములుగాఁ దుంపఁ బడియు, నేలంబడిరి. అంత, వానరసైన్య మట్లు రాక్షససైన్యమును వధించుచుండఁ

గా, నదియంతయు, వజ్రదంష్ట్రుఁడు చూచుచుండఁగానే భంగమునొంది తూలినద
య్యె. మహాప్రతాపుఁడగు నావజ్రదంష్ట్రుఁడు రాక్షసులందఱు నట్లు వానరులచే
వధింపఁబడుచు భయముగొని యుండుటనుజూచి, రోషంబున కన్ను లెఱ్ఱఁబాఱ,
విల్లుగొని వానరసైన్యంబును భయపెట్టుచుం బ్రవేశించి కంకపక్షి ఱెక్కలు గట్టఁ
బడినవై గుఱిసూటిగాఁ దప్పనిబాణములను వైచి వారిని భేదించెను. ప్రతాపవంతుఁ
డగు నావజ్రదంష్ట్రుఁడు, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై యొక్కొక్కయేటున వానరుల
నేడ్వురను నెనమండ్రను తొమ్మిదిమందిని, ఏవురనుగా నొప్పించెను. అట్లు వానరులనే
కులు బాణములచేమెడలు తెగిపడఁగా, దక్కినవానరులందఱును భయముగొని గుం
పులుగుంపులుగా, ప్రజలు ప్రజాపతి నాశ్రయించునట్లు, అంగదుని నాశ్రయించిరి. అం
త నపుడు వాలికుమారుఁ డంగదుఁడు, వానరసేనలు భంగమునొందుటను జూచి కోప
మునొంది తన్నుఁ దేఱి చూచుచున్న వజ్రదంష్ట్రుని తానును దేఱి చూచి మా
ర్కొనెను. అంగదుఁడును వజ్రదంష్ట్రుఁడును ఒండొరులపయిం గవిసి, మిక్కిలియుఁ
గ్రుద్ధులై, సింగమును మదపుటేనుంగునుంబోలె పోరుచు విహరించిరి. అంత మహా
బలుఁడగు వజ్రదంష్ట్రుఁడు, ఏనుంగును జిల్లకోలలతోఁ బొడుచునట్లు, వాలికుమా
రుఁ డగునంగదునిమర్మస్థానములందు, వేయిబాణములఁ జొప్పించి నొప్పించెను. మహా
బలుండును భయంకరపరాక్రముఁడు నగు నంగదుఁడు, అంగములన్నియు నెత్తుటం
దోఁగ, వజ్రదంష్ట్రునిపై నొకవృక్షము వైచెను. ఆవజ్రదంష్ట్రుఁడు తనపయి కావృక్ష
ము వచ్చుచుండుటం జూచియు తత్తఱపడక, దానిని బాణములచే పెక్కువ్రయ్యలు
గా ఖండించెను. అదియు తునియలై నేలంబడెను. వానరసింహుఁ డగునంగదుఁడు
వజ్రదంష్ట్రునిపరాక్రమముం జూచి, విశాలమైనయొకపర్వతమును గొని, వానిపై
వైచి, సింహనాదమును గావించెను. వీర్యశాలి యగునావజ్రదంష్ట్రుఁడు, పర్వతముతన
పయికి వచ్చుచుండుటఁ జూచి, తొట్రుపడక గద చేతంగొని రథమునుండి లంఘించి నేల
పై నిలిచెను. అంగదుఁడు యుద్ధాగ్రంబున వజ్రదంష్ట్రునిడాయంబోయి యాగదనుబట్టి
లాగికొనెను. అపు డాయంగదుఁడు వైచినపర్వతము, చక్రములతోను నొగతోను గు
ఱ్ఱములతోనుం గూడ వజ్రదంష్ట్రునిరథము నుగ్గుగావించెను. అంత నాయంగదుఁడు
విశాలమై వృక్షములతో నొప్పుచున్న మఱియొకపర్వతము నెత్తి వజ్రదంష్ట్రుని తలపై
వైచెను. ఆవజ్రదంష్ట్రుఁడు, నెత్తురు గ్రక్కుచు మూర్ఛితుఁడై నిట్టూర్పులు పుచ్చు
చు మఱియొకగదను చేతం గవుంగలించుకొని కొంతసేపు సంజ్ఞలేక పడియుండె
ను. ఆరాక్షసుఁడు మూర్ఛదేఱి, మిక్కిలి క్రుద్ధుఁడై, యచట నిలుచున్న వాలిపు
త్త్రు నంగదుని వక్షఃస్థలమున గదచేతఁగొట్టెను. అంత గదను వీడి వాఁ డంగదునితో
నపుడు ముష్టియుద్ధము గావించెను. ఆవానరరాక్షసు లిరువురును ఒకరినొకరు చ
క్కఁగా ప్రహరించుకొనిరి. వారిద్దఱును నొండొరులం గొట్టుకొనుచు, దెబ్బలచే
నెత్తురు దొరుఁగుచుండ, నలజడినొంది, మిక్కిలియుఁ బరాక్రమంబు మెఱయ, నంగా

రక బుధులుంబోలె నొప్పుచుండిరి. అంత మహాతేజుండును వానరకుంజరుఁడు నగునంగదుఁడు, పెక్కుపుష్పఫలములతోడం గూడిన యొకవృక్షమును జేతికి యుద్ధమునకు నిలిచెను. అట్లు వజ్రదంష్ట్రుఁడు నొకవృక్షముఁ జేతికి పట్టుకొని నిలిచెను. ఆయంగదుఁడంత వృషభచర్మము గప్పిన డాలును, వితీవిరియై చిఱుగంటలచే నొప్పుచు మంచి యొరగలిగి యున్న ఖడ్గమును గ్రహింపఁగా నావజ్రదంష్ట్రుఁడును డాలును గత్తియుఁ గ్రహించెను. ఇట్లాయంగదుఁడును వజ్రదంష్ట్రుఁడును, మిక్కిలి కుపితులై యొండొరుల జయింపఁగోరి, నానావిధమార్గంబుల యుద్ధము సేయుచు, బెట్టిదముగా నొకరినొకరు ప్రహరించుకొనిరి. వారిద్దఱును నెత్తురు గాఱుచున్న గాయములతోఁ గూడియుండుటవలనఁ జక్కఁగాఁ బుష్పించిన మోదుగువృక్షములుంబోలె బ్రకాశించుచు, పయిపయి యుద్ధముగావించుచు, మిక్కిలి యలసి మోఁకరించి నేలపయిం గూర్చుండిరి. అంత నిమిషమంతసేపులో కపికుంజరుఁడగు నంగదుఁడు కన్నులు కోపంబున వెలుంగ, కోలచేఁ గొట్టువడిన సర్పమువలె పయికి లేచెను. మహాబలుండగు నంగదుఁడు, చక్కఁగా సానఁబట్టంబడి తలతల మెఱయుచున్న ఖడ్గమున, వజ్రదంష్ట్రుని సొగసైన ఘనశిరస్సును ఖండించెను. దేహమంతయు నెత్తుటం దోఁగియున్న యావజ్రదంష్ట్రునిశిరస్సు రోషంబున కనుగ్రుడ్లు తిరుగుడువడ, ఖడ్గముచేఁ గొట్టువడి రెండు తునియలుగా *నేలంబడినది. అట్లు వజ్రదంష్ట్రుఁడు హతుండగుటను జూచి, రాక్షసులు భయమోహితులై, బెదరుగొని, వానరులు పయిఁబడి చంపుచుండఁగా, దుఃఖితులయి, నోళ్లెండ, మొగంబులు సిగ్గుచే కొంతవాంచి, మరల లంకకుం బరుగెత్తిరి. దేవేంద్రునిప్రభావముగల మహాబలుఁడగు నాయంగదుఁడు, ఆవజ్రదంష్ట్రుని వధించి వానరులచేఁ బూజితుఁడై, వానరసైన్యములనడుమ, దేవతలనడుమ దేవేంద్రుఁడుంబోలె మిక్కిలి సంతుష్టుఁడై యొప్పుచుండెను. ఇది యేఁబదినాలుగవసర్గము.



{ అకంపనుఁడు రావణునిపంపున లంకపడమటిద్వారము నిర్గమించి యచటనున్న హనుమంతుని సేనతో యుద్ధము సేయుట. }

వజ్రదంష్ట్రుఁ డంగదునిచే హతుఁడగుటవిని, రావణుఁడు తనమోఁలఁ జేతులు మొగుడ్చుకొని నిలుచున్న బలాధ్యక్షుఁడగు ప్రహస్తునింజూచి, 'భయంకరపరాక్రములై పగవారి కెదిరింప నలవిగాకున్న రాక్షసులు, సమస్తాయుధములం గుశలుఁడై యున్న యకంపనుని మున్నిడుకొని, శీఘ్రముగా యుద్ధమునకు వెడలుదురుగాక. ఈ యకంపనుఁడు యుద్ధమునఁ బగవారి నడఁచువాఁడు; తనసేనం గాచువాఁడు. గట్టి సేనానాయకుఁడు; యుద్ధములఁ బ్రసిద్ధుఁడు. మఱి యెప్పుడును నామేలు గోరుచుండువాఁడు; ఎప్పుడును యుద్ధమునందు ప్రీతిగలవాఁడు. పగవారిం దపింపఁజేయు-

* తృతీయయందు వజ్రదంష్ట్రునివధమని తెలియునది.

నీయకంపనుఁడు, రామలక్ష్మణులను, మహాబలుఁడగు సుగ్రీవునిని జయించి భయంకరు లగునితరవానరులనుగూడ వధింపఁగలఁడు' అనెను. మహాబలుఁడును, శీఘ్రపరాక్రముఁడు నగునా ప్రహస్తుఁ డారావణునియాజ్ఞను గయికొని, యుల్లే సేనను వేగిరముగ సన్నాహము గావించెను. అంత, బలాధ్యక్షునియాజ్ఞచే మేటిరాక్షసులు, నానావిధాయుధములనుగొని, భయంకరములగు కన్నులతోను నాకారములతోను నొప్పుచు, యుద్ధమునకు పురమునుండి బయలువెడలిరి. అంత నపుడు, మేఘమువలె స్థూలుఁడై మేఘమువలె నల్లని యాకారమునుగలిగి యుఱుముంబోని పెద్దకంఠధ్వనితోఁ గూడిన యకంపనుఁడు, మేలిబంగారుకుండలములు దులకింప, విఱివియైన యొకరథము నారోహించి భయంకరులగు రాక్షసులచేఁ బరివేష్టితుఁడై యుద్ధమునకు బయలువెడలెను. దేవతలకుఁగూడ మహాయుద్ధమున నేని, కంపింపఁజేయరానివాఁడు గాన యకంపనుఁడని వానికిఁ బేరుగలిగినది. వాఁ డారాక్షసులనడుమ తేజంబునంజేసి సూర్యుఁడుంబోలె వెలుఁగుచుండెను. అకంపనుఁ డట్లు యుద్ధము సేయఁగోరి సంరంభమునఁ బోవుచుండఁగా, అతనిరథమునకుఁ గట్టినగుఱ్ఱములకు, ఆకస్మికముగా దైన్యముకలిగెను. యుద్ధంబును గోరియాడు నాయకంపనునకు, ఎడమకన్నదిరినది. ముఖము వెలవెలఁ బోయినది. కంఠధ్వనియు డగ్గుత్తిక పడినది. అంతకుమున్ను తెలివిడిగా నుండినపగ లప్పుడు, పెద్దగాలి సుడియుఁగా మబ్బుక్రమ్మినదయ్యెను. మృగములును పక్షులు నన్నియు క్రూరముగాను భయంకరముగాను గూయిడినవి. సింగములకుంబోలె నున్నతములగు మూఁపులుగలిగి, బెబ్బులివలె పరాక్రమంబున విలసిల్లు నా యకంపనుఁడు, ఆ యుత్పాతములను బాటింపకయే యుద్ధభూమికిం బోయెను. అతఁడు రాక్షసులతోఁగూడ నట్లు యుద్ధమునకు వెడలుచుండఁగా, వారలధ్వని మిక్కిలియు బెట్టిదమై సముద్రమునంతయుఁ గలంచునట్లు చెలంగినది. వానరులమహాసైన్యము, ఆధ్వనికి మిక్కిలి భయపడి, వృక్షములను పర్వతములను ఆయుధములుగాఁ గొని యుద్ధముసేయ నిలిచియుండెను. రామునినిమిత్తమునను రావణునినిమిత్తమునను వరుసగా ప్రాణములునైన విడువఁబూనియున్న వానరులకును రాక్షసులకును, మిక్కిలి రౌద్రముగా యుద్ధముజరిగెను. ఆవానరులును రాక్షసులును నందఱును, మిక్కిలి బలవంతులు, అందఱును శూరులు, పర్వతాకారులు. కాఁబట్టి వా రొండొరులం జంప నువ్విళ్లూరుచుం బోరిరి. అతిబలవంతులగు నా యిరుదెగలవారును యుద్ధంబున సేయుచున్న సింహనాదములవలనను క్రోధమున నొండొరులంజూచి బొబ్బలిడుటవలనను బుట్టినధ్వని మిక్కిలియు బెట్టిదముగా వినఁబడెను. ఎఱుపువన్నెగల నేలదుమ్ము, వానర రాక్షసుల త్రొక్కుళ్లవలన రేఁగి మిక్కుటముగాఁ బర్వి యత్యంతభయంకరమై పదిదిక్కులను గ్రమ్మినదయ్యె. మఱియు నుదికిన తెల్లపట్టువలెఁ దెల్లగాఁ గొండొకచోఁ గనుపట్టు నేలదుమ్ము గ్రమ్మియుండుటంజేసి, ఆయుద్ధభూమియందు, అన్యోన్యపదార్థములనుగాని, యొండొరులనుగాని, వాన

రరాక్షసులు కనుఁగొనఁజాలరైరి. ఆయుద్ధమున నట్లు దుమ్ము గ్రమ్మఁగా ధ్వజములుగాని,పతాకలుగాని, కవచముగాని, గుఱ్ఱముగాని, ఆయుధముగాని, రథముగాని,యెంత మాత్రమును గానఁబడదయ్యె. ఆ దొమ్మియుద్ధమున, సింహనాదములు సేయుచు నొండొరులపై కడరుచున్న యా వానరరాక్షసుల ధ్వనిమాత్రము మిక్కిలి గొప్పదై వినంబడుచుండినదికాని మఱి యితరవస్తువు లేవియుఁ గానరావయ్యె. అట్లు దుమ్ము క్రమ్ముటవలన, చీఁకటి యొదవఁగా నపుడు వానరులును తమవారని తెలియనేరక మిక్కిలి క్రుద్ధులై వానరులనే ప్రహరించిరి. అట్లె రాక్షసులును రాక్షసులనే కొట్టులాడిరి. అప్పుడు వానరులును రాక్షసులును, చీఁకటి నొండొరులం దెలియక పగవారినిని దమవారినిని వధించుకొనుచు యుద్ధభూమినంతయు నెత్తుటం దడిపి, త్రొక్కుళ్లచే బురదగావించిరి. అంత నెత్తురు వెల్లువలుగాఁ బొరుఁగుటచే దుమ్మంతయు దడిసి యడఁగిపోయెను. యుద్ధభూమియంతయుఁ బీనుంగుపెంటలచే నిండినది. వానరులును రాక్షసులును, వృక్షములను, శక్తులను, శిలలను, ప్రాసములను, గదలను, పరిఘములను, తోమరములను గొని, పరాక్రమంబున నొండొరులపయిం గవిసి యుద్ధముగావించిరి. ఆయుద్ధమున పర్వతాకారులును భయంకరకర్ములు నగువానరులు, ఇనుపగుదియలవంటి తమబాహువులతోఁ బెనఁగులాడుచు రాక్షసులను వధించిరి. రాక్షసులును మిక్కిలి కుపితులై ప్రాసములను తోమరములనుగొని మిక్కిలి దారుణములగు నయ్యాయుధములచే వానరుల వధించిరి. రాక్షససేనాపతియగు నకంపనుండు మిక్కిలి క్రుద్ధుండై భయంకరపరాక్రము లయినరాక్షసులనెల్ల, ఆకపులను జంపుచుండుటంజట్టి, మిక్కిలియు గారవించెను.వానరులును రాక్షసులను మార్కొని, వారలచేతియాయుధములను వీర్యముననొడిసి పెఱికికొని గొప్పవృక్షములను పెనుశిలలను వైచి పటిమలు గావించుచుండిరి. ఇంతలో, కుముదుఁడు నలుఁడు మైందుఁడు ద్వివిదుఁడు ననెడి వానరవీరులు క్రుద్ధులై మిక్కిలి యురవడింపసాఁగిరి. మహావేగులగు నావానరయూథపతులు రాక్షససేనాముఖమును జేరి, వృక్షములంగొని విలాసముతో, మహాయుద్ధము గావించిరి. ఆవానరులు నలువురును రాక్షసులను గుంపులుగుంపులుగా నెంతయు వధించిరి. ఇది యేఁబదియైదవసర్గము.



## అకంపనుఁడు హనుమంతునిచే హతుఁడగుట.

అకంపనుఁడు, అవ్వానరోత్తములట్లు యుద్ధమునమిక్కిలి గొప్పకార్యమును గావించుటం జూచి తీవ్రకోపమునొందినవాఁడయ్యె. అతఁడు ఆశత్రువులుగావించినకార్యముంజూచి క్రోధమున నొడలు దెలియక మేటివింటిని సారించుచు సారథినిజూచి 'సారథీ! పెక్కండ్రు వానరులు చేరి మనరాక్షసులను మిక్కిలియు ననేకుల యుద్ధమున రూపుమాపుచున్నారే! ఆస్థలమునకే శీఘ్రముగా రథముదోలుము. ఇదిగో నాయొదు

ట,బలవంతులును భయంకరకాయులునగు వానరులు వృక్షములను బర్వతములను ఆయుధములుగాఁ గొనియున్నారుచుమీ! యుద్ధంబున సమర్థులని పొగడ్తగాంచిన యవ్వానరుల వధింపఁగోరియున్నాను. వీరలచేతనే యీరాక్షససైన్యమంతయుఁ జీకాకునొందినట్లు చూపట్టుచున్నది.' అనెను. అంత సారథికోత్తముఁ డకంపనుండు వేగవంతములగు గుఱ్ఱములు పూన్చినయారథమును దోలించి, క్రుద్ధుండై బాణసమూహములచే నావానరుల నొప్పించెను. వానరులు యుద్ధమున నాయకంపనుని యెదుట నిలువనేచాలరైరనఁగా నిఁక యుద్ధముసేయలేరైరని చెప్పనేల? వానరులు వానిబాణములచే భంగమునొంది యందఱును పరుగెత్తిరి. మహాబలుఁడగు హనుమంతుఁడు, అట్లకంపనునిచేతం జిక్కి మృత్యువుబారిం బడునట్లున్న యావానరులనుజూచి యకంపనుని దారసించెను. వీరులయిన వానరయూథపులందఱును, యుద్ధంబున నమ్మహాకపి తమకు తోడ్పడుటను జూచి మిక్కిలి సంతుష్టులయి, యందఱును జేరి యతనిని బరివేష్టించిరి. బలవంతు లయినయావానరయూథపతులు హనుమంతుఁడు వచ్చి నిలుచుటంజూచి, బలవంతుఁడగు నవ్వానరవీరుని నాశ్రయించి నిలిచినవారయిరి. అకంపనుఁడు పర్వతాకారుఁడగు హనుమంతునిపై, ఇంద్రుఁడు పర్వతముపై వర్షధారలు గురియునట్లు బాణముల గురియించెను. ఆహనుమంతుఁడు మహాబలుఁడుగావున, తన దేహమునంబడిన వాఁడిబాణజాలములను సరకుసేయక యాయకంపనుని వధింపవలయునని మనంబున నిశ్చయించెను. మహాతేజుండగు వాయుకుమారుఁ డాహనుమంతుఁడు, బలిమిమై భూమినివడఁకించున ట్లడుగులిడుచు నారాక్షసునిపైకిఁ దలపడెను. దిశలు పిక్కటిల్ల సింహనాదము సేయుచుఁ దేజంబున మిక్కిలి వెలుంగుచునున్న యాహనుమంతునిరూపము పట్టపగలింటిసూర్యునిబింబముపగిదిఁ దేఱిచూడ రాకుండెను. వానరశ్రేష్ఠుఁడు హనుమంతుఁడు తనచేత నాయుధము లేకుండుటం దెలిసి మిక్కిలి కుపితుఁడై వేగ యొకపర్వతమును బెకలించెను. వీర్యవంతుఁ డగు నాహనుమంతుఁడు అమ్మహాపర్వతము నొకచేతంబట్టుకొని మహాధ్వనిగలుగునట్లు సింహనాదముసేసి గిఱగిఱం ద్రిప్పెను. అంత నాహనుమంతుఁడు యుద్ధమున మున్ను దేవేంద్రుఁడు వజ్రముంగొని నముచిపయికిం బోయినట్లు, అమ్మహాపర్వతమునుగొని రాక్షసశ్రేష్ఠుఁడగు నాయకంపనునిపయికిం బోయెను. అకంపనుండు తనమీఁదికి పర్వతశిఖరము నెత్తికొని యతఁడు వచ్చుటంజూచి, దూరమునందే,యర్ధచంద్రాకారములగు మహాబాణములచే దానిని బ్రద్దలు గావించెను. ఆపర్వతశిఖరము, ఆకాశముననే యారాక్షసునిబాణములచే ఖండితమై తుత్తుమురుగా నేలంబడుటనుజూచి, హనుమంతుఁడు కోపావేశము నొందెను. అతఁడు కోపమును గర్వమును బెనఁగొనఁగా, మహాపర్వతమువలె మిక్కిలి యున్నతమయిన యొకమద్దిచెట్టుంజూచి దానిని బెకలించెను. మహాతేజుండు హనుమంతుఁడు, వెనుకో దగల యామద్దిమ్రాఁకునుగొని, మిక్కిలి సంతోషమున బిట్టునవ్వుచు, యుద్ధమున దానిని గిఱగిఱం ద్రిప్పెను. హనుమంతుఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁ

డై వేగంబోవునవు డతనితోడలయురవడిని గొబ్బున వృక్షములు విఱిగిపడెను; వద ఘాతమున భూమియు బ్రద్దలువాఱెను. అప్పుడు బుద్ధిమంతుఁడగు హనుమంతుఁడు, ఆ మద్దివృక్షముంగొని, ఏనుంగులను వానిమావంతులను, రథములను అందలిరథికులను, కాలుబంట్లనుంగా నిట్లు పెక్కురాక్షసులను నపుడు వధించెను. క్రుద్ధుఁడగుయముని వలెను గ్రుఁడై రాక్షసుల ప్రాణములను హరించుచున్న యాహనుమంతుంజూచి, రాక్షసులు భయంబునం బాఱిరి. వీరుఁడగు నకంపనుఁడు, హనుమంతుఁడు కుపితుఁడై వచ్చుటయు రాక్షసులందఱు భయముగొని పాఱుటయుంజూచి, కోపమునొంది సింహనాదముగావించెను. ఆయకంపనుండు తీక్ష్ణములై మర్మభేదకములగు పదునాలుగు బాణములచేత మహావీర్యశాలియగు హనుమంతుని నొప్పించెను. వీరుఁడగు నాహనుమంతుఁడు, అప్పుడు పెక్కుమార్లు బాణములు జడిగొని మేనం గ్రుచ్చుకొనఁగా వృక్షములు మొలచియున్న పర్వతమువలెఁ జూపట్టుచుండెను. మహాకాయుఁడును మహావీర్యుండును మహాధైర్యుండునగు నాహనుమంతుఁడు పుష్పించినయశోకవృక్షమువలె రక్తవర్ణుండై, పొగలేకమండునగ్నిహోత్రమువలెఁ దేజరిల్లుచుండెను. అంత నా హనుమంతుఁడు మఱియొకవృక్షమును బెకలించి మిక్కిలియురవడినూని, శీఘ్రంబున, రాక్షసోత్తముఁ డగునాయకంపనుని శిరస్సునం గొట్టెను. మహాత్ముఁ డావానరసింహుఁడు హనుమంతుఁడట్లు వృక్షమునం గొట్టఁగా, ఆయకంపనుఁడు హతుఁడై నేలఁబడి మృతినొందెను. రాక్షసశ్రేష్ఠుఁడగు నకంపనుఁ డట్లు నిహతుఁడై నేలంబడియుండుటనుజూచి, రాక్షసులందఱును భూకంపము గలిగినప్పుడు వృక్షము లల్లలాడునట్లు మిక్కిలియు వ్యథనొందిరి. ఆరాక్షసులందఱు నట్లు పరాజయమునొంది యావానరులు వెంబడించి తఱుమఁగా, దిగులుగొని, యాయుధములు పాఱవైచి లంకకుఁ బరుగెత్తిరి. ఆరాక్షసు లట్లపజయమునొంది, తలవెండ్రుకలు ముడివీడి విరియఁబాఱ, తడఁబడుచు మానంబుసెడి, దేహమంతయుఁ జెమటగాఱ నూర్పులుపుచ్చుచు, నతివేగంబునఁ బరుగిడిరి. వార లపజయమువలన మిక్కిలియు తెలివితేటకలంగి మూఢులయి యొండొరులంగొట్టుకొనుచు భయమున మాటిమాటికి వెనుకఁ దిరిగి చూచుచు, లంకాపురమును జొచ్చిరి. ఆరాక్షసులందఱును లంకకుఁబోయినపిమ్మట, మహాబలులగు వానరులందఱును జేరి, హనుమంతునిం బూజించిరి. బలసంపన్నుఁడగు నాహనుమంతుఁడును, సంతుష్టుఁడై 'మీసాహాయ్యమువలననే నాకుజయముగలిగినది గాని వేఱుగాదు' అని యావానరులందఱను వారివారిపరువునకుం దగునట్లు, బదులు పూజించెను. జయలక్ష్మీ విరాజితులగు నావానరులు, హనుమంతుఁ డకంపనుని వధించుట యెల్లరకుం దేటపడునట్లుగా, తమబలముకొలఁదిని, సింహనాదములు గావించిరి. ఆసింహనాదములకు బలవంతులగు రాక్షసులుగూడ నదరిపడిరి. వాయుకుమారుఁ డా హనుమంతుఁడు అట్లురాక్షసులను దలపడిసంహరించి, భయంకరుఁడును, శత్రునాశకుండును బలవంతుఁడునగు కైటభాసురుని వధించిన మహావిష్ణువుంబోలె సేనాముఖ

మున వీరశోభావిరాజమానుండై యెంతయు విలసిల్లుచుండెను. అప్పుడు, ఆహనుమం తుని, ఆకాశమునం బిండుగొనియున్న దేవతలందఱును బూజించిరి. అట్లు రాముఁడు ను, మహాబలశాలియగు లక్ష్మణుండును,సుగ్రీవుఁడు మొదలయిన వానరులును,మహా బలుఁడగు విభీషణుఁడును, హనుమంతు నెంతయు గారవించిరి. ఇది యేఁబదియాఱవ సర్గము.

---

## ప్రహస్తుఁడు యుద్ధమునకు వచ్చుట.

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు, అకంపనుండు వధింపఁబడెనని విని, క్రుద్ధుఁడై, కొంచెము మొగమున దైన్యమునుం బొంది, తనయొద్ద నున్న మంత్రులవంకఁ జూపు నిగిడ్చెను. రాక్షసాధిపుఁడగు రావణుఁడు, కొంతసేపు, విచారమగ్నుఁడై యుండి, యంత మంత్రులతో నాలోచించి, పిదపఁ, బూర్వాహ్ణమున లేచి సేనా వ్యూహముల నన్నిటిని జూచుటకై లంకయంతటఁ దిరిగెను. అతఁడు, రాక్షసస మూహములచే చక్కఁగా రక్షితమై, పెక్కుసేనావ్యూహములతోఁగూడి, పతాకా ధ్వజపంక్తులచే వెలయుచున్న లంకాపురమునంతయుఁ జూచెను. ఆరాక్షసేశ్వరుఁడు రావణుఁడు, లంకచుట్టు వానరులు ముట్టడివేసి యుండుటనుజూచి, సహింపక నిర్దేశించుటకుం దగుసమయమున, యుద్ధపండితుం డగుప్రహస్తునింజూచి, 'నీవు యుద్ధము న నిపుణుండవు. నీకుఁ దెలియనిది లేదు. పగవారిసైన్యములు తటాలున పట్టణము చుట్టు ముట్టడించి పీడించుచుండునపుడు * దానిని విడిపించుటకు యుద్ధమునకంటె వే ఉపాయము నాకుఁ దోఁపలేదు. ఇట్టి కార్యభరమును, నేనుగాని, కుంభకర్ణుఁడు గాని, నా సేనాపతివగు నీవుగాని, యింద్రజిత్తుగాని, నికుంభుఁడుగాని వహింపవలె ను గాని యితరులు వహింపలేరు. కాఁబట్టి, అట్టి మహాబలసంపన్నుఁడవగు నీవు, శీఘ్రమున సైన్యమునుగొని వశమున నుంచుకొని వానరులెల్ల నుండుస్థలము నకుఁబోయి గెలుపునొందరా వెడలుము. నీవు యుద్ధము సేయను వలదు. అందు లకై యూరక వెడలినంతమాత్రనే చపలమగు నావానరసైన్యము, రాక్షసోత్త ములు గావించు సింహనాదధ్వనులను విని, భయమునం బాఱఁగలదు. వానరులు ధైర్యరహితులు, యుద్ధశిక్ష నొందనివారు, మఱి చపలచిత్తులు. కాన, యేనుంగు లు సింగముగర్జనము విని నిలువఁజాలనట్లు, నీసింహనాదమును విని సైరించి నిలువఁ జాలరు. ప్రహస్తా ! అట్లావానరసేనయంతయుఁ బాఱిపోయినపిమ్మట, రాముఁడును, లక్ష్మణుఁడును, తమమాట వినువా రెవ్వరును లేమింజేసి, పట్టుమాలి, నీచేతం జిక్కు

---

* ఇందులకు 'నాన్యం యుద్ధాత్ప్రపశ్యామి మోక్షం యుద్ధ విశారద' అనిమూలము. 'నాన్య యుద్ధాత్' అని పాఠాంతరమున 'మఱియొకరు యుద్ధముచేయుటవలన దీనిని విడిపించుట గలుగునని నాకుఁ దోఁపలేదు.' అని యర్థాంతరము గ్రాహ్యము.

దురు. 'యుద్ధమున మనకుఁగూడ హాని కలుగఁగూడునుగాన దానిని చేయకుండుట యే మే' లందువా? మనము యుద్ధము సేయకున్నచో శత్రువులు విడువరుగాన వారివలన మనకు మరణముగలుగుట నిశ్చయము. యుద్ధము సేసినచో మరణమే కలుగునో జయమే కలుగునోయని నిశ్చయింపరాదు; కనుక మరణము గలుగుట సందేహము. ఇట్లు యుద్ధము సేయనిచో నిస్సందేహముగాఁ గల్గు మరణముకంటె యుద్ధము సేయఁగా సందేహముగాఁ గల్గు మరణమే మేలు. కాన యుద్ధము సేయకుండుటకన్న సేయుటయే మేలు. ఇదియే నా యభిప్రాయము. ఇఁక దీనికిఁ బ్రతికూలముగాఁగాని యనుకూలముగాఁగాని మఱేది మాకు హితమని తలఁచుచున్నావో దానినిఁ జెప్పుము. అదియే మాకును హితమగు' ననెను. రావణుఁ డిట్లు చెప్పఁగా, సేనాపతియగు ప్రహస్తుఁడు శుక్రుఁ డసురరాజుతోఁబోలె నారావణునితో 'రాజా! మున్ను నిపుణులగు విభీషణుఁడు మొదలగు మంత్రులతోఁగూడ మన మీవిషయము నాలోచించినదియేకాని క్రొత్తకాదు. అప్పు డొక్కమతముగాక ఒక్కొక్కఁడును ఒక్కొక్కమతముగా నాలోచింపఁగా మనకు జగడముగూడఁ గలిగినది. దానిచేతనేకదా విభీషణుఁడు వెడలిపోయెను. సీత నొసంగుటచే మేలు గలుగుననియు నియ్యనిచో యుద్ధము గలుగుననియు నేను నిశ్చయించియుంటిని. అప్పు డెట్లు నిశ్చయించితినో యట్లే యిది కలుగుట మనము చూచితిమి. నా మాట యటుండనీ. నీవు భూషణాదిదానములచేతను సమ్మానముతోఁ గూడిన ప్రియభాషణములచేతను సాంత్వవచనములచేతను నన్ను నెప్పుడును బహూకరించుచున్నాఁడవు. ఇట్టి నేను కాలమువచ్చినప్పుడు నీకు ప్రియమైన దేదిచేయను? ఏదిగాని చేయుదును. నాకుఁ బ్రాణముగాని, పుత్రులు, భార్యలు, ధనములు మొదలగునవిగాని రక్షించుకొనవలసినది లేదు సుమీ. ఇదిగో నీకుఁగా, యుద్ధ మనునగ్నిహోత్రమునందు నా ప్రాణములనుగూడ వేల్చెదను. జూడుము' అనెను. సేనాపతియగు ప్రహస్తుఁడు తనయేలినవాఁ డగు రావణునితో నిట్లుచెప్పి, తనముందట నున్నబలాధ్యక్షులనుజూచి, 'మిక్కిలియు గొప్పదియగు రాక్షససైన్యమును శీఘ్రముగాఁ దీసికొనిరండు? ఇప్పుడు, యుద్ధాంగణమునందు, వజ్రములవంటి నావాఁడిబాణముల యురవడిచే హతులయిన వానరులమాంసములను, మాంసభక్షకములగు పక్షులు, తనివిదీరం దిని తృప్తినొందఁగలవు' అనెను. ఇట్లు ప్రహస్తుఁడు చెప్పఁగా, ఆసేనాధ్యక్షులు వేగిరపడి, యాలంకానగరమున రాక్షససేన సన్నద్ధముగావించిరి. అంత ముహూర్తమాత్రమున, నాలంకయంతయు గజంబులచే నిండినట్లు, తీక్ష్ణములగు నానావిధాయుధములను ధరించిన రాక్షసవీరులచే నెరసినదయ్యె. అప్పుడు రాక్షసవీరులు, అగ్నిహోత్రమున పలువిధములగు శాంతిహోమములు సేయుటవలనను, బ్రాహ్మణులను గంధపుష్పాదులచే నర్చించుటవలనను, అచ్చట వాయువు ఆజ్యగంధముతోఁగూడి, బ్రాహ్మణార్చనమునందలి పుష్పాదుల గంధముతోను బెరసి

వీచినది. అప్పుడు యుద్ధసన్నద్ధులగు రాక్షసులు, మిక్కిలియుబ్బున విజయమంత్రములచే మంత్రింపఁబడిన నానావిధపుష్పమాలికలను దీసికొని ధరించినవారయిరి. ఆ రాక్షసులు విండ్లుగొని కవచంబులుధరించి వేగంబునవచ్చి రాజగు రావణునింజూచి యభివందనముగావించి, ప్రహస్తునిఁ బరివేష్టించిరి. అంతఁ బ్రహస్తుఁడు రాజగు రావణునివీడ్కొని, భయంకరమగు భేరినివాయింపఁజేసి, సమస్తాయుధముల సమకట్టంబడి దివ్యంబై యొప్పు రథము నారోహించినవాఁడయ్యె. ఆరథము మిక్కిలివేగముగల యశ్వములు పూన్పంబడి, సమర్థుఁడగుసారథిచే చక్కఁగాతోలంబడినదై మేఘగర్జనమువలె ధ్వనించుచు, చంద్రునివలె నాహ్లాదకరమై సూర్యునివలెఁ దేజరిల్లుచునుండెను. దానికిఁ జెనకరాని సర్పధ్వజము గట్టంబడియుండెను. అది మంచికప్పుగలిగి చక్కనిచక్రములతోను బంగారు కిటికీలతోనుగూడి నిజకాంతిచే కాంతిగల తక్కినపదార్థములను బరిహసించుచున్నట్లుండెను. అంతఁ బ్రహస్తుఁడు రావణుని యాజ్ఞఁగొని యారథము నారోహించి మిక్కిలి గొప్పసైన్యము బలసిరాఁగా శీఘ్రమున లంకనుండి వెడలెను. అంత సేనాపతి ప్రహస్తుఁడు వెడలఁగానే, మేఘధ్వనులంబోలిన భేరీధ్వనులును నానావిధవాద్యశబ్దములును శంఖధ్వనియు సముద్రమునుప్పొంగఁజేయునట్లు దిక్కులు పిక్కటిల్ల వినఁబడినవి. భయంకరాకారులును మహాకాయులు నగురాక్షసులు భయంకరధ్వనులతో నార్పులు సెలంగ, ప్రహస్తపురస్సరులై ముందటఁబోయిరి. నరాంతకుఁడు, కుంభహనుఁడు, మహానాదుఁడు, సమున్నతుఁడు ననెడి యీప్రహస్తునిమంత్రులు నలువురును, అతనిని బరివేష్టించి నడచిరి. ఆప్రహస్తుఁడు వ్యూహములుగా తీర్పంబడి గజసమూహములకు సాటియై యతిభయంకరముగానున్న యమ్మహాసైన్యముతోఁగూడి తూర్పుద్వారమున వెడలెను. ఆప్రహస్తుఁడు, సముద్రప్రవాహమువలె నమ్మహాసైన్యము పరివేష్టించిరాఁగా, ప్రళయకాలమునందు సమస్తమును తుదముట్టించు యముఁడుంబోలె శీఘ్రమున బయలువెడలెను. ఆప్రహస్తుఁడును, ఆరాక్షసులును బ్రయాణకాలమునం గావించిన సింహనాదముల ధ్వనికి, లంకయందలి సమస్తజంతువులును బెదరి వికృతస్వరముల నఱచినవి. మాంసరక్తాహారములగు పక్షులు, మేఘశూన్యమయిన యాకాశముంజేరి, రథమునకు నపసవ్యముగాఁ జుట్టుచుట్టినవి. నక్కలు భయంకరముగా నోట నగ్నిజ్వాలలు గ్రక్కుచు నఱచినవి. ఆకాశమునుండి యుల్కలుపడినవి. వాయువును బరుషముగావీచెను. చంద్రసూర్యాదిగ్రహములును పరస్పరము యుద్ధముసేయుచు నెంతమాత్రము ప్రకాశింపకుండినవి. మేఘములు బెట్టిదముగా నుఱుముచు, ఆప్రహస్తునిరథమువీఁద నెత్తురుగురిసి యతనిముందు నడచువారిని తడిపినవి. గద్దయొకటి ధ్వజాగ్రమునందు దక్షిణముఖముగా వ్రాలి, రెండుతెక్కలనును ముక్కుతో గీఱుకొనుచు, నిలిచెను. దానింజూడఁగా ప్రహస్తునిముఖకాంతి,యంతయునుమాసి వెలవెలంబోయెను. అశ్వములను తోలుటయందు నిపుణుఁడైన సారథి

పెక్కుమార్లు యుద్ధరంగమున సారథ్యము చేయుచుఁ జొచ్చియుండియు, సూతకులమునఁ బుట్టినవాఁడగుటచే మునికోలపట్టు మెలుపు నలవడినవాఁడయ్యును, వాని చేతనుండి మునికోల తటాలున నేలంబడెను. బయలు వెడలునపుడు ప్రహస్తునికి, అస్త్రవసువులకుఁగూడ దుర్లభమయి తలతల మెఱయుచుండిన కాంతిపెంపు, ముహూర్తమాత్రమున నశింపఁగా నతఁడు వివర్ణుఁడై నిరుత్సాహుఁడయ్యె. సమభూమియందే యతనిగుఱ్ఱములు నడతొట్రిలఁ బడినవి. బలపౌరుషములం బ్రఖ్యాతిగాంచిన ప్రహస్తుఁడు వెడలివచ్చుచుండుటంజూచి వానరసైన్యములు నానావిధాయుధములు ధరించి యుద్ధంబున కెదురునిలిచిరి. అంత వానరులు, ఆయుధములకై వృక్షములను బెకలించుటచేతను పెనుశిలలను దీయుటచేతను మిక్కిలి తుములమయిన మహాధ్వని గలిగినది. రాక్షసులును వానరులును, నట్లు పెడబొబ్బలిడుచును సింహనాదములు సేయుచుండఁగా నయ్యిరువాఁగును సంతుష్టములై యుండెను. వేగవంతులును, సమర్థులునై, ఒండొరుల వధింపఁగోరుచు యుద్ధంబునకుఁ జీరుచునున్న వానరులయు రాక్షసులయు మహాధ్వని మిక్కిలియుఁ జెలంగినది. అంత ప్రహస్తుఁడు దుర్బుద్ధి మీఱ గెలువఁ దలంపుగొని వానరరాజగు సుగ్రీవుని సైన్యమున కెదురుచని, చావంగోరి మిడుత యగ్గినుఱుకునట్లు, అంతకంతకు వేగమునవడించుచున్న యమ్మహాసైన్యమును బ్రవేశించినవాఁడయ్యె. ఇది యేఁబదియేడవసర్గము.



## ప్రహస్తుఁడు నీలునిచే హతుండగుట.

అంత, రాముఁడు పగవారినుక్కడంచు బలుమగఁడు గావున, భయంకరపరాక్రముఁడగు ప్రహస్తుఁడు వెడలివచ్చుటం* దెలిసి, బలవంతుఁడగు శత్రునిం జూచుటవలన చిఱునవ్వుదొలఁక, విభీషణుంజూచి 'మహాబాహూ ! మిక్కిలి గొప్పకాయముగల వీఁడెవఁడు? గొప్పసైన్యముతోఁగూడి వచ్చుచున్నాఁడే ! ఈరాక్షసుఁడు వీర్యవంతుఁడని తోఁచుచున్నది. వీనిం జెప్పుము' అనెను. విభీషణుఁడు రాముఁడు చెప్పినదివిని, 'ఈరాక్షసుఁడు వాని (రావణుని) సేనాపతి. వీనిపేరు ప్రహస్తుఁడు. లంకయందు రాక్షసరాజగు రావణుని సైన్యమునందు మూఁడవభాగము వీనివశమున బలసి యుండును. వీఁడు బలవంతుఁడు, అస్త్రంబులం దెలిసినవాఁడు, శూరుఁడు, పరాక్రమమునం బ్రసిద్ధిగాంచినవాఁడు' అనెను. మిక్కిలిబలవంతమై, రోషంబెంతయు నతిశయింప, ప్రహస్తునింజూచి గర్జించుచున్న వానరమహాసైన్యము, భయంక

* ప్రహస్తుఁడు పూర్వద్వారమున వెడలెను. రాముఁడు ఉత్తరద్వారమున నున్నవాఁడు. కనుక రాముఁ డనేకయోజనముల దూరముననున్న ప్రహస్తుని నెటుచూడఁగలిగె ననఁగా రాముఁడు ప్రహస్తునిఁ జూడలేదుగాని ఆప్తులుచెప్పఁగా విన్నాఁడు; వారిమాట ప్రత్యక్షముతో సమమగుటచేత ప్రత్యక్షముగాఁ జూచిన ట్లడిగినాఁడని తెలియునది.

రాకారుఁడై భయంకరపరాక్రముండునై మిక్కిలియుఁ బెద్దకాయము గలిగియున్న యా ప్రహస్తుఁడు రాక్షసపరివృతుఁడై గర్జించుచు వెడలివచ్చుచుండఁగాఁ జూచిరి. అప్పుడు గెలుపుగోరి వానరులపయికి నడరుచున్న రాక్షసులు ధరించియున్న ఖడ్గములు, శక్తులు, ఋష్టులు, బాణములు, శూలములు, ముసలములు, గదలు, పరిఘములు, ప్రాసములు, పలువిధములయిన పరశ్వథములు విచిత్రములగు ధనువులు మొదలగు నాయుధము లెంతయుఁ బ్రకాశించుచుండెను. వానరోత్తములును, యుద్ధముసేయుటకై పుష్పితములయిన వృక్షములను విశాలములు దీర్ఘములు నగుశిలలనుం బట్టుకొనినిలిచిరి. అట్లు ఆవానరులును రాక్షసులును పెక్కండ్రు ఒండొరులపైఁగవిసి, శిలావర్షమును బాణవర్షమును గురియుచుఁ బెనంగఁగా పోరు మిక్కిలియు ఘోరమయ్యె. అప్పుడు యుద్ధమునందు రాక్షసు లనేకులు మేటివానరులను పెక్కండ్ర వధించిరి. అట్లే వానరులు పెక్కండ్రు రాక్షసులననేకుల వధించిరి. రాక్షసులు వానరుల కొందఱను శూలములఁ జంపిరి. కొందఱను చక్రములచే వధించిరి. కొందఱను బరిఘములచే రూపుమాపిరి.కొందఱను గొడ్డండ్రచే ఛేదించిరి.ఇట్లు శూలాదులచేనొచ్చి వానరులుకొంద ఱుసుఱునఁ బాసిరి.కొందఱు నేలంగూలిరి.కొందఱు బాణములు త్రాళ్లవలె నొడలెల్లఁగాఁడి పెనఁచుకొనఁగా గుండెలుపగిలి ప్రాణములువిడిచిరి. కొందఱు వానరులను రాక్షసులు ఖడ్గములచేత రెండుతుండెములుగా నఱకఁగా, వారు విలవిల మిట్టిపడుచు నేలంబడిరి. కొందఱువానరులు ప్రక్కవాటున శూలములచే చీల్పంబడి మృతులయిరి.అప్పుడు వానరులును, మిక్కిలి క్రుద్ధులయి,నలుగడల రాక్షసులను గుంపులుగుంపులుగా, వృక్షములచేతను పర్వతశిఖరములచేతను నేలంగూల్చి చూర్ణముగావించి రూపుమాపిరి.వానరులు వజ్రములవలె బిట్టుగాఁదాఁకునట్టి పిడికిళ్ల నెంతయుఁ బొడువఁగాఁ గొందఱురాక్షసులు,పండ్లును గన్నులునునూడి చెల్లచెదరుకాఁగా నోట నెత్తురుగ్రక్కుకొనుచుంగూలిరి.వానరులును రాక్షసులును యుద్ధంబున దెబ్బదిన్నప్పుడు, ఆర్తధ్వని సేయుచు, జయము నొందినపుడు సింహనాదము సేయుచునుండిరి. ఆ రెండు ధ్వనులును తుములమై చెలంగినది. వానరులును రాక్షసులును క్రుద్ధులయి, యుద్ధకౌశలము ననుసరించి, కన్నులు గిఱగిఱం ద్రిప్పుచుఁ గ్రూరులై నిర్భయముగా నానాయుద్ధకర్మములం గావించిరి. నరాంతకుఁడు, కుంభహనుఁడు, మహానాదుఁడు, సమున్నతుఁడు, అనెడి యీ ప్రహస్తమంత్రులు నలువురును, జెలరేఁగి, వానరులను వధించిరి. ఆనలువురు నట్లు వేగముగాఁ బయిపడివచ్చుచు వానరులను వధించుచుండుటనుజూచి, ద్వివిదుఁడు, వారిలో నొక్కఁడగు నరాంతకుని పర్వతశిఖరముచేఁ గొట్టిచంపెను. దుర్ముఖుఁడు, మిక్కిలియు హస్తలాఘవము గలవాఁడుగాన, పెద్దవృక్షము నొకటింబెకల్చి, సమున్నతుఁడనురాక్షసుని వధించెను. మిక్కిలి తేజోవంతుఁడగు జాంబవంతుఁడు పరమక్రుద్ధుఁడై పెద్దశిల నొకటింగొని మహానాదునిఱొమ్ముపయి వేయఁగా వాఁడు గూలెను. అంత తారుఁడు వృక్షంబుగొని వీర్యవంతుఁడగు కుంభ

హనునిశిరస్సునం గొట్టఁగా, వాఁడాయుద్ధరంగమునఁ గూలి ప్రాణములు విడిచెను. ప్రహస్తుఁడు రథగతుఁడై యిట్లు తనమంత్రులనలువురును హతులయినందులకు నోర్వంజాలక విలుగొని వానరులతో ఘోరముగా యుద్ధముసేసెను. (ఒండొంటిపయి నిటునటుఁ దిరుగుడువడుచు) ప్రళయమువలె నున్నయామహాయుద్ధమునందు, అప్రమేయమగు సముద్రము ఘూర్ణిల్లునపుడు కలుగుమహాధ్వనివలె, ఆరెండుసేనలయందును నపుడు భయంకరమయినధ్వని పుట్టెను. ప్రహస్తుఁడు యుద్ధమునఁ బండితుఁడుగాన యమ్మహాయుద్ధమునందు మిక్కిలియుఁగ్రుద్ధుఁడై శరసమూహముల నవ్యాహతముగాఁ బ్రయోగించి వానరులనొప్పించెను. వానరులయు రాక్షసులయు పర్వతాకారములగుశరీరములు పడి యుద్ధభూమియంతయు వ్యాపించియుండఁగా నది పర్వతములు గూలిపడియున్నట్లు భయంకరముగా నుండెను. ఆయుద్ధభూమియంతయు నెత్తురు గ్రమ్మియుండుటచే వసంతఋతువునందు పూచినమోదుగుచెట్లచే నిండియున్నట్లు మిక్కిలి ప్రకాశించుచుండెను. ఆయుద్ధభూమి యొకనదివలెఁ జూపట్టెను. అందు యుద్ధాగ్రమున హతులయిన యిరువాఁగువీరుల ప్రోవులే తీరములు; విఱిగిపడియున్న యాయుధములే త్రెళ్లినతీరమందలి పెనువృక్షములు; నెత్తురువెల్లువయే వండునీళ్లు; కాఱిజములును గుల్మములునే మిక్కిలియగు నందలిరొంపి; చెల్లచెదరుగాఁ బడియున్న ప్రేఁగులే యందలి నాఁచుతీఁగలు; తెగిపడి మిట్టిమిట్టిపడుచున్న దేహఖండములును శిరస్సులునే యందలిమత్స్యములు; కరచరణాదులవ్రేళ్లే యందలిపచ్చికతంపర; నెఱసియున్న గ్రద్దలగుంపులే యందు హంసగణములు; రాఁబులుఁగులె సారసపక్షులును; మేదస్సే నెఱసియున్ననురుఁగు; దెబ్బలుదిన్నవారల యార్తధ్వనులె దానిప్రవాహపుబిట్టుచప్పుడు; అది * యముఁడను సముద్రమునకుంబోవునది; పిఱికివాండ్రకు దాఁట నలవిగానిది. ఇట్టియుద్ధమహానదిని నయ్యిరువాఁగును బ్రవర్తింపఁజేసినవారైరి. రాక్షసులును వానరవీరులును వర్షాకాలముకడపట హంససారసపక్షులతో నొప్పుచుండునదిని సులభముగా దాఁటునట్లు దుస్తరంబగు నయ్యుద్ధభూనదిని దాఁటిరి. మేటియేనుంగుమిన్నలు తామరపుప్పొడి నెఱసి మొలుపెక్కియున్న తామరకొలఁకును దాఁటి మొగ్గనిదేహముగలవగునట్లు, అవ్వానరరాక్షసులు ఆయుద్ధభూనదిని దిగి మొగ్గనిదేహములు గలవారయి దాఁటిరి. అంత నట్లు రథమునసుండి ప్రహస్తుఁడు బాణజాలములను విడుచుచు వేగంబున వానరులను వధించుచుండఁగా నీలుఁడు చూచెను. సేనాపతియగు ప్రహస్తుఁడు,ఆకాశమునఁ జిమ్మిరేఁగినవాయువు పెనుమేఘసమూహముపయి బలవంతముగా నడరునట్లు, తనపయి కడరివచ్చుచున్న నీలునిఁజూచి సూర్యప్రభమయిన రథముతో నానీలునిమీఁదికేపోయెను. మేటివిలుకాఁడగు నాదళవాయి ప్రహస్తుఁడు, మహాయుద్ధమున, బలువింటి నాకర్ణాంత

* యుద్ధభూమియందు యముఁడు జీవులను గ్రహించుటకై సన్నిహితుఁడగుచున్నాఁడని ప్రసిద్ధి.

ముగ లాగి, నీలునిపయి బాణములు ప్రయోగించెను. వంకరగాక చక్కఁగ గుఱినాటునవై మిక్కిలి కోపితములయిన సర్పములవలెఁ బొల్చుచు మహావేగముగలిగియున్న యాబాణములు, గుఱిదప్పక నీలుని దేహమును నుచ్చికొనిపోయి భూమిం జొచ్చినవి. వీర్యశాలియగు మహాకపి నీలుఁడు, అట్లు నిప్పువలె నేండ్రములయిన వాఁడి బాణములచేఁ గొట్టువడి, కుపితుఁడై వృక్షము నొకటి పెకలించుకొని, తనపయికి వచ్చుచున్న యాదుర్ధర్షునిఁ బ్రహస్తునిఁ బ్రహరించెను. రాక్షసపుంగవుఁ డా ప్రహస్తుఁడు, అట్లు వృక్షమునఁ గొట్టువడి, క్రుద్ధుఁడై, సింహనాదము సేయుచు, వానర సేనాపతియగు నీలునిమీఁద బాణవర్షములు గురియించెను. మహాబలుఁ డగు నీలుఁడు, బెట్టిదములయిన యాప్రహస్తుని బాణములను వారింప నశక్తుఁడై, కన్నులు మూసికొని యన్నిటిని సహించుచుండెను. ఆఁబోతు, శరదృతువునందు శీఘ్రముగావచ్చి తీసిపోవు వర్షమును నెంతమాత్రము సరకుసేయక సహించునట్లే, నీలుఁడును, జెనకరానట్లతిభయంకరముగాను వేగముగాను బ్రహస్తుండు ప్రయోగించు బాణవర్షమును ఎంతమాత్రము లక్ష్యపెట్టక కన్నులుమూసికొని సహించియుండెను. నీలుఁడు కేవలుఁడుగాక మిక్కిలియు గొప్పవీరుఁడు గావున, ఆ బాణవర్షమునకు రోషముగొని, యొక్క మహావృక్షమున మనోవేగములయిన ప్రహస్తుని గుఱ్ఱములను గూల్చెను. అంత మహాబలుం డగు నీలుండు, తటాలున నా ప్రహస్తుని చేతిధనుస్సు నొడిసిపట్టుకొని విఱిచివైచి మాటిమాటికి సింహనాదము గావించెను. రాక్షససేనాధిపతియగు ప్రహస్తుఁ డట్లు నీలునిచే రథము విఱిగి విల్లును దునిసినవాఁడై బెడిదమైన ముసలమును చేతంగొని, రథమునుండి నేలకు నుఱికెను. వేగవంతులై బలంబున సింహశార్దూలములం బోలుచు, సింహశార్దూలములనంటి వీరచేష్టితములను గావించుచు, నెందును జయంబు నొందుచు, యుద్ధంబుల నెప్పుడు వెనుదీయక వృత్రాసుర దేవేంద్రులకు సమానులై యుండు వీరులగు నాయిరువురు సేనాపతులును, పరస్పరము బద్ధవైరులై సమస్తాంగములును నెత్తుటం దడియఁగా మదపుటేనుంగులవలె నొండొరులం దాఁకినిలిచి మిక్కిలి వాఁడులయిన కోఱల నొండొరులపయి గాయములు వడ రాయుచు నొండొరుల గెలిచి కీర్తిం బడయుటకు తుకతుకపడుచుండిరి. అప్పుడు ప్రహస్తుఁడు మిక్కిలియు నుద్యుక్తుఁడై ముసలముగొని నీలుని లలాటమునఁ గొట్టఁగా నపు డందుండి రక్తము గాఱెను. అంత దేహమంతయు నెత్తుటం దోఁగ మహాకపి నీలుఁడు క్రుద్ధుఁడై మిక్కిలియు పెద్దదియగు నొకవృక్షమునుగొని ప్రహస్తుని రొమ్ముపై వైచెను. ప్రహస్తుఁడా దెబ్బను సరకుసేయక, ఆ పెనుముసలమునుగొని బలవంతుఁ డగు నీలునిమీఁదికిఁ బలంబుమెయిఁ బరుగెత్తెను. అంత మహావేగుఁడగు నా వానరోత్తముఁడు నీలుఁడు, ఉగ్రమగు వేగమునఁ బ్రహస్తుఁడు సంరంభించి తనపయికి వచ్చుటనుజూచి, యంత నొకగొప్ప శిలను గయికొనెను. యుద్ధకాంక్షియై ముసలముగొని యుద్ధము సేయుచుఁ దనపయికి ప్రహస్తుఁడు రాఁగా, నీలుఁడు శీఘ్రంబున నా శిలను వానితలమీఁదఁ బడవేసెను.

అప్పుడు వానరముఖ్యుఁ డగునీలుఁడు వైవఁగా బెడిదంబైన యావెనుశిల తగిలి ప్రహస్తునితల వెక్కువ్రయ్యలుగా పగిలెను. ఆప్రహస్తుఁడు, కాంతియు బలంబును నింద్రియములును నశించి గతప్రాణుఁడై వేరు నఱకంబడినవృక్షమువలె తటాలున నేలంగూలెను. అట్లు భిన్నమయిన యాప్రహస్తుని శిరస్సునుండియు శరీరమునుండియును, పర్వతమునుండి సెలయేఱు ప్రవహించునట్లు,మిక్కుటముగా నెత్తురు దొరఁగినది. నీలుఁడు ప్రహస్తుని వధించినపిమ్మట, నంతవఱకును కదల్పరాకుండిన యతని రాక్షసమహాసైన్యమంతయు నుబ్బువీడి తూలుచు, లంకకుం దిరిగినదయ్యె. సేనాపతి ప్రహస్తుఁడు హతుఁడు కాఁగా, జలము లనకట్టను దాఁకి నిలువలేక చెదరి పాఱునట్లు ఆ రాక్షసులు,యుద్ధమున నిలువలేక మఱలువారయిరి. సేనాపతియగు నాప్రహస్తుఁడు హతుఁడుకాఁగా, రాక్షసు లేమియును జేయఁజాలక రాక్షసాధిపతియగు రావణునొద్దకుఁబోయి, చింతావశమున మూఁగలవలె నేమియు మాటాడఁజాలక తీవ్రంబగు దుఃఖసముద్రమున మునింగి మూర్ఛితులవలె నుండిరి. అంత జయశీలుఁడును బలశాలియును నగువానరసేనాపతి నీలుఁడు తానుగావించిన కృత్యమునకు నందఱును పొగడుచుండఁగా రామలక్ష్మణులం జేరి మిక్కిలి సంతోషమున నుండెను. *ఇది యేఁబదియెనిమిదవసర్గము.



{ రావణుఁడు తానే యుద్ధమునకుఁబోవుట; సుగ్రీవాదులు రావణుచే భంగపడుట; రావణుఁ డమోఘంబగు శక్తిచే లక్ష్మణుని మూర్ఛితుఁ జేయుట; రామ రావణయుద్ధము;రాముఁడు రావణునికిరీటమును భేదించుట. }

వానరవృషభుం డగునీలునిచేత రాక్షససేనాపాలకుఁ డయినప్రహస్తుఁడు హతుఁడుకాఁగా, భయంకరాయుధములందాల్చి, సముద్రమువలె మహావేగం బురువడించుచుండిన రావణునిసైన్యము లంకకుఁ బరుగెత్తినదయ్యె. రాక్షసు లట్లుపోయి యంత రావణునకు సేనాపతియగు ప్రహస్తుఁడు నీలునిచే హతుఁడయ్యెనని విన్నవింపఁగా, ఆరాక్షసాధిపతి, వారలు చెప్పిన యప్పలుకువిని, యిఁక శత్రువులు బలాధికు లని తెలిసి వారి నాశ్రయింపవలసినది నీతియైయుండఁగా, ఆతిగవుమాలి యట్టియెడఁ గోపమునుగూడ నొందినవాఁడయ్యె. ఆరావణుఁడు యుద్ధమునఁ బ్రహస్తుఁడు నిహతుం డగుటవిని, శోకమునఁ గందికుంది క్రోధము మనమునం బెనఁగొనఁగా, దాఁపున నున్నరాక్షసభటముఖ్యులనుజూచి, దేవతాభటముఖ్యులకు దేవేంద్రుఁడు చెప్పునట్లు 'మనపగవాఁ డగురామునిపట్ల నుపేక్షించి యుండరాదు. మఱి యింద్రునిబలమునుగూడ బిలుకుమార్చునట్టి నాసేనాపతిని ప్రహస్తుని వానిసైనికులతోను

* పంచమియందు ప్రహస్తుని వధము.

గజాదులతోను వధించిరి గావున తక్కినశత్రువులనుగూడ వానరులని తలఁచి యుపేక్షించియుండరాదు. నే నింక ముందు వెనుకఁ జూడను. నేనే పగవారిని నాశము సేసి విజయముగొనుటకై యుద్ధముఖమునకుఁ బోయెను. అందు అల్పులచేఁ బ్రబలులు హతులగుచున్నారుగాన యది మిక్కిలి యద్భుతముగానున్నది. ఇదిగో, కార్చిచ్చు వెనుమంటలచే నడవిని దహించునట్లు, బాణసమూహములచే నా రామలక్ష్మణులను వానరసైన్యమునంతయు దహించెదను. (నేఁడు భూమికి కపి రక్తములచేఁ దృప్తిగావించెదను) ' అనెను. దేవేంద్రునికి శత్రుండగు నా రావణుఁ డిట్లుచెప్పి, అగ్నివలె ధగధగమెఱయునదై, మేటిగుఱ్ఱపుమిన్నలు పూన్పంబడి, యలంకారములచేతను వెలుంగుచు స్వరూపముచేతనే జ్వలించుచున్నరథము నారోహించెను. అప్పుడు రాక్షసరాజముఖ్యుఁ డగునారావణుఁడు, శంఖభేరీపణవాదివాద్యధ్వనులచేతను భుజాస్ఫాలనధ్వనులచేతను సింహనాదఘోషములచేతను మనోజ్ఞములయిన వందిమాగధాదిస్తవములచేతను నలుగడలఁ బూజ్యమానుఁడై యుద్ధమునకుఁబోయెను. రాక్షసరాజముఖ్యుండగు నారావణుఁడు పర్వతములవలె పృథుకఠినములును మేఘములవలె గురునీలములు నగునాకారములుగలిగి, నిప్పులవలెఁ గన్నులు వెలుఁగుచునున్న రాక్షసులచే పరివృతుఁడై భూతములచేఁ బరివేష్టితుఁడగు రుద్రునివలెఁ బ్రకాశించెను. అంత మహాతేజుం డారావణుఁడు శీఘ్రమునఁ బట్టణమునుండి వెలువడినవాఁడై యుగ్రంబై మహాసముద్రంబును మేఘంబునుం బోలె మహాధ్వనిగలిగి, వృక్షములును శైలములును జేతం దాల్చి యుద్ధమునకు సన్నద్ధమైయున్న యవ్వానరసైన్యమును జూచెను. రాముఁడు యుద్ధోత్సాహమున బాహువులు సర్పరాజుంబోలె నుప్పొంగ, యుద్ధహర్షమున కాంతియెంతయు నతిశయింప, అంగసంరక్షణార్థము సేన పరివేష్టించియుండ, మిక్కిలి ప్రచండమైవచ్చుచున్న యారాక్షససైన్యముంగని ఆయుధధారులలో మేటి వీరభటులతారతమ్యముల నెఱుంగు విభీషణునిఁ జూచి ' పలువిధములయిన పతాకలతోను ధ్వజములతోను నాయుధములతోనుగూడి ప్రాసములు ఖడ్గములు శూలములు మున్నగు నితరాయుధములనుదాల్చి, ఐరావతసమానములగు మదగజంబులును గలిగి,అక్షోభ్యమై శూరమయంబై యున్న యీసైన్యమెవ్వనిది' అనియడిగెను. అంత నింద్రునికింబోలె పరాక్రమముగల విభీషణుఁడు, రాముఁడు చెప్పినమాటవిని, మహాధైర్యశాలురగు నా రాక్షసపుంగవుల మేటిబలమును జెప్పంబూని ' రాజా ! ఇదిగో, బాలసూర్యునివలె నెఱ్ఱనయిన మొగముగలిగి, యేనుంగుమూఁపునఁ గూర్చుండి, తనదేహభారంబున నేనుంగుశిరస్సు నదరఁగా, వెనుకాయముతో వచ్చుచున్నవీఁడు రావణుని పుత్త్రుఁడగు నకంపనుఁడని తెలియుము. ఇదిగో రథమునెక్కి, సింహధ్వజముగ్రాలఁగా, ఇంద్రధనువువలె వెలుంగుధనువును, నారిదివిచి యల్లలార్చుచు, ఉగ్రములై వెలువడినకోఱపండ్లచే నేనుంగుకైవడిఁ బ్రకాశించుచున్నాఁడే ! వీఁడు బ్రహ్మదత్తంబగు నం

తద్ధానవరబలము గలయింద్రజిత్తు. వింధ్యపర్వతమువలెఁ బొడవై, అస్తపర్వతమువలె నితరులతేజంబు గ్రిందుపఱచుచు, మహేంద్రపర్వతమువలె నిశ్చలుండై యతిరథుండును మహావీరుఁడునగు నొకఁడు రథమెక్కి విలుదాల్చి యతిప్రమాణంబగు నావింటిని సారించుచు వచ్చుచున్నాఁడే! మిక్కిలియు పెనుకాయముగలవీఁడతికాయుఁడండ్రు. ఇదిగో నప్పుడుదయించినసూర్యునివలె నెఱ్ఱనై కన్నుఁగవ వెలుంగఁగా,ఘంటాధ్వనులు మిక్కిలియు చెలంగుచున్న యేనుఁగునెక్కి వేండ్రముగా గర్జించుచు వచ్చుచున్నాఁడే! ఈమహాధీరుఁడు, ఈవీరుఁడు, మహోదరుఁడు. ఇదిగో పలువిధములయిన బంగారు సొమ్ములచే నలంకృతమై యుండుటంజేసి సంజకెంజాయమబ్బులతోఁ గూడిన కొండవలెఁ బ్రకాశించుచున్న గుఱ్ఱమునెక్కి, మెఱుఁగులు దుఱంగలించుచున్న ప్రాసము కేలఁ బూని, వచ్చుచున్నవీఁడు పిశాచుఁడు; పిడుగువంటి యురవడిగలవాఁడు. ఇదిగో! మెఱపువలె మెఱయుచు నజ్రాయుధమునురవడియుఁ దనకు నూడిగముగాఁ గలిగియున్న వాఁడిశూలమును బట్టుకొని, పర్వతమువలె వెలుంగుచున్న మేటివృషభము నారోహించి, వచ్చుచున్నవీఁడు యశస్వియగు త్రిశిరుఁడు. ఇదిగో మేఘసమానరూపుఁడై, బలుపెక్కి విశాలమై సుందరంబగు వక్షము గలిగి, సర్పరాజధ్వజము వెలుంగ, సన్నద్ధుఁడై, వింటినారి నాకర్ణాంతముగా లాగి మరల లీలమెయి నల్లలార్చుచునున్నవీఁడు కుంభుఁడు.బంగారముతోను వజ్రమణులతోను నలంకృతమై, ధగధగ మెఱయుచు, పొగతోఁగూడినట్లు చూపట్టుచునున్నట్టి పరిఘమునుగొని వచ్చుచున్నవీఁడు నికుంభుఁడు. వీఁడు రాక్షసబలమునకు ప్రధానభూతుఁడు; మిక్కిలి యాశ్చర్యకరములగు ఘోరకర్మములను గావించినాఁడు. ధనుర్బాణఖడ్గములతోఁగూడి పతాకాలంకృతమై యగ్నివలె ధగధగ వెలుంగుచునున్న రథము నారోహించి భయంకరాకృతిని ప్రకాశించుచున్నవీఁడు నరాంతకుఁడు; పగవారు లేమిచే చేతులతీఁట వ్రేవ పర్వతశిఖరములతోఁ బోరాడుచుండును. నానావిధములును భయంకరములునగు రూపములుగలవియై, వ్యాఘ్రముఖములును, ఉష్ట్రముఖములును, గజముఖములును, మృగముఖములును, అశ్వముఖములునై కన్నులు తిరుగుచున్నవగు భూతములచేఁ బరివేష్టితుఁడై యున్న యితఁడే దేవతలదర్పమునుగూడ నడంచిన రావణుఁడు. నిండుచంద్రునింబోలి సన్ననికమ్ములుగలిగి, యుత్తమంబై నెలుంగుచున్న శ్వేతచ్ఛత్ర మీతని రథమునందు ప్రకాశించుచున్నది. ఇతఁడు మహాత్ముఁడగు రాక్షసరాజు,రాక్షసపరివృతుఁడై భూతపరివృతుం డగురుద్రునివలెఁ బ్రకాశించుచున్నాఁడు. ఇతఁడు కిరీటముఁదాల్చి కుండలము లల్లలాడుచున్న ముఖముతో, హిమవంతమును వింధ్యమునుంబోలెఁ బొడవై బలుపుగల భయంకరాకారము గలిగినవాఁడు. ఈ రాక్షసాధిపతి యింద్రునిని యమునిని గర్వము నడఁచినవాఁడు; సూర్యుండుంబోలె వెలుంగుచున్నాఁడు చూడుము' అనెను. అంత రాముఁడు పగవారి నడంపఁజాలిన విభీషణునింజూచి, 'రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు ఆహా! ఏమి తేజంబున నె

లుఁగుచున్నాఁడు! ఎంతటి ప్రతాపశాలి! రావణుఁడు, సూర్యుఁడు కిరణములచేతం బోలె కాంతులచేఁ దేఱిచూడ నలవిగాక తేజరిలుచున్నాఁడు. తేజస్సు మిక్కిలియు నావరించియున్న యితనిరూపము స్పష్టముగాఁ గనఁబడుచున్నది. రాక్షసేంద్రుఁడగు నీరావణుని దేహంబుకాంతి తేజరిలునట్లు దేవదానవవీరులలో నెవ్వరిదేహమునకు నిట్టితేజస్సు గలుగదు. ఈతనిభటులందఱును, మహాతేజులు, అందఱును బర్వతాకారులు, అందఱును పర్వతములనేనింగొని యుద్ధముసేయువారు, అందఱును దీప్యమానములగు నాయుధములు దాల్చియున్నవారు. ఈరాక్షసరాజు, దేదీప్యమానులును భయంకరపరాక్రములు నగువారిచేఁ బరివేష్టితుఁడై, ప్రశస్తదేహములుగల వేంద్రపు భూతములచేఁ బరివృతుండగు యమునివలెఁ దేజరిల్లుచున్నాఁడు. దైవవశమున నీపాపాత్ముఁడు నాకంటఁబారిం బడినాఁడు. ఇప్పు డిదిగో సీత నపహరించి నాకుఁ గలిగించినక్రోధమును వీనిపై నిగిడ్చెదను' అనెను. వీర్యవంతుఁడగురాముఁ డిట్లుచెప్పి, యంత లక్ష్మణుం డనుచరింప విలుగొని, మేటిబాణమును బొదినుండియెత్తి సన్నద్ధుండై నిలిచియుండెను. అంత, మహాధీరుండగు నారాక్షసరాజు రావణుఁడు బలవంతులగు నారాక్షసులనుజూచి 'మీరు జంకులేక లోపలిద్వారములందును పురద్వారములందును దానిపార్శ్వములందును భటనివాసముకొఱకు నిర్మితములగు చర్యాగృహములందును, మిక్కిలి నిమ్మళముగాఁ గాఁచియుండుఁడు' అని యాజ్ఞాపించి, 'మీరందఱు నాతోఁగూడ నిచ్చట వచ్చియుండుటనుజూచి వానరులు పట్టణమున యోధులెవ్వరును లేకున్న యీయభిప్రాయమును దెలిసికొని, యంత మనపట్టణము గెలువరానిదయ్యు శూన్యముగానుండుటచే, నందఱును జేరి తటాలునఁ జొచ్చి ధ్వంసముచేసి కీడ్పఱచివైతురు' అనెను. ఇట్లు గూడివచ్చిన వారినందఱును రావణుఁడు వీఁడుకొలుపఁగా, ఆరాక్షసులు రావణునియాజ్ఞఁ జొప్పునఁ బోయిరి. పిదప రావణుఁడు మహామత్స్యము పూర్ణమగు సముద్రజలమును గలంచునట్లు, వానరసైన్యముల నుఱుమాడెను. ఆరాక్షసాధిపతి రావణుఁడు దీప్తంబులగు ధనుర్బాణములంగొని యుద్ధంబునకై పయిపడి వేగవచ్చుచుండుటనుజూచి, వానరేశ్వరుఁడగుసుగ్రీవుఁడు, గొప్పపర్వతశిఖరమునొకటి పెకల్చి యతనిమీఁది కడరెను. సుగ్రీవుఁడు బహువృక్షములతోఁగూడిన తటముగల యాపర్వతశిఖరమునెత్తి రాక్షసునిపై విసరివైచెను. రావణుఁ డది తనసమీఁదికి వచ్చుటంజూచి తోడనే బంగారుపింజలుగల బాణములచే దానిం దునియలు గావించెను. మిక్కిలియుఁ బెనువృక్షములతోఁ గూడిన నెత్తముగల యాపర్వతశిఖరము తునియలై నేలంబడఁగా, రాక్షసగణాధీశ్వరుండగు రావణుఁడు, మృత్యువుంబోలినదై మహాసర్పమువంటిదగు నొక్కబాణమును వింట సంధించెను. ఆరావణుఁడు, కుపితుఁడై, వాయువునకుంబోని వేగముగలిగి, మిడుఁగుఱులతోఁ గూడిన నిప్పువలె మండుచు, వజ్రాయుధమువలె నురవడించుచున్న యాబాణమును గయికొని, సుగ్రీవవధార్థమయి వైచెను. ఇంద్రునివజ్రాయుధమువంటి యాకృతిగలిగి, వాఁ

డిమొనయుఁగల యాబాణము, రావణబాహుముక్తమై, వేగమున, కుమారుఁడు వైచిన యుగ్రశక్తి క్రౌంచమును భేదించినట్లు సుగ్రీవునిఁ దాఁకి భేదించెను. వీరుఁడగు నాసుగ్రీవుఁడు, బాణపీడితుఁడై, చిత్తము తబ్బిబ్బువడఁ గూయిడుచు నే లంబడెను. అట్లు సుగ్రీవుఁడు యుద్ధమున మూర్ఛితుఁడై నేలంబడుటను జూచి, రాక్షసులందఱును మిక్కిలి యుబ్బున సింహనాదములు గావించిరి. అంతగవాక్షుఁడును మంచికోఱలుగల గవయుఁడును, ఋషభుఁడును, జ్యోతిర్ముఖుఁడును, నభుఁడును, మేనులుబెంచి పర్వతముల నెత్తికొని, యారాక్షసరాజుపయి నడరిరి. ఆరాక్షసాధిపతి రావణుఁడు అవ్వానరులువైచిన పర్వతములను వాఁడి మొనలు గలబాణసమూహములువేసి దుంచి వ్యర్థములుగావించి, యంతటంబోక యవ్వానరోత్తములనుగూడ చిత్రములగు బంగారుపింజల బాణములువైచి నొప్పించెను. భయంకరకాయులగు నవ్వానరోత్తములు రావణు బాణములచే భిన్నులయి నేలంబడిరి. అంత నారావణుఁడు, యుగ్రంబగు నా వానరసైన్యమునంతయు, బాణసమూహములను ముంచెను. మహావీరులును ప్రసిద్ధులునగు నవ్వానరు లట్లు హింసితులై రావణునియుగ్రవడికి నేలంబడి కాచుదిక్కు వేఱులేనందున మాటికిబిట్టుగాఁ గూయిడుచు, భయము శల్యమువలె మది నాటుకొని కారింపఁగా, రావణుని బాణములచే *గాసింబడి శరణ్యుఁడగు రాముని శరణుఁజొచ్చిరి. †అంత మహాత్ముఁడగు నామేటివిలుకాఁడు రాముఁడు విల్లుదీసికొని, శీఘ్రమున వానరుల రక్షించుటకై పోయెను. అప్పుడు లక్ష్మణుఁ డారామునియొద్దకుంబోయి చేతులు మొగుడ్చుకొని పరమార్థయుక్తంబగు వాక్యమున ‹ ప్రభూ! పరదార నపహరించిన యీదుర్బుద్ధిని వధించుటకు పూజ్యులగు దేవర మిక్కిలి చాలియేయున్నారు.

---

* దీనిచే ఆర్తియే శరణాగతిని గలిగించునదిగాని దేశకాలనియమముగాని అధికారినియమముగాని ఫలనియమముగాని కాదని తెలియునది.

† శరణాగతకృత్యమునుజెప్పి యిట శరణ్యుని కృత్యమును జెప్పుచున్నాఁడు. 'తతోమహాత్మా స ధను ర్ధనుష్మా నాదాయ రామ స్సహసా జగామ । తంలక్ష్మణః ప్రాంజలిరభ్యుపేత్య ఉవాచ వాక్యం పరమార్థయుక్తమ్' అని మూలము. ఇట ప్రపత్తి ఆర్తప్రపత్తి రూపముగుటచే సద్యఃఫలమును దెలుపుటకై (తతః) అనఁబడెను. ప్రపత్తిచేసిన యుత్తరక్షణముననే, (మహాత్మా) శరణాగతి తారతమ్యముల నెఱింగినవాఁడు. (ధనుష్మాన్) ప్రశస్తమైన ధనువుగలవాఁడు-ధనుర్యుద్ధములందు సమర్థుఁడనుట. (సహసా) తోడనే-అనఁగా లక్ష్మణుఁడు నేనుపోయెదనని వచ్చుటకునుపే ఆశ్రితరక్షణమునందుఁ గలత్వరచే విల్లుగొనిపోయెననుట. అట్లుపోయియు లక్ష్మణుఁ డడ్డగించినాఁడనుట. (తం)ఆర్తరక్షణత్వరచే పోవుచున్న రామునిని, (లక్ష్మణః) రామకైంకర్య లక్ష్మీసంపన్నుఁడగు లక్ష్మణుఁడు తన్నతిక్రమింపకుండునట్లు కాలిసంకెలవేసినట్లు, (ప్రాంజలిః) చేమోడ్పుగలవాఁడై, (అభ్యుపేత్య) చుట్టునుజేరి - దీనిచే లక్ష్మణుని రాకను దెలియనివానివలె పలుప్రక్కల రాముఁడు పెక్కువిధములంబోయెనని తెలియుచున్నది. (పరమార్థయుక్తం)యథార్థముతోఁగూడినది-వట్టియుపచారముతోఁ గూడినదిగాదు-లేక (పరమార్థయుక్తం) పరమప్రయోజనముతోఁగూడినది. శేషివిషయమగు కైంకర్యము శేషభూతునికి పరమప్రయోజనముగాన యిట్లుచెప్పినాఁడని దెలియునది (వాక్యమువాచ) వాక్యముచెప్పెను. గోవిందరాజులు.

అయినను నిట్టినీచునితో యుద్ధము సేయుట నీకుఁదగదు. నేను నుఱుమాడెదను. నేనును
వీనివధింప మిక్కిలి చాలియున్నవాఁడను. నేనై సెలవులేక పోవరాదు గనుక స్వామి
వగు నీదుకింకరుఁడనగు నాకనుజ్ఞయిమ్ము. నీయనుజ్ఞలేక కార్యము సేయుట నాకు స్వ
రూపముగా నేరదు.' అనెను. ఇట్లు వినయమునఁ జెప్పిన యాలక్ష్మణుంజూచి యప్పటి
హర్షాతిశయంబున మిక్కిలియుఁ గాంతివికసిల్ల, విధేయుఁడొకఁడు తనకార్యమునఁ
బూనఁగా పరాక్రమము తానుజూపుటయుడిగి యతనితో 'లక్ష్మణా! పొమ్ము. నీచుండని
పరాకుననుండక యుద్ధమున జతనముతో నుండుము. ఏలన రావణుఁడు ఒకయస్త్రము
తొడుగునట్లుదోఁచి మఱియొకయస్త్రమును దొడుగుచు, ఒకటివైచునట్లు నటించి
మఱియొకటి వైచుచు, ఇట్లు మహావీర్యుండుగాన యుద్ధంబున నద్భుతంబగు పరా
క్రమము నెఱపుచుండును జుమీ! ఇతఁడు క్రుద్ధుఁడగు నేని ముల్లోకము లొక్కటిగా
నెత్తివచ్చినను నితనితాఁకు నిలుచుట కడిఁది. ఇందులకు సందేహము లేదు. కాఁబట్టి
కనుగలిగి, వీఁడెచ్చరికతప్పుట మొదలగు ఛిద్రములను జతనమున నరయుము.
నీయందును ఛిద్రములు గలుగనట్లు చూచుకొనుము. ఛిద్రములు గలిగెనా
గప్పివుచ్చుము. ఇట్లెచ్చరికగలిగి వింట నిన్ను రక్షించుకొనుము' అనెను. రాముఁ
డు చెప్పినదివిని లక్ష్మణుఁ డతనిని గౌఁగిలించుకొని ప్రదక్షిణముగావించి నమస్క
రించి యంత యుద్ధమునకుఁబోయెను. గజతుండములవంటి బుజములు గలయా
లక్ష్మణుఁడు, మెఱుంగులు దుఱంగలించుచు బెడిదమై చూపట్టు వింటి నెత్తికొని, భిన్న
లయి నేలంబడుచున్న యవ్వానరులపై బాణవర్షము లవ్వారిగాఁగురిసి గప్పుచున్న
రావణునిం జూచెను. మహాతేజుండగు వాయుకుమారుఁడు హనుమంతుఁ డట్లు లక్ష్మ
ణుఁడు యుద్ధమునకు వచ్చుటనుజూచి, భృత్యుండు నేనుండఁగా నతనికేల కష్టమని
రావణుని బాణసమూహమును వారించుచు వానిపయి కడరెను. బుద్ధిమంతుఁడగు
హనుమంతుఁడు రావణుని రథమును జేరి, కుడిబుజము నెత్తి రావణుని నదల్చుచు
'నీవు దేవతలను దానవులను గంధర్వులను యక్షులను రాక్షసులను భంజించియు
న్నావనుట వాస్తవమే. వానరులవలనమాత్రము నీకట్లుగాక భయమే ప్రాప్తించి
యున్నది. ఇదిగో! అయిదువ్రేళ్లు గలిగి నీపయికినెత్తియున్న యీ నాకుడిబుజము,
ఇప్పుడు నిన్నుఁజంపి నీదేహమున బహుకాలముగానున్న జీవుని వెలువరింపఁగలదు
చూడు' మనెను. భయంకరపరాక్రముఁడగు రావణుఁడు, హనుమంతుఁడు చెప్పి
నదివిని, కోపంబునఁ గన్నులెఱ్ఱఁబాఱ, నతనితో 'ఓరీ! వానరా! జంకులేక శీఘ్ర
ముగఁ బ్రహరింపుము. హనుమంతుఁడు రావణుని డాసికొట్టినాఁ డను నిట్టిస్థిరకీర్తిని
బొందుదువు. అంత నేను నీపరాక్రమముఁ దెలిసి నిన్ను నాశము సేసెదను' అనెను.
వాయుకుమారుఁడు హనుమంతుఁడు రావణుఁ డాడినదివిని, 'నేను ముందే దెబ్బ
యిచ్చియున్నాను. *నీకొడుకగు నక్షకుమారునిఁ దలంచుకొనుము' అనెను. హనుమంతుఁ

*శత్రువుఁ దన్నుఁగొట్టఁగా మరలఁ దానుగొట్టుటయే విక్రమపరిపాటియని హనుమంతునిహృదయము.

డిల్లి త్రిప్పొడువఁగా మహాతేజుం డగునాపరాక్రమశాలి రాక్షసేశ్వరుఁ డగురావణుఁడు, రోషముగొని, యతనిఱొమ్ము నఱచేతం జఱచెను. హనుమంతుఁడు రావణుని యఱచేతిదెబ్బకు మాటిమాటికి జలనమునొందెనుగాని మిక్కుటంపుదేజమును మహాబుద్ధియుఁ గలవాఁడుగావున, కొంచెముసేపట్లుండి, దిటతెచ్చుకొని మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై యారావణుని నఱచేతం బ్రహరించెను. అంత రావణుఁడు మహాబలుండగు హనుమంతుని యఱచేతిదెబ్బకు, భూకంపమునఁ బర్వతము చలించునట్లు, మిక్కిలియుఁ జలించెను. అట్లు రావణుఁడు యుద్ధమున హనుమంతుని హస్తతలమునఁ దాడితుఁడై చలించుటంజూచి వానరులును, ఋషులును, సిద్ధులును, దేవతలు, నసురులును బరమసంతోషమునఁ గోలాహలము సేసిరి. అంత మహాతేజుం డగురావణుఁడు తెప్పిఱిలి, హనుమంతుంజూచి, 'వానరా! సెబాసు! నీవు నాకు శత్రుఁడవయినను నీవీర్యమునకు మెచ్చుకొన్నాను' అనెను. అంత హనుమంతుఁడు 'ఇసీ! నావీర్యము పాడగుఁగాక. కాలిపోవుగాక. రావణా! నాచేఁ గొట్టుపడియు నీవు చావకయునుఱితో నున్నావే! ఇట్టి నావీర్యము ఇస్సీ కాల్పనా! దుర్బుద్ధీ! ఇఁక ఒకమాఱుమాత్ర మిపుడు ప్రహరింపుము. ఉరక నిన్ను నీవే పొగడుకొనుచున్నావేమి! అంత నే నొకపిడికిటిపోటుతో నిన్ను యమపురికిఁ బంపెదను!' అనెను. అంత హనుమంతునిమాటకు రావణుఁడు కోపమున మిక్కిలియు మండిపడెను. అంత నావీర్యవంతుఁడు రావణుఁడు కోపమునఁ గన్నెఱ్ఱఁజేసి కుడిచేతిని గట్టిగాఁ బిడికిలించికొని వేగమున హనుమంతునిఱొమ్మునం బొడిచెను. అట్లు విశాలమగు నిజవక్షఃస్థలమునఁ గొట్టువడి హనుమంతుఁడు మరల మిక్కిలియుఁ జలించెను. అతిరథుండగు రావణుఁడు, అపుడు మహాబలశాలియగు హనుమంతుఁడు మూర్ఛితుఁడై యప్పటికిని గ్రిందుపడుపరాన ట్లుండుటంజూచి యతఁడు తెప్పిఱిలినఁ గష్టమని శీఘ్రమున రథమెక్కి నీలునిపయికింబోయెను. రాక్షసాధిపతి రావణుఁడు ప్రతాపవంతుఁడుగాన సర్పంబులంబోలి భయంకరములై పగవారిమర్మముల మిక్కిలియు భేదించునట్టి బాణములేసి సేనాపతిని నీలునిచుట్టును మంటలు గ్రమ్మఁజేసెను. వానరచమూపతి యానీలుఁ డట్లు బాణసమూహములచే నలజడినొంది నొకచేత వానిని వారించుచు మఱొకచేత నొకపర్వతశిఖరమునుగొని యారాక్షసేశ్వరునిపై వైచెను. మహాతేజంబుగల హనుమంతుఁడు తెప్పిఱిలి యుద్ధకాంక్షచే నలుప్రక్కలంజూచి,నీలునితో యుద్ధము గావించుచున్న రావణునిఁగని, తనబారితప్పినాఁడను రోషంబున నారాక్షసేశ్వరునింజూచి గొప్పమనస్సుగలవాఁడు గావున 'మఱియొకనితోడ యుద్ధముసేయువానిమీఁదికిఁ దలపడుట యుక్తముగాదు. కావున నిన్ను విడిచితిని' అనెను. మహాతేజుండగు రావణుఁడును నీలుఁడువైచిన యాపర్వతశిఖరమును మిక్కిలియు వాఁడిమొనలుగల యేడుబాణములచే ఖండింపఁగా నది తుత్తుమురై నేలంబడెను. వీరులగు పగవారినివధించు నావానరచమూపతి నీలుఁడు, తానువైచిన యా

పర్వతశిఖరము తునియలగుటంజూచి, కోపమునఁ బ్రళయకాలాగ్నివలె మండిపడెను. ఆనీలుఁ డప్పుడు యుద్ధమున నినుమద్దిచెట్లను, చండ్రచెట్లను, చక్కఁగాఁబూచిన మామిడిచెట్లను, మఱియు పలువిధములయిన యితరవృక్షములనను రావణునిపై వైచెను. రావణుం డావృక్షములనెల్ల బదులునకు బాణముల ఖండించి నీలునిపై మిక్కిలియు బెడిదమయిన బాణవర్షమును గురిసెను. ఆనీలుఁడు, అట్లు మేఘము మహాపర్వతముపై వర్షముగురియునట్లు, రావణుఁ డట్లు తనపై బాణవర్షముగురియఁగా, అపుడు తనయాకారమును గుఱచగావించుకొని, రావణుని ధ్వజాగ్రముమీఁ గొబ్బున నుఱికెను. అట్లు నీలుఁడు తనధ్వజాగ్రమున వ్రాలియుండుటం గాంచి రావణుఁడు క్రుద్ధుండై మండిపడెను. నీలుఁడును ధ్వజాగ్రమునమండి సింహనాదము వించెను. అంత రావణునికి గుఱి దొరకకుండునట్లు, ధ్వజాగ్రమునను ధనువుమెను కిరీటముకొనను సంచరించుచున్న నీలునిఁజూచి లక్ష్మణుఁడును నతివేగము బ్రసిద్ధిగాంచిన హనుమంతుఁడు రాముఁడునుజూచి యాశ్చర్యము నొందిరి. మహాతేజుండగు రావణుఁడును నీలుని లాఘవమునకు విస్మయమునొంది, యద్భుతముగా వెలుఁగుచున్న యాగ్నేయాస్త్రమును దీసికొనెను. అంత నావానరులందఱును రావణుఁడు యుద్ధమున నీలునిలాఘవముచే తబ్బిబ్బువడుటంజూచి యుబ్బునొంది నీలునిం గాంచి కోయని యార్చిరి. అప్పుడు నీలునిలాఘవమున మనస్సు తడఁబాటునొందఁగా,నాగ్నేయాస్త్రమునకు సంరంభించియున్న రావణుఁడు వానరులయు నీలునియు కోలాహలముచేఁ గొంతసే పేమియుఁ జేయునది దోఁచకుండెను.అంత రావణుఁడు శరముంగొని యాగ్నేయమంత్రముతో నభిమంత్రించి ధ్వజాగ్రమున నీలునిం బొఱచూచెను. అంత మహాతేజుండగు రాక్షసేశ్వరుఁడు రావణుఁడు నీలుంజూచి 'చపలప్రకృతీ ! వానరమా ! నీ వీపెనుమాయం జేసి మంచిలాఘవము గలిగియున్నావు. నీకిప్పుడు శక్తిగలదేని, నీప్రాణమును రక్షించుకొనుము. నీవు * నీరూపములను బెక్కువిధముల నమ్యైవానిని లాఘవాతిశయమున సృజించుచున్నట్లు కనఁబడుచున్నావు. అయినప్పటికిని నేనిపుడు అస్త్రమంత్రముచే నభిమంత్రించి ప్రయోగించుబాణము, నీవు ప్రాణమురక్షించుకొనుటకై యిట్లుసేయుచున్నను, నీప్రాణములు దీయఁగలదు' అనెను. మహాబాహుండగు రాక్షసేశ్వరుఁడు రావణుఁ డిట్లుచెప్పి యాగ్నేయాస్త్రముచే బాణము నభిమంత్రించి వింటందొడిగి వానరచమూపతియగు నీలునిపయిఁ గాఁడ నేసెను. ఆగ్నేయాస్త్రమంత్రముచే మంత్రితమైనబాణము వక్షమునఁగాడఁగా నీలుండు దానిజ్వాలలచే దగ్ధుఁడగుచు తటాలున ధ్వజాగ్రమునుండి నేలఁబడెను.

---

* నీలుఁడు ధ్వజాగ్రమునను ధనురగ్రమునను కిరీటాగ్రమునను అతిస్వల్పకాలమున లాఘవాతిశయమున దా నొక్కఁడు గనఁబడుటచే అతఁడు తాను పెక్కురూపములు సృజించుకొన్నాఁడని రావణుఁడు వర్ణించుట తెలియునది.

ఆనీలుఁడు తండ్రియగు నగ్నిహోత్రునిదయా వైభవమువలనను తన తేజమువలనను మోఁకాళ్లూనుకొని నేలఁబడెనుగాన తలక్రిందులుగఁబడి ప్రాణములు విడిచినవాఁడు గాఁడయ్యె. రావణుఁడు నీలుఁడు మూర్ఛితుఁడగుటంజూచి యుద్ధోత్సుకుఁడై మేఘధ్వనివలె శబ్దించురథమున లక్ష్మణునిమీఁది కడరెను. ఆరావణుఁడు లక్ష్మణునిఁ దారసించి యడ్డపడిన సుగ్రీవాదులవారించి, యుద్ధమధ్యంబునఁ దేజరిల్లుచు, భూమియదరునట్లు వింటిని నారిం దివిచి మొరయించెను. మహాసత్త్వుం డగులక్ష్మణుఁడు,అట్లు పెనుమ్రోఁతగల ధనువును ధ్వనింపఁజేయుచున్న రావణుం జూచి 'రాక్షసేంద్రా! నరులతో యుద్ధముసేయఁదగవు. నాపైకిరమ్ము' అనెను. రాక్షసరాజు రావణుఁడు,అతిగంభీరధ్వనిగల లక్ష్మణునివాక్యమును,భయంకరమయిన యతనిజ్యాశబ్దమును విని,యట్లు సన్నద్ధుఁడై నిలుచున్నలక్ష్మణునిం దారసించి కోపంబున, 'లక్ష్మణా! నీవు నన్నెదిరింపఁగోరుచున్నావు గావున విపరీతబుద్ధిపుట్టి నాభాగ్యవశమున నాదృష్టిఁ బారింబడితివి. నీవు నాబాణసమూహములచేఁ బీడితుండవై, యీక్షణముననందే యమపురికిం బోఁగలవు' అనెను.అట్లు గర్జించుచు నున్నతములయిన తెల్లని దంష్ట్రాగ్రములు గలిగి యున్నరావణునిఁ దృణీకరించి లక్ష్మణుండు 'రాక్షసరాజా! గొప్పప్రభావముగలవారు నీయట్లు గర్జింపరు. నీవు మహాపాపిష్ఠుఁడవు కాన యిట్లు నిన్ను నీవే పొగడుకొనుచున్నావు. రాక్షసేంద్రా! నిర్జనప్రదేశమున యతివేషమున సీత నపహరించి తెచ్చిన నీబలమును పగవారిని భయపెట్టు ప్రతాపమును పరాక్రమమును నేను జక్కఁగా నెఱుఁగుదును. నేను ధనుర్బాణంబులు దాల్చి వచ్చియున్నాను. యుద్ధమునకు రమ్ము. వ్యర్థముగా నాత్మస్తుతిచేసికొనుటచేఁ బనయేమి !' అనెను. లక్ష్మణుఁడిట్లు చెప్పఁగా రావణుఁడు కుపితుఁడై యతనిమీఁద మంచిపింజలుగలబాణము లేడింటిని బ్రయోగించెను. లక్ష్మణుఁడు బంగారుపింజలు గలిగి వాఁడిమొనలరంజిలు బాణములచే, నాబాణముల నేడింటిని ఖండించెను.ఆబాణములు, దేహములుభిన్నమైన మహాసర్పములవలె,శీఘ్రమున భిన్నములై నేలంబడుటను జూచుచు, లంకేశ్వరుఁడు రావణుఁడు కోపవశమునొంది మఱియు వేఱువాఁడిబాణములను బ్రయోగించెను లక్ష్మణుండును బాణసమూహములను వింటం దొడిగి తీవ్రంబగు బాణవర్షమును గురిసెను. మఱియు మంగలకత్తి యాకారము గలబాణములను, అర్ధచంద్రాకారముఖములుగల బాణములను, మేలయిన కర్ణిబాణములును రెండుప్రక్కల వాదఱగలబాణములను బ్రయోగించి రావణుండేయు బాణములను ఖండించుచుండెనుగాని వానికెంతమాత్రమును గలంగినవాఁడుగాఁడు. రాక్షసరాజా రావణుఁడు, తా నేసినయయ్యె బాణసమూహముల నన్నింటిని లక్ష్మణుఁడు ఖండించి వ్యర్థముగావించుటం జూచి లక్ష్మణుని బాణలాఘవమునకు నాశ్చర్యపడి మరలఁ దీక్ష్ణములగు బాణంబులను బ్రయోగించెను. ఆలక్ష్మణుఁడు రాక్షసరాజును వధించుటకై వాఁడిమొనలుగలిగి యింద్రుని వజ్రాయుధమును బిడుగుంబోలె నురవడించుచు నగ్నివలె వెలుంగుచున్న బాణములు, వేగమ వింటం గూర్చివిడిచెను.

రాక్షసేంద్రుఁడగు నారావణుఁడు ఆబాణములనెల్ల ఖండించెను. అట్లు వానిని ఖండించి యంతఁ దనకు బ్రహ్మ యొసంగినదియు ప్రళయకాలాగ్నివలెఁ బ్రకాశించుచున్నదియునగు నొక్క బాణమును లక్ష్మణుని లలాటమున నాటనేసెను. ఆలక్ష్మణుఁడు రావణుబాణముచేఁ బీడితుఁడై వింటిపట్టు వదలుగాఁబట్టికొని, చలనమునొంది మూర్ఛిల్లి మరల నెట్టకేలకు తెలివినొంది రావణునిచాపమును ఖండించెను. అప్పుడు లక్ష్మణుఁడు, అట్లు చాపము తునిఁగిన రావణుని, వాఁడిమొనలుగల మూఁడుబాణముల నొప్పించెను. ఆరాక్షసరాజును ఆబాణములచేఁ బీడితుఁడై చలనమునొంది మూర్ఛితుఁడై యెట్టకేలకు మరల తెలివినొందినవాఁడయ్యె. అధికసమర్థుఁడును దేవశత్రుండునగు నారావణుఁడు విల్లుదునిఁగి, బాణములం గొట్టువడి, మేదస్సున నొడలెల్లఁదడియ, రక్తంబున దొప్పఁదోఁగి, యుద్ధరంగమున, మున్ను బ్రహ్మ దనకొసంగిన శక్తిని జేకొనెను. రాక్షసలోకనాథుఁ డగునారావణుఁడు పొగలేనియగ్గివలె జ్వలించుచున్నదై వానరసైన్యమును దిగులుగొలుపుచున్న యాశక్తిని శీఘ్రమున లక్ష్మణునిపయి వేగఁ బ్రయోగించెను. లక్ష్మణుఁడు, ఆశక్తి తనపయి వచ్చుచుండుటంజూచి దానిని, ఉగ్రంబులై, నేతిచే వృద్ధిం బొందిన యగ్గికి సాటియైన బాణములం గొట్టెను. అట్లు గొట్టినను, ఆశక్తి, లక్ష్మణుని విశాలవక్షమును జొచ్చినది. మహాశక్తిమంతుఁ డగురఘుకులవీరుఁ డాలక్ష్మణుఁడు, ఆశక్తిచేతం గొట్టువడి మాటికి మండిపడెను. అంత లక్ష్మణుఁడు మూర్ఛిలుచుండుటనుజూచి రావణుఁడు లటాలునవచ్చి బాహువులచే బలిమిమై నతనిఁ బట్టుకొనెను. *హిమవంతమునుగాని, మందరపర్వతమును

* ఇందులకు 'హిమవాన్మన్దరో మేరుస్త్రైలోక్యంవాసహామరైః। శక్యంభుజాభ్యాముద్ధర్తుం నసంఖ్యే భరతానుజః' అనిమూలము. విశేషార్థము.—లక్ష్మణుని భుజములచేనెత్తఁబూనినరావణుని ఋషి పరిహసించుచున్నాఁడు.—(హిమవాన్) 'ధైర్యేణహిమవానివ' అని సమస్తధీరులకును నుపమానభూతుఁడైన హిమవంతునినిగూడ భుజములచేనెత్తుటకు రావణునకు శక్యమగును. అందొకభాగమయిన కైలాసమును మున్ను కదల్చియున్నాఁడు గాన; (మన్థరః) సకలసాగరములందును బ్రధానమై మిక్కిలిగంభీరమైన క్షీరసముద్రమును గలఁచిపుచ్చ సమర్థమయిన మందరపర్వతమునుగాని భుజములచే నెత్త శక్యమగును. ఏలన నది తానుజయించినదేవతలచేతనే యమృతమథనసమయమున జర్ఝరితము గావింపఁబడినదిగాన; (మేరుః) సకల కులపర్వతవలయమునకు లలామమయినట్టి మేరువునుగూడ నట్లుచేయ శక్యమగును. ఏలన వాయువుచేతనే దానిశిఖర మయినలంకసముద్రపుకుక్షిని నిక్షిప్తమయినదిగాన; (త్రైలోక్యం) పంచాశత్కోటివిస్తీర్ణమై వేఱొకటి తనకు పరిమాణములేక తనకుఁదానే పరిమాణమైయొప్పు ముల్లోకముల నట్లుచేయుటకు శక్యమగును. ఏలన దానిలో నొకభాగమయినభూమిని హిరణ్యాక్షుఁడు చంకఁబెట్టుకొన్నాఁడు గాన; (సహామరైః) దేవతలతోఁగూడ - త్రైలోక్యనిర్వాహకులగు దేవతలతోఁగూడియైనను నట్లు చేయశక్యముగాదు. ఆదేవతల కధిపతియైన యింద్రుఁడు తనకొడుకుచేతనే నిగ్రహింపఁబడినవాఁడు గాన; (భరతానుజః) (రామానుజ అనుజః) రాముని చతుర్భాగమనుట. రాముని చతుర్భాగము నుద్ధరించుటకే యశక్తుఁడైనవాఁడు రామునితో యుద్ధముసేయు నెట్లుశక్తుఁడనుట. (భుజాభ్యామ్) రెండు భుజములచేత ననుటచే హిమవత్పర్వతాదులను రెండుభుజములచేతనే యెత్తుట శక్యము. ఇతని



1506. రావణశక్తితాడితుఁడై లక్ష్మణుఁడు మూర్ఛనొంది పడుట ; రామరావణయుద్ధము.

ు మేరువుంగాని దేవతలతోఁగూడ ముల్లోకములనుంగాని చేతులతో నెత్తవచ్చు
కాని యుద్ధమున లక్ష్మణునిమాత్రము నెత్తనలవిగాదు. * లక్ష్మణుఁడు బ్రహ్మాసం
ధి యగునాశక్తి వక్షస్థలమునఁ గాఁడఁగానే యిట్టిదట్టిదని చింతింప నలవిగానిదై
ౖదేవుని యంశభూతమై యొప్పు తనస్వరూపమును స్మరించినవాఁడయ్యె. అంత
వకంటకుఁ డగు రావణుఁడు మనుష్యదేహమును దాల్చినదై దానవగర్వముల రూ
హూపుచునుండు వైష్ణవభాగమగు లక్ష్మణుని రెండుచేతులచేతను బట్టి పీడించియు
నివి, వైష్ణవభాగరూపుఁ డగుటంజేసి, లేవనెత్తుటకు శక్తుఁడు గాఁడయ్యె. అంత
ాయుకుమారుఁడు హనుమంతుఁడు కుపితుఁడై రావణునిమీఁది కడరి వజ్రమువంటి
కిట నతని ఱొమ్మునం బొడిచెను. ఆ పిడికిటిదెబ్బకు, రాక్షసేశ్వరుఁడు రావణుఁడు

---

యిరువదిచేతులను నెత్త శక్యముగాదనుట సూచితము. 'శత్రూణామప్రకంప్యోపి' అని మీఁద
ప్పఁబడుటచే, సపరికరుఁడైన రామునకుఁగూడఁ గదల్పనలవిగానివాఁడనియు సిద్ధము. అయితే
ఁద హనుమంతుఁ డెత్తినట్లు చెప్పఁబడినదే! ఇదియెట్లు? అన్నచో (సంఖ్యే) యుద్ధమందు శక్యము
దనుట. దుర్హృదయులైనవారికి నెత్త శక్యముగాదని యర్థము. కాఁబట్టి హనుమంతుఁడు ఎ
టకుఁ గల కారణము 'సుహృత్త్వేన' అనిశోభనహృదయమని మీఁదఁ జెప్పఁబడుచున్నది. దీనిచే
ద్ధమునఁ బడిన లక్ష్మణునిశరీరము హిమవదాదులకంటెను బరువనుట చెప్పఁబడినదయ్యె.

* ఇట్లు బరువుగలుగుటకు హేతువేమనఁగా విష్ణువునంశమగుటయే యని తెలియునది. విష్ణువు
శమయిన తనస్వరూపము స్వాభావికముగా బరువయినదని భావము. అట్టి తనస్వరూపమును స్మరిం
తప్ప మఱి వేఱువ్యాపారము చేయనందున తన గురుత్వము స్వాభావికమె యని యేర్పడుచున్నది.
స్మరణమువలన క్రొత్తగా గురుత్వము గలుగదుగదా. స్వకీయాంశము స్మరించుటంజేసి లక్ష్మణుఁడు
శరీరమునకు బరువు గలిగించికొన్నాఁ డన్నచో, ఇది పదార్థమునుగాదు వాక్యార్థమునుగాదు.
ౖరూపమును స్మరించుట బరువుగలిగించుటకుఁ గారణమనుటకు ప్రమాణములేదు. లేక విపత్పరిహారము
ఁఅకు తనకు మూలకారణమగు విష్ణువును స్మరించినాఁ డన్నచో, తానే విష్ణురూపమగుటవలన తనకు
పత్పరిహారము తానే తప్ప వేఱులేనందున నిదియు సరిగాదు. తాను నటించుచున్న మనుష్యభావన
ోధమునొందదు కాని తనంతట గౌరవము(బరువు)గలుగునుగాన విష్ణుస్మరణ మన్నచో మనస్సుయొక్క
వనయు లౌకికులకు దెలియనేరదు. ఇట్లును మనుష్యభావనయు నుపాయమునుగానందున నదియుసరి
దు. కాఁబట్టి వస్తువుస్వభావముచేతనే భక్తులకు తేలికగాను భక్తులుగానివారికి బరువుగాను నుండుట
లియునది. ఇట్టిది గావుననే 'అచింత్య' మనఁబడినది.

† ఇచటఁగూడ విశేషణసామర్థ్యమువలన వస్తుస్వరూపముచేతనే అకంప్యమగుట (కదల్పరానిత్వం
టు) గలిగెనని తెలియునది. విష్ణుస్వరూపము నిరవయవమగుటవలన దానియం దంశము కలుగుటయెట్లు?
న్నచో నిచట స్వరూపముచేత అంశమని చెప్పఁబడదు. గుణము లావిర్భవించు తారతమ్యమువలననే
ంశత్వము తెలియునది. 'గుణైష్షడ్భిస్త్వేతైః ప్రథమతరమూర్తిస్తవబభౌ । తతస్తిస్రస్తేషాం త్రియు
ముగైర్ద్విత్రిభిరభూః । వ్యవస్థాయాం చైషాం ననువరద సావిష్కృతివశాత్ । భవాన్ సర్వత్రైవ
గణితమహిమంగళగుణః' అన్నట్లు గుణములుదయించు నెక్కువ తక్కువలంబట్టి యంశములని తెలి
నది. ఇచట మనుష్యభావము మనుష్యసమానాకారమని తెలియునది.

మోఁకాళ్లూన రథభూమినిబడి మిక్కిలియుఁ జలించి మతిచాఁపుగానుం బడెను. ల
ణుఁడు నోళ్లనుండియు, గన్నులనుండియు చెవులనుండియు మిక్కిలియు నెత్తురు గ్ర
ను. అతఁడిట్లట్లు పొరలాడుచు చేష్టలుదక్కి రథమధ్యమునంబడి తెలివిదప్పి మ
తుండునయి నిలుకడనొందక తత్తఱపడుచుండెను. భయంకరపరాక్రముఁ డగు
ణుఁడు యుద్ధమున మూర్ఛితుం డగుటఁజూచి వానరులును, ఋషులును దేవేం
డు మొదలగు దేవతలును, సంతుష్టులై కో యని యార్చిరి. మహాతేజుం డగు
మంతుఁడును, రావణుచేఁ గొట్టువడి మూర్ఛితుం డై నలక్ష్మణునిఁ జేతు నెత్త
రామునిసమీపంబునకుఁ దెచ్చెను. *ఆలక్ష్మణుఁడు రావణాది
పనుగూడ నలవిగానివాఁ డయినను, హనుమంతుఁడు అనుకూలమగు హృద
గలవాఁడును, మిక్కిలియు భక్తుఁడు నగుటం జేసి నతనికిఁ దేలికయయ్యెను. ల
యంత యుద్ధమున దుర్జయుండగు నాలక్ష్మణుని వదలి యాఁరావణుని రథమున న
డనయొప్పటి నెలవుం జేరెను. పగవారిని రూపుమాపు లక్ష్మణుఁడును, † విరోధిప్ర
కస్వభావుఁ డగువిష్ణునిభాగమయి అచింత్యునగు తనస్వరూపమును స్మరించుట
మూర్ఛదేఱి గాయము లాఱినవాఁడయ్యెను. మహాతేజుం డగురావణుండు
మూర్ఛదేఱి, వాఁడిబాణములను గొప్పవింటిని గయికొనెను. రాముఁడు, యుద్ధ
మహావీరులు పడిపోవుటం జేసి పరుగెత్తుచు నున్నట్టి వానరసైన్యమున
తాను రావణునిమీఁది కడరెను. అంత హనుమంతుఁడు రామునియొద్దకు
'నీవు నన్నారోహించి, రావణునితో యుద్ధము గావింపఁదగును' అనెను. రా

---

*పూర్వము హిమవదాదులకంటె బరువగుటచే లక్ష్మణుఁడు 'అకంప్యుఁ'డనఁబడెను. ఇట్ల
ణునిని ఒకకపి రామసమీపమునకుఁ గొనిపోవుట యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు. 'వాయుసూ
హృత్త్వేన భక్త్యాపరమయాచసః। శత్రూణామప్రకంప్యోఽపి లఘుత్వమగమత్కపేః' (వాయుస
వాయుకుమారుఁడగు హనుమంతునకు, (సుహృత్త్వేన) శోభనహృదయత్వముచేత - అనుకూలవ
త్వముచేత ననుట, హృదయానుకూల్యమే లక్ష్మణుఁడు తేలికయై యనుగ్రహము చూపుటకుఁ
(పరయాభక్త్యా) పరభక్తి అందులకు అధికమనిభావము. (సః) ఆలక్ష్మణుఁడు, (శత్రూణాం)
నకును వానిపరికరమునకును, (అప్రకంప్యోఽపి) కదల్పరానివాఁడయ్యు, (కపేః) హనుమంతుఁడ
(లఘుత్వమగమత్) తేలికనొందెను. దీనిచే లఘుత్వము బుద్ధిపూర్వకమైనదని చెప్పంబడినది. శత్రు
ప్రాపింపరాకుండుటయు మిత్రులకు ప్రాపింపఁగూడియుండుటయు లక్ష్మణునకు స్వరూపప్రయు
యనిభావము. లక్ష్మణుఁడు మూర్ఛనొందియున్నను మిత్రునకు తేలికయైయుండవలయునని తెలి
బరువుగానుండెడిశక్తియుఁ దెలియుటచే అచ్చటచ్చట రామలక్ష్మణులు అజ్ఞానమును అభి
చించు వచనములాడుట మానుషవేషనిర్వాహణమునకని తలంచునది.

† ఇట తనంతట శక్తివిడిచిపోవుటకును మూర్ఛదేఱుటకును గాయము లాఱిపోవుటకును హే
'విష్ణోర్భాగ మమీమాంస్య మాత్మానం ప్రత్యనుస్మరన్' అను మూలమునఁజెప్పిన విరోధిప్రత్యనీ
వుఁడగు విష్ణుని యచింత్యమగు భాగమగుటయే కారణము. 'అనుస్మరన్' అనుటచే ఊరక స్మ
కాని సాధనానుష్ఠానమేదియుఁ జేసినవాఁడుగాఁడని చెప్పఁబడెను. గోవిందరాజులు.



1509. లక్ష్మణుఁడు రావణశక్తితాడితుఁడై మూర్ఛనొందుట; రాముఁడు, రావణుని రథమును విఱిచి సారథినిజంపి కిరీటమును క్రిందఁబడనేసి లంకకుఁబోయి సన్నద్ధుఁడై మరలిరమ్మని చెప్పుట.

హనుమంతుఁడు చెప్పినమాటలువిని, విష్ణువు బలవంతుఁ డగుగరుత్మంతుని నారోహించినట్లు, పెచ్చుపెరిగిన మిక్కిలి బలవంతుఁడును మహాశూరుఁడు నగుమహాకపిని హనుమంతుని నారోహించినవాఁడయ్యెను. రాముఁ డట్లారోహించి యుద్ధంబున రథగతుం డగు రావణునిం జూచెను. మహాతేజుం డగురాముఁ డారావణుంజూచి క్రుద్ధుఁడై విల్లుగొని విష్ణువు బలిమీఁది కదరున ట్లాగ్రహంబున వానిమీఁది కడరెను. ఆరాముఁడు వజ్రధ్వనివలె మహాధ్వని గలుగునట్లు, అల్లెత్రాటిని మొరయించెను. అతఁడు నంత గంభీర మగువాక్యమున రాక్షసేశ్వరుం డగురావణునింజూచి "నిలునిలు ! ఓరీ రాక్షసశార్దూలమా ! నా కింతటి యప్రియము గావించి యెచ్చటికిఁబోయి నాబారినుండి తప్పించుకొనఁగలవురా? నీవు దేవేంద్రునియొద్దకుఁగాని, యమునియొద్దకుఁగాని, సూర్యునియొద్దకుఁగాని, బ్రహ్మదేవునొద్దకుఁగాని, యగ్నిహోత్రునొద్దకుఁగాని, శంకరునియొద్దకుఁగాని పోయినను దశదిశలకుం బరుగెత్తినను, ఇప్పుడు నాయెదుటఁ బడినపిమ్మట నీకఁ దప్పించుకొనఁజాలవు. రక్షోగణరాజా! నీ విప్పు డెవ్వనిని శక్తిచేఁ గొట్టితివో యతఁడే యిప్పుడు నీకు విషాదము గూర్పఁగోరి, నీకును నీపుత్రకళత్రములకును మృత్యువై యిదిగో త్వరలోనే రాఁగలఁడు. వాఁడే నేనయివచ్చితిని. లక్ష్మణుని గొట్టితినని విఱ్ఱవీఁగకుమా! 'లక్ష్మణునిచేఁ గొట్టువడనివాఁడను నీచేఁగొట్టువడుదునా' యందువా? ఇప్పుడు నీయెదుటనున్నవాఁడు అత్యద్భుతాకారులును, జనస్థాననివాసులును, నుత్తమాయుధధారులునగు బదునాల్గువేల రాక్షసుల నొక్కండె బాణములనుఱుమాడినవాఁడుసుమీ" యనెను. రాముఁడు చెప్పినదివిని, రాక్షసేంద్రుఁ డగురావణుఁడు, మున్ను దన్ను ప్రహరించుటయేకాక, యుద్ధమున రామునకు వాహనమయ్యు నున్నందులకు మహావీర్యుం డగువాయుపుత్రుని హనుమంతునియెడఁ గ్రుద్ధుఁడై ప్రళయకాలాగ్నివంటి వాఁడిబాణములఁ గాఁడనేసెను. హనుమంతుఁడు యుద్ధమున రావణునిచే బాణంబులఁ గొట్టువడియు నతండు స్వాభావికముగా తేజంబు గలిగియుండువాఁడుగాన నతని తేజము మఱియు నధికమయ్యెనుగాని గుండినదిగాదు. అంత మహాతేజుం డగురాముఁడు రావణునిచే గాయపఱుపఁబడిన వానరసింహుని హనుమంతునింజూచి కోపావేశమునొందెను. అంత రాముఁడు, ఆరావణునిరథమును మాటిమాటికి డగ్గఱి, దానిచక్రములను గుఱ్ఱములను ధ్వజమును ఛత్రమును పెద్దపతాకలను, సారథిని, వజ్రశూలఖడ్గాద్యాయుధములను, వాఁడిపుంఖములు గలబాణములేసి ఖండించెను. అంత వీర్యవంతుఁ డగునింద్రుఁడు వజ్రాయుధమున మేరుపర్వతమును గొట్టినట్లు,రాముఁడు వజ్రమునకును బిడుగునకు సాటియగు బాణముచే విశాలమై బలువుగలిగి పొలుపు గులుకురావణునివక్షమును బలిమిఁగొలఁదిం బ్రహరించెను. ఎవ్వండు మున్ను తనపయిఁ బిడుగుపడినను వజ్రాయుధపుఁ బ్రేటుపడినను గలంగఁడో మఱి చలింపను జలింపఁడో, యట్టియనూన్యానరాజప్రభావము గలరావణుఁడు రామబాణములఁ గొట్టువడి, బాధకు నోర్వలేక మిక్కిలియు నార్తుఁడై చలన

మును బొందెను. వీరుఁడయ్యు చేతిధనువునుగూడ విడిచెను. మహామనస్కుఁడగుటచే దయాళు వగు రాముఁడు, ఆ రావణుఁడు మూర్ఛిలుచుండుటంజూచి యంత వెలుంగుచున్న యొకయర్ధచంద్రబాణమును దీసి, దానిచే సూర్యవర్ణం బగు రాక్షసాధిపతి రావణుని కిరీటమును దోడనే ఖండించి మానభంగము గావించెను. యుద్ధముననట్లు విల్లు దిగవిడిచి కిరీటజాలము ఖండింపఁబడి, నిర్విషమగు సర్పమువలెను, మంటలు లేని యగ్నిభంగిని, గాంతిలేని సూర్యునివిధమునను, తేజంబుసొంపు దూలియున్న రాక్షసరాజును * రావణునింజూచి 'నీవు మిక్కిలియు భయంకరమయినకృత్యము గావించితివి. మఱియు నాప్రక్కం గలమేటివీరులను బెక్కండ్రను గొట్టితివి. కావున మిక్కిలియు నలసియున్నావని నిశ్చయించి యిపుడు నిన్ను బాణములచే మృత్యుబారికిఁ బంపక విడిచితిని. రాక్షసరాజా! నీవు యుద్ధంబుచేసి మిక్కిలియు నలంగియున్నావు. నేను సెలవిచ్చెద. పొమ్ము. లంకకుఁబోయి కొంత విశ్రమించి మరలరథమునెక్కి విలుదాల్చి వెడలిరమ్ము. అప్పుడు నీవును మరలరథగతుఁడవై ధనుర్ధరుఁడవై యుండినపుడు నాబలంబును జూపెదను; జూడుము' అనెను. అట్లు వేగ విల్లు ద్రుంపఁబడి, సారథియు గుఱ్ఱములును గూలి, తానును బాణపీడితుఁడై పెనుకిరీటమును ఖండింపఁబడుటచే రావణుఁడు గర్వము నశించి యుబ్బుదూలి, రాముఁడు చెప్పినదివిని, లజ్జితుఁడై శీఘ్రమున లంకాపురిం బ్రవేశించెను. మహాబలుండును దేవదానవశత్రుండును నగు రాక్షసేంద్రుఁడు రావణుఁడు, లంకకుఁ బోయినపిదప, రాముఁడు, తానును లక్ష్మణుఁడును జేరి, మహాయుద్ధాగ్రమునఁ బడియున్న వానరుల దేహములందలి బాణములను పెఱికించి వారిబాధలు దీర్చినవాఁడయ్యె. దేవేంద్రశత్రుఁడగు నారావణుఁడు పరాజితుండగుటకు సురలు నసురులు దిక్కులును సమస్తభూతగణములును సముద్రవాసిప్రాణులును ఋషులును మహోరగులును, అట్లు జలచరప్రాణులును భూచరప్రాణులు నందఱును సంతోషమునొందినవారయిరి. ఇది యేఁబదితొమ్మిదవ సర్గము.



* రావణుఁడు విల్లుదాల్చి తనకుఁదానే రక్షకుఁడై యుండెను. పిదప విలువిడుచుటచే తన్ను తానే రక్షించుకొను ప్రయత్నము మాలినవాఁడయ్యెఁగాన రామునికే రక్షింపఁదగువాఁడయ్యెను. ఇట్లు రాముఁడు అనన్యశరణుండయిన రావణునిఁజూచి దయార్ద్రుఁడై ప్రాణముదీయక కేవల మానభంగము మాత్రము గావించినవాఁడయ్యెను. దీనిచే, భగవద్రక్షణమునకు నిమిత్తము తాను తనరక్షణమునందు ప్రయత్నముమాలియుండుటయే యని తెలియునది.

**రావణుఁడు రామునిబాణముల వేంద్రమునకు దుఃఖించి కుంభకర్ణుని మేలుకొలుప నియోగించుట; కుంభకర్ణుఁడు మేలుకనివచ్చి రావణుని నుపాలంభించుట; అందులకు రావణుండు కుపితుండగుటను జూచి తాను యుద్ధమునకు వచ్చుట.**

అప్పుడు రాక్షసరాజు రావణుఁడు లంకాపురమును బ్రవేశించి, రామబాణభయమునం బీడితుఁడై గర్వమువిడిచి, యింద్రియములు కళవళించినవాఁడయ్యె. సింహముచేత నేనుంగును గరుడునిచేత సర్పమునుంబోలె, మహాబలుఁడగు రామునిచేత రావణుఁడు మిక్కిలియు క్రిందుపడినవాఁడయ్యె. రాక్షసరాజగు రావణుఁడు, బ్రహ్మదండములుం బోనివై మెఱపులవలె మెఱయుచున్న రామునిబాణములం దలంచి తలంచి కంది కుందెను. ఆరావణుఁడు కాంచనమయమగు దివ్యసింహాసనమున నాసీనుఁడై, రాక్షసులంజూచి "మహేంద్రసమానుండగు నేను మనుష్యమాత్రునివలనఁ బరాజితుఁడ నయితినే! నేను గావించిన మహాతపస్సంతయు వ్యర్థమేకదా! 'మనుష్యులవలన నీకు భయమని యెఱుంగుము' అని మున్ను దేవుఁడు చెప్పిన భయంకరవాక్యము ఇప్పుడు నాకు ఫలితమయినది. ఆబ్రహ్మవాక్యమట్లయగునుగాని వ్యర్థముగాదు. దేవతలవలనఁగాని, దానవులవలనఁగాని, గంధర్వులవలనఁగాని, యక్షులవలనఁగాని, రాక్షసులవలనఁగాని, సర్పములవలనఁగాని, చావులేకుండునట్లు వరమునడిగి పొందితిని. కాని మనుష్యులవలనఁ జావులేకుండునట్లు లడుగనయితిని. మున్ను, ఇక్ష్వాకుకులనాథుఁడగు ననరణ్యుఁడు, నాచే వధింపఁబడునప్పుడు, నన్నుఁజూచి 'రాక్షసాధమా! కులాధమా! దుర్బుద్ధీ! నిన్ను యుద్ధమునఁ బుత్రమంత్రిబలాశ్వసారథిసహితముగా వధించునట్టి మహాపురుషుం డొకఁడు నావంశమున జన్మింపఁగలఁడు. ఇది నిశ్చయము' అని ప్రతిజ్ఞ సేసెనే. కాఁబట్టి యాచెప్పిన మనుష్యుఁడగు రాముఁడాయనరణ్యుని వంశీయుఁడగు దశరథునికిఁ గుమారుఁడుగాఁ బుట్టెనని తలంచెదను. మున్ను నేను వేదవతిని బలవంతిపెట్టి తిరస్కరించినపుడు, ఆబిక నన్ను శపించినది. మహాభాగురాలగు నావేదవతియే తనశాపముదీర్చుటకై జనకసుతయగు సీతగాఁబుట్టినది. పార్వతి, నందీశ్వరుఁడు, రంభయు, వరుణకన్యకయు (పుంజికస్థలయు) తపఃప్రభావమునం జేసి తాముమున్నట్లు చెప్పిరో యట్లె యయినది. ఋషివచన మెన్నఁటికి నబద్ధము గానేరదు.. రాక్షసులారా! మీరు రీశాపస్వరూపము నంతయుఁ దెలిసి, ఇప్పుడు పగవారిని గెలుచువిషయమై యెచ్చరికగలిగి యుండవలయును. మఱియురాక్షసులు గోపురపార్శ్వములనుండు భటసంచారప్రదేశములందును, గోపురశిఖరములందును, చక్కఁగాఁ గొలిచియుందురుగాక. గాంభీర్యమం దప్రతిముఁడై దేవదానవులగర్వము లడంచుకుంభకర్ణుఁడు బ్రహ్మశాపమున నిద్రాపరవశుఁడై కీడ్పడియున్నాఁడు. అతనిని నిద్రలేపుఁడు' అనెను. మహాబలుండారావణుఁడు, అట్లుప్రహస్తుఁడు హతుం

డగుటయు, తానుపరాజితుఁడగుటయుం దలపోసి, కుంభకర్ణుఁడు భయంకరబలుఁడగుటను దలంచి, 'అవాంతరద్వారములందు జతనముగానింపుఁడు. వానరు లెక్కకుండునట్లు ప్రాకారము లెక్కి కాపుండుఁడు. నిద్రాపరవశుఁడై యున్న కుంభకర్ణుని లేపుఁడు. కుంభకర్ణుఁడు, నేనుదుఃఖితుఁడనై చింత చేకలఁగి కోర్కెయీడేఱక మేలుకొనియుండఁగా, కాలముచే తెలివికొట్టువడి యేచింతయులేక సుఖముగా తానునిద్రపోవుచున్నాఁడు. ఇప్పుడేకాదు. * ఇట్లు ఒకప్పుడు తొమ్మిదినెలలును, ఒకప్పుడు ఆఱులును, ఒకప్పుడు ఏడునెలలును, ఒకప్పుడు ఎనిమిదినెలలునుగా నిట్లెప్పుడును నియతిలేక నిద్రపోవుచుండును. † అతఁడు నేఁటి ముందునాఁటికి తొమ్మిదవనాఁడు,

* ఇట్లు నియతిలేక నిద్రపోవుటంబట్టియే యుత్తరకాండమున కుంభకర్ణుఁడు బ్రహ్మతో 'స్వప్తుం వర్షాణ్యనేకాని దేవదేవ మమేప్సితం' 'దేవదేవా! అనేకసంవత్సరములు నిద్రపోవుట నాకిష్టముగానున్నది' అని నిదురించుకాల మింతయని గుర్తింపక వరమడిగినాఁడు. మీఁద రామునితో విభీషణుఁడు 'శయితాహ్యేష షణ్మాసా నేకాహం జాగరిష్యతి' 'వీఁడు ఆఱునెలల నిదురపోయి యంతలొక్కదినము మేలుకొనియుండును.' అన్నవచనము నిదురపోవునాఱునెలలకేకాక తక్కిననెలలపక్షమునకును ఉపలక్షణమని తెలియునది. లేక ఆఱునెలలకు తక్కువలేకుండ నిదురపోవుననియు నంతకంటె తక్కువకాలము నిదురించుటలేదనియు సూచించునభిప్రాయమున నట్లుచెప్పియుండును. ఏడునెలలు ఎనిమిదినెలలు తొమ్మిదినెలలును నిద్రగలిగినను వానిలో ఆఱునెలలనిద్ర యడఁగియే యున్నదిగదా. లేక 'నవ సప్తదశాష్టౌ చ మాసాన్ స్వపితిరాక్షసః' అనిపాఠము. అప్పుడు 'దశాష్టౌ' అనుచో అష్టియనఁగా అశనము. అనఁగా నాశము. దశాష్టౌ=దశమాసములు నశింపఁగా (మిగిలిన) 'నవసప్తమాసాన్' పదియాఱుమాసములు. అనఁగా పదియాఱుమాసములలో పదిమాసములు నశింపఁగా మిగిలిన యాఱుమాసములు నిదురించుచున్నాఁడని విభీషణునివచనమునకు సరిగానుండుట తెలియునది. లేక 'షడహైర్మాసాం త్సంపాద్యాహరుత్సృజన్తి షడహైర్హి మాసాం త్సంపశ్యన్తి అర్ధమాసైర్మాసాం త్సంపాద్యాహరుత్సృజన్తి అర్ధమాసైర్హి మాసాంత్సంపద్యన్తి' ఇత్యాదులయిన మాసవికల్పములలో 'షడహైః' అని యాఱుదినములు కూడ మాసముగా శ్రుతిచెప్పుటచే ఆచొప్పున 'నవషట్ సప్తచాష్టౌచమాసాన్' (9+6+7+8) అన్నట్లు ఈమాసములను గూర్పఁగా ముప్పదిమాసములగుచున్నది. మాసమునకు ఆఱుదినములుచొప్పున ముప్పదిమాసములకు నూటయెనుబది దినములుగాఁగా అమావాస్య మొదలుకొని అమావాస్యవఱకుఁగాని పున్నమ మొదలుకొని పున్నమవఱకుఁగాని గణింపఁబడు ముప్పదిదినముల మాసములు ఆఱుగలుగుచున్నవిగాన విభీషణుఁడు చెప్పిన ఆఱుమాసములకు సరిపోవుచున్నదని తెలియునది. యని శ్రుతియందలి షడహామాసత్వపక్షమును జెప్పువారందురు.

† ఇందులకు 'మన్త్రయిత్వా ప్రసుప్తోఽయ మితస్తు నవమేఽహని' అనిమూలము. ఇటకొందఱు 'ఏకాహంజాగరిష్యతి' అని కుంభకర్ణుఁడు నిద్రలేచినపిదప నొకదినమే మేలుకొనియుండునని విభీషణుఁడు నియమముచెప్పుటవలన మంత్రాలోచనము చేసినదినమునకు మఱుసటిదినమే కుంభకర్ణుఁడు నిద్రయారంభించినాఁడు. 'ఆజగామ ముహూర్తేన యత్రరామస్సలక్ష్మణః' అని విభీషణుఁడు రావణునిసభనుండి ముహూర్తమాత్రమున రాముఁడున్నచోటికి వచ్చినాఁడనుటచే, మంత్రాలోచన దినముననే విభీషణుఁడు రామునియొద్దకువచ్చెననియుఁ దెలియునది. 'విభీషణోనాశుజగామసంగమః' అని రాముఁడు విభీషణుని

అంతకు మునుపటిదినమున, సభలో నాలోచనముచేసి, నిదురపోయినాఁడు. కాన

---

తో శీఘ్రముగానే సమాగమమునొందెననుటచే విభీషణుఁడు వచ్చినవెంటనే రాముఁడు స్వీకరించెనని తెలియుచున్నది. కాన, రావణునిసభలోని మంత్రాలోచనము, విభీషణునిరాక, విభీషణస్వీకారమును, ఒక్కదినముననే జరిగినవి. ఈదినము మొదలుగా మూఁడుదినములు సముద్రప్రార్థనమునకై రాముఁడు దర్భశయనమునొందుట. పిమ్మట అయిదుదినములలో సేతుబంధనము. సేతువుగట్టి పూర్తియైన నాఁటి సాయంకాలమే సువేలాద్రినెక్కుట. ఆరాత్రియే సుగ్రీవ రావణులకు ద్వంద్వయుద్ధము. మఱుసటిదినమున తుములయుద్ధము. ఆనాఁటిరాత్రి నాగపాశబంధమోక్షములును ధూమ్రాక్ష వజ్రదంష్ట్ర కంపన వధములును, అవ్వలినాఁడు ప్రహస్తునివధమును రావణుని మకుటభంగమును. ఇట్లు రావణునిమకుటభంగమైన యీదినమొకటి; తుములయుద్ధము జరిగిన ముందునాఁడొకటి; సేతుబంధ మాదిగా సువేలాద్రి నెక్కుటవఱకుఁ గలిగిన దినములయిదు. మంత్రాలోచన విభీషణాగమనాదు లయినదినము మొదలుగా దర్భశయన మున్న మూఁడుదినములలో రెండవదినము కుంభకర్ణునినిద్ర యారంభముగాన యందు రెండుదినములు. ఇట్లు మకుటభంగమయిన దినముతోఁగూడ తొమ్మిదవదినమునాఁడు కుంభకర్ణుఁడు నిదురించెనని చెప్పెదరు. ఇదిచింత్యము. ఎట్లన సువేలాద్రినెక్కిన నాఁటిరాత్రి పూర్ణచంద్రోదయమును వర్ణించుటచే సువేలమునెక్కినదినము పున్నమయగుట సిద్ధము. రావణుఁడు మరణించినదినము అమావాస్యయగుటయు స్పష్టము. ఇట్లు పూర్వపక్షులు చెప్పినచొప్పున సువేల మెక్కిన రెండవనాఁడు అనఁగా ద్వితీయయందే మకుటభంగముగలుగఁగా రావణుఁడు అమావాస్యవఱకు విళంబముచేసి యుద్ధముచేయుట చింతింపవలసినదగుచున్నది. వాస్తవమునకు 'ఇతః' అనఁగా ప్రకృతయుద్ధమారంభించినదినమునుండి యని యర్థము. ఆదినమునువిడిచి దానికి మునుపటిదినము మొదలుగా తొమ్మిదవనాఁడు నిదురించినాఁడు. దానికి మునుపటినాఁడు మంత్రాలోచనముచేసినాఁడు. ఇట్లు పున్నమనాఁడు సువేలారోహణము ప్రథమయందు యుద్ధారంభము. దీనికి మునుపటి తొమ్మిదవనాఁడు సప్తమి. సప్తమినాఁడు కుంభకర్ణుఁడు నిదురించెను; రాముఁడు దర్భశయనము నారంభించెను. షష్ఠియందు కుంభకర్ణాదులతో మంత్రవిచారము. నాఁడే విభీషణుఁడు వెడలిపోవుట యని చెప్పెదరు. మఱియును గొందఱు 'సీతాపహరణమునకు మునుపు పదుమూఁడుసంవత్సరములు గడచినవి. పంపాతీరమున వసంతమును వర్ణించుటంజేసి పదునాలుగవసంవత్సరము నారంభమున సీత యపహృతయయ్యెను. పదునాలుగవసంవత్సరమందు వాలివధము. దానికి పిమ్మట వర్షర్తువును వర్ణించుటచే ఆశ్వయుజమున సీతాన్వేషణమునకై యుత్సహించిరనుట స్పష్టము. స్వయంప్రభబిలమునందు బహుకాలముచెల్లెను. 'పుష్పితాగ్రాన్ వసంతాదౌ దదర్శ వివిధాన్ ద్రుమాన్' అని స్వయంప్రభబిలమునుండి వెడలివచ్చినంతనే, వసంతాదియగు ఫాల్గునమాసమునకు సూచకముగా వృక్షాగ్రములు పుష్పించుట చెప్పఁబడినది. కాన ఫాల్గునమాస శుద్ధత్రయోదశియందు హనుమంతుఁడు లంకాప్రవేశముచేసినాఁడు. 'స్థితః కకుద్మానివ తీక్ష్ణశృంగః' అను శ్లోకమున 'ప్రతిపూర్ణశృంగః' అని పూర్ణశృంగుఁడగు చంద్రునివర్ణించుట త్రయోదశియందే సంభవించును. ఏనాఁటిరాత్రి లంకయందు సీతను వెదకెనో యామఱుసటిదినము ప్రాతఃకాలముననే లంకాదహనము' ఏలన 'అపశ్యమేనాం ద్రష్టవ్యా మయా లంకానిశాక్షయే' 'నేను తెల్లవాఱఁగా లంకను దప్పక చూడవలయును' అని హనుమంతుఁడు లోఁకయందలి నిప్పుతో త్రిప్పఁబడినప్పుడు చెప్పెను. ఆనాఁడే లోడనే జాగులేక మరలుట యెట్లన సీత 'యదివా మన్యసే వీర వసైకాహమరిందమ' అని యొక్కదినము నిలుచునట్లు వేఁడఁగా 'ఏవమాశ్వాస్య వైదేహీం హనుమాన్మారుతాత్మజః। గమనాయ మతించక్రే' అని హనుమంతుఁడు లోడనే పయన

మిక్కిలి దినములు కానందున సులభముగా మేలుకొలుపవచ్చును. మహాబలుం

---

మగుటం దలంచెననియున్నది. ఆనాఁడు తెల్లవాఱఁగ లంకనుదహించినపిదప నాఁటి మధ్యాహ్నమునకు పూర్వమే అంగదాదులు మధువనభంగముగావించి రామునిఁజేరిరి. ఎట్లన-ఆంజనేయుఁడు మరల సముద్రమును దాఁటునప్పుడు అరిష్టపర్వతము నెక్కుచో దానిని వర్ణించునెపమున 'బోధ్యమానమివ ప్రీత్యా దివాకరకరైశ్శుభైః' సూర్యుని మేలికిరణములచేత మేలుకనుచున్నదానివలె' నని సూర్యోదయసమయమును జెప్పి, పిదప అస్తమయమును జెప్పలేదు. ఆనాఁడే చతుర్దశీశేషముతోఁగూడిన పున్నమయందే మధ్యాహ్నమున యుద్ధయాత్ర. 'అస్మిన్ముహూర్తే సుగ్రీవ ప్రయాణమభిరోచయే । యుక్తోముహూర్తోవిజయః ప్రాప్తోమధ్యం దివాకరః' అని నాఁడు మధ్యాహ్నము యుద్ధయాత్రయని రాముఁడు చెప్పుటవలనం దెలియుచున్నది. 'ఏనాఁటియభిజిన్ముహూర్తమున యుద్ధయాత్రయో దానిమఱుసటినాఁడే సముద్రతీరమున సేనవిడియుట. ఎట్లన 'సాస్మయాతి దివారాత్రం మహతీ హరివాహినీ' 'వానరసేన రేయుం బగలు దారి నడచినది' అని చెప్పి 'ముహూర్తంక్వాపినాసత' 'కొంచెమునేపయినను ఒక్కచోటను నిలువదయ్యె' నని చెప్పియుండుటంబట్టి మఱునాఁడే సముద్రతీరముఁజేరి విడిసినదయ్యె. ఇదియిట్లుండ లంకను దహించిననాఁడే రావణుఁడు సభయందు మంత్రులతో కొంతయాలోచనము సేయుటం జెప్పి 'విసర్జయిత్వా తాన్ సర్వాన్ ప్రవివేశ స్వకం గృహమ్' 'వారినెల్ల వీడ్కొలిపి రావణుఁడు తనగృహమునకుఁ బోయెను' అని లంకాదాహదినముయొక్కవృత్తాంతమును ముగించి 'తతః ప్రత్యుషసిప్రాప్తే' 'అంత తెలతెలవేఁగఁగా' ఇత్యాదులచే మఱుసటినాఁడు ప్రాతఃకాలమున విభీషణుని రెండవయుపదేశమునుజెప్పి యంత మంత్రవిచారమునకై రావణుఁడు కుంభకర్ణవిభీషణాదులతో సభను బ్రవేశింపఁగా విభీషణుని మూడవయుపదేశమునుజెప్పి, 'ఇత్యుక్త్వా పరుషంవాక్యం రావణంరావణానుజః' 'ఆజగామ ముహూర్తేన యత్రరామ స్సలక్ష్మణః' అని లంకనుదహించిననాఁటికి మఱుసటినాఁడే సముద్రతీరమునందు విభీషణుఁడు రామునియొద్దకువచ్చుటను వర్ణించుటచేతనుంగూడ ద్వితీయదినమున రాముఁడు సముద్రతీరమును జేరెనని తెలియుచున్నది. సముద్రతీరమును జేరినదినము శిష్టఫాల్గునపు పున్నమ. కావుననే 'ఉత్తరాఫల్గునీహ్యద్య' అని నాలుగవసర్గమున యుద్ధప్రయాణముదినము పున్నమతోఁ జేరినదిగాఁ జెప్పుట విరుద్ధముగాదు. సముద్రతీరమును జేరిననాఁడు పున్నమతోఁగూడినదనుట 'చండ నక్రగ్రహాంఘోరం క్షపాదౌదివసక్షయే । చన్ద్రోదయసముద్ధూతం ప్రతిచన్ద్రసమాకులమ్' అని పగలు ముగియఁగా రాత్రితొలుతనే - అనఁగా సంధ్యాసమయముననే - చంద్రోదయమును జెప్పుటవలన సిద్ధము. సేనానివేశవృత్తాంతమును విభీషణాగమనవృత్తాంతమును ఒక్కదినముననే జరిగినవయ్యు వాక్కు క్రమముగా వచ్చునదిగాన క్రమముగా వచింపఁబడినవి. ప్రథమయందు రాముని దర్భశయనారంభము కుంభకర్ణుని నిద్రారంభము. మూఁడుదినములు రాముఁడు దర్భశయనమందుండెను.కనుక చతుర్థీ పంచమీ షష్ఠీ సప్తమీ అష్టమీతిథులందు సేతుబంధను. అష్టమిరాత్రి సువేలారోహణము. సువేలమునందు 'పూర్ణచంద్రప్రదీపాచ నిశాసమభివర్తత' అనుటకు పూర్ణచంద్రునివంటి దీపములుగల రాత్రియని యర్థముకాని పూర్ణచంద్రుఁడుగల రాత్రియనికాదు. సుగ్రీవసేనయందు భేరీలు మొదలగువానివలె దీపములు మొదలయినవియు నుండఁగూడును. సువేలమునెక్కిన మఱునాఁడు పగటిపూఁట లంకను ముట్టడించుట.ఏలన 'తాంరాత్రిముషితాస్తత్ర సువేలేహరిపుంగవాః' 'లంకాయాందదృశుర్వీరా వనాన్యుపవనానిచ' 'ఆరాత్రి వానరులు సువేలమునందు వసించియుండి లంకయందలి వనములను ఉపవనములను జూచిరి.' అనిచెప్పి యవతల యుద్ధమును వర్ణింపఁబడినది గాన...తెలి

వగు నాకుంభకర్ణుని శీఘ్రముగా మేలుకొలుపుఁడు. మహాబాహుండును సమస్త

---

మునది. అందును ప్రథమదినయుద్ధమున రాత్రి నాగాస్త్రబంధమోక్షాదులు జరిగెను. 'యుధ్యతామేవ తేషాంతు తథావానరరక్షసాం।రవిరస్తంగతోరాత్రిః ప్రవృత్తాప్రాణహారిణీ' అని రాత్రియగుటనుజెప్పి 'సాబభూవనిశాఘోరాహరిరాక్షసహారిణీ। తతస్తేరాక్షసాస్తత్రతస్మింస్తమసిదారుణే।రామమేవాభ్యవర్తంత' 'తంభీమవేగాహరయోనారాచైఃక్షతవిగ్రహాః। అంధకారేన దదృశుః' ఇత్యాదులచే ఆ రాత్రి చీఁకటి గ్రమ్మియుండునదిగా గుర్తించి 'నిరంతరశరీరౌతౌ భ్రాతరౌరామలక్ష్మణౌ। క్రుద్ధేనేంద్రజితావీరౌ పన్నగైశ్శరతాంగతైః' ఇత్యాదులు అనఁగా నాగపాశబంధాదులు ప్రతిపాదింపఁబడినవి. ఆయర్ధరాత్రమందే వానరుల హర్షధ్వనికి కుపితుఁడై రావణుఁడు పంపిన ధూమ్రాక్షవజ్రదంష్ట్రులయుద్ధమును వారివధమును జరిగినవి. ఏలన వారియుద్ధమున పగటిపూఁటను దెలుపునదేదియుఁ గానరాదు. వానరులు హర్షమునొందుట పిమ్మటిదిగా నుండుటంబట్టియు రాత్రియే వారు వధింపఁబడిరని యూహ్యము. రాత్రిశేషమున వారిరువురు వధింపఁబడఁగా ద్వితీయదినమున అకంపనునియుద్ధము. ఎట్లన-అకంపనుఁడు వెడలునపుడు 'అభవత్సుదినేచాపి దుర్దినంరూక్షమారుతమ్' అని దినము తేటగానుండియు మబ్బులు క్రమ్మినవనఁబడినదని పగటిపూఁటకు సూచకమున్నది. అకంపనుఁడు వధింపఁబడిన యనంతరమే రావణుఁడు పూర్వాహ్ణముననే యూరుచుట్టు తిరిగినాఁడు. అకంపనవధమునకుఁ బిదప వెనువెంటనే ప్రహస్తయుద్ధము.ఆనాఁటిమధ్యాహ్నమునందే జరిగెను. అయితే 'అన్యోన్యమభిసంరబ్ధాఃగ్రహాశ్చనచకాశిరే' అని గ్రహములు ప్రకాశము మాయుటను జెప్పుటచే ప్రహస్తయుద్ధము రాత్రియందు జరిగినదన్నచో మీఁద దివాయుద్ధములందు పగటిపూఁటఁ దెలియరాని పదార్థములుగూడ చూపట్టుట చెప్పఁబడినది. రావణయుద్ధమందు 'ప్రాజాపత్యంచనక్షత్రం రోహిణీంశశినఃప్రియాం।సమాక్రమ్య బుధస్తస్థౌ ప్రజానామశుభావహః' ఇత్యాదులు పగటిపూఁట చెప్పఁబడినవిగాన దీనింబట్టి రాత్రిని గ్రహింపరాదు. ఆ ద్వితీయదినముననే రావణుని యపజయమును కుంభకర్ణుని మేలుకొలుపుటయు కుంభకర్ణుని యుద్ధమును జరిగినవి. ఏలన కాలవిశేషమును గుర్తింపక పిదప అవిచ్ఛేదముగా ఆసందర్భములను జెప్పుచు ముఖ్యకృత్యమగు బ్రహ్మాస్త్రబంధనతద్విమోక్షమునందు కాలవిశేషమును జెప్పియున్నాఁడుగాన ఆమూఁడును నేకదినముననే జరిగినవని నిశ్చయింపఁదగును. మఱియు 'సప్తషష్టిర్హతాఃకోట్యోవానరాణాంతరస్వినామ్। అహ్నఃపంచమశేషేణ వల్లభేనస్వయంభువః' అని చూపట్టుచున్నదిగదా. ఇట 'అహ్నఃపంచమశేషః' 'పగటియైదవశేషము' అనఁగా 'ప్రాతః సంగవ మధ్యాహ్నాపరాహ్ణాః సాయ మిత్యమీ। ఏకస్యాహ్నఃపంచభాగావిహితాఃకాలచిన్తకైః' అన్నట్లు ప్రాతఃకాలము,సంగవము, మధ్యాహ్నము,అపరాహ్ణము, సాయంకాలము అని పగటికి నైదుభాగములుగలవు. అందు అయిదవభాగము సాయంకాలముగాన పంచమశేషమనఁగా సాయంకాలమే. ఆద్వితీయనాఁటిరాత్రి బ్రహ్మాస్త్రమోక్షమయినపిదప మరల లంకను ముట్టడించుటయు దానిని దహించుటయు కుంభనికుంభ యూపాక్షశోణితాక్ష ప్రజంఘాకంపన మకరాక్షవధములును జరిగినవి. 'తతోఽస్తంగత ఆదిత్యేరౌద్రేతస్మిన్నిశాముఖే। లంకామభిముఖాస్సోల్కాః జగ్ముస్తే ప్లవగర్షభాః' అని రాత్రియందు కొఱవులెత్తుకొని వానరులు పోయిరనుటచే నివియెల్ల నాఁటిరాత్రియే జరిగెననుట సిద్ధము. ఇట్లు రెండు నిండుదినములచేత, మూలబలము ఇంద్రజిత్తు రావణుఁడుతప్ప తక్కినవ్యపదిష్టులగు రాక్షసులు హతులుకాఁగా మూఁడవదినము మొదలుగా మూఁడుదినములు ఇంద్రజిత్తుయుద్ధము. ఏలన 'అహోరాత్రైస్త్రిభిర్వీరః కథంచిద్వినిపాతితః' అని మూఁడు రేయుంబవలకు నింద్రజిత్తు గూల్పఁబడినాఁడని యున్నది. పిదప ఆఱవనాఁడు మూలబల

రాక్షసప్రధానుండును నగు నాకుంభకర్ణుఁడుమాత్రము నాయట్లు శాపగ్రస్తుఁడు గాఁడు గావున యుద్ధమునందు శీఘ్రముగానే వానరులను రామలక్ష్మణులను వధింపఁ గలఁడు. యుద్ధమునందు మహాధ్వజముంబోలి సమస్తరాక్షసముఖ్యుండై యొప్పుసీకుంభకర్ణుఁడు మూఢుఁడై గ్రామ్యసుఖమునం దగిలి యెప్పుడును నిద్రపోవుచున్నాఁడు. భయంకరమైన యీయుద్ధమునందు రామునివలన నపజయమును నొందియున్న నాకు, కుంభకర్ణుని లేపుటవలన నెంతమాత్రము శోకముగలుగదు. 'అకాలమున లేపుట దగునా' యన్నచో, ఇట్టివ్యసనము ప్రాప్తించియుండఁగా సాహాయ్యముసేయ నుపయోగింపఁడేని, యాకుంభకర్ణుఁడు దేవేంద్రసమానపరాక్రముఁడై యుండియు నాకేమిప్రయోజనము" అనెను. రాక్షసేంద్రుఁడాడిన యామాటవిని రాక్షసులు అకాలమున నెట్లు లేపఁదగునని మిక్కిలియు వ్యాకులులై కుంభకర్ణుని గృహమునకుం బోయిరి. ఆరాక్షసులు, రావణాజ్ఞనుగొని కుంభకర్ణుని మేలుకొలు

---

వధము. నాఁటిసాయంకాలము మొదలుకొని రేయుంబగలు రావణయుద్ధము. ఏడవదినమున రావణవధము. లేక 'అభ్యుత్థానంత్వమద్యైవ కృష్ణపక్షచతుర్దశీం। కృత్వానిర్యాహ్యమావాస్యాంవిజయాయబలైర్వృతః' అని యిత్యాదిసందర్భములు రెండువిధముల యోజించుటకు శక్యమగుటంబట్టి సప్తమదినమందు రావణయుద్ధమనియు అష్టమదినము ప్రాతఃకాలమున రావణవధమనియు గ్రహింపవచ్చును. పుచ్ఛామావాస్యయందు రావణవధము గావున అమావాస్యయందు రావణవధమని ప్రవాదము. ఇట్లుండఁగా 'రామరావణయోర్యుద్ధం సప్తరాత్రమవర్తత' అని రామరావణయుద్ధము ఏడురాత్రులు జరిగెసదనుట కేవల రామరావణులకుఁగాక రామునికి అతనిసైనికులకును రావణునికిని అతనిసైనికులకును గలిగెనని గ్రహింపఁగా సంగతమగుచున్నది. దీనివలన 'మంత్రయిత్వాప్రసుప్తోయ మితస్తునవమేఽహని' అనుటయు నొప్పుచున్నది. (ఇతః) అనఁగా ఈదినమునుండి - నాకు మకుటభంగమయిన దినమునుండి, (నవమేఽహని) ఈదినమువిడిచి దీనికి మునుపటిదినమునుండి తొమ్మిదవనాఁడు, (మంత్రయిత్వాప్రసుప్తః) ముందునాఁడు మంత్రాలోచనము సేసి, ఆనాఁడు నిద్రించినాఁడని యర్థము. కాఁబట్టి యీయుద్ధమంతయు పదునాలుగవసంవత్సరము కడపటిమాసమునఁ జరుగవలసిన దగుచున్నది. అయితే సీతనుజూచి రావణుఁడు 'ద్వౌమాసౌరక్షితవ్యౌమే యోవధిస్తేమయాకృతః' అని రెండుమాసములు గడువిచ్చియుండుటచే హనుమంతుఁడు లంకను బ్రవేశించినది పదియవమాసమని తేలుచున్నది. హనుమంతునింజూచి సీతయు 'ద్వామాసౌతేనమేకాలోజీవితానుగ్రహఃకృతః। వర్తతేదశమోమాసో ద్వౌతుశేషౌప్లవంగమః' ఇత్యాదులు చెప్పటం జేసియు పదియవమాసమని తెలియుచున్నది. కాఁబట్టి యిది యెట్లు మునుపుచెప్పినదానితో పొసఁగునన్నచో ఇట్లుకాదు. సీత రెండుమాసములనుట, తానేచెప్పిన 'ఊర్ధ్వంమాసాన్నజీవేయమ్' నెలకుపయిగా జీవించియుండను' 'మాసాదూర్ధ్వంనజీవిష్యేత్వయాహీనానృపాత్మజ' 'రాజకుమారా! నీవులేక మాసమునకుపైఁగా జీవించియుండను' అనువాక్యములకు విరుద్ధమగునుగాన రెండుమాసములనుట రావణుని యభిప్రాయమునుబట్టి చెప్పినమాటయేకాని వేఱుగానేరదు. రావణుఁడు సీతను సాంత్వనము సేయుటకై యట్లుచెప్పినాఁడు. సీతయో జరగుచున్నమాసముచేతనే పదునాలుగవ సంవత్సరము పూర్తి యగుటందెలిసి మాసమునకుఁ బైఁగా బ్రతికియుండనని సమాచారము రామునకుఁ జెప్పిపుచ్చెనుగాన యంతయు నొప్పియెయున్నది. గోవిందరాజులు.

పుటకై తమశక్తి యెచ్చునట్లు, మాంసశోణితములను భుజించి కుంభకర్ణుఁడు మేలుకొన్నపుడు అతని యాఁకటితాపము మొదలగునవి యుపశమిల్లుటకై గంధమాల్యములను భక్ష్యములను దీసికొని శీఘ్రమునం బోయిరి. మహాబలులగు నారాక్షసులు, పెద్దవాకిలి గలిగి నలుప్రక్కలను ఒకటిన్నఆయామడ విఱివిగలదై రమణీయమై, కుంభకర్ణుఁడు పూసికొనియున్న చందనాదుల సర్వగంధములు నవ్వారిగా గుబాళించుచు, గుహాకారముగా నున్నకుంభకర్ణునిగృహమునకుఁ బోయి యతనినిట్టూర్పుల యురవడిచే వెనుకటికిఁ జిమ్ముంబడుచు నెట్టకేలకు నతికష్టమున నెదుర్కొనిపోవుచు మహాప్రయత్నమున దానిని బ్రవేశించినవారయిరి. ఆరాక్షసులు, అట్లు రమణీయమును మంగళద్రవ్యయుక్తమునై బంగారునెలకట్టుల రంగారుచున్న యాగుహను బ్రవేశించి యచ్చట భయంకరాకారుఁడై పరుండియున్న రాక్షససింహునిఁ గుంభకర్ణునిం జూచినవారయిరి. వారందఱు నిద్రాకాలపు వికారముతోఁగూడినవాఁడై, నిదురించుచు నేలంగూలిన పర్వతమునవలెఁ జూపట్టుచు మేలుకొలుప నలవి గానికటికినిదురపాలయి యున్నకుంభకర్ణుని నొక్కటిగాఁజేరి, మేలుకొలుపసాగిరి. ఆరాక్షసులు, దేహమంతయు నిక్కవెండ్రుకలు నెరసియుండ, నిట్టూర్పులు విడుచుచున్న మహాసర్పముంబోలి బెడిదంపునూర్పులచే దిగులుగొలుపుచుఁ, బరుండియుండియు భయంకరాకారుఁడై, భయంకరములగు నాసారంధ్రములును పాతాళమునవలె విఱివియై లోఁతుగానున్న నోరునుగలిగి, శయ్యపయిని సమస్తావయవములు దాఁకునట్లు పరుండి, ముందు త్రాగిమిగిలిన మేదోరుధిరములకంపు గొట్టుచునుండ, బంగారుబాహుపురులు నందిటంగట్టి కిరీటంబుదాల్చి పగవారల నుక్కుమడఁచు మహాబలుని రాక్షసశార్దూలుండగు కుంభకర్ణుని నాశ్చర్యమునఁ గొంతదడవు చూచుచుండిరి. అంత మహాబలులగు నారాక్షసులు కుంభకర్ణునిముందట, మిక్కిలియుఁ దృప్తికరమగు మాంసములను మేరుపర్వతమంతటిరాశిగాఁ బోసిరి. ఆరాక్షససింహులు, కుంభకర్ణునిముందట, జింకలమాంసములును, మహిషమాంసములును, వరాహమాంసములును, నానావిధములయిన యన్నములును యద్భుతములగు రాసులుగా నుంచిరి. అంత దేవతాశత్రువులగు నారాక్షసులు కుంభకర్ణునిముందట నెత్తురుకుండలును పలువిధములయిన మద్యభాండములనును నునిచిరి. ఆపరంతపునకు మిక్కిలియుమేలయిన చందనము దేహమంతయుఁ బూసిరి. దివ్యములై మేలివాసనలు గుబాళించుచున్న పూదండలచేతను నానావిధగంధములచేతను గుంభకర్ణుని దేహమంతయుఁ గప్పిరి. అంత నారాక్షసులు సుగంధ మగుధూపము వేసి పరంతపుఁడగు నా కుంభకర్ణునిం బొగడిరి. ఆరాక్షసు లంత మాటిమాటికి మేఘములవలె గర్జించిరి. చంద్రబింబములవలెఁ దెల్లనగు శంఖములను బూరించిరి. అందఱును జేరి యొక్కపెట్ట దొమ్మిగా నఱచిరి. అంతటికిని లేపకుండఁగా వారు కోపముగొని బిగ్గఱ నఱచిరి. కుంభకర్ణునింగొట్టి యిటునటుఁబట్టి కదల్చిరి. ఇట్లారాక్షసులు కుంభ

కర్ణుని మేలుకొలుపుటకై మహాధ్వనిని గావించిరి. పక్షులు శంఖభేరీధ్వనులను, పణవధ్వనులను, భుజాస్ఫాలనధ్వనులను, గర్జితధ్వనులను, సింహనాదములను విని భయమున దిక్కులన్నింటికిఁ బాఱి యచ్చటను భయము తీఱకుండుటచే ఆకాశమున కెగసి యందును దిగు లుడుగనందున గొబ్బున నేలంబడినవయ్యె. మిక్కిలియుఁ గష్టపడి గావించిన చప్పుళ్ల చేతను కటికినిదురపాలయి యున్న మహాకాయుఁడు కుంభకర్ణుఁడు మేలుకొనకుండుటను జూచి, అంత నా రాక్షసులు గుంపులుగొని గుదియలను రోఁకళ్లను గదలను నందఱును జేకొనిరి. అప్పుడు రాక్షసు లుదగ్రులై, పర్వతశిఖరములచేతను, ముసలములచేతను, గదలచేతను, వృక్షములచేతను, అఱచేతులచేతను, గుదియలచేతను, బిడికిళ్లచేతను, నేలపయి సుఖసుప్తుఁడగు కుంభకర్ణునిఁ బ్రహరించిరి. ఆ రాక్షసులు బలవంతులయ్యును, కుంభకర్ణుని నిట్టూర్పుగాలిచేత నతనిముందట నిలువంజాలరయిరి. అంత భయంకరపరాక్రములగు నా రాక్షసులు, అప్పటికిని కుంభకర్ణుఁడు మేలుకొనకుండుటనుజూచి, మఱియు నందులకై దృఢముగా బ్రయత్నించిరి. అప్పుడు వారు రాక్షసులు పదివేవురుమంది తమ్ము బలసియుండ, కుంభకర్ణునిచుట్టును, మృదంగములును, పణవములును, భేరులును, శంఖములును, కుంభములును నేక కాలమున వాయించిరి. నల్లని కాటుకరాశివంటి యాకారముగల యా రాక్షసులు, అట్లు కుంభకర్ణునిం గొట్టుచు, గర్జించుచు, నెంత మేలుకొలిపినను, అతఁడు మేలుకొనఁడయ్యె. వారంతవఱకుఁ దాము సేయు ప్రయత్నములచే నతనిని మేలుకొలుపఁ జాలకుండుటనుజూచి, యంత మఱియు బెట్టిదముగా మిక్కిలియు నధికమయిన యత్నమును జేయనారంభించిరి. అంత వారు గుఱ్ఱములను లొట్టియలను గాడిదలను ఏనుంగులను కొయ్యలచేతను కొఱడాలచేతను అంకుశములచేతను గొట్టి కుంభకర్ణునిపైకిం దోలిరి. భేరులను శంఖములను మృదంగములను తమబలముకొలఁదిని వాయించిరి. మఱియు వారు తమబలమంతయు నెఱపి పెద్దకొయ్యలకొనలంగట్టిన మునికోలలచేతను (ఎనిమిదిబుజముల కంబములచేతను) గుదియలచేతను ముసలములచేతను కుంభకర్ణునిం బ్రహరించిరి. ఆమహాధ్వని, లంకయందలి పర్వతములు వనములు మొదలగు సమస్తప్రదేశములును, పట్టణమంతయును నిండి చెలంగినది. అప్పటికిని కుంభకర్ణుఁడు మేలుకొనఁడయ్యె. అంత నతనిచుట్టును, వేయుభేరులను మేలి బంగారుదండెలంగొని యొక్కటిగాఁ జేరి యేకకాలమున వాయించిరి. ఇంతదూరము చేసినను, బ్రహ్మశాపవశమున కటికినిద్రపాలై యుండుటచే కుంభకర్ణుఁడు మేలుకొనకుండుటంజూచి భయంకరపరాక్రములయిన యా రాక్షసు లందఱును మును పే కోపావేశము నొందియుండినవా రప్పుడు మఱియు నధికముగా కుపితులయిరి. కొంద ఱా రాక్షసుని మేలుకొలుపుటకై పిడికిళ్లం బొడుచుట మొదలగువానిచే పరాక్రమముఁ జూపిరి. కొందఱు భేరులను వాయించిరి. మఱికొందఱు మహాధ్వనిగా నార్చిరి. కొందఱు కుంభకర్ణుని తలవెండ్రుకలం బెఱికిరి. వేఱుకొంద ఱతనిచెవులం గొఱికిరి. మఱి



1518. రావణుని మాతలు కుంభకర్ణుని నిదురనుండి మేలుకొలుపుట.

గదా. అటుగాదేని, యితరులవలన మహాభయముగలిగి యుండవలయును. ఇదినిశ్చయము. ఆభయము నివర్తించుటకొఱకే మీరింత వేగముతో నన్ను లేపితిరి. నేనిపుడు రాక్షసరాజగు రావణునిభయమును నిర్మూలముచేసెదను. దేవేంద్రునయినను బడఁగూల్చెదను. అగ్నిహోత్రునయినను త్రుంచివైచెదను. అన్నయగు రావణుఁడు, స్వల్పకారణమునుబట్టి నిద్రితుండగునన్ను మేలుకొలుపఁడు. కనుక నన్ను మేలుకొలుపుటకుఁ గారణమును గలిగినది గలిగినట్టుగానే చెప్పుఁడు' అనెను. ఇట్లుమహాబలుఁడగు కుంభకర్ణుఁడు సంరంభించి పలుకుచుండఁగా రాక్షసరాజగు రావణునిమంత్రి యూపాక్షుఁడు మోడ్పుఁగేలుగీలించి యతనితో 'రాజా! మాకెప్పుడుగాని దేవతలవలన భయము గొంచెమేనియుఁ గలుగదు. మనుష్యులవలననే మాకిప్పుడు మిక్కిలియు భయముగలిగి గాఱియపెట్టుచున్నది. రాజా! మాకిప్పుడు మనుష్యులవలనఁ గలిగినంతభయము దైత్యులవలనను దానవులవలనను దేవతలవలననుంగూడ నెప్పుడును గలిగినదిలేదు. పర్వతాకారులగు వానరులు, లంకచుట్టును ముట్టడించియున్నారు. రాముఁడు సీతాహరణముచే సంతప్తుఁడై మాకింత బెడిదంపుభయమును గలిగించినాఁడు. మునుపు ఒక్కవానరునిచేత ఈ మహాపట్టణమంతయు దగ్ధమయ్యెను. అక్షుఁడు చతురంగ బలసహితముగా హతుఁడయ్యెను. దేవతలకెల్ల కంటకమై యొప్పు రాక్షసరాజు రావణుఁడునుగూడ యుద్ధమున సూర్యతేజుండగు రామునిచే మృతప్రాయుఁడను బుద్ధితో విడువఁబడినాఁడు. రాక్షసరాజగు రావణునికి దేవతలుగాని దైత్యులుగాని దానవులుగాని, నేమిసేయఁజాలరైరో, యట్టికార్యమును రాముఁ డిప్పుడు చేసినాఁడు. రావణుఁడు బ్రతికియున్నాఁడో లేదో యనుసంశయమున యుద్ధమున నతనిని రాముఁడు వదలినాఁడు' అనెను. ఆకుంభకర్ణుఁడు తనయన్న రావణుఁడు యుద్ధమునఁ బరాజయము నొందెనని విరూపాక్షుఁడు చెప్పఁగావిని కోపంబున గుడ్లుగిఱిగిఱం ద్రిప్పుచు 'యూపాక్షా! నేనిప్పుడే వానరసైన్యమునంతటిని లక్ష్మణునిని రామునిని యుద్ధంబునఁ జంపిపుచ్చి యటుపిమ్మట రావణునిఁజూచెదను. వానర మాంసములచేతను వారిరక్తములచేతను, రాక్షసులం దృప్తినొందించెదను. నేనే రామలక్ష్మణులనెత్తురు ద్రావనుంద్రావెదను' అనెను. అట్లు గర్వించి రోషమున దుర్నయము వెచ్చువెరుఁగ మాటలాడుచున్న యాకుంభకర్ణుని వాక్యమునువిని, రాక్షసయోధముఖ్యుఁడగు మహోదరుఁడు చేమోడ్పుగీలించి 'మహాబాహూ! నీవు రావణునొద్దకువచ్చి యతఁడు చెప్పునదివిని గుణదోషములు విమర్శించి, యటుపిమ్మట యుద్ధమున శత్రులం జయింపవచ్చును' అనెను. మహాతేజుండును బలవంతుఁడునగు కుంభకర్ణుఁడు మహోదరునిమాటనువిని రాక్షసులు పరివేష్టించి వెంబడింప, రావణునిగృహంబునకుఁ బయనముకాఁగోరెను. అంత రాక్షసులు, భయంకరములగు కన్నులును ఆకారమును పరాక్రమమునుంగల కుంభకర్ణుని నిదురలేపి, వేగమున రావణునిగృహమునకుఁ బోయిరి. అంత

నారాక్షసు లందఱును బోయి, సింహాసనాసీనుండగు రావణునింగని, చేమోడ్పుగీలించి, 'రాక్షససింహమా! నీతమ్ముఁడు కుంభకర్ణుఁడు నిదుర మేలుకొనియున్నాఁడు. అతనియొద్దకు బోయెదవా? లేక యతని నిచ్చటికి రమ్మనిచూచెదవా? ఎట్లు సేసెదవు' అనియడిగిరి. కుంభకర్ణుఁడు నిదుర మేలుకొని యుండుటనువిని రావణుఁడు సంతుష్టుఁడై వచ్చిన యారాక్షసులనుజూచి 'నేను గుంభకర్ణు నిచ్చటఁ జూడఁగోరెదను. కాన యతనిని న్యాయముచొప్పునఁ బూజించి యిచ్చటికిఁ దోడ్కొనిరండు' అనెను. ఆరాక్షసు లట్లే యనిచెప్పి యందఱును మరలవచ్చి రావణునాజ్ఞచొప్పన కుంభకర్ణునితో 'సమస్తరాక్షసముఖ్యుండగురాజు రావణుఁడు, నిన్నుఁ జూడఁగోరుచున్నాఁడు. కాన యతనియొద్దకుఁబోవం దలంపుగొనుము. అన్నకు సంతోషముగలిగింపుము' అనిరి. మహాబాహుఁడును దుర్ధర్షుఁడునగు కుంభకర్ణుఁడు అన్నగారియాజ్ఞనువిని, యట్లే యని చెప్పి, శయనమునుండి లేచెను. అతఁడు సంతుష్టుఁడై ముఖముగడిగికొని, స్నానముచేసి మిక్కిలియు నలంకరించుకొని, దప్పిగొనుటచే బలవృద్ధిని గలిగించునట్టిమద్యమును శీఘ్రముగఁ దెండని వేగిరపెట్టెను. అంత నారాక్షసులు రావణాజ్ఞచే నతివేగమునఁ బోయి నానావిధములయిన మద్యభాండములనుదెచ్చి యాకుంభకర్ణునకు శీఘ్రముగా సమర్పించిరి. అతఁడు రెండువేలకుండలమద్యము ద్రావి రావణుసమీపమునకుఁ బోవఁ దొడంగెను. స్వభావముననే మత్తుండగునతఁడు కొంతమత్తు మిక్కుటముగా నుండ, తేజంబును బలంబును దీపింప, సంతుష్టుఁడై, ప్రళయకాలయమునికైవడిం బ్రకాశించెను. ఆకుంభకర్ణుఁడు రాక్షససమూహములతోఁగూడి, యన్నయగు రావణునిగృహమునకుం బోవుచు పదన్యాసముల భూమివడఁకునట్లు సేసెను. అతఁడు, సూర్యుఁడుకిరణములచే భూమిని బ్రకాశింపఁజేయునట్లు, తన దేహకాంతిచే రాజమార్గమును వెలుంగఁజేయుచు, అందు నలుగడలఁబౌరజనులు చేమోడ్పులు నరుసలుగాఁ గీలించి మ్రొక్క, దేవేంద్రుఁడు బ్రహ్మదేవునిగృహంబునకుం బోవునట్లు, రావణుని గృహంబునకుంబోయెను. లంక వెలుపల నుండునట్టివానరులు, అప్రమేయాకారుఁడును బర్వతశిఖరసమానుండునై రాజమార్గమునం బోవుచున్న యాశత్రుహంతను కుంభకర్ణుని తటాలునఁజూచి యూథపతులయ్యును, మిక్కిలియు భయపడిరి. భయార్తులై వానరులు కొందఱు శరణ్యుండగు రాముని శరణుసొచ్చిరి. కొందఱు వ్యథనొంది నేలంబడిరి. కొందఱు వ్యథితులై దిక్కులకుం బరుగిడిరి. కొందఱు నేలంబరుండిరి. వానరులు పర్వతశిఖరాకారుండును, కిరీటియునై, దేహకాంతిచే సూర్యునింబోలి, పెరిఁగియున్న యద్భుతాకారముతోనున్న యాకుంభకర్ణునిం జూచి భయార్తులై యంతంత దిక్కులకుం బరుగెత్తిరి. ఇది యఱువదియవసర్గము.



—•—• రాముఁడు కుంభకర్ణునివృత్తాంతమడుగుట; విభీషణుఁడు చెప్పుట. •—•—

అంత మహాతేజుండును వీర్యశాలియు నగు రాముఁడు, కిరీటియు, మహాకాయుండు నగు కుంభకర్ణునిం జూచెను; మఱియు పర్వతమువలె నతిస్థూలశరీరము గలిగి మున్ను ఆకాశమున కడుగిడుచు దాని నాక్రమించుచున్న ప్రభుఁడగు నారాయణునివలెఁ జూపట్టుచు, నీటితోఁ గూడిన మేఘమువలె నల్లనై, బంగారుబాహుపురులచే నలంకృతుఁడై యున్న కుంభకర్ణుని రాముఁడు ధనుర్ధరుఁడై మరల చక్కఁగా తేఱిపాఱఁ జూచెను. ఆకుంభకర్ణునిం జూచి మరల నవ్వానరమహాసైన్యమంతయు పరుగెత్తినది. రాముఁడు పర్వతాకారుఁ డగు నాకుంభకర్ణునిం జూచి వానరసైన్యము పరుగెత్తుటయుం గని, యాశ్చర్యమున విభీషణునిం జూచి 'లంకయందు పర్వతాకారుండై కిరీటము దాల్చి కపిలనేత్రములు గలిగియున్న వీరుఁ డొకఁడు మెఱపులతోఁ గూడిన మేఘముపై వడిం జూపట్టుచున్నాఁడే! ఇతఁ డెవ్వఁడు? ఇతఁడు భూమికంతెయు ధ్వజమువలె నొక్కఁడు మిక్కిలియు గొప్పగాఁ జూపట్టుచున్నాఁడు. ఇతనినిజూచి వానరులందఱును, అంతనంతఁ, బరుగులు వాఱుచున్నారు. ఈగొప్పవాఁ డెవ్వఁడు? రాక్షసుఁడా? అసురుఁడా! నాకు వివరింపుము. నే నిదివఱ కిటువంటిమహాభూతమును నెప్పుడును జూచినది లేదు' అనెను. ఎట్టికార్యమును జుల్కఁగాఁ జేయునట్టి రాజకుమారుఁడు రాముఁ డిట్లడుగఁగా మహాప్రాజ్ఞుం డగు నావిభీషణుఁ డతనితో "ఈతఁడు విశ్రవసునిపుత్త్రుఁ డగు కుంభకర్ణుఁడు. యుద్ధమున యమునిని దేవేంద్రునినిం గూడ నోడించినవాఁడు, ప్రతాపశాలి. ఒడ్డుఁబొడవు కొలఁదిని, ఇంతటి రాక్షసుఁడు మఱియొక్కఁడు లేఁడు. రామా! ఇతనిచేత యుద్ధమున, దేవతలును, దానవులును, యక్షులును, పన్నగులును, రాక్షసులును, గంధర్వులును, విద్యాధరులును, కిన్నరులును, వేలకొలఁదిని గ్రమ్మివచ్చినను, భంగము నొందిరి. మహాబలుఁడగు కుంభకర్ణుఁడు, శూలపాణియై, వికటములగు కన్నులతో యుద్ధాగ్రమున నిలువఁగా, దేవతలును, నతనిఁ గొట్టంజాలక 'ఇతఁడు త్రిలోకసంహారి యగు కాలుఁడే'యని భ్రమించిరి. మహాబలుండగు నీకుంభకర్ణుఁడు వరదానమునం గాదు; స్వభావముననే మిక్కిలి బలవంతుఁడు సుమీ. రావణాదులగు తక్కినరాక్షసోత్తములకెల్లను బలము వరప్రదానమునఁ గలిగినదగును. ఇతఁడు పుట్టినమాత్రముననే మహాబలుఁడై, యాఁకటిచే నలఁగి, మిక్కిలియుం బెక్కువేలప్రాణులను భక్షించెను. అట్లతఁడు ప్రజలనెల్లను భక్షించుచుండఁగా, వారు భయపీడితులై దేవేంద్రుని శరణుసొచ్చి, యావిషయము నతనికిం జెప్పిరి. ఆదేవేంద్రుఁడు, కుపితుఁడై తీక్ష్ణమయిన వజ్రాయుధముచే కుంభకర్ణునిం బ్రహరించెను. మహాబలుఁడగు కుంభకర్ణుఁడు, అట్లు వజ్రాయుధమునం గొట్టువడి, కొంతతడవు చలనము నొంది యంత కోపమున బిగ్గఱగా నార్చెను. మునుపే భయపడి యున్న ప్రజలందఱును, ధీమంతుఁ డాకుంభకర్ణుఁ డట్లు మిక్కిలియు నఱచుచుండుటను జూచి మఱియు భయముఁ జెందిరి. అప్పుడు మహాబలుఁడగు కుంభకర్ణుఁడు కోపమున నైరావతము దంతము పెఱికి యింద్రుని

ఱొమ్మున నడిచెను. ఆయింద్రుఁడును కుంభకర్ణుని వ్రేటున మిక్కిలియు నలంగి కోపమున మండిపడెను. అంత దేవతలును బ్రహ్మర్షులును దానవులును, తోడనే యొక్కట విషాదమునొందిరి. దేవేంద్రుఁడు ప్రజలతోఁగూడ బ్రహ్మదేవునొద్దకుఁ బోయి, ప్రజలును దానును, కుంభకర్ణుని దుష్కార్యమును నా బ్రహ్మకుఁ దెలుపుకొనెను. ప్రజలను భక్షించుటయు, దేవతలను దిరస్కరించుటయు, ఋష్యాశ్రమముల ధ్వంసముసేయుటయుఁ, బరస్త్రీల నపహరించుటయు మొదలుగా కుంభకర్ణునిదుష్కృత్యముల నన్నిటిని జెప్పిరి. వారలా బ్రహ్మతో 'ఈకుంభకర్ణుఁ డిట్లే నిత్యమును బ్రజలను భక్షించుచుండునేని, ఇఁక స్వల్పకాలములోనే లోకమంతయు శూన్యము గాఁగలదు' అనిరి. ఇంద్రుఁడు దేవతాపురస్సరుఁడై చెప్పినదివిని, బ్రహ్మ రాక్షసులను రప్పించి వారిలోఁ గుంభకర్ణునిం గాంచెను. బ్రహ్మదేవుఁడుగూడ, కుంభకర్ణునిఁజూడఁగానే మిక్కిలి బెదరునొందెను. అట్లా బ్రహ్మ యీ రాక్షసునిఁజూచి యూఱటమాటలతో సమీపమునఁ బెట్టుకొని 'విశ్రవసుఁడు లోకవినాశనమునకై నిన్నుఁ బుట్టించినాఁడు. ఇది వాస్తవము. కాఁబట్టి * నీవిది మొదలు, చచ్చినట్లుపడి నిద్రించుచుండఁగలవు' అనెను. అంత నా కుంభకర్ణుఁడు బ్రహ్మశాపముచేఁ గీడ్పడి ప్రభుఁడగు రావణునిముందటఁ బడెను. అంత రావణుఁడు మిక్కిలియుఁ దత్తఱపాటునొంది, బ్రహ్మదేవునింజూచి 'బ్రహ్మదేవా! చక్కఁగాఁ బెరిఁగి బంగారువలె నింపుగొలుపు నొకవృక్షమును, ఫలించుకాలమున నఱకివేయునట్లయినది. నీవు సొంత మునిమనుమఁడే యగు నతని నిట్లు శపించుట న్యాయముగాదు. నీమాట యబద్ధము గాఁజాలదు. కనుక నితఁడు నిదురించుచునే యుండును, సందేహము లేదు. అయినను నితఁడు నిదురించుటకును మేలుకొనుటకును గాలనియమము నేర్పఱుపవలయును' అనెను. బ్రహ్మ రావణుఁడు చెప్పినదివిని, 'ఈ కుంభకర్ణుఁడు † ఆఱుమాసములకుఁ దక్కువలేకుండ నిదురపోవుచును నాఱునెలల కొకదినము మేలుకొనుచుండును. ఈవీరుఁడు ఆఱునెలల కొకదినము నిద్రలేచి, యాఁకలిగొని నోరు దెఱచుకొని భూమియందు సంచరించుచు గ్రుద్ధుండగు నగ్నిహోత్రుంఁడుంబోలె లోకములను భక్షింపఁగలఁడు' అనెను. రాక్షసరాజు రావణుఁడు నీదుపరాక్రమమునకు భయపడి, వ్యసనమునొంది, యిపుడు నిదురపోవుచుండిన కుంభకర్ణుని మేలుకొలిపెను. భయంకర పరాక్రముండయిన యీవీరుఁడు, నిజగృహమునుండి వెడలి మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై

---

* ఇదియే బ్రహ్మశాపము. ఇది కుంభకర్ణుఁడు తపస్సుచేసినపిదపఁ గలిగినది. మొదటనే కలిగినదన్నచో చచ్చినట్లు పడి నిదురించువానికి తపస్సుచేయుట కలుగదుగాన తపస్సునకు పిదప కలిగినట్లే గ్రాహ్యము.

† ఇది మూలమున 'శయితాహ్యేష షణ్మాసా నేకాహం జాగరిష్యతి' అని నిదురించుట యాఱునెలలని చెప్పినను, 'నవషట్సప్తచాష్టౌచ మాసాన్' అని పూర్వము చెప్పఁబడియుండుటఁబట్టి ఆఱునెలలకుఁ దక్కువకాకుండ నని యర్థము గ్రాహ్యము.

వానరులను భక్షించుకొనుట పరుగులెత్తుచున్నారు. వానరు లిపుడు కుంభకర్ణునిం జూచి నంతనే బెదరి పరుగెత్తుచున్నారే ! ఇక యుద్ధంబున వీఁడు క్రుద్ధుండై పోరొనర్చిన చో వానరు లెట్లు వారింపఁగలరు. 'ఇది రావణుఁడు నిలిపిన యొక్క యంత్రము వచ్చి నిలిచెను. ఇదియే కుంభకర్ణుఁడు సుమీ' అని వానరులకెల్లను జెప్పవలయును. వార లిట్లుగాఁ దెలిసి యీవిషయమున నిర్భయులై యుందురు'' అనెను. విభీషణుఁడు యుక్తియుక్తముగను సుముఖముగా ను జెప్పినదివిని రాముఁడు అపుడు సేనాపతియగు నీలునింజూచి, 'అగ్నిపుత్రా ! నీలా ! నీవుపోయి సమస్తసైన్యములను వ్యూహములుగాఁ దీర్చి, లంకయందలి ద్వారములను చర్యాస్థానములను, అనకట్టలనును, ఆక్రమించి యుండుము. యుద్ధసాధనములగు పర్వతశిఖరములను వృక్షములనును శిలలనును నిపుడే రాశిగా సేకరింపుము. వానరులందఱు పర్వతములు చేతంగొని ఖడ్గాద్యాయుధములను ధరించియుందురుగాక ' యనెను. వానరసేనాపతియగు నాకపికుంజరుఁడు నీలుఁడు, రాముని యాజ్ఞంగొని, యట్లె వానరసేన కాజ్ఞచేసెను. అంతఁ బర్వతాకారులగు గవాక్షుఁడును, శరభుఁడును, హనుమంతుఁడును, అంగదుఁడును, పర్వతశిఖరములను గ్రహించి, లంకాద్వారములకుఁ బోయి ముట్టడించిరి. రాముఁడు చెప్పినదివిని, జయశీలురును వీరులు నయినవానరులు, వృక్షములుగొని నగరరక్షకై వెలుపలఁ దిరుగుచున్న శత్రుసైన్యములను మర్దించిరి. అంత నానాపర్వతంబు లెత్తికొన్న చేతులం బ్రకాశించుచుండ లంకాప్రాకారము దాపున నున్న యాయుగ్రవానరసైన్యము పర్వతమునకు సమీపమున భయంకరముగాఁ గ్రమ్ముకొన్న మహామేఘసమూహమువలెఁ బ్రకాశించెను. ఇది యిరువదియొకఁడవసర్గము.



రావణుఁడు తనయొద్దకు వచ్చిన కుంభకర్ణు ననునయించుచు రామునివలనం గలిగిన యాపదను జెప్పి యుద్ధరింపవలయునని ప్రార్థించుట.

మహాపరాక్రమవంతుఁడయి యెట్టివారికిని జయింప నలవి గాని రాక్షససింహుఁడా కుంభకర్ణుఁడు, అకాలమున లేచుటచే తీఱని నిదురచొక్కును మద్యపానమువలనిమత్తును చెలంగఁగా, వేలకొలఁది రాక్షసులచే పరివృతుఁడై, కాంతిఁ దేజరిల్లుచున్న రాజమార్గమును జేరి పౌరులు మేడలపయినుండి పుష్పవర్షము లపుడు గురియుచుండఁగాఁ బోయెను. అతఁడు, బంగారుకిటికీలచే నెఱసి, సూర్యమండలమువలె ధగధగ మెఱయుచు విశాలమును రమణీయమునై వెలయు రాక్షసరాజు రావణునిగృహమునుం జూచెను. అతఁ డప్పుడు సూర్యుఁడు మేఘసమూహమును బ్రవేశించునట్లు, రాక్షసేశ్వరుఁడగు రావణునిగృహమును బ్రవేశించి,

* దూరంబున మణిమయకక్ష్యలో సింహాసనాసీనుండై యున్న యన్నను రావణుని, దేవేంద్రుఁడు ఆసనగతుండగు బ్రహ్మదేవునిఁ జూచునట్లు, చూచెను. అతఁడు రాక్షసనమూహములు నెలసియున్న తన యన్నగృహమును బ్రవేశించుచుండఁగా అతని యడుగులిడుటకు భూమి వడంకినది. ఆకుంభకర్ణుఁడు తనయన్నభవనమును బ్రవేశించి ద్వారమునుదాఁటి లోపలం బుష్పకవిమానంబున నాసీనుఁడై దుఃఖంబున నున్నయన్నను గాంచెను. అంత రావణుఁడు, కుంభకర్ణుఁడు వచ్చుటంజూచి మిక్కిలి సంతుష్టుఁడై యాసనమునుండి దిగ్గనలేచి,యాసనము దాపునకుఁ దోడుకొనిపోయెను. అంత రావణుఁడు మరల పర్యంకమునఁ గూర్చుండినపిమ్మట, మహాబలుఁడగు కుంభకర్ణుఁడు, అన్నచరణములకు వందనముసేసి 'నేను జేయవలసినదేమి' అని యడిగెను. రావణుఁ డందులకు సంతుష్టుఁడై లేచి యతనిని గౌఁగిలించుకొనెను. అన్నయగు రావణుఁ డట్లు కుంభకర్ణునిఁ గౌఁగిలించుకొని తగుచొప్పున నభినందింపఁగా, కుంభకర్ణుఁడు సుందరమును దివ్యమునగు సింహాసనము నారోహించెను. అట్లపుడు మహాబలుండగు కుంభకర్ణుఁడు ఆసనగతుఁడై కోపంబునఁ గన్నెఱ్ఱఁబాఱ, రావణునిఁజూచి 'రాజా! నీవు నిద్రపోవుచున్న నన్ను, నింతయక్కఱతో నేల లేపితివి? నీ కిపు డెవ్వని వలన భయముగలిగినది. ఎవఁ డిపుడు మరణమునొందనున్నాఁడు; చెప్పు' మని యడిగెను. రావణుఁడు, క్రుద్ధుఁడై కూర్చున్న తమ్మునిఁ గుంభకర్ణునింజూచి కొంచెము కోపమునఁ గన్నులించుక తిరుగుడువడఁగా 'బలవంతా! నీవు పరుండి యిప్పటికి చాల తొమ్మిదిదినముల కాలమయినది. ఇట్లు సుఖమున నిద్రపోవుచు నుండుటచే నీవు రాముని వలన నాకుఁ గలిగినభయము తెలియకున్నావు.ఇదె! బలశాలియగు దశరథకుమారుఁడు రాముఁడు, సుగ్రీవునితోను వానరసేనతోను గూడి, సముద్రమును దాఁటివచ్చి,మనలను సమూలముగా ఖండించుచున్నాఁడు. మూలబలమును ఛేదించుచున్నాఁడు. రాముఁడు సముద్రమునఁ దానుగట్టించిన సేతుమాత్రముననే సుఖముగావచ్చి ఔరా!నా లంకయందలి వనములను నుపవనముల నన్నిటిని నొకటె వానరరూపమయినసముద్రమునుగాఁ జేసియున్నాఁడు! చూడుము. మనరాక్షసులు మేటికన్నాకులయినవారు వానరులచే యుద్ధమున హతులయిరి. నే నొకప్పుడును యుద్ధమున వానరవీరులలో నొక్కండయినఁజచ్చి వానరసేన క్షీణించుటఁ జూడలేదు. ఇంతేకాదు.వానరు లింతకుమునుపు నొకప్పుడయినను నోటమి పొందినదియు లేదు. నీవు మహాబలుండవుగదే! ఇప్పుడిట్టిభయము పుట్టియున్నది. నీవిపు డీ వానరులనెల్ల నాశముసేసి, యీలంకాపురమును గాపాడుము. ఇందులకొఱకే నిన్ను నిదుర లేపితిమి. నాయైశ్వర్యమంతయు క్షయించినది. లంకయందలి మేటిరాక్షసులందఱును హతులయి యిప్పుడు బాలురును వృద్ధులును మాత్రము శేషించియున్నారు. నేనును ఈపట్టణమును నిట్లుండుటఁ దెలిసి యా

* రావణునిగృహము, పుష్పకవిమానముగాన యది యున్నతమగుటచే దూరమునుండియే యందున్న రావణుఁ డగపడెనని తెలియునది.

లంక నిపుడు రక్షింపుము. మహాబాహూ ! నీవు నీయన్నకుఁగా, నితరులకుఁ జేయ నలవిగాని యీకార్యమును, గావింపుము. పరంతపా ! ఇదివఱ కెప్పుడయిన నేను నీతో నిట్లు చెప్పినది లేదుగదా ? నీయందుమాత్రము నాకెప్పుడును మిక్కిలియు స్నేహమును గౌరవమును గలదు. రాక్షసతిలకా ! దేవాసురయుద్ధములందు నీవు పెక్కుమార్లు దేవతలను మాఱొడ్డి యోడించియున్నావు. అసురులనుగూడ యుద్ధమున జయించియున్నావు. నీపరాక్రమము భయంకరముగదే ! కాన నీవావీర్యమునంతయు నిపు డవలంబింపుము. సమస్త ప్రాణులందును నీకు సాటియైన బలవంతుఁ డెవ్వఁడు నగపడ లేదు. నీకు యుద్ధమనఁగా ప్రియము. బంధువులయందును మిక్కిలి ప్రీతిగలవాఁడవు. కనుక నాకు ప్రియమును హితమునయిన యీ యుత్తమకార్యమును మనకిద్దఱకుం గల ప్రీతి కనురూపముగాఁ గావింపుము. మహావాయువు లేచి,శరత్కాలమేఘంబును ధ్వంసము గావించునట్లు, నీవు నిజతేజంబున, శత్రుసైన్యములఁ బటాపంచలు సేయుము' అనెను. ఇది యఱువది రెండవసర్గము.



కుంభకర్ణుఁడు 'నేనును విభీషణుఁడును జెప్పినట్లు, రామునకు సీత నియ్యవైతివి గాన యిట్టికీడు గలిగె'నని రావణు నుపాలంభించుట; అందులకు రావణుఁడు కోపింపఁగాఁ దా నతనియిచ్ఛచొప్పున శత్రులను జయించునట్లు ప్రతిజ్ఞ సేయుట.

రాక్షసరాజగు రావణుఁడు విలపించుకొన్నట్లు చెప్పినమాటలనువిని, కుంభకర్ణుఁడు నవ్వి 'మునుపు మన మాలోచనము సేసినపుడు, ఏదోషముకలుగునని నిశ్చయించితిమో, యాదోష మిపుడు హితపరులయిన వారిమాటలను వినకపోవుటవలన నిన్నుఁ జెందినది. శత్రువులవలన భయముగలుగునని మును పాలోచించినవిపత్తే దాపరించినది. మహాపాతకులను నరకమునందే పాతము తప్పక పొందునట్లు, సీత నపహరించుటచే నీవు గావించిన పాపకార్యపు ఫలమును శీఘ్రముగనే నిన్నుఁ బొందినదిసుమీ. మహారాజా! నీవు కేవలము వీర్యగర్వమున, సీత నపహరించిన యీకార్యమును, అపహరించుటకుమునుపే మంచిదోకాదో యని యాలోచింపవయితివి. దానివలన దోషముపుట్టుటయు విచారింపకపోయితివి. ప్రజల నేలునట్టియేరాజు కార్యమును దొడంగుటకు మునుపు చేయవలసిన యాలోచనాదులను వెనుకను, వెనుక విచారింపవలసినకార్యములను ముందును, జేయునో యతఁడు నీతిని అనీతిని దెలియనివాఁడు. తగనిదేశమునను తగనికాలమునను జేయఁబడిన కార్యములు, దేశకాల వైకల్యమువలన విపరీతములై, మంత్రాధ్యయనాదులు లేమివలన నపాత్రులయినవారిచే వేల్వఁబడిన హవిస్సులవలె,విఫలములగును.ఎవ్వఁడు

మంత్రులతోఁ జక్కఁగా నాలోచించి సిద్ధాంతము చేసికొని *యుత్తమము మధ్యమము అధమము అను మూఁడువిధములగు కర్మములను, వాని నారంభించుటకు వలయు నుపాయము, వానికి వలయు ద్రవ్యసంపత్తి, వానిని చేయఁదగిన దేశకాలవిశేషములు, వానికిఁ గలుగఁగూడిన విఘ్నములకు ప్రతీకారము, వానిసిద్ధి, యను నీ యైదింటితోఁ బొందుపఱుచుటయందు కనుగలిగి కావించునో, యతఁడే నీతిమార్గమున వర్తించువాఁడు. అతఁడే నీతిఫలమును బొందును. ఎవ్వఁడు, బుద్ధియొప్ప మంత్రులతోఁగూడి యాలోచించి సుహృదులతోఁగూడి విచారించి నీతిశాస్త్రము నతిక్రమింపక కార్యము నిర్ణయింపఁగోరునో, యారాజు నీతిమార్గమున వర్తించువాఁడు. రాక్షసేశ్వరా! పురుషుఁడు శాస్త్రమున విధింపఁబడియుండునట్లు ప్రాతఃకాలమున ధర్మమును మధ్యాహ్నమున నర్థమును సాయంకాలమునఁ గామంబును సేవింపవలయును. లేక ప్రాతఃకాలమున తత్కాలవిహితమగు ధర్మమును మధ్యాహ్నపు నర్థమును, మధ్యాహ్నమునఁ దత్కాలవిహితమగు నర్థమును, ప్రాతఃకాలపుధర్మమును, సాయంకాలమునఁ దత్కాలవిహితమగు కామమును మధ్యాహ్నపుధర్మమును నిట్లొక్కొక్క కాలమున రెండేసిధర్మములు జతలుగాఁగాని సేవింపవలయును. లేక, సాయంకాలమున తత్కాలవిహితమగు కామమును ప్రాతర్మధ్యాహ్నముల ధర్మార్థములును గా మూఁడింటిని సేవించునది; కాని అకాలమున వీనిని సేవింపరాదు. కేవలకామమునే సర్వకాలములందును సేవించువాఁడు పురుషాధముఁడే యగును. ఈమూఁటియందును శ్రేష్ఠమైనదానిని (ధర్మమును) విని యేరాజుగాని రాజంతటివాఁడుగాని యాచరింప నెఱుఁగఁడో †యతనిశాస్త్రశ్రవణమ్మంతయు అనుష్ఠానమందు పర్యవసింపనందున వ్యర్థము. రాక్షసోత్తమా! ఎవ్వఁడు మనస్సును వశీకరించి, తత్తదుచితకాలమున శత్రువునొద్దకుఁబోయి ధనము సమర్పించుట యను దానమును, మంచిమాటలు చెప్పుకొనుట యను సామమును, వారలకును వారిపుత్త్రాదులకును భేదము పుట్టించుట యను భేదమును, పరాక్రమించి యుద్ధము సేయుట యను దండమును, అను నీనాలుగింటిలో నొక్కొక్కటినిగాని యన్నిటిని మొత్తముగాఁగాని, వాని నిర్వహించుప్రకారమగు నయమును నిర్వహింపని ప్రకారమగు అనయమును, ధర్మార్థకామములను,

* తాను బలిష్ఠుఁడై శత్రువు దుర్బలుఁడై యుండునపుడు గావింపవలసిన యుద్ధము ఉత్తమకర్మము. తానును శత్రువును సమానబలులై యున్నపుడు గావింపవలసిన సంధిమధ్యమకర్మము. తాను దుర్బలుఁడై శత్రువు బలిష్ఠుఁడై యున్నపుడు కావించుదానము అధమకర్మము. ఈ మూఁడుకర్మములను గుఱించి మంత్రులతో నాలోచించి వానికి నారంభించునుపాయ మిదియనియు పట్టు ద్రవ్యసంపత్తి యింతయనియు చేయవలసిన దేశకాలము లివియనియు విఘ్నములకు నివారణ మిట్టిదనియు, సిద్ధించువిధ మిదియనియు నిష్కర్షించుకొని చేయువాఁడే నీతిమార్గవిదుఁడనిభావము.

† దీనిచే త్రివర్గమునందు శ్రేష్ఠమగుధర్మమును దిగవిడిచి, కనిష్ఠమగు కామము నేయాశ్రయించిన నీశాస్త్రశ్రవణము సముద్రఘోషమాత్రమే యైనదని సూచితము. గోవిందరాజులు.

మంత్రులతోఁ జక్కఁగా నాలోచించి పూర్వోక్తములగు నమైత్యకాలములను జను న్సును వశీకరించి యెవఁడు సేవించునో వాఁడు లోకమున వ్యసనమునొందఁడు. ఏరాజు, అర్థతత్త్వములను జక్కఁగాఁ దెలిసిన మంత్రులతోఁగూడి, తనకుమీఁద హితముగలుగునట్టి కర్తవ్యమేదో యకర్తవ్యమేదో యాలోచించి నిశ్చయించుకొని కర్తవ్యమునుమాత్రమే చేయునో యతఁ డీ లోకమున సుఖముగా *జీవించును. రాజవిషయ మటుండ మంత్రులగు వారన్ననో, నీతిశాస్త్రార్థములను గురుముఖ ముగావిని తెలియక వేషమునకు పురుషులయ్యు, పశువులవలె ఆహార నిద్రాదుల నుమాత్రమే తెలిసియుండునట్టివారు, రాజు భ్రాంతుఁడై రాజకార్యవిచారము లందుఁ దమ్ము నాలోచనను చెప్పుటకై చేర్చుకొనఁగా, ఊహాపోహములు లేకయే వట్టిదిట్టతనమువలన నేమో పేరులుదురుగాని యొప్పిదమయినదానిని నిశ్చ యించిచెప్పరు. శాస్త్రముల నెంతమాత్రముదెలియని యామంత్రుల యహితవ చనములను, అర్థశాస్త్రము దెలియనివా రయ్యును, అఖండసంపదను గోరు రాజు లెంతమాత్రమును జేయరాదు. ఎవ్వరు తమకు శాస్త్రజ్ఞానములేక వట్టి దిట్టతనమువలన, వాస్తవమునకు అహితమయ్యును పయికి హితమువలెఁ దోఁ చునర్థమును అక్రమముగాఁ జెప్పుదురో, వారు కార్యమును జెఱుపునట్టివారుగాన మునుపే పరీక్షించి తెలిసికొని వారిమాట వినకుండుటయేకాక వారిని మంత్రాలో చనమునకును జేర్చుకొనక వెలిగావింపవలయును. ఇట్టి దుర్మంత్రులగువారు అహిత ములను జెప్పుటమాత్రమే కాదు; ఉపాయజ్ఞులగు శత్రువులచే ప్రేరితులై రాజును నాశముసేయఁబూని, యతనికి ప్రయోజనమగువిషయమున విపరీతఫలముల నిచ్చుకా ర్యములనును నతనిచేఁ జేయింతురు; రాజు, అట్లు లంచముపుచ్చుకొనుట మొదలగు వానిచే శత్రువులకు వశులై తన్నుం జెడి వేఱుపడి, మిత్రులవలె నటించుచు, కార్య మునం దబుద్ధులయి యున్న యామంత్రులను, మంత్రాలోచనకాలమున పలువిధ ములయిన మాటలాడి గుఱుతెఱుంగవలయును. 'అసమర్థులయిన మంత్రులు విపరీతబుద్ధిగలవారయ్యు నేమిచేయఁగల' రందువా? నిపుణులగు శత్రువులు లం చము మొదలగువానిచే వశపఱచుకొనియున్న మంత్రులు, ప్రస్తుతమై యొక కార్య ముండఁగా, అందులకు తగనికార్యములకుఁ దమ్ముఁ బురికొలుపునపుడు, ముందు వెను కఁ జూడక వెంబడినే వారుచెప్పినకార్యముల వెంటంబడి చపలుఁడై తోడనే వానిని రాజు గావించునేని, క్రౌంచపర్వతమున కుమారస్వామి గావించిన రంధ్ర మును బక్షులుహొందునట్లు, శత్రువులు తాము రాజునం దాదుర్మంత్రులచేఁ గావిం చిన యాఛిద్రమునుగొని లోపలఁ బ్రవేశించి యతని నాక్రమింతురు. ఏరాజు మంత్రవ్యవహారాదులచే తనకు వంచనపరుఁ డయినవానిని దెలియక యట్లు

* నీవట్లు మీఁద హితమయినట్టి కార్యాకార్యము లాలోచింపనందున నీ కిట్టివ్యసనము సంభ [illegible]

తెలియమిచే దుర్మంత్రులను దొలఁగించుట మొదలగువానివలనఁ దనయెప్పటి స్థితిని రక్షించుకొననేరక యుండునో, యతఁడు అనర్థములను బొందుటయేకాక, సింహాసనమునుండియు * భ్రష్టుఁడగును. ఈవిషయమునందు మనతమ్ముఁడు విభీషణుఁ డేమిచెప్పినాఁడో దానిని గావింపుము. అదియే మనకిపుడు హితమయినది. ఇంకను నీ కేదిచేయఁ గోరికగలదో దానినిం జేయుము' అనెను. కుంభకర్ణుఁ డట్లు చెప్పినదివిని రావణుఁడు క్రుద్ధుఁడై కనుబొమలు ముడివడ నతనితో 'కుంభకర్ణా! నాకన్నఁ జిన్నవాఁడవగు నీవు, పూజనీయుఁడును ఆచారప్రవర్తకుఁడు నగు పెద్దవానిపగిది, పూజ్యుఁడును ఆచార్యుఁడును బెద్దవాఁడునగు నన్ను శిక్షించుచున్నావేమి? నీతికాలము గడచిపోయినదిగాన యీమాటలవలన వట్టిప్రయాసమేకాని వేఱుపస లేదు. కాన దీనిని జెప్పుటచే ప్రయోజనమేమి? నీతికి మీఱినయిప్పటికాలమునకు యుక్తమగు పరాక్రమము నెఱపుము. అనీతిని నీతిగాభ్రమించియో, మనస్సునఁ దెలివిపుట్టకుండుటనో, బలవీర్యములవలని గర్వముననో, చేయవలసినది చేయకపోయితిని. ఇఁకఁ జేయుటకును గాలము గడచినదిగాన, యట్లు చేయలేదని మాటిమాటికిఁ జెప్పుట వ్యర్థము. ఇప్పటికాలమున కేదియుక్తమో దానినే యిప్పుడు చేయుము. కడచినదానిని గుఱించి బుద్ధిమంతులు దుఃఖింపరు. పోయినది పోయినదేకాని మరలిరాదు. నీకు నాయందు నెయ్యముగలదేని, నీపరాక్రమము నీకుఁ దెలిసియున్నదేని, ఇప్పుడీ యుద్ధము అవశ్యము చేయవలసినకార్యమని నీకును దోఁచునభిప్రాయమేని, నాయపనీతివలనం గలిగినదోషమును నీపరాక్రమముచే సరిపెట్టుము. తాను పూనినప్రయోజనమునకు నపాయము గలుగునని తోఁచుటచే మనస్సుకలఁగి దీనుండై యున్నవానికి దగ్గఱనే యెప్పుడునుండి యరయునట్టిస్నేహితుఁడే స్నేహితుఁడు. నీతిదప్పి తడఁబడుచుండువారలకు సాహాయ్యముఁ జేయనేర్చినబంధువే బంధువు' అనెను. ఇట్లు తెగదెంపుగాను నిష్ఠురముగాను మాటలాడుచున్న రావణునిం జూచి యంతఁ గుంభకర్ణుఁ డితఁడు కోపమునొందెనని బొమముడిచేత నూహించి తెలిసికొని మృదువచనమున మెల్లగా నిట్లనియె. కుంభకర్ణుఁడు తనయన్న మీఁదుమిక్కిలి యింద్రియములు కలఁగి కుపితుఁడై యుండుటనుజూచి, మెల్లగా నతని నూఱడించుచు, 'రాక్షసరాజేంద్రా! ఈ సంతాపపడుటచాలు. కోపమునుగూడ దిగవిడిచి, † స్వస్థుఁడవై యుండుము. ‡ రా

* ఇంతవఱకు కుంభకర్ణుఁ డాడినమాటలం బట్టి 'కామవ్యసనమువలనను కుమంత్రవచనమువలన నీ కీయాపద గలిగిన'దని రావణునకుఁ దెలుపుట తెలియునది. గోవిందరాజులు.

† ఇందులకు 'స్వస్థోభవితుమర్హాతి' అనిమూలము. (స్వఃస్థః) స్వర్గస్థుఁడవు అగుమని యర్థాంతరము దెలియునది.

‡ ఇందులకు 'నైతన్మనసికర్తవ్యం మయిజీవతి పార్థివ। తమహంనాశయిష్యామి యత్కృతే పరితప్యసే' అనిమూలము. అర్థాంతరము:—(మయిజీవతిసతి) నేను బ్రతికియుండఁగా (ఏతత్ మనసి నకర్తవ్యం) నీ విచింత మనస్సునఁ బెట్టుకొనవలదు. నేను జీవింతునేని యపుడు నీవిట్లు మనస్సున చింత

జా! నేను బ్రతికియుండఁగా, నీవు 'భ్రమించియో తెలివిపుట్టకయో చేయకపో యితి' నన్నచింత మనస్సున నుంచుకొనవలదు. నీ వెవ్వనినిమిత్తమై పరితపించుచు న్నావో యారాముని నాశముసేసెదను. 'అయిన నిట్లేలచెప్పితి' వందువా? రాజా! సామాన్యమగు స్నేహమునుబట్టియు, విశేషించియు నన్నదమ్ముఁడవను నెయ్యమును బట్టియు, నీవు రోషముగొనియో హర్షముగలిగియో మఱి యేయవస్థయందుండినను గాని నీకు నేనవశ్యము హితమును జెప్పవలయునుగాన దానిని జెప్పితిని. * మిక్కిలి స్నేహముగలబంధువునకు నిట్టియాపత్కాలమునం జేయుటకు యుక్తమయినది శత్రు వధము; ఆవధమును యుద్ధమునం గావించెదను జూడుము. † మహాబాహూ! ఇప్పుడు నేనుయుద్ధాగ్రమున రాముని లక్ష్మణునిని వధింపఁగా వానరసైన్యమంతయుఁ బలా యితమగుటను జూడుము. ‡ మహాబాహూ! ఇప్పుడు నేను యుద్ధముననుండి, రాము నిశిరస్సుఁ దేఁగా నీవుచూచి సుఖమునొందుము. సీత దుఃఖిత యగుఁగాక. § లంక

---

పెట్టుకొనవలదనుట. అనఁగా నేను జీవింపఁబోవుటయే లేదనిభావము. (యత్కృతే) ఏనాకొఱకు, (పరి తప్యసే) వీఁడు సుఖముగా బ్రతికియుండి నాకార్యమును జేయఁడయ్యెనని పరితపించుచున్నావో, (తం అహంనాశయిష్యామి) (రామేణ) అట్టి నన్ను రామునిచేతఁ జంపించుకొనెదను! నీవు నేనుబ్రతికియుండి యు నీకార్యమును జేయలేదనిగదా పరితపించుచున్నావు. నేను రామునిచేత నన్నుఁ జంపుకొనెదను. అ ప్పల బ్రతికియుండియు నీకార్యమును తీర్పలేదని పరితపింపవు అని యర్థాంతము.

* ఇందులకు, 'సదృశంయత్తుకాలేస్మిన్ కర్తుంస్నిగ్ధేనబన్ధునా । శత్రూణాంకదనంపశ్య క్రియ మాణంమయారణే' అనిమూలము. అర్థాంతరము:—ఇట 'శత్రూణాంకదనం' శత్రువులయొక్క చంపు టను, శత్రువులు నన్నుఁజంపుటను జూడుమని యర్థాంతరము.

† ఇందులకుమూలము. 'అద్యపశ్యమహాబాహో మయాసమరమూర్ధని।హతేరామేసహభ్రాత్రా ద్రవన్తీంపరవాహినీమ్' (హేపర) ఓయన్నా, (మయాసహసమరమూర్ధనిహతేసతి) నాతోఁగూడ నీవు యుద్ధాగ్రమున హతుఁడవు కాఁగా, (రామే)రామునినిమిత్తమై, (ద్రవన్తీం) పయినెత్తివచ్చుచున్న, (వాహినీంపశ్య) వానరసేనను జూడుము. నీవును నేనును యుద్ధమున హతులముకాఁగా వానరసైన్యము రామునికొఱకు మనలంకపయి నెత్తివచ్చుటను జూడుమని యర్థాంతరము.

‡ ఇందులకుమూలము. 'అద్యరామస్యతద్దృష్ట్వా మయానీతంరణాచ్ఛిరః । సుఖీభవమహాబా హో సీతాభవతుదుఃఖితా' అర్థాంతరము.—(మయాసహరామస్య రణాత్ హేతోః) రామునకు నాతో డ యుద్ధముకలిగినకారణమున—రామునకును నాకును యుద్ధముకలుగుటచే ననుట, (ఆనీతం) దూరమునఁ జిమ్మఁబడిన, (శిరః) నాశిరస్సును, (దృష్ట్వాసుఖీభవ) చూచి సుఖమునొందుము. అప్పుడు నాయందు నీకుఁగలకోపము తీఱిపోవునుగాన నెమ్మదినొందుదువనుట, (సీతాదుఃఖితాభవతు) సర్వలోకమాతయగు టచే సీత నామరణమునకు దుఃఖించునని యర్థము.

§ ఇందులకుమూలము. 'అద్యరామస్య పశ్యన్తు నిధనం సుమహత్ప్రియం । లఙ్కాయాం రాక్షసాస్సర్వే యేతేనిహతబాన్ధవాః' అర్థాంతరము. (రామస్యనిధనం) రామునియొక్క నావధమును- రాముఁడు నన్నువధించుటను, (యేనిహతబాన్ధవాః తే రాక్షసాఃపశ్యన్తు) బంధువులుచచ్చిన రాక్షసులు చూతురుగాక. 'న దుఃఖం పంచభిస్సహ' 'అయిదుమందితోడ ననుభవించుదుఃఖము దుఃఖముగాదు' అను

యుం డింతవఱకు తమతమబంధువులు హతులగుటచే వారిని బోఁగొట్టుకొనియున్న రాక్షసులందఱును, తమకు మిక్కిలియు సంతోషకరమయిన రాముని వధమును నిప్పుడు చూతురుగాక. *ఇప్పుడు యుద్ధమున స్వబంధువులు హతులగుటవలన దుఃఖితులయి యుండురాక్షసులకు యుద్ధమున శత్రువును నాశముసేయుటచేఁ గన్నీళ్లుతుడిచి సుఖముగావించెదను. ఇప్పుడు పర్వతాకారుఁ డగువానరోత్తముఁడు సుగ్రీవుఁడు, నెత్తుటందోఁగి సూర్యకాంతితోఁ గూడిన మేఘమువలెఁ జూపట్టుచు యుద్ధభూమిం బడియుండఁగాఁ జూడుము. †అనఘా! రాముని వధింప నువ్విళ్లూరుచున్న యీ రాక్షసులును నేనును రక్షించుచుండఁగా, నిన్నిపుడు రాముఁ డెట్లు వధింపఁగలఁడు? ‡రాక్షసాధిపా! రాముఁడు నన్ను ముందు వధించిననే పిమ్మట నిన్ను వధింపఁగలఁడు. నాకో బ్రతికియుండఁగా శత్రుపరిభవమువలన పరితాప మొకప్పుడును గలుగనేరదు. నన్నొకఁడును జంపఁజాలఁడు. నేను జావకుండఁగా నీకు భయమెక్కడిది? పరంతపా! అసమానపరాక్రమశాలీ! ఇప్పుడే యథేచ్ఛముగా నాకు యుద్ధమున కనుజ్ఞ యొసఁగుము. యుద్ధమునకుఁ బంపఁదగినవాఁడు నాకన్న నితరుఁ డెవ్వఁడును నీకు లేఁడు. బలవంతా! నీశత్రువుల నందఱను నేను వధించివచ్చెదను. ఇంద్రుఁడుగాని, యముఁడుగాని, అగ్నివాయువులుగాని, కుబేరవరుణులుగాని, వచ్చినను వారలతోనుంగూడ యుద్ధముసేసెదను. పర్వతమంతటి పెనుకాయముగలిగి, తీక్ష్ణము

---

న్యాయమున ఆరాక్షసులు తమబంధువులచావువలని దుఃఖముతోఁగూడ, నాచావువలన నావారి దుఃఖమునుగూడఁ జూచిరేని వారికి దుఃఖ మంతేఁగాఁ దోఁపదనిభావము.

* 'అద్యశోకపరీతానాం స్వబన్ధువధకారణాత్ । శత్రోర్యుధివినాశేన కరోమ్యాస్రప్రమార్జనమ్' అనిమూలము. అర్థాంతరము:—(శత్రోః) శత్రుఁడగు రామునివలన, (యుధివినాశేన) యుద్ధమున నేను జచ్చుటచేత, (శోకపరీతానాం .. ప్రమార్జనమ్) బంధువులు చచ్చుటచే శోకముపాలయినవారి కన్నీళ్లుతుడిచెదను-అనఁగా పూర్వశ్లోకమునఁ జెప్పినట్లు బంధువులు చచ్చినవారిదుఃఖము, నేనుజావఁగాఁ గలిగిన నావారిదుఃఖమునుజూడఁగా తీసిపోవుననిభావము.

† 'కథంత్వంరాక్షసైరేభి ర్మయాచపరిరక్షితః । జిఘాంసుభిర్దాశరథిం వధ్యసేత్వమిహానఘ' అనిమూలము. అర్థాంతరము—(జిఘాంసుభిః) చంపవలయునని కోరికమాత్రముగల రాక్షసులచేత-పరాక్రమమునకు సమర్థులుగానివారిచేత ననుట, (కథం పరిరక్షితః) ఎట్లు రక్షింపఁబడఁగలవు. చంపఁబడుదువే యనియర్థము.

‡ ఇందులకు 'అద్యపూర్వంహతేతేన మయి త్వాంహన్తి రాఘవః । నాహమాత్మనిసన్తాపం గచ్ఛేయంరాక్షసాధిప' అనిమూలము. అర్థాంతరము—(అహం) నేను, (ఆత్మనివిషయే) నావిషయమై, (సన్తాపంనగచ్ఛేయం) సంతాపము నొందలేదు. నేను వధింపఁబడుటకు దుఃఖింపలేదనుట. అయితే, (మయిహతేసతి) నేను హతుఁడుకాఁగా, (అథ) పిమ్మట, (రాఘవస్త్వాంహన్తి ఇతి సన్తాపంగమిష్యామి) రాముఁడు నిన్నుఁజంపునని సంతాపపడుచున్నానని యర్థాంతరము. అనఁగా నేనురామునిచే హతుఁడగుటకు నాకు దుఃఖములేదు. నేను హతుఁడయినపిమ్మట రాముఁడు నిన్నువధించుననియే నాకు దుఃఖముకలుగుచున్నదని భావము. గోవిందరాజులు.

లయిన కోఱలతోఁగూడి, వాఁడికోఱలమును దాల్చి నేను సింహనాదము సేయుచుఁ దలపడఁగా, దేవేంద్రుఁడుగూడ భయపడి పాఱిపోవునే! అట్లుంగాక నే నాయుధమును విడిచి వట్టిబాహుబలముచే పగవారినిబట్టి ప్రహరింపఁగా, బ్రతుకఁగోరినవాఁ డెవ్వఁడును నాయెదుట నిలువశక్తుండుగాఁడే! నాకు శక్తిగాని, గదగాని, ఖడ్గముగాని, వాఁడిబాణములుగాని యేవియు నక్కఱలేదు, కోపమున నురవడించితినా, వజ్రాయుధధరుఁడగు నింద్రునయినను వట్టిచేతులచేతనే వధించివుత్తును. ఆరాముఁడు నాపిడికిటిపోటు నురవడికిం దాళఁగలఁడేని యటుపిమ్మట నతనిబాణసమూహములు నానెత్తురుఁ ద్రాఁగఁగలవు. నా పిడికిటిపోటునకే తాళఁడే! నానెత్తు రెట్లు వానిబాణములు త్రాగఁగలవు. రాజా! నేనుండఁగా నీవేల యిట్లు చింతచేఁ గుందుచున్నావు? నేను నీపగవారిని రూపుమాపుటకై పోవ నుద్యుక్తుఁడనై యున్నాను. * రాజా! రాముని వలని భయమును విడువుము. నే నిప్పుడు యుద్ధమునందు రామునిని లక్ష్మణునిని మహాబలుఁడగు సుగ్రీవునిని మనలంకను దహించి రాక్షసుల ననేకులం జంపిన హనుమంతుని వధించివుచ్చెదను; యుద్ధమునకు వచ్చియున్న తక్కిన వానరులనందఱను వధించెదను; మఱి యెవ్వరికిని బడయఁదరముగాని మహాయశస్సు నీకుఁ గలిగింపఁగోరినాను. రాజా! ఇంద్రునివలనఁగాని బ్రహ్మవలనఁగాని భయముగలిగినను దానినిగూడఁ బోఁగొట్టెదను. నేను క్రుద్ధుఁడనయి తేఱిచూచితినా, దేవతలుగూడ నేలం బడిపోవుదురు. యమునింగూడ నడంచివుత్తును. అగ్నిహోత్రునిఁగూడ భక్షించివైతును. సూర్యుని నక్షత్రములతోఁగూడ నాకాశముననుండి నేలం బడవేయుదును. దేవేంద్రుని వధించెదను. సముద్రమునంతయుఁ ద్రాఁగివైచెదను. పర్వతములను జూర్ణము గావించెదను. భూమిని బ్రద్దలువాఱఁజేసెదను. ఇప్పుడు భూతములన్నియు నలుగడల భక్షింపఁబడుచున్నవై బహుకాలముగా నిదురపోవుచుండిన కుంభకర్ణుని పరాక్రమమును జూచుఁగాక. ఈ మూఁడులోకములును జేరి నాకొక్కపూఁటయాహారమునకే చాలవు. ఇఁక నాతో యుద్ధ మెట్లు చేయును? † నేను రామునిఁ జంపి నీకు పయిపయిని గుప్పఁగూరఁగా సుఖమును గలిగింపవలయునని పోవుచున్నాను. రామునిని లక్ష్మణునిని జంపి వానరోత్తముల నందఱను బట్టి భక్షించెదను. నీవు నీ యిచ్ఛ

---

* 'ముంచరామాద్భయంరాజన్ హనిష్యామిహసంయుగే । రాఘవం లక్ష్మణంచైవ సుగ్రీవంచ మహాబలమ్... అసాధారణమిచ్ఛామితవదాతుంమహద్యశః॥' అనిమూలము. అర్థాంతరము—(రామాత్ భయం) అస్తి అని శేషము. రామునివలన భయముగలిగి యున్నది. [రాఘవంలక్ష్మణం...హనిష్యామి (ఇతిఏతత్) ముంచ] రామలక్ష్మణాదులను జంపఁగలననుమాట విడువుము. వారిని నేను జంపలేననుట. (తవమహద్యశః) నీయొక్క గొప్పకీర్తిని,(దాతుం) ఖండించుటకు,(ఇచ్ఛామి) కోరుచున్నానని యర్థము.

† 'వధేనతేదాశరథేస్సుఖార్థం। సుఖంసమాహర్తుమహంవ్రజామి' అనిమూలము. (తేవధేన) నీవధముచేత- నీవు వధముఁబొందుటచేత, (దాశరథేః సుఖం... వ్రజామి) రామునికి సుఖముగలిగించుటకై పోవుచున్నానని యర్థాంతరము.

కొలఁదిని, క్రీడింపుము. * మేలయిన మద్యమును త్రాగుము. వలయుపనులం జేసికొనుము. తుంటుడుకు మానుము. నేనిప్పుడు రాముని యమపురమునకుఁ బంపఁగానే, యిఁక సీత చిరకాలము నీకు వశమై యుండఁగలదు' అనెను. ఇది యఱువదిమూఁడవసర్గము.



## మహోదరుఁడు కుంభకర్ణుని భర్జించుట.

పెద్దకాయమును మిక్కిలి బలమును పెనుబుజములును గలిగి ఎదురాడరానివాఁడై యున్న కుంభకర్ణుఁడు చెప్పినమాటనువిని మహోదరుఁ డతనితో "కుంభకర్ణా! నీవు గొప్పకులమునఁ బుట్టినవాఁడవయ్యును నీకు బుద్ధి యల్పముగానున్నది. నీవు కేవలము దిట్టఁడవేకాని శాస్త్రజ్ఞుఁడవు గావు; మఱియు గర్వితుండవు. కావున నీ కేకార్యమందుఁగాని చేయవలసినమంత్ర మిది యని యెఱుఁగనేరవు. 'రాజు పరాక్రమగర్వమున ముందు పుట్టుదోషమును విచారింపఁడయ్యెనని యు నయానయములెఱుఁగఁడనియుఁ' జెప్పితివి. కుంభకర్ణా! రాజునకు నయానయములు తెలియకపోలేదు. నీవు పసితనమువలనఁ గేవలము దిట్టఁడవై యిట్లు చెప్పఁగోరుచున్నావుగాని శాస్త్రజ్ఞానముచేతఁగాదు. రాక్షసతిలకుఁడు రావణుఁడు వివిక్తాదిమంత్రములకుఁ దగిన దేశమును కాలమును, తగనిదేశమును కాలమును, వేఱువేఱ తెలిసికొనినవాఁడు గావున తనకును శత్రువులకును గలవృద్ధిని క్షయమును సమత్వమును చక్కఁగా నెఱుఁగును. కాన యతఁడు దేశకాలవిభాగాదులు తెలియనివాఁ డన్నది యుక్తము గాదు. కేవల శౌర్యమునుమాత్రమే యవలంబించి, యల్పమగు బుద్ధిగలిగి, పెద్దలను సేవింపనట్టి కుత్సితునికిని జేయరానటువంటికార్యమును బండితుఁ డెవ్వఁడు చేయును? ఎవ్వఁడును జేయఁడే. ఇఁక రావణుఁడు చేయఁడని చెప్ప నేల? నీవు ధర్మార్థకామముల కొక్కొకటికిని వేఱువేఱ ఫలములు నియముగాఁగలవనియు, ధర్మమునకు మంచిఫలమును అధర్మమునకు చెడుఫలమును నియతముగాన సీత నపహరించినయధర్మమున కిట్టిఫలము గలిగెననియుఁ జెప్పుచున్నావే. ధర్మార్థకామములకు వేఱువేఱ యయ్యెఫలమే నియతమని కలరూపునఁ దెలియుటకు, నీకుఁ బ్రమాణ మేమియున్నది?

---

* ఇందులకు 'రమస్వకామం పిబచాగ్ర్యవారుణీం । కురుష్వకృత్యాని వినీయ తాంజ్వరః । మయాద్యరామేగమితేయమక్షయం । చిరాయసీతా వశగాభవిష్యతి' అనిమూలము. అర్థాంతరము— 'రమస్వ-పిబ-కురుష్వ' ఇత్యాదులందు కాకువు. 'గమితేయమక్షయం' అనుచో 'గమితా+ఇయం+అక్షయం' అనిభేదము. (రామేవిషయే) రామునివిషయమున, (అక్షయంగమితా) ఎప్పుడును పొందింపఁబడిన—రామునితోఁ గూర్పఁబడిన (ఇయంసీతా) ఈసీత, రామునికి చిరకాలము వశమైయుండునని భావము. గోవిందరాజులు.

*ఏమియు లేదుగదా. స్వర్గనరకరూపము లగునవ్యక్తఫలములకును కర్మములే సాధనములు; కాని యీకర్మసమూహములో పుణ్యకర్మములకే మంచిఫలమనియు పాపకర్మములకే చెడుఫలమనియు లేదు. మిక్కిలి పాపకర్మములకుఁగూడ మంచియే ఫల మగుచున్నది. ధర్మమును అర్థమును, అధర్మమును అనర్థమును ఈ నాలుగును శ్రేయస్సునే కలిగించునవి. అయినను అందు అధర్మమునకును అనర్థమునకును ఒకానొకప్పుడు సెబ్బరము ఫలమగుట కలదు కాన యీరెంటికి మంచియు సెబ్బరయు రెండును ఫలము లగునేకాని సెబ్బరయే ఫలమని చెప్పుట సరిగాదు. ధర్మాధర్మములకు ఫలనియమము లేదు యటుండనీ. పురుషులు ఇహలోకమున కుపయోగించు విహితకర్మమును పరలోకమున కుపయోగించు విహితకర్మమును జేయుచున్నారు; వానివలని ఫలములను ననుభవించుచున్నారు. అట్లు విహితకర్మములను జేయక తనయిచ్ఛ (కామము) చొప్పున కర్మము లాచరించువాఁడును మంగళకరములగు కర్మఫలములను బొందుచున్నాఁడు. కనుక విహితకర్మమే శుభప్రదమనియు నిషిద్ధకర్మమట్టిది గాదనియు నియమము లేనందునఁ గామమునకును ఫలనియతి గానరాదు. ఇట్లు ధర్మాదులకు ఫలనియమము లేక సర్వమునకును సర్వమును ఫలమైయుండు మతముంబట్టి, మనరాజు, కామము సేవించువాఁడును సుఖమును బొందవచ్చునని, సీత నపహరించిన యీకార్యము మనస్సునఁ జక్కఁగా నాలోచించియే చేసెను. కాన మేమును అది చేయఁదగినదే యని సమ్మతించితిమి. కాన శత్రువువిషయమై యాలోచింపక సాహసించి చేసినదేమున్నది చూపుము. రావణుఁ డాలోచింపక చేసెననుట యటుండనీ. నీవొక్కఁడవే యసహాయుఁడవై యుద్ధమునకు వెడలెదనని యందులకుఁ గారణములుగా పరాక్రమాదుల ముచ్చటించితివే. ఆపక్షమునందుఁగూడ అయుక్తమును అహితము నగుదానిని చెప్పెదను వినుము. ఎవ్వఁడు మున్ను జనస్థానమునందు మహాబలవంతు లగురాక్షసులను బెక్కండ్ర వధించెనో, యట్టిరాముని నీ వొక్కఁడవే యెట్లు జయింపఁగలవు? కాన నీమాట అయుక్తము. మునుపు, ఆరామునిచే జనస్థానమున మహాతేజులయిన యేరాక్షసులు జయింపఁబడిరో యాజాతివారందఱును నిప్పటికిని రాముని పేరు చెప్పినను భయపడుచుండుట చూచెదవు. కాన నీమాట యహితమునగును.

---

* అనఁగా సుఖఫలప్రదములయిన యాగాదిధర్మముల ననుష్ఠించునపుడు అప్పటికి శరీరాయాసమూలమున దుఃఖము కలుగుట తెలియుచున్నది. కాన యిట ధర్మమున దుఃఖము గలుగుచున్నది. దుఃఖజనకములైన పరద్రవ్యాపహరణాదులగునధర్మములను జేయునపుడు, అప్పటికి సుఖమును దోఁచుచున్నది. కావ, అధర్మమున సుఖముగలుగుచున్నది. ఇట్లే అర్థమునందును కామమునందును సుఖమును దుఃఖమును గనఁబడుచున్నవి. ఇట్లు ఒక్కొక్కకర్మమునకు ఫలమిదియని నియతముగాకుండుటంబట్టి యీకర్మమునకు నిదిఫలమని చెప్పుటకు ప్రమాణము గానరాదు. కాఁబట్టి ధర్మమునకు మంచిఫలమనియు అధర్మమునకు చెడ్డఫలమనియు నియతిచెప్పుట యొప్పదు. రావణుఁడు చేసిన యధర్మమున కిది ఫలమనుట యుక్తముగాదని భావము.

దశరథకుమారుఁడగునారామునిని మిక్కిలియు క్రుద్ధమైయున్న సింహమని తెలియక, నిదురించిన సర్పమును లేపునట్లు, నీపయికి పురికొలుపఁ గోరుచున్నావు. ఎప్పుడును దివ్యతేజంబున వెలుంగుచుఁ గోపంబుగొన్నపుడు నెట్టివారికిని జెనకరానివాఁడై, మృత్యువుంబోలె సైఁప నలవిగానిపరాక్రమము గలయారాముని నెవ్వఁడు దారసింపనేర్చును? మనశత్రుండగురాముని యెదుట నిలుచుటకు, ఈ మనరాక్షసబలమంతయు ప్రాణసంశయమును నొందుచున్నది. ఇట్లుండఁగా ఒక్కఁడ వానియెదుటికిఁ బోవుట నాకెంతమాత్రము నిష్టముగాదు. తనబలము కొఱఁతపడుచుండునపుడు, బలము పయిపయి పెరుఁగుచున్న పగవానిని నెదిర్చినయెడల తనప్రాణములే పోవునని నిశ్చయము గలిగియుండియు, అట్టిపగవానిని అల్పునిగాఁగొని సరకుసేయక యెవ్వఁడు దలపడి గెలువఁగోరును? *ఎవ్వఁడును గోరఁడు. కాన నీప్రాణములు విడువ నిశ్చయించితివేని రామునితో యుద్ధమునకుఁ బొమ్ము. రాక్షసోత్తమా! మనుష్యులందు తనకెవ్వరు సాటిలేక, మఱి దేవతలలో నింద్రునికిని సూర్యునికిని సాటియగు మేటియై, యొప్పు నా రామునితో యుద్ధము సేసెదనని యెట్లు సెప్పెదవు? చెప్ప నేరముగాని దానిని జేయుట యెట్లు?" అనెను. మహోదరుఁ డిట్లు సంరంభించి కుంభకర్ణునకుం జెప్పి యంత రాక్షసమధ్యమున లోకరావణుఁ డగురావణునిం జూచి 'నీవేమో సీతను బొందియు మరల నెందులకు.పలువిధముల మాటలాడుచున్నావు. నీ వెప్పుడు గోరుదువో యప్పుడే సీత నీకు వశురాలగును.రాక్షసేశ్వరా! సీత తానే నీయొద్దకు వచ్చుటకు నొకయుపాయము నేను గనుఁగొంటిని. నీకది ప్రియమేని నీసొంతబుద్ధితో వినుము. పరబుద్ధిమాత్ర మనుసరింపకుము. 'ఆ యుపాయ మేది' యందువా? నేనును ద్విజిహ్వుఁడును, సంహ్రాదియు, కుంభకర్ణుఁడును, వితర్దనుఁడును, మే మయిదుగురమును, రాముని వధించుటకై పోవలయునని చాటింపుము. అంత మేము పోయి కష్టపడి రామునితో యుద్ధము గావించెదము. మేము నీశత్రువులగు నా రామలక్ష్మణులను జయింతుమేని, యప్పుడు మన కుపాయములతోఁ బని యేమియు లేదు. మేము యుద్ధము చేసినను శత్రు వగురాముఁడు దుర్జయుఁడై జీవించియుండునేని, యపుడు మేము మనస్సునం దిపు డాలోచించినది గావించెదము. మేము, రాముఁడు బాణములచే మాదేహమునంతయు భేదించినట్లు చేసికొని, నెత్తుటం దోఁగి, రామునితో యుద్ధము సేసితిమని సీత నమ్ముటకై రామనామములు చెక్కినవాఁడిబాణములతోఁ గూడ యుద్ధమునుండి యిచటికి వచ్చెదము. మే మట్లువచ్చి 'రామునిని లక్ష్మణునిని భక్షించివైచితిమి' అని చెప్పుచు నీపాదములకు నమస్కరించెదము. అప్పుడు నీవు మాకోర్కియంతయు నిండింపవలయును. రాజా! అటుపిమ్మట

* కుంభకర్ణుఁడు 'రావణుఁ డాలోచింపక సీతనపహరించి తెచ్చెననియు తానొక్కఁడే యుద్ధమునకుఁబోయి రామాదులను జంపెదననియు జెప్పిన యీరెండుపక్షములను మహోదరుఁడు ఖండించుట తెలియునది.

నీవు, ఒకని నేనుంగుపై నెక్కించి 'రాముఁడును లక్ష్మణుఁడును వానరులును హతులయిరి' అని పట్టణమంతటను జాటింపుము. అరిందమా! నీ వంత సంతోషించినట్లు, భృత్యులకు యథేష్టముగా భోగ్యపదార్థములను దాసదాసీపరివారమును, తక్కిన కామితపదార్థములను బంగారమును నిప్పింపుము. అంత నీవు వీరభటులకు పుష్పమాలికలను వస్త్రములను మైపూఁతలను పేయమును మిక్కిలియు నిప్పింపుము. నీవును ముదితుఁడవై త్రాగుము. అంత 'రాక్షసులు రామునిని అతని సుహృదులను భక్షించిరి' అనెడి యీవదంతి, యెందుకొని పట్టణమంతటను వ్యాపించి ప్రసిద్ధిగాంచినపిదప, నీవు సీతయొద్దకుఁబోయి, ఆబిడకు రామవియోగమువలనఁ గలిగిన శోకమును దీర్చి 'నన్నేలుకొమ్ము' అని యేకాంతమున మంచిమాటలాడి, ధనధాన్యములను కోరిన మేలిపదార్థములను నొసంగి యాబిడ కాస గలిగింపుము. రాజా! ఈ కపటోపాయమువలన సీతకు భయమును దుఃఖమును బుట్టుటచే మునుపు నిన్నొల్లకుండినదయ్యును, నాథుఁడు లేమింజేసి, నీకు వశురాలగును. ఆబిడ, రమణీయరూపుఁడయిన తనభర్త రాముఁడు మృతిఁబొందెనని యెఱిఁగి యిఁక వేఱ యాశ లేకపోవుటవలనను, స్త్రీలకు స్వాభావికమగు చాపలమువలనను, నీకు వశమగును. ఆచెలువ మున్ను సుఖముగాఁ బెరిఁగినదిగాన సుఖములకే తగినది; కనుక దుఃఖములం గృశించి పడలేక యిఁకఁ దాను సుఖపడుట నీవలననే కలుగవలయునని తెలిసి యన్నివిధముల నిన్నాశ్రయించును. ఈ యుపాయము నేను నాబుద్ధిచేతనే చక్కఁగా నాలోచించి నిర్ణయించితిని. నీవు రామునికంటఁబొరిని బడితివేని యనర్థమేకలుగును. ఇచ్చట నీ యుపాయమునసే నీకోర్కి సిద్ధింపఁగలదు. కాన యుద్ధమునకై తుకతుకవలదు. యుద్ధము సేయక యుండుటచే (ఆసనబలముచే) గలుగుసుఖము మిక్కిలి హెచ్చుగానున్నది. రాజా! రాజయినవాఁడు, నేను జెప్పినట్లుచేసి, సైన్యమును నశింపక, తానును బ్రాణసందేహము నొందక, యుద్ధము సేయకయే శత్రువులను జయించునేని, బహుకాలము కీర్తిని, పుణ్యఫలమగు మహాసుఖమును, మంచిప్రియురాలిం బడయుటవలని సంపదను, మనఃప్రసాదమును బొందియుండును" అనిచెప్పెను. ఇది యఱువదినాలుగవసర్గము.

---

## కుంభకర్ణుఁడు యుద్ధమునకు వెడలుట.

మహోదరుఁ డిట్లుచెప్పఁగా కుంభకర్ణుఁ 'డిఁక నిట్టిమాటలు చెప్పవలదు. భద్ర'మని యతనిని బెదరించి, యంత రాక్షసోత్తముఁడగు తనయన్నను రావణునింజూచి 'నాపరాక్రమము దెలిసినదే కదా! అట్టినేను, దురాత్ముఁడగు నారాము నిదిగోవధించి, నీ కిప్పుడు గలిగియున్న బెడిదపుభయమును బోఁగొట్టెదను. నీవు వైరము లేకసుఖము గానుండుము. శూరులగువారు, నీరు లేని మబ్బులవలె, కార్యములులేక యూ

రక గర్జింపరు. నేను, యుద్ధంబునఁ దగునట్లు కార్యము చేసి నాగర్జనమును గావించెదను జూడుము. నేను గర్జించినట్లె నాకార్యముండును. శూరులు, వీరులు తమ్ముఁ గుఱించి యాడెడి యవమానోక్తుల నెంతమాత్రము సహింపరు; తమ్ముఁ దామె పొగడుకొనరు; కాని తమపౌరుషమును మాటలచే వెలిపుచ్చి చూపక, యితరులకుఁ జేయనలవిగాని కార్యములనుగూడఁ జేయుదురు. మహోదరా! పిఱికివాండ్రును బుద్ధిహీనులునై తమ్ముఁ దాము పండితు లనుకొనెడి నీయట్టివారిమాటలను వినుటచే రాజీయాపదను బొందినాఁడు. యుద్ధమన్న వెనుదీయుచుండుమీరు రాజున కెల్లప్పుడు నిచ్చకములాడుచు, అతఁడు పోయినదారినెల్లఁ బోవుచుండి, యింతకు ముగించు నీకార్యమును గలిగించినారు. మీ రీరాజును, పయికి మిత్రుఁడని చెప్పుకొన్నను నిజమునకు మీకు * శత్రువుగాఁ గొనియున్నవారుగాన యీరాజుం జేరి యితనిపోయినపోకలెల్లం బోవుచు మీరు, లంకయందు రాజొకఁడు మాత్రమే మిగులునట్లు చేసితిరి. బొక్కసమంతయు నాశము సేసితిరి. సైన్యమునంతయు హతము గావించితిరి. మీరు గావించినదుర్నయమునంతయు నీ యుద్ధమున సరిపెట్టుటకై శత్రువులను జయింప నుద్యమించి యిదె యుద్ధభూమి కిపుడే పోవుచున్నాను' అనెను. బుద్ధిమంతుఁడగు కుంభకర్ణుఁ డిట్లు చెప్పినమాటనువిని, యంత రావణుఁడు పకపక నవ్వుచు, 'నాయనా! నీవు యుద్ధమునం దాఱితేఱినదిట్టవు. ఈ మహోదరుఁడు రామునివలన భయపడియున్నాఁడు. సందేహము లేదు. కావుననే యుద్ధము నొల్లకున్నాఁడు. కుంభకర్ణా! నాకు నీయంతటిసుహృదుఁడును బలవంతుఁడును ఎవ్వఁడును లేఁడు. శత్రువుల వధింపఁ బొమ్ము. పోయి జయమునొందుము. అట్లు నీ వసమానుఁడవు కావుననే, నాభయమును బోఁగొట్టుదువని నిను నిదుర లేపితిని. అరిందమా! నామేలుగోరుసుహృదులగు రాక్షసులు పోయియుద్ధము సేయుట కిది యొకాలము చుమీ. కాఁబట్టి, నీవు శూలము కేలం దాల్చి పాశంబు దాల్చినయంతకునివలెఁ జూపట్టుచుఁ బొమ్ము. సూర్యునింబోలు తేజంబున దుర్ధర్షుఁడవై, వానరులను రామలక్ష్మణులను భక్షింపుము. నీరూపమును జూచినంతనే వానరులందఱు భయపడి పాఱిపోవుదురు. రామలక్ష్మణులకును గుండెలు పగులును' అనెను. మహారాజగు నారాక్షసపుంగవుఁడు రావణుఁ డిట్లు మహాబలుండగు కుంభకర్ణునితోఁ జెప్పి, యతఁడు జయించు నను నమ్మికవలన తాను మరలఁ గ్రొత్తగాఁ బుట్టినట్లు తలంచెను. రావణుఁడు కుంభకర్ణుని బలమును పరాక్రమమును జక్కఁగా నెఱింగినవాఁడుగావున, సంతుష్టుఁడై కలంకము లేనిచంద్రునివలె నొప్పుచుండెను. రావణుఁ డిట్లు చెప్పఁగా మహాబలుం డగుకుంభకర్ణుఁడు మిక్కిలియు సంతుష్టుఁడై యుద్ధమునకుఁ బోవ నుద్యుక్తుఁడయ్యెను. కుంభకర్ణుఁడు రాజగురావణుఁడు చెప్పినదివిని, యుద్ధమునకుఁ బోవ నుద్యమించి పగవారి రూపుమాపం జాలిన వాఁడిశూలమును వేగ

* అకార్యమందు ప్రవర్తించినరాజు ఎవరిచేత వారింపఁబడఁడో వారి కతఁడు శత్రుఁడను నభిప్రాయమున నిట శత్రుఁ డనఁబడినది.

గయికొన్నవాఁడయ్యెను. ఆశూలము కేవల మినుముతో చేయఁబడినదై తలతల మెఱయుచు, మేలిబంగారముచే నలంకృతమై, దేవేంద్రునివజ్రమునకు సాటియై, బెడిదమునయి వజ్రమువలె మిగులఁ బెనుపుగలిగియుండెను. అది దేవతలను దానవులను గంధర్వులను యక్షులను కిన్నరులను బెక్కండ్ర రూపుమాపియున్నట్టిది. మఱియు నది యెఱ్ఱనిపూదండలుగలిగి మిక్కుటమయిన తేజమున రాజిలుచు, తనంతటనే నిప్పుకలు గ్రక్కుచుండెను. మహాతేజుండగు కుంభకర్ణుఁడు శత్రురక్తముచే రంజితమై యున్నయావాఁడిశూలమునుగొని రావణునిఁ జూచి 'నేనొక్కఁడనే పోయెదను. నాసేన యిచ్చటనే యుండుఁగాక. ఇపుడుపోయి నన్నుఁజూచి కలగుండుపడియున్న వానరులనందఱను గ్రుద్ధుండనై పట్టి భక్షించెదను' అనెను. కుంభకర్ణుఁడు చెప్పినది విని రావణుఁడతనితో 'ఒంటిపోవలదు. శూలములను ముద్గరములను ధరించియున్న సేనలు బలసి రాయుద్ధమునకుఁ బొమ్ము. ఏలన వానరులు మహాబుద్ధిమంతులు, వేగవంతులు, దృఢనిశ్చయులు; కావున నొంటరిగానున్ననుగాని యేమఱియున్ననుగాని, దంతములచే రూపుమాపుదురు. అందువలన, మిక్కిలియు బెదిరింప నలవిగానిబలవంతు లగుసైనికులం గూడిపొమ్ము. రాక్షసులకు శత్రుపక్షములోనివారినందఱను రూపుమాపుము' అనెను. అంత మహాతేజుండగు రావణుండు, సింహాసనమునుండి దిగ్గన లేచి నడుమనడుము రత్నములు గ్రుచ్చంబడియున్న బంగారుమాలికను కుంభకర్ణునిమేనఁ గట్టెను. మఱియు నతఁడు మహాత్ముఁడగు కుంభకర్ణునికి బాహుపురులును, ఉంగరములును, ఉత్తమములగు నాభరణములును, చంద్రబింబమునంటి ముత్తెపుహారమును దొడిగెను. మంచివాసనలు గుబాళించు దివ్యములగు పుష్పమాలికలను నతనికి నొసఁగెను. మఱియు నతనిచెవులకు కాంతి దళుక్కుత్తుచున్న కుండలములను దక్కంగలయాభరణములను దొడిగెను. పెద్దకర్ణముగల కుంభకర్ణుఁడు, బంగారుబాహుపురులును సందిటిపురులును మంచినాయకపతకమును నాభరణములను ధరించియుండుటవలన చక్కఁగా వేల్వఁబడినయగ్నిహోత్రునిభంగిఁ దేజరిల్లెను. అతఁడు నీలమణులు దాపఁబడిన గొప్పవెంలత్రాఁడు దాల్చియుండుటచే అమృతము చిలుకుటకై వాసుకిని జుట్టినమందరపర్వతమువలెఁ బ్రకాశించెను. అతఁడు ఆయుధాదులప్రహారములు దగిలినను జెడక దృఢమై పెక్కుబారువులు తూఁగునదై, ఛిద్రములేక దట్టమై, మెఱుపువలె మెఱయుచు నిజకాంతిచే వెలుంగుచునున్న బంగారుకవచమును ధరింపఁగా, సంధ్యాకాలమేఘముచేఁ గప్పఁబడిన హిమవత్పర్వతమువలెఁ బ్రకాశించెను. సమస్తావయవములందును నయ్యయాభరణముల నన్నింటినిందాల్చి శూలము కేలంబూనియున్న యాకుంభకర్ణుఁడు, త్రివిక్రమముల కుత్సహించిన నారాయణునిభంగి వెలుంగుచుండెను. మహాబలుఁ డాకుంభకర్ణుఁడు, అన్నయగు రావణునిఁ గౌఁగిలించుకొని యాతనిచుట్టును బ్రదక్షిణముసేసి శిరసు నేలసోఁక నమస్కరించి యుద్ధమునకుఁ దర

లెను. మిక్కిలి పెనుకాయముమీఱి మహాధ్వనిగలుగునట్లుగా, బలవంతుఁడు కుంభకర్ణుఁడు వెడలునపుడు, అతనిని రావణుఁడు మేలయినయాశీర్వాదములతోఁ బంపెను. రాక్షసరథికులు పెక్కండ్రు శంఖభేరీధ్వనులు సెలఁగ, నుత్తమాయుధములను దాల్చియున్న సైన్యములతోను, ఏనుఁగులతోను, గుఱ్ఱములతోను, మేఘమువలె ధ్వనించు రథములతోను, మహాత్ముఁడును రథికోత్తముఁడు నగుకుంభకర్ణుని వెంబడించిపోయిరి. రాక్షసులు సర్పములను ఒంటెలను గాడిదలను గుఱ్ఱములను సింహములను ఏనుఁగులను మృగములను పక్షులను నెక్కి, భయంకరుండును మహాబలుండునగు కుంభకర్ణునివెంటఁ బోయిరి. దేవదానవులకు శత్రుండగు నాకుంభకర్ణుఁడు, పౌరులు పుష్పవర్షములు గురియుచుండఁగా, ఛత్రమును దాల్చి, వాఁడిశూలము కేలంగొని, స్వభావముననే మిక్కుటపు మత్తుగలవాఁడయ్యు, నెత్తురుద్రావుటచేతను నెత్తుటి వాసనచేతను మఱియుం గైపునొంది బయలువెడలెను. మహాబలవంతులును భయంకరాకారులునై బెడిదంపుఁగన్నులుగలిగి శస్త్రములుం దాల్చి యెఱ్ఱనికన్నులతోను మిక్కిలి పెనుకాయములతోను నల్లనికాటుకరాసులవలెఁ బొడకట్టుచున్న కాలుబంట్లు పెక్కండ్రురాక్షసులు శూలములను వాఁడిఖడ్గములను పరశ్వథములను పెక్కుబారల నిడివి గలపరిఘములను గదలను ముసలములను దారసింపరానట్లు పిసరివైవంబడు పెనుతాటిబోదియలనుంగొని మహాధ్వనిగలుగ కుంభకర్ణువెంట నడిచిరి. మహాతేజుంపును బలవంతుండునగు కుంభకర్ణుఁడు, అంత భయంకరమై గగుర్పుఁబుట్టించు మఱియొకరూపముదాల్చి యుద్ధమునకుఁ బోయెను. ఆ కుంభకర్ణుఁడు, నూఱు విండ్లపట్టు వెడలుపును, ఆఱువందలవిండ్లపట్టు పొడవును బండిచక్రములంతటికన్నులునుం గలిగి భయంకరాకారుఁడై మహాపర్వతమువలె నొడ్డును బొడవునై, కాలినపర్వతమువలె నల్లనిపెనుశరీరముచూపట్ట, తనవెంబడి వచ్చురాక్షసులను సమీపించి, తన పెద్దనోరువిచ్చి పకపకనవ్వి 'అగ్ని మిడుతలను దహించునట్లు, నే నిదిగో యిపుడె క్రుద్ధుఁడనై యావానరముఖ్యయూథములను వేఱువేఱ రూపుమాపఁగలను; కాని యడవులం దిరుగుచుండునావానరులు నా కేవిధమయిన యపరాధమును జేయలేదు. మఱియు నా వానరజాతి మావంటి క్రీడాపరులకు పట్టణోద్యానభూషణముగానున్నది. కాఁబట్టి వారలనుజంపుటకుఁ బని లేదు. *ఇప్పుడు మనపట్టణము ముట్టడికి మూలము రాముఁడును లక్ష్మణుఁడును. వారలను జంపఁగా సర్వమును

* 'పురరోధస్యమూలంతు రాఘవస్సహలక్ష్మణః। హతేతస్మిన్ హతంసర్వం తంవధిష్యామి సంయుగే' అనిమూలము. వాస్తవార్థము.— (పురరోధస్యమూలం సలక్ష్మణోరాఘవఃఖలు) పట్టణము ముట్టడికి మూలము రాముఁడును లక్ష్మణుఁడునుఁ గదా. అతఁ డట్లుండనీ. (యేన) ఎవ్వనిచేత (సర్వం) (అస్మదీయం) అనిశేషము. నాసమస్తమును, (హతం) హతమో, (తం సంయుగేవధిష్యామి) యుద్ధమునందు వానినిజంపెదను. ఏలనఁగా (తస్మిన్ హతే) అతఁడు హతుఁడుకాఁగా (తదీయంసర్వంహతం స్యాత్) అతనిసర్వమును హతమగుచున్నదని యర్థము. మహేశ్వరతీర్థులు.

హతమగును. కావున నారాముని నే యుద్ధమునందుఁ జంపివచ్చెదను' అనెను. కుంభకర్ణుఁ డిట్లు చెప్పఁగా రాక్షసులందఱును సముద్రమును కంపింపఁజేయునట్టుంబోలె, సంతోషమున మిక్కిలియు భయంకరమయినధ్వని గావించిరి. బుద్ధిమంతుఁ డాకుంభకర్ణుఁడు వేగ యుద్ధమునకుఁబోవుచుండఁగా, అప్పుడు, భయంకరరూపములయిన యశుభనిమిత్తము లతనికి నలుగడలఁ జూపట్టినవి. మేఘములు, ఉల్కలతోను బిడుగులతో నుంగూడి గాడిదలవలె స్పష్టముఁగానియెఱుపువన్నెగలిగి యుండినవి. భూమియు సముద్రములతోను వనములతో నుంగూడ గడగడవడంకినది. నక్కలుభయంకరాకారములై నోటమంటలు గ్రక్కుచు నఱచినవి. పక్షులు అపసవ్యమండలాకారంబులను దిరిగి కట్టినవి. ఆకుంభకర్ణుఁడు పోవుచుండఁగా మార్గమున గ్రద్దలు మాలికవలె బారుగట్టి యతనిపయి వ్రాలినవి. అతనియెడమకన్నునదరెను;ఎడమబాహువును వడఁకినది. అప్పుడు ఉల్కయొకటి జ్వలించుచు భయంకరధ్వనితో నాకసమునుండి పడెను. సూర్యుఁడు కాంతిహీనుండయ్యె. వాయువు సుఖముగావీవదయ్యె. కుంభకర్ణుఁడు కాలబలప్రేరితుండగుటవలన, మిక్కిలియు గగురు పుట్టించునట్టియామహోత్పాతములు దోఁచినను సరకుసేయక యుద్ధమునకుం బోయెను. అతఁడు పర్వతమంతటివాఁడుగనుక పాదములచేతనే ప్రాకారమునుదాఁటి మహామేఘసమూహమువలెఁ గనుపట్టుచు నద్భుతమై యున్నవానరసైన్యమును జూచెను. అప్పు డావానరులు పర్వతాకారుఁడగు నారాక్షసశ్రేష్ఠునింజూచి భయముగొని గాలిచేఁ గొట్టఁబడినమేఘములవలె నల్దిక్కులకుం బాఱిపోయిరి. మేఘసమానుం డగునాకుంభకర్ణుఁడు,మిక్కిలి ప్రచండమయిన యవ్వానరసేన భిన్నమగు మేఘసమూహమువలె దశదిశలకుం బాఱుటనుజూచి సంతోషముపట్టక మేఘమువలె మాటికి సింహనాదము గావించెను. ఆకసమునందు మేఘ మురిమినట్లు భయంకరమైన యతని పెడబొబ్బను విని, వానరులనేకులు, వేళ్లు నఱుకంబడిన సాలవృక్షములవలె నేలంబడిరి. మహాబలవంతుఁడగు నాకుంభకర్ణుఁడు విశాలమగుపరిఘము కేలం బూని, వానరసమూహమునకు మిక్కిలియుఁ దీవ్రమయినభయమును బుట్టించుచు, ప్రలయకాలమున, పనియేమిసేయుదునని సచేతనమై కొలువు దండాయుధముతోఁగూడిన యమునివలె, భయంకరాకారుఁడై పగవారి నాశము సేయుటకు వెడలిపోయెను. ఇది యఱువదియైదవసర్గము.



కుంభకర్ణుఁడు వానరులతో యుద్ధముసేయ నారంభించుట;
భయంబునం బరుగెత్తుచున్న వానరుల
నంగదుండు నిలువరించుట.

భూమికిం బోయెను. అతఁడు సముద్రము మాఱుమ్రోఁగునట్లును, పిడుగులు పడం జేయునట్లును, పర్వతములను పగుల్చునట్లును, మహాధ్వనిగా సింహనాదము సేసెను. ఇంద్రునకుఁగాని యమునకుఁగాని వరుణునకుఁగాని వధింప నలవిగానివాఁడై భయంకరములగు కన్నులతో వచ్చుచున్న యా కుంభకర్ణునింజూచి వానరులు భయమునం బరుగులువాఱిరి. వాలిపుత్త్రుం డగునంగదుఁడు, వానరవీరు లట్లు పాఱుచుండుటనుజూచి,నలునిని, నీలునిని, గవాక్షుని, మహాబలుండగు కుముదునినిఁ జూచి 'మీరిపుడు మీస్వరూపమును, పరాక్రమములను, ప్రశస్తములగు కులములనును మఱచి, క్షుద్రులయిన వానరులవలె భయమున బెదరి యెటపోయెదరు? సౌమ్యులారా! బాగు బాగు. మరలుఁడు. ప్రాణములను రక్షించుకొనవలేమి! ఈరాక్షసుఁడు యుద్ధమున కయినవాఁడు గాఁడు. ఇది మనకు భయము పుట్టించుటకై రచింపఁబడిన పురుషాకారమగు నొకపెద్దవెఱబొమ్మ. వానరులారా! రాక్షసులు మనకు భయము గలిగించుటకై యెత్తికొనివచ్చిన యీ పెనువెఱబొమ్మను మనము పరాక్రమమున ధ్వంసము సేయుదము. మఱలుఁడు' అనెను. వానరు లంత నతికష్టమున నూఱట నొంది యందఱును నంతంతఁ జేరి, వృక్షములను బర్వతములనుం గయికొని యుద్ధభూమికిం బోయిరి. ఆవానరు లట్లు మరలి యుద్ధభూమికివచ్చి, మిక్కిలియు క్రుద్ధులై, యెంతయుఁ గుపితములయిన మదగజములవలె నుక్కుమిగిలి కుంభకర్ణునిఁ బ్రహరించిరి. మహాబలుండగు కుంభకర్ణుఁడు ఉన్నతములగు పర్వతశిఖరములచేతను, శిలలచేతను, కొనలు పుష్పించియున్న వృక్షములచేతను, ఎంత కొట్టఁబడుచున్నను చలించినవాఁడుగాఁడు. శిలలును, కొనలం బుష్పితములైయున్న వృక్షములును, ఆకుంభకర్ణుని మేనందగిలి నూఱుపఱియలుగా పగిలి నేలంబడినవి. కార్చిచ్చు మిక్కిలియు రేఁగి వనములం గాల్చునట్లు, ఆకుంభకర్ణుఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై మహాతేజములగు నవ్వానరసైన్యములను నెంతయుఁ బూనికతో దహింప నారంభించెను. వానరసింహులు పెక్కండ్రు కుంభకర్ణునిచేఁ జిమ్మివైపంబడి దేహమంతయు నెత్తురు వెల్లువలుగా నేలంబడి యెఱ్ఱని పువ్వులుగల వృక్షములవలె నొప్పచుండిరి. వానరులు కొందఱు వెనుకకుఁ దిరిగి చూడక యొకరిపై నొకరు దాఁట్లువైచుచు పరుగులువాఱిరి. బలవంతుఁ డగునారాక్షసుఁడు కుంభకర్ణుఁడు చంపుచుండఁగా, ఆవానరవీరు లోర్వంజాలక కొందఱు సముద్రమునం బడిరి. కొంద ఱాకాశమున కెగసిరి. ఆవానరులు మున్ను తాము సముద్రమును దాఁటివచ్చిన సేతుమార్గముంబట్టి పరుగెత్తిరి. వారు భయమున మొగములు వెలవెలంబోవఁ గొందఱు మిట్టభూములకును గొందఱు పల్లములకును బరుగెత్తిరి. భల్లూకములు గొన్ని వృక్షముల నాశ్రయించినవి.కొన్ని పర్వతముల కుఱికినవి. కొన్ని సముద్రమునం బడి మునింగినవి. కొన్ని గుహలనాశ్రయించినవి. కొందఱు వానరులు నేలంబడినవారివలె నుండిరి. కొందఱు వానరులు కాలునిలువక యే పాఱిరి. (కొందఱు నేలంబడిరి. కొందఱు మూర్ఛనొంది చచ్చినట్లు పడియుండిరి) అంగదుఁడు అట్లు

భంగమునొంది పాఱుచున్న వానరులనుజూచి 'వానరులారా! నిలువుఁడు. పరుగెత్త వలదు. యుద్ధము గావింతము. మఱలుఁడు. మీరు భంగమునొంది యిటనుండి పరుగెత్తి భూమియంతయు చుట్టితిరిగినను మీకుండుటకు చోటు దొరకదని నాకుఁ దోఁచుచున్నది. కాన యందఱును మరలుఁడు. ప్రాణములను తృణీకరింపక రక్షించుకొనెదరా యేమి? వానరులారా! మీ రెదురులేని పరాక్రమముగలవారలు. మీరలాయుధము విడిచి, పరుగెత్తుదురేని, మీభార్యలే మిమ్ము నెగతాళి సేయుదురు. మానముగా బ్రతుకుపౌరుషశాలురకు నది మరణముగదా. మనమందఱును జ్ఞాతిపరంపరలు విస్తరించియున్నవియు గొప్పవియునగు కులములందుఁ బుట్టినాము. అట్లుండఁగా క్షుద్రవానరులవలె మీరు భయమున బెదరి యెటపోవుచున్నారు? భయమునఁ బరాక్రమము దిగవిడిచి పరుగులెత్తుచున్నారు గావున మీరు అపూజ్యులే యగుదురు. మీరలు మున్నపుడు జనసమూహములలో మే మట్టివార మిట్టివార మని పలువిధముల నాత్మస్తుతులు సేసికొంటిరే. చెప్పరములై గుప్పఁగూరగానున్న యవి యన్నియు నిపు డెచ్చటికిఁ బోయినవి? ఎవఁడు పరాజితుఁడై ప్రాణములు పెట్టుకొని యుండునో వానిని పిఱికివాఁడని పెక్కువిధముల జను లాడుకొందురు. సత్పురుషులు సేవించు శూరమార్గము నవలంబింపుఁడు. భయము వదలుఁడు. వానరులారా! మనము తప్పించుకొని పాఱిపోయినను ఆయు వల్పమేకాన బహుకాలము బ్రతికియుండఁ బోవుటలేదు. కాన యుద్ధమున ధైర్యముతోనిలిచి హతులమై నేలంబడుదము. యుద్ధమున హతులగుటంబట్టి, యెట్టివారికిఁ బొందనలవిగాని బ్రహ్మలోకము నేని బొందుదము. శత్రువును యుద్ధంబునఁజంపి కీర్తియేనిం బొందుదము. కాన బ్రహ్మలోకమునకు వెలగా మనయసువును విడిచిపుత్తము. మండుచున్ననిప్పును జూచి మిడుత ప్రాణముతోఁ బోజాలనట్లు, కుంభకర్ణుడు రామునింజూచి ప్రాణముతో మరలి పోఁజాలఁడు. మన మింతవఱకు మంచిపేరువన్నె గనియున్నవారము. ఇట్టి మనము పెక్కండ్రు కుంభకర్ణుఁడొక్కనిచే భంగమునొంది పలాయితులమై ప్రాణములను రక్షించుకొందుమేని, మన మిన్నాళ్లు గడించిన కీర్తియంతయు నశించుచున్నది' అనెను. ఉత్సాహంబువెల్లున బంగారు సందిటి పురులువెలుంగుచున్న యాశూరుఁ డంగదుఁడిట్లుచెప్పుచుండఁగాఁ బరుగెత్తుచున్న వానరులంత తమపిఱికితనము తేటపడ, శూరులు మెచ్చనిమాటల నతనితో 'రాక్షసుఁ డీ కుంభకర్ణుఁడు భయంకరముగా మమ్ముఁ బట్టి మర్దించినాఁడు. ఇది నిలుచుటకు సమయముగాదు. కాఁబట్టి పోయెదము. మాకుఁ బ్రాణములు తీపికదా' అనిరి. ఆవానరోత్తము లింతమాత్రము చెప్పి భయంకరరూపుఁడై బెడిదంపుఁగన్నులతో నున్నకుంభకర్ణుఁడు పయిపయి వచ్చుచుండుటనుజూచి దశదిశలకుఁ బాఱిరి. అంత నంగదుఁడు భయమునం బాఱుచున్న యవ్వానరవీరులను మంచిమాటలచేతను రాముఁడు గావించిన సాలపర్వతభేదాది దృష్టాంతములను బురస్కరించిన వాక్యములచేతను, నందఱను మఱలించెను.

అట్లు బుద్ధిమంతుఁ డగునంగదుం డుత్సాహము కలిగింపఁగా, అవ్వానరయూథపతు లందఱును సుగ్రీవాదుల యాజ్ఞకు నెదురుసూచుచు యుద్ధసన్నద్ధులై యుండిరి. అంత ఋషభుఁడును, శరభుఁడును, మైందుఁడును, ధూమ్రుఁడును, నీలుఁడును, కుముదుఁడును, సుషేణుఁడును, గవాక్షుఁడును, రంభుండును, తారుండును, ద్వివిదుండును, పనసుఁడును, * హనుమంతుఁడును మొదలగువారు అతిత్వరితముగా యుద్ధాభిముఖులయి పోయిరి. ఇది యఱువదియాఱవసర్గము.

---

వానరవీరులు కుంభకర్ణునకోడుట; అంగదుఁడును పరాజయమునొందుట; సుగ్రీవుఁడు కుంభకర్ణునితో యుద్ధముసేయుట; మూర్ఛితుఁడగుసుగ్రీవునిఁ గుంభకర్ణుఁడు లంకకుఁ గొనిపోవఁగా లంకారాజవీథియందలి శైత్యోపచారములచే నతఁడు మూర్ఛదేఱి, కుంభకర్ణుని ముక్కునుఁ జెవులను గొఱికి తీసికొని మరల వానరసేనం గలియుట; కుంభకర్ణుఁడు ముక్కుసెవులు పోయినందులకు లజ్జితుఁడై కోపమున మరల యుద్ధమునకు వచ్చుట; రామ కుంభకర్ణ యుద్ధము ; రామునిచే కుంభకర్ణుఁడు హతుఁడగుట.

మహాకాయు లగునవ్వానరులు, అంగదునిమాటను విని యపుడు మరణంబునకును దెగించినబుద్ధి గలిగి యందఱును యుద్ధముఁగోరి మరలివచ్చిరి. అంగదుఁ డట్లు తగినమాటలచే నురల్చి నిలువరింపఁగా, అవ్వానరులు తమతొలిపరాక్రమముల నుగ్గడించుకొనుచు పరాక్రమము నవలంబించి, జీవించునాశ లేమిచేత మరణమునొందినను నొందుఁగాక యని నిశ్చయించి హర్షంబున మరలివచ్చి మిక్కిలి తుములమగు యుద్ధము గావించిరి. అంత మహాకాయులగు వానరవీరులు వృక్షములను మిక్కిలియు గొప్పలయిన పర్వతములను నెత్తికొని శీఘ్రంబునఁ గుంభకర్ణునిపయికిం దఱిమివచ్చిరి. మహాకాయుఁడగు నాకుంభకర్ణుఁడు వీర్యవంతుఁడుగావున మిక్కిలియు క్రుద్ధుఁడై గదనెత్తికొని, శత్రువుల నలుగడల నలంచి కలంచి నేలంగూల్చెను. కుంభకర్ణుని యొక్కొక దెబ్బకును వానరులు హింసితులై యవయవములు వికావికలై ఏడునూర్లు ఎనిమిదినూర్లు వేలునుగా నేలంగూలిరి. ఆకుంభకర్ణుఁడు మిక్కిలియుఁ గుపితుఁడై గరుడుఁడు సర్పంబులను దినునట్లు, వానరులను ఎనమండ్రను పదుగురిని పదునాల్గురను ఇరువదిమందిని

* ఇట హనుమంతుఁడు పలాయితుఁడై మరలిరాలేదు. ఋషభాదులను గలసికొని కుంభకర్ణునితో యుద్ధముసేయ మరలి వచ్చినాఁడని తెలియునది.

ముప్పదుగురినింగా జేతులంబట్టుకొని నోటవేసికొని భక్షించుచు యుద్ధరంగమున విహరించుచుండెను. అంత వానరులు నెట్టకేలకు దిటవొంది యందఱు నంతనంత నొకటిగాఁ జేరి వృక్షములను బర్వతములనుం బట్టుకొని సన్నద్ధులయి యుద్ధాగ్రముననిలిచిరి. అంత వానరసింహుఁడగు ద్వివిదుఁడు, ఒకపర్వతమును బెకలించుకొని పర్వతశిఖరమువలె మిక్కిలి పొడవయిన కుంభకర్ణునిపయి, నేలకు వ్రాలునట్లు మిక్కిలియు వంగియున్న మేఘమువలె, పయినడరెను. ద్వివిదుఁడు కుంభకర్ణునిసమీపమునకుఁబోయి యాపర్వతము నతనిపయి వైచెను. అది గుఱితప్పి మహాకాయుండగు నతనిపయింబడక యవుడతనిసేనపయిం బడెను. ఆమేటిపర్వత మాసేనయందలి గుఱ్ఱముల నేనుంగులనురథములను ప్రసిద్ధులయిన తక్కిన రాక్షసులను, జూర్ణముగావించెను. అంత నాద్వివిదుఁడు మఱియొకపర్వతశిఖరమును వైచెను. ఆపర్వతశిఖరముచేఁ గొట్టువడి గుఱ్ఱములును హతులగుటం జేసి, ఆరాక్షసయుద్ధభూమియంతట నెత్తురువెల్లువలయినవి. రాక్షసరథికులును భయంకరముగా సింహనాదములు సేయుచు ప్రళయకాలాంతకునిఁబోని బాణములేసి, గర్జించుచున్న వానరోత్తములశిరసులు వేగ తునుమాడిరి. మహాబలశాలురగు వానరులును, అప్పుడు గొప్పగొప్పవృక్షములఁ బెకలించుకొని, వానిచే రథములను నుగ్గునూచగావించి గుఱ్ఱములను ఏనుంగులను లొట్టియలనును రాక్షసులను రూపుమాపిరి. హనుమంతుఁ డాకాశగతుండై పర్వతశిఖరములను పలువిధములయిన పెక్కువృక్షములనును కుంభకర్ణునితలపయి వర్షించెను. మహాబలుండగు నాకుంభకర్ణుఁడు శూలమున నాపర్వతశిఖరములను ఛేదించి వర్షముగాఁగురియుచున్న యావృక్షములనెల్లఁ దట్టివేసెను. అంత నాకుంభకర్ణుఁడు వాఁడిశూలముంగొని యుగ్రమయిన యావానరసైన్యమును దఱుమఁగా నప్పుడు హనుమంతుఁడు పర్వతశిఖర మొకటిని బెకల్చుకొని యాతనియుందట నడ్డపడి నిలిచెను. పెద్దపర్వతమువలె భయంకరమైన కాయముగలిగి యున్న యాకుంభకర్ణుని హనుమంతుఁడు కుపితుఁడై వేగ యాపర్వతశిఖరముచేఁ గొట్టెను. ఆదెబ్బకు కుంభకర్ణుఁడు గీప్వడి మేదస్సును నెత్తురునుగాఱి దేహమంతయుఁదడియ నపుడు కొంచెముక్షోభమునొందెను. ఆకుంభకర్ణుఁడు మెఱుపువలె మెఱయుచు మండుచున్న యుగ్రశిఖరముతోఁగూడిన కొండవలె వెలుంగుచున్న శూలమును గిరగిరం ద్రిప్పి, కుమారస్వామి తనయుగ్రశక్తిచే క్రౌంచపర్వతమును ఛేదించునట్లు, హనుమంతుని వక్షస్థలమునఁ గొట్టెను. అట్లు హనుమంతుఁడు, శూలముచే విశాలమగు తనవక్షము భిన్నముకాఁగా మూర్ఛిలుచు నోట నెత్తురు గ్రక్కుచు మహాయుద్ధరంగంబున ప్రలయకాలమేఘధ్వనింబోని భయంకరరవంబున నఱచెను. అంత రాక్షససమూహములు హనుమంతుఁడు బాధితుండగుటను జూచి తోడనే పరమసంతుష్టులయి సింహనాదములు సేసిరి. వానరులందులకు వ్యథనొంది కుంభకర్ణునివలని భయంబున నార్తులై, యుద్ధమునఁ బలాయితులయిరి. అంత బలవంతుఁడగు నీలుఁడు చెదరినసేనను నిలువరించి బుద్ధిమంతుఁడగు కుంభకర్ణునిపై నొకపర్వ

తశిఖరమును వైచెను. అతండాపర్వతశిఖరము తనపయికివచ్చుటంజూచి దానిని బిడికిటం దట్టెను. అతని పిడికిటిపోటున ఆపర్వతశిఖరముపగిలి పటిసయలై మిణుఁగుఱులు సెదర మంటలుపొడమ నేలంబడినది. ఋషభుఁడు శరభుఁడు నీలుఁడు గవాక్షుఁడు గంధమాదనుఁడు ననెడి యీయేవురు వానరోత్తములును కుంభకర్ణునిపయికి నడరిరి. మహాబలులగు నవ్వానరోత్తములు మహాకాయుని కుంభకర్ణునిం జుట్టుముట్టి పర్వతంబులను వృక్షములను నఱచేతులను తన్నమెత్తిన పాదములను పిడికిళ్లనుంగొని చుట్టుముట్టిరి. ఆదెబ్బలన్నియు నతనికి సుఖస్పర్శములుగాఁ దోఁచినవిగాని యెంతమాత్రము వ్యథపెట్టినవిగావు. కుంభకర్ణుఁ డపుడు మహావేగుం డగుఋషభుని రెండుచేతుల బిగ్గఁగౌఁగిలించి యదిమెను. భయంకరుండగు నవ్వానరతిలకుఁడు ఋషభుఁడు కుంభకర్ణునిభుజములఁ బీడితుఁడై నోట నెత్తురుగ్రక్కుచు నేలంబడెను. అప్పుడింద్రశత్రుండు కుంభకర్ణుఁడు యుద్ధంబున పిడికిటిపోటున శరభునిఁ గొట్టి మోఁకాల నీలుం గ్రుమ్మి యఱచేత గవాక్షుని జఱచెను; మిక్కిలి క్రుద్ధుఁడై బలముకొలఁదిని గంధమాదనుని పాదంబునం దన్నెను. అవ్వానరోత్తములు కుంభకర్ణుఁడు గొట్టిన దెబ్బలకు మిక్కిలిబాధనొంది నెత్తుటందోఁగి మూర్ఛనొంది నఱకంబడిన మోదుగుచెట్లుంబోలె నేలంబడిరి. మహాత్ములగు నవ్వానరముఖ్యులు పడుటంజూచి వెక్కువేలవానరులు కుంభకర్ణునిపయి కడరిరి. పర్వతాకారులును మహాబలులు నగునావానరవీరులందఱును కొండపైకింబోలె నాకుంభకర్ణునిపయి కెగిరి యారోహించి దంతములంబట్టి గొఱికిరి. ఆవానరోత్తములు మహాకాయుఁడగు నాకుంభకర్ణుని నపుడు నఖంబులగీఱిరి, పండ్లంగొఱికిరి, పిడికిళ్లంబొడిచిరి, మోఁకాలంగ్రుమ్మిరి. పర్వతాకారుఁడగు నారాక్షసిసింహుఁడు కుంభకర్ణుఁడు అట్లు వేలకొలఁది వానరులు తనపయిని వ్యాపించి యలమియుండఁగా, వృక్షములు పెరిఁగియున్న పర్వతమువలెఁ బ్రకాశించెను. మిక్కిలియు బలవంతుఁడుగాన నాకుంభకర్ణుఁడు గరుడుఁడు సర్పములను భక్షించునట్లు, వానరుల నందఱను జేతులంబట్టికొని భక్షింప నారంభించెను. అట్లు కుంభకర్ణుఁడు వానరులను పాతాళబిలమువలె నున్న తననోట వేసికొనఁగానే, వారలు ముక్కురంధ్రములనుండియు చెవులనుండియు వెడలి వచ్చుచుండిరి. పర్వతాకారుఁడగు నారాక్షసోత్తముఁడు ఇట్లు వానరులు మరలి వెడలివచ్చుటం జూచి, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై వారలనందఱను విఱిచి భక్షింపసాగెను. ఆరాక్షసుఁడు ప్రళయకాలాగ్నివలె రౌద్రాకారుఁడై, మైమఱచి భూమియంతయును రక్తమాంసములం దడుపుచు వానరసైన్యములందు విహరించుచుండెను. వజ్రాయుధము దాల్చిన దేవేంద్రునివలెను, పాశము ధరించియుండు యమునిభంగిని శూలపాణి యగుమహాబలుఁడు కుంభకర్ణుఁడు యుద్ధమున నెంతయుం బ్రకాశించెను. అగ్ని వేసంగికాలమున నెండియున్న యడవులను దహించునట్లు కుంభకర్ణుఁడు వానరసైన్యములను దహించెను. అంత నవ్వానరులు అట్లు వధింపఁబడుచు గుంపులువీడి నాయకుఁడు

లేకుండుటం జేసి, మిక్కిలియు భీతులయి, మహావికృతధ్వనిగా నఱవసాగిరి. అట్లు కుంభకర్ణుఁ డనేకవిధముల వధించుచుండఁగా, అవ్వానరులు బాధితులై మనంబుల దుఃఖితు లగుచు రాముని శరణుఁ జొచ్చిరి. అంత నింద్రునిమనుమఁ డగునంగదుఁడు యుద్ధమున వానరులందఱును బరాజితులై పాఱుటంజూచి యొక గొప్ప పర్వతశిఖరమును గొని కుంభకర్ణుని వెంబడివచ్చు రాక్షసులందఱును భయపడునట్లుగా, మాటిమాటికి సింహనాదములుసేయుచు మహాయుద్ధంబున వేగ కుంభకర్ణునిపయి నడరి యాశిఖరమును కుంభకర్ణునితలపయి వైచెను. అట్లు తలపై గొప్పదెబ్బ తగులఁగా, ఆకుంభకర్ణుఁ డప్పుడు మహాకోపమున మండిపడెను. ఆకుంభకర్ణుఁ డట్లు కుపితుఁడై సమస్తవానరులు భయపడునట్లు మహాధ్వనిగా నార్చుచు వేగంబున నంగదునిమీఁదికిఁ బోయెను. మహాబలుఁ డగునాకుంభకర్ణుఁడు కోపమున నంగదునిపై శూలమును వైచెను. యుద్ధమార్గములం జక్కఁగా దెలిసినవాఁడును బలవంతుఁడు నగు నంగదుండు, ఆశూలము తనపయికి వచ్చుటంజూచి లాఘవంబునఁ దప్పించుకొనెను. ఆయంగదుఁ డంతేకాక తటాలున దగ్గఱకు దుమికి, కుంభకర్ణునిఱొమ్ముపై నఱచేతి నడచెను. పర్వతాకారుఁ డగునా కుంభకర్ణుఁడు,అంగదుని దెబ్బకుఁ బరమకుపితుఁడై యేమియుఁ దెలియక మూర్ఛిల్లెను. అంత నాబలవంతుఁడు కొంతవడికి మూర్ఛదేఱి తెలివినొంది పిడికిలిం ద్రిప్పి వెడచేత నంగదునిం బొడిచెను. అంత నంగదుఁడు మూర్ఛిలి నేలంబడెను. వానరోత్తముఁ డగునా యంగదుఁడు అట్లు మూర్ఛిల్లఁగానే కుంభకర్ణుఁ డా శూలముగొని సుగ్రీవునిమీఁదికిఁ బోయెను. అప్పుడు వీరుం డగునా వానరాధిపుఁడు సుగ్రీవుఁడు మహాబలుం డగుకుంభకర్ణుఁడు తనమీఁదికి వచ్చుటంజూచి యుద్ధోత్సాహంబున గంతువేసెను. మహాకపియగు సుగ్రీవుఁడు, పర్వతశిఖరమును జేతనెత్తికొని గిరగిరం ద్రిప్పుచు, వేగమున మహాబలుండగు కుంభకర్ణునిమీఁది కడరెను. కుంభకర్ణుఁడు, ఆసుగ్రీవుఁడు తనపయికి వచ్చుటనుజూచి సమస్తావయవములును వికృతముగా నుంచుకొని సుగ్రీవున కభిముఖుండై నిలిచెను. వానరులను భక్షించుచు వారిరక్తముచే నంగములెల్లఁ దడియ, నిలుచున్న కుంభకర్ణుని సుగ్రీవుఁడుచూచి 'నీవు యుద్ధంబున గొప్పగొప్పవీరులను బడఁగూల్చితివి. ఇతరుల కెవ్వరికిని జేయనలవిగాని కార్యము గావించితివి. వానరసైన్యములను భక్షించితివి. గొప్పయశస్సును బొందితివి. రాక్షసా! ఆవానరసమూహములను వదలుము. అల్పులతో నీకేమిపని. ఇటు రమ్ము. నే నీపర్వతమును నిదె నీపయిఁ బడవైచుచున్నాను. ఈయొక్కపాటునుమాత్రము సహింపుము' అనెను. వానరరాజగు సుగ్రీవుండు బలంబును ధైర్యమును బెనంగొనఁ జెప్పిన యప్పలుకువిని రాక్షససింహుఁ డగు కుంభకర్ణుఁ డతనితో * 'నీవు బ్రహ్మదేవుని మనుమఁడవు బ్రహ్మపుత్త్రుఁ డగు

* 'ప్రజాపతేస్తుపౌత్రః' అనిమూలము. తొల్లి బ్రహ్మ యావులింపఁగా, అతనిముఖమునుండి, ఋక్షరజుఁ డనువానరుఁడు పుట్టెను. అతఁ డొకప్పుడు గ్రుమ్మరుచుండి బ్రహ్మలోకమునందు అప్సరస

ఋక్షరజుని పుత్త్రుఁడవు. ప్రఖ్యాతికెక్కిన పరాక్రమసంపత్తి గలవాఁడవు. ఇవంతయు మాకుఁ దెలిసినవే. నీవేల గర్జించెదవు' అనెను. అంత సుగ్రీవుఁడు, కుంభకర్ణుఁ డాడినమాటవిని వజ్రంబును విడుగునుంబోని యాపర్వతమును గిరగిరంద్రిప్పి వేగవైచి యతనివక్షమునఁ బడఁగొట్టెను. అప్పు డా పర్వతశిఖరము విశాలంబగు కుంభకర్ణుని వక్షఃస్థలమునంబడి చూర్ణమయినది. దానింజూచి వానరులందఱు తోడనే విషాదమునొందిరి. రాక్షససమూహములును సంతోషమున సింహనాదములు గావించెను. పర్వతశిఖరముచేఁ గొట్టువడినందులకు నాకుంభకర్ణునకుఁ గోపము పుట్టెను. అతఁ డాకోపమువలన నోరుదెఱచి యార్చుచు, మెఱుపువలె మెఱయుచున్నశూలమును గిరగిరంద్రిప్పి సుగ్రీవుని వధించుటకుఁగాను నతనిపై వైచెను. హనుమంతుఁడు తత్క్షణమే యచ్చటి కుఱికి, కుంభకర్ణుఁడు భుజబలముకొలఁదిని విసరివైచిన యావాఁడిశూలమును బంగారు దండతోడం గూడినదానిని నొడిసిపట్టుకొని వేగంబున రెండుచేతులం బట్టివిఱిచెను. వానరసింహుఁ డగుహనుమంతుఁడు మిక్కిలి సంతుష్టుఁడై, వేయిబారువుల యినుముతోఁ జేయఁబడిన యమ్మహాశూలమును మోఁకాలికానించి ప్రల్లన విఱిచివేసెను. హనుమంతునిచే శూలము విఱుగుటంజూచి వానరసైనికు లుబ్బున పలువిధములనార్చుచు, నలుప్రక్కలను బఱతెంచిరి. అవ్వానరులెల్ల ఆశూల మట్లగుటనుజూచి, మిక్కిలి సంతుష్టులై సింహనాదములు సేయుచు, వాయుకుమారుని హనుమంతునిం బూజించిరి. మహాబలుఁడగు నారాక్షసవీరుఁ డా కుంభకర్ణుఁడు, అపుడు తనశూలము విఱువంబడుటనుజూచి కుపితుఁడై, * లంకామలయపర్వతమునుండి శిఖరమును బెకలించి సుగ్రీవుని దారసించి దానిని వైచెను. ఆపర్వతశిఖరపుదెబ్బకు, ఆసుగ్రీవుఁడు మూర్ఛిలి యుద్ధభూ

---

రూపమును గలిగించు నొకానొకసరస్సున మునిఁగి యప్సరోరూపమునొందెను. ఆబిడనుజూచి యింద్రుఁడును సూర్యుఁడును కామమోహితులై యిరువురు నేకకాలమున దానిని, చేతం బట్టుకొనిరి. అంతలో వారలకు రేతస్సు కలఁగి యాచెలువపైఁబడెను. అట్లు అది యాస్త్రీ వాలమునంబడఁగా వాలియనియు, గ్రీవమునంబడఁగా సుగ్రీవుఁడనియు నిరువురు కుమారులు పుట్టిరి. బ్రహ్మ యీసంగతింజూచి నవ్వి అప్సరసయైన ఋక్షరజుని నెప్పటిరూపము నొందుటకై పిలుచుకొని యాకుమారులనుం దోడ్కొనిపోయి వానరరూపమును గలిగించు మఱియొక సరస్సున మునుంగుమనిచెప్పఁగా నది యట్లుచేసి కుమారులును దానును వానరరూపమును దాల్చెను. అతనిపుత్త్రులు వాలిసుగ్రీవులు గావున సుగ్రీవుఁడు బ్రహ్మమనుమఁడుగా నిట చెప్పఁబడెను. కాశ్యపప్రజాపతివలన సూర్యుఁడును సూర్యునివలన సుగ్రీవుఁడును బుట్టుటచే ప్రజాపతిపౌత్రుఁ డనఁబడెనని మఱికొందఱిమతము. గోవిందరాజులు.

* త్రికూటశిఖరముపయినున్న లంకయొక్క ద్వారమునందుండు కుంభకర్ణుఁడు మఱియొకచోట నుండు లంకామలయపర్వతపుశృంగము నెట్లు పెకల్చినాఁ డన్నచో నంతకుఁ దగినకొలఁది యగు పెనుదేహము గలవాఁడుగాన యట్లు చేసెననిగాని లంకామలయ మనఁగా నిట త్రికూటమనికాని గ్రహించునది.

మిని బడెను. ఆతఁ డట్లు తెలివిదప్పి నేలంబడుటను జూచి యంత రాక్షసులందఱును మిక్కిలి సంతుష్టులై సింహనాదములు గావించిరి. వానరులు మిక్కిలియు దుఃఖితులైరి. ఆకుంభకర్ణుఁడు, యుద్ధమున, ఆశ్చర్యమును భయంకరమును నగు పరాక్రమము గలవానరనాథుని సుగ్రీవునియొద్దికిఁ బోయి, మిక్కిలి ప్రచండమైన వాయువు మేఘమును గొనిపోవునట్లు, యతనినిబట్టి గొనిపోయెను. మేరుపర్వతాకారుఁ డగునా కుంభకర్ణుఁడు, యుద్ధమున మహామేఘముంబోని యా సుగ్రీవు నెత్తికొనిపోవుచు, ఉన్నతమయిన భయంకరశిఖరము గలమేరుపర్వతమువలెఁ బ్రకాశించెను. అంత వీరుండగు కుంభకర్ణుఁడు అట్లు సుగ్రీవునెత్తికొని, యుద్ధమున రాక్షసశ్రేష్ఠులు పలువిధములఁ బొగడఁగా, వానరరాజగు సుగ్రీవుండునుం బట్టువడుటకు దేవత లాశ్చర్యమునొంది చేయుధ్వనులను వినుచుంబోయెను. అంత నప్పుడు దేవేంద్రునికిం బోలుపరాక్రమము గలయాయింద్రశత్రువు కుంభకర్ణుఁడు, దేవేంద్రసమానుఁడగు నావానరేంద్రుని సుగ్రీవునెత్తికొని 'వీనిని బట్టుకొనిపోయితిమేని, రామలక్ష్మణులతోఁ గూడినయీ వానరసైన్యమునంతటిని బట్టుకొన్నట్లయగు' నని తలఁచెను. అంత వానరసైన్యమంతయు నంతంతఁ బాఱుటయు, సుగ్రీవుండును కుంభకర్ణునిచేఁ బట్టువడుటయుఁ,జూచి వాయుపుత్త్రుం డగుహనుమంతుఁడు బుద్ధిమంతుఁడు గాన దనలో 'సుగ్రీవుఁడే యిట్లు పట్టువడెనే! ఇఁక నను బోఁటికి నేమిచేయనగును. దేనిని నాకుఁజేయుట న్యాయమో దానినే యెప్పుడును జేయుదునుగాని యొండు గావింపను. నేను పర్వతమంతటివాఁడనై రాక్షసుని నాశము సేసెదను. నేను యుద్ధమున మహాబలుఁ డగుకుంభకర్ణునిఁ బిడికిటంబొడిచి, దేహమును వికవికలుగావించి వధించి వానరరాజును విడిపింపఁగా, సమస్తవానరులును సంతోషము నొందుదురుగాక. అట్లుగాక, ఈరాజు సుగ్రీవుఁడు తన్ను దేవతలును, అసురులును, ఉరగులును, నొక్కటియై వచ్చి పట్టుకొన్నను, తానే విడిపించుకొననుగూడ సమర్థుఁడు. వానరనాథుఁ డితఁడు యుద్ధమున కుంభకర్ణుండు వైచిన పర్వతపు వ్రేటు దగిలియున్నందున, ఇంతకు తన్నుఁ దాను దెలియకున్నాఁడని తోఁచుచున్నది. లేకున్న తానే విడిపించుకొనియుండునే. ఈ సుగ్రీవుఁ డీ కొంతసేపులో మూర్ఛదేఱి, యిమ్మహాయుద్ధమునందుఁ దమకును వానరులకును నేదిహితమో దానిని జేయును. స్వామి కష్టమునం దగులఁగా భృత్యుఁడు విడిపింపవచ్చునుగాని, యట్లు నే సుగ్రీవుని విడిపింతునేని, మహాపరాక్రమశాలియగు నితనికిఁగలుగు నసంతుష్టి మిక్కిలి కష్టముగానుండును. కీర్తియు శాశ్వతముగా నశించును. అందువలన నేను కొంతసేపు, మనరాజే పరాక్రమించుటను వేచియుండెదను. అతనిపరాక్రమముమీఁద నే భారమువైచియుండెదను. అతఁడు వచ్చువఱకును విచ్చిపాఱెడు వానరసమూహముల నాశ్వాసించుచుండెదను.' అని యాలోచించెను. ఇట్లు వాయుపుత్త్రుఁడు హనుమంతుఁడు చింతించి, యవ్వానరమహాసైన్యమును బాఱిపోనీయక మఱల నిలిపినవాఁడయ్యె. అంత నాకుంభకర్ణుఁడు, ఇట్లు



1549. కుంభకర్ణుఁడు సుగ్రీవుని పట్టుకొనుట ; సుగ్రీవుఁడు కుంభకర్ణుని ముక్కు చెవులను కొఱికివైచుట.

కదలుచున్న యమ్మహాకపిని సుగ్రీవునిఁ జిక్కఁ బట్టికొని, మేడలమీఁదను చర్యాగృహములందును, గోపురములందును నున్న రాక్షసులు శ్లాఘ్యములగు పుష్పవర్షములను గురియుచుండఁగా లంకాపురమును బ్రవేశించెను. మహాబలుండగు సుగ్రీవుఁడు, అట్లు తనపై లాజలును సుగంధజలములును జడిగొనిపడఁగాఁ దడియుచుండుటవలనను, రాజమార్గము చల్లఁగానుండుటవలనను, మెల్లమెల్లగా మూర్ఛదేఱెను. అంత, మహాధీరుండగు సుగ్రీవుఁడు, మిక్కిలికష్టమునఁ దెలివొంది, యధికబలవంతుఁడగు నా కుంభకర్ణుని వక్షమునుండి, పలుమాఱు లంకాపురపు రాజమార్గముం జూచుచుఁ దనలో 'ఇప్పు డిట్లు పట్టువడియున్నానే! నేనిప్పుడు ప్రతికార మెట్లు చేయఁగూడును? వానరుల కెట్లుచేసిన నిష్టమును హితమునుగానుండునో యాలాగునఁ గార్యము గావించెదను.' అని యాలోచించెను. అంత వానరరాజగు సుగ్రీవుఁడు వాఁడిగోళ్లచే తటాలున నింద్రశత్రుఁడగు కుంభకర్ణుని చెవులనుగిల్లి, పండ్లతో ముక్కుఁ గొఱికికొని, పార్శ్వములందు చెక్కులనుమూఁపులను కడుపుప్రక్కలను పాదములచే విదారించెను. ఆకుంభకర్ణుఁ డట్లు సుగ్రీవునిచే ముక్కును జెవులునుబోయి ప్రక్కల విదారింపఁబడి, నలంగుడుపడుటకు మిక్కిలియుం గోపావేశమునొంది, దేహమంతయు నెత్తురుగాఱ, సుగ్రీవుని గిరగిరం ద్రిప్పి, నేలపయి వేసి నలిపెను. భయంకరబలుఁడగు కుంభకర్ణుఁడు నేలపైచి పిండలివండుగాఁ బిసికియు, ఆరాక్షసులు నానావిధములఁ బ్రహరించుచుండియు, ఆసుగ్రీవుఁడు సరకుసేయక వేగమున నాకాశమున కెగసి మరల రామునితో వచ్చి చేరుకొనెను. మహాబలుఁడగు కుంభకర్ణుఁడు ముక్కుచెవులునుబోయి, నెత్తుటం దోఁగుచు సెలయేళ్లతోఁగూడిన పర్వతమువలెఁ జూడనొప్పెను. అట్లు నెత్తుటం దోఁగుచున్న మహాకాయుఁడును భయంకరపరాక్రముఁడును మహాబలుండునగు నా కుంభకర్ణుఁడు మరల యుద్ధభూమికట్టు దిరిగి యుద్ధముసేయ నిశ్చయించెను. నల్లని కాటుకరాశివలెఁ జూపట్టు నాకుంభకర్ణుఁడు, కోపంబుమీఱ దేహమంతయు రక్తము గాఱుటం జేసి, సంధ్యాకాలమునందలి మేఘమువలె నప్పుడు ప్రకాశించెను. ఆసుగ్రీవుఁడు తప్పించుకొనిపోయినంతనే, దేవేంద్రశత్రుండగు కుంభకర్ణుఁడు క్రుద్ధుఁడై రౌద్రాకారమున మరల యుద్ధమునకుఁ బరుగెత్తుచు, ఆయుధములేదని తలంచి యపుడు భయంకరమైన యొక్కముద్గరముఁ గయికొనెను. అంత మహాతేజుండా కుంభకర్ణుఁడు శీఘ్రముగా పట్టణమునుండి వెలువడి, యుగ్రమగునవ్వానరసైన్యమునుజొచ్చి జ్వలించుచున్న ప్రలయకాలాగ్నిహోత్రుండు ప్రజలనుంబోలె, యుద్ధమున నాసైన్యమును భక్షింపసాగెను. కుంభకర్ణుఁడు యుద్ధమున, నుగ్రమగు నవ్వానరసైన్యమునుజొచ్చి, ఆఁకటిచే రక్తమాంసములందు పేరాసగొని మోహమున తనవారెవరివా రని తెలియక, రాక్షసులను వానరులను పిశాచములను భల్లూకములను భక్షించెను. ప్రలయకాలమున మృత్యువు ప్రజలను హరించునట్లు ఆకుంభకర్ణుఁడు మేటివానరులనుబట్టి భక్షించెను. అతఁడు క్రుద్ధుఁడై వానరులను రాక్షసులనును

బట్టి, యేకకాలమున, ఒకరి, నిద్దఱను, ముగ్వురను, అనేకులను, ఒకచేతనెత్తి వేగమున నోటవేసికొనుచుండెను. అప్పుడు అతఁడు మహాబలుఁడుగాన వానరులు మేటి పర్వతశిఖరములచే నెంతఁగొట్టుచున్నను, నాదెబ్బలను సరకుసేయక, తానుదిన్నట్టి వానరులమేదస్సును నెత్తురును తనదౌడలనుండి వెల్లువలుగాఁగాఱ, వారినిబట్టి భక్షించుచుండెను. అట్లు కుంభకర్ణుఁడు పట్టి భక్షించుచుండఁగా ఆవానరులు నిలువలేక రాముని శరణుఁజొచ్చిరి. కుంభకర్ణుఁడును మిక్కిలియు క్రుద్ధుఁడై వానరులను భక్షించుచునే వారివెంటంబడి పరుగెత్తెను. అతఁడు వానరులను ఏడువందలను ఎనిమిదివందలను, ఇరువదినందలను, ముప్పదివందలునుఁగా రెండుచేతులం బిగియ నదుముకొని భక్షించుచునే పసుగునఁ దఱుముచుండెను. అప్పుడు శత్రుబలంబుల నుఱుమాడుచు వారిపట్టణముల జయించువాఁడగు సుమిత్రాపుత్రుండు లక్ష్మణుఁడు, కుపితుఁడై, యుద్ధము గావించెను. వీర్యవంతుఁడగు నాలక్ష్మణుఁడు కుంభకర్ణుని దేహమునం దేడుబాణములు నాటించి, మఱలఁ బెక్కుబాణములు దీసి విడిచెను. కుంభకర్ణుఁడు మహాబలుఁడుగాన సరకుసేయక లక్ష్మణునిఁ దలకడచి, పదఘాతమున భూమిపగులునట్లు దోఁపఁగా రామునిమీఁదికే పోయెను. అంత దశరథకుమారుఁడగు రాముఁడు బెడిదమైనయస్త్రము నొకటిసంధించి తీక్ష్ణములగుబాణములను కుంభకర్ణునిఱొమ్ము గాఁడనేసెను. అట్లు రాముని బాణములు గ్రుచ్చుకొనఁగా క్రుద్ధుఁడై తోడింబడి రామునిపైఁ బరుగెత్తివచ్చుచున్న యాకుంభకర్ణునినోటనుండి నిప్పువంటిజ్వాలలు వెడలినవి. ఆరాక్షసపుంగవుఁడు అట్లు రాముని యస్త్రముచేఁ గొట్టువడి పరమక్రుద్ధుఁడై యుద్ధమున వానరులు భయముగొని పాఱ భయంకరముగా సింహనాదము సేయుచు రామునికెదురై పాఱుతెంచెను. రాముఁడు నెమిలిపురులు గట్టంబడియున్న బాణములను కుంభకర్ణునిఱొమ్మున నుచ్చిపోవవేయఁగా, నతండు పరవశుండగుటయు, నతనిచేతనుండి, మహాగదయు జాఱి నేలంబడెను. అతని ఖడ్గాద్యాయుధములును అన్నియు నేలఁబడి చెల్లాచెదరైనవి. అంత మహాబలుఁడగు నాకుంభకర్ణుఁడు తాను నిరాయుధుండగుటను దెలిసికొని పిడికిళ్లచేతను, గాళ్లచేతను మహాయుద్ధము గావించెను. అట్లు బాణములు మిక్కిలియు మేనం గ్రుచ్చుకొన నెత్తుటఁ దొప్పఁదోఁగియున్న యాకుంభకర్ణుఁడు, పర్వతము సెలయేటిని స్రవించునట్లు, రక్తము స్రవించెను. అతఁడు దేహమంతయు నెత్తురువ్యాపించియుండఁగా, తీవ్రకోపమునొంది, వానరులను రాక్షసులను భల్లూకములనును భక్షించుచు యుద్ధరంగమున గ్రుమ్మరుచుండెను. అంత భయంకరపరాక్రమంబు గలిగి మృత్యువుంబోలియున్న యమ్మహాబలుఁడు కుంభకర్ణుఁడు, బెడిదమైన యొకపర్వతశిఖరమునెత్తి గిరగిరం ద్రిప్పి, రామునిగుఱిపెట్టి వేసెను. పురుషసింహుఁడగు రాముఁడు ఆపర్వతశిఖరము తనపయికి రాకమునుపే, నడుమనే, కాంచనముచే చిత్రముగా నలంకృతములై సూటిదప్పక సాఁగుబాణము లేడువైచి ఖండించెను. మేరుశిఖరము

వలె నాకారము చూపట్టు నాకుంభకర్ణుఁడు కాంతిచే జ్వలించుచున్నట్లు తేజరిల్లుచు, రెండువందల మేటివానరులపయి కడరుటంజూచి రాముఁడతనిని బాణములువైచి నేలంబడునట్లు గావించెను. ఆసమయమున ధర్మాత్ముఁడగు నాలక్ష్మణుఁడు కుంభకర్ణుని వధంబునకై యాసక్తిఁగొని యందులకు నుపాయములు పెక్కు లాలోచించుచు రామునితో 'రాజా! ఈకుంభకర్ణుండు నెత్తురువాసనగొని మత్తుఁడై యున్నాఁడు గాన వానరులని రాక్షసులనికాని తెలియఁడు. తనవారలను నెదిరివారలనుగూడఁ బట్టి తినుచున్నాఁడు. వానరతిలకులందఱును నీకుంభకర్ణునిపై చక్కఁగా నెక్కి నిలుతురుగాక. ముఖ్యులయిన యూథపతులును, యథాయోగ్యముగా నితనిచుట్టునుండి కదలమెదలనీకుండఁ గావింతురుగాక. ఇప్పు డట్లు గావించినయెడల దుర్బుద్ధియగువీఁడు, పెనుభారముచే పీడితుఁడై కాలమున నేలంబడుటయేకాక, యాబరువున మరల లేవలేనివాఁడై యింకఁ దక్కినవానరులను జంపకుండును' అనెను. బుద్ధిమంతుఁడగు నారాజకుమారుఁడు లక్ష్మణుఁడు చెప్పిన యప్పలుకువిని, అవ్వానరులు సంతుష్టులయి కుంభకర్ణు నారోహించిరి. కుంభకర్ణుఁ డట్లు వానరులు తనపై నెక్కఁగా, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై, వేగంబున దుష్టగజము మావటివాండ్రను విదుల్చునట్లు, అవ్వానరుల నందఱను విదిల్చివైచెను. రాముఁ డట్లావానరులందఱును విదుల్పంబడుటనుజూచి, ఆరాక్షసుఁడు దుష్టుఁడుగాన వధింపఁదలఁచి వేగమున మేలయినవింటిని దీసికొని యతనిమీఁదికిఁబోయెను. వీరుఁ డారాముఁడు కోపమున కన్నెఱ్ఱఁబాఱ, చూడ్కులఁ గాల్చునట్లు చుఱచుఱం జూచుచు, వేగముమీఱ కుంభకర్ణభయమునఁ గందికుంది యున్నవానరయూథపులెల్ల సంతోషింప, రోషమున వానిమీఁది కడరెను. ఆరాముఁడు మహాసర్పముం బోనిదై దృఢమయిన యల్లెత్రాడుగలిగి, బెడిదమై బంగారుచే వింత రంగారుచున్న వింటినిదీసికొని, మేలియమ్ములు గలపొదులనుగట్టికొని వానరుల నాశ్వాసించి కుంభకర్ణునిమీఁదికి వేగ యడరెను. మిక్కిలియు దుర్జయుఁ డగు నమ్మహాబలుఁడు రాముఁడు అవ్వానరసమూహములచేఁ బరివృతుఁడై లక్ష్మణుఁడు వెంటరా, యుద్ధమునకు వెడలెను. ఆరాముఁడు మహాకాయుఁడై కిరీటంబుదాల్చి సమస్తావయవములును నెత్తుటందోఁగియున్న మహాబలుని, పగవారి పీఁచమడంచు కుంభకర్ణునిం జూచెను. ఆకుంభకర్ణుఁడపుడు, కుపితమైన దిగ్గజమువలెఁ జిమ్మిరేఁగి కనఁబడినవారినెల్లఁ దఱిమికొట్టుచు, క్రుద్ధుండై వానరులవెదకుచు రాక్షసపరివృతుఁడై యొప్పుచు, వింధ్యమంథరపర్వతములవలెఁ జూపట్టుచు, బంగారు బాహుపురులు రంగార, మేఘము పొడవుననుండి వర్షము గురియునట్లు, నోటనుండి నెత్తురు గ్రక్కుచుండెను. మఱియు నతఁడు నాలుకచే నెత్తురు నాకికొనుచు, నెత్తురువలె నెఱ్ఱనయిన కన్నులతో, వానరసేన మర్దించుచుఁ బ్రలయకాలమునఁ బ్రజల నాశము సేయు యమునివలెఁ జూపట్టుచుండెను. పురుషలలాముండగు రాముఁడపుడు, మండుచున్నయగ్నియుంబోలె వెలుంగుచున్న రాక్షసోత్తముని కుంభ

కర్ణునిఁజూచి వింటిని సారించెను. రాక్షసశార్దూలుఁడగు కుంభకర్ణుఁడు, రాముని వింటి ధ్వనిని విని, దాని నోర్వఁజాలక కుపితుఁడై రామునివంకకే వేగ దలపడెను. అంత, యుద్ధమునందు, వాయువుచే వంకకేఁగిన పెనుమేఘముం బోలినవాఁడై, వానికి మేటిశరీరమువలె నిడుదలై బలుచేతులుమీఁదఁ, బర్వతాకారమున నొప్పు కుంభకర్ణుఁడు యుద్ధమునందనవంకకే వచ్చుచుండుటంజూచి రాముఁడతనితో * 'రాక్షసాధిపా! రమ్ము. విషాదమువలదు. నేను విలుచేపట్టి నిలిచియున్నాను చూడుము. నీ వింద్రుని గెలిచినాఁడ ననుకొందువు కాఁబోలు. నేను రాముఁడని యెఱుఁగుము. ఇంద్రుఁడను గాను. ఇఁకఁ గొంతసేపులోపలనే యసువులు వీడెదవు చూడుము' అనెను. కుంభకర్ణుఁడు 'ఇతఁడే రాముఁ'డని యెఱింగి వికృతస్వరముగా పకపకనవ్వుచు, మిక్కిలి క్రుద్ధుఁడై యుద్ధంబున వానరులందఱును బరుగువాఱునట్లు సమస్తవానరుల గుండియలు పగుల్చునట్లు, రామునిమీఁదికిఁ దలపడెను. మహాతేజుండగు కుంభకర్ణుఁడు, వికృతముగాను, భయంకరముగాను, మేఘగర్జనమువలె గంభీరముగాను, నవ్వి రామునిం జూచి, 'నేను విరాధుఁడనుగాను; కబంధుఁడనుగాను; ఖరుఁడనుగాను; వాలినిగాను; మారీచుండనుగాను; నన్ను వీరినిగాఁ దలఁపవలదు; మఱి నీవు వారిని జంపితినని విఱ్ఱవీఁగవలదు. నేను కుంభకర్ణుఁడను వచ్చినాను. ఇదిగో మిక్కిలియు నినుముతోఁ జేయఁబడి బెడిదమై యున్నయీ పెనుముద్గరమును జూడుము. దీనిచేతనే నేను మున్ను దేవతలను దానవులనుం జయించియున్నాను. నీవు, ముక్కుసెవులు పోయినవాఁడనని నన్నుఁ జుల్కఁగాఁ జూడవలదు. ముక్కుసెవులు పోవుటచే నాకు రవ్వంతయైనను బాధలేదు. ఇక్ష్వాకుసింహమా! నా గాత్రముమీఁద నీపరాక్రమమును జుల్కం జూపుము. అంత నీపౌరుషమును పరాక్రమమును దెలిసి, నిన్ను భక్షించివైచెదను' అనెను. కుంభకర్ణుఁడు చెప్పినదివిని, యారాముఁడు, మంచి పింజలుగల బాణములను బ్రయోగించెను. దేవశత్రుఁడగు నాకుంభకర్ణుఁడు, వజ్రసమానవేగంబులగు నాబాణములచేఁ గొట్టువడియు, ఎంతమాత్రమును గలంగినవాఁడును గాఁడు; దుఃఖితుఁడును గాఁడయ్యె. ఏబాణములచే మున్ను మేటిసాలవృక్షములేడు నఱకంబడినవో, వానరపుంగవుఁడగు వాలియు హతుఁడయ్యెనో, వజ్రసమానములైన యా † బాణము లిప్పుడు కుంభకర్ణునిమేని నెంతమాత్రమును గాసిపఱుపఁజాలక

* ఇందులకు 'అగచ్ఛ రక్షోధిప మావిషాద మవస్థితోఽహం ప్రగృహీత చాపః । అవేహి మాం శక్రసపత్న రామం, మయాముహూర్తాద్భవితా విచేతాః' అనిమూలము. వాస్తవార్థము-'కుంభకర్ణా! ఎంతమాత్రమును దుఃఖమునొందక నన్నుఁ బొందుము. నిన్నుద్ధరించుటకై విలుదాల్చి యున్నాను చూడుము. నన్ను నిన్నుద్ధరింపవచ్చినరామునిఁగా నెఱుంగుము. ఇఁక శీఘ్రముగ నిను విముక్తునిఁ గావించెదను' అనెను.

† సప్తసాలములను భేదించినదియు, వాలిని జంపినదియు నొక్కబాణమే యైనను, నిచట తద్వర్గములైనదానిని జెప్పుటచే బాణములని బహువచనము తెలియునది.



1553. కుంభకర్ణుడు దారిలో వానరులను మ్రింగుచు యుద్ధమునకుఁ బోవుట ;
రామలక్ష్మణులు వాని హస్తపాదములను ఖండించుట.

పోయినవి. దేవేంద్రశత్రుఁ డా కుంభకర్ణుఁడు ఆబాణములు తనమేనం గాఁడి మ
ఱుఁగువడఁగా, శరీరముచే వానిని జలధారలవలెఁ ద్రాఁగినట్లు చూపట్టుచు ను
గ్రంబగు వేగముగల యా ముద్గరమును గిరగిరం ద్రిప్పి రాముని బాణముల యుర
వడిని వారించుకొనెను. అంతఁ గుంభకర్ణుఁడు, నెత్తుట బ్రుంగినదియు, దేవమహాసై
న్యములకును దిగులు గొలుపునదియు నుగ్ర వేగంబు గలదియు నగు నాముద్గరమును
ద్రిప్పి వానరసైన్యములను దఱిమెను. అంత రాముఁడు మీఁటయిన వాయవ్యా
స్త్రమునుదీసి, యారాక్షసునిపై వేసెను. అది యతని బాహువును ముద్గరసహి
తముగా ఖండించెను. అంత నతఁడు బాహువు నఱుకంబడి తుములముగా నఱచెను.
పర్వతశిఖరాకారమగు నాకుంభకర్ణుని బాహువు ముద్గరసహితముగా రామబాణము
చే నఱుకంబడినదై, యా సుగ్రీవుని సైన్యమునంబడి, యందలి వానరసైనికులను
జంపెను. అట్లు భంగమునొంది చావఁగా మిగిలినవానరులు, అప్పుడు విషణ్ణులయి,
యోరలంజేరి (సమీపముంజేరి) భయమున నవయవములు గడగడ వడంకుచుండఁ
గా, రామునికిని రాక్షసవీరునికిని మిక్కిలియు ఘోరముగా జరుగుచున్న ద్వంద్వయు
ద్ధమును జూచిరి. అట్లు వాయవ్యాస్త్రముచే నొకచేయి త్రుంపఁబడఁగా, ఆ కుంభ
కర్ణుఁడు, శిఖరము నఱుకంబడిన మహాపర్వతమువలె నొప్పుచు, రెండవచేత నొక
వృక్షమును బెఱికి, దానితోఁ, రణంబున రామునిమీఁది కడరెను. ఆరాముఁడు బంగా
రుచే చిత్రమైనబాణమును, ఐంద్రాస్త్రమంత్రముచే నభిమంత్రించి, యంత సర్ప
శరీరాకారమై, వృక్షముతోడ పయికెత్తంబడి యున్నకుంభకర్ణుని యారెండవ
బాహువును సాలవృక్షసహితముగా ఖండించివైచెను. పర్వతాకార మైనయా
కుంభకర్ణుని బాహువు ఖండితమై నేలంబడి విలవిలం దన్నికొనుచుఁ బెక్కువృక్షము
లను పర్వతములను ఱాలను వానరులను రాక్షసులను నుగ్గుగావించినది. అట్లు
కుంభకర్ణుఁడు రెండుచేతులును దెగి యఱచుచు వేగ తనపయికి వచ్చుటనుజూచి, రా
ముఁడు తీక్ష్ణములయిన యర్ధచంద్రబాణముల రెంటినిదీసికొని యుద్ధంబున నారా
క్షసునిపాదములను ఛేదించివైచెను. ఆ కుంభకర్ణునిపాదములు రెండునుబడఁగా,
ఆధ్వని, దిక్కులను విదిక్కులను పర్వతములను గుహలను మహాసముద్రమును
లంకాపురమును, వానరరాక్షస సైన్యములను మాఱుమ్రోయించుచు నిండి
చెలంగినది. కుంభకర్ణుఁ డట్లు చేతులుతునీఁగి పాదములును ద్రుంగి పోవఁగా,
బడబాముఖమువలె విఱివియైన నోరిని దెఱచుకొని, గర్జించుచు నంతరిక్షము
నందు, చంద్రునివలె నున్న రామునిపై రాహువుంబోలె, తునీఁగి మిగిలినతొడలచే
వేగమునఁ దలపడెను. రాముఁడు వాఁడిమొనలు గలిగి బంగారుపూఁత పిం
జలతోఁ గూడినబాణముల నా కుంభకర్ణుని నోటినిండఁ బూరించెను. అతఁడు
నోటినిండ నమ్ములు నిండియుండుటవలన మాటాడం జాలక, యెట్టకేలకుఁ గోయని
యార్చి మూర్ఛయు నొందెను. అంత, రాముఁడు, సూర్యకిరణమువలె వెలుఁగు

చు బ్రహ్మదండమునకును బ్రలయకాలయమునకును సాటియై, వగవాఱి కకుంభప్రదంబును, సుపుంఖమును, వాయువేగంబును, వాఁడియు నైనయైంద్రబాణమును దీసికొనెను. వజ్రమువలెఁ గఠినముగాను బంగారుమయముగాను సుందరముగాను నున్న పింజతోఁ గూడినదై, వెలుంగుచున్న సూర్యునివలెను జ్వలించుచున్న యగ్నివలెనుఁ బ్రకాశించుచు, ఇంద్రుని వజ్రాయుధమువలెను బిడుగువలెను సురవడిగలిగి, యున్న యాబాణమును రాముఁడు కుంభకర్ణునిపైఁ బ్రయోగించెను. రాముఁడు బాహుబలముకొలఁది నాబాణమును వైవఁగా, అది పొగలతోఁగూడి జ్వలించుచున్న యగ్నివలెఁ జూపట్టుచు, ఇంద్రుని వజ్రాయుధమువలె బలమును పరాక్రమమునుం గలిగి, తనకాంతిచే దశదిశలను వెలింగించుచు, కుంభకర్ణునిమీఁదికిఁ బోయెను. ఆ బాణము, మున్ను దేవేంద్రుఁడు వృత్రాసురుని శిరమును ఖండించినట్లు, మహాపర్వతశిఖరాకారమై, తిరుగుడువడ్డ పెనుకోఱలతోఁగూడి, * సుందరములగు కుండలములు చొకళించుచున్న యా కుంభకర్ణునిశిరస్సును ఖండించెను. రెండు కుండలములచే నలంకృతమై, ఖండనవేగమున నాకాశగతమై యున్న కుంభకర్ణుని పెనుశిరస్సు, రాత్రియం దుదయించి పునర్వసునక్షత్రములు రెండింటి నడుమ నుండుచంద్రునివలెఁ బ్రకాశించెను. రామబాణమునఁ గొట్టువడి పర్వతాకారం బగు నా కుంభకర్ణునిశిరస్సు నేలంబడఁగా, ఆదెబ్బకు చర్యాగృహములును పురద్వారములును పొడవయిన ప్రాకారమును విఱిగి నేలంగూలినవి. మఱియు నా కుంభకర్ణుని కళేబరము పడఁగా దానిపాటునఁ జట్టు భయమునం బరుగిడుచున్నవావరు లనేకకోట్లు నలఁగి కూలిరి. అంత హిమవంతమువలెఁ జూపట్టుచున్నయాకుంభకర్ణుని పెనుకళేబరము సముద్రమునం బడి మేటిమొసళ్లను పెనుచేఁపలను సర్పములను మర్దించి యపుడు నేలను జొచ్చినది. బ్రాహ్మణులకును దేవతలకును శత్రుండై, మహాబలుండగు కుంభకర్ణుఁడు యుద్ధమున నిహతుండగుటయు, భూమియుఁ బర్వతములును నన్నియు నల్లలాడినవి. దేవతలును సంతోషమున దొమ్మిగా సింహనాదములు చేసిరి. అంత దేవర్షులును మహర్షులును ఉరగులును దేవతలును భూతములును గరుడులును గుహ్యకులును యక్షులును గంధర్వుల సమూహములును ఆకాశముననుండి, రామునిపరాక్రమము చూచి యెంతయు సంతోషించిరి. అంత రాక్షసరాజయిన రావణునిబంధువు లగునారాక్షసులు ధీరులయ్యు, మహాబలుండగు నా కుంభకర్ణుఁడు నిహతుండగుటకు మిక్కిలియు దుఃఖితులై, దేవతలచేఁ బీడితులయిన యసురులు విష్ణుం జూచి గాసిజెందినట్లు, రామునింజూచి వ్యథితులై బిగ్గఱ నఱచిరి. రాహుముఖముననుండి విముక్తుఁడయిన సూర్యుఁడు దేవలోకమునఁ జీఁకటిని బోఁగొట్టి ప్రకాశించునట్లు, రాముఁడు భూతలమున వానరసమూహమునడుమ, యుద్ధమునఁ

---

* ఇట కుండలము లున్నవనుటచే సుగ్రీవుఁడు కుంభకర్ణునిచెవులను కుండలములు వేసికొను భాగము తప్పఁ దక్కినదానిని కొఱికికొన్నాఁడని తెలియునది. మహేశ్వరతీర్థులు.

గుంభకర్ణునివధించి, యెంతయుఁ దేజంబునఁ బ్రకాశించెను. వానరులందఱును భయంకరపరాక్రముఁడై దారసింప రాకుండువాఁడగు శత్రుండు కుంభకర్ణుఁడు హతుం డగుటయు, ముఖకమలము లెంతయు వికసిల్ల మిక్కిలి యుబ్బునొంది కుంభకర్ణ జయరూపమగు నిష్టసిద్ధిని బొందినరామునిని బూజించిరి. భరతాగ్రజుం డగు రాముఁడు, అట్లు దేవతాసమూహములను గలంచి నలంచి మహాయుద్ధములందు గడిదేఱియుండుటచే శ్రమంపడక యవలీలగెలుపునొందుకుంభకర్ణుని, భరతాగ్రజుఁడు రాముఁడు యుద్ధమున వధించి, మహాసురుం డగువృత్తుని వధించిన దేవేంద్రుని వలె మిక్కిలియు సంతోషము నొందినవాఁడయ్యె. ఇది యఱువదియేడవసర్గము.



కుంభకర్ణుఁడు హతుఁడగుటను విని రావణుఁడు ప్రలాపించుట.

* రాక్షసులు మహాత్ముఁ డగురామునిచేత కుంభకర్ణుఁడు హతుఁడగుటను జూచి రాక్షసేంద్రుఁడగు రావణునకు, 'రాజా! మృత్యుసమానుఁ డగునాకుంభకర్ణుఁడు, వానరసైన్యమునంతయుఁ దఱిమియు, వానరులను బెక్కండ్ర భక్షించియుఁ, దుదకు మృత్యుకర్మ మగుమరణము బారిం బడియెను. పర్వతాకారుఁడగు నీతమ్ముఁడు కుంభకర్ణుఁడు కొంతసేపు పరాక్రమముచూపి, కంఠమును తొడలును భుజములును ద్రుంపఁబడి, నెత్తురు మిక్కిలియుఁ దొరఁగునట్లు,రామునిబాణములం బీడితుఁడై ,కాఱుచిచ్చుచేఁ గాలినవృక్షమువలె నొకఁటేపిండమై,యిట్లు వికృతశరీరుఁడగుచుఁదనమొండెము సగముమాత్రము భయంకరముగాఁ జూపట్టుచున్నసముద్రమును బ్రవేశించి దాని నడ్డగింపఁగా,శరీరపుమీఁదిభాగ మగుతల లంకాద్వారమును నిరోధింపఁగా, నిట్లు రాముని తేజముచేత యడంగిపోయినాఁడు' అనిరి. రావణుఁడు మహాబలుఁడగు కుంభకర్ణుఁడు యుద్ధమున నిహతుఁడగుటవిని శోకమునం బొక్కుచు మూర్ఛనొంది నేలంబడెను. పినతండ్రి హతుఁడగుట నెఱింగి, దేవాంతకుఁడును, నరాంతకుఁడును,త్రిశిరుఁడును, అతికాయుఁడును, శోకపీడితులై రోదనము గావించిరి. అక్లిష్టకర్ముఁడగు రాముఁడు తమసోదరుఁడగు కుంభకర్ణునిఁ జంపెనని తెలిసి, మహోదరుఁడును మహాపార్శ్వుఁడును దుఃఖాక్రాంతులయిరి. అంత రాక్షసపుంగవుఁ డారావణుఁడు, ఎట్టకేలకు మూర్ఛదేఱి, కుంభకర్ణవధమునకు దీనుండై , 'హా! వీరా! శత్రుగర్వసంహారకా! కుంభకర్ణా! మహాబలశాలీ! నీవు దైవగతింజేసి నన్ను దిగవిడిచి యిపుడు యమలోకంబునకుఁ బోయితివే! మహాబలవంతా! నీవు నాకును బంధువులకును శల్యమువలెఁ బీడించుచున్నదుఃఖమును దీసివేయకయే, ఒక్కండవును శత్రుసైన్యములను పరాక్ర

* ఇట 'కుంభకర్ణం హతం దృష్ట్వా రాఘవేణ మహాత్మనా। రాక్షసా రాక్షసేన్ద్రాయ రావణాయ న్యవేదయన్' అని మూలము. రాక్షసేన్ద్రాయ అనుచోఁ గలయకారము గాయత్రి పదునెనిమిదవ యక్షరముగాన పదునెనిమిదవసహస్ర మారంభించుట తెలియునది.

ఘమునఁ దపింపఁజేసి, నన్ను విడిచిపెట్టి పోవుచున్నావే! నేను దేని నాశ్రయించి దేవాసురులకును భయపడకుందునో యట్టి నాకుడిబుజము పడిపోయినందున నిపుడు నేనుండియు లేనివాఁడనయితిని. దేవదానవులగర్వం బడంచి కాలాగ్నిరుద్రునకు సాటియైన యట్టి మహావీరుఁడు యుద్ధమున నెట్లు దుదకుఁ గేవల మొక రామునిచేత హతుఁడయినాఁడు ! ఎవ్వనికి వజ్రాయుధమునొరపిడియు నొకప్పుడును వ్యసనమును గలిగింపదో, యట్టి నీవు, ఎట్లు కేవలము రామబాణములకుఁ బీడితుఁడవై నేలంబడి నిదురించుచున్నావు. ఇదిగో, దేవతలందఱును ఋషులును గుంపులుగొని యాకాశగతులయి, యుద్ధమున హతుఁడవయిన నిన్నుఁజూచి మిక్కిలిహర్షమున సింహనాదములు గావించుచున్నారు. మిక్కిలి సంతుష్టులయిన వానరులు, యవసరముదొరకియున్నది గాన యిపుడే దుర్గములయిన లంకాద్వారములను నలుగడల నారోహింతురు. ఇదినిశ్చయము. రాజ్యముతో నాకుఁ బనియేలేదు. ఇఁక సీతతో నేమిచేయఁగలను. కుంభకర్ణునిఁ బాసినవెనుక నాకు బ్రతుకునందే యిష్టములేదు. నేను నాతమ్ముని జంపిన వానిని రాముని యుద్ధమున వధింపనేని, యపు డీవ్యర్థపుబ్రతుకు నాకెంతమాత్రము మేలుగాదు. అంతకన్న మరణమే నాకుమేలు చుఁడీ. ఇప్పుడె నాతమ్ముఁ డెచ్చటికిఁ బోయెనో యచ్చటికిఁబోయెదను. నాతమ్ముని విడిచి నేను క్షణమయినను బ్రతికి యుండనొల్లను. దేవతలు పూర్వము తమ కపకారము గావించిననన్నుంజూచి యిపు డెగతాళిసేయుదురు. కుంభకర్ణా ! నీవు హతుఁడవయితివే ! ఇంక నే నింద్రు నెట్లుజయింపఁగలను? మహాత్ముఁడగు విభీషణుఁడు నాశుభముఁగోరి చెప్పినమాట నాకిపుడు యథార్థముగా సంభవించినది. దానిని మును పజ్ఞానమువలనఁ జేకొన నయితిని. కుంభకర్ణునకుఁ బ్రహస్తునకు నిట్లు భయంకరమగు వినాశముగలిగిన దాదిగా విభీషణుఁడు చెప్పినమాట నన్నుఁ బీడించుచున్నది. నేను ధర్మాత్ముఁడగు నాశ్రీమంతుని విభీషణుని దఱిమితినే. ఆ పాపకార్యపుఫలమే యిట్లు దుఃఖప్రదముగా పరిపక్వమై నాకు సంభవించినదే!' అని విలపించెను. రావణుఁడు, ఇంద్రశత్రుఁడగు తనతమ్ముఁడు కుంభకర్ణుఁడు హతుఁడగుటం దెలిసి, మనస్సు మిక్కిలియుఁ గలంగి, యతనింగూర్చి యిట్లు పలువిధముల నెంతయు దీనముగాఁ బలవించి యంత దుఃఖముసహింపఁజాలక యా మిక్కుటమైన యార్తిచే సోలి నేలంబడెను. ఇది యఱువదియెనిమిదవసర్గము.



### రావణప్రేషితులై మహోదర మహాపార్శ్వ నరాంతక దేవాంతక త్రిశిరోతికాయులు యుద్ధమునకు వచ్చుట.

దురాత్ముఁడగు రావణుఁ డిట్లు శోకమునఁ బరితపించుచు విలపించుచుండుటను విని త్రిశిరుఁ డతనితో 'రాజా ! మా నడిమితండ్రియగు కుంభకర్ణుఁడు నీవు చెప్పినట్లు, మహాపరాక్రమశాలియే; సందేహము లేదు. దైవయోగమున హతుఁడయ్యెను.

అయినను సత్పురుషులయినవారు మీవలె నెంతమాత్రము విలపింపరు. ప్రభు ముల్లోకములకును నీ వొక్కఁడవే చాలుదువు. ఇది నిజము. అట్టి నీవు, నిన్ను దలంచి ప్రాకృతునివలె నీవిధమున దుఃఖింపనేల? నీకు బ్రహ్మదేవుఁ డొసంగినశక్తియు కవచమును బాణమును ధనుస్సును, వేయి గాడిదల పూన్చినదియు మేఘగర్జనవలె శబ్దించునదియు నగుమహారథమును గలవు. ఒకప్పుడు, నీ వాయుధ మొకటియు లేకయే, దేవదానవులనుంగూడ విదళించియున్నావు. అట్టినీవు, ఇప్పుడు సమస్తాయుధసంపన్నుఁడవై రాముని నడంప నేర్తువు. మహారాజా! ఇంతేల! నీవూరకయిచటనే నిచ్చ లుండుము. నేను యుద్ధమునకు వెడలిపోయెదను. గరుడుఁడు సర్పములనుంబోలె నేను నీశత్రువులను నున్మూలనము చేసెదను. దేవేంద్రుఁడు శంబరాసురునింబోలె, విష్ణుండు * నరకాసురునింబోలె, నే నిపుడే యుద్ధమున రామునిఁ గూల్చి పడవైచెదను' అనెను. రాక్షసరాజగు రావణుఁడు, త్రిశిరునిమాటనువిని కాలచోదితుఁడగుటవలన రాముని గెలుచుట యశక్యమని యెఱుంగక యామాటకు తన్ను మరలఁ గ్రొత్తగాఁ బుట్టినవానివలెఁ దలఁచుకొనెను. త్రిశిరుండు చెప్పినమాటవిని, రావణునికుమారులును వీరులును, దేవేంద్ర సమపరాక్రములనయిన రాక్షససింహులు, దేవాంతకుఁడును, నరాంతకుఁడును, మహాతేజుండయిన యతికాయుఁడును, నంత నేను నేనని గర్జించుచు యుద్ధంబునకుఁబోవ హర్షమున నుత్సహించినవారయిరి. వారందఱును ఆకాశమునం బోవంగలవారలు, అందఱును మాయలం దాఁటి తేఱినవారలు. అందఱును దేవతలగర్వము నడంచువారు. అందఱును యుద్ధమున జయింప నలవిగానివారలు. అందఱును మంచి బలసంపన్నులు. అందఱును విస్తరించిన కీర్తిగలవారు. అందఱును యుద్ధమునందు దేవతలు గంధర్వులు కిన్నరులు మహోరగులు నొక్కపెట్ట నెత్తివచ్చినను బరాజయము నొందినట్లు విన్నదిలేదు. అందఱును విద్యావంతులు, వీరులు. అందఱును యుద్ధమునం దాఁటి తేఱినదిట్టలు, అందఱును ఉత్కృష్టమయిన శాస్త్రజ్ఞానముగలవారు. అందఱును వరములు వడసినవారు. అప్పు డారాక్షసరాజు రావణుఁడు, సూర్యునికింబోలె వర్చస్సు గలవారై శత్రుబలంబుల నుఱుమాడునట్టి కొడుకులు పరివేష్టించియుండఁగా, దానవుల వెనుగర్వమును నడంచునట్టి దేవతలు పరివేష్టించి యున్న దేవేంద్రునివలెఁ బ్రకాశించెను. ఆరావణుఁడు కొడుకులను గవుంగలించుకొని, భూషణములచే నలంకరించి ప్రశస్తములగు నాశీర్వచనములతో యుద్ధమునకుఁ బంపెను. రావణుఁడు యుద్ధంబునఁ గొడుకుల

---

* ఇట చెప్పఁబడిన నరకాసురుఁడు భూదేవికుమారుఁడగు నరకాసురుఁడు గాఁడు. ఏలన వాఁడు వాల్మీకి ప్రబంధము నిర్మించుకాలమునఁ బుట్టియుండలేదు. విప్రచిత్తికి సింహికయందు 'వాతాపిర్నముచిశ్చైవ ఇల్వలస్సృమర స్తథా। అన్ధకో నరకశ్చైవ కాలనాభ స్తథైవచ' అని పుట్టిన వాతాపి మొదలగు వారలలోని నరకాసురుఁడని తెలియునది. గోవిందరాజులు.

కు రక్షణార్థముగా, తనతమ్ములును *యుద్ధోన్మత్తుడును మత్తుఁ డనఁబడువారునగు మహోదర మహాపార్శ్వులను బంపెను. మహాకాయులగు నారాక్షసులు, మహాత్ముఁడును శత్రురావణుఁడు నగురావణునకు నమస్కరించి ప్రదక్షిణముగావించి యుద్ధమునకుం బయనమైరి. మహాబలశాలురయిన యారాక్షసతిలకు లార్వురును, ఆయుధప్రహారములను నివారించునట్టి †యోషధులను నానావిధసుగంధములనుం బూసికొని యుద్ధంబున కువ్విళులూరుచు వెడలిరి. త్రిశిరుఁడును, అతికాయుఁడును, దేవాంతకుఁడును, నరాంతకుఁడును, మహోదరుఁడును, మహాపార్శ్వుఁడును ననెడి వీరు కాలచోదితులై యుద్ధమునకు వెడలిరి. అంత, మహోదరుఁడు ఐరావతకులంబునఁ బుట్టినదై నల్లని మేఘమునుం బోలుసుదర్శనమను నేనుంగు నారోహించెను. ఆ మహోదరుఁడు, సమస్తాయుధములతోఁగూడి యమ్ములపొదులతోను నలంకృతమైయున్న యేనుంగునెక్కి, యందు, ‡ అస్తగిరియందు సూర్యునివలె, నొప్పుచుండెను. రావణుపుత్త్రుఁ డగుత్రిశిరుఁడు, ఉత్తమాశ్వములు పూన్పఁబడి సమస్తాయుధములతో నిండియున్న మేలిరథము నారోహించెను. ఆయుధకాంతులు గలిగి యతిధ్వనితోఁ గూడియున్న రథమునెక్కి విలుదాల్చి యున్నత్రిశిరుఁడు, మెఱపులతోను నుల్కలతోను నింద్రధనువుతోనుం గూడి పర్వతశిఖరముపైనున్న మేఘమునవలెఁ దేజరిల్లెను. ఆ త్రిశిరుఁడు ఆయుత్తమరథమునందు, మూఁడు తలలందును మూఁడుకిరీటములు గలవాఁడై, మూఁడుబంగారుశిఖరములు గల పర్వతరాజం బగుహిమవంతమువలెఁ బ్రకాశించెను. అప్పుడు మహాతేజుండును, విలుకాండ్రలోనెల్ల మేటియు రాక్షసరాజగు రావణునికుమారుఁడు నగునతికాయుఁడు మంచి చక్రములును కన్నులును గలమేలిరథము నారోహించెను. అది మంచి కాఁడికిక్రిందిమానితోను నొగతోనుగూడి పొదులతోను విండ్లతోను బ్రకాశించుచు, ఈఁటెలు, కత్తులు, ఇనుపగుదియలు మొదలగునవియు నిండియుండెను. ఆ యతికాయుఁడు, దేదీప్యమానమై బంగారుచే రంగారుచున్న కిరీటమును భూషణములనుం దాల్చి కిరణములచేఁ బ్రకాశించు మేరుపర్వతమువలెఁ దేజరిల్లెను. మహాబలుండయిన యా రాజకుమారుఁ డతికాయుఁడు దేవతలచే

---

* ఈయుద్ధోన్మత్తుఁడును మత్తుఁడును వరుసగా రావణుని తమ్ములగు మహోదరుఁడును మహాపార్శ్వుఁడు నగుదురు.

† ఓషధులు 'కోష్ఠంమాంసీ హరిద్రేద్వే మురాశైలేయచన్దనే । త్వచాచమ్పకముస్తాశ్చ సర్వౌషధ్యో దశస్మృతాః' కోష్టు, జటామాంసి, పసుపురెండు, పెన్నేరుగడ్డ, రాతిపువ్వు, చందనను, లవంగపట్ట, సంపెఁగ, తుంగముస్త అనెడి పదియోషధులును ఆయుధము దెబ్బలను నివర్తించునవని తెలియునది.

‡ 'అస్తగిరియందు సూర్యునివలె ననుటచే అస్తమయసూర్యునివలెఁ దోఁడనే వినాశోన్ముఖుఁ డగుట సూచితమగుచున్నది.

దేవేంద్రుఁడుంబోలె, రాక్షసవీరులచేఁ బరివేష్టితుండై, యా రథమున నెంతయుఁ బ్రకాశించుచుండెను. నరాంతకుండు, ఉచ్చైశ్శ్రవమువలెఁ జూపట్టుచు బంగారు భూషణములచే నలంకృతమై మనోవేగమును మహాకాయమునగు తెల్లని యశ్వము నారోహించెను. నరాంతకుఁ డిట్లు, గుఱ్ఱము నెక్కి కొఱవివంటి యీఁటె యుం గొని, నెమిలి నెక్కి శక్తిం జేకొనియున్న మహాతేజుండగు కుమారస్వామివలెఁ బ్రకాశించెను. దేవాంతకుఁడు వజ్రములు దాపియున్న పరిఘమును జేతులం బట్టుకొని, సముద్రమథనము నపుడు, మందరపర్వతమును దాల్చియున్న విష్ణుదేహము ననుకరించుచుఁ బ్రకాశించెను. మహాకాయుండును మహాపరాక్రమశాలియునగు మహాపార్శ్వుఁడు, గద చేతంబట్టి యుద్ధమున గదాధరుఁడగు కుబేరునివలెఁ బ్రకాశించెను. దేవతలు, అప్రతిమంబగు సైన్యములచేఁ బరివృతులై యమరావతినుండి వెడలునట్లు, మహాబలవంతులగు నారాక్షసులు, అప్రతిమంబగు సైన్యములచేఁ బరివృతులై లంకనుండి వెడలిరి. మహాబలవంతులగు రాక్షసులు మేటియాయుధములను దాల్చి కొందఱు గజములను, గొంద ఱశ్వములను, గొందఱు మబ్బుల యుఱుముంబోలె మొరయు రథములను నెక్కి, యామహోదరాదుల వెంబడిఁ బోయిరి. మహాబలశాలులై సూర్యునకుంబోలె వర్చస్సుగలిగి కిరీటధరులై కాంతిం దళుక్కొత్తు నారాక్షసకుమారులు, ఆకాశమున వెలుంగుచున్న గ్రహములవలె వెలుంగుచుండిరి. ఆ రాక్షసులు దాల్చియున్న యాయుధములబారు, శరత్కాలమేఘములవలె తెల్లనై యుల్లసిల్లుచు, ఆకాశమునందు బారులీఱియున్న హంసలపంక్తివలెఁ బ్రకాశించినది. ఆ రాక్షసులు 'శత్రువులనయినను గెలువవలయును; లేక వారిచే మరణమునయినఁ బొందవలయును' అని నిశ్చయించి వెడలిపోయిరి. ఆవీరు లిట్లు చేయవలయునని నిశ్చయించి, యుద్ధార్థులయి వెడలిపోయిరి. వీరు లారాక్షసులు, యుద్ధమున మిక్కిలియు మదించియున్నవారు గావున యుద్ధరంగమునకుం బోవుచు, గర్జించిరి, సింహనాదములు సేసిరి, *బాణములనువిడిచి మరల పట్టుకొనిరి. అప్పు డారాక్షసుల యార్పులచేతను, అప్పళింతలచేతను, భూమియు చలించినది. వారల సింహనాదములచే నాకాశము పగిలినట్లుండెను. మహాబలవంతులగు నామేటి రాక్షసవీరులు, అట్లు సంతోషమునంబోయి, శిలలను వృక్షములనుం బట్టుకొని యుద్ధమున కాయితమై యున్న వానరసైన్యమునుఁ జూచిరి. మహాబలులగు వానరులును, గజరథతురగములు గ్రిక్కిఱిసి, రథములందలి వందలకొలఁది చిఱుగంటలచే గణగణమని మ్రోఁగుచు, పెద్దపెద్ద యాయుధములను ధరించి, మండుచున్న యగ్గివలెను వెలుంగుచున్న సూర్యునివలెను జూపట్టుచున్న రాక్షసులు నలుగడల బలసియుండఁగా

* ఇందులకు 'జగర్జుశ్చ ప్రణేదుశ్చ చిక్షిపుశ్చాపి సాయకాన్ । జగృహుశ్చాపి తేవీరా నిర్యాన్తో యుద్ధదుర్మదాః' అనిమూలము. 'చిక్షిపు... జగృహుశ్చాపి' అనుటకు 'క్షేపవచనములాడిరి; బాణములం బట్టిరి' అని వ్యాఖ్యాతల ర్థముచెప్పియున్నారు.

నల్లని మేఘమువలెఁ గార్కొనివచ్చుచున్న రాక్షససైన్యమునుజూచిరి. మహాబలులగు వానరులు వచ్చుచున్న యారాక్షససేననుజూచి తమపరాక్రమముఁ జూపుటకు వీలు దొఱికినదని వెనుగొండల నెత్తికొని, బిట్టుగా సింహనాదములు గావించియు నారాక్షసులంజూచి యోర్వఁజాలక గర్జించుచుండిరి. అంత మహాబలులగు నారాక్షస సమూహములును, వానరయూథపతుల సింహనాదధ్వనిని విని వారి వెన్నుబ్బునకు సహింపఁజాలక మఱింతబిట్టుగాను భయంకరముగాను నార్చిరి. ఆవానరయూథపులు, భయంకరమైనయారాక్షససేనను జొరఁబడి,పర్వతముల చేత నెత్తుకొని, శిఖరములతోడి పర్వతములవలెఁ దిరిగిరి. వానరులు, శిలలను వృక్షములను ఆయుధముగాఁగొని యుద్ధము సేయువారు; కావున, పెద్దబోదెలుగల వృక్షములంగొని యావానరపుంగవులు పరమక్రుద్ధులై కొంద ఱాకాశమునుండియు, కొందఱు భూమిపైనుండియు రాక్షససైన్యములందు విహరించిరి. అప్పుడు రాక్షసులును వానరులును గ్రిక్కిఱిసి భయంకరముగా యుద్ధముగావించిరి. భయంకరపరాక్రములగు వానరులు, రాక్షసప్రయుక్తములైన బాణసమూహముచే నెంత నొంపఁబడుచున్నను నిలువక, వారిపై వృక్షములను శిలలను పర్వతములనును, అనుపమముగాఁ గురియించిరి. వానరులును రాక్షసులును యుద్ధమునం దుత్సాహమున సింహనాదములుసేసిరి. వానరులు రాక్షసులను శిలలచేమోఁది చూర్ణముగావించిరి. కొందఱు వానరులు,యుద్ధంబునం గ్రుద్ధులై కవచములను దొడిగియు, ఆభరణాలంకృతులయ్యు రథములను నారోహించియున్న వీరులగు రాక్షసులపయికి ఱెటాలున నెగిరి చంపిరి; గజములను గుఱ్ఱములను నారోహించియున్న వారినిని నట్లే పయికెగిరిచంపిరి. ఆయుద్ధమున మేటిరాక్షసులు, పర్వతశిఖరములు తమయంగములనెల్ల నెరసియుండ, పిడికిటిపోటులచే కనుగ్రుడ్లు వెలికుఱుకఁగాఁ దిరుగుచు నేలంబడి యఱచిరి. రాక్షసులును వాఁడిబాణములను భేదించి శూలములను,ముద్గరములను,ఖడ్గములను,ప్రాసములను,శక్తులనుంగొని వానరకుంజరులను వధించిరి.ఆయుద్ధమునందు వానరులును రాక్షసులును ఒకరినొకరు జయింపఁగోరి, అవయవములన్నియు శత్రురక్తమునఁ దొప్పదోఁగ, నొండొరులం బడఁగూల్చిరి.అంత ముహూర్తమాత్రమున నాయుద్ధభూమియంతయు,వానరులును రాక్షసులు నొండొరులపై వైచిన పర్వతములచేతను ఖడ్గములచేతను గప్పఁబడి నెత్తురు వెల్లువలయ్యెను. అప్పు డాయుద్ధభూమియంతటను పర్వతాకారులును, పగవారి మర్దించువారును, యుద్ధమదగర్వితులును నగురాక్షసుల కళేబరములు నెరసిబెరసి యుండినవి. వానరులు బాహుయుద్ధమున రాక్షసులను బయికెత్తియుఁ బడఁజిమ్మియు వారిశూలాద్యాయుధమును విఱిచివైవఁగా, రాక్షసులును వెనుదీయక మరలి వారిని దారసించి చూచువారి కాశ్చర్యముగలుగునట్లు,కాలుసేతులం బోరుగావించిరి. రాక్షసులు వానరులతోనే వానరులం బడఁగొట్టిరి. వానరులును, రాక్షసులతోనే రాక్షసులను బ్రహరించుచుండిరి. రాక్షసులు వానరులువైచు శిలల నొడిసిపట్టు

కొని వానరులం బడఁగూల్చిరి. వానరులును రాక్షసులచేతియాయుధములను బెఱికి కొని వారిని గొట్టిచంపిరి. వానరులును రాక్షసులును, యుద్ధమున నొకరినొకరు పర్వతములచేతను శూలములచేతను బాణములచేతను గొట్టుకొనియు దేహములు భేదించియు, సింహనాదములు గావించిరి. ఆయుద్ధభూమియందు, రాక్షసులు వానరులచేఁ గొట్టువడి, కవచములు పఱియలుకాఁగా, కత్తివాటువడ్డ వృక్షములు పాలుగార్చునట్లు నెత్తురుకార్చిరి. కొందఱు వానరులు యుద్ధమున రథముచేత రథమును, ఏనుఁగుచేత నేనుఁగును, గుఱ్ఱముచేత గుఱ్ఱమును, వేసికొట్టిరి. వానరులందఱును, సంతుష్టమనస్కులై మనశ్శిలలంగొనియు, పెక్కుకొమ్మలుగల వృక్షములనుంగొనియు, రాక్షసులను వధించిరి. అప్పుడు రాక్షసులకును వానరులకును యుద్ధము భయంకరమయ్యెను. రాక్షసులు, క్షురప్రములచేతను, అర్ధచంద్రబాణములచేతను, బల్లెములచేతను, వాఁడియగు తక్కినబాణములచేతను వానరోత్తములు [illegible] వృక్షములను శిలలను ఛేదించిరి. యుద్ధమునందు, చెల్లచెదరై పడియున్న పర[illegible]ఖ[illegible]ములును, ఛిన్నములయిన వృక్షములును, హతులయిన వానరరాక్షసు[illegible]భూమి నడచిపోవుట కలవిగానిదయ్యె. ఉడివ్రాసిబల[illegible]గల [illegible] లందఱును, గర్వమునను నుబ్బునను దోఁచిన చేష్టలు సేయుచు, యుద్ధభూమి నొంది భయమువిడిచి, రాక్షసుల నానాయుధములను బెఱికికొని, వానింగొని యా రాక్షసులతోడ యుద్ధము గావించిరి. అట్లుదొమ్మియుద్ధము జరుగునపుడు వానరు లుబ్బున చెలరేఁగుచుండుటయు, రాక్షసులుత్రోపువడి కూలుచుండుటయును జూచి మహర్షులును దేవతలును సంతోషమున నార్చిరి. అంత నరాంతకుఁడు వాయువేగము గలగుఱ్ఱము నెక్కి, తీక్ష్ణమయిన శక్తినిగొని, మహాసముద్రమును మత్స్యము ప్రవేశించునట్లు, వానరరాజసైన్యమును బ్రవేశించెను. ఆవీరుఁడు మెఱయుచున్న ప్రాసముచేత, నేడువందల వానరులను భేదించి చంపెను. అట్లు, ఇంద్రశత్రుఁడగు నమ్మహాబలుఁడు, తా నొక్కండును నిట్లు క్షణమాత్రమున మేటి వానరసేనను గొట్టి కలగుండుపఱిచెను. విద్యాధరులును, మహర్షులును, గుఱ్ఱముపైఁ గూర్చుండి వానరసేనల విహరించుచున్న మహాబలుని నరాంతకునిం జూచిరి. ఆనరాంతకుఁడు పర్వతాకారులగు వానరులను గూల్చుచుఁ బోఁగా నతనిమార్గము వట్టిపర్వతాకారములగు వానరుల కళేబరములచేతను గప్పంబడి నెత్తురుగండలచేతఁ జొంపిగొని చూపట్టినది. ఆ మేటివానరులు పరాక్రమము చూపఁ దలఁచినంతలోనే నరాంతకుండు వారల నాక్రమించికొని భేదించుచుండెను. నరాంతకుండు, యుద్ధాగ్రమున, మెఱయుచున్న ప్రాసమును బట్టుకొని, దావాగ్ని వనములను దహించునట్లు, వానరసైన్యములను దహించెను. వానరులు వృక్షములనుగాని పర్వతములనుగాని పెకల్చునంతలోపలనే, వారలు నరాంతకుని ప్రాసముచేఁ గొట్టువడి, వజ్రముచే నఱుకంబడిన కొండలవలె నేలంగూలిరి. బలవంతుఁడగు నరాంతకుఁడు, యుద్ధమున, వానరసైన్యములనెల్ల మర్దించుచు, వర్షాకాలమునందు వాయువువలె,

నెదురులేక యన్నిదిక్కులందును సంచరించుచుండెను. ఆవీర్యవంతుఁడు, వానరులను పయ్యికెగురుచున్నను, నిలుచున్నను, పరుగిడుచున్నను, అందఱినుబట్టి వధించుచుండుటచే, నవ్వానరవీరులు పరుగిడుటకుఁగాని నిలుచుండుటకుఁగాని భయమున నిట్టిట్టనియాడుటకుఁగాని చాలరైరి. మృత్యువునుంబోలినదై సూర్యునివలెఁ దేజరిల్లుచున్న యొక్క ప్రాసముచే వానరసైన్యములు భిన్నములై నేలంబడినవి. వానరులు వజ్రాయుధపువ్రేటుతో సాటియగు నాప్రాసంపుదెబ్బకు సహింపఁజాలక మిక్కిలియు బిగ్గఱగాఁ గూయిడిరి. అప్పుడు ప్రాసముచే హతులై పడుచున్న వానరవీరుల రూపములు వజ్రాయుధముచే శిఖరసమూహములు భిన్నములై పడుచున్న పర్వతములవలెఁ జూపట్టినవి. మున్ను కుంభకర్ణునిచే నేలంద్రెళ్లి మూర్ఛితులై యుండిన మహాబలవంతులగు వానరశ్రేష్ఠులు, ఈలోపల మూర్ఛదేఱి సుగ్రీవునిఁ గొలిచియుండిరి. సుగ్రీవుఁడు నలుప్రక్కలం గలయఁజూచుచు, నరాంతకునివలనిభయమున వానరసేన బెదరుగొని యిట్టటు పరుగెత్తుచుండుటను జూచెను. అతం డట్లు పరుగెత్తుచున్న తనసేనను జూచి యంత గుఱ్ఱముమీఁదఁ గూర్చుండి, ప్రాసముచేఁ బట్టివచ్చుచున్న నరాంతకునిం గనుఁగొనెను. అంత మహాతేజుండగు నవ్వానరరాజు సుగ్రీవుఁడు, ఇంద్రునింబోలు పరాక్రమశాలి యగుకుమారు నంగదునిఁజూచి 'నీవుపోయి యదిగో గుఱ్ఱముపైఁ గూర్చుండి, వానరసేనను గలఁగుండు పఱచుచున్న వీరుం డగునారాక్షసుని వేగ ప్రాణములకుం బాపుము' అనెను. అంత నాయంగదుఁడు రాజగు సుగ్రీవుఁడు చెప్పినదివిని, మేఘసమూహమునుండి సూర్యుఁడు వెలివచ్చునట్లు, మేఘమువలెఁ గారుకొనుచున్న వానరసైన్యమునుండి వెలికిదూఁకెను. దట్టముగాఁ బెనఁచుకొనియున్న పర్వతమువలె నొప్పు వానరోత్తముఁ డంగదుఁడు, బాహుపురులు సందిటఁ గట్టుకొనియుండుటచేత, గైరికధాతువులతోఁగూడిన పర్వతమువలెఁ బ్రకాశించెను. మహాతేజుం డగువాలిపుత్త్రుం డంగదుఁడు, ఏయాయుధమును దీసికొనక, కేవల నఖదంతములే యాయుధములుగాఁ గలవాఁడై నరాంతకు నెదురుచని వానితో 'నిలువు. ఈయల్పవానరులతో నేమిచేయుచున్నావు? వజ్రమువలె బిట్టుగాఁ దాఁకునట్టి యీప్రాసమును నాయీవక్షముపై వేయుము' అనెను. నరాంతకుఁ డంగదుని మాటనువిని, పండ్లచేఁ బెదవిని గొఱికికొని, సర్పమువలె నిట్టూర్పులు పుచ్చుచు, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడయ్యెను. నరాంతకుఁ డట్లు కుపితుఁడై వాలిపుత్త్రుఁ డగు నంగదునిమీఁదికిఁ బోయి, యపుడు జ్వలించుచున్న ప్రాసమును గిరగిరం ద్రిప్పి వేగంబున నతనిపయి వైచెను. అది వజ్రసమాన మైనయంగదుని వక్షఃస్థలమును దాఁకి విఱిఁగి నేలంబడెను. వాలికుమారుఁ డాయంగదుఁడు, గరుడునిచేఁ ద్రుంపఁబడిన సర్పశరీరమువలె విఱిగిపడిన యాప్రాసమునుజూచి, యపుడు, యఱచేతి నెత్తి వానిగుఱ్ఱము నెత్తిమీఁదఁ జఱచెను. పర్వతాకారమైన యానరాంతకునిగుఱ్ఱము, యంగదుని యఱచేతిదెబ్బకు, తలపగిలి దవడలు లోనికిఁబోయి, కనుగ్రుడ్లు పెటిలి,

నాలుక వెలికుఱికి, నేలంగూలెను. మహాప్రభావుఁడగు నరాంతకుఁడు, తనగుఱ్ఱము హతమై నేలంగూలుటనుజూచి, కోపావేశమునొంది, పిడికిలియెత్తి యుద్ధమున వాలిపుత్త్రుఁ డగునంగదుని తలపైఁ బొడిచెను. అంత నంగదుఁడు నరాంతకుని పిడికిటిపోటునకు తలపగిలి, మిక్కిలియు వేఁడినెత్తురు రురవడిగాఁ గాఱ, పలుమాఱు మండిమిడిసిపడుచును నింతలో మూర్ఛిల్లుచును దుదకుఁ దెలివొంది నరాంతకునిబలమున కచ్చెరువొందెను. అంత మహాబలుం డగువాలిపుత్త్రుఁ డంగదుఁడు, వజ్రముంబోని యురనడిగలిగి, పర్వతశిఖరమునకు సాటియగు పిడికిలి నలవరించుకొని, నరాంతకుని ఱొమ్ముపైఁ బొడిచెను. ఆ నరాంతకుఁ డాపిడికిటిపోటునకు నలంగి ఱొమ్ము పగులఁగా, జ్వాలారూపమునఁ బయి కెగయునెత్తురుధారల దేహమెల్లఁ దోఁగ, వజ్రాయుధపు వ్రేటుచే విఱిగిపడిన పర్వతమువలె నేలంగూలెను. అంత వీరాగ్రేసరుఁ డగునానరాంతకుఁడు వాలికుమారుం డగునంగదునిచే యుద్ధంబున హతుఁడు కాఁగానే, యాకాశమున మేటిదేవతలును వానరులును సంతోషమున మహాధ్వని గావించిరి. అంత, నంగదుఁడు మిక్కిలియు దుష్కరముఁను గావుననే రాముని మనస్సునకు మిక్కిలియు సంతోషము గూర్చునదియు నగునట్టిపరాక్రమము నెఱపుటవలన, రాముఁడు తానతి వీర్యవిక్రమశాలియయ్యు, నా యంగదునికృత్యమున కాశ్చర్యపడెను. రాముఁ డట్లు పొగడుటకు సంతుష్టుఁడై యా యంగదుఁడును మరలి యుద్ధమునకు సన్నద్ధుఁ డయ్యెను. ఇది యఱువదితొమ్మిదవసర్గము.



హనుమంతుఁడు దేవాంతకునిని, నీలుఁడు మహోదరునిని జంపుట; హనుమంతుఁడు త్రిశిరునింగూల్చుట; ఋషభుఁడు మహాపార్శ్వునిఁ జంపుట.

నరాంతకుండు హతుఁడగుటనుజూచి, రాక్షసశ్రేష్ఠు లగుదేవాంతకుఁడును పులస్త్యవంశజుఁ డగుత్రిశిరుఁడును, మహోదరుఁడును, నాక్రోశించిరి. వీర్యశాలి యగు మహోదరుఁడు మేఘమువలెఁ జూపట్టు మేటిగజము నారోహించి, మహావీర్యవంతుఁడగు నంగదునిఁదఱిమి నడచెను. అట్లు బలవంతుఁడగు దేవాంతకుఁడు తోఁబుట్టువు హతుఁడయినదుఃఖమున మిక్కిలియుం బొక్కుచు, మెఱయుచున్న పరిఘమును గొని యంగదునిమీఁది కడరెను. అంత, వీరుఁడగు త్రిశిరుఁడు సూర్యునివలె ధగధగ మెఱయుచున్నదై మేలయినగుఱ్ఱములు పూన్పంబడియున్నరథము నారోహించి యంగదునిపైకిఁ దలపడెను. అట్లు దేవతలగర్వంబు నడంచునట్టి దిట్టలగు మేటిరాక్షసు లతనిమీఁదికిఁ దలపడఁగా, ఆయంగదుఁడు, పెద్దకొమ్మలు గలవృక్షమునొకటిఁ బెకలించెను. వీరుం డగునంగదుఁడు, దేవేంద్రుఁడు దీప్తమగు వజ్రాయుధమును బ్రయోగించునట్లు, పెద్దకొమ్మలు గలయాపెనువృక్షమును, దేవాంతకునిపై వేగ విసరి

వైచెను. త్రిశిరుఁడు కృష్ణసర్పములంబోని బాణములచే నావృక్షమును ఛేదించెను. అప్పు డంగదుఁ డావృక్షము నఱుకఁబడుటనుజూచి యాకాశమున కెగసెను. అంత నా కపికుంజరుఁడు, వృక్షములను పర్వతములనుం గురిసెను. త్రిశిరుఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై వానినన్నిటిని వాఁడిబాణముల ఖండించివైచెను. దేవాంతకుఁడు పరిఘాగ్రముచే నావృక్షములను దట్టివేయుచుండెను. త్రిశిరుఁడు వీరుఁడగు నంగదునితో మోహరించి బాణముల నేసెను. మహోదరుఁడు మిక్కిలిక్రుద్ధుఁడై యేనుంగును నంగదునిమీఁదికిఁదోలి,వజ్రసమానములగు తోమరములచే నంగదునిఱొమ్మునం గొట్టెను. వేగవంతుఁడగు దేవాంతకుఁడును, చాలఁగ్రుద్ధుఁడై యప్పు డంగదునిపయిం బోయి, శీఘ్రమునఁ బరిఘముతో నతనిని బ్రహరించి, తెఱపిగలుగుటకై వెనుకకుఁ బోయెను. వాలిపుత్త్రుఁ డగునంగదుఁడు మహాతేజుండును మిక్కిలి ప్రతాపవంతుఁడు నగును గావునఁ బిమ్మట వ్యగ్రరాక్షసశ్రేష్ఠులు నొక్కపెట్ట తనపయిఁ దలపడినను నెంతమాత్రము వ్యథనొందనివాఁడై యుండెను. వేగవంతుఁడును పరమదర్పయుండును నగు నా నంగదుఁడు, మహానీలమేఘమువంటి దానిని, పయి కెగిరి, మహోదరుఁ డెక్కియున్న వెనుగజమును బిట్టుగా నఱచేతఁ జఱిచెను. యుద్ధమున, నాయంగదునిదెబ్బకు, ఆమహోదరునియేనుంగుకన్నులు రెండును వీడిపడినవి. ఆయేనుంగును గూయిడెను. అంగదుఁడు మహాబలవంతుఁడుగాన యాయేనుంగుదంతమును బెఱికి, యుద్ధమున దేవాంతకునిమీఁదికి దూఁకి, దానిచే నతనినిగొట్టెను. అతఁడు, వాయువుచే నెగురఁగొట్టఁబడిన వృక్షమువలె, నవయవములెల్ల విరవిరఁబోవఁగాఁ, బడి, నోటనుండి లత్తుకరసమువలె నెఱ్ఱనగునెత్తురుం గ్రక్కెను. అంత మహాతేజుండును బలవంతుఁడునగు దేవాంతకుఁ డెట్టకేలకుఁ దెప్పిఱి, భయంకరాకారమగుపరిఘము గిరగిరం ద్రిప్పి యపు డంగదునింగొట్టెను. అప్పుడు వానరరాజపుత్త్రుండగు నంగదుఁడు పరిఘముచేఁ గొట్టువడియు, మ్రోఁకాళ్లు నేలనూని, బోరగిలంబడి, మరల తోడనే లేచెను. త్రిశిరుఁడు వానరరాజపుత్త్రుండగు నంగదుఁడు లేచుటనుజూచి, యతనిని, బెడిదములై సూటిదప్పక చక్కనైయుండు మూఁడుబాణములచే నొసటంగొట్టెను. అంత నంగదునొక్కని ముగ్గురు మేటిరాక్షసులు చుట్టుముట్టియుండుటను దెలిసి, హనుమంతుఁడును నీలుఁడును దోడ్పడ బయలుదేఱివచ్చిరి. అంత నీలుఁడు, అప్పుడు, త్రిశిరునిమీఁద నొకపర్వతశిఖరమును వేయఁగా, బుద్ధిమంతుఁడగు నారావణపుత్త్రుఁడు, వాఁడిబాణముల దానిని ద్రుంచెను. ఆపర్వతశిఖరము త్రిశిరునిబాణశతముచే భిన్నమై తాలన్నియుఁబగిలి, మిడుంగుఱులతోను జ్వాలలతోను నొప్పుచు, నేలంబడెను. అంత నప్పుడు దేవాంతకుఁ డాపర్వతము బ్రద్దలగుటంజూచి యుబ్బి, పరిఘముగొని యుద్ధమున వాయుకుమారుఁ డంగదునిమీఁదికిఁ దలపడెను. అప్పుడు వాయుపుత్త్రుఁడు హనుమంతుఁడు, తనపయికి దేవాంతకుఁడు వచ్చుటంజూచి, వానిపయి కెగిరి, వజ్రసమానమగు పిడికిట వానిశిరస్సును బొడిచెను. అప్పుడు వీరుఁడును బలవంతుఁడునగు నామహాకపి

హనుమంతుఁడు, దేవాంతకుని శిరస్సుపైఁగొట్టి రాక్షసులందఱు వడంకునట్లు సింహనాదముసేసెను. రాక్షసరాజయినరావణునిపుత్త్రుఁడగు నాదేవాంతకుఁడు, ఆపిడికిటిపోటునకు తలవెనుక్కైదంతములును గన్నులును వెలికుఱుక, నాలుక వ్రేలుకాడ, నుసురుఱువీడి తోడనే నేలంగూలెను. రాక్షసయోధులలో ముఖ్యుఁడును, మహాబలుఁడును, దేవతలకు శత్త్రుండునగు నాదేవాంతకుఁడు యుద్ధమున హతుఁడగుటనుజూచి, త్రిశిరుఁడు క్రుద్ధుఁడై, నీలునిఱొమ్మునిమీఁద వాఁడిమొనలుగల పెక్కుబాణసమూహములు వర్షమువలె నుగ్రముగాఁ గురిసెను. మహోదరుండును మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై మందరపర్వతమును సూర్యుఁ డారోహించునట్లు,మరల పర్వతాకారమైన మఱియొకయేనుంగు వేగనారోహించి యుద్ధమునకువచ్చెను. అంత మెఱపులగుంపులతోను నింద్రధనుస్సుతోడనుం గూడినమేఘము పర్వతముమీఁద వర్షముగురియునట్లు, బహుభూషణాలంకృతుఁడై విలుదాల్చి యున్నయామహోదరుఁడు నీలునివక్షమునందు, బాణవర్షము గురియించెను. అంత మహాబలుం డగునామహోదరుఁడట్లు బాణసమూహములు దనచుట్టును వర్షించుచుండఁగా కపిసైన్యపాలుఁడగు నీలుఁడు భిన్నగాత్త్రుఁడై యవయవములెల్ల విరవిరఁబోవ నిట్టట్టుగదలలేక స్తంభించియుండెను. అంతనీలుఁడు కొంతవడికిఁ దెలివినొంది వృక్షసమూహములతోఁగూడిన యొక పర్వతమును బెకల్చి, మిక్కిలియు నుగ్రమగువేగమున నెగసివచ్చి యాకొండతో మహోదరునితలమీఁదం గొట్టెను. అంత నమ్మహోదరుఁడు ఆపర్వతము దెబ్బకుఁ దానును తనమహాగజమును భగ్నుఁడై హింసనొంది వజ్రాయుధముచే హతమైనపర్వతమువలె ప్రాణములెడలి నేలంబడెను. అట్లు తనపినతండ్రి యగుమహోదరుఁడ హతుఁడగుటంజూచి, త్రిశిరుఁడు, మిక్కిలి క్రుద్ధుఁడై విలుగొని హనుమంతుని వాఁడిబాణములఁ గాఁడనొప్పించెను. ఆహనుమంతుఁడు కుపితుఁడై పర్వతశిఖరము నొకటి ప్రయోగించెను. బలవంతుఁడగు త్రిశిరుఁడు దానిని వాఁడిబాణములేసి పెక్కువ్రయ్యలుగాఁ దునిమెను. మహాకపియగు హనుమంతుఁడు తానువైచిన పర్వతమ వ్యర్థమగుటనుజూచి అయ్యుద్ధమున రావణపుత్త్రుఁడగు త్రిశిరునిపై వృక్షములన జడిగాఁ గురియించెను. ప్రతాపవంతుఁ డగుత్రిశిరుఁడు వృక్షవర్షము పయివచ్చుటఁ జూచి, దాని నాకాశమునఁ బెక్కువాఁడిబాణములచే ఛేదించి సింహనాదమ గావించెను. అంత నపుడు హనుమంతుఁడు క్రుద్ధుఁడై పయికెగసి, మేఁటియేనుగును సింగముచీల్చునట్లు,త్రిశిరునిగుఱ్ఱములను నఖంబులఁ జీల్చివైచెను. అంత రావణపుత్త్రుండగు త్రిశిరుఁడు యముఁడు కాళరాత్రినింబోలె, తాను శక్తింగొని వాయుకుమారుఁడగు హనుమంతునిపై వైచెను. వానరశార్దూలుం డగు హనుమంతుఁడు ఆకాశముననుండి పడునుల్కయుంబోలె త్రిశిరుఁడు తనపై వైచినయాశక్తి, తన్ను తాఁకకమునుపే, దానినిబట్టి విఱిచి, సింహనాదము గావించెను. అట్లు భయంకర ప్రకాశంబగు నాశక్తిని హనుమంతుఁడు విఱిచివేయుటంజూచి, వానరులు వి

క్కలి సంతుష్టులై మేఘములవలె గర్జించిరి. అంత నవుడు రాక్షసోత్తముండగు త్రిశిరుఁడు, ఖడ్గముదీసి విశాలమగు హనుమంతునివక్షముపైఁ గొట్టెను. వీర్యవంతుఁడగు నావాయుకుమారుఁడు హనుమంతుఁడు, ఖడ్గపువ్రేటునం గొట్టువడి, త్రిశిరుని యొమ్ముపై నఱచేతం జఱిచెను. మహాతేజుండగు నా త్రిశిరుఁడు హనుమంతుని యఱచేతిదెబ్బకు మూర్ఛితుఁడై చేతియాయుధము జాఱిపడ, నేలంబడెను. పర్వతాకారుఁడగు నమ్మహాకపి హనుమంతుఁడు, అట్లు మూర్ఛితుఁడై నేలంబడుచున్న యాత్రిశిరుని చేతిఖడ్గము పెఱికికొని సర్వరాక్షసులును బెదరునట్లుగా సింహనాదము గావించెను. త్రిశిరుఁడు ఆ సింహనాదమునకు సహింపలేక హనుమంతునిపైకి దూఁకెను. అట్లు దూఁకి, యతనిని బిడికిటిపోటునం బొడిచెను. మహాకపి యగుహనుమంతుఁడా పిడికిటిపోటునకు మిక్కిలియుం గుపితుఁడై, రాక్షసతిలకుఁడగు త్రిశిరునిని కిరీటముతోఁగూడఁ బట్టుకొనెను. ఇంద్రుఁడు త్వష్టపుత్రుఁడయినవిశ్వరూపునితలలను ఖండించినట్లు, ఆ హనుమంతుఁడు, క్రుద్ధుఁడై వాఁడియగు నాఖడ్గముచే కిరీటయుక్తమై కుండలాలంకృత మగునా త్రిశిరునిశిరస్సుల మూటిని ఛేదించెను. జ్వలించుచున్న నిప్పువంటి నిడుదకన్నులు గలిగి, పర్వతాకారములగు నాయింద్రశత్రుని త్రిశిరునితలలు మూఁడును, ఆకాశముననుండి ఫలము ననుభవించి తీఱినజ్యోతులు పడునట్లు నేలంబడినవి. దేవశత్రుఁడయిన యా త్రిశిరుని దేవేంద్రపరాక్రముఁడగు హనుమంతుఁడు వధింపఁగానే, వానరు లందఱును సంతోషించి సింహనాదములు గావించిరి. భూమి మిక్కిలి చలించినది. అంత రాక్షసులు భయపడి నలుప్రక్కలం బాఱిపోయిరి. త్రిశిరుఁడు హతుఁడగుటయును, అట్లే మహోదరుఁడును రూపుమాయుటయును అంతకమున్న దుర్ధర్షులయిన దేవాంతక నరాంతకులును హతులగుటయుం జూచి మహాకోపనుండయిన మత్తుం డనఁబడు రాక్షసపుంగవుఁడు మహాపార్శ్వుఁడు మఱియుఁ గోపము నొందినవాఁడయ్యె, వాఁడు మిక్కిలి మెఱుఁగులు దుఱఁగలించుచు భయంకరమై యంతయు వట్టి యినుముచేతనే చేయఁబడిన మేలిగదను గయికొనెను. అది బంగారుపట్టెలచే నలంకృతమై మున్ను శత్రువుల రక్తముచే రంజితమై యవుడు యుద్ధంబున నెత్తురుగండల క్రొన్నురుఁగు గలిగి, తనరూపముచేతనే ప్రకాశించుచుండును. మఱియు నది కొనయందు మిక్కుటపుఁగాంతిచే మెఱయుచు, ఎఱ్ఱని పుష్పమాలికలచే నలంకృతమై, యైరావతము పుండరీకము సార్వభౌమ మనెడి దిగ్గజములకును భయము గలిగించుచుండెను. * రాక్షసపుంగవుఁ డగునామత్తుఁడు మహాపార్శ్వుఁడు మిక్కిలి క్రుద్ధుఁడై గద చేతంగొని ప్రళయకాలాగ్నివలె మండిపడుచు, వానరులమీఁదికిఁ బోయెను. అంత బలవంతుఁడగు ఋషభుఁడు ఒక్కయెగురున రావణునితమ్ముండగు మహాపార్శ్వునిం జేరి, వానిముందట నిలఁబడెను. అమ్మహాపార్శ్వుఁడు, పర్వతాకారుఁడగు ఋషభుఁడు తనముందట నిలుచుటంజూచి, కోపిం

* మహాపార్శ్వునకు మత్తుఁడు మత్తానీకుఁడను రెండుపేళ్లుగలవు.

వి. వజ్రసమానమగుగదచే నతనిఱొమ్మునఁ గొట్టెను. వానరసింహుఁడగు ఋషభుఁడు అట్లాగదచేఁ గొట్టువడి ఱొమ్ముపగిలి, మిక్కిలియుఁ దత్తఱిల్లి, మెంతయు నెత్తురు గాఱినవాఁడయ్యె. వానరతిలకుఁడగు ఋషభుఁడు, చాలసేపటికిఁ దెలివినొంది, వేగమున మహాబలుఁడగు నా మహాపార్శ్వునిగదపయికిఁ బరుగొత్తెను. ఆ ఋషభుఁడు భయిదమయిన యాగదను బెటికికొని, పలుమాఱు గిరగిరం ద్రిప్పి దానిచే యుద్ధమున మహాబలుండయిన మత్తానీకునిఁ (మహాపార్శ్వునిఁ) గొట్టెను. అంత నామత్తుఁడు (మహాపార్శ్వుఁడు) తనగదచేతనే కొట్టునడి భగ్నుఁడై దంతములును దుల్లిపడ నేత్రములు వెలికుఱుక, వజ్రాయుధముచేఁ గొట్టువడినపర్వతమువలె నేలంగూలెను. ఆమహాపార్శ్వుఁడు, కన్నులువీడి,బలమెడలి, యునుఱుమాలి నేలంబడఁగానే,రాక్షససైన్యము భయమునం బాఱినది. (ఉన్మత్తుఁ డనఁబడు మహోదరుఁడు అప్పుడు తనతోఁ బుట్టువగు మహాపార్శ్వుఁడు యుద్ధమున హతుఁడగుటనుజూచి స్వభావముననే మిక్కిలియు క్రుద్ధుఁడగువాఁడు గాన యప్పుడు మఱియుఁ గోపమునొంది ప్రళయకాలాగ్నివలెఁ దేజంబున వెలుంగుచుండెను. అంత నావీరుఁడు గదనుగొని యుగ్రమగు వానరసైన్యమును బెదరించుచు, మిక్కిలియుఁ బ్రచండమైన యగ్నివలె దహించుచు నాసైన్యమునడుమ వేగంబునఁ బాఱుతెంచెను.భయంకరపరాక్రముఁడగునారాక్షసుఁ డట్లు పయింబడి వచ్చుచుండుటనుజూచి, పర్వతాకారుఁడును మహాబలుండునగు గవాక్షుఁడు పర్వతమునొకటిఁగొని భయంకరుఁడగు నారాక్షసుని దానిచేఁ జంపంగోరి,వానిపయిఁ దలపడెను. వీరుండైన యున్మత్తుఁడును(మహోదరుఁడును) అట్లుయుద్ధమున నమ్మహాపర్వతము తనపయికి వచ్చుచుండుటనుజూచి, గదచేత దానిని నూఱుతునుకలుగా ఛేదించెను.మహాబాహుఁడును వానరకుంజరుఁడు నగు గవాక్షుఁడు ఆపర్వతము నుగ్గునూచయగుటకు నాశ్చర్యపడి మాటిమాటికి గర్జించెను. రాక్షసోత్తముఁడయిన యున్మత్తుఁడును (మహోదరుఁడును) మిక్కిలిక్రుద్ధుఁడై ధగధగమెఱయుచున్న గదను వేగగొని గవాక్షునిఱొమ్మునఁ గొట్టెను. వీరుఁ డాకపికుంజరుఁడు ఆగదచేతఁ గొట్టువడి మిక్కిలియు నెత్తురుగాఱ మూర్ఛితుఁడై నేలంబడెను. అంత నా గవాక్షుఁడు నుఱల మూర్ఛదేఱి, యామహోదరుని నెత్తిపై నఱచేతం జఱచెను. వీరుఁడును పర్వతాకారుండునగు నారాక్షసుఁడు ఆదెబ్బపడి పండ్లును గన్నులు నూడిపడ నేలం బడి వేఁడినెత్తురుగాఱ ప్రాణము లెడలినవాఁడయ్యె.) ఆరావణునితమ్ముఁడు హతుఁడు కాఁగానే సముద్రమువలెవిస్తరించిన రాక్షససైన్యము ఆయుధములువిడిచి కీర్తిలేక పట్టిబ్రతుకుఁ గలిగినంజాలునని చెలియలికట్టను దాఁటినసముద్రమువలెఁ బరుగొత్తినది. ఇది డెబ్బదియవ సర్గము.



అతికాయుఁడు యుద్ధమునకు వచ్చుట; విభీషణుఁడు రామున కతికాయునివృత్తాంతమును జెప్పుట; అతికాయుఁడు వానర యూథపతులను నిరసించి రామునిఁ దారసించి రాఁగా లక్ష్మణుండెదుర్కొని బ్రహ్మాస్త్రమున వానిని జంపుట.

మహాతేజుండై బ్రహ్మవలన వరముపడిసి యుద్ధమున దేవదానవుల గర్వము నడంచిన పర్వతాకారుండగు నతికాయుఁడు, అట్లు తనబలమంతయు, గగురుబుట్టించు నట్లు తుములముగాఁ గలఁగి నలంగుటం జూచి, దేవేంద్రపరాక్రము లయినతోఁ బుట్టువులు నిహతులగుటయుఁ గాంచి, మఱియుఁ దనపినతండ్రులును రాక్షసోత్తములు నగు నాయన్నదమ్ములు యుద్ధోన్మత్తుఁడును (మహోదరుఁడును) మత్తుఁడును (మహాపార్శ్వుఁడును) యుద్ధమున రూపడఁగుటయుఁ గనుంగొని, మిక్కిలియుఁ గోపమునొందెను. ఇంద్రునిశత్రుం డగునయ్యతికాయుఁడు, వేయిసూర్యులొక్కటిగాఁ గూడి నట్లు మిక్కిలియు వెలుఁగుచున్నరథము నారోహించి వానరులమీఁది కడరెను. అతఁడు కిరీటముఁ దాల్చి స్వచ్ఛములగుకుండలములు తళుకొత్త తనవెనువింటినారి సారించి, తనపేరు వాడి మహాధ్వనిగలుగునట్లు, సింహనాదము సేసెను. అట్లతనిసింహనాదమునకును బేరువాడిన చప్పుడునకును, బెడిదం బయినయల్లెత్రాటిధ్వనికిని, వానరులందఱును భయపడిరి. ఆవానరులందఱును అతికాయుని మహాకాయమునుజూచి 'వీఁడు కుంభకర్ణుఁడే; మరల లేచివచ్చినాఁడు' అని భయపీడితులై యొండొరుల నండఁగొనిరి. ఆవానరయూథములు త్రివిక్రమావతారమందలి విష్ణునిరూపమువలె నున్నయతనిరూపమునుజూచి భయపడి యంతంత పాఱిపోయినవి. ఆవానరు లతికాయునిఁ జూచి, యేమియుం దోఁచక యుద్ధమున శరణ్యుండగు లక్ష్మణాగ్రజుని రాముని శరణుఁ జొచ్చిరి. అంత రథము నెక్కి, పర్వతాకారుఁడై విలుదాల్చి ప్రళయకాలమేఘమువలె గర్జించుచున్న యతికాయుని రాముఁడు దూరమునఁ జూచెను. రాముఁడు మహాకాయుఁడగు నాయతికాయునిం జూచి యాశ్చర్యమునొంది, వానరులకు కూఱటఁ జెప్పి భయముడిపి విభీషణునిం జూచి 'పర్వతాకారుఁడయి విలుదాల్చి సింహదృష్టిగలిగి యున్నవీఁ డెవ్వఁడు, వేయిగుఱ్ఱములుగట్టంబడి విశాలమగు రథముమీఁద నున్నవాఁడు? కాంతిమంతములయిన వాఁడిశూలములును మిక్కిలియుఁ దీక్ష్ణములయిన ప్రాసతోమరములును చుట్టును వెలయ, భూతములచేఁ బరివృతుఁడయిన యీశ్వరునివలె వెలుంగుచున్నాఁడు. మఱియు మృత్యువు నాలుకవలె రాజిలుచుండు రథశక్తులతోడంగూడి మెఱపులతోఁ గూడిన మేఘమువలె మిక్కిలి వెలుంగుచున్నాఁడే! వీఁడెవ్వఁడు? ఈతనిధనుస్సులన్ని యుసజ్యములై పిఱిందిపట్ల బంగారుచే నలంకృతములై, యింద్రధనుస్సు ఆకాశము నుంబోలె, నితనిమేటిరథమును వెలింగించుచున్నవి. ఈరథికశ్రేష్ఠుఁడు సూర్యునివలెఁ దేజరిల్లుచున్న రథముపైఁ గూర్చుండి యుద్ధభూమిని వెలింగించుచు వచ్చుచున్నాఁడే!

ఈరాక్షససింహుఁ డెవ్వఁడు? ఇతఁడు సూర్యకిరణములంబోని బాణములచే దశదిశలం బ్రకాశింపఁజేయుచు ధ్వజశిఖరముననున్న రాహువుచే నెంతయు నొప్పుచున్నాఁడు. ఈతనిచేతివిల్లు తుదిని మొదలను నడుమను వంగినదై, మేఘధ్వనివంటి యల్లెత్రాటి మ్రోఁతతోఁగూడి, పిడిదిపట్ల బంగారుచేరంగారుచు నలంకృతమై యింద్రధనుస్సు వలెఁ జూపట్టుచు నెంతయుఁ బ్రకాశించుచున్నది. ఈతనిమహారథము, దివ్యమగు ధ్వజములతోను పతాకలతోనుంగూడి, కాఁడిక్రింది గుఱ్ఱముల నొప్పి నలుగురు సారథులచేఁ దోలంబడి, మేఘగర్జనమువలె ధ్వనించుచున్నది. ఈతనిరథముపై ముప్పదియెనిమిది యమ్ములపొదులున్నవి. మఱియు బెడిదములయిన విండ్లును బంగారువలెఁ బింగళములగు నల్లెత్రాళ్లును జెక్కులున్నవి. నాలుగుచేతులు కొలఁది గల పిళ్లుగలిగి పదిచేతుల నిడివితోఁగూడి రెండుప్రక్కలును గాంతికులుకుచున్న ఖడ్గములు రెండు రథంబున నితని రెండుపార్శ్వముల నున్నవి. ఈధీరుఁడు ఎఱ్ఱని పుష్పమాలికను గంఠమునఁ దాల్చి మహాపర్వతమువలెఁ జూపట్టుచు, నీలవర్ణుఁడై మృత్యువునుంబోలెఁ బెద్దనోరుగలిగి మేఘములచేఁ గప్పఁబడినసూర్యునివలెఁ దేజరిల్లుచున్నాఁడు. వీఁడు బంగారుబాహుపురులు గట్టంబడిన భుజములతో నొప్పుచు, ఉన్నతములగు రెండుశిఖరములతోఁగూడిన పర్వతరాజమగు హిమవంతమువలెఁ బ్రకాశించుచున్నాఁడు. మహాబాహూ! మంచినేత్రములు గల వీనిముఖము కుండలములు దాల్చియుండుటచే పునర్వసునక్షత్రముల నడుమనుండు పూర్ణచంద్రబింబమువలె నొప్పుచున్నది. మఱియు వీనింజూచి వానరులందఱును భయపీడితులై నలుదిక్కులం బాఱుచున్నారు. ఇట్టి యీరాక్షసోత్తముఁ డెవ్వఁడో నీవు నాకుఁ జెప్పుము' అనియడిగెను. అమితతేజం డగురాజకుమారుఁడు రాముఁ డిట్లడుగఁగా మహాతేజం డగువిభీషణుఁ డతనికి వివరించువాఁడై 'మహాతేజుఁడును, కుబేరుని తమ్ముఁడును, భయంకరకార్యుఁడును, మహోత్సాహుఁడును రాక్షసేశ్వరుఁడు నగు రాజు రావణుఁడు గలఁడుగదా! ఆరావణునకు వీర్యశాలి యగువీఁడు పుత్త్రుఁడు; యుద్ధమున రావణు నంతటివాఁడు. వీఁడు వృద్ధులను సేవించుచు విద్యావంతుఁడై సమస్తాస్త్రవిదులలో నుత్తముఁడై గుఱ్ఱముమీఁదను రథముమీఁదను, ఏనుఁగుమీఁదను మెలంగఁదెలిసి, ఖడ్గవిద్యయందును, విలువిద్యయందును, కృషియందును, సామదానభేదములందును, యుక్తియందును, మంత్రాలోచనమందును, సమర్థుఁడని యెన్నికగన్నవాఁడు. ఇతఁడు ధాన్యమాలినికొడుకు; అతికాయుఁ డందురు. వీని బాహుబలము నాశ్రయించియె లంకాపురి నిర్భయముగానున్నది. భావితాత్ముఁ డగు నీయతికాయుఁడు తపస్సుచేసి బ్రహ్మనారాధించి దివ్యాస్త్రములను బడసి శత్రువులను జయించినాఁడు. వీనికి బ్రహ్మదేవుఁడు, దేవాసురులచే చావులేకుండుటయు, దివ్యమయిన యీకవచమును, సూర్యునివలె మెఱయుచున్న యీరథమును నొసంగెను. వీఁడు వందలమార్లు, దేవతలను దానవులను నోడించి, రాక్షసులను రక్షించియు

న్నాఁడు; యక్షులను రూపిమాపియున్నాఁడు. వీఁడు యుద్ధంబున బుద్ధిమంతుఁ డగు
నింద్రునివజ్రాయుధమును స్తంభింపఁజేసినాఁడు; అట్లే వరుణుని పాశమునుగూడ
ప్రతిహతము గావించినాఁడు. ఇట్టి బలవంతుఁ డయినయీరాక్షససింహుఁడు అతి
కాయుఁడు రావణునిపుత్త్రుఁడు, బుద్ధిమంతుఁడు, దేవదానవులదర్పమును హరిం
చినవాఁడు. పురుషులలామా! కాఁబట్టి, వీఁడు వానరసైన్యములను బాణములచే
నాశము సేయుటకు మునుపే వీనిని శీఘ్రముగాఁ జావఁ బ్రయత్నము సేయుము'
అనెను. అంత బలవంతుఁ డగునతికాయుఁడు వానరసేనను బ్రవేశించి, వింటినారిని
మొరయించి, పలుమాఱు సింహనాదము గావించెను. భయంకరదేహుఁడై రథ
మున నున్ననారథికోత్తము నతికాయునింజూచి, వానరులలోఁ బ్రధానులగు బల
వంతు లాతని నెదుర్కొనిరి. కుముదుఁడును, ద్వివిదుఁడును, మైందుఁడును, నీలుఁ
డును, శరభుఁడును వృక్షములను బర్వతశిఖరములనుం జేకొని యొక్కపెట్ట నెది
ర్చిరి. అస్త్రవేత్తలలోనెల్ల మేటియు మహాతేజుండు నగునతికాయుఁడు వారువైచిన
వృక్షములను పర్వతములను కాంచనాలంకృతములయిన బాణములచే ఛేదించివై
చెను. బలవంతుఁడును భయంకరకాయుఁడు నగునతికాయుఁడు, యుద్ధమున నావా
నరుల కభిముఖుఁడై వారినందఱను వట్టియుక్కతోనే చేయంబడిన బాణములచే
నొప్పించెను. ఆవానరులు, అతికాయుని బాణవర్షముచేఁ బీడితులై, దేహమంతయు
గాయములుపడ, నమ్మహాయుద్ధమున నతనికి బదులేమియుఁ జేయఁజాలకపోయిరి.
అతికాయుఁడు క్రుద్ధుండై యౌవనముచే గర్వించియున్నసింహము మృగసమూహ
మునుంబోలె, అవ్వానరవీరుల సైన్యమంతయు భయపెట్టి కలంచెను. రాక్షసలలా
ముఁడగు నాయతికాయుఁడు వానరసేనలోపల, తనపైకి యుద్ధంబునకు రానివాని
నెవ్వనిని గొట్టక ధనుస్తూణీరములతో రామునొద్దకుఁబోయి గర్వయుక్తముగా 'నేను
విల్లును బాణంబులనుగొని రథమెక్కి యుద్ధమునకు నిలిచియున్నాను. అల్పుఁ డెవ్వని
తోఁగాని యుద్ధముసేయను. ఇందు యుద్ధమున కుత్సాహముగలవాఁ డెవ్వఁడో య
తఁడు నాకిప్పుడు శీఘ్రముగా యుద్ధ మొసంగుఁగాక' యనెను. అతికాయుం డట్లు
గర్వించి చెప్పుచున్నమాటవిని, శత్రుహంతయగు లక్ష్మణుఁడు,అందులకు నోర్వంజాలక,
కోపించి, యతనిముందటికి దూఁకి, యెంతమాత్రము సరకుసేయక వింటిం గయికొ
నెను. లక్ష్మణుఁడు క్రుద్ధుఁడై యట్లుదూఁకి, పొదినుండి బాణమునెత్తి యతికాయుని
ముందట, నావెనువింటిని నాకర్షించెను. లక్ష్మణుని యల్లెత్రాటిధ్వని బెడిదమై భూ
మిని బర్వతములను నాకాశమును సముద్రమును దిక్కులనునిండి, రాక్షసులనం
దఱను భయపఱుచుచుం జెలంగెను. అప్పుడు భయంకరమయిన లక్ష్మణుని ధనుర్ధ్వ
నినివిని, మహాతేజుండును బలవంతుఁడునగు రాక్షసరాజపుత్త్రుం డతికాయుఁడు మి
క్కిలియు నాశ్చర్యమునొందెను. అంత నతికాయుఁడు లక్ష్మణుఁడు పైనడరుటంజూచి
కుపితుఁడై, వాఁడిబాణమునుగయికొని, యతనితో 'లక్ష్మణా! నీవుపసివాఁడవు. పరా

క్రమకృత్యములందు గడిదేఱినవాఁడవుగావు. కాన పొమ్ము. మృత్యువుతోపాటియైన నాబోఁటితో యుద్ధముసేయ నేలగోరదవు? నా చేతులారవిడుచు నస్త్రములవేగమును భూమియు నంతరిక్షమును హిమవంతుఁడుగూడ నెంతమాత్రము సైఁపఁజాలరు. సుఖముగా నిద్రించుచున్న (తనంతటఁదానే పొనుఁగుపడియున్న) ప్రలయకాలాగ్ని నేల ప్రజ్వరిల్లఁజేసెదవు? ధనుస్సునుబెట్టి మరలుము. నన్నుమార్కొని ప్రాణములు పోఁగొట్టుకొనవలదు. అట్లుగాక నీవు నాకెదిరి నిలిచి మరలిపోవనొల్ల వేని నిలువుము. ఇందె ప్రాణములు విడిచి యమలోకమునకుఁ బోయెదవు. తీక్ష్ణములై శత్రుగర్వ నాశనములై యీశ్వరుని త్రిశూలముంబోలి మేలిబంగారుచే నలంకృతములైన నాబాణములను జూడుము. సర్పసమానమైన యీ బాణము, క్రుద్ధమయినసింగ ము మేటియేనుంగునెత్తురు త్రావునట్లు, నీనెత్తురుం ద్రావఁగలదు' అనెను. అతఁ డిట్లుచెప్పి మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై వింటబాణమును సంధించెను. అతిబలుండును మహాకాంతిమంతుఁడునగు నారాజపుత్త్రుఁడు లక్ష్మణుఁడు యుద్ధమున నతికాయుఁడు రోషంబును గర్వంబును దొలఁకఁబలికిన మాటనువిని, మిక్కిలియు కోపమునొంది యెంతయు నర్థవంతమగు వాక్యమున 'దురాత్మా! మాటమాత్రమున నీవు ముఖ్యుఁడవు గానేరవు. కార్యమునుబట్టియే శూరులగుదురుగాని తమ్ముందాము పొగడుకొనుటచేతంగాదు. నేను వింటిని బాణములనుందాల్చి నిలిచియుండఁగా నీబలమును జూపుము. నీవు కార్యముసేసి నీస్వరూపమును జూపుము. ఊరక నిన్ను నీవే పొగడుకొనఁదగదు. ఎవ్వఁడు పౌరుషముగలవాఁడో వాఁడే శూరుఁడనఁబడును. ఊరక తన్నుఁ బొగడుకొన్నంతనే శూరుఁడుగాఁడు. నీవు సర్వాయుధములను ధరించి యున్నవాఁడవు, ధనుర్ధరుఁడవై రథమునెక్కియున్నాఁడవు. బాణములచేతంగాని దివ్యాస్త్రములచేతఁగాని నీపరాక్రమముఁ జూపుము. అటుపిమ్మట వాయువు చక్కఁ గాఁబండిన తాటిపండును తొడిమనుండి రాల్చునట్లు, నేను వాఁడిబాణములచే నీశి రస్సును బడఁగూల్చెదను. ఇప్పుడు మేలికాంచనముచే భూషితములగు నాబాణ ములు, నీదేహమున బాణపుటలుఁగులచేఁ గావింపఁబడినగండ్లనుండి కాఁచునెత్తురుం ద్రావఁగలవు. వీఁడుబాలుఁడని నన్నెంతమాత్రము తక్కువగా నెంచవలదు. నేను బా లుఁడయిననుగాని వృద్ధుఁడయిననుగాని యుద్ధమున మృత్యువువంటివాఁడనని యెఱుం గుము. బాలుండగు విష్ణుఁడు త్రివిక్రమావతారమున ముల్లోకములను మూఁడడుగు లచేఁ ద్రొక్కలేదాయేమి?' అనెను. సయుక్తికముగను పరమార్థయుక్తముగను లక్ష్మణుఁడు చెప్పినమాటనువిని, యతికాయుఁడు మిక్కిలి క్రుద్ధుఁడై మేటిబాణ మును గయికొనెను. అంత, మహాత్ములగు విద్యాధరులును, భూతములును, దేవతలు ను, దైత్యులును, మహర్షులును, గుహ్యకులును నచ్చటి కాయుద్ధమును జూడవచ్చిరి. అంత నతికాయుఁడు కుపితుఁడై వింటబాణమునుదొడిగి, బాణవేగమున నడుమనుం డు నాకాశమును మ్రింగువానివలె లక్ష్మణునిపై విడిచెను. వీరులగు పగవారిం బీఁ

చమడంచు లక్ష్మణుఁడు, సర్పముంబోలి బెడిదమై తనపయి వచ్చుచున్న యా వాఁడి బాణమును అర్ధచంద్రబాణమున ఛేదించెను. అతికాయుఁడు, ఛిన్నశరీరమగుసర్పమువలె నాబాణము ఖండింపఁబడుటనుజూచి మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై యైదుబాణములను దీసికొనెను. అతికాయుఁ డాబాణములను లక్ష్మణునిపై వైచెను. ఆ బాణములు తన్నుఁ దాఁకకమునుపే లక్ష్మణుఁడు వాఁడిబాణముల వానిని ఖండించెను. శత్రువీరుల రూపుమాపు నాలక్ష్మణుఁడు, ఆబాణములను వాఁడిబాణములచే ఛేదించి, తేజస్సుచే మండుచున్నట్లున్న యొకతీక్ష్ణబాణమును దీసికొనెను. వీర్యవంతుఁడగు లక్ష్మణుఁడు ఆబాణమును దీసి తనమేటివింట సంధించి యాకర్ణాంతముగా వేగ నాకర్షించి యతికాయునిపై విడిచెను. వీర్యశాలియగు నాలక్ష్మణుఁడు అట్లు తెగనిండఁ దిగిచి కణుపులులేక చాఁపై యున్నబాణమున రాక్షసశ్రేష్ఠుఁడగు నతికాయుని లలాటమునం గొట్టెను. ఆ బాణము భయంకరుఁడగు నారాక్షసుని నొసట నాటుకొని నెత్తుటందడిసి, కొండపయి నున్న మేటిసర్పమువలెఁ జూడనొప్పెను. అతికాయుఁ డా లక్ష్మణుబాణముచేఁ బీడితుఁడై రుద్రునిబాణముచే పీడితమయిన త్రిపురద్వారమువలె నెంతయుఁ జలించెను. మహాబలుం డతికాయుఁడు కొంత తెప్పిఱిలి యిఁకఁ జేయవలసినదేమియని యాలోచించి యిదియని నిశ్చయించి, లక్ష్మణునితో 'నీవిట్లు బాణము ప్రయోగించుటచే నాకు శ్లాఘింపఁదగిన శత్రుఁడవగుచున్నావు' అని యిట్లుచెప్పి మొగమువాంచి చేతులు దిటకుఁదెచ్చుకొని రథగతుఁడై చిత్రప్రచారములు దిరిగెను. ఆరాక్షసోత్తముఁడు ఒకటి,మూఁడు, అయిదు, ఏడు నని యిట్లు బాణములనుదీసి వింట సంధించి నారినాకర్షించి లక్ష్మణుపైఁ బ్రయోగించెను. మృత్యువుంబోలినవై బంగారుపింజలతోఁగూడి సూర్యునివలెఁ దేజరిల్లుచు రాక్షసేంద్రుఁడగు నతికాయుని వింటినుండి విడివడిన యాబాణములు ఆకాశమును జ్వలించుచున్నదానివలెఁ గావించినవి. అంత రామునితమ్ముఁడు లక్ష్మణుఁడు, ఎంతమాత్రమును తత్తఱపడక, యతికాయుఁడు ప్రయోగించిన బాణజాలములనెల్ల పెక్కువాఁడిబాణములను ఖండించెను. దేవేంద్రునకు శత్రుండును రావణునకుఁ బుత్త్రుండునగు నతికాయుఁడు, యుద్ధమున నాబాణములన్నియుఖండితములగుటంజూచి, కుపితుఁడై, తీక్ష్ణంబగు నొకదివ్యబాణమునుదీసెను. మహాతేజుండగు నాయతికాయుఁడు, ఆబాణమును వింటఁదొడిగి వేగవిడిచెను. అంత, పయిపడివచ్చుచున్న లక్ష్మణునిఱొమ్మున నది నాటుకొనెను. అట్లుయుద్ధమున నతికాయునిచే ఱొమ్మున బాణముగ్రుచ్చఁబడి లక్ష్మణుఁడు మదించినయేనుఁగు మదజలము గార్చునట్లు వేఁడినెత్తురు దొరఁగెను. లక్ష్మణుఁడు సమర్థుఁడుగాన, యపుడు తన దేహములోని బాణమును తటాలునఁ బెఱికి బాధయుడిగి, వాఁడియగునొకబాణమును గ్రహించి దానినిదివ్యాస్త్రమంత్రముతోఁగూర్చెను. అపుడు లక్ష్మణుఁ డాబాణమును ఆగ్నేయాస్త్రమంత్రముచే నభిమంత్రించెను. అది మహాత్ముండగు లక్ష్మణునిధనువునం దపుడు మిక్కిలియు జ్వలించెను. మహాతేజుండగు నతికాయుఁడును, సౌరాస్త్రమంత్రము

ననుసంధించి, ఆమంత్రముచే సర్పసదృశంబును గాంచనపుంఖమునగు బాణము నభిమంత్రించెను. లక్ష్మణుఁ డాగ్నేయాస్త్రమంత్రముచే నభిమంత్రితమై భయంకరముగా జ్వలించుచున్నయాబాణమును, యముఁడు కాలదండమునుంబోలె, అతికాయునిపైఁ బ్రయోగించెను. ఆగ్నేయాస్త్రయుక్తంబగు బాణమువచ్చుటనుజూచి,అతికాయుఁడు, అపుడు సూర్యాస్త్రముచే నభిమంత్రితమై వెలుంగుచున్న యాబాణమును విడిచెను. ఆబాణములు రెండును ఆకాశమున, మొనలు మిక్కుటపుతేజమున వెలుంగఁగా, క్రుద్ధములయిన సర్పములవలె నొండొంటిఁదాఁకి కొట్టుకొన్నవయ్యె. ఆ బాణములు రెండును ఒండొంటినిదహించి నేలంబడినవి. ఇట్లవి మేటిబాణములయ్యు తేజంబులు దూలి, భస్మీభూతములై నేలంబడి యెంతమాత్రమును బ్రకాశింపవయ్యె. అంత నతికాయుఁడు క్రుద్ధుఁడై, ఐషీకాస్త్రమును బ్రయోగించెను. వీర్యవంతుఁడగు లక్ష్మణుఁడు, అయ్యస్త్రమును ఐంద్రాస్త్రముచేతం గొట్టెను. రావణపుత్త్రుండగు నతికాయుఁడు, తనయైషీకాస్త్రము హతమగుటంజూచి, రోషమునొంది. యామ్యాస్త్రమంత్రముచే బాణము నభిమంత్రించెను.అంత నతికాయుఁ డా యామ్యాస్త్రమును లక్ష్మణునిపైఁ బ్రయోగించెను. లక్ష్మణుఁడును వాయవ్యాస్త్రమున దానినిగొట్టెను. అంత లక్ష్మణుఁడు మిక్కిలి క్రుద్ధుఁడై, మేఘము వర్షధారలఁగురియునట్లు, బాణధారల నతికాయునిపైఁగురిసెను. ఆబాణములు, అతికాయునింబొంది వజ్రవిభూషితమగు నతనిమేనికవచమును దాఁకి, కొనలందలియలుఁగులు విఱిగి నేలంబడినవి. శత్రువీరహంతయు మహాయశుండు నగులక్ష్మణుఁడు, ఆ బాణములన్నియు వ్యర్థములగుటనుజూచి మరల మేటిబాణములను వేయింటిని వర్షించెను. మహాబలుండగు నాయతికాయుఁడు, లక్ష్మణుఁడు బాణసమూహముల నెంతఁ దనపై వర్షించుచున్నను యుద్ధమునం దభేద్యమగు కవచముదాల్చి యుండుటచే, నెంతమాత్రమును బాధనొందఁడయ్యె. (అతికాయుఁడు క్రూరసర్పాకారమగు బాణమును లక్ష్మణునిపైఁ బ్రయోగింపఁగా, పగవారిని బరితపింపఁజేయు నాబలుదిట్ట, ఆబాణము మర్మస్థలమున నాఁటుటచే ముహూర్తమాత్రము మూర్ఛనొందెను. అంతఁ గొంతవడికి మూర్ఛదేఱి, యమ్మహాబలుఁడు మేటిబాణముల నాలుగింటిచే యుద్ధమున గుఱ్ఱములను సారథినినిజంపెను.ఆయరిందముఁడు బాణవర్షముచే ధ్వజమును ధ్వంసముగావించి, తొట్రుపడక యారాక్షసునిం జంపుటకై బాణములను గుఱిపెట్టియేసెను.) పురుషలలాముండగు లక్ష్మణుఁడు యుద్ధమున నతికాయు నెంతమాత్రము నొప్పింపఁజాలఁడయ్యె. అంత వాయుదేవుఁడు, లక్ష్మణునియొద్దకువచ్చి 'ఈ యతికాయుఁడు బ్రహ్మదేవునివలన వరమునొంది, అభేద్యమగు కవచమును ధరించియున్నాఁడు. బ్రహ్మాస్త్రముచే వీనిని వధింపుము. ఏలన వేఱువిధమున వీనిని వధింపనలవిగాదు. కవచధరుండును బలవంతుఁడునగు నితనిని ఇతరాస్త్రములచే వధింప నలవిగాదు' అని చెప్పెను. అంత దేవేంద్రసమానపరాక్రముఁడగు లక్ష్మణుఁడు వాయుదేవునివచనమునువిని, శీఘ్రమున బ్రహ్మ

స్త్రమంత్రమును జపించి, అమోఘంబగు వేగముగలబాణమును వింటసంధించెను. లక్ష్మణుఁడు వాఁడిమొన గలమేటిబాణమున బ్రహ్మాస్త్రము నభిమంత్రింపఁగానే, చంద్రసూర్యులును తక్కిన మహాగ్రహములును భయమునొందిరి. దిక్కులును, ఆకాశమునదిరెను. భూమి వడంకెను. లక్ష్మణుఁడు మంచిపింజగలిగి, వజ్రముతోసమానమై యతికాయునకు యమదూతం బోలినయమ్మహాబాణమును బ్రహ్మాస్త్రమంత్రముచే నభిమంత్రించి వింటందొడిగి, దేవేంద్రశత్రుండగురావణునిపుత్రుఁడయ్యతికాయునిపై యుద్ధంబునఁ బ్రయోగించెను. అప్పుడు యుద్ధంబున, లక్ష్మణుఁడు ప్రయోగింపఁగా, అమోఘమగువేగము గలిగి అగ్నివలె జ్వలించుచు, బంగారుమయమై వజ్రకఠినమై వింతగొలుపు మేటిపింజగలిగి యున్నయాబాణము తనపైకి వచ్చుచుండుటను నతికాయుఁడు చూచెను. అతికాయుఁ డాబాణమును జూచుచునే వేగంబున దానిని బెక్కువాఁడిబాణములం గొట్టెను. అట్లు గొట్టినను గరుడుఁడుంబోలె వేగముగల యాబాణము నప్పు డతికాయునివలనికిఁ దారసించెను. అప్పు డతికాయుఁడు సకలలోకాంతకుఁడై జ్వలించుచున్న యమునివలెఁ దేజరిల్లుచు నాబాణము వచ్చుటంజూచి, యెంతమాత్రము మనంబున డిందువడక, శక్తులచేతను, ఋష్టులచేతను, గదలచేతను, గొడ్డండ్రచేతను, శూలములచేతను, ద్విఫలపత్రాగ్రములగు శూలములచేతను దానినిగొట్టెను. అమ్మహాస్త్రము అద్భుతాకారములగు నయ్యాయుధములను సరకుసేయక, బీఱుపుచ్చి అగ్నిహోత్రమువలె వెలుఁగుచుంబోయి, కిరీటాలంకృతమగు నయ్యతికాయునిశిరమున నాటి దానిందుంచివైచెను. శిరస్త్రాణముతోఁగూడిన యా యతికాయునిశిరస్సు,లక్ష్మణుబాణముచే ఛిన్నమై హిమవంతము శిఖరమువలెఁ దటాలున నేలంగూలెను. అట్లు భూషణములన్నియు నిట్టట్టుచెదరిపడ, నేలంగూలిన యాయతికాయునిఁ జూచినంతనే, హతశేషులగు రాక్షసులందఱును మిక్కిలి వ్యథితులయిరి. ఆ రాక్షసులందఱును ముఖమున దుఃఖముదోఁప దీనులయి వానరుల దెబ్బల కలసి సొలసి యోరువంజాలక పెక్కండ్రు తోడనే వికృతస్వరమున బిగ్గఱగాఁ గూయిడిరి. అంతఁ దమనాయకుండు హతుఁడుకాఁగా ఆ రాక్షసులందఱును భయపడి యుద్ధకాంక్ష యుడిగి,బరుగులువాఱుచు,లంకాభిముఖులయి త్వరితముగాఁ బోయిరి. అప్పుడు భయంకరబలుఁడై యెవ్వరికిని జెనక రాకుండినపగవాఁ డతికాయుఁడు హతుఁడుకాఁగా, వానరులందఱును మిక్కిలి యుబ్బునొంది విరిసినతామరలవలె ముఖములు కలఁకదేఱి యలర, కోరినకోర్కి యగుగెలుపునొందిన లక్ష్మణునిం బూజించిరి. (మహాబలుండై మేఘముంబోలి యున్నయతికాయుని యుద్ధమునంగూల్చి యాలక్ష్మణుఁడు మిక్కిలిసంతుష్టుఁడై యంత వానరసమూహములు తన్నెంతయుఁ బూజింప, యప్పుడు రామునియొద్దకుఁ బోయినవాఁడయ్యెను.) ఇది డెబ్బదియొకండవసర్గము.

---

రావణుం డతికాయవధాదులను విని, తానుబంపిన వీరులం దఱును జచ్చుటంబట్టి రామునిపరాక్రమమును మెచ్చుకొని నగరరక్షణమునకు భృత్యుల నియోగించి పుత్రదుఃఖమున నంతఃపురమును జొచ్చుట.

రాక్షసరాజగు రావణుఁడు, మహాతేజుం డగులక్ష్మణునిచే నతికాయుఁడు హతుఁ డగుటనువిని, వెల్లారాటమొంది 'శత్రువులనెంతమాత్రము సైఁపనివాడును ఆయుధధారులలోనెల్ల నుత్తముఁడు మంచివిలుకాఁడు నగు ధూమ్రాక్షుఁడును, అకంపనుఁడును, ప్రహస్తుఁడు, కుంభకర్ణుఁడు ననెడి యీరాక్షసులు, మహాబలశాలురు, వీరులు, యుద్ధ మెప్పుడెప్పుడని కోరుచుండువారు. వీరుశత్రుసైన్యములను జయించుచుండు రేకాని యెుకప్పుడును శత్రువులవలన పరాజయము నొంది యెఱుంగరు. మహావీర్యవంతులును, మహాకాయులును, నానాశస్త్రవేత్తలు నగునారాక్షసులనుగూడ, రాముఁ డెట్టికార్యమేని చుల్కఁగాఁ జేయువాఁడుగాన వధించి పుచ్చినాఁడు. మహాబలవంతులును శూరులును నగు నితరులును బెక్కండ్రు గూల్పఁబడిరి. ఖరాదులనువధించి ప్రసిద్ధిఁగాంచిన వీరులయిన యారామలక్ష్మణులనుగూడ ప్రఖ్యాతబలపరాక్రముఁ డగునాపుత్త్రుఁ డింద్రజితుఁడు వరలబ్ధములయిన దివ్యబాణములచే బంధించినాఁడు. ఆబంధము విడిపించుటకు సురలకుఁగాని మహాబలులయిన యసురులకుఁగాని యక్షగంధర్వకిన్నరులకుఁగాని యలవిగాదు. అన్నదమ్ము లారామలక్ష్మణు లట్టిశరబంధమునుండియు విడివడి రే! అది తమ ప్రభావములచేతనో, మాయచేతనో, మోసముచేతనో, నాకుఁ దెలియకున్నది. నాయాజ్ఞవలన వీరులును శూరులునగు రాక్షసు లెవరెవగు యుద్ధమునకుంబోయిరో వారలందఱను మిక్కిలియు బలవంతులగు వానరులు వధించిపుచ్చిరి. ఇప్పుడు యుద్ధమున మహావీరుఁడగు రాముని లక్ష్మణునితోడను, వానరసేనతోడను, సుగ్రీవునితోను, విభీషణునితోనుంగూడ వధింపఁ జాలునట్టివాఁ డెవ్వఁడును నాకగపడలేదు. రామునివిక్రమము బారింబడి రాక్షసులు రూపుమాసిరే! ఆహా! రాముఁ డెట్టిబలవంతుఁడు! అతనియస్త్రబల మెంతగొప్పది! వీరుఁడగు నారాముఁడు అనామయుండగు నారాయణుఁడే యని తలంచెదను. అతని భయమువలన నేకదా లంకాపురి లోపలివెలుపలివాకిళ్లన్నియు మూయఁబడియున్నవి. కాన రాక్షసులారా! మీరెంతమాత్ర మేమఱుపాటులేక మిమ్ముం గాపాడుకొనుచు, ఈపురమును జాగ్రత్తతో నలుగడల రక్షించుచుండవలయును. సీతను గాఁచుచున్న యశోకవనికయందు, ఎవ్వనినిగాని ఏవిధముననను, మాకుఁ దెలియక లోపలికి విడువరాదు; వెలుపలికిఁ బోనివ్వరాదు. మఱియు నెందెందు సేనానన్నివేశమున్నదో యందందంతటను, మీమీసేనలచేఁ బరివృతులై కన్నుగలిగి మాటిమాటికి తిరుగుచుండవలయును. రాక్షసులారా! సాయంకాలమునఁగాని, యర్ధరాత్రమునఁగాని, ప్రాతఃకాలమునఁగాని, యెప్పుడుగాని, యావానరులు పూనియున్నకార్యమును జూచు

చుండవలయును. వానరులని వారినెప్పుడుగాని తక్కువగాఁ జూడవలదు. పగవారి సైన్యము యుద్ధమున శాయితమైయున్నదా? లేక మనపైకి వచ్చుచున్నదా? లేక యూరకనిల్చియున్నదా? అనియెప్పు డేలాగుననుండునదియుఁ దెలియవలయును' అని యాజ్ఞాపించెను. అంత మహాబలవంతులగు రాక్షసులందఱును, లంకాపతియగు రావణుఁడుచెప్పినయప్పలుకులు విని, యతఁ డానతిచ్చినచొప్పున నంతయుఁ గావించిరి. రాక్షసాధిపుఁడగు రావణుఁ డారాక్షసులకెల్ల నట్లాజ్ఞాపించి దుఃఖశల్యముం దాల్చి దీనుఁడై తనగృహమునకుం బోయెను. అంత నప్పుడు మహాబలుఁడగు రాక్షసేశ్వరుఁడు రావణుఁడు, కోపాగ్ని పయింబయిఁ జెలంగ, మాటిమాటికి నాపుత్రవ్యసనమునే తలంచుకొని నిట్టూర్పులువిడిచెను.ఇది డెబ్బదిరెండవసర్గము.

ఇంద్రజిత్తు రావణు నూఱడించి యాభిచారికహోమము గావించి బ్రహ్మాస్త్రమున రామలక్ష్మణులను వానర యూథపులను మూర్ఛిలంజేయుట.

అంత, దేవాంతకుఁడు, త్రిశిరుఁడు, అతికాయుఁడు మొదలయిన ప్రసిద్ధులగు రాక్షసపుంగవులు యుద్ధమున హతులయిరని హతశేషులయిన రాక్షస సమూహములు త్వరితముగాఁబోయి రావణునకుఁ జెప్పిరి. అంత రాక్షసరాజు రావణుఁడు, అతికాయాదులందఱును హతులయిరన్న సంగతినివిని, తటాలున దుఃఖమునఁ గన్నుల నీళ్లుగాఱ మూర్ఛిల్లి, కొంతవడికిం దెలిసి, భయంకరమగు పుత్రనాశమును, భ్రాతృవధమును దలంచుకొని, మిక్కిలియు వగచెను. అంత రాక్షసరాజగు రావణుని పుత్త్రుఁడును, రథికసింహుఁడును నగునింద్రజిత్తు, దీనుండై దుఃఖసముద్రమునం దెప్పలఁ దేలుచున్న రాజగు రావణుంజూచి 'రాక్షసేంద్రా ! ఇంద్రజిత్తు బ్రతికియుండునపుడు, నీ విట్లు దుఃఖము నొందవలదు. యుద్ధమున నింద్రజిత్తుబాణములచేఁ గొట్టువడి యెవఁడుగాని, ప్రాణములఁ దక్కించుకొనఁజాలఁడు. ఇప్పుడు రాముఁడు లక్ష్మణునితోఁగూడ నాబాణములచే దేహము ఛిన్నభిన్నమై, వాఁడిబాణములు దేహమంతటను గ్రుచ్చుకొనియుండ, ప్రాణములువీడి నేలంబడియుండునట్లు గావించెదను జూడుము. ఇంద్రజిత్తు చక్కఁగా నిశ్చయించి పౌరుషదైవబలములు రెంటితోనుం గూడిన యీప్రతిజ్ఞను జేయుచున్నాఁడు వినుము. ఇప్పుడె రామునిని లక్ష్మణునిని, అమోఘములయిన బాణములచే పూరించెదను. ఇప్పుడును దేవేంద్రుఁడును, యముఁడును, విష్ణుదేవుఁడును, మిత్త్రుఁడును, సాధ్యులును, అగ్నిదేవతలును, అగ్నిహోత్రుఁడును, చంద్రుఁడును, సూర్యుఁడును, బలిచక్రవర్తి యాగశాలయందు, త్రివిక్రమావతారుఁడగు విష్ణుదేవుఁడు నెఱపిన పరాక్రమముంబోలిననా యప్రమేయపరాక్రమముఁ జూడఁగలరు' అనెను. బలంబు కొఱవడని యా యింద్రజిత్తు, రాజగు రావణునితో నిట్లుచెప్పి, యతని వీడ్కొని, వాయుసమవేగముగలదై, మేలయిన గాడిదలు కట్టంబడియున్న రథము నారోహించెను. మహాతేజుండై పగవారి పీఁచమడంచు

నాయింద్రజిత్తు, సూర్యరథమువలె వెలుంగుచున్న యా యరదము నెక్కి యుద్ధము చేయవలసినచోటికి తోడనేపోయెను. మహాబలుండగు నాయింద్రజిత్తు బయలుదేఱంగానే, మహాబలులయిన రాక్షసులు పెక్కండ్రు, మిక్కిలి యుబ్బుచు, మేటిధనువులు కేలందాల్చి కొందఱు గజములను గొంద ఱుత్తమాశ్వములనను నారోహించి, (భయంకరపరాక్రములగు కొందఱు పర్వతాకారములగు వ్యాఘ్రములను, వృశ్చికములను, మార్జారములను, ఖరములను, లొట్టియలను, సర్పములను, వరాహములను, శ్వాపదములను, సింహములను, జంబుకములను, శశములను, హంసములను, మయూరములను నెక్కి) ప్రాసములను ముద్గరములను ఖడ్గములను గొడ్డండ్రను గదలను ధరించి యతని వెంబడిం బోయినవా రయిరి. ఆ యింద్రజిత్తు తన వెంటవచ్చు రాక్షసులు మహాధ్వని గలుగునట్లు, శంఖములు పూరించియు భేరులు వాయించియుఁ దన్నుఁ బ్రస్తుతింపఁ, బేరోలగంబునం బోయెను. శత్రువుల రూపుమాపు నాయింద్రజితుఁడు, పూర్ణచంద్రునిచే నాకాశము ప్రకాశించునట్లు, శంఖమువలెను జంద్రబింబమువలెను ధవళమగు ఛత్రముచే నెంతయుఁ బ్రకాశించెను. అంత విలుకాండ్రలో నెల్ల మేటియును మహాధీరుఁడు నగునింద్రజిత్తునకు, బంగారుదండములచేతను బంగారుశలాకలచేతను నలంకృతములై సుందరములగు మేలిచామరములఁగొని వీచిరి. శ్రీమంతుఁడగు రాక్షసేశ్వరుఁడు రావణుఁడు, అట్లింద్రజిత్తు గొప్పసైన్యమునుదీసికొని వెడలుచుండఁగాఁజూచి 'పుత్రా! నీకెదిరిగలుగఁడు. నీవు దేవేంద్రుని జయించినవాఁడవు సుమీ! ఇఁక నెదుర్పఁగూడిన మనుష్యుఁడెంత? నీవెట్లును రాముని జంపఁగలవు.' అనెను. అట్లుచెప్పి యారక్షసరాజెంతయు నాశీర్వాదములు సేయఁగా నింద్రజితుఁడు వానిని గయికొనెను. అంత సూర్యునిభంగి తేజంబున వెలుంగుచుఁ, బరాక్రమమున నెదురులేని యాయింద్రజిత్తుచే, సూర్యునిచే నాకాశముంబోలె, లంకాపురియంతయుఁ బ్రకాశించినది. మహాతేజుండై శత్రువుల నడంగఁద్రొక్కు నాయింద్రజిత్తు, యుద్ధభూమినొంది, దివ్యరథమును బడయుటకై హోమము సేయఁబూని చుట్టును రాక్షసులఁ గావలియుంచెను. అగ్నివంటి ప్రభగల యా రాక్షసోత్తముఁడు, అప్పుడు, మంత్రపూర్వకముగాఁ గ్రమముచొప్పున అగ్నిహోత్రమునందు వేలిమి గావించెను. అచ్చట ప్రతాపవంతుఁడగు నా రాక్షసేంద్రుఁడు, గంధమాల్యములతోఁగూడ, సంస్కరింపఁబడిన హవిస్సును బేలాలను, అగ్నిహోత్రమునందు వేల్చెను. ఆహోమమునందు, ఇంద్రజిత్తు జెల్లునకు బదులాయుధములను అభిచారమునకు * పరిస్తరించుటకు వలయు జెల్లు పత్రములుగాను, తాండ్రపుల్లలు సమిధలుగాను గొని, ఎఱ్ఱని వస్త్రములనుగట్టి నల్లయినుపస్రువమును గావించుకొనెను. అతఁ డా యుద్ధభూమిని తోమరములతోను నాజెల్లాకులతోను, అగ్నిపరిస్తరణము గావించి బ్రతికియున్న నల్ల

* అభిచారహోమమునకు పరిస్తరణములగు జెల్లుపత్రములును, సమిధలుగా తాండ్రపుల్లలును, ఎఱ్ఱనివస్త్రములు మొదలగునవియు, వలయునవి.

నిమేఁకను బలువుగాఁబట్టి హోమము చేసెను. ఒకమాఱు వెలిఁగింపఁగానే ఆయగ్నిద రికొని,పొగలేక, పెనుమంటలతోఁ జెలంగుచుండుటచే, ఒక్కమాఱే దరికొనుటమొ దలయిన యాచిహ్నములు విజయములు సూచించినవై నవి. అగ్నిహోత్రుఁడు తానే పురుషరూపమునఁ బ్రదక్షిణముగాఁ జుట్టి వచ్చుజ్వాలలతోఁగూడి, మంచిబంగారు భూషణములుదాల్చి, పొడమిన యాహవిస్సును బ్రతిగ్రహించెను. అప్పు డా యింద్ర జిత్తు, బ్రహ్మాస్త్రమును ఆహ్వానముసేసి మఱియు నందు, తనకు రథము ధనుస్సు మొదలగు వానినన్నిటిని, అభిమంత్రించెను. అట్టు లింద్రజిత్తు వేల్వఁబడు చున్నయ గ్నినుండి బ్రహ్మాస్త్రమును, నాహ్వానము సేయఁగానే, గ్రహనక్షత్రచంద్రు లతోఁగూడ నాకాశమంతయు, భయమునఁ జలించినది. అగ్నిహోత్రుండునుంబోలెఁ దేజంబున వెలుంగుచు, దేవేంద్రునకుంబోలె ప్రభావముగలిగి, యచింత్యమంత్రశక్తి యుక్తుం డగునా యింద్రజిత్తు అట్లు అగ్నినివేల్చి, తాను ధనువును బాణములును ఖడ్గమును రథమును అశ్వమును సారథినిం బడసి యాకాశంబునఁ దన్నంతర్హితునిఁ గావించుకొనెను. అంత రాక్షససైన్యము గుఱ్ఱములను రథములను నెరసిబెరసి, పతాకలచేతను ధ్వజములచేతను నలంకృతమై యుద్ధకాంక్షచే గర్జించుచు బయలు వెడలెను. ఆరాక్షసులు, చిత్రంబులును మహావేగములును కాంచనాలంకృతములు నగు పెక్కుబాణములచేతను తోమరములచేతను అంకుశములచేతను యుద్ధమున వానరులం బ్రహరించిరి. అంత నింద్రజిత్తు కుపితుఁడై యారాక్షసులంజూచి 'మీరు వానరులఁ జంపఁగోరి సంతోషమున వారితోఁ బోరాడుఁడు' అనెను. అట్లు చెప్పుటవలన నంత నా రాక్షసులందఱును జయముఁ గాంక్షించుచు, గర్జించుచు, భయంకరులగు నా వానరులపయి బాణవర్షములను గురియించిరి. ఆయింద్రజిత్తు, యుద్ధమున రాక్షసులు నలుగడలఁ గ్రమ్మియుండ వారినడుమ మీఁదుగానుండి, నాళీకబాణములచేతను గదలచేతను ముసలముచేతను వానరులను హింసించెను.ఆవానరుల ట్లింద్రజిత్తుచేఁ గొట్టువడుచు, వృక్షములుగొని యందఱు నొకటిగా యుద్ధకర్కశుండగు నింద్రజిత్తునిమీఁదికిం దలపడిరి. అంత మహాతేజుండును బలవంతుఁడునగు రావణపుత్రుఁడింద్రజితుఁడు, కుపితుండై యవ్వానరులదేహములను జించి చెండాడెను. అతఁడు యుద్ధమునఁ గుపితుఁడై రాక్షసు లుప్పొంగునట్లు ఒకొక్కబాణమునకు తొమ్మండ్రు, ఏవురు, ఏడ్గురునుగా వానరులను ఖండించెను. మిక్కిలి దుర్జయుండగు నావీరుఁడు, యుద్ధమున, సూర్యసమానములును గాంచనాలంకృతములు నగు బాణములచే, వానరులను గలంచి నలంచివుచ్చెను. అవ్వానరులు యుద్ధమున బాణపీడితులై, దేహమంతయు ఛిన్నభిన్నముకాఁగా, జయమునం దాశ వదలుకొని, దేవతలచేఁ గొట్టువడిన గొప్పయసురులవలె నేలంబడిరి. అంత నప్పుడు యుద్ధంబున మేటులయిన మఱికొందఱు వానరులు, కుపితులయి బెడిదములయిన బాణములనెడి కిరణములచే వెలుంగుచున్న సూర్యునికై వడిఁ జెనఁకరాకున్న యాయింద్రజిత్తుమీఁదికిఁ బో

యిరి.అంత నవ్వానరవీరులు, అందఱును ఇంద్రజితుని బాణములచే భిన్నదేహులయి, ధైర్యమువీడి, వ్యథితులై, నెత్తుటఁదోఁగుచుఁ బలాయితులయిరి. అవ్వానరులు యుద్ధమున రాముని కార్యముకొఱకై, ప్రాణములపై నాశపెట్టక పరాక్రమించి శిలల నాయుధములుగాఁగొని గర్జించుచు వెనుకడుగిడక యింద్రజితుని నెదుర్కొనిరి. ఆ వానరు లట్లు యుద్ధమునఁ జుట్టుముట్టి యింద్రజిత్తుపయి, వృక్షములను బర్వతశిఖరములను శిలలను వర్షించిరి. మహాతేజుండై యుద్ధమున జయముం గొనునాయింద్రజితుఁడు, ప్రాణముల హరించునదై జెడిదంబగు నావృక్షములయు శిలలయు వర్షమును బాణములచే వారించెను. అంత యుద్ధమున సమర్థుండగు నింద్రజితుఁడు, అగ్నిసమానములును క్రూరసర్పసదృశములు నయినబాణములను బ్రయోగించి, వానరసైన్యములను భేదించెను. అతఁడు పదునెనిమిది వాఁడిబాణములచే గంధమాదనుని గాఁడనేసి,దూరముననున్న నలుని తొమ్మిదిబాణముల నొప్పించెను. ఆమహావీర్యశాలి, యుద్ధమున మర్మములను విదారించునట్టి బాణము లేడింటిచే మైందునిని, ఐదుబాణములచే గజునిని, జాంబవంతుని పదిబాణములను, నీలుని ముప్పదిబాణములనును, అట్లె సుగ్రీవునిని ఋషభునిని, అంగదునిని, భయంకరములును వరలబ్ధములును తీక్ష్ణములునగు బాణములచేత నపుడునొప్పించి మూర్ఛితులం గావించెను. అప్పుడతఁడు చెలరేఁగిన ప్రళయకాలాగ్నివలె క్రుద్ధుఁడై మఱియు ముఖ్యులయిన యితరవానరులను పెక్కండ్రనుంగూడ, పెక్కుబాణములచేత నొప్పించెను. ఇంద్రజిత్తు, అమ్మహాయుద్ధమున, సూర్యసమానములయి, యాకర్ణాంతముగా నాకర్షించి విడువఁబడి, మహావేగంబులగు బాణములచే, వానరులసైన్యముల కలంచి నలంచివైచెను. అతఁడు తనబాణసమూహముచే వానరసేనయంతయు కలంగి నలంగి మూర్ఛిలి, నెత్తుటం దోఁగుచు నిశ్చేష్టమై యుండుటనుజూచి మిక్కిలియు నుబ్బున నుప్పొంగినవాఁ డయ్యెను.మహాతేజుండును వీర్యబలసంపన్నుఁడును వరదానబలయుతుండును నగురావణపుత్త్రుఁ డింద్రజితుఁడు మఱల బాణములను ఖడ్గాద్యాయుధములను త్వరితముగా వర్షమువలెఁ గురియించి వానరసేననంతయు నొప్పించెను. అతండమ్మహాయుద్ధమున తనసైన్యముమీఁదిభాగమున నుండుటను మాని శీఘ్రముగా వానరసైన్యములఁ దోఁచి,యందుఁ గంటికిఁగానరాక, నల్లనిమేఘము జలమును వర్షించునట్లు భయంకరమగు బాణవర్షమును గురియించెను. ఆయుద్ధమునందు, పర్వతాకారులయిన యవ్వానరులు, ఇంద్రజితుని బాణములచే భిన్నదేహులయి, వాని మాయలచేఁ గొట్టువడి, వికృతస్వరముగా నఱచుచు, నింద్రుని వజ్రాయుధముచేఁ గొట్టువడిన మేటిపర్వతములవలె నేలంగూలిరి. వారు యుద్ధమున తమసైన్యములందు, వాఁడిమొనలుగల బాణములు పడుచుండుటను మాత్రమే చూచుచుండిరి కాని, మాయచేతఁ బ్రచ్ఛన్నుండై మఱుఁగుపడియున్న యిందజితునిమాత్రము కానలేరయిరి. అంత మహాత్ముఁడగు నారాక్షసశ్రేష్ఠుఁడు, వాఁడిమొనలుగలిగి, సూ

ర్యునివలె వెలుంగుచున్న బాణములచే దిక్కులన్నింటిని గప్పి, వానరోత్తముల నొప్పించెను. అతఁడు మఱియు, మండుచున్న యగ్నివలెఁ గ్రాలుచున్న శూలములను ఖడ్గములను గొడ్డండ్లను మిడుంగుఱులు రాలుమంటలెగయ గిరగిరంద్రిప్పి వానరరాజసైన్యముపై జడిగా వేగ ప్రయోగించెను. అంత మేటివానరవీరులు, రాక్షసోత్తముఁడగు నింద్రజితునియగ్నిసమానములగు బాణములచేఁగొట్టుపడి దేహములు ఛిన్నభిన్నములై నెత్తురువెల్లువలు కాఁగా, చక్కఁగాఁ బూచినమోదుగుచెట్లవలె నొప్పుచు, నూఁతకు నొకరిపై నొకరు పడుచు, వికృతస్వరముగా నఱచుచు, నేలంగూలిరి. కొందఱు తలయెత్తి యాకాశమును జూచుచు, కన్నులయందు వాఁడిబాణములు నాటఁగా, ఒకరిపై నొకరు పడుచు నేలంబడిరి. రాక్షసోత్తముఁడగు నింద్రజిత్తు, హనుమంతుని, సుగ్రీవుని, నంగదుని, గంధమాదనుని, జాంబవంతుని, సుషేణుని, వేగదర్శిని, మైందుని, ద్వివిదుని, నీలుని, గవాక్షుని, గజుని, గోముఖుని, కేసరిని, హరిలోముని, విద్యుద్దంష్ట్రుని, సూర్యాననుని, జ్యోతిముఖుని, దధిముఖుని, పావకాక్షుని, నలుని, కుముదుని, ఈవానరోత్తములనెల్లను బ్రహ్మాస్త్రమంత్రముచే నభిమంత్రితములగు ప్రాసములచేతను శూలములచేతను గఱకు బాణములచేతను, మిక్కిలియు నొప్పించెను. అట్లతఁడు గదలచేతను గాంచనపుంఖము లగు బాణములచేతను, వానరయూథపులను నొప్పించి, యంత రామలక్ష్మణులమీఁద సూర్యకిరణసమానములగు బాణజాలములను జడిగాఁ గురియించెను. అప్పుడు రాముఁడు మిక్కిలి యాశ్చర్యకరమగు ధైర్యసంపత్తిగలవాఁడై, అట్లింద్రజిత్తు తనపయి బాణవర్షములు గురియుచున్నను, జలధారలంబోలె వానిని సరకుసేయక చుట్టుసేనంజూచుచు నపుడు లక్ష్మణునితో "లక్ష్మణా! మరల రాక్షసతిలకుం డయినయీయింద్రజిత్తు బ్రహ్మాస్త్రమంత్రము నాశ్రయించి ప్రహరించుచు, ఆప్రభావమున, భయంకరమైన వానరసైన్యమునుగూల్చి ప్రసక్తితో, మనలబాణములచే నొంచుచున్నాఁడు. మహాత్ముం డగువీఁడు బ్రహ్మదేవుం డొసంగినవరమునం జేసి, యిప్పుడు యుద్ధమున, నాకాశము నొంది, తన భయంకర దేహమును మాటుసేసికొనియున్నాఁడు. ఇట్లు దేహము నే చూపక మఱుఁగి బాణములుమాత్రము వేయుచున్నయీయింద్రజితుని యుద్ధంబున వధించుట కలవియెట్లు? ధీమంతా! ఇట్టి మహనీయ మయిన యస్త్రమునకు దేవతగాను, దీనిపుట్టుటకును గారణముగాను నుండుభగవంతుఁ డగు బ్రహ్మదేవుసమహిమ యచింత్యమని తలంచెదను. కాఁబట్టి నీవును నాతోఁగూడ, మనస్సు గలఁగక, యిప్పుడీ బాణపాతములకు నోర్చియుందుము. ఈరాక్షసోత్తముఁడు, బాణవర్షజాలములను బరఁగించి సమస్తదిక్కులును దట్టముగాఁ గప్పుచున్నాఁడు. ఈ వానరరాజసైన్యమంతయు, మేటిశూరులు పడుటచేతను, నెంతమాత్రము ప్రకాశింపకున్నది. వీఁడు, మనము యుద్ధముసేయ వీలులేక మాని, తెలివిదప్పి రోషహర్షములుదూలి మూర్ఛనొంది నేలంబడియుండుటను జూడఁగానే, రణాగ్రమందలి జయలక్ష్మిని బడసి సంతోషముతో లంకాపురికిఁ బోఁ

గలఁడు. ఇది నిశ్చయము' అనెను. అంత నచ్చట, నారామలక్ష్మణులు, ఇంద్రజిత్తుబాణజాలములచే పీడితులై యట్లు పడియుండిరి. రాక్షసశ్రేష్ఠుఁ డగునాయింద్రజిత్తును అట్లు రామలక్ష్మణులు పడియుండుటనుజూచి సంతోషముచే యుద్ధమధ్యమున సింహనాదము గావించెను. అతఁ డప్పుడు, యుద్ధమున నట్లా వానరసైన్యమంతటిని రామలక్ష్మణులను విషాదముపాలుసేసి, యంతఁ దోడనే రావణబాహురక్షిత మైనలంకాపురిని బ్రవేశించినవాఁడయ్యె. ఇది డెబ్బదిమూఁడవసర్గము.

---

(జాంబవంతుఁడు చెప్పినచొప్పున హనుమంతుఁడు హిమవంతము ప్రక్కనున్న యోషధిపర్వతమును దేఁగా నందలి దివ్యౌషధిగంధమును మూర్కొన్నమాత్ర రామలక్ష్మణాదులందఱును మూర్ఛదేఱుట.)

అప్పుడు రామలక్ష్మణులు రణాగ్రమందు కేడ్పడుటంజూచి వానరసైన్యమంతయు భయమున మూర్ఛిల్లెను. సుగ్రీవుఁడు నీలుఁ డంగదుఁడును జాంబవంతుఁడును జేయుట కేమియుఁ దోఁపకుండిరి. అంత, బుద్ధిమంతులలోనెల్ల మేలుబంతియగు విభీషణుఁడు వానరసైన్యమంతయు భయమున విహ్వలమై యుండుటనుజూచి, వానరవీరోత్తములను నప్రతిమవచనముల నూఱడించుచు 'మీరు భయపడవలదు. రామలక్ష్మణులు బాణములఁ గొట్టువడి యవశులయి విషణ్ణులై యున్నారని మీరు విషాదపడుటకు వీలయిన కాలమేమియు లేదు. ఏలన వారు బ్రహ్మదేవునిమాటను గారవించుటకై యిట్లింద్రజిత్తుబాణసమూహములచేఁ గీడ్పడినట్లున్నారుగాని వేఱుగాదు. కాన విషాదపడుట కిదికాలముగాదు. బ్రహ్మ యీయింద్రజిత్తునకు అమోఘమయిన వేగముగల యాబ్రహ్మాస్త్రము నొసంగెను. రాజపుత్రులగు రామలక్ష్మణులు బ్రాహ్మం బగునమ్మహాస్త్రమును గారవించుటకై నేలంబడియున్నారు. ఇందులకు దుఃఖపడఁ గారణమేమి?' అనెను. అంత బుద్ధిమంతుఁడగు వాయుపుత్రుఁడు హనుమంతుఁడు బ్రహ్మాస్త్రమునుగారవించుటకై ముహూర్తకాలము బద్ధుఁడైయుండి యంత విడిపించుకొని విభీషణునిమాటవిని యతనితో, 'బలవంతులైనయీవానరసైనికులు హతులై యున్నారు. ఇఁక నెవరెవరు ప్రాణములు దాల్చియున్నారో వారల నాశ్వాసింతము' అనెను. ఆరాత్రియం దట్లు, వీరులయిన హనుమంతుఁడును విభీషణుఁడు నిరువురును, గొఱవికట్టలం జేతులఁబట్టికొని యుద్ధభూమియందు వానరవీరులను వెదకుచుం దిరిగిరి. కొందఱు తోఁకలుదెగియు కొందఱు చేతులును, కొందఱు తొడలును, గొందఱు కాళ్లును, గొందఱు వ్రేళ్లును, కొందఱు మెడలునుదెగి, మూత్రముల స్రవించుచును, దేహములనుండి నెత్తురుమిక్కిలియుఁ గాఱ, పర్వతాకారులై యచ్చటచ్చటం బడియున్న వానరులచేతను దేదీప్యమానములై పడియున్నయాయుధములచేతను నెరసియుండు యుద్ధభూమిని వారిద్దఱును గాంచిరి. అంత వారలు, యుద్ధమున హతప్రాయులై పడి

యున్న సుగ్రీవుని, అంగదుని, నీలుని, శరభుని, గంధమాదనుని, గవాక్షుని, సుషేణుని, వేగదర్శిని, ఆహుకుని, మైందుని, నలుని, జ్యోతిముఖుని, ద్వివిదుని, పనసుని, మఱియు నితరులయిన వానరవీరులనుం జూచిరి. బ్రహ్మదేవునకు మనన్నునకెక్కిన యాయింద్రజిత్తు, బ్రహ్మాస్త్రముచే నాఁటిసాయాహ్నభాగమున నాలుగుగడియలలో, బలవంతులగు వానరవీరుల నఱువదియేడుకోట్లను వధించెను. హనుమంతుఁడును, విభీషణుఁడును, సముద్రసమానమై భయంకరమయిన యావానరసైన్యమంతయు, బాణపీడితమైయుండుటఁ జూచి, జాంబవంతుని వెదకిరి. స్వభావముననే ముసలివాఁడై జ్ఞానవృద్ధుఁడునై వందలకొలఁది బాణములు దేహమెల్ల నాటియుండఁ, జల్లారుచున్న యగ్నివలెనున్నవీనుని జాంబవంతుని విభీషణుఁడుచూచి యతనిదగ్గఱకుఁ బోయి 'అయ్యా! ఈవాఁడిబాణముల తాఁకునకు నీ ప్రాణములు చెదరకున్నవిగదా' యని యడిగెను. భల్లూకపుంగవుండగు జాంబవంతుఁడు విభీషణుఁడు చెప్పినదివిని బహుకష్టమున మాటలాడ నెలుంగుదెచ్చుకొనుచు, 'రాక్షసోత్తమా! మహావీర్యశాలీ! నీ యెలుఁగువలన నిన్నుఁ దెలిసికొంటిని. తీక్ష్ణబాణములచేఁ బీడింపఁబడుచుండుట వలన నిన్నుఁ గంటితోఁ జూడఁజాలకున్నాను. విభీషణా! ఎవ్వనిసిం గని యంజనయు వాయుదేవుఁడును మంచి సంతానవంతు లయిరో, యావానరోత్తముఁడు హనుమంతుఁడు ప్రాణములతో నున్నాఁడేకద' అనియడిగెను. జాంబవంతుఁడు చెప్పినమాట విని విభీషణుఁ డతనితో 'రామలక్ష్మణులనుంగూడ విడిచి వాయుపుత్రుని హనుమంతు నేలయడిగెదవు? అయ్యా! నీవువాయుకుమారుఁడగు హనుమంతునిపైఁ జూపినంత మిక్కుటపుస్నేహము, వానరరాజగు సుగ్రీవునియందుఁగాని, యువరాజగు నంగదునియందుఁగాని, రామునియందుఁగాని చూపవయితివి. ఏల' అని యడిగెను. విభీషణుఁడు చెప్పినమాటనువిని జాంబవంతుఁడు, అందులకు బదులుగా 'రాక్షససింహమా! అందఱను విడిచి వాయుపుత్రుఁడగు హనుమంతు నడిగినందులకుఁ గారణము చెప్పెదవినుము. వీరుఁడాహనుమంతుఁ డొకఁడుమాత్రము బ్రతికియుండినట్లయిన, తక్కినసైన్యమంతయు హతమయినను భయములేదు; బ్రతికియున్నట్లే. హనుమంతుఁడొక్కఁడు ప్రాణములు వీడినచో, మన మందఱమును బ్రతికియున్నను జచ్చినవారలమే. నాయనా! వాయువంతటివాఁడై వీర్యమున నగ్నిహోత్రునకు సాటివచ్చువాయుపుత్రుఁడు హనుమంతుఁడు, ప్రాణముతోనుండునేని, యంత మాకు బ్రతుకుపై, ఆశకలుగును' అనెను. అంత, వాయుకుమారుండగు హనుమంతుఁడు, వృద్ధుఁ డగుజాంబవంతునియొద్దకుఁ బోయి, శాస్త్రవిహితనియమమున నతనిపాదములం బట్టుకొని నమస్కరించెను. భల్లూకతిలకుండగు జాంబవంతుఁడు,అట్లు, బాణములచే నింద్రియములు కళవళించుచున్నను, హనుమంతుఁడు 'నేనుహనుమంతుఁడ' నని చెప్పి యభివాదనము చేసినదివిని, తాను మరల జన్మించినట్లు తలఁచెను. అంత మహాతేజుండగు నాజాంబవంతుఁడు హనుమంతునిఁజూచి 'వానరసింహమా! ఇటుర

మ్ము. నీవిపుడు వానరులనందఱను రక్షింపవలయును. వీరల రక్షించుటకు వలయు పరాక్రమము నీకుంబోలె మఱెవ్వరికిని జాలదు. నీకది మిక్కిలియుఁ జాలియున్నది. మఱి వీరలకు నీవు మిక్కిలియు నెయ్యుఁడవు. కాన నీవె రక్షింపవలయును. నినుబోఁటి వాఁడు పరాక్రమముచూపుటకే యిదితగినకాలము. మఱియెవ్వఁడు నిట్టికాలమున పరాక్రమింపఁజాలువాఁడు నాకగపడలేదు. భల్లూకవీర సేనలకును వానరవీరసైన్యములకును సంతోషము గలుగఁజేయుము. కీడ్పడియున్న యీరామలక్ష్మణులనుగూడ విశల్యులనుగావించి సుఖముగూర్పుము. హనుమంతా! నీవుసముద్రమునకు దాదాపుమీఁదుగా, బహుదూరముపోయి, పర్వతోత్తమమగు హిమవంతమునకుఁ బోవలయును. శత్రునిషూదనా! అంత నచ్చట, నీవు మిక్కిలియుం బొడవై బంగారమయమైన ఋషభమను మేటిపర్వతమును, కైలాసశిఖరమునుగూడఁ జూడఁగలవు. వీరా ! ఆశిఖరముల రెంటినడుమ దేదీప్యమానమయి యెనలేనికాంతిం దళుక్కుత్తుచు, సమస్తౌషధులతోనుంగూడి యున్నయోషధిపర్వతమును జూడఁగలవు. వానరసింహమా! ఆపర్వతముశిఖరమునఁ బుట్టినవై, దేదీప్యమానములగుచు దశదిశల వెలింగించు చున్నవగునాలుగుదివ్యౌషధులం జూడఁగలవు. అవియె * మృతసంజీవనియు, విశల్యకరణియు, సావర్ణ్యకరణియు, సంధానకరణియు. హనుమంతా ! వాయుపుత్రా ! నీ వాయోషధుల నన్నిటిని దీసికొని శీఘ్రమున రావలయును; వచ్చి వానరుల ప్రాణములుగూర్చి వారి కూఱట గలిగింపవలయును' వానరపుంగవుం డగుహనుమంతుఁడు, జాంబవంతునిమాట వినఁగానే, జలప్రవాహములచే సముద్రముప్పొంగునట్లు, బలోత్కర్షములచేఁ బూరితుఁడయ్యెను. వీరుండగు నాహనుమంతుఁడు, త్రికూటపర్వతాగ్రమునకుఁ దూఁకి పదఘాతమున నాపర్వతోత్తమమును బీడించుచు, రెండవపర్వతమువలెఁ జూపట్టెను. ఆపర్వతము హనుమంతునిపాదములచేఁ ద్రొక్కఁబడి మిక్కిలియుఁ గలఁగినది. అట్లది మిక్కిలి పీడితమగుటచే, తనుదా నెంతమాత్రము నిలువఁజాలదయ్యె. ఆపర్వత మట్లు పీడితమగుటచే నందలి వృక్షములు, హనుమంతుఁడు హిమవంతమునకుఁబోవం దగుశక్తిని గయికొన్నయురవడిచేత నిప్పుపుట్టి మండుకొన్నవి; దానిశిఖరములును చూర్ణములైనవి. అట్లు పీడితమగుచు, విఱిఁగిన వృక్షములతోను శిలాతలములతోను ఆపర్వతము వడవడ వడంకఁగా, దానితటమే యుద్ధరంగముగాన, యందున్నవానరులు నిలువఁజాలరయిరి. అప్పుడు రాత్రియందు లంకాపురి, హనుమంతుని యురవడికి జనులందఱును దిగులునొంద, మహాద్వారము చలింప, గృహములను గోపురములును విఱిగిపడ, నృత్యముచేసిన ట్లుండినది. పర్వతాకారుఁడగు

* మృతులయినవారిని జీవింపఁజేయునది మృతసంజీవని. జీవమువచ్చినవెనుక తిరుగునట్లు చేయుటకు శల్యములను దీసివైచునది విశల్యకరణి. శల్యములను దీసినవెనుక చర్మమునొకటిగా సంధించునది సంధానకరణి. వ్రణములవలనఁ గలుగు వివర్ణతను బోఁగొట్టి తక్కినదేహభాగముతో సమానవర్ణము గలిగించునది సావర్ణ్యకరణి.

వాయుపుత్రుఁడు హనుమంతుఁడు, అట్లు త్రికూటపర్వతమును బీడించి, సముద్రసహితముగా భూమియంతయుఁ జలనమునొందునట్లు గావించెను. అంత హనుమంతుఁడాకొండనుండి మేరుమందరములకు సాటియై నానావిధములగు సెలయేళ్లు నెరసి బెరసియున్న లంకామలయపర్వతము నపుడారోహించెను. ఆపర్వతము పలువిధములయిన వృక్షములచేతను లతలచేతను నెరసి, విరిసినతామరలును గలువలును గలిగి దేవతలచేతను గంధర్వులచేతను సేవితమై యఱువది యోజనములు పొడవుగానుండును. మఱియు నది విద్యాధరులచేతను మునిగణములచేతను అప్సరసలచేతను మిక్కిలియు సేవితమై, నానామృగసమూహములచే నెరసి పెక్కుగుహలతో శోభిలుచుండును. అచ్చట మేఘసంకాశుఁ డగువాయుపుత్రుఁడు హనుమంతుఁడు, అందలి యక్షగంధర్వకిన్నరులనందఱి నాకులపెట్టుచు, దేహమును బెంచెను. ఆహనుమంతుఁడు పాదములచేఁ బర్వతమును ద్రొక్కుచు భయంకరమైన బడబాముఖమువంటి నోరు దెఱచి రాక్షసులను భయపెట్టుటకై బిట్టుగా నఱచెను. లంకయందలి రాక్షసులందఱును, అట్లాశ్చర్యకరముగా గర్జించుచున్న హనుమంతుని గర్జనమును విని, భయమున నిట్టట్టుగదలనుం జాలరైరి. అంత భయంకరవిక్రముఁ డగునాపరంతపుఁడు హనుమంతుఁడు, రామునకు నమస్కరించి యతనికొఱకు మిక్కిలియు గొప్పకార్యమును జేయంబూనినవాఁడయ్యెను. ప్రచండవేగుండగు నాహనుమంతుఁడు, సర్పమువలెఁ గ్రాలుచున్నతోఁకనెత్తి యెగురుటకై వీఁపునువంచి, బలోద్దీపనమునకై చెవులుముడించి, బడబాముఖమువంటి నోరుదెఱచుకొని యాకాశమున కెగిరెను. ఆహనుమంతుఁడు తనబాహువులయు తొడలయు నురవడిచేతఁ బెల్లగిలిన వృక్షసమూహములును, పర్వతములును శిలలును ఆత్రికూటగిరి నెప్పుడునున్న క్షుద్రవానరములును, అతనితోఁగూడనే శీఘ్రమున బహుదూరము చిమ్ముంబడి పోయి యంత వేగము క్రమముగాఁ దగ్గి జలమునఁబడినవి. గరుడసమానవీర్యుఁ డగువాయుపుత్రుఁడు హనుమంతుఁడు సర్పభోగసమానములైనబాహువులు సాఁచి దిక్కులను పిక్కటిల్లఁజేయునట్లుచూపట్టుచు, పర్వతరాజమగు మేరువున్నదిక్కుగా హిమవంతునిఁగూర్చిపోయెను. అప్పుడు తనయురవడిచే నలలపరంపరలు కలఁగుండునొంది సమస్తజలజంతువులును మిక్కిలియు సుడివడుచున్నసముద్రమును జూచుచు హనుమంతుఁడు విష్ణుహస్తముచేఁ బ్రయుక్తమైన సుదర్శనచక్రమువలె నతివేగంబునం బోయెను. వేగమున తండ్రియగువాయువునకు సాటివచ్చు నాహనుమంతుఁడు, పర్వతములను నదులను సరస్సులను తటాకములను వృక్షసమూహములను గొప్పగొప్పపట్టణములను సమృద్ధములగుజనపదములనుం జూచుచు వేగమునంబోయెను. పరాక్రమమునఁ దండ్రికి సాటివచ్చు వీరుఁడాహనుమంతుఁడు, ఆకాశమున నెంతమాత్రము శ్రమములేక యతివేగమునంబోయెను. వానరసింహుఁడగు హనుమంతుఁడు, వాయువుంబోలె మహావేగంబునుం గయికొని, దిక్కులన్నియు శబ్దమునం బూరించుచుఁబోయెను. వాయు

కుమారుఁడగు హనుమంతుఁడు మేరదాఁటి పోవకుండునట్లు జాంబవంతునిమాటనే స్మరించుచు వాయువేగంబునంబోవుచుఁ దోడనె హిమవంతమును జూచెను. ఆ హనుమంతుఁడు నానావిధములగు ప్రస్రవణములతోఁ గూడినదై పెక్కుగుహలతోను సెలయేళ్లతోను నొప్పుచు, తెల్లనిమబ్బుల గుంపులవలె సుందరముగాఁ జూపట్టు శిఖరములతోను నానావిధములయిన వృక్షములతోనుం గూడి యెంతయుఁ బ్రకాశించుచున్నహిమవత్పర్వతమును జేరెను. ఆ హనుమంతుఁడు, మిక్కిలి యున్నతములై భయంకరములుగా నున్నయుత్తమశిఖరములతో నొప్పుచున్న యామహాపర్వతరాజమును జేరి, యందు దేవతోత్తములచేతను మహర్షులచేతను సేవితములగుచు పవిత్రములై యొప్పు గొప్పగొప్పయాశ్రమములను జూచెను. ఆ హనుమంతుఁడు బ్రహ్మదేవునిగృహం బగుబ్రహ్మకోశమును, కైలాసమును, ఇంద్రుఁడు తపస్సు గావించినయాశ్రమస్థలమును, రుద్రుఁడు లీలార్థము బాణప్రయోగము గావించిన స్థానమును, హయగ్రీవు నారాధనక్షేత్రమును, ప్రకాశించుచున్న బ్రహ్మకపాలమును విశ్రమార్థము నిలిచియున్నమాసాదులగు సూర్యకింకరులనుం జూచెను. అతఁడింద్రునకు బ్రహ్మదేవుఁడు వజ్రము నొసంగినస్థానమును, సూర్యునివలెఁ బ్రకాశించుచున్న కుబేరస్థానమును సూర్యునిభార్య యగుఛాయాదేవి ప్రీతికి విశ్వకర్మ సూర్యునివేఁడిమితగ్గుటకై సానఁబట్టుటకు నిబంధించినస్థానమును, దేవగణముల దర్శించుటకై బ్రహ్మకేర్పఱిచిన సింహాసనము గలబ్రహ్మాసనమును, శివుధనుఃస్థానమును, భూమినుండి పాతాళమును బ్రవేశించురంధ్రమును జూచెను. మఱియు నతఁడు, ఉత్తమమగు కైలాసపర్వతమును కైలాసపార్శ్వంబున హిమవచ్ఛిల యనఁబడునొకశిలావిశేషమును, ఋషభమను నౌషధిపర్వతమును, మేరు వనంబడు నేటికాంచనపర్వతమును, రాత్రులందు వెలుంగుచుండు నసుత్తృణజ్యోతులచేతను బ్రకాశించుచున్నదై మృతసంజీవిని మొదలయిన సర్వౌషధులును గలిగియున్న పర్వతోత్తమమునుంజూచెను. వాయుపుత్రుఁ డాహనుమంతుఁడు అగ్నికాంతులచేతంబోలె నోషధులచే వెలుంగుచున్న యా యోషధిపర్వతమును జూచి యాశ్చర్యమునొంది యాపర్వతరాజమంతయుఁ దిరిగి యందు నోషధులను వెదకెను. వాయుకుమారుఁడగు నామహాకపి, యట్లు వేలకొలఁది యోజనములు గడచిపోయినను శ్రమనునొందక, దివ్యౌషధులు గల యాపర్వతమునందు నోషధుల వెదకుచుం దిరిగెను. అంత నాపర్వతరాజమునం గలదివ్యౌషధులు తమ్ముఁ దీసికొనిపోవుటకై హనుమంతుఁడు వచ్చినాఁడని తెలిసికొని యన్నియు నతనికి మఱుఁగుపడినవయ్యె. అట్లు కనఁబడకపోఁగా మహాత్ముఁడగు హనుమంతునకుఁ గోపముగలిగెను. ఆకోపమున నతఁడు సైఁపక, బిట్టుగా బొబ్బయిడి యగ్నివలెఁ గన్నులెఱ్ఱనై వెలుంగఁగా నాపర్వతేంద్రమునుజూచి 'పర్వతరాజమా! నీవు రామునియందుఁ గూడ దయలేకున్నావే. ఇట్లే నీవుగట్టిగా నిశ్చయించుకొని యున్నావా? యేమి? అట్లేని, నాబాహుబలమున నిన్నుఁ గీడ్పఱిచి క్రిందఁ జెల్లాచెదరై

పడఁగూల్చెదను జూడుము' అనెను. అతఁడంత వృక్షములతోను గజములతోను గూడినదై బంగారుగనులుగలిగి, వేలకొలఁది గైరికధాతువులచే విలసిల్లుచు, ఓషధులచే వెలుంగుచున్న పయినెత్తములుగల యాపర్వతశిఖరమును, దానియందలి చిన్నశిఖరములు పగిలి పటాపంచలగునట్లుగాఁ, బట్టుకొని వేగంబునఁ దటాలునఁ బెల్లగించెను. ఆ హనుమంతుఁడు, దేవతలును మఱియసురులును సమస్తలోకములును భయపడ, నాపర్వతమును బెల్లగించి, యాకాశమునకెగసి, గరుడునివలె బెడిదంపు వేగముగలవాఁడుగాన, మహావేగంబున, ఆకాశమునందలి దేవాదులనేకులు పొగడుచుండఁగాఁ బోయెను. అప్పుడు హనుమంతుఁడు దాను సూర్యసమానుండై వెలుంగుచు, సూర్యప్రభంబగు నాశిఖరమును గ్రహించి యాకాశమునకెగసి సూర్యునికి దాపున రెండవసూర్యుండునుంబోలెఁ బ్రకాశించెను. పర్వతాకారుఁడగు నావాయుకుమారుఁడు హనుమంతుఁడు, ఆ పర్వతమును చేతం దాల్చినవాఁడై, ఆకాశమున, వేయంచులుగలిగి అగ్నిజ్వాలలతోఁ గూడియున్న సుదర్శనమును చేతందాల్చియుండు మహావిష్ణువుంబోలె మిక్కిలియుఁ బ్రకాశించుచుండెను. * వానరు, లతఁడు పర్వతశిఖరముతోవచ్చుటనుజూచి, సంతోషముచే బిగ్గఱనార్చిరి. అతఁడును వారిని జూచి కార్యసిద్ధివలనియుబ్బున గర్జించెను. అతిభయంకరమైన వారల గర్జనలఘోషమును విని, లంకావాసులగు రాక్షసులు మఱింత బెట్టిదముగా నఱచిరి. అంత మహాత్ముఁడా హనుమంతుఁడు, ఆ త్రికూటపర్వతరాజమున, వానరసేనామధ్యమున వ్రాలి యచట వానరోత్తములకు శిరస్సువంచి నమస్కరించి విభీషణునిఁ గౌఁగిలించుకొనెను. అచట నపుడు మనుష్యరాజకుమారులగు రామలక్ష్మణు లిరువురును, ఆమహౌషధులగంధము నాఘ్రాణించి విశల్యులైరి. మఱి తక్కిన వానరవీరులును ఆ గంధమును మూర్కొన్నంతనే సుఖితులగుచు లేచిరి. మఱియు నింతకుఁ బూర్వమే నిహతులయిపడి యుండినవానరవీరులుఁగూడ ఆ మేటిమహౌషధులగంధము పయిసోఁకఁగానే సంజీవనివలన క్షణమాత్రమున లేచి, విశల్యకరణివలన నందఱు విశల్యులై, సంధానకరణివలన నొప్పులుమాని, సావర్ణ్యకరణివలన రాత్రిపరుండి నిదురించినవారలు వేకువను నిద్రలేచునట్లు, నొప్పుచుండిరి. నిహతులయిన రాక్షసులుకూడ నట్లెల్ల లేవరైరన్నచోఁ, లంకలో వానరులును రాక్షసులును యుద్ధముసేయ నారంభించినది మొదలుగా, రాక్షసులిందఱు నిహతులయిరని లెక్క యెవ్వరికిని దొరకకుండుటకై, రావణుని యాజ్ఞవలన, యుద్ధంబున వానరోత్తములచే నప్పుడప్పుడు హతులగుచున్న రాక్షసులు అందఱును అప్పుడప్పుడే సముద్రమున వైవంబడుచుండిరి. అంత భయంకరవీర్యుఁడగు నావాయుకుమారుఁడు హనుమంతుఁడు ఆయోషధిపర్వతమును వేగ హిమవంతమునం జేర్చి మరల రామునితోవచ్చి కలసికొనెను. ఇది డెబ్బదినాలుగవసర్గము.

---

* ఇక్కడ హతులయియుండినవానరు లాస్పుటను జెప్పుటచే నూరుగురునుండిరో యాపర్వతమందలియోషధులగంధము నాఘ్రాణించుటవలన నందఱును జీవితులైరని తెలియుచున్నది.

రాత్రి తొలిజామున సుగ్రీవునాజ్ఞను వానరయూథపులు
కొఱవులంగొని ప్రాకారముదాఁటి లంకనుగాల్చుట;
రావణుఁడు కోపించి కుంభకర్ణపుత్రులగు కుంభ
నికుంభులను యూపాక్ష విరూపాక్షాదులతోఁ
గూర్చి యుద్ధమునకుఁ బంపుట; వానర
రాక్షసుల తుములయుద్ధము.

మహాతేజుం డగువానరరాజు సుగ్రీవుఁడు, ప్రయోజనయుక్తం బగుమాట రామునకు విన్నవించుచు నంత హనుమంతునింజూచి, 'రావణుఁడు, తనతమ్ముఁడుకుంభకర్ణుఁడును, కొడుకులును, హతులగుటం జేసి, యుత్సాహము దక్కియున్నాఁడుగనుక నిపుడు వెడలివచ్చి మనకు యుద్ధమునొసంగఁడు. మనవానరులలో, ఎవ్వరెవ్వరు మహాబలవంతులును వేగవంతులు నగుదురో, ఆవానరతిలకులు (సింహసదృశులగువారు రావణాలయమును గాల్చుటకై) కొఱవులను చేతంగొని, ప్రాకారముపై కెగసి శీఘ్రమున లంకలోనికిం బోవుదురుగాక' యనెను.* అంత సూర్యుఁడస్తమించి బెడిదముగానున్న యా రాత్రి తొలిజామున, యవ్వానరసింహులు, కొఱవులనుబట్టుకొని లంకంగూర్చిపోయిరి. వానరసేనలు కొఱవులంగొనివచ్చి నలుప్రక్కలం దఱుమఁగా, గుల్మములనుండి నగరు గాచుచున్న రాక్షసులు, తోడనే పాఱిపోయిరి. అవ్వానరులు, మిక్కిలియుబ్బునం జెలరేఁగి, పురద్వారములందును, అట్టళ్లయందును, పెనువీథులందును, పలువిధములైన యవాంతరవీథులందును, ప్రాసాదములయందును నిప్పంబెట్టిరి. అప్పుడావానరులు దరికొలిపిన యగ్ని రాక్షసులగృహములను వేలకొలందిని దహించెను. పర్వతములంతటి మేడలు దగ్ధములై నేలంగూలినవి. వానియందలి యగరువును, మంచివాసన బుగులుకొన్నహరిచందనమును దగ్ధమయ్యెను. అందలి నిర్మలములయిన ముత్తెములును, దక్కినమణులును, వజ్రములును, పగడములును, తెల్లనారపట్టుచీరలును, సొగసైన పత్తికాయపట్టుచీరలును, నానావిధ వికారములచే విచిత్రసన్నివేశముగా ప్రకాశించుచున్న పలువగల శాలువులును, కంబళములును, బంగారుభూషణములును, ఆయుధములును, గు

* ఇట 'తతో ఽస్తంగత ఆదిత్యే రౌద్రే తస్మిన్నిశాముఖే । లఙ్కామభిముఖాస్సోల్కా జగ్ముస్తే ప్లవగర్షభాః' అని మూలము. మును పు విభీషణుఁడును హనుమంతుఁడును 'ఉల్కాహస్తౌ తదా రాత్రౌ' అన్నట్లు రాత్రియందు కొఱవులతో తిరిగినట్లు చెప్పఁబడినది. ఇట 'అస్తంగతే ఆదిత్యే' అని, అస్తమయమే చెప్పఁబడినది. ఈరెంటికిని పొందిక యెట్లు? అన్నచో ఆదిత్యుఁ డస్తమించెననఁగా సూర్యప్రకాశము లేకుండుటను గ్రహించుచున్నది. నిశాముఖమనఁగా నిందు తొలిజామని తెలియునది. 'రౌద్ర' అను విశేషణమువలన అజాగ్రత్తపడియుండుటచే రౌద్రముగా గాఢాంధకారము క్రమ్ముట సూచితము. హనుమంతుఁడు మహాద్భుతవేగశాలి గాన ముహూర్తమాత్రమున పోయి ఔషధపర్వతమునుదెచ్చి దానిని మరల హిమవంతమునందుంచి వచ్చినాఁడని యతనివేగాతిశయ మిట ప్రతిపాదిత మగుచున్నది. గోవిందరాజులు.

ణ్ణములకు వేయునలంకారములును పల్లను మొదలగునవియు ఏనుఁగుల కంఠభూష ణములును వానికి నడుమునఁగట్టెడు త్రాటిమోకులును, చక్కఁగా తొడయంబడినర థాలంకారవస్తువులును, యోధులకవచములును, ఏనుంగులకును గుఱ్ఱములకును ఇను ము కంచు మొదలగువానితోఁ జేయఁబడిన కవచములును, ఖడ్గములును, విండ్లును, అల్లెత్రాళ్లును, అమ్ములును, తోమరములును, అంకుశములును, శక్తులును, కంబళ్లు మొద లగునవియు, చామరాదులును, పులిచర్మములును కస్తూరికాది బహుసుగంధిద్రవ్యము లును గాల్పఁబడినవి. ఆపట్టణముసందప్పుడు, ముత్తెములును మణులును పొదిఁగిన ప్రాసాదములను, నానావిధములయిన యాయుధసమూహములను, నలుగడల న గ్నిదహించెను. అప్పుడు, గృహస్థులగు రాక్షసులనివాసస్థానములై స్వస్తికాది భేద ములచే నానాసంస్థానములం గట్టఁబడినగృహముల నన్నింటిని నగ్నిహోతృఁడు ద హించినవాఁడయ్యె. అపుడు ఆలంకయందు, బంగారుచే రంగారు నద్భుతకవచము లను దొడుగంబూనినవారును, పుష్పమాలికలను నుత్తమవస్త్రములను దాల్పఁగ డఁగువారలును, మద్యపానముచే కన్నులు తిరుగుచున్నవారును, కైపుచేఁ దొట్రి లఁబడుచున్నవారును, ప్రియురాండ్రచీరలం బట్టుకొని రతికిం బూనినవారలును, శత్రు వులయెడఁ గోపము మిక్కిలి చేసినవారును, గదలను శూలములను ఖడ్గములను జేతుల నంకించువారలును, మాంసాదులను భక్షించుచు క్షీరాదులం ద్రావుచును న్నవారలను, మిక్కిలియు మేలయిన శయనములందుఁ బ్రియురాండ్రతోడం బ రుండి గూర్కువారును, బెదరి బిడ్డలంకసికొని శీఘ్రమున నలుప్రక్కలం బరుగిడు వారునయి, యిట్లు వ్యాసక్తులై యున్నలంకావాసులగు రాక్షసులను బెక్కులక్షల మంది నగ్నిహోత్రము దహించి వారిక్రొవ్వ నెనడు మొదలయినవానిచే పయి పయి సారెకుఁ బ్రజ్వరిల్లుచుండెను. ఆయగ్ని, శ్రేష్ఠములయిన ధనములుగలవియు, మి క్కిలి వెలపొడుగయినవియు, మహాశిల్పముగలిగి మిక్కిలి సౌందర్యము గలుగున వియు, బంగారుతోఁ జేయఁబడి చంద్రాకారములను అర్ధచంద్రాకారముల నగు నవియు, పయిమేడలచే మిక్కిలి యున్నతములయి నవియు, రత్నములచేఁ జిత్రితము లయిన గవాక్షములుగలవియు, అన్నిమెడల శయ్యలతోను నానావిధములయిన యా సనములతోనుం గూడినవియు, రత్నఖచితములను ప్రవాళకలితములు నగుటంజేసి చిత్రములై యొప్పునవియున్నై, పొడవుచే సూర్యుని మట్టనట్లు నూకట్టుచు, కొంచపిట్ట లయు నెమిళ్లయు పిడియలయు భూషణములయు ధ్వనులచే శబ్దించుచు, పర్వతాకార ములై యున్న యుత్తమగృహములను దహించినవాఁడయ్యెను. నిప్పువ్యాపించి మండు చున్న లంకాపురద్వారములు వర్షాకాలమున మెఱపులతోఁ బెనఁగిన మేఘసమూహ ములవలెఁ బ్రకాశించినవి. అంతనాగృహములు నిప్పుచుట్టుకొనగా, ఇంద్రుని వజ్రాయుధములచే భిన్నములయిన మహాపర్వతపుశిఖరములుంబోలె నేలంగూలినవి. అప్పుడు విమానములందుఁ బరుండి నిదురించుచున్న యుత్తమస్త్రీలు నిప్పు దేహము

లఁ దగులఁగానే అవయవములన్నిటంగల యాభరణములనెల్లను దీసిపాఱవైచి, బిగ్గరహాహాకారంబుల నాక్రోశించిరి. అప్పుడగ్నిచేఁ గాలుచున్న యావిమానములు రాత్రులందు తృణజ్యోతులతంపరలు వెలుఁగుచుండు హిమవంతపు శిఖరములవలె దూరమునం జూచుటకుఁ గనుపట్టినవి. ఆలంకయందు రాత్రి కాలుచు జ్వాలలతోఁ గూడియున్న మేడలమొనలు పూచిన మోదుగుచెట్లవలె నెంతయుఁ జూపట్టెను. అప్పుడు అగ్గికి భయపడి మావంతులును, గుఱ్ఱపువారును, ఏనుఁగులయు గుఱ్ఱములయుఁ గట్లు ద్రెంచి విడిచిపెట్టఁగా, నవి పరుగులు వాఱుచున్న లంక, ప్రలయకాలమున అలల యురవడికి పెనుమొసళ్లు తడఁబడుచున్న మహాసముద్రమువలె నుండెను. ఏనుఁగు, గుఱ్ఱపువారిచే విడువఁబడి భయమునఁ బరుగెత్తు గుఱ్ఱమునుజూచి తానును భయపడి మఱియొకదిక్కునకుఁ బాఱినది. గుఱ్ఱమును, భయపడి పరుగెత్తుచున్న యేనుఁగును జూచి తానును భయపడి మఱియొకదిక్కునకుఁ బాఱినది. లంక యట్లు గాలుచుండఁగా, ఎఱ్ఱని యగ్నిజ్వాలలతోడి దాని ప్రతిబింబము సముద్రజలములందుఁ దగులుపడఁగా, అది యెఱ్ఱనిజలము గలసముద్రమువలెఁ బ్రకాశించెను. అట్లు వానరులు లంకాపురికి నిప్పుముట్టింపఁగానే, ముహూర్తమాత్రమున, నమ్మహాపురి యీలోకమునకుఁ గలుగు ఘోరప్రళయమునందు, దందహ్యమానమయిన భూమివలె నుండెను. పొగ గ్రమ్ముకొనఁగా నగ్గిం గాలుచు బిగ్గఱగా కోయని కూయిడుచున్న స్త్రీల యార్తధ్వని పదియోజనములవఱకు వినఁబడెను. అంత వేలకొలఁది రాక్షసులు మిక్కిలియును గాలుచున్న దేహములతో లోపలనుండ సహింపఁజాలక పురము వెలుపలికి వెడలఁగానే, యుద్ధమునకై తహతహపడుచున్న వానరులు వారలను వేగమున నెదుర్కొనిరి. వానరుల యుద్రేకధ్వనులును రాక్షసులయార్తధ్వనులును దశదిశలందును సముద్రమునందును భూమియందునుఁ బ్రతిధ్వని గలుగునట్లు నిండి చెలంగినవి. అప్పుడు మహాత్ములైన యారామలక్ష్మణులిరువురును, విశల్యులై బాణబాధయుడిగి, తొట్రుపడక, యుత్తమములగు విండ్లరెంటిని గయికొనిరి. అంత రాముఁడు, ఉత్తమమగు వింటినారి సారింపఁగానే, యమ్మహాధ్వని తుములమై, రాక్షసుల కెంతయు భయము గలిగించినదయ్యె. అప్పుడు రాముఁడు, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై, పెనువింటిని మొరయించుచు, భగవంతుఁడగు శివుఁడు, సంహారకాలమునఁ గ్రుద్ధుఁడై *వేదోక్తలక్షణమగు ధనువును మొరయించునట్లు, ప్రకాశించెను. వానరుల కోలాహలధ్వనిని రాక్షసుల యార్తధ్వనిని రెంటిని నణంచి మించి రామునిజ్యాధ్వని వినఁబడెను. వానరుల కోలాహలధ్వనియు, రాక్షసుల యార్తధ్వనియు, రాముని జ్యాఘోషమును, ఈమూఁడును దశదశలను వ్యాపించి చెలఁగినవి. రాముఁడు వింటినుండి విడిచిన బాణములచే, కైలాసశిఖరమువంటి యాలంకాపురద్వారము విఱిగి

* ‘భగవానివసంక్రుద్ధో భవో వేదమయంధనుః’ అని మూలము. ‘వేదమయమ్’ అను శబ్దబ్రహ్మాత్మకమగు ధనువు అని మహేశ్వరతీర్థులు.

నేలంబడినది. అంత మేటిరాక్షసులు, విమానములందును గృహములందును రామబాణములు నిగుడుటంజూచి, యధికముగా యుద్ధసన్నాహము చేసిరి. అట్లా రాక్షసోత్తములు యుద్ధసన్నాహముసేయుచు, సింహనాదములు గావించుచునుండఁగా, ఆరాత్రి ప్రళయకాలరాత్రివలె నుండెను. మహాత్ముఁడగు సుగ్రీవుఁడు వానరోత్తములను జూచి 'వానరతిలకులారా! మీరలు రావణాంతఃపురమునకు దాపుగానున్న నడిమికక్ష్యద్వారముం జేరి యుద్ధముసేయుఁడు. మీలో నయ్యయియుద్ధభూమియందున్నవాఁ డెవ్వఁడు నా యీయాజ్ఞను మీటిఁబుచ్చునో, వానిని రాజాజ్ఞ నుల్లంఘించినందులకై, యొక్కదూఁకునఁబట్టి చంపవలెను జుండీ' అని యాజ్ఞాపించెను. మండుచున్న కొఱవులు చేతంబట్టుకొని యవ్వానరముఖ్యులు ద్వారమునొద్ద నిలుచుండుటను జూడఁగానే రావణునకుఁ గోపావేశము కలిగెను. అతఁడు ఒడలువిఱుచుకొనుచుఁ గాలుసేతులు నిగుడ్పఁగా, దశదిశలును వ్యాకులములయినవి. కాలాగ్ని రుద్రుని యవయవములందుఁ గలకోపము రూపమునొందినట్లు, రావణుఁడు చూపట్టెను. అతఁడు, మిక్కిలి క్రుద్ధుఁడై కుంభకర్ణుని పుత్త్రులగు నికుంభుని కుంభుని నిరువురను, పెక్కండ్రు రాక్షసులతోఁగూర్చి యుద్ధమునకుఁ బంపెను. రావణునాజ్ఞవలన, యూపాక్షుఁడును, శోణితాక్షుఁడును, ప్రజంఘుఁడును, కంపనుఁడును, కుంభనికుంభులతోఁగూడఁ బోయిరి. రావణుఁడు మిక్కిలియు బలవంతులగు నా రాక్షసుల నంపుటకు 'ఈ గృహమునుండియే సింహనాదములు సేయుచుఁ బొండు. శీఘ్రముగా గెలుపుగొనుఁడు' అనియు నాజ్ఞాపించెను. అంత వీరులగు నా రాక్షసులు మెఱయుచున్న యాయుధముల ధరించి రావణుఁ డాజ్ఞాపించినట్లు మాటిమాటికి సింహనాదములు సేయుచు లంకనుండి వెడలిరి. వానరులయసాధారణకాంతులచేతను వారిచేతనున్న యగ్నులకాంతులచేతను, రాక్షసుల భూషణకాంతులచేతను నీనడిమి యాకాశమునందంతయుఁ జీకటిదూలి వెలుతురు గలిగినదయ్యె. అప్పుడుదయించిన చంద్రునికాంతియు, నక్షత్రములకాంతియు నయ్యుభయసేనల యాభరణకాంతులును, ఆకాశమును వెలుఁగించినవయ్యె. చంద్రునికాంతిచేతను, భూషణముల కాంతిచేతను, మండుచున్న గృహముల కాంతిచేతను, అవ్వానరరాక్షససైన్యములు నలుగడల మిక్కిలియుఁ బ్రకాశితములయినవి. అప్పుడు మఱియు నూర్ధ్వముఖముగా మిక్కిలియు జ్వాలలు వెలుఁగుచుండుచున్న గృహముల కాంతులు, అలలల్లలాడుచున్న సముద్రమునం బాతాళమువఱకు వ్యాపింపఁగా, అదియెంతయు నధికముగా శోభిలుచుండెను. అప్పుడు భయంకరమయిన రాక్షససైన్యము పతాకలతోను ధ్వజములతోనుంగూడి, ఖడ్గరూపములయిన మేటి గండగొడ్డండ్రును దాల్చి, భయంకరములగు రథగజతురగములుగలిగి, పలువిధములయిన పదాతిసేనలు నరసియుండెను. మఱియు నది మెఱయుచున్న శూలములు గదలు ఖడ్గములును, ప్రాసములును, తోమరములును, ధనువులుం గలిగియుండెను. అది ఘోరాకారులును భయంకరపరాక్రమపౌరుషులు నగుసైనికుల

తోఁగూడి, యిటునటు సాదనచేఁద్రిప్పఁగా తలతలమెఱయు చున్న చిల్లయీఁటెలును గలిగి, రథగజాదులందలి వందలకొలఁది చిఱుగంటలు గణగణమొరయ, వెలయుచుండెను. మఱియు నందలిసైనికులు బంగారుభూషణముల సమూహములను భుజంబులం దొడిగి, మదముచే గండగొడ్డండ్రను ద్రిప్పుచు, గొప్పవి యగుతక్కినయాయుధములను ద్రిప్పుచు, మునుపటివిండ్లు విఱిగినచోఁ గావలయునని వేఱువిండ్లను బాణయుక్తముగా వెనుకంగట్టుకొని యుండిరి. వార లందికొన్న చందనాదిగంధములచేతను దాల్చిన పుష్పమాలికలచేతను, వీరపానముగాఁ ద్రావఁబడిన మద్యములచేతను వాసితమై గాలియు మిక్కిలియు వీచుచుండెను. ఆసేన మఱియు మహాశూరులు నెఱసినదై, మహామేఘమువలె గర్జించుచు భయంకరమై యొంతయుఁ జూపట్టినదయ్యె. వానరసైన్యము, మిక్కిలియు భయంకరమైన యారాక్షససేన వచ్చుచుండుటంజూచి బిగ్గఱగా నార్చుచుఁ గదలి యెదుర్కొనిపోయెను. ఆ రాక్షసుల మహాసైన్యమును వేగమున గెంతులిడుచు, మిడుతలగ్నిపయి నుఱుకునట్లు, మాఱుకొని వానరసేనపయికిం బోయెను. ఉత్తములగు నారాక్షససైనికులు, ఒండొరులభుజనము లెడతెగక రాచుకొనుటవలన వారి పరిఘములును సర్వాయుధములును సానఁబెట్టఁబడినట్లు తళతళమెఱయఁగా, వారలు మఱియు నధికముగాఁ బ్రకాశించిరి. అంతట నప్పుడు వానరులు కయ్యమునకుఁ గాలుద్రవ్వుచు, వెఱ్ఱిగొన్నట్లుఱుకుచు వృక్షపర్వతములచేతను పిడికిళ్లచేతను రాక్షసులఁ బ్రహరించుచుండిరి. భయంకరాకారులగు రాక్షసులును, అవ్వానరులు తమపైకిఁ దలపడఁగా, వారిశిరస్సులను వాఁడిఖడ్గములచేఁ దటాలునఁ ద్రుంచుచుండిరి. ఆయుద్ధమునందు రాక్షసులుగొందఱు, వానరులచే చెవులు గొఱికివేయఁబడియు, కొందఱు పిడికిటిపోట్లచే తలలు పగుల్పఁబడియు, గొందఱు శిలాప్రహారములచే నవయవములు వికవికలయ్యి మెలఁగుచుండిరి. అట్లు ఆవానరులలోఁ బ్రసిద్ధులగు మఱికొందఱు, బలవంతులగు రాక్షసులతో మంచివీరులగువారిని నలుగడలఁ బెక్కండ్రను గీటడంచిరి. అట్లె భయంకరాకారులగు రాక్షసులు వేఱుకొందఱు, అవ్వానరులలో వీరులయినవారిని వాఁడిఖడ్గములచే వధించిపుచ్చిరి. ఆ యుద్ధమున, ఒకఁడు తన్నుఁ గొట్టువానిం గొట్టెను. మఱొకఁడు తన్నుఁ బడఁద్రోయువానిం బడఁద్రోచెను. వేఱొకఁడు తన్ను నిందించువానిని నిందించెను. ఇంకొకఁడు తన్నుఁ గొఱుకువానిం గొఱికివెట్టెను. ఒకఁడు 'నన్నుఁగొట్టు'మనియు, మఱియొకఁడు 'ఇదిగోఁ గొట్టుచున్నాఁ'డనియు, ఇంకొకఁడు 'ఇదిగోఁగొట్టితి' ననియు, వేఱొకఁడు 'ఏల కష్టపెట్టుకొనెదవు నిలువు'మనియు, నిట్లాయుద్ధమున నొకరితోనొకరు వీరాలాపములాడిరి. అప్పుడు వానరులును రాక్షసులును కట్టువస్త్రము వ్రేలాడ, మేనికవచములు దొలఁగ, ఆయుధములు జాఱిపడ, పెద్దప్రాసములను యష్టులను శూలములను ఖడ్గములను నెత్తికొని సంకులముగా యుద్ధముసేయఁగా, పోరు మిక్కిలియు ఘోరమయ్యెను. ఆయుద్ధమునందు రాక్షసులు వానరులను ఏడ్గురేసి పదుగురేసిగాఁ బట్టి వధించిరి. అట్లె వానరులును

రాక్షసులను ఏడుగురను బదుండ్రనుగాఁ బడఁగూల్చిరి. వానరులు తలవెండ్రుకలు పీకి, వస్త్రములుతోలఁగి, కవచములు తుత్తుమురై, ధ్వజములు భగ్నములై కలంగియున్న రాక్షససైన్యమునాఁగి చుట్టుముట్టినవారయిరి. ఇది డెబ్బదియైదవసర్గము.



అంగదుఁ డకంపనుని ప్రజంఘునిని, ద్వివిదుడు శోణితాక్షుని, మైందుఁడు యూపాక్షునిని జంపుట; సుగ్రీవుఁడు కుంభుని వధించుట.

అట్లు నిరంతరముగా, ననేకవీరులరూపడఁగించుచు, యుద్ధము బెడిదముగా జరుగుచుండఁగా, అంగదుఁడు యుద్ధోత్సాహమున వీరుండగు నకంపనుని దలపడెను. అకంపనుఁడు కోపమున నంగదుని మచ్చరించుచు పిలిచి వేగంబున ముందుపడి గదచే నతనింగొట్టెను. అంగదుఁడు అట్లు బిట్టుగాఁగొట్టువడి చలనమునొందసోలెను. అంగదుఁడు తేజస్వియగావునఁ దెలివినొంది యొకపర్వతశిఖరమును బెకల్చి యకంపనునిఱొమ్మునఁ గొట్టఁగా వాఁడు మృతుఁడై నేలంగూలెను. అంత నకంపనుఁడు యుద్ధమున హతుఁడగుటనుజూచి, శోణితాక్షుఁడు నిర్భయముగా వేగ నంగదునిమీఁదికి రథముపఱపెను. అప్పుడు శోణితాక్షుఁడు వేగంబున కాలాగ్నిసమానాకారములై, శరీరమును భేదించునట్టి బెడిదంపువాఁడిబాణముల నంగదునిఁ గాఁడనేసెను. వాలిపుత్త్రుఁడును ప్రతాపవంతుఁడును బలవంతుఁడును నగునంగదుఁడు శోణితాక్షప్రయుక్తములయి మంగలకత్తివంటి ముఖములుగల బాణములచేతను, అర్ధచంద్రాకారబాణములచేతను, శల్యక(నారాచ)బాణములచేతను, వత్సదంతాకారముఖములుగలబాణములచేతను కంకపత్త్రాకారముఖములుగల బాణములచేతను, రెండుపార్శ్వములను గర్తములుగలబాణములచేతను, అర్ధనారాచములచేతను(సగము ఇనుముతోఁ జేయఁబడిన బాణములచేతను), గన్నెరాకుకొనలవంటి బాణములచేతను ఇట్లు పెక్కువాఁడిబాణములచేత దేహమంతయు గ్రుచ్చఁబడినవాఁడై, యాశోణితాక్షుని మేటిధనుస్సును రథమును బాణములను నుగ్గుగావించెను. అంత శోణితాక్షుఁడు క్రుద్ధుఁడై, వాలును పలుకయుంగొని ముందు వెనుకచూడక, మహావేగమున నురవడించి తేరినుండి యాకాశమున కెగసెను. బలవంతుఁడగు నంగదుఁడు వానికంటె మఱింత వేగమున నాకాశమునకెగసి వానింబట్టుకొని చేత వానిమహాఖడ్గమును నొడిసిపెఱికికొని సింహనాదముగావించెను. అంత కపికుంజరుఁడగు నంగదుఁడు ఆశోణితాక్షునిమూఁపున ఖడ్గముంగొని యజ్ఞోపవీతములాగున వ్రేటువేసిఛేదించెను; కాని వాఁడు మృతుండుగాఁడయ్యె. వాలిపుత్త్రుఁడగు నంగదుఁడు, అమ్మహాఖడ్గమునుబట్టికొని మాటిమాటికి సింహనాదములు సేయుచు యుద్ధాగ్రమున నితరులగు వెదిరి రాక్షసులపైఁబోయెను. బంగారుబాహుపురుల రంగారువీరుండగుశోణితాక్షుఁడు, ఇనుపగదను దాల్చి గిరగిరంద్రిప్పుచు

నాయంగదు నేవెంటనంటి తలపడెను. అంత వీరుఁడును బలవంతుఁడు నగుయూపాక్షుఁడు క్రుద్ధుఁడై ప్రజంఘునితోఁ గూడి మహాబలుండగు నంగదునిపై రథముఁబఱపెను. వానరశ్రేష్ఠుఁడగు నంగదుఁడు, శోణితాక్ష ప్రజంఘులనడుమ, విశాఖానక్షత్రములు రెండింటినడుమ నుండుపూర్ణచంద్రునివలె నొప్పెను. మైందుఁడును ద్వివిదుఁడును మేనమామలగుటం జేసి యంగదునిరక్షించుచుఁ దమతమకుఁ దగిన ప్రతిభటుఁ డగురాక్షసునిఁ గనుఁగొనుటకై యంగదునిసమీపమున నిలిచిరి. మహాకాయులును మహాబలులునగు రాక్షసులు వీర్యములు దెచ్చుకొని కత్తులను డాళులను గదలనుం దాల్చి రోషమున వానరులమీఁది కడరిరి. అంగద మైందద్వివిదులు మువ్వురు వానరపుంగవులును, ప్రజంఘ యూపాక్ష శోణితాక్షులనుమువ్వురు రాక్షసులతోనుం దలంపడ నప్పుడు గగురుపుట్టించునట్టి మహాయుద్ధమయ్యెను. ఆవానరులు యుద్ధంబున వృక్షంబులును దెచ్చి పయినివేయుఁగా, మహాబలుండగు ప్రజంఘుఁడు ఖడ్గమున వానినెల్ల ఛేదించివైచెను. ఆవానరులు యుద్ధమున రాక్షసులరథములమీఁదను నశ్వములపైనిని, వృక్షములను పర్వతములనును వేయఁగా యూపాక్షుఁడు బాణసమూహములచే వానిని ఖండించెను. ద్వివిదుఁడు మైందుఁడును బెకల్చి తనపైవైచిన వృక్షములను వీర్యశాలియు ప్రతాపవంతుఁడునగు శోణితాక్షుఁడు గదచే నడుమన భగ్నము గావించెను. ప్రజంఘుఁడు పగవారిమర్మముల భేదించునట్టి పెనుఖడ్గమునుబట్టుకొని యంగదునిఁజంపుటకై వేగమునఁ బయినడరెను. మహాబలుఁడగు వానరోత్తముఁ డంగదుఁడు తనపైకిఁ దారసిలి యాప్రజంఘుఁడు వచ్చుటం జూచి యపుడు మితిమీఱిన బలిమిగలవాఁడుగాన యినుమద్దిచెట్టుతో నతనిని గొట్టెను. మఱియు నాయంగదుఁడు ప్రజంఘుని ఖడ్గయుక్తమగుబాహువును బిడికిటంబొడువఁగా, ఆపోటునకు ఖడ్గము వానిచేతినుండి జాఱి నేలంబడెను. మహాబలుఁడగు ప్రజంఘుఁడు, నల్లకలువకాంతిగల ఖడ్గము నేలంబడుటనుజూచి వజ్రసమానమగు పిడికిలి నలవరించెను. మహాతేజుండగు నాప్రజంఘుఁడు, మహావీర్యుఁడయిన యావానరసింహుని యంగదుని లలాటమునం బొడువఁగా నతండు కొంతసేపు చలనమొంది సోలెను. తేజోవంతుఁడును ప్రతాపశాలియునగు నాయంగదుఁడు, కొంతవడికి తెలివినొంది ప్రజంఘునిశిరస్సు, ఖడ్గముచే కాయమునుండి నేలం డొల్లనేసెను. యూపాక్షుఁడు, యుద్ధమునఁ దనపినతండ్రి ప్రజంఘుఁడు హతుఁడగుటంజూచి కన్నులనిండ నీళ్లుగ్రమ్మ బాణములన్నియు ముగియుటం జేసి, శీఘ్రమున రథముడిగ్గి, ఖడ్గము చేకొనెను. ఆయూపాక్షుఁడు వచ్చుటనుజూచి బలవంతుఁ డగు ద్వివిదుఁడు క్రుద్ధుఁడై వేగిరపడి, వానియొమ్మునం జఱచి బలాత్కారమున వానిని బట్టుకొనెను. అంత మహాబలుఁడగు శోణితాక్షుఁడు తమ్ముఁడు పట్టువడుటంజూచి కోపమున గదతో ద్వివిదునివక్షమునఁ గొట్టెను. మహాబలుఁడగు ద్వివిదుఁడు, ఆగదపోటునకు నెంతయుఁ జలించి మరల నాశోణితాక్షుఁడు గొట్టుటకు గదనెత్తఁగా దాని నొడిసి పెఱికికొనెను. ఈలోపల వీరుఁడును వీర్యశాలియునగు

వానరయూథపతి మైందుఁడు, యూపాక్షునివక్షమున నఱచేతంగొట్టెను. బలవంతులయిన యాశోణితాక్ష యూపాక్షులు, ఆయుద్ధమున మైందద్వివిదులతోఁ దలపడి, ఒకరినొకరు నెంతయు బిట్టుగా లాగుచును గొట్టుకొనుచు నుండిరి. వీర్యవంతుఁడగు ద్వివిదుఁడు గోళ్లచే శోణితాక్షునిముఖమంతయుఁ జీఱి, వేగంబున గిట్టనఁద్రిప్పి నేలపైఁగొట్టి వానిదేహమంతయుఁ బిసికి ముద్దగావించెను. వానరయూథపతియగు మైందుఁడును మిక్కిలి క్రుద్ధుఁడై యూపాక్షుని రెండుచేతులంబట్టి నలుపఁగా వాఁడు హతుఁడై నేలంగూలెను. అప్పుడట్లు మహావీరులు పెక్కండ్రు హతులు కాఁగా, ఆరాక్షససేన భయముగొని కుంభకర్ణునికొడుకున్నయెడకుఁ జక్కఁ బాఱిపోయెను. కుంభుఁడు అట్లువేగమునఁ బాఱివచ్చుచున్న సేనకు ధైర్యముచెప్పి యూఱటగలిగించెను. అంత రాక్షసశ్రేష్ఠుఁడును మహాతేజుఁడునగు కుంభుడు ఎదురులేని మహావీర్యశాలురయిన వానరులచేత రాక్షససేనలోని మేటివీరులు కూల్పఁబడుటంజూచి యుద్ధమునం దితరుల కెంతమాత్రమును జేయఁదరముకాని గొప్పకార్యమును గావించువాఁడయ్యె. అమ్మేటివిలుకాఁడు మిక్కిలియు నెచ్చరికమీఱ విలుగొని కృష్ణసర్పసమానములై దేహములనుభేదించునట్టిబాణములను బ్రయోగించెను. ఆకుంభునియుత్తమంబగు ధనువు నల్లెత్రాటితోను బాణంబుతోనుం గూడినదై మెఱపుఁదీఁగయు నైరావతం బనెడి నిడుదయగు నింద్రధనువునుంబోలె కాంతిదళ్కొత్తుచు, * అట్టిమెఱపుఁదీఁగతోను ఐరావతధనువుతోనుం గూడియున్నరెండవ యింద్రధనువువలెఁ బ్రకాశించెను. అప్పుడు కుంభుఁడు బంగారుపింజగలిగి, ఱెక్కలుగట్టఁబడి, వస్త్రమువలెనున్న కంకపత్రములతోఁ గూడియున్న యాబాణము నాకర్ణాంతముగా లాగి ద్వివిదునిఁ గాఁడనేసెను. పర్వతశిఖరాకారుఁడగు నావానరోత్తముఁడు ద్వివిదుఁడు, ఆబాణముచేఁ దటాలునఁ గొట్టువడి, యడుగులు తొట్రిలంబడ నల్లలాడుచు, విహ్వలాంగుఁడై నేలంబడెను. మైందుఁడు తనతమ్ముఁ డమ్మహాయుద్ధమున భంగము నొందుటను జూచి గొప్పశిలను జేకొని వేగమునఁ గుంభునిమీఁదికిం బోయెను. మహాబలశాలి యగుమైందుఁడు, ఆశిలను గుంభునిమీఁద నేసెను. ఆరాక్షసుఁడు మిక్కిలియుఁ దీక్ష్ణములగు నైదుబాణములచే దానిని వ్రయ్యలుగావించెను. మహాతేజుండగు కుంభుఁడు, మంచిముఖముగలిగి, క్రూరసర్పముంబోని యొకబాణమును వింటసంధించి ద్వివిదునన్న యగుమైందునిఱొమ్మునాటనేసెను. ఆదెబ్బ వానరయూథపుఁ డగుమైందునిమర్మమునఁ దాఁకఁగా నతండు దానికి మూర్ఛిల్లి నేలంబడెను. అంగదుఁడు మహాబలురైన తనమేనమామ లిరువురును బడుటం

---

* ఐరావతమనఁగా 'ఇన్ద్రాయుధం శక్రధనుస్తద్దీర్ఘ ఋజురోహితం । ఐరావతం' అను వైజయన్తి. నిడుదయై చక్కఁగానుండు నింద్రధనువు. ఇట మెఱపుఁదీఁగకును అల్లెత్రాటికిని ఐరావతధనువునకును బాణమునకును కుంభధనువునకును ఇంద్రధనువునకును సామ్యము దెలియునది. మెఱపుఁదీఁగయు ఐరావతమును నింద్రధనువుగూడుట యుత్పాతకాలమందని తెలియునది.

జూచి, విలు పూని యున్నయాకుంభునిమీఁదికి వేగమున నడరెను. అంగదుఁడు పైకివచ్చుటనుజూచి కుంభుఁడు, ఏనుంగును నంకుశములచేతం బొడుచునట్లు, ఆ యంగదుని నినుపబాణము లయిదింటిచేతను తక్కినవాఁడిబాణములు మూఁటి చేతను నొప్పించెను. వీర్యవంతుఁడగు నాకుంభుఁడు, మొక్కవోని మంచిమొనలు గలవై యుత్కృష్టములై బంగారుచే నలంకృతములును నానావిధములు నగునినుప బాణముల నంగదు నొప్పించెను. అట్లు కుంభుఁడు తనయవయవములందెల్ల బాణములఁ గ్రుచ్చి నొప్పించినను వాలిపుత్త్రుఁ డంగదుఁ డొంతమాత్రము చలింపనివాఁడై వానినెత్తిమీఁద శిలలను వృక్షములనును జడిగాఁ గురియించెను. శ్రీమంతుఁడగు నా కుంభకర్ణకుమారుఁడు కుంభుఁడు అంగదుఁడు వైచిన యావృక్షములనన్నిటిని భేదించి శిలలను దుత్తుమురుగావించెను. మఱియు నావానరయూథపతి యంగదుఁడు దా రసించి వచ్చుచుండుటను జూచి, ఏనుంగును కొఱవులు రెంటం బొడుచునట్లు, అతని కనుబొమలయందు రెండుబాణములునాటి నొప్పించెను. ఆయంగదుని నొసటనుండి నెత్తురు మిక్కుటముగాఁగాఱఁగా నతనికన్నులు మూఁతపడినవి. అంగదుఁడు నెత్తుటఁదోఁగుచున్నకన్నులను నొకచేతమూసికొని, రెండవచేత దాపుననున్న వృక్షమును బట్టుకొనెను. మఱియు నతఁ డదియొకచేతఁ బెకల్పరాకుండుటచే ఱొమ్ము చేఁబట్టి య దిమి బోదెనుగదల్చియు చేతంబట్టుకొనియుఁ గొంచెమువంగి యేనుఁగు వృక్షమును బెకల్చునట్లు, దానిని బెకల్చెను. ఇంద్రధ్వజమును బోలినదై మందరపర్వతము వలె నున్నయావృక్షమును నంగదుఁడు వేగమున విడుచుచుండఁగా గుంభుఁడు సమస్తరాక్షసులును జూచుచుండ, దేహమును భేదించునట్టి వాఁడిబాణము లేడువైచి యతనిం గాఁడఁజేసెను. అంగదుఁ డాబాణములచే వ్యథితుఁడై బిగ్గఱ నఱచి మూర్ఛిల్లెను. శత్త్రువులకు మార్కొనరానివాఁడగు వానరశ్రేష్ఠుఁ డంగదుఁడు సముద్రమునం బడునట్లు యుద్ధమున నొచ్చుటను జూచి, తక్కినవా రాసంగతి రామునకుఁ దెలిపిరి. రాముఁడును, వాలిపుత్త్రుండగు నంగదుఁడు యుద్ధరంగమున నొచ్చినాఁడని విన్నంతనే జాంబవంతుఁడు మొదలగువానరశ్రేష్ఠుల నంత నంగదునికిఁ దోడుపడ నాజ్ఞాపించెను. ఆవానరసింహులు రామునాజ్ఞవిని, మిక్కిలియుం గ్రుద్ధులై విలు పూని యున్నయాకుంభునిమీఁదికి వేగంబోయిరి. అంత నవ్వానరతిలకులు, అంగదుని రక్షింపఁగోరి వృక్షములను శిలలనుం దాల్చి కోపంబునఁ గన్ను లెఱ్ఱఁబాఱఁ గుంభునిమీఁదికి నురవడించిరి. జాంబవంతుఁడును సుషేణుఁడును వేగదర్శి యను వానరుఁడును, క్రుద్ధులై కుంభకర్ణపుత్త్రుఁడగు కుంభునిమీఁదికి నడరిరి. మహాబలవంతులగు నమ్మేటివానరులు పైకి నడగుచుండుటనుజూచి కుంభుఁడు, జలప్రవాహమును చెట్లగుంపుచేతంబోలె, బాణసమూహముచేత వారిని వారించెను. అవ్వానరోత్తములు మహాబలవంతులయ్యును ఆకుంభుని బాణములబారింబడి, సముద్రము చెలియలికట్టనుంబోలె, దానింగడచి ముందరికేమఱ్ఱికొని పోఁజాలరైరి. వానరే

శ్వసుఁడగు సుగ్రీవుఁడు, ఆవానరులందఱును బాణవర్షముల నొచ్చుటనుజూచి యన్నకుమారుఁడగు నంగదునిఁ బిఱుందనిడికొని, మహావేగంబగు సింగము కొండనెత్తములఁ దిరుగునట్టి యతిబలము గలయేనుంగు మీఁది కుఱుకునట్లు, వేగమున యుద్ధంబునఁ గుంభునిమీఁదికి నడరెను. మహాబలుండగు సుగ్రీవుఁడు, గొప్పపర్వతములను, ఇనుమద్దిచెట్లను, జంద్రచెట్లను, ఇంకను బలువిధము లగు పెక్కువృక్షములను బెకల్చి కుంభునిమీఁదవైచెను. ఆకాశమునంతయుఁ గ్రమ్ముకొనుచు దారసింపరాకున్న యావృక్షవర్గమును కుంభకర్ణకుమారుఁడు కుంభుఁడు, వాఁడిబాణములఁ ద్రుంచివైచెను. కుంభుఁడు తీవ్రుండై గుఱిదప్పక నేయువాఁడిబాణములు చుట్టును దట్టముగా నలమికొనఁగా, ఆవృక్షములు ఇనుపశంకులతో నిండిన శతఘ్నులనెడి ఘోరాయుధములవలెఁ బ్రకాశించినవి. వీర్యవంతుఁడును మహాబలుఁడును నగు శ్రీమంతుఁడౌ వానరరాజు సుగ్రీవుఁడు, కుంభునిచేఁ దనవృక్షవర్షమంతయు ఛిన్నమైనను నెంతమాత్రము వ్యథనొందఁడయ్యె. అతఁడు, కుంభుఁడు బాణములచే తొడింబడ తన్ను ఛేదించుచున్నను వానికెల్లను సైఁచుచు వానిం దారసిల్లి యింద్రధనువువలె వెలుంగుచున్న వానివింటిని బట్టి విఱిచెను. సుగ్రీవుఁడట్లు శీఘ్రమున వానిమీఁదికి దుమికి, యితరుల కలవిగానికార్యమును గావించి కుపితుఁడై, కొమ్ము విఱిగిన యేనుంగువలె నున్న కుంభునిం జూచి 'నికుంభాగ్రజా ! కుంభా ! బాణవేగమును, మిక్కిలియు నెఱపునీవీర్యము అద్భుతముగా నున్నది. మఱియు రాక్షసులయందు నీకుఁ గలప్రావణ్యమును ప్రభావమును రావణునికిం గలయట్లున్నవే. నీవు ప్రహ్లాదునికిని బలిచక్రవర్తికిని దేవేంద్రునికిని కుబేరునికిని వరుణునకును సాటియగువాఁడవు. నీవొకఁడవు బలవ్యాపారంబునఁ దండ్రిం బోలిపుట్టినవాఁడవు. పగవారి నడంచుదిట్ట యగుమహాబాహుఁడవు నీవొక్కఁడుమాత్రము విలుదాల్చి నిలువఁగా, నిన్ను, జితేంద్రియుని మనోవ్యథలువలె, దేవతలును జెనకంజాలరు. నీవు మహాబుద్ధిమంతుఁడవు. నేను జూచుచుండఁగా యుద్ధకార్యము లొడఁగూడుటకు నీపరాక్రమముఁ జూపుమా ! నీపెదతండ్రి రావణుఁడు వరదానబలమువలన దేవదానవులనోర్చియున్నాఁడు నీతండ్రి కుంభకర్ణుఁడుమాత్రము శరీరబలముచేతనే సురాసురులను వారింపఁజాలును. నీవీరెండుబలముల చేతను వారినోర్వఁగలవు. నీవు విలువిద్యయం దింద్రజిత్తునికిని, ప్రతాపమున రావణునికిని, సమానుఁడవు. నీవిప్పుడు లోకమున బలవీర్యములందు, రాక్షసులలో నెల్ల శ్రేష్ఠుఁడవు. ఇంద్రునకును శంబరునకునుంబోలె నీకును నాకు నద్భుతముగాఁ గలుగుమహాయుద్ధమును నిపుడు సమస్తభూతములును జూచుఁగాక. నీవసదృశమైన వీరకృత్యము చేసితివి. అస్త్రకౌశలమును జూపితివి. భయంకరవిక్రములగు వానరవీరులను బడఁగూల్చితివి. వీరా! పెక్కండ్రతోఁ బోరియలసినవానిని వధించినాఁడని యపవాదము కలుగునని భయపడి, నిన్నింకను నేనువధింపలేదు. చాలఁబనిచేసి యలసియున్నావు. కొంతయల

సటం దీర్చుకొని యంతనాబలమును జూడు' మనెను. ఇట్లు సుగ్రీవుండు అవమానగర్భమగు మాటలచే గారవింపంగా, ఆకుంభుండు నేయిపోసిన యగ్నిహోత్రమువలె, తేజము వర్ధిల్లినవాండయ్యె. అంత నపుడు కుంభుండు సుగ్రీవుని రెండుచేతులంబట్టుకొనెను. వారిరువురును మదగజంబులవలె మదచేష్టలు సేయుచు, మాటిమాటికి నిట్టూర్పులుపుచ్చుచు, ఒండొరుల దేహముల బిగ్గంబట్టి పెనంచుకొనుచు, ఒకరినొకరుపట్టి లాగికొనుచు, యుద్ధము చేసినశ్రమమువలన నోటనుండి పొగతోడ నగ్నిజ్వాలవిడుచుచుండిరి. వారలపదఘాతములచే భూమి క్రుంగెను. సముద్రమును తరంగములు ఘూర్ణిల్ల నెంతయుం గలగుండునొందెను. అంత సుగ్రీవుండు, కుంభునిం బయి కెత్తి సముద్రమునడుగునేలం జూచునట్లుగా,* వేగంబున సముద్రమునం బడవైచెను. అంత సముద్రమున కుంభుండుపడుటచే దానిజలసమూహము, వింధ్యమంథరపర్వతాకారముగా పైకినుబ్బి యంతటను బ్రవహించెను. అంతం గుంభుండెగిరి సుగ్రీవునియొద్దకువచ్చి కుపితుండై వజ్రమువంటి యురవడిగల పిడికిట నతనిఱొమ్మునం బొడిచెను. ఆ దెబ్బకు సుగ్రీవుని వృక్షము సంకలితోలుమాత్రమురిలి మిక్కిలియు నెత్తురుగాఱెను. కాని యాపోటు మిక్కిలియు రవడిగలదయ్యు, సుగ్రీవునియెమ్ములక్రంతను దాంకి ప్రతిహతమయ్యెను. ఆసుగ్రీవుని ఱొమ్మున, కుంభునిపిడికిలి రాసిన యురవడిచేం బుట్టినయగ్గి, ఇంద్రుండు కొండల తెక్కలం గొట్టునపుడు మేరువునందు వజ్రాయుధపురాపిడిచేతం గలిగిన జ్వాలవలె మాటికి జ్వలించెను. అప్పుడు మహాబలుండగు నవ్వానరసింహుండు సుగ్రీవుండు కుంభునిచే నట్లు కొట్టువడి, కుపితుండై వజ్రముంబోనిపిడికిలి యలవరించెను. వీర్యవంతుండగు నాసుగ్రీవుండు సహస్రకిరణములచే నావృతమై సూర్యమండలమువలె వెలుంగుచున్న యముష్టిచేం గుంభునిఱొమ్మునం బొడిచెను. అప్పుడు కుంభుం డాదెబ్బచేత మిక్కిలియుం బీడితుండై యవయవములెల్ల విరవిరంబోవ, కాంతి పోనుంగు పడిన నిప్పువలె విగతప్రాణుండై నేలంగూలెను. ఆరాక్షసుండు కుంభుండు ఆపిడికిటిపోటుచేం గొట్టువడినవాండై, యాదృచ్ఛికముగా కిరణంబులు వెలుంగుచుండు నంగారకుం డాకాశముననుండి నేలంబడునట్లు, తటాలున నేలంగూలెను. ముష్టిపోటు ఱొమ్మునం దగిలి భగ్నుండై నేలంగూలిన కుంభునిరూపము రుద్రునిచేం ద్రోపుపడిన సూర్యునిరూపమువలె నెంతయుం దేజరిల్లెను. అట్లు భయంకరపరాక్రముండును వానరసింహుండునగు సుగ్రీవునిచే యుద్ధమున కుంభుండు హతుండు కాంగానే, భూమి పర్వతములతోను సరిద్వనములతోను వడవడ వడంకెను. రాక్షసులకును మిక్కిలియు భయావేగము గలిగినదయ్యె. ఇది డెబ్బదియాఱవ సర్గము.

---

* సుగ్రీవుండు శతయోజనదీర్ఘమైన త్రికూటశిఖరమధ్యమున యుద్ధమును సేయుచు నచ్చటనుండి లంకాద్వీపతలమునుండి లవణసముద్రమునం బడవైచెననుటచే నతనియపరిమేయబలసంపత్తి తెలియంజున్నది.

నికుంభుఁడు హనుమంతునిచే హతుండగుట.

నికుంభుఁడు, తన యన్నయగు కుంభుని సుగ్రీవుఁడు గూల్చుటంజూచి, కోపమున దహించువానింబోలె చుఱచుఱ వేఁడిచూపుల నా వానరేశ్వరునిం జూచెను. అంత వీరుఁడగు నికుంభుఁడు భయంకరమై యమదండముంబోలెఁ జూపట్టుచు రాక్షసుల భయ ముడుపునట్టియొక పరిఘమును జేకొనెను. అది పెద్ద పుష్పమాలికలచే నలంకృతమై చందనకుంకుమాదుల నద్దుకొన్నదై యైదువ్రేళ్లతో వ్రాయంబడిన ముద్రలుగలిగి, మేలయి, పర్వతశిఖరమువలెఁ జూపట్టుచుండెను. మఱియు నది బంగారుపట్టెలకట్లుగలిగి, వజ్రములచేతను పగడములచేతను నలంకృతమై యొప్పుచుండెను. అప్పుడు మహాతేజుండును భయంకరపరాక్రముండునగు నికుంభుఁడు, ఇంద్రధ్వజసమానంబగు నాపరిఘమును గిరగిరం ద్రిప్పి నోరు విఱివిగాఁ దెఱచి సింహనాదము గావించెను. నికుంభుఁడు ఱొమ్మున రత్నాలపతకమును సందిళ్ల బాహుపురులును చెవులఁ జిత్రములగు కుండలములను, విచిత్రమగు పుష్పమాలికయును మఱియు నితరములగు హారాదిభూషణములును ఆ పరిఘమును దాల్చినవాఁడై సింహనాదము సేయుచు, మెఱపులతోను నింద్రధనుస్సుతోనుగూడి గర్జించుచున్న మేఘమువలెఁ బ్రకాశించెను. మహాబలుండగు నికుంభుఁడు పరిఘమును గిరగిరం ద్రిప్పఁగా దానివలనంబుట్టిన వాయువురవడిచే నావహాదివాయుపటలము భేదిల్లెను. మఱియు నది మహాధ్వనిగలదై పొగలేని యగ్నివలెఁ బ్రజ్వరిల్లెను. ఆ నికుంభుఁడు పరిఘముం ద్రిప్పఁగాఁ బుట్టినయురవడిచే గంధర్వగృహరాజములతోఁ గూడిన యలకాపురమును, సమస్తదేవతాగృహములతోఁ గూడినయమరావతీనగరమును అశ్విన్యాది నక్షత్రములతోను ఇతరములయిన నక్షత్రములతోను చంద్రునితోను బుధాదిగ్రహములతోను * శుక్రాది మహాగ్రహములతోనుం గూడిన యాకాశమును జలించి గిఱ్ఱునఁ దిరుగుచుండెను. పరిఘముకాంతిచేతను ఆభరణములకాంతులచేతను బ్రజ్వలించుచున్న యా నికుంభాగ్ని వానరులకుఁ జిమ్మిరేఁగిన ప్రలయకాలాగ్నియుంబోలెఁ దాఁకరాన నలవిగాకపొడమెను. అప్పుడు వానరులును రాక్షసులును భయముఁగొని యిట్టట్టు కదలనుం జాలకుండిరి. బలవంతుఁడు హనుమంతుఁడొకఁడుమాత్రము వక్షము మఱింతవిఱివిగావించి చూపుచు నతనియెదుట మార్కొని నిలిచెను. ఇనుపగుదియలంబోని బాహువులుగల యా బలవంతుఁడు నికుంభుఁడు సూర్యబింబమువలె ధగధగ మెఱయుచున్న యా పరిఘమును బలవంతుఁడగు హనుమంతునిఱొమ్మునఁ వైచెను. ఆ పరిఘము, కఠినమును విశాలమునయిన యా హనుమంతునిఱొమ్ముఁ దాఁకి నూఱుముక్కలయి చెల్లచెదరుగా నెగసి యాకాశమున నూఱు ఉల్కలుంబోలె వెలుంగుచు నేలంబడెను. ఆ హనుమంతుఁడా పరిఘమునఁ గొట్టువడి యా దెబ్బకు భూకంపమునం బర్వతమువలె నంతయుఁ జలనము నొందెను. అప్పుడు మిక్కిలిమీఱిన బలవంతుఁడగు వానరోత్తముఁడా హనుమంతుఁడు

* ఇట రాత్రిగాన సూర్యుఁడు చెప్పఁబడలేదని తెలియునది. గోవిందరాజులు.

నట్లు కొట్టుపడి, కుపితుఁడై, తనబలముకొలఁదిని పిడికిలి నలవరించెను. మహాతేజుఁడును వీర్యవంతుఁడును వేగసంపన్నుఁడునై వాయువునకుంబోలె గమనము గలహనుమంతుఁడు, ఆ ముష్టినెత్తి, వేగమున నికుంభునిఱొమ్మునం బొడిచెను. ఆ పోటువలన నికుంభుని వక్షమునందలి చర్మమువిరిసి, నెత్తురు మిక్కిలియుఁ గాఱినది. ఆపిడికిటిదెబ్బకు మెఱుపువలె నతనిఱొమ్మున ఫళాగున జ్వాలపుట్టినది. ఆ నికుంభుఁడు ఆదెబ్బకు మిక్కిలిచలించి యంతఁ గొంతవడికిఁ దేఱి మహాబలుఁడగు హనుమంతునిఁ బట్టుకొనెను. అప్పుడు నికుంభుఁడు యుద్ధమున మహాబలుఁడగు హనుమంతునిఁ బయికెత్తుటనుజూచి (లంకావాసులగు) రాక్షసులు, ఉబ్బున, భయంకరముగా నార్పులు చెలంగించిరి. అప్పుడు హనుమంతుఁడు తన్ను నికుంభుఁడు పట్టుకొనిపోవుచున్నను, వానిని వజ్రమువంటిపిడికిటం బొడిచెను. అంత వాయుపుత్రుఁడు హనుమంతుఁడు తన్ను విడిపించుకొని నేలపై నిలిచి శీఘ్రంబున నికుంభుని నిట్లు రూపుమాపెను. వీర్యవంతుఁడగు హనుమంతుఁడు మహాప్రయత్నమున నా నికుంభుని నేలపైఁ బడఁద్రొబ్బి పిసికి పిండిలివండుచేయుటే కాక వేగ పయికెగిరి వానిఱొమ్ముపై గొబ్బునఁబడెను. హనుమంతుఁడంత రెండుచేతులను నికుంభునిమెడను బట్టుకొని త్రిప్పి, వాఁడు బెడిదముగా నఱచుచుండఁగా, భయంకరమగు వానిశిరస్సును ద్రుంచివైచెను. అంత నికుంభుఁడు హనుమంతునిచే యుద్ధమున నఱచుచు రూపుమాయఁగా నంత దశరథకుమారుఁడగు రాముఁడును రావణునికుమారుఁడగు మకరాక్షుఁడును మిక్కిలియుఁ గోపమునొంది యతిభయంకరముగా యుద్ధముగావించిరి. నికుంభుఁడు ప్రాణములువిడువఁగానే వానరులు సంతుష్టులై సింహనాదములు సేసిరి. అపుడు దిక్కులు ప్రతిధ్వనించెను. భూమి వడఁకినట్లుండెను. ఆకాశము పగిలినట్లుండెను. రాక్షససైనికులకెల్ల భయావేశము కలిగినదయ్యె. ఇది డెబ్బదియేడవ సర్గము.

---

## మకరాక్షుఁడు యుద్ధమునకు వచ్చుట.

రావణుఁడు, నికుంభుఁడును హతుఁడగుటయు కుంభుఁడు కూలుటయు విని మోతయు సహింపఁజాలక నిప్పువలె మండిపడెను. రావణుఁడు క్రోధమును శోకమును రెండును బెనంగొన, ఖరునికుమారుఁడును విశాలాక్షుఁడు నగుమకరాక్షుఁజూచి 'కొడుకా ! నీవు నాయాజ్ఞచొప్పున సేనంగూడిపొమ్ము. పోయి రామునిని, లక్ష్మణునిని, అవ్వానరులనును వధించిరమ్ము' అని యాజ్ఞాపించెను. ఖరునికుమారుఁడు మకరాక్షుఁడు మహాశూరుఁడని యహంకరించి యుండువాఁడుగాన, రావణుని యాజ్ఞను విన్నంతనే, సంతుష్టుఁడై మంచిదని చెప్పెను. ఆ బలవంతుఁడు రావణునకుఁ బ్రదక్షిణముచేసి నమస్కరించి యతని యాజ్ఞచొప్పున శుభ్రంబగు రాజగృహమునుండి బయలుదేఱెను. మకరాక్షుఁడు దాపున నున్నసేనాపతినిజూచి 'రథమును శీఘ్రముగాఁ దెమ్ము, సేననుం ద్వరితముగా రప్పింపుము '

అనెను. అతఁ డట్లుచెప్పినదివిని సేనాపతియు, తోడనే రథమును సైన్యము నతని సమీపమునకుం దెచ్చెను. మకరాక్షుఁడు తనరథమునకుఁ బ్రదక్షిణముగావించి, యారోహించి 'రథమును శీఘ్రముగాఁ బోలుము.' అని సారథి కాజ్ఞాపించెను. అంత *మకరాక్షుఁ డారాక్షససైనికులనెల్లంజూచి 'రాక్షసులారా! మీరలందఱును, నాముంగల, చక్కఁగా యుద్ధముసేయుఁడు. రాక్షసరాజును మహాత్ముఁడునగు రావణుఁడు, ఆరామలక్ష్మణుల నిద్దఱను యుద్ధమున వధింప నన్ను నియోగించెను. రాక్షసులారా! ఆరామునిని,లక్ష్మణునిని, వానరుఁడగు సుగ్రీవునిని, తక్కిన వానరులనను, నిపుడు మేటిబాణములచే వధించివచ్చెదను. ఇపుడు నేనచటికిఁబోయి, వానరుల మహాసైన్యమునంతయు శూలములువైచి, ఎండుకట్టెలను నిప్పుదహించునట్లు, రూపుమాపెదను.' బలవంతులగు నారాక్షసులు, మకరాక్షుఁ డట్లు చెప్పినదివిని, యంతటను నానావిధాయుధములు ధరియించి యుద్ధమునకు వచ్చిరి. వారందఱును కామరూపులై కోఱలుమెఱయ పింగళవర్ణములగు కన్నులతో నిలవెండ్రుకలు విరియఁబాఱియుండుటచే భయంకరులై మత్తగజములవలె గర్జించుచు మహాకాయులై మహాకాయుఁడగు ఖరకుమారుని మకరాక్షుని పరివేష్టించి హర్షంబున భూమిని జలింపఁజేయుచు యుద్ధమునకు నడచిరి. అంత నలుప్రక్కలను,వేలకొలఁది భేరీలు వాయింపఁబడెను. వేలకొలఁది శంఖములు పూరింపఁబడెను. రాక్షసుల సింహనాదములు భుజాస్ఫాలనధ్వనులును జెలఁగెను. ఇవన్నియు మహాధ్వనియై వినఁబడెను. అంత నామకరాక్షుని సారథిచేతిమునికోల జాఱి నేలంబడెను. మకరాక్షునిధ్వజమును దటాలున నేలంబడెను. అతనిరథమునకుఁ బూన్పంబడిన గుఱ్ఱములు, వివిధములుగా పదవిన్యాసములుసేయుట మాని మొదట తొట్రుపడు పాదములతో నడచి యంత దీనములై కన్నుల నీళ్లుగార్చుచుఁ బోయినవి. రౌద్రుఁడును దుర్మతియునగు నామకరాక్షుఁడు బయలుదేఱినపుడు, వాయువు దుమ్ములతోఁగూడి పరుషమై భయంకరముగా వీచెను. మేఘవర్ణమును ఏనుంగువన్నెయు, ఎనుపోతురంగునుంబోని చాయలుగలిగి, యుద్ధాగ్రములం బెక్కుమాఱులు నిలిచి గదాఖడ్గముల వ్రేటులు పడి గడి దేఱి యుద్ధమునం దాఱి తేఱి, 'నేను నేను' అని యహమహమికతో గర్జించుచును మహావీర్యవంతులగు రాక్షసులు,ఆదుర్నిమిత్తంబులను జూచియు పాటింపక రామలక్ష్మణు లున్న చోటికిం బోయినవారయిరి. ఇది డెబ్బదితొమ్మిదవ సర్గము.



* ఒకపక్షమునఁ జెప్పిన, మకరాక్షుఁడు వచ్చుటయు హతుఁడగుటయు పశుప్రాతఃకాలము నందని తెలియుచున్నది. రెండవపక్షమునఁ జెప్పిన పశుప్రాతఃకాలము మొదలుకొని అకంపనవధము ప్రహస్తవధము రావణమకుటభంగము కుంభకర్ణప్రబోధము కుంభకర్ణవధమును నాఁటియపరాహ్ణమున బ్రహ్మాస్త్రబంధమును, నాఁటిరాత్రి బ్రహ్మాస్త్రబంధమోక్షము లంకాదహనము నికుంభకుంభయూపాక్షశోణితాక్షప్రజంఘకంపనమకరాక్షవధములు నని తెలియుచున్నది.

## రాముఁడు మకరాక్షుని వధించుట.

ఆ వానరయూథపతులందఱును, మకరాక్షుఁడు వెడలివచ్చుటను జూచి, యుద్ధసన్నద్ధులై నిలిచిరి. అంత దేవతలు దానవులతోడం బోలె, ఆవానరులు రాక్షసులతోడం దలపడఁగా, అప్పుడు మహాయుద్ధము గగుర్పాటు బుట్టించునదై ప్రవర్తిల్లెను. అప్పుడు వానరులును రాక్షసులును వృక్షములను శూలములను, శిలలను, పరిఘములను వైచి, యొండొరులను మర్దించిరి. అపుడు ఆరాక్షసులలోఁ గొందఱు, ఈఁటెయలచేతను, ఖడ్గములచేతను, గదలచేతను, కుంతములచేతను, తోమరములచేతను, పట్టిసములచేతను, భిండివాలములచేతను, వజ్రములచేతను, మఱికొందఱు పాశములచేతను, ముద్గరములచేతను, దండములచేతను, నిఖాతములనెడి యాయుధవిశేషములచేతను, వానరవీరులతో యుద్ధముగావించిరి. మకరాక్షుని బాణసమూహములచే వానరులు పీడితులై మనంబులు మిక్కిలియుఁ దల్లడిల్ల నందఱు భయార్తులై పాఱిరి. ఆరాక్షసులు, వానరులందఱును భయమునం బరుగెత్తుటనుజూచి సంతోషమున సింహనాదములు గావించిరి. రాక్షసులు జయమునం బ్రకాశించుచుండిరి. అప్పుడు వానరులు నలుగడలఁ బరుగెత్తుటయు రాక్షసులు వానరులను దఱుముటయుఁజూచి రాముఁ డారాక్షసులను బాణవర్షమున వారించెను. రాక్షసులు రామునిచే వారితులగుటంజూచి, మకరాక్షుఁడు కోపానలంబున మండిపడుచు రామునింజూచి ‘రామా! నాతోఁగూడ నిలువు! నీకు ద్వంద్వయుద్ధము నొసంగెదను. వింటినుండి వాఁడిబాణముల విడిచి నీప్రాణములఁ దీయించెదను. అప్పుడు దండకారణ్యమున నీవు నాతండ్రిని వధించితివిగావున, మరల నాయెదుట యుద్ధకర్మమునకై పూని నిలుచుండుటను జూడఁగా నాకు పయింబయి రోషము పెచ్చుపెరుఁగుచున్నది. దురాత్మా! రామా! ఆకాలమునందు నిన్ను నే నాదండకారణ్యమునందుఁ జూడకపోయితినే యని నాయంగములన్నియు మిక్కిలి మండుచున్నవి. రామా! నాభాగ్యవశమున నీ విచట నాకంటం బడితివి. ఆఁకటిచేఁ బీడితమైన సింహము ఇతరమృగమున కువ్విళ్లూరునట్లు, ఇన్నాళ్లునీకుఁ గాచికొనియుంటిని. ఇప్పు డిదిగో నాబాణవేగముచే నీవుహతుఁడవై నీచే నిదివఱకు హతులయిన వీరులతోడంగూడ యమునిపురికిం బోఁగలవు. రామా! ఇందులకు పెక్కుమాటలాడి ప్రయోజనమేమి? నేనుజెప్పునది వినుము. యుద్ధరంగమునందు సమస్తలోకములవారును, నిన్నును నన్నును జూతురుగాక. రామా! మహాయుద్ధముసేయుటకై దివ్యాస్త్రములచేతఁగాని, గదచేతఁగాని, బాహువులచేతంగాని, మఱియితరాయుధముచేతఁగాని, నీకు దేనియం దభ్యాసమున్నదో దానిచేతనే యుద్ధముగావింపుము’ అనెను. దశరథకుమారుఁడగు రాముఁడు మకరాక్షుఁడు చెప్పినదివిని యట్లు పయిపయి నూరక ప్రేలుచున్నవానిని జూచి బిట్టుగాఁ బెడనవ్వునవ్వుచు ‘ఓరీరాక్షసా! నీకుఁ జేయనలవికాని పెక్కుమాటలు వ్యర్థముగా నేల ప్రేలెదవు? యుద్ధమునందుఁ బోరాడియే

కాని వట్టిమాటలబలిమిచే జయింప నలవిగాదు. నాయొక్కనిచే దండకారణ్యమున పదునాలుగువేల రాక్షసులును, నీతండ్రియు త్రిశిరుడును దూషణుడును నిహతులయిరి.పాపాత్మా! వాడిముక్కులును గోళ్లునుం గలగ్రద్దలును,నక్కలును,గాకులును, నిపుడిడుగో నీమాంసము తనివిదీఱం దినంగలవు' అనెను. రాముం డిట్లు చెప్పంగా, ఖరకుమారుండగు మకరాక్షుండు కుపితుండై యుద్ధరంగంబున నారామునిపై బాణసమూహములను బ్రయోగించెను. రాముండు బంగారుపింజలు గలయాబాణములను తనబాణవర్షముచేం జెక్కుతునియలుగా ఖండించుటయు,నవి దునిసి వేలకొలందిని నేలంబడినవి. అప్పుడు ఖరపుత్త్రుండగు మకరాక్షుండును, దశరథపుత్త్రుండగు రాముండును, తేజమున నొండొరులందాంకి, యట్లు బెట్టిదముగా యుద్ధముగావించిరి.అప్పుడు యుద్ధరంగమున, వింటినుండి యల్లెత్రాడును నత్తెమును నొరయుటవలన బిట్టుగాం బుట్టిన పెనుచప్పుడు ఆకాశమున మేఘము లుఱిమినట్లు వినంబడినది. దేవతలును దానవులును గంధర్వులును గిన్నరులును మహోరగులును నందఱును నయ్యాశ్చర్యమును జూడంగోరి యాకాశమునం జేరిరి. వారొండొరుల యవయవములను బాణములచేం గ్రుచ్చుట యప్పటప్పటికి నినుమడిగా మిక్కిలియుం బెరుంగుచుండెను. వారు యుద్ధాగ్రంబున ఒకరుచేసినదానికి బదులుమఱొకరు చేయుచును బోరాడిరి మకరాక్షుండు,రాముండు యుద్ధమునం బ్రయోగించిన బాణములను ఖండించివైచెను. రాముండు నారాక్షసుండు వైచినబాణములను పెక్కువిధముల బాణములచేం ద్రుంచివైచెను. దిక్కులను విదిక్కులను నన్నిటను బాణసమూహముల వ్యాప్తములయ్యెను భూమియంతయు నలుగడల బాణములంగప్పంబడుటచే నెంతమాత్రము గానరాకుండెను. అంత మహాబాహుండగు రాముండు క్రుద్ధుండై మకరాక్షునివింటిని ఖండించి మరల నెనిమిదిబాణముల వానిసారథిని వధించెను. రాముండు బాణములచే రథమును భగ్నముచేసి గుఱ్ఱములను గూల్చెను. అంత మకరాక్షుండు విరథుండై నేలకుఱికి నిలిచెను అట్లారాక్షసుండు నేలపయి నిలుచుండి, సమస్తభూతభయంకరమై ప్రళయకాలాగ్నివలె జ్వలించుచున్న శూలమును కేలంగొనెను. ఆమకరాక్షుండు క్రోధమున, నామహాయుద్ధమునందు, జ్వలించుచున్న యమ్మహాశూలమును గిరగిరం ద్రిప్పి రామునిపై వైచెను. ఖరపుత్త్రుండగు మకరాక్షునిచేతినుండి విడివడి మండుచువచ్చుచున్న యమ్మహాశూలమును, రాముం డాకాశముననే మూండుబాణములం ద్రుంచెను. మంచిబంగారముచే రంగారుచున్న యాశూలము రామబాణముచేం గొట్టువడి పెక్కుతునియలుగా భిన్నమై పెద్దయుల్కవలె మండుచుం జెదరి నేలంబడెను. ఎట్టికార్యము నేని రాముండు చుల్కంజేయువాండు గాన యట్లాశూలమును హతముసేయుటంజూచి యాకాశముననున్న భూతములు 'బాగుబాగు' అని ప్రశంసించినవి.మకరాక్షుండు ఆశూలముగూడ హతమగుటంజూచి ముష్టినెత్తి రామునితో నిలునిలుమని పలికెను. వాండట్లు పిడికిలి నలవరించుకొని వయికివచ్చుటంజూచి, రఘునందనుండగు రాముండు పెలుచనవ్వి, యంత వింట నాగ్నే

యాస్త్రమును సంధించి ప్రయోగించెను. అప్పుడు యుద్ధమున రాముఁ డయ్యాగ్నేయాస్త్రమును వేయఁగా నారాక్షసునిగుండె నుచ్చికొనిపోవుటచే వాఁడు నేలంబడి మృతినొందెను. * అప్పుడు మకరాక్షుండు కూలుటంజూచి, రాక్షసులెల్ల రామబాణములం బీడితులై లంకాపురికే పరుగులువాఱిరి. అంత దేవతలు దశరథరాజకుమారుఁడగు రాముని బాణవేగమున హతుఁడై వజ్రహతమై తూలినపర్వతమువలె నేలంగూలి యున్నఖరకుమారుని మకరాక్షునింజూచి మిక్కిలియు సంతుష్టినొందినవారయిరి. ఇది డెబ్బదితొమ్మిదవ సర్గము.



ఇంద్రజిత్తు మరల నాభిచారికహోమముచేసి యుద్ధమున రామాదుల నొప్పించుట; లక్ష్మణుఁ డింద్రజితునిదుండగము సైఁపక సర్వరాక్షస వధార్థము బ్రహ్మాస్త్రమును బ్రయోగింప ననుజ్ఞ వేఁడఁగా రాముఁడు వారించి యింద్రజిత్తును వధించునుపాయమే చింతించుట.

యుద్ధములఁ గెలుపుగొనుచుండు రావణుఁడు, మకరాక్షుఁడు హతుఁడగుట నువిని, మిక్కిలియుఁ గోపావిష్టుఁడై పండ్లు పెటపెటం గొఱికెను. రావణుం డట్లు కుపితుఁడై యప్పటికిఁ జేయఁదగినది యేమి యని యాలోచించి యంతమఱింతక్రుద్ధుఁడై తనకొడుకు నింద్రజిత్తును యుద్ధమునకుఁ బోవ నాజ్ఞాపించువాఁడై 'వీరా! మహావీర్యులయిన యన్నదమ్ములను రామలక్ష్మణులను, వధింపుము. నీవు మాయచే నదృశ్యుండవై పోరినను లేక దృశ్యుఁడవై పోరినను, అన్నివిధములను బలాధికుఁడవు. నీవు ఏకార్యముననునెదురులేని యింద్రునంతటివానిని యుద్ధమున జయించినవాఁడవు. ఇఁక మనుష్యమాత్రులయిన రామలక్ష్మణులను యుద్ధమునఁజూచియుఁ జంపకుందువా? చూచినమాత్రనే చంపఁ జాలుదువు' అనెను రాక్షసేశ్వరుఁడగు రావణుఁ డట్లు చెప్పఁగా, ఇంద్రజిత్తు తండ్రియాజ్ఞఁ గయికొని, యజ్ఞములు సేయు ప్రదేశమునకుం బోయి, యచ్చట, నగ్నిహోత్రమును యథావిధిగా వేల్చెను. ఆయింద్రజిత్తు, అచ్చట నగ్నిహోత్రమును వేల్వంబోవఁగా, నచ్చటికి రాక్షసస్త్రీలు, వేళతప్పిపోకుండుటకై వేగిరపడి ఋత్విజులు ధరించుటకై యెఱ్ఱనిశిరోవస్త్రములను దీసికొనివచ్చిరి. ఆహోమమున తోమరములును జెల్లుపత్రములును పరిస్తరణములుగాను తాండ్రపుల్లలు సమిధలుగాను ఋత్విజుల యుష్ణీషవస్త్రములు నెఱ్ఱనివిగాను స్రువము ఇనుపదిగాను నుండెను. ఆయింద్రజిత్తు, శరపత్రముల చేతను తోమరముల చేతను నగ్నిహోత్రము నాలుగుప్రక్కలను బరిస్తరణముగావించి హోమముకొఱకు, నుపయోగింపనున్న నల్లని మేఁకకుత్తుకను ఛేదించెను.

* రెండుపుస్తకములలో నిప్పటను [illegible] శ్లోకములతో [illegible] సమాప్త మగుచున్న దని తెలియుచున్నది.

అంత నొక్కసారి రగుల్కొనఁగానే, అయ్యగ్నిహోత్రము ఆఱిపోక, పొగలేక, పెద్దజ్వాలలతో వెలింగెను. ఇట్లు విజయసూచకములయిన యాచిహ్నములతో నదియొప్పెను. అగ్నిహోత్రము కరఁగినబంగారమువలె వెలుంగుచుఁ బ్రదక్షిణముగాఁ దిరిగి జ్వాలలతో నొప్పుచుండెను. అందు అగ్ని, పురుషరూపముతో పొడవుగా లేచి తానే యాహవిస్సును గ్రహించెను. ఇట్లితఁడు అగ్నిహోత్రమును వేల్చి, దేవదానవరాక్షసులకుఁ దర్పణముగావించి, ఆహోమమువలన నంతర్ధానశక్తి నొందియున్న యుత్తమరథము నారోహించెను. ఆమేటిరథము, నాలుగుగుఱ్ఱములు పూన్పఁబడి, తీక్ష్ణములయిన బాణములచే నిండి, యెక్కుపెట్టఁబడి యున్న పెనువింటితోఁగూడి, యొంతయుఁ బ్రకాశించెను. ఆరథము బంగారపురేకులచేఁ గప్పఁగలిగి మృగరూపములుగాను చంద్రాకారములుగాను నర్ధచంద్రాకారములుగాను రచితములయిన చిత్రములచే నలంకృతమై తానెంతయుఁ గాంతిచే ధగధగ మెఱయుచుండెను. ఇంద్రజిత్తుధ్వజము, మంచిబంగారముతోఁ జేయఁబడిన యొకమహావలయముతోఁగూడి, వైడూర్యములచే నలంకృతమై జ్వలించుచున్న యగ్నివలెఁ బ్రకాశించెను. మిక్కిలియు బలవంతుఁడగు నాయింద్రజితుఁడు సూర్యునివలె మెఱయుచు నంతర్ధానశక్తియుక్తమై యున్నయామేటిరథముచేతను బ్రహ్మాస్త్రముచేతను రక్షితుఁడై యెట్టివారికి నెదిరింప నలవిగానివాఁడయ్యెను. యుద్ధములందు గెలుపునే కోరువాఁడైన యాయింద్రజిత్తు, నిరృతిదేవతాకములయిన మంత్రములచేత నగ్నియందు హోమము చేసి, యంతర్ధానశక్తిం బొంది లంకను వెలువడి 'వనమునందుఁ గల్లమునివేషము వేసికొనివచ్చిన యారామలక్ష్మణులను,ఇదిగో యుద్ధమున వధించి యుద్ధమున జయము నార్జించి నాతండ్రి రావణున కొసంగెదను. ఇప్పుడు నాతండ్రికి పరమప్రీతికలుగుటకై రాముని లక్ష్మణునినిజంపి భూమియందొక్కవానరుఁడును లేకుండునట్లు గావించెదను' అనిచెప్పి యంత నంతర్ధానము నొందెను. అంత యుద్ధమునందుఁ దీక్ష్ణుఁడయిన యింద్రజితుఁడు రావణునాజ్ఞనొంది క్రుద్ధుఁడై తీక్ష్ణములగు బాణములతోను ధనుస్సుతోను రణరంగమునకు వేగవచ్చెను. మహావీర్యులై, బలునిక్కుగల మూఁపులును దలయును జూడ మూఁడుతలలుగల సర్పములవలెఁ జూపట్టుచు, వానరసేనామధ్యంబుననుండి బాణజాలములను బ్రయోగించుచున్న వీరులను రామలక్ష్మణులను నింద్రజిత్తు చూచినవాఁడయ్యెను. అట్లుచూచి వీరే యారామలక్ష్మణులని తలఁచి విల్లుమోపెట్టి వర్షాకాలమున మేఘుఁడు వర్షముగురియునట్లు బాణధారల జడివలె నెడతెగక నిగిడించెను. అతఁడు రథసహితముగా నాకాశమార్గమునొంది కన్నుల కదృశ్యుండై రామలక్ష్మణులను వాఁడిబాణముల నొప్పించెను. ఆయింద్రజిత్తుఁ డురవడిగాఁ బఱపుచున్న బాణములచేఁ గప్పఁబడి,యారామలక్ష్మణులును వింటి బాణమును సంధించి తమ దివ్యాస్త్రవిద్యను జూపిరి. మహాబలవంతులగు రామలక్ష్మణులు బాణసమూహములచే నాకాశమును గప్పినను, సూర్యసమానములగు నాదివ్యాస్త్రములుగాని

బాణములుగాని యాయింద్రజిత్తునకుఁ దగులనే లేదు. శ్రీమంతుఁ డాయింద్రజితుఁడు ఆకాశమును ఆచ్ఛాదించుటకై పొగచేతం గలుగునట్టిచీఁకటిని గావించి పూర్వమే మంచుచేతం గలిగినజీఁకట్లావరించియున్న దిక్కులనెల్ల గుర్తింప నలవిగానట్లు మఱుఁగుపఱిచినవాఁడయ్యె. ఆయింద్రజిత్తు, అట్లెదురులేక సంచరించు నపుడు, నతఁడు బాణము వేయుఁగాఁ గలుగుజ్యాతలములధ్వనిగాని,రథనేమిధ్వనిగాని,యశ్వఖురధ్వనిగాని, యెంతమాత్రమును వినఁబడదయ్యె. అతనిరూపమును నెంతమాత్రము గానరాదయ్యె. మహాబాహుండగు నాయింద్రజిత్తు, దట్టముగా మహామేఘములు క్రమ్మినప్పటి చీఁకటివలె కటికినల్లనిచీఁకటియందు గొప్పజలవర్షము గురియునట్లు, అద్భుతముగా నచ్చపుటినుపబాణములను గురిసెను. ఆయింద్రజిత్తు మిక్కిలియు వరబలము పెంపున మించి యుద్ధమునం గ్రుద్ధుఁడై రామునిసర్వావయవములను సూర్యసమానములగు బాణములచే నొప్పించెను. పురుషసింహులగు రామలక్ష్మణులు, వర్షధారలచేతఁ బర్వతములుంబోలె నారాచధారలచేఁ గొట్టువడుచును జలింపక బంగారుపింజలు గలవాఁడిబాణములను బ్రయోగించిరి. కంకపక్షి ఱెక్కలు గట్టఁబడియున్న యాబాణములు, ఆకాశమున పక్షులవలె నతివేగంబున నింద్రజిత్తుందాఁకి యతనిమర్మముల భేదించి నెత్తుటం దడిసి నేలంబడెనవి.అట్లు పురుషోత్తములగు రామలక్ష్మణులు, బాణసమూహముచే నతిమాత్రము పీడితులగుచు నాయింద్రజిత్తు వైచుచున్న బాణములను బెక్కుబాణములచే ఖండించివైచిరి. ఆరామలక్ష్మణులు ఇంద్రజిత్తు కనఁబడకున్నందున నతఁ డేవైపుననుండి తమపయి వాఁడిబాణములు వైచుచున్నాఁడో యాదిక్కున నుత్తమములయిన యస్త్రములం బరఁగించిరి. ఇంద్రజిత్తు కడుంజుల్కఁగా బాణములేయు నతిరథుఁడుగాన మాయంజేసి యొక్కచో నిలువక, రథముతోఁగూడ నన్నిదిక్కులం దిరుగుచు, నెదిరిబాణములకుఁ జిక్కక, రామలక్ష్మణులను వాఁడిబాణములచే మిక్కిలియు నొప్పించెను. వీరులగు రామలక్ష్మణులు అట్లింద్రజిత్తు,చక్కఁగా నిర్మితములై బంగారుపుంఖములుగల బాణముల తమమేనెల్ల బిట్టుగ్రుచ్చఁగా, దేహమంతయు నెత్తుటఁ దొప్పదోఁగి, చక్కఁగా పూచినమోదుగుచెట్లవలె నుండిరి.ఆకాశమున మేఘములు గ్రమ్మినపుడు సూర్యునిగత్యాదు లెవ్వరికిని దెలియరానట్లు, ఆయింద్రజిత్తు పోకడగాని రూపముగాని ధనుర్బాణములుగాని, యితరమేదగాని, యెంతమాత్ర మెవ్వరికిని దెలియరావయ్యె. అప్పు డాయింద్రజిత్తు బాణములు బిట్టుగాడఁగా వానరులు గొట్టువడి ప్రాణములెడలి యాయుద్ధభూమిని, వందలకొలఁదిని బడిరి. అప్పుడు లక్ష్మణుఁడుమాత్రము మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై యన్ననుఁ జూచి, 'నేనిప్పుడు బ్రహ్మాస్త్రమును బ్రయోగించి సమస్తరాక్షసులను సంహరించెదన్నన్ను' అనెను. అంతరాముఁడు శుభలక్షణుండగు లక్ష్మణుంజూచి 'ఒక్కనినిమిత్తమై నీవు భూమియందలి రాక్షసులనెల్ల వధింపఁగోరుట యెంతమాత్రమును యుక్తముగాదు. యుద్ధముసేయక యూరకున్నవానిఁగాని, యుద్ధభయమున దాఁగియున్నవా

నింగాని, భయమునఁ జేతులు మోడ్చుకొనియున్నవానింగాని, శరణుఁజొచ్చినవా
నింగాని, పలాయితుఁడగువానింగాని, యేమఱియున్నవానినిగాని, నీ వెంతమాత్ర
మును వధింపఁదగదు. లక్ష్మణా ! మహాబలుఁడవు. ఈయింద్రజిత్తునే వధించుటకు
పలయుప్రయత్నము గావింతము. క్రూరసర్పములంబోని మహావేగము లగుదివ్యా
స్త్రములను బ్రయోగింతము. మాయలు నెఱపుచు, రథంబుతోఁగూడ నంతర్హితుఁడై
యున్నయీనీచు నింద్రజిత్తును వానరు లెట్లయినఁ గనిపెట్టి బలమునఁ బట్టి వధింపఁ
గలరు. ఈయింద్రజిత్తు భూవివరమును జొచ్చినను, స్వర్గమునకుఁ బోయినను, పాతా
ళమును బ్రవేశించినను, ఆకాశమున కెగసినను, ఇట్లె లోకములం జొచ్చి మఱుఁగు
పడియున్నను, నాదివ్యాస్త్రములచే దగ్ధుఁడై ప్రాణములువీడి తప్పక నేలంగూలును'
అనెను. మహానుభావుఁడును మహాబుద్ధిమంతుఁడు నగునారఘువీరుఁడు రాముఁ డిట్లు
చెప్పి, భయంకరుండును క్రూరకర్ముఁడు నగునాయింద్రజిత్తును శీఘ్రమున వధించుట
కై యుపాయముఁ జూచుచుండెను. ఇది యెనుబదియవసర్గము.



## ఇంద్రజిత్తు హనుమంతుఁడు చూచుచుండఁగా మాయా సీతను ఛేదించుట.

* మహాత్ముఁడైన యారాముని సంకల్పమును దెలిసికొని యింద్రజిత్తు, ఆ యుద్ధమునుమాని యచటనుండి మరలి లంకను బ్రవేశించెను. మిక్కిలియు గాంతిఁ దక్కొత్తునాశూరుఁ డట్లుపోవుచు తనలో బలవంతు లగుకుంభకర్ణాది రాక్షసు లనేకులు హతులగుటను దలంచుకొని కోపంబున కన్నెఱ్ఱఁజేయ, మరల పురము వెలువడి యుద్ధభూమికి వచ్చెను. మహావీర్యశాలియు దేవతాకంటకుఁడును పులస్త్యవంశ్యుఁడు నగు నాయింద్రజిత్తు, రాక్షససేనాపరివృతుఁడై లంకపడమటిద్వారముననుండి వెలువడి వచ్చెను. అంత నింద్రజిత్తు, వీరులగు నన్నదమ్ములు రామలక్ష్మణులు యుద్ధమున కుద్యుక్తులై యుండుట నాలోచించి యపుడు వారలు దుఃఖపరవశులై యుద్ధప్రయత్నము † మానియుండుటకై యితరులవ్యామోహపెట్టు శక్తిని మాయను

* ఇందులకు 'విజ్ఞాయతు మనస్తస్య రాఘవస్య మహాత్మనః । సన్నివృత్త్యాహవాత్తస్మాత్సంప్రవివేశపురంతతః' అని మూలము. ఇచట 'విజ్ఞాయతు' అను దాని మూఁడవ యక్షరమగు 'య' కారముచే గాయత్రి పంచసప్తతితమ యక్షరమగు 'య' కారము గ్రహింపఁబడినది. గాన పంచసప్తతితమసహస్ర మారంభించెనని తెలియునది.

† ఇంద్రజిత్తు [illegible] యుద్ధము [illegible] ట్లుసేయ [illegible] పఁ బోఁడంగినవాఁడై మాయాసీతను గావించి, రామలక్ష్మణులు దుఃఖితులై యున్నవారుగాన వారిని దార [illegible] కష్టమగుటచే [illegible] వానరులు సీతను జూచియెఱుఁగరుగాన వారలకు సీతనుజూపినను సీతయని తెలిసికొనఁజాలరుకాన పడమటిద్వా

బరఁగించినవాఁ డయ్యెను. అంత నింద్రజిత్తు మాయచేత సీతను జేసి గొప్ప సైన్యము చుట్టు నావరించియుండ రథమునందుంచి యామెను వధింపఁగోరెను. మిక్కిలియు దుర్బుద్ధియగు నాయింద్రజిత్తు, రామాదుల నెల్లవారిని మోసపుచ్చఁ దలంపుగొని, యాసీతను వానరులు చూచుచుండఁ జంపఁబూని వానరాభిముఖుఁడై పోయెను. అట్లాయింద్రజిత్తు లంకనుండి వెడలివచ్చుచుండుటనుజూచి, వానరులు, మిక్కిలియుఁ గ్రుద్ధులై యుద్ధంబుసేయఁగోరి శిలలు కేలంబూని యెదుర్కొనిరి. కపికుంజరుఁడగు హనుమంతుఁడు మిక్కిలియు గొప్పదై చెనకరానన్న యొకపర్వతశిఖరమును జేకొని యావానరుల యగ్రభాగమున నడిచెను. హనుమంతుఁ డింద్రజితునిరథమునందు, సీతంగాంచెను. రాఘవునకుఁ బ్రియురాలగు నాయుత్తమకాంత ఆసీత యానందము దూలి, ఒక్కటే జడఁగాఁ బెనఁచుకొన్నకురులతో, దీనయై యుపవాసముల మొగము కృశించి, ఎప్పుడును ధరించి యున్నయొక్కటెవస్త్రము మలినమైయొప్ప, దేహసంస్కార మెంతమాత్రమును లేకుండుటవలన దుమ్మును ముఱికియును నవయవములందెల్ల గ్రమ్మియుండఁ గానంబడెను. అతం డాబిడ నట్లు గొంతసేపుచూచి సీతయనియె నిశ్చయించినవాఁడై విషాదమునొందెను. అతఁ డాజనకతనయ సీతనుజూచి స్వల్పకాలమే యైనదగనుక, నామెసీతయని నిశ్చయింపఁజాలినవాఁడయ్యెను. అట్లు దీనురాలై మఱికిబ్రుంగియున్న యంగములతో సీత వానిరథంబుననుండుటనుజూచి హనుమంతుఁడు మొగంబుకన్నీళ్లందొరఁగి కలఁగఁబాఱ మిక్కిలిదుఃఖితుఁడయ్యెను. హనుమంతుఁడట్లు దుఃఖార్తుఁడై, యానందముచెడి జాలింగొలుపుచు, సీత యింద్రజిత్తునివశమునఁ జిక్కి వానిరథమున నుండఁగాఁ జూచి, ‘ఇట్లు వీఁడు సీతను రథముననుంచి తెచ్చుట కేమియభిప్రాయముండు’ నని యాలోచించుచు నచటివారల నడిగెను. అంత నతఁడు అవ్వానరశ్రేష్ఠులంగూడి యింద్రజితునిమీఁదికిం బోయెను. అట్లు వానరసైన్యము తనమీఁదికివచ్చుటను జూచి యింద్రజిత్తుకోపావేశము నొందియొరనుండి ఖడ్గము వెఱికి,సీతను శిరమునఁబట్టుకొనెను. ఇంద్రజిత్తు, మాయచే రథమునందు రచితయై రామారామా యనియాక్రోశించుచున్న యాకాంతను సీతను, అవ్వానరులందఱును జూచుచుండఁగానే, దెబ్బలుగొట్టెను వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు,సీతతలవెండ్రుకల నింద్రజిత్తు పట్టుకొనుటను జూచి,దీనత్వమునొంది,కన్నులనుండి యశ్రుజలములం గార్చెను. అట్లు సర్వాంగసుందరియు, రామునిగారాబుమహిషియునగు సీత యట్లు యవస్థపడుటను జూచి హనుమంతుఁడు క్రుద్ధుఁడై, రాక్షసేంద్రుని రావణునిపుత్త్రుఁడగు నింద్రజిత్తుంజూచి పరుషవాక్యములతో “దురాత్మా! నీవు బ్రహ్మర్షికులమునం బుట్టినవాఁడవయ్యును రాక్షసయోనిని జేరినవాఁడవుగావున

రమున హనుమంతుని కానీతనుజూపి ఛేదించినవాఁడయ్యెను. ఇట్లుమాయాసీతను ఛేదించుటచే హనుమంతుఁడుపోయి యీసంగతి రామాదులకుఁ దెలుపుఁడనియు వారలు దుఃఖపరవశులై యుద్ధప్రయత్నము మంటగిలియుందురనియు దానివలన తనహోమము నిర్విఘ్నముగా నెఱవేఱుననియు భావము.

మహాపతివ్రతయగు సీతతలవెండ్రుకలఁ దాఁకితివిగదరా ! దీనివలన నీవు దప్పక నశిం పఁగలవు. ఇట్టి యేవపుబుద్ధిపుట్టినదిగా! ఇసీ ! ఇట్టిపాపాచారముగలనీవు పాడయిపోదు వుగాక ! దయమాలినవాఁడా ! దుర్జనుఁడా ! దురాచారా ! నీచుఁడా ! అధర్మవిషయ మున పరాక్రమము నెఱపుదువా? ఓరీ! ఇట్టిహీనంపుపని యపూజ్యుఁడే చేయునదిగాని వేఱొకఁడు చేయఁడే. నిర్దయుఁడా ! నీకు రోఁతగూడలేదురా ! 'అపరాధులయెడ దయ గూడ' దనెదవా? ఈబిడ గృహమును పరిచారకులను వీఁడినది; కాన బంధువులమూల మున నీకపరాధమేమియుఁ జేయలేదయ్యె. రాజ్యమునుండియు రాజ్యపరికరములు నుండియు వీడినది; కాన సేనలమూలమునను నీకేమియు నేరముసేయదయ్యె. రక్ష కుఁడగు రాముని ప్రాపునుండియు వీడినది; కాన యతనిమూలమునను తప్పుసేయ నేరదు. మఱి యాచారప్రధానమగు మిథిలరాజవంశమునఁ బుట్టినది; కాన యపరా ధము రూపెట్టిదో యెఱుఁగదు. ఈపడఁతిని చంపఁ దివురుచున్నావే. ఇందుల కీయమ నీకేమియపరాధము చేసినదిరా ! సీతను జంపి, నీ వెంతటివాఁడవయినను నెట్లుగాని యిఁక చాలఁగాలము జీవింపఁజాలవు. నీ విట్టిమహాపాపకర్మము చేయుటంబట్టివధార్హుఁ డవై నాచేతఁ జిక్కితివేచుమీ ! ఇఁక నునుఱులోఁ దప్పించుకొనుటెక్కడిది? ఓరీ నీవు నీశత్రువునకేకాదు, లోకులకెల్లను కంటకుఁడవుగావున లోకంబునకంతయు వధ్యుఁడవు. నీవిపు డీలోకమున జీవితమువదలి ప్రేతమవై యాపదునాలుగులోక ములందును స్త్రీహత్యచేసినవార లేకుత్సితలోకములం జెందుదురో యాలోకముల ను బొందఁగలవు" అనెను. హనుమంతుఁ డిట్లు బరుసులుపలుకుచు,శిలాదియుద్ధసాధన ములుధరించి సన్నద్ధులయిన వానరులతోఁడఁగూడి మిక్కిలియు క్రోధమువిూఱ నిం ద్రజితునిపయి నడరెను. భయంకరముగా నురవడించుచున్న రాక్షససైన్యము అట్లు పైనెత్తివచ్చుచున్న మహావీర్యుఁడగు హనుమంతుని యతనివానరసేనను వారించిన దయ్యె. ఆ యింద్రజిత్తు వేయిబాణములువైచి యవ్వానరసేననంతయుఁ జీకాకు నొందించి, వానరశ్రేష్ఠుండగు హనుమంతుఁ జూచి 'ఎవ్వతికొఱకై, సుగ్రీవుండును, నీవును,రాముఁడును నీలంకకువచ్చిరో,యాసీత నిపుడు నీవు కన్నారఁజూచుచుండఁగానే చంపివైచెదను. వానరా! ఈసీతను మొదటఁజంపి పిదప రామునిని లక్ష్మణునిని నిన్ను ను, సుగ్రీవునిని, దుర్మార్గుఁడయిన యావిభీషణుని వధించిపుచ్చెదను. కోఁతీ ! మఱి యు నీవు స్త్రీలను జాపరాదనిచెప్పితివే. అందులకు బదులుచెప్పెద వినుము. పగవా రి కేది పీకకలిగించునో యది యెట్టిదయినను నవశ్యముచేయఁదగినదే. కాన సీతను వధించుటయు విూకుఁ బీడాకరముగాన కర్తవ్యమే' యనెను. ఇంద్రజిత్తు, హనుమం తున కివ్విధమునఁజెప్పి, యవు డేడ్చుచున్న మాయాసీతను వాఁడివాఁదఱగల ఖడ్గముగొని తనచేతులార నఱకెను. బలితంపుపిఱుందులుగలదై, కనులపండు వుగాఁ బొడకట్టుచు నప్పటిదుర్దశకు జాలిగొలుపుచున్న యాసీతను నింద్రజిత్తు తలవెండ్రుకలు పట్టుకొని కత్తిఁగొని యజ్ఞోపవీతము వేసికొనునట్టి వాటముగా



1608. ఇంద్రజిత్తు మాయాసీతను వధించుట ; హనుమంతుఁ డది చూచి దుఃఖితుఁ డగుట

వ్రేటువేయఁగా, తుండెములై నేలంబడినది. అట్లుతఁ డమ్మాయాసీతను తనచేతులారఁ జంపి, హనుమంతుంజూచి 'నేను కోపమున రామునియిల్లాలిని ఈసీతను రూపుమాపితిని జూడు. ఈసీత యేమో నఱకంబడినది. ఇఁక మీప్రయాసమంతయు విఫలము' అనెను. అట్లాయింద్రజిత్తు తానే పెనుఖడ్గమున నాసీతను దెగనఱకి, యుబ్బునొంది, రథమునుండియే మహాధ్వనిగలుగునట్లుగా, సింహనాదముగావించెను. అప్పుడు దాపున యుద్ధమునకై నిలిచియున్నవానరులందఱు, ఇంద్రజిత్తు తనచుట్టును దుర్గమువలెఁ బన్నియున్న రాక్షసులనడుమనుండి, పెద్దదిగా నోరుదెఱచి యార్వఁగా నాధ్వనిని వినిరి. దుర్మతియగు నాయింద్రజిత్తు, అట్లుసీతనువధించి మనంబున మిక్కిలియు నుప్పొంగినవాఁ డయ్యెను. అట్లుమిక్కిలియు సంతోషమునఁ జెలరేఁగుచున్న యతనింజూచి వానరు లెంతయును విషణ్ణులై ముందువెనుకఁ జూడక పాఱిపోవఁదొడంగినవారయిరి.

ఇది యెనుబదియొకండవసర్గము.

హనుమంతుఁడు పాఱిపోవుచున్న వానరుల నిలువరించి రాక్షససేనల నుఱుమాడి సీతావధమును రామునకుఁ దెలుపుటకై సేనతో నతనిసన్నిధికిఁ బోవుట; ఇంద్రజిత్తు నికుంభిలయందు హోమ మారంభించుట.

వానరశ్రేష్ఠులు, వజ్రాయుధధ్వనివలె మిక్కిలి భయంకరముగాఁ జెలంగుచున్న యింద్రజిత్తుని సింహనాదమునువిని, భయంబున దిక్కుల నన్నిటిఁజూచుచుఁ బాఱిపోయిరి. అంత వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు, అట్లు దిగులుగొని మొగంబులు వెలువెలఁబోవ, దీనులై యొకరితోనొకరు సంబంధింపక పాఱిపోవుచున్న యావానరులనందఱను జూచి 'వానరులారా! ఇట్లు మొగంబులు దుఃఖంబునఁ గుందుచు యుద్ధమందలి యుత్సాహమువదలి, పాఱిపోయెద రేల? మీ శూరత్వమంతయు నిపుడెచటికిఁ బోయినది? నేను యుద్ధమున ముందునడచెదను. నా వెంటనంటిరండు. ఇదివఱకు పెక్కుయుద్ధంబులందుఁ బొగడ్తగొన్నశూరులు యుద్ధమునుండి వెనుదీయుట యెంతమాత్రము యుక్తముగాదు' అనెను. వాయుకుమారుఁడు హనుమంతుఁడిట్లు చెప్పఁగా, నవ్వానరులు, మనంబుల సంతోషమొప్ప, మేనం బులకలు మిక్కిలియుఁ బొడమఁ బర్వతశిఖరములను వృక్షములనుఁ జేకొని యుద్ధసన్నద్ధులయిరి. అంత నవ్వానరసింహులు గర్జించుచు రాక్షసులమీఁదికింబోయిరి. అమ్మహాయుద్ధమునందు వారందఱును హనుమంతుం బరివేష్టించి వెంబడి నడచిరి. ఆహనుమంతుఁడు నలుప్రక్కలను నగ్గివలె వెలుంగుమేటివానరులచేఁ బరివృతుఁడై జ్వాలలతోఁగూడిన యగ్నిహోత్రునివలె శత్రుసైన్యములను దహించెను. ప్రలయకాలమునఁ బ్రజల నాశముసేయునట్టి యమునింబోలిన యమ్మహాకపి హనుమంతుఁడు వానరసైన్యపరివృ

తుఁడై రాక్షసులతో యుద్ధముగావించెను. మహాకపి యగునాహనుమంతుఁడు ఒకప్రక్క కోపమును నొకప్రక్క శోకమును మల్లడిగొనఁగా నింద్రజిత్తురథము మీఁద పెద్దశిలనొక్కటిని బడవైచెను. అప్పుడు సారథి యట్లు పైకివచ్చుచున్న యా మహాశిలను జూడఁగానే గుఱ్ఱములు తాను మెలపునట్లు మిక్కిలి లోఁకువై మెలఁగునవిగావున, అవిపూన్చియున్న రథమును తోడనే బహుదూరము గుఱితప్పఁ దోలఁగించెను. ఆమహాశిల, రథమునందలి యింద్రజిత్తుపైఁగాని యతనిసారథిపైఁగాని పడకపోవుటవలన వ్యర్థముగాఁ బ్రయుక్తమై భూమినిభేదించి పాతాళమును జొచ్చెను. ఆశిలను హనుమంతుఁడు వేయఁగానే రాక్షససేనయంతయు వ్యథనొందెను. అంత నాశిల క్రిందఁబడఁగా వారు మిక్కిలియు నలఁగి నజ్జయిరి. వానరులు నార్పులు సెలంగ వందల కొలఁదిని నాయింద్రజిత్తుమీఁదికి నడరిరి; మహావీర్యులును భయంకరపరాక్రములునగు నవ్వానరులు,యుద్ధమున నింద్రజితునిపై వృక్షములను పర్వతశిఖరములను బ్రయోగించిరి. అప్పుడు వానరులు, వృక్షములను పర్వతములను బెనువర్షముగా పగవారిపైఁగురియించుచు, నానావిధస్వరములుగా నార్చుచు రాక్షసులతో యుద్ధముఁగావించిరి. మహావీర్యశాలురయిన యావానరులు, తనుసత్తువకొలఁదిని వృక్షములచేఁగొట్టఁగా భయంకరరూపులగు రాక్షసులు యుద్ధభూమింబడి పొరలాడిరి. అంత నింద్రజిత్తు తనసేనయంతయు వానరులచేఁ బీడితమైయుండుటం జూచి క్రుద్ధుఁడై విలుగొని వానరుల కెదురునడచెను. ఇంతవఱకు తనపరాక్రమమును మిక్కిలియుం బెక్కుమార్లు నెఱపియున్న యాయింద్రజిత్తు, తనసైన్యములు చుట్టిరా, బాణసమూహములు పరఁగించి వానరసింహులను మిక్కిలియుం బెక్కండ్రను వధించెను. ఆయింద్రజిత్తు వెంటనున్న రాక్షసులును, శూలములచేతను, పిడుగులచేతను, ఖడ్గములచేతను, పట్టిసములచేతను, కూటముద్గరములచేతను, తమబలముకొలఁదిని వానరులం బ్రహరించిరి. మహాబలుఁడగు హనుమంతుఁడు, బోదెలతోను శాఖలతోనుంగూడిన వృక్షములను శిలలనుంగొని, భయంకరపరాక్రములగు రాక్షసులతోడ యుద్ధముగావించెను. ఆహనుమంతుఁ డట్లు పరాక్రమమున పరసైన్యమును వారించి యాతఁ డవ్వానరులంజూచి 'మనకు నీసైన్యము సాధింపఁదగినంత పాటిది కాదు. దీనిని సాధించియుఁ బ్రయోజనములేదు. మనమందఱము రామునిప్రియముసేయఁగోరి, ప్రాణములపై నెయ్యములేక నేలంబడి నిలువక పొరలుచునే పలుచేష్టలు గావించుచు నెవ్వతినిమిత్తమై యుద్ధముసేయుచున్నామో యట్టియా జనకరాజసుత సీత వధింపఁబడినది. ఇంద్రజిత్తు సీతనువధించిన యీసంగతిని రామునకును సుగ్రీవునకునుం దెలిపి, వారు దీనికేమిప్రతీకారముచేయ నియమింతురో దానినే మనమును జేయుదము. అదియే యుక్తము' అనెను. అవ్వానరశ్రేష్ఠుఁ డిట్లు జెప్పి వానరులనెల్లయుద్ధమునుండిమాన్పి, పగతురకెంతమాత్రమును భయపడనివాఁడుగాన మెల్లమెల్లగా సేనతోడమరలిపోయెను. అంత దుష్టాత్ముఁ డాయింద్రజిత్తు, హనుమంతుఁడు

రాముఁడున్న యెడకుఁ బోవుచుండుటం జూచి, తాను, హోమము గావింపఁగోరి చైత్యమునందున్న నికుంభిలయను దేవతాలయమునకుం బోయెను. ఇంద్రజిత్తు నికుంభిలను జేరి అగ్నిహోత్రమునందు విధ్యుక్తముగా హోమము గావించెను. అప్పుడు యాగభూమియందు, ఇంద్రజిత్తు అగ్నిహోత్రమునందు విధ్యుక్తముగా మాంసమును నెత్తురును వేల్వఁగా, ఆయగ్ని యాహావిస్సులం గొనుచు నెంతయుఁ బ్రజ్వరిల్లెను. నెత్తురుహోమముచే తర్పితమైన యాయగ్ని లేచి మిక్కిలియు వేండ్రముగా మండుచు జ్వాలలలుముకొన్నదై సంధ్యాకాలమందలి సూర్యునివలెఁ జూపట్టెను. అంత, నింద్రజిత్తు శాస్త్రోక్తవిధులం జక్కఁగాఁ దెలిసినవాఁడుగాన, రాక్షసుల కభ్యుదయము గలుగుటకై విధిచొప్పున నగ్నిహోత్రమున హవిస్సును వేల్చెను. అప్పు డచ్చటఁగల రాక్షసమహాసమూహమునందు శాస్త్రీయములను అశాస్త్రీయములను జక్కఁగ నెఱింగిన రాక్షసులు ఆహో

రెండవసర్గము.

ఇంద్రజిత్తు సీతను వధించినాఁడని హనుమంతుఁడు చెప్పఁగా రాముఁడు దుఃఖించుట; లక్ష్మణుఁడు రాముని నూరార్చుట.

రాముఁడు రాక్షసులును వానరులును గావించుచున్న యుద్ధమునం బుట్టిన మహాధ్వనివిని, యపుడు యాదృచ్ఛికముగా వచ్చిన జాంబవంతునిఁ జూచి 'సౌమ్యా! హనుమంతుఁ డిపుడు దుష్కరమైన మహాయుద్ధము చేయుచున్నట్లున్నది. ఏలనఁగా, ఆ వైపుననుండి బెడిదంబై మిక్కిలియుఁ బెద్దదియగు నాయుధధ్వని చెవులకు వెక్కసముగా వినఁబడుచున్నది. భల్లూకపతీ! కాన నీవు నీసేనం గూడి, యచటికి శీఘ్రముగాఁ బొమ్ము; పోయి యొంటిగా యుద్ధము చేయుచున్న కపిశ్రేష్ఠునకు హనుమంతునకు శీఘ్రముగా సాహాయ్యము చేయుము' అనెను. భల్లూకపతియగు జాంబవంతుఁడు, రాముఁ డట్లు చెప్పఁగా తనసైన్యముతోఁ గూడి. హనుమంతుఁడున్న పశ్చిమద్వారమునకుఁ బోయెను. అంత వానరులు యుద్ధము చేసి యలసి నిట్టూర్పులు పుచ్చుచుఁ దన్నుఁ బరివేష్టించియుండఁగా, వచ్చుచున్న హనుమంతుని, జాంబవంతుఁడు మార్గమందే చూచెను. హనుమంతుఁడును, నీలమేఘముం బోలెఁ గారుకొనుచు భయంకరాకారముగానున్న యాభల్లూకసైన్యము సన్నద్ధమై వచ్చుచుండఁగా మార్గమున నే చూచి, దానిని వెనుకకు మరలవలయునని చెప్పి తాను రామునొద్దకుఁ బోయెను. మహాయశుండగు హనుమంతుఁడు, వానరసైన్యముతోఁ గూడి శీఘ్రమున రామునిసమీపమునకుం బోయి, దుఃఖితుఁడై యాతనితో 'యుద్ధంబున మేము పోరాడుచు, ముందటనుండి చూచుచుండఁగానే, రావణపుత్రుఁ డింద్రజిత్తు, సీతనుబట్టి తెచ్చి, యామె

రోదనము సేయుచుండఁగాఁ జంపెను. అరిందమా! అట్లు సీతవధింపఁబడుటంజూచి, నేను
మనస్సుతత్తఱిల్ల, మిక్కిలియు దుఃఖమునొందితిని; కాన యేమియుఁ దోఁపకున్నది.
ఈసంగతి దేవరకుఁజెప్పుటకై యిచటికి వచ్చితిని' అనెను. హనుమంతుఁ డట్లుచెప్పి
నదివిని, రాముఁడు శోకాతిశయమున మూర్ఛితుఁడై వేరునఱుకఁబడ్డ వృక్షమువలెఁ
గొబ్బున నేలపయిఁబడెను. దేవతాసముఁడగు నారాముఁడు నేలంబడుటనుజూచి వా
నరోత్తములందఱు, అన్నిదిక్కులనుండి యచటికిఁ బరుగెత్తివచ్చిరి. వారు సెగలు
పైకెగయ జ్వలించుచున్న యగ్నిహోత్రమువలె, భూమింబడియున్న వాఁడయ్యెను,
దేజంబున నెవ్వరికిని డాయనలవిగాక యితరుల దహించునట్లున్నయారాముని, మూ
ర్ఛదేఱుటకై, తామరలును గలువలునుంగూడి మంచివాసనలు గుబాళించుచున్న
జలములను వేగచల్లి తడిపిరి. అంత లక్ష్మణుఁ డట్లు మిక్కిలియు దుఃఖితుఁడై, దిటత
ప్పియున్న రాముని బాహువులం గ్రుచ్చి కౌఁగిలించికొని, యుక్తియుక్తమగు మా
టల నతనితో 'ఆర్యా! నీవు పితృవచనపరిపాలనాదిరూపమైన ధర్మమార్గమును దృ
ఢముగా ననుష్ఠించువాఁడవు. చేతికివచ్చినరాజ్యమును బోఁగొట్టినకైకేయీదశర
థులయందును నెంతమాత్రము మనమునఁ గలుషత్వము లేకుండుటవలన జితేంద్రి
యుఁడవు. ఇట్టిధార్మికుని నిన్నును, ధర్మము కుందేటికొమ్మువలె వ్యవహారమునందు
మాత్రముండునదేకాని నిజమునకు లేనట్టిదే కాన, వ్యసనములనుండి రక్షింపఁజా
లకున్నది. అది నిజముగా నుండునదైనంగదా నిన్నురక్షించును. లేనిది తానెట్లురక్షిం
చును. అట్లే అధర్మము సుఖములను బోఁగొట్టవలసినదయ్యెను అదికూడ లేనిదేకా
వున రావణునకు సుఖములను వారింపఁజాలకున్నది. ధర్మమును అధర్మమును లేవ
నుటకు ప్రమాణమేమి? ప్రత్యక్షమా? అనుమానమా? శబ్దమా? అని యడిగినచో
స్థావరములుగాని జంగమములుగాని యైనపదార్థములు, ఎట్లు ప్రత్యక్షముగాఁదె
లియుచున్నవో యట్లు ధర్మమును అధర్మమును ప్రత్యక్షముగాఁ దెలియుటలేదు.
కాఁబట్టి యవి ప్రత్యక్షప్రమాణమునుబట్టి లేవనియె నానిర్ణయము. మఱియు
స్థావరపదార్థము ప్రత్యక్షముగాఁదెలియునట్లు జంగమపదార్థమును ప్రత్యక్షముగాఁ
దెలియుచున్నది. ఈ ధర్మమును అధర్మమును అట్లు ప్రత్యక్షముగాఁ గనుపట్టుట
లేదు. ధర్మముగాని అధర్మముగాని ప్రత్యక్షసిద్ధమగునేని యది జంగమముగానో
స్థావరముగానో కనఁబడవలయును. అట్లు గనఁబడనందున నవి ప్రత్యక్షములుగావు.
ఇంతేకాక ధర్మము ప్రత్యక్షసిద్ధముగాఁ గలిగియుండునదేని నినుబోఁటిధార్మికునకు
విపత్తియే కలుగరాదు. అధర్మమును నట్లెకలిగియుండునదేని రావణునిబోఁటి యధా
ర్మికునకు సుఖమే కలుగఁదగదు. అట్లు లేనందున నీకీరెండును ప్రత్యక్షసిద్ధముగాఁ
గలుగ నేకలుగవు. మఱియు ధర్మమునకు ఫలము సుఖము; అధర్మమునకు ఫలము వ్య
సనము. కాన వ్యసనావ్యసనఫలములంబట్టి ధర్మాధర్మము లున్నవని యనుమాన
ముచేఁ దెలియవచ్చునుగదా. అప్పుడు అధర్మము కలిగియున్నదైనయెడల, అధర్మ

యుక్తుఁడగు రావణుఁడు వ్యసనము పొందవలెను. ధర్మము నిజముగా కలిగియున్నదైనయెడల ధర్మయుక్తుఁడగు నీకిట్లు వ్యసనము కలుగదు. ఇట్లు ధార్మికునకు వ్యసనమును, అధార్మికునకు వ్యసనము లేమియు కలుగుటవలన వ్యసనావ్యసనములంబట్టి ధర్మాధర్మము లున్నవని యనుమానము చేయరాకున్నది. అధర్మిష్ఠుఁడగు రావణునకు వ్యసనములేక సుఖము గలిగి యుండుటయు, పరమధార్మికుఁడవగు నీవు దుఃఖము పొందియుండుటయుఁ జూడఁగా, ధర్మము అధర్మఫలము లిచ్చుచుండుటయు అధర్మము ధర్మఫలము నొసఁగుటయుఁ గనుపట్టుచున్నది. ఇట్లు ధర్మాధర్మములు తమతమకు విరుద్ధములగు ఫలముల నిచ్చుచున్నవి. కాన,సుఖమునుబట్టి ధర్మమున్నదనియు దుఃఖమునుబట్టి యధర్మమున్నదనియు ననుమానముచే నిర్ణయింప నలవిగాకున్నది. మఱియు ధర్మము ననుష్ఠించుటచేత ధర్మఫలమగు సుఖము కనుపట్టునా?అధర్మము ననుష్ఠించుటచే అధర్మఫలమగుదుఃఖము చూపట్టునని తలఁచెదవా? ఎవరు మిక్కిలి యధార్మికులో వారికి అధర్మఫలముగలుగునేని, ధర్మరతులెవరో వారికి ధర్మఫలమే సంభవించునేని, యప్పుడు, ధర్మమాచరించుచున్న యాజనులకు ధర్మఫలమగు సుఖము కలుగుననియు అధర్మము నాచరించువారికి అధర్మఫలమగుదుఃఖము కలుగుననియు సిద్ధమగును. అయిన నట్లు కానరాదు. ఏలన, నధర్మమునందే వర్తించుచున్నవారికి, అర్థములు వర్ధిల్లి సుఖము కలుగుచున్నది ధర్మపరాయణులగువారికి దుఃఖము కలుగుచున్నది. ఇట్లు సుఖము నియతముగా ధర్మమునకు ఫలముగాకయు దుఃఖము నియతముగా అధర్మమునకు ఫలముగాకయు నుండుటంబట్టి. సుఖమునుబట్టి ధర్మమున్నదనియు దుఃఖమునుబట్టి యధర్మమున్నదనియు ననుమానింపఁ దరముగాదు. రామా! పాపకర్ములు, అధర్మముచేత బాధింపఁబడుదురేనియు పుణ్యకర్ములు, ధర్మముచేత సుఖితులగుదురేనియు, వధకర్మరూపమైన యీయధర్మమును సుఖశకర్మరూపమైనధర్మమును పుట్టి * మూఁడుక్షణములేయుండునవి గనుక పిదప హతములగుచున్నవి. హతమైనయధర్మ మెవరిని వధించును? హతమైనధర్మ మెవరికి మేలుగూర్చును? కాఁబట్టి యవి సుఖదుఃఖముల నిచ్చుననియుఁ దానింబట్టి యవియున్నవని వేదాదులు చెప్పుశబ్దప్రమాణమును సరికాదుగాన వానినిబట్టియు నవియున్నవని నమ్మరాదు 'కర్మములు క్షణమున ధ్వంసమునొంది నను దానిచే నారాధిత యగుదేవతయే ఫలము నిచ్చు'నందువా? ఆదేవతచే (దైవముచే) ఈపురుషుఁడు, తాను బాధపడుచున్నవాఁడుగాని లేక యొకరిని బాధించుచున్నవాఁడుగాని యగునేని,అనఁగా సత్కర్మముచే నారాధితుఁడైనయాదై

* శబ్దమును బుద్ధియు కర్మమును మూఁడుక్షణము లుండునని శాస్త్రము. క్రియామాత్రములై ధర్మాధర్మములు ఇట్లు క్షణికములగుటవలన అవి కాలాంతరమున సుఖదుఃఖఫలముల నిచ్చుట గలుగదు. కాఁబట్టి యవి సుఖదుఃఖముల నిచ్చుననియు నాసుఖదుఃఖములఁబట్టి యవియున్నవి యగుననియు వేదాదులు చెప్పుట యెట్లు తేలునట్లు చెప్పుమాట యగునని భావము.

వమే సుఖమునిచ్చుధర్మమును అసత్కార్యముచే ప్రీతినొందనియ్యాద్దైవమే దుఃఖము నిచ్చు అధర్మమును అగునేని అప్పుడదియే పుణ్యమును పాపమును జేయించుచున్న దైవమెడల, పాపకర్మఫలమగు దుఃఖమును పుణ్యకర్మఫలమగు సుఖమును, ఆచే యించుదైవమునే పొందునుగాని చేయువానిని గాదు. రాజు చేయించినకార్యము నకు ఫలము రాజునకేకాని భటునకుఁ గలుగదు. కాన దైవము తానే ధర్మాధర్మమై సుఖదుఃఖఫలము లిచ్చుననుటయు సరికాదు. * 'కర్మజనితమైన యపూర్వమనెడి ధర్మము ఫలమునిచ్చు'నందువా? అరిందమా! అనుమానముచేఁ దెలియరాక ప్ర త్యక్షమునుగాక, అగ్నీంద్రాదులవలె స్తుతివాదవాక్యములచే గమ్యమగునట్టును గాక,యున్న యపూర్వమనెడు ధర్మముచేత మిక్కిలియు శ్రేయస్సును బొంద నెట్లు శక్యమగును? సత్పురుషశ్రేష్ఠా! అపూర్వధర్మమనెడువస్తువు సత్తు(నిజముగాఁగలది) అయినయెడల ధార్మికుఁడవగునీకు అసత్తు(అనిష్టము) ఏదియుఁ గలుగదు. అయినను నీవు నీధర్మమునకు ఫలమైనసుఖమును బొందక దుస్సహమునయినయిటువంటి దుఃఖ మును బొందితివి గాన యాధర్మము సత్తగుట పొసఁగదు. సత్తయినచో సుఖమి య్యదా? అసత్తే కావలయును. ఇట్లు యపూర్వమనెడి ధర్మమునకు నీవట్లు వలయుసుఖ మనెడి కార్యమే లేనందున నది యున్నదనియే కల్పింపరాదు. ఒకయర్థమును, దాని కార్యము కనఁబడనంతమాత్రమున లేనిదిగా నిశ్చయింపరాదు. ఏలన నప్పుడు ఇంద్రి యములకు కనఁబడనివన్నియు లేనివనవలసివచ్చును. అట్లు లేవనరాదుగదా. మఱి యు నొక్కొక్కయర్థమునకు సహకారియునుండుటయుఁ గలదు. ఆసహకారినిగూడఁ గావింపనియెడల నాయర్థమునకు వలయుకార్యము పుట్టదు. ఇచట ధర్మమునకు సహ కారి పౌరుషము. 'ఆపౌరుషమును జేయనందున ఆధర్మమునకుఁ గార్యము(ఫలము)అగు

---

* స్వామిభృత్యుఁడగు రాజు [illegible] సర్వోత్తము, దాని ననుసరించువాని నను గ్రహించుమను, ఉల్లంఘించువాని నిగ్రహించుమనునట్లు, ఈశ్వరుఁడును తనయాజ్ఞ యనెడి కర్మము ననుష్ఠించువానిని అనుగ్రహించుమను దానిని నుల్లంఘించువాని నిగ్రహించుమను నాన్నాఁడు. కాఁబట్టి యీశ్వరుఁడే తన యాజ్ఞారూపమగు ధర్మమును నాజ్ఞోల్లంఘనరూపమగు నధర్మమును బట్టి సుఖమును దుః ఖమును నిచ్చుచున్నాఁడన్నచో, అతఁ డట్లు నిగ్రహించుట స్వార్థమునా? పరార్థమునా? స్వార్థమ న్నచో అవాప్తసమస్తకాముఁడు [illegible] స్వార్థము గలుగదు. పరార్థ మన్నచో అప్పుడు ఒకనిని [illegible] పక్షపాతనైర్ఘృణ్య దోషములు కలుగును. ఈశ్వరుఁడు వారివారికర్మానుగుణముగా సృజించుటవలన పక్షపాతాదులు [illegible] [illegible] కర్మములు [illegible] కర్మమును [illegible] సుఖమును [illegible] కనుక కర్మమువలన [illegible] అపూర్వమనెడుధర్మము [illegible] చెప్పుచున్నారు.

సుఖము పుట్టదయ్యో' నందువా? అట్లేని, అప్పుడు ధర్మము అటుగాక, ఒకసహకారి నపేక్షింపక యే కార్యము కలిగింపఁదగనిదై కావున తనంతటనే కార్యముసేయఁజాలనిదగునుగాన యది కార్యమును బుట్టించుటకు బలమును(పౌరుషమును) అపేక్షించుచున్నది గావలయును. ఇట్లేని, ధర్మము స్వతంత్రముగా ఫలమునిచ్చునట్టినియతి మాలినదిగాన దానినే ప్రధానమైనదిగా సేవింపరాదని నాయభిప్రాయము. మఱియు కార్యమును సాధించువిషయమందు, బలమునకు (పౌరుషమునకు) ధర్మము తక్కువయైనదగునేని, యిపుడు ధర్మమును ప్రధానముగాఁ గొనుట మాని ధర్మమునం దివు డెట్లు వర్తించుచున్నావో యట్లె బలమునందును (పౌరుషమునందును) వర్తింపుము. *పరంతపా! సత్యవచనమును ధర్మమందురు. అట్లేని,మనతండ్రి నిన్నుఁ బట్టముకట్టెదనిచెప్పి తప్పుటచే సత్యముమాలినాఁడు. సకలకల్యాణగుణాశ్రయుఁడును జ్యేష్ఠపుత్రుని నిన్ను రాజ్యమునుండి వనమునకు వెడలఁబంపుటచే నీయందు దయయుఁ దూలినవాఁడు. కాన యతనిని గట్టువెట్టవలసియుండెను. నీవో పితృవాక్యమును దప్పక సేయుదునని ప్రతిజ్ఞపట్టినవాఁడవు. ఆప్రతిజ్ఞ చొప్పున తండ్రి మొదటఁజెప్పినట్లు పట్టముగట్టికొని యతనిని సత్యముదప్పకుండునట్లే యేలకట్టుపఱుపవయితివి? నీవు పితృవాక్యమును జేయుదునని ప్రతిజ్ఞచేసి యాచొప్పున సమస్తప్రజలయెదుట రామునిఁ బట్టముగట్టెద నన్నమొదటిపితృవచనమును సత్యమగునట్లు, పాలింపవలసియుండియు పాలింపక నేవిడిచి యతనిఁ దడవికిఁబొమ్మన్న వెనుకటివచనమునుమాత్రము సత్యమగునట్లు పాలించితివిగాన సత్యమునుగూడ గొంతపాలించియుఁ గొంతపాలింపకయుఁ బోవుటచే చక్కఁగా పాలింపనివాఁడవే యైతివి. పరంతపా! ధర్మమును అధర్మమును నిజముగాఁగలవియే యైనను ధర్మమునే యనుష్ఠింపవలయు ననికాని యధర్మమునే యనుష్ఠింపవలయు ననికాని నియమములేదు. అప్పటికిఁదగినట్లు రెంటిననుష్ఠింపవచ్చును. ఎట్లన కేవలము ధర్మమే యనుష్ఠింపవలసినదిగా నేర్పడినయెడల, నప్పుడు వజ్రము దాల్చిన శతక్రతుఁ డింద్రుఁడు మునియగు విశ్వరూపునిఁ జంపి యాగము సేయఁదగదు; చంపక యాగమునుమాత్రమే చేసియుండును. కేవల మధర్మమే అనుష్ఠింపవలసినదగునేని, యిపుడు శతక్రతువులుచేసిన యింద్రుఁడు వజ్రముదాల్చి మునిని చంపి యాగము సేయవలదు. మునిని జంపుటమాత్రమే చేయవలయును. ఇట్లు †క్షత్రధర్మనిష్ఠుఁడగు నింద్రుఁడు ధర్మాధర్మములను రెంటి ననుష్ఠించుటచేత రాజు కాలమునకుఁ దగినట్లు రెంటిని జేయవలయును. ధర్మమును అధర్మమును రెంటిని ననుష్ఠింపక ఒక్కొక్కటినే వేఱువేఱ నియమముగా ననుష్ఠించుచు వచ్చినయెడల నవి

* ఇట్లు సామాన్యముగా ధర్మమునుదనిరించి యిదిమొదలుగా సత్యవచనమను ధర్మమును రాముఁడు ప్రధానముగాఁ గొనియుండుటచే దానిని ప్రత్యేకముగా గ్రహించుచున్నాఁడు.

† 'తాన్యేతాని దేవక్షత్రాణీన్ద్రో వరుణః పర్జన్యో యమ ఈశానః' అని యింద్రుఁడు క్షత్రియుఁడగుటను శ్రుతి చెప్పుచున్నది.

యట్లుసేయువానిని నాశముసేయును. కావుననే పురుషుఁడు, ఒక్కొక్కటినే చేయ వలయుననెడి నియమము లేక యయ్యేకాలమునకుఁ దగినట్లు, సమస్తకార్యములును ధర్మయుక్తముగాను అధర్మయుక్తముగాను గావింపవలయును. రామా! నిన్నుఁజూచిన జాలి రేఁగుచున్నది. ఇట్లయ్యేకాలమునకుఁదగిన ట్లిచ్చవొప్పున రెంటిని జేయుటయే ధర్మమని నాసిద్ధాంతము. మఱి ధర్మమే లేదంటిని. ఎట్లో ఉన్నదన్నను ప్రధానముగాదంటిని. అది యప్రధానముగానయినను నీకు కలుగదు. ఎట్లన, ధర్మమునకు మూలము అర్థము. రాజ్యము నీకు ప్రాప్తించినపుడు రాజ్యమును దిగవిడుటచే రాజ్యరూపమైన యర్థమును ఛిన్నము చేసికొంటివి. మూలమైన అర్థమును ఛేదించుకొనఁగా మఱిధర్మమెక్కడిది ? ధర్మము నీకు నప్రధానముగానైనను గలుగదయ్యెను. పర్వతములనుండియె నదులు కలుగును. అట్లే పన్ను మొదలైన యీయాయాకారణములచే ప్రాప్తమై క్రమముగా వర్ధిల్లినయర్థమువలననే మూలవ్యయము లేక యే యజ్ఞదానాదిసమస్తక్రియలు ప్రవర్తించుచున్నవి. అర్థహీనుఁడై కావుననే యల్పతేజుఁడయిన పురుషుఁడే కార్యములు చేసినను అవియన్నియు, వేసవియందలి యల్పనదులవలె మొదలంట మాయుచున్నవి. అర్థములేమిచే ధర్మము కలుగకపోవుటమాత్రమే కాదు ; దోషమునుగలుగును. ఎట్లన, ధనమును బోఁగొట్టుకొన్నవాఁడు పూర్వము ధనమున్నపుడు సుఖముగాఁ బెరిఁగినవాఁడుగాన ధనమునశింపఁగా కష్టములకుఁ దాళలేక సుఖముల ననుభవింపఁ గోరినవాఁడై సుఖసాధనమగుధనము నార్జించుటకు దొంగతనము మొదలగు పాపము సేయ నారంభించుచున్నాఁడు. అట్లు సేయుటచే వానికి దోషముగూడఁ గలుగుచున్నది. ఎవ్వని కర్థముగలదో వానికే యందఱు మిత్రులగుదురు. దరిద్రుని స్నేహితులు గూడ వదలుదురు. ఎవనికి ధనమున్నదో వానికే యందఱును బంధువులు; ధనహీనుని వానిబంధువులుగూడ సరకుసేయరు. ఎవనికి ధనమున్నదో యతఁడే పుంస్త్వముగలవాఁడు. ధనహీనులు స్త్రీప్రాయులె. ధన మెవ్వనికున్నదో యతఁడే పండితుఁడు. ధనహీనుఁడు పండితుఁడైనను మూర్ఖుఁడుగా నెన్నఁబడును. ఎవ్వఁడు ధనవంతుఁడో యతఁడే పరాక్రమశాలి. ధనహీనుఁడు పరాక్రమవంతుఁడయినను పిఱికిగా నెన్నఁబడును. ఎవనికి ధనముగలదో యతఁడే బుద్ధిమంతుఁడు. దరిద్రునకు బుద్ధియున్నను శోభిల్లదు. ధనవంతుఁడే మంచియదృష్టముగలవాఁడు. దరిద్రుఁడు దురదృష్టుఁడేయగును. ధనవంతుఁడే శీలాదిగుణవంతుఁడు. దరిద్రునకు గుణములున్నను వన్నెనొందవు. అర్థమును వదలినయెడల, ఈచెప్పినమిత్రసంపదాదిగుణములకు వ్యతిరిక్తములయినదోషములు కలుగునని నీకు స్పష్టముగాఁ జెప్పితిని. వీరా ! అప్పుడు రాజ్యమును తన్మూలమైనయర్థమును దిగవిడిచితివే. ఏమిగుణమున్నదని నీకు దానిని విడువ బుద్ధిగలిగెనో నాకుఁ దెలియకున్నది. ఎవ్వనికి ధనముగలదో వానికి ధర్మకామప్రయోజనములునుఁ దక్కినవన్నియు ననుకూలముగా సిద్ధించును. ధనము లేనివాఁడు

శ్రేయస్సును బొందఁగోరి ధనార్జనమునకై యెంత ప్రయత్నపడినను శ్రేయమును బడయుట శక్యముగాదు. రాజా! సంతోషము కామము గర్వము ధర్మము కోపము శాంతి దాంతి, యివన్నియు ధనముండిననే ప్రకాశమునొందును. ధనములున్నను వానినిబాటింపక కేవల ధర్మమునుమాత్రము ననుష్ఠించువారి కీలోకమందలిసుఖ మెంతమాత్రమును గలుగదు. ఐహికసుఖములకెల్ల నట్లు సాధనములయినధనములు సుబ్బులుక్రమ్మినదినమున సూర్యాదిగ్రహములు గనఁబడనట్లు, నీయందుఁ గానరాకున్నవి. సకలశ్రేయములకు సాధనములైనయర్థములను నీ వాదరింపవైతివి. ఇఁక సుఖ మెట్లుగలుగును? వీరా! నీవు తండ్రిమాటయందుఁ దప్పకనిలిచి యూరువదలి యడవిని వాసముచేయువాఁడవైతివి. ఇట్లు పితృవచనపరిపాలనమనెడి కేవలధర్మమునే యవలంబించి అర్థమునకు హేతువయిన రాజ్యమును దిగవిడుచుటచే, నీకు ప్రాణములకంటె మిక్కిలియుఁ బ్రియురాలయిన నీయిల్లాలిని రాక్షసుఁడు రావణుఁ డపహరించినాఁడు. 'ఇట్లయిపోయినది. ఇఁకఁ జేయవలసినదే' మందువా? వీరా! అట్లునీవు రాజ్యము నాదరింపకపోవుటచే నింద్రజిత్తువలనఁ బ్రాప్తించిన యీమహాదుఃఖమును, ఇప్పుడు నేను ప్రతిక్రియచేఁ బోఁగొట్టెదను. కాన రామా! లెమ్ము. పురుషసింహమా! ఆజానుబాహూ! దృఢవ్రతా! లేలెమ్ము. మహాబుద్ధిమంతుఁడవగు నిన్నుఁ బరమాత్ముఁడవని యెఱుంగకున్నావేమి? కాన శోకింపఁ గారణములేదు. అనఘా! నీకు విధేయుఁడనై నీకుఁ బ్రియము సేయుకొఱకే పుట్టియున్నవాఁడగు నేనిపుడు సీతవధమును విని, నీకు దుఃఖముగలిగినందులకు కుపితుఁడనై, యిదిగో గుఱ్ఱములతోను ఏనుఁగులతోను రథములతోనుంగూడ * రాక్షసేశ్వరుఁడగు రావణునితోనుంగూడ లంకనంతయు బాణములచేఁ బడఁగూల్చెదను జూడుము' అనెను. ఇది యెనుబది మూఁడవ సర్గము.

---

విభీషణుఁడు రామునాశ్వాసించి యింద్రజిద్వధార్థము లక్ష్మణునిఁ బంప వేఁడుట.

లక్ష్మణుఁడన్నయందలి వాత్సల్యముగలవాఁడుగాన యట్లు రామునాశ్వాసించుచుండఁగా విభీషణుఁడు సేనాసన్నివేశములు తమతమకార్యములను గావించుటకై యేర్పఱచి, నానావిధాయుధధరులును వీరులునై నల్లనికాటుకరాసులవలెఁ బొడసూపుచున్న నలుగురుమంత్రులు తన్ను బలసిరాఁగా యేనుంగులచేఁ బరివేష్టితమైయున్న

*ఇందులకు 'అయమనఘ తవోదితః ప్రియార్థం జనకసుతానిధనం నిరీక్ష్య రుష్టః। సహయగజరథాం సరాక్షసేన్ద్రాం భృశ మిషుభిర్వినిపాతయామి లఙ్కామ్' అని మూలము. 'అనఘా! నేనిప్పుడు సీతావధమునువిని, నీదుఃఖమునకు కుపితుఁడనై ధర్మార్థములు ప్రమాణికము లని చెప్పితినిగాని వేఱుగాదు. ఇఁక నీకుఁ బ్రియము సేయుటకై లంకను హయగజరథములతోను రాక్షసేంద్రుఁడగు రావణునితోను నిదిగో బాణములచేఁ బడఁగూల్చెదను' అని మహేశ్వరతీర్థులు.

యూథపతియగుగజమువలె వచ్చెను.అతఁడువచ్చి, దుఃఖపరవశుఁడై మహాత్ముఁడు రాముఁడుండుటయు, వానరులందఱును గన్నుల నీరుగార్చుచు చూపులు కలంగియుండుటయుం జూచినవాఁడయ్యెను. అంత విభీషణుఁడు, ఇక్ష్వాకుకులమున కెల్ల నానందము గూర్చు మహాత్ముఁడు రాముఁడు దుఃఖమున మోహమునొంది లక్ష్మణునితొడపయిఁ బరుండియుండఁ గాంచెను. ఆవిభీషణుఁడు, రాముఁడు శోకమునం బొక్కుచు లజ్జితుఁడై యుండుటను జూచి మనసులోపలనే దుఃఖించుచు,దీనుఁడై 'ఇదియేమి?అందఱు దుఃఖితులై యున్నారు'అనియడిగెను.లక్ష్మణుఁడు,విభీషణుని ముఖమునుజూచి,సుగ్రీవుని నా వానరులనందఱనుం గాంచి కన్నీటఁ దోఁగుచు విషయము సంగ్రహముగా 'సౌమ్యా! రాముఁ డిప్పుడు ఇంద్రజిత్తు సీతనువధించినాఁడని హనుమంతుఁడు చెప్పఁగా విని,దుఃఖముపట్టలేక మోహమునొందినాఁడు' అనెను.లక్ష్మణుఁ డట్లు సగము చెప్పుచుండఁగా, విభీషణుఁడు సంగతియంతయుం దనకుఁ దెలిసియుండుటం జేసి యతఁడుచెప్పుట నడ్డగించి 'మనుజేంద్రా! హనుమంతుఁ డపుడు వాస్తవమనితలఁచి చెప్పినమాట యెంతమాత్రము యుక్తముగాదని నాకుఁ దోఁచుచున్నది. సముద్రము నెండించుట యెట్లశక్యమో,అట్లు సీతను వధించినాఁడనుట యెంతమాత్రము యుక్తముగాదు. మహాబాహూ! దురాత్ముఁడగు రావణునియభిప్రాయము నాకుఁదెలియును. సీతనుగుఱించి యతఁ డెంతమాత్రమును వధించునంతటికార్యమును జేయనేచేయఁడు. నేను హితముంగోరి,సీతను రామునకొసంగుమని యెంత బతిమాలివేఁడినను, రావణుం డామాటను విననేలేదు. అట్లు సీతనువిడుచుటకే సమ్మతింపనివాఁడు వధించుటకు నిచ్చగించునా?సామోపాయమునఁగాని దానమునఁగాని భేదమునంగాని యాబిడనుజూడనుగూడ శక్యముగాదు.ఇఁక దండోపాయమునఁ జూచుటగూడ నలవియెట్లు?మఱి యేమాయోపాయమునను జూచుటసైతము శక్యముకాదే. కనుక సీత నింద్రజిత్తు దెచ్చి యెట్లు వధింపఁగలఁడు? ఆయింద్రజిత్తు వానరులను * మోసపుచ్చి నికుంభిల యనుదేవాలయమునకుఁ బోయియున్నాఁడు. వాఁడచ్చట హోమమునుచేయును. ఇంద్రజిత్తు నికుంభిలయందు నిర్విఘ్నముగా హోమముగావించి మరలివచ్చునేని, దేవతలును, దానవులు నొక్కపెట్ట నెత్తివచ్చినను,వారికిని యుద్ధంబున వానినిమార్కొనుట కలవిగాదు. ఆయింద్రజిత్తు, నికుంభిలయందు తాను హోమము సేయునపుడు, వానరులు తనపైఁ దలపడి పరాక్రమము చూపిరేని తనకు విఘ్నముకలుగునని తలఁచి యట్లు

* ఇంద్రజిత్తు వానరుల నేల మోసపుచ్చఁగోరెననఁగా, అప్పుడు రావణునకుఁదోడుగా తాను దక్క యుద్ధముసేయువారుఁ డెవ్వఁడును లంకలో లేఁడయ్యె. కాన తాను హోమకార్యమునందు వ్యాకులుఁడైనపుడు, వానరులను అడ్డుపెట్టువారులేనందున వానరులు పైఁబడఁగా హోమము విచ్ఛిన్నమగును. అట్లు విచ్ఛిన్నమైనచో బ్రహ్మవరముచొప్పునఁ దనకు నాశముకలుగును. కాన తనహోమకార్యము నెఱవేఱువఱకు రామాదులందఱును దుఃఖపరవశులై యుద్ధమునందు ఉత్సాహములేకుండుకొఱకు మాయాసీతను వధించి వారిని మోసపుచ్చినాఁడని విభీషణుడు చెప్పుట తెలియుఁడి. గోవిందరాజులు.

విఘ్నము చేయకుండునట్లు వారిని వంచించువాఁడై యీమాయను ప్రయోగించి నాఁడుగాని మఱేమికాదు. కాన యాహోమకర్మము సమాప్తినొందకమునుపే యానికుంభిలకు సైన్యములతోడఁ గూడి పోదము. పురుషసింహమా! ఇది వట్టిభ్రమము. దీనివలన సంతాపముగలిగినది. దీనిని విడువుము. నీవిట్లు శోకమున స్రుక్కచుండుటనుజూచి మనసైన్యమంతయు దుఃఖితమై కృశించుచున్నది. నీవు ధైర్యము మిక్కిలియుఁగలిగి మనస్సు నెమ్మదినొంది యిచటనే యుండుము. నాతోడను సేనాపాలురగు వానరవీరులతోడనుగూర్చి లక్ష్మణునింబంపుము. ఈపురుషసింహుఁడు లక్ష్మణుఁ వాఁడిబాణములు ప్రయోగించి యాయింద్రజిత్తుని హోమకార్యమును వదలునట్లుచేసి యుద్ధమునకుఁ దెచ్చును. అంత బ్రహ్మవరముచొప్పున వాఁడు వధ్యుఁడగును. చక్కఁదిద్దంబడుటచే మిక్కిలివాఁడులై పక్షిఱెక్కల యీఁకలు గట్టియుండుటవలన మిక్కుటమైన వేగము గలిగి యున్నయీలక్ష్మణుని క్రూరబాణములు, గ్రద్దలు మొదలగు క్రూరపక్షులుంబోలె నాయింద్రజిత్తునెత్తురు ద్రావఁగలవు. మహాబాహూ! పూర్వము నముచిని వధించుటకై యింద్రుఁడు వజ్రాయుధమును బ్రయోగించినట్లు, ఇప్పుడు నీవింద్రజిత్తును వధించుటకై శుభలక్షణుండగు లక్ష్మణునిఁ బంపుము. మనుజేంద్రా! పగవానివధించువిషయమై యిపు డింతమాత్రమును గాలవిళంబము సేయుట యుక్తముగాదు. కాన నీవు మహేంద్రుఁడుంబోలె నీదేవతాశత్రుఁడగు నింద్రజిత్తును వధించుటకై లక్ష్మణుని కాజ్ఞయిమ్ము. రాక్షసోత్తముఁడగు నాయింద్రజిత్తుచేయు హోమకర్మము సమాప్తిఁబొందునేని, యతఁడు యుద్ధమున సురాసురులకేని యదృశ్యుఁడగును. అతం డాహోమకర్మము నెఱవేర్చి యుద్ధమునకు వచ్చినచో దేవతలకుసైతము మిక్కిలియుఁ బ్రాణసంశయము కలుగును' అనెను.
ఇది యెనుబదినాలుగవసర్గము.



{ రాముఁడు విభీషణువచనమున ధైర్యమునొంది యింద్రజిత్తుని వధించుటకై లక్ష్మణుని విభీషణ హనుమదంగద జాంబవదాదులతోఁగూడ నికుంభిలకుఁ బంపుట. }

రాముఁడు విభీషణుఁడు చెప్పినది వినియు, శోకమున మిక్కిలియు స్రుక్కియుండుటవలన నతఁడు చెప్పినమాటను మనస్సునఁజక్కఁగా గ్రహింపలేఁడయ్యె. అంత శత్రుపురములఁ గెలుచునట్టిబలుదిట్ట రాముఁడు కొంతసేపటికి ధైర్యమువలంబించి వానరులయెదుటఁ దనదాపునఁ గూర్చున్న విభీషణునితో 'రాక్షసపతీ! విభీషణా! నీ విప్పుడు చెప్పినమాట నేను జక్కఁగా నాలింపనయితినిగాన మరల దానిని వినఁగోరెదను. నీవు చెప్పఁగోరినదానిని మరలంజెప్పుము' అనెను. రాముఁ డిట్లు చెప్పినదివిని మాటలయందుఁ బండితుండగు నావిభీషణుఁడు, తాను మున్ను చెప్పినమాటలే మరలంజెప్పువాఁడై 'మహాబాహూ! వీరా! నీవు సేనాభాగముల నెట్లేర్పఱుపుమని నియమిం

చితిఖ్రా! యాప్రకారముననే వానినెల్ల నియమించినతోడనే కావించితిమైనది. ఆగుల్మములనెల్ల నన్నిస్థలములందును సరిపడివచ్చునట్లు విభజించితిమైనది. అయ్యైవిభాగములయందు న్యాయముచొప్పున యూథపతులుగా నెవ్వరెవ్వరి నుంపవలెనో వారి నుంచియు నైనది. మహాయశా! మఱియు నేను విన్నవింపవలసిన దొకటికలదు. దానిని వినుఁడు. నీవు నిష్కారణముగా నిట్లు పరితపించుచుండఁగా మాకును హృదయములు తపించుచున్నవి. ఇప్పుడు నీదుఃఖమునకుఁ గారణము మిథ్యయేకాన యందులకై యిట్లు మిన్నకశోకించుటయు పరితపించుటయు మానుము. వీరా! నీవిట్లు చింతపాలగుట శత్రులకు సంతోషము పెంచునుగాన యిది వదలుము. నీవు సంతోషము గయికొని యుద్ధప్రయత్నము గావింపుము. రఘునందనా! నీకు సీతను బొందవలయుననియు, రాక్షసులను వధింపవలయుననియు నిచ్ఛగలదేని నేను హితమైనమాటం జెప్పెదను వినుము. ఈలక్ష్మణుఁడు నికుంభిలకుఁబోయి యుద్ధమున నింద్రజిత్తును జంపుటకై గొప్పసైన్యముతోడ చక్కఁబయలు వెడలుఁగాక. పెక్కుయుద్ధముల గెలుపునొంది యాఱితేఱిన యీమేటివిలుకాఁడు లక్ష్మణుఁడు, గుడుసువడిన వింటినుండి కృష్ణసర్పవిషముంబోని వాఁడిబాణముల నింద్రజిత్తును జంపుఁగాక. వీరుఁ డాయింద్రజిత్తు తపస్సుచేసి బ్రహ్మవలని వరమున హోమమూలముగా బ్రహ్మశిరమను మహాస్త్రమును, కామగమనములగు రథమును గుఱ్ఱములనుం బడసెను. ఆయింద్రజిత్తిపుడు సైన్యములతోఁగూడ నికుంభిలను జేరియున్నాఁడఁట. కాన యతఁడు హోమకర్మము చేసి తీర్చి నికుంభిలనుండి లేచివచ్చునేని, మనమందఱమును హతులమైతిమనియే యెఱుఁగుము. మహాబాహూ! సమస్తలోకనాథుఁడగు బ్రహ్మ, యింద్రజిత్తునకు 'నీవు నికుంభిలాహోమమునకుఁబూని, హోమము పూర్తిసేయకయు నికుంభిల యనెడు న్యగ్రోధమూలము చేరకయు నుండునపుడు, శత్రుఁ డెవ్వఁడు నిన్ను మార్కొన్నవాఁడై నీ వాయుధముగొని తన్ను వధింపఁదలపడఁగా నిన్ను హింసించునో వాఁడింద్రశత్రుని నిన్ను వధించువాఁడు మఱియెవ్వఁడును నిన్ను వధింపఁజాలఁడు' అని వరమొసఁగెను. రామా! ఈవిధమున నింద్రజిత్తుహోమమునకు విఘ్నము సేయువాఁడే బుద్ధిమంతుఁడగు నాయింద్రజిత్తునకు మారకుఁడుగా బ్రహ్మ విధించియున్నాఁడు. కాన మహాబలశాలీ! ఇపు డాయింద్రజిత్తును వధించుటకు మాలో నొక్కని కాజ్ఞసేయుము. ఇంద్రజిత్తు హతుఁడయినయెడల రావణుఁడును నతనిసుహృజ్జనులును హతులైరనియే తలంపుము' అనెను. రాముఁడు విభీషణుఁడు చెప్పినదివిని యతనితో 'సత్యపరాక్రమా! భయంకరుఁడగు నాయింద్రజితుని మాయమహిమ నాకుఁ దెలియును. వాఁడు బ్రహ్మాస్త్రముగూడఁ దెలిసినవాఁడు, మిక్కిలి ప్రాజ్ఞుఁడు, మహామాయాశాలి, మంచి బలవంతుఁడు, యుద్ధమున వరుణునితోఁగూడి దేవతలువచ్చినను వారిని మూర్ఛలం జేయును. మహాయశా! వాఁడు రథారూఢుఁడై యాకాశమునఁ దిరుగుచుండఁగా, మేఘములు గ్రమ్మినపుడు సూర్యగతియుంబోలె, వానిపో

కడ తెలియుట శక్యముగాదు' అనెను. రాముఁడు దురాత్ముఁడగు తనశత్రుని యిం ద్రజితుని మాయవలనిబలిమి తెలిసినవాఁడై, పెక్కుయుద్ధంబులం గీర్తినొంది యున్న లక్ష్మణునిఁజూచి 'లక్ష్మణా! నీవు వానరరాజగు సుగ్రీవునకుఁ గలసమస్తసై న్యమును దోడ్కొని,హనుమంతుఁడు మొదలగు సేనాపతులతోను,భల్లూకపతియగు జాంబవంతునితోను అతనిసైన్యములతోనుం గూడి పోయి మాయావియు బలవం తుఁడునగు నారాక్షసపుత్త్రుని నింద్రజిత్తును వధింపుము. ఈవిభీషణుఁడు మహా త్ముఁడు, రాక్షసుఁడగుటచే మాయాతంత్రము లెఱింగినవాఁడు, విశేషించి యాని కుంభిలాప్రదేశమును దెలిసినవాఁడు. ఇట్టియితఁడును మంత్రులతోఁగూడి నీవెంబ డినె రాఁగలఁడు' అనెను. రాముఁడుచెప్పినమాట విన్నంతనే మిక్కిలి యద్భుతప రాక్రముఁడగు లక్ష్మణుఁడును విభీషణుఁడును, ఉత్తమములయినవిండ్లం గయికొనిరి. లక్ష్మణుఁడు యుద్ధసన్నద్ధుఁడై కవచముధరించి ఖడ్గంబుగొని, కాంచనాలంకృతమగు ధనువును బాణములను గయికొని యుద్ధంపునుబ్బున, రామునిపాదములం బట్టుకొని మ్రొక్కి యతనితో 'ఇప్పుడు నావింటినుండి వెడలెడు బాణములు ఇంద్రజితుని దేహ ము నుచ్చికొని తామరకొలఁకునందు హంసలువ్రాలునట్లు లంకాపురమునం దెల్లఁ బడఁగలవు. ఇపుడే, నాబాణములు వింటియల్లెత్రాటినుండి విడివడి, భయంకరుఁడగు వానిశరీరమును భేదించి గండ్లుచేసి వానిని నుఱుమాడఁగలవు' అనెను. ఆలక్ష్మణుఁ డు యుద్ధోత్సాహమున మిక్కిలియుఁ గాంతి దళుకొత్త అన్నయెదుట నీలాగునం బ లికి యింద్రజిత్తును నికుంభిలయందలిరాక్షసులను వధింప నువ్విళ్లూరుచు త్వరితము గాఁ బోయెను. లక్ష్మణుం డట్లు తనయన్నపాదంబులకు మ్రొక్కి ప్రదక్షిణముగా వించి, యింద్రజిత్తుప్రాపున నున్నయానికుంభిల యనుచైత్యవృక్షమునొద్దకుఁ బో యెను. ప్రతాపశాలియగు నారాజకుమారుఁడు, రాముని మంగళాశీర్వచనములు నొంది, విభీషణునితోడ వేగపోయెను. అప్పుడు హనుమంతుఁడు, అనేక వానరస హస్రములచేఁ బరివృతుండయ్యు, విభీషణుఁడు మంత్రియుక్తుండయ్యు లక్ష్మణుని వెంట నడచిరి. ఆలక్ష్మణుఁడు మిక్కిలియుఁ గొప్పవానరసైన్యము తన్నతివేగమున బలసిరాఁగా, పోవుచు, మార్గమునఁ దనవెంటవచ్చుటకు సన్నద్ధమై నిలిచియున్న భ ల్లూకసైన్యమును జూచెను. మిత్రులకు సొంపుగూర్చు నాలక్ష్మణుఁడు, బహుదూ రము దారిగడచిపోయి పిదప దూరమున వ్యూహముపన్ని యున్నరాక్షససైన్యమును గాంచెను పగవారిని బీఁచమడంచువాఁడును ప్రతాపశాలియు నగునారాజపుత్త్రుఁడు లక్ష్మణుఁడును కేల విలుదాల్చి బ్రహ్మ వరమిచ్చియున్న ప్రకారమున నికుంభిలను జేరకమునుపే యుద్ధముసేసిసం జచ్చునని కీటుకునూఁది యందులకుఁ దగినమాయో పాయమును బన్ని యాయింద్రజిత్తును జయించుటకు నాయితుఁడై విభీషణుని వీరుఁ డగు నంగదునిని వాయుపుత్త్రుండగు హనుమంతునిం గూడియుండెను.పలువిధములు గాఁ జూపట్టుచు, నిర్మలములయిన యాయుధకాంతులచే మెఱయుచు, ధ్వజములచేఁ

గ్రిక్కిటిసి, మహారథములచే విస్తరిల్లి, మిక్కిలియు భయంకరమై యింతింతనరాని యురవడిగలిగి కటికిచీఁకటివలెఁ దట్టమై కారుకొనుచున్న యాశత్రుసైన్యమును లక్ష్మణుఁడు చొచ్చినవాఁడయ్యెను. ఇది యెనుబదియేనవ సర్గము.

---

**లక్ష్మణుఁడును హనుమంతుఁడు మొదలగువారును నికుంభిల చుట్టును కాపుగా నుంపఁబడినరాక్షససైన్యమును ధ్వంసము సేయుటవిని, యింద్రజిత్తు హోమకర్మము ముగియకమునుపే యుద్ధమునకు వెడలుట.**

అంత, నట్టిస్థితియందు, రావణునితమ్ముఁడు విభీషణుఁడు, లక్ష్మణునితో పరులకుఁ గీడుగలిగించునదియుఁ దమకు గార్యసాధకము నయినవాక్యమును జెప్పవాఁడై 'ఇదిగో మేఘమువలె నల్లనై రాక్షససేన కనఁబడుచున్నదే! దీనిని, ఇంద్రజిత్తు యాగము ముగియుటకుమునుపే, వానరులు వృక్షములు మొదలయిన యాయుధములతో హతము సేయుదురు గాఁత. లక్ష్మణా! నీ వీపెనుసైన్యమును భేదింపఁబూనుము. ఇది భిన్నమైనయెడల రాక్షసరాజకుమారుఁడు ఇంద్రజిత్తు కంటికిఁగనఁబడును. ఇంద్రజిత్తునుజంప వచ్చియున్నవాఁడవుగావున నీ వింద్రజిత్తు చేయుకర్మము సమాప్తి నొందుటకుమునుపే యింద్రునివజ్రముంబోని బాణములను బ్రయోగించి, యాసేనను భేదింపుము. వీరా! దురాత్ముఁడై మాయాశీలుఁడై యధార్మికుఁడును గ్రూరకర్ముఁడునై సమస్తలోకములకును భయము గలిగించుచుండునీయింద్రజిత్తును జంపుము' అనెను. ఆలక్ష్మణుఁడు సుహృదుఁడుచెప్పిన మాటలోనిసారము గ్రహించు మేలిలక్షణముగలవాఁడు గాన, విభీషణుఁడు చెప్పినదివిని, యట్లై, రాక్షసేశ్వరుని పుత్త్రుఁడగు నింద్రజితునిపై బాణవర్షము లవ్వారిగాఁ గురియించెను. వృక్షములును బర్వతములును నఖములునే యాయుధములుగాఁ గొని పోరునట్టి భల్లూకములును వానరులును, నొక్కటఁగూడి యట్లు పన్నియున్న యారాక్షససేనపైఁ గవిసిరి. రాక్షసులును వాఁడిబాణములను ఖడ్గములను శక్తులను తోమరములను నెత్తికొని వానరసైన్యములఁ జంపఁగోరి సన్నద్ధులై నిలిచిరి. అప్పుడు వానరులకును రాక్షసులకును గలిగిన యాతుములయుద్ధముచే లంకాపురమంతయుఁ బ్రతిధ్వనించినదయ్యె. అప్పుడు ప్రయుక్తములైన నానావిధాకారములగు నాయుధములును, వాఁడి బాణములును వృక్షములును, పైచుటకు పైకెత్తఁబడిన ఘోరపర్వతశిఖరములును నిండి యాకాశమును గప్పినవయ్యె. ఆరాక్షసులు, వికృతములై భయంకరములుగానున్న ముఖములతోను బాహువులతోను, వానరులదేహములయం దాయుధముల నొప్పించి మిక్కిలియు పెనుభయము గలిగించిరి. అట్లు వానరులును యుద్ధమునఁ గొమ్మలతోఁ గూడినవృక్షములతోను బర్వతశిఖరములతోను రాక్షసోత్తములను బ్రహరించి వధించిరి. మహాకాయులును మహాబలులునగు భ

ల్లూక వానరవీరులు రాక్షసులను పలువిధముల వధించుచుండఁగా రాక్షసులకు మిక్కిలియు భయము పుట్టెను. అంత దుర్ధర్షుండగు నింద్రజిత్తు, దనసైన్యము శత్రువులచేఁ బీడితమై విషాదమునొందియున్నదని విని యాహోమకార్యము సమాప్తముగాఁ జేసి తీఱకమునుపే నియమమునుండి లేచెను. ఇంద్రజితుఁడు క్రుద్ధుఁడై, దట్టముగాఁ గ్రమ్మియుంధకారమువలెనున్న వృక్షసమూహమునుండి రాక్షసుల తోడ వెలువడి, ఆయుధసహితమై పూర్వమె గుఱ్ఱములు పూన్చియున్నరథము నారోహించెను. ఆయింద్రజిత్తు బెడిదమైనవిలు కేలందాల్చి వర్షాకాలమేఘముంబోలె మేను నల్లనై భీకరముగాఁజూపట్ట, కోపంబున మొగము జేవురింపఁ గన్నులెఱ్ఱఁబాఱ లోకనాశముసేయు మృత్యువువలెఁ బొలిచెను. ఆయింద్రజిత్తు రథమునెక్కుటను జూచినంతనే, భయంకరవేగులై లక్ష్మణునితో యుద్ధమున కాయిత్తులైయున్న రాక్షసులసేనయంతయు నతనిని బరివేష్టించి నిలిచెను. ఆసమయమునఁ బర్వతాకారుండును పగవారి పీఁచమడంచువాఁడునగు హనుమంతుఁడు మిక్కిలియుఁ జెనకరానియొంకపెనువృక్షము నెత్తి దానిచే నారాక్షసులసేనను గొట్టి ప్రళయకాలాగ్నివలెఁ గాల్చి, మరల బెక్కువృక్షములచే నాసైన్యమును యుద్ధమున మూర్ఛిల్లునట్లు గావించెను. అట్లు వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు, నురవడిగా, రాక్షససేనల నుఱుమాడుచుండుటంజూచి రాక్షసులు వేలకొలఁది నతనిం జుట్టుముట్టిరి. రాక్షసులు పర్వతాకారుఁడగు హనుమంతుఁ జుట్టుముట్టి వాఁడి శూలములం దాల్చినవారు శూలములను, ఖడ్గములం బూనినవారును ఖడ్గములను, ఈఁటెయలు దాల్చినవారు ఈఁటెలను, బట్టిసములు పూనినవారును పట్టిసములను, మఱియు పరిఘములను గదలను వాఁడులై చూపట్టుచక్రములను వందలకొలఁది ఘ్నులను నినుపగుదియలను బెడిదములగు గండగొడ్డండ్రను, భిండివాలములనును, వజ్రసమానకఠినములగు ముష్టులను, పిడుగులనంటి యఱచేతులను, అన్యోన్యాయుధములందు తేఱుగడయైన వారన్యోవానినిగొని గిట్టి ప్రహరించిరి. హనుమంతుఁడు మిక్కిలి క్రుద్ధుఁడై వారలం దఱితోను మహాయుద్ధముగావించెను. పర్వతాకారుఁడును పగవారిరూపుమాపువాఁడును పవమానపుత్త్రుఁడునగు నాకపిశ్రేష్ఠుఁడు హనుమంతుఁడు రాక్షసులను రూపుమాపుచుండుట నింద్రజిత్తు చూచెను. ఆయింద్రజిత్తు సారథినిజూచి 'ఇఁక నీ వానరు నినుపేక్షించినయెడల వీఁడు మన రాక్షసులనెల్ల రూపుమాపివైచును. కాన వీని పైకి రథముతోలుము' అని యానతిచ్చెను. అతఁడిట్లు చెప్పఁగా సారథి రథమునుదోలి యందుమిక్కిలియు దుర్ధర్షుఁడై కూర్చుండియున్న యింద్రజిత్తును హనుమంతుఁడున్న యెడకుం జేర్చెను. దుర్ధర్షుఁడాయింద్రజిత్తు,హనుమంతునిఁ దారసించి,యతనిశిరస్సుపై బాణములను ఖడ్గములను పట్టిసములను పరశ్వధములను వర్షించెను. హనుమంతుఁడు బెడిదములయిన యాయాయుధముల కన్నిటికిని సహించి మిక్కిలియు రోషావేశమున నాయింద్రజిత్తుంజూచి 'దుర్బుద్ధీ! నీవు రావణుకొడుకవుగదరా! నీవు పిఱికివిగాక

శూరుఁడవగుదువేని, యుద్ధము సేయుము. వాయుకుమారుఁడగు హనుమంతునెదుటం బడి మఱల బ్రతికిపోఁజాలవు. దురాత్మా ! నీవు నాతో ద్వంద్వయుద్ధము సేయుదువేని, బాణములు విడిచి బాహువులచే నాతోఁ బోరాడుము చూతము. అప్పు డా ద్వంద్వయుద్ధమున నాయురవడి సహింపుము. సహింతువేని నీవు రాక్షసోత్తముఁడవురా !' అనెను. విభీషణుఁడు లక్ష్మణునికి, నింద్రజిత్తు విలునెత్తి హనుమంతునిఁ జంపనున్నాఁడని తెలిపి యతనితో 'దేవేంద్రునంతటివానిని గెలిచి రావణుని కడుపునంబుట్టి ప్రసిద్ధిగాంచినయీయింద్రజిత్తు రథమునారోహించి హనుమంతుని వధింపఁ దివురుచున్నాఁడు. కాన యుపేక్షింపవలదు. లక్ష్మణా! కరవీరపత్త్రాదులగు నానా విధములగు ససమానములైన సన్నివేశములుగలిగి, శత్రువులమర్మములను భేదించుచు జీవితముల రూపుమాపునట్టి ఘోరబాణములు ప్రయోగించి యీ యింద్రజిత్తును జంపుము ' అనెను. ఇట్లు శత్రుభీషణుఁడగువిభీషణుఁడు చెప్పఁగా, నపుడు మహానుభావుఁడగు లక్ష్మణుఁడు పర్వతాకారుఁడును భయంకరబలుఁడునై సింహనాదము సేయుచు రథమెక్కి యుద్ధమునకు సన్నద్ధుఁడై వచ్చియున్న యా యింద్రజిత్తుఁ జూచినవాఁడయ్యె. ఇది యెనుబదియాఱవ సర్గము.

— ✧ —

విభీషణుఁడు లక్ష్మణునకు నింద్రజిత్తు హోమస్థానమైన నికుంభిలన్యగ్రోధమూలమునుజూపి వాఁడా న్యగ్రోధమును బ్రవేశింపకమునుపే వానిని వధింపవలెనని చెప్పుట; ఇంద్రజిత్తు తనమర్మములు లక్ష్మణునకుఁ జెప్పినందులకై విభీషణుని నిందించుట; విభీషణుఁ డతనికి ప్రత్యుత్తరములిచ్చుట.

ఆవిభీషణుఁడు లక్ష్మణున కిట్లుచెప్పి యిఁక నింద్రజిత్తు హతుఁడగునని సంతుష్టుఁడై ధనుర్ధరుఁ డగులక్ష్మణునిం దోడ్కొని త్వరితముగాఁ బోయెను. విభీషణుఁ డట్లు కొంతదూరముపోయి, యొకమహావనమును బ్రవేశించి, యచట నింద్రజిత్తు హోమమును జేయునాస్థానమును లక్ష్మణునకుఁ జూపెను. మహాతేజుం డయినరావణానుజుఁడు విభీషణుఁడు, మేఘమువలె నల్లనై భయంకరముగాఁ జూపట్టుచున్న నికుంభిలాన్యగ్రోధవృక్షమును జూపి యతనితో 'బలవంతుఁడగు రావణపుత్త్రుఁ డింద్రజిత్తు ఇచ్చోటనే భూతములకు బలియొసఁగి, యటుపిమ్మట యుద్ధమునకు వచ్చును. అంత నారాక్షసుఁడు సమస్తభూతములకును నదృశ్యుఁడై యుద్ధంబున శత్రువులవధించును; మేటిబాణములచే బాధింపను బంధించును. ఆయింద్రజిత్తు న్యగ్రోధమువృక్షమును జొచ్చినచో, పిదప రథాశ్వసారథులతోఁగూడ నదృశ్యుఁడగును. కాన యతఁడు న్యగ్రోధమును బ్రవేశింపకమునుపే యీబలవంతుని రథముతోడను గుఱ్ఱములతోను సారథితోనుంగూడ వాఁడిబాణములఁ జక్కాడుము' అనెను.

మహాతేజుఁడైన యాలక్ష్మణుఁడు మిత్త్రుల కానందము గూర్చువాఁడుగాన మిత్ర మగు విభీషణునివాక్యమునకు వల్లెయనిచెప్పి, యాన్యగ్రోధముకడ చిత్రంబగు ధనువును సారించుచు యుద్ధార్థమై నిలిచియుండెను. అంత మహాబలుఁడగు రావణపుత్త్రుఁ డింద్రజిత్తు కవచముదొడిగి, విలుదాల్చి, యగ్నివలె వెలుంగునదై ధ్వజాలంకృతమగు రథమునొంది లక్ష్మణునకుఁ బొడకట్టెను. మహాతేజుండగు లక్ష్మణుఁడు, అదివఱకుఁ బరాజయమునొంది యెఱుఁగని యాపులస్త్యవంశజుని నింద్రజితునింజూచి 'నిన్ను యుద్ధమునకుఁ బిలుచుచున్నాను. నాకు మాయసేయక లెస్స యుద్ధమొసంగుము' అనెను. లక్ష్మణుఁడిట్లు చెప్పఁగా, మహాతేజుండును దృఢమనస్కుండునగు నాయింద్రజిత్తు అచట విభీషణుఁడు నుండుటనుజూచి పరుష వాక్యమున నతనితో 'విభీషణా! నీవిచటనే పుట్టి పెరిఁగినవాఁడవు. మఱియు నా తండ్రికి చక్కఁదమ్ముఁడవు. నాకుఁ బినతండ్రివి. పుత్త్రుఁడ నయిననావిషయమై ద్రోహ మెట్లు గావించెదవు? రాక్షసుఁడవుగాఁ బుట్టియు సజాతీయుఁడనియుఁ జూడక పోయితివి. దురాత్మా! ధర్మదూషణా! నీకు బంధుత్వముగాని, స్నేహముగాని,కులముగాని, తోఁబుట్టుఁదనముగాని, ధర్మముగాని ప్రమాణము కాదయ్యె. వానికట్టున నిలువక పోయితివి. దుర్బుద్ధీ! నీవు నీస్వజనమును దిగవిడిచి, పరులకు భృత్యుఁడవయితివి. కాన బంధువులకు నీగతి జాలిగొలుపుచున్నది. సత్పురుషులకు నీవు నిందనీయుఁడవయితివి.స్వజనులనడుమ నుండుటయెక్కడ? నీవుగా పరుల నాశ్రయించుటయెక్కడ? ఈ రెంటికి నెంతో వాసియున్నది. నీబుద్ధి తుచ్ఛమైనది గావున యది నీకుఁ దెలియ లేదు. 'నే నాశ్రయించినపరులు నీచులుగారు గాన నీచత్వము లే' దందువా? పెఱవారు గుణవంతులయిననుగానీ, తమవారు గుణహీనులేకానీ, ఎట్లును గుణహీనులయిన తమవారేమేలు. ఎప్పటికిని పెఱవాఁడు పెఱవాఁడేకాని తనవాఁడుగాఁడు. ఎవ్వఁడు తనపక్షమువానిని వదలి పరపక్షము నాశ్రయించునో వాఁడు తనపక్షమువారందఱును నశించిన వెనుక తానాశ్రయించిన పరపక్షముచేతనే హతుఁడగును. రాక్షసా! రావణానుజా! నాహోమము విఘాతమగునట్లు లక్ష్మణుని న్యగ్రోధమును జొప్పించితివే! ఇటువంటి నీదయమాలిన కటికితనము, స్వజనులయెడ బంధుఁడవై యుండి నీవెక్కఁడవే యిట్లు కఠినముగా చేయఁజాలితివిగాని మఱియొక బంధుఁడు తెగించి చేయఁజాలఁడు' అనెను. అన్నకొడుకగు నింద్రజిత్తిట్లు చెప్పఁగా విభీషణుఁడు 'రాక్షసరాజకుమారా! దుష్టా! రాక్షసా! నీవు నాశీలము దెలిసియుఁ దెలియనివానివలె నేఁ డిట్లు కారులు ప్రేలెదవు. పినతండ్రినిగాన నీకుఁ బెద్దనగుటంబట్టి నన్నిట్లు పరుషములాడఁదగదు. నేను క్రూరకర్ములగు రాక్షసులకులమునఁ బుట్టినవాఁడనయినను, నాశీలము రాక్షసులకుంబోలె క్రూరముగాదు; అక్రూరమైనది. శీలంబనెడి యీనాగుణము, సత్పురుషులకు ముఖ్యమైనది.ఆశీలమునే చెప్పెద. క్రూరమైన కార్యమును జేయుటకుఁగాని పరపీడనము సేయుటకుఁగాని అధర్మమును సేయుటకుఁగా

ని నాకు వేడుక గలుగదు.ఇట్లు నాశీలము వేఱగుటచే మిమ్ము విడిచితిని.ఇది దోషమం దువేని నాయందేకాక రావణునియందును గలదు. లేనిచో నాసోదరుఁడు తనశీలము పేక్షయినందుచే 'ధీఘాన్ము' అని తనసోదరు నెట్లు నిరసించిపుచ్చును. తనశీలము వేఱ గుటంబట్టికదా నన్నిట్లు చేసినాఁడు ? మఱి రావణుని విడిచినందులకు హేతువులు వినుము. ధర్మము వదలినశీలముగలవాఁడై పాపమునే సేయ నిశ్చయించియున్న పురుషుని కూడికవలనఁ దనకును బాపముగలుగును. యోగ్యుఁడగువాఁడు చేతికిఁజుట్టి కొన్న సర్పమును విదిర్చివైచినట్లు, ఆదుర్మార్గునిఁ బరిత్యజించి సుఖము నొందవల యును. హింస, పరధనము హరించుట, పరదారగమనము, ఈదురాచారములుగల వానిని, కాలుచున్న గృహమును వదలునట్లు తోడనే వదలివేయవలయునని పెద్దలు చెప్పుదురు. పరధనముల నపహరించుటయు, పరస్త్రీలంబొందుటయు, సుహృదుల యినవారియందు మిక్కిలి శంకగలిగియుండుటయు ననెడి యీమూఁడుదోషములు పురుషుని నాశముగలిగించునవి. 'దోషములచే రావణుఁడు త్యాజ్యుఁడేని యభిజనవి ద్యాదిగుణములచే నట్లె గ్రాహ్యుఁ డేలకాఁడు? ' అందువా ? మహర్షులను ఘోర ముగా వధించుటయు,సమస్తదేవతలతోను జగడము పెట్టుకొనుటయు, గర్వమును, దీర్ఘకోపమును, బద్ధవైరమును, పరశ్రేయస్సును ద్వేషించుటయు, ననెడి యీదో షములు, ఐశ్వర్యమును జీవితమును నాశముసేయునట్టివి; మఱి మేఘములు పెనుపర్వ తములనుగూడ నావరించునట్లు, ఎంతటి గొప్పగుణములనుగూడ నాచ్ఛాదించివైచు చున్నవి.నీతండ్రియగు నాయన్న రావణుఁ డిట్టిదోషములతోఁ గూడినవాఁ డగుటంబ ట్టియె నతనిని దిగవిడిచితిని. రాక్షసా! ఇంక శీఘ్రముననె యీలంకయు నిందలి రాక్ష సులునుండరు.అతిగర్వితుఁడును బాలుఁడు దుష్టుండునగు నీవునుండవు.నీతండ్రియు నుం డఁడు.నీవు మృత్యుపాశమునం దగులుకొనియున్నావు.నన్నేమియాడెదవు? యాడుము. నీకిదె మరణవిపత్తి ప్రాప్తించియున్నపుడు నన్ను నూరకనిందించుటచే ప్రయోజన మేమి? నిందించి చచ్చుటేకాని సాధించుట యేమియు లేదుగదా. రాక్షసాధమా ! న్యగ్రోధవృక్షమును జొచ్చుట కింక నీకు శక్యముగాదు. కాకుత్స్థకులులగు రామ లక్ష్మణులను నిట్లు ధర్షించితివి గావున నిఁక బ్రతుకుటయు నీకలవిగాదు.మనుష్యనా థుఁడగు లక్ష్మణునితో యుద్ధముసేయుము.హతుఁడవై యమలోకమున యమదూత లాజ్ఞాపించుకార్యములను జేయుచుండెదవు. నీవు పూనినబలమంతయుఁ జూపుము. నీకుం గలసమస్తాయుధములను సమస్తబాణములను బ్రయోగించి కాఁజేయుము. నీవేమిచేసినను, నిపుడు లక్ష్మణునిబాణములబారిం బడి నీవును నీసైన్యమును నెంత మాత్రము ప్రాణములు దక్కించుకొని పోఁజాలరు' అనెను. ఇది యెనుబదియే డవసర్గము.

లక్ష్మణుఁడును నింద్రజిత్తును పరస్పరము వీరాలాపములాడు
చు నొండొరుల బాణప్రయోగములచే నొప్పించుట.

ఇంద్రజిత్తు విభీషణునివచనములు విని, మిక్కిలియు క్రుద్ధుఁడై ఖడ్గాద్యా యుధములు చేపట్టి, చక్కఁగా నలంకృతమై నల్లనిగుఱ్ఱములు పూన్పంబడియున్న మహారథముపైని ప్రలయకాలాంతకునివలె భయంకరుఁడై చూపట్టుచు, అతిదీర్ఘమై విశాలమై మహావేగమును మంచిచేవయుఁ గలబెడిదంపుధనువు నెత్తి పగవారిని గూల్చునట్టి వాఁడిబాణములను గ్రహించి వేగమున నభిముఖముగాఁబోయి పరుష వాక్యముల విభీషణునింజూచి పలికెను. రథంబెక్కి చక్కఁగా నలంకృతుఁడై యున్న బలవంతుఁడును మేటివిలుకాఁడునగు నాయింద్రజిత్తు, నిజతేజముచేతనే యలంకృ తుఁడై పగవారి రూపుమాపువాఁడై, బంగారువన్నెగల * హనుమంతునివీఁపునం గూర్చుండి యుదయపర్వతముపైనున్న సూర్యునివలెఁ దేజరిల్లుచున్న రామానుజుని లక్ష్మణునింజూచెను. ఇంద్రజిత్తు సంరంభమున లక్ష్మణుని విభీషణునిని ఆవానరసింహ ములనుంజూచి,'ఇంక నాపరాక్రమము చూడుఁడు. ఇప్పుడు యుద్ధమున నాకాశము ననుండి గురియువర్షమువంటిదై యెట్టివారికి దారసింపనట్టు నావింటినుండి విడివడు బాణవర్షమును వారింపుఁడీ నూతము. ఇప్పుడు నాబాణములు, ఈ నానుహాధనువు నుండి విడివడినవై దూదిజొంపము నగ్గియుంబోలె మీగాత్రములను దహింపఁగలవు. ఇప్పుడు మిమ్మందఱను తీక్ష్ణములయిన బాణములచేతను శూలములచేతను శక్తుల చేతను యష్టులచేతను తోమరములచేతను గాత్రములు ఛేదించి యమలోకము నకంపెదను. హస్తలాఘవము మిక్కిలియుఁ గలవాఁడనుగాన యుద్ధమున బాణము లవర్షముగురియుచు మేఘమువలె గర్జించుచుండఁగా, నాయెదుట నెవఁడు నిలువఁ గలఁడు? మున్ను రాత్రియుద్ధమునందు, మీయిద్దఱను మీతోడవచ్చినవారలను, నేను వజ్రాశనులవంటి బాణములచే, మూర్ఛితులయి నేలంబడినట్లు గావించితిని. క్రు ద్ధమయిన కాలసర్పమువంటి నాతో మరల యుద్ధము సేయవచ్చితివే! కాన నీవారా త్రియుద్ధము మఱచిపోయితివో, లేక నీకు మరణకాలమే దాపరించెనో యనితలంచె దను'అనెను. ఆరాక్షసవర్యుండగు నింద్రజితుఁడు బిగ్గఱ నాడినమాటవిని లక్ష్మణుఁడు, ముఖమున నెంతమాత్రమును భయవికారమునొందక క్రుద్ధుఁడై యతనితో 'రా క్షసా! నీవు మమ్ము యమునింటికిఁబంపుట మొదలగువానిని, నీకుఁ జేయ నలవిగాని కార్య ములను, నోటిమాటలచేఁ జేసి నిర్వహించితివే కాని, కార్యములచే నిర్వహింపవు. ఎవ్వఁ డు వ్యర్థముగా బీరములాడక కార్యముల నాచరించి నిర్వహించునో యతఁడే బుద్ధి మంతుఁడుగాని నీవుగావు. నీవు దుర్బుద్ధివే! దుష్టబుద్ధీ! నీవు కానునకును గొఱగాని వాఁడవు. మమ్ముజయించుట యెట్టివానికి సాధ్యముగాదు. ఇట్టినీవు అట్టిమమ్ము జయిం

* దీనిచే హనుమంతుఁడు పూర్వము రాక్షసులతో యుద్ధముచేసి యింద్రజిత్తు రాఁగానే లక్ష్మ ణుని వీఁపున నెక్కించుకొనెనని తెలియునది.

చువిషయమై చేతఁగానివాఁడవయినను జయించెద ననుమాట మాత్రమును
జెప్పి దానం గృతార్థుఁడ వయితివని తలంచెదవు. 'నాపరాక్రమము మున్ను చూచి
యుండలేదా'యందువా? అప్పుడు రాత్రియుద్ధమునందు నీవు మాకుఁ గనఁబడక యం
తర్హితుఁడవై యుద్ధము చేసితివే! అది దొంగలు చేయుపద్ధతిగాని వీరు లాచరించు
మార్గము గాదు. రాక్షసా! నేను నీబాణములకు గుఱిగా నీయెదుట నిలిచియున్నాను
నీవు నిప్పుడు నీయుప్పటి తేజమును జక్కఁ జూపుము. ఊరక వట్టిమాటలచే నిన్ను నీవే
పొగడికొనెదవేల?' అనెను. పెక్కుయుద్ధముల గెలుపుగొనియున్న మహాబలుఁ
డింద్రజితుఁడు, లక్ష్మణుఁ డట్లు చెప్పినదివిని, బెడిదమయినవింటిని సారించి వాఁడిబాణము
లను విడిచెను. మహావేగములై సర్పవిషముంబోలె ఘోరములు నగు నాబాణ
ములు ప్రయుక్తములై నిట్టూర్పులుపుచ్చుచున్న సర్పములుంబోలెఁ బోయి లక్ష్మ
ణుని దేహమునాటి నేలంబడినవి. యుద్ధమున వేగవంతుఁడగు రావణపుత్త్రుఁ డింద్ర
జిత్తు, శుభలక్షణుఁ డగు లక్ష్మణుని మిక్కిలియు వేగముగల బాణముల నెంతయుం
గ్రుచ్చి నొప్పించెను. శ్రీమంతుఁడగు నాలక్ష్మణుఁడు అవయవములందెల్ల బాణములు
మిక్కిలియుఁ గ్రుచ్చుకొనియుండ, నెత్తుటఁ దొప్పందోఁగి, పొగలేని యగ్గివలెఁ బ్రకా
శించెను. ఇంద్రజిత్తు తాను గావించినకార్యముంజూచి యది లక్ష్మణునొప్పించి సఫ
లమగుటయుఁ దెలిసి, మిక్కిలియు బిట్టుగా ధ్వనిగలుగునట్లు, సింహనాదము సేసి
యతనితో * 'లక్ష్మణా! తెక్కలుగట్టంబడి వాఁడిమొనలుగలిగి, ప్రాణములను గడ
ముట్టించు బాణములు, నావింటినుండి విడివడి, యిపుడు నీప్రాణములను గ్రహింపఁ
గలవు. ఇపుడు నాచేత హతుఁడవై మృతుండవగు నీదేహముపయిని నక్కలును డేగ
లును గద్దలును గుంపులు గుంపులుగా వచ్చి పట్టి తినఁగలవు. మిక్కిలియు దుర్బుద్ధి
యగు రాముఁడు, క్షత్త్రియాధముఁడును అపూజ్యుఁడును తనకు భక్తుఁడును తోఁబుట్టు
వునగు నీవు, ఇదిగో నాచేత హతుఁడవు కాఁగాఁ జూడఁగలఁడు. లక్ష్మణా! నేను నిన్ను
వధింపఁగా, కవచము విఱిగి విలుదునిసి తలపోయి నేలంబడి యున్న నీదు మొండెము నిప్పు
డు రాముఁడు చూడఁగలఁడు' అనెను. ఇట్లు ఇంద్రజిత్తు సంరంభించి పరుషముగాఁ బ
లుకుచుండుటనుజూచి లక్ష్మణుఁడు యుక్తియుక్తమును అర్థవంతమును నగు వాక్యముల నత
నితో 'దుర్బుద్ధీ! రాక్షసా! నీనోటిపదటము వదలుము. నోటిచే వట్టిబీరములు
వలదు. నీవు బెట్టిదములగు కార్యములు చేసినవాఁడవే కాని యిప్పుడు దానిని నోటం
జెప్పికొననేల? బాహుబలమునఁ జక్కఁగార్యము చేసి దానిని సాధింపుము. రాక్షసా!
కార్యము చేసిచూపక, యూరక నిన్ను నీవే పొగడికొనుటవలన నేమిగలదు. నేను
నీపేలినది నిజమని నమ్మునట్టి కార్యము గావించి చూపుము. పురుషాధమా!

---

* ఇందులకు 'నీబాణములు తీక్ష్ణములైనవి. నేను బ్రయోగించునవి మొక్కవోయినబాణములు. కాఁబట్టి ప్రాణనాశకరములగు నీబాణములు, నాప్రాణములం గొనఁగలవు' అని వాస్తవార్థము. మహేశ్వరతీర్థులు. ఇట్లె తక్కినవాని నూహించుకొనునది.

నేను పరుషములాడకయే, కొంచెమైన నాక్షేపింపకయు, ఆత్మస్తుతిచేసికొనకయు, నిన్నిపుడు వధించి పుచ్చెదను చూడుము' అనెను. ఇట్లు పలికి, లక్ష్మణుఁడు, తీక్ష్ణములును మహావేగములు నగునయిదుబాణములను ఆకర్ణాంతముగా వింటి నాకర్షించి యింద్రజిత్తుఱొమ్మునఁ గాఁడనేసెను. మంచిఱెక్కలు గలిగియుండుటచే మహావేగములైన యాబాణములు సర్పములవలె జ్వలించుచు, నారాక్షసునివక్షమున సూర్యకిరణములవలె వెలింగెను. అట్లాలక్ష్మణునిచే బాణములం గొట్టువడి యింద్రజిత్తు,కుపితుఁడై, మూఁడుబాణములను గుఱితప్పకుండునట్లు చక్కఁగా లాగి ప్రయోగించి లక్ష్మణుని నొప్పించెను. అప్పు డట్లు నరసింహుఁడును రాక్షససింహుఁడునగు లక్ష్మణుఁడును నింద్రజిత్తును నొకరినొకరు జయింపంగోరి, యుద్ధమున దొమ్మిగా నొండొరులం దోఁపురాపాడుట భయంకరమై యొప్పెను. ఇంద్రజిత్తును లక్ష్మణుఁడు నిరువురును బలవంతులు; ఇద్దఱును సహజపరాక్రమశాలురు; ఇద్దఱును చక్కఁగా పరాక్రమము నెఱపఁగలవారు; ఇద్దఱును సమస్తశస్త్రాస్త్రములందును ఆఱితేఱినవారు. ఇరువురును నెట్టివారికి జయింపనలవిగానివారు; అసమానబలతేజములుగలవారు. అప్పుడు ఆవీరులిరువురు, ఆకాశమండలి గ్రహములుపోరినట్లు యుద్ధము సేసిరి. అప్పుడు యుద్ధమున నెట్టివారికిని నెదిరింప నలవిగానిమహాత్ములగు నాయిరువురు నెంతమాత్రమును భయమునొందక వృత్రుఁడును దేవేంద్రుఁడునుంబోలె,సింగములచందమునను బోరాడిరి. ఆమనుజసింహుఁడును రాక్షససింహుఁడు నిరువురు,పిఱుదివియక నిలిచి పెక్కు బాణజాలములను నొండొరులపయిం బ్రయోగించుచు, మిక్కిలియుబ్బున యుద్ధము గావించిరి. నరోత్తముఁడగు లక్ష్మణుఁడును రాక్షసోత్తముఁడయిన యింద్రజితుఁడును మిక్కిలియు హర్షమున విండ్లను బాణములనుదాల్చి యొండొరుల జయింపఁ దమకపడుచు, మేఘము లవ్వారిగా జలమువర్షించునట్లు ఒకరిపైనొకరు మిక్కిలియు బాణజాలములను బ్రయోగించిరి. యుద్ధంబునం దాఱితేఱినవారై చండములగు బాణములును ఖడ్గములను వాఁడియగు నితరాయుధములనుం దాల్చి యున్నమహాబలులగు నింద్రజిల్లక్ష్మణులు మహాయుద్ధమున బీరంబులు పెచ్చుపెరిఁగి, శంబరుఁడును నింద్రుఁడునుంబోలె మిక్కిలి బెట్టిదముగా నొండొరులం గొట్టుచుఁ బోరాడిరి. ఇది యెనుబదియెనిమిదవ సర్గము.



{ఇంద్రజిత్తును లక్ష్మణుఁడును బాణసమూహము లేయుచు నొండొరులకవచములు భేదించి మహాయుద్ధముగావించుట.}

అంతం బగవారిని స్రుక్కించు లక్ష్మణుఁడును, క్రుద్ధుఁడై కృష్ణసర్పమువలె నిట్టూర్పులుపుచ్చుచు, నొకబాణమును వింటఁగూర్చి యింద్రజిత్తుపైఁ బ్రయోగించెను. ఇంద్రజిత్తు, ఆలక్ష్మణునియల్లెత్రాటి పెనుచప్పుడునువిని, మొగము వెలువెలఁబోవ లక్ష్మణునిం బొడఁజూచెను. రావణపుత్త్రుఁడగు నారాక్షసుఁడు మొగము వెలు

వెల్లనై యుండుటనుజూచి, విభీషణుఁడు, యుద్ధతత్పరుఁడై యున్న లక్ష్మణునితో 'మ హాబాహూ ! ఇంద్రజిత్తునందుఁ గలముఖవైవర్ణ్యము మొదలగు నిమిత్తములం జూడఁగా వీఁడు భంగమునొందెనని నిస్సంశయముగాఁ దెలియుచున్నది. కాన వీనిం జం పుటకు వేగిరపడుము' అనెను. అంత లక్ష్మణుఁడు, అగ్నిజ్వాలలవలె వెలుంగుచున్నవై మహావిషంబులగు సర్పములవలె ఘోరములైన వాఁడిబాణములను వింటనంధించి యింద్రజితునిపైఁ బ్రయోగించెను. ఇంద్రునివజ్రాయుధముంబోని కఠినంపుఁదాఁకు గల బాణములచే లక్ష్మణుఁడు గాఁడనేయఁగా నింద్రజిత్తు నొచ్చి, యింద్రియము లన్నియుఁ గలంగ కొంతసేపు మూర్ఛనొందెను. వీరుఁ డాయింద్రజిత్తు, ముహూర్త మునకు నింద్రియములు మరల కుదుటంబడ, దెలివినొంది, తనయెదుట యుద్ధము నకై కాచి నిలిచియున్న వీరుని దశరథకుమారునిఁ గనెను. ఆయింద్రజిత్తు కోపంబునఁ గన్నెఱ్ఱఁబాఱి,లక్ష్మణునివైకినడరి,యతనిం దారసించి మరలఁబరుషముగా నతనితో'నీ వును నీయన్నయు బాణపాశములచే బద్ధులై యుంటిరే; యామొదటియుద్ధమునమిమ్ము బంధించిన నాపరాక్రమమును మఱచితివాయేమి ? అప్పుడు నేలంబడి పొరలుచుం టివే? ముందు మొదటియుద్ధమున మీయిద్దఱను మీపరివారమునను వజ్రాయుధ ముంబోని బాణములచే తెలివిదప్పి క్రిందఁబడునట్లు గావించితినిగదా. అట్లు నాప రాక్రమమును దెలిసియు నీవు నన్ను నెదిరింపఁగోరుటనుజూడఁగా, నీవు మున్నుపడిన భంగము మఱచిపోయితివని కాని లేక యమలోకమునకుఁ బోవఁ దివురుచున్నావని కా ని స్పష్టముగాఁ దోఁచుచున్నది. నీవు మొదటియుద్ధమున నాపరాక్రమమును జూడ కున్నయెడల నిప్పుడు నీకుఁ జూపెదను. వెనుదీయక యిపుడు నిలుపుము' అనెను. ఇంద్రజిత్తు ఇట్లుచెప్పి యేడుబాణముల లక్ష్మణునిని, వాఁడి మొనలుగల పదిమేటి బాణముల హనుమంతుని నొప్పించెను. అంత వీర్యవంతుఁడగు నింద్రజిత్తు, లక్ష్మణా దులవలని కోపమునకంటె విభీషణునివలన నినుమడియగుకోపమున సంరంభము నిను మడింప, ఆకర్ణపూరితములై గుఱిదప్పనట్లు నూఱుబాణములేసి యాతనిఁ గాఁడఁ జేసెను. అపు డింద్రజిత్తుచేసిన యాకార్యమునుజూచి, పురుషతిలకుఁ డాలక్ష్మణుఁడు దానిని లెక్కసేయక వెడనవ్వునవ్వుచు 'ఇది కొంచెమేని పనికిరాదు' అనిపలుకుచు ఔట్టిదములయిన బాణములనుదీసి, యింద్రజిత్తుమీఁదఁ బ్రయోగించెను. లక్ష్మణుఁడు యుద్ధమునఁ గ్రుద్ధుఁడై భయమున మొగంబు వెలువెలఁబోక తెంపుతో నింద్ర జితునిం జూచి 'రాక్షసా ! నీబాణము లెంతమాత్రమును సత్త్వలేనిదిగాన తేలిక లై బాధపెట్టక సుఖముగానున్నవిచుమీ! శూరులు యుద్ధమునకుఁ జొచ్చియెందుఁ గాని యింతచులుకనగా ప్రహరింపరు. యుద్ధమున జయముగోరునట్టి శూరులన్నవో యీవిధముగా యుద్ధముసేయరు' అని వానింజూచి పలుకుచు బాణవర్షములు ప యిని గురియించెను. బంగారుచే రంగారుచున్న యాయింద్రజితుని కవచము, లక్ష్మ ణుని బాణములచే తుత్తునియలై యాకాశమునుండి చుక్కలసమూహము రాలు

నట్లు, రథముపై చెల్లచెదరుగా రాలెను. అట్లు యుద్ధమున కవచమునుగ్గై మేనెల్లగం డ్లుపడి నారాచములు నాటియుండుటంజేసి, వీరుఁడా యింద్రజిత్తు వృక్షములు మిక్కిలి మొలచియున్న పర్వతమువలెఁ జూడనొప్పెను. అంత భయంకరపరాక్రముఁ డగు నింద్రజితుఁడు యుద్ధంబునఁ బరమక్రుద్ధుఁడై వీరుండగు లక్ష్మణునిని వేయి బాణములేసి నొప్పించెను. గొప్పదియు దివ్యంబునగు లక్ష్మణుని కవచముగూడ నుగ్గయి పడినది. అట్లు వారిరువురును ఒకరుచేసినదానికి బదులు మఱొకరు సేయుచును నొండొరులపయిం దలపడిరి. అయ్యిరువురును సమస్తావయవములను బాణములచే భిన్నములై దేహమంతయును నెత్తుటం దోఁగుచుండ,బిట్టుగా నిట్టూర్పులు నిగిడించుచుం బోరాడిరి. మహాత్ము లయ్యిరువురువీరులును యుద్ధకర్మములందు పండితులు గావున మిక్కిలియుఁ జాలసేపు నొండొరులను వాఁడిబాణముల భంజించిరి. అప్పుడు భయంకరపరాక్రములగు నయ్యిరువురు నొండొరుల జయింపఁ బ్రయత్నపడుచు నొండొరుల బాణములు మేనెల్ల నెరసియుండ నొండొరుల కవచములను ధ్వజములను ఖండించి, సెలయేళ్లు జలమునుంబోలె వేఁడినెత్తురు దొరుఁగుచునుండిరి. ఆకాశమునందు ప్రలయకాల నీలమేఘములు జడివానలు గురియునట్లు, వారిరువురును భయంకరధ్వనిగా నొండొరులపై ఘోరమగు బాణవర్షములుగురియుచు నిట్లు బోరాడుచుండఁగా చాలఁగాలము గడచినది. కాని వారిరువురకును యుద్ధమునకు వెనుదీయుటఁ గాని యాయాసముగాని కలిగినదిగాదు. అస్త్రవేత్తలలో నుత్తములగు నాయిరువురు, మాటికి నొండొరులపయి దివ్యాస్త్రములం బ్రయోగించుచు, నానావిధములయిన బాణములను నాకాశమునందంతయు నిండఁగట్టినట్లు పరఁగించిరి. లక్ష్మణుఁడును నింద్రజితుండును, మోసపోకయు చుల్కఁగాను చిత్రముగాను జక్కఁగాను, నొండొరులపై బాణములేయుచు నుభయలును బెట్టిదముగ ద్వంద్వయుద్ధము గావించిరి. ఆయిరువురి యల్లెత్రాటిచప్పుళ్లు జనులనెల్ల వడవడంకించుచు, పిడుగుపాటువలె భయంకరమై బిట్టుగా వేఱువేఱ వినంబడినవి. అప్పుడు అయ్యిరువురు యుద్ధము సేయుచుండఁగా, ఆకాశమున గర్జించుచున్న యతిఘోరములగు రెండుమేఘములధ్వనియుంబోలె మహాధ్వని చెలంగినది. జయము నొందవలెనని గట్టిపూనికతో యుద్ధముసేయుచున్న కీర్తిమంతులగు నాబలవంతు లిరువురును బంగారుపింజలుగల బాణములచే మేనెల్ల గండ్లుపడుటచే నెత్తురు మిక్కిలియుఁ దొరిఁగినవారయిరి. బంగారుపింజలుగల యాబాణములు,యుద్ధమున వారిరువురగాత్రములంజొచ్చి నెత్తుటితోఁదడిసి వెలువడి భూతలముం బ్రవేశించినవి. ఆయిరువురును బ్రయోగించిన బాణములలో వేఱు కొన్ని యాకాశమునఁ బఱచునపుడు మిక్కిలియు వాఁడియగు నాయుధములచేఁ దాఁకుడుపడినవి. మఱి కొన్ని బాణములు ఇతరబాణములను వేలకొలఁదిని భంజించియు ఛేదించినవి. ఆపోరు ఘోరమయ్యెను. అందు నయ్యిరువురును బ్రయోగించు బాణసమూహము, సత్రమునందు జ్వలించుచున్న, గార పత్యా

హవనీయాగ్నిహోత్రముతోఁగూడిన దర్భసమూహమువలె నొప్పెను. ఆ మహాత్ముల దేహములు గాయములుపడియుండుటచే వసంతమందు ఎఱ్ఱనిపువ్వులతో నిండి యాకులేలేకయున్న ఖూరుగు మోదుగుచెట్లుంబోలెఁ బ్రకాశించినవి. ఇంద్రజిత్తును లక్ష్మణుఁడు ఒకరినొకరు వధింపఁ దలఁచుచు మాటిమాటికి బెట్టిదంబుగా దొమ్మి యుద్ధమును గావించిరి. యుద్ధమున లక్ష్మణుఁ డింద్రజిత్తును ఇంద్రజిత్తు లక్ష్మణునిఁగాని ట్లొకరి నొకరు ప్రహరించుచు నెంతపోరినను నెంతమాత్రమును శ్రమమునొందరయిరి. వేగవంతులును మహావీర్యశాలురునగు నయ్యిరువురు, బాణసమూహములు దేహమునఁ గాఁడియుండుటవలన వృక్షములు మొలచిన పర్వతములవలెఁ బ్రకాశించిరి. మిక్కిలియు బాణములచే నావరింపఁబడి నెత్తుటందోఁగియున్న యావీరుల సర్వావయవములు, జ్వలించుచున్న యగ్నిహోత్రములవలె వెలింగెను. అంత నయ్యిరువురు నట్లు చాలసేపుగా యుద్ధము సేయుచుండిరి; కాని వారికి యుద్ధముపయి విసుకుగాని శ్రమముగాని యొంతమాత్రము గలుగదయ్యె. అంత మహాతేజుండగు విభీషణుఁడు యుద్ధాగ్రంబుల నెవ్వరిచేతను బరాజయమునొందని లక్ష్మణునకు యుద్ధమువలని యాయాసముదీర్చ నెంచి యతనికిప్రియ మగుహితము గలిగించువాఁడై యుద్ధరంగమున ముందటవచ్చి నిలిచెను. ఇది యెనుబదితొమ్మిదవసర్గము.

---

విభీషణుఁ డింద్రజితుని పరివారమును జంప వానరవీరులం బ్రోత్సాహపఱచుట; లక్ష్మణుఁ డింద్రజిత్తుసారథిని ప్రమాథి మొదలగువారు వానిరథాశ్వములనుం గూల్చుట.

బలవంతుఁడును శూరుఁడునగు విభీషణుఁడు, మదపుటేనుఁగులుంబోలె, నొండొరులతో యుద్ధము సేయందలపడి యొండొరుల * వధింపంగోరి పోరుచున్న యీయిరువురను మొదటఁజూడంగోరి వారలఁజూచి పిదప దాను యుద్ధము సేయుటకై యుద్ధభూమి నగ్రభాగంబున నిలిచెను. అంత నవ్విభీషణుఁడు యుద్ధరంగమున నిలిచి, యప్పటి కొకగొప్పవింటి నిగోని బిట్టుగా నారిసారించి రాక్షసులపై వాఁడిమొనలు గల మేటిబాణములం బ్రయోగించెను. ఆ బాణములు, అగ్నివలె వెలుంగుచు సూటి దప్పక రాక్షసులందాఁకి పిడుగులు పెనుగొండలను బ్రద్దలువాపునట్లు వారలను విదారించినవి. రాక్షసోత్తములయిన యవ్విభీషణుని సచివులుగూడ యుద్ధమున శూలముల చేతను ఖడ్గముల చేతను పట్టిసముల చేతను, వీరులగు రాక్షసులను ఖండించిరి. అప్పుడు విభీషణుఁడు తనమంత్రులయిన యా రాక్షసులు బలసియుండ, మత్తిల్లి చెలరేఁగుచున్న యేనుఁగుగున్నల నడుమనున్న మదపుటేనుంగువలెఁ జూడనొప్పెను.

---

* విభీషణుఁడు మొదట తానే యుద్ధము సేయ నుద్యుక్తుఁడయ్యెను, వారలయందెవఁడు బలాధికుఁడో తెలియం జూడఁగోరి యూరకుండెననియు, పిదప వారు బలమందు సమానులగుటంజూచి తాను రామునికిం కించిత్కారము సేయుటకై యిప్పుడు యుద్ధమున సద్యుక్తుఁడై నిలిచెననియు భావము.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణము

## వచనము

## యుద్ధకాండము

తృతీయభాగము.

దేవరాజసుధీప్రణీతము.



మద్రాసు.

ఆనందముద్రాయంత్రాలయమునందు

ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెనివారిచే బ్రకటితము.

1913.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# విషయసూచిక

# పటములపట్టిక.

అంత రాక్షసవరుఁడగు విభీషణుఁ డన్యోకాలముల కదియది యుక్తమని యెఱింగిన వాఁడుగాన రాక్షసులతోఁ బోరాడ ప్రియపడుచున్న వానరులను మఱియుఁ బ్రోత్సాహపెట్టువాఁడై యప్పటికిఁదగినట్లు వారితో 'వానరశ్రేష్ఠులారా ! రాక్షసేంద్రుఁడగు రావణునకు నీఁడొక్కఁడే పరమగతియైయున్నాఁడు. రావణునిసైన్యమంతయుఁబోయి వీఁడొక్కండె శూరుఁడు మిగిలియున్నాఁడు. మీరలేల మిన్నకనిలుచున్నారు? పాపాత్ముండగు నీరాక్షసుఁడు రణముఖంబున హతుఁడుకాఁగా, పిదప రావణుఁ డొకఁడుతక్కఁ దక్కిన యతనిబలమంతయు హతమయిన దగుచున్నది. వీరుఁడగు ప్రహస్తుఁడును మహాబలుఁడగు నికుంభుఁడును కుంభకర్ణుఁడును కుంభుఁడును ధూమ్రాక్షుఁ డనురాక్షసుఁడును జంబుమాలియు మహామాలియు తీక్ష్ణవేగుఁడును అశనిప్రభుఁడును, సుప్తఘ్నుఁడును, యజ్ఞకోపుఁడును, వజ్రదంష్ట్రుఁడును, రాక్షసుఁడును, సంహ్రాదియు, వికటుఁడును, నిఘ్నుఁడును, తపనుఁడును, దముఁడును, ప్రఘాసుఁడును, ప్రఘసుఁడును, ప్రజంఘుఁడును, జంఘుఁడును, దుర్ధర్షుండగు నగ్నికేతుఁడును, వీర్యవంతుఁడగు రశ్మికేతుఁడును, విద్యుజ్జిహ్వుఁడును, ద్విజిహ్వుఁడును, సూర్యశత్రుండను రాక్షసుఁడును, అకంపనుఁడును, సుపార్శ్వుఁడును, చక్రమాలి యనురాక్షసుఁడును, కంపనుఁడును, బలవంతులయిన దేవాంతక నరాంతకులును హతులయిరి. మీరు మహాబలవంతులయిన యీరాక్షసోత్తములఁ బెక్కండ్రవధించి సముద్రమును చేతులతో నీఁది దాఁటినవారయితిరి. ఇఁక నింద్రజితుని వధించుట మీ కావుపాదమంతటిస్వల్పమును దాఁటుటయేయగును. ఆస్వల్పమునుగూడ దాఁటివైవుఁడు. వానరులారా ! బలగర్వితులగు రాక్షసులందఱు వచ్చి తలపడి మీచే హతులయిరి. ఈయింద్రజిత్తు ఒకఁడుమాత్రమే మిగత. ఇంతమాత్రమే మీ కిందు జయింపవలసియున్నది. నేను రామునికార్యమునకుఁగాను దయను దొలఁగఁబెట్టి తోఁబుట్టువుకొడుకునయినను జంపిపుత్తును; కాని పినతండ్రినై నాకు కొడుకగువానిని నేనేచంపుట యుక్తముగాదు. నే నింద్రజిత్తును వధింపఁగోరఁగానే కన్నీరు నాకన్నును గ్రమ్మి యడ్డపడుచున్నది. కావున వానిని మహాబాహుఁ డీలక్ష్మణుఁడే యడంచును. వానరులారా! మీరందఱు నొక్కటిగాఁగూడి,యీయింద్రజిత్తునకుఁ దోడ్పడుటకై వీనిచెంతల పొంతల నున్నరాక్షసభటులను వధింపుఁడు' అనెను. ఇట్లు మహాయశస్కుఁడగు నావిభీషణుఁడు ప్రోత్సాహపెట్టఁగా,వానరోత్తము లుబ్బునొంది వాలము లల్లార్చిరి. అంత నావానరసింహములు, ఆప్రోత్సాహమున, మాటిమాటికి సింహనాదములు సేయుచు, మేఘములంజూచి నెమిళ్లు కేకలువేయునట్లు, ఉబ్బు పట్టంజాలక నానావిధములయిన ధ్వనులు గావించిరి. జాంబవంతుఁడును సమస్తములయిన స్వసైన్యములచేఁ బరివృతుఁడై శిలలచేత రాక్షసులంగొట్టి నఖములచేతను దంతములచేతను వారల నొప్పించెను. మహాబలవంతులయిన యారాక్షసులు, అట్లు ప్రహరించుచున్న భల్లూకపతియగు జాంబవంతుని, భయము మాలి యనేకవిధాయుధములం గొని

చుట్టుముట్టిరి. ఆరాక్షసులు, అప్పుడు యుద్ధమున రాక్షససైన్యమును వధించుచున్న జాంబవంతుని, బాణములను కఱకులయిన పరశువులను పట్టిసములను యష్టులను తోమరములనుం గొని నొప్పించిరి. వానరరాక్షసులకుఁ గలిగిన యాదొమ్మి యుద్ధము క్రుద్ధులైన దేవాసురులయుద్ధమువలె మహాధ్వనిగలిగి భయంకరమై చెలంగినది. * వీర్యశాలియగు హనుమంతుఁడును మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై సాలమొకటిఁ బెకలించి వేవురకొలఁది రాక్షసులం దలపడి భయంకరముగా యుద్ధముసేసెను. ఇంద్రజిత్తు పినతండ్రికి మిక్కుటమైన యుద్ధమునొసంగి మరల శత్రువీరుల రూపు మాపెడిలక్ష్మణునిమీఁదికే యడరెను. అపుడయ్యుద్ధమున వీరులై చక్కఁగా యుద్ధముసేయు సుప్రసిద్ధులగు నయ్యిరువురును, బాణవర్షములుగురియుచు నొకరినొకరు నొప్పించిరి. మహాబలవంతులును వేగవంతులునగు నయ్యిరువురు, వర్షర్తువునందు చంద్రసూర్యులు మబ్బులచే మఱుఁగుపడునట్లు, బాణసమూహములచే పలుమాఱు మఱుఁగుపడుచుండిరి. అచట నయ్యిరువురు పోరునపుడు, వారిహస్తలాఘవముంబట్టి యమ్ములపొదినుండి బాణములను దీయుటగాని, వింట బాణమును సంధించుటగాని, వింటిని కుడియెడమప్రక్కలమార్చి పట్టుకొనుటగాని, బాణములను బ్రయోగించుటగాని, ఆకర్ణాంతముగా నారి లాగుటగాని, ఆలీఢాదిమానముల దిట్టముగా నిలుచుండుటలుగాని, వింటిని నారిని బిడికిటపట్టుటగాని, గుఱిదప్పక వేయుటఁగాని, యెంతమాత్రము గనఁబడదయ్యె. వింటినుండి యురవడిగా వెడలుచున్న బాణసమూహము లాకాశమంతటిని గప్పుటవలన బాణములుతప్ప మఱియేవస్తువును గానఁబడదయ్యె. అప్పుడు లక్ష్మణుఁ డింద్రజిత్తును దారసించియు నింద్రజిత్తు లక్ష్మణునిఁ దలపడియుఁ బోరునపుడు ఇతఁ డతనిని గొట్టుననిగాని యతఁ డితనిం గ్రిందుపఱచుననికాని నిశ్చయము నేర్పఱచుట యశక్యముగానుండెను. వారిరువురు, వేగమున నొండొరులవంక నేసినవాఁడిబాణములు ఆకాశమునం దెంతమాత్రమును తెఱపిలేనట్లు నిండఁగా నది చీఁకటి క్రమ్మినట్లుండెను. అట్లు వారిరువుర వాఁడిబాణములు పెక్కువందలకొలఁదిని బరఁగుచుండుటం జేసి దిక్కులును విదిక్కులును బాణములు నెరసి జెరసినవయ్యె. సమస్తమును, సూర్యుఁ డస్తమించునపుడు చీఁకటిచేఁ గప్పఁబడునట్లు, చీఁకటిచేఁ గప్పఁబడి, యెంతయు భయంకరముగానుండెను. అప్పుడు నెత్తురువెల్లువలు గొప్పనదులుగా వేలకొలఁదిని బ్రవహించినవి. బెడిదములయి మాంసాహారులగు క్రూరజంతువులు భయంకరముగాఁ గూఁతలిడినవి. అప్పుడు భయమున వాయువు వీవకుండెను. అగ్ని మండదయ్యె. మహర్షులును దిగులొంది 'లోకంబులకు మంగళమగుఁగాక ' యని పలికిరి. మున్ను యుద్ధముఁజూడ నచ్చటికివచ్చియున్న గంధర్వులును చారణులును అతిఘోరమైన యాయుద్ధమును జూడ వెఱచి వేఱుచోటికిఁ

* ఇచట హనుమంతుఁడు యుద్ధముచేసెననుటవలన హనుమంతునివీఁపుపయినున్న లక్ష్మణుఁడు అతనియలసట దీఱుటకై కొంతసేపు దిగియుండెనని తెలియుచున్నది.

బోయిరి. అంత లక్ష్మణుఁడు, రాక్షససింహుఁడగు నింద్రజితుని నల్లనిగుఱ్ఱములను బంగారుభూషణములు గలవానిని నాలుగింటిని, నాలుగుబాణములఁ గాఁడ నేసెను. పిమ్మట శ్రీమంతుఁ డగులక్ష్మణుఁడు, వాఁడియై మంచి గఱులుగలిగి, మేలయినకాంతిని వెలుంగుచున్న వేఁటాళ తెల్లనికత్తివాతి వాఁడియమ్మును దీసి యాకర్ణాంతముగా లాగి,యింద్రునివజ్రముంబోలినదై యత్తైముచప్పుడుచే శబ్దించుచుఁ బిడుగువలెనున్న యాబాణముచే లాఘవంబు మెఱయ, రథమును జిత్రగతులం ద్రిప్పుచున్న యింద్రజిత్తు సారథితల మేనినుండి ద్రొల్ల నేసెను. సారథి హతుఁడుకాఁగా మహాతేజుఁడగు నామందోదరీతనూజుఁడు ఇంద్రజితుఁడు,తానే తేరును దోలుకొనుచును వింటినింబట్టి యుద్ధమును జేయుచు నుండెను. ఆయుద్ధమునం దట్లు ఇంద్రజిత్తు తా నొకఁడే తేరు దోలికొనుచును వింటింగొని యుద్ధము సేయుచును నుండుసామర్థ్యమునకుఁ జూచువా రాశ్చర్యపడిరి. లక్ష్మణుఁడు, ఇంద్రజితునిచేతులు గుఱ్ఱములం దోలువ్యాపారమునఁ దగిలియుండునపుడు అతనిని వాఁడియమ్ములఁ గాఁడనేసెను. వింటను నతని చేతులు దగిలియుండునపు డతని గుఱ్ఱములపయి బాణము లేసెను. లక్ష్మణుఁడు,పగవానియందు తెలిపింజూచి బాణము లేయుటయం దతిశీఘ్రలాఘవముగలవాఁడుగాన యట్లారంధ్రములం గనిపెట్టి, రథస్థుఁడై తిరుగుచున్న యింద్రజిత్తును, నిర్భయుఁడై బాణసమూహములచే పీడించెను. ఇంద్రజిత్తు, యుద్ధమునఁ దనసారథి హతుఁడగుటయు, దాను గుఱ్ఱములందోలు తెఱపిని గనిపెట్టి లక్ష్మణుఁడు తన్ను నొప్పించుటయుం జూచి యుద్ధగర్వము వదలి విషణ్ణుం డయ్యెను. వానరయూథపులు ఇంద్రజిత్తుమొగము విన్ననై యుండుటంజూచి మిక్కిలియు సంతుష్టులై లక్ష్మణునిం గొనియాడిరి. అంత, ప్రమాథి, శరభుఁడు,రభసుఁడు, గంధమాదనుఁడు నను వానరోత్తములు నలువురు,ఇంద్రజితుని యాటోపము సహింపక యురవడిఁ జూపసాఁగిరి. మహాపర్యవంతులును భయంకరపరాక్రములు నయిన యావానరవీరులు నలువురును, ఇంద్రజితుని తేరికిఁ బూన్చిన మేటిగుఱ్ఱముల నాలుగింటిపై నతివేగంబున దూఁకివడిరి. పర్వతాకారులగు నవ్వానరవీరులు పయిఁబడఁగానే యాయశ్వములు ఆఁగఁజాలక, ముఖములనుండి యెఱ్ఱనినెత్తురు గ్రక్కినవి. ఆగుఱ్ఱములు అట్లు నలఁగి యవయవములు విఱిగి ప్రాణములువీడి నేలం గూలినవి. అవ్వానరవీరులు, ఇంద్రజితునిగుఱ్ఱములను హతముసేసి, యతనిమహారథమును నుగ్గుగావించి మరల వేగంబున నెగిరివచ్చి లక్ష్మణునిపార్శ్వమున నిలిచిరి. ఆయింద్రజిత్తు గుఱ్ఱములుచచ్చి సారథియుఁ గూలినయావట్టిరథమునుండి నేలకుదూఁకి, బాణవర్షము గురియుచు లక్ష్మణునిపయి కడరెను. అంత నప్పుడు మహేంద్రునికి సాటియగు లక్ష్మణుఁడు, తనపయి వాఁడియైన బలుతూఁపులను బరఁగించుచు, కాలినడకను దారసించి వచ్చుచున్న యాయింద్రజిత్తును,యుద్ధమున వాఁడియైన మేటిబాణములను మఱియు నితరబాణసమూహములను మిక్కిలియుఁ బ్రయోగించి యొంతయు వారించినవాఁడయ్యె. ఇది తొంబదియవసర్గము.

ఇంద్రజిత్తు వేఱురథమెక్కి రాఁగా లక్ష్మణుఁడు వానిసారథిం జంపుట; విభీషణుఁ డింద్రజిత్తుగుఱ్ఱంబుల రూపుమాపుట; లక్ష్మణునిచే నింద్రజిత్తు హతుండగుట.

అట్లు గుఱ్ఱములు కూలఁగా రథము డిగి నేలపయి మహాతేజుఁడింద్రజిత్తునిలుచుండి, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై తేజంబున మిక్కిలియు జ్వలించుచుండెను. ధనుర్ధరులయిన యాయిరువురును బాణములచే నొండొరువుల నెంతయు వధింపఁ గోరుచు,యడవియందు గజంబులుంబోలె విజయముకొఱకై యొకరినొకరు నెదుర్కొనిరి. రాక్షసులును వానరులును యుద్ధమున నలుప్రక్కల సంచరించుచు,ఒకరినొకరువధించుచు,తమతమయధిపతిని నెంతయువిడువక పోరుచుండిరి. అంత నింద్రజిత్తు, ఆరాక్షసులకందఱకు సంతోషముగలిగించుచు, వారలంబొగడుచు తానును సంతసిలుచు,'రాక్షసోత్తములారా! ఈసమస్తదిక్కులను జీఁకటిదట్టముగా వ్యాపించియున్నది. కావునిపుడుయుద్ధమునఁ దనవాఁడనికాని పరుఁడనికాని భేదము తెలియకున్నది. మీరలీవానరులను నేనిచటనుండి వెడలిపోవుసంగతి తెలియకుండున ట్లేమఱించుటకై యుద్ధవిడిగానిలిచి యుద్ధముసేయుచుండుఁడు. నేనింతలో రథము నారోహించి యుద్ధమునకు వచ్చెదను. నేను బట్టణములోనికిపోవఁగా దురాత్ములయినవానరులు నన్ను యుద్ధము సేసిపోవునపు డాఁగకుండునట్లు మీరు గావింపవలయును' అనెను. పగవారివీఁచమడంచు నింద్రజితుఁడు తనసైనికుల కట్లుచెప్పి వానరులనువంచించి రథముఁదెచ్చుటకై లంకకుంబోయెను. యుద్ధంబులగెలుపునొందుచుండు మహాతేజుండయ్యింద్రజిత్తు సొగసైబంగారుచే రంగారుచు వందలకొలఁదిప్రాసములచేతను ఖడ్గములచేతను బూర్ణమై యుత్తమాశ్వములుపూన్చినరథమును నశ్వలక్షణములఁ దెలిసి తనకు హితముపదేశించునట్టిసారధి తోలఁగా తన తేజంబున దాని నలంకరించుచు నారోహించినవాఁడయ్యె. మందోదరీపుత్త్రుఁడగు నింద్రజితుఁడు మృత్యువశంబునఁ బ్రేరితుఁడై మేటిరాక్షససమూహములంగూడి లంకానగరమునుండి వేగ వెడలివచ్చెను. శత్రువీరుల నుఱుమాడునయ్యింద్రజిత్తు వేగవంతములగు గుఱ్ఱములు పూన్చినరథముచే పట్టణమునుండి వెలువడి లక్ష్మణునివయికిని విభీషణునిమీఁదికిని బోయెను. అంత లక్ష్మణుఁడును మహావీర్యశాలురగువానరులును విభీషణుఁడును యుద్ధభూమి నున్నట్టియుండి,తమ్ము మోసపుచ్చిపోయి రథగతుఁడయి వచ్చినయాయింద్రజిత్తుంజూచి,యాబుద్ధిమంతునిలాఘవమునకు మిక్కిలి యాశ్చర్యము నొందిరి. ఇంద్రజితుఁడును మిక్కిలి క్రుద్ధుఁడై యుద్ధముల బాణసమూహములు పరఁగించి వానరులను వందలకొలఁదిని వేలకొలఁదిని బడఁగూల్చెను. యుద్ధములందు జయశీలుఁడగు నింద్రజితుఁడు క్రుద్ధుఁడై తద్దయు లాఘవంబునూని విల్లు మండలాకారమైయొప్ప వానరుల వధింపసాగెను. భయంకరపరాక్రములగు నవ్వానరులు,అట్లింద్రజిత్తు బాణములచేఁ దమ్ము వధించుచుండఁగాఁ దాళలేక ప్రజలు ప్రజాపతియగు బ్రహ్మదేవుని శరణుఁజొచ్చునట్లు తమనాథుండగులక్ష్మణుని శరణుఁజొచ్చిరి. అంత లక్ష్మణుఁడు యుద్ధం

బునఁ గోపాతిశయముచే మండిపడి తనహస్తలాఘవమునుజూపుచు,నింద్రజితునిచేతి ధనువును ఖండించెను. ఇంద్రజిత్తు వేగిరమున నొండువిల్లుగొని, నారియెక్కు వెట్టఁగా దానినిగూడ లక్ష్మణుఁడు మూఁడుబాణముల ఛేదించెను. అంత లక్ష్మణుఁడట్లు ధనువు ద్రుంచి, మఱియు నయ్యింద్రజితునివక్షమున సర్పవిషమువలెఁ బ్రాణాంతకరములయిన యైదుబాణముల నొప్పించెను. ఆబాణములు లక్ష్మణునివెనుపింటెనుండి వెడలినవై యింద్రజితునిదేహముదూఱి నెత్తుటంగడిసి యెఱ్ఱనిమహాసర్పములవగిది నేలంబడినవి. ఆయింద్రజిత్తు, లక్ష్మణునిబాణములచే కవచముభిన్నముకాఁగా,నోట నెత్తురుగ్రక్కుచు, దృఢమయిన యల్లెత్రాడుగలిగి మిక్కిలియు సారవంతమైన మఱియొక మేటివింటిని గైకొనెను. ఆ యింద్రజిత్తు మిక్కిలియు లాఘవము నూని, దేవేంద్రుఁడు వర్షములు గురియునట్లు లక్ష్మణునిపయిని బాణవర్షములు గురియించెను. అరిందముఁడైన యా లక్ష్మణుఁడు, ఎట్టివారికిని దారసింపరాని యయ్యింద్రజితుని బాణవర్షమును, తొట్రుపాటెంచుకయులేక బాణములచే వారించెను. అప్పుడు మహాతేజుఁడగు రఘుకులనందనుఁడు లక్ష్మణుఁడు తొట్రుపడక యింద్రజితునకుఁ దనపరాక్రమమును జూపెను. అది యెంతయు నద్భుతమై చూపట్టెను. అంత లక్ష్మణుఁడు యుద్ధంబునఁ బరమక్రుద్ధుఁడై తనయస్త్రప్రయోగమందలి యురవడింజూపుచు, ఆరాక్షసులనందఱ నొక్కొక్కని మూఁడేసిబాణములఁ బ్రహరించి యింద్రజితునింగూడఁ బెక్కుబాణములనొప్పించెను. ఆరాక్షసుండు,అట్లు బలవంతుఁడును శత్రుహంతయునగులక్ష్మణునిచే మిక్కిలియు బాణములు గ్రుచ్చంబడినవాఁడై కోపించి లక్ష్మణునిమీఁద తెఱపిలేనట్లు పెక్కుబాణములను బ్రయోగించెను. లక్ష్మణుఁ డాబాణములు తన్నుం దగులకమునుపే నడుమనె, వానిని వాఁడిబాణముల ఖండించెను. అంతేకాక, ధర్మాత్ముఁడును రథికోత్తముఁడునగులక్ష్మణుఁడు యుద్ధమునందు నున్నఁగాఁ బదనుచేయఁబడిన గణుపులుగలకత్తివాఱిబాణమున నాయింద్రజితునిసారథిశిరము డొల్లనేసెను. ఆయుద్ధమున సారథి హతుఁడయ్యెను, ఇంద్రజితునిరథమునకుఁ బూన్చియున్నగుఱ్ఱములు శిక్షాపాటవమువలన నెంతమాత్రము కలఁతనొందక, మండలాకారముల రథమునువహించి త్రిప్పినవి. అది చూచుట కెంతయు నాశ్చర్యముగా నుండెను. దృఢపరాక్రముఁడగులక్ష్మణుఁడు, యుద్ధమున క్రోధముబారింబడి, సైనికులుబెదర, ఆ యింద్రజితునిగుఱ్ఱములను బాణములచే నొప్పించెను. బలవంతుఁడగు నింద్రజితుఁడు, లక్ష్మణుఁడుగావించిన యాకార్యమునకు సైఁపక క్రుద్ధుఁడగు లక్ష్మణునిఁ బదిబాణములఁ గాఁడనేసెను. వజ్రసమానములును సర్పవిషముంబోలినవియునగు నింద్రజితుని బాణములు, బంగారువన్నె దులకించునదగు లక్ష్మణునికవచమును దాఁకి భగ్నములయ్యెను. రావణపుత్త్రుఁ డింద్రజితుఁడు, లక్ష్మణుఁ డభేద్యంబగు కవచము దొడిగియున్నాఁడని యెఱింగి, మిక్కిలియుక్రుద్ధుఁడై తనబాణప్రయోగపునురవడిం జూపుచు, మంచిపింజలు గలమూఁడుబాణముల లక్ష్మణునిలలాటముఁ గాఁడనేసెను. యుద్ధప్రి

యుండగు లక్ష్మణుఁడు లలాటమున మూఁడుబాణములు గ్రుచ్చుకొని యుండుటవలన యుద్ధాగ్రమున మూఁడు శిఖరములుగల పర్వతమువలెఁ జూడనొప్పెను. అట్లు మహాయుద్ధంబున నింద్రజిత్తు, బాణములచే పీడింపఁగా, లక్ష్మణుఁడు వేగ వింటి నాకర్షించి సుందరములయిన కుండలములతోఁ దులకించుచున్న యింద్రజితునిముఖమున నయ్యుద్ధమున నయిదుబాణములు నాటనేసెను. శూరులును మహాబలవంతులును భయంకరపరాక్రములునగు లక్ష్మణుఁడును నింద్రజితుఁడును మంచిసారముగల విండ్లను ధరించి, కరవీరపత్త్రాద్యాకారముల పలువిధముల మొనలుగల బాణములచే నొండొరుల నొప్పించిరి. యుద్ధమున శూరులగు లక్ష్మణుఁడు నింద్రజిత్తు నిరువురును, సమస్తావయవములు నెత్తుటం దొప్పఁదోఁగ చక్కఁగా పుష్పించిన మోదుగుచెట్లవలెఁ బ్రకాశించిరి. అయ్యిరువురు విండ్లుదాల్చి, జయమునందు మనస్సిడి, యొండొరుల మాఱుకొని యవయవములం దెల్లను బెడిదములయిన బాణములను గాఁడనేసిరి. అంత నింద్రజిత్తు, యుద్ధమునఁ గోపం బినుమడింప, విభీషణుని శుభవదనంబున మూఁడుబాణములేసెను. మఱియు నతఁడు రాక్షసేంద్రుఁడగు విభీషణుని మూఁడు బాణముల నొప్పించి యావానరవీరులనందఱను, నొక్కొక్కని నొక్కొకబాణముచే నొప్పించెను. మహాతేజుండగు విభీషణుఁడు ఆయింద్రజిత్తునియెడల మీఁదు మిక్కిలి క్రుద్ధుఁడై, యతిదురాత్ముఁడగు వానిగుఱ్ఱములను గదచే చంపెను. మహాతేజుండగు నయ్యింద్రజిత్తు, గుఱ్ఱములుచచ్చి సారథియుఁ గూలినయారథమునుండి నేలకుదూఁకి, రథమున నున్నశక్తింగొని పినతండ్రిపయి నేసెను. సుమిత్రానందమును బెంచుచుండు లక్ష్మణుఁడు ఆశక్తి విభీషణునిమీఁదికి వచ్చుచుంటంజూచి, నడుమనే వాఁడిబాణముల ఛేదింప నది పదితునియలై నేలంబడెను. విభీషణుఁడు దృఢంబగు ధనువుందాల్చి క్రుద్ధుఁడై విరథుఁడగు నాయింద్రజిత్తుని వక్షమున వజ్రమువలె కఠినస్పర్శములగు బాణము లయిదింటిని వైచెను. బంగారు పింజలుగలిగి గుఱిని దప్పకతాఁకునట్టి యాబాణములు నతనిదేహమును భేదించి నెత్తుటందడిసి యెఱ్ఱనై యెఱ్ఱనిపెనుసర్పములవలె నొప్పెను. మహాబలుఁడాయింద్రజిత్తు మిగులఁ గ్రుద్ధుఁడై యముఁడొసంగిన యుత్తమబాణంబును రాక్షసులనడుమం దీసికొనెను. మహాతేజుండును భయంకరపరాక్రముండునగు లక్ష్మణుఁడు, అట్లింద్రజిత్తు ఆ పెనుబాణమును సంధింపఁగాఁ జూచి తానును మఱియొకబాణమును దీసికొనెను. ఈబాణమును గుబేరుఁడు రాఁగలవృత్తాంతమును బుద్ధినూహించి యతనిస్వప్నమునఁ దానే యొసంగియుండెను. కాన యది యెట్టివారికి జయింపరానిది; సురాసురులతోఁ గూడి యింద్రుఁడు వచ్చినను దానితాఁకు నోర్వఁ దరముగాదు. ఆయిరువురును గుదియలవంటి తమబాహువులచే నామేటివిండ్లను బలముకొలఁది నాకర్ణాంతము లాగుచున్నపుడు, అవి క్రౌంచపిట్టలు కూపెట్టినట్లు మ్రోసెను. ఆవీరులిరువురును మేలయిన వింటియందాయుత్తమబాణములను సంధించి తివుచుచుండఁగా నవి రెండును కాం

తి పెంపున మిక్కిలియు జ్వలించెను. ఆబాణములు రెండును విండ్లనుండి విడువంబడఁగానే యాకాశమును వెలిఁగించుచుం బఱచి యొండొంటిమొగముతో మొగము గొట్టుకొన బిట్టుగా రాసాపునొందినవి. భయంకరాకారములయిన యాబాణము లట్టుబిట్టుగా నొరసిపిసినొందఁగా దానివలనఁ బుట్టినయగ్గి,పొగలును మిడుంగుఱులును జెలంగ మిగుల బెట్టిదముగా నయ్యెను. ఆబాణములు రెండును నాకాశమున మహాగ్రహములంబోలె నొండొంటిందాఁకి వెనఁగి నూఱువటియలై నేలంబడినవి. మిగుల రోషమునొందియున్న యాలక్ష్మణుఁడు సింద్రజిత్తును నపుడును తమబాణములు యుద్ధాగ్రమునఁ గొట్టువడుటనుజూచి యిరువురును లజ్జితులయిరి. లక్ష్మణుఁడు మిక్కిలియు సంరంభించి వారుణాస్త్రమును దీసికొనెను. యుద్ధంబున వెనుదీయని యింద్రజిత్తును యుద్ధంబున రౌద్రాస్త్రమును బ్రయోగింపఁగా దానిచేత మిక్కిలి యద్భుతమైన యవ్వారుణాస్త్రము హతిమయ్యెను. అంత యుద్ధంబుల గెలుపుగొనుచుండు నమ్మహాతేజుఁ డింద్రజితుఁడు క్రుద్ధుఁడై లోకమును సంహరించువాఁడుంబోలె మెఱయుచున్న యాగ్నేయాస్త్రమును బ్రయోగించినవాఁడయ్యె. దానిని వీరుండయిన లక్ష్మణుఁడు సౌరాస్త్రముచేత వారించెను. ఇంద్రజిత్తు తనయస్త్రము వారింపఁబడుటను జూచి క్రోధమున నొడలు దెలియక తనశత్రువును నాశముసేయుటకై ఘోరమయిన యాసురాస్త్రమును దొడిగి ప్రయోగించెను. ఆయాసురాస్త్రమును బ్రయోగించుటవలన నింద్రజిత్తు వింటినుండి ధగధగ మెఱయుచున్న కూటముద్గరములును, శూలములును, ముసుంతులనెడి ముసలములును, గదలును, ఖడ్గములును, గండ్రగొడ్డండ్రును బయలువెడలినవి. తేజోవంతుండగు లక్ష్మణుఁడు యుద్ధంబున భయంకరమును సమస్తప్రాణులకును వారింప నశక్యమైనదియు, సకలశత్రువులను రూపు మాపునదియు నయిన యాయాసురాస్త్రమును జూచి దానిని మాహేశ్వరాస్త్రముచేత వారించెను. అంత నయ్యిరువురియుద్ధము మిక్కిలియు నధికమై యాశ్చర్యమువలె నొప్పెను.అప్పు డాకాశమున నున్నభూతములన్నియు లక్ష్మణునిం బరివేష్టించినవయ్యె.అప్పుడు వానరులును రాక్షసులును బెట్టిదంపుచప్పుళ్లతో భయంకరముగాఁ బోరుచుండఁగా, భూతములనేకములు ఆకాశమునఁ గ్రమ్మి విస్మయపడి చూచుచుండఁగా నదియెంతయు నొప్పుచుండెను. అప్పుడు మహర్షులును పితరులును దేవతలును గంధర్వులును గరుడులును నురగులును దేవేంద్రపురస్సరులై యాయుద్ధమున లక్ష్మణునికి కీడుగలుగకుండునట్లు జయజయేత్యాదులైన యాశీర్వాదముల రక్షించుచుండిరి. అంత రామునితమ్ముండగు లక్ష్మణుఁడు అగ్గింబోనివేండ్రపుఁ దాఁకుగలిగి యింద్రజితుని రూపుమాపునట్టి దగునొక బలుమేటిబాణమును వింటసంధించినవాఁడయ్యె. ఆయస్త్రము నుంచిగఱులుగలిగి; గుండ్రనై, చక్కనిగణుపులును సంస్థానమునుగలిగి బంగారుచేఁ జిత్రితమై యెట్టిశరీరమునైన భేదించి ప్రాణములుదీయు నట్టిదిగానుండెను. అది వారింపనుగాని సహింపనుగాని కడిందియై రాక్షసులకు భయ

మొనంగుచు, క్రూరసర్పవిషముంబోలి దేవసమూహముచే మిక్కిలియుఁ బూజితమై వెలయుచుండునది. మఱియు మున్ను దేవాసురయుద్ధమున మహాతేజుండును సమర్థుఁడును,వీర్యవంతుఁడును పచ్చనిగుఱ్ఱములుగలవాఁడునగు దేవేంద్రుఁడు దానవుల నయ్యాస్త్రముచేత జయించెను.ఇట్లు యుద్ధంబులఁ బరాజయము నొందనియమ్మేటిబాణమును ఐంద్రాస్త్రమంత్రముచే నభిమంత్రించి,వీరుఁడును పురుషశ్రేష్ఠుఁడునగులక్ష్మణుఁడు తన గొప్పవింట సంధించినవాఁడయ్యె. లక్ష్మణుఁ డట్లు శత్రువిదారణంబగు దివ్యబాణమును సంధించి, ప్రలయకాలమునందు లోకనాశమునకై యముఁడుంబోలె, నారినిమోపెట్టి చెనకరానిబలువింటిని వంచి యాకర్షించెను.లక్ష్మీయుక్తుండగు లక్ష్మణుఁడు, బాణమును మేటిధనువున సంధించి యాకర్ణాంతములాగుచుఁ దనకుఁ గార్యసాధకంబగు వాక్యమున 'బాణమా! దశరథరాజకుమారుఁడురాముఁడు,ధర్మాత్ముఁడును సత్యసంధుఁడును, పౌరుషంబున నెదురులేనివాఁడును నగునేని, నీ వీయింద్రజితుని వధింపుము' అనెను. యుద్ధమున వీరుఁడును, శత్రువీరసంహారుఁడును, లక్ష్మీసంపన్నుఁడునగు లక్ష్మణుఁడిట్లాబాణమునుగూర్చి చెప్పి,సూటిదప్పక నాఁటెడియాబాణమును ఆకర్ణాంతములాగి, యైంద్రాస్త్రమంత్రముతో నభిమంత్రించి యింద్రజితునిమీఁదం బ్రయోగించెను. అమ్మహాబాణము, బొమిడికముందొడిగి, సిరిదళుకొత్తుచు కుండలములు తలతలమెఱయుచున్న యింద్రజితునిశిరంబును ఖండించి, యతనిదేహమునుండి నేలంబడద్రోసినదయ్యె. బంగారుచాయం బొలుపారుచున్న యింద్రజితుని పెనుశిరస్సు మొండెము వీడి నెత్తుటందోఁగుచు భూమిపయిం గానంబడెను. రావణకుమారుం డింద్రజిత్తు, కవచముతోడను శిరస్త్రాణముతోడను ధనుస్సుతోడను విధ్వంసమునొంది హతుఁడై వేగ నేలం ద్రెళ్లెను. అప్పుడు, విభీషణుఁడును, వానరులందఱును ఆయింద్రజితుఁడు హతుఁడుకాఁగానే వృత్రాసురుఁడు హతుఁడయినపుడు దేవతలుంబోలె, నుబ్బున నందఱును నార్పులుచెలంగించిరి. అంత నాకాశమున దేవతలును మహాత్ములగుఋషులును గంధర్వులును అప్సరసలును సంతోషమున నలుగడల ధ్వనిగావించిరి. ఆయింద్రజిత్తు కూలుటందెలిసి జయశీలురగువానరులు పట్టి నుఱుమాడఁగా,రాక్షసుల యమ్మహాసేన యాఁగంజాలక దిక్కులకుం బాఱిపోయెను. వానరులు పట్టి తఱుముచు వధించుచుండఁగా, నారాక్షసులు సహింపలేక సంజ్ఞదప్పి యాయుధములువదలి లంకాభిముఖముగా పరుగెత్తిపోయిరి. రాక్షసులందఱును భయమునొంది, పట్టిసములను ఖడ్గములు పరశ్వథములు మున్నగునాయుధములు దిగవిడిచి, పలుదెఱఁగుల విచ్చి, వందలువందలుగా దిక్కులకుఁ బాఱిపోయిరి. అట్లు వానరులచే పీడితులై దిగులుగొని కొందఱు రాక్షసులు లంకనుజొచ్చిరి. కొందఱు సముద్రమునం బడిరి. మఱికొందఱు కొండల దాఁగిరి. ఇంద్రజితుఁడు హతుఁడై యుద్ధభూమిని బడియుండుటను జూడఁగానే వేలకొలఁది నుండినరాక్షసులలో నొక్కఁడయినను కనుపట్టఁడయ్యె. అందఱును బాఱిపోయిరి. సూర్యుఁ డస్తమించినవెనుక కిరణములునిలువక పోవుదెంచునట్లు, అయ్యిం

ద్రజిత్తు హతుఁడుకాఁగానే రాక్షసులందఱును నలుదిక్కులకుం బాఱిపోయిరి. మహాతేజుఁడగు నయ్యింద్రజిత్తు కొంతసేపు అవయవములు విదుల్చుచుండి యంత ప్రాణము వెడలినవాఁడై, కిరణములులేని సూర్యునివలెను చల్లాఱినయగ్నివలెను తేజము దూలినవాఁడయ్యెను. రాక్షసరాజకుమారుఁ డింద్రజితుఁడు కూలినంతనే లోకమునందు వెక్కులుపీడలన్నియు నడఁగె. అరిష్టములన్నియు నశించె. *సూర్యుఁడు చక్కఁగా నెండగాయుచుండెను.పాపకర్ముఁడగునాయింద్రజితుఁడు హతుఁడుకాఁగానే భగవంతుఁడగు దేవేంద్రుఁడును సమస్తదేవతోత్తములును హర్షమునొందిరి. ఆకాశమునందు దేవదుందుభులధ్వనియు వినంబడెను. మఱి యప్సరసలనర్తనములును మహాత్ములగు గంధర్వులగానముల ధ్వనియుఁ జెలంగెను. క్రూరకర్ముఁడగు రాక్షసుఁ డయ్యింద్రజితుఁడు హతుఁడుకాఁగానే దేవతలు పుష్పవర్షములుగురిసి లక్ష్మణునిఁ బ్రశంసించిరి. అది యపు డద్భుతమైయుండెను. అప్పుడు జలములును తేటపడియె. దిక్కులును దెలివినొందెను. దైత్యులును దానవులును గగురునొందిరి. సమస్తలోకములకును భయమును గలిగించుచుండినయాయింద్రజిత్తు హతుఁడుకాఁగానే దేవతలు గంధర్వులు దానవులునువచ్చి యందఱును జేరి, 'ఇఁక బ్రాహ్మణులు తుందుడుకు మాలి కలంక లుడఁగి,సుఖముగా విహరింతురుగాక' యనిరి.అంతట వానరయూథపతులు అసమానబలుఁడగు నారాక్షసపుంగవుఁడు యుద్ధమున హతుఁగుటంజూచి మిక్కిలి హర్షమునొంది లక్ష్మణునిం గొనియాడిరి. విభీషణుఁడును, హనుమంతుఁడును, భల్లూకయూథపతియగు జాంబవంతుఁడును, జయము గలిగినందులకు మిక్కిలి సంతసిల్లుచు లక్ష్మణుని స్తుతులుచేసిరి. వానరులు తమకోర్కి యీడేఱుటంజేసి, సంతోషమున సింహనాదములు సేయుచు పలువిధముల నార్పులు సెలఁగించుచు గర్జించుచు, లక్ష్మణునిఁ బరివేష్టించి కొలిచియుండిరి. అప్పుడు వానరు లుబ్బుపట్టఁజాలక తోఁకలం గొట్టుచు భుజములప్పళించుచు 'లక్ష్మణుఁడు సర్వోత్కర్షమునను న్నాఁడు' అని యందఱు వినం జాటిరి. వానరులు మనమునసంతసముప్పొంగ నొండొరువుల కవుంగిలించుకొని లక్ష్మణునిగుఱించి పలువిధములుగా ముచ్చటలాడుకొనుచుండిరి. దేవతలు ఇంద్రజిత్తు హతుఁడయ్యెనని చారణాదులమూలమున మొదట విని, మిక్కిలియు మనంబున హర్షమునొందుచు పిదప నింద్రజిద్వధ మశక్యముగాన యది యబద్ధముగా నుండునో యని తలంచి ఆయుద్ధభూమికిఁ జక్కఁబోయి సర్వప్రియసుహృదుండగు లక్ష్మణుఁడు మిక్కిలియు దుష్కరమును సర్వలోకములకును బ్రాణప్రతిష్ఠాకరమునగు నింద్రజిద్వధమును గావించెనని ప్రత్యక్షముగా నెఱిఁగి విస్మయమునొందినవారయిరి.

ఇది తొంబదియొకండవ సర్గము.



* పూర్వము భయముచేత సూర్యుఁడు చక్కఁగా నెండగాయఁడయ్యెనని తెలియునది.

లక్ష్మణుఁడు విభీషణాదులతో రామునియొద్దకుఁబోయి, యతని కింద్రజిద్వధమును దెలుపుట; రాముఁడు లక్ష్మణుం గౌఁగిలించి తక్కినవారిని శ్లాఘించుట; సుషేణుఁడు రామునియోగమున లక్ష్మణాదులను విశల్యులం జేయుట.

శుభలక్షణలక్షితుఁడై యవయవములెల్ల నెత్తుటం దడిసియున్న లక్ష్మణుఁడు, యుద్ధమున నింద్రునిజయించినట్టి యింద్రజితుని వధించి హర్షమునొందినవాఁడయ్యె. అంత వీర్యవంతుఁడును మహాతేజుండునగులక్ష్మణుఁడు, జాంబవంతునిని హనుమంతుని మఱియు నయ్యెవానరులనందఱను గుంపుగాఁ బిలుచుకొని యుద్ధపారవశ్యమున విభీషణహనుమంతుల నూఁతగొని యుద్ధభూమినుండి రామసుగ్రీవు లున్నయెడకు శీఘ్రముగాఁ బోయెను. అంత లక్ష్మణుఁడు రామునకుఁ బ్రదక్షిణముసేసి నమస్కరించి యింద్రునియొద్ద బృహస్పతియుండునట్లు, పారతంత్ర్యము నెఱపుచు నన్నసమీపమున నిలుచుండెను. అప్పుడు వీరుండగులక్ష్మణుఁడు రామునియొద్దకువచ్చి భక్తిసంకోచాముల వలన నవ్యక్తాక్షరము లగుపలుకుల నమ్మహాత్మునకు ఘోరంబగు నింద్రజిద్వధమును జెప్పెను. అప్పుడు విభీషణుఁడు సంతుష్టుఁడై రామునితో '*ఇంద్రజిత్తు వధింపఁబడెను గాని వానిశిరస్సుమాత్రము మహాత్ముఁడగు లక్ష్మణుఁడు ఛేదించెను'అని విన్నవించెను. మహావీర్యుండగు రాముఁడు లక్ష్మణుఁ డింద్రజితుని వధించెనన్న యీమాటను విన్నంతనే యెనలేని సంతోషమునొంది లక్ష్మణునితో 'లక్ష్మణా ! బాగుబాగు. నీవుచేసిన యుద్ధకృత్యమునకు సంతుష్టుఁడనయితిని. గొప్పకర్జమును జేసి తీర్చితివి. ఏలనఁగా నింద్రజితుఁడు నశించుటచే మనమింక రావణునింగూడఁ జంపి జయమును బొందిరమైనట్లె యని నిశ్చయింపుము' అనెను. వీర్యవంతుఁడగు రాముఁడు లక్ష్మీవర్ధనుండగు లక్ష్మణుని శిరంబుమూర్కొని యతఁడు సిగ్గుపడుచు నొదుఁగుటంజూచి నెయ్యమున బలవంతముగాఁ దొడపయిఁ గూర్చుండఁబెట్టుకొనుటకు లాగి, యొడిపయిఁ గూర్చుండఁబెట్టుకొని బిగ్గఁగౌఁగిలించుకొని తమ్ముని నెయ్యము పొంగారుచూడ్కుల మాటిమాటికిఁ జూచెను. అప్పుడు పురుషలలాముఁ డగురాముఁడు, అట్లు లక్ష్మణుఁడు శల్యపీడితుఁడై దేహమంతయు గండ్లువడి,నిట్టూర్పులు నిగిడించుచుండుటనుజూచి, దుఃఖంబునఁ బొక్కుచు తానును మిక్కిలియు నిట్టూర్పులువిడుచుచు, తమ్ముని శిరసు మూర్కొని యాగాయముల బాధను బోఁగొట్టుటకై వేగిరపడుచు నతనిమేనెల్లఁ బక్కఁగాఁదడవి యాశ్వాసించి యతనితో 'ఇతరులకు దుష్కరములయిన కార్యములనుగూడఁ జేయువాఁడవు. కావున నీ విట్టి యశక్యమైన వీరకృత్యముచేసి నాకు మిక్కిలియు మంగళము గావించితివి. పుత్త్రుఁడు హతుఁడయ్యెఁగాన యిపుడు రావణుఁడును యుద్ధమున హతుఁడయి

* లక్ష్మణుఁడు రామసన్నిధియందు సంకోచముచే తానే యింద్రజిత్తును వధించుటను జెప్పక మొత్తమున కింద్రజిత్తు హతుఁడయ్యెనని చెప్పెననియు విభీషణుఁ డదితెలిసి స్పష్టముగా లక్ష్మణుఁడే యింద్రజిత్తును వధించుటను జెప్పెననియుఁ దెలియునది.

నట్లె తలఁచెదను. ఇంతవఱకెందఱుమహావీరులను జంపినను గెలుపుగలిగినట్లు తోఁప లేదు. దురాత్ముఁడగు మనశత్రు వాయిందద్రజిత్తు హతుఁడయ్యెఁగాన యిపుడే నేను గెలుపుగొన్నవాఁడను. వీరా ! నీవు యుద్ధంబున నింద్రజితునిఁ జంపుటచే, కూరుఁ డగు రావణుని కుడిబుజమును నాభాగ్యమున ఛేదించినట్లేయగును. ఏలనఁగా వాఁడే యీరావణునకు మంచియూఁతచుమీ. విభీషణుఁడును హనుమంతుఁడును యుద్ధమున గొప్పపరాక్రమకృత్యములు గావించినారు. ఇట్లు మూఁడహోరాత్రములకు మహాప్రయాసమున వీరుఁడగు నింద్రజిత్తు కూల్పఁబడినవాఁడయ్యె. ఇప్పుడు నాకు శత్రువులందఱు తీఱినట్లు గావించితివి. రావణుఁడొక్కఁడున్నాఁడుగాని వాఁడును కొడుకు పడుటనువిని గొప్పసైన్యమును బన్నికొని యుద్ధమునకు వెడలిరానే రాఁగలఁడు చుమీ. పుత్రుఁడు హతుఁడగుటకుఁ బరితపించుచు దుర్జయుఁడగు నారాక్షసరాజు రావణుఁడు యుద్ధమునకు వెడలిరాఁగానే, పెనుసైన్యముతో వానిం బొదివి వధించి వుచ్చెదను. లక్ష్మణా ! నాథుఁడవగు (యాచమానుఁడవగు) నీవు యుద్ధమున నింద్రజిత్తును వధించుటవలన నిఁక నాకు సీతను భూమినిని బొందుట యెంతమాత్రము కష్టముగాదు' అనెను. రఘువంశ్యుఁడా రాముఁడు తమ్ముని నట్లాశ్వాసించి యాలింగనము చేసికొని సంతుష్టుఁడై సుషేణుంబిలిచి 'నీవు చికిత్సయందు మిక్కిలియు ప్రాజ్ఞుండవు. మిత్రులయందు మిక్కిలి వాత్సల్యము గలయీలక్ష్మణుఁడు దేహమంతయు నలుఁగులు గ్రుచ్చుకొని బాధపడుచున్నాఁడు. ఈతఁడీబాధ యుడిగి సుఖముగా నుండునట్లు నీవు చికిత్సగావింపుము. శీఘ్రముగా లక్ష్మణునకును విభీషణునకును మేనియందలి శల్యములు విడఁ దీయుము. శూరులై వృక్షములుగొని పోరాడు భల్లూకవానరసైనికులలోపల మఱియు నెవరెవరు యుద్ధంబున నమ్ములు గ్రుచ్చుకొని గండ్లుపడియున్నారో వారికందఱకును శీఘ్రంబున నివిపుడు ప్రయత్నపడి సుఖముం గూర్పుము' అనెను. రాముఁడిట్లు చెప్పఁగానే మహాత్ముఁడగు వానరయూథపతి సుషేణుఁడు లక్ష్మణునకు ముక్కున నొకగొప్పయోషధినిడి వాసన చూపెను. ఆలక్ష్మణుఁడు ఆమూలికను వాసనచూచినంత నతని మేనం గ్రుచ్చుకొన్న యలుఁగులు వీడి వేదనయు మాని గాయములు పూడియుం బోయినవయ్యె. అంత సుషేణుఁడు రామునాజ్ఞ చొప్పున విభీషణుఁడు మొదలైన సుహృదులకును సమస్తవానరముఖ్యులకును నపుడు చికిత్సగావించెను. అంతనపుడు లక్ష్మణుఁడు క్షణములోపల శల్యములు విడఁదీయఁబడి, బాధయుడిగి, తుండుడుకును మాని, యెప్పటియట్ల సంతోషముతో నుండెను. అప్పుడు రాముఁడునువానరరాజగు సుగ్రీవుఁడును విభీషణుఁడును, భల్లూకపతియగు జాంబవంతుఁడును, దక్షిణసైనికులందఱును లక్ష్మణుఁడు తెవులుమాని సంతోషముతో లేచుటం జూచి చాలసేపు సంతోషమున నోలలాడుచుండిరి. మహాత్ముఁడగు రాముఁడు, లక్ష్మణుఁడు దుష్కరమయిన యింద్రజిద్వధమును గావించినందులకు నెంతయు

నతనిం బూజించెను. వానరయూథపతులును యుద్ధమున నింద్రజిత్తు కూల్పఁబడుటను వినిసంతోషము నొందినవారయిరి. ఇది తొంబదిరెండవ సర్గము.

---

రావణుఁ డింద్రజిత్తు హతుండగుట విని విలపించుట;
సీతను బీడింపఁ బూనిన రావణుని సుపార్శ్వుఁ
డనుమంత్రి వారించుట.

అంత రావణునిగృహంబుననుండి యాతనికి దోడుగానుండిన రావణుని సచివులు, ఇంద్రజిత్తు హతుఁడయ్యెనని తామె చక్కఁదెలిసికొని దుఃఖితులగుచుఁ బోయి రావణునకుం జెప్పువారై 'మహారాజా! మహాతేజుండగు నీతనూజుని నింద్రజిత్తును యుద్ధమున మేమందఱమును జూచుచుండఁగా, లక్ష్మణుఁడు విభీషణునితోడ్పాటున వధించినాఁడు. యుద్ధంబున నపజయమెయెఱుంగనిశూరుఁ డింద్రజిత్తుగూడ నట్టి శూరుఁడగు లక్ష్మణునితోఁ దలపడి హతుఁడయ్యెను. దేవేంద్రునింగూడ జయించినట్టి శూరుఁడగు నీపుత్త్రుఁడు బాణములచే లక్ష్మణునిఁ దపింపఁజేసి యుద్ధంబున హతులగు వీరులు పొందునట్టి యుత్తమలోకములను బొందినవాఁడయ్యె' ననిరి. ఆరావణుఁడు యుద్ధంబునఁ దనపుత్త్రుఁ డింద్రజితుఁడు హతుఁడయ్యెనని యత్యంతభయంకరమై మిక్కిలియు జాలిఁబుట్టించుచు వేంద్రమయి యున్నవార్తను విన్నంతనే యెంతయు వెనుమూర్ఛ వైకొన్నవాఁడయ్యె. రాక్షసపుంగవుఁడును రాక్షసరాజు నగునారావణుఁడు చాలసేపటికిఁ దెలివొంది, పుత్త్రశోకమునఁ బీడితుఁడై దీనుఁడై యింద్రియములు కళవళింప 'హా! రాక్షససేనాముఖ్యా! నాచిన్నారికొడుకా! మహారథా! నీవు దేవేంద్రునిఁగూడ జయించి తుదకు మనుష్యుఁ డగులక్ష్మణునిబారి కెట్లు చిక్కితివి! నాయనా! నీవు క్రుద్ధుఁడవయినచో, * కాలునిని, అంతకునిని, మందరపర్వతపు శిఖరములనేనియును భేదింతువే! ఇఁక యుద్ధంబున లక్ష్మణుని భేదించుట చెప్పవలయునా? మహాబాహూ! నీ విపుడు మరణమునొంది యమునితోఁ జేరితివిగావున ఆయముఁడు నాకిప్పుడు మిక్కిలియుఁ గావలసినవాఁడయ్యెను. ఇట్లు యుద్ధమున మృతినొందుట గొప్పశూరులకును నవలంబించుపద్ధతి. మనుష్యులకేకాదు; సమస్తదేవతా సమూహములకును నిదియే మార్గము. కాన యుద్ధమున హతినొందుట శూరులందఱును గోరునదియు యశస్కరమైనదియుం గాన నీవిట్లు హతుఁడవయితివని నాకుశోకము లేదు. ఇంతేకాదు. ఎవఁడు తనయొడయనికార్యమునకై హతుఁడగునో వాఁడు స్వర్గము నొందఁగలఁడు. కాన స్వామికార్యార్థమై హతుఁడవై స్వర్గము గొంటివి గావునను నిన్నుగుఱించి శోకింప నక్కఱ లేదు. ఇఁక నిపుడు సమస్తదేవతలును దిక్పాలురును ఋషులును ఇంద్రజిత్తు హతుఁడయ్యెనని విని నిర్భయులై సుఖముగా నిదురవోవఁగలరు. ఇప్పుడు మూఁడులోకములును అరణ్యసహితమైన

---

* కాలుఁడు అంతకుఁడనుట యముని మూర్తిభేదములని తెలియునది.

సమస్తభూమండలమును, ఒకయింద్రజిత్తు లేనందున నాకు శూన్యములుగాఁ దోఁచుచున్నవి. ఇఁక, నింద్రజిద్వధమునకు దుఃఖితులై యంతఃపురమున రోదనము సేయు రాక్షసకన్యల యార్తధ్వనులు, పర్వతగుహాలందు యూథపతివధమునకు దుఃఖించు నాఁడుగజముల యార్తధ్వనియుంబోలె వినఁగలను. పరంతపా! నీవు యౌవరాజ్యమును లంకను రాక్షసులను తల్లిని నన్నును భార్యను నిట్లు మమ్మందఱను దిగవిడిచి యెచటికిఁ బోయితివి? వీరా! నేను యమపురికిఁ బోయిన నీవుగదా నాకుఁ బ్రేతకార్యములు సేయవలసినవాఁడవు. అట్లుగాక విపరీతముగా నీకు నేను జేయునట్లు చేసితివే! ఇదివఱకు నామనస్సు కంటకములన్నియుఁ బుచ్చుచుండినట్టినీవు, ఇప్పుడు, సుగ్రీవుఁడును రాముఁడును లక్ష్మణుఁడును నాకు మనశ్శల్యములై బ్రతికియుండఁగా ఆశల్యమును దీయక యేమమ్మెల్ల దిగనాడి యెచటికిఁ బోయితివి!' యనివిలపించెను. రాక్షసరాజు రావణుఁ డీవిధమున విలపించుచు నార్తుఁడై పుత్రమరణ వ్యసనమునం జేసి మిక్కిలియు కోపావేశము నొందినవాఁడయ్యెను. స్వభావముననే వాఁడికిరణములు గలసూర్యుని, వేసవి కాలమున, కిరణములు మఱింత వేండ్రమైనవానింగాఁ జేయునట్లు, స్వభావముచేతనే కోపనుండగు రావణుని పుత్రవిషయమైన శోకములు మఱియుఁ గుపితునిగాఁ జేసినవి. అప్పుడు రావణుని పదిమొగములందును బన్నినబొమముళ్లు ప్రలయకాలమునందు సముద్రమున నక్రములతోఁ గూడిన గొప్పకరుళ్లవలెఁ బ్రకాశించినవి. రావణుఁడు కోపమున నావులింపఁగా, అతనినోటనుండి, పూర్వము వృత్రాసురుని ముఖమునుండి వెడలినట్లు, ప్రకాశముతో జ్వలించుచు పొగతోఁగూడిన యగ్గి వెలువడెను. పుత్రవధముచేఁ బురపురంబొక్కుచున్న శూరుండా రావణుఁడు, క్రోధము బారిం జిక్కి బుద్ధిచే కర్తవ్యకార్యమేది యని యాలోచించి సీతను వధింప నిచ్ఛగించినవాఁడయ్యె. స్వభావముచేతనే యెఱ్ఱనగు రావణునికన్నులు, అప్పుడు క్రోధాగ్నిచే మఱియు నెఱ్ఱనై మిక్కిలియు భయంకరములుగా జ్వలించిన వయ్యెను. స్వభావముచేతనే భయంకరమగు నతనియాకారము, అప్పుడు కోపాగ్నిపర్వ్వటంజేసి మఱియు భయంకరమై, క్రుద్ధుఁడగు రుద్రుని రూపమువలెఁ దారసింపరానిదై, యుండెను. క్రుద్ధుఁడైన యతనికన్నులనుండి, మండుచున్న దీపములనుండి మంటతో నూనెబొట్లుపడునట్లు, నిప్పుకలతోఁగూడఁ గన్నీటిబొట్లు పడినవి. ఆతఁడు పండ్లుకొఱుకునపుడు, ఆ పెటపెటధ్వని, బలవంతులగు రాక్షసులు పెద్దగానుగుయంత్రముఁ ద్రిప్పుచుండఁగాఁ బుట్టుచప్పుడువలె బెట్టిదముగా వినంబడుచుండెను. మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై ప్రలయకాలాగ్నివలెఁ జూపట్టుచు నతం డేయేదిక్కు చూచునో, ఆయాదిక్కునఁ గలరాక్షసులు బెదరుగిదిరి యతని యెదుటఁబడక స్తంభాదులమాటున మఱఁగియుండిరి. అట్లు కుపితుఁడై ప్రలయకాలమందు చరాచరముల సంహరింపఁగోరుచున్న యంతకునిభంగి భయంకరాకారుఁడై 'యన్నివైపులం జూడ్కులు నిగుడ్చుచున్న యారావణునిపొంతకు రాక్ష

సులు భయమునఁ బోవరయిరి. అంత రాక్షసాధిపతియగు రావణుఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై, యుద్ధభీతులయిన రాక్షసులను యుద్ధమునకు దృఢముగాఁ బురికొలుపుటకై వారలనడుమ 'నేను వేలకొలఁది సంవత్సరములు దుష్కరమయిన తపముగావించి యెడనెడ తపస్సమాప్తికాలములందుఁ బెక్కుమార్లు బ్రహ్మదేవుని సంతోషపఱచితిని. ఆతపస్సంపువలనను మఱియు బ్రహ్మదేవుని యనుగ్రహము వలనను నాకెప్పుడుగాని దేవతలవలనను అసురులవలనను భయమెంతమాత్రము లేదు. ఏలనఁగా, నాకు బ్రహ్మవలన దత్తమై సూర్యునివలె ధగధగ మెఱయుచుండు కవచము దేవాసురులతో యుద్ధము సేయునపుడును వజ్రాయుధము శక్తులన్నియు నెఱిపినను, భిన్నముగాదయ్యె. ఇప్పుడు నే నాకవచమును దాల్చి రథము నెక్కి యుద్ధమునకుఁ బోఁగా నిట యుద్ధమున నన్నెవఁ డెదుర్పఁగలఁడు? సాక్షాద్దేవేంద్రుఁడు గూడ యుద్ధమున నన్నెదుర్పఁజాలఁడు. మున్ను దేవాసురులతో యుద్ధము సేయునపుడు, బ్రహ్మదేవుఁడు ప్రసన్నుఁడై నాకు బాణసహితమగు గొప్పధనువు నొసంగెనే! *ఇప్పుడు రామలక్ష్మణులను మహాయుద్ధమున వధించుకొఱకు బెడిదమైన యాధనువును, వందలకొలఁది వాద్యములధ్వనులు బోరుకొనుచుండ నెత్తితెండు' అనెను. శూరుఁడారావణుఁడు పుత్రవధమున మిక్కిలియుఁ దప్తుఁడై క్రోధము బారింజిక్కి, బుద్ధి నాలోచించి †సీతను జంపవలయునని యుద్యుక్తుఁడయ్యెను. కోపమున కన్నులెఱ్ఱఁబాఱ, మిక్కిలియు ఘోరమగు ప్రకృతియు నతిభయంకరాకారమును గలయారావణుఁడు దీనుఁడై తనయెదుట దీనస్వరులై యున్న రాక్షసులనెల్లం జూచి 'నాచిన్నికొడుకింద్రజిత్తు వానరులను వంచించుకొఱకు మాయచేత దేనినో యొకదానిని సీతగా రచించి చంపి యాపొల్లుదానినే 'ఇదియే సీత' యని వానరులకుఁ జూపినాఁడు. ‡వాఁడు పొల్లుగాఁజేసినది నేను నిజముగానే చేసెదను. ఇట్లు సేయుటయే నామది కిష్టము. ఆచెడిపోయిన రాచవానినే యనుసరించి తగిలియున్న సీతను నిపుడే చంపి వుచ్చెదను'

* ఇట 'రామలక్ష్మణయోరేవ వధాయ పరమాహవే' అని మూలము. వాస్తవార్థమున (రామలక్ష్మణయోః పరమాహవే) రామలక్ష్మణులయొక్క యుద్ధమందు, (వధాయ) వానరులను వధించుకొఱకు, అవింటిని నెత్తితెండని యర్థము. 'వందలకొలఁది వాద్యధ్వనులతో నెత్తితెండు' అనుటచే నింతకు ముందు దానిని నెత్తి తేలేదనియు నిదియె క్రొత్తగాఁ దెచ్చుటయనియు తోఁచుచున్నది

† 'సీతాం హన్తుం వ్యవస్యత' అనిమూలము. (సీతాం) సీతను, (హన్తుం) పొందుటకు, ఆమెను సందర్శించుట కనుట, నిశ్చయించెనని వాస్తవార్థము.

‡ ఇందులకు 'తదిదం తథ్యమేవాహం కరిష్యే ప్రియమాత్మనః। వైదేహీం నాశయిష్యామి క్షత్రబంధుమనువ్రతామ్' అనిమూలము. వాస్తవార్థము.-(అహం) నేను, (క్షత్రబంధుం) క్షత్రియులకు పరమాప్తుఁడైనరాముని, (అనువ్రతాం) అనుసరించినదగు, (వైదేహీం) సీతను, (తథ్యం) నిజముగా, (నాశయిష్యామి యది) నాశము సేయుదునేని, (తదిదం) ఆసీతావధము, (ఆత్మన అప్రియ ఏవస్యాత్) నాకు అప్రియమెయగును. కాన (కరిష్యే) (ఇతరరాక్షసుల సంతోషమునకుఁగాను బెదరుకొంచెము

అనెను. రావణుఁ డిట్లు సచివులకుఁ జెప్పి శీఘ్రమున ఖడ్గము సంకించెను. ఆరావణుఁడు పుత్రశోకమున మనస్సు మిక్కిలి తత్తఱిల్లఁగా నెంతయుఁ గ్రుద్ధుఁడై పుష్పమాలికాయుక్తమై, నిర్మలమైన యాకాశమువలె వెలయుచున్న ఖడ్గము నెత్తికొని, భార్యలును సచివులును బలసి తోడరాఁగా వేగమున సీతయున్న యెడకుఁ దోడనేపోయెను. రాక్షసులు, రావణుఁడు పోవుచుండుటం జూచి సింహనాదములు గావించి యతఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై యుండుటనుగాంచి యింకఁ దమకు గెలుపుగలుగునని సంబరమున నొండొరువులం గవుంగిలించుకొని యొకరితో నొకరు 'ఇప్పుడు ఆయన్నదమ్ములు రామలక్ష్మణు లిరువురును, రావణుని యిట్టి భయంకరాకారమును జూచి దిగులుపడఁగలరు మున్నితఁడు క్రుద్ధుఁడై లోకపాలురను నలువురను జయించినాఁడుగాఁడా! మఱియు ననేకయుద్ధముల నితరశత్రువులంగూడఁ బెక్కండ్రను గూల్చినవాఁడుగదా! రామలక్ష్మణు లితని కెంతమాత్రము. మఱియు రావణుఁడు ముల్లోకములందును శ్రేష్ఠములగు వస్తువులం గొనితెచ్చి యనుభవించుచున్నాఁడు. పరాక్రమమునంగాని బలమునంగాని యీతనికి సాటియైనవాఁడు భూలోకంబుననే లేఁడు' అని గుజగుజలు వోయిరి. ఆ రాక్షసు లట్లొండొరులతో గుజగుజ లాడుచుండఁగానే రావణుఁడు కోపావేశమున మైమఱచి యశోకవనము నున్న సీతంగూర్చి వేగంబోయెను. అట్లు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడగు రావణుఁడు తనహితము గోరునట్టి సుహృదులు వలదని యెంతవారించినను నిలువక, ఆకాశమున నంగారకుఁడు క్రుద్ధుఁడై రోహిణిమీఁదికిఁ బోవునట్లు, సీతంగూర్చి పోయెను. రాక్షసస్త్రీలు కావలికాఁచుచుండఁగా నేకందును లేకున్న మిథిలరాజనందన సీతయు క్రుద్ధుఁడై మేటిఖడ్గమునుగొని రావణుఁడు వచ్చుచుండుటను జూచెను. జనకరాజసుత సీత, అట్లు ఖడ్గధరుఁడై స్నేహితులువలదని పలువిధముల వారించుచున్నను, నిలువక తనమీఁదికి వచ్చుచున్న రావణునిం జూచి దిగులుపడి దుఃఖావేశంబున విలపించుచు 'దుర్బుద్ధియగు నీరావణుఁడు క్రుద్ధుఁడై నామీఁదికిఁ బరుగెత్తివచ్చుచున్నాఁడు. కావున వీఁడు సనాథనగునన్ను అనాథనుంబోలె వధింపనున్నాఁడు. వీఁడు పెనిమిటినే యనువర్తించు నన్ను 'నాకు భార్యవుగమ్ము; నాతో రమింపుము' అని యనేకవిధములఁ బ్రేరించినాఁడు. కాని నే నొల్లనని పరిష్కారముగా వీనిని నిరాకరించివైచితిని. నే నంగీకరింపనందున వీఁడు నిరాశనొంది, కోపమును మోహమును మిక్కిలియుం బయికొనఁగా నన్ను వధించుటకు నుద్యుక్తుఁడయి వచ్చినాఁడు. ఇది స్పష్టము. లేక వీఁ డీకత్తితో వచ్చుటను జూడఁగా పురుషసింహులయిన యాయన్నదమ్ములను రామలక్ష్మణులను నానిమిత్తమై యీయపూజ్యుఁ డిపుడు యుద్ధమున నీకత్తిచేఁగూల్చి యిటవచ్చినాఁడేమో! అయ్యో! నానిమిత్తమై యారాజకుమా

---

దుఃఖమును) చేసెదనని యర్థము. నేను క్షత్రియులకుఁ బరమాప్తుఁడగు రామునిననుసరించియుండు సీతను యథార్థముగానే వధింతునేని అది నాకు మిక్కిలి యప్రియమే. అయినను రాక్షసులసంతోషమునకై యామెకు కొంతదుఃఖము కలిగించెదనని భావము.

రులకు నిట్లు నాశముగలిగెనే! ఇట్టి పాపాత్మురాలనా! ఇస్సీ! పాడై పోదునుగాక. లేక యతిక్రూరుఁడై పాపములు సేయుటయందు వెనుదీయకుండు రావణుఁడు పుత్రశోకమునం జిక్కి యుండుటచే రామలక్ష్మణులను వధింపఁజాలక వారికి బదులుగా నన్ను వధింపనున్నాఁడో! ఆలోచనమాలినదాననుగాన నేను హనుమంతుఁడపుడు చెప్పిన మాటనయినను వినకపోయితిని. ఏనిందయును బొందని నేను, అప్పుడు హనుమంతుని వీఁపుపయిని గూర్చుండి పోయియుండునేని ప్రియునియొద్దఁ జేరియుందును గాన యిప్పుడిట్లు దుఃఖపడకుందునే! రామలక్ష్మణులు నిజముగా వీనిచే వధింపఁబడినవారేని, కానక కానక యొక్కకొడుకుంగన్న కౌసల్య, ఆయొక్క కొడుకును యుద్ధమున హతుఁడయ్యెనని వినఁగానే యామెగుండియ తప్పక వ్రీలునని తలఁచెదను. ఆకౌసల్య, మహాత్ముఁడగు రాముని పుట్టినముద్దును, పసితనమునఁబెరిఁగినగోమును, యౌవనమున మెలఁగిన చెలువమును, ధర్మకార్యముల కనురూపమైనస్వభావమును రూపును తలఁచితలఁచి యేడువంగలదు. ఆయమ, పుత్త్రుఁడు నిహతుఁడగుటఁ దెలిసి మూర్ఛిలి యంత నతనికి శ్రాద్ధముసేసి ప్రపంచమునం దాశవదలి అగ్నియందైన నుఱుకును; లేక నీళ్లనైనం జొచ్చును. ఇది నిజము. ఇస్సీ! ఆకుబ్జ మంథర పాడై పోవుఁగాక. పాపములకు వెనుదీయక యొడిగట్టుకొనియెయుండు నాదుష్టురాలివలననే కౌసల్య కిట్టి దుఃఖము సంభవించినది. అది పాడై పోవుఁగాక' యని విలపించెను. ఇవ్విధమున విలపించుచు, చంద్రునింబాసి యంగారకగ్రహముబారిం జిక్కియున్నరోహిణియుంబోలె మిక్కిలియు జాలిగొలుపుచున్న సీతనుజూచి, యింతలో రావణునిమంత్రియు బుద్ధిమంతుఁడును బరిశుద్ధుఁడును మేధావియునగు సుపార్శ్వుఁడను రాక్షసుఁడు సచివులువలదని వారించుచుండఁగా నిలువకపోవుచున్న రాక్షసేశ్వరుని రావణునింజూచి' రావణా! నీవు సాక్షాత్కుబేరుని తమ్ముఁడవు. మహాకులప్రసూతుఁడవు. ఇట్టి నీవు ధర్మమును దిగఁద్రోచి కేవలక్రోధమునకు లోనై సీత నెట్లు వధింపఁగోరెదవు? వీరా! రాక్షసేశ్వరా! వేదముల నధ్యయనముచేసి విద్యలనెల్లఁ జదివి, వ్రతస్నాతుఁడవైనవాఁడవు. ఎప్పుడును విహితకర్మములఁ దప్పక యాచరించువాఁడవు. అట్టి నీకు స్త్రీని వధింపఁ దలంపుగాని యెట్లు గలిగినది? రాజా! సీతయో మిక్కిలి రూపవతి. ఇట్టి చెలువను జంపక యే దక్కించుకొనువిధముం జూడుము. ఈకోపమును నీవును మమ్ముం గూడిపోయి రామునందేచూపుము. * నీవు నేఁడు కృష్ణపక్షచతుర్దశియందే యుద్ధమునకుఁ బ్రయాణసన్నాహము సేసి, రేఁపమావాస్యయందు సమస్తబలపరివృతుఁడవై

* ఇట 'అభ్యుత్థానంత్వమద్యైవ కృష్ణపక్షచతుర్దశీం। కృత్వా నిర్యాహ్యమావాస్యాం విజయాయబలైర్వృతః' అనిమూలము. చతుర్దశియందు ప్రయాణసన్నాహమును జేయుమనుటచే త్రయోదశీ యుద్ధదినములు గడచినవని తేలుచున్నది. ఎట్లనఁగా- సువేలాద్రి నెక్కినరాత్రి 'తతోఽస్తమగమత్సూర్య స్సన్ధ్యయాప్రతిరఞ్జితః। పూర్ణచన్ద్రప్రదీపాచ క్షపాసమభివర్తత' అనుటంబట్టి పున్నమనాఁడు సువేలాప్రవేశము. పిమ్మట కృష్ణపక్షపాడ్యమిని యుద్ధారంభము. నాఁటిరాత్రియె నాగపా

జయమునొందుటకు బయలువెడలుము. నీవు శూరుఁడవు, బుద్ధిమంతుఁడవు, మహారథుఁడవు, నానాఖడ్గాద్యాయుధములంగొని యుత్తమమగు రథము నెక్కి † దశరథకుమారుని రాముని వధించి సీతాదేవిని బొందఁగలవు ఇట్లుగాక యూరక సీతను జంపినఁ బ్రయోజనమేమి' అనెను. దురాత్ముఁడును వీర్యవంతుఁడు నగు నా రావణుఁడు, సుహృదుఁడగు సుపార్శ్వుఁడు మిక్కిలి ధర్మయుక్తముగాఁ జెప్పినమాట నంగీకరించి, గృహమునకుఁ బోయెను. అంత నతఁడు సుహృదులు పరివేష్టించిరా, మరల సభామండపమునకుం బోయెను. ఇది తొంబదిమూఁడవసర్గము.



## మూలబలయుద్ధము; రాముఁడు దానిని నిర్మూలము గావించుట.

రాక్షసరాజు రావణుఁడు సభామండపమును బ్రవేశించి దీనుఁడై మిక్కిలియు దుఃఖించుచు క్రుద్ధంబయిన సింహమువలె నిట్టూర్పులువిడుచుచు మేటిసింహాసనమునం గూర్చుండెను. మహాబలవంతుఁడగు నా రావణుఁడు పుత్రవ్యసనమున గ్రుంగుడుపడుటం జేసి తన సేనాధ్యక్షుల ననునయించుటకై వారి నందఱనుజూచి చేమోడ్చి గీలించి 'మీరలందఱును సమస్తములయిన యేనుంగులు గుఱ్ఱములు రథసమూహములు పదాతులు మొదలగుసైన్యములతోఁ గూడి యుద్ధమునకు వెడలుఁడు. మీరలు రామునొక్కనిని యుద్ధంబునఁ జుట్టుముట్టి వర్షాకాలమున మేఘములు వర్షముగురియునట్లు, బాణవర్షములు గురియించి ‡ యతనిని వధింపవలయును. లేక మీచేత రాముఁడు హతుఁడగుట శక్యముగానియెడల, నేఁడు మహాయుద్ధము గావించి మీరు వాఁడిబాణములచే నతనిగాత్రమును భేదించితిరేని యట్లు హీనబలుఁడై యున్న యా రాముని రేపు లోకులెల్లఁ జూచుచుండఁగా నేను వధించిపుచ్చెద' ననెను. ఆ రాక్షసులు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు చెప్పిన యామాటను గయికొని

శబంధమును తత్పంధవిముక్తియు. విదియయందు ధూమ్రాక్షవధము. తృతీయయందు వజ్రదంష్ట్రివధము. చతుర్థియందు అకంపనవధము. పంచమియందు ప్రహస్తవధము. షష్ఠిని రావణమకుటభంగము. సప్తమియందు కుంభకర్ణవధము. అష్టమియం దతికాయాదులవధము. నవమిని మరల నింద్రజిత్తుయుద్ధము. ఆరాత్రియే కుంభనికుంభాదులవధము. దశమిని మకరాక్షవధము. ఏకాదశి ద్వాదశి త్రయోదశులందు నింద్రజిద్వధమని తెలియునది. ఇది యొకపక్షము. వాస్తవమునకు నవమియందు యుద్ధారంభము గనుక నవమీదశములు రెండుదినములలో రావణుఁ డింద్రజిత్తును మూలబలమునుదప్పఁ దక్కినరాక్షసులందఱు వధింపఁబడిరి. ఏకాదశి ద్వాదశి త్రయోదశులచే నింద్రజిద్వధము. కావున, చతుర్దశియందు యుద్ధప్రయాణసన్నాహము చేయుమనుట యొప్పుచున్నదని తెలియునది.

† ఇందులకు 'హత్వా దాశరథింరామం భవాన్ ప్రాప్స్యతి మైథిలీమ్' అని మూలము. (భవాన్) నీవు, (దాశరథింప్రతిహత్వా) రామునిఁబొంది, (దాశరథింమైథిలీం ప్రాప్స్యతి) రామునిచే యుద్ధమున హతుఁడవై వారిరువురకు సార్షముఁడవగుటం బొందుదువని వాస్తవార్థము.

‡ ఇచటను మీఁదనెల్లను వాస్తవార్థము రామభక్తిపరముగా నూహించుకొనునది.

వేగముగల రథముల నారోహించి నానావిధ సైన్యము లెంతయు బలసినదున బయలు
వెడలిరి. ఆరాక్షసులు గదలను, శరీరములను రూపుమాపునట్టి పరిఘములను పట్టిసము
లను బాణములను ఖడ్గములను పరశ్వథములను వానరులమీఁదం బ్రయోగించిరి. వాన
రులును రాక్షసులమీఁద వృక్షములను పర్వతములనుం బ్రయోగించిరి. అట్లు రాక్షసు
లకును వానరులకును సూర్యోదయము మొదలుగా, అమ్మహాయుద్ధము భయంకరమై
తుములముగాఁ బ్రవర్తించినదయ్యె. అప్పుడు వానరులును రాక్షసులును యుద్ధము
నం దొండొరులపై విచిత్రము లగు గదలను ప్రాసములను ఖడ్గములను గండ్రగొడ్డం
డ్లను శిలలను వృక్షములనుం బ్రయోగించి యొకరి నొకరు ప్రహరించిరి. ఇవ్విధమున
రాక్షసులకును వానరులకును మహాయుద్ధము ప్రవర్తిల్లఁగా నందు మిక్కిలియు నధి
కముగా రేఁగినదుమ్ము రక్తప్రవాహములచే నడంగినదయ్యె. అప్పుడు నెత్తురు
నదులు ప్రవహించినవి. అందు నిటునటు గజములును రథములును తీరములుగాను,
గుఱ్ఱములు మత్స్యములుగాను, ధ్వజములు వెల్లువం గొట్టికొనివచ్చు వృక్షములు
గాను, కళేబరములు తెప్పలుగాను గానంబడినవి. అంత నావానరులందఱు నెత్తురు
వెల్లువలం దొప్పదోఁగుచు, యుద్ధమున రాక్షసుల ధ్వజములను కవచములను రథ
ములను నశ్వములను నానావిధములయిన యాయుధములను నెగిరి నొగిరి విఱి
చివైచిరి. వానరులు రాక్షసులతలవెండ్రుకలను చెవులను నొసళ్లను ముక్కులను
తీక్ష్ణములయిన దంతములం గొఱికియు గోళ్లచే గీఱియుఁ ద్రుంచివైచిరి. ఫలవంత
మగు వృక్షమును పెక్కుపక్షులు వచ్చి ముసరునట్లు యుద్ధమున నొక్కొక్క రాక్ష
సుని నూర్గురేసి మేటివానరులు మూఁగొని పోరాడిరి. పర్వతాకారులగు రాక్షసులను,
అట్లు భయంకరులయిన వానరులను పెనుగదలచే మోఁదియు నీఁటెలచేఁ బొడిచియుఁ
గత్తులచే నఱకియు, గండ్రగొడ్డండ్రచేఁ జెక్కియు నొప్పించిరి. రాక్షసు లట్లు వధిం
చుచుండఁగా వానరమహాసేన యోఁగఁజాలక సమస్తలోకశరణ్యుఁ డగుదశరథకు
మారుని రాముని శరణుఁ జొచ్చినది. అంత మహాతేజుండును వీర్యవంతుఁడునగు
రాముఁడు విలుగొని రాక్షససేనం జొచ్చి బాణములు గురియించెను. అప్పుడు రా
ముఁడు రాక్షససైన్యమును జొరఁగానే మహాభయంకరుఁడై బాణాగ్నిచే నిర్దహిం
పఁగా, గ్రీష్మర్తువునం దాకాశమున మేఘములు సూర్యునింబోలె, ఆరాక్షసులు
రామునిఁ దారసింపఁ జాలరయిరి. యుద్ధమున రాముఁడు మహాభయంకరములును
నితరుల కశక్యములు నగుకార్యములను జేయఁగా నతనిహస్తలాఘవాతిశయ
మువలన రాక్షసు లక్కార్యములను జేసినయెనపిదపఁ జూచిరిగాని చేయుచున్న
ప్పుడు చూడఁజాలరయిరి. అతనికార్యములను జూడక పోవుట యేకాదు. వనమునఁ
బెనుగాలి గొట్టినపుడు, కొమ్మలాడుట చెట్లు విఱుగుట మొదలగు దానికార్యము లగ
పడునేకాని యావాయువేమో యగపడనట్లు, రాముఁడు రాక్షససేనం జొచ్చి
బాణవర్షము గురియఁగా రాక్షసులకు నతని సంచారలాఘవమునం జేసి పెనుపై

న్యము చేసిరి పాఱుట మహౌఘములు నుగ్గగుట మొదలగు నతనికార్యము లగపడి నవేకాని కర్తయైన యతఁడేమో యెంతమాత్రమును గనఁబడినవాఁడు గాఁడయ్యె. ఆరాక్షసులు, రామునిచే కొందఱు బాణముల ఖండింపఁబడియు కొందఱుచీల్పఁబడియు కొందఱుగాలియుఁ గొందఱవయవములు తుత్తుమురు గావింపఁబడియు కొందఱు ఱొమ్మున శల్యము గాఁడియు నున్నసేనం జూచిరేకాని, శీఘ్రకారి యగురాముని నెంతమాత్రమును జూడఁజాలరయిరి. ప్రజలు పంచభూతాత్మకమగు తమశరీర మందలి జీవాత్మను,అతఁ డింద్రియార్థముల ననుభవించుచుండుటంబట్టి యున్నాఁడని యనుమానముచేఁ దెలిసికొనుటయేకాని ప్రత్యక్షముగాఁ జూడలేనట్లు, ఆరాక్షసులు రాముఁడు తమశరీరములను బ్రహరించుచుండఁగా నాప్రహారములంబట్టి రాముని ననుమానించిరేకాని యతనిని ముందటఁ గన్నారఁ జూచినవారు కారైరి. రాముఁ డతివేగమున నిటునటు రాక్షససేనల సంచరించుచు వధించుచుండఁగా నతఁడు మెఱుపువలె నెచట నగపడునో యచట నున్నరాక్షసుని రామునిఁగా భ్రమించి 'వీఁడుగో రాముఁడు ఏనుంగులను జంపుచున్నాఁడు. వీఁడుగో మహారథముల నుఱుము సేయుచున్నాఁడు. వీఁడుగో వాఁడిబాణములఁ బదాతులను గుఱ్ఱములను వధించుచున్నాఁడు' అని యఱచుచు ఆరాక్షసులు రాముఁ డున్నచోటనుండిన సాదృశ్యమునం జేసి యొకరినొకరు రామునిఁగా భ్రమించి కుపితులై యొండొరులనే వధించుకొనిరి. * ఆరాక్షసులు మహాస్వభావము గలమేటిగాంధర్వాస్త్రముచే

---

* రాముఁడు గాంధర్వాస్త్రముచే శత్రువులను మోహమును గలిగించి వధించినాఁడని తలఁపరాదు. అట్లైన యతనికిని నింద్రజిత్తునకును భేదమేమి? గాంధర్వాస్త్రముచే మోహమును గలిగించినాఁడనఁగా ఆ యస్త్రమును బ్రయోగించునపుడు రాక్షసులు దానివేగాతిశయమును దానిని వేసినవాఁడు తమవాఁడో పరుఁడో యని భేదము గ్రహింపలేక మోహమునొందిరని భావము. కనుక మోహమనఁగా వేగమువలన గ్రహింపలేకపోవుటయని తెలియునది. రాముఁ డతివేగమున సంచరించులాఘవమునుంబట్టి, యతఁ డక్కడ నగపడెనో యచ్చటనే యాక్షణమందగపడక వేఱొండుచోట మెలఁగుచుండుటచే ఆక్షణమందే రాక్షసులతనినుద్దేశించి వేసినబాణములు అచ్చటఁగల తమవారినే చంపినవయ్యెను. ఇట్లు అస్త్రప్రయోగముయొక్క వేగాతిశయమువలనను రాముని సంచారలాఘవాతిశయమువలనను రాక్షసులు వీఁడు వాఁడనియు ఇందునందనియు తెలియనేరక మోహితులై యొండొరులను జంపుకొనిరేకాని యస్త్రముచే తమలో నొక్కొక్కఁడు రాముఁడుగా తోఁచుటచే మోహితులైరి కాదు. [illegible] వేగాతిశయమునుంబట్టియే యతనిం గనుఁగొనుటకు రాక్షసులు నానాదిక్కులకు న్నులగిఱుపఁగా అందందు నతఁడు గనుపట్టుటచే ఒక్కఁడే పెక్కండ్రుగా రాక్షసులకుఁ దోఁచినాఁడని తెలియునది. కాఁబట్టియే రాముఁడు శీఘ్రకారి యనఁబడెను. వింటికొప్పున కొంచెమిసుక నుగా వ్రేల్చుటయు రాముఁ చక్రముగా రూపించుటయు ప్రయోగముయొక్క త్వరంబట్టియే చెప్పనొప్పును. కావున నీ సుగ్రీవాదులు తిని యస్త్రప్రయోగలాఘవమును మాయాబలముగా శంకింతురోయని రాముఁడు 'ఇది యస్త్రమును బ్రయోగించు సామర్థ్యమువలననైనదే కాని యస్త్రమువలననైనది గాదనియుఁ జెప్పినాఁడు. కనుక నటయస్త్రముచేత మోహితులైరనఁగా

మోహితులై తమసైన్యమును దహించుచున్న రామునిం జూడఁజాలరయిరి. ఆరాక్షసులకు భయాతిశయమువలన యుద్ధమున రాముఁడు వేలకొలఁది రాములై యగపడును; మరల మహాయుద్ధంబున నప్పుడె యొక్కఁడుగానే కానఁబడును. మహాత్ముఁడగు రాముఁడు మండలాకారగతివిశేషములం దిరుగునపుడు, అతనివింటి బంగారుకొప్పుగూడ గిఱ్ఱునఁ దిరుగుచుండుటచే గిఱ్ఱునఁ ద్రిప్పఁబడుచున్న కొఱవికట్టియవలె తెలుపులేని యొకటే రేకగా రాక్షసులకుఁ గనుపట్టుచుండెనే కాని రాముఁడేమో కనఁబడినవాఁడు గాఁడయ్యె. అప్పుడు తనచుట్టు మండలాకారముగా గుడుసుపడియున్న వింటితోఁగూడి యుద్ధంబున రాక్షసులం జక్కాడుచు సుదర్శనచక్రముం బోలియున్న రాముఁడు ప్రజలకు జ్యోతిశ్చక్రముంబోలెఁ జూపట్టినవాఁడయ్యె. వింటిగుడుసుతోడి రాముఁడనెడి యాసుదర్శనచక్రమునకు రాముని శరీరమె నడిమి మిట్టగానుండు తూముపట్టు; పరులను సంతాపింపఁ జేయు నతనిబలమే జ్వాలామాలి యనుదానిజ్వాల. అతఁడొక్కపెట్ట వేయేసిగా వేయుబాణములె సహస్రారంబగు నాచక్రమునకు ఆకులు. గుడుసుపడియున్నధనువే దానిచుట్టుకట్టు. జ్యాతలఘోషమే నిరంతరఘోషంబగు నాచక్రముధ్వని. పరాక్రమమె దానియక్షము. రామశరీరకాంతియె దానిప్రభ. దివ్యాస్త్రములమహత్త్వమె దానిచుట్టువాదర. వాయువేగములగు రథములు ఏడుకోట్ల యిరువదితొమ్మిది లక్షలును, బలయుక్తములగు గజములు పదుమూడుకోట్ల పంద్రెండులక్షలయిరువదివేలును, కాలుతులతోఁ గూడినయశ్వములు * పదకోట్ల యిరువదిలక్షల యఱువదివేలును పదాతులు నూటనలు

దానివేగమువలన వేసినవానిని గ్రహింపలేరయిరని భావము. అస్త్రముయొక్క కార్యము దహించుటమాత్రమే. దానిని బ్రయోగించినలాఘవమే మోహనమునకు కారణము.

* అనీకమనఁగా 'ఏకేభైకరథాత్ర్యశ్వా పత్తిః పంచపదాతికా। పత్త్యంగైస్త్రిగుణైస్సర్వైః క్రమాదాఖ్యాయథోత్తరమ్। సేనాముఖం గుల్మగణౌ వాహినీపృతనాచమూః' ఒకయేనుఁగును ఒకరథమును మూడుగుఱ్ఱములను అయిదుపదాతులును గలది పత్తియనఁబడును. మొత్తమునకు పదియురువులుగలదండు పత్తియనుట. మూఁడుపత్తులు సేనాముఖము. మూఁడుసేనాముఖములు గుల్మము. మూఁడుగుల్మములు గణము. మూఁడుగణములు వాహిని. మూఁడువాహినులు పృతన. మూఁడుపృతనలు చమువు అనంబడును. ఇటచమువే యనీకమనఁబడినది. దీనింబట్టి (౭౨౯౦) ఏడువేలరెన్నూట తొంబదియురువులు గలసేన యనీకమగు. అట్టియనీకములు పదివేలు అనఁగా ఏడుకోట్ల యిరువదితొమ్మిదిలక్షల యురువులనుట. ఇట్లే 'అనీకం దశసాహస్రం రథానాం వాతరంహసాం। అష్టాదశసహస్రాణి కుంజరాణాం తరస్వినాం। చతుర్దశసహస్రాణి సారోహాణాంచ వాజినాం। పూర్ణే శతసహస్రే ద్వే రాక్షసానాం పదాతినామ్' అను గణనమున దశసహస్రములయిన (పదివేల) యనీకముల రథములనఁగా ఏడుకోట్లయిరువదితొమ్మిదిలక్షలు. అష్టాదశసహస్రములయిన (పదునెనిమిదివేల) అనీకముల గజములనఁగా పదుమూడుకోట్ల పంద్రెండులక్షల యిరువదివేలు. చతుర్దశసహస్రములయిన (పదునాల్గువేల) అనీకముల గుఱ్ఱములనఁగా పదకోట్ల యిరువదిలక్షల యఱువదివేలు. ద్విశతసహస్రములయిన (రెండులక్షల) అనీకముల పదాతులనఁగా నూటనలుబదియైదుకోట్ల యెనుబదిలక్షలని తెలియునది.

పదియేనుకోట్ల యెనుబదిలక్షలునుగా కామరూపులయిన రాక్షసుల యీచతు రంగబలమును రాముఁడగ్నిజ్వాలలవంటి బాణములను మూఁడునుమ్మాతిక గడియ లోపలఁ దానొక్కఁడే హతము గావించినవాఁడయ్యె. అంత హతశేషులగు రాక్షసు లు, అశ్వములు చచ్చి రథములు నుఱుమై, యుత్సాహము మాలి ధ్వజములు దుత్తు మురై లంకాపురమునకుఁ బోయిరి. మిక్కిలియు మహాత్ముఁడగు నా రాముని యుద్ధరం గము హతములగు గజములును తురగములును పదాతులునుం గలిగి, * క్రుద్ధుండ గు రుద్రుని క్రీడాస్థానంబగు శ్మశానవాటివలె భయంకరమై యుండెను. అంత దేవతలును, గంధర్వులును సిద్ధులును మహర్షులును రాముఁడు గావించిన యీమ హాకార్యమును 'బాగుబాగు' అని కొనియాడిరి. అప్పుడు ధర్మాత్ముఁడగురాముఁడు తన పొంతనున్న సుగ్రీవునిని విభీషణునిని హనుమంతునిని జాంబవంతుని వానరోత్తముం డగు మైందుని ద్వివిదునింజూచి, † 'ఇట్లు మూలబలమునంత క్షణములోపల మాపు ట మాయం జేసికాదు. ఇది యస్త్రమును బ్రయోగించు శక్తిచేనైనది. ఇట్టిదివ్య శక్తి నాకును సంహారకాలమందు శివునకును మాత్రమేకలదుగాని మఱెవ్వరికిని గలు గదు' అనెను. అప్పుడు దేవేంద్రసమానుఁడై దివ్యాస్త్రంబులను శస్త్రములను నెంత యుఁ గడిదేఱియున్న మహాత్ముఁడు రాముఁడు ఆరాక్షససైన్యమును హతము సేయు టయు, దేవతలందఱును మిక్కిలియు సంతుష్టులై గుంపులుగొని యతనినెంతయు స్తోత్రములు చేయువారైరి. ఇది తొంబదినాలుగవసర్గము.

---

## రాక్షసస్త్రీలపలాపము.

రావణుఁడు పంపినసైన్యమునంతయును, పెక్కువేలరౌతులతోఁగూడినగుఱ్ఱ ములను ఏనుంగులను వేనవేలు ధ్వజాలంకృతములై యగ్నివలె ధగధగ మెఱ యుచున్న బంగారురథములను శూరులై గదలతోను పరిఘములతోనుం బోరువారై రథంబులపయిని బంగారుటెక్కెముల కాంతులచే వింతవన్నెలుదాల్చు నల్లనిమేను లుగలిగి కామరూపులయియున్న పెక్కువేలరాక్షసులను, రాముఁడనాయాసమున

---

* 'హతైర్గజపదాత్యశ్వై స్తద్బభూవరణాజిరమ్ । ఆక్రీడమివరుద్రస్య క్రుద్ధస్యసుమహాత్మ నః' అనిమూలము- ఇట క్రుద్ధుఁడగురుద్రునిఁ జెప్పుటచే ప్రళయకాలమునం గ్రుద్ధుఁడగు మహాత్ముఁడ యినరుద్రుని క్రీడాస్థానమువలె రథగజతురగములు హతములైయున్నరాముని యుద్ధరంగము చూ పట్టెనని యర్థాంతరమును గ్రాహ్యము.

† ఇందులకు 'ఏతదస్త్రబలందివ్యం మమవాత్ర్యంబకస్యవా' అనుమూలము. ఇట్లు క్షణములో లెక్కలేని బలురాక్షసులను జంపుట మాయవలనఁగాదు. అస్త్రమును బ్రయోగించుశక్తి లాఘవమువలనని యర్థము. అస్త్రమునమాత్రే మాశక్తియను. అట్లేని 'గాంధర్వేణ గాంధర్వమ్' అను రావణాదులకుఁ గూడ గాంధర్వాస్త్రములుండుటచే నాశక్తి యుండవలయునుగదా. అదియును గాపున కేవల మస్త్ర శక్తికాక అస్త్రప్రయోగశక్తియేయని తెలియునది.

బంగారుచే రంగారువాఁడిబాణముల వధించివుచ్చెను. హతశేషులగు నరాక్షసులు యుద్ధమునుండి వెనుకకుఁ ద్రొక్కఁబడి పాఱివచ్చినవారును లంకనున్నవారలును, అట్లు రాముని చేత మూలబలము వధింపఁబడుటను గనియు వినియు, రాక్షస స్త్రీలతోఁ జేరి దీనులై చింతలమునింగినవారయిరి. యుద్ధమున రామునిచే పెనిమిటిచచ్చియు పుత్రులుచచ్చియు బాంధవులు హతులయ్యు నున్నరాక్షస స్త్రీలొండొరులం గవుంగిలించుకొని దుఃఖార్తలయి యిట్లు పలవించిరి. 'శూర్పణఖ ముసలిది, వికృతాకారముగలది, దానికడుపు వ్రేలుకాడుచుండును. ఇది, వనంబున రూపొందిన మన్మథునివలె నత్యంత సుందరుఁడై సుకుమారుఁడును మహాబలుఁడును సర్వభూతహితరతుఁడు నయినరాము నొద్ద కెట్లుపోయినది? సమస్తలోకములచేతను నిందనీయ యగుకురూపిణి యాశూర్పణఖ యట్టిరాముంజూచి మోహించినదఁట! శూర్పణఖకు మంచిగుణ మొక్కటియు లేదు. రాముఁడో సమస్తసుగుణసంపన్నుఁడు. ఇది వికారముఖముగలిగి వన్నె మాలినది. రాముఁడో సుందరమైన ముఖముగలిగి మిక్కిలి తేజము దొలఁకుచుండువాఁడు. ఇది రాక్షసి, అతఁడు మనుష్యులలానుఁడు. ఇట్టిది యట్టిరాముని నెట్లు కామించెను! ముసలితనము నుదరి ముడుతలుపడి వెండ్రుకలెల్ల నరసి రాముని కెంతమాత్రము ననురూపగాని యీశూర్పణఖ, మాయిందఱము దుర్భాగ్యుల మగుటవలన ఖరదూషణులును మఱియు సమస్తరాక్షసులును వినాశమునొందుటకై మిక్కిలి పరిహాసాస్పదమును సమస్తలోకనిందితమును నగు చేయరానికార్యమును * రాముని మోహించుటను గావించినది. ఆబిడ నిమిత్తమై రావణుఁడు రామునితో నీవ హావైరము పెట్టుకొనెను. రావణుఁడు తనవధమునకై యాసీతను గొనితెచ్చి బలవంతుఁడగు రామునితో తీఱనివిరోధము నుంచుకొన్నాఁడు. ంతేకాని జనకరాజసుతయగు నాసీత యేమో, యీరావణునకు వశురా లగుటలేదు. మున్నుసీత నపహరింప వేఁడిన యారాక్షసుని విరాధుని, రాముఁడొక్కఁడే వధించుటను జూచియున్న మనకు ఆవిరాధునివధమే రాముఁడు తనవిరోధులనెల్ల విరసించుటకుఁ జాలిననిదర్శనము. రాముఁడు జనస్థానమున భయంకరపరాక్రములగు పదునాల్గువేల రాక్షసులను అగ్నిజ్వాలలంబోని బాణములచే వధించివుచ్చెను. అదియు నతఁడు పగవారినెల్ల నుఱుమాడుననుటకు చాలియున్నది. రాముఁడు యుద్ధమున సూర్యసమానములయిన బాణములచేత ఖరుని దూషణుని త్రిశిరుని, వధించెను. రాముఁడే గెలుచుననుటకిది యొకదృష్టాంతమే చాలును. మఱియు నెత్తురే యాహారముగాఁగలిగి క్రోధమున బెట్టిదముగా నార్పులిడుచు యోజనము నిడివియైన బాహువులుగల యాకబంధునిఁగూడ రాముఁడు వధించెను. రాముఁడే గెలుచుననుట కిదయొకటియె నిదర్శనము చాలును. మహాబలుఁడును మేరుపర్వతసమానుఁడును దేవేంద్రునికుమా

* శూర్పణఖవచ్చి రావణాదులతో వేఱువిధముగా రామునియందు నేరముమోపి చెప్పినను దానియంగకంపనాదులవలన నది రామునిఁ గామించినదని యందఱికిఁ దెలిసియుండుట నిట తెలియనది.

రుఁడును నగువాలినిఁగూడ రాముఁడు వధించెను. రాముఁడు జయించుటకు నిదర్శ
నమే చాలును. దీనుఁడై యాశాభంగమునొంది, ఋశ్యమూకపర్వతమున దాఁగి
యున్న సుగ్రీవునిఁగూడ రాముఁడు వానరరాజ్యమున కధిపతిఁగా జేసెను. రాముఁడు
గెలుచుననుట కాదృష్టాంత మొకటియె చాలును. విభీషణుఁడు చెప్పినమాట ధర్మార్థము
లు రెండును గలిగించునది, సమస్తరాక్షసులకు హితకరమైనది, యుక్తియుక్తమైనది.
మోహావేశమునంజేసి రావణున కది యిష్టపడదయ్యె. కుబేరానుజుఁడగు రావణుఁడు,
విభీషణుఁడు చెప్పినట్లు గావించియుండునేని,యీలంకాపురమంతయు శ్మశానమువలెఁ
బీనుంగులతో నిండి యిట్లార్తనాదములతోఁ గూడినదిగాకుండును. రామునిచే మహా
బలుఁడగు కుంభకర్ణుఁడు హతుండగుటయు లక్ష్మణునిచే నెట్టివారికి నెదిరింపరాని యతి
కాయుఁడును నంతటఁబోక హతుఁడగుటయు ప్రియపుత్రుఁడగు నింద్రజిత్తుఁడు హతుఁడ
గుటయు వినియు నింకను రావణునకు రాముని మహిమ దెలియకున్నదే'యనిరి. 'యుద్ధ
మున నాకొడుకు హతుఁడయ్యెనే! నాతోఁబుట్టువు చచ్చెనే! నాపెనిమిటి గూలెనే'
యని లంకాపురమున రాక్షసులయింటింటను రోదనధ్వనులు వినఁబడుచుండెను. మఱి
యువారు 'శూరుఁడగురాముఁడు రథములను గుఱ్ఱములను,ఏనుఁగులను పదాతులను,
లక్షలు లక్షలుగా యుద్ధమున వధించినాఁడు సాక్షాద్రుద్రుఁడో విష్ణువో దేవేంద్రుఁడో లేక
యముఁడో రామునిరూపమునవచ్చి మనవారిని వధించుచున్నాఁడేకాని రాముఁడు మ
నుష్యమాత్రుఁడుగాఁడు. మహావీరులగు మావారందఱు రామునిచే హతులగుటవలన
మేము బ్రతుకుననుకొని యాశవదలి,యీభయమునకుఁ దుదగానక యనాథలమై విలపిం
చుచున్నారము. శూరుఁడగు రావణుఁడు బ్రహ్మవలని మహావరము పెంపునఁ గన్నుఁ
గానక తనకిప్పుడు రామునివలనఁగలిగియున్న మహాఘోరభయము నెఱుఁగకున్నాఁడు.
దేవతలుగాని, గంధర్వులుగాని, పిశాచములుగాని, రాక్షసులుగాని, యుద్ధమున రా
మునిబారింబడినవానిని, రక్షింపఁజాలరు. రావణునికి ప్రతియుద్ధమునందును నుత్పాత
ములును గనఁబడుచున్నవి. ఇఁకమీఁదను నుత్పాతములు చూపుచూపి రామునిచే రా
వణుఁడు హతుఁడగుటను సూచింపఁగలవు బ్రహ్మ,రావణుని తపస్సునకుమెచ్చి యతనికి,
దేవతలవలనఁగాని,దానవులవలనఁగాని,రాక్షసులవలనఁగాని భయము లేదనివర మొసఁ
గెను. అప్పుడు రావణుఁడు మనుష్యులవలన నభయము యాచింపఁడయ్యె. కాఁబట్టి,య
ప్పుడు రావణునకును రాక్షసులకును మనుష్యునివలనఁ బ్రాణాంతకరమయిన యీఘో
రభయము ప్రాప్తించినది. ఇందులకు సందేహము లేదు. దేవతలు బ్రహ్మవరకారణమున,
బలవంతుఁడగు రావణునిచే మఱింత పీడితుఁడై, యోర్వలేక,బ్రహ్మదేవునిగుఱించి య
త్యుగ్రమగు తపముగావించిరి మహానుభావుఁడగు బ్రహ్మదేవుఁడు సంతుష్టుఁడై దేవత
లకు మేలుగలుగుకొఱకు, వారలనెల్లంజూచి, మహార్థంబగు నీవాక్యమున 'ఇది మొద
లు సమస్తరాక్షసులును వారలతోఁజేరిన దానవులును నెల్లప్పుడును ముల్లోకములం
దును మీకెవ్వరికిఁ బీడగలిగింపక శాశ్వతముగా నెంతయు భయంబుగలిగి సంచ

రింతురు' అని సమాధానము చెప్పెను. దేవేంద్రుఁడు మున్నగు దేవతలు, బ్రహ్మదేవు నిసమాధానమునకుఁ దృప్తిఁబొందక యందఱు నొకటిగాఁ జేరి, వృషభధ్వజుఁడును త్రిపురసంహారుఁడునగు శివునిం బ్రార్థించి ప్రసన్నునిఁ గావించికొనిరి శివుఁడును ప్రసన్నుఁడై దేవతలం జూచి 'రాక్షసులకెల్ల నాశ మొసగలిగించునట్టి స్త్రీ యొకతె పుట్టఁగలదు ఆబిడవలన మీకు హితముగలుగునని చెప్పెను. రాక్షసులకు నాశముసేయుటకై దేవతలుపంపిన యీసీత మున్ను, దేవత లమృతపానము చేసినపిదప, ఆఁకలి దానవులను బొడమాపినట్లు,* రావణునితోఁగూడ మనల నందఱను భక్షించివేయఁగలదు. దుర్నయపరుఁడును దుర్బుద్ధియునగు రావణుఁడు చేసినదుష్కార్యముచేత నిట్లు వెనుదుఃఖముతోఁగూడ నీభయంకరమైన నాశ మందఱకిని బ్రాప్తించియున్నది. ప్రలయకాలమునందు యమునిబారింబడిన ప్రజలకుంబోలె రాముని బారింబడిన మనకు శరణొసంగి రక్షించువాఁడు లోకంబున నెవ్వఁడు గానరాఁడు. వనమునందు కారుచిచ్చుజ్వాలలు చుట్టిముట్టియున్న యేఁనుగజములకుంబోలె, ఈమహావిపత్తునున్న మనకు రక్షకుఁడెవ్వఁడును లేఁడు. పులస్త్యమహర్షి మనుమఁడయిన యమ్మహాత్ముఁడు విభీషణుఁడు, ఎవ్వరివలన భయముగలుగునని తోఁచెనో యట్టిరామునే శరణుఁజొచ్చినాఁడుగాన యుచితమైనపనియే చేసినాఁడు' అని విలపించిరి. ఇవ్విధమున నప్పుడు †రాక్షసస్త్రీలందఱును ఒండొరులచేతులం గౌఁగిలించుకొని భయాతిశయమునం బీడితలై దీనలై దుఃఖించుచు మిక్కిలియు దారుణముగా బిగ్గఱ నాక్రోశించినవారయిరి. ఇది తొంబదియేనవసర్గము.

---

రావణుఁడు మహోదర మహాపార్శ్వ విరూపాక్షు లను
ముగ్వురు మంత్రులతోఁగూడి లంకయుత్తరద్వారమున
యుద్ధమునకు వెడలుట; రావణునకు మార్గ
మున దుశ్శకునములు; రావణుఁడు వానర
సేనతో యుద్ధము సేయుట

అట్లు లంకాపట్టణమున, ఇంటింటను, రాక్షసస్త్రీలు ఆర్తలై జాలిపుట్టునట్లు సేయు రోదనధ్వనిని రావణుఁడు వినెను. ఆరావణుఁడు దీర్ఘముగా నిట్టూర్పువిడిచి కొంతసే పేమియుఁదోఁపక చింతామగ్నుఁడై యుండి యంత మిక్కిలియు కోపావేశమున భయంకరాకారుఁడయ్యెను. ఆరాక్షసేశ్వరుఁడు పండ్లచే నోష్ఠముగఱచి, కోప

---

* ఇట దానవులనుగూడఁ జెప్పటచే మందోదరీసంబంధమువలన దానవులును గొందఱు రాక్షసులతోడ నుందురని తెలియుచున్నది.

† ఇట రాక్షసనాశమునకై బ్రహ్మాదులు వరములిచ్చుట మొదలగు వృత్తాంతములు మందోదరి జ్ఞానవృద్ధులవలనను ఆబిడవలననుండి యీరాక్షసస్త్రీలును వినియుందురని తెలియుచున్నది. గోవిందరాజులు.

మున కన్నులు మఱియు నెఱ్ఱఁబాఱి ప్రలయకాలాగ్నివలెఁ జిమ్మిరేఁగి రాక్షసులకు నుగూడఁ దేఱిచూడ నలవిగాక చూపట్టుచు, లోపల భయమునంజేసి తడఁబడి తేట పడనట్లు మాటాడుచున్నవారై సమీపంబున నున్న రాక్షసులను * మహోదర మహాపార్శ్వ విరూపాక్షు లనువారలంజూచి చూపులచే చుఱుచుఱ దహించువాఁడుం బోలెఁ గనుపట్టుచు వారితో 'సేనలకు శీఘ్రముగా యుద్ధమునకు వెడలవలయునని నాయాజ్ఞగాఁ జెప్పుఁడు' అనెను. ఆరావణుఁడు చెప్పినమాట విని, యారాక్షసులు భయపీడితులై రాజాజ్ఞ చొప్పున, మిక్కిలి యెచ్చరికగల రాక్షసులను యుద్ధమునకు రాఁ బ్రేరించిరి. భయంకరాకారులగు నారాక్షసులును వల్లెయని మంగళాశీర్వచనములం జేసికొని యందఱును యుద్ధాభిముఖులయి పోయిరి. ఆరాక్షసులెల్ల వారివారి వరుసలచొప్పున రావణునకు నమస్కారాదులు గావించి యేలినవానిజయముం గోరుచు, చేమోడ్పులుఘటించి నిలఁబడిరి. అంత రావణుఁడు మిక్కిలి క్రోధావేశమునొంది పగవారిని సరకుసేయని వెడనవ్వునవ్వి మహోదరుని మహాపార్శ్వుని విరూపాక్షునిని జూచి 'ఇప్పుడు నావింటినుండి ప్రలయకాలసూర్యునింబోలు వెడిదంపు బాణములను బ్రయోగించి రామునిని లక్ష్మణునిని యమపురికిఁ బంపెదను. నేనిప్పుడు యుద్ధమున పగవారినెల్ల వధించి యింతకుమునుపు వారిచే ఖరుఁడు కుంభకర్ణుఁడు ప్రహస్తుఁడు ఇంద్రజిత్తును వధింపఁబడినందులకు ప్రతీకారము గావించెదను. నాబాణజాలము లనెడి మేఘములు గ్రమ్ముకొనఁగా దిక్కులును, నదులును, సముద్రములును, వెలుతురులేక చీఁకటితోఁగూడి యుండఁగలవు. ఇప్పుడు వింటినుండి గఱులుగట్టంబడిన మేటిబాణములను నవ్వారిగాఁ బ్రయోగించి యవ్వానరసైన్యములను గుంపులుగుంపులుగానుఱుమాడివచ్చెదను. ఇప్పుడు రథమనెడి వాయువేగముచే ధనుస్సనెడిసముద్రమునుండి రేఁపంబడిన బాణములనెడి కరుళ్లచే వానరసైన్యములను మథించివచ్చెదను. కొంచెము వికసించిన తామరలుగల తటాకములను మదగజములు కలఁచునట్లు, కొంచెమువికసించిన తామరలవంటి ముఖములును తామరయకరువులవంటి వన్నెయుఁగల యవ్వానరులసేనలను గలంచెదను. ఇప్పుడు యుద్ధభూమియంతటను వానరయూథపులు మొగముల బాణములు గ్రుచ్చుకొని తెగిపడియుండఁగా, నది కాఁడలతోఁగూడిన కమలములు వ్యాపించియున్నట్లు మిక్కిలివన్నెగులుకఁగలదు. యుద్ధమునఁ బ్రచండులై వృక్షములంగొని పోరువానరులనిప్పుడు ఒక్కొక్కబాణమునేసి నూర్గురునూర్గురుగా యుద్ధమున వధించెదను. యుద్ధమున నెవ్వతెవ్వతెకు భర్తలు భ్రాతలును పుత్రులును హతులయిపో యట్టి రాక్షసస్త్రీలకందఱకును, ఇప్పుడు శత్రువునువధించి, కన్నీరుదుడిచెదను. ఇప్పుడు యుద్ధమున నాబాణములచే వానరులను ఛేదించి ప్రాణములెడలి చెల్ల

---

* ఈమహోదరుఁడును మహాపార్శ్వుఁడును రావణునిమంత్రులు, మునుపు యుద్ధమున హతులయిన మహోదర మహాపార్శ్వులు మత్తుఁడు ప్రమత్తుఁడు అనునామాంతరములు గలిగి రావణునకుఁ దమ్ములయినవారు.

చెదరుగాఁ గూలిన వారికళేబరముల ప్రోవులచే భూమినంతయుఁ గప్పి యది కనఁబడుట కష్టసాధ్యమగునట్లు గావించెదను. ఇప్పుడు, మాంసాహారములగు నక్కలు గద్దలును నితరజంతువులన్నిటికిని నాబాణములచే శత్రువులమాంసములొసఁగి తృప్తిఁ గావించెదను. శీఘ్రముగా నారథము నలంకరింపుఁడు. వేగ నావిలు దెండు. మఱియిప్పటికి మిగిలియుండు రాక్షసు లందఱును నావెంటవత్తురుగాక' అనెను. మహాపార్శ్వుఁడు రావణుఁడు చెప్పినమాటనువిని యచటనున్న సేనాధ్యక్షులనుజూచి 'సైన్యము వేగ మాయితపఱుపుఁడు' అని యాజ్ఞాపించెను. మహాబలవంతు లగునాబలాధ్యక్షులు లంకాపురియం దింటింటింకిఁబోయి రాక్షసులంబిలుచుచు మాటిమాటికిఁ బిలిచినను వారు త్వరితముగా రానందునఁ గుపితులై వీథివీథిని బిలుచుచుం దిరిగిరి. అంత ముహూర్తమునకు, భయంకరముఖములుగలిగి రాక్షసులు, సింహనాదములు సేయుచు ఖడ్గములను పట్టిసములను శూలములను గదలను ముసలములను ద్విఫలపత్రాగ్రములగు హులశములను నాయుధములను వాఁడివాదరలుగల శక్తులను పెద్దకూటముద్గరములను యష్టులను విమలములయిన చక్రములను వాఁడిపరశ్వథములను భిండివాలములను శతఘ్నులను మఱియు నితరములైన మేటియాయుధములను, నిట్లు నానావిధాయుధములను గేలందాల్చి, చూచువారికి భయంకరముగాఁ జూపట్టుచు వేగ వెడలివచ్చిరి. అంత రావణునాజ్ఞ చొప్పున సేనాధ్యక్షుఁడు ఎనిమిదిగుఱ్ఱములు పూన్పంబడి సారథితోఁ గూడియున్న రథమును శీఘ్రముగాఁదెచ్చెను. భయంకరుఁడగు రావణుఁడారథమును నిజతేజముచే దేదీప్యమానంబై వెలుంగ నారోహించెను. అంత రావణుఁడు, పెక్కండ్రురాక్షసులు బలసినదువ,బలాతిశయమునం జేసి భూమిని భేదించురీతిఁ దోఁప, వేగమునం బయనమయ్యెను. అప్పుడు మహాపార్శ్వుఁడును మహోదరుఁడును దుర్ధర్షుఁడగు విరూపాక్షుఁడును, రావణునను మతినొంద రథముల నారోహించిరి. వారలు సంతుష్టులై భూమిని బీఁటలువాఱ్చునట్టు లార్పులు చెలంగించుచు భయంకరముగా సింహనాదములుసేయుచు జయకాంక్షులై వెడలిరి. అంత మహాతేజుండగు రావణుఁడురాక్షససైన్యములం బరివృతుఁడై విలుగొని ప్రలయకాలమున ప్రజలరూపుమాపు యమునివలెఁ జూపట్టుచు యుద్ధమునకు వెడలెను. అంత సమ్మహారథుఁడు వేగవంతములగు గుఱ్ఱములుపూన్చినరథము నారోహించి రామలక్ష్మణు లున్నయుత్తరద్వారమున నిర్గమించెను. అప్పుడు సూర్యుఁడు కాంతిహీనుఁడయ్యె. దిక్కులందుఁ జీఁకట్లు గ్రమ్మినవి. భయంకరములగుపక్షు లఱచినవి. భూమియు నల్లలాడినట్లుండెను. పర్జన్యుఁడు నెత్తురువర్షముగురిసెను. గుఱ్ఱములు మార్గమునం దొట్రిలంబడినవి. ధ్వజాగ్రమున గ్రద్దవ్రాలెను. ఆఁడునక్క లమంగళముగా నఱచినవి. రావణుని కెడమకన్నదరినది; ఎడమచేయియదరెను; ముఖము వెలుకఁబాఱెను; ఎలుఁగు తగ్గువడెను. ఆయుత్తరద్వారమునుండి రావణుఁడు యుద్ధమునకు వెడలునపుడు,యుద్ధముననతనికి మరణమునూచించునట్టియీదుర్నిమిత్తములు పుట్టినవి. పిడుగుపడినట్లు బిట్టుచప్పుడు

తో నాకాశమునుండి యుల్క పడినది. అమంగళములగు గద్దలఱవఁగాఁ గూడ కాకులును జేరి యఱచినవి. రావణుఁడు మృత్యుప్రేరితుఁడగుటవలన, నిట్లు సంభవించిన యీదుర్నిమిత్తములను సరకుసేయక, మోహమున వధమునొందుటకై బయలువెడలెను. మహాబలులగు నారాక్షసులరథధ్వనిని విని వానరసేనయు యుద్ధముసేయ నెదురుమొగమై నిలిచెను. ఆవానరులును రాక్షసులును నొండొరుల జయింపఁగోరి కుపితులై స్పర్ధచే నొకరినొకరు పిలుచుచుఁ దుములముగా యుద్ధముచేసిరి. అంతనపుడు రావణుఁడు క్రుద్ధుఁడై వానరసేనలంజొచ్చి బంగారుచే రంగారుబాణములం బ్రయోగించుచు గొప్పయుద్ధమును గావించెను. రావణుఁడప్పుడు కొందఱ వానరుల తలలు ఖండించెను. కొందఱ గుండెకాయలు చీల్చెను. కొందఱ చెవులం దెగనేసెను. రావణుని బాణములచేఁ గొందఱ యూర్పులు పుచ్చలేక హతులయిపడిరి. కొందఱు ప్రక్కలఁజీల్పఁబడిరి. కొందఱకుఁ దలలు భిన్నములయినవి. కొందఱికి కన్నులుపోయినవి. రావణుఁడు యుద్ధమున రథగతుఁడై క్రోధమునం గన్నులు విరియఁ గిఱ్ఱనగిఱపుచు, నెందెందుపోవునో యయ్యెయెడలనెల్ల, వానరపుంగవులతనిబాణవేగమునకు సహింపఁజాలక పాఱిరి. ఇది తొంబదియాఱవసర్గము.

---

## సుగ్రీవుఁడు విరూపాక్షుని వధించుట.

అట్లపుడు రావణుని బాణములచే గాత్రములు భిన్నములై చెల్లచెదరుగాఁ గూలియున్న వానరులకళేబరములచే నచటి యుద్ధభూమియంతయు నిండినదయ్యె. మిడుతలు మండుచున్నయగ్గిని సహింపఁజాలనియట్లు, అవ్వానరులు, సహింపనలవిగాని రావణుని బాణవేగమునకు సైఁపఁజాలరయిరి. అవ్వానరులు వాఁడిబాణములం బీడితులై, సైఁపఁజాలక యగ్నిజ్వాలలం దగులువడి కాలుచున్నయేనుఁగులవలె నాక్రోశించుచు పరుగిడిరి. వాయువు మహామేఘములం బాఱఁదోలునట్లు, ఆయుద్ధమున, నారావణుఁడు, వానరసైన్యములను బాణములఁ జిమ్ముచుంబోయెను. అప్పుడు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు అట్లు వానరుల బలిమిఁగొలఁదిని యుద్ధముగావించి యంతఁ ద్వరితముగా రాముని యుద్ధమున దార్కొన్నవాఁడయ్యె. అట్లు వానరులు యుద్ధమున భంగమునొంది పాఱుచుండుటనుజూచి, సుగ్రీవుఁడు గుల్మమున సుషేణునియునిచి యందఱు నాశ్చర్యపడునట్లు యుద్ధముసేయఁ దలంపుగొనెను. వీరుఁడగునాసుగ్రీవుఁడు బలపరాక్రమంబుల తనకుసాటి యగుసుషేణుని గుల్మమున (సేనారక్షణమున) నుంచి వృక్షము చేతంగొని శత్రువు నెదుర్కొనిపోయెను. వానరరాజు సుగ్రీవుఁడట్లు బయలుదేఱఁగా, గొప్పగొప్పయూథపతులగు వానరవీరులు తామే, యతనికి యుద్ధోపకరణముల సమకట్టుటకై పెనుపర్వతములను నానావిధములయిన పెనువృక్షములను బెకల్చి యందఱు నతనిపార్శ్వములందును పిఱుందను వెంబడించి నడచిరి. గొప్పవాఁడగు నాసుగ్రీవుఁడు యుద్ధమున మహాధ్వనితో గర్జించుచు, పలు

దెఱంగులగు రాక్షసుల ననేకులం గూల్చి యంత మేటిమగలయిన వేఱు రాక్షసులపయి కడరెను. పెనుకాయముగల యావానరేశ్వరుఁడు సుగ్రీవుఁడు ప్రలయకాలమున వాయువు మిక్కిలి పొడవులయిన వృక్షములను జక్కాడునట్లు, గొప్ప రాక్షసులను గలంచి నలంచివైచెను. అడవియందు మేఘము పక్షిసమూహములపై జాలవానం గురియునట్లు, సుగ్రీవుఁడు రాక్షససేనలపయిని పర్వతవర్షమును గురిసెను. కపిరాజగు సుగ్రీవుఁడు గురిసిన యాపర్వతవర్షముచేఁ జేసి రాక్షసులతలలు తుత్తునియలుగాఁ బగిలి వజ్రముచేఁ దుత్తుమురైన పర్వతములవలె నేలం గూలిరి. అంత రాక్షసులందఱు నట్లు సుగ్రీవునిచే నలుగడల భంగమునొంది హింసితులై పడుచును నఱచుచు మిక్కిలి క్షీణించుచునుండుటను జూచి దుర్ధర్షుఁడగు విరూపాక్షుఁడు, విలుగొని తనపేరు వాడి రథమునుండి కుప్పించి యొకగజముమూఁపు నారోహించెను. మహారథుఁ డా విరూపాక్షుఁడు, ఆమదపుటేనుఁగు నెక్కి, భయంకరధ్వనిగా సింహనాదము సేయుచు వానరులమీఁది కడరెను. ఆవిరూపాక్షుఁడు వానరసైన్యముఖమున నున్న సుగ్రీవునిపై బెట్టిదములగు బాణములం బ్రయోగించి భయమునఁ బరుగెత్తుచున్న రాక్షసులకు భయముదీర్చి సంతుష్టి గలిగించినవాఁ డయ్యె. కపిరాజా సుగ్రీవుఁడు, అట్లు విరూపాక్షునిచే వాఁడిబాణముల నొప్పింపఁబడి, మిక్కిలి క్రుద్ధుఁడై యతనిని వధింప మనంబునఁ దలఁచెను. అంత శూరుఁడగు సుగ్రీవుఁడు చక్కఁగాఁ బ్రహరించువాఁడు గావున నొకవృక్షమును బెకలించి, విరూపాక్షునిపయి నడరి, దానితో నతనిమహాగజముముఖమునఁ గొట్టెను. అమ్మహాగజము సుగ్రీవునిచే వ్రేటువడి వింటికోలఁది దూరము వెనుకకుఁ బాఱి యఱచుచుం గూలెను. అంత వీర్యశాలి యగు నావిరూపాక్షుఁడు కూలినయాయేనుఁగునుండి శీఘ్రంబున డిగ్గి, వాలును నెద్దుతోలు పలుకయుం గొని శత్రువున కభిముఖుఁడై కదలక స్థిరముగా నెలకొనియున్న సుగ్రీవునిమీఁదికి, అతనిని బెదరించువాఁడుంబోలె చుఱుకుంబోయెను. ఆసుగ్రీవుఁడు విరూపాక్షునియెడఁ గోపించి, మేఘమువలె విశాలమైయున్న యొకమహాశిలను దీసికొని, యారాక్షసునిపై వ్రేసెను. అప్పుడు మిక్కిలియు పరాక్రమవంతుఁడగు నావిరూపాక్షుఁడు, అమ్మహాశిల పయిఁబడి వచ్చుటను జూచి తప్పించుటకై ప్రక్కవాటునఁ దొలఁగి ఖడ్గముచే సుగ్రీవునివైచెను. అట్లు బలవంతుఁడగు నారాక్షసునిచే ఖడ్గపు వ్రేటుపడి, వీరుఁడగు సుగ్రీవుఁడు కొంతసేపు మూర్ఛనొందినట్లు విహ్వలించినవాఁ డయ్యె. అంత నపు డమ్మహాయుద్ధమున సుగ్రీవుఁడు తోడనే లేచి వేగమునం బిడికిలి నలవరించి విరూపాక్షునిఱొమ్మునం బొడిచెను. విరూపాక్షుఁ డట్లు సేనాముఖమునఁ బిడికిటం బొడువఁబడి మిక్కిలి క్రుద్ధుఁడై యాఖడ్గమున * సుగ్రీవునికవచమును తునియలుగాఁ బడవైచెను. సుగ్రీవుఁ డా దెబ్బకుఁ గాళ్లు చాఁచుకొని నేలం బడెను. అట్లు పడి యాకపి తోడనే లేచి వజ్రముంబోనియఱచేతిదెబ్బతో మిక్కిలియు చప్పు

* దీనిచే సుగ్రీవునకుఁ గూడ కవచధారణము గలదని తెలియుచున్నది. గోవిందరాజులు.

డుగలుగ నావిరూపాక్షునిఁ గొట్టఁబోయెను. సుగ్రీవుఁ డట్లలవరించినయఱచేతిచఱపు ను నావిరూపాక్షుఁడు, శిక్షాపాటవమునఁ దప్పించుకొని యాసుగ్రీవుని వక్షమునందుఁ బిడికిటం బొడిచెను. అంత వానరేశ్వరుండగు సుగ్రీవుఁడు, తనచఱపును ఆవిరూపాక్షుఁడు తప్పించుకొని తన్నుఁబడుచుసకుఁ గొట్టుటంజూచి మఱింత క్రుద్ధుఁడై యావిరూపాక్షుం డేమఱియున్న తెఱపిం గాంచెను. అంత సుగ్రీవుఁడు కోపంబున నావిరూపాక్షుని నొసటియెమ్ముపై తనపెద్దయఱచేతం గొట్టెను. ఇంద్రునివజ్రాయుధమువంటి యాయఱచేతివ్రేటును బడి, ఆవిరూపాక్షుఁడు, సెలయేటినుండి జలము స్రవించునట్లు నవరంధ్రములనుండియు నెత్తురుగ్రక్కుచు నెత్తుటఁ దోఁగి నేలంగూలెను. అట్లు క్రోధమువలన కనుగ్రుడ్లుత్రిప్పుచు, నోట నురుఁగుగాఱ, నెత్తుటందోఁగి, సహజము గానే వికృతములయిన నేత్రములప్పుడు గ్రుడ్లు వెలికుఱుకుటచే మఱింతవికృతములుగాఁ జూపట్టఁగాఁ గూలినట్టి యావిరూపాక్షుని వానరులును రాక్షసులును జూచిరి. అట్లు తమశత్రు వవ్విరూపాక్షుఁడు వేదనచే మీఁదికెగిరియెగిరి పడుచు, ఇటునటు ప్రక్కలం బొరలాడుచు, నెత్తుటందోఁగి వినువారికి జాలిపుట్టునట్లు కూయిడుచునుండఁగా వానరులుచూచిరి. అట్లు మహాబలవంతములగు నావానరరాక్షససైన్యసముద్రములు రెండును యుద్ధమున నొండొంటి నూర్చ్కొని, చెలియలకట్టల నతిక్రమించి వచ్చి మఱ్ర్కొన్న రెండుమహాసముద్రములుంబోలె మిక్కిలి భయంకరముగా నార్పులు పెడబొబ్బలను జెలంగించిరి. వానరరాజగు సుగ్రీవుఁడు, మహాబలుఁడయిన యవ్విరూపాక్షుని నాశము సేయుటనుజూచి వానరసైన్యములుబ్బునను, రాక్షససేనలు కోపదుఃఖములను, గట్టుపొరలి వచ్చినగంగాప్రవాహమువలె నుప్పొంగి యొండొరుమీఁదంబడి పోరాడిరి. ఇది తొంబదియేడవసర్గము.



## సుగ్రీవుఁడు రావణునిమంత్రియగు మహోదరునిం బరిమార్చుట

అమ్మహాయుద్ధమున వానరరాక్షససైన్యములు రెండును నొండొంటిని హతము సేయుచుండఁగా, గొప్పవేసవిని కొలఁకులు వేగ నీరుతగ్గునట్లు, వేగ నవి క్షీణింపసాఁగినవి. రాక్షసాధిపతియగు రావణుఁడు, అట్లు తనసైన్యముహతమై విరూపాక్షుఁడు వధింపఁబడుటకు రెండింతలుగా క్రుద్ధుఁడయ్యెను. అతఁడు తనసైన్యము వానరులచే వధింపఁబడుచు మిక్కిలియు క్షీణించుటంజూచి, యట్లు యుద్ధమున తనకు దైవము విపరీతమగుటను గని, మిక్కిలియు వ్యథనొంది, సమీపంబుననున్న శత్రుహంతయగు మహోదరుంజూచి 'వీరా! మహాబాహూ! ఇట్టిసంకటకాలమున నీయొక్కని నమ్మియే నేను జయింతునని యాశగలిగియున్నాను. కాన యిప్పుడు శత్రుసేననుజంపి పరాక్రమము నెఱపుము. నీయేలినవానియుప్పుదిన్నఋణము దీర్చుకొనుట కిదియెకాలము. కాన లెస్సఁబోరాడుము' అనెను. రావణుఁ డిట్లుచెప్పఁగా రాక్షసశ్రేష్ఠుఁడగు మహోదరుఁడు వల్లెయని, మిడుత యగ్గినుఱుకునట్లు, పగవారిసైన్యముంజొచ్చెను.

అంత మహాబలుఁడును మిక్కిలి తేజోవంతుఁడునగు నమ్మహోదరుఁడు, ఏలినవాని వాక్యము శిరసావహించి తనవీర్యముచేతం బ్రేరితుఁడై వానరులతో యుద్ధము గావించెను. మహాబలవంతులగు వానరులును గొప్పగొప్పశిలలు గయికొని, భయంకరమగు రాక్షససేననుజొచ్చి రాక్షసులను వధించిరి. అమ్మహాయుద్ధమున, మహోదరుఁడును మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై, కాంచనాలంకృతములగు బాణములు ప్రయోగించి వానరుల కాలుసేతులను దొడలను ఖండించెను. అంత నవ్వానరులందఱును రాక్షసులచే మిక్కిలియుఁ బీడితులై కొందఱు దశదిశలకుం బాఱిరి. కొందఱు సుగ్రీవు నాశ్రయించిరి. అట్లు వానరమహాసేన మిక్కిలియు భంగమునొంది పాఱుటం జూచి సమీపముననున్న సుగ్రీవుఁడు మహోదరునిమీఁదికిఁ బోయెను. మహాతేజుం డవ్వానరేశ్వరుఁడు సుగ్రీవుఁడు, ఆరాక్షసుని వధించుటకై పర్వతంబంతటి పెద్దదై బెట్టిదముగానున్న యొకశిలనుదీసి వానిపై వైచెను. మహోదరుఁడట్లు తనపైకి వేగవచ్చుచున్నయాశిలను జూచి, యెంతమాత్రము తత్తఱపడక, దారసింప నలవిగానియాశిలను బాణములచే భేదించెను. ఆశిల, యారాక్షసుని బాణసమూహములచే వేయిదునియలుగాఁ దుండింపఁబడి, చెల్లచెదరయి, గుమిగూడియున్న గ్రద్దలగుంపు నలుగడల చెల్లచెదరయి నేలకు వ్రాలునట్లు, నేలంబడెను. సుగ్రీవుఁడు తాను బ్రయోగించినశిల యట్లు వ్రక్కలగుటను జూచి కోపావేశమునొంది, యుద్ధాగ్రమున వృక్షమొకటి పెల్లగించి యారాక్షసునిపై వైచెను. పగవారిపట్టణముల జయించునట్టిశూరుఁ డమ్మహోదరుఁడు బాణములచే నావృక్షమును గూడ వ్రక్కలుసేసెను. అట్లు వృక్షము గూడ వ్యర్థముకాఁగా నాసుగ్రీవుఁడు కుపితుఁడై పరిఘమొకటి నేలంబడియుండుటనుగాంచెను. సుగ్రీవుఁడు తలతలమెఱయుచున్న యాపరిఘమునుగొని, తనహస్తలాఘవ మమ్మహోదరునకుఁ జూపుచు, దానిని గిఱగిఱం ద్రిప్పి దానిమొనచే వానిమేటిగుఱ్ఱములను వేగఁగూల్చెను. అంతవీరుం డమ్మహోదరుఁడు, గుఱ్ఱము దెగినయమ్మహారథమునుండి నేలకుఱికి, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై గద చేతంగొనెను. అవ్వీరులిరువురును, మెఱయుచున్నగదను పరిఘమును గేలం ద్రిప్పుచుండుటం జేసి మెఱపులతోఁగూడిన మేఘములవలె నొప్పుచు గర్జించుచు యుద్ధంబున నాఁబోతులవలెం జూపట్టుచు నొండొరులం దాఁకిరి. అంత మహోదరుండు క్రుద్ధుఁడై సూర్యకాంతితో జ్వలించుచున్న తనగదను సుగ్రీవునిపై వైచెను. అమ్మహాయుద్ధమున మహాబలవంతుఁడగు వానరేశ్వరుఁడు సుగ్రీవుఁడు, మిక్కిలియు భయంకరమయిన మహోదరునిగద తనపయికి వచ్చుచుండుటను జూచి కోపంబున కన్నెఱ్ఱఁబాఱ, పరిఘము నెత్తికొని దానిచే నాగదనుగొట్టెను. ఆపరిఘమును గదయు నొండొంటిఁదాఁకి భిన్నములై నేలంబడినవి. అంత మహాతేజుండగు సుగ్రీవుండు, బంగారుకట్లచే రంగారుచు బెడిదమైయున్న యొకయినుపరోఁకలి నేలం బడియుండఁగా నెత్తుకొనెను. ఆసుగ్రీవుఁ డాముసలము నెత్తికొని మహోదరునిపై వేసెను. మహోద

రుఁడును మఱియొకగదను వైచెను. ఆరెండును ఒండొంటిందాఁకి భిన్నములై నేలంబడినవి. అంత నాయుధములన్నియు భగ్నములుకాఁగా, తేజంబును బలంబును దయివాఱ నాయిద్దఱును మండుచున్నయగ్నిహోత్రములవలెఁ జూపట్టుచు, పిడికిళ్ల నొండొరుల మార్కొనిరి. అప్పుడు యుద్ధమునఁ బరాజయ మెఱుఁగనివారై పరులవీఁచమడంచునట్టివీరు లయ్యిరువురును, నొండొరులం గొట్టుచు మాటిమాటికి పెడబొబ్బలు పెట్టుచు, నఱచేతుల నొకరినొకరు చఱచి యిరువురు నేలపయింబడి శీఘ్రమునఁ బయికిలేచి, యొండొరులం గొట్టుచు, నొకరినొకరు బుజములనెత్తి విసరివైచుచు నిట్లు బాహుయుద్ధము చేసిచేసి యలసట నొందినవారయిరి. అంత మహావేగుండగు మహోదరుఁడు, సమీపమున నేలంబడియున్న యొకఖడ్గమును పలుకయును గయికొనెను. మహోదరునికన్న మఱింత వేగవంతుఁడగు వానరోత్తముఁడు సుగ్రీవుఁడు, అట్లు నేలంబడియున్న మఱియొకఖడ్గమును డాలును గయికొనెను. ఆయుధవిద్యయందుఁ బండితులగు నయ్యిరువురును, ఖడ్గముల నెత్తికొని, యుద్ధమునుబ్బుగదుర, రోషంబున నంగము లుప్పొంగ, గర్జించుచు, నొండొరులపయి కడరిరి. అయ్యిరువురు నొండొరులయెడఁ గ్రుద్ధులయి యొకరినొకరు గెలుచుటకై తమకముగొని, శీఘ్రగతిని సవ్యాపసవ్యములుగా మండలములు దిరుగుచుఁబోరిరి. శూరుఁడును మహావేగుండు నగునమ్మహోదరుఁడు పరాక్రమగర్వితుఁడేకాని సూక్ష్మబుద్ధి కాఁడు గావున ఖడ్గమును గుఱితప్పి సుగ్రీవునిచేతిపెనుడాలునందుఁ దగుల్కొనవేసెను. అంత మహోదరుఁడు పలుకయందుఁ గ్రుచ్చుకొన్న ఖడ్గమును లాగుచుండఁగా నింతలో కపికుంజరుఁడగు సుగ్రీవుఁడు, బొమిడికముతోఁగూడి కుండలములతో భూషితమైయున్న వానిశిరస్సును దెగవ్రేసెను. అట్లు మహోదరుఁడు తలదెగి నేలంబడుటనుజూచి, రావణునిసేన యచటనిలువక పరుగెత్తెను. మహోదరునివధించి సుగ్రీవుఁడు సంతోషమున వానరులుం దానును సింహనాదము గావించెను. రావణుండందులకు కుపితుండయ్యెను. రాముఁడు మిక్కిలిహర్షమునఁ బ్రకాశించెను. అంత రాక్షసులందఱును మనంబులు విన్ననై, మొగములు వెలవెలఁబోవ, భయమున మనసు కుదురుతప్ప పరుగెత్తిరి. మహాపర్వతమునఁ గొంతభాగమును బడఁజిమ్మినట్లు, అమ్మహోదరుని నేలంబడఁగూల్చి సూర్యకుమారుఁడగు సుగ్రీవుఁ డవ్వానరసైన్యమునందు సూర్యుఁడు నిజతేజంబున దుర్ధర్షుండై వెలుంగునట్లు, తానును ధర్షింపరానివాఁడై జయలక్ష్మిచే నెంతయుఁ బ్రకాశించెను. అంత మహాత్ముఁడగు వానరేంద్రుఁడు సుగ్రీవుఁడు యుద్ధముఖమున విజయమునొంది, యాకాశమున దేవతలును యక్షులును సిద్ధులును భూమియందలి ప్రాణులును గుంపులుగొని మిక్కిలి సంతోషావేశమునఁ బొగడ నెగడుచుండెను. ఇది తొంబదియెనిమిదవ సర్గము.



రావణునిమంత్రియగు మహాపార్శ్వుఁ డంగదునిచే హతుఁడగుట.

మహోదరుఁడు సుగ్రీవునిచే హతుఁడగుటంజూచి యంత మహాబలుఁడగు మహాపార్శ్వుఁడు, కోపంబునఁ గన్నెఱ్ఱఁజేసి, భయంకరమయిన యంగదుని సైన్యమునుజొచ్చి బాణములచేఁ గలంచివుచ్చెను. ఆమహాపార్శ్వుఁడు, వాయువు కొండల నుండి పండ్లను బడరాల్చునట్లు, మేటివానరవీరుల తలలను కుత్తుకలనుండి బాణములచే డొల్లనేసెను. ఆరాక్షసుఁడు మిక్కిలి కుపితుఁడై కొందఱు వానరుల బాహువులను, కొందఱ మూఁపులను, కొందఱ డొక్కలను, బాణములచే విదారించెను. అట్లు మహాపార్శ్వుని బాణవర్షములచేఁ బీడితులై యవ్వానరులందఱును, నోర్వఁజాలక, విషాదమున యుద్ధవిముఖులై సొమ్మసిలిరి. మహాబాహుఁడగు నంగదుఁడు తన సైన్య మారాక్షసునిచే నలఁగి భయముగొని యుండుటనుజూచి సముద్రము పర్వకాలమునఁ జిమ్మరేఁగునట్టు ఉరవడి చూపసాఁగెను. వానరశ్రేష్ఠుఁడగు నంగదుఁడు బంగారుకట్లునేసి యుండుటవలన సూర్యకిరణములవలె వెలుంగుచున్న యినుపగుదియను దీసికొని యుద్ధమున మహాపార్శ్వునిపయిఁ బడవేసెను. దుర్బుద్ధియగు నామహాపార్శ్వుఁడు, ఆదెబ్బకు సారథియుం దానును దెలివిదూలి మూర్ఛితుఁడై, రథమునుండి, నేలంబడెను. మహాబలుఁడై కాటుకరాశియుంబోలె నల్లనైన మేనుగలిగి, మిక్కిలియు వీర్యశాలియు తేజోవంతుఁడునగు గవాక్షుఁడును జాంబవంతుఁడును, మేఘమువలెఁ బఱపై నల్లగాఁ గారుకొనుచున్న తమభల్లూకసేననుండి వేగ వెలువడి, క్రుద్ధులై పర్వతశిఖరసమానమును విశాలమునైన పెనుశిలను జేకొని, వేగమున మహాపార్శ్వుని యశ్వములనుజంపి వానిరథమును నుగ్గు గావించిరి. మహాబలుఁడగు మహాపార్శ్వుఁడు, కొంతవడికిఁ దెలివినొంది, యయ్యంగదునిపైఁ బెక్కుబాణములుబఱపి యతనిని మిక్కిలియు నొప్పించెను. ఆమహాపార్శ్వుఁడు, భల్లూకపతియగు జాంబవంతుని వక్షమునందు మూఁడుబాణములును, గవాక్షునిఁ బెక్కుబాణములను నొప్పించెను. అట్లు జాంబవంతుఁడును గవాక్షుఁడును, బాణపీడితులగుటంజూచి, యంగదుఁడు కోపావిష్టుఁడై భయంకరమగు పరిఘమును గయికొనెను. వేగవంతుఁడగు వాలికుమారుఁ డంగదుఁడు, మిక్కిలియు కుపితుఁడై మహాపార్శ్వుని వధార్థమై, యతఁడు, దూరమున నుండుటవలన సూర్యకిరణములంబోలె బంగారుకట్లచేఁ బ్రకాశించుచున్న యాయినుపగుదియనుబట్టి రెండుచేతులతోను గిరగిరం ద్రిప్పి వానిపయిం బడవైచెను. బలవంతుఁడగు నంగదుఁడట్లు బలముకొలఁదిని జిమ్మివైవఁగా నాపరిఘము మహాపార్శ్వుని బిట్టుగాఁదాఁకి, వానిచేతినుండి బాణసహితమగు ధనుస్సును, వానిశిరస్సునుండి బొమిడికమును బడవైచెను. ప్రతాపవంతుఁడగు నంగదుఁడు వానిని వేగఁగిట్టి, క్రుద్ధుండై, కుండలములు దులకించుచున్న వానికర్ణమూలమున నఱచేతం జఱచెను. మహావేగవంతుఁడును మిక్కిలి కాంతిసంపన్నుఁడునగు నమ్మహాపార్శ్వుఁడు, క్రుద్ధుఁడై, మిక్కిలియుం బెద్దదియైన యొకగండ్రగొడ్డలిని నొకచేతం గొనెను.

అగండ్రగొడ్డలి ప్రతిదినమును నూనెచఱుచుచుండుటనలనఁద్రుప్పులేక నిర్మలమై, పర్వతసారమువలె నతికఠినమై శిథిలముగాక యుండెను. మహాపార్శ్వుఁడట్లు పరమ క్రుద్ధుఁడై యాపరశ్వథమును నంగదునిపయి వైచెను. అమ్మహాపార్శ్వుఁ డట్లు అంగ దుని యెడమభుజఫలకముమీఁద నాగండ్రగొడ్డలిని బెట్టిదముగా వ్రేయఁగా, నతఁడు కుపితుఁడై లాఘవమున నావ్రేటు దప్పించుకొనెను. అయ్యంగదుఁడు,తనతండ్రియగు వాలివంటి పరాక్రమశాలియు శూరుఁడునుగాన, మిక్కిలి క్రుద్ధుఁడై వజ్రాయుధము వంటి కఠినంపుఁబిడికిలి నలవరించి త్రిప్పెను. ఆయంగదుఁడు ఆయపట్టుల నెఱింగిన వాఁడు గావున మహాపార్శ్వునివక్షఃస్థలమున గుండెకు సరిగా నింద్రునివజ్రముఁబంటి పిడికిటం బొడిచెను. అమ్మహాయుద్ధమున నయ్యంగదుని పిడికిటిపోటునకు మహాపా ర్శ్వుఁడు గుండె తటాలున వ్రీలఁగా, వాఁడు ప్రాణములువీడి నేలంగూలెను. ఆమహాపార్శ్వుఁడు నేలంగూలఁగానే, యారాక్షససేనయంతయు మిక్కిలి కలఁగఁబా ఱెను. అప్పుడు యుద్ధమున రావణునకు మిక్కిలియుఁ గ్రోధము కలిగినదయ్యె. అప్పుడు వానరులు మిక్కిలియు నుబ్బుచెంది లంకను దానికోటబురుజులను పురద్వారము లను బ్రద్దలుగాఁబగులునో యన్నట్లు, బిట్టుగా సింహనాదములు సేసిరి. అట్లె దేవేం ద్రుఁడును దేవతలును, సంతోషమున మహాధ్వనిగావించిరి. అంత నింద్రునకు శత్రు వయిన రాక్షసేంద్రుఁడు రావణుఁడు, నట్లు దేవతలును వానరులును గావించిన మ హాధ్వనినివిని కుపితుఁడై మరల యుద్ధమున కభిముఖుఁడై నిలిచినవాఁడయ్యె. ఇది తొంబదితొమ్మిదవసర్గము.

---

## రామరావణయుద్ధారంభము.

రావణుం డమ్మహాయుద్ధమున మహాబలుఁడును వీరుండునగు నవ్విరూపాక్షుఁడు హతుఁడగుటయు, పిదప మహోదరుఁడును మహాపార్శ్వుఁడును హతులగుటయును, జూచి, మిక్కిలి కోపావేశమునొందెను. ఆరావణుఁడు సారథిని రథము దోలు మనిచెప్పి వానితో 'నే నిదిగో * నిపుడు రామలక్ష్మణులనుజంపి, యిదివఱకు హతు లయిన మంత్రులకును ముట్టడివేయఁబడిన లంకాపట్టణమునకు దుఃఖము నెల్లఁ బోఁ గొట్టెదను. సీతయనెడి పువ్వుగలదై ఫలము లొసంగుచు, సుగ్రీవుఁడు జాంబవంతుఁ డు కుముదుఁడు నలుఁడు మైందుఁడు ద్వివిదుఁడు అంగదుఁడు గంధమాదనుఁడు హనుమంతుఁడు సుషేణుఁడు మఱియుఁ దక్కిన వానరయూథపతులందఱును చిన్నకొమ్మలుగాఁగలిగి యున్నరాముఁ డనువృక్షమునిపుడు యుద్ధమున ఖండించెదను' అనెను. అతిరథులలోనెల్లగొప్పవాఁడగు నారావణుఁడు,రథఘోషముచే దశదిశలును మోగ్రయించుచు శీఘ్రమున రామునిమీఁదికిం బోయెను. ఆమహాధ్వనిచేతం బూరి

* ఇచట వాస్తవార్థము యథాయోగ్యముగ గ్రహించుకొనునది.

తమై భూమియంతయు నదులతోను పర్వతారణ్యములతోను గజవరాహాదిమృగములతోను జలనమునొందెను. ఆరావణుఁడు మిక్కిలియు భయంకరమై మహాతీక్ష్ణమగు తామసాస్త్రమును బ్రయోగింపఁగా, వానరులందఱును నయ్యస్త్రముచే దగ్ధులై నలుగడలఁ ద్రెళ్ళ నారంభించిరి. ఆయస్త్రము బ్రహ్మ స్వయముగా నిర్మించినదిగావున వానరులు దానికి సహించి నిలువఁజాలక భంగమునొంది పరుగెత్తఁగా నందువలన నపుడు బెట్టిదముగా దుమ్ము రేఁగెను. అట్లు వానరసైన్యములు పెక్కులు రావణుని మేటిబాణములచే వందలకొలఁదిని భంగమునొందుటను జూచి రాముఁడు యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యెను. *రాక్షససింహుఁడు రావణుఁ డట్లు వానరసైన్యములను బాఱఁదఱిమి, యంత పరాజయమెన్నఁడెఱుఁగని రాముఁడు ఉపేంద్రునితోఁ గూడిన యింద్రునివలెఁ దమ్ముండగు లక్ష్మణునింగూడి, పెనువింటిని గేలనూని యాకాశము నొఱయునట్లు నూపట్టుచు తామర రేకులంబోని వాలుఁగన్నుఁగవయు, నిడుదలయిన బాహువులును నొప్పుగులుక పగవారి పీఁచమడంచువాఁడై నిలుచుండఁగాఁ గాంచినవాఁడయ్యె. అంత మహాతేజస్కుఁడును బలవంతుఁడునగు రాముఁడు లక్ష్మణుండును దానును, యుద్ధమున వానరులు భంగము నొందుటయు, రావణుఁడు తనపైకి వచ్చుచుండుటయుఁజూచి చిరకాలమున కతనితోఁ బోరుగలిగెనని యుబ్బునొంది వింటిని నడుమం బట్టుకొని †యంత మిక్కిలి వేగంబున నా పెనువింటి మహాధ్వనిచే భూమినంతయు భేదించునట్లుం బోలె, నారి సారింపఁ దొడంగినవాఁడయ్యె. అప్పుడు రావణుఁడు ప్రయోగించిన బాణజాలము చేతను రాముఁడు నారిసారించుట చేతనుం బుట్టినధ్వనికే యారాక్షసులును వానరులును పెక్కండ్రు వందలకొలఁదిని బడిరి. ఆరావణుఁడు రాజకుమారులయిన యారామలక్ష్మణుల బాణములబారిం బడునట్లు నిలిచినపుడు, అమావాస్యయందు చంద్రసూర్యుల సమీపముననున్న రాహువువలెఁ బ్రకాశించెను. లక్ష్మణుఁడు మొదటఁ దానా రావణునితో వాఁడిబాణములం బోరఁగోరి, వింటినాకర్షించి యగ్నిజ్వాలలవంటి బాణములను బ్రయోగించెను. లక్ష్మణుఁడు విలుగొని యాబాణములను బ్రయోగించినమాత్రముననే మహాతేజస్కుఁడగు రావణుఁడు వానిని ఆకాశముననే బాణము లేసి వారించెను. రావణుఁడు తనహస్తలాఘవమును జూపుచు, లక్ష్మణుని బాణములం దొకబాణము నొక్కబాణమునను, మూటిని మూటను, పదింటిని పదింటను ఇట్లన్నింటి కన్నిబాణము లేసి ఖండించెను. అంత యుద్ధంబుల జయశీలుఁడగు

* ఈవాక్యముచే రాముని యపరాజితత్వమును, నిరవధిక సౌందర్యనిధి యగుటచే వైరమువిడిచి యతనిసౌందర్యము నిరంతరమును ననుభవింపఁదగినదై యుండుటయు, రావణునిదుర్బుద్ధియు, ఆవర్తము చేత అమృతప్రవాహమునుంబోలె మేటిధనువుచేత నావర్తితమైన శ్రీరామదేహలావణ్యామృతపూరమునం దవగాహనము నేయకున్న యతనిదౌర్భాగ్యమున చెప్పఁబడినవి.

† ఇట 'వింటిని నడుమంబట్టుకొని నారిసారించుటయు' ననియిట్లు రాముఁడు విలంబము చేయుట రావణుఁ డింతకయినను నమ్రుఁడైవచ్చునో యేమోయని దయాళుత్వమునెఱపుట తెలియునది.

రావణుఁడు లక్ష్మణుని బాణములొక్కటియుఁ దన్నుఁ దాఁకనందున నతనిని సరకుసేయక యతిక్రమించి పర్వతమువలె స్థిరముగా నిలుచున్న రామునిఁ దారసించెను. రావణుఁడట్లు రాముని దార్కొని కోపంబున కన్నులెఱ్ఱఁబాఱ, రామునిపయిని బాణవర్షము గురిసెను. అంత, రాముఁడు రావణుని వింటినుండి జలధారలవలె నెడతెగక వేగ బాణములు వచ్చుచుండుటం జూచి, తానమ్ములపొదినుండి వేగ కత్తివాతి బాణములం దీసెను. * అంత రాముఁడు దేదీప్యమానములై కుపితములయిన సర్పములుం బోని మహాభయంకరములయిన యా బాణసమూహములను వాఁడిభల్లములచేఁ దుండించెను. అప్పుడు రాముఁడు రావణునిని, రావణుఁడు రామునిని, వేగ దలపడి, యొకరిపయి నొకరు పలువిధములగు వాఁడిబాణములను వేగ కురియించిరి. అప్రతిహతులగు నయ్యిరువురు, ఒండొరుల బాణవేగములను వారించుచు చాలసేపువఱకు చిత్రముగా సవ్యాపసవ్యమండలములం దిరుగుచుఁ బోరిరి. అట్లయ్యిరువురు, యముఁడును నతనినడంచిన రుద్రుండునుంబోలి, భయంకరులై బాణములు ప్రయోగించుచు నొక్కటం దలపడి పోరాడుచుండుటం జూచి సమస్తభూతములును దిగులొందినవి. వర్షాకాలమున మెఱుపువరుసలతోఁ గూడిన మేఘములు దట్టముగాఁ గ్రమ్మునట్లు, ఆకాశమున నపుడు నానావిధములగు బాణములు దట్టముగా నిండియుండినవి. ఆకాశమున బాణములు నిండి జడివలె ముసరి నడుమనడుమ నవకాశములుండుటం జేసి కిటికీలు నిర్మించినట్లుండెను. సూర్యుఁడస్తమించినపిదప, మహామేఘము లేచి ధారలుగా వర్షించి మఱియుఁ జీఁకటిగాఁ జేయునట్లు, అయ్యిరువురును, మహావేగములును మిక్కిలియుఁ దీక్ష్ణములును గద్దఱెక్కలు గట్టంబడుటం జేసి మంచిఱెక్కలు గలవియు, మిక్కిలి వాఁడిమొనలతోఁ గూడినవియునగు బాణములను దట్టముగాఁ బ్రయోగించి యుద్ధంబంతయు గాఢాంధకారము గలిగి భయంకరమగునట్లు గావించిరి. అప్పుడయ్యిరువురును నొండొరుల వధింప నువ్విళ్లూరుచు వృత్రుఁడును నింద్రుండునుంబోలె భయంకరముగాఁ బోరిరి. అయ్యుద్ధం బెట్టివారికిని దారసింపఁ దరముగాకయు నిట్టిదట్టిదని చింతింప నలవిగాకయు నుండెను. అయ్యోద్ధలును మేటివిలుకాండ్రు. ఇద్దఱును సమస్తాయుధములందు నిపుణులు. ఇద్దఱును నస్త్రవేత్తలలో నుత్తములు. కావున నిద్దఱును యుద్ధమున సమానముగా విహరించిరి. అయ్యిరువురు నేయేమండలగతులందిరుగుదురో యాయాగతులచేత నాయావైపునుండి సముద్రములనుండి వాయువేగమునఁ దరంగములు లేచునట్లు, బాణపరంపరలు వెడలుచుండినవి. అంతలోక రావణుండగు రావణుండు హస్తమున బాణప్రయోగము సేయుచునే రాముని లలాటమందు బాణపంక్తిని గాఁడనేసెను. బె దనుగు రావణునివింటినుండి విడివడి నల్లకలువరేకులకాంతిఁ దళుకొత్తుచున్న యా బాణపంక్తి రామునిశిరమున నాటియు

* ఇట అమావాస్యయందె రామరావణయుద్ధము జరుగుచున్నదిగాన అమావాస్యయందని యధ్యాహరించుకొనుట యొప్పియున్నది.

న్నను నతఁడెంతమాత్రమును వ్యథ నొందఁడయ్యెను. అంత మహాతేజుండును వీర్యవంతుఁడునగు రాముఁడు, రౌద్రాస్త్రమంత్రమును జపించుచు నాయస్త్రపువిస్తారములయిన పెక్కుబాణములను దీసి క్రుద్ధుఁడై వింటినాకర్షించి రావణునిపయిం బ్రయోగించెను. ఆబాణములు మహామేఘమునుంబోని రావణుని యభేద్యకవచమును దాఁకి యాకవచబలముచే నతని కెంతమాత్రము నపుడు వ్యథ గలిగింపవయ్యె. అంత యుద్ధమున సమస్తాస్త్రనిపుణుండగు రాముఁడు మరల రథగతుం డగురావణుని లలాటమునందు గొప్పయస్త్రమంత్రముచే నభిమంత్రించి బాణములం బ్రయోగించెను. అమ్మహాస్త్రవికారములయిన బాణములు రావణునిబాణములను భేదించి రావణునిచే వారింపఁబడినవై, కుపితములయి యూర్పులుపుచ్చుచున్న యైదుతలల సర్పములవలె భూమింజొచ్చినవి. రావణుఁడు రాముఁడు ప్రయోగించిన యయ్యస్త్రమును వారించి క్రుద్ధుఁడై మిక్కిలిభయంకరమయిన యాసురాస్త్రమును బ్రయోగించెను. అయ్యాసురాస్త్రమునుండి సింహముఖములును, వ్యాఘ్రముఖములును, కంకముఖములును, కాకముఖములును, గృధ్రముఖములును, డేగముఖమువంటి ముఖములుగలవియు, నక్కముఖముగలవియు, తోఁడేళ్లముఖములు గలవియు, నోరుదెఱచుకొనిభయంకరములైన యయిదుతలల సర్పములంబోని యాకారముగలవియు నగువాఁడిబాణములు మఱియు నితరములైనవియు పెక్కులు వెడలినవి. మహాతేజుండును మాయావియునగునారావణుఁడు, క్రుద్ధుఁడై సర్పమువలె నూర్పుల నిగిడించుచు నయ్యాసురాస్త్రమహిమం జేసి ఖరముఖములును, వరాహముఖములును, శునకముఖములును, కుక్కుటముఖములును, మకరముఖములును, సాధారణ సర్పముఖములును నగువేఱుబాణములను మఱియు నితరములయిన వాఁడిబాణములను, రామునిపయిం బ్రయోగించెను. అట్లయ్యాసురాస్త్రము దారసింపఁగా అగ్నితుల్యుండగు రాముఁడు మిక్కిలి యుత్సాహంబుదీపింప, నాగ్నేయాస్త్రమును బ్రయోగించెను. అయ్యాగ్నేయాస్త్రప్రభావమువలన, అగ్ని ధగధగజ్వలించు ముఖములుగలవియు, సూర్యముఖములును, చంద్రముఖములును, అర్ధచంద్రముఖములును, ధూమకేతుముఖములును, గ్రహనక్షత్రముఖములును, మహోల్కాముఖములు వర్తించునవియు మెఱుపుజ్వాలలంబోనివియు, నగుబాణములును మఱియు నితరములయిన వాఁడిబాణములును వెడలినవి. రావణుని యాసురాస్త్రమున జనించిన భయంకరబాణములు రామునియాగ్నేయాస్త్రము దాఁకఁగానే కొట్టువడి యాకాశముననే వేయిదునియలుగా రూపుమాసినవి. ఎట్టికార్యము నేని చుల్కంగ గావించు రాముఁ డపుడు, అయ్యాసురాస్త్రమును నివారించుటనుజూచి, యంత కామరూపులగు సుగ్రీవాదులును వానరవీరులందఱును, రామునిఁ బరివేష్టించి యుబ్బున నార్పులు సెలంగించిరి. అప్పు డమ్మహాయుద్ధమున రాముఁడు రావణహస్తప్రయుక్తమైన యా యాసురాస్త్రమును ప్రతిహతము గావించి ముద

మునొందెను. వానరేశ్వరులును ముదమునొంది బిగ్గఱ నార్పులు గావించినవా రయిరి. ఇది నూఱవసర్గము.

---

రాముఁడు కొంతవిశ్రమించుచుండఁగా లక్ష్మణవిభీషణులు రావణుని హయరథసారథులను నుఱుమాడుట; రావణుఁడు విభీషణునిపైఁ బ్రయోగించినశక్తిని లక్ష్మణుఁడు ఖండింపఁగా రావణుఁడు మయనిర్మితమైన యమోఘశక్తిచే లక్ష్మణుని మూర్ఛితుం జేయుట; రాముఁడు హనుమదాదుల లక్ష్మణుని రక్షింప నియమించి రావణు నమితబాణవర్షముల నొప్పించుట.

రాక్షసరాజగు రావణుఁడు, అయ్యాసురాస్త్రము ప్రతిహతమగుటంజూచి, క్రోధమినుమడింప మఱియొక యస్త్రమును బ్రయోగించువాఁడయ్యె. మహాతేజుండగు రావణుఁడు మయునిచే విహితమై రుద్రదేవతాకమై భయంకరమయిన మఱియొక యస్త్రమును రామునిపయిం బ్రయోగింపసాగెను. అంత నతని ధనువునుండి దేదీప్యమానములై వజ్రాయుధమునకుం గలసారముగలిగినశూలములును గదలును ముసలములును వెడలినవి. ప్రలయకాలమున మహావాయువులు వెడలునట్లు,నానావిధములును దీక్ష్ణములును, నగుగుదియలును కపటములగు పాశములను జ్వలించుచున్న వజ్రములును, భయంకరములై మహావేగమున వెడలినవి. శ్రీమంతుఁడును మహాకాంతిసంపన్నుఁడును దివ్యాస్త్రవిదులలోనెల్ల మేలుబంతియునగు రాముఁడు, గొప్పదియగు గాంధర్వాస్త్రముచేత నారౌద్రాస్త్రమును బడఁగొట్టెను. మహాత్ముఁడగు రాముఁ డారౌద్రాస్త్రమును హతము సేయఁగా, రావణుఁడు కోపంబునఁ గన్నులకెంపు గదుర సౌరాస్త్రమును బ్రయోగించెను. అంత భయంకరవేగుండును బుద్ధిమంతుండునగు రావణుని వింటనుండి, ధగధగ మెఱయుచున్న గొప్పగొప్పచక్రాయుధములు వెడలినవి. దేదీప్యమానములై చంద్రసూర్యగ్రహసమానాకారములైయున్నయాబాణములు నిందునందు వ్యాపించుచుండఁగా, చంద్రసూర్యులును గ్రహములును క్రిందఁ బడుచున్నటువలె ఆకాశమును దిక్కులును బ్రకాశించినవి. ఆ రాముఁడు సేనాముఖముననిలిచి రావణుఁడుప్రయోగించిన యాచక్రములను చిత్రములయిన యితరాయుధములను, బాణసమూహములఁ బఱపి ఖండించెను. రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు, ఆసౌరాస్త్రముగూడ ప్రతిహతమగుటనుజూచి, రామునిమర్మస్థానములం దన్నిటను,పదిబాణములఁ గ్రుచ్చి నొప్పించెను. రావణుఁడు మహాధనుస్సునుండి ప్రయోగించిన యాపదిబాణములు గ్రుచ్చుకొనఁగా రాముఁడు మహాతేజుండు గావున నెంతమాత్రము చలించినవాఁడు గాఁడయ్యె. అంత యుద్ధంబుల జయంబు గొనుచుండు రాముఁడు, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై రావణుని యవయవములం దన్ని

టను పెక్కుబాణములఁ జొప్పించి నొప్పించెను. అట్లు రావణునిఁ బ్రహరించి రాముఁడు గొంత విశ్రమించియుండునంతలో రామునితమ్ముఁడును శత్రువీరుల నుఱుమాడువాఁడును బలవంతుఁడునగు లక్ష్మణుఁడు ఏడుబాణములు దీసికొనెను. మహాతేజుఁడగు లక్ష్మణుఁడు మహావేగము లయినయాబాణములచే మనుష్యుని తలవ్రాసియున్న రావణుని ధ్వజమును పెక్కుపఱియలుగా ఖండించెను. కాంతిమంతుఁడును మహాబలసంపన్నుఁడునగు లక్ష్మణుఁ డంత నొక్కబాణమున కుండలాలంకృతమయిన రావణుని సారథిశిరముఁ దెగవ్రేసెను. లక్ష్మణుం డయిదు వాఁడిబాణముల రాక్షసేంద్రుఁడగు రావణుని మహాధనుస్సును, ఏనుఁగుతొండమువంటిదానిని, తునియలుగావించెను. ఇట్లు విలువిఱిగి రావణుఁడు మిన్నకుండఁగా, విభీషణుఁడు దూఱితలపడి, నీలమేఘసమానములును పర్వతాకారములునగు రావణుని యుత్తమాశ్వములను గదచేఁ గొట్టిచంపెను. మహావేగుఁడగు రావణుఁడు గుఱ్ఱములు హతములుకాఁగా, వేగ తనమహారథమునుండి నేలకు దూఁకి, తమ్ముండగు విభీషణునియెడ మహాకోపంబు పూనినవాఁడయ్యెను. అంత మహాశక్తిమంతుఁడును ప్రతాపవంతుఁడు నగు రావణుఁడు, దేదీప్యమానమై వజ్రమువలె వెలుంగుచున్నశక్తిని విభీషణునిపైఁ బడవైచెను. లక్ష్మణుఁడు, ఆశక్తి విభీషణునిమీఁద రాకమునుపే దానిని మూఁడుబాణముల ఛేదించెను. అంత నపుడు యుద్ధమున వానరులు బిట్టుగ నార్పులు చెలఁగించిరి. కాంచనమాలికచే నలంకృతమైన యాశక్తి మూఁడుతునియలుగాఁ దునిసి, మిణుంగుఱులు సెదర, జ్వలించుచు నాకాశమునుండి పెద్దయుల్కపడినట్లు, నేలంబడెను. అంత, నారావణుఁడు, చందనాదులచే మఱింత యర్చితమై యమునికిఁగూడఁ దారసింప నలవిగానిదై నిజతేజమున వెలుంగుచున్న మహాశక్తిని గ్రహించెను. ఎట్టివారికిని దారసింప నలవిగానిదై దేవేంద్రుని వజ్రాయుధమువలెఁ గాంతిఁ దేజరిల్లుచున్న యామహాశక్తి, బలవంతుఁడగు రావణుఁడు తనబలముకొలఁదిని నురవడిం ద్రిప్పఁగా, నది జ్వలించుచు మిక్కిలియు భయంకరమై చూపట్టెను. ఇంతలో వీరుండగు లక్ష్మణుఁడు, విభీషణుఁ డట్లు ప్రాణసందేహము నొందుటనుగని, శీఘ్రమునంబోయి యతనికడ్డమునిలిచెను. వీరుఁడు లక్ష్మణుండు, ఆవిభీషణునిఁ దప్పించుటకై, వింటి నాకర్షించి, శక్తిని కేలందాల్చి యున్నరావణునిపయి బాణవర్షములు గురిసెను. మహాత్ముఁడగు లక్ష్మణుఁడు, రావణునిపై బాణసమూహములను బరఁగించుచుండఁగా, నతఁడు విభీషణునియెడఁ బరాక్రమము చూపుట కయితిలేక పోవుటచే నావిభీషణునిఁ బ్రహరించు తలంపు మానినవాఁడయ్యె. ఆరావణుఁడు, తనతమ్మునిని లక్ష్మణుఁడు తప్పించుటను జూచి, లక్ష్మణు నెదుర్కొని నిలిచి యతనితో 'లక్ష్మణా! నీవు బలంబున విఱ్ఱవీఁగి, మిన్నకుండక యిట్లు విభీషణునిఁ దప్పించితివి గావున నిఁక నారాక్షసుని విడిచి యాశక్తిని నీమీఁదఁ బడవైచెదను. ఇదివఱ కెందఱినో చంపి నెత్తురు చిన్నెలతోఁ గూడియున్న యాశక్తి యనుపగుదియవంటి నాబాహువునుండి ప్రయుక్తమై నీప్రా

దయము నుచ్చికొని నెత్తుటందోఁగి నీప్రాణములు గొనిపోవంగలదు' అనెను. ఇటు రావణుఁడు చెప్పి, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై లక్ష్మణునిమీఁద నెనిమిదిగంటలతోఁ గూడి మహాధ్వని గలుగునట్లు మ్రోయుచున్నయాశక్తిని బ్రయోగించి యార్చెను. ఆశక్తి మయుఁడు మాయచే నిర్మించినట్టిది అదిమొట్టిశత్రువులమీఁదఁ బ్రయోగించినను వ్యర్థముగాక శత్రువుల రూపుమాపుచు నిజతేజంబున జ్వలించు చున్నట్లు చూపట్టుచుండెను. అట్లు రావణుఁడు బెట్టిదమైన యురవడితో దానిని బ్రయోగింపఁగా నది యింద్రునివజ్రముంబోలె బిట్టు మ్రోఁగుచు యుద్ధాగ్రంబున లక్ష్మణుని మీఁది కడరెను. రాముఁడు దానినిజూచి 'లక్ష్మణునికి శుభంబగుఁగాక' యని తమ్మునికి మంగళాశాసనముగావించి యాశక్తినుద్దేశించి 'నీవు చంపఁబూనిన పూన్కి విఫలమయి వ్యర్థమగుదువుగాక' యని వెంటనేచెప్పెను. రావణుఁడు యుద్ధంబునఁ గ్రుద్ధుఁడై సర్పముంబోని యాశక్తిని విడువఁగా నది క్షణమున నెట్టివారినేని భస్మము సేయఁజాలినదయ్యును, రాముఁడు వ్యర్థముగావించుటచే, శూరుఁడై యెంతమాత్రమును భయపడక నిలుచున్న లక్ష్మణునివక్షమును గాఁడినదిమాత్రమయ్యె. మిక్కిలివేగముగలిగి మహాకాంతిని వెలుంగుచున్న యాశక్తి సర్పరాజయిన యాదిశేషుని నాలుకవలె భయంకరమై తేజరిల్లుచు లక్ష్మణుని వెనువక్షముం దాఁకెను. అంత లక్ష్మణుఁడు రావణునిచేతి యురవడిచేత నాశక్తి చాల లోఁతుగానాఁటి వక్షమును భేదింపఁగా నేలంబడెను. అప్పుడు మహాతేజుఁడగు రాముఁడు దాపుననుండెను గాన లక్ష్మణుఁ డట్టియవస్థను బొందుటనుజూచి తమ్మునియందలినెయ్యముచే మనమున విషణ్ణుఁడయ్యెను. అతఁడు కన్నులనీళ్లుగ్రమ్మ గొంతసేపు సేయవలసినదేమియని యాలోచించి యంతఁ బ్రళయకాలాగ్నివలె మిక్కిలియు నురవడింపసాగెను. రాముఁడు 'ఇది దుఃఖమునకు సమయముకా'దని చింతించి సీత నపహరించుటంబట్టియేకాక లక్ష్మణుని నట్లుండఁగా జూచుటంబట్టియు అన్నివిధములను మిక్కిలియు బ్రయత్నపడి రావణుని వధించుటయందే కనుగలిగి నతనితో బెట్టిదముగా యుద్ధముసేసెను. ఏలన రాముఁ డంత మహాయుద్ధంబున శక్తిచే భిన్నుఁడై నెత్తుటందోఁగుచు, సర్పముతోఁగూడిన పర్వతమువలె లక్ష్మణుఁ డుండఁగాఁ జూచెను. కావున నే రావణుం జంప నిశ్చితుఁడయ్యెను. అవ్వానరశ్రేష్ఠులు బలవంతుఁడగు రావణుఁడువైచిన యాశక్తిని,దాని దార్ఢ్యమువలన తా మెంతప్రయత్నము చేసియు విఱువఁజాలకపోవుటయేకాక, రావణుఁడు హస్తలాఘవముగలిగి యతివేగముగా బాణజాలములు పరఁగించి నొప్పించుటవలనంగూడ, ఆశక్తిని, నెంతమాత్రము విఱువఁజాలరయిరి. మఱియు నమ్మహాశక్తి లక్ష్మణుని భేదించి భూమింజొచ్చినది; కావునను వారికి విఱువఁ దరముగాదయ్యె. బలవంతుఁడగు రాముఁడు యుద్ధంబునం గ్రుద్ధుఁడై, భయంకరమగు నమ్మహాశక్తిని రెండుచేతులంబట్టికొని లాగి విఱిచివైచెను. రాముఁ డాశక్తినిబట్టి లాగుచుండఁగా మహాబలుండగు రావణుఁడు, అతని సమస్తావయవములందును, మర్మములభేదించు

నట్టి వాఁడిబాణములం బ్రయోగించెను. రాముఁ డాబాణములను సరకుసేయక లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని హనుమంతునిని సుగ్రీవునిని నితరవానరవీరులనుంగాంచి,'వానరోత్తములారా! ఇచటమీరు లక్ష్మణునిఁ బరివేష్టించి కాచుచుండుఁడు. చాలఁగాలముగా నువ్విళ్లూరుచున్న చాతకపక్షికి వర్షాకాలమురాఁగా మేఘముగపడినట్లు, బహుకాలముగాఁ గోరుచుండిన నాకిపుడు పరాక్రమమునకు నిదెకాలము లభించినది. కాన పాపాత్ముఁడును పాపనిశ్చయుండునగు రావణునిప్పుడు తప్పక వధింపవలయును. వానరులారా ! మీయెదుట సత్యముగాఁ బ్రతిజ్ఞసేయుచున్నాను. ఈ ముహూర్తములోనే, అంతసేపా ! అతిత్వరలోనే, మీరు జగంబున రావణుఁడుగాని రాముఁడుగాని లేకపోవుటఁ జూడఁగలరు. రాజ్యముపోవుట, వనమునవసించుట, దండకారణ్యమున గ్రుమ్మరుట, సీత పరులచే స్పృశింపఁబడుట, రాక్షసులచేతం జిక్కుట, పంపావనాదులందు మహాదుఃఖము కలుగుట, నరకమునకుంబోలె మిక్కిలియు ఘోరమైన యీలక్ష్మణునిపాటునం గలిగిన క్లేశమును, సమస్తము నిపుడు యుద్ధమున రావణునిం జంపి దిగవిడిచెదను. ఎవనికిఁగా నేను యుద్ధమున వాలినివధించి సుగ్రీవుని వానరరాజుగావించి యీవానరసేన నిచటికిం దెచ్చితినో,మఱియు నెవనికిఁగా సముద్రమున సేతువుగట్టి దానిని దాఁటి యిచటికి వచ్చితినో,అట్టిపాపాత్ముఁడు రావణుఁడిపుడు నాకంటిబారింబడినాఁడు.*దృష్టియందు విషముగల సర్పములకంటం బడినవాఁడు జీవింపనట్లు, నాకంటిబారింబడి వీఁడు బ్రతుకఁజాలఁడు. దుర్ధర్షులగు వానరపుంగవులారా! మీరు పర్వతాగ్రములం గూర్చుండి, స్వస్థముగా, నాకును రావణునకును నిదె జరుగఁగల యుద్ధమును జూచుచుండుఁడు. దేవతలును ఋషులును గంధర్వులును చారణులును మఱియు మూఁడులోకములందున్నవారును, ఇప్పుడు యుద్ధమున రాముని † రామత్వమును జగదేకవీరత్వమును జూతురుగాక. లోకములందెల్లఁగల సమస్త చరాచరములును దేవతలును గుంపులుగాఁ జేరి, యిప్పుడు యుద్ధము జరిగినవిధమును భూమి యుండునంతవఱకును, నిత్యమును లోకమునఁ జెప్పుకొనుచుండనట్లుచేయునట్టి పరాక్రమకృత్యమును నిదె కావించెదను' అనెను. ఇట్లు పలికి రాముఁడు యుద్ధమున నెచ్చరికమీఱ, మేలిబంగారుచే రంగారు వాఁడిబాణముల రావణునొప్పించెను. అంత మేఘము జలధారలు గురియునట్లు రావణుఁడు రామునిపై, ధగధగ మెఱయుచున్న బాణములు ముసలములు మొదలగువానిని జడిగా గురిసెను. రాముఁడును రావణుఁడును నొకరిపయి నొకరు ప్రయోగించుబాణము లొండొంటిం గొట్టుకొనఁగాఁ బుట్టినధ్వని తుములమై చెలంగెను. బంగారు పింజకొనలు ధగధగ మెఱయుచున్న యారామరావణబాణములు ఒకటిచే నొకటి భిన్నములై చెల్లచెదరై యాకాశమునుండి నేలంబడినవి. రామరావణు లిరువురజ్యాత

---

* కొన్ని సర్పములు తమచూపువలననే మనుష్యులను జంపునని ప్రసిద్ధి.

† రామత్వమనఁగా రామావతార ప్రయోజనమని యాచార్యులు చెప్పెదరు.

లధ్వని, మిక్కుటమై సమస్తభూతములకును దిగులుగొలుపుచు నాశ్చర్యమునందగి చెలంగినది. తళతళ మెఱయుచున్న పెనువిలుదాల్చి మహాత్ముఁ డారాముఁడు బాణజాలములను జడిగొన రావణునిపయి విచ్చలవిడిఁ బరఁగింపఁగా, రావణుఁ డతని నట్లు దాఁకి మిక్కిలియుఁ బీడితుఁడై వాయువుచేఁ గొట్టువడిన మేఘమువలె భయమునఁ బరుగెత్తినవాఁడయ్యె. ఇది నూటయొకండవసర్గము.



రాముఁడు లక్ష్మణుంగూర్చి విలపించుట; హనుమంతుఁడు సుషేణునిపంపున నోషధిపర్వతమును దెచ్చుట; సుషేణుఁడు దివ్యౌషధిరసమును లక్ష్మణునిముక్కునఁ బిండఁగా నతండు విశల్యుఁడై లేచుట.

బలవంతుఁడగు రావణుఁడు యుద్ధమున శక్తిచేఁ గొట్టఁగా నెత్తురు వెల్లిందొప్పఁ దోఁగి శూరుండగు లక్ష్మణుఁ డుండుటనుజూచి, రాముఁడు దురాత్ముఁడగు రావణునితో బెట్టిదముగా యుద్ధముసేసి బాణములు * విడుచుచునే సుషేణునిఁ జూచి 'వీరుండయిన యీలక్ష్మణుఁడు రావణునిబలిమిచేఁ గొట్టువడి నేలందెళ్లి సర్పమువలెఁ బొరలాడుచున్నాఁడు. నాకు మిక్కిలి శోకము గలుగుచున్నది. వీఁడు నాకుఁ బ్రాణములకంటె ప్రియుఁడయినవాఁడు. ఇట్టివాఁడు, నెత్తుటం బడిసియుండుట చూడఁగానే నామనస్సు కళవళించుచున్నదే! ఇఁక యుద్ధము సేయ శక్తియెట్లు గలుగును? యుద్ధంబుల విఱ్ఱవీఁగుచు శుభలక్షణుఁ డయిన నాతమ్ముఁ డితఁడు మరణమునొందునేని యిఁక నాకుఁ బ్రాణము లేల? సుఖముగాని యేల? దురాత్ముఁడయిన రావణునిచే నాతమ్ముఁడు హతుఁడగుటను జూడఁగా నాయెదుటనే నాతమ్ముఁ డిట్లగుటచే నాపరాక్రమము సిగ్గువడినట్లు వెనుదీయుచున్నది. విల్లు చేతనుండక జాఱుచున్నట్లున్నది. బాణములు బీఱువోవుచున్నవి కన్నుల నీళ్లు గ్రమ్మి యేమియుఁ గానఁబడకున్నది. స్వప్నములందు నడచునపుడు మనుష్యులకు కాళ్లు వెన్కకు నీడ్చునట్లు, నా కవయవములు విరవిరవోయి యేపనియు చేయఁగూడకున్నది. చింత వేండ్రముగా హెచ్చు పెరుఁగుచున్నది. ప్రాణములపై నాశయుఁ దూలినది' అనెను. రాముఁడు తన వెలుపలఁ దిరుగుప్రాణమైన గారాబుతమ్ముఁడు లక్ష్మణుఁడు మర్మమునందు బిట్టుగాఁ గొట్టువడి యావేదన కార్తుఁడై నిట్టూర్పులు పుచ్చుచుండుటనుజూచి మిక్కిలియు దుఃఖముపయిఁకొన శోకమున మునిఁగి యేమియుఁ దోఁపకుండెను. ఆరాముఁ డట్లు మిక్కిలియు విషాదమునొంది యింద్రియములు కలఁగి విలపించుచు 'నాతమ్ముఁడు లక్ష్మణుఁ డిట్లు హతుఁడై దుమ్ములఁ బ్రుంగుచుండుటను జూచుచున్నానే! ఇఁక నాకు యుద్ధము చేతఁగాని ప్రాణముల

* 'విడుచుచునే' యనువర్తమాననిర్దేశముచేత రావణుఁడు పలాయితుఁడైనపిదప లక్ష్మణునియారోగ్యమును జూచుటయందు రాముఁడు విలంబము సేయకుండుట సూచితము.

చేతఁగాని సీతచేతంగాని ప్రయోజనమేమియు లేదుగదా. లక్ష్మణుఁడు యుద్ధాగ్రంబున హతుఁడై యిట్లు పడియున్నపుడు నాకు రాజ్యముతోఁబనేమి ? ప్రాణములెందుకు ? యుద్ధముచేసి కార్యమేమియుంగలుగదు. ప్రతిదేశమునను గావలసిన భార్యలు దొరకుదురు ; కావలసిన బంధువులు దొరకుదురు. కూడఁబుట్టిన తమ్ముఁడు దొరకునట్టి దేశముమాత్రము నెచ్చటను గానరాదు ' అని విలపించెను. ఇట్లు విలపించుచు శోకమున నింద్రియములు విహ్వలించుచుండ, జాలిగొలుపునట్లు, నేలం బొరలుచు మాటికి నిట్టూర్పులు విడుచుచున్న రాముని, వీరుండయిన సుషేణుఁ డుచిత వాక్యముల నాశ్వాసించుచు, ' మహాబాహా ! లక్ష్మీవర్ధనుఁడయిన యీలక్ష్మణుఁడు, మృతుఁడుగాఁడు. ఏలనఁగా నితనిముఖము వికృతమునుగాదు. వివర్ణముగాదు. కాంతియుఁ దూలదు. ఇతనిముఖము, మంచికాంతిగలిగి, ప్రసన్నముగాను చూపట్టుచున్నది. అఱచేతులు, ఎఱ్ఱదామరలవలె నెఱ్ఱగానున్నవి. కన్నులు మిక్కిలియు సుప్రసన్నములై యున్నవి. రాజా ! ప్రాణములు పోయినవారికి నిట్లు రూపముండదు. దీర్ఘాయుష్యము గలమనుష్యులకే ముఖమిట్లుండును. వీరా ! లక్ష్మీవర్ధనుండగు నీలక్ష్మణుఁడు మృతినొందలేదు. పగవారివీఁచమడంచు నితఁడు ప్రాణములతోనే యున్నాఁడు. కాన దుఃఖింపవలదు. వీరా ! ఇతఁడు మూర్ఛితుఁడై యవయవములు క్రిందవైచియున్నను గుండె మాటిమాటికిఁ గొట్టుకొనుచుండుటచే బ్రతికియున్నాఁడని తెలియుచున్నది' అనెను. మాటలాడ నెఱింగినసుషేణుఁడు రామున కిట్లు చెప్పి యంత మేలయినహనువులు (చెక్కిలిమీఁదిపట్లు) గలహనుమంతునిఁ ద్వరపెట్టుచు ' సౌమ్యా ! వీరా ! నీవిచటనుండి శీఘ్రముగా మున్ను నీకు జాంబవంతుఁడు చెప్పిన శుభంబగు నోషధిపర్వతమునకుఁబోయి దానిదక్షిణశిఖరమునం బుట్టిన దివ్యౌషధిని శల్యములు లేకుండఁజేయునట్టిదై శుభంబగు విశల్యకరణి యనుదానిని, సవర్ణకరణిని, సంజీవనిని, సంధానకరణినిని, వీరుఁడగు మహాత్ముని లక్ష్మణునిని జీవింపఁజేయుటకై త్వరితముగాఁ దీసికొనిరమ్ము' అనెను. ఇట్లు సుషేణుఁడు చెప్పఁగా శ్రీమంతుఁడగు హనుమంతుఁడు ఆయోషధిపర్వతమునకుఁ బోయి, ఆయోషధిస్వరూపము తెలియనందున చింతనొందెను. అమితతేజుండగు నాహనుమంతునికి 'ఇప్పర్వతమునం దీశిఖరమునే తీసికొనిపోయెదను. ఏలన లక్ష్మణునికి సుఖముగలిగించు నాయోషధి నాకుఁ గలిగిన యంతఃకరణప్రసాదాదులంబట్టి యనుమానింపఁగా ఈశిఖరమునందే పుట్టియుండవలయునని నాకుఁ దోఁచుచున్నది. మఱియు సుషేణుఁడును, దక్షిణశిఖరమునఁబుట్టిన యోషధిని దెమ్మన్నాఁడుగాన యతఁడు నిట్లు చెప్పియున్నాఁడు. కాన యీశిఖరమే యది గావలయును. నాకు విశల్యకరణియేదో తెలియలేదని దానిం దీసికొనకయే మరల సుషేణునడిగివచ్చుటకై పోవుదునేని, యంతలో కాలము మించిపోవుటవలన లక్ష్మణునకు ప్రాణహాని కలిగించుదోషము సంభవించును. నాకును నెంతమాత్రమును పౌరుషము లేదందురు ' అని యీయాలోచనము పు

ట్టెను. మిక్కిలి బలవంతుఁడగు వానరసింహుఁ డాహనుమంతుఁడు, ఇట్లాలోచించి శీఘ్రంబునం బోయి, యా మేటిపర్వతమును జేరి, దానిశిఖరమును మువ్మాఱు కదల్చి, పూచియున్న నానావిధవృక్షసమూహములతోఁగూడ నాపర్వతమును బెకలించి, చేతులతోఁ బయికెత్తికొనెను. అతఁ డాకాశముననుండి నీరునిండియున్న నల్లనిమేఘమునుంబోలె యాపర్వతశిఖరమును దీసికొని యాకాశముననుండి వచ్చెను. అతం డట్లు మహావేగమున రామాదులయొద్దకు వచ్చి యచట సేననడుమఁ బర్వతశిఖరమునుంచి, కొంచెము విశ్రమించి, సుషేణునిఁ జూచి 'వానరపుంగవా! నీవు చెప్పినమూలిక గుఱుతు నాకుఁ దెలియలేదు. కాన నేనాయోషధిపర్వతమందలి యీదక్షిణశిఖరము నంతయుఁ దెచ్చితిని' అని చెప్పెను. ఇట్లు చెప్పుచున్న యవ్వాయుకుమారుని హనుమంతునిఁ గొనియాడి వానరశ్రేష్ఠుఁడగు సుషేణుఁడు అమ్మహౌషధిని బెల్లగించి యెత్తుకొనెను. యుద్ధభూమింగల వానరులును రాక్షసులును, దేవతలకయినను నెంతమాత్రమును జేయందరముకాని హనుమంతునికార్యమును జూచి యందఱు నాశ్చర్యపడిరి. అంత * వానరోత్తముఁడగు సుషేణుఁడు ఆయోషధిని నలిపి, మిక్కిలియు తేజోవంతుఁడగు లక్ష్మణునిముక్కునఁ బిడిచెను. శత్రువీరుల నుఱుమాడు వాఁడై శల్యములు గ్రుచ్చుకొనియున్న యాలక్ష్మణుఁడు, ఆమూలిక నాఘ్రాణించి నంతనే, శల్యములువీడి యెంతమాత్రము నొవ్వులేక శీఘ్రమున భూమినుండి లేచెను. భూమినుండి లేచిన యాలక్ష్మణునిఁ జూచి, యవ్వానరులు, సుషేణుని 'బాగుబాగు' అని కొనియాడిరి. శత్రువీరుల నుఱుమాడు రాముఁడు లక్ష్మణుని రా రమ్మని పిలిచి కన్నులనిండ బాష్పములు గ్రమ్మ, మిక్కుటంబగు నెయ్యమున బిగియఁ గౌఁగిలించుకొనెను. రాముఁ డట్లప్పుడు లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని 'వీరా! లక్ష్మణా! నీవు మరణము నొందియు మఱల నాభాగ్యవశమున బ్రతికి రాఁగంటిని. నీవు మృతినొందినయెడల, నాకుఁ బ్రాణములతోనే పనిలేదు. సీతయు నక్కఱలేదు. ఇక యుద్ధమున జయము నొందవలసినపని యేమున్నది' అనెను. మహాత్ముఁడగు నారాముఁ డిట్లు చెప్పుచుండఁగా లక్ష్మణుఁడు దుఃఖితుఁడై మాటలు తొట్రుపడ నతనితో 'రామా! నీపరాక్రమ మెప్పుడును బొల్లుకానేరదు. ఇట్టినీవు మున్ను రావణునిఁ జంపి విభీషణునకు లంక నొసంగెదనని ప్రతిజ్ఞసేసి,

* పూర్వము ఇంద్రజిత్తుతోడి యుద్ధమునందు శల్యపీడితులగు లక్ష్మణాదులకుఁ జికిత్స చేసినపుడు సుషేణుఁడు ఆయోషధిని సంగ్రహించియుండును. కాన మరల నిప్పు డాపర్వతమునకు హనుమంతునిఁ బంపెననుట పొసఁగకున్నది. అయినను లక్ష్మణవిభీషణాదుల చికిత్సయందు ఔషధమంతయు వ్యయమైపోయెనని పరిహారము చెప్పఁగూడును కాని మఱపు గలుగనివాఁడగు హనుమంతుఁడు తానే అచిరకాలమునకుముందు స్థాపించివచ్చినపర్వతమును తెలిసికొనలేక ముఖప్రసాదాది లక్షణములచే ననుమానించి తెలిసికొనుటయు మూఁడుమార్లు కదలించి పెల్లగించుటయు విరుద్ధముగాఁ దోఁచుచున్నది గాన దీనికి పరిహారము చింత్యము. గోవిందరాజులు.

యిపుడు బలహీనుఁడైన రొుకయల్పునియట్లు, నీ విట్టిధమునం జెప్పఁదగదు. అన ఘా! సత్పురుషులు, తాముచేసినప్రతిజ్ఞ వ్యర్థముగావింపరుగదా. చేసినప్రతిజ్ఞనుతప్ప క నెఱవేర్చుటయేకదా గొప్పతనమునకు లక్షణము. అనఘా! నానిమిత్తమై నీవు సీతాదేవియందును విజయమునందును నుపేక్షనొందుట చాలును. ఇఁక రావణుని జంపి నీప్రతిజ్ఞను నెఱవేర్చుము. వాఁడికోఱలుగలిగి, బొబ్బలిడుచున్న సింహముబారిం బడిన మహాగజముంబోలె నీబాణముబారిం బడినపగవాఁ డెంతమాత్రమును బ్రతికి పోఁజాలఁడు. నేనన్ననో, సూర్యుఁడు సంచారకర్మను తీర్చుకొని యస్తమించునంత లో దురాత్ముఁడగు నీరావణుఁడు హతుఁడు గావలయునని కోరుచున్నాను. వీరా! నీవు యుద్ధమున రావణునిఁ జంపఁగోరుదువేని, నీవు విభీషణునకుఁ గావించినప్రతిజ్ఞ నెఱవేర్పఁ దలంతువేని, జనకమహారాజుకూఁతురయిన సీతయందు నీ కభిలాషగలదేని, నేను జెప్పినమాటను శీఘ్రమునం గావింపుము' అనెను. ఇది నూటరెండవసర్గము.



ఇంద్రుండు పంపిన రథము నెక్కి రాముఁడు మరల వేఱురథము నెక్కి వచ్చినరావణుని మార్కొనుట; రావణుఁడు మాతలిని నశ్వములను మిక్కిలి నొప్పింపఁగా రాముఁడు తీవ్రకోపము నొందుట.

శత్రువీరులం జక్కాడు వీర్యవంతుఁడగు రాముఁడు లక్ష్మణుఁడు చెప్పినయప్ప లుకువిని విలుగొని యెక్కుపెట్టి సేనాగ్రంబున రావణునిపై భయంకరములయిన బాణములను బ్రయోగించెను. ఇంతలో రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు మఱియొక రథము నెక్కి రాహువు సూర్యునిమీఁది కడరునట్లు, రామునిమీఁదికిఁ బోయెను. అట్లు రావణుఁడు రథగతుఁడై మేఘము జలధారలుగురియునట్లు మిక్కిలియు భయం కరములయి వజ్రముంబోలిన బాణములఁ బ్రయోగించి రామునినొప్పించెను. రాముఁ డు యుద్ధమున సమాహితుఁడైయున్న రావణునిపై మండుచున్న నిప్పువంటివియు బం గారుచే రంగారునవియునగు బాణములేసి నొప్పించెను. రాముఁడు భూమిపయి నిలి చియు, రావణుఁడు రథముపయినుండియు యుద్ధము సేయుట సమముకాదని దేవ తలును గంధర్వులును దానవులును నాడుకొనిరి. అంత శ్రీమంతమగు దేవేంద్రునిమేటి రథమును నింద్రునిపనుపున తనసారథియగు మాతలి యారోహించి స్వర్గమునుండి దిగి రామునియొద్దకు వచ్చెను. ఆరథము బంగారుచే నంగములు చిత్రితములై వందల కొలఁది గంటలచే నలంకృతమై, బాలసూర్యునివలెఁ దేజరిల్లుచుండెను. దానినొగ వైడూర్యమణిచేఁ జేయఁబడియుండెను. కాంచనాభరణములచే నలంకృతములై తె ల్లని వింజామరలతోఁగూడి సూర్యునివలెఁ బ్రకాశించుచు నాకుపచ్చనిరంగుగల యుత్తమాశ్వములు హేమజాలవిభూషితములైనవి పూన్పఁబడియుండెను. ఆరథ

మునకు బంగారుదండము ధ్వజముగానుండెను. అంత నింద్రునిసారథియగు మాతలి మునికోలం జేకొని రథముననున్నవాఁడై యంజలిగీలించి రామునితో 'కాకుత్స్థా! నీవు మహాబలుండవు, శ్రీమంతుఁడవు, పగవారి నడంచువాఁడవు. ఇట్టినీకు విజయము గలుగుటకై దేవేంద్రుఁడీరథము నొసంగెను. మఱియు గొప్పదియగు నీ యింద్ర ధనువును, అగ్నివంటి యీకవచమును, సూర్యసమానములగు బాణములును నిర్మల మును వాఁడియునగు శక్తిని నింద్రుఁడు నీకొసంగెను. వీరా! రాజా! మున్ను దేవేంద్రుఁడీరథము నారోహించి నాసారథ్యముక్రింద దానవులను వధించినట్లు, నీవిపుడు నేను సారథినై యుండఁగా, నీరథము నారోహించి, రావణునివధింపుము' అనెను. అప్పుడు రాముఁడు మాతలి యట్లుచెప్పఁగా, అమ్మహారథమునకుఁ బ్రదక్షిణనమస్కారములు గావించి, తన దేహకాంతిచే చంద్రకాంతిచేతంబోలె లోకములను వెలింగించుచు నారథము నారోహించెను. అంత మహాబాహుండగు రామునకును రావణునకును, జూపఱకాశ్చర్యమును గగుర్పాటును బుట్టించునట్టి మహాయుద్ధము ప్రవర్తించిన దయ్యె. సమస్తములయిన దివ్యాస్త్రములనెఱింగిన యారాముఁడు, రావణుఁడు ప్రయోగించిన గాంధర్వాస్త్రమును గాంధర్వాస్త్రముచేతను, దైవాస్త్రమును దైవాస్త్రముచేతను వారించెను. రాక్షసాధిపతియైన రావణుఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై మరల పరమభయంకరమైన రాక్షసాస్త్రమును ప్రయోగించెను. కాంచనభూషితములైన యాబాణములు రావణునివింటినుండి వెడలి, మహావిషముగల సర్పములై రామునిమీఁదికడరినవి. ఆసర్పములు మొగంబులు జ్వలింప,నోరుదెఱచుకొని వాని నుండి మండుచున్న నిప్పుకలుగ్రక్కుచు, భయంకరాకారములై రామునిమీఁదికే యడరినవి. వాసుకియుంబోలె బెట్టిదములుగా నడరునవై పడగలుజ్వలించుచున్న మహావిషములగు నాసర్పములు, దిక్కులను విదిక్కులనన్నిటిని దట్టముగా నావరించినవి. యుద్ధంబున రాముఁడు తనమీఁదికి వచ్చుచున్నయమ్మహాసర్పములను జూచి ఘోరమును భయంకరమునగు గారుడాస్త్రమును బ్రయోగించెను. బంగారుపింజలుగలిగి, అగ్నివలె మెఱయుచున్న యారామబాణములు వింటినుండివిడివడి, సర్పశత్రువులును బంగారుమయములునగు గరుడపక్షులయి విహరించినవి. గరుడరూపముగలిగి కామరూపములగు నాబాణములు, సర్పరూపములును మహావేగములునగు నారావణబాణముల నన్నింటిని రూపుమాపినవి. రాక్షసేశ్వరుండయిన రావణుఁడు తనయస్త్రము ప్రతిహతమగుటంజూచి,కుపితుఁడై భయంకరములయిన బాణవర్షముల రాముని పయింగురిసెను.అంత నారావణుఁడు ఎట్టికార్యము నేని చులుకగాఁజేయునట్టి రాముని వేయిబాణము లేసి నొప్పించి మఱియుఁబెక్కు బాణముల మాతలిని గాఁడనేసెను.రావణుఁడు, ఆయింద్రరథమునకుంగల ధ్వజపటమును గుఱిపెట్టి యొకబాణమేసి దానిని ఛేదించి రథావయవమగు దండమునుండి బంగారుధ్వజమును రథమునడుమఁ బడంజేసి, యంత బాణసమూహముచే నింద్రునియశ్వములను నొప్పించెను. దేవతలును

గంధర్వులును దానవులును చారణులును దురాత్ముఁడగు రావణుఁడు గావించినయామహాత్కార్యమునుజూచి విషణ్ణులయిరి. సిద్ధులును మహర్షులును వానరవీరులును విభీషణుఁడును రాముఁ డార్తుఁడగుటనుజూచి యందఱును వ్యథితులయిరి. రాహువు చంద్రుని గ్రసించినట్లు రావణుఁడు రాము నాక్రమింపఁగాఁ జూచి, బుధుఁడు ప్రజల కశుభము సేయువాఁడై ప్రజాపతి దేవతాకమును చంద్రునకు ప్రియమును నగురోహిణీనక్షత్రము*నాక్రమించి నిలిచెను. సముద్రము పొగలు పెనఁచుకొన్న యలలుగలదై మండుచున్నట్లు చూపట్టుచు, నపుడు క్రుద్ధమై సూర్యునిస్పృశించునట్లు పయికిఁ జిమ్మిరేఁగెను. సూర్యుఁడును గాంతి మందటిలి ఖడ్గమువలె నల్లనై కబంధాకారమగు ధూమకేతువుతోఁగూడి మిక్కిలి పరుషుఁడై చూపట్టెను. ఆకాశమున ఇక్ష్వాకువంశపురాజుల నక్షత్రమై యింద్రాగ్నిదేవతాకమగు విశాఖానక్షత్రమును అంగారకుఁ డాక్రమించి యుండెను. రావణుఁడు పదితలలతోను, నిరువదిభుజములతోను ధనుర్ధరుఁడై మైనాకపర్వతమువలెఁ జూపట్టెను. యుద్ధరంగమున రావణుఁడు, విజృంభించి రాముని నిట్లు నిరసించుచుండఁగా రామునకు వింట బాణంబుల సంధించుటయు సాధ్యముగాకుండెను. మునుపే క్రుద్ధుఁడై యున్న రాముఁడు బొమలుముడిచి కన్నుల నొక్కింత కెంపుగదుర వేఁడిచూపుననే కాల్చువాఁడుంబోలెఁ జూపట్టుచు నీఁడుమిక్కిలి మహాకోపంబు నొందినవాఁడయ్యె. ఇది నూటమూఁడవసర్గము.

---

(రావణుఁడు వైచినశూలమును రాముఁ డింద్రదత్తమగు శక్తిచే హతముసేసి రావణునియశ్వాదుల నొప్పించుట.)

బుద్ధిమంతుఁడగు రాముఁ డట్లు క్రుద్ధుఁడై యుండఁగా నతని ముఖమును జూచి సమస్తభూతములును భయమునొందినవి. భూమియుఁ గంపమునొందెను. పర్వతము తనయందలి సింగములతోను బెబ్బులులతోను వృక్షము లల్లలాడ మిక్కిలియుఁ జలించినదయ్యెను. నదీపతియగు సముద్రుఁడును మిక్కిలియు క్షోభమునొందెను. ఆకాశమున పరుషధ్వని గలపక్షులును బరుషములగు మేఘములును నుత్పాతసూచకములయిన ధ్వనులం గావించుచు, నంతటను విహరించినవి. రాముఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడగుటయు, మిక్కిలియు దారుణము లయినయుత్పాతములను,జూచి సమస్తభూతములును భయమునొందినవి. రావణునకు భయముగలిగెను. అపుడు,శూరులయ్యిరువురు భయంకరములైన నానావిధాయుధములతోఁ జిత్రముగా యుద్ధముసేయుచుండఁగా,జగత్త్రిశయాకారమై యున్న యమ్మహాయుద్ధమును, దేవతలును గంధర్వులును మహోరగులును మహర్షులును దానవులును దైత్యులును గరుడులును విమానగతులయి యాకాశముననుండి చూచుచుండిరి. అప్పుడు సురలును అసురులును అం

* బుధుఁడు రోహిణీనక్షత్రమును నొందినపుడు జగత్పీడగలుగునని జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధము.

దఱును వచ్చియీమహాయుద్ధమును జూచుచు రామరావణులవలని తమతమపక్షపాతముచే నొండొరులతో వాదులాడుచుండ నయ్యెరువురలో తమతమవీరులయందలి భక్తిం జేసి మిక్కిలి యుబ్బుచు జూపువాక్యముల ననుకూలు సమవస్థితులై 'రావణా'! జయింపు మనిరి. అంత దేవతలు,'రామా! నీవు జయింపు' మని రామునిం జూచి మాటిమాటికిం జెప్పిరి. ఈనడుమ దుష్టాత్ముండగు రావణుఁడు రామునిచలన క్రుద్ధుఁడై యతనిని బ్రహరింపఁగోరి యిపుడు గొప్పయాయుధ మేమి ప్రయోగింపవచ్చునని క్షణమాలోచించి వజ్రాయుధమువంటి సారముగలిగి మిక్కిలియు ధ్వనితోఁగూడినదై సర్వశత్రువులను రూపుమాపునట్టి శూలమును, రోషమున జ్వలించువాఁడుంబోలెఁ జూపట్టుచుండఁగయికొనెను. ఆశూలము పర్వతశిఖరములవంటి యినుపశంకువులచే వ్యాప్తమై చూచుటకు భయంకరమై కొంచెము నలుపుతోఁగలసి వాఁడిమొనగలిగి ధగధగమెఱయుచుండుటచే పొగతోఁగూడిన యగ్నిజ్వాలవలెఁ జూపట్టుచు ప్రలయకాలాగ్నిసమూహముంబోలి రుద్రునిశూలమును మించి యెట్టివారికిని వారింపరాక, వేయేల! యమునికిఁగూడ సమీపింప నలవికాక సమస్తభూతములకును దిగులుగొలుపుచు ఱంపమువలెఁ గోయునదై కత్తియుంబోలెఁ దుండించునదియునై యొప్పుచుండెను. అట్లు వీర్యవంతుఁడగు రావణుఁడు పరమక్రుద్ధుఁడై యుద్ధమున శూరులు వెక్కండ్రు రాక్షసులు దన్నుఁబరివేష్టించి కొలువ నమ్మహాశూలము నడుమం బట్టెను. మహాకాయుఁడగు రావణుఁ డాయుద్ధమునందు రోషమువలన కన్నులు కెంపార నమ్మహాశూలము నెత్తి తనసైన్యమంతయు సంతోషించునట్లు, భయంకరముగా సింహనాదము గావించెను. అప్పుడు రాక్షసేంద్రుఁడగు రావణుని భయంకర సింహనాదముధ్వనికి, భూమియు నంతరిక్షమును దిక్కులును విదిక్కులును, అదిరెను. గొప్పధ్వని గలదురాత్ముఁ డారావణుఁ డిడినసింహనాదమునకు సమస్తభూతములు భయమునొందినవి. సముద్రము సంక్షోభించెను. మహావీర్యుఁ డగునారావణుఁ డట్లమ్మహాశూలమును గ్రహించి మహాధ్వనిగల్గునట్లు సింహనాదముగావించి రామునింజూచి పరుషముగా 'రామా! నీకొఱకై రోషమున నే నిపు డెత్తిన వజ్రసారమగు నీశూలము ఈ క్షణముననే, నిన్నును, నీతమ్మునిని వధింపఁగలదు. రామా! యుద్ధమున విఱ్ఱవీఁగెదవు. నిన్నిపుడు శీఘ్రమున వధించి యిదివఱకు నాసైన్యముఖమున హతులయిన శూరులగు రాక్షసులతోఁ బాటిగాఁ జేర్చివైచెదను. రామా! కొంచెమునిలువుము. ఇపుడే శూలమున నిన్ను వధించి పుచ్చెదను' అనెను. రాక్షసేశ్వరుఁడగు రావణుఁ డిట్లుచెప్పి యాశూలమును బ్రయోగించెను. ఆశూలమా రావణునికరమునుండి విడివడినదై మెఱుపుల జ్వాలలవంటి జ్వాలలతోఁగూడి, యెనిమిదిగంటలతో మహాధ్వని మీఱ నాకాశమున నెంతయుం బ్రకాశించెను. వీర్యవంతుఁడగు రాముఁడు జ్వలించుచు భయంకరాకారమై వచ్చుచున్న యమ్మహాశూలమును జూచి వింటి నాకర్షించి బాణములం బ్రయోగించెను. ప్రలయకాలమునందుఁ బ్రజ్వలించుచున్నయగ్ని నింద్రుఁడు జల

ప్రవాహములచే వారించునట్లు, రాముఁడు తనపయికి వచ్చుచున్న యాశూలమును బాణసమూహముచే వారించెను. రాముఁడు ప్రయోగించినబాణములు రావణుని యమ్మహాశూలముపైఁబడి యగ్గి నుఱికిన మిడుతలవలె దగ్ధములయ్యెను. రాముఁడు తన బాణము లంతరిక్షముననే శూలమును దాఁకి చూర్ణితములై దహింపఁబడుటఁ జూచి మిక్కిలియుఁ గ్రుద్ధుఁడయ్యె. అంత నా రఘునందనుఁడు రాముఁ డట్లు పరమకుపితుఁడై తనకు మాతలి దెచ్చియిచ్చినదియు దేవేంద్రనిర్మితమైనదియునగు మహాశక్తి నెత్తెను. బలవంతుఁడగు రాముఁ డమ్మహాశక్తి నెత్తి గిరగిరం ద్రిప్పఁగా, నది ఘంటలచే మ్రోఁగుచు, దేదీప్యమానమై ప్రలయకాలమందలి పెద్దయుల్కవలె నాకాశమునంతయుఁ బ్రకాశింపఁజేసెను. అమ్మహాశక్తి, ప్రయుక్తమై రావణుని శూలమును దాఁకఁగా నమ్మహాశూలము విఱిఁగి కాంతివిహీనమై నేలంగూలెను. అంత, రాముఁడు క్రూరములును, మహావేగములునై వజ్రముంబోలి చప్పుడు గలిగించుచున్న వాఁడిబాణములను బ్రయోగించి మిక్కిలి వేగముగల రావణుని యశ్వములను నొప్పించెను. పిదప రాముఁడు మిక్కిలి లాఘవమొప్ప, రావణునివక్షమున వెక్కువాఁడిబాణములను లలాటమున మూఁడుబాణములనుం గాఁడనేసెను. అప్పుడు యుద్ధంబున రాక్షసేంద్రుఁ డారావణుఁడు సమస్తావయవములును బాణములచేఁ గ్రుచ్చుకొనఁగా దేహమంతయు నెత్తుటం దోఁగి పూచినయశోకవృక్షమువలెఁ బ్రకాశించెను. అప్పుడు యుద్ధమధ్యమున రాక్షసేశ్వరుఁ డారావణుఁడు, రామబాణములవయవములందెల్లఁ గాడఁగా, నెత్తుటఁ దొప్పఁదోఁగి, యొకింత ఖేదమునొందియు నంతలో మిగులఁ గ్రోధము నొందినవాఁడయ్యె. ఇది నూటనాలుగవ సర్గము.



రావణుని బాణములను రాముఁడు వారించి రావణునినిందించుచుఁ బెక్కుబాణముల నొప్పించుట, విహ్వలుండయిన రావణునింజూచి యతని సారథి తేరు దొలంగంగొనిపోవుట.

యుద్ధగర్వితుఁడగు నారావణుఁడు,అట్లు రాముఁడు క్రుద్ధుఁడై యుద్ధంబునఁ దన్ను నొప్పించుటయు,దానను మిక్కిలియుఁ గోపమునొందెను. వీర్యవంతుఁ డారావణుఁడు అట్లు క్రుద్ధుఁడై కోపమున కన్నులు జ్వలింప,నమ్మహాయుద్ధమున వింటి నాకర్షించి బాణములు వరఁగించి రాముని నొప్పించెను. ఆకాశమునుండి మేఘము, వేలకొలఁది వర్షధారలఁ గురిసి, తటాకమును బూరించునట్లు, రావణుఁడు మ్రోయుచున్న వేలకొలఁది బాణజాలములం బరఁగించి రాముని దేహమంతయుఁ బూర్ణముగాఁ గప్పెను. రాముఁ డట్లు యుద్ధంబున రావణువింటినుండి వెడలినబాణసమూహములచేఁ బూరితుండై నిశ్చలం బగుమహాపర్వతమువలె కంపము నొందఁడయ్యెను.

వీర్యవంతుఁడగు రాముఁడు, యుద్ధమునఁ గాలూని, బాణములచే బాణసమూహములను వారించుచు, రావణుని బాణములను సూర్యునికిరణములనుంబోలెఁ గయికొన్నవాఁడయ్యె. అంత రావణుఁడు క్రుద్ధుఁడై హస్తలాఘవమొప్ప, మహాత్ముఁడగు రాముని ఱొమ్మున వేలకొలఁది బాణములఁ గాఁడనేసెను. అప్పుడు యుద్ధమున లక్ష్మణాగ్రజుండగు రాముఁడు దేహమంతయు నెత్తుటం దొప్పఁదోఁగియుండుట వలన, నడవియందుఁ బూచియున్న యొకపెనుకింశుకవృక్షమువలెఁ జూడనొప్పెను. మహాతేజుండగు నారాముఁడును, రావణుని బాణములఁ గొట్టువడి కుపితుఁడై ప్రళయకాల సూర్యసంభోని యత్యుగ్రములయిన బాణములను దీసెను. అంత వీరుండగు దశరథకుమారుఁడు రాముఁడు, కోపావేశమునొంది, రావణుంజూచి పెడనవ్వు నవ్వి.పరుషవచనముల నతనితో 'రాక్షసాధమా! నాభార్యను, నేను దగ్గఱలేకుండఁగా, పరవశురాలై యున్నపుడు, నాకుఁ దెలియనట్లు జనస్థానమునుండి నపహరించి తెచ్చితివే! ఇట్టి నీవు విక్రమశాలివా? నీకెంతమాత్రమును బరాక్రమములేదు. మహారణ్యమున నన్నెడఁబాసి దుఃఖితయై యున్నసీతను, నీవు బలాత్కారమున దొంగిలితెచ్చి శూరుఁడనని యెన్నికొనుచున్నావే. ఎంతటిశూరుఁడవురా? పరస్త్రీలం దడవు శూరుఁడవుపో! పెనిమిటి యొద్దలేనపుడు స్త్రీలవిషయమై దుర్జనులు చేయునట్టి కార్యమును జేసి శూరుఁడనని యెన్నికొనుచున్నావుగా. నీకు మర్యాద నుంటఁగలసినది. లజ్జయు లేదు.నీ నడవళ్లను ఒక్కవిధముగావు కావరమున నీకునీవే మృత్యువుందెచ్చుకొని చచ్చినట్లుగాఁ దలఁచుకొనక శూరుఁడని యెన్నికొనుచున్నావు. శూరుఁడవు,కుబేరునికిఁ దమ్ముఁడవు,తపోబలాది సంపన్నుఁడవు. ఇట్టినీవు, సీత నపహరించి యెంతటిగొప్పకార్యమును జేసితివిరా? అది యెంతటిపొగడ్తకుఁ దగినది! ఎంతకీర్తికరమైనదిరా? నీవు కండకావరమునఁ బోతరించి నిందితంబును అహితమును నగు కార్యమును గావించితివి. అందులకు మహాఫలము నిదె యిపు డనుభవింపుము. దుర్బుద్ధీ! శూరుఁడనని నిన్ను నీవే యెన్నికొనుచున్నావే. సీతను దొంగవలె నపహరించి తెచ్చునపుడు నీకు సిగ్గు కలుగదయ్యెనే! నీవు నాయెదుట నట్లు సీతను బలవంతముగాఁ గొనిపోవఁగడఁగితివేని, యపుడే నాబాణములచే హతుఁడవై సీతమ్ముఁ డగు ఖరునియొద్దకుఁ బోయియుందువే! దురాత్మా! నాభాగ్యవశమున నీవిపుడు నాకంటియెదుటం బడితివి. ఇదిగో నిన్ను వాఁడిబాణముల యమపురి కనిచెదను జూడుము. ఇదిగో కుండలములు దళుకొత్తుచున్న నీశిరస్సు నాబాణములచే ఛిన్నమై యుద్ధభూమియందు దుమ్ములబ్రుంగి నక్కలు మొదలగునవి యీడ్చుకొని పోవుఁగాక. రావణా! నీవు నేలంగూలి యుండఁగా గద్దలు నీఱొమ్ముపయినివ్రాలి, బాణపు టలుఁగులచే నయినగండ్లనుండి పయికిఁ జిప్పిలుచున్న నీనెత్తురును దప్పిదీఱఁ ద్రావుఁగాక. ఇప్పుడే యిదిగో నీవు నా బాణములచేఁ ద్రుంగి ప్రాణములు వీడి నేలంబడఁగానే గరుడపక్షులు సర్పములను బట్టి లాగునట్లు గద్దలు మొదలగుపక్షులు నీప్రేఁగులనుబట్టి లాగుఁగాక' అనెను.

పగవారిని రూపుమాపు వీరుండు రాముఁడు, ఇవ్విధమునం జెప్పచుఁ, దన్నుఁ దారసించియున్న రాక్షసేశ్వరుని రావణునిమీఁద బాణవర్షములు పరఁగించెను. శత్రువును రూపుమాప నువ్విళులూరుచున్నయా రామునకు, అప్పుడు వీర్యమును బలమును ఉత్సాహమును దివ్యాస్త్రబలమును యుద్ధమున నినుమడిగా నతిశయించినవయ్యె. విదితాత్ముఁ డగు రామునకు సమస్తములయిన దివ్యాస్త్రములును ప్రత్యక్షముగా స్ఫురించినవి. అంత నమ్మహాతేజుఁడు, ఉబ్బువెల్లునం జేసి మఱింత హస్తలాఘవము గలవాఁడయ్యెను రాక్షసులం దునుమట్టించు దిట్ట యగు నా రాముఁ డిట్టిశుభచిహ్నములు తనకుఁ గలుగుటను దెలిసి మఱింత యుత్సహించి రావణుని మీఁదుమిక్కిలియు నొప్పించెను. వానరులు వైచుశిలాసమూహములచేతను, రాముని బాణవర్షములచేతను గొట్టునడుచు రావణుం డేమియుఁ దోఁపక హృదయమున తత్తఱపడఁ జొచ్చెను. రావణునకు మృత్యుకాల మపుడాసన్నమగుటం జేసి యతఁడు బాణములు ప్రయోగింపక వింటి నాకర్షింపక యుండెను; మఱియు నతనికి మనసు వివశమగుటచే రాముని వీర్యమును బదులేసి నిలువరింపఁ డయ్యె; మఱి రావణుఁ డేసిన బాణములును తక్కిన నానావిధములైన యాయుధములును, యుద్ధమున ఛేదనభేదనాదులయిన ప్రయోజనములేవియుఁ గావింప నేరకుండెను. రావణుఁ డిట్టియవస్థయం దుండుటను జూచి యతనిరథంబు నపుడు దోలుచున్న సూతుఁడు తొట్రుపడక, యుద్ధభూమినుండి రథమును మెల్లగఁ దొలఁగఁ దోలుకొనిపోయినవాఁడయ్యెను. ఇది నూట యైదవసర్గము.



{ రావణుఁడు మనంబునఁ దెప్పిఱి సూతుని రథము తొలఁగఁ దెచ్చినందులకై భర్త్సించుట; సూతుఁ డందులకుఁ దగినసమాధానము చెప్పి రథమును మరల యుద్ధభూమికిం దోలుట. }

ఆ రావణుఁడు మృత్యుబలమున ప్రేరితుఁ డగుటం జేసి వివేకంబుదూలి మిక్కిలియుం గ్రుద్ధుఁడై కోపంబునఁ గన్నుంగవ కెంపుగదుర, సారథినిజూచి 'ఓరీ దుర్బుద్ధీ! నన్ను బలహీనునివలెను, ఉత్సాహము లేనివానివలెను, పౌరుషము మాలినవానివలెను, పిఱికివానివలెను, అల్పునివలెను, ధైర్యములేనివానివలెను, తేజస్సు దూలినవానివలెను, మాయలు దెలియనివానివలెను, దివ్యాస్త్రములకు వెలియైనవానివలెను, నలక్ష్యముసేసి, నీబుద్ధికిఁ దోఁచినపోకలు పోవుచున్నావు. నాయభిప్రాయమును దెలిసికొనక నన్నలక్ష్యముచేసి శత్రువుసమక్షమున నా యీరథము నేల తొలఁగఁ దోలుకొని వచ్చితివి? అపూజ్యా! నేను జిరకాలముగా సంపాదించిన నాయశస్సును, వీర్యమును, తేజమును, రావణుఁడు యుద్ధమునం బలాయితుఁడు గాఁడని యందఱికిని నాయెడం గలిగియున్న నమ్మకమును, నీచేత నివిగో నాశము నొందెఁ జుమీ! శత్రువు వీర్యంబునఁ బ్రఖ్యాతినొందినవాఁడు. నా పరాక్రమకృత్యముల నెఱపి రంజింప జేయఁ

దగినవాఁడు. అట్టిశత్రువు చూచుచుండఁగా, యుద్ధమునందుఁ బేరాస గలిగియుండు నన్నుఁ బనికిమాలినవానిని గావించితివి. దుర్బుద్ధీ! నీ వీరథమును నాసంగతిని దెలియక శత్రువున కెదురుగాఁ దోలక తోలఁగఁదెచ్చుటఁ జూడఁగా, పగవాఁడు నీకేమో లంచమిచ్చి నిన్నుఁ గైవసము చేసికొన్నాఁడని నా కూహ గలుగుచున్నది. ఇదిసత్యమే యగును. హితమును గోరునట్టి మిత్రులుచేయునది యీపనిగాదు. ఇది పగవారికిఁ జేయఁదగినది. ఇట్టిపనినే చేసితివిగాని యట్టిపనిని జక్కఁజేయవైతివి. నీవు నాయొద్దఁ జిరకాలమున్నవాఁడవేని, నేను జేసినసత్కారాదులు నీ తలంపునకు వచ్చుచున్నవేని, పగవాఁడు నాపైఁబడి రాకమునుపే రథమును వేగ మరల్చి యుద్ధమున కభిముఖముగాఁ దోలుము' అనెను. రావణుఁడు బుద్ధిమాలి యిట్లు పరుషముగాఁ జెప్పినది విని,సారథి యతనిహితమునుగోరు బుద్ధిగలవాఁడు గాన, యతని నాశ్వాసించుచు హితవచనమున 'నేను భయపడినవాఁడనుగాను, మూఢుఁడనుగాను, లంచ ముదీసికొని పగవారితోఁ జేరుకొన్నవాఁడనుగాను, ఏమఱినవాఁడనుగాను, నీయందు స్నేహము లేనివాఁడనుగాను, నీవు నాకుఁ జేసినసత్కారములు మఱచినవాఁడనుంగాను. మఱియేమన్నన్ను నేను నీహితముగోరి, నీయశస్సును నురక్షితము గావింపఁబూని, నీయందలినెయ్యము దోలఁకాఁడుమనముతో నిది నీకు ప్రియముగానుండునని చేసితిని. ఇది నీ కప్రియమైనది. మహారాజా! నీవు, ఏ దేనొకకులమునఁబుట్టి యల్పబుద్ధియై దుష్టహృదయుఁడగువాఁడుంబోలె, నాయందు, నీకుఁ బ్రియమును హితమును జేయుటయందే యాసక్తుఁడయిననాయందు, ఇట్లు రథము తొలఁగఁదెచ్చిన విషయమై దోషము తలంచుట యుక్తముగాదు. ఉన్నతప్రదేశమునుండి నది వేగముగ మరలునట్లు, యుద్ధభూమినుండి యతివేగమున రథము మరల్చినందులకుఁ గల కారణమునుజెప్పెద వినుము. వీరా! నీ వపుడు చాలసేపు మహాయుద్ధముసేసి యలసియుండుట నాకుఁ దెలియవచ్చినది. నీవు యుద్ధమునకుఁ జక్క మొగము గలిగి యుండుటగాని నీయుత్సాహముగాని కానరయితిని. ఈ రథాశ్వములును, రథమునీడ్చి యీడ్చి యలసి, దీనములై యెండతాఁకున మిక్కిలియు సొలసి, వర్షమునఁ గొట్టువడిన గోవులుంబోలె నుండినవి. మనకు నేయేశకునములు మిక్కిలియుఁ గలుగుచున్నవో అవన్నియును ప్రతికూలముగానే నాకుఁ దోఁచుచున్నవి. సారథియగువాఁడు దేశకాలములను, శుభాశుభనిమిత్తములను, తన రథికునియు నెదిరియు ముఖమునందలి తేటకలఁక మొదలయిన యింగితములను, ఉత్సాహము లేమియు, దుఃఖమును, సంతోషమును, బలాబలములును, భూమి మిట్టపల్లములను సమప్రదేశములను విషమప్రదేశములును (యుద్ధమునకు సమయాసమయములును) ఎదిరియందు కనుఁగొనందగిన ఛిద్రములును, మఱియు రథమును నెదిరికి సమీపముగాఁ దోలుటయు, ప్రక్కవాటులం దోలుటయు, నిలుకడగా నిలుపుటయు, ఎదురుమొగముతోనే వెనుకకు మరలుటయు, ఇవన్నియుఁ జక్కఁగా నెఱిఁగి రథము నడపవలెను.

వీరా! నీకును, నశ్లే ఈరథాశ్వములకును, విశ్రాంతిగలుగుటకును దుస్సహమయిన దుఃఖమేమియుఁ గలుగకుండుటకును నిట్లు రథమును దొలఁగఁదెచ్చుట యుక్తమగు నని చేసితినేకాని యట్టినిమిత్తమేమియులేక యే నాయిచ్ఛచేత నిట్లు చేసినవాఁడను గాను. ప్రభూ! నే నిపుడుచేసినది భర్తయగు నీయందలి స్నేహాతిశయమువలననే కాని వేఱుగాదు. వీరా! శత్రుసంహారా! నీ విపు డాజ్ఞాపింపుము. నీవు కార్యస్వరూప మేది చెప్పెదవో దానిని, నీయుప్పుదిన్న ఋణము నీఁగవలయునని మనస్సున సంకల్పించుకొని, యట్లె చేయుచున్నాను' అనెను. రావణుం డా సారథి చెప్పిన యావాక్యమునకు సంతుష్టుఁడై పలువిధములఁ వానిం బ్రశంసించి యుద్ధముసేయు పేరాస గడలుకొన, వానితో 'సారథీ! ఈరథమును శీఘ్రమున రామునకభిముఖముగాఁ దోలుము. రావణుఁడు యుద్ధమున శత్రువులఁ జంపక మఱలిరాఁడు'అనెను. రాక్షసేశ్వరుఁడగు రావణుఁ డిట్లుచెప్పి, వానియెడల సంతుష్టుఁడై యంత వానికి సొగసయిన మేలిహస్తాభరణమొకటి నొసంగెను. సారథియు రావణుని వచనమువిని రథమును మరల్చి యుద్ధాభిముఖముగాఁ దోలెను. అంత నాసారథి రావణునాజ్ఞ చొప్పున శీఘ్రముగా గుఱ్ఱములం దోలెను. అంత రాక్షసేశ్వరుఁడగు రావణుని యమ్మహారథము క్షణములో యుద్ధాగ్రమున రామున కభిముఖమై నిలిచినదయ్యెను.ఇది నూటయాఱవసర్గము.

---

{ అగస్త్యుఁడు రామునకు నాదిత్యహృదయము నుపదేశించుట; రాముఁ డా స్తోత్రమును జపింపఁగా సూర్యుండు రాము ననుగ్రహించుట }

అంత యుద్ధమునుజూచుటకై దేవతలతోఁగూడ వచ్చియున్న భగవంతుండగు నగస్త్యమహర్షి యుద్ధంబున నలసిపోయి మరల యుద్ధమునకువచ్చి ముందఁగలనున్న రావణుంగాంచి, రాముఁడు 'వీనిని జయించుటెట్లు?'అని చింతయందు మునిఁగియుండుటనుజూచి,యతనియొద్దకువచ్చి 'రామా! రామా! మహాబాహూ! నీకు వేదములవలె నిత్యమై రహస్యమయి యొప్పునాదిత్యహృదయము నుపదేశించెద వినుము. నాయనా! దానిచేత నీవు యుద్ధమున సమస్తశత్రువులను గెలువఁగలవు. * అది పఠించు

---

* ఇట ఆదిత్యశబ్దముచే ఆదిత్యమండలము చెప్పఁబడుచున్నది. అతనిహృదయమనఁగా అతనిలో పలనుట 'య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే' అను శ్రుతిచొప్పున ఆదిత్యమండల మధ్యవర్తియగు పరమపురుషుఁడని తెలుంగునది. లేక:— ఆదిత్యుఁడనఁగా సూర్యుఁడు. అతని హృదయము అనఁగా హృద్గతము అని యర్థము. 'అయపయగతౌ' అని ధాతువు. 'య ఆదిత్యే తిష్ఠన్' 'య ఆదిత్యమన్తరో యమయతి' అన్నట్లు సూర్యహృద్గతుఁడు పరమపురుషుఁడు కనుక ఆదిత్యహృదయమనఁగా పరమపురుషుని ప్రతిపాదించు స్తోత్రమని యర్థము.

వారికి బుణ్యమును వర్ధిల్లఁజేయునది. సర్వశత్రువులను నాశము సేయునది. జయము కలిగించునది. అక్షయమైన ఫలము నొసంగునది. పరమపావనమైనది. సమస్తమంగళములకును మంగళమైనది. (సమస్తశ్రేయములకు సాధనమైనది). సమస్త పూర్వాఘములును నాశముసేయునది. ఆధివ్యాధులను నివర్తింపఁజేయునది. ఉన్నయాయువుకంటె నధికాయువు నొసంగునది. జపింపఁదగిన వానిలోనెల్ల శ్రేష్ఠమైనది. ఇట్టి యాదిత్యహృదయ మనుస్తోత్రమును జపించునది. *సువర్ణవర్ణములగుటచేఁ బ్రశస్తములయిన కిరణములుగలవాఁడును, చక్కఁగ నుదయమునొందువాఁడును, దేవాసురులచే నమస్కృతుఁడును, నితరతేజస్సుల నన్నిటిని గప్పివుచ్చునట్టి మహాతేజస్సుగలవాఁడును, చంద్రసూర్యాదులకుఁ దేజమునొసఁగువాఁడును, ఎండవానలచే సమస్తలోకముల నియమించువాఁడును నగు పరమపురుషుని నిమ్మహాస్తోత్రముచే సంతోషపెట్టుము. † ఏలన ఆదిత్యమండలాంతర్వర్తియగు నీపురుషుండు సమస్తదేవతలకు

* ఇందులకు 'రశ్మిమన్తంసముద్యన్తం దేవాసురనమస్కృతం । పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్' అని మూలము. (రశ్మిమన్తం) రశ్మిశబ్దము పరమాంతరంగభక్తులను జెప్పునది. కనుక రశ్మిమంతుఁడనఁగా 'అట్టిభక్తులఁదుము ప్రకాశించువాఁడు. 'రశ్మిగ్ంరశ్మీనాంమధ్యేతపన్తమ్' అని సువర్ణఘర్మానువాకోక్తి. (సముద్యన్తం) 'యఃపూర్వోవ్యయవేధసేనమఃసే' అను శ్రుతి చెప్పునట్లు క్రొత్తక్రొత్తగా నుదయించినట్లు చూపట్టువాఁడు. (దేవాసురనమస్కృతం) 'దేవానాం దానవానాంచ సామాన్యమధిదైవతమ్' అన్నట్లు, సర్వజనులకు నుపాస్యుఁడైనవాఁడు. (వివస్వన్తం) నిరతిశయదీప్తిగలవాఁడు. 'అథయదతః పరోదివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనుత్తమేషూత్తమేషు లోకేషు' అని శ్రుతి. (భాస్కరం) సూర్యచంద్రాగ్ని ప్రభృతులకునుగూడ ప్రభ నొడఁగూర్చువాఁడు. 'నతత్రసూర్యోభాతి నచన్ద్రతారకం నేమావిద్యుతోభాన్తి కుతోఽయమగ్నిః । తమేవభాన్తమనుభాతి సర్వంతస్యభాసాసర్వమిదంవిభాతి' అని శ్రుతి. (భువనేశ్వరం) భువనశబ్దము సమస్తములైన యండములను జెప్పునది. సకలాండములకు నీశ్వరుఁడనుట. ఇట్టి భగవంతుని (పూజయస్వ) ఈస్తోత్రముచే నారాధింపుమనుట. మహేశ్వరతీర్థులు.

† ఇందులకు 'సర్వదేవాత్మకోహ్యేష తేజస్వీ రశ్మిభావనః । ఏషదేవాసురగణాన్ లోకాన్ పాతిగభస్తిభిః' అని మూలము. (సర్వదేవాత్మకః) సమస్తదేవతలును శరీరముగాఁగలవాఁడు, ఇందులకు 'యస్సర్వేషు దేవేషుతిష్ఠన్' ఇత్యాదులు శ్రుతులు. (తేజస్వీ) పరులను గ్రిందుపఱుచు సామర్థ్యముగలవాఁడు (రశ్మిభావనః) రశ్మలను అనఁగా నిత్యముక్తులను, భావనః= భావింపఁజేయువాఁడు, నిత్యముక్తులసత్తను నిర్వహించువాఁడు, వారు భగవంతుని నిత్యేచ్ఛను లోనై నిత్యులుగానుండువారు. వీరే 'నిత్యంప్రియాస్తస్యతుకేననతేహ నిత్యాః' అనఁబడిరి. (ఏషదేవాసురగణాన్ లోకాన్ పాతిగభస్తిభిః) 'అగ్నౌప్రాస్తాహుతిస్సమ్యగాదిత్యముపతిష్ఠతే । ఆదిత్యాజ్జాయతేవృష్టిర్వృష్టేరన్నంతతః ప్రజాః' ఇత్యాద్యుక్తరీతిని వర్షముచే నన్నదానముచేత, 'దేవాన్ భావయతానేన తేదేవాభావయన్తువః' అని పురోడాశాది దానములచేతను సర్వమును రక్షించువాఁడని యర్థము. ఇందులకు 'యాభిరాదిత్యస్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యోవర్షతి' ఇత్యాది శ్రుతులచెప్పిన కిరణములచే వర్షమొసంగి దానిచే నన్నముగలిగించి రక్షించునని భావము.

నాత్మభూతుఁడు. మిక్కిలి తేజంబుగలవాఁడు. తనకిరణములచే లోకములను రక్షించువాఁడు. దేవప్రకృతులును అసురప్రకృతులు నగుసమస్తలోకులను తనకిరణములచే నెండయు వానయుఁ గలిగించి రక్షించును.* ఇతఁడు సమస్తదేవతలును శరీరముగాఁ

---

*ఇందులకు 'ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివస్స్కన్దః ప్రజాపతిః। మహేన్ద్రో ధనదః కాలో యమస్సోమో హ్యపాంపతిః । పితరో వసవస్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః । వాయుర్వహ్నిః ప్రజాప్రాణ ఋతుకర్తా ప్రభాకరః' అని మూలము. 'య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే' అని చెప్పఁబడిన యోగిజనసాక్షాత్కారముచేత 'ఏష' అని మరలమరల నిర్దేశము. (బ్రహ్మా) చతుర్ముఖశరీరుఁడు. 'తవ చాన్తరాత్మా మమ చ యే చాన్యే దేహిసంజ్ఞితాః' అని శివునిఁగూర్చి చతుర్ముఖవచనము. (విష్ణుః) ఉపేంద్రావతారుఁడు (శివః) శివశరీరకుఁడు. 'స బ్రహ్మా స శివ స్సహరిస్సేన్ద్రః' అని రెంటికిని శ్రుతి. (స్కన్దః) 'స్కన్దిర్ గతిశోషణయోః' అను ధాతువుంబట్టి శత్రువులను శోషింపఁజేయువాఁడు స్కందుఁడు. లేక షణ్ముఖశరీరకుఁడు. (ప్రజాపతిః) 'ప్రజాపతిశ్చరతి గర్భే అన్తః' అన్నట్లు ప్రజాపతిశబ్దవాచ్యుఁడు. (మహేంద్రః) స్వరూపముచేతను ఐశ్వర్యముచేతను నిరవధికుఁడు. ఇందులకు 'ఇంద్రం నిచిక్యుః పరమే వ్యోమన్ - ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే' అని శ్రుతి. (ధనదః) 'అన్నాదో వసుదానః' అని శ్రుతి ప్రసిద్ధుఁడయిన సకలఫలప్రదుఁడు. (కాలః) జగత్సంహారకుఁడు. 'కాలాయ మహాగ్రాసాయ వై నమః- అత్తా చరాచరగ్రహణాత్' అని శ్రుతిసూత్రములచేతను 'అనాదిర్భగవాన్ కాలః' అని పరాశరస్మరణమువలనను జగత్సంహారకుఁడని యర్థము. (యమః) యమయతి శిక్షయతి-శిక్షించువాఁడనుట. 'యమో వైవస్వతో రాజా యస్తవైష హృది స్థితః' అని మనుస్మృతి. (సోమః) 'సూతేఽమృతమితి సోమః' అమృతమును గనువాఁడు. 'సోమః పవతే జనితా మతీనాం జనితా దివః' ఇత్యాదులచే చెప్పఁబడిన సకలకారణ సోమశబ్దముచే వాచ్యుఁడయినవాఁడు. (అపాంపతిః) 'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః। తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః' అన్నట్లు నారాయణుఁడు 'అప ఏవ ససర్జాదౌ' అనుటవలన అప్ఛబ్దవాచ్యములయినవానికి స్వామి. (పితరః) అగ్నిష్వాత్తు మొదలగువారు (వసవః) 'సదా వసన్తీతి వసవః' వసువులు. వీరు 'ధ్రువో ధరస్తథా సోమ ఆపో వైశ్వానరోఽనిలః । ప్రత్యూషశ్చ ప్రభావశ్చ వసవోఽష్టౌ ప్రకీర్తితాః' అని యెనమండ్రు. లేక 'అగ్నిశ్చ పృథివీ చ వాయుశ్చాన్తరిక్షం చ ఆదిత్యశ్చ ద్యౌశ్చ చన్ద్రమాశ్చ నక్షత్రాణి చైతే వై వసవః' అని శ్రుతిం జెప్పఁబడ్డ వసువులు. (సాధ్యాః) 'సిద్ధిరేషామస్తీతి సాధ్యాః' సిద్ధిగలవారు సాధ్యులు. వీరు పన్నిద్దఱు 'బ్రహ్మణో వై ముఖాత్సృష్టా యే తు దేవాః ప్రజేప్సయా। సాధ్యా మన్త్రశరీరాస్తే స్థితా మన్వన్తరేష్వపి। ధర్మపుత్రా మహాభాగా విజ్ఞేయా ద్వాదశామరాః । మనరనుమన్తా ప్రాణశ్చ చేతయానశ్చ వీర్యవాన్। విత్తిర్జయో నయశ్చైవ హంసో నారాయణస్తథా । ప్రభవో విభుశ్చైవ సాధ్యా ద్వాదశ జజ్ఞిరే' అని వాయుపురాణమునం జెప్పఁబడియున్నారు. (అశ్వినౌ) ఆదిత్యమహిషియగు సంజ్ఞాదేవి ఆఁడుగుఱ్ఱమైయుండ నందు ఆదిత్యుఁడు అశ్వమై పుట్టించినవారు అశ్వులనఁబడుదురు. (మరుతః) 'మ్రియన్తే న కదాచిదితి మరుతః' ఎన్నఁడును మరణింపనివారు. వీరు శుక్రజ్యోతిః ప్రభృతులు నలుబదితొమ్మండ్రు. (మనుః) మననముసేయువాఁడు 'నాన్యతోఽస్తి మన్తా' 'ఇతనికంటె నితరుఁడు మననము సేయువాఁడు లేఁడు' అని శ్రుతి. సృష్టికిఁ బూర్వము ప్రపంచవిషయకమగు మననముగలవాఁడనుట. (వాయుః) 'వాతి సురభీకరోతి' సమస్తమును వాసనగలదిగాఁ జేయువాఁడు. 'వా గతిగన్ధనయోః' అని ధాతువు. 'సర్వకర్మా సర్వకామస్సర్వగన్ధస్సర్వరసః' అని శ్రుతి. (వహ్నిః) 'వహతి హవ్యమ్' హవ్యము దేవతలకుఁ గొనిపోవువాఁడు 'ఇష్టాపూర్తం బహుధా జాతం

గల పరమాత్ముఁడుగాన యితఁడే బ్రహ్మయు, విష్ణుఁడును, శివుఁడును, కుమారుఁడును, ప్రజాపతులును, దేవేంద్రుఁడును, కుబేరుఁడును, మృత్యువును, యముఁడును, చంద్రుఁడును, వరుణుఁడును, పితృదేవతలును, వసువులును, సాధ్యులును, అశ్వులును, ఆవహాది మరుద్గణములును, మనువును, భూతలోకసంచారియగు వాయువును, అగ్నియు, ప్రజలశరీరమందలి ప్రాణవాయువును, వసంతాది ఋతుకర్తయగు ప్రభాకరుఁడు నగును. * నీ వాదిత్యుఁడవు, సవితృఁడవు, నీవు సూర్యుఁడవు,

---

జాయమానం విశ్వంబిభర్తి భువనస్యనాభి। తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదుచన్ద్రమాః' 'ఏది భువనమునకు నాభియై పుట్టినదియు పుట్టుచున్నదియు నగు సమస్తమయిన యిష్టాపూర్తము భరించుచున్నదో యదియేయగ్ని, అదియెవాయువు, అదియెసూర్యుఁడు, అదియెచంద్రుఁడు' అనిశ్రుతి. (ప్రజాప్రాణః) ప్రజలకు ప్రాణనహేతువు. 'కోహ్యేవాన్యాత్కఃప్రాణ్యాత్ - యదేష ఆకాశఆనందోనస్యాత్' 'ఆనందరూపమయిన యాకాశము అనఁగా బ్రహ్మము లేనియెడల, ఎవఁడు ప్రాణముగలవాఁడగును' అనిశ్రుతి. (ఋతుః) 'అర్యతే' పొందఁబడినవాఁడు, తెలియఁబడువాఁడు. 'ఋగతౌ' అనిధాతువు. 'ఋతుస్సుదర్శనఃకాలః' అని సహస్రనామపాఠము. (కర్తా) చేయువాఁడు. అతఁడులేక గడ్డిపోఁచయు గదలదుగాన సర్వభూతములలోపలఁజొచ్చి సకలకర్మములను జేయువాఁడు. 'అంతఃప్రవిష్టః కర్తారమేతం-అథరథాన్ రథయోగాన్ పథస్సృజతేసహికర్తా- సర్వకర్తా 'లోపలఁబ్రవేశించిన కర్తయగునితని, మఱియు రథములును రథములతోఁగూడిన మార్గములను సృజించును. అతఁడుగదా కర్త! సమస్తకర్మములు గలవాఁడు' అని శ్రుతులును ప్రమాణములును. (ప్రభాకరః) ప్రభను సృజించువాఁడు. వెలుతురును అనఁగా జ్ఞానమును గలిగించువాఁడు. ప్రకృష్టజ్ఞానమునకు సాధనమైనవాఁడు. 'తేషాంసతతయుక్తానాం భజతాంప్రీతిపూర్వకమ్। దదామిబుద్ధియోగంతం యేనమాముపయాన్తితే' 'అట్లు ఎల్లప్పుడును యోగమునూని నన్నుఁ బ్రీతిపూర్వకముగా భజించువారికి వారు నన్నుఁబొందునట్టి జ్ఞానయోగమును నేనొసంగుదును' అని గీతాదులు.

## ఆదిత్యహృదయస్తోత్ర ప్రారంభః.

* 'ఆదిత్యస్సవితాసూర్యః ఖగఃపూషాగభస్తిమాన్। సువర్ణసదృశోభాను ర్హిరణ్యరేతాదివాకరః' 'సువర్ణస్తపనోభానుః' అని పాఠాంతరము. ఇట్లాదిత్యస్వరూపమునుపదేశించి తద్విషయమైన ఆదిత్యహృదయస్తోత్రము నుపదేశించుచున్నాఁడు. (ఆదిత్యః) అదితికి అపత్యముగా నవతరించినవాఁడు. లేక ('అదితేః)అఖండితమైనభూమికి పతియైనవాఁడు ఆదిత్యుఁడు.|(సవితా) 'సూతేజగత్'జగత్తును గనువాఁడు. (సూర్యః) 'సువతిప్రేరయతి జనాన్ కర్మణీతిసూర్యః' 'షూప్రేరణే' అనిధాతువు. జనులను కర్మములనుజేయఁ బ్రేరేపించువాఁడు. (సూర్యః) స్థావరజంగమాత్మకమగు జగత్తునకు అంతర్యామియై సూర్యశబ్దవాచ్యుఁడగువాఁడు 'సూర్యఆత్మాజగతస్తస్థుషశ్చ' అనిశ్రుతి. (ఖగః) 'ఖేగచ్ఛతీతిఖగః' లోకోపకారార్థ మాకాశమున సంచరించువాఁడు. (పూషా) 'వర్షేణపుష్ణాతిజగదితిపూషా' 'వర్షముచే జగత్తును బోషించువాఁడు. (గభస్తిమాన్)కిరణములుగలవాఁడు (సువర్ణసదృశః)బంగారునకు సాటియైనవాఁడు, బంగారు వన్నెగలవాఁడు 'హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్ సర్వఏవసువర్ణః' 'బంగారుమీసములును గలవాఁడును బంగారు వెండ్రుకలు గలవాఁడును గోళ్లుమొదలుకొని సమస్తశరీరమును సువర్ణవర్ణము' అనిశ్రుతి.(భానుః)'భాతీతిభానుః' ప్రకాశించువాఁడవు. (హిరణ్యరేతాః) హిరణ్యము రేతస్సుగాఁగల

నీవు ఖగుఁడవు, నీవు పూషవు, నీవు గభస్తిమంతుఁడవు, నీవు సువర్ణసదృశుఁడవు, నీవు భానుఁడవు, హిరణ్యరేతసుఁడవు, నీవు దివాకరుఁడవు, * నీవు హరి

---

వాఁడు-హిరణ్యయమైన బ్రహ్మాండమును సృజించినవాఁడవనుట (దివాకరః) పగలుసేయువాఁడు లేక పగటప్రాణములను చేష్టగావించువాఁడు- గోవిందరాజులు. (ఆదిత్యః) అన్నిటిని గ్రహించువాఁడు 'యస్మాత్సర్వమాదత్తే తస్మాదాదిత్యః' ఎందువలన సమస్తమును గ్రహించుచున్నాఁడో అందువలన ఆదిత్యుఁడవు అను వ్యుత్పత్తిచే అఖిలవిషయభోక్తయని యర్థము. (సవితా) సమస్తజగత్తును ప్రసవింపఁజేయువాఁడు-జగమును గన్నవాఁడు-లేక జగమును ప్రేరించువాఁడు. (సూర్యః)'సుష్ఠు ఈరయతి ప్రేరయతీతి సూర్యః' చక్కఁగా ప్రేరేపించువాఁడగు పరమాత్ముఁడు, 'అంతః ప్రవిష్టశ్శాస్తాజనానాంసర్వాత్మా। యస్సర్వాణిభూతాన్యంతరోయమయతి' అనిశ్రుతి. (ఖగః)పరమాకాశమున నధివసించువాఁడు.'యోఅస్యాధ్యక్షః పరమేవ్యోమన్' అనిశ్రుతి. (పూషా) పోషించువాఁడు స్థితికర్తయనుట. (గభస్తిమాన్) 'గాం దిశంవ్యాప్యభాస్తి ప్రకాశయతీతిగభస్తిః' కనుక గభస్తియనఁగా సర్వవ్యాపినియగు లక్ష్మి, (గభస్తిమాన్) అనుటచే లక్ష్మినిత్యయుక్తుఁడనుట. లక్ష్మి 'యథాసర్వగతోవిష్ణు స్తథైవేయంద్విజోత్తమ' అను పరాశరస్మృతిచెప్పిన సర్వగతయగుట సిద్ధము. (సుపర్ణః) శోభనములయిన పక్షములు(ఱెక్కలు) గలవాఁడు. అనఁగా పరమాత్మ, 'ద్వాసుపర్ణా సయుజాసఖాయాసమానమ్' అనిశ్రుతి.(తపనః) తపింపఁజేయువాఁడు. 'సుపర్ణసదృశః' అనుపాఠమున పూర్వోక్తమైన యర్థమును. శ్రుతియు గ్రాహ్యములు. (భానుః) ప్రకాశించువాఁడు 'తమేవభాన్తమనుభాతిసర్వమ్' అనిశ్రుతి. (హిరణ్యరేతాః) హిరణ్యయమైన రేతస్సును అనఁగా అండోత్పాదకద్రవ్యమును గలవాఁడు. 'అపఏవససర్జాదౌ తాసువీర్యమపాసృజత్। తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్' అని మనుస్మృతి. (దివాకరః) అజ్ఞానమును నివర్తింపఁజేసి దివాకాంతివంటిజ్ఞానమును గలుగఁజేయువాఁడు. మహేశ్వరతీర్థులు.

* హరిదశ్వస్సహస్రార్చి స్సప్తసప్తిర్మరీచిమాన్ । తిమిరోన్మథనశ్శంభు స్త్వష్టామార్తండఅంశుమాన్' (హరిదశ్వః) పచ్చనిగుఱ్ఱములవాఁడు, (సహస్రార్చిః) వేయికిరణములు గలవాఁడు, (సప్తసప్తిః) సప్తయనెడి సప్త (గుఱ్ఱము) గలవాఁడు, 'ఏకోఅశ్వోవహతిసప్తనామ' అనిశ్రుతి. (మరీచిమాన్) మరీచులుగలవాఁడు-ప్రకాశవంతుఁడనుట. (తిమిరోన్మథనః) చీఁకటిని రూపుమాపువాఁడు. (శంభుః) 'శం సుఖంభవతి అస్మాదితిశంభుః' సుఖముగలిగించువాఁడు, (త్వష్టా) 'సర్వాణిరూపాణి త్వక్షతితనూకరోతీతిత్వష్టా' సమస్తరూపములను చిన్నవిచేయువాఁడు సర్వసంహారకుఁడనుట. (మార్తండః) 'మృతేఅణ్డే జాతోమార్తండః' మృతమయిన అండమందుఁ బుట్టినవాఁడు,సర్వమును సంహారమునొందఁగా దానిని సృజించుటకు మరల ప్రాదుర్భవించినవాఁడనుట. (అంశుమాన్) అంశువులుగలవాఁడు - ప్రకాశించుచుండువాఁడనుట. గోవిందరాజులు. (హరిదశ్వః) 'హరతిమనః ఇతిహరిత్' మనస్సును హరించునట్టి, అశ్వః-వాహనమును అనఁగా గరుడుఁడుగలవాఁడు,(సహస్రార్చిః)అర్చ్యతే ఇతిఅర్చిః-అర్చిశ్శబ్దముచే అర్చనీయములు (పూజ్యములు) అయిన మంగళగుణములు చెప్పఁబడుచున్నవి. కనుక సహస్రార్చిః అనఁగా అనంతకల్యాణ గుణగణుఁడనుట. (సప్తసప్తిః) సప్తయనెడు అశ్వముగలవాఁడు-దీనిచే కల్క్యవతారము సూచితము (మరీచిమాన్) మ్రియన్తేశత్రవోఽనేనేతిమరీచిః చక్రమ్-శత్రువులను మరణమునొందించునట్టి సువర్శనచక్రము. మరీచిమాన్-అట్టిచక్రము గలవాఁడనుట. ఈచక్రము ఇతరాయుధములకును నుపలక్షణముగాన శంఖచక్రగదాధరుఁడనుట. (తిమిరోన్మథనః) జ్ఞానోత్పత్తికి ప్రతిబంధకమైన

దశ్వుఁడవు, నీవు సహస్రార్చివి,నీవు సప్తసప్తివి, నీవు మరీచిమంతుఁడవు, నీవు తిమిరోన్మథనుఁడవు,నీవు శంభుఁడవు, నీవు త్వష్టవు, నీవు మార్తాండుఁడవు, నీవు అంశుమంతుఁడవు, * నీవు హిరణ్యగర్భుఁడవు,నీవు శిశిరుఁడవు నీవు తపనుండవు, నీవు భాస్కరుండవు, నీవు రవివి,నీవు అగ్నిగర్భుఁడవు,నీవు అదితిపుత్రుండవు,నీవు శంఖుఁడవు,నీవు శిశిరనాశనుఁడవు.† నీవు వ్యోమనాథుఁడవు,నీవు తమోభేదివి,నీవు ఋగ్యజుస్సామపారగుఁడవు,

---

దోషము నివర్తింపఁజేయువాఁడు. 'హృద్యన్తస్థోహ్యభద్రాణి విధునోతిసుహృత్సతామ్' అనిస్మృతి. (శంభుః) సుఖముగలిగించువాఁడు, 'విశ్వాత్మంవిశ్వశంభువమ్' అనిశ్రుతి. (త్వష్టా) 'త్వక్ష్ణోతిత్రిస్సప్త కృత్వః సక్షత్రియాంభూమిమితిత్వష్టా' క్షత్రియులతోడి భూమిని ముయ్యేడుమాఱులు తనూకరించినవాఁడు. దీనిచే పరశురామావతారము సూచితము. (మార్తాండమ్) 'మృతంఅచేతనంబ్రహ్మాణ్డంజీవయతీతి మార్తణ్డః'- అచేతనమైన బ్రహ్మాండమును జీవింపఁజేయువాఁడనుట. 'జీవాజీవమజీవయత్' అని భాగవతము. (అంశుమాన్) 'అశువ్యాప్తౌ' అనిధాతువు. అంతర్బహిర్వ్యాప్తిగలవాఁడు. 'అన్తర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్స్థితః' అనిశ్రుతి. మహేశ్వరతీర్థులు.

* హిరణ్యగర్భశ్శిశిరస్తపనోభాస్కరోరవిః । అగ్నిగర్భోదితేఃపుత్ర శ్శంఖశ్శిశిరనాశనః (హిరణ్యగర్భః) హిరణ్యం-హిరణ్మయమైనయండము 'తదణ్డమభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్'అనిస్మృతి. ఇట్టియండము గర్భమునఁగలవాఁడు. బ్రహ్మాండోదరమున వర్తించువాఁడనుట,లేక హిరణ్యం-హితరమణీయమైన,గర్భం-అంతఃకరణము గలవాఁడనుట. (శిశిరః) తాపత్రయతప్తులయినవారికి విశ్రమస్థానమైనవాఁడు, (తపనః) తాపముగలిగించువాఁడు, (భాస్కరః) భాసఃకరోతీతి భాస్కరః - కిరణములను గలిగించువాఁడు, (రవిః)'రూయతేస్తూయతే సర్వైరితిరవిః' అందఱచే స్తోత్రముచేయఁబడువాఁడు, (అగ్నిగర్భః) పగట అగ్నిగర్భమునం గలవాఁడు. 'ఉద్యన్తంవావాదిత్య మగ్నిరనుసమారోహతి' అనిశ్రుతి. (అదితేఃపుత్రః)అదితికి పుత్రుఁడుగా-నవతరించినవాఁడు. (శంఖః) 'శమేః ఖః' సాయంకాలమున తానే శమించువాఁడు. (శిశిరనాశనః) మంచును నాశము నేయువాఁడు. గోవిందరాజులు. (హిరణ్యగర్భః)హిరణ్యం=అనఁగా సకలజగదుత్పాదకమైన సమష్టి జీవసమూహము, గర్భః=గర్భమందుఁగలవాఁడు. 'హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే హిరణ్యగర్భోభూగర్భః' అనిశ్రుతి. (శిశిరః) పూర్వమువలెనర్థము. (తపనః) తవయాత్రికులకు విరోధులయినవారికి తాపముగలిగించువాఁడు, (భాస్కరః) కాంతికలిగించువాఁడు-సర్వవస్తువులను సాక్షాత్కరించుటకు హేతువైన లోకకర్తయనుట. (రవిః) పూర్వమువలెనర్థము, లేక 'రాత్యుపదిశతివేదానితివారవిః' వేదములుపదేశించువాఁడనుట"యోవై వేదాంశ్చప్రహిణోతితస్మై' అనిశ్రుతి. (అగ్నిగర్భః) అగ్ని=కాలాగ్నిరుద్రుఁడు, గర్భమందుఁగలవాఁడు, రుద్రునిఁగన్నవాఁడనుట. 'నారాయణాద్రుద్రోజాయత' అనిశ్రుతి. (అదితేఃపుత్రః) అదితికొడుకగు నింద్రునిరక్షించువాఁడు. (శంఖం) 'శం సుఖం ఖే ఆకాశే హృదయాకాశే యస్యసః శంఖః' హృదయాకాశమున సుఖముగలవాఁడు- నిరవధికానందవంతుఁడనుట. (శిశిరనాశనః) సూర్యరూపమున మంచును నాశము నేయువాఁడు. మహేశ్వరతీర్థులు.

† వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః।ఘనవృష్టిరపాంమిత్రో విన్ధ్యవీథీప్లవంగమః 'వింధ్యవీథీఃప్లవంగమః' అనియు పాఠాంతరము. (వ్యోమనాథః) పరమాకాశమునకు నాథుఁడు. పరమపదనాథుఁడనుట. (తమోభేదీ) రాహువును భేదించు శీలముగలవాఁడు. (ఋగ్యజుస్సామపారగః) ఋగ్యజు

నీవుఘనవృష్టివి, నీవు అపాంమిత్రుఁడవు, నీవు వింధ్యవీథీప్లవంగముండవు.*నీవు ఆతపివి,

---

స్సామవేదములందు తుదనొందినవాఁడు. 'ఋగ్భిః పూర్వాహ్ణేదివిదేవఈయతే'-'యజుర్వేదేతిష్ఠతిమధ్యేఅహ్నః సామవేదేనా స్తమయేమహీయతే' 'వేదైరశూన్యస్త్రిభిరేతిసూర్యః' అనిశ్రుతి.(ఘనవృష్టిః)గొప్పవర్షము గురియువాఁడు 'అగ్నౌప్రాస్తాహుతి స్సమ్యగాదిత్యముపతిష్ఠతే। ఆదిత్యాజ్జాయతేవృష్టి ర్వృష్టేరన్నంతతఃప్రజాః' అనిస్మృతి. కావున నే (అపాంమిత్రః) జలములకు మిత్రమయినవాఁడు (వింధ్యవీథిః) దక్షిణాయనమందు వింధ్యము సంచారమార్గముగాఁగలవాఁడు. (ప్లవంగమః) తెప్పవలెపోవువాఁడు 'వింధ్యవీథీప్లవంగమః' అని యేకపదముగా గ్రహించినచో వింధ్యవీధియనఁగా ఆకాశమార్గము. అందు వేగపోవువాఁడని యర్థము-గోవిందరాజులు. (వ్యోమనాథః) ఆకాశమును చేసినవాఁడు-తామసాహంకారరూపమున ఆకాశమును సృజించినవాఁడు 'ఆత్మనఆకాశస్సంభూతః' అనిశ్రుతి. (తమోభేదీ) భక్తులతమోగుణమును భేదించువాఁడు, (ఋగ్యజుస్సామపారగః) సకలవేదములకు పర్యవసానభూమియైనవాఁడు.'వేదైశ్చసర్వైరహమేవవేద్యః' 'యేచవేదవిదోవిప్రా యేచాధ్యాత్మవిదోజనాః। తేవద న్తిమహాత్మానం కృష్ణధర్మంసనాతనమ్' ఇత్యాదులు ప్రమాణములు.(ఘనవృష్టిః) ఘన=అధికమైన,వృష్టిః=సకలకర్మఫలరూపమైన వర్షముగలవాఁడు, సకలకర్మఫలప్రదుఁడనుట. 'అహంహిసర్వయజ్ఞానాం భోక్తాచప్రభురేవచ' 'ఫలమతఉపప త్తేః' ఇత్యాదు లిందులకు ప్రమాణములు. (అపాంమిత్రః) మహార్ణవమున శయనించువాఁడును 'యమంతస్సముద్రే కవయోవయ న్తి' ఇత్యాదు లిందులకు శ్రుతులు. (వింధ్యవీథీప్లవంగమః) వింధ్యమువలె దుర్గమమయిన వీథియందు-అనఁగా సుషుమ్నామార్గమందు, ప్లవం=శీఘ్రముగా, గమయతి=పొందించుచున్నాఁడు. ముక్తులకు ప్రాపకుఁడనుట. 'సఏతాన్ బ్రహ్మగమయతి- హార్దానుగృహీతశ్శతాధికయా' ఇత్యాదులు శ్రుతులు. మహేశ్వరతీర్థులు.

'ఆతపీమణ్డలీమృత్యుః పిఙ్గళస్సర్వతాపనః।కవిర్విశ్వోమహాతేజా ర క్తస్సర్వభవోద్భవః' (ఆతపీ) ఎండగలవాఁడు, (మణ్డలీ) వర్తులమైన బింబముగలవాఁడు, (మృత్యుః) విరోధుల నివర్తించువాఁడు, (పింగళః) ఉదయసమయమున పింగళవర్ణముగలవాఁడు, (సర్వతాపనః) సర్వులను మధ్యాహ్నమున తపింపఁజేయువాఁడు, (కవిః) పండితుఁడు, వ్యాకరణాది సర్వశాస్త్ర ప్రవర్తకుఁడనుట - (విశ్వః) సమస్తమును నిర్వహించువాఁడు, (మహాతేజాః) గొప్పతేజస్సులు గలవాఁడు, (రక్తః) అందఱియం దనురక్తుఁడైనవాఁడు, (సర్వభవోద్భవః) ఎల్లవారి సంసారమునకుఁ గారణమైనవాఁడవు - గోవిందరాజులు. (ఆతపీ) 'తపఆలోచనే' అనిధాతువు. ఆతప్-అనఁగా ఆ=అంతటను, తపః=జగన్నిర్మాణసంకల్పముగలవాఁడు, 'యస్యజ్ఞానమయంతపః' అనిశ్రుతి.(మండలీ) 'మండ్యతే నేనేతిమండలీ'-అలంకరించునట్టి కౌస్తుభాదులు ఇట మండలమగును. మండలీఅనఁగా అవిగలవాఁడనుట, (మృత్యుః) ఇట మృత్యువనఁగా ప్రకృతి- మృత్యుశరీరకుఁడనుట 'యస్యమృత్యుశ్శరీరమ్' అనిశ్రుతి.(పింగళః) 'పింగమేళనే' అనిధాతువు. కలయువాఁడు. సుశీలునికే మేళనము (కలుపుగోలుతనము) కలుగును. సౌశీల్యమనఁగా మహాత్ములు మూఢులతోఁగూడ దట్టముగాఁ గలసియుండుట. (సర్వతాపనః) ఒక్కమ్మడిని సమస్తాండములను సంహరించువాఁడు, (కవిః) సమస్తవేద్యములను దెలిసినవాఁడు, 'యస్సర్వజ్ఞస్సర్వవిత్' అనిశ్రుతి. (విశ్వః) విశ్వశరీరకుఁడు 'విశ్వమేవేదంపురుషః' అనిశ్రుతి. (మహాతేజాః) మహత్=నిరవధికమైన, తేజాః=ఇతరులను గ్రిందుపఱుచు సామర్థ్యముగలవాఁడు, (రక్తః) సర్వరంజకుఁడు, (సర్వభవోద్భవః) సర్వ=సమస్తములైన, భవ=కార్యవర్గమునకు, ఉద్భవః=హేతువైనవాఁడవు, సర్వోత్పత్తిహేతువనుట. లేక సర్వజనుల సంసారమును పుట్టుచోటయినవాఁడవనియు గ్రాహ్యము. మహేశ్వరతీర్థులు.

నీవు మండలివి, నీవు మృత్యువవు, నీవు పింగళుఁడవు, నీవు సర్వతాపనుఁడవు, నీవు కవివి, నీవు విశ్వుఁడవు, నీవు మహాతేజుండవు, నీవు రక్తుండవు, నీవు సర్వభవోద్భవుఁడవు,* నీవు నక్షత్రగ్రహతారాధిపుఁడవు, నీవు విశ్వభావనుఁడవు, నీవు అగ్న్యాది తేజస్సులకంటెను ప్రశస్తమైన తేజస్సుగలవాఁడవు, నీవు ద్వాదశాత్ముండవు, ఇట్టినీకు నమస్కారమగుఁగాక. †పూర్వగిరితోఁ గూడినవానికి నమస్కారము. పశ్చిమగిరితోఁ గూడినవానికిని నమస్కారము. జ్యోతిర్గణములకు పతియైనవానికి నమస్కారము. దినాధిపతికి నమస్కారము. ‡జయునకు నమస్కారము. జయభద్రునకు నమస్కారము.

---

*'నక్షత్రగ్రహతారాణా మధిపోవిశ్వభావనః । తేజసామపితేజస్వీ ద్వాదశాత్మన్నమోఽస్తుతే' (నక్షత్రగ్రహతారాణామధిపః) నక్షత్రగ్రహతారకముల కధిపుఁడయినవాఁడు, (విశ్వభావనః) సమస్తమును స్థాపించువాఁడు, (తేజసామపితేజస్వీ) అగ్ని మొదలగువాని తేజస్సులకంటెను ప్రశస్తమైన తేజస్సుగలవాఁడు, (ద్వాదశాత్మా) పండ్రెండుమూర్తులుగలవాఁడు 'ఇన్ద్రోధాతాభగఃపూషా మిత్రోఽథవరుణోఽర్యమా । అర్చిర్వివస్వాన్ త్వష్టాచ సవితావిష్ణురేవచ' అని ద్వాదశమూర్తులు. ఇట్టి నీకు నమస్కారమని యోజన- గోవిందరాజులు. (నక్షత్ర...మధిపః) నక్షత్రగ్రహతారకముల కంతర్యామియైనవాఁడు, 'యశ్చన్ద్రతారకమన్తరోయమయతి' అని శ్రుతి. (విశ్వభావనః) విశ్వస్థితిహేతువు. 'ద్యౌస్సచన్ద్రార్కనక్షత్రం ఖందిశోభూర్మహోదధిః । వాసుదేవస్యవీర్యేణ విధృతానిమహాత్మనః' అని శ్రుతి. (తేజసామపితేజస్వీ) ప్రశస్తమైన తేజస్సుగలవాఁడనుట. 'యేనసూర్యస్తపతితేజసేద్ధః' అని శ్రుతి. 'సూర్యస్యాపిభవేత్సూర్యః' అనియుఁగలదు. (ద్వాదశాత్మన్) ద్వాదశమండలాంతర్వర్తీ! నీకు నమస్కారమని యర్థము. మహేశ్వరతీర్థులు.

†'నమఃపూర్వాయగిరయే పశ్చిమేగిరయేనమః। జ్యోతిర్గణానాంపతయే దినాధిపతయేనమః' (పూర్వాయగిరయే) పూర్వభాగమందున్న పర్వతముతోఁగూడినవానికి, (పశ్చిమేగిరయే) పశ్చిమభాగమందున్న పర్వతముతోఁగూడినవానికిని, (జ్యోతిర్గణానాంపతయే) జ్యోతిర్గణములకు పతియైనవానికిని, (దినాధిపతయే) దినమున కధిపతియైనవానికి, (నమః) నమస్కారము-గోవిందరాజులు. (పూర్వాయగిరయే) శ్రీవిష్ణుపురాణమందుఁ జెప్పఁబడిన యాయాపర్వతముల కంతర్యామియగువానికి, (జ్యోతిర్గణానాంపతయే) జ్యోతిర్గణములనఁగా ముక్తులు-ముక్తులకు స్వామియైనవానికి-సూర్యునకు పర్యాయములయిన నామములన్నియు తదంతర్యామియగు పరమాత్మునియందు పర్యవసించునని యభిప్రాయమున (దినాధిపతయే) ఇత్యాదులు చెప్పఁబడినవని తెలియునది. మహేశ్వరతీర్థులు.

‡'జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః। నమోనమస్సహస్రాంశో ఆదిత్యాయనమోనమః । నమఉగ్రాయవీరాయ సారంగాయనమోనమః । నమఃపద్మప్రబోధాయ మార్తాండాయనమోనమః। బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే। భాస్వతేసర్వభక్షాయ రౌద్రాయవపుషేనమః' (జయాయ) ఉపాసకులకు జయముగలిగించువానికి, (జయభద్రాయ) జయభద్రములను నొసంగువానికి, (హర్యశ్వాయ) పచ్చనిగుఱ్ఱములవానికి- ఇచట స్తుతిగాన పునరుక్తియని చింతింపరాదు. సహస్రాంశుశబ్దమునకు ఆదిత్యశబ్దమునకును పూర్వమువలె నర్థములు దెలియునది. (ఉగ్రాయ) ఉపాసింపనివారికి ఉగ్రుఁడయినవానికి, (వీరాయ) 'వివిధమీరయతి ప్రేరయతీతివీరః' పలువిధములుగా ప్రాణులను జేష్టింపఁజేయువానికి, (సారంగాయ) సారం శీఘ్రంగచ్ఛతీతి సారంగః=శీఘ్రముగాఁ బోవువానికి. ఒకనిమేషార్థ

హర్యశ్వునకు నమస్కారము. సహస్రాంశునకు మాటికి నమస్కారము. ఆదిత్యునకు రెండుమార్లు నమస్కారము. ఉగ్రునకు నమస్కారము. వీరునకు నమస్కారము. సారంగునకు నమస్కారము. పద్మప్రబోధునకు నమస్కారము. మార్తాండునకు రెండుమార్లు నమస్కారము. బ్రహ్మేశానాచ్యుతేశునకు నమస్కారము. సూర్యునకు నమస్కారము. ఆదిత్యవర్చసునకు నమస్కారము. భాస్వంతునకు నమస్కారము. సర్వభక్షునకు నమస్కారము. రౌద్రవపువునకు నమస్కారము.* తమోఘ్నునకు నమస్కారము. హిమఘ్నునకు నమస్కారము. శత్రుఘ్నునకు నమస్కారము. అమితాత్మునకు నమస్కారము. కృతఘ్నఘ్నునకు నమస్కారము. దేవునకు నమస్కారము. జ్యోతిషాంపతికి నమస్కారము. తప్తచామీకరాభునకు నమస్కారము. వహ్నికి నమస్కారము. విశ్వకర్మకు నమస్కారము. తమోభినిఘ్నునకు నమస్కారము. రుచికి నమస్కారము. లోకసాక్షికి నమస్కారము.

---

మున సహస్రములయోజనములు పోవునని పురాణప్రసిద్ధి. (బ్రహ్మేశానాచ్యుతేశాయ) సృష్టిసంహారస్థితికర్తలగు బ్రహ్మ శివ విష్ణువులకు ఈశుఁడయినవానికి, ఇట పరబ్రహ్మరూపముగాస్తుతి, 'అసావాదిత్యోబ్రహ్మ' అని ఆదిత్యుఁడు బ్రహ్మముగా శ్రుతి. లేక (బ్రహ్మేశాన) బ్రహ్మరుద్రులకు, అచ్యుతేశ=అప్రచ్యుతుఁడైన నియామకుఁడు—ఎడతెగక నియామకుఁడై యుండువాఁడనుట. సమస్తాపదలందును గాపాడువానికనుట. వేదాపహారగురుపాతక దైత్యపీడాద్యాపదలను బోఁగొట్టి గొప్పఫలము నొసంగువానికని యర్థము. (ఆదిత్యవర్చసే) ఆదిత్యరూపమగు దీప్తిగలవానికి, (భాస్వతే) 'భాఅస్యాస్తీతిభాస్వాన్ తస్మై' కిరణములుగలవానికి, (సర్వభక్షాయ) సర్వమును సంహరించువానికి, కావున నాసమయమందు (రౌద్రాయవపుషే) రుద్రాకారము గలవానికి-గోవిందరాజులు. (జయాయ) 'జయతీతిజయః' అప్రతిహతపరాక్రమునికి, 'జయన్త్యనేనసద్భక్తాః స్సంసారమితివాజయః' భక్తులకు సంసారభయము గలిగించువానికి, (జయభద్రాయ) ఉపాసకులకు రోగపాపాదుల జయమును కల్యాణమును నిచ్చువానికి, (హర్యశ్వాయ) హరిః=కోఁతియగు హనుమంతుఁడు, (అశ్వాయ) వాహనముగాఁగలవానికి-దీనిచే రామావతారము సూచితము. (సహస్రాంశో) ఇట అంశువనఁగా 'మమైవాంశో జీవలోకే జీవభూతః' అను స్మృతిచే జీవుఁడని యర్థము. (సహస్రాంశు) డనఁగా వేలకొలఁది జీవులుగలవాఁడనుట. (సారంగాయ) సారగ్రాహియైనవానికిని-లేక సారంగమనఁగా హంసముగనుక హంసావతారుఁడైనవానికి, లేక సారం అనఁగా ప్రణవము-దానిచే ప్రతిపాదితుఁడైనవానికి, (బ్రహ్మేశానాచ్యుతేశాయ) సృష్టిస్థితిసంహారకర్తలగు త్రిమూర్తులకు స్వామియైనవానికి-పరబ్రహ్మ మట్టివాఁడుగాన యిట్లు చెప్పఁబడినది. 'సృష్టిస్థిత్యంతకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్। సంజ్ఞాం సయాతి భగవా నేకఏవజనార్దనః' అనిస్మృతి. (సర్వభక్షాయ) సర్వయజ్ఞభోక్తయైనవానికి, లేక సర్వసంహారకుఁడైనవానికి, 'యస్యబ్రహ్మచక్షత్రంచ ఉభేభవతఓదనః' అనిశ్రుతి. (రౌద్రాయవపుషే) శత్రుసంహారముకొఱకు రౌద్రాకారము దాల్చువానికి- దీనిచే నృసింహావతారము సూచితము.—మహేశ్వరతీర్థులు.

* 'తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే। కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయేనమః। తప్తచామీకరాభాయ వహ్నయేవిశ్వకర్మణే।నమస్తమోభినిఘ్నాయ రుచయేలోకసాక్షిణే' (తమోఘ్నాయ) చీఁకటిని బోఁగొట్టువానికి, (హిమఘ్నాయ) మంచును బోఁగొట్టువానికి,

* ఈతఁడే మహాప్రలయమందు జగత్తును నాశముసేయును. మరల దానినే సృజించును. అత్యయకాలముపోఁగా పాలించును. (2) ఇతఁడు కిరణములచే శోషిల్లఁజేయును ఎండగాయును. వర్షముగురియును. సమస్తప్రాణులు నిదురింపఁగా, వానియం దంతర్యామియై నెలకొని, మేలుకొనియుండును. (3) ఇతఁడే అగ్నిహోత్రమును అగ్నిహోత్రులఫలమునగును. (4) వేదములును యజ్ఞములును, యజ్ఞములఫలమునునితఁడే. మఱియు లోకమునంగల కర్మములకెల్లను సర్వాత్మకుఁడగు (5) సవితయే (సూర్యమండలాంతర్వర్తియగు పురుషుఁడే) నియామకుఁడు. రామా! ఇందులకు వీఁడు వాఁడని యధికారినియమము లేదు. ఎవ్వఁడయిననుసరే, ఆపదలయందును, కష్టములు వచ్చి

(శత్రుఘ్నాయ) ఆశ్రితులశత్రువులను జంపువాఁడు, (అమితాత్మనే) అపరిచ్ఛిన్నమైన స్వరూపముగలవానికి, (కృతఘ్నఘ్నాయ) కృతఘ్నుని జంపువానికి, (దేవాయ) ప్రకాశించుచుండువానికి, (తప్తచామీకరాభాయ) హిరణ్యదేహము గలవానికిని, (వహ్నయే) అగ్నిరూపమున హవ్యమును వహించువానికి, (విశ్వకర్మణే) సర్వజగత్కర్తయైనవానికి, (లోకసాక్షిణే) లోకులకు అంతర్యామియైయుండి సుకృతదుష్కృతికర్మములకు సాక్షియగువానికి - గోవిందరాజులు. (శత్రుఘ్నాయ) శత్రుభూతములగు నింద్రియములను నిగ్రహించినవానికి, (అమితాత్మనే) అమితమహిమగలవానికి, (దేవాయ) స్వయంప్రకాశుఁడయినవానికి, (తప్తచామీకరాభాయ) హిరణ్మయుఁడైనపురుషునకి, (విశ్వకర్మణే) సమస్తమును తనకార్యమయినవానికి, 'సర్వకర్మాసర్వకామః' అనిశ్రుతి. (తమోభినిఘ్నాయ) అజ్ఞాననాశకుఁడయినవానికి, (రుచయే) రుచించువానికి, (లోకసాక్షిణే) సర్వసాక్షియైనవానికి నమస్కారము. 'సర్వదేవాత్మకోహ్యేష' అనుట మొదలుకొని 'లోకసాక్షిణే' అనువఱకు ఆదిత్యహృదయస్తోత్రనామమంత్రములు నూటయెనిమిదని తెలియునది.

* ఇట్లాదిత్యహృదయము నుపదేశించి యిదిమొదలు తత్ప్రతిపాద్యదేవతను స్తోత్రముచేయుట తెలియునది.

(2) ఇట పాలించువిధము చెప్పఁబడినది.

(3) దీనిచే సకలయజ్ఞముల కర్తయనియు ఫలప్రదుఁడనియు చెప్పఁబడినది.

(4) ఇతఁడే వేదములనుటచే వేదోక్తములయిన సమస్తకర్మములచే సమారాధ్యుఁడనియు, 'ఇతఁడే యజ్ఞాదులు' అనుటచే సమస్తయజ్ఞఫలప్రదుఁడనియు 'లోకమునందలి కర్మములకెల్ల నియామకుఁ' డనుటచే లౌకికకర్మఫలప్రదుఁడనియుఁ జెప్పఁబడెనని తెలియునది.

(5) మీఁద బ్రహ్మరుద్రాదులందఱు నేకవాక్యమున 'భవాన్నారాయణోదేవః' ఇత్యాదులచే విష్ణువే సర్వస్మాత్పరుఁడని మహాగ్రంథసందర్భముచే ప్రతిపాదించియున్నారు. ఇట సూర్యుఁడే సర్వోత్తరుఁడనుట యెట్లు పొసఁగునని యడిగితివో మధువిద్యయందు ఆదిత్యుఁడే పరుఁడుగా ప్రతిపాదించినను, ఆపరత్వము ఆదిత్యునియం దంతర్యామియగు పరమాత్మునియందే పర్యవసించునట్లు మధువిద్య తాత్పర్యముగదా. బాదరాయణుఁడు బ్రహ్మయని మీమాంసయందుఁ జెప్పియున్నాఁడుగదా. అట్లే, యీమంత్రమును ఆదిత్యున కంతర్యామివిషయమేయని తలఁచుటచే నంతయును సంగతమగుచున్నది. ఇట సూర్యుఁడు తనమండలమునువిడిచి యుద్ధము చూడ దేవతాసమూహము నడుమనిలిచి రామునకుఁ బొడమూపి స్తోత్రఫలము ననుగ్రహించినాఁడని తెలియునది.

నపుడును, అడవిమార్గములందును, ఇతరభయములు గలిగినపుడును, ఈస్తోత్రమును గీర్తించునేని, నతఁడు కీడ్పడక సుఖము నొందును. నీవు మనస్సు నిశ్చలముగా నిలిపి, దేవదేవుఁడును జగన్నాథుఁడునగు నీదేవుని, దీనిచేఁ బూజింపుము. ఈస్తోత్రమును మూఁడుమాఱులు జపింతువేని, యుద్ధములందు జయమునొందఁగలవు. మహాబాహూ! ఈక్షణముననే నీవు రావణునిని వధింపఁగలవు' అనెను. ఇట్లగస్త్యుఁడు చెప్పి యపుడు తాను వచ్చినదారినిం బోయెను. అప్పుడు మహాతేజుండగు రాముఁడు, ఈస్తోత్రము విన్నంతనే శోకమంతయునశింప మిక్కిలియు సంతుష్టుఁడై పరిశుద్ధమయిన మనస్సుతో ఆచమనము సేసి శుచియై ఆదిత్యునిఁజూచి యీస్తోత్రమును జపించి మిక్కిలియు హర్షమునొంది యిట్లు మూఁడుమార్లు ఆచమనముచేసి వీర్యమతిశయించి విలుగొని దిటవుమై యుద్ధమున నిలిచెను. రాముఁడంత రావణుంజూచి మనంబున నుబ్బి, సమస్తప్రయత్నముల నతనిని వధింప నిశ్చయించి యుద్ధముసేయుటకై తారసించెను. అంత ఆదిత్యుఁడు తన్నుస్తోత్రముచేయు రామునిం జూచి మనంబున సంతసిల్లి ఆసంతోషమున మేను మిగుల గగురుపొడుచుచుండఁగా, రాక్షసరాజగు రావణునివధము ననుగ్రహించి తనమండలమునుండి దేవతాసమూహమధ్యమున నిలిచి 'రావణునివధింపఁ ద్వరపడుము' అని రామునకుం జెప్పెను ఇది నూటయేడవసర్గము.



## రావణునకు మరణసూచకములగు దుర్నిమిత్తములు తోఁచుట.

అట్లారావణునిసారథి సంతుష్టుఁడై యతనియాజ్ఞచొప్పున రథమును వేగముగా యుద్ధభూమికిం దోలెను. ఆరథము, పరసైన్యముఁగలంచి నలంచునట్టిది. అది పొడవుగా నెత్తంబడిన పతాకలతోఁగూడి*గంధర్వనగరమువలె చిత్రాలంకారాది యుక్తమై యత్యాశ్చర్యకరమై యొప్పుచుండెను. బంగారుమాలికలుగలిగి మిక్కిలియు వేగసంపన్నములయిన యశ్వములు దానికిఁ బూన్పంబడియుండెను. యుద్ధపరికరములగు దిండ్లు కవచములు మొదలగునవి సమృద్ధముగాఁ గలిగి, బహుళములయిన పతాకలును ధ్వజములును వెలయుచు తనవిఱివిచేత నాకాశమును గ్రమ్మి దానిని గ్రసించునట్లు చూపట్టుచు, భూమిని మ్రోయించుచు పరసైన్యములను నాశము సేయునదియు, స్వసైన్యముల కుల్లాసము గలిగించునదియునై యొప్పుచుండెను.

---

*గంధర్వనగరమనఁగా 'చిత్రవర్ణం చిత్రరూప ప్రాకార గృహగోపురం। అలంకృతమనేకాభిర్వితానధ్వజతోరణైః। గంధర్వనగరం దస్మిన్నృపాజిక్షయయుద్ధకృత్ । దృశ్యతేచేన్మహద్యుద్ధమన్యోన్యం ధరణీభుజామ్' నానావర్ణములుగలిగి, నానావిధములయిన ప్రాకారములును గృహములును పురద్వారములునుగలిగి నానావిధకాంతులుగల మేలుకట్లచేతను టెక్కెములచేతను తోరణములచేతను నలంకృతమై యుండునది గంధర్వనగరము. అది కనఁబడునేని ఏనుఁగులకు మనుష్యులకును గుఱ్ఱములకును నాశకరమయిన యుద్ధముగలుగును. రాజులకు పరస్పరము మహాయుద్ధము సంభవించును. అని గంధర్వనగరలక్షణము దెలియునది. గోవిందరాజులు.

నరనాథుండగు రాముఁడు, అట్లు రాక్షసనాథుఁడగు రావణునిరథము మిక్కిలియు శబ్దించుచు దిక్కులఁ బ్రతిధ్వనులం జెలంగించుచు వేగమున వచ్చుచుండఁగాఁ జూచెను. రాముండు తనశత్రుఁడయిన రావణుని యమ్మహారథము నల్లనిగుఱ్ఱములు పూన్పఁబడి, యుగ్రంబయిన వర్చస్సుతోఁ గూడి, తనపతాకాపరంపరలు మెఱపుఁదీఁగలవలె మెఱయ, ఇంద్రాయుధమువలె తనయందలి పెనుధనువు చూపట్ట, మేఘము జడివాన గురియునట్లు బాణధారలు పరఁగుచుండ, మేఘముంబోలెఁ జూపట్టుచున్నదై వచ్చుచుండుటనుజూచి బాలచంద్రునివలె తనవిల్లు మండలాకారముగ గుదుసుపడునట్లు వంచి మోపెట్టి, వజ్రాయుధము వ్రేటున పర్వతము బ్రద్దలువాఱు చప్పుడుంబోలె పెనుచప్పుడు గలుగ వేగమున నారి సారించుచు నింద్రునిసారథి యగుమాతలిం జూచి 'మాతలీ! పగవానిరథము వేగముగావచ్చుచున్నది చూడుము. ఆరావణుఁడు మరల మహావేగము * నప్రదక్షిణముగునట్లుగా వచ్చుచున్నాఁడుగావున వానికి యుద్ధంబున హతుఁడగుటకు బుద్ధి గలిగినట్లున్నది. అట్లగుటంజేసి నీ వేమఱిపాటున నప్రదక్షిణగతి లేకుండునట్లుగా, మనరథమును శత్రురథమున కభిముఖముగాఁ దోలుము. వాయువాకాశంబున లేచిన మేఘమును బటాపంచలు సేయునట్లు నేను వీనిని నుఱుమాడిపుచ్చెదను. నీవు దైన్యము నొందకయు, పరాకుపడకయు, మనస్సు కలంగకయు, చూపుచెదరకయు, పగ్గంబుల క్రమంబుగా మెలపుచు, రథమును ద్వరితముగాఁ దోలుము. నీవు, దేవేంద్రునిరథమును మెలపి యలవాటు పడియున్నవాఁడవుగావున నీకీవిషయమై యుపదేశింప వలసినది లేదు సరే. అయినను నేను యుద్ధముసేయఁబోవుచున్నానుగావున మిక్కిలి యెచ్చరికగలిగి నీకుఁ దెలిసినవాని నే తలఁపించెదనింతేకాని క్రొత్తవానిని నేర్పువాఁడనుగాను' అనెను. దేవసారథిశిలకుం డగునమ్మాతలి రాముఁడుచెప్పినయామాటకు మిక్కిలి సంతుష్టుఁడై రథమును దోలెను. అంత నమ్మాతలి రావణునిమహారథము నప్రదక్షిణముగాఁ జేయుచునట్లు తనరథమును ప్రదక్షిణముగాఁ బఱపఁగా చక్రములనుండి రేఁగినదుమ్ము రావణునకును, రామునకు నడ్డముగాఁ గ్రమ్మెను. అంతరావణుఁడు క్రుద్ధుఁడై కన్నులఁ గెంపుగదురఁ దేఱి పాఱంజూచుచు, తనరథమున కభిముఖుఁడై నిలిచియున్న రాముని, బాణములనొప్పించెను. మిక్కిలి తేజోవంతుఁడగురాముఁడు రావణుఁడట్లు ధర్షించుటకు సైఁపక రోషంబున ధైర్యంబును మఱింత పట్టుకొలుపుచు యుద్ధమున మాతలి దెచ్చియిచ్చిన మహావేగంబగు నైంద్రధనుస్సును సూర్యకిరణములంబోని వాఁడిబాణములను గయికొనెను. అంత నయ్యిరువురకును, నొండొంటి కభిముఖములై, యొకటినొకటి వధింపఁగోరి పోరాడుచున్న మత్తిల్లిన సింగములకుంబోలె మహాయుద్ధము ప్రవర్తిల్లినదయ్యె. అంత దేవతలును గంధర్వులును సిద్ధులును మహర్షులును, రావణునినాశమును గోరుచుండువారుగాన, యాయిద్దఱరథికులయుద్ధమును జూడవచ్చిరి. అంత భయంకరములై గగురుఁబుట్టించు

* అప్రదక్షిణముగావచ్చుట వినాశమును సూచించుచున్నదని యర్థము.

చు రావణునినాశమును తన్మూలమున రామునిజయమును సూచించుచున్నట్టి యుత్పాతములు తోఁచినవి. రావణునిరథముమీఁద పర్జన్యుఁడు నెత్తురుగురిసెను. వేండ్రములయిన సుడిగాడ్పు లప్రదక్షిణముగా వీచినవి. గద్దలు పెనుగుంపులుగాఁగూడి యాకాశంబునఁ దిరుగుచు రావణునిరథ మెట్లెట్లుపోవునో యాయామార్గమును వెంబడించిపోవుచుండెను పగటియందుఁగూడ లంకను, దాసానిపువ్వువలె నెఱ్ఱనయిన సంజకెంజాయ గ్రమ్ముటవలన, అది యున్నభూమియంతయు రాత్రియందు మండుచున్నట్లుంబోలె చూపట్టెను. పిడుగులతోడి పెద్దయుల్కలు మహాధ్వనితోఁబడినవి. అవి రావణునికిఁ బ్రతికూలశకునములగుటంజేసి రాక్షసులకు విషాదముగలిగించినవయ్యె. రావణుం డున్నచక్కటిని భూమి కంపమునొందినది. రాక్షసులు యుద్ధమున శత్రులం బ్రహరింపఁబూనినపుడు వారిచేతుల నెవ్వరో పట్టుకొన్నట్లుండెను. సూర్యకిరణములు ఎఱ్ఱగాను పచ్చగాను తెల్లగాను నల్లగాను, రావణునిదేహంబునం బ్రసరించి పర్వతమునందున్న పలువన్నెలు గలగైరికధాతువులవలెఁ జూపట్టినవి. గద్దలువెంటరా నక్కలు, నోళ్ల నిప్పుకలు గ్రక్కుచు రావణుని మొగముచూచి యురవడిగా నమంగళము సూచించుచు నఱచినవి. యుద్ధంబున గాలిరేఁగి రాక్షసరాజగునా రావణునికి కన్నులు తెలియకుండునట్లు దుమ్ములం జల్లుచుఁ బ్రతికూలముగావీచెను. మేఘములు మును లేకయే రావణునిసైన్యమునందంతటను భయంకరములై సహింప నలవిగానట్టి మహాధ్వనితోఁగూడి * యుల్కాశనులుపడినవి. దిశలును విదిశలను అంతటను జీకట్లు గ్రమ్మినవి. దుమ్ములు మిక్కుటముగాఁ గురియుటచేత నాకాశము కన్నెత్తిచూడ నలవిగాదయ్యె. ఆ యుద్ధమున గోరువంకలు బెట్టిదముగా కలహమాడుచు భయంకరముగాఁ గూఁతలిడుచు నా రావణునిరథముమీఁద వందలువందలుగాఁ బడినవి. రావణుని గుఱ్ఱములు, పిఱుఁదుపట్లనుండి యగ్నికణములను నేత్రములనుండి యశ్రువులను నిట్లు అగ్నిని జలమును సమముగా నెడతెగక దొరిఁగినవి. ఇట్లు భయంకరములును వేండ్రములునయిన పెక్కుదుర్నిమిత్తములుతోఁచి రావణునివినాశము సూచించినవయ్యె. మఱియు రామునకుఁగూడ మనోజ్ఞములును శుభోదర్కములు నగుటంజేసి జయసూచకములగు ననేకశుభనిమిత్తము లంతటను గానంబడెను. రాముఁడు తనకు జయసూచకములయిన శుభనిమిత్తములు దోఁచుటంజూచి, మిక్కిలిసంతుష్టుఁడై రావణుఁడు హతుఁడయినట్లు సీతలభించినట్లు తలంచినవాఁడయ్యె. అంతరాముఁడు నిమిత్తముల లక్షణములు చక్కఁగా నెఱింగినవాఁడుగావున, యుద్ధమున తనకొఱకు జయమునుసూచించుచుఁ దోఁచినశుభనిమిత్తములనుజూచి, పులకితుఁడై మిక్కిలియు

---

* ఉల్కాశనులనఁగా 'ఉల్కాశిరసి విశాలానిపతన్తీ వర్ధతేచ తనుపుచ్ఛా, అశనిస్స్వనేన మహతాయుక్తా నృగజాశ్వతరుమృగేషు । నిపతతి విదారయన్తీ ధరాతలం చక్రసంస్థానా' అని మిహిరుఁడు.

సుఖమునొంది యుద్ధమున నధికముగాఁ బరాక్రమించినవాఁడయ్యె. ఇది నూటయేని మిదవ సర్గము.

---

రావణుఁడు రాముని రథధ్వజమును ఛేదింప బాణము విడువఁగా నది యకార్యమునకు నశక్తమై పడుట; రాముఁడు రావణునిరథధ్వజమును ఛేదించుట.

అంత రథారూఢులయినరామరావణు లిరువురకును, నపుడు మిక్కిలియు వేండ్రమై సమస్తలోకములకును భయంకరమయిన యతిక్రూరంపుద్వంద్వయుద్ధము చాలబెట్టిదముగా జరగెను. అంత రాక్షసుల పెనుసేనయు వానరులమహాసైన్యమును, ప్రహారణసాధనము లగు ఖడ్గశిలాదులంగొని సన్నద్ధములయ్యు నాయుద్ధమును జూచు కుతూహలమువలన చేష్టలుమాలి యూరకుండెను. అప్పుడు, రాముఁడును రావణుఁడును బిట్టుగాయుద్ధమునకుఁ బూనుటంజూచి యిరువాఁగువారును మిక్కిలియు యుద్ధమును జూచుటయందు మనసులు దగులువడ నెంతయు నాశ్చర్యమునొంది యుండిరి. ఆ యిరుదెగలసైనికులు, చేతుల నానాప్రహరణములుదాల్చి యుద్ధమునకుఁ దిమురుచుండియు జరుగుచున్న యమ్మహాయుద్ధమును జూచి బుద్ధిని మిక్కిలియాశ్చర్యపడి యొండొరులను దలపడ్డవారు గారయిరి. రాక్షసులసైన్యము రావణునిని,వానరులసైన్యము రామునిని,జూచు చు నద్భుతరసమున తెప్పపాటునుమఱచి కదలకమెదలకుండుటవలన నయ్యిరుదెగలును చిత్తరువున వ్రాయఁబడినటువలెఁ జూడనొప్పెను. రావణుఁడును రాముఁడును నిరువురును తమతమకుఁ దోఁచినదుర్నిమిత్తశుభనిమిత్తములను జూచి తమ కిది యది కలుగునని బుద్ధినిశ్చయమునొంది కోపము పాదుకొన నిర్భయముగాఁ బోరాడిరి. అప్పుడు రాముఁడు జయము తప్పకగలుగుననియు, రావణుఁడు తప్పక మరణముగలుగుననియు, నిరువురును బుద్ధిని నిశ్చయించుకొని, ధైర్యంబూని తమపరాక్రమమునంతయు యుద్ధంబునఁ జూపిరి. అంత వీర్యవంతుఁడగురావణుఁడు,బాణంబులు వింటం దొడిగి, రామునిరథమున నున్నధ్వజముపయిం బ్రయోగించెను. ఆ బాణములు,దేవేంద్రునిరథశక్తిచేఁ గొట్టువడి,యందలిధ్వజమును దాఁకకయే నేలంబడినవి. అంత, వీర్యవంతుఁడగురాముఁడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై వింటి నాకర్షించి రావణుఁడు చేసినదానికి బదులుసేయ మనంబునం దలంచెను. రాముఁడు మహాసర్పమువలె సైఁపరానిదై తనతేజస్సుచే జ్వలించుచున్నట్టి యొక్కవాఁడిబాణమును రావణునిధ్వజముపయిం బ్రయోగించెను. ఆ బాణము,రావణునిధ్వజమును ఛేదించి భూమిని జొచ్చెను.రావణునియారథధ్వజ మట్లు ద్రుంగినదై నేలం ద్రెళ్లెను. మహాబలవంతుం డగు రావణుఁడు, తనధ్వజము నట్లు రాముఁడు తుండించుటనుజూచి యతనియాటోపమునకు సహింపఁజాలకయు కోపము పట్టఁజాలకయు మిక్కిలియు జ్వలించుచున్నయగ్నివలె నెంతయుమండిపడెను. ఆరావణుఁడిట్లు, రోషపరవశుఁడై గొప్ప

బాణవర్షమును గ్రక్కువానివలె, వైచుచు, రామునిగుఱ్ఱములను జ్వలించుచున్న బాణములఁ గాఁడనేసి నొప్పించెను. ఆపచ్చనిగుఱ్ఱము లట్లు బాణములు గ్రుచ్చుకొనియు నెంతమాత్ర మడుగు తొట్రుపడకయు గతి తడఁబడకయు నుండుటయేకాక తామరతూండ్లఁ గొట్టుపడినవానివలె మనస్సునఁ గలంగక స్వస్థములై యుండినవి. రావణుఁ డపుడు తనబాణముల కాగుఱ్ఱములు తొట్రుపడకుండుటను జూచి మీఁదుమిక్కిలియుం గుపితుఁడై, మరల బాణవర్షమును గురిసెను. ఆ రావణుఁడు గదలను నినుపగుదియలను చక్రములను ముసలములను పర్వతశిఖరములను వృక్షములను శూలములను గండ్రగొడ్డండ్లను రామునిపయిఁ బ్రయోగించెను, వింటినుండి గదాదులు పొడముట యెట్లన్నచో ఆ రావణుఁడు వింటినుండి యాశ్చర్యకరం బగుశక్తివలన భయంకరమయి దిక్కుల బెడిదముగాఁ బ్రతిధ్వను లెసంగించుచు నానావిధమై దిగులుగొలుపుచున్న యాగదాదిశస్త్రవర్షమును గురియించెను. అనేక శస్త్రమయ మైనయిమ్మహావర్షము యుద్ధమున రామునిరథమును గుఱిపెట్టి గురిసియు రామబాణములచే వారితమగుటం బట్టి యాతనిరథముపయిని బడక చుట్టుపట్లనున్న వానరసైన్యముపయినంతటను బడెను. అంత రావణుఁ డుత్సాహంబున బ్రుంగుడువడక, మనం బన్యాయత్తంబుగా నీయక, వేలకొలఁదిని బాణంబులం బ్రయోగించి యాకాశమంతయు వేగ నెంతమాత్రము తెఱపిలేనట్లు బాణములచే నిండించినవాఁడయ్యె. రావణుఁ డట్లు యుద్ధాసక్తుఁడై యెంతయుఁ బాటుపడుచుండుటను జూచి రాముఁడు నవ్వుచున్నవాఁడుంబోలె ననాయాసంబున వాఁడిబాణములు వింటసంధించెను. అంత నతండు యుద్ధమున లక్షలకొలఁదిని బాణముల నేయుటయు, రావణుఁడు వానిని జూచి తానును బెక్కుబాణము లాకాశంబంతయు సందులేకుండునట్లుగా నింపునట్టు లడరించెను. అంత నయ్యిరువురు ప్రకాశించుచున్న బాణములను వర్షమువలెఁ బ్రయోగింపఁగా నాబాణపరంపరలు దట్టముగాఁ గ్రమ్మి వెలుంగుచున్న యాకాశము బాణములచే రచింపఁబడిన మఱియొక యాకాశమువలెఁ జూడనొప్పుచుండెను. ఒకబాణముగాని గుఱిలేక వేయఁబడినదిగాదు; కోరినకొలఁదినిమించి గుఱిని భేదింపను లేదు; గుఱిఁదగిలియు వ్యర్థమయినదియుఁ గానరాదు. అట్లద్భుతముగా యుద్ధంబున బాణము లేయుచున్న రామరావణుల బాణములు ఒండొంటిం దాఁకి నేలఁబడినవి. అయ్యిరువురు సవ్యాపసవ్యంబుల నెడతెగక బాణములు పరఁగించుచు నాకాశమంతయు నూర్పువిడుచుటకేని యవకాశము లేకుండునట్లు బాణజాలములు నిండుకొన యుద్ధముగావించిరి. రాముఁడు రావణునశ్వములను గొట్టెను. రావణుఁడు రామునిగుఱ్ఱములను గొట్టెను. ఇట్లపు డిరువురు నొకరు చేసినదానికి మఱియొకరు బదులుచేయుచు నిట్లొండొరులఁ గొట్టుచుండిరి. ఇవ్విధమున నయ్యిరువురును మిక్కిలియుఁ గ్రుద్ధులయి, యద్భుతముగా యుద్ధముగావించిరి. అప్పుడు ముహూర్తకాలము యుద్ధము తుములంబై గగురుఁబుట్టించునంత బెట్టిదముగాఁ జరగెను. అట్లు మహాబలవంతు లగు రామరావణులు వాఁడిబాణముల యుద్ధము సల్పుచుం

దునపుడు రాక్షసేశ్వరుఁ డా రావణుఁడు తనధ్వజమును గూల్చినందులకు రామునిపయి మిక్కిలియుఁ గ్రోధమునొందినవాఁడయ్యె. ఇది నూటతొమ్మిదవసర్గము.

---

ఖండింప ఖండింప మరలమరల మొలచుచున్న రావణశిరస్సులను రాముఁడు నూటయొక్క-మాఱు ఖండించుట.

ఆ యుత్పాతకాలమున యుద్ధభూమి నారామరావణులిరువురును నద్భుతముగా చేయుచున్న యుద్ధమును సమస్తభూతములును మనంబున వెఱఁగుపడి చూచుచుండెను. అమ్మేటిరథముల నారోహించియున్న యయ్యిరువురును నొండొరులయెడం గ్రుద్ధులై నొండొరులను బిట్టుదలపడి, ఒకరినొకరు చంపఁబూని, యొండొరుల నొప్పించుచుండఁగా, వారలరథములు, సారథులు సారథ్యనైపుణమువలన మండలగతులు,వీధిగతులు,* గతప్రత్యాగతులు మొదలగువెక్కు-గతులం జూపుచుండఁగా,మిక్కి-లి భయంకరాకారములయి చూపట్టినవి. రాముఁడు రావణునినొప్పించుచును రావణుఁడు రామునినొప్పించుచును, నిట్లిరువురును నొండొరులపయి నడరించుటయందును మరల్చుటయందును మిక్కి-లియు నురవడింజూపిరి. అయ్యిరువురు నట్లు బాణసమూహములు పరఁగించుచుండఁగా,వారల యమ్మేటిరథములు రెండును యుద్ధభూమియందు,జడివానలుగురియుచున్న మేఘములవలె మెలంగుచుండెను. అట్లు వారుయుద్ధమున తమరథముల నానావిధగతు లట్లుచూపి,మరల వాని నొండొంటి కభిముఖముగానిలిపిరి. అప్పుడు యుద్ధమున గమనము లేకున్నయయ్యిరువురరథములు నొకటికొకటి కాఁడి కాఁడితోను, గుఱ్ఱపుమొగము గుఱ్ఱపుమొగముతోను, పతాకలు పతాకలతోను గలిసియుండునట్లు నిలిచి పొలిచినవి. అంతరాముఁడు వింటినుండి ప్రకాశించుచున్న వాఁడిబాణములు నాలుగింటినేసి తనయశ్వముల కడ్డముగా నున్నరావణునశ్వముల నాలుగింటిని నవ్వలికిఁ దొలంగఁదోలెను. ఆరావణుఁడు తనగుఱ్ఱముల నవ్వలికిఁ దొలఁగించుటకు కోపపరవశుఁడై రామునిపయి వాఁడిబాణములం బరఁగించెను. రాముఁడట్లు బలవంతుఁ డగురావణునిచే మిక్కి-లియు నొప్పింపఁబడియు వ్యథగాని వేదన సూచించు ముఖవికారముగాని యెంతమాత్రమును బొందఁడయ్యె. అంత రావణుఁడు, దేవేంద్రునిసారథి యగుమాతలిపయి పిడుగుపాటుచప్పుడుంబోలె మహాధ్వని గలబాణంబులను బ్రయోగించెను. ఆయుద్ధంబున నాబాణములు మహావేగంబున మాతలిదేహమునఁ గాఁడియు నతనికిఁ గొంచెమేని తెలివిదప్పుటగాని నొప్పిగాని కలుగదయ్యె. రాముఁడు రావణుఁడు తన్నునొప్పించుట కంతకోపము నొందలేదుగాని, మాతలి నట్లు ధర్షించినందులకుమాత్రము మిక్కి-లి క్రుద్ధుఁడై బాణసమూహములు పరఁగించి యుద్ధంబున నతనినిఁ దనయెదుటనిలువలేక కొంత తొలఁగునట్లుగావించెను.

---

* గతమనఁగా శత్రురథమునుగూర్చి పోవుట. ప్రత్యాగతమనఁగా మరల నిజస్థానమునకువచ్చుట.

వీరుండగు రాముఁడు, అంత బాణములను నిరువదింటిని ముప్పదింటిని, అఱువదింటిని వందలకొలదిని, వేనవేలుగను, నిట్లు పలువిధములుగ రావణుని రథమువయి నడరించెను. అంత రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు రథమున నిశ్చలుఁడై యుండి, క్రుద్ధుఁడై గదలను ముసలములను వర్షించి యుద్ధంబున రాముని బదులునకు నొప్పించెను. అంత నయ్యుద్ధము మిక్కిలి పెచ్చుపెరిఁగి తుములమై గగురుపుట్టించునంత భయంకరమై చెలఁగెను. గదలయు ముసలములయు పరిఘములయు నొరపిళ్లవలని ధ్వనులకును బాణముపింజలపాటులకును, సప్తసాగరములును ఘూర్ణిల్లినవి. అట్లు సప్తసాగరములు క్షోభిల్లుటయు పాతాళతలవాసు లయినయురగులును దానవులును వేలకొలఁదిని నందఱును వ్యథితులయిరి. పర్వతములతోను వనములతోనుంగూడ భూమియంతయుఁ జలనమునొందెను. సూర్యుండును కాంతిహీనుండయ్యె. వాయువును వీవఁడయ్యె. అంత దేవతులును గంధర్వులును సిద్ధులును గిన్నరులును, మహోరగులును పరమర్షులును, నందఱును చింతనొందిరి. దేవతలును ఋషిగణములును 'గోవులకును బ్రాహ్మణులకును క్షేమంబగుఁగాక. లోకములు శాశ్వతముగా నుండుఁగాక. రాముఁడు యుద్ధమున రాక్షసరాజును రావణుని జయించుఁగాక' అని జపముగావించిరి. ఇవ్విధంబున నపుడు దేవతలును మహర్షులును జపము సేయుచు, మహాభయంకరమై గగురుఁబుట్టించుచున్న రామరావణయుద్ధమును జూచుచుండిరి. గంధర్వులును అప్సరసలును, గుంపులుగట్టి యసమానమైనయమ్మహాయుద్ధమును జూచి. 'ఆకాశమువంటిది ఆకాశమే. సముద్రమునకుసాటి సముద్రమే. అట్లు రామరావణయుద్ధమునకుసాటి రామరావణయుద్ధమే కాని వేఱొకటి కాదు' అని యిట్లు పలుకుచు మరల నా రామరావణయుద్ధమును జూచుచుండిరి. అంత రఘుకులకీర్తివర్ధనుం డగు మహాబాహుఁడు రాముఁడు క్రుద్ధుఁడై క్రూరసర్పముంబోని క్షురాగ్రబాణమును వింటసంధించి కాంతిం దళుక్కొత్తుచు కుండలములచే వెలుంగుచున్న రావణునిశిరమును ద్రుంచెను. అప్పుడాశిరస్సును నేలంబడఁగా ముల్లోకములును జూచినవి. ఆశిరస్సువంటిదే మఱియొకశిరస్సు రావణునకు మొలచెను. అట్లు రావణునికి మొలచిన యారెండవశిరస్సును రాముఁడు కార్య మతివేగముగఁ జేయువాఁడుగాన హస్తలాఘవం బుఱువడింప యుద్ధంబున శీఘ్రముగా బాణములం దుంచివేసెను. ఆశిరస్సును దుంచినమాత్రలోనే మరల మఱియొకశిరస్సు కనఁబడినది. ఆశిరస్సును గూడ రాముఁడు వజ్రసమానములయిన బాణముల ఖండించెను. ఇట్లు శిరస్సులొక్కటివలెనే మఱొక్కటి కనుపట్టుచు మొలచుచుండఁగా నూటయొక్కశిరస్సులను రాముండు నూటయొక్కమాఱు ఛేదించినను రావణుని ప్రాణములు నశించునని నిశ్చయమేమో తోఁపదయ్యె. అంత సర్వాస్త్రవిదుండును బహుదివ్యబాణయుక్తుండును కౌసల్యానందవర్ధనుండును వీరుండు నగు రాముఁడు మనంబున 'మునుపు మారీచు నేబాణములఁ జంపితినో, ఏబాణముల ఖరదూషణులను వధించితినో, మఱియు దండకారణ్యమున విరాధునిని,

క్రౌంచావనమునఁ గబంధుని నేబాణంబుల రూపుమాపితినో, ఆబాణములన్నియు యుద్ధంబున నెప్పుడును వ్యర్థములుగాక శత్రువును దప్పక వధించునవిగా నేను నమ్మియుండునట్టివి. ఇట్టిబాణములన్నియును రావణునందు నల్పశక్తిగలవై వ్యర్థములగుటకుఁ గారణమేమియో తెలియకున్నది'యని చింతాకులుఁడయ్యెను. ఇట్లు రాముఁడు చింతాపరుఁడయ్యు, యుద్ధమున నెంతమాత్రము పరాకువడక, రావణునివక్షముపై బాణవర్షములుగురిసెను. అంత రథస్థుం డగురాక్షసేశ్వరుఁడు రావణుఁడు కుపితుఁడై యుద్ధమున రామునిపైఁ గదలను ముసలములను వర్షించి నొప్పించెను. అట్లు రామరావణులు త్రికూటపర్వతశిఖరాగ్రమున నొండొరుఁదాఁకిపోరుచు నాగ్రహావశమున రథసహితులై యాకాశమున కెగసియు, నేలకుడిగ్గియుఁ బోరఁగా నాయుద్ధము మిక్కిలి వెచ్చువెరిఁగి యాకాశముననుభూమిని త్రికూటపర్వతశిఖరముననును తుములమై చూపఱకు గగుర్పుఁబుట్టించుచుం బ్రవర్తించినదయ్యె. దేవతలును, దానవులును, యక్షులును, పిశాచులును, నురగులును, రాక్షసులును, జూచుచుండఁగా నమ్మహాయుద్ధము *రేయుంబవలు, నెడతెగక జరిగెను. రాత్రియందుఁగాని, పగటియందుఁగాని, యొకముహూర్తమాత్రముగాని, క్షణకాలముగాని, రామరావణులయుద్ధము విరామమొందినదిగాదు. దశరథకుమారుఁడు రాముఁడును రాక్షసేశ్వరుఁ డగురావణుఁడు నట్లు యుద్ధము చేయునపుడు రాముని కింకను జయముగలుగకుండుటం జూచి మహాబుద్ధిమంతుం డగునింద్రుని రథసారథి యగుమాతలి యుద్ధము సేయుచున్న రామునిం జూచి వేగిరపడి యిట్లని పలికెను. ఇది నూటపదియవ సర్గము.

---

## రాముఁడు బ్రహ్మాస్త్రమున రావణుని వధించుట.

అంత నపుడు మాతలి, రామునిఁజూచి 'వీరా! నీవేమియుఁ దెలియనివాఁడుంబోలె వీనివలె నస్త్రమునకుఁ బ్రత్యస్త్రము వేయుచుమాత్రమే యున్నావేమి? ప్రభూ! వీఁడు మనుష్యునిచే వధింపఁబడునని దేవతలు చెప్పినకాల మిపుడువచ్చినది. కాన వీని వధమునకై వీనిమీఁద నిపుడు బ్రహ్మాస్త్రమును బ్రయోగింపుము.' అని రామునకు రావణుని వధమునకై బ్రహ్మాస్త్రము వేయుటను దలఁపించినవాఁడయ్యె. అట్లు మాతలి చెప్పినమాటచే యుద్ధంబున మహావీర్యశాలియగురాముఁడు స్మరణకుఁ దెచ్చుకొని ధగధగ మెఱయుచున్నదై రోఁజుచున్న సర్పమువలెఁ జూపట్టు నాదివ్యాస్త్రమును దీసికొన్నవాఁడయ్యె. భగవంతుఁడును వీర్యవంతుఁ డునగు నగస్త్యమహర్షి మొదట బ్రహ్మదత్త

---

* ఇట 'సర్వరాత్రమహర్తః' అని మూలము. 'సప్తరాత్రమహర్తః' అనియుం బాఠములదుగాని మీఁదటిదినముల లెక్కకు విరుద్ధముగాన యిది యొప్పదు. లేక యిదియే యొప్పనముగా నచ్చును ఎట్లన, ఫాల్గునచతుర్దశియందు హనుమంతుఁడు లంకఁగాల్చుట. పున్నమయందు రాముఁడు సముద్రతీరమును జేరుట. ప్రథమాద్వితీయాతృతీయలందు వర్ధశయనము అష్టమియందు సువేలారోహణము నవమియందు యుద్ధారంభము. అమావాస్యయందు రావణవధముగాన సప్తరాత్రమనుట చెల్లుచున్నది.

మును యుద్ధంబున నమోఘము నయినయమ్మహాబాణమును, రామునకొసంగెను. ఇది యమితతేజుండగు బ్రహ్మచే మున్నింద్రునికొఱకై నిర్మింపఁబడినది. ఆబ్రహ్మ,ముల్లోకములను జయింపఁగోరుచున్నయింద్రునకు మున్నట్లునిర్మించి దీనినొసంగెను, దీనితెక్కలందు వాయుదేవుఁడును,అలుఁగునందు సూర్యాగ్నులును,నధిదేవతలై యుందురు.దీనిశరీరము మధ్యభాగమాకాశమయమై దానింబోలెవ్యాప్తిసమర్థంబై యుండు.అది మేరుమందరపర్వతములుంబోలె గురుత్వమును ప్రజ్వరిల్లుచున్నయాకారమును గలిగి మంచిపింజతోఁగూడి బంగారుచే రంగారుచుండెను అది సర్వభూతములసారాంశములు గ్రహించి నిర్మింపఁబడినదై సూర్యునివలెఁ దేజరిల్లుచు, పొగతోఁగూడినప్రళయకాలాగ్నివలెను, ప్రజ్వలించుచున్నక్రూరసర్పమువలెను జూపట్టుచుండెను. అది శత్రువులగజాశ్వసమూహములను నతిశీఘ్రమున ఛేదించునది. వానినేకాదు. శత్రుపురద్వారములను పరిఘములను పర్వతములనుంగూడ భేదింపఁజాలునది. అది పలువిధము లయినరాక్షసులనెత్తుటం దడిసి,మేదస్సునఁబ్రుంగి, మిక్కిలియుబెట్టిదమై, వజ్రమునవలె మిక్కిలియు దృఢమై మహాధ్వని నెసంగించుచు నానావిధములయినకపటయుద్ధంబులనుగూడ రూపడంచుచునుండును.అది భయంకరమై యెల్లవారికి బెదరుపుట్టించుచు, నిట్టూర్పుసర్పముంబోలి, కంకపక్షులకును గృధ్రములకు వశములకును, నక్కలగుంపులకును, రక్షోగణములకును నిత్యమును యుద్ధంబుల నాహారమునొసంగునది; యుద్ధంబుల యమునింబోలి భయంకరమై యుండును. వానరవీరులకెల్ల నది సంతోషమును, రాక్షసులకు వినాశమును గలిగించునదై సొగసయి చిత్రములయి పలువిధము లగుగరుత్మంతుని తెక్కలుగట్టంబడియుండెను. అది సమస్తలోకములలో నుత్తమంబగు బాణమై యిక్ష్వాకులవంశ్యులకెల్ల భయంబునుబోఁగొట్టుచు, శత్రువులకీర్తి నపహరించుచు, రామునకు మిక్కిలియు హర్షముగలిగించునదై యుండెను. మహాబలసంపన్నుఁడగు రాముఁడట్టి దివ్యాస్త్రమును దీసికొని వేదోక్తమగువిధానమున నభిమంత్రించి వింటసంధించెను. రాముఁడమ్మహాబాణమును వింట సంధించుచుండఁగా,సర్వభూతములును దిగులొందినవి. భూమియు వడంకెను, రాముఁడు మిక్కిలియుక్రుద్ధుఁడై బలంబుకొలఁదిని బిట్టుగా వింటి నాకర్ణాంతముగాలాగి, మర్మముల ఛేదించునమ్మహాబాణమును మిక్కిలియెచ్చరికమెయి రావణునిమీఁదఁ బ్రయోగించెను. అమ్మహాబాణము, దేవేంద్రునిబాహువునుండి విడఁబడ్డవజ్రాయుధమువలెఁజెనకరానిదై, కల్పాంతయమునికైవడి వారింపరానిదై రావణువక్షమునఁ గాఁడెను. మహావేగంబై శత్రుదేహముల రూపుమాపునబ్బాణము,విడివడి,దురాత్ముఁడగురావణునివక్షముదాఁకి వీపున నుచ్చికొనిపోయెను. ప్రాణనాశకరమయినయబ్బాణము, రావణుఱొమ్మును దూసికొని వేగమున నతనిప్రాణములు హరించి నెత్తుటఁదోఁగినదై వెలువడి భూతలమును బ్రవేశించినది.అది రావణునివధించి నెత్తుటం దడియుటచే కాంతియొట్టినదై తొలఁక పంచినకార్యమును జేసితీర్చినదగుటం జేసి యడఁకువతోఁగూడినదియుంబోలె, మరలఁ దనపొదికివచ్చి చొచ్చినదయ్యె. అట్లురావ

ణుఁడు హతుఁడై ప్రాణములను జీవితమును దొఱంగుచుండఁగా, నతనిచేతనున్నవిల్లు, పట్టువదలి వేగ బాణముతోఁగూడ నేలంబడెను. భయంకరమైనయురవడియు, మహాతేజంబును గలరాక్షసేంద్రుఁడా రావణుఁడు, ప్రాణములు వెడలఁగానే, వజ్రాయుధముచే హతుఁడగువృత్రుఁడుంబోలె రథమునుండి నేలంగూలెను. అంత హతశేషులగు రాక్షసులు రావణుఁడు పడుటం జూచి, తమనాథుఁడు హతుఁడగుటవలన బెదరుగదిరి నలుదిక్కులకును బాఱిపోయిరి. వానరులును వృక్షహస్తులై సింహనాదములు సేయుచు నారాక్షసులం దఱిమిరి. ఆ రాక్షసులు రావణుఁడు హతుఁడగుటయు రాముఁడు జయమునొందుటయును జూచి, వానరు లుబ్బున వెనుదగిలి నొప్పింపఁగా, ప్రాపులేనివారగుటం జేసి, ముఖంబుల కన్నీరుచిప్పిల్లుచు చూచువారికి జాలిపుట్ట, భయమున లంకాభిముఖులయి పాఱిరి. అంత జయశాలు రగువానరులు మిక్కిలియుబ్బునొంది రాముని విజయమును రావణునివధమును నుగ్గడించుచు సింహనాదములు సేసిరి. అంత నాకాశమున మంగళకరముగా దేవదుందుభి మ్రోసెను. అచట వాయువు దివ్యగంధములం దాల్చి సుఖముగా వీచెను అప్పు డంతరిక్షముననుండి, రామునిరథముపయి నంతయు పువ్వులనించుచు దుర్లభం బగుపువ్వులసోన మనోహరముగఁ గురిసెను. భూమియందు వానరులు సేయుస్తోత్రములే కాక యాకాశమునందును మహాత్ములగుదేవతలు, రాముని పలువిధంబులఁ బొగడుచు, బాగుబాగని కొనియాడుమేలివాక్యమును భూమియందు వినఁబడెను. క్రూరుఁడును సమస్తలోకభయంకరుండు నగురావణుండు హతుఁడగుటయు, దేవతలును చారణులును మిక్కిలియు సంతోషావేశమునొందిరి. అంత రాముఁడు రాక్షసేశ్వరుని రావణుని వధించి తానును సంతుష్టుఁడై తనరాజ్యము గొన్నసుగ్రీవుఁడును యౌవరాజ్యము నొందినయంగదుఁడును ప్రత్యుపకారము సేయుటకు రావణునివధము గోరుచుండినవారుగాన, వారినిని గోర్కె యీడేఱినవారిని గావించెను. అంత దేవతలెల్లను గలంకమాని ప్రసన్నతనొందిరి. దిక్కులు తేటలయ్యెను. ఆకాశము నిర్మలమయ్యెను. భూమి కంపింపకయ్యె. వాయువు వీవఁదొడఁగెను. సూర్యుఁడు స్థిరముయినకాంతితో వెలింగెను. అంతనపుడు సుగ్రీవుఁడును విభీషణుఁడు మొదలగువారును, మఱియు జాంబవంతుఁడు మొదలయిన సుహృదులును, లక్ష్మణసహితముగాఁ జేరి, రాముఁడుయుద్ధంబున జయమునొందుటకు సంతుష్టులై, యంగదునిఁగూడి, జయలక్ష్మిచేమనోహరముగా వెలుంగుచున్న రాముని యుక్తప్రకారంబునం బూజించిరి. మహాతేజుండును రఘుకులరాజుల కానందకరుండు నగునా రాముఁడు, యుద్ధమున శత్రువునువధించి ప్రతిజ్ఞ నెఱవేర్చి, తనజనములచేతను సైన్యములచేతను బరివృతుఁడై దేవగణములచేతఁ బరివేష్టితుండగు దేవేంద్రునివలెఁ బ్రకాశించెను.*ఇది నూటపదునొకండవసర్గము.

* ఫాల్గునపుఅమమాస్యయందు రావణవధము. లేక 'సర్వాహోరాత్ర' మని యుద్ధము రేయుంబవలును వర్తించె నన్నచో అమావాస్యశేషించియున్న చైత్రశుద్ధ పాడ్యమి ప్రాతఃకాలమున రావణవధమని తెలియునది. గోవిందరాజులు.

భ్రాతృవధమునకై దుఃఖమున విలపించుచున్న విభీషణుని రాముఁడాశ్వాసించుట.

రామునిచేఁ బరాజితుఁడై హతినొంది యుద్ధభూమిం బడియున్న యన్నను జూచి, విభీషణుఁడు దుఃఖోద్రేకము మనంబునఁ బయికొన నిలువక విలపించువాఁడై 'వీరా ! నీవు మహాపరాక్రమశాలివే ! మహాప్రసిద్ధుఁడవే ! సమస్తశాస్త్రముల శిక్షితుఁడవే! రాజనీతిం బండితుఁడవే ! లోకోత్తరమయిన శయ్యాపయిం బవ్వళింపఁదగినవాఁడవే ! ఇట్లు హతుడవై యిపుడు, బాహుపురులచే నలంకృతములయి యున్న దీర్ఘభుజములను యిట్టటు గదలకుండఁ జాఁచి, రథమునుండిపడఁగాఁ గొంచెముపట్టుతొలఁగి సూర్యునివలెఁ దేజరిల్లుచున్న కిరీటముతో, నేలంబరుండియున్నా వేమి? వీరా ! నేను మున్నే నిగలుగునని చెప్పితినో యామాట నున్మథమోహాక్రాంతుఁడవగుటం జేసి నీకు రుచింపక పోయినది. ఆమాట వొప్పననే యిదిగో నాఫల మనుభవించితివి. సీతనపహరించినంతటి మహాపాపకర్మమును గావించి ప్రహస్తుఁడుగాని యింద్రజిత్తుగాని యితరరాక్షసులుగాని, కుంభకర్ణుఁడుగాని యతిరథుం డగునతికాయుఁడుగాని నరాంతకుఁడుగాని నీవు నీయంతటఁగాని కావరమున నెంతమాత్రము నరకుసేయుదురై తిరి. అందులకు ఫలమిదిగో ప్రాప్తమయినది. సమస్తనీతులకు సేతువగు (మర్యాదయగు) వాఁడు గతించెను. ధర్మము యొక్క రూపమైనవాఁడు గతించెను. బలంబుల వెనుఁగుప్పయైన వాఁడు గతించెను. సకలస్తోత్రములకును విషయమైనవాఁడు గతించెను. ఆయుధధారులలోనెల్ల మేలుబంతి యగువీరుఁడితఁడు నేలంబడుటవలన, సూర్యుఁడు భూమింబడినట్లయ్యె. చంద్రుఁడు చీఁకటిలో మునిఁగినట్లయ్యె. అగ్ని సెగచల్లారినట్లయ్యె. ఇఁక నింతటివాఁడు లేనందున యుత్సాహశక్తియె, ఆశ్రయము లేక వ్యాపారముడూలినదయ్యె. రాక్షససింహుఁడు యుద్ధంబున హతుఁడై దుమ్ములబ్రుంగుచు నిదురించినట్లుండఁగా నిట్టిమహావీరుని గోలుపడ్డ ప్రపంచమునందు నిఁక నేమిమిగిలియున్నది? ఏమియు లేదు. సమస్తము శూన్యముగానే తోఁచుచున్నది. ధైర్యమె చిగురుగాను, సహనమె * మేలిపువ్వుగాను, తపమే దార్ఢ్యముగాను, శౌర్యమే దృఢమయినవేరుగాను గలదై మిక్కిలిగొప్పది యగురావణుఁడనువృక్షమును యుద్ధమునరాముఁడను వెనుగాలి విఱిచివైచెను. † పరాక్రమమే విషాణముగాను, పితృపితామహాదివర్గమే వెన్నెముక

* వృక్షమునకు చిగురువలె ధైర్యమే మొదటిఫలము. పండునకు పువ్వువలె ప్రసహనమే కార్యమునకు అవ్యవహితమైన హేతువు. కాన రావణవృక్షమునకు ధైర్యముచిగురుగాను సహనము పువ్వుగాను నిరూపింపఁబడినవి. శౌర్యమువలననే తపస్సు మొదలగునవి గలుగునుగాన శౌర్యముమూలముగాఁ జెప్పఁబడినది.

† విషాణము పరమర్మములను భేదించునట్లు తేజస్సును భేదించునుగాన తేజస్సు ఇట విషాణముగా రూపింపఁబడినది. వంశముచే (వీఁపుచే) ఆశ్రితులను ధరించునట్లె కులముచేతను ధరించుటచే కుల

గాను, కోపమే తలతప్ప తక్కినశరీరముగాను, అనుగ్రహమే హస్తముగాను, గల రావణుండను మత్తగజము, రాముం డనుసింహముచేఁ బట్టుకొనఁబడి హతమై నేలంబడినది. పరాక్రమోత్సాహములు విజృంభించిన జ్వాలలుగా,నిట్టూర్పు ధూమముగా, నిజబలమే వేడిమిగా, మహాతేజముగలిగి, వెలుఁగు రావణుం డనునగ్నిని యుద్ధమున రాముఁడనుమేఘము చల్లార్చెను. రాక్షసులే * వాలమును మూఁపురమును గొమ్ములునుం గాఁగలిగి,శత్రులను గెలుచునదై శత్రుల పొడవడంచుటయందు ముఖ్యమై(గర్వంబున మదపుటెనుంగుబోలి)విషయచాపలమె చెవులును గన్నులునుగాఁగలిగియున్న రావణుం డనునాఁబోతుగూడ,రాముఁ డనువ్యాఘ్రముచే హతమైకూలెను' అని విలపించెను. అట్లు శోకావేశంబున యుక్తియుక్తంబు లగువాక్యములు చెప్పుచు నర్థమిట్టిదని పరామర్శించి నిశ్చయించి తెలిసినవాఁడగు విభీషణునిం జూచి రాముఁడు 'ఈ రావణుఁడు పరాక్రమముచూపక పిఱికివలె నశింపలేదు.యుద్ధంబున ప్రచండమయిన పరాక్రమమున మిక్కిలి యున్నతం బయినయుత్సాహమును నెఱపి నిర్భయముగా నేలంగూలినాఁడు. పరలోకవృద్ధిం గోరుచు, శూరధర్మమునఁ దప్పకనిలిచి యిట్లు యుద్ధమున నిర్భయులై హతులయినవారినిగుఱించి దుఃఖింపరాదు. యుద్ధమున దేవేంద్రసహితములయిన ముల్లోకములు నెవ్వనికి వెఱచునో, అట్టి పరాక్రమబుద్ధిసంపన్నుఁడగు రావణుఁడు కాలధర్మమునొంది వీరస్వర్గమునకుఁ బోయినపుడు దుఃఖించుట యుక్తముగాదు. 'మరణమన్న దుఃఖింపకుండనగునా' యందువా? యుద్ధమునందు జయమేకలుగునని నియమ మింతవఱకెప్పుడును గలిగినదిలేదు. వీరుండగువాఁడు యుద్ధమున శత్రువులనయిన వధించును. శత్రువులచే తానైనను హతుఁడగును. అతనికి రెండు సమములే. క్షత్రధర్మ మాలోచింపుము. ఇట్లు యుద్ధంబున హతుఁడై వీరస్వర్గమునొందుట పూర్వులయిన పెద్దలచే నుపదేశింపఁబడినదే. మఱియు క్షత్రియులకెల్ల నభిమతమయినదే. యుద్ధమున హతుఁడయిన శూరునిగుఱించి, యతఁడు వీరస్వర్గమునొందుటంబట్టి యెంతమాత్రము దుఃఖింపరాదని శాస్త్రనిర్ణయము. అట్లగుటం జేసి శాస్త్రనిశ్చయ మిట్టిదని యెఱింగి పుట్టినవారికి మరణముదప్పదను పరమార్థబుద్ధిగలిగి శోకంబుమాలి,యిఁకమీఁద నేకార్య మనుష్ఠింపవలయునో దానినిగుఱించి యాలోచింపుము' అనెను. అట్లు పరాక్రమవంతుఁ డగురాజకుమారుఁడు రాముఁడు పలుకుటయు, నవ్విభీషణుఁడు శోకసంతప్తుఁడై తనయన్నకు వెంటనే చేయవలసిన హితమునుగుఱించి రామునితో 'సముద్రము చెలియలికట్టను దాఁకి భగ్నమగునట్లు, ఇపుడు యుద్ధమున నిన్నుఁదాఁకి, భగ్నుఁడయిన యీరావ

---

ము వంశముగా రూపింపఁబడెను. తలతప్పఁ దక్కినదేహము పెక్కువిధములుగ నుండుటచే కోపమును పెక్కు అగుటచే అది అపరగాత్రముగా రూపితము. హస్తముచేత కోరినది యిచ్చునట్లు ప్రసాదము చేతను నిచ్చుటచేనది హస్తముగాఁ బోల్పఁబడెను.

* రాక్షససమృద్ధి గర్వహేతువగుటచే గర్వహేతువులగు లాంగూలాదులుగా రూపితమైనది.

ను డింతకుమునుపు దేవేంద్రునితోఁగూడ దేవతలెత్తివచ్చినను యుద్ధంబులం బరాజయుంబెఱుంగఁడు; కాన మహావీరుఁడు. ఇతఁడు పెక్కుదానములు చేసినాఁడు; గురుదేవతాదులం జక్కఁగాఁ బూజించినాఁడు; సమస్తభోగముల ననుభవించినాఁడు; భృత్యులను జక్కఁగాఁ బోషించినాఁడు. మిత్రులకు యథేష్టముగా ధనములొసఁగినాఁడు; శత్రువులందు పగతప్పక తీర్చిపుచ్చినాఁడు; కానధర్మశీలుండునగును. మఱియు నితఁడు ఆహితాగ్నియై యగ్నిహోత్రము తప్పక వేల్చుచుండినవాఁడు, మహాతపస్సంపన్నుఁడు, వేదాంతములు నెఱింగినవాఁడు, మిక్కిలియుఁ గర్మశూరుఁడు. ఇట్లు మహాశూరత్వాదిలక్షణములుగలిగి సంస్కారార్హుం డయినయితఁడు ప్రేతత్వమునొందఁగా నితనికిఁ జేయువలసిన యార్ధ్వదైహికమును, నీ ప్రసాదమునొంది చేయఁగోరుచున్నాను' అనెను. అట్లువిభీషణుఁడు జాలిగొలుపునట్టి మాటలాడి, చక్కఁగా బోధింపఁగా మహాత్ముండును నతిబలవంతుఁడు నగు రాజకుమారుఁడు రాముఁడు రావణునకు స్వర్గమునకై హితమగు సంత్యేష్టికర్మమును గావింప నియోగించువాఁడై .'మరణపర్యంతమే వైరమువర్తించును; కాని యటమీఁద నైరమువలనఁ బనయేమి * మనకార్యమును

* ఈశ్లోకము 'మరణాన్తాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్। క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథాతవ' అనియూలము. ఇట 'నిర్వృత్తం నః' అనుచో 'నః' అనునక్షరముచే గాయత్రి యిరువదియవ యక్షరమగు నకారము గ్రహింపఁబడినదిగాన యిరువదవ శ్లోకసహస్రి మారంభించెనని తెలియునది. దీనికి విశేషార్థము. (మరణాన్తానివైరాణి) ఋషిజనస్థానధ్వంసము సీతాహరణము మత్పాిణభూతుఁ డయినజటాయువు నఱుమాడుట మొదలుగా నాయెడల ద్వేషము నాచరించుపను లిఁక మీఁద చేయఁజాలఁడుగదా యనిభావము. (నిర్వృత్తం నః ప్రయోజనమ్) మన ప్రయోజనము నెఱవేఱినది. 'యదివా రావణస్స్వయం' 'రావణుఁడువచ్చినుగాని వోడ్కొనిరమ్ము' అనిచెప్పిన నేను, ఇతనివిషయమందు ఏదేని మంచిచేయవలయునని మనస్సునఁ దలఁచియుంటిని. కాని యితఁడు 'ద్విధాభజ్యేయమప్యేవం న నమేయంతు కస్యచిత్' 'రెండుతుంచెములయిన నగుదునుగాని యొక్కనకు నెవ్వనికిని లొంగను' అనిచెప్పి చలముపట్టుటచే నేనుతలంచిన మంచిచేయుటకు లేకపోయినది. దానిని చేయుటకు నిపుడు సమయముదొరకినది. (క్రియతామస్య సంస్కారః) ఇప్పుడు మృతుఁడైయున్నాఁడు. మునుపటివలె నేను జేయు మంచికి అడ్డిచేయ నేరని యవస్థ యితనికి కలిగినది. కాఁబట్టి యిట్టియవస్థయం దితనిని విడువరాదు. ఇటమీఁద చేయువలసినదేదో దాని నితనికిఁజేసియే తీఱవలయును. (మమాప్యేష యథాతవ) (ఏష యథా తథా తవాపి) 'ఈతఁడు నాకెట్లో యట్లె నీకును' అనియర్థము. మృతుఁడై నేనుజేయు మేలునకు నడ్డుచేయలేనివాఁడగుటచే నితఁడు నాచిత్తమున కనుకూలుఁడయినాఁడు. కాఁబట్టి నామిత్రుఁడగు నీవును నితని ననువర్తింపవలయునని భావము. లేక (ఏష తవ యథా తథా మమాపి) 'ఇతఁడు నీకెట్లో యట్లె నాకుఁగూడ' ననియర్థము. ఇతనిసంస్కారము నీకెట్లు ప్రాప్తమో యట్లె నాకును ప్రాప్తము అనిభావము. నీ వితనిరోషమునఁజూచి యితనికి సంస్కారముచేయవేని నేనేచేయుచున్నాను. బంధువులలో ఎవరైనను దీనిని జేయవలయునుగదా. కాఁబట్టి నీవు దూరమున నుండుము. నేనేచేయుచున్నాను (మమాప్యేష యథాతవ) నాకు భ్రాతయగు నీకు భ్రాతయగుటచే యితఁడు నీకెట్లు భ్రాతయో యట్లె నాకును భ్రాతగాన నీవు సంస్కారము చేయవేని నేను చేసెదననియు భావము. గోవిందరాజులు.

నెఱవేఱినది. ఇఁక నితనికి సంస్కారము గావింపుము. ఇతఁడు నీకెట్లుతోఁబుట్టువో యట్లే యిఁక నాకునుతోఁబుట్టువే కాని వేఱుగాఁడు' అని చెప్పెను. ఇది నూటపండ్రెండవసర్గము.

---

### { రావణుభార్యలు మృతుం డయినపతినిజూచి రోదనము సేయుట. }

మహాత్ముఁ డగురామునిచే రావణుఁడు హతుఁడయ్యెనని విని రావణుని భార్యలయిన రాక్షసకామినులు, శోకంబున స్రుక్కుచు, ఎవ రెంతవారించినను నిలువక, నేలదుమ్ములంబడి పొరలుచు, తలవెండ్రుకలు విరియఁబోసికొని, దూడలు పోయిన గోవులపగిది దుఃఖంబునం బొక్కుచు నంతఃపురమునుండి వెడలివచ్చిరి. ఆరాక్షసస్త్రీలు రాక్షసులతోఁగూడ నుత్తరద్వారమున వెడలి, భయంకరమగు యుద్ధభూమిని బ్రవేశించి హతుఁ డగుతమపతిని గలయవెదకుచు 'రాజపుత్రా'! యని రామునిని, 'నాథా' యని రావణునినిబేర్కొని విలపించుచుఁ, గబంధములచే చిహ్నితమై నెత్తురుబురదలతోఁ గూడియున్న యుద్ధభూమినంతటను దిరిగిరి. ఆస్త్రీలు, భర్తృమరణమువలని శోకముచే మిక్కిలియు గ్రుంగుడుపడి, కన్నుల గవలనిండఁ గన్నీరొలుక, రోదనముసేయుచు యూథపతి మరణించిన యాఁడు గజములవలె బిగ్గఱ నఱచిరి. వారు, మహావీర్యశాలియు, మహాకాయుఁడును మహాతేజుండును నై నల్లనికాటుకరాశివలె నుల్లసిలుచు హతుండై భూమింబడి యున్న పతిని రావణునిం జూచిరి. అంత నక్కాంతలు, యుద్ధభూమిని దుమ్ములను బ్రుంగి పరుండి యున్నప్రాణేశ్వరునిఁ జూచి వివశలయి, త్రెంపఁబడ్డ యడవితీవియలవలె నతని యవయవములపయి గొబ్బునఁబడిరి. ఒకానొక చెలువ, ప్రేమాతిశయమున నారావణుం గౌఁగిలించుకొని రోదనముచేసెను. మఱియొక్కతి, యడుగులం బక్కఁబడియు, మఱియొక్కతి కంఠమును నాలింగనము సేసికొనియు విలపించెను. ఒకపడఁతి, పతిబుజములనెత్తికొని భూమిని బొరలాడెను. మఱియొకలలన హతుండగు నాథునిమొగమును జూచి సొమ్మసిలెను. ఒకానొకతరుణి, తనప్రియునిశిరస్సును నొడియం దిడుకొని యతనిమొగమును దేఱిచూచుచు, మంచునీళ్లచే తామరపువ్వుం బోలె, కన్నీళ్లచే దానిం దొప్పఁదోఁచుచు రోదనముగావించెను. ఇట్లాస్త్రీలందఱు, హతుఁడై రణభూమిని బడి యున్నతమపెనిమిటిని రావణునిఁజూచి, యార్తలయి రోదనముచేసిరి. మఱియు శోక మంతకంత కగ్గలముకాఁగా పరవశలయి యతనినిగూర్చి 'ఎవ్వనికి దేవేంద్రుఁడు వెఱచునో, ఎవ్వనికి యముఁడు భయపడునో, ఎవ్వఁడు కుబేరునిజయించి యతని పుష్పకవిమానమును దీసికొనెనో, మఱియు నెవ్వనివలన గంధర్వులును మహర్షులును మహాప్రభావులగు దేవతలును మిక్కిలియు భయము నొందిరో, యట్టిమహావీరుఁ డితఁ డిపుడు యుద్ధంబున హతుండై నేలంబడియున్నాఁడే!

అసురులవలనఁగాని సురలవలనఁగాని, యురగులవలనఁగాని, యెవ్వఁ డెంతమాత్రము భయమనుమాట యెఱుఁగఁడో యట్టిశూరున కిపు డొక మనుష్యునివలన భయము గలిగెనుగా! ఎవ్వనిని దేవతలకును నట్లె దానవులకును రాక్షసులకును వధింపనలవి గాదో యట్టి యీరావణుఁ డిపుడు యుద్ధంబున రథాదులులేక పట్టి కాలినడతో వచ్చిన యొకబీదమనుజునిచే హతుఁడై పడియున్నాఁడే! దేవతలుగాని యక్షులుగాని యసురులుగాని యెవ్వని వధింపఁజాలరయిరో, యట్టిమహాశూరుం డితఁడు, ఎవ్వఁడో యొకబలహీనుండుంబోలె, మనుష్యమాత్రునిచే మృత్యువునొందెనే!' అని పలువిధములఁ బలవించిరి అస్త్రీ లివ్విధంబున పెనిమిటిపరాక్రమాదులు పలువగల నుగ్గడించుచు రోదనము సేసి, మరల, దుఃఖ మతిశయింపఁగా పట్టలేక, నూటిమాటికి 'నీ చెప్పినను నీహితమునే చెప్పునట్టిమిత్రు లెంత చెప్పినను వినక సీతను దెచ్చితివి. అది నీమరణమునకే యైనది. నుఱి రాక్షసులును హతులయిరి. ఇప్పు డీమేమందఱమును, రాక్షసులును, నీవును, అందఱు నేకకాలమునఁ గూల్పఁబడితిమి. నీయందు ప్రీతి గలనీతమ్ముఁడు విభీషణుఁడు నీకు హితమునే బోధించుచున్నను, నీ వజ్ఞానమున నీచావునే కోరి, యతనిని ముందు వెనుక చూడక పరుషవచనములాడి పరిభవించితివి. నీవు మిథిలరాజసుతను సీతను రామునకు మరల నొసంగియుందువేని, మాకందఱకు మూలమయిన నీ విట్లు మరణింపకుందువే! ఇట్టి నీమరణమువలన మాకు బెట్టిదముగాఁ గలిగినయీఘోర వ్యసనమును గలుగకుండునే! నీతమ్ముఁడయిన విభీషణుని కోరికయుఁ గావించినట్లగునే! రాముఁడును మనకులమునకుఁ గూరిమిమిత్రుఁడగునే! మేమందఱమును విధవలము గాకుందుమే! మనపగవారికోర్కియు ఫలింపకుండునే! నీ వట్లు సేయక, క్రూరుఁడవై బలవంతముగా సీతను చెఱబెట్టుకొనియె యుండుటవలన, ఈరాక్షసజనమును నీవును మేమును ముగ్వుర మేకకాలమునఁ గూలనయినది. రాక్షసోత్తమా! ఇదంతయు నీవు విచ్చలవిడిగాఁ జేసి తెచ్చుకొన్నదే కాదు. అన్నియు దైవమే చేయించుచున్నది. దైవముచే హతుఁడయినవాఁడే శత్రువుచేత హతుఁడగును గాని యితరుఁడుగాఁడు. మహాబాహూ! వానరులకును రాక్షసులకును, నీకును నిట్లిమ్మహాయుద్ధమునం దీవినాశము దైవసంకల్పమునసే కలిగినదిగాని వేఱుకారణమునఁగాదు. లోకమున దైవమొక కార్యమునకుఁ బూనిసపిదప, అర్థబలమునఁగాని, యిచ్ఛచేతంగాని, పరాక్రమమునఁగాని, యాజ్ఞచేతఁగాని, దాని నెంతమాత్రము త్రిప్పనలవిగాదు' అని మాటిమాటికి విలపించిరి. ఇవ్విధంబున నారాక్షసేశ్వరుని భార్యలు, దీనలయి, దుఃఖార్తలయి, కన్నుంగిన కన్నీళ్లఁ గ్రమ్మి కలంకనొంద క్రొంచపిట్టలవలె విలపించిరి. ఇది నూటపదుమూఁడవ సర్గము.

---

### రావణుని పట్టపుదేవియగు మండోదరి విలపించుట; విభీషణుఁడు రామునినియోగంబున రావణునకు సంస్కారము సేయుట.

ఆరాక్షసస్త్రీలనవ్విధమున విలపించుచుండఁగా వారిలో రావణునకు మిక్కిలియుఁ బ్రియురాలును, జ్యేష్ఠపత్నియు నయినమండోదరి, దీనయై తనభర్తం జూచెను. మండోదరి యచట నచింత్యకర్ముం డగురామునిచేత హతుఁడై యున్న తనప్రాణనాథుని రావణునిం జూచి, దుఃఖితయై 'అయ్యా! మహాభాగా! కుబేరునితమ్ముఁడా! నీవు క్రుద్ధుఁడై కన్నెఱ్ఱఁ జేసినపుడు నీయెదుట నిలుచుటకు దేవేంద్రుండేనియు ఋషులును బ్రాహ్మణులును మహాయశస్కులగు గంధర్వులును దిగులుపడుట తెల్లమే కదా. ఇట్టినీవు మనుష్యునిచే నెట్లు జయింపఁబడితివి? అయ్యా! నీకు భయపడి చారణులును దిక్కులకుం బాఱిరి కదా. రాక్షసతిలకా! అట్టి మహాశూరుండ వగునీవు మనుష్యమాత్రుం డగురామునిచేత యుద్ధమున నోడఁబడితివే! రాజా! ఇందులకు లజ్జనొందవే. ఇదియేమి? పరాక్రమమున ముల్లోకముల నాక్రమించి త్రిలోకరాజ్యలక్ష్మిచే నెంతయు రాజిలుచు నెట్టివారికి నోర్వరాకుండుమగఁటిమి గలనిన్ను నొకకేవలమనుష్యుఁడు, అందును నడవిలోఁ దిమ్మరునట్టివాఁడు, ఎట్లు వధించెనో! ఆశ్చర్యము గానున్నదే! ఇంతేకాదు. నీవుండుదేశము మనుష్యులకుఁ బొందనలవికాదు. నీవును కామరూపివి. ఇట్టినిన్ను, మనుష్యుఁ డారాముఁడు యుద్ధమునఁ జంపెననుట యెంతమాత్రము పొసఁగకున్నది. సమస్తయుద్ధోపకరణములు పూర్ణముగా నున్ననిన్ను యుద్ధాగ్రమున నెదిర్చి రాముఁ డాక్రమించెననుట యిది రాముఁడే కేవలము మనుష్యుఁడై చేసినకార్యముగా నాకు నమ్మకము గలుగలేదు. జనస్థానమున ననేకరాక్షసులతోఁ గూడినసీతమ్ముని ఖరుని వధించునపుడే యీరాముఁడు మనుష్యమాత్రుఁడు గాఁడని స్పష్టముగాఁ దెలిసినది. దేవతలకుఁగూడఁ బ్రవేశింప నలవి గానియీలంకానగరములోపలికి హనుమంతుఁడు వీర్యము పెంపున వచ్చినపుడే మేము రాముఁడు మనుష్యమాత్రుఁడుగా నుండఁడని దిగులొందితిమి. భయంకరాకారులగువానరులు, ఇమ్మహాసముద్రమున సేతువుకట్టినపుడే నేను రాముఁడు మనుష్యమాత్రుఁడు గాఁడని మనస్సునం దలంచితిని. అటుగాదేని, యముఁడే, నిన్ను వధించుటకై యప్రమేయరూపలావణ్యము గలసీతారూప మగుమాయం బన్ని రామరూపంబు దాల్చి తానే నీమీఁదికి వచ్చియుండును. మహాబలశాలీ! దేవేంద్రుఁడు వచ్చి నిన్నిట్లు గీడ్పఱిచియుండునో. ఇదియు నొప్పదు. ఇంద్రుఁడు యుద్ధంబున నిన్నుఁ గన్నెత్తిచూచుటకుఁగూడ శక్తుఁడు గాఁడే. * లోకరక్షణోపాయంబునుగుఱించి మహాచింతగలిగి, యెప్పుడు నునికియు,

* ఇందులకు 'వ్యక్తమేష మహాయోగీ పరమాత్మా సనాతనః । అనాదిమధ్యనిధనో మహతః పరమోమహాన్ । తమసః పరమోధాతా శంఖచక్రగదాధరః । శ్రీవత్సవక్షా నిత్యశ్రీ రజయ్యశ్శాశ్వతో ధ్రువః' అనిమూలము. విశేషార్థము:—విష్ణువు సర్వదేవతలకంటె నుత్కృష్టుఁడనియు, రాముఁ డట్టి విష్ణు

జన్మవృద్ధినాశములు లేమియు, తఱుఁగకుండుటయు, మాఱకుండుటయుఁగలిమిచే నపక్షయాది షడ్వికారములు లేక, గొప్పవారగు నింద్రాదులకును గొప్పవాఁడయి బ్ర

వేయనియు శ్రీముఖముననే భగవంతుఁడగువాల్మీకి వ్యాఖ్యానించుచున్నాఁడు. (వ్యక్తమేషః) స్పష్టముగానితఁడు—పరిశేషము వలనను ప్రమాణముచేతను నిశ్చయింపఁబడిన రావణహంతయగు నితఁడు, (మహాయోగీ) 'యోగస్సన్నహనోపాయధ్యానసంగతియుక్తిషు' అన్నట్లు మహాసన్నహనము గలవాఁడు—ఆశ్రితరక్షణసన్నాహముగలవాఁడనుట, (మహాయోగీ) యోగమనఁగా ఉపాయమునగునుగనుక, వివిధమై విచిత్రమగు జగత్తునిర్మించు నుపాయమునఁ జతురుఁడు, (మహాయోగీ) యోగమనఁగా ధ్యానము అనఁగా సంకల్పమునగును గనుక 'బహుస్యాం ప్రజాయేయ' 'పెక్కండ్రనయ్యెదను; ప్రజలను బుట్టించెదను' అని యిత్యాదులచేఁ జెప్పఁబడునట్లు మొట్టమొదట నొక్కఁడైయుండిన తాను పెక్కండ్రగునట్లు సంకల్పము చేసినవాఁడనుట, (మహాయోగీ) యోగమనఁగా యుక్తియునగును గాన శరణాగతరక్షణాదులందు పూర్వపక్షులచే చలింపఁజేయ నలవికాని యుక్తిగలవాఁడనుట. (పరమాత్మా) చేతనాచేతనములు శరీరముగాఁగలిగి వానియందెల్ల నాత్మయైయుండువాఁడు. అట్లు సమస్తశరీరములతో సంబంధించియున్నను వానిదోషములు తాఁకనివాఁడనుటకై, (సనాతనః) అన్నాఁడు. (అనాదిమధ్యనిధనః) ఆదిమధ్యాంతశూన్యుఁడు. (మహతః పరమోమహాన్) గొప్పవానికంటె మిక్కిలియు గొప్పవాఁడు. 'అణోరణీయాన్ మహతోమహీయాన్' ఇత్యాదులచేఁ జెప్పఁబడిన పరమమహత్త్వముగలవాఁడు. (తమసః పరమః) 'అక్షరాత్పరతః పరః' 'యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపిచోత్తమః' అని శ్రుతిస్మృతులచే క్షరాక్షరములకంటె పరుఁడయినవాఁడు. (తమసః పరమః) 'ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' అన్న పరమపదమున వసించువాఁడు. (ధాతా) భూతభవిష్యద్వర్తమానకాలములందును సకలజగత్తునకు నిర్మాతయైనవాఁడు. 'సూర్యాచన్ద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్' అని శ్రుతి. (ధాతా) స్థితికర్త. ఆస్థితియు జగత్తు వివిధములుగాఁ జేయుటచే అనేకరూపమయినది. (ధాతా) ధరించువాఁడు, ప్రశాసనముచే లోకములు తనకు లోనయినవాఁడు. 'ఏతస్యవాఅక్షరస్య ప్రశాసనే' అని శ్రుతి. ఇట్లు కారణస్వరూపమును ఉపాస్యమగు వస్తువును, అందులకుపయుక్తములగు గుణములును చెప్పఁబడినవి. ఇఁక దివ్యమంగళవిగ్రహయోగమును జెప్పుచున్నాఁడు. (శంఖచక్రగదాధరః) తాను ఉపాస్యుఁడై యుండుట కనుగుణముగా శరణాగతులవిరోధులను నిరసించుటయందు జాగరూకుఁడై అనఁగావారిని రూపుమాపుటకు సిద్ధముగా నాయుధధారియై యుండుట చెప్పఁబడినది. (శ్రీవత్సవక్షాః) శ్రీవత్సమనుమచ్చను వక్షమునఁగలవాఁడు. శ్రీవత్సకౌస్తుభాదులు నిత్యములగుటచే రుద్రాదులకంటె విలక్షణుఁడగుట చెప్పఁబడినది. (నిత్యశ్రీః) లక్ష్మి నిత్యానపాయినియై యుండువాఁడు-లక్ష్మి యెప్పుడును దన్నెడఁబాయకుండువాఁడు.—ఇట శ్రీ నిత్యానపాయినియై యుండుననుటచే శ్రీ గలిగియున్న దివ్యవిగ్రహము నిత్యమే యగునని చెప్పఁబడిన దగుచున్నది. స్వరూపము నిత్యమగుట సాధారణముగానే ప్రాప్తమగుటచే, నిట విగ్రహనిత్యత్వమే తెలియనగును. లేక జగన్మాతయగు నీశ్రీదేవి నిత్యురాలనియె చెప్పఁబడినది కావచ్చును. శ్రీసంబంధమువలన మెఱుఁగుపెట్టఁబడిన తేజమును (అజయ్యః) అని చెప్పుచున్నాఁడు.—'అప్రమేయంహితత్తేజో యస్యసాజనకాత్మజా' అనికదా చెప్పఁబడినది. (అజయ్యః) ఉపాసకులుతప్ప తక్కినవారికి జయింప నలవిగానివాఁడు. (అజయ్యః) 'అప్రధృష్యశ్చసంగ్రామే సేంద్రైరపి సురాసురైః' దేవేంద్రునితోఁగూడిన సురాసురులకుంగూడ యుద్ధమునం జెనకరానివాఁడు' అన్నట్లు జయింపనలవిగానివాఁడు (శాశ్వతః) మూఁడువిధములయిన పరిచ్ఛేదము

ష్టాదులకంటెను గొప్పవాఁడయి, ప్రాకృతమండలమునకవ్వల నప్రాకృతమగు వైకుంఠమున దివ్యవిగ్రహముతో వెలుఁగుచు సర్వదా భక్తుల రక్షించుటకు శంఖచక్రగదాయుధములను ధరించి దక్షిణవక్షమున రక్తవర్ణమై మత్స్యాకారమయిన శ్రీవత్సమను మచ్చగలిగి, లక్ష్మీదేవితో నెప్పుడు నెడఁబాయక కూడి, యెట్టివారికిని జయింపశక్యుండు గాకున్న యాపరమాత్మయె యితఁడు. ఇది నిశ్చితము. 'ఇట్టిపరమాత్ముఁ డీమానుషత్వాదులు నొందనేల' యందువా? సత్యపరాక్రముఁడును మహాతేజస్సంపన్నుండునగు విష్ణుదేవుఁడు సర్వలోకములకును నియామకుఁడై యనిష్టములఁ దొలఁగించి యిష్టములను బొందించు కర్తగావున తోడనే సమస్తలోకములకును హితము

---

లేనివాఁడు.—వికారశూన్యుఁడును, (ధ్రువః) కంపింపఁజేయనలవిగానివాఁడు, ఇట సహస్రనామపాఠమున 'అనాదినిధనో ధాతా' యనియు 'నిత్యశ్రీః' అనియు నుండుటంబట్టి ధాతయనుటయు నిత్యశ్రీయనుటయు రూఢిచేతనే చెల్లునని తెలియునది. తనిశ్లోకము.

(మహాయోగీ) లోకరక్షణోపాయమును గుఱించి మహాయోగము అనఁగా గొప్పచింతగలవాఁడనుట, (పరమాత్మా) సమస్తజీవాత్మలకంటె నుత్కృష్టుఁడయినవాఁడు, పరమత్వమెట్లనఁగా 'సనాతనః' ఇత్యాదులచే షడ్భావవికారములు లేమిని జెప్పుచున్నాఁడు. అవ్వికారములు జీవాత్మకుఁగలవు. అవిలేమిచే పరమాత్ముఁడనుట. (సనాతనః) సదా యునికిఁగలవాఁడు, (అనాదిమధ్యనిధనః) జన్మవృద్ధివినాశశూన్యుఁడు, (శాశ్వతః) అపక్షయములేనివాఁడు, (ధ్రువః) పరిణామములేనివాఁడు. ఈవిశేషణములచే జీవగతములయిన షడ్భావవికారములు లేమి చెప్పఁబడినదయ్యె. ఇవియే 'అపక్షయవినాశాభ్యాం పరిణామర్ధి జన్మభిః । వర్జితశ్శక్యతేవక్తుం యస్సదాస్తీతి కేవలమ్' అని విష్ణుపురాణమునఁ జెప్పఁబడినవి. పరమాత్మశబ్దార్థమును వివరించుచున్నాఁడు. (మహతఃపరమోమహాన్) మహాన్ ఇంద్రాదులు. వారికంటె మహనీయులు బ్రహ్మాదులు. వారికంటె మహనీయుఁడే 'పరమోమహాన్' అనఁబడినాఁడు. స్థానవిశేషముచేతను పరమత్వమును జెప్పుచున్నాఁడు. (తమసఃపరమః) ప్రాకృతమండలమునకు నవ్వల నప్రాకృతవైకుంఠమందుండువాఁడు. 'ఆదిత్యవర్ణం తమసఃపరస్తాత్' 'ఆదిత్యవర్ణం తమసస్తుపారే' అని శ్రుతి. సర్వత్రవ్యాపించియుండువాఁడు పరమపదమనెడి యొక్కచోట నుండుననుటయెట్లు? అనఁగా, విగ్రహముగలమున నక్కడనున్నాఁడనియు స్వరూపముచే సర్వత్రనున్నాఁడనియుఁ జెప్పుచున్నాఁడు. (శంఖచక్రగదాధరః) శంఖచక్రగదలను ధరించువాఁడు. సదాశంఖచక్రములను ధరించుటవలని ప్రయోజనమును జెప్పుచున్నాఁడు. (ధాతా) పోషకుఁడు. సర్వదా నాశ్రితుల రక్షించుకొఱకై యాయుధములను ధరించుచున్నాఁడనుట. ఇదియే 'పాతుప్రణతరక్షాయాం విళంబమసహన్నివ । సదాపంచాయుధింబిభ్ర త్సనశ్శ్రీరంగనాయకః' అని యభియుక్తులచేతను జెప్పఁబడినది. అతనిసర్వేశ్వరత్వమును దెలుపులక్షణమును జెప్పుచున్నాఁడు. (శ్రీవత్సవక్షాః) శ్రీకరమైనవత్సమును, అనఁగా రక్తవర్ణమై మత్స్యవిశేషాకారమగు వత్సమును దక్షిణవక్షమునఁగలవాఁడు, (జగద్రక్షణమున కుపయుక్తమయిన పురుషకారసంబంధమును చెప్పుచున్నాఁడు. (నిత్యశ్రీః) నిత్యానపాయినియైన శ్రీగలవాఁడు. ఇందే 'విష్ణోః శ్రీరనపాయినీ' అనఁబడినది. కావుననే (అజయ్యః) జయించుట శక్యుఁడ యినవాఁడు. ఈరాముఁడు ఇటువంటిపరమాత్మయే యగును. (వ్యక్తం) ఇది నిశ్చితమని సంబంధము.—గోవిందరాజులు.

సేయఁగోరి, తనవలన నీకుఁ జావులేకుండునట్టి వరమును బరిహరించుటకై మనుష్య
దేహమును దాల్చి, వానరత్వము నొందిన సమస్తదేవతలును దన్ను బరివేష్టింపఁగా సమ
స్తలోకవిరోధి వగు నిన్ను నీరాక్షసపరివారమును వధించి పుచ్చినాఁడు. ఇది స్పష్టము.
నీవు మున్నింద్రియములను జయించి ముల్లోకములను జయించితివి. ఇప్పు డాయింద్రి
యములు తమ్ము నీవు గెలిచిన యావైరమును దలఁచి నిన్ను జయించినవో యన్నట్లు,
ఇంద్రియములకు లోనయినట్టిదశ నొందితివి. 'రామునితోడ పగవలదు. సంధిగా
వింపుము' అని నే నెన్నిమార్లు చెప్పుచుండినను నీవు విన వయితివే. అందులకు ఫల మి
పు డనుభవమునకు వచ్చినది. రాక్షసపుంగవా! నీ వే కారణము లేకయే సీతయందింత
యభిలాషనొందితివి. ఆ చెలువను గుఱించి నీ వి ట్లభిలషించుట అయుక్తమే. దానం జేసి
నీయైశ్వర్యమును, నీబంధువులును నీవును నశించుటయే ఫలించినది. దుర్మతీ! అరుం
ధతికన్నను, రోహిణికన్నను, నధికురాలును పూజ్యురాలు నయిన సీతాదేవిం జెఱప
ట్టితివే! ఇట్లు మిక్కిలి యనుచితమునే చేసితివి. 'అది పతివ్రతయేని యేల నన్ను
దహింపలేకుండువా?' నాప్రభూ! నీ సొమ్ము యున్న నన్నుఁ దక్కువగాఁ దలఁ
చితివే! కాని నీవు భూదేవికి భూదేవియై మిక్కిలి యోర్పుగలిగి, లక్ష్మికి లక్ష్మియుం
బోలె సర్వసంపదధికురాలై భర్తయందు మిక్కిలియు మక్కువగల పతివ్రతామణి
యై సర్వాంగసుందరి యైనకల్యాణి నాసీతాదేవిని విజనం బగు నడవియం దుండున
పుడు నిన్నొల్లని దానిని మాఱీచుని చేఁ గపటము పన్ని దీసికొనివచ్చి యా మిథిలరాజ
కుమారితో సంగమింపవలె నన్న నీకోర్కె తీరకయే యాపతివ్రత తపఃప్రభావముచే
దగ్ధుఁడవయితివి ఇది నిశ్చయము. సన్నని నెన్నడుముగల యాసీతను నీ వట్లు చెఱ తెచ్చిన
పుడే దగ్ధుఁడు కావలసియుండఁగా నీ వట్లు కాకపోయితివి గాన నీవు మిక్కిలియు మా
హాత్మ్యము గలవాఁడవు. ఆమహాత్మ్యమును బట్టియే, నీకు నింద్రుఁడు అగ్ని మొదలగు
దేవతలందఱును భయపడువారయిరి. ఆ భీతివలన వారు సీత నట్లు చేసినందులకు ఫల
ముగా నిన్ను దహింపకపోయిరి. పాపకర్మము చేసినవాఁడు ఫలసమయము ప్రాప్తించి
నపుడు, తాను గావించిన పాపకర్మములకు ఘోరమయిన ఫలమును నవశ్య మనుభ
వించును ఇందుల కెంతమాత్రము సంశయము లేదు. మంచి చేసినవానికి మంచియే
కలుగును. సెబ్బర చేసినవానికి సెబ్బరయే కలుగును. విభీషణుఁడు రామాశ్రయణ
మున మంచి చేసినాఁడు గాన సుఖము నొందెను. నీవో పాపము చేసితివి గావున నిట్టి
దుఃఖము నొందితివి. ఆసీతకంటెను రూపమున మిక్కిలి చక్కనయిన స్త్రీలు నీకు వేఱు
పెక్కండ్రు గలరు. అయినను నీవు మన్మథుని బారిం జిక్కి యాసీతం జూచి మోహితుఁ
డవయితివి గావున, నీకది తోఁపకపోయినది. సీత, కులమునందును, రూపమునందును,
విద్యాసామర్థ్యమునందును, నాకన్న నెక్కుడుగాదు. ఈడుజోడునుగాదు. అయినను
నీవు మోహము నొందియుండుటవలన నిది నీకుతోఁపదయ్యెను. ఎట్లుగాని, యేప్రాణి
కినేని, నిమిత్తము లేక మృత్యువు గలుగదు. అట్లే నీకు సీతం దెచ్చుటయే కారణముగా

నిదేమృత్యువు గలిగినది. నీవు దూరమునుండి యాబిడను దెచ్చితివి; కాన దూరమునసుండి నీవేపోయిమృత్యువును దెచ్చుకొన్నట్లయినది. సీత యిఁక శోకముఁ బాసి రామునితోఁ గూడ సుఖముగా విహరింపఁగలదు. అల్పపుణ్య నగునేనుమాత్ర మిట్లు భయంకర మయినదుఃఖసముద్రమునం బడినదాననయితిని. వీరా! నేను చిత్రములగు పుష్పమాలికలను వస్త్రములను ధరించి నీతోఁ గూడి, యెనలేనిసిరి దళుకొత్త, ఆసిరి పెంపునకు ననురూపమయిన విమానమునెక్కి, కైలాసమునందును మందరపర్వతమను మేరుగిరియందును చైత్రరథవనమునందును, దేవతల యుద్యానము లన్నింటియందును, నిచ్చలు విహరించి నానావిధము లయినయద్భుతదేశములం జూచుచు సుఖ మనుభవించుచుంటినే. అట్టినే నిపుడు, నీవు హతుఁడగుటవలన, కామోపభోగము లన్నిటిని దూలినదాన నయితిని! అట్టి సమస్తభోగముల ననుభవించుచుండినట్టి నేనే యిపుడిట్లు భోగములపేరే తెలియని సాధారణమైన యితరస్త్రీనంటిదాన నయితిని. కాన యిసీ! రాజులసంపదలు చంచలములు. అవి పాడయిపోవుఁగాక. రాజా! సుకుమారమై సొగ సయినకనుబొమలు కలిగి, నిద్దపుచర్మముతోఁగూడి, నిక్కగలముక్కుచే నిగ్గులుకుచు, ప్రభయందుఁ జంద్రునికిని, సౌందర్యమందు పద్మమునకును, తేజమునందు సూర్యునికిని సాటియై, పర్వతశిఖరమువంటి కిరీటముచే తలతలమెఱయుచు, ఎఱ్ఱనిపెదవులును తలతలలాడుకుండలములును దులకించు నీముఖము, మున్ను పానభూములయందు, మత్తుచే కలఁగి తిరుగుచున్న కన్నులతో నొప్పుచు, పలువిధములయిన పూదండలు దొడిగి, సొబగై, సొంపారు చిఱునవ్వుగులుకుపలుకు లాడుచు, శుభంబై యుండునే! అట్టి నీయీముఖమే యిపుడు, రామబాణములచే భిన్నమై నెత్తురువెల్లువలఁదోఁగి, మేదస్సును మస్తిష్కమును నెఱయఁజెదరి, రథంపుదుమ్ములను బ్రుంగి, యెంతమాత్రము నాప్రభూ! ప్రకాశింపకున్నది. అయ్యో! నీవు మృతుండవయి నేను ముండమోయువలసినదశ సంప్రాప్తమయినదే. ఇట్టియవస్థ వచ్చునని మూఢురాల నగునాకు ముందెప్పుడును దోఁచినదికాదు. నాతండ్రి మయుఁడు దానవరాజు. నాభర్త రాక్షసనాథుఁడు. నాకొడుకు కింద్రజిత్తు దేవేంద్రుని గెలిచిన యుక్కుఁడునియు యని మిక్కిలియుఁ గన్నుఁగానక విఱ్ఱవీఁగుచుంటినే. నాకు రక్షించుదిక్కయియున్న నాతండ్రి పెనిమిటి కొడుకులు మొదలయినవారలు, మత్తిల్లిన శత్రువులంగూడ పీఁచమడంచు మహాశూరులనియు బహుయుద్ధములందు సడిసన్నబలపౌరుషములు గలవారనియు, వారి కెవ్వరివలనను భయముగలుగనేరదనియు గట్టిగా నమ్మియుంటినే. తుద కిట్లయ్యెనా? రాక్షసతిలకా! అట్లు ప్రసిద్ధులై యిటువంటిప్రభావము గలిగియుండినమీకు, నిదివఱ కెన్నఁడు నిట్లు గలుగునని తలంపనియిట్టిభయము ఒకమనుష్యనిమాత్రునివలన నెట్లు గలిగెనో, ఆశ్చర్యముగా నున్నదే! రాజా! నీమేను నిగ్గుగలయింద్రనీలమువలె నీలమై, పొడవయినపర్వతమువలె నునుపై, బాహుపురులు వైడూర్యమయము లయిననందిటిపురులు, ముత్తెపు

హారములు పుష్పమాలికలు మొదలగువానిచే సుజ్జ్వలమై విహారసమయములందు మఱింతరమణీయమై, యుద్ధభూములందు వీరోత్సాహంబున నినుమిక్కిలిగా మెఱయుచు, మెఱపులచే మేఘంబునుంబోలె నాభరణకాంతులచే నెంతయు వెలుంగుచుండునే. అట్టిశరీరమె యిపుడు, తీక్ష్ణము లయినపెక్కుబాణము లంతటను నెరసి యుండుటంజేసి యంటుటకేనియు నశక్యమై యెంతమాత్రమును గౌఁగిలించుకొన నలవిగాకున్నదే. మఱియు నిది, యేదుపందిమేన ముండ్లు దట్టముగానుండునట్లు, నెఱఁకులందు చక్కఁగాఁడి గీలుకొని యున్నబాణము లెడతెఱపి లేకుండునట్లు దట్టముగానుండ, నరములుముళ్లు బిట్టుగాత్రెగి, కపిలవర్ణమైయుండియు నెత్తుట మిక్కిలి యునుజొత్తిల్లుటచే దానివలె నెఱ్ఱనివన్నెగలిగి, నేలంబడి,వజ్రాయుధపువ్రేటునఁ గొట్టువడి నేలంగూలిన పర్వతమువలెనున్నది. అయ్యో ! నీవు మృతుఁడవయినది స్వప్నమే. స్వప్నమనుట సత్యమే. నీవంటిశూరుని రాముఁ డెట్లు చంపఁగలిగెను.మృత్యువుచేతఁ జచ్చితినందువా? నీవు మృత్యువునకుఁగూడ మృత్యువవే ! మృత్యువుబారికి నెట్లు చిక్కితివి. కాఁబట్టి నీవు మృతుఁడవగుట స్వప్నమే. ముల్లోకములందలి రత్నములనెల్ల ననుభవించుచు, ముల్లోకములకును పెనుభయముగలిగించుచు,సమస్తలోకపాలురను జయించి కైలాసాచలమునూఁచి శివుని గ్రిక్కదల్చి, బలగర్వితులను నడంచి, పరాక్రమము దశదిశలం బ్రకటించి, లోకంబులనెల్ల కలంచి నలంచి,సమస్తభూతములను సింహనాదములఁ గుయ్యో మొఱ్ఱో యని కూపెట్టించి, వీర్యము పెంపున శత్రువులు దార్కొన్నపుడు సరకుసేయక గర్వోక్తులాడుచు, భయంకరకర్ములగు తనసైనికులను భృత్యవర్గములను నాపదలు పొరయకుండఁ గాచుచు, వేలకొలఁదిని మేటిదానవవీరులను యక్షులనుజంపి నివాతకవచులను భయమున తనకోడి మిత్రులగునట్లు గావించుకొని, ముల్లోకములకును నియామకుఁడై, పెక్కుయజ్ఞములకు విఘ్నములు గావించి, స్వజనముల నాదరమునఁ బ్రోచి, ధర్మపుమర్యాదులను ద్రెంచి, యుద్ధంబునఁ బెక్కుమాయలంబన్నుచు, నయ్యైస్థలములనుండి దేవకన్యలను అసురకన్యలను మనుష్యకన్యలను బలిమిం గొనివచ్చి, శత్రువులవధించి వారిస్త్రీలకు శోకమొసంగుచు స్వజనంబులఁ జక్కఁగానడపుచు లంకాద్వీపము నేలుచు, తనశిరస్సుల నగ్నియందు వేల్చుట మొదలగు భయంకరకర్మములంగావించి, మాకందఱకును గామభోగంబుల నవ్వారిగా నొడఁగూర్చుచు, రథికశిరోమణివై యేతాదృశప్రభావసంపన్నుఁ డయిన నాప్రియుఁడు నాప్రాణేశ్వరుఁడు రామునిచే హతుఁడై పడియుండుటనుజూచియు,పెనిమిటిని బాసి యింకను దేహమును బెట్టుకొనియున్నాను; కాన నేను వజ్రశిలాకఠినను గాని వేఱుగాదు. రాక్షసేశ్వరా ! నీవు మిక్కిలియు వెల పొడుగయిన శయ్యలందుఁ బరుండియుండువే ! ఇపు డిచట దేహమంతయు దుమ్ముల బ్రుంగి యెఱ్ఱనగునట్లు నేలపయిని బరుండియున్నావేల? నాకొడు కింద్రజిత్తును యుద్ధమున లక్ష్మణుఁడు వధించినపుడ, నేను వేండ్రముగా దుఃఖమునఁ గొట్టువడి క్రుంగితిని. ఇపు డిఁక నీవు హ

తుఁడవగుటచే మొదలే కూల్పఁబడితిని; కాన బ్రతుకుటలేదు. నీవు జీవించియుండినచో నాబంధువులు హతులయిరని నాకు దుఃఖములేదు. నానాథుఁడవు, నీవు నన్నుఁ బాసిపోయితివి గావుననే, యికఁ గలంతకాలము కామభోగములు వదలి దుఃఖము ననుభవించుచుండఁగలను. రాజా ! ఎవ్వరికిని బొంద నలవిగానిబహుదూర మయినస్థానమునకుఁ బోయితివి. (బోవనున్నావు.) దుఃఖార్తనగు నన్నుఁ గూడఁ గొనిపొమ్ము. నిన్నువదలి నే నెంతమాత్రము జీవింపఁజాలను. నీ విట్లు మిక్కిలియు దుఃఖించుచును మాటిమాటికి పలవించి పలవించి సోలియున్న దీనురాలిని భాగ్యహీనురాలిని నన్ను, నిచటనే యొంటి దిగవిడిచి పోఁగోరితివేల? ఇదితగునా? పోనీ. నాకు బదులు పలుకనయినను బలుకవచ్చునుగదా. అదిగూడ పలుకవేమి? ప్రభూ ! ముసుఁగు లేక నగరద్వారము వెడలి యిచటికి కాలినడకవచ్చిన నన్నుఁజూచి కోపపడినాఁడవు కావేమొ. అట్లేల కోపపడకున్నావు? భార్యలయందు మిక్కిలియు మక్కువగలవాఁడవు. కాన నీభార్య లందఱును, తెరయొలంపుముసుంగులు విడిచి,యంతఃపురము వెలువడి యిదె వచ్చియున్నారు చూడుము. చూచి వారలను కోపింపవేల? నీకు క్రీడలయందెల్ల సహాయులుగా నుండినయీభార్యాజనులందఱు నిట్లనాథలై పనివి పనివి పలవించుచున్నారే ! వీరల నూఱడింపను నూఱడింపవు. మిక్కిలియు మన్నింపను మన్నింపవు. ఇదేమి? రాజా! పతివ్రతలును ధర్మపరాయణలును గురుశుశ్రూషాతత్పరలునగు కులస్త్రీలను నీవు మునుపు వెక్కండ్రను, వారిపతులను జంపి విధవలం జేసితివే. వారెల్ల శోకంబునం బురపురఁబొక్కుచు నిన్ను శపించుటవలన నీ విట్లు శత్రులబారికిం జిక్కితివి. లేకున్నఁ జిక్కుదువా? నీచే నట్లు పరిభవమునొందిన యాకులాంగనలు, తమభర్తలను నీవు వధించుకాలమున ని న్నేమిశపించిరో యందులకు ఫలమిపుడు ప్రాప్తమయినది. రాజా ! 'పతివ్రతలకు కన్నీళ్లు కారణములేక యూరక నేలంబడవు. అవిపడునేని యేదయిన ననర్థముఁ జేసి యేతీఱును.' అని లోకమునందు జనులు తఱచుగా వాడెడి యీనానుడి, నీవిషయమున సత్యమేయైనది. రాజా ! తేజముచే ముల్లోకముల నాక్రమించి మహాశూరాగ్రణి నని విఱ్ఱవీఁగుచుండు నీవు, నీచమయిన యీ స్త్రీచౌర్యము నెట్లుదా చేసితివి? నీవు కపటోపాయమున మాయామృగమును బంచి రాముని నాశ్రమమునుండి తొలఁగఁదీయునట్లు గావించి, రామునిపత్నిని సీతను దెచ్చితివే. దీన నీకయినదేమి ? నీ పిఱికితనమున కిది యొకగుఱుతయినది. అయినను నీవు యుద్ధమున నొకప్పుడుగాని పిఱికితనము చూపినట్లు, నేనెఱుఁగను. అట్టిధైర్యప్రకృతి వగునీవు భాగ్యము తలక్రిందగుటవలన సీతను దొంగిలితెచ్చినట్టి పిఱికివగుట నీకు వినాశము ముదిరినందులకు లక్షణమేకాని వేఱుగాదు. భూతభవిష్యత్కాలార్థములం దెలిసి, వర్తమానార్థమునందును ప్రాజ్ఞుఁడయి, సత్యవాదియు మహాభాగుండు నగునాపిన్నమఱంది విభీషణుఁడు నీవు సీతను దెచ్చుటఁజూచి కొంతసేపుచింతించి నిట్టూర్పునిగిడించి

నాతో నేమిచెప్పెనో యాచొప్పుననే యిపుడు నీకామక్రోధములచేఁ బ్రసక్తించినవ్యసనమున సమస్తరాక్షసముఖ్యులకును వినాశ మిదే దాపరించినదయ్యె. సమస్తమును వేరుతోఁగూడ నాశముసేయునట్టి యీమహానర్థము నీకొఱకై యుద్భవిల్లినది. (నీవలననే కలిగినది). నీవే యీరాక్షసకులమునంతయు దిక్కుమాలినదానిని గావించితివి. బలపౌరుషములం బ్రఖ్యాతిగాంచిన మహాశూరుండగునీవు యుద్ధమున మృతినొందుటకు నేను దుఃఖింపవలసినది లేదు. అయినను, ఆఁడుదాననగుటంజేసి, నాబుద్ధి నిలువక యిట్లు దైన్యమునం దడఁబడుచున్నది. నీపుణ్యమును పాపమునుం దీసికొని నీకుఁ బొందఁదగుగతిని బొందితివి. కాన నిన్నుగుఱించి దుఃఖింప నక్కఱలేదు. కాని నిన్నెడఁబాసినందులకు దుఃఖము పట్టఁగూడలేదుగాన నన్నుగుఱించియే దుఃఖించుచున్నాను. అనఘా! నీమిత్రులు నీహితముగోరి చెప్పినమాటను వినవయితివి. వారిమాట యటుండనీ. నీతమ్ములు నీకు మిక్కిలియు నూఱిపోసిన హితమునయినను వినఁగూడదా ? అదియును వినవయితివి. విభీషణుఁడు, యుక్తియుక్తముగాను ప్రయోజనకరముగాను, శాస్త్రోక్తప్రకారమునను,హితమయినమాటను సాంత్వనపూర్వకముగా చెప్పినను నీవు 'దాయాదివి నావ్యసనమునే కోరుదువు' అని యిట్టిహేతువు లేవో చెప్పి దానిని జేకొనవయితివి. అపుడు మారీచుఁడును కుంభకర్ణుఁడును * నాతండ్రి మయుఁడును జెప్పినవచనములను నీవు వీర్యంబున మత్తిల్లియుండుటచే వినవయితివి. దానికి నిటువంటిఫల మిదే ప్రాప్తించినది. ఏమిచేయవచ్చును. నీలమేఘముంబోలె చూపట్టుచు, పచ్చనిపుట్టముగట్టి సొగసయినబాహుపురులం దులకించుచుందువే ! ఇట్లు నెత్తుటందోఁగి కాలుసేతులుచాఁచి నిద్రించినట్లు పడియున్నావేమి. నేనిట్లు దుఃఖమునం బొక్కుచున్నను మాఱుపలుకవేమి ? మహాపరాక్రమశాలియు సమర్థుండునై, యుద్ధంబున వెన్నుఁజూపకుండు మాల్యవంతుని (లేక సుమాలి) దౌహిత్రుఁడవు (దౌహిత్రిని) నన్నుఁ గన్నెత్తియుఁ జూడవేమి? నీవుపడుటంజేసి భయముమాలి సూర్యకిరణము లిపుడు లంకను వీకం బ్రవేశించినవి. ఇట్లు క్రొత్తగా నవమానము వచ్చినపుడు పరుండియున్నావేమి ? లెమ్ములెమ్ము. నీవు యుద్ధంబున శత్రువులను రూపుమాపుటకు ముఖ్యసాధనమై,సూర్యునివలె ధగధగ మెఱయుచు, నీచేత నిత్యమును బూజలందుచు, ఘోరం బగతురఁ గూలనడుచునదై కాంచనజాలాలంకృతమై, యింద్రునివజ్రాయుధముంబోలె వెలయుచున్న నీయినుపగుదియ, రామబాణములచే వేయి దునియలుగా ఖండింపఁబడి యిపుడు నేలంబడియున్నది. నీవు ప్రియురాలింబోలె యుద్ధభూమిని గౌఁగిలించుకొని పరుండియున్నావే. ప్రియురాలుగానిదానివలె నన్ను మాత్రము విడిచి నాతోఁబలుక నొల్లకున్నావేల? నీవు మరణమునొందినపిమ్మటను, నాయీహృదయము దుఃఖమునం బీడితమై వేయిపఱియలుగాఁ బగులకున్నదే. ఇసీ!

* దీనిచే మయుఁడుగూడ హితముపదేశించినట్లు తెలియునది. ఇట 'మమపితుః' అనుటకు మాల్యవంతుఁడని మహేశ్వరతీర్థులు.

యిట్టికతినురాలను బాడయిపోవుదునుగాక!" యని విలపించెను. రాణి మండోదరి, యివ్విధమున కన్నులంగవకన్నీళ్లు కలంగంబాఱ, విలపించుచునే యుండి పతియందలి మిక్కుటపునెయ్యమున హృదయము మఱిఁగియుండుటచే దుఃఖముపట్టఁజాలక మూర్ఛనొందెను. మండోదరి యిట్లు దుఃఖమునఁజిక్కి మూర్ఛిలి, నీలవర్ణమయి నెత్తుటం దోఁగియున్న రావణునివక్షమునందుఁ బడినదై, సంజకెంజాయచే నెఱ్ఱవాఱిన నల్లనిమేఘమునందు వెలుంగుచున్న క్రొమ్మెఱుంగుఁదీఁగవలెఁ బ్రకాశించెను. అట్లు మండోదరి రోదనము సేయుచు మూర్ఛిలి పతివక్షమునఁ బడఁగా, ఆసవతులు మిక్కిలియుఁ దొందరపడివచ్చి తామును మిక్కిలియు రోదనము సేయుచు నాబిడను లేవనెత్తి 'దేవీ! రాజులసంపదలు చంచలమని నీకుఁ జక్కఁగాఁ దెలిసియేయున్నది. మఱియు, బాల్యము కౌమారము యౌవనము వార్ధకము మరణము మొదలుగా వేఱువేఱవస్థలు పెక్కులుగలిగి మాఱుచునేయుండుటచే లోకులస్థితిగూడ స్థిరముగాదని లెస్సగా నెఱుంగనేయెఱుంగుదువే. ఇందులకు వగవనేల ?' అని యూఱ్ఱడించిరి. ఇట్లు సవతు లూఱడించుచుండఁగా, అమ్మండోదరి, నిక్కుంగల చన్నుగుబ్బల కాలువలుగట్టు నశ్రుజలములం దడుపుచు, మహాధ్వనితో రోదనముచేసెను. ఇట్లు వారు రోదనముసేయుచుండఁగా రాముఁడు విభీషణునిఁ జూచి 'ఈ స్త్రీలనందఱను పురమునకు మరలించి యన్నకు నుత్తరక్రియలుగావింపుము' అనెను. అంత ధర్మజ్ఞుండగువిభీషణుఁడు, రాముఁడు చెప్పినవాక్యమును విని, మునుపు రావణున కుత్తరక్రియలు చేసెదనని తానై చెప్పఁగా రాముఁ డంగీకరించుటను తనబుద్ధి నాలోచించి తనమాటను దోయ లేక యతఁ డట్లు చెప్పెనో యేమో యతఁడే యనుజ్ఞ చేయునేని యప్పటికే చేయుదునుగాని మఱొకవిధమునఁ జేయనని యతనినే యనువర్తించుకొఱకై వినయంబున ధర్మార్థయుక్తంబగు వచనమున నతనితో 'ఈరావణుఁడు ధర్మమును వ్రతములను వదలినవాఁడు, క్రూరుఁడు, ప్రాణిహింసకుఁడు, అసత్యవాది, మఱియుఁ బరస్త్రీగమనము సేయువాఁడు.ఇట్టివానికి సంస్కారముసేయుటకునే నర్హుఁడనుగాను. ఈరావణుఁడు నాకు తోఁబుట్టువు రూపుదాల్చిన శత్రువేకాని వేఱుగాదు. మఱియు సమస్తప్రాణులకును కీడుసేయుటయందే యాసక్తుఁడు. కాన నాకుఁ బెద్దయని పూజింపవలసినవాఁ డయినను, ఈదోషములంబట్టి యెంతమాత్రము పూజకర్హుఁడుగాఁడు. నేను అన్నకు సంస్కారమును గావింపనందున భూమియందు మహాజనులు,నన్ను క్రూరుఁడని యిచ్చకొలఁదిని జెప్పినను జెప్పుదురు. అయిన నితఁడు గావించినదోషములను విందురేని, 'విభీషణుఁడు రావణునికి సంస్కారము చేయకున్నను మంచిపనియే చేసినాఁడు' అని మరల నందఱు చెప్పఁగలరు" అనెను. మాటలందు నిపుణుఁడును ధార్మికులలో నుత్తముండునగు రాముఁడు విభీషణుఁ డట్లుచెప్పినదివిని, అనంతుష్టి మిక్కిలియుం జెంది, వాక్యసమర్థుం డగునా విభీషణునితో "రాక్షసేశ్వరా! నీవు నాకు ప్రియమే చేయువలసినవాఁడవు. మఱియు నీ మహిమవలననే నా కీజయ

ము కలిగినదిగావున నేనవశ్యము నీకు హితమునే చెప్పవలసినవాఁడను. రావణునిసం
స్కారము నాకుఁ బ్రియమైనది. నీకును హితమైనది. కాన దానిని జేయుము. ఈరా
వణుఁడు, అధర్మమును అసత్యమును గలవాఁడనుట వాస్తవమే. దోషియయినను గు
ణములు పెక్కులుగలవాఁడు. మిక్కిలియు తేజస్వియు బలవంతుఁడునై యెప్పుడును
యుద్ధములం బరాజయమునొందని మహాశూరుండునై యున్నాఁడు. ఇతఁడు దేవేంద్రుఁ
డు మొదలయిన దేవతలవలననుం బరాజయమునొందఁడని వినుచున్నాము. మఱియు
నితఁడు మహాత్ముఁడు బలసంపన్నుఁడు; సమస్తలోకంబులకు రోదనముగలిగించుటచే
రావణుం డనఁబడినవాఁడు. 'గుణములు పెక్కులుండినను నీకు వైరియగువాని నెట్లు
సంస్కరింపవచ్చు' నందువా? చావకుండునంతవఱకే యన్నివైరములు. చచ్చినపిదప
వైరములు పెట్టుకొనఁదగవు. ఇదిగాక మనపనియు నెఱవేఱినది. కాన యితని కుత్త
రక్రియలు గావింపుము. ఇఁక నీకితఁ డెట్లు బంధువో యట్లె నాకును బంధువు
గాని వేఱుగాఁడు. నీవలెనే యితఁడును నాకు బంధుఁడు. విభీషణా ! నీకు ధర్మముల
న్నియుఁ దెలిసినవే. కనుక, రావణుఁడు నీచేతులార శాస్త్రోక్తప్రకారమున సం
స్కారమును బొందుటకుఁ దగినవాఁడే. అట్లు పాపకారి యగువానికిని సంస్కార
ము చేసినాఁడని నీకుఁ గీర్తియు రాఁగలదు" అనెను. రాముఁడు చెప్పినదివిని, విభీష
ణుఁడు స్త్రీలనెల్లఁ బంపివైచి రావణునకు వేగిరపడి యజ్ఞశీలునకుఁ దగురీతిని సంస్కా
రము గావించువాఁడయ్యెను. అంత ఋత్విజులు, పద్మకము వట్టివేళ్లు మొదలగు గం
ధద్రవ్యములతోఁ గూడఁ జందనకాష్ఠములచే చితిని బేర్చి, దానిపయిని దెల్లనిమెండ్రు
కలజింకచర్మమును బఱచి, వేదోక్తమయిన ప్రక్రియచే రావణుని నందుఁ జేర్చిరి. అట్లు
చితిం జేర్చినపిదప రాక్షసరాజగు రావణునకు వేదవిహితమగు నంత్యేష్టి జరుపఁ
బడెను. అప్పు డా రాక్షసేశ్వరునకు పితృమేధసంస్కారము క్రమముచొప్పున
జరిపిరి. అది యెట్లన, ఋత్విజులు చితికి నాగ్నేయభాగమున వేదిని గల్పించి, యందు
పడమట గార్హపత్యమును దూర్పున నాహవనీయమును, దక్షిణమున దక్షిణాగ్నిని
నిట్లు యథాస్థానంబులఁ ద్రేతాగ్నులను స్థాపించిరి. అంతఁ బెరుఁగుతోఁ గలిసినయాజ్య
ము నిండియున్నహోమపాత్రము నందఱును ప్రతిపత్తికై చితియందువైచిరి. కర్మ
విదు లగురావణుని ఋత్విజులు రావణునిపాదములయందు సోమరాజం దెచ్చుశకట
మును, తొడలనడుమ యజ్ఞార్థము వస్తువుదంచురోలును సమస్తము లయినదారుపా
త్రములను అరణిని ఉత్తరారణిని రోఁకలిని నితరములయిన స్థాలి మొదలగువానిని,
యథాస్థానములనుంచి, వేదములందును మహర్షిప్రోక్తములయిన స్మృతులయందు
ను విధింపఁబడిన విధానమున నాచితికి సమీపమున పవిత్రమగు ఛాగపశువును వ
ధించి హోమముగావించి * పయికప్పలను నేతితోఁదడిపి రాక్షసరాజగు రావణుని

* ఇందులకు 'పరిస్తరణికాంరాజ్ఞో ఘృతాక్తాంసమవేశయన్' అనిమూలము. మహేశ్వరతీర్థు
లు 'అనుస్తరణికాంరాజ్ఞో ఘృతాక్తాం' అనిపాఠముగ్రహించి 'అనుస్తరణిక' యనఁగా రాజగవి గా

పయి వైచిరి. అప్పు డారాక్షసులు విభీషణసహితులై, మనంబులు విన్ననై యుండ, రావణుని గంధమాల్యములచేతను పలువిధములగు వస్త్రములచేతను నలంకరించి, ముఖములఁ గన్నీళ్లు దొరఁగుచుండ, నపుడు చితిపయిని బేలాలు చల్లిరి. అంత విభీషణుఁడు మంత్రయుక్తముగా రావణునకు నగ్ని నొసంగెను. అవ్విభీషణుఁడు స్నానముగావించి తడివస్త్రముతో భూమియందు గఱికలను నువ్వులను నీళ్లనునుంచి యందుఁ బ్రేతావాహనము చేసి, రావణున కుదకదానము గావించి తలసోఁక నమస్కారము చేసి, యారావణస్త్రీలను పట్టణమునకుఁ బొండని పలుమఱు సాంత్వవచనమునం జెప్పి వారలను పట్టణమునకుం గొనిపోయెను. వారలందఱును నపుడు పట్టణముం బ్రవేశించిరి. ఆరాక్షసస్త్రీలందఱును బట్టణమును బ్రవేశించినపిదప, విభీషణుఁడు రాముని యొద్దకువచ్చి యతనిపార్శ్వమున వినయయుక్తుండై నిలిచి కొలిచియుండెను. రాముండును నట్లు శత్రువును జంపి, వృత్రాసురునిఁ జంపినయింద్రునివలె వెలుంగుచు సైన్యములును సుగ్రీవుండును లక్ష్మణుండును బలసికొలువ మిక్కిలి హర్షమునొందిన వాఁడయ్యె. ఇది నూటపదునాలుగవ సర్గము.

---

రామనియోగమున లక్ష్మణుఁడు లంకయందు విభీషణునకు రావణసింహాసనమునఁ బట్టాభిషేకము సేయుట; విభీషణుఁడు పట్టాభిషిక్తుఁడై ప్రజలను సంతోషపఱిచి మరల రాముని సన్నిధికివచ్చుట; రాముఁడు సీతకుఁ దనవిజయము దెలుపుటకై హనుమంతునిఁ బంపుట.

అంత యుద్ధమును జూడవచ్చిన యాదేవతలును గంధర్వులును, దానవులును రావణునివధమును జూచి తమతమవిమానముల నెక్కి మేలయినముచ్చట లాడుకొనుచు తమతమనెలవులకుం బోయిరి. అమ్మహాభాగులు, హర్షయుక్తులై భయంకరమయిన రావణవధమును, రామునిపరాక్రమమును, వానరులు గావించిన మహాయుద్ధమును, సుగ్రీవుని మంత్రమును, లక్ష్మణునకు రామునందుఁగల యనురాగమును, నతనిపరాక్రమమును, నట్టి సుపుత్త్రులఁ బడసిన సుమిత్రసౌభాగ్యంబును ముచ్చటలాడుకొనుచు తమవచ్చినదారిం బోయిరి. మహానుభావుం డగురాముఁడు మాతలిని మిక్కిలియు గారవించి దేవేంద్రుఁడు పంపినదియు నగ్నివలె ధగధగ వెలుఁగుచున్నదియు నగుదివ్యరథమును గొనిపొమ్మని యనుజ్ఞయిచ్చెను. ఇంద్రసారథియగు మాతలియు రామునననుజ్ఞనొంది యాదివ్యరథము నెక్కి దేవలోకమునకుం బోయెను. దేవతాసారథులలో మేటియగు నమ్మాతలి స్వర్గలోకమునకుఁ బోయినపిదప రాముఁ

---

న రాజగవిని జంపి దానిచర్మముచే రావణునకుఁ గప్పిరని యర్థముసేసి యిందులకు 'యథామృతాయానుస్తరణీం ఘ్నన్తి' అని శ్రుతిని ప్రమాణీకరించియున్నారు.

డింత విజయమును సుగ్రీవుని సాహాయ్యంబునం గలిగినదిగావున పరమసంతుష్టుఁడై యతనిని గౌఁగిలించుకొనెను. అతం డిట్లు సుగ్రీవునిఁ గౌఁగిలించుకొని గారవించి లక్ష్మణుఁడు శిబిరమునకుఁ బోదమని ప్రేరింప,వానరోత్తములపూజ లందుచు శిబిరమునకుఁ బోయెను. రాముఁ డపుడు, తనసమీపమున తేజంబు మిక్కిలియు దీపింపనున్న సత్త్వసంపన్నుని సుమిత్రాపుత్త్రుఁ డగులక్ష్మణునిం జూచి *'సౌమ్యా! నాయందనురక్తియు భక్తియుం గలిగి నాకుపకారము గావించినయీవిభీషణునకు ముందు లంకకుఁబోయి పట్టాభిషేకము గావింపుము. సౌమ్యా! రావణునితమ్ముఁడగు నీ విభీషణుఁడు లంకయందు పట్టాభిషిక్తుఁడగుటను జూడం గందు నేని యిదియ నాదు ముఖ్యమయినకోరిక' అనెను. మహాత్ముఁడగురాముఁ డట్లు చెప్పఁగా లక్ష్మణుఁడు వల్లెయని మిక్కిలి సంతోషమున బంగారుకలశముల రావించెను. లక్ష్మణుఁడు సువర్ణకలశములను మేటివానరముఖ్యులవశమున నిచ్చి సముద్రజలములను దెచ్చుటకు మనోవేగముగల మహాబలులగు వానరుల నియోగించెను. అట్లు లక్ష్మణుఁ డాజ్ఞాపించుటం జేసి మహాబలవంతులును వానరోత్తములు నగునవ్వానరులు నచటనుండి శీఘ్రముగాఁ బోయి సముద్రములనుండి జలంబులఁ దీసికొనివచ్చిరి. అంత లక్ష్మణుఁడు విభీషణుని సింహాసనమునం గూర్చుండఁబెట్టి ఒకకలశ మెత్తి దానిచే నతని కభిషేకముగావించెను. ధర్మాత్ముండగు నాలక్ష్మణుఁడు రామునియాజ్ఞవలన, లంకాపురమున మిత్త్రగణపరివేష్టితుఁడయి యున్నశుద్ధాత్మునకు విభీషణునకు, వేదోక్తప్రకారమున సమస్త రాక్షసమధ్యమునఁ బట్టాభిషేకముగావించెను. విభీషణుఁడు లంకయందు పట్టాభిషిక్తుండై రాక్షసరాజగుటనుజూచి విభీషణునిమంత్త్రులును నతనికి భక్తులయిన రాక్షసులును సంతోషమునొందిరి. అవ్విభీషణుఁడు అట్లు రాముఁ డొసంగినయమ్మహారాజ్యము నొంది ప్రజలనందఱ చల్లనివాక్యముల నలరించి యంత మరల రామునిసన్నిధికి వచ్చెను. అంత నపుడు పౌరులగు రాక్షసులు అక్షతలను కుడుములను, పేలాలను దివ్యములగు పుష్పములను, మిక్కిలియు సంతుష్టులై మంగళార్థముగ నవ్విభీషణునకు సమర్పించిరి. వీర్యశాలియు దుర్ధర్షుండునగు విభీషణుఁడు ఆవస్తువులనన్నింటిని

* ఇందులకు 'విభీషణమిమంసౌమ్య లంకాయామభిషేచయ। అనురక్తంచభక్తంచ మమచైవోపకారిణమ్॥ ఏష మేపరమః కామో యదీమం రావణానుజమ్। లంకాయాం సౌమ్యపశ్యేయమభిషిక్తం విభీషణమ్' అనిమూలము. మునుపు సముద్రతీరమున నే లంకారాజ్యమునకు అభిషేకము జరిగియుండియు మరల దానిని విధించుట రావణసింహాసనమందు అభిషేకము చేయుటకని తెలియునది. 'అనురక్తమ్' అనుటచే మిత్త్రునికృత్యము చెప్పఁబడినది. 'భక్తమ్' అనుటచే దాస్యకృత్యము చెప్పఁబడినది. 'ఉపకారిణమ్' అనుటచే అనురాగమును భక్తియు కార్యమునం బర్యవసించుట—అనఁగా చేసిచూపుట చెప్పఁబడినది. 'ఏష మేపరమః కామః' అని విభీషణుని లంకారాజ్యపట్టాభిషేకమె తనకు పరమమైన కామముగా చెప్పుటచే శరణాగతుఁడయిన విభీషణునియభిమతమును బూరించుటయే తనవిజయమునకు ముఖ్యప్రయోజనమని సూచితమయినది.

బరిగ్రహించి *తాను రామునకును లక్ష్మణునకును మంగళప్రయోజనము లయినపాత్రాదిమంగళద్రవ్యములనెల్ల నర్పించెను. రాముం డట్లు కృతార్థుఁడై పరిపూర్ణమనోరథుండై యున్న విభీషణునిఁ జూచి తనకు భోగేచ్ఛకొఱకుఁగాక విభీషణునికిఁ బ్రీతి సేయంగోరియే యావస్తువుల నన్నింటిని బ్రతిగ్రహించెను. అంత రాముఁడు తనపార్శ్వభాగమున నంజలి గీలించి కొలిచి యున్న పర్వతాకారుండును వీరుండును నగు కపిని హనుమంతునిం జూచి, 'సౌమ్యా! జయశీలాగ్రణీ! నీవు మహారాజగు నీవిభీషణునియనుమతి నొంది లంకకుఁ బొమ్ము. పోయి యథావిధిని విభీషణునియనుజ్ఞ నొంది రావణునిగృహమును బ్రవేశించి విజయమును జెప్పి సీతకు సంతోషము గల్గించి యావిదేహరాజకుమారికి నేనును సుగ్రీవుఁడును లక్ష్మణుఁడును కుశలముగా నున్నారమనియు రావణుఁడు నాచే హతుఁ డయ్యెననియుఁ జెప్పుము. వానరేశ్వరా! నీవీప్రియవృత్తాంతమును సీతకుఁ జెప్పి యాపడఁతి చెప్పుసందేశమును దీసికొని మరలి రావలయును' అనెను. ఇది నూటపదియేనవసర్గము.

—⊸—

## హనుమంతుఁడు సీతకు రామువిజయమును దెలిపి యాబిడ సందేశమును గొని రామునొద్దకు వచ్చుట.

రాముఁ డిట్లాజ్ఞాపింపఁగా వాయుపుత్త్రుఁడు హనుమంతుఁడు రాక్షసులచేఁ బూజితుండగుచు, లంకాపురమును బ్రవేశించెను. మహాతేజుం డగు నాహనుమంతుఁడు రావణునిగృహమును జొచ్చి యచట నొకవృక్షముక్రింద రాక్షసస్త్రీపరివృతయై యానందము దూలి దేహసంస్కారము లేక క్రూరగ్రహపీడిత యగురోహిణివలె నున్నసీతాదేవిని జూచెను. హనుమంతుఁడు సీతసమీపమునకుఁ బోయి తనపేరు చెప్పి, ప్రణామము చేసి, నిశ్చలుఁడై వినయసంకుచితగాత్త్రుఁడై నిలుచుండెను. అట్లు వచ్చిన మహాబలుని హనుమంతునిఁ జూచి సీతాదేవి, మొదటఁ జూచియు గుఱుతుపట్టఁజాలక యూరకుండెనుగాని పిమ్మటఁ దేఱిపాఱఁ జూచి మున్ను వచ్చిపోయినవాఁడని తలంపునకుఁ దెచ్చుకొని మిక్కిలి యునుబ్బు చెందినదయ్యె. వానరోత్తముఁ డగు హనుమంతుఁడు తన్నుఁ జూచి సీతాదేవి మొగము వికసిల్లుటను గాంచి రాముఁడు చెప్పినవృత్తాంతమంతయు చెప్పందొడంగి, "సీతాదేవీ! రాముఁడును సుగ్రీవుఁడును, లక్ష్మణుఁడును విభీషణుఁడును వానరసైన్యములును క్షేమముగానున్నవారు. పగవారిఁ జమడంచు రాముఁడు తా నిప్పుడు శత్త్రువును గీటడంచి కృతకృత్యుండై తనక్షేమమును సీతకుఁ జెప్పు మనెను. దేవీ! విభీషణునితోడ్పాటునను వానరులసాహాయ్యమునను లక్ష్మణునినీతిబలమునను రాముఁడు రావణుని వధించెను. వీరుఁ డగు రఘునందనుఁడు శత్త్రు

---

* శుద్ధాత్ముఁ డనుటచే రామాజ్ఞచేతనే అభిషేకము నంగీకరించినాఁడుగాన వాస్తవమునకు రామకైంకర్యమందే యాసక్తుఁడయ్యెనని తెలియునది. ఆజ్ఞాకైంకర్యమే కదా కర్తవ్యము. కనుక పట్టాభిషేకము చేసికొనుట రామాజ్ఞాకైంకర్యమే యనిభావము.

వును వధించినవాఁడగుటంజేసి మిక్కిలియుసంతుష్టుఁడై కృతార్థం బగుమనంబున నీతోనిట్లు చెప్పుమనెను. 'నాదుదేవీ! నీకుఁ బ్రియవార్తను జెప్పెద. నిన్ను మిక్కిలియు సంతోషపెట్టెదను. పాతివ్రత్యధర్మము దెలిసినదానా! నాభాగ్యమున నీవు జీవించి యున్నావు. నీవు లేనిచో నేను జయించినది వ్యర్థమే యగును. సీతా! నాపరాక్రమముచేత మనకు యుద్ధమున జయము గలిగినది. కనుక నీ వింక కుందు మాని స్వస్థముగా నుండుము. పగవాఁ డగురావణుఁడును హతుఁ డయ్యె. ఈలంకయు మనవశమున నున్నది. నిన్ను శత్రువుచేతినుండి విడిపించుటయందే మనస్సు గట్టిగా నిలిపి, దానివలన నిదురయుఁ బట్టక, మహాసముద్రమున సేతువుగట్టి, రావణుని వధింతునన్న యీప్రతిజ్ఞను దీర్చుకొంటిని. రావణునికి వాస మయినయీలంకయం దున్నానని యొంతమాత్రము తత్తఱపడవలదు. రావణుండు చచ్చి యీలంకపరిపాలనమంతయు మనవిభీషణునికి లోనయినదిగనుక నీవు సొంతగృహమున నున్నట్టేకాని వేఱుగాదు. కాన భయమేమియుఁగలుగదని నమ్మి యూఱడిల్లుము. ఈవిభీషణుఁడును, నిన్నుఁజూడవలయునని తుకతుకపడుచు నిదిగో రాఁగలఁడు!' అని తనమాటగా సీతోఁజెప్పు'' మని చెప్పె' ననెను. సీతకు హనుమంతుఁ డిట్లుచెప్పఁగానే చంద్రబింబమువంటి మొగము గలయాబిడ సంతోషము వెల్లిగొన దిగ్గనలేచి యుబ్బుమిక్కుటమై యేపనియుఁ జేయనీయక యాఁగుటచే మ్రానుపడి యేమియుఁ బలుకఁజాలక యూరకుండెను. అట్లుసీత తనకు మాఱుపలుకకుండుటఁ జూచి యవ్వానరోత్తముఁడు హనుమంతుఁడు, 'దేవీ! ఏమి యాలోచించెదవు? నాతో బదులుమాటాడవదియేల?' యని యడిగెను. సీత హనుమంతుఁ డిట్లడుగఁగా పతివ్రతాధర్మమునం దెంతయు నెలకొనియుండునదిగాన పతిసందేశవార్తకు నెంతయుసంతోషము నొంది, యుబ్బువెల్లున పలుకులు డగ్గుత్తిక పడ 'నాభర్త విజయము నొందెనన్నయీప్రియవార్తను విన్నంతనే మిక్కుటమైన సంతోషపారవశ్యముచే నేవ్యాపారమును జేయఁగూడకుండెను; కాన క్షణమాత్రము మాటలాడఁ జాలకుంటిని. హనుమంతా! నాకిట్టిప్రియవార్తను జెప్పినమహోపకారనిధికి నీకు బదులుగాఁ జెప్పుటకై తగినట్టిప్రియవచనము, నెంత యాలోచించినను ఈలోకమునందంతటను నాకుఁ గనఁబడలేదు. ఎట్టిప్రియవచనమును జెప్పవచ్చినను నది నీవు దెచ్చినప్రియవాక్యమునకుఁ దక్కువగానే తోఁచుచున్నది. సౌమ్యా! హనుమంతా! నీవు నాకిట్టిప్రియవార్తను జెప్పినందులకై నీకు బదులు చెప్పుటకుఁ దగినమాట లేకపోవుటే కాదు, మఱియిచ్చుటకు మిక్కిలియుందగినట్టివస్తువుగూడ భూమియందును స్వర్గపాతాళములయందును నాకుఁ గనఁబడకున్నది. వెండిగాని బంగారుగాని నానావిధము లయినరత్నములుగాని త్రైలోక్యరాజ్యాధిపత్యముగాని, యివన్నియు నీవుచెప్పిన ప్రియవచనమునకు సాటియని చెప్పనుం దగదు' అనెను. సీత యిట్లు చెప్పఁగా హనుమంతుఁడు, చేతులుమోడ్చి యాబిడసమ్ముఖమున నిలిచి 'నీవు పెనిమిటికి ప్రియమును హితమును గూర్చుటయందే యాసక్తురాలవు. పెనిమిటి జ

యమునొంద వలయుననియే యువ్విళ్లూరుదానవు. నెయ్యము దొలఁకాడు నిటువంటి వాక్యము పలుకుట నీకే తగునుగాని మఱియొక్కతికిఁ దగదు. ఇటువంటి నెయ్యంపు మాటయే నాకు బదులుగాఁ జెప్పఁదగినట్టి లోకోత్తర మైన ప్రియవచనము. సౌమ్యురాలా! మఱియు నాకు బదులు గాఁ జెప్పఁదగినట్టి ప్రియవచనము నీకుఁ గానఁబడ లేదంటివే; ఇట్లు నీవు చెప్పినమాటకు, నామాట మితి మీఱిన ప్రీతిని గలిగించునది, యనుగొప్ప తాత్పర్యము గలుగుచున్నది. మఱియు నీమాట ప్రీతిపూర్వకమయినది. ఇట్టినీమాట యొక్కటియే నానావిధము లగురత్నసమూహములకంటెను మాత్రమే కాదు; దేవేంద్రపదవికన్నను విశేషించినది. ఇట్టివచనమును వినుటచేతనే నాకు నీవిచ్చుటకుఁ దగినదిగా లేదన్న సర్వోత్తర మైనవస్తువు లభించినట్టయినది. రాముఁడు శత్రువును వధించి విజయము నొంది నెమ్మది నుండఁగాఁ జూచుచున్నానే; ఈయొక్క ప్రయోజనమువలననే దేవరాజ్యము మొదలయిన యతిశయములు గలిగినట్లయినవి. రామవిజయమును జూడఁగనుటయే నాకు దేవరాజ్యము మొదలైనసంపదలు సుమీ' అనెను. అతం డట్లు చెప్పినదివిని జనకరాజసుత యగుసీత యవ్వాయుకుమారునితో మఱింత శుభం బగువాక్యమున 'వాక్యమునకు *వలయు సమస్తలక్షణములతోఁ గూడి విన్నంతనే యానందము గలిగించునట్టిమాధుర్యగుణమున వన్నెకెక్కి, గ్రహణధారణాదు లయినయెనిమిదియంగములతోఁ గూడినబుద్ధి దళుకొత్తునట్టివాక్యముల మాడులాడుటకు నీవే సమర్థుఁడవుగాని మఱియొకఁడుగాఁడు. నీ వానృశంస్యధర్మము మిక్కిలియుఁ గలవాఁడవు. ఆధర్మమువలన నీవు వాయువునకుఁ బొగడందగినపుత్త్రుండ వగుదువు. నీ వాధర్మమువలన మాకోటిలోకులకు వాయువునకంటెను సంజీవనకరుఁడవై యున్నావు. ప్రయాసము నోర్చుబలమును, యుద్ధమున కుత్సహించుశౌర్యము, శాస్త్రజ్ఞానము, దేహదార్ఢ్యము, పరాక్రమము, సామర్థ్యము, పరులను గ్రిందుపఱుచు తేజము, అపరాధముల సైఁచుక్షమ, ప్రభావము కలఁగించునవియున్నను కలంగకుండు ధైర్యము, వినయసంపన్నత, విశిష్టనీతిసంపత్తి, యివి మొదలుగా నుత్తమము లయినమంగళగుణము లనేకములు నిన్నాశ్రయించియే యెంతయు శోభిల్లుచున్నవి. ఇందులకు సందియము లేదు. నేను లేనిగుణముల నారోపించి పొగడుచున్నదాననుగాను' అనెను. అంత నాహనుమంతుఁడు హర్షంబున సంభ్రమము నొందక యంజలిగీలించి సవినయముగా సీత యెదుటనిలిచి, 'నీవుపతియే దైవముగాఁ గలిగినదానవుగాన యతనిం బాసినదుఃఖముచే నశోకవనమునఁ గృశించుచుండఁగాఁ

*ఆకాంక్ష యోగ్యత సన్నిధి యనునివి వాక్యలక్షణములు. 'గ్రహణం ధారణం చైవ స్మరణం ప్రతిపాదనమ్ । ఊహాపోహోర్థవిజ్ఞానం తత్త్వజ్ఞానంచ ధీగుణాః ' గ్రహించుట ధరించుట, స్మరించుట బోధించుట ఊహించుట అపూర్వముసూహించుట, అర్థము దెలియుట తత్త్వము దెలియుట అనునెనిమిదియు బుద్ధికి గుణములు. మునుపు రాముఁడు కిష్కింధాకాండమున 'నానృగ్వేదవినీతస్య 'ఇత్యాదులచే హనుమంతుని వాక్యసౌష్ఠవమును ప్రసంగించినట్లే సీతయు నిట ప్రశంసించుచున్నదని తెలియునది.

నిన్ను భయంకరము లయినరూపములును నడవళ్లును గలిగి, దయ మాలినమనంబులును నంతకన్న దయమాలినచూపులును గలిగి, యీరాక్షసస్త్రీలు మునుపు బెట్టిదపు మాటలు పలికినారు; మఱి మిక్కిలియుఁ దర్జించినారు. కాన నీవనుమతి యొసంగినయెడ వీరినందఱను బట్టి చంపవలెనని కోరుచున్నాను. నీకుఁ బ్రియవార్త చెప్పినందులకుఁ బారితోషికముగా నాకీవరమిమ్ము. కల్యాణీ! నీకప్రియము గావించినభయంకరాకారలగు నీరాక్షసస్త్రీలను భూమిం బడఁద్రోసి పిడికిళ్లం బొడిచియు, చేతులం జఱచియు, కాలం దన్నియు, మోఁకాళ్ల బెట్టిదముగా మోఁదియు, పండ్లరాల్చియు, చెవులను ముక్కులను గొఱికి వైచియు, వెండ్రుకలనూడఁ బెఱికియు, వాఁడిమూఁతులుగలగోళ్లం జీల్చియు, పలువిధములం బీడించియు, నెగిరి మీఁదం బడియు, చేతుల గ్రుద్దియు నాకోపము కొలఁది నిట్లు నానావిధములఁ జంపఁ గోరుచున్నాను. దేవీ! యశస్వినీ! నీకపరాధము గావించిన దుష్టలయిన యీరాక్షసస్త్రీలను ఈచెప్పినట్లు నానావిధములు గఁ బీడించి వధింపఁ గోరుచున్నాను' అనెను. కీర్తిమతి యగు జనకరాజపుత్రి సీత, హనుమంతుఁ డట్లు చెప్పినది విని యతనితో ధర్మయుక్తముగా 'వానరోత్తమా! రాజును గొలిచి బ్రతుకువారలు గాన రాజు చెప్పినపని చేయుచుఁ జేయకున్న దండమునకుఁ బాలయియుండుదాసీలయెడ నెవఁడు కోపించును? రావణునకట్టిదాసీలు వీరు. కాన వీరలపయి నినుబోఁటివాఁడు కోపపడుట యెంతమాత్రము యుక్తము గాదు. మఱియు నాభాగ్యము పరిపక్వము గాక తలక్రిందగుటం జేసియు, పూర్వము నేను జేసికొన్న దుష్కర్మముచేతను, నాకీతర్జన భర్జనాదులన్నియు సంభవించినదే కాని మఱేమి కాదు. మునుపు చేసికొన్నది యిప్పు డనుభవింపక తీఱదు గదా. రావణునిదాసీలవలన నిట్టి తర్జనభర్జనాదులను అనుభవింపవలసిన కాలము గూడినందున, నేను బడి తీఱవలసినవే యని నిశ్చయించుకొంటిని (ఇట్లు వీరిని దండించుటకుఁ దగు కారణబలము నాకు లేనందున) కృపాపరవశురాలనై వీరిని మన్నించుచున్నాను. వానరోత్తమా! రావణుఁ డాజ్ఞాపింపగా నీరాక్షసస్త్రీలు నన్నట్లు తర్జించిరి. అతఁడు హతుఁడు కాఁగా నన్నట్లు తర్జింపకున్నారు గదా. ఇట్లు తమయిచ్ఛను గాక రాజాజ్ఞం బట్టి వీరు చేసిన దానిని మనము తప్పుగాఁ గొనరాదు. వీరు తమంతట నే తప్పు చేసియుండినను డనీ. అప్పటికిని మన్నింపవలసినదే. ఎట్లన వానరా! ఈ విషయమై * యొకభల్లూకము పురాతన

* ఒకవేటకాఁడు, ఒకపులి తన్ను తఱుమఁగా నొకచెట్టెక్కెను. ఆచెట్టుమీఁద నెలుఁగుబంటియొకటియుండెను. చెట్టుక్రిందనున్న పులి యాయెలుఁగుబంటిని జూచి 'అడవి మృగములగు మన కెల్ల జాతిశత్రువు వీఁడు కాన వీనిని చెట్టునుండి పడఁద్రోయు' మనఁగా 'నేనున్నచోటికి వచ్చినవీనిని పడఁద్రోయను. అట్లు చేసినచో ధర్మహానియగు' నని చెప్పి యది నిదురించెను. అనంతరము పులి యావేఁటకానితో 'నిన్నుఁ జంపక విడిచెదను. నిదురించుచున్న యాయెలుంగుబంటిని బడఁద్రోయు' మనఁగా వాఁడట్లె దానిని క్రిందఁ బడఁద్రోసెను. ఆయెలుఁగుబంటి యభ్యాసవశమున మఱియొకకొమ్మను నూఁతగొని పడదయ్యెను. అంత పులి 'వీఁ డిదిగో నీకపరాధము చేసినాఁడు కాన వీనిం బడఁద్రోయుము' అని మాటిమాటికి చెప్పుచున్న

మును ధర్మయుక్తమునగు నీశ్లోకమును నొకవ్యాఘ్రమునకుఁ జెప్పెను. దానిని జెప్పెద వినుము. *భల్లూకము 'ప్రాజ్ఞుఁడగువాఁడు తనకపకారము చేసినవారికి ప్రత్యపకారము చేయఁడు. అపకారము చేసినవారికి బదులునకపకారము చేయరాదనుట యాచారము. దానినవశ్యము రక్షింపవలయును. సత్పురుషులకు సచ్చరిత్రమే భూషణము' అని చెప్పెను. †హనుమంతా! పాపులయినను గాని మంచివారయినను గాని, వధమునకర్హులయినపుడు, గొప్పవాఁడగువాఁడు, వారియెడఁ గారుణ్యమె కావింపవలయును. 'అపరాధులను దండింపకుండుట ప్రసక్తించునే' యందువా? ఈలోకమున నపరాధము చేయనివాఁడొక్కఁడును లేఁడు. శాస్త్రము చొప్పున వీరికి దండనమును గలుగదు. రాక్షసులు కామరూపులయి లోకహింసనే వినోదముగా విహరించుచు నానావిధములగు పాపములు చేయుచుండువారలయినను అది వారికి జాతిప్రయుక్తమైనదిగాన వారికి దండనము చేయుటంతమాత్రము దగదు' అనెను. సీత యిట్లు చెప్పఁగా వాక్యనిపుణుఁడగు హనుమంతుఁడంత కీర్తిమతియును రాముని పత్నియు నగు నా సీతం జూచి 'శరణాగతరక్షణమే

ను ఎలుఁగుబంటి 'వీఁడు ఈ యొక్క తేఁపయే కాదు. ఇట్లు పెక్కు తేఁపలు నాకపరాధము చేసినను నీకుఁ బట్టియియ్యను' అని చెప్పి వానిని రక్షించెనని పురాణకథ యిట అనుసంధించునది.

* ఇందులకు 'నపరః పాపమాదత్తే పరేషాం పాపకర్మణామ్ । సమయో రక్షితవ్యస్తు సన్తశ్చారిత్రభూషణాః' అని శ్లోకము. సుగ్రీవునికి రాముఁడు కపోతాఖ్యానముం బోలె దేవి హనుమంతునికి తన యభిప్రాయపడిన యర్థమునకు ఋక్షగీతమును ప్రమాణీకరించినదని తెలియునది.

† ఇందులకు 'పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ । కార్యం కరుణమార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి' అని మూలము. ఇది దేవియభయప్రదానశ్లోకము. విశేషార్థము—(పాపానాం వా శుభానాం వా) నీయభిప్రాయము చొప్పున పాపులును నాయభిప్రాయము చొప్పున సాధువులు నయినవారియెడ 'దోషోయద్యపి తస్యస్యాత్' అని రాముఁడన్నట్లు దోషమే నాకుద్దేశ్యము. మఱికి గలవాఁడే కద స్నాన మపేక్షించును. వారు పాపులగుటం బట్టియే నన్నపేక్షించెదరు. సాధువులకు నావలనఁ బనియేమి? వారిపుణ్యమే వారికి రక్షకమగును కాఁబట్టి వారిపాపమే నాకుద్దేశ్యము. అయినను 'దండింపఁదగినవారిని దండింపవలయును. దండింపరానివారిని గాదు' అను ధర్మశాస్త్రము నిన్నుఁ జెంది భంగమునొందుచున్నదే యన్నచో 'దుష్టుఁడయినను శరణాగతుఁడు రక్షింపఁదగినవాఁడు'. అను విశేషశాస్త్రము నిన్నుఁ జెంది భంగమునొందవలయునా యనుచున్నది (వధార్హాణాం) వధార్హులయిన వారియందును. ఇచట సప్తమ్యర్థమందు షష్ఠి. (ప్లవంగమ) అభిలషింపరానిదానినే అభిలషించితివి క్రోఁతివి గాన. అట్టివారియందు (ఆర్యేణ) మహాపురుషుఁ డగువానిచేత, (కరుణం) దయ, (కార్యం) చేయఁదగినది. మహాపురుషుఁడగువాఁడు దయయే చూపవలయుననుట- పుణ్యమును పాపమును అటుంపనీ ఇప్పుడు జాలిఁబుట్టించుచున్న వీరిపనుజూడుము. లేక (శుభానాం వధార్హాణాం యథా కరుణం కార్యం తథా పాపానాం వధార్హాణామపి కార్యమిత్యర్థః) సాధువులయెడ వధార్హులయినను కరుణ చూపినట్లు పాపులయెడను జూపవలయునని యర్థము. అప్పుడు సాపరాధులగువారికి దండనము లేకపోవుచున్నదేయనఁగా (న కశ్చిన్నాపరాధ్యతి) అపరాధము చేయనివాఁ డెవ్వఁడు. అందఱును అపరాధులే యని యర్థము. ఇతి శ్లోకః.

వ్రతముగాఁ గలరామునకు నీవే తగినధర్మపత్నివి. పాతివ్రత్యాదిగుణములఁ గీర్తి వహించినదానవు. దేవీ ! నాకు బదులుసమాచారము చెప్పిపంపుము. రాముఁ డున్నయెడకుఁ బోయెదను' అనెను. హనుమంతుఁ డట్లు పలుకఁగా జనకరాజసుత యగు సీత యతనితో వానరోత్తమా! నాప్రాణేశ్వరుని రాముని గన్నారఁ జూడఁగోరెదను' అనెను. సీత యిట్లు చెప్పినది విని మహాతేజుం డగువాయుతనూజుండు హనుమంతుఁడు సీతకు సంతోషము గలిగించుచు ' పూజ్యురాలా! శచీదేవి యసురులను జంపి వచ్చిన దేవేంద్రునిఁ జూచినట్లు సమస్తశత్రువులను రూపుమాపి క్షేమముగ నున్న మిత్రులతోను తమ్ముఁడు లక్ష్మణునితోను గూడి పూర్ణచంద్రునివలె నెమ్మొగంబు దులకించు చున్నరాముని నవశ్యము చూడఁగలవు ' అనెను. సాక్షాన్మహాలక్ష్మివలె రాజిలుచున్నయాసీతతో హనుమంతుఁ డివ్విధంబునఁ బలికి, యంత రాముఁ డున్నయెడకు మహావేగంబున వచ్చినవాఁ డయ్యె. ఇది నూటపదియాఱవసర్గము.

---

శ్రీరామునియాజ్ఞను విభీషణుఁడు సీతకు శిరస్స్నానదివ్యాలంకారాదులుగావించి రామునియొద్దకుఁ దెచ్చుట. సీత హర్షవిస్మయస్నేహభరితహృదయయై శ్రీరామవదనమును సందర్శించుట.

కార్యజ్ఞుం డగుహనుమంతుఁడు మహాప్రాజ్ఞుండును సమస్తధనుర్ధరులలో మేటియు నగురామునొద్దకుఁ బోయి, "ఎవతెకొఱకు సేతుబంధాదికార్యములనెల్ల నిట్లు దొడంగి చేసితిమో, ఎవ్వతిని బడయుటకై రావణుని జయించుట యనుఫలమును బొందనయ్యెనో, యట్టిసీతాదేవి శోకమున పురపురం బొక్కుచున్నది గాన మీరుకుఁ జూడఁదగును. శోకావేశమున కన్నులనీళ్లు కలఁగంబాఱుచున్నయాసీతాదేవి, నీవు జయమునొందినది విన్నంతనే సంతోషము నొందినదయ్యె. ఆబిడ పూర్వము నన్నుఁ దెలిసియున్నందున నాయందునమ్మికగలిగి, నాతో 'విజయమునొంది కృతార్థుం డయి యున్నరామునిని లక్ష్మణసహితముగాఁ జూడఁగోరెదను ' అని చెప్పె"ననెను. హనుమంతుఁ డిట్లు చెప్పఁగా రాముఁడు ధార్మికులలోనెల్ల నుత్తముఁడుగావున, కొంచెము కన్నీరొలుక 'చిరకాలము రావణునింట నుండినసీతను బరిగ్రహించినయెడ లోకాపవాదము గలుగును. నిర్దోష యగునాపడఁతిని బరిత్యజించినయెడఁ బాపము గలుగును. ఏమి చేయవచ్చును ' అని తోడనే చింత నొందినవాఁ డయ్యె. అంత రాముఁడు *దీర్ఘముగాను నుష్ణముగాను నూర్పుపుచ్చి, నేలం జూచుచు దాపున మేఘముంబోలె నల్లని

---

* ఊర్పు దీర్ఘముగా నుండుటచే చింత దీర్ఘముగా నుండుటయు, ఉష్ణముగానుండుటచే కందియున్నసీతను మఱలనెట్లు కుందింపఁజేయుదునని లోపలితాపమును సూచితములు. నేలం జూచుట చింతాపారవశ్యకృతము. గోవిందరాజులు.

మేనుతో సీతం దేర వేగిరపడుచున్న విభీషణునింజూచి*'నీవు, సీతను,అభ్యంగస్నానము చేయించి మంచిమైపూఁతల నలందఁజేసి మేలయినభూషణముల నలంకృతం గావించి పొంతకుఁ దెమ్ము. జాగువలదు' అనెను. రాముఁడిట్లు చెప్పఁగా విభీషణుండు త్వరితుండై, లంకను బ్రవేశించి యంతఃపురమునకుఁబోయి తన స్త్రీలచేత సీతాదేవికి 'సీతాదేవీ! నీవుస్నానము సేసి దివ్యములయినమైపూఁత లలంది, దివ్యము లయినయాభరణముల నలంకరించుకొని వాహనము నారోహింపుము. నీకు శుభంబగుఁగాక. నీభర్త నిన్నుఁ జూడఁ గోరుచున్నాఁడు' అనిచెప్పించెను. విభీషణుఁడట్లు స్త్రీముఖమునఁ జెప్పినమాట నువిని, సీత,యతనింజూచి 'రాక్షసరాజా! నే నింతవఱకున్నరీతినే స్నానము సేయక యే నాభర్త నుజూడఁగోరెదను' అనెను.ఆబిడ యిట్లుచెప్పినది విని విభీషణుఁడు 'అట్లుగాదు. రాముఁడు నీకు భర్తయు మనకు రాజు నగును గాన నాతఁ డేమిచెప్పెనో యది యట్లే నీకుఁ గావింపఁదగును' అని స్త్రీముఖమున బదులుచెప్పెను. అతఁడట్లుచెప్పినమాట విని సీత భర్తనే దైవముగాఁదలఁచి, పతిభక్తియే వ్రతముగా నుండు నట్టిమహాపతి వ్రతగాన యట్లేచేసెదనని ప్రత్యుత్తర మొసంగెను. అంత,విభీషణుఁడు సీతకు శిరస్స్నానము చేయించి, స్త్రీలచే నంగరాగపుష్పాదులచే నలంకృతం గావించి మిక్కిలి వెలపొడుగయినభూషణములఁ దొడిగించి దివ్యమయిన వస్త్రముగట్టంజేసి యాబిడను మేలయినవస్త్రము పఱవంబడి మెఱయుచున్నపల్లకి నెక్కించి వెక్కండ్రు రాక్షసులు బలసి రక్షించుచురాఁగా రామునియొద్దకుఁ దోడ్కొనివచ్చెను. అవ్విభీషణుఁడు సీతతో రామునికడకు రాఁగా నమ్మహాత్ముఁడది తెలిసియుఁ నేమియుఁజెప్పక చింతను గూరియుండెను. విభీషణుండు నమస్కరించి మిక్కిలియు హర్షముప్పొంగ 'సీతాదేవిని దోడ్కొనివచ్చితి'నని విన్నవించెను. అట్లురాక్షసునింటఁ జిరకాల ముండినసీత వచ్చినదని విన్నంతనే రామునకు,రావణుంజంపి సీతను దెచ్చినందులకు నుబ్బును,చిరకాలము రావణునింటనుండినదే యని దీనతయును, ఇట్టిదాని నెట్లు పరిగ్రహింపవచ్చునని రోషమును,ఈ మూఁడును బయికొనెను. అంత రాముండు కొంతసేపు సాధకబంధకముల వితర్కించుచు నాలోచనముచేసి, యుబ్బు దక్కి తనపార్శ్వమున నున్నవిభీషణునిఁ జూచి 'సౌమ్యా! రాక్షసరాజా! నీవెల్లప్పుడును నావిజయమునందే యాసక్తిగలవాఁడవుగదే. శీఘ్రముగా సీతను నాసమీపమునకుఁ దోడితెమ్ము' అనెను. అతఁడు రాముఁడు చెప్పిన యామాటందెలిసి,శీఘ్రముగా నచ్చట నంతటను గలజనము నెల్ల నవ్వలికిఁ దొలఁగించుటకుఁ దగినవారి నియమించెను. చొక్కాయీలను తలగుడ్డలను దాల్చి, యెల్లప్పుడును బెత్తమును బట్టుటచే గడునుపాఱినచేతులు గలపురుషులు బెత్తములనచటిజనులను

---

* రాముఁడు సీతతో మీఁద పరుషము లాడంగోరి యుండుటచే నప్పటివలె నలంకారాదులులేని దీనదశయం దుండఁగా నట్లు పరుషమాడఁదగదు గాన పరుషము లాడంవగుటకై స్నానాలంకారాదులు గావించి తెమ్మనెనని తెలియునది. అట్లు పరుషములాడుట యాబిడను త్యజించుటకుఁ గాదు.బ్రహ్మాదిదేవతలయెదుట నామెపాతివ్రత్యమును బ్రకటించుట కని తెలియునది. గోవిందరాజులు.

దొలంగ బడియుచు చుట్టును దిరిగిరి. అట్లు వారిని నలుగడలఁ దొలంగఁద్రోలుచుండఁగా మూఁకలుగొని యున్న భల్లూకులును వానరులును రాక్షసులును గుంపులుగుంపులుగా దవ్వగఁ దొలంగిపోయిరి. వారందఱను దొలంగఁ ద్రోలుచుండఁగాఁ బుట్టిన పెను ధ్వని వాయువుచేఁ జిమ్మఁబడుచుండు మహాసముద్రపు ఘోషమువలె వినఁబడెను. అట్లు నలుగడల తొలంగ ద్రోయఁబడుచు తొందరపడుచున్న వారలం గలయఁజూచి రాముఁడు వానరులందఱి దాక్షిణ్యమువలన సహింపక 'త్రోయ వలదు' అని వారించెను. రాముఁడు వేగిరపడి కంటఁ జూచుచుం జూఁడునట్లు వేఁడిచూపుల మహాప్రాజ్ఞుం డగు విభీషణునిం జూచి పొడుపుమాటల నతనితో 'నీవు నన్నుఁ బాటింపక యీజనమునంతయు నెందులకిట్లు కష్టపెట్టెదవు? వీరలం దొలఁగఁద్రోయుపూనికి నిలుపుము. వీరెల్ల నాజనులే కాని వేఱుగారు. స్త్రీకి ఆవరణము గృహములుగాదు, వస్త్రములుగాదు, ప్రాకారములు గాదు, తెరలు గాదు, మఱియు నిట్లు జనులను దొలఁగఁద్రోయుట మొదలగు రాజమర్యాదలు గాదు. ఆచారమే వారికి ఆవరణము. ఇష్టజనవియోగము మొదలగు వ్యసనములయందును, రాజ్యక్షోభము మొదలయిన యాపదలయందును యుద్ధభూములయందును, స్వయంవరమునందును, యజ్ఞమునందును, వివాహమునందును స్త్రీ పరులకగపడుట దోషముగాదు. ఈసీతయిప్పుడు యుద్ధగామినియున్నది. * మఱియు మహాకష్టమునను దగిలియున్నది. కావున యీపడఁతిని జూచుటవలన దోషములేదు. విశేషించి నేను సమీపమున నుండునపుడు దోషమే కలుగదు. విభీషణా! యట్లు పటంజేసి, చెలువను శీఘ్రముగా నాసమీపమునకుఁ దెమ్ము. మిత్రసమూహములచేఁ బరివృతుండయి యున్న నన్ను సీత చూచుంగాత' మనెను. రాముఁడిట్లు చెప్పఁగా విభీషణుఁడు 'మహాకష్టమునఁ దగిలియున్నది' అన్న యతనిమాటకు మనసున శంకగూరి వినయమున సీతాదేవిని రామునిసమీపమునకుఁ దోడితెచ్చెను. అంత లక్ష్మణుఁడును సుగ్రీవుండును హనుమంతుఁడును అట్లు రామునిమాటయందు సీతపయి ననురాగములేకుండుటను జూచి మిక్కిలియు దుఃఖితులయిరి. ఏలన వారు రామునకు భార్యయందపేక్ష లేమిని బెట్టిదముగాఁ దెలుపుచున్న యింగితములనుజూచి రామునకు సీతయందుఁ బ్రీతి దప్పినట్టు లూహించిరి. ఆసీత విభీషణుఁడు వెంటనంటిరా సిగ్గుచే తన యవయవములలో తానుముడుంగుకొనుచు పెనిమిటిసన్నిధికిఁ బోయెను. ఆబిడ పెనిమిటిసన్నిధిని జేరి జనసమూహమునడుమ నుండుటం జేసి లజ్జచే వస్త్రమున మొగముంగప్పుకొని 'ఆర్యపుత్ర' యని పలుకుచు రోదనముగావించెను. భర్తయే దైవముగాఁగల సాధ్వి, పెనిమిటిని జూడఁగానే మఱింత మొగమున తెలివిదొలఁకాడ, ప్రసన్నముగు ప్రాణేశ్వరుని సౌమ్యముఖమును జూచి, ఆట్టివేళనుండి మరల భర్తను జూడఁగంటినేయని యాశ్చర్యమునను, బహుకాలము చూడని ప్రియునిఁ జూచున్నానుగదా' య

---

* అనఁగా మీఁద నగ్నిప్రవేశము చేయవలసియుండుట మహాకష్టముగా రాముఁడు చెప్పెనని యూహించునది.

ని మిక్కిలి సంతోషమునను, ప్రియునందు సహజముగాఁ గలనెయ్యమునను జూచినద య్యె. అంత నపుడు నచ్చంపుచందురునివంటినెమ్మొగము గలయాచెలువ, యుదయించిననిండుచందురునివలె కోపంబున నించుక యెఱ్ఱవాఱియు చెలువంపుముద్దు గులుకుచును చిరకాలము దాను జూడకయున్న ప్రియునిమొగమును జూచి మనస్సునందలి కుందును నూలి మిక్కిలిసంతోషము నొందిన దయ్యె. ఇది నూటపదునేడవసర్గము.

---

## రాముఁడు సీతను జూచి రావణగృహంబునఁ జిరకాల ముండినందులకుఁ బరుషము లాడుట.

రాముం డిట్లు తనపార్శ్వమున లజ్జచే నమ్రయై నిలుచున్నసీతను జూడఁగానే హృదయములోన కోపంబు దీపింప పలుకఁదొడంగి "కల్యాణీ! ఇదిగో యుద్ధంబున శత్రువును జయించి నిన్ను సాధించితిని. ఇదియంతయు పౌరుషము నుబట్టి చేయవలసియుండుటచేఁ జేయఁబడినదే కాని నిన్నుఁబడయుటకై చేసినయత్నమేమియుఁగాదు. కోపమునకు ఫలము నొందితిని. పగవాఁడు చేసినతిరస్కారమునకు బదులుచేసి తీర్చుకొంటిని. అవమానమును దానిని జేసినపగవానిని నొక్కుమ్మడి నిర్మూలము గావించితిని. ఇపుడు నాపౌరుషము దెలియనయ్యె. ఇపుడు నాశ్రమము సఫలమయ్యె. ఇప్పుడు ప్రతిజ్ఞను జేసి తీర్చుకొంటినిగాని నాయంతట నేను స్వతంత్రుఁడనయితిని. నేను లేనందునపుడు, చపలచిత్తుం డగురాక్షసుఁడు ని న్నపహరించుకొని పోయినాఁడు. ఇట్లు నిన్నుఁబట్టి నాకు దైవముచేఁ బ్రాప్తించినయవమానమును బురుషప్రయత్నముచే నేను నివర్తించుకొంటిని. అవమానము వచ్చినపుడు, దాని నెవ్వఁడు తేజంబునఁ బోఁగొట్టుకొనఁడో యల్పతేజుం డగునట్టివానికిఁ బురుషార్థ మేమి యున్నది? ఏమియు లేదు. సముద్రమును లంఘించుట లంకను మర్దించుట యని హనుమంతుఁడు గావించిన శ్లాఘ్యము లగుమహాకార్యములును నాకుఁ గలిగినతిరస్కారమును బోఁగొట్టినందున నిపుడు సఫలములయినవి. సుగ్రీవుఁడు, యుద్ధమునఁ బరాక్రమమును జూపుచు నాహితము నాలోచించుచు, సైన్యములును దానును నాకుఁగాఁబడ్డప్రయాస మంతయు నిపుడు సఫలమయినది. గుణహీనుం డయినయన్నను దిగవిడిచి తనంతట నాయొద్దకువచ్చి యుండగొన్న భక్తుఁడు విభీషణుఁడు పడినప్రయాస మంతయు నిపుడు నాకుఁ గలిగినతిరస్కారమును దునిమివైచుటవలన సఫలమయ్యెను" అనెను. ఇట్లా రాముఁ డతికఠినముగా సర్దాశకొప్పలుకు లాడుచుండఁగా, సీత, లేడివలె మిక్కిలి వికసిల్లినబెళుకుఁగన్నుంగవతోఁ జాలఁ గలంగినదై కన్నీళ్లు కాలువలుగట్టుచుండెను. మొదట మండుచునేయున్న యగ్గి నుండు మిక్కుటముగా నేయి వ్రాసి తడిపిన నది మఱియు వేండ్రముగా జ్వలించునట్లు మొదలే కుపితుండయి యున్నరామునకు నట్లు దుఃఖించుచున్నసీతను జూడఁగానే మఱియుఁగోపము పెచ్చుపెరిఁగెను. అతం డట్లు మిక్కిలియుఁగ్రుద్ధుఁడై మోమున బొమలు ముడించి, మ్రోల సీత

ను జక్కఁజూడక పైఁబడక యడ్డముగాఁ జూడ్కులనిగుడ్చుచు వానరులయు రాక్షసులయుమధ్యమున నాబిడను జూచి పరుషముగా 'సీతా! ప్రాప్తించినతిరస్కారమును బోఁగొట్టుకొనఁ దివురువాఁడు, ఏమి సేసితీఱవలయునో యది యంతయుఁ జేసినైనది; మున్ను దక్షిణపుదిక్కు ఇల్వలవాతాపు లాక్రమించి యుండుటచే ప్రాణిసమూహమునకు సంచరింపరాకుండినందునఁ గోపమునొంది యాత్మధ్యానగరిష్ఠుఁ డగు నగస్త్యుఁడు తపోబలమున వారిని రూపుమాపి దానిని సాధించినట్లు, నేను రావణుం డపహరించిననిన్ను కోపమునం జేసి యాపగవానిని జంపి సాధించితిని. కల్యాణీ! నే నింతకు నాస్నేహితులపరాక్రమమువలన యుద్ధమున నిర్వహించి తీర్చినప్రయాసమంతయు నీకొఱకై చేసినదిగాదని నీకుఁ దెలిసియుండనీ. మఱియెందులకొఱ కందువా? ఆచారమును రక్షించుటకును, అంతటను గలుగునపవాదమును ప్రఖ్యాతిగాంచిననావంశమునకుఁ గలిగిన యపకీర్తిని బరిహరించుటకును, నే నిట్లు యుద్ధమునఁ బ్రయాసము పుచ్చుకొంటినిగాని వేఱుగాదు. పరగృహవాసముచే నీచరితను గుఱించి నాకు సందేహము గలిగియుండుటవలన నాకట్టెదుట నిలిచియున్ననీవు నేత్రరోగము గలవానికి దీపమునలె మిగుల *ప్రతికూలవై యున్నావు. కల్యాణీ! జనకపుత్త్రి! అట్లగుటవలన పొమ్ము, అనుజ్ఞయిచ్చితిని. ఈదశదిశలందును నీయిష్టము వచ్చినచోటికిఁ బోవచ్చును. ఇఁక నాకు నీతోఁబని లేదు. మంచికులమునఁ బుట్టి, అందును మిక్కిలి తేజంబున రాజిల్లుపురుషుఁ డెవ్వఁడు పరునియింట బహుకాల ముండినతనవడఁతిని మనసున మిక్కుటమైన తహతహపడుచుఁ మరలఁ జేకొనును? ఇంతకాలము రావణునితోడనుండి యిపుడు జాఱివచ్చినదానవు. కామదుష్టమైన వానిచూడ్కులకుఁ బాలయినదానవు. గొప్పకులమును నలుగడఁ బ్రకటించుకొనుచున్ననేను, ఇట్టినిన్ను మరల నెట్లు చేపట్టుదును? ఆకులముకీర్తికొఱకు నిన్ను సాధించితిని గాని వేఱు గాదు. పోయినకీర్తిని మరలఁ దెచ్చుకొంటిని. ఇఁక నీయందు నాకాసక్తి యేమియు లేదు. ఇచ్చటనుండి యిచ్చవచ్చినచోటికిఁ బోవచ్చును. కల్యాణీ! ఇది నేను బుద్ధిని జక్కఁగా నిశ్చయించి చెప్పినమాటయే కాని మఱివేఱు గాదు. కాన సీతా! నీకు సుఖమెట్లో యట్లు † లక్ష్మణునియందుఁగాని భరతుని యందుఁ గాని బుద్ధి నుంపుము. లేక వానరరాజయినసుగ్రీ

---

* ఇట నేత్రరోగికి దీపము ప్రతికూలమగుటకుఁ గారణము వాని నేత్రమందలిదోషముకాని దీపమందలిదోషము కానట్లు, రాముఁడు తనకు సీత ప్రతికూలమగుటకు కారణము తనయొక్క సందేహము నెడిదోషమే కాని సీతయందలి దోషమేమియుఁ గాదని భావపడుట వ్యంజితము.

† ఇట లక్ష్మణాదులందు మనస్సునుంపుము బుద్ధినుంపుమనఁగా భర్తపరిత్యజించిన స్త్రీకి బంధుగృహమున వాసము విధించియుండుటవలన స్త్రీకి స్వాతంత్ర్యము విధింపఁ దనను పుత్రసమానులగు లక్ష్మణాదులగృహములందు వారిరక్షణక్రిందనుండి యాత్మపోషణము సేసికొని కాలముగడుపుము అని యర్థముగాని వేఱుగా నర్థము గ్రహింపరాదు.

వునియందుఁగాని, రాక్షసరాజగువిభీషణునియందుఁగాని, మఱియు నీకెట్లు సుఖమనితోఁచునో యట్లుగాని, యుండుటకు మనస్సునుంపుము. సీతా! దివ్యరూపము గలిగి మనోజ్ఞురాలవగునీవు వేఱుదిక్కు లేక రావణునియింటనే చిక్కియుండఁగా వాఁడిట్లున్ననిన్నుఁ జూచుచు, నింతపెద్దయుఁగాలము సైఁచి యూరకుండునా? ఊరకుండఁడు.' అని పరుషములాడెను. అంత ప్రియవచనములు వినుటకే తగినయాసీత చిరకాలమునకుఁ బ్రియునివలన నట్టియప్రియవచనమును విని మేటియేనుంగు తుండముచే బిట్టాడింపఁగా నందుగుతీఁగ మిక్కిలియు వడఁకుచు వాలుదొరఁగునట్లు తాను వడవడవడంకి మిక్కిలియుఁ గన్నీరు విడిచినదయ్యె. ఇది నూటపదునెనిమిదవ సర్గము.

---

## సీత రామునివచనములకు బదులుసెప్పి పతికి నమ్మిక గలుగుటకై యగ్నిప్రవేశము సేయుట.

ఇట్లు రాముఁడు రోషమున, వినువారి కితరులకును భయమున గగురుపుట్టించునట్టిపరుషభాష లాడుటయు సీత మిక్కిలి యుదుఃఖిత యయ్యెను. సీత, తానిదివఱకెన్నఁడు వినియెఱుంగనియూ పరుసంపుమాటను భర్తవలన మహాజనమధ్యమున విని, లజ్జచే వంచియున్నతలను మఱియు వంచుకొన్నదయ్యెను. జనకరాజసుత సీత తనయవయవములందు దానుజొరఁబడునట్లు మిక్కిలియు ముడుంగుకొనుచు, అలుఁగులవంటి యప్పలుకులుగాఁడ, నలుఁగులు గ్రుచ్చుకొన్నదియుంబోలె నొవ్వుసయిఁవఁజాలక మిక్కిలియుఁ గన్నీరుదొరఁగెను. అంత నద్దేవి కన్నీటం దోఁగియున్నతనమొగమును దుడుచుకొనుచు భర్తనుజూచి మెల్లమెల్లగా డగ్గుత్తికవడిన పలుకుల 'వీరా! ఇటువంటిమాట నన్నేలపలికెదవు? ఇది నీవు చెప్పుటకును నేను వినుటకునుదగునా? ఇది మిక్కిలి పరుసనై చెవుల బ్రద్దలుచేయుచున్నదే. సామాన్యుఁడయినవాఁడు సాధారణయైనయొకతెకుఁ జెప్పునట్లు లిట్టిమాట నినుబోఁటి పలుకుదువా? మహాబాహూ! నీకు నేనెట్టిదిగాఁ దోఁచుచున్నదో యట్టిదానను గాను. నీకుఁగా నాసచ్చరిత్రముపై నొట్టుపెట్టుచున్నాను. (ఏదయిన నొకప్రమాణముచే నాయందు నమ్మకముంపుము) అల్పస్త్రీల కొందఱిదురాచారమును జూచి స్త్రీజాతినంతయు నట్టిదిగానే యుండునని శంకించుచున్నావు. నీవు నాస్వభావమును జక్కఁగాఁ బరీక్షించి తెలియుదువేని, యీసందేహము దిగవిడువుము. ప్రభూ! నాస్వభావము నీకుఁ దెలిసియున్నను రావణునియంగము నాకుఁ దగిలినదోషమున్నది కాననన్ను దిగవిడుతునందువా? అప్పుడు నేను పరాధీనురాలను; కాన వానియంగములతాఁకు నొందవలసివచ్చెను. అయినను అందు నాయిచ్చతోఁ జేసినతప్పు లేదు. అది దైవము చేసినయపరాధము. నామనసో యితరులకు గ్రహింపనలవిగాక నాయధీనమైయుండునది; కాన యది యక్కాలమున నీయందే యుండెను. నాయవయవములో నితరులకు గ్రహింప శక్యములైనవి. మఱి

వానిని విడిపించుకొనుటకు నేను స్వతంత్రురాలను గానయితిని. కాబట్టి వానివిషయమై నేనేమిచేయఁగలను? మానదా! మనమిద్దఱును నొకరితోనొకరు చాలఁగాలము కూడి యాడి పెరిఁగితిమి. ఒకరితోనొకరు పెక్కేండ్లు గలసిమెలసియుంటిమి. ఈ రెంటివలన నే నాస్వభావము నీకుఁ జక్కఁగఁ దెలిసియుండవలయును. ఇట్టివాని చేతను నీకు నాస్వభావము తెలియకపోయెనేని యిఁక దేనిచేతనుం దెలియనేరదు. కావున నే నిఁక కలకాలము హతనయితిని. వీరా! నీవు నన్ను వెదకుటకై వీరుఁ డగుహనుమంతునిఁ బంపితివే. అట్లు పంపునపుడు నేను లంకలోనున్నపుడే నన్నేల విడువవయితివి. వీరా! నీవప్పుడే నన్ను విడిచియుందువేని, యాసంగతిని విన్న వెంటనే,నన్ను నీవు దిగవిడిచితి వని వానరోత్తముఁ డగుహనుమంతునిసమక్షమున నే ప్రాణములు విడిచియుందును. ఇంతకాలము ని న్నెడఁబాసినవ్యథ నేను పడియుండనుగదా. నావిషయ మట్లుండనిమ్ము. అట్లు చేసియుందువేని, ప్రాణసంకటమున నుసుఱుపెట్టుకొని యింతయుద్ధముచేసి వ్యర్థముగా మీకు శ్రమపడవలసియుండదే. నీమిత్రులకు నింతదూరము నిష్ఫలముగా కష్టపడవలసినది లేకయేయుండునే. నరసింహానా ! నీ వల్పుం డగునొక మనుష్యునివలెఁ గోపమునే యనుసరించి నాయాఁడుతనమునే మున్నిడుకొని పలికితివిగాని నిష్కళముగా నాశీలమును పరికింపనయితివి.(నన్నాఁడుదియనిమాత్రమే తలంచి పలికితివిగాని నాశీలమును దలంపవయితివి)నీ వాచారముం దెలిసినవాఁడవే.అయిన నేమి! జనకునకుఁ బుట్టినట్లు వ్యాజమేకాని వాస్తవముగా భూమినుండియే పుట్టితిని. ఇట్టినాపుట్టుకను, బహుకాలము నీవు పరిశీలించి యున్న నాయాచారమునుగూడ, మున్నిడుకొనవైతివి; ముఖ్యముగా పాటింపవైతివి. నీవు పిన్నవాఁడవై యుండునపుడే,నన్ను,నాపిన్నతనమున నే నగ్నిసాక్షికముగాఁ బాణిగ్రహించితివే. అట్లు పిన్ననాఁడే పట్టినపాణియుఁగూడఁ బ్రమాణముగా దయ్యె. మనపిన్ననాఁడే యాడినపెండ్లినిగూడ, పిన్ననాఁటినుండి యున్న పెండ్ల మని కూడ, పాటింపనయితివి. నీయందునాకుఁ గలభక్తిని నాశీలమును, అంతటెని వెనుకకు ద్రోచితివిగాని ముందడుకొనవయితివి'అనెను. సీత రామునితో నిట్లుపలుకుచు రోదనము సేయుచు,కన్నీళ్లచే డగ్గుత్తికపడినపలుకులతో,దీనుండైయేమియుఁదోఁచక చింతంగూరి నిలఁబడియున్నలక్ష్మణుని జూచి 'లక్ష్మణా! నాకు చితిఁబేర్పుము. ఇదియే నావ్యసనమునకు మందు. మఱేదియుఁగాదు. దానిని జొచ్చిప్రాణములు విడిచెదను. వట్టియపవాదముచేఁ గొట్టువడి నేనిఁక బ్రతుకనొల్లను. నాపాతివ్రత్యాదిగుణములకుఁ బ్రీతినొందక, పతి నన్ను మహాజనసభామధ్యమునఁ బరిత్యజించినపుడు నాకునాథునకు నమ్మికఁబుట్టించుటకై యోగ్యమగుగతి యగ్నిని జొచ్చుటయే. కాన యగ్నిం బ్రవేశించెదను. ఇంతకన్న వేఱుగతి లేదు' అనెను. సీతయిట్లుచెప్పఁగా శత్రువీరుల నఱుమాడులక్ష్మణుఁడు దైన్యముఁబొరిఁ జిక్కి రాముని ముఖముచాయం జూచెను. అంత వీర్యవంతుఁ డగులక్ష్మణుఁడు రాముని బొమలసైగ మొదలగు సుఖసూచనలచే నదియతని కభిమతమని తెలిసికొని, రాముని మతము చొప్పున చితిని బేర్చెను. అప్పుడు రాముడు 'పతివ్రత నెప

ము లేక మే చేయు ప్రత్యయము నెట్లు చూతు' నని లజ్జ నొంది సీత మొగము చూచి నచో మోమోటము గలుగునని తలంచి మొగము వంచుకొనియుండఁగా సీత రామానుభవముచే మెల్లగా నతనికిఁ బ్రదక్షిణము గావించి ధగధగ జ్వలించుచున్న యగ్నిహోత్రమునొద్దకు వచ్చెను. సీత దేవతలకును బ్రాహ్మణులకును నమస్కరించి యగ్ని సమీపముం జేరి చేమోడ్పుగీలించి, 'నాహృదయము నెప్పుడును రామునినుండి మఱియొకపురుషునియెడకుఁ జలింపదేని యిట్లే లోకముల కెల్ల సాక్షి యయినయీయగ్నిహోత్రుఁడు నన్ను సర్వవిధముల రక్షించుఁగాక. నేను బరిశుద్ధమయిననడవడి గలదాననయి రాముఁడు నన్నన్యాయముగా దుష్టురాలినిగాఁ దలంచినయెడ సమస్తలోకసాక్షి యగునగ్నిహోత్రుఁడు నన్ను సర్వవిధముల రక్షించుఁగాక. నేను మనస్సునను వాక్కునను కర్మమునను సకలధర్మవిదుండగు రాముని నతిక్రమించి నడచుకొనకుందునేని, సకలలోకసాక్షి యగునగ్నిహోత్రుఁడు నన్నివిధంబుల నన్ను రక్షించుఁగాక. భగవంతుఁడగు సూర్యుఁడును వాయువును, దిశలును, చంద్రుఁడును, పగలును, రాత్రియు, ప్రాతస్సాయంసంధ్యలును, భూమియు, మఱియుఁ దక్కినవారును, నన్ను సచ్చరిత్రముగలదానినిగానే తలంతురేని, అగ్నిహోత్రుఁడు నన్ను రక్షించుఁగాక' అని పలికెను. ఇట్లు చెప్పి సీతాదేవి యగ్నిహోత్రమునకుఁ బ్రదక్షిణము గావించి మనంబునం దెంతమాత్రము శరీరముపయి నభిలాష లేక, జ్వలించుచున్న యామంటలోఁ బ్రవేశించెను. అచ్చట మూఁగియుండినమహాజనము ఆబాలవృద్ధము, మిక్కిలియు భయముగదుర, సీత యగ్నిని బ్రవేశించుటను జూచెను. మేలిబంగారుభూషణములం దాల్చి మంచికడానిబంగరువన్నె గలిగి వెలుంగునాబిడ సమస్తలోకములును జూచుచుండ, జ్వలించుచున్న యగ్నిహోత్రమునఁ బడెను. అమ్మహాభాగ్యవతి సీత పవిత్రమయిన*యాజ్యాహుతియుంబోలె నగ్నిని బ్రవేశించునపుడు మూఁడులోకములును జూచినవి. ఆసీత యజ్ఞంబున మంత్రములచే సంస్కరింపఁబడి నిరంతరముగా వేల్వఁబడి పడుచున్న యాజ్యధారవలె, పెనుమంటలు చెలంగుచున్న యగ్నిహోత్రమునం బడఁగా స్త్రీలందఱును జూచి యాక్రోశించిరి. స్వర్గమునందును భూలోకమునందును బాతాళమునందు నున్నట్టి దేవతలును గంధర్వులును దానవులును శాపమునొంది స్వర్గమునుండి †నరకమునం బడు దేవతనుంబోలె నగ్నియందుఁ బడుచున్న సీతాదేవిని జూచిరి. ఆబిడ యగ్నిని బ్రవేశము సేయునపుడు రాక్షసు

---

* సీతకు ఈఆజ్యాహుతిదృష్టాంతముచేత పరమపవిత్రత దెలియునది. గోవిందరాజులు.

† సమస్తభోగములకు నర్హమయినట్టిదివ్యరూపము గలసీత అగ్నింబడుట, స్వర్గమండలిదేవత నరకమునంబడుట యెంత యనర్హమో యంత యనర్హముగా నుండెనని దృష్టాంతార్థము. సీత రావణుఁడు తనకడకు వచ్చినది మొదలుకొని యింతవఱకును పరమభాగవతుం డగులక్ష్మణునియెడఁ గావించినయపచారమునకు ననుభవించిన ఫలము చెప్పఁబడెను. వాస్తవమునకు సీత రావణుఁడువచ్చినకాలమున అగ్నిం బ్రవేశించెననియు రావణుఁడు కొనిపోయినది మాయాసీతయనియు నిజమయినసీత యగ్నినుండి యుద్ధమించుటకై మాయాసీత యగ్నిని బ్రవేశించినదనియుఁ గొందఱు చెప్పెదరు.

లును వానరులును మిక్కిలి యద్భుతముగా నుండునట్లు మహాధ్వని సెలంగ హాహాకారములు సేసిరి. ఇది నూటపందొమ్మిదవసర్గము.

---

{ బ్రహ్మాదిదేవతలు విమానారూఢులయి శ్రీరామసన్నిధికి వచ్చుట. దేవతలందఱును రామునిం బ్రస్తుతించుట. బ్రహ్మ విశేషించి శ్రీరామునిస్తోత్రము సేయుట. }

అంత ధర్మాత్ముం డగు రాముండు, సముస్తజను లాడుకొనుమాటల వినుచు నే మనంబున దుఃఖితుండై కన్నుల నీళ్లు కలంగం బాఱ కొంతసేపు మనంబునం జింతించుచుండెను. అంత రాజరాజగు కుబేరుండును శత్రువులను సుక్కించుయముండును. సహస్రాక్షుండగు దేవేంద్రుండును, పగవారిని దపింపం జేయువరుణుండును, ముక్కంటియు శ్రీమంతుండును వృషభధ్వజుండు నగు శివుండును, సమస్తలోకంబులను సృజించువాండును బ్రహ్మవేత్తలలో నెల్లను త్తముండు నగు బ్రహ్మదేవుండును,వీరలందఱును సూర్యునింబోని విమానంబుల నెక్కి లంకాపురిం జేరి రామునియొద్దకు వచ్చిరి. అంత నా బ్రహ్మాదిదేవతాశ్రేష్ఠులు తమ్ముం జూచి చేతులు మోడ్చి నిలుచున్న రామునిం గాంచి కంకణాదిహస్తాభరణములతో నొప్పుతమనిండుదబాహువులను బయికెత్తి రామునితో 'నీవు సమస్తలోకములకును గర్తవు,సర్వోత్తముండవు,జ్ఞానవంతులలో నెల్ల మేటివి. ఇట్లు సర్వజ్ఞుండవగు నీవు సీత యగ్నిలోంబడుచుండంగా నేమియుం దెలియనివానివలె నుపేక్షింపనేల? బ్రహ్మాదిదేవతలలో నెల్ల నీవే శ్రేష్ఠుండవని నీమహిమ నీకే యెట్లు తెలియకపోయెను. నీవు మున్ను అష్టవసువులలో ప్రజాధిపతి యగు ఋతధాముం డనువసువుగా నుంటివి. నీవేక దా మూడులోకములకును అండాధిపతిపర్యంతమును మొట్టమొదట సృజించినకర్తవు. నీకు నీయంత స్వతంత్రుండవే కాని నిన్ను నియమించువాండు లేండు. అష్టరుద్రులలో మహాదేవుండను నెనిమిదవరుద్రుండవు. పన్నిరువురుసాధ్యులలో వీర్యవంతుం డనంబడుపదునైదవవాండవు. పరంతపా! నీకశ్వి దేవతలు చెవులు, చంద్రసూర్యులు కన్నులు. లోకములసృష్టికి ముందును ప్రలయమందును నీవుత్పత్తివినాశరహితుండవై కనంబడుచుందువు. ఇట్లు సర్వజ్ఞుండును సర్వశక్తియు సర్వేశ్వరుండవు నయ్యు నేమియుం దెలియని యొక కేవలమనుష్యునియట్లు సీత యగ్నిబడుచుండంగా నుపేక్షించుచుండనేల?' యనియడిగిరి. ఇట్లు లోకరక్షకు లగు నా బ్రహ్మాదు లడుగంగా లోకనాథుండును ధార్మికశిరోమణియు రఘుకులీనుండు నగు రాముండు ఆ దేవతాశ్రేష్ఠులను జూచి నేను * దశరథకుమారుం

---

* ఇందులకు 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్। యోఽహం యస్య యతశ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే' అని మూలము. విశేషార్థము:—రాముండు బ్రహ్మాదులచే సామాన్యముగా స్తోత్రము చేయంబడుచున్నను సమస్తదేవతాపూజనీయుం డగుచతుర్ముఖునివలన తనప్రభావమును లోకమునం బ్రఖ్యాపించుటకు తనసౌశీల్యమును (అనంగా సర్వోత్కృష్టుండయ్యుం దనకంటె మిక్కిలియుం దక్కువయగువారితో పాటిగాం గలసి మెలసి తానుండుటను) దెలుపుచున్నాండు. (ఆత్మానం మా

డగురాముఁడ ననియే మనుష్యుండ ననియే నన్నుఁ దలఁచుకొనుచున్నాను. నే నెవ్వఁడనో ఎవ్వరివాఁడనో యెందులకువచ్చితినో యావివరమంతయు భగవంతుఁడగుబ్రహ్మదేవుండు చెప్పవలయును' అనెను. ఇట్లురాముఁడనుగఁగా, బ్రహ్మవేత్తలలో నెల్లనుత్తముండగుబ్రహ్మదేవుఁ డతనిఁ జూచి 'రామా! సత్యపరాక్రమా! యథార్థము చెప్పెదను వినుము. * నీవు నారములు అయనముగాఁ గలిగి జగత్కారణుండ వైననారాయణుం

---

నుషం మన్యే) నన్ను మనుష్యునిగాఁ దలంచుకొనుచున్నాను. నాపరత్వమునకంటె మనుష్యత్వము నభినయించుటయేనాకు నభిమతమని యర్థము. అందును విశేషముచెప్పుచున్నాఁడు (రామం) రాముఁడను పేరుగలవానినిగాఁ దలంచుచున్నాను. మనుష్యుఁడుగాను అందును రాముఁ డనుపేరు గలిగియు నుండుటయే నాకభిమత మనుట. అంతకంటె నతిశయమును జెప్పుచున్నాఁడు. (దశరథాత్మజమ్) దశరథకుమారుఁ డగురాముఁడుగాఁ దలఁచుచున్నా ననుట. అవతారములం దెల్ల దశరథచక్రవర్తిపుత్రుఁడుగానుండుటయేనాకు మిక్కిలియు ప్రియమనిభావము. ఇటసంప్రదాయోదాహరణ మొకటిగలదు 'శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత । గోవిన్ద పుణ్డరీకాక్ష పాహిమాం శరణాగతామ్' అని ద్రౌపదీవాక్యము గలదు. (శంఖచక్రగదాపాణే) అని పరత్వవ్యంజకము లగుశంఖచక్రాద్యాయుధములను ధరించుటను జెప్పుటచే కృష్ణుఁడనాపరము నేసి సుఖమునంచుకొన్నవాఁడయ్యెననియు, (ద్వారకానిలయ) అని కృష్ణావతారమును జెప్పుటచే కొంచెము మొగమెత్తినాఁడనియు, (గోవింద పుండరీకాక్ష) అని గోవిందశబ్దముచే గోపాలపుత్రుఁడు గొల్లపిల్లవాఁడని వినుటచే పరత్వమునకంటె వసుదేవునికి పుత్రుఁడగుటయే తనకభిమతమని విహ్వలితాత్ముం డయ్యెననియుఁ జెప్పంబడెడిని. మనుష్యత్వమున నతిశయించిన తనపరవాసుదేవత్వాదికము సుగ్రీవాదులకు చక్కఁగా నిశ్చితమయియున్నది గాన యందు దృఢముగా విశ్వాసము వారికిఁ గలిగించుటకై చతుర్ముఖునిచే తనపరత్వమును ప్రకటించుటకు స్వస్వరూపము నడుగుచున్నాఁడు. (యోఽహం) నే నెవఁడు? నాస్వరూప మేమియనుట. (యస్య) నే నెవ్వరివాఁడను అనితన సంబంధమును గురించిన ప్రశ్నము. (యతః) ఎందుకొఱకు? అని తాను వచ్చిన ప్రయోజనమును గురించిన ప్రశ్నము. (భగవాం స్తద్బ్రవీతు) భగవంతుఁడగు బ్రహ్మ దానినిజెప్పఁగాత. చక్రవర్తి పుత్రుఁడగుటయే నాకు మిక్కిలియు ప్రియతమమైనది. నీవు నీయంతట సర్వజ్ఞుఁడవుగాన నాకభిమతముగానిదైనను పరత్వమును ప్రకటింపుమని యర్థము. తనయాకారమును వివరించుట తనకభిమతముగాని దయినను తాను వివరింప ననుమతియొసంగుట రాముఁ డనుపేరఁ దాను జేయవలసినకార్య మొనఁగూడి యుంటంబట్టియని తెలియునది.

* ఇందులకు 'భవాన్నారాయణో దేవః శ్రీమాంశ్చక్రాయుధో విభుః । ఏకశృంగో వరాహస్త్వం భూతభవ్యసపత్నజిత్' విశేషార్థము:— (నారాయణః) 'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః । తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః' 'జలములు నారములనంబడినవి. ఏలననవి నరునిచేఁ (పరమాత్మచేఁ) బుట్టినవి. ఆజలములు మునుపు ఇతనికి స్థానముగా నుండినవగుటంజేసి యితఁడు నారాయణుఁ డనఁబడెను' అని మనుస్మృతి. ముందు జలములను సృజించి యితరములను సృజించుటకుమునుపు ఆజలములందు నివసించినాఁడనుట. ఇట్టినారాయణుఁ డనుటచే జగత్కారణుఁ డగుటయు చెప్పఁబడెను. ఇందులకు 'ఏకో హ వై నారాయణ ఆసీన్న బ్రహ్మా నేశానో నేమే ద్యావాపృథివీ' అని శ్రుతి. అవాప్తసమస్తకాముఁ డగువానికి జగత్తు సృజించుట మొదలగువ్యాపారములు సేయుట

డవు. అవాప్తసమస్తకాముఁడవయ్యు క్రీడాప్రవృత్తుఁడవుగాన జగత్సృష్టిమొదలగు వ్యాపారములు లీలలుగాఁ జేయుచుందువు. నీవెల్లప్పుడును లక్ష్మితోఁ గూడియుండువాఁడవు. సుదర్శనచక్రం బసాధారణ మగునాయుధముగాఁ దాల్చియుందువు. సర్వవ్యాపకుఁడవు. ఒకకొమ్ముగలిగి భూమి నుద్ధరించినయాదివరాహమూర్తివి. ఇంతకుమునుపుండినశత్రువులను నిఁకఁ బుట్టఁగలశత్రువులను గెలుచువాఁడవు. * రామా! నీవక్షరమవు. నీవు పరబ్రహ్మమవు. షడ్భావవికారశూన్యుండవు. ఆదిమధ్యాంతములందు వర్తిం

పాసఁగఁ జేయఁగా (దేవః) 'దీవ్యతీతి దేవః' క్రీడించువాఁడు. క్రీడాప్రవృత్తుఁడగుటచే సృష్టి మొదలగు వానిని లీలకొఱకుఁ జేయుచున్నాఁ డనుట. కాఁబట్టి అన్నిట పరిపూర్ణుఁడయినవానికి నేదయినపని, సంభవించునని భావము. ఇట్లు పరత్వమునకు అసాధారణమయిన నామధేయమును జెప్పి పత్నీవైశిష్ట్యమును జెప్పుచున్నాఁడు. (శ్రీమాన్) శ్రీతోడి నిత్యయోగము గలవాఁడు. అసాధారణమైనయాయుధమును జెప్పుచున్నాఁడు, (చక్రాయుధః) సుదర్శనచక్రము నాయుధముగాఁగలవాఁడు. స్వరూపవైలక్షణ్యమును జెప్పుచున్నాఁడు. (విభుః) వ్యాపకుఁడనుట. అణుస్వరూపులగు ఆత్మలకు స్వరూపవ్యాప్తి లేదు. పరమాత్మునికి స్వరూపముచే సర్వత్రవ్యాప్తి గలదు. వారికంటె విలక్షణుఁడనుట. దీనిచే ఫలితమైన రక్షకత్వమును జెప్పుచున్నాఁడు. (ఏకశృంగో వరాహః) ఒకకొమ్ము గలయాదివరాహుఁడవు. ప్రళయసముద్రము పొంగి పొరలినపుడు వరాహరూపమును దాల్చి భూమి నుద్ధరించినవాఁడవనుట 'ఉద్ధృతాసి వరాహేణ' అని శ్రుతి 'దంష్ట్రయా పర్వతేంద్రాణాం చాలనం కృతవాన్మహాత్ । తతస్తంతుష్టువుర్దేవా ఏకశృంగత్వ సిద్ధయే । ఏకశృంగ వరాహోఽభూత్తదా ప్రభృతి మాధవః' వరాహమూర్తి ఒకకోఱతో భూమినిమోయుచు రెండవకోఱతోఁ బర్వతములను గదల్పసాగెను. అంత దేవతలు ఒకకోఱ గలిగియుండుటకై భగవంతుని బ్రస్తుతించిరి. అంత నదిమొదలుగా వరాహమూర్తి ఒకకొమ్ము గలవాఁడయ్యెను.' అని స్కాందము. అనిష్టనివర్తకత్వమును జెప్పుచున్నాఁడు. (భూతభవ్య సపత్నజిత్) మునుపటిశత్రువులను పిమ్మటశత్రువులను గెలుచువాఁడు. మునుపటిశత్రువులు మధుకైటభాదులు పిమ్మట రానున్నశత్రువులు శిశుపాలాదులు అని తెలియునది.

* ఇందులకు, 'అక్షరం బ్రహ్మ సత్యంచ మధ్యేచాన్తేచ రాఘవ। లోకానాం త్వంపరోధర్మో విష్వక్సేన శ్చతుర్భుజః' అని మూలము. (అక్షరం) నక్షరతీత్యక్షరం - క్షరించనిది నాశములేనిదనుట, 'ఏతద్వైతదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి' అని శ్రుతి. (భవాన్) నీవు, ఇదియిట్లె మీఁదనెల్ల నొక్కొక్కదానితోఁ గూర్చుకొనునది. 'అథ పరాయయా తదక్షర మధిగమ్యతే' ఇత్యాది శ్రుతులు. దీనిచే 'యేనాక్షరం పురుషం వేద' అను శ్రుతి యుపబృంహితమయ్యె. 'విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం ప్రభుమ్' అను అక్షరవిద్యోపసంహారము నయ్యె. ఇట్లె మీఁదవచ్చెడువచనములచే నానావిద్యల యుపసంహారము దెలియునది. (బ్రహ్మ) 'బృహతి బృంహయతీతి బ్రహ్మ' జగదాకారముగా బృంహణము (ఉబ్బుట) నొందునది. 'బృహతి బృంహయతి తస్మాదుచ్యతే పరం బ్రహ్మ' అని శ్రుతినిర్వచనము. (సత్యం) విపర్యాసము నొందనివాఁడవు. షడ్భావవికారశూన్యుఁడ వనుట. 'అస్తి, జాయతే, పరిణమతే, వర్ధతే, అపక్షీయతే, వినశ్యతి' 'ఉండుట, పుట్టుట, మాఱుపడుట, పెరుగుట, తగ్గుట, నశించుట' యనునది యాఱు భావవికారములు. (మధ్యేచాన్తేచ) చకారముచే 'ఆదౌ' అనియు గ్రాహ్యము. ఆదిమధ్యాంతములందు వర్తించువాఁ డనుట. దీనిచే నిత్యత్వము చెప్పఁబడినది. (లోకానాం

చునిత్యుండవు. నీవు సమస్తలోకముల శ్రేయస్సునకు పరమధర్మరూపమున సాధనభూతుఁడయిన వాఁడవు. సర్వస్వామివి. నాలుగుభుజముల నొక్కమ్మడినే నాలుగుపురుషార్థముల నొసంగువాఁడవు * నీవు శార్ఙ్గ మనుధనువు దాల్చువాఁడవు, సమస్తేంద్రియములకు నియామకుఁడవు. పురుషుఁడవు, పురుషోత్తముఁడవు. ఎవ్వరిచేతను జయింపఁబడనివాఁడవు. నందక మనుఖడ్గము ధరించువాఁడవు. విష్ణుఁడవు, కృష్ణుఁడవు, బృహద్బలుండవు. † నీవు సేనానివి, గ్రామణివి, బుద్ధివి, సత్వమువు, క్షమవు, దమమువు,

---

పరో ధర్మః) లోకములకు సిద్ధరూపమయిన పరమధర్మము. ధర్మమనఁగా శ్రేయస్సాధనముగాన సర్వలోక శ్రేయస్సాధనభూతుఁ డయినవాఁడ వని యర్థము. (విష్వక్సేనః) 'విష్వగ్రీచీ సేనాయస్యస విష్వక్సేనః' అంతటనుగల సేన గలవాఁడు. సర్వస్వామియనుట. (చతుర్భుజః) నాలుగుభుజములు గలవాఁడవు. నాలుగుభుజములచే నొక్కసారినే నాలుగుపురుషార్థముల నిచ్చువాఁ డనుట.

* ఇందులకు 'శార్ఙ్గధన్వాహృషీకేశః పురుషః పురుషోత్తమః। అజితః ఖడ్గధృద్విష్ణుఃకృష్ణశ్చైవ బృహద్బలః ' అని మూలము. (శార్ఙ్గధన్వా) శృంగవికారమగుధనువు గలవాఁడవు. దీనిచే రక్షణోపకరణముగలవాఁడని తెలియునది. (హృషీకేశః) హృషీకములనఁగా నింద్రియములు. ఇంద్రియములకు నియంత యైనవాఁడవనుట, సర్వేంద్రియముల నాకర్షించునట్టి దివ్య విగ్రహముగలవాఁడవు. (పురుషః) పురుసనోతీతిపురుషః—బహుప్రదుఁడవనుట—లేక పురి=హృదయగుహాయందు, శేతే=శయించువాఁడవు 'పురిశయం పురుషమిత్యాక్షతే' అని నిర్వచనశ్రుతి, లేక యేనజగత్ పూర్ణం సపురుషః—జగమెల్లనిండినవాఁడు. 'తేనేదంపూర్ణం పురుషేణసర్వమ్' అనిశ్రుతి. లేక పురాతనత్వాత్ పురుషః—పురాతనుఁడయినవాఁడు 'పూర్వమేవాహమిహాసమితి, తత్పురుషస్య, పురుషత్వమ్' అనిశ్రుతి, (పురుషోత్తమః) క్షరము అక్షరము అనెడి పురుషులకంటె నుత్తముఁడయినవాఁడు-చిదచిత్తులకంటె నుత్కృష్టుఁడనుట 'యస్మాత్ క్షరమతీతోఽహమక్షరాదపిచోత్తమః। అతోఽస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః' అని గీత. లేక పురుషులందు త్తముఁడగుటచే పురుషోత్తముఁడు. (అజితః)ఎవరిచేతను జయింపఁబడనివాఁడు —ఆశ్రితసంరక్షణమందు ఎప్పుడుగాని భంగము నొందనివాఁడు (ఖడ్గధృత్) నందకమను ఖడ్గమును ధరించినవాఁడు, (విష్ణుః) వ్యాపనశీలుఁడు. ఎవఁడు తనదయకు విషయమయ్యెనో వానినప్పుడే అచ్చటనే యుండి రక్షించువాఁ డనుట. (కృష్ణః) 'కృషిర్భూవాచకశ్శబ్దో ణశ్చ నిర్వృతివాచకః' అను నిర్వచనముచేత భూమికిభారమునుదీర్చి యూఱటగలిగించువాఁడు. (బృహద్బలః) ధారణశక్తి మిక్కిలిగలవాఁడవు.

† 'సేనానీర్గ్రామణీశ్చత్వం బుద్ధిస్సత్వం క్షమాదమః। ప్రభవ శ్చాప్యయశ్చ త్వ ముపేంద్రో మధుసూదనః' అని మూలము. విశేషార్థం (సేనానీ) సేనల నడపించువాఁడు. ఉపసేనానిర్వాహకుఁ డనుట, (గ్రామణీః) గ్రామములనడపువాఁడు-దివ్యజనపదాదులను పాలించువాఁడనుట. (బుద్ధిః సత్వంక్షమాదమః) బుద్ధిని సత్యమును క్షమను దమమును బ్రవర్తింపఁజేయువాఁడు. 'నదేవాయష్టిమాదాయ రక్షంతి పశుపాలవత్ । యంహిరక్షితుమిచ్ఛన్తి బుద్ధ్యా సంయోజయన్తితమ్' 'దేవతలుకఱ్ఱనుగొని పసుల కాపరివలెఁ గాచువారుగారు. ఎవనిని రక్షింపఁగోరుదురో వానికి బుద్ధిగలిగింతురు ' అనుటంబట్టి యీశ్వరుఁడు బుద్ధ్యాదులనుగలిగించి రక్షించువాఁడనుట. 'మహాన్ ప్రభుర్వై పురుషస్సత్వస్యైష ప్రవర్తకః' అనిశ్రుతి, (ప్రభవః) జగత్తునకు ఉత్పత్తిస్థానము-సమస్తమున కుపాదానమైనవాఁడనుట. (అప్యయః)సమస్తజగమునకు లయస్థానము. 'కృష్ణఏవహి భూతానాముత్పత్తిరపిచాప్యయః' అనిశ్రుతి.(ఉపేం

జగత్తు ప్రభవమును నాశము నయినవాఁడవు. ఉపేంద్రుఁడవు. మధుసూదనుఁడవు. *నీవు ఇంద్రకర్మఁడవు. మహేంద్రుఁడవు నీవు. నీవుపద్మనాభుఁడవు,నీవు రణాంతకరుం డవు. దివ్యు లగుమహర్షులు నిన్నుశరణ్యునిఁగాను శరణముఁగాను జెప్పుదురు. సహస్ర శాఖారూపములగు శృంగములు గలిగి యనేకవిధబోధనా (విధి)రూపములగు జిహ్వ లతోఁగూడి కర్మముల నాలోచించుమహర్షభ మగువేదము నీవు. మూఁడులోకముల కు నీవు సమష్టికర్తవుగద. స్వయంప్రభుఁడవు,ముక్తులకును నిత్యులకును నీతోడిసామ్య భోగము నొసంగువాఁడవు. ఆశ్రితు లపేక్షించుటకుఁ బూర్వమె వారలను రక్షించు టకుఁ బుట్టువాఁడవు నగుదువు. ‡ నీవు * యజ్ఞ రూపుఁడవు, నీవు వషట్కారమవు,

(ద్రః) ఇంద్రునికిఁ దమ్ముఁడుగా మొదటనవతరించినవాఁడు. (మధుసూదనః) వేదముల నపహరించిన దైత్యు నిఁ జంపినవాఁడు.

* 'ఇంద్రకర్మా మహేంద్ర స్త్వం పద్మనాభో రణాంతకృత్ । శరణ్యం శరణంచత్వా మా హుర్దివ్యా మహర్షయః' అని మూలము. విశేషార్థము. (ఇంద్రకర్మా) ఇంద్రుని కర్మమువంటి కర్మము గల వాఁడవు. 'తం విష్ణురన్వతిష్ఠత' అనిశ్రుతి, ఎవనికర్మము ఇంద్రునికర్మమువలె నుండునో వాఁ డనుట. వృ త్రాదివధమును నింద్రునియం దంతర్యామియగు పరమాత్మునికర్మమే గాని యదిపైకి నింద్రునికర్మము వలె నుండు ననుట. (మహేంద్రః) నిరతిశయైశ్వర్యసంపన్నుఁడవు. (పద్మనాభః) పద్మము నాభియం దుఁ గలవాఁడవు. నాకను జనకుఁడవనుట, ఇదియే 'పద్మే దివ్యేర్కసఙ్కాశే నాభ్యా ముత్పాద్యమా మపి । ప్రాజాపత్యం త్వయాకర్మ మయిసర్వం నివేశితమ్' అని మీఁదఁజెప్పెడిని. (రణాంతకృత్) రణ మందు శత్రువులకు నాశమును జేయువాఁడవు, (శరణ్యం) శరణమున కర్హుఁడవు. శరణమున కుచితమయిన జ్ఞానశక్తిదయాదిసంపన్నుఁ డనుట,(శరణం) రక్షణోపాయ మైనవాఁడనుట, 'సర్వస్యశరణంసుహృత్' అనిశ్రుతి, అని, (మహర్షయః) అలౌకికతత్త్వ సాక్షాత్కార సమర్థు లయినసనకాదులు అందును (ది వ్యాః) అవతారరహస్యాది విశేషజ్ఞానవంతు లగు వాల్మీకాదులు లేక 'యత్ర ఋషయః ప్రథమజాయే పు రాణాః' అన్నట్లు నిత్యసూరులు, (ఆహుః) చెప్పుదురు.

† 'సహస్రశృంగోవేదాత్మా శతజిహ్వోమహర్షభః । త్వంత్రయాణాంహి లోకానా మాదిక ర్తా స్వయంప్రభుః।సిద్ధానామపిసాధ్యానామాశ్రయశ్చాసి పూర్వజః' అ మూలము. సహస్రశాఖారూపము లయిన శృంగములు గలదియు, (శతజిహ్వః) అనేకవిధిచోదనారూపములగు జిహ్వలు గలదియు, నగు (మహర్షభః) గొప్ప ఋషభమయిన-'ఋష ఆలోచనే' గొప్ప ఆలోచనచేయువాఁడు, కర్మముల నాలో చించువాఁడయిన (వేదాత్మా) వేదమయుఁడయినవాఁడవు. ఇట్టిశృంగములును జిహ్వలునుగలవేద మనెడి ఋషభమయినవాఁడవనుట, (ఆదికర్తా) సమష్టికర్తవు- దీనిచే వ్యష్టికర్తయగు తన్ను వ్యావర్తించుకొ న్నాఁడు, (స్వయంప్రభుః) తనకుఁదా నే ప్రేరకుఁడుగాని యితరులచే ప్రేరింపఁబడువాఁడుగాఁడు 'నత స్యేశే కశ్చన ' అనిశ్రుతి. (సిద్ధానాం) ముక్తులకును, (సాధ్యానాం) యత్రపూర్వేసాధ్యాస్సన్తిదేవాః అనఁబడిన నిత్యులకును (ఆశ్రయః) తనతోడిసామ్యభోగమునొసంగువాఁడు. (పూర్వజః) ఆశ్రితులపేక్షిం చుటకుఁ బూర్వమే వారిని రక్షింపఁ బుట్టువాఁడు.

‡ 'త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమోంకారః ,పరంతపః।ప్రభవం నిధనం వా తే న విదుః కో భవానితి' అనిమూలము. (త్వంయజ్ఞః) నీవు యజ్ఞమవు. 'యజ్ఞోవై విష్ణుః' అని శ్రుతి-యజ్ఞనిర్వాహక

(వషట్, ఆశ్రావయ, అస్తుశ్రౌషట్, యజే, యజామహే, అనువానిచే నారా ధ్యుఁడవు), నీవు ఉత్కృష్టతపస్సుచే నారాధ్యుఁడవు. వేదములును వైదికులును నీపుట్టుకయును నాశమును నెఱుఁగరు. నీ వెవ్వఁడో యదియు నెఱుఁగరు. * నిన్ను యోగులు సమస్తభూతములందును విశేషించి బ్రాహ్మణులందును గోవులందును సమస్తదిక్కులందును, ఆకాశమందును పర్వతములందును వనములందును సమస్తభూతములందునుఁ జూతురు. † సహస్రపాదుఁడవునీవ. శ్రీభూపతివి. సహస్రశిరస్కుఁడవు, సహస్రనేత్రుఁడవు నీవ. ‡ నీవు పర్వతములతోఁగూడినభూమిని తక్కినమహాభూతములను ధరించుచున్నావు. ¶ రామా! దైవందిన ప్రళయమున భూమి నాశము నొందునపుడు, నీవు జలములందు శేషశాయి వగుచు దేవతలును గంధర్వులును దానవులును వసించు స్వర్గమర్త్యపాతాళము లనెడిమూఁడులోకములను కుక్షిని ధరిం

---

ములగు పశుహవిరాజ్యస్రుక్స్రువాదులు శరీరముగాఁగలవాఁడవు. యజ్ఞారాధ్యులగు నింద్రాదులు శరీరముగాఁ గలవాఁడవనుట. 'బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్' అని గీత. (వషట్కారః) వషట్కారమవు. ఇది యుపలక్షణము 'వషట్' అను ద్వ్యక్షరము 'ఆశ్రావయ' అను చతురక్షరమును 'అస్తుశ్రౌషట్' అను చతురక్షరమును 'యజ' అను ద్వ్యక్షరమును 'యేయజామహే' అని పంచాక్షరమును; మొత్తమునకు నీవను పదక్షరములచేతను ఆరాధ్యుఁడవనుట 'చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పఞ్చభిరేవచ। హూయతేచ పునర్ద్వాభ్యాం సనో విష్ణుః ప్రసీదతు' అని చెప్పఁబడెను. (ఓంకారః) ప్రణవవాచ్యుఁడవు. 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అని శ్రుతి. (పరంతపః) ఉత్కృష్టతపము గలవాఁడవు. ఉత్కృష్టతపముచే సమారాధ్యుఁడవనుట, (ప్రభవం నిధనం వా) వేదములును వైదికులును నీపుట్టుకను నాశమును నెఱుఁగరు. (కో భవానితి) నీవెవ్వఁడవో యదియు నెఱుఁగరు- అపరిచ్ఛిన్నమహిమగలవాఁడవగుటచే నెఱుంగరనుట. (క ఇత్థా వేద యత్రసః) అని శ్రుతి. దీనిచే నీస్వరూప మేమి యనుప్రశ్నమునకు నుత్తరము చెప్పఁబడెను.

* ఇందు సంబంధప్రశ్నమున కుత్తరము చెప్పఁబడుచున్నది. 'దృశ్యసే సర్వభూతేషు బ్రాహ్మణేషు గోషుచ। దిక్షుసర్వాసుగగనే పర్వతేషు వనేషుచ' అని మూలము. ఇందు సర్వాంతర్యామి యగుట చెప్పఁబడినది. 'భూతాని విష్ణుర్భువనాని విష్ణుర్వనాని విష్ణుర్గిరయో దిశశ్చ। నద్యస్సముద్రాశ్చ సఏవ సర్వం యదస్తి యన్నాస్తిచ విప్రవర్య' అని స్మృతి.

† ఇందు పురుషసూక్తార్థము చెప్పుచున్నాఁడు. 'సహస్రచరణః శ్రీమాన్ శతశీర్షః సహస్రదృక్। త్వంధారయసి భూతాని వసుధాంచ సపర్వతామ్' అని మూలము. ఇట శతశబ్దము సహస్రవాచకము. శతశీర్షా అనఁగా సహస్రశీర్షుఁడనుట. 'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షస్సహస్రపాత్' అని శ్రుతి. (శ్రీమాన్) శ్రీపతివి. ఇది భూపతియగుటకు నుపలక్షణము 'హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ' అని ఉత్తరనారాయణోక్తి.

‡ ఇందు సర్వాధారత్వము చెప్పఁబడెను. మఱియు ఆధారాధేయభావసంబంధమును చెప్పఁబడెను.

¶ దైవందిన ప్రళయవృత్తాంతమును జెప్పుచున్నాఁడు. 'అంతే పృథివ్యాస్సలిలే దృశ్యసే త్వం మహోరగః। త్రీన్ లోకాన్ ధారయన్ రామ దేవగన్ధర్వ దానవాన్' అని మూలము.

చుచు మార్కండేయాదులకుఁ గనుపట్టెదవు. * రామా ! నేను నీకు వక్షము. సరస్వతీదేవి జిహ్వ. ప్రభూ! దేవతలు పరబ్రహ్మమ వగునీగాత్రమునందు రోమములవలె నీకవినాభూతులై యుందురు. నీవు తెప్పమూయుట రాత్రియగును; కన్ను తెఱచుట పగ లగును. నీయూర్పులే వేదములయినవి. వేయేల ! నీవులేనిది యొకటియు లేదు. † జగత్తుసర్వమును. నీకుశరీరము. భూతలముస్థైర్యమును నీవు. అగ్నితాపమే నీకోపము. చంద్రునిప్రసాదమే నీప్రసాదము. శ్రీవత్సమే నీకు గుఱుతు. ‡ త్రివిక్రముండ వగునీవు మున్నుమూఁడడుగులచే ముల్లోకములను బలినుండి పుచ్చుకొంటివి. అట్లుదాఁటి మహాసురుఁడగు బలిని బంధించి యతనిచే పలాయితుఁడయిన దేవేంద్రుని మూఁడులోకములకు రాజును జేసితివి. ¶ సీత లక్ష్మి. నీవు విష్ణుఁడవు, దేవుఁడవు. పుట్టఁగలకృష్ణుండవు నీవ. ప్రజాపతియనఁబడువాఁడవు నీవ. రావణుని వధించుటకై యిందు మనుష్యదేహమును జొచ్చితివి. రామా! ధార్మికశిరోమణీ! నీవిదె మాకయి

* ఇందు ‘అంగాన్యన్యాదేవతాః’ అన్నట్లు సర్వదేవాత్మత్వము చెప్పఁబడుచున్నది. ‘అహం తే హృదయం రామజిహ్వాదేవీ సరస్వతీ। దేవా గాత్రేషు రోమాణి నిర్మితా బ్రహ్మణఃప్రభో॥నిమేషస్తే భవేద్రాత్రి రున్మేషస్తే భవేద్దివా।సంస్కారాస్తేఽభవన్ వేదా న తదస్తి త్వయావినా ॥’ అని మూలము. సంస్కారము లనఁగాని శ్వాసములనుట ‘తస్యహవా ఏతస్య మహతోభూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదః’ అని శ్రుతి. వేయేల (నతదస్తి వినాత్వయా) నీవు అంతర్యామిగా లేనివస్తువే లేదని యర్థము.

† ఇట్లు నిషేధశ్రుత్యర్థమును జెప్పి ‘సర్వంఖల్విదంబ్రహ్మ తత్త్వమసి’ ఇత్యాదిసామానాధికరణ్యశ్రుత్యర్థమును జెప్పుచున్నాఁడు ‘జగత్సర్వం శరీరంతే స్థైర్యంతే వసుధాతలమ్ । అగ్నిఃకోపః ప్రసాదస్తే సోమః శ్రీవత్సలక్షణః’ అని మూలము.(సర్వంజగత్)సమస్తజగమును...(తే)నీకు,(శరీరమ్) నీ నియమముచేత ఆధేయమును విధేయమును శేషభూతమునగునని యర్థము. ఇదియే కదా శరీరలక్షణము. ఇట్లుజగత్తు నీశరీరమగుటవలన శరీరగతములగు విశేషణములు నీవిశేషణములే యనుచున్నాఁడు. (వసుధాతలంస్థైర్యమ్) వసుధాతలస్థైర్యమనుట. భూమియొక్క దృఢత్వము నీదియనుట. ‘కాఠిన్యవాన్ యో బిభర్తి తస్మైభూమ్యాత్మనే నమః’ అని విష్ణుపురాణోక్తిచొప్పున భూరూపమున కాఠిన్యవంతుఁడై సమస్తమును భరించుచున్నాఁడని యర్థము.

‡ ఇందు వామనావతారమును త్రివిక్రమావతారమును వ్యంజితములు ‘ఇదంవిష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్’ అనిశ్రుతియు.ఇందులకు ‘త్వయాలోకాస్త్రయః క్రాన్తాః పురాణే విక్రమైస్త్రిభిః। మహేన్ద్రశ్చ కృతోరాజా బలిం బధ్వామహాసురమ్’ అని మూలము.

¶ ప్రయోజనమేమి యన్న దానికిందు నుత్తరముచెప్పఁబడుచున్నది. ‘సీతా లక్ష్మీర్భవాన్ విష్ణుర్దేవః కృష్ణఃప్రజాపతిః । వధార్థం రావణస్యేహప్రవిష్టో మానుషీంతనుమ్’ ఇందు భగవదవతారములందెల్లలక్ష్మి అనువర్తించివచ్చుట చెప్పఁబడినది. (కృష్ణః) భవిష్యత్కృష్ణావతారుఁడవు నీవే. (ప్రజాపతిః) ప్రజాపతిశబ్దవాచ్యుఁడవు నీవే. అవతారప్రయోజనము చెప్పుచున్నాఁడు. (మానుషీం) మనుష్యసంస్థానరూపమైన (తనుం) అప్రాకృతశరీరము నొందినవాఁడవు. దేహము అప్రాకృతమే. రూపము మనుష్యసంబంధి యని భావము.

పూనినకార్యము చేసి యైనది. రావణుని వధించితివి. ఇఁక సంతుష్టుఁడవై వైకుంఠ మున కుద్గమింపుము. నీబలమును వీర్యమును అమోఘము.నీపరాక్రమమును అమోఘము. నీదర్శనమును వ్యర్థము గాదు. నిన్ను స్తోత్రము సేయుటయు వ్యర్థము గాదు. మహాఫలప్రదములు. నీయందు భక్తి గలమనుష్యులు అవిలంబముగా నభిమత ఫలము నొందుదురు. పురాతనుఁడును పురుషోత్తముఁడు నగునీయందు నిశ్చలముగా భక్తియుంచినవారు ఈలోకమున సదా దేహముండువఱకు భోగము లనుభవించి దేహావసానమున పరలోకముునను సమస్తకామములను బొందుదురు.* వేదసిద్ధమును బురాతనమును నితిహాసరూపము నయినదిగాన యీస్తోత్రము నెవ్వరు నిత్యమును గీర్తింతురో యానరులకుఁ బునరావృత్తి గలుగదు' అనెను. ఇది నూటయిరువదియవ సర్గము.

---

అగ్నిపురుషుఁడు చితిమధ్యమునుండి లేచి సీతచరిత్రమును శ్లాఘించుచు రామున కాబిడ నర్పించుట. రాముఁడును సీతచరిత్రమును గొనియాడుచు నామెను స్వీకరించుట. నిరతిశయానంద ప్రాప్తి.

బ్రహ్మదేవుండు రామునితోఁ బలికిన యీ శుభవాక్యమును విని యగ్నిపురుషుఁడు సీతాదేవిని తొడలనిడికొని చితినుండి దిగ్గన లేచివచ్చెను. ఆయగ్నిహోత్రుఁడు ఆచితిని చెల్లాచెదరఁ ద్రోచికొని, మనుష్యవిగ్రహము దాల్చి జనకరాజసుతను సీతను దీసికొని శీఘ్రంబునఁ బయికి నావిర్భవించెను. బాలసూర్యునివలె వెలుఁగుచు, మేలి బంగారుసొమ్ములు దాల్చి, యెఱ్ఱనిచీరం గట్టి, యెలప్రాయంబు మఱింతినవన్నె గులుక నలువెక్కిన కుటిలకుంతలము లందగింప, తొడిగిన పూదండలును నాభరణములును గసుగందక యుండ నగ్గిం బ్రవేశించుటకు మును వుండినరూపముననే పోలుపారుచు, మనస్సు కలంక లేక యున్నసీతను తనయొడినిడికొనియగ్నిహోత్రుండు రామునకొసంగెను. అప్పుడు లోకము గావించు సమస్త శుభాశుభకర్మములకు సాక్షియగు నగ్నిహోత్రుండు రామునిఁజూచి 'రామా! నన్నుముందుఁ జొచ్చిననీపత్ని యాసీత యిదిగో! ఈబిడయం దేపాపము లేదు; కాన పరిగ్రహింపుము. మిక్కిలియుం గూర్చునీయిల్లాలునందు దోషము లేదని నెఱింగియు నీయాచారమునకుఁ గొఱఁతకలుగకుండునట్టు లగ్గిం జొప్పించితి వెంతయాచారశూరుండవు! ఈబిడ వాక్కుచేఁగాని, మనసుచేఁగాని, సంకల్పముచేఁగాని, కంటిచేఁగాని, నిన్నుమీఱి యొండుపురుషునియందు వర్తించినదిగాదు; సదాచారి చుమీ.ఇది సమ్మతింపక రావణుఁడెట్లు కొంపోవునందువా? నీవు లేనపుడు ఈబిడ దీనురాలై పరవశయైయుండఁగా రావణుఁడు పరాక్రమంబునఁ

* దీనిచే తపస్సుమొదలగువానికంటె రామభక్తియె పరమధర్మమని చెప్పఁబడినది. రామ భక్తిం జేయలేనివారికి ఈస్తోత్రమె యట్టిఫలము నిచ్చుననుచున్నాఁడు.

గన్నఁగాననివాఁడగుటచే బలవంతముగా నిర్జనమగువనమునుండి నపహరించుకొనిపోయినాఁడు. ఇట్లు చెఱఁబెట్టి యంతఃపురమునఁ బదిలముగానుంచి, వికృతరూపలయి భయంకరముగాఁ జూపట్టురాక్షసస్త్రీలను బెక్కండ్రఁగావలియుంచి వాఁ డెంతనిర్బంధపెట్టినను, ఈసతి నీయందే మనస్సునుంచి నిన్నే పరమగతిగా భావించియుండెను. మించిపోయెనేని యిట్లుండునా? ఆరాక్షసుఁడు రావణుఁడు, ధనకనకవస్తువాహనాదుల నిచ్చెదనని పలువిధములఁ బేరాస గొలుపుచుండినను, చంపెద నఱికెదనని యెంతబెదరించుచుండినను, సీత వాని నెంత మాత్రమును గణింపక మనస్సంతయు నీయందే యుంచి నిన్నే ధ్యానించుచు నుండెను. రామా! పరిశుద్ధ మయినహృదయము గలిగి పాపమెఱుంగ కున్నయీపూఁబోఁడిని ప్రతిగ్రహింపుము. నామాటకు బదులు చెప్పఁగూడదు. నేను నీకాజ్ఞాపించెదను' అనెను. అంత మాటనేర్పరియు ధర్మాత్ముఁడు నగురాముఁడు, అగ్నిపురుషుండు చెప్పినయప్పలుకు విని తనయిల్లాలు నిర్దోషురాలని చెప్పినందులకు మనంబు మిక్కిలియు నుల్లసిల్ల, నట్టిపడఁతిని నగ్నిం జొప్పించినందులకు కన్నుల నీళ్లు కలంగం బాఱ, వ్యర్థముగా దిగవిడిచితినని కొంతసేపు చింతించుచుండెను. అగ్నియిట్లు చెప్పఁగా, మహాతేజుండును గాంతిమంతుఁడును దృఢపరాక్రముండును పరమధార్మికుండు నగురాముఁడు, దేవశ్రేష్ఠుం డగునగ్నిం (బ్రహ్మదేవునిం) జూచి 'ముల్లోకములందును సీతపయి పాపము చెప్పుట యెంతమాత్రము తగనే తగదనుట వాస్తవమే. అయినను ఈ శుభాత్మురాలు రావణునంతఃపురమున బహుకాలముండినది గదా. కాన యపవాదము గలుగవచ్చును. నేను సీతను పరిశోధింపకయె పరిగ్రహించి యుందునేని, సుజనులు నన్ను దశరథమహారాజకడుపునఁ బుట్టియు రాముఁడు మూఁఢుఁడును కాముకుఁడునే యగుఁగాని మానవంతుఁడుగాఁడని నిందింతురు. కాన యా యపవాదమును బోఁగొట్టుటకై యిట్లు చేయవలసివచ్చెను. జనకమహారాజుకుమారితయైనదానికిఁగూడ నాచారము మఱియొకరు చెప్పవలయునా? సీత నాయందే మనస్సుదగులుపడి నామనసు పోయినపోకలే పోవుచుండునుగాని తానుస్వతంత్రముగా నేపనియుఁ గావింపనిదనియు నాకునుం దెలియును. అయినను సత్యమునే యవలంబించి సరియైననడవడి నడపఁ గోరువాఁడను గావున, సత్యము బయలుపఱుటకును, ముల్లోకములవారికిని నమ్మకము గలుగుకొఱకును, సీత యగ్నిని బ్రవేశించుచుండఁగా నుపేక్షించుచుంటిని. ఇటువంటిసుందరిని జూచి రావణుఁడూరకుండునా యందువేని, ఈవాలుంగన్నులచిన్నారి తనతేజముచేతనే సురక్షితయైనది. ఇట్టిచెలువయెడఁగూడ రావణుఁడతిక్రమించి నడచునా? సముద్రము చెలియకట్ట మీఱఁజాలనట్లు వాఁడు సీతను నతిక్రమింపఁజాలఁడు. సీతను జెనకుట యెంతమాత్రము శక్యముగాదు గాన దుష్టాత్ముండగు రావణుఁడు మనస్సున నయినను నా చెలువను జెనకంజాలఁడు. మండుచున్నయగ్నిజ్వాలను నెవ్వఁడు స్పృశించును? అయిన నీయమ యిటువంటియైశ్వర్యము నెట్లు విడుచునందువా? రావణాంతఃపురమునందలి యైశ్వర్యము ఈకల్యాణి కెంతమాత్ర మగ్రాహ్యము గా

డు. నాయైశ్వర్యమె దీనికిఁదగును. ఏలనఁగా సూర్యునికంటె వెలుతురు వేఱు గానట్లు సీత నాకు నెంతమాత్రము వేఱుపడియుండునది గాదు. ముల్లోకములందును అందఱికన్నను బరిశుద్ధురాలగు జనకరాజసుత యీసీతను, బుద్ధిమంతునకుఁ గీర్తిని విడువ నలవిగానియట్లు నాకు విడువశక్యముగాదు. కాన సీతకు నేనును వేఱుపడియుండువాఁడను గాను. మీరు నాయందు నెయ్యము గలవారలు; మఱి లోకపూజ్యులరు; ఇట్లు హిత ముపదేశించుచున్నవారలు. ఇట్టి మీ రందఱును జెప్పినమాట నాకు శుభకరమగును. కాన నేనవశ్యము దానిని జేసి తీఱవలయును' అనెను. మహాబలవంతుఁడగు రాముఁ డిట్లు తనకుం జక్కఁగాఁ దెలిసియె యీమాటం బలికి, మహాబలసంపన్నులయిన యాబ్రహ్మాదులు దాను గావించిన కార్యమునకుఁ బ్రశంసించుచుండఁగా, సుఖార్హుండు గావునఁ బ్రియురాలిం దగ్గఱకుఁ జేరఁదీసికొని యెంతయుసుఖము ననుభవించినవాఁ డయ్యె. ఇది నూటయిరువదియొకండవసర్గము.

---

(శివుఁడు రావణుని వధించినందులకుఁ బొగడుచు రామునిఁ జిరకాల మయోధ్యారాజ్యము పూని యశ్వమేధాదులు చేసి ధర్మమును స్థాపించి రమ్మని దివ్యశరీరుండయి దివ్యవిమానమున వచ్చియున్న దశరథునిం జూపుట. రామాదులు దశరథునకు నమస్కరించుట. అతం డందఱును వేఱువేఱ యభినందించి స్వర్గమున కరుగుట.)

రాముఁడు తెస్సగాఁ జెప్పినయీశుభవచనమును * విని శివుం డంతకన్న శుభం బగువాక్యమున నతనితో, † 'పుండరీకాక్షా! మహాబాహూ! విశాలవక్షా! పరంతపా! రామా! శస్త్రధారిశిరోమణీ! మాభాగ్యమున నీ విట్లు రావణుని వధించితివి. రామా! సమస్తలోకములకును రావణువలనఁ బుట్టి చెలంగిన భయం బను ఔషిదాపుగాఢాంధకారమును మాభాగ్యవశంబున నీ విపుడు యుద్ధమున రావణునిం

* బ్రహ్మ దేవకార్యమును జేసితియైనదిగాన దేవలోకమునకు రాముని రమ్మనఁగా శివుఁడు లోకమున ధర్మము సంస్థాపింపవలయునని రామునిహృదయమగుటం దెలిసి యట్లే యతఁడు చేయ ననుమతించుచున్నాఁడు.

† ఇందులకు 'పుష్కరాక్ష మహాబాహో మహావక్ష పరంతప' అని మూలము. పుష్కరాక్షుఁడనఁగా పుండరీకాక్షుఁడు. 'తస్యయథాకప్యాసం పుండరీక ఇవ అక్షిణీ' 'పురుషః పుండరీకాక్షః' అని శ్రుతిస్మృతులయందు పరబ్రహ్మమున కసాధారణచిహ్నముగాఁ బ్రతిపాదితమైన పుండరీకాక్షత్వము రామునకుఁ జెప్పఁబడుటచే రామరూపమున నవతరించిన విష్ణుఁడే వేదాంతవేద్యుండగు పరబ్రహ్మమని చెప్పఁబడినదయ్యెను. మహావక్షుఁడనఁగా శ్రీనివాసమువలన గొప్ప వక్షముగలవాఁడనుట.

జంపి పోఁగొట్టితివి. మహాబలశాలీ! నీవయోధ్యకుఁ బోయి, దీనుండై నీరాకకెదురు చూచుచున్న భరతు నాశ్వాసించి కౌసల్యను, నింతటిమహాకార్యమునకు మూల మగుటచేఁ గీర్తిగాంచినకైకేయినిం గాంచి, లక్ష్మణునియందలి నెయ్యమువలన నతనిం గన్న సుమిత్రను విశేషించియుఁ జూచి, రాజ్యంబుఁ జేకొని సుహృజ్జనులకెల్ల సంతోషము గూర్చి పుత్రపౌత్రాదులం గని యిక్ష్వాకువంశమును శాశ్వతముగా నెలకొల్పి యశ్వమేధమును గావించి యసదృశమయిన కీర్తిని గాంచి బ్రాహ్మణులకు వలయు ధనంబొసంగి, యంత వైకుంఠమునకు వేంచేయం దగును; కాని యింతకుముందు గాదు. రామా! ఇదిగో మనుష్యలోకమున నీకు గురుండును మహాయశుండు నయిన నీతండ్రి దశరథమహారాజు విమానమున వచ్చియున్నాఁడు చూడు. శ్రీమంతుఁ డితఁడు, పుత్రుఁడవగు నీచేత నసత్యదోషమును తరించునట్లు చేయఁబడి యింద్రలోకము నొందెను. నీవును నీతమ్ముఁడు లక్ష్మణుఁడును నితనికి నమస్కారము గావింపుఁడు' అనెను. శివుఁడు చెప్పినదివిని, రాముఁడును లక్ష్మణుఁడును విమానశిఖరమునందున్న తండ్రికి ప్రణామము గావించిరి. ప్రభుండగు రాముఁడును లక్ష్మణుఁడును, తనదివ్యదేహకాంతిచే వెలుంగుచు దివ్యంబు లయిననిర్మలవస్త్రములను ధరించియున్న తండ్రిని దశరథుని దర్శించిరి. అప్పుడు విమానంబునం దుత్తమాసనంబునఁ గూర్చుండి యున్నమహాబాహుం డగుదశరథమహారాజు తనకుఁ బ్రాణములకంటె మిక్కిలియుఁ బ్రియుండయిన పుత్రుని రామునిం జూచి మిక్కిలియుహర్షము పయికొనఁగాఁ దనతొడపయి నుంచుకొని బారసాఁచి బిగ్గ కౌఁగిలించుకొని యంత నతనితో 'రామా! నిన్నుఁ బాసినందున నాకు నీస్వర్గభోగము గాని యీదేవర్షులు గావించు సమ్మానముగూడ నంతగా మెచ్చు గాకున్నది. ఇది సత్యము. ఇట్లని యొట్టుపెట్టి చెప్పుచున్నాను. ఇప్పుడు శత్రువులను వధించి వనవాసప్రతిజ్ఞను తీర్చి నిండుమనంబున సంతుష్టుండవై యున్న నిన్నుఁ జూడఁగా నాకు మిక్కిలియుఁ బ్రీతియగుచున్నది. మేటిమాటకారీ! నిన్నారు వెడలఁ బంపుటకై కైక యేమిమాటలు చెప్పినదో యవియన్నియు మఱపునొందక నా మనస్సునే నాటుకొని నన్ను దుఃఖపెట్టుచునేయున్నవి. నీవును లక్ష్మణుఁడును కుశలముగానుండుటఁజూచి నిన్నును వానిని కౌఁగిలించుకొన్నపిదప నిపు డాదుఃఖమునుండి, మంచునుండి సూర్యుఁడు విడివడినట్లు, విముక్తుఁడనయితిని. పుత్రా! మున్ను అష్టావక్రుండు కహోళుం డను బ్రాహ్మణుని జనకసభయందు వాదంబునఁ బగవాని దరింపఁజేసినట్లు, మహాత్ముఁడును సుపుత్రుండు నగునీవు సత్యపాశబద్ధుఁడ నగునన్ను నసత్యదోషమునుండి తరింపజేసితివి. సౌమ్యా! పురుషోత్తమా! మేటిదేవతలే రావణుని వధముగావించుటకై యప్పు డాయభిషేకవిఘ్నాదులు గలిగించిరని నాకిప్పుడే తెలిసినది. శత్రునిషూదనా! కౌసల్య వనమునుండి గృహమునకు వచ్చిననిన్ను మిక్కిలి సంతోషము పొంగఁ జూడఁగలదు. కాన, యది కృతార్థురాలుచుమీ. రామా! అయోధ్యాపురమునకుఁబోయి పట్టాభిషిక్తుండవై యభిషేకజలంబులం దోఁగి యపుడు భూనా

ఘుండవై తేజరిలుచున్న నిన్నుఁ జూడఁగల మనుష్యులందఱును కృతార్థులే కదా. నీయందనురక్తిఁగలిగి, బలవంతుఁడును శుచియును ధర్మవర్తనుండునై యొప్పు భరతునిఁ బోయి నీవు గలియఁగాఁ జూడఁగోరెద. కాన యవశ్య మతనిని బోయి చేరుము. సౌమ్యా! నీవు సీతను బుద్ధిమంతుఁ డగులక్ష్మణునిని గూడి, యరణ్యంబున వాసము సేయుచుఁ బదునాలుగేండ్లనుఁ గడపి వచ్చితివి. నీవు వనవాసంబు దీర్చుకొంటివి. నీ ప్రతిజ్ఞయు సఫలమయ్యెను. రావణుని యుద్ధమున వధించి దేవతలనందఱ సంతోషపఱిచితివి. శత్రుసూదనా! చేయవలసిన కార్యము చేసితివి. శ్లాఘ్యమయిన యశస్సును బొందితివి. ఇంక రాజ్యమునందుఁ బట్టాభిషిక్తుఁడవై నెలకొని, నీవును దమ్ములును దీర్ఘాయులరై సుఖముండుఁడు' అనెను. దశరథమహారాజిట్లు పలుకఁగా రాముఁ డంజలి గీలించి యతనితో 'తండ్రీ! నీవు సమస్తధర్మములను దెలిసినవాఁడవు. రాము నడవికిఁ బంపుదువేని, నిన్నును నీకొడుకునుగూడ దిగవిడుతు' నని కైకేయితో నీవు శపథము చేసితివే! కాఁబట్టి యిపుడా కైకేయియందును భరతునియందు నను గ్రహము సేయుము. ప్రభూ! ఘోర మయినయాశాపము, కైకేయిని యామెపుత్త్రుఁ డగుభరతునిఁ దాఁకకుండునట్లు దయసేయుము' అనెను. అమ్మహారాజు తనయెదుట చేతులు మోడ్చి యున్నరామునిం జూచి 'వల్లె' యని యంగీకరించి, లక్ష్మణుని మరలఁ గాఁగిటం జేర్చి యతనితో 'నీవు రామునకును విదేహరాజసుతకు సీతకును భక్తితోడ శుశ్రూష సేసి నాకు మిక్కిలియు సంతోషము గలిగించితివి. ధర్మమునకగుఫలము నీకుఁ గలిగినదయ్యె. ధర్మజ్ఞా! *రాముఁడు ప్రసన్నుండు కాఁగా నీకు ధర్మంబును భూమియందు విశాల మయినయశస్సును సుఖమును గొప్పతనమునుఁ గలుగును. సుమిత్రానందవర్ధనా! రామునకు శుశ్రూష సేయుచుండుము. దాన నీకు శుభం బగును. రాముఁడు సమస్తలోకములకును నెల్లప్పుడును, శుభము లాచరించుటయందే యాసక్తిగలవాఁడు. † ఈదేవేంద్రుఁడు మొద లగుమూఁడులోకములవారును సిద్ధులును మహర్షులును, మహాత్ముండును బురుషోత్తముండు నగురామునిఁ గొలిచి పూజించుచున్నారు. సౌమ్యా! సమస్తదేవతాంతర్యామియు వేదతాత్పర్యభూతము నై యగ్నీంద్రాదిరూపమున సర్వకర్మములచే నారాధ్యమై సాక్షాదుపనిషత్తులచేఁ దెలియందగి భక్తిశూన్యులకుఁ దెలియ నలవి గానిదై షడ్భావవికారరహిత మై యొప్పెడి యాబ్రహ్మమే యిట్లు రామరూపమున నవతరించినదని బ్రహ్మాదులు చెప్పుదురు. నీవు రామునకును వైదేహికి సీతకును భక్తితో శుశ్రూషసేయుటవలన ధర్మము నాచరించినవాఁడ వయితివి; విశాలమయినకీర్తిని జెందితివి' అనెను. మహాబాహుండగు ధర్మాత్ముఁ డాదశరథుఁడు తనమ్రోల చేమోడ్చి నిలిచి యున్నలక్ష్మణున కవ్విధంబునం

* లక్ష్మణుఁగూడ విష్ణ్వవతారమని దశరథుఁ డెఱుఁగఁడు.

† ఇందు దశరథుఁడు రాముఁడు సర్వోత్తముఁ డని యింద్రాదిశిష్టులయాచారమునుబట్టి తెలుపుచున్నాఁడు.

జెప్పి యంత సీతాదేవిని జూచి శుభవచనమున 'సీతా! రాముఁడిప్పుడు నిన్ను 'పరిత్యజించినా'నని చెప్పినందులకై నీవు కోపముసేయరాదు. నీచరిత్రము పరిశుద్ధముగా నుండవలయునని రాముఁడు నీమేలుగోరి నీపరిశుద్ధత వెల్లడియగుటకై యిట్లు చేసినాఁడేకాని మఱేమి గాదు. సుభ్రూ! పెనిమిటికి శుశ్రూష సేయువిషయమునుగుఱించి నీ కుపదేశింపవలసినది లేదు. అయిన నేను మామనగుటచే చెప్పవలసినవాఁడను. కాన యవశ్యము చెప్పెదను. ఈరాముఁడె నీకు పరదైవము' అనెను.' దశరథుఁ డివ్విధమున పుత్రులగు రామలక్ష్మణులకును కోడలయిన సీతకును జెప్పి విమానంబుతోఁ దేజరిల్లుచు నింద్రలోకమునకుం బోయెను. ఇది నూటయిరువదిరెండవ సర్గము.

---

దేవేంద్రుని ప్రసాదమువలన నిదురించి లేచినట్లు యుద్ధమృతు లయినవానరు లెల్ల లేచుట. దేవతలు స్వస్థానమునకుఁ బోవుట.

దశరథుఁడు మహేంద్రవైభవమున మరలి దేవలోకమునకుఁ బోఁగానే, దేవేంద్రుఁడు మిక్కిలియు సంతుష్టుఁడై తనముంగల నంజలి గీలించి నిలుచున్న రామునిఁ జూచి 'రామా! పరంతపా!* మేము దశరథునిపుత్రకామేష్టికాలమున నొసంగినదర్శనము నీకు రావణవధ పర్యంతమగు ఫలము కలిగించినది. మేము మిక్కిలియు సంతోషించితిమి. అందువలనఁ బ్రత్యుపకారముగా నీవు మనమున నేమిగోరెదవో చెప్పుము' అనెను. ఇంద్రుఁ డిట్లు చెప్పఁగా, రాముఁడు తానును తమ్ముం డగులక్ష్మణుండును భార్యయగు సీతయుఁ జేతులుమోడ్చి 'సమస్తదేవాధిపతీ! మాటలాడువారలలో మేటీ! నీకు నాయందుఁ బ్రీతిగలిగినయెడల నేను గోరునది చెప్పెదను. నీవట్లుచేసి నీమాటను సత్యము గావించుకొనుము. నాకొఱకై పరాక్రమించి యుద్ధంబున మృతులై యమలోకమునకుఁ బోయినవానరు లందఱును మరల బ్రతికి లేచునట్లుగావింపుము. ఎవ్వరు నాకుఁ బ్రియము లయినకార్యములం దాసక్తులై మరణమునుగూడ లెక్కగొనక కావించి, కొడుకులను పెండ్లాలనుం బాసి మృతులయిరో యావానరులందఱును మరల బ్రతికి తమపుత్రకళత్రములతోఁ గూడునట్లు లనుగ్రహింపుము. ఈవరమే నేను వేఁడుచున్నాను. మానదా! వానరులును భల్లూకములు నెంతమాత్రమును బీడలేక, గాయములునులేక యెప్పటియట్లు బలపరాక్రమసంపన్నులై యుండం జూడఁగోరుచున్నాను. వానరులుండు స్థలములందు కాలముగానియప్పుడుగూడ ముఖ్యము లయినఫలమూలములు గలుగవలయును. నదులు నిర్మలజలములతో నొప్పుచుండవలయును' అనెను. మహాత్ముం డారాముఁడు పలికినమాటను విని,

---

* నీవిప్పుడు మమ్ము దర్శించినది వ్యర్థముగారాదు. మేమును సంతోషించితిమి. కాన నీవు మనసునఁ గోరువర మడుగుము ఇచ్చెదమని యర్థాంతరము.

దేవేంద్రుఁడు ప్రీతిసూచకం బగుమాటల 'నాయనా! రఘునందనా! చెల్లాచెదర యిన కాలుసేతులు తోఁకలు మొదలగు నవయవముల నెప్పటిరూపుగాఁ జేర్చి లోకాంతరగతు లయినవారిని మరలఁ దెచ్చి యిట్లు వానరాదుల బ్రతికింపవలసియున్నది గాన నీ వడిగినయీవరము మిక్కిలియుగొప్పది. అయిననేను మొదలొకటిచెప్పి మఱి యొకటి రెండవతూరి యింతవఱకుఁ జెప్పినది లేదు. కాన నీవడిగినట్లు కాఁగలదు. రాక్షసులచే యుద్ధంబునఁ గాలుసేతులు తలలుదెగి హతులయిన కొండముచ్చులు నెలుఁగుగొడ్డులును వానరులును మరల బ్రతికిలేవఁగలరు. వానరు లందఱు నేపీడయును గాయమును లేక యెప్పటిబలపరాక్రములు చక్కఁగాఁబడసి,నిదురించి మేలుకొన్నపుడు లేచునట్లు, లేవఁగలరు. అందఱును మిక్కిలియు మోదమునఁబొంది తనుస్నేహితులతోను బంధువులతోను దాయాదులతోను స్వజనములతోను జేరి సుఖముండఁగలరు. మేటివిలుకాఁడా! ఈవానరు లున్నస్థలములందుఁగూడ, అకాలమునందును వృక్షములు నానావిధపుష్పములచే పలువన్నెలు గులుకుచు మంచిపండ్లునుం గలిగియుండఁ గలవు. నదులు నిర్మలజలములు గలిగియుండఁగలవు. మునుపు గాయములుపడిన యంగములతోఁ గూడియుండినవానరులందఱును మరల నవయవములందు గాయములు లేక యుందురు', అనెను. అంత మృతు లయినవానరవీరు లందఱును నిదురించి లేచినట్లు బ్రతికిలేచిరి. మృతులు గాకుండినవానరులందఱును చచ్చినవారు మరల లేచుటను జూచి 'ఇదేమివింత' యని యాశ్చర్యమునొందిరి. మరల బ్రతికినవానరులందఱును లేచివచ్చి రామునకు నమస్కారము గావించిరి. ఆదేవోత్తములందఱును అట్లు రాముఁడు సమస్తాభీష్టంబులనొంది యలరుచుండుటను గాంచి, స్తోత్రార్హుండగు నతనిని మొదట స్తుతించి, యంతలక్ష్మణుఁడు వినుచుండ నతనితో 'వీరా! పరంతపా! నీవిచటనుండి యయోధ్యకుఁబొమ్ము. ఈవానరులను వారివారినెలవులకు వీడ్కొలుపుము. సీయం దెంతయు ననురాగముగలిగి, మిక్కిలి తపస్సంపన్నయై యున్న యీసీత పడిన యిడుమలను దలంపఁగా జాలిగలుగుచున్నది. కాన యీదేవి నుపలాలింపుము. నీతల్లులనందఱను,మహాత్ముండగు శత్రుఘ్నుని,నిన్నుఁ బాసినశోకముచేఁ దాపసవ్రతముదాల్చియున్నసీతమ్ముని భరతునిని జూడుము. నీవు పట్టాభిషేకము చేసికొని పురజనులనందఱను మిక్కిలియు సంతోషపెట్టుము' అనిరి.ఇట్లు చెప్పి దేవతలు రామలక్ష్మణులయొద్ద సెలవుపుచ్చుకొని సంతుష్టులై సూర్యునివలెఁ బ్రకాశించుచున్న విమానములనారోహించి *దేవలోకమునకుం బోయిరి. రాముఁడు, లక్ష్మణుండును దానును,ఆదేవోత్తములకందఱకును నమస్కరించి యపుడు వానరులనందఱను వీడుఁబట్ల విశ్రమించుచన ట్లాజ్ఞాపించెను. అంత విజయమునొంది కీర్తి గాంచిన యమ్మహావానరసైన్యము మిక్కిలియు సంతుష్టినొందె. రామలక్ష్మణులపాలనము క్రింద కాంతిసొంపునం

---

* ఇట ప్రథమయందు రావణసంస్కారము జరుగఁగా ద్వితీయయందు విభీషణాభిషేకమును సీతాప్రాప్తియును దేవతలను బంపుటయుఁ దెలియునది.

దళ్కొత్తుచు చంద్రునిచేఁ బ్రకాశించుశుక్లపక్షరాత్రివలె నెంతయు విలసిల్లు చుండెను. ఇది నూటయిరువదిమూఁడవసర్గము.

విభీషణుఁడు రాముని మంగళస్నానము సేయఁ బ్రార్థింపఁగా భరతుండులేక తానట్లు చేయనని చెప్పుట. విభీషణుఁడు రెండుమూఁడు దినములు లంక నుండునట్లు ప్రార్థించినను రాముఁడు భరతునిఁ జూడఁగోరి యట్లు సేయ నొల్లక పుష్పక విమానమును దేరఁబంచుట.

బ్రహ్మాదిదేవతలు వచ్చి పోయినపిదప, ఆనాఁటిరాత్రియంతయు నరిందముఁడగు రాముఁడు లంకయందుండి సుఖముగా నిదురించి వేకువను మేలుకొనియుండఁగా, విభీషణుం డంజలి గీలించి జయం బడిగి యతనితో 'రామా! స్నానంబునకుఁ దగిన జలములు, కుంకుమ మొదలయిన మైపూఁతలు, వస్త్రములు భూషణములు, దివ్యంబులగు చందనములు, నానావిధములయిన పుష్పమాలికలునుం దెచ్చియున్నాను. చక్కఁగా నలంకరింప వలంతు లయి తామరలవంటి కన్నుంగవలఁ జెన్నారుచున్న యీకాంతలును వచ్చియున్నారు. నిన్ను నుపచారములతోఁ జక్కఁగా స్నానము సేయింతురు. మఱెందులకుఁ గాదు; నన్ననుగ్రహించుటకై నీవు వాని నంతయుఁ బ్రతిగ్రహింపుము' అనెను. విభీషణుఁ డిట్లుచెప్పఁగా రాముఁడతనితో 'సుగ్రీవుఁడు మొద లగువానరవీరులనే నీవు స్నానార్థము పిలువుము. ఏలనఁగా, మహాబాహుఁ డాభరతుఁడు నామనసుననే యున్నాఁడు. వాఁడు సుకుమారుఁడు; మఱియుఁ బసివాఁడు; కామసుఖములకే తగినవాఁడయ్యు నాకొఱకు, నన్ను మరల లభించుకొఱకు, తాపసధర్మము నాచరించుటవలననే కష్టపడుచున్నాఁడు. మఱి పదునాలుగేండ్లు నిండఁగానే రానియెడల నగ్గిలోఁబడుదునని ప్రతిజ్ఞ చేసియు నున్నాఁడు; ప్రతిజ్ఞను దప్పువాఁడు గాఁడు. అట్టివాఁడు నాకు స్నానమున కుపకరణము గనుక నతఁడులేక స్నానమెట్లు సేయఁగూడును. కైకకడుపునం బుట్టినందులకే యాయమవలన దుఃఖము పడియున్నాఁడు. ఇఁక నేనుగూడ నాదుఃఖము పెట్టవలయునా? నన్నుఁబాసినందున బహువ్రతధర్మము లతఁ డాచరించుచుండఁగా నేనుమాత్రము వ్రతమువిడుచుట యుక్తమగునా? మఱియు రాజయిన నేను లేనపుడు రాజ్యమును జక్కఁగ జరిపినవాఁడు. అట్టివాఁడు దగ్గఱలేనందున నాకు మొదలు స్నానమె యంతగా మెచ్చు గాకున్నది. ఇఁక వస్త్రాభరణములసంగతి చెప్పనేల? ఇదియే కదా యయోధ్యకుఁ బోవుమార్గము. ఇది చాలదూరమగుటచేఁ బోవుటకు మిక్కిలియుఁ గష్టమైనది. ఈమార్గముననే పట్టి నేనిప్పుడే శీఘ్రముగా నాపట్టణమునకుఁ బోయెదను' అనెను. రాముఁ డిట్లుచెప్పఁగా విభీషణుండు మరల నతనితో 'రాజకుమారా! అన దృఢపరాక్రమశాలీ! ఒకదినములోపల నిన్నాయయోధ్యాపురమును జేర్చెదను. నీకు శుభంబగుఁగాక. సూర్యప్రకాశంబగు పుష్పక మను విమానమున్నది. అది నా

యున్నదైన కుబేరునిది. దానిని రావణుఁడు బలవంతముగాఁ బట్టి తెచ్చుకొనెను. దొంగిలించి కాదు; కుబేరుని యుద్ధంబున జయించి తెచ్చుకొన్నాఁడు. మిక్కిలి యుత్తమంబయిన యది దివ్యమయినది గాన తలఁచినచోటికి తనంతటఁ బోవంగలదు. ఇయ్యది యిప్పుడు కుబేరుఁడు వచ్చినను నియ్యక నీవెక్కిపోవుటకొఱకై పదిలముగా నిలుపుకొనియున్నాను. మేఘమువలె నాకాశమున మహావేగమున సంచరించునట్టి యీపుష్పకవిమాన మిదె యిచటనున్నది. నీ వావిమానము నెక్కి యేతుందుడుకు లేక యయోధ్యను జేరంగలవు. రామా! స్నానాదులు గయికొనకున్నఁ బోయెఁగాక. నీవు ప్రాజ్ఞుండవు; కాన నీకుఁ దెలియని దేదియు లేదు. నీకు నాయందనుగ్రహ ముంపఁదగునేని, నాభక్త్యాదిగుణములు నీమనంబునకు వచ్చునేని, నాయందు నీకు నెయ్యము గలదేని, రెండొకదినములు నీవును నీతమ్ముఁడు లక్ష్మణుఁడును నీభార్య సీతయు నిందు నిలువుఁడు. నేను సమస్తకామితపదార్థములఁ గావించుపూజలం గయికొని యటుపిమ్మటఁ బోదువు. నీకు వలయుపూజ మునుపే సమకట్టియున్నాను. క్రొత్తగా సమకట్టఁబూని జాగుసేయుటలేదు; కనుక ఆయితముగా సమకట్టి యున్న నాసత్కారమును నే నత్యంతప్రీతిని జేయఁగా నీవు నీసైన్యము వారును నీ మిత్రగణమును నంతకుఁ బ్రతిగ్రహింపుఁడు. నిర్బంధము సేసెదనని తలంపకుము. నామాటతప్పక విందువనెడినమ్మకమువలనను, నాయందు నీవు గావించులాలనమువలనను, నీయందు నాకుఁగల భక్తిబలమువలనను, నీభృత్యుఁ డగు నే నిట్లు గావింపఁ బ్రార్థించుచున్నా నింతేకాని ని న్నాజ్ఞాపించువాఁడనుగాను జుమీ' అనెను. విభీషణుఁ డిట్లు చెప్పఁగా నంత రాముఁడు, రాక్షసులును వానరులును నందఱును వినుచుండఁగా నతనితో 'స్వామ్యా! పరంతపా! నీవు గావించినసాహాయ్యము, యుద్ధంబున నీవు నెఱపినపౌరుషములు, ఉత్తమమయిన నీభక్తి, వీనిచేత నే నన్నివిధములఁ బూజితుండనయితిని. రాక్షసేశ్వరా! నీవు చెప్పినయీమాటను నేను జేయకుండనుజుమీ. అయినను నన్ను వనమునుండి మరల్చి పట్టణమునకుఁ గొనిపోవుటకై యెవ్వఁడు చిత్రకూటపర్వతమునకు వచ్చెనో, ఎవ్వండు పట్టాభిషేకము సేసికొమ్మని తల నేల సోఁక మ్రొక్కి యెంత బతిమాలుకొన్నను నే నట్లుచేయనయితినో, అట్టిపరమభక్తుని నాతమ్ముని భరతునిఁ గన్నారంజూచుటకు నామనసు తొందరపడుచున్నది. భరతునే కాదు, కౌసల్యను, సుమిత్రను, కీర్తిమతి యగు కైకేయిని, వసిష్ఠాదిగురువులను స్నేహితులను పురజనులను వారి పుత్రులనుం జూడవలయునని నామనస్సు తుకతుకలాడుచున్నది. రాక్షసేశ్వరా! నాకొఱకు శీఘ్రము పుష్పకవిమానమును రావింపుము. రెండుమూఁడుదినము లుందమన్నను, పదునాలుగేండ్ల వనవాసము నిర్వర్తించి వచ్చినపని తీర్చి యయినపిదప, పదునాలుగేండ్లకు రానిచో, యగ్నిం బ్రవేశింతునని ప్రతినచేసి యుండునపుడు, నే నిచటనుండ మన సెట్లు వచ్చును? సౌమ్యా! విభీషణా! నాకనుజ్ఞ యిమ్ము. ఈవిమానము నొసఁగుటచేత నే పూజితుండనయితిని. నీవు కోపము సేయవలదు. నాకు శీఘ్రము

గాఁబోవ ననుమతియొసంగుము' అనెను. రాముఁడు చెప్పినదివిని, రాక్షసేశ్వరుఁడగు విభీషణుఁడు పోయి శీఘ్రముగా నావిమానమును దీసికొని మరలివచ్చెను. అది బంగారుమయము లయినచిత్రావయవములును వైడూర్యమయము లయినవేదికలును గలిగియుండెను. దానిలోపల మంటపములు పెక్కులు వ్యాపించియుండెను. అది యంతటను వెండివలె నతివిశదకాంతి నొప్పుచు తెల్లనిపతాకలచేతను ధ్వజములచేతను జక్కఁగా నలంకృతమై యుండెను. అందు మఱియు బంగారుమయములైన యవాంతర రాజగృహములును వన్నెఁజూపుచుండెను. వ్రేలాడుచున్న బంగారుపద్మములును దానికొక చెలువు గూర్చుచుండెను. దానికి ముత్తెములచే నిర్మింపఁబడిన కిటికీలుండెను. మఱియు దానినలుప్రక్కల చిఱుగంటల సమూహములును కోణములందు పెద్దగంటలును వ్యాపించియుండుటచే నది యన్నిప్రక్కల శ్రావ్యముగా శబ్దించుచుండెను. అది విశ్వకర్మచే నిర్మితము. మేరుశిఖరాకారమునం జూపట్టుచు, ముత్తెములవలెను రజతమువలెను నచ్ఛమయిన పెక్కుహర్మ్యములచే పొలుపు గులుకుచు, పటికమయములైన చిత్రావయవములు గలప్రదేశములతోను, వైడూర్యమయములై మేలయినపఱపులు గలిగి మిక్కిలి నెలపొడుగయియున్న యుత్తమాసనములతోను గూడియుండెను. అది యెట్టివారికిని జెనకరానిదై మనోవేగమున నొప్పుచుండెను. అట్లు విభీషణుఁ డావిమానమును దెచ్చి రామునకు సమర్పించి యచ్చో నిలుచుండెను. ఇది నూటయిరువదినాలుగవసర్గము.

---

రామునియాజ్ఞచే విభీషణుఁడు సమస్తవానరులను బహుమానించుట. శ్రీరాముఁడు తనతో రాఁగోరినసుగ్రీవాది వానరులతోను విభీషణునితోను నతనిమంత్రులతోను సీతాలక్ష్మణులతోను బుష్పకమారోహించి యయోధ్యకుఁ బయనమగుట.

విభీషణుండు పుష్పమాలికాలంకృత మగునాపుష్పకవిమానము వచ్చి యుండుటను రామునకుం జూపి సమీపంబున నిలుచుండి యతనితో ని ట్లనియె. రాక్షసేశ్వరుం డతఁడు చేతులు మోడ్చి, వినయవినమితాంగుండై యాదరాతిశయంబువలన వేగపాటు గదుర రాముని 'ఇంక నేనేమి సేయవలయును' అని యడిగెను. మహాతేజుం డగురాముం డాలోచించి లక్ష్మణుఁడు మాత్రము దాపున వినుచుండఁగా, నతని సమ్మతిమీఁద స్నేహంబుదొలఁకాడ నవ్విభీషణునితో 'విభీషణా! కష్టసాధ్యమగు నీకార్యమునంతయుఁ దగినట్లు పాటుపడి సాధించినవారలు వానరులు. కావున నీవు నానావిధములైన రత్నములను వస్త్రములను ఆభరణములను నొసంగి వీరిని సత్కరింపుము. రాక్షసేశ్వరా! ఇదివఱకు దేవతలకుంగూడ జయింపరాకుండినయీలంకను యుద్ధంబున వెనుదీయక ప్రాణభయంబును దిగవిడిచి యుబ్బున వీరు సాహాయ్యపడుట

చేత మనము జయించితిమిగాని వేఱుగాదు. వీరివలననే నీకు లంకారాజ్యప్రాప్తియు
ననఁదగు. అట్లు కార్యమును సాధించినయీవానరుల నందఱను బూజింపుము. ధనముల
ను రత్నములనునొసంగి వీరు పడిన ప్రయాసమును సఫలముగావింపుము. మానదా!
నీవు కృతజ్ఞత గలిగి సమ్మానార్హులగునీవానరవీరుల నిట్లు సమ్మానింతువేని వీరందఱును
పూర్ణమనోరథులై సుఖముండుదురు. అట్లుగావింతువేని, నీవు త్యాగశీలుండవనియు
త్యాగములచే మిత్రుల సంగ్రహించుకొనువాఁడవనియు, దయావంతుఁడవనియు
త్యాగంబువలన యశస్సంపన్నుఁడవనియు నిన్నందఱును దలంతురు. కావుననే యిది
నీకుఁ దెలుపుచున్నానింతేకాని యాజ్ఞాపింపలేదు. తమకు స్వామి యయ్యును, ప్రీతిక
రములయిన యౌదార్యాదిగుణము లొక్కటియు లేనివాఁడయి, దయలేక క్రోధమునే
యవలంబించి హింసించుచుండునట్టిరాజును సైనికులు విసుగునం జేసి యుద్ధకాలము
న దిగవిడుతురు. కాన వారిని సమ్మానించుటయే మంచిది' అనెను. రాముండిట్లు చెప్పఁగా,
విభీషణుఁ డావానరుల నందఱను వారివారియంతరువులకుం దగినట్లు మణులను ధన
ములను భాగములు సేసి యొసంగి సమ్మానించెను. అంత నవ్వానరయూథపతులంద
ఱును రత్నవస్త్రాదులచేత సమ్మానితులగుటను జూచి రాముండు యశస్సంపన్నురా
లగుసీతను లజ్జించుచుండఁగా *నంకంబునం జేకొని, పరాక్రమవంతుఁ డగుతమ్ముఁడు
లక్ష్మణుఁడు తనవిలుగొని వెనువెంట నెక్క, నుత్తమం బగునాపుష్పకవిమానము నా
రోహించెను. రాముఁడట్లు విమానము నారోహించుటయేకాక సమస్తవానరులను
మహావీర్యశాలియగు సుగ్రీవుని, విభీషణునిం జూచి సమ్మానపూర్వకముగా 'వానరోత్త
ములారా! మీరలు మామిత్రులంచ నగునాయీకార్యమును గావించితిరి. మీకందఱ
కును సెల వొసంగితిని. మీయిష్టముచొప్పున మీమీనెలవులకుఁ బొండు. పరంతపా!
సుగ్రీవా! మంచిహృదయము గలచెలికాఁ డేమి చేయవలయునో నీవు, అధర్మమున
కు వెఱచి, అది యంతయు నాకుఁ జేసితివి. ఇఁక నీవు నీసేనలతోఁగూడి శీఘ్రంబుగాఁ
గిష్కింధకుం బోయి సుఖముండుము. విభీషణా! †నీవు నేనొసంగిననీసొంతరాజ్యము
ననుభవించుచు రావణునివలె నితరరాజ్యముల నాక్రమింపక లంకయందు సుఖ
ముగానుండుము. అప్పుడు దేవేంద్రసహితముగా దేవతలెత్తివచ్చినను నిన్నుఁ జెనక
నలవిగాదు. నేనింక నాతండ్రి రాజధాని యగునయోధ్యకుఁ బోయెదను. మీరు నా క
నుమతియొసంగఁ గోరెదను. మిమ్మందఱను వీడ్కొనుచున్నాను' అనెను. రాముఁ డి
ట్లు చెప్పఁగా మహాబలశాలు రగునాసుగ్రీవాదివానరులును, రాక్షసుం డగువిభీష
ణుఁడును నంజలిగీలించి రామునిఁ జూచి 'మే మయోధ్యకు రాఁగోరుచున్నాము. దే
వర మమ్మునెల్లఁ దోడ్కొనిపోవలయును. అచ్చట జనపదముల కెంతమాత్రము బాధ

* రాముఁడు వేఱొక స్త్రీసహాయము లేనందున సీతను తొడయం దిడుకొనె నని తెలియునది.

† దీనింబట్టి జనస్థానమును విడిచి యంపలి కాఁపుపెట్టియున్నవారిని రప్పించుకొను మనియు
సూచితము.

లేకుండునట్లు వనములందును నగరములందును నెచ్చరికతోఁ మెలఁగెదము. రాజకుమారా! నీవుపట్టాభిషేకజలంబులం దోఁగుటనుజూచి కౌసల్యాదేవికి నమస్కరించి, త్వరితముగానే మామాగృహములను చేరెదము' అనిరి. అట్లు విభీషణుండును సుగ్రీవాదివానరులును బ్రార్థింపఁగా, ధర్మాత్ముండును శ్రీమంతుఁడు నగు రాముఁడు వారల నందఱను జూచి 'నేను భరతాదు లయిననాబంధువులను, మిమ్ము నందఱనుం గూడి యయోధ్యాపురమును బ్రవేశించి ప్రీతిం బొందఁగంటిని; కానయిది* ప్రియమునకంటె మఱిమఱిప్రియము నాకులభించినది. సుగ్రీవా! నీవును వానరులును శీఘ్రముగాఁ బుష్పకము నారోహింపుఁడు. రాక్షసేంద్రా! విభీషణా! నీమంత్రులతోడ నీవును శీఘ్రముగ నారోహింపుము' అనెను. అంత శీఘ్రగమనంబును దివ్యంబు నగునాపుష్పకవిమానమును సుగ్రీవుఁడును వానరసైన్యమును వేవేగ నారోహించిరి; విభీషణుండును నతనిమంత్రులును నారోహించిరి. వారందఱు నారోహింపఁగానే కుబేరుని మేటివాహన మయినయవ్విమానము రాముడు బయలు దేఱున ట్లనుజ్ఞ సేయఁగా నాకాశమున కెగసెను. రాముఁడు హంసప్రతిమలతోఁగూడి ప్రకాశించుచున్నయావిమానమున మిక్కిలి సంతుష్టుండై దేవాదులు గొనియాడుచుండ కుబేరునియట్లు చూపట్టుచుం బోయెను. ఆపుష్పకము దేవనిర్మితమై యిఱకటమునొందక యెందఱికేని యెడము గలిగి యుండునది గాన మహాబలశాలు రగునవ్వానరులును రాక్షసులును నందఱును నెంతమాత్రము నిఱుకు లేక హాయిగా నందుఁ గూర్చుండి యుండిరి. ఇది నూటయిరువదియైదవసర్గము.

---

రాముఁడు సీతకు మార్గమునందు లంకాపురి మొదలుగా నయోధ్యవఱకుఁ గలయవ్విశేషములను జెప్పుట. రాముఁడు కిష్కింధకుఁ బోయినపుడు సీతాప్రార్థనమున సుగ్రీవాదివానరపత్నులను బుష్పకమెక్కించి యందఱితోఁ గూడ భరద్వాజాశ్రమమును జేరుట.

అత్యుత్తమ మయినయాపుష్పకవిమానము రాముఁ డనుజ్ఞ యియ్యఁగానే, వాయువుచేఁ జిమ్మంబడినమహామేఘముంబోలె నాకాశమున కతివేగమున నుద్గమించి పోయెను. అంత రఘునందనుండు రాఘుఁడు నలుదిక్కులను జూపు నిగిడించి చందురునివంటిముద్దునెమ్మొగంబు గల రాచకుమారిని సీతను జూచి 'సీతా! కైలాసశిఖ

* 'ప్రియాత్ప్రియతరం లబ్ధం యదహం ససుహృజ్జనః। సర్వైర్భవద్భిస్సహితః ప్రీతింలప్స్యే పురీంగతః' అనిమూలము. సీతాలాభము ప్రియము, భరతదర్శనము ప్రియాత్ప్రియము—ప్రియమునకంటె ప్రియము. మీతోఁగూడి పురమును బ్రవేశించుట 'ప్రియాత్ ప్రియతరము—ప్రియమైనదానికంటె మఱి మఱి ప్రియమైనదని భావము.

రము౦ బోలు త్రికూటశిఖరముపయి నున్నలంకాపురిని జూడుము. ఇది విశ్వకర్మచే నిర్మింపఁబడినది. సీతా! ఇదిగో యిటుచూడు. కండలు నెత్తురును రొంపిగొనియున్న యుద్ధభూమి యిది. వానరులును రాక్షసులును పెక్కండ్రిందు హతులయిరి. వాలుఁగంటీ! బ్రహ్మవలన వరముపడసి,లోకములనెల్ల కలంచి నలంచు చుండినరాక్షసరాజు రావణుఁడు నీనిమిత్తము నాచే హతుండై యిచట నీలుగఁబడియున్నాఁడు చూడుము. ఈచోట కుంభకర్ణుఁడు నాచేత హతుఁడయ్యె.ఇచటఁ బ్రహస్తుఁ డనురాక్షసుఁడు గూలెను. ఇచట హనుమంతునిచే ధూమ్రాక్షుఁడు గెడసెను. తెన్నఁజూడుము. * మహాత్ముఁ డగుసుషేణునిచే నిచట విద్యున్మాలి హతుఁడయ్యెను. ఈచోట లక్ష్మణుఁడు రావణకుమారుని నింద్రజితుని వధించెను. ఈస్థలమున నంగదుఁడు వికటుం డను రాక్షసుని వధించెను. ఇచట దుర్ధర్షుం డగువిరూపాక్షుండును, ఇచట మహోదరుఁడును మహాపార్శ్వుఁడును,ఇచట నకంపనుఁడు,నిచ్చట నిచ్చట బలవంతు లయినయితరరాక్షసులు కొందఱును వధింపఁబడిరి.రావణునిభార్య యగుమండోదరి, వేగురుసవతులు కన్నుల నీళ్లు గార్చుచు చుట్టియుండఁగా మృతుం డయినరావణుంగూర్చి ప్రలాపించినస్థలమిది.సుందరవదనా! ఇదిగో నీసముద్రము రేవును జూడుము.ఇచట మేము సముద్రము దాఁటి యానాఁటిరాత్రి యంతయు నివసించియుంటిమి.విశాలాక్షీ!నగరుని చేఁ ద్రవ్వింపఁబడినయీసముద్రమునందు నీనిమిత్తమై నలునిచే నేను గట్టించిన సేతువిదె చూడుము. ఇది యెంతయు దుష్కరమయినది. సీతా! క్షోభ పెట్టనలవిగానిదియు వరుణునికి స్థానమయినదియు నగుసముద్రమును జూడుము. ఇందు నడుమదీవులు మొదలగు నేలపట్లు లేవు. ఇది కరుల్లిచేఁగర్జిల్లుచు ముత్తెపుఁజిప్పలచే నొప్పుచున్నది. సీతా!హనుమంతుఁడు సముద్రమును దాఁటినపుడు,అతఁడు విశ్రమించుటకై సముద్రమును భేదించి లేచినయీబంగారుమయ మయిన మేటిపర్వతమును మైనాకమును జూడుము.సముద్రమధ్యమున † సేతువుపయి,నీస్థలంబున వానర సేనయంతయు విడిసియుండినది. మహాత్ముం డగుసముద్రుని యందు సేతుబంధ మనెడియీ రేవునుజూపట్టు చున్నది చూడు. ఇది ముల్లోకముల చేతను బూజింపఁదగినది. ఇది పరమపావనమై సమస్తపాపముల నాశముచేయుచుండునది కాఁగలదు.‡ఇట సముద్రజలాధిష్ఠాతయగు సముద్ర

* సుషేణుఁడు విద్యున్మాలిని వధించుటయు అంగదుఁడు వికటుని వధించుటయు పూర్వము చెప్పఁబడకున్నను ఇప్పుడు అనువదించుటచే జరగినట్లు తెలియునది.

† ఇంతకుపూర్వము సేతువు దక్షిణకోటినిజెప్పి యిచట నుత్తరకోటిని జెప్పుట తెలియునది.

‡ ఇందులకు 'అత్రపూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ప్రభుః' అని మూలము. 'ఇచట పూర్వము, ప్రభుండగు మహాదేవుఁడు నాయందనుగ్రహముచేసెను' అని సామాన్యముగా నర్థము. ఇట మహాదేవుఁడనఁగా రుద్రుండని కొందఱుచెప్పెదరు గాని యది సరికాదు. పూర్వము రుద్రుఁడు రామునికి ప్రసాదముచేసినట్లు చెప్పఁబడలేదు. పూర్వము చెప్పఁబడినవియేకదా మరల నిట అనువదింపఁబడినవి. కాన చెప్పఁబడనిరుద్రుని నిట చెప్పుట దగదు. అయినను 'అంగదుఁడు వికటునిఁ జంపినది పూ

రాజు తన్ను శోషింపఁజేయుటకై కుపితుఁడగునాకు ప్రసన్నుండయ్యెను. రాక్షసరాజగువిభీషణుఁడు నాకడకు వచ్చిచేరినచోటిది. సీతా! ఇదిగో! చిత్రములయినయడవులు

ర్వము చెప్పఁబడకున్నను ఇట అనువాదముచే (మరల చెప్పుటచే) సిద్ధించినట్లు రుద్రుఁడు ప్రసాదమునే యుటయు పూర్వము చెప్పఁబడకున్నను నిప్పటియనువాదముచే సిద్ధించెననఁగూడదా? యనవచ్చును. కాని యిది సరికాదు. అందు విరోధమేమియులేదు. అట్లే యిందును విరోధములేదనరాదు. ఇందు విరోధము చూపట్టుచున్నది. ఎట్లనఁగా, రుద్రుఁడు చూపినప్రసాదము సేతువును నిర్మించుకాలమందా? లేక మరల వచ్చుకాలమందా? సేతువు నిర్మించునప్పుడన్నచో పూర్వమే సిద్ధించి యున్నసముద్రప్రసాదముచేతనే యది (సేతునిర్మాణము) కలుగుచున్నది గాన యందులకావశ్యకముగాదు. మఱియిప్పుడు రావణవధము మొదలయిన కారణము లేమియు లేవు గాన యందులకై ప్రసాదము చూపవలసినదియులేదు. మహాదేవుఁడను పేరునకు సముద్రప్రసాదమని శ్రుతిచే బాధించుటకు యుక్తమైయున్నది. కాన సముద్రము నిర్మించునపుడనుట చెల్లదు. మరలివచ్చునపు డన్నచో 'అత్రపూర్వమ్' అను పూర్వశబ్దమున కది విరోధించును. 'పూర్వ'మనుటకు పూర్వకల్పమని యర్థముఁజెప్పుటయుఁదగదు. 'ఆత్మానం మానుషంమన్యే' అని తనపరత్వమును మఱుఁగుచేసి మనుష్యునిఁగాఁ జెప్పుకొన్నవాఁడు సుగ్రీవాదుల యెదుట తనవిష్ణ్వవతారమును తెలుపునట్టి పూర్వవృత్తమును 'పూర్వకల్ప' మని చెప్పి వెలిపుచ్చెననుట ఉచితముగాదు. పూర్వకల్పమందలిసేతు వున్నయెడల మరలదానిని నిర్మించుటయు వ్యర్థము. 'అత్ర' అనుపదము పూర్వశ్లోకమునఁ జెప్పఁబడినదియు నలునిచేఁ జేయింపఁబడినదియునగు సేతువునే పరామర్శించుచున్నదిగాని పూర్వకల్పసేతువును గాదు. అప్పటిసేతు వుండినను అది యితరములయిన పిమ్మటివానిచే అంతరితముకాఁగూడును. పురాణాంతరముల ననుసరించి యాయర్థమిట యనుసంధించుట తగదు. ఎట్లన కూర్మపురాణమున 'సేతుమధ్యే మహాదేవ మీశానం కృత్తివాససం। స్థాపయామాసవై లింగం పూజయమాస రాఘవః। తస్యదేవో మహాదేవః పార్వత్యా సహశంకరః। ప్రత్యక్షమేవ భగవాన్ దత్తవాన్ వరముత్తమమ్। యే త్వయా స్థాపితం లిఙ్గం ద్రక్ష్యన్తీహ ద్విజాతయః। మహాపాతకసంయుక్తాస్తేషాం పాపం వినశ్యతి। అన్యానిచైవ పాపాని తీరే తత్రమహోదధేః। దర్శనాదేవ లిఙ్గస్య నాశంయాంతి నసంశయః। యావత్ స్థాస్యన్తి గిరవో యావదేవచ మేదినీ। యావత్సేతుశ్చ తావచ్చ స్థాస్యామ్యత్ర తిరోహితః। స్నానం దానం జపశ్శ్రాద్ధం భవిష్య త్యక్షయంతతః। స్మరణాదేవ లిఙ్గస్య దినపాపం ప్రణశ్యతి। ఇత్యుక్త్వాభగవాన్ వాచం పరిష్వజ్యచ రాఘవమ్। సనందసగణోరుద్ర స్తత్రైవాన్తరధీయత' అని యిందు సేతుమధ్యమున రాముఁడు శివుని లింగరూపమునస్థాపించి పూజించినట్లును శివుఁడు పార్వతీసహితుఁడై రామునకు ప్రత్యక్షమై యతఁడు స్థాపించినలింగమును దర్శించుద్విజులకెల్ల పాపములు నశించుననియు, సముద్రతీరమునం దాలింగమును దర్శించినమాత్రనే యితరపాపములును నశించుననియు, వృక్షములు భూమియు సేతువునుండువఱకు తానందు నుండునట్లును, అచట స్నానాదానాదు లక్షయముగా జరుగుననియు, లింగమును స్మరించినమాత్రముననే పాపముపోవుననియుఁ జెప్పి రామునిఁ గౌఁగిలించి సపరివారముగాఁ బోయెనని యున్నది. పాద్మపురాణమందును, రాముఁడు పుష్పకమునుండి దిగి శివునిం బ్రతిష్ఠించినాఁడనియు నతఁడతనికిఁ బ్రసన్నుఁడయ్యెననియుఁ జెప్పఁబడియున్నది. ఇట్టి పురాణవచనములచొప్పున ఈశ్లోకము లింగప్రతిష్ఠను దెలుపుచున్నది అని చెప్పవచ్చును. కాని యిందులకు దోషము విస్తరించియున్నది గాన యిది చెల్లదు. ఇతిహాసము ఎక్కువగా పరిగ్రహింపఁబడుచున్నది. మఱి యందు గ్రంథము సౌష్ఠవముగలిగియుండును. 'ఇతిహాసపురాణ పంచమమ్' ఇత్యాదులందు 'ఇతి

గలిగి,సుందరముగా సుగ్రీవునిపట్టణము కిష్కింధ కానఁబడుచున్నది చూడు. ఇచ్చట నే నేను వాలిని వధించితిని' అనెను. అంత, సీత, పూర్వము వాలిచే పాలితమయిన కిష్కింధాపురమును జూచి, సుగ్రీవాదులసమక్ష మగుటంజేసి ప్రణయముతో భయంబును గూడికొన రామునితో సవినయవాక్యమున 'అనఘా! రాజా! తార మొద లయినసుగ్రీవుని ప్రియభార్యలను నితర లయినవానరోత్తములభార్యలనుం బిలుచుకొనియే, నీవును నేనును రాజధాని యగునయోధ్యకుఁ బోవలయు నని కోరుచున్నాను' అనెను. సీత యి ట్లడుగఁగా రాముం డట్లె యగుఁగాక యని యాబిడకు బదులుచెప్పి కిష్కింధను జేరి విమానమును గ్రింద నిలిపి సుగ్రీవునిఁ జూచి 'వానరసింహమా! సీతకుఁగా వానరోత్తములందఱితోను, తమతమభార్యలతోఁగూడ నందఱు నయోధ్యకు రావలయునని చెప్పుము. మహాబలా! వానరేశ్వరా! అట్లె నీవును భార్యల నందఱినుం దీసికొనిరమ్ము. జాగువలదు.త్వరితముగాఁ బోవలయును' అనెను.అపారతేజుం డగురాముం డట్లు శ్రీమంతుఁడగువానరేశ్వరునకు సుగ్రీవునకును నతనిం బరివేష్టించి యున్నసమస్తవానరులకును జెప్పెను. సుగ్రీవుండు నంతఃపురమునకు శీఘ్రముగాఁ బోయి తారనుజూచి,' ప్రియురాలా!నీవును మహాపరాక్రము లగునితరవానరుల భార్యలును నయోధ్యకు రావలయునని సీతాదేవి గోరుటచే రాముఁడామెకు ప్రీతి గావింపఁగోరి యట్లే యందఱును రావలయుననియాజ్ఞాపించెను. కాన జాగువలదు. వానరకాంతల నందఱను బిలుచుకొనిపోవుదము. అయోధ్యానగరమును జూచి దశరథమహారాజుభార్యల నందఱను సందర్శించివత్తము' అనెను. సుగ్రీవుఁడుచెప్పినదివిని, సమస్తావయవములను భూషణముల నలంకరించుకొనియున్నతార,వానరకాంతలనందఱను బిలిచి'మీరు మీమీభర్తలతో నయోధ్యకు రావలయు నని సుగ్రీవుఁడానతిచ్చెను.మీరు నాతోఁగూడ నయోధ్యకువచ్చి యందలివిశేషములను జూచుటవలన నాకు సంతోషము గావింపవలయు. పౌరులును జానపదులు నెదుర్కొన వారింగూడి రాముఁడు పేరోలగమున నయోధ్యాపురమును బ్రవేశించుటను, దశరథమహారాజుభార్య లంద

---

హాస'శబ్దము అధికాక్షరముగానుండుటచే ఉత్తరపదముగా నుండవలసియుండఁగా పూర్వపదముగాప్రయోగింపఁబడుటంబట్టి పూజ్యత్వమును చూపుచున్నది. కాఁబట్టి యదిపురాణమునకంటె గొప్పదియగును. మఱియు,'వేదఃప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా' అని వేదమయమని చెప్పుటచేతను చతుర్ముఖవరప్రదాన మూలమగుటచేతను రామాయణము పురాణములకంటెను ప్రబలమైనది. కాన దానితో విరోధించినపుడు తామసపురాణములు ప్రమాణము గాదు. మఱియు పురాణము సర్గప్రతిసర్గాదులలో దేనినయిన గుఱించినదేకాని యితిహాసమువలె పూర్వచరిత్రములను జెప్పుటయందు తాత్పర్యముగలదిగాదు. మఱియు నీసర్గమందలిశ్లోకములు తఱచుగా వ్యత్యస్తముగా నున్న వని పూర్వవ్యాఖ్యాతలు చెప్పెదరుగాన యీశ్లోకము మందోపరిప్రలాపము చెప్పినపిసప నుండఁదగినది.అప్పుడు'మహాదేవప్రసాద'మనఁగా శివునివలని పితృదర్శన మేయగును. ఇదియె రాముఁడు హనుమంతుని భరతునికడకుఁ బంపునపుడు 'మహాదేవప్రసాదాచ్చ పిత్రామమసమాగమమ్' అని చెప్పియున్నాఁడు. గోవిందరాజులు.

ఱకుం గలవైశ్వర్యమును గన్నులారం జూచివత్తము' అనెను.* తారయిట్లనుజ్ఞ సేయఁగా వానరకాంతలందఱును మంగళాచరణాదివిధిపూర్వకముగా నలంకారములు గావించుకొని సీతాదేవిని జూచుకోరికలు ముప్పిరిగొన నవ్విమానమునకుఁ* బ్రదక్షిణమగునట్లుగాఁబోయి తారయును దామునారోహించిరి. రాముఁడు, తారమున్నగు వానరకాంతలారోహించువఱకు నవ్విమానము క్రిందనుండినదై వారలెక్కిన వెనుక పయికి శీఘ్రముగా నుద్గమించుటనుజూచి ఋశ్యమూకసమీపమును జేరఁగా మరలసీతనుజూచి'సీతా! పర్వతరాజ మగునీ మేటిఋశ్యమూకము బంగారుధాతువులచేఁ బరివృతమై మెఱపులతోఁగూడిన మేఘమువలె నొప్పుచున్నది, చూడుము సీతా! ఇందు, నాకును వానరరాజయినసుగ్రీవునకును సమాగమము గలిగెను. ఇచ్చటనే నేను వాలిని వధించుటకై ప్రతిజ్ఞగావించితిని. చిత్రము లయినయడవులు గలయాపంపాసరస్సు నిదె చూపట్టుచున్నది చూడుము. ఇచట నిన్నుఁబాసి మిక్కిలియు దుఃఖముపట్టఁజాలక విలపించితిని. ఈసరస్సుతీరమున నేను ధర్మచారిణి యగుశబరిని జూచితిని. ఈచోట నేను యోజనముపొడ వయినబాహువులు గలకబంధునిఁ జంపితిని. విలాసినీ! సీతా! జనస్థానమున జటాయువు వాసమగుటచే శ్రీమంతం బగువటవృక్ష మదె కానఁబడుచున్నది చూడుము. ఆవృక్షముదాపున క్రూరుం డగురావణునకును మహాత్ముం డగుజటాయువునకును నీనిమిత్తమై సుమహాయుద్ధము జరిగెను. వరవర్ణినీ! నేను ఖరుని దూషణుని మహావీర్యుఁ డగుత్రిశిరునిని గుఱిదప్పక నూటిగాఁ దగులుబాణముల నేస్థలమునం గూల్చితినో యామనయాశ్రమపదం బిదిగో చూడుము. ఇదిగో చిత్రమై శుభంబుగాఁ జూపట్టుమనపర్ణశాలను జూడుము. ఇచటనే రాక్షసరాజగురావణుఁడు బలాత్కారమున నిన్నపహరించెను. సీతా! ఇదిగో గోదావరీనది రమణీయమై నిర్మలజలములు గలిగి మంగళప్రదముగాఁ జూపట్టుచున్నది చూడు. ఇదిగో అగస్త్యాశ్రమము కానఁబడుచున్నది. మహాత్ముఁ డగుసుతీక్ష్ణునియాశ్రమ మదిగో దేదీప్యమానమైయున్నది చూడు. సీతా! పగవారిపురంబుల భేదించువేయుగన్నులప్రోడ యగునింద్రుఁ డెచటికి వచ్చెనో యట్టిమహనీయం బగుశరభంగాశ్రమ మిచటఁ జూపట్టుచున్నది చూడు. ఈప్రదేశముననే మహాకాయుం డగువిరాధుఁడు నాచేత హతుఁడయ్యెను. సీతా! సన్నని నెన్నడుము గలదానా! మనము పదిసంవత్సరములందంద వసించియుండినయాఋష్యాశ్రమము లివియె చుమీ. ఇచట వారలకుఁ గులపతియు సూర్యాగ్నిసమాన తేజుండు నగునత్రిమహర్షి యున్నాఁడు. ఇచట ధర్మచారిణి యగుతాపసిని అనసూయాదేవిని నీవు దర్శించితివి. సుందరగాత్రీ! ఇదిగో

* వానరభార్యలనందఱను బిలుచుటకు, వారలలంకారముగావించుకొనివచ్చి విమానమెక్కుటకును కిష్కింధయందు ఒకదినము పట్టినదని చెప్పెదరు. మఱియు వానరస్త్రీలు 'కృత్వా చాపి ప్రదక్షిణమ్' అని యావిమానమునకుఁ బ్రదక్షిణము చేసినట్లు చెప్పినను అది చాల విశాలమగుటచే నట్లు త్వరితముగాఁ జేయసాధ్యముగాదు గాన ప్రదక్షిణమగునట్లుగా దానినెక్కిరని గ్రహింపవలయును.

పర్వతరాజం బగుచిత్రకూటము ప్రకాశించుచున్నది చూడుము. కైకకుమారుం డగుభరతుఁడు నన్ను కలఁకఁదేర్చి రాజ్యము నంగీకరింపఁ జేయుటకై వచ్చినస్థల మిదియే. అల్లదిగో యమునానది సుందరము లయినయడవులతో దూరంబునం గనఁబడుచున్నది. మనము మున్ను భరద్వాజాశ్రమమును జూచినయాశ్రీమంత మగు ప్రదేశము దాపుగానుండుటచే నదిగోఁ జక్కఁగా కనఁబడుచున్నది చూడుము. వరవర్ణినీ! ఇదిగో ఆకాశభూపాతాళము లనుమూఁడుమార్గములం బ్రవహించుటచే త్రిపథగ యనంబడుగంగ యిదిగో నానావిధములయిన పక్షులు నెరయ తీరములందు చక్కఁగాఁ బూచినయడవులు నిక్కఁజూపఁ జూపట్టుచున్నది. ఇదియే శృంగిబేరపురము. ఇచటనే గుహుఁడు మనయొద్దకు వచ్చెను. సీతా! అల్లదిగో ఆసరయువు కనఁబడుచున్నది చూఁడు. దానితీరములందు పెక్కుయజ్ఞములు గావింపఁబడుటవలన వరుసలు వరుసలుగా పెక్కు †యూపస్తంభము లున్నవి. పలువిధము లయినవందల కొలఁదివృక్షములును చక్కఁగాఁ బూచినయడవులును దానియిరుప్రక్కల నొప్పుచున్నవి. మాతండ్రి రాజధాని యైనయాయయోధ్యానగరము నదె కానవచ్చుచున్నది చూడు. సీతా! అయోధ్యకు మరలి క్షేమముగా వచ్చితివి గావున ఆపట్టణమునకు నమస్కరింపుము ' అనెను. అంత నావచ్చినవానరు లందఱును రాక్షసుఁ డగువిభీషణుఁడును అందఱును లేచిలేచి శుభదర్శన మగునాయయోధ్యాపురమును జూచిరి. అంత తెల్లని మేడలవరుసలచే మురువు చూపుచు విశాలము లయినకక్ష్యలు గలిగి గుజ్జములును నేనుఁగులును గ్రిక్కిఱిసి దేవేంద్రునియమరావతిపురముం బోలి వెలుంగు చున్నయయోధ్యానగరమును వానరులు సందర్శించినవారయిరి. ఇది నూటయిరువదియాఱవసర్గము.

---

రాముఁడు భరద్వాజాశ్రమమున భరద్వాజమునివలననయోధ్యయందలిమాతృభరతాదులక్షేమమును వినుట. ఆముని ప్రార్థనమున భరద్వాజాశ్రమమం దొకదినమునిలుచుట. అమ్ముని తనయాశ్రమము మొదలుకొని యయోధ్యవఱకు మార్గమునఁ గలవృక్షలతాదు లకాలకుసుమపుష్పఫలాదులతోనుండునట్లు వరమిచ్చుట.

లక్ష్మణాగ్రజుం డగురాముఁడు పదునాలుగేండ్లు నిండఁగా* చైత్రశుద్ధపంచమి

---

* ఇక్ష్వాకువులు తీరమందు యాగము చేసినపిదపఁ గీర్తికొఱకు శిలలతోఁ గావించినయూపము లని తెలియునది.

† చైత్రశుద్ధపంచమియందు రాముఁ డరణ్యవాసమునకై అయోధ్యను విడిచెనుగాన యాచైత్రశుద్ధచతుర్థికి పదునాలుగేండ్లు నిండఁగా చైత్రశుద్ధపంచమిని భరద్వాజాశ్రమమును చేరెనని తెలియునది. ఇదియెట్లన చైత్రశుద్ధపంచమియందు అయోధ్యనుండి వెడలుట; అనాఁటిరాత్రి తమసాతీరమునవాసము.

యందు భరద్వాజాశ్రమముఁ జేరి త్రికరణశుద్ధిగా నమ్మహామునికి వందనము చేసెను. రాముఁడు తపమే ధనముగాఁ గలభరద్వాజమహర్షికి నమస్కరించి 'మహాత్మా! అయోధ్యానగరమున సుభిక్షమును ఆరోగ్యము గానున్నసంగతిని విందువాయేమి? భరతుఁడు ప్రజాపాలనమందు జాగరూకుఁడే కదా. మాతల్లులు మొదలగువారందఱును బ్రతికియున్నారాయేమి?' అని యడిగెను. రాముఁ డిట్లడుగఁగానే భరద్వాజ

---

షష్ఠినాఁడు శృంగిబేరపురమునందు, సప్తమిని వృక్షమూలమందు, అష్టమిని భరద్వాజాశ్రమమునందు, నవమిని యమునాతీరమునందు. దశమిని రాముఁడు చిత్రకూటమునకు పోవనున్నాఁ డని గుహునిచారులవలన వృత్తాంత మెఱిఁగి సుమంత్రుఁడు నాఁటిసాయంకాలము అయోధ్యను బ్రవేశించుట. నాఁటి రాత్రియె దశరథునిమరణము. ఏకాదశియందు రాజకళేబరమును తైలద్రోణియందు నిక్షేపించుట. ద్వాదశిని భరతునియొద్దకు దూతలనుబంపుట, ఆదూతలు మార్గమునందు త్రయోదశిని చతుర్దశిని గడపి పున్నమరాత్రి కేకయనగరమును బ్రవేశించుట. పాడ్యమియందు భరతుఁ డయోధ్యకుఁ బయనమగుట. మార్గమున ఏడురాత్రులుండి అష్టమదినమున మిక్కుటమైన త్వరచే రేయుంబవలు పోయి నవమి సూర్యోదయమున భరతుఁ డయోధ్యను బ్రవేశించుట. ఆనవమినాఁడే దశరథునికి సంస్కారము. ఆదినము మొదలుకొని పదుమూఁడవదినమున అనఁగా వైశాఖశుద్ధపంచమియందు దానికి మునుపటిదినమందును భరతుఁడు రాజునకు శ్రాద్ధకర్మములు సేయుట. షష్ఠిని ఆదేశాచారముచొప్పున దహనదేశమును శోధించుట, సప్తమియందు రామునియొద్దకుఁ బోవ మార్గము చక్కఁబెట్టుటకు పనివాండ్రను బంపుట. పనివాండ్రు దశమివఱకు, నాలుగుదినములుమార్గము చక్కఁబెట్టుట. ఏకాదశిని భరతుఁడు రామునియొద్దకు పయనమగుట, ఆనాఁటిరాత్రి గంగాతీరమున వసించుట. ద్వాదశిని భరద్వాజాశ్రమమున నుండుట, త్రయోదశిని రామునితో సమాగమము, చతుర్దశీ పూర్ణిమా పాడ్యములయందు భరతుఁడు చిత్రకూటమున వసించియుండుట. వైశాఖబహుళద్వితీయయందు భరతుఁ డయోధ్యకు పయనమగుట. చతుర్థిని అయోధ్యను బ్రవేశించుట. ఇట్లు రాముఁడు అయోధ్యనుండి చైత్రశుద్ధపంచమిని వెడలినదిమొదలుగా వైశాఖబహుళ చతుర్థివఱకు ఒకటిన్నరమాసమయ్యెను. వైశాఖబహుళ పంచమియందు రాముఁడు చిత్రకూటమునుండి బయలుదేఱి అత్రియాశ్రమమును బ్రవేశించుట. ఆశ్రమమండలమున పదిసంవత్సరములు. ఇట్లు పదిసంవత్సరములును ఒకటిన్నరమాసమును గడవఁగా మిగతకాలమున పంచవటియందు వాసము. అందు మూఁడేండ్లు. అనఁగా మొత్తమున పదుమూఁడేండ్లు గడచిపోఁగా పిదప పదునాలుగవయేఁట చైత్రమాసమున సీతాపహరణము. వైశాఖమున సుగ్రీవదర్శనము. ఆషాఢమున వాలివధము, ఆశ్వయుజమున సీతాన్వేషణమునకు సైన్యము లుద్యోగించుట. ఫాల్గునమున హనుమదాదులప్రాయోపవేశము. ఫాల్గున శుద్ధచతుర్దశియందు లంకాదహనము. ఫాల్గునము అమావాస్యయందు రావణవధము. చైత్రశుద్ధపాడ్యమిని రావణసంస్కారాదులు. ద్వితీయయందు విభీషణాభిషేకము సీతాప్రాప్తి దేవతాప్రస్థాపనము. తృతీయయందు లంకనుండి బయలుదేఱుట. చతుర్థిని కిష్కింధయందు నాఁగుట, పంచమిని భరద్వాజాశ్రమమం దుండుట అని తెలియుచున్నది. ఇందు వానివాని కుపపత్తులు అందంద తెలుపఁబడినవి. కాఁబట్టి హనుమంతునిసమక్షమున రావణుఁడు 'ద్వౌమాసౌరక్షితవ్యౌ' అని రెండునెలలుచెప్పుట సీత నూఱడించుటకేకాని వేఱుగాదు. 'మాసాదూర్ధ్వం నజీవిష్యే' మాసమునకుమీఁద బ్రతుకను అని సీత చెప్పినదే సరిగా పొసఁగుచున్నది. ఆసీత చెప్పినమాసమును అప్పుడు జరుగుచుండినమాసమే యని పలు

మహర్షి రాముని మరలఁ జూచినందులకు సంతుష్టుఁడై *చిఱునగవు మోమునం దోఁప నతనితో 'భరతుఁడన్ననో †దుమ్మున గ్రుంగి జడలు దాల్చి నీపాదుకల మున్నిడుకొని ప్రజాపాలనము సేయుచు నీరాక కెదురుచూచుచున్నాఁడు గృహమున నన్నియు క్షేమమే. సమితింజయా! నీవు మున్ను కేవలము ధర్మమును మాత్రమే కోరినవాఁడవై పితృవాక్యము దప్పక చేయువాఁడవై కైకేయివచనముఁ గయికొని సర్వస్వమును దిగవిడిచి సమస్తభోగములను బరిత్యజించి ప్రాంతనారచీరలం గట్టుకొని సీతయు లక్ష్మణుఁడును దోడరా స్వర్గమును బాసిన దేవతయుంబోలె రాజ్యమును బాసి మహారణ్యమున కందమూలఫలాదు లాహారముగాఁ గాలినడక నడచి ప్రవేశించుచు వచ్చినపుడు నిన్నుఁజూడఁగా నాకు దుఃఖము కలిగినది. ఇప్పుడో శత్రులను జయించి కార్యసిద్ధి నెంతయునొంది, మిత్రగణములను బంధువులనుం గూడి క్షేమముగా నీవు వచ్చుటను జూడఁగా నాకు మిక్కిలియుఁ బ్రీతి యైనది. రామా! నీకు వనవాసకాలమున పంచవటీవాసాదులం గలిగినసుఖమును సీతాహరణమునం గలిగినదుఃఖమును నాకుఁ దెలిసియున్నది. ధర్మవత్సలా! నీవు జనస్థానమున రాక్షసుల మహాఘోర యుద్ధమున వధింప సంభవించుటయు, ఋషిజనులు వేఁడికొనఁగా నీ విట్లు ఖరాదులను వధించి వారలను రక్షించుచుండఁగా అనిందిత యైననీభార్యను ఈబిడను రావణుం డపహరింపఁ దలంచుటయు, మారీచుండు జింకరూపమునఁ బొడ తెంచుటయు, సీత యపహృత యగుటయు, కబంధునిఁ గాంచుటయు, పంపాసరస్సునకుఁ బోవుటయు, సుగ్రీవునితోడ నీవు స్నేహముచేయుటయు, వాలిని నీవు వధించుటయు, సీతను వెదకుటయు, హనుమంతుఁడు సముద్రము దాఁటి సీతను జూచి లంకం గాల్చి వచ్చిన మహాకర్మమును, సీతావృత్తాంతము దెలిసినపిదప నలునిచే సేతువు గట్టించినవిధ

మాఱు చెప్పఁబడినది. రావణుఁడు 'పదినెలలయినవి, ఇఁక మిగత రెండుమాసములున్నవి' అని చెప్పుట మధుపానమత్తతచే వివేచింపక చెప్పినదగును. సీత 'మాసాదూర్ధ్వమ్' 'మాసమునకు మీఁదుగా' ననుట జరుగుచుండినమాసమే యని తెలియునది—గోవిందరాజులు. భరద్వాజాశ్రమమును ప్రాపించుటను జెప్పుటచే మహనీయులస్థానము లనుప్రాప్యము లగునని చెప్పఁబడినది.

* ఇట మునికి చిఱునగవు 'రాముఁడు సర్వజ్ఞుఁ డయి తెలియన ట్లడుగుచున్నాఁడే' యని కలుగవలయును. లేక 'భరతుఁడు పరిపాలనమున జాగరూకుఁడా' అని రాము డడుగుటకు భరతుఁడు ప్రజాపాలనమున సంతుష్టుఁడైయున్నాఁడా యని యతనిప్రశ్నాభిప్రాయము గాన పరతంత్రుఁడైయున్న భరతుఁ డిట్లు సంతుష్టుఁడైయుండుట యెక్కడిది యనికాని కలిగినది గావలయును.

†భరతుఁడు జటలుధరించియుండుటచే స్నానముచేయకుండుటవలన దుమ్మున గ్రుంగినాఁడని తెలియునది. స్నానములేకపోయినను నిత్యానుష్ఠానముల దీక్షితునివలె గౌణస్నానముచే జరుపుట తెలియునది. స్నానములేనప్పుడు 'కథం న్వపరరాత్రేషు సరయూ మవగాహతే' అని రాముఁడు భరతుని సరయువునందు గ్రుంకు లిడునని వగచెనే. ఇదియెట్లు? అన్నచో ఇది యొకానొకప్పుడు చేయుస్నానముగా గ్రహించినచో పొసఁగుపాటు గావచ్చును.

మును, వానరవీరు లుబ్బునఁ జెలరేఁగి లంకను దహించిన తెఱంగును, దేవకంట కుం డగురావణుండు పుత్రమంత్రిబంధుసహితముగా సైనికులతోను వాహనములతోను యుద్ధంబున నీచే వధింపఁబడినప్రకారమును, బ్రహ్మాదిదేవతలు నీయొద్దకు వచ్చుటయు, నీ కింద్రుఁడు మృతవానరులు జీవించున ట్లిచ్చినవరముచొప్పును, ఇది యంతయు నేను తపోబలంబున నెఱింగియున్నవాఁడను. ఆయుధధారులలో నెల్ల మేటీ! నేను గూడ నీ కిచట వర మొసంగెదను. అడుగుము. ఇప్పుడు నేను గావించెడియీపూజను గయికొని ఱే పయోధ్యకుం బోవచ్చును' అనెను. రాజకుమారుఁడు రాముఁడు బుద్ధిమంతుఁడు గాన యచటనుండి భరతునియొద్దకు దూతఁ బంపుట యుచితమని తలంచుకొని భరద్వాజమహర్షి వచనమును శిరసా వహించి యట్లయని పలికి మిక్కిలియు హర్షంబున నతనిని జూచి 'మహానుభావా! నే నయోధ్యకుఁ బోవుమార్గమున వృక్షము లన్నియును గాలము కానపుడు గూడ, ఫలవంతము లై మధువు స్రవించుచుండవలయును. ఫలములు అమృతముంబోలె రుచి గలిగి వెక్కులు పలువిధములుగా నుండవలయును' అని వర మడిగెను. ఆమహర్షి యట్లయని ప్రతిజ్ఞ సేయఁగానే ఆయనమాట వెంబడినే యచటివృక్షము లన్నియు స్వర్గమునందలికల్పవృక్షములవలె సర్వకాలసమృద్ధము లై యుండినవి. అప్పు డావానరు లయోధ్యకుఁ బోవునపుడు మార్గము నేపైపు చూచినను మూఁడామడలవఱకును ఫలింప కుండినవృక్షములు ఫలవంతము లయినవి. పుష్పింపనివి పుష్పించినవి. ఎండిపోయినవృక్షము లన్నియు ఆకులతో దట్టముగా నిండిన వై మధువు స్రవించినవి. అంత నవ్వానరసింహములు మేను గగురుపొడువఁ బరమసంతుష్టు లై దివ్యంబు లగుఫలముల ననేకంబులను యథేష్టముగా వేలకొలఁదిని భక్షించుచు స్వర్గమునుం బొందినవారలుంబోలె నానందంబు నొందిరి. ఇది నూటయిరువదియేడవసర్గము.



రామనియోగంబున హనుమంతుఁడు శృంగిబేరపురమున
గుహునికి రామాగమనముఁ జెప్పి భరతునికి నట్లేపోయి
రామురాక నెఱిఁగింపఁగా నతం డానందమగ్నుఁడగుట.

రాముఁ డయోధ్యను దలంచుకొని కొంతసే పాలోచించెను. అంతఁ డట్లాలోచించి వానరోత్తముం డగుహనుమంతునిఁ బిలిచి 'అయోధ్యలో రాజుగారినగరిలో మా తల్లి మొదలగువా రందఱును క్షేమమా? యని తెలిసికొనుము. నీవు శృంగిబేరపురమునకుఁ బోయి యచట వనచరుండును నిషాదరాజు నగుగుహునిఁ జూచి, నేను జెప్పినట్లు నీవు నాక్షేమ మతనికిఁ జెప్పుము. ఆగుహుఁడు నే నారోగ్యముతో మరలఁ గుశలముగా వచ్చితినని నన్నుఁ బాసినతుండుడు కంతయుఁ దీఱఁగా విన్నంతనే మిక్కిలియు సం

తోషము నొందఁగలఁడు. *అతఁడు నాకు నాయంతటివాఁ డగుచెలికాఁడు. ఆబోయల రాజు గుహుఁడు అయోధ్యకుఁ బోవుమార్గమును భరతునివృత్తాంతమును నీకు సంతోషమునఁ దెలుపఁగలఁడు. నేను జెప్పినట్టుగా భరతునకు నాక్షేమమునుఁ జెప్పవలయును. నేను వనవాసము తీర్చి పితృవచనపరిపాలన గావించి భార్య యగుసీతతోడను లక్ష్మణునితోడను క్షేమముగ వచ్చితినని యతనికిఁ జెప్పుము. మఱియు బలవంతుఁ డగురావణుఁడు సీత నపహరించుకొని పోవుటయు, సుగ్రీవునితోఁ గలసి సఖ్యము గావించుటయు, వాలిసుగ్రీవులయుద్ధంబున వాలిని వధించుటయు, సీతను వెదకుటయు, నీ వపారబలంబు గలిగియుండుటంజేసి యవ్యయ మైననదీపతిని సముద్రమును దాఁటి సీతను జూడఁగాంచినవిధమును, అందఱును సముద్రముకడకుఁ బోవుటయు, సముద్రరాజు దర్శన మొసంగుటయు, అందు సేతువు గట్టించినవిధమును, రావణుని నేను వధించినతెఱంగును, †దేవేంద్రుఁడును బ్రహ్మయు వరుణుండును నాకు వర మొసంగుటయు,శివుని ప్రసాదమున నాకు తండ్రితోడ సమాగమము గలుగుటయును, భరతునకుం జెప్పుము. మఱియు నేను రాక్షసరాజగువిభీషణునితోను వానరనాథుఁ డగుసుగ్రీవునితోను ‡సమీపించి వచ్చియున్నాననియు సౌమ్యుఁడవు గాన మెల్లమెల్లఁగ నతనికిఁ జెప్పుము. ఈ వృత్తాంతము వినినపుడు § భరతుని ముఖమున నేమి జాడలు తోఁచునో, నావిషయ మై యింగిత చేష్టాదు లేమేమి గనఁబడునో, దాని నంతయు నీవు సూటిగాఁ దెలిసికొనవలయును. నీవు భరతునితో 'రాముఁడు శత్రుసమూహములను జయించి యుత్తమ మయినయశము నొంది యభీష్టము చక్కఁగా నీడేఱి మహాబలవంతు లగుమిత్రులతోఁ గూడి సమీపించి వచ్చుచున్నాఁడు' అని చెప్పి, యతనిముఖవర్ణమువలనను, దృష్టివలనను, మాటలవలనను, అతనివృత్తాంతములను ఇంగితముల నన్నింటిని గలరూపునఁ దెలిసి

---

* 'సమ మాత్మసమస్సఖా' అనిమూలము. 'ఆత్మసమః' అని రాముఁడు గుహునింజెప్పుటచే గుహుని హీనజాతిని బాటింపక ప్రేమాతిశయమున తనవలె నిక్ష్వాకుకులీనునిగాఁ దలఁచెనని యర్థము. గోవిందరాజులు.

† మునుపు దేవేంద్రుఁడొకఁడే వర మొసంగిన ట్లుండఁగా బ్రహ్మయు వరుణుండును గూడ నిచ్చి నట్లు చెప్పుటచే బ్రహ్మాదులయనుమతియు నావరదానమునకుఁ గలదని తెలియుచున్నది.

‡ చతుర్దశవర్షములు పదునాలుగవయేఁడు గడచిపోవుటచే నేను వచ్చియుండుట చెప్పనియెడల భరతుఁడగ్ని ప్రవేశించుననియు 'సౌమ్య'శబ్దముచే మెల్లగాఁ జెప్పవలయుననియు లేనిచో ఆనంద మతనికి ఉన్మస్తకమయి పోవుననియు రాముని భావము.

§ ఇక్కడ భరతునియింగితాదులను దెలిసికొని రమ్మనుటకుఁ గారణము—అతనితో 'నీవే రాజ్యమును పరిపాలింపుము' అన్నచో అంగీకరించునా అంగీకరింపఁడా యని తెలిసికొనుట కని తెలియునది. అట్లు తెలిసికొననియెడ భరతునిప్రకృతికిని రామప్రకృతికిని విరుద్ధ మైనది కలుగును. రాముఁడు 'న సర్వే భ్రాతరస్తాత భవన్తి భరతోపమాః' 'నాయనా! అందఱు తోఁబుట్టువులును భరతునివంటి

కొనవలయును. 'అందఱకును రాజ్యాధిపత్యమం దాశయేగదా. ఇందు భరతుని మాత్రము పరీక్షింపవలయునా' యందువా? సమస్తకాలములందు సమృద్ధమై రథగజతురగములచేతను నెరసి బెరసి కులపరంపరాగతమై యొప్పురాజ్యము అనుభవించు చుండునప్పుడు (భరతుఁడు దప్ప మఱి) యెవ్వనిని మనస్సు నాకర్షింపక విడుచును.'భరతునియింగితము తెలిసి పిదప నేమిచేయవలయు'నందువా? (పూర్వము తా నెంతమాత్రము రాజ్యపాలన మంగీకరింప నని చెప్పినను పదునాలుగేండ్లు నన్నుఁ బాసి యాతురుఁడై యుండుటవలన)నన్నుఁగలియఁగానే,పూర్వము నాప్రీతికొఱకు రాజ్యభారము నంగీకరించి నాయెడ సహజపారతంత్ర్యసంపత్తి గలిగియుండు నా భరతుఁడు (నన్నుఁ జూచినయుబ్బు పట్టఁజాలక నేను నీవే రాజ్యము నేలుమనఁగా) అట్లె రాజ్యము నేలఁగోరునా? అని యువ్విళ్లూరెద. అట్లేని యతఁడే జనసమృద్ధమైనభూమండల మంతయు నేలుఁగాక. (తండ్రి నాయభిషేకసంభ్రమము పొందనివాఁడయ్యె. నే నయినను భరతాభిషేకమహోత్సవము ననుభవించెదను). అతఁడు త్రైలోక్యమును భరింపఁ జాలురఘుకులమున కానందకరము గాఁ బుట్టినవాఁడు గాన యీరాజ్యమును భరింపఁగలఁడు. హనుమంతా! అతఁడు నాసన్నిధానమున నెట్లో రాజ్య మంగీకరింప నున్నబుద్ధిని, సర్వవిధముల నంగీకరింప ననియే యున్ననిశ్చయమును, దెలిసికొని రాజ్యము నంగీకరించునేని మే మిచ్చోటనుండి దూరము వచ్చుటకు మునుపే మాయొద్దకు శీఘ్రముగారావలయును. *అంగీకరింపనివారు గారు'అనియు భరతుఁడు 'యావన్న చరణౌ భ్రాతుః పార్థివవ్యఞ్జనాన్వితౌ। శిరసా ధారయిష్యామి న మే శాన్తిర్భవిష్యతి 'రాజలక్షణలక్షితము లయినయన్న చరణములు శిరస్సునఁ దాల్చునంతవఱకును నాకు నెమ్మదికలుగదు' అన్నాఁడు. వీరిరువురప్రకృతు లిట్లున్నది గనుక రాముఁడు భరతునిప్రకృతిని బరిశీలింపక తనప్రకృతిచొప్పున 'నీవే రాజ్యమేలు'మని యతనితోఁ జెప్పినచో పొసఁగునో పొసఁగదోయని తెలియుటకై యిట్లు పరిశీలనము చేయుచున్నాఁడు—గోవిందరాజులు. భరతునకు రాజ్యమునందే యభిలాష యున్నదో లేదో ఆకారమువలనను ఇంగితములవలనను దెలిసికొమ్మని రాముఁడు చెప్పఁగా అట్టిసాహ్యదముగలవాని నట్లు పరీక్షింపవచ్చునాయని హనుమంతుఁ డడుగ కులక్రమాగతమైనరాజ్య మెట్టివానిని మనస్సునాకర్షించునని రాముఁడు చెప్పఁగా, అట్లైన యతఁడు తానే యేలెదనన్నచో నేమిచేసెదవని యతఁ డడుగ చిరకాలము రాజ్యములోడిపరిచయముచే దానిని తానే యేలఁగోరు నేని యతనినే యేల నిత్తునని రాముఁడు చెప్పెనని తెలియునది—మహేశ్వరతీర్థులు.

* కావుననే హనుమంతుఁడు భరతుఁడు రాజ్యమంగీకరింపఁడన్ననిశ్చయము నెఱింగి, భరతునియొక్కనే యుండెను గాని మరలి రామునొద్దకు రాలేదని తెలియునది. కొందఱు 'రాముఁడు భరతునిభావము తెలిసినవాఁడయ్యును సర్వవిధముల ననురక్తుఁడయినవానినిగూడ రాజు పరీక్షింపవలయునని లోకమునందు రాజనీతి ప్రవర్తించుటకైయే యిట్లు మిక్కిలిశంకతోఁగూడిన మాటలు చెప్పెను. వాస్తవమునకు తాను తటాలున వచ్చినయెడల భరతునకు హర్షము ఉన్మత్తకమైపోవునని ముందు హనుమంతునిఁ బంపినాఁడు. హనుమంతుఁడు రామునిహృదయము నెఱింగినవాఁడు గావున భరతునికి రామునిరాకంజెప్పి భరతునితోడనే రామునొద్దకు వచ్చె'నని చెప్పెదరు—గోవిందరాజులు.

యెడ రావలదు ' అనెను. రాముఁ డిట్లు తనహృదయమును గాక యందులకు ప్రతికూల మయినదానిని జేయ నాజ్ఞాపింపఁగా వాయుపుత్రుం డగుహనుమంతుండు మనుష్యరూపమును ధరించి త్వరితముగ నయోధ్యాపురమునకుఁ బోవ నుద్యుక్తుఁడయ్యెను. అట్లుద్యుక్తుం డై యవ్వాయుకుమారుఁడు హనుమంతుఁడు, గరుత్మంతుఁడు మంచి సర్పమును బట్టుకొనఁగోరి దానిపయికి వేగ మెగసి పోవునట్లు అతివేగమున నాకాశమున కెగసిపోయెను. వీర్యవంతుఁ డగు నాహనుమంతుఁడు, అట్లు తనతండ్రిసంచారమార్గ మయినయాకాశంబునకుఁ గుప్పించి, మహాసర్పములకు నివాసస్థానమును మంగళకరము నగుగంగాయమునాసంగమము నతిక్రమించి, శృంగిబేరపురమునకుఁ బోయి గుహునిం జూచి సంతుష్టుఁ డై శుభవచనంబున నతనితో 'సత్యపరాక్రముఁడును కాకుత్స్థకులుండు నగునీచెలికాఁడు రాముఁడు సీతను లక్ష్మణునిని గూడి నీతో తనక్షేమమును జెప్పుమనెను. రాముఁడు భరద్వాజమహర్షి పంపునం జేసి యీపంచమిరాత్రి యమ్ముని యాశ్రమముననుండి రేపు తెల్లవాఱునంతకు నమ్మునియనుజ్ఞ నొంది బయలుదేఱి రాఁగలఁడు. అతిత్వరలోనే యతనిం జూడఁగలవు' అని యతనికిఁ జెప్పెను. మహాతేజుండును వేగవంతుఁడు నగునాహనుమంతుఁ డిట్లు చెప్పి సకలలోకానందకర మగు రామాగమము భరతునకు వినిపింప వలసినభాగ్యము లభించినందులకు పులకాంకితశరీరుఁ డై మార్గమందలిపర్వతనద్యాదుల యొప్పిదమను బాటింపక యతివేగంబున నాకాశమునకు నెగసిపోయెను. అతండు మార్గమునఁ బరశురామతీర్థమును వాలుకినీనదిని ప్రసిద్ధం బగుగోమతినదిని, భయంకర మగుసాలవృక్షవనమును, నానాసస్యసమృద్ధము లయిన కోసలజనపదములను అందుఁ బెక్కువేలకొలఁది నున్న ప్రజలనుం గాంచెను. ఆకపికుంజరుఁడు త్వరితముగా బహుదూరము పోయి నందిగ్రామమునకు సమీపమున పుష్పితము లై యున్నవృక్షములను జూచెను. ఆవృక్షములు స్త్రీ లని బాలు రనియు వృద్ధు లనియు లేక యందఱకు నానందము గూర్చుచుండుటచే స్త్రీలును పుత్రులతోడ వృద్ధులును వానియందుఁ గ్రీడించుచు వాని కొక చెలువు గూర్చుచుండిరి. మఱియును దేవేంద్రునినందనవనమునందును కుబేరుని చైత్రరథవనమందును గలవృక్షములుంబోలె నవి వెలయుచుండెను. అయోధ్యానగరమునకు రెండుగడియలదూరమున, చీరకృష్ణాజినముల నడుమునంగట్టి యాశ్రమంబున వసించుచుఁ గృశుం డై రాముఁ డంతకును రాకుండుటకు దీనుం డై యున్నభరతునిఁ గాంచెను. ఆభరతుఁడు జడలు దాల్చి రామునిఁ బాసినవ్యసనంబున నకనక స్రుక్కి, దేహ మంతయు ముఱికి గ్రమ్మియుండ, బహిరింద్రియముల నిగ్రహించి ఫలమూలాహారుం డై తాపసవృత్తిని ధర్మము లాచరించుచునుండెను. అతఁడు పెనుపొంది పొడవయినజడలగుంపుతో వల్కలాజినముల నుత్తరీయము గా వైచుకొని వాఙ్నియమము గలిగి మనోనియమమున నాత్మధ్యానము సేయుచు బ్రహ్మర్షికింబోని తేజంబున వెలుంగుచుండెను. మఱియు నతండు రాముఁ డొసంగినపాదుకలు మున్నిడుకొని

భూమండలమును బాలించుచుఁ జతుర్వర్ణములవారికిని నేభయమునుం గలుగకుండ రక్షించుచు నుండెను. అతనిని జాగరూకులై పరిశుద్ధులై యున్నమంత్రులును బురోహితులును సేనాపతులును గాషాయవస్త్రంబులు ధరించి కొలుచుచుండిరి. వార లట్లు కాషాయవస్త్రముల ధరింప నేల యన్నచో *రాజపుత్రుం డగుభరతుఁడు నారచీరలను వల్కలములను ధరించి యుండఁగా ధర్మమునం దెంతయు నాసక్తు లగుతాము నతనిని విడిచి మంచి వస్త్రములు మొదలయినభోగముల ననుభవింప నొల్లనివా రయిరి. వాయుకుమారుఁ డగుహనుమంతుఁడు, సమస్త ధర్మంబులను దెలిసి దేహము నొందినమఱియొకధర్మమువలె (మూర్తి వహించిన రెండవ ధర్మదేవతయుంబోలె) చూపట్టుచు,(అగ్నిని విధ్యుక్తప్రాకారమున దరికొలిపి శుచియై దేహమును ద్యజింపఁ గోరుచు) నున్నయాభరతునిఁ జూచి యంజలి గీలించి 'దండకారణ్యమున వల్కలములు ధరించి జడలం దాల్చియున్న యెవ్వనినిగుఱించి నీ విట్లు దుఃఖించుచున్నావో యారాముఁడు తనక్షేమమును నీకుఁ జెప్పుటకై నన్నుఁ బంపెను. దేవా! ప్రియమైనవార్త నీకుఁ జెప్పెదను. మిక్కిలిభయంకర మయిననీయాదుఃఖ మంతయు నిదె దిగవిడువఁగలవు. ఏలన ఈముహూర్తమందే నీవు నీయన్న యగు రామునితోఁ గూడికొందువు. రాముఁడు రావణునిఁ జంపి సీతను మరలం బడసి మనోరథ మీడేఱినవాఁడై మహాబలవంతు లగుమిత్రులతో వచ్చుచున్నాఁడు. మహాతేజుం డగులక్ష్మణుండును వచ్చుచున్నాఁడు. కీర్తిమతి యగుసీతయు మనోరథ మీడేఱినదై, దేవేంద్రునితోఁ గూడ శచీదేవివలె, రామునితోఁ గూడ వచ్చుచున్నది' అనెను. †హనుమంతుఁ డిట్లు చెప్పఁగా, భరతుం డన్నయందు మిక్కిలియుమక్కువ గలవాఁడు గావున నుబ్బు పట్టలేక తటాలున నేలం బడెను. మఱి యాయుబ్బువలన మూర్ఛయు నొందెను. రాముఁడు వచ్చు నన్నవార్తకే యిట్లయినచో నింక రాముఁడే

---

* ఇందులకు 'నహి తే రాజపుత్త్రం తం చీరకృష్ణాజినాంబరమ్ । పరిభోక్తుం వ్యవస్యన్తి పౌరా వై ధర్మవత్సలాః' అని మూలము. ఇందులకు విశేషార్థము.—(పౌరాః) మంత్రులు మొదలయినపౌరులు, (పర) భరతునిచుట్టు వర్తించుచున్నవారయినను, (భరతం) భరతుని, (భోక్తుం) అనుభవించుటకు—చూచుటకనుట,(నవ్యవస్యన్తి)వ్యవసాయమును జేయరు-అతని చూచువిషయమున నిరాశులగుదు రనుట. ఏలనఁగా,(రాజపుత్రం) రామునిఁ బాసినయుత్తరక్షణమే మృతుఁ డయినవానికొడుకు గదా యితఁడు; ఇప్పుడు రాముఁడు రాకుండు నేని, ఇతనిని మనము పక్కింపఁగలమా యని చూడరయిరని భావము. అట్లు చూడకుండుటకు మఱియొకహేతువును జెప్పుచున్నాఁడు. (ధర్మవత్సలం) ధర్మార్థము, తనయాత్మను త్యజించుటయందు పితను బోలినవాఁడు పదునాలుగేండ్లు నిండియు రామాగమమును గానరాకుండుటచే ప్రాణముల త్యజింప నుద్యుక్తుం డయినభరతునిఁ జూచి పౌరులును దాపాతిశయమునొందుట యీశ్లోకమునఁ జెప్పఁబడినది—అని ఆచార్యులు.

† ఇట హనుమంతుఁడు భరతునితో పరిచయము లేనందున నతనికి వందనము సేయలే దని గ్రహించునది. లేక ముందు చేసినయంజలి వందనపూర్వకమైనది గా గ్రహింపవచ్చును. లేక భరతుఁ

గొబ్బున వచ్చునేని యేమవునో కదా! అంతఁ గొంతసేపటికి రఘుకులుఁడును శ్రీమంతుఁడు నగుభరతుఁడు లేచి తెప్పిఱిలి సంభ్రమంబున ప్రియవార్తఁ జెప్పుచున్న హనుమంతునిఁ గౌఁగిలించికొని శోక మంతయు దిగవిడిచి యానందజనితము లయిన బాష్పములచే నతనిదేహ మంతయుఁ దడిపెను. అతఁడు హనుమంతునిఁ జూచి యతని తేజోవిశేషమునకు మనుష్యుఁ డగుటను సంశయించి యతనితో 'సౌమ్యా! నీవు నాయెడ దయ గలిగి యిచ్చటికి వచ్చిన దేవతవో మనుష్యుఁడవో తెలియరాదు. మిక్కిలియింపు గ మాట లాడుచున్నావు. ఇట్టినీప్రియవచనమునకుఁ బారితోషికముగా లక్షగోవులను నుత్తమము లయిననూఱుగ్రామములను, మేలయినకుండలములం దాల్చి మంచినడవడి గలిగి బంగారువంటిచాయయు సోగ సయినముక్కును బెడం గయినతొడలును చందురునివంటితిన్ననినెమ్మొగమును గలిగి సమస్తాభరణములచే నెంతయునలంకృతలై మంచికులంబును జాతియును గలిగి పెండ్లియాడం దగినట్టికన్యలు పదునార్వురను నొసంగుచున్నాను' అనెను. ఆరాజకుమారుఁడు కపివీరుఁ డగుహనుమంతునివలన నాశ్చర్యకర మయినరామునిరాకను విని రామునిఁ జూడ నువ్విళ్లూరుచు మిక్కిలియుబ్బు నొంది మఱల హర్షము పట్టక హనుమంతునితో ని ట్లనియె. ఇది నూటయిరువదియెనిమిదవసర్గము.



భరతుఁ డడుగఁగా హనుమంతుఁడు చిత్రకూటమును విడిచి నది మొదలు మరల భరద్వాజాశ్రమమునకు వచ్చువఱకుఁ గలరామవృత్తాంతమును జెప్పి తేపు పుష్యయోగమున రాముఁడు సీతాలక్ష్మణాదిపరివారసహితముగా వచ్చుటను జూతువని చెప్పుట. భరతుఁడు పరిపూర్ణమనోరథుఁడై యానందపారవశ్యము నొందుట.

"మహారణ్యమునకుఁ బెక్కుసంవత్సరములు పోయి యుండిననానాథుఁ డగురాముని గుఱించినయింపారుముచ్చట నిప్పటికి వినఁగంటినిగదా! దీనినిబట్టి 'మనుష్యుఁడు బ్రతికియుండినయెడ నూఱుసంవత్సరముల కయినను దప్పక యానందము నొందును' అని లోకు లాడికొనెడియీవార్త యథార్థ మనియే నాకుఁ దోఁచుచు

---

డున్నయవస్థను జూడఁగానే ప్రియవార్త వినిపించుటకు క్షణము జాగుచేసినచో నతఁడు ప్రాణములు విడుమనని శంకించి గోడ యుండినఁ జిత్తరువు వ్రాయవచ్చు ననున్యాయమున తనవందనమునకు నుద్దేశ్యమైన వస్తువు నశించుచుండఁగా వందనముచేఁ బస యేమి యని యతని సంజీవింపఁజేయుప్రియవార్తయే ముందు చెప్పినాఁడని గ్రహించునది. లేక భరతుని చూడఁగానే తనస్వరూపమును మఱచినాఁడు గాన వందనము చేయలేదనియు గ్రహించునది—గోవిందరాజులు.

న్నది. *రామునకును వానరులకును సమాగమ మెట్లు గలిగినది? ఎందులకొఱకుఁ గలిగినది? ఎచటఁ గలిగినది? అడుగుచున్నాను గాన యున్నది యున్నట్టు చెప్పుము" అనెను. ఆరాజకుమారుఁ డిట్లడిగి తపస్వులకుఁ దగినయొకయాసనమున నతనిని గూర్చుండఁబెట్టఁగా, నంత నతఁ డరణ్యంబున జరిగినరామునిచరిత్ర మంతయు భరతునకుఁ జెప్పవాఁడై. ప్రభూ! మహాబాహూ! నీతల్లి కైకకు దశరథుఁడు వర మొసంగుటయు, దానింబట్టి రాముఁ డడవికిఁ బంపఁబడుటయుఁ, బుత్రశోకమున రాజు దశరథుఁడు మృతుఁ డగుటయు, దూతలు నిన్ను రాజగృహమునుండి యయోధ్యకుఁ దోడ్కొనివచ్చుటయు, నీ వయోధ్యకు వచ్చి రాజ్యమును శత్రువులపీఁచ మడఁచి పాలింప సమర్థుండ వయ్యుఁ జేకొన నొల్లకుండుటయు, సత్పురుషులధర్మము ననుష్ఠించువాఁడై నీవు చిత్రకూటపర్వతమునకుఁ బోయి రాజ్యమును గయికొమ్మని రామునిఁ బ్రార్థించుటయు, రాముఁడు తండ్రియాజ్ఞయందే నిలిచి రాజ్యము నొల్లక దిగవిడుచుటయు, నీ వాపూజ్యుని పాదుకలు గ్రహించి మరలివచ్చుటయు, ననెడివృత్తాంతమును నీకుఁ గలరూపునం దెలిసియున్నది. నీవు పాదుకలను దీసికొని మరలిపోయిన తరువాత నేమి జరిగినదో చెప్పెదను వినుము. నీవు మరలి పోవఁగా నపు డపూర్వపురుషులను జూచుటవలన నవ్వనమునందలిమృగములును పక్షులును నటు నిటు కలంగఁబాఱఁగా నావనము మిక్కిలియుఁ బరితాపము నొందిన ట్లుండెను. అంత రాముఁ డడవియేనుఁగుల త్రొక్కుళ్లచే నొప్పి, సింహములు పులులు మృగములు మిక్కిలియుఁ గలిగి భయంకర మై నిర్జన మై మిక్కిలివిస్తీర్ణము గా నుండు దండకారణ్యమునకుఁ బోయెను. రామలక్ష్మణులును సీతయు విజన మయినయరణ్యమునఁ బోవుచుండఁగా బలవంతుఁ డగువిరాధుఁడు బిగ్గఱగా నఱచుచు వారికడ్డముగాఁ బొడకట్టెను. అట్లు బిగ్గఱగా నఱచుచు వాఁడు రాఁగా వారలు చేతులు మీఁదుగను దల క్రిందు గను నుండునట్లు వానిని బట్టియెత్తి గర్జించుచున్న మదగజమునుంబోలె పల్లములోఁ †బడవైచి పూడ్చిరి. అంత నాయన్నదమ్ములు రామలక్ష్మణు లట్లు దేవతలకును జేయ నలవి గానియాకార్యమును జేసి నాఁటిసాయంకాలము రమణీయమైనశరభంగాశ్రమమునకుఁ బోయిరి. శరభంగుఁడు శరీరము వదలి దేవలోకమునకుఁ బోయినపిమ్మట, సత్యపరాక్రముఁ డగురాముఁడు, అచటిమునుల కందఱకును బ్రణమిల్లి జనస్థానమును జేరెను. అంతఁ గొంతకాలమునకు శూర్పణఖ యనునది రామునియొద్దకు వచ్చెను. అంత రామునియాజ్ఞచే మహాబలుఁ డగులక్ష్మణుఁడు తటా

---

* వానరులతోడిసమాగమమును భరతుఁ డిచట నడుగుటవలన నింతకుముందు హనుమంతుఁడు భరతునకు వానరసేనలను రాముఁడు సమకట్టికొని వచ్చుట సామాన్యముగా చెప్పియుండవలయునని తెలియుచున్నది.

† ఇందులకు 'ప్రక్షిప న్తిస్మ' అని మూలము. ఇది బహువచనముగా నుండుటచే రామలక్ష్మణులతో సీతకూడ వానిని బడవైచుటయందు తోడుగా నుండెనని తెలియుచున్నది.

లున లేచి ఖడ్గంబు గొని యారాక్షసి ముక్కుఁజెవులనుఁ గోసివైచెను. మహాత్ముం డగురాముఁ డాజనస్థానమున నుండునపుడు, భయంకరకర్ము లగురాక్షసులఁ బదునాలుగువేలమందిని వధించెను. ఆరాక్షసులు పదునాలుగువేవురును నొక్కటిగాఁ గూడి రామునిపయి నెత్తివచ్చిరి. కాని రాముఁడొక్కరుఁడె వారి నెదుర్కొని పోరి మూఁడుగడియలలో నందఱ నిశ్శేషముగా నఱుమాడినవాఁ డయ్యె. దండకారణ్యమున వసించుచుఁ దపోవిఘ్నము గావించుచుండినమహాబలవంతులును మహావీర్యవంతులు నయినయారాక్షసుల నందఱును రాముఁడు యుద్ధమున వధించెను. ఆరాక్షసులు యుద్ధమున నజ్జుగుజ్జయిరి. వారినాయకుఁ డగుఖరుఁడును హతుఁ డయ్యెను. దూషణుఁడు మొదటనే నశించెను. త్రిశిరుఁడు వానికి వెంటనే కూలెను. అట్లు రామునిచే విరూప గావింపఁ బడిన మూర్ఖురా లాశూర్పణఖ ఖరాదులు హతులు కాఁగా నంత రావణునొద్దకుఁ బోయి తన మొఱ చెప్పుకొనెను. రావణునియనుచరుఁడును భయంకరుఁడు నయినమారీచుఁడనురాక్షసుఁడు రత్నమయమైనయొకమృగమురూపము దాల్చి సీతముందటఁ జెరలాడి యాబిడ కాశ పుట్టించెను. అంత సీత రామునిం జూచి 'ఈజింకను పట్టితెమ్ము. ఇదియుండినయెడ మన యీయాశ్రమ మాహా! యెంతరమణీయ మై మనసు నాకర్షించుచుండును' అనెను. అంత రాముఁడు విలు గొని, యామృగము పరుగెత్తఁగా దాని వెంటఁ దఱుముకొని పోయెను. అంత నది చిక్కక పరుగెత్తుటను జూచి యది మాయయని తలఁచి గణుపులు చదునుగాఁ జెక్కంబడియున్నయొకసున్నని బాణ మేసి దానిని రూపుమాపెను. సౌమ్యా! అంత రాముఁడు దానివెంటఁ బోయియుండఁగా, లక్ష్మణుఁడు గూడ తరలిపోవఁగా, నపుడు రావణుఁ డది సమయమని రామునాశ్రమమును బ్రవేశించెను. వాఁ డాకాశమున నంగారకగ్రహము రోహిణిని బట్టునట్లు బలాత్కారమున సీతాదేవిని బట్టుకొని, యంత నాబిడను గాపాడఁ గోరి యడ్డపడినజటాయు వనుగృధ్రమును యుద్ధమునం జంపెను. ఆరావణుఁ డిట్లు బలాత్కారమున సీతం బట్టుకొని వేగం బోయెను. అంతఁ బర్వతములుంబోలె నద్భుతాకారు లయినవానరులు ఋశ్యమూకపర్వతముపయినుండి, సీత నపహరించుకొని పోవుచున్నరాక్షసనాథుం డగురావణుని నాశ్చర్యపడి చూచిరి. అంత మహాబలుం డగులోకరావణుఁ డారావణుఁడు (మతింతవేగమునఁ బోయి మనోజవం బగుపుష్పకవిమానము నెక్కి)సీతతో లంకను బ్రవేశించెను. రావణుఁ డాసీతను బంగారుపూఁత పూసినదియు సొగసయినదియు నగునొకగొప్పమందిరమున నునిచి మంచిమాటల నాశ్వాసించెను. సీత యామాటలను నారాక్షసరాజును గడ్డిపరకలుగాఁగొని వానినెంతమాత్రమును సరకుసేయకుండుటయు రావణుం డాబిడ నశోకవనమునకుఁ బంపఁగా నామె యందే యుండెను. అట రాముఁ డమ్మహావనమున నామృగమును జంపి మరలి యాశ్రమమునకు వచ్చెను. అట్లతఁడు మరలివచ్చి సీతనును గృధ్రమగుజటాయువును గానక మిక్కిలివ్యథ నొందెను. అంత

రాముఁడు లక్ష్మణునితో సీతను వెదకుచుం బోయి తనతండ్రికిఁ జెలికాఁడగు జటాయువు హతుండయి యుండుటను జూచి యతని కగ్నిసంస్కారము గావించి గోదావరీ తీరమందును, అందుఁ బూచియున్న వనప్రదేశములందును, సీత పువ్వులకై వచ్చియుండు నేమో యని సంచరించెను. ఆరామలక్ష్మణులు మహారణ్యమునఁ బోవుచుఁ గబంధుఁడను రాక్షసునిఁ దారసించిరి. అంత సత్యపరాక్రముఁడగు రాముఁడు కబంధునివచనముంబట్టి ఋశ్యమూకపర్వతమునకుఁ బోయి యచట సుగ్రీవునితో సమాగమము నొందెను. ఆ రామసుగ్రీవు లిరువురకు నొకరి నొకరు చూచుటకు మునుపే నొండొరులతో సఖ్యము చేసికొనవలయు నని మనస్సునఁ గోరిక పుట్టెను. మున్ను సుగ్రీవుని నతనియన్న యగువాలి క్రుద్ధుఁడై రాజ్యమునుండి వెడలఁగొట్టియుండెను. ఆరామసుగ్రీవు లొకరొకరి ప్రయోజనము లొండొరులతోఁ జెప్పికొనఁగా వారికి స్నేహము మిక్కిలి యతిశయించిన దయ్యె. రాముని భుజపరాక్రమమున సుగ్రీవుఁడు యుద్ధమున మహాకాయుండును మిక్కిలిబలవంతుఁడు నగువాలిని జంపి తనకు రాజ్యమును సంపాదించుకొనెను. సుగ్రీవుఁడు రాజ్యమునఁ బట్టము కట్టుకొని సమస్తవానరులతోఁ గూడినవాఁ డయ్యెను. మఱియు నతఁడు రాజకుమారిని సీతను వెదకించునట్లు రామునితోఁ బ్రతిజ్ఞ గావించెను. మహాత్ముఁడగువానరేంద్రుఁడు సుగ్రీవుఁ డాజ్ఞ చేయఁగా సీతను వెదకుటకై పదికోట్లవానరవీరులు సమస్తదిక్కులకును బోయిరి. అట్లు సీతను వెకకుటకై పంపఁబడినవారిలో మేము పర్వతోత్తమ మయినవింధ్యమునందే బహుకాలము జాగు గలుగ బిలమునందు బహుదూరము పోయి దారి తెలియక మిక్కుటమయినశోకమునఁ దప్తులమయి యుండఁగా పెద్దయుఁగాలము గడచినది. జటాయువువన్నయుఁ బరాక్రమశాలియు నయినసంపాతి సీతాదేవి లంకయందు రావణుమందిరమున నున్నదని మాకుఁ జెప్పెను. అప్పుడు నేను బంధువులయిన వానరులందఱు నట్లు దుఃఖావేశము నొందియుండుటను జూచి వారిదుఃఖముపోఁగొట్టువాఁడనై నాదుబలము నవలంబించి నూఱుయోజనములు విఱివి గల సముద్రమును దాఁటితిని. ఆరావణునిగృహమున నశోకవనమునందు సీత యొంటిమైనుండఁ గంటిని. ఆబిడ మున్ను కట్టినపట్టుపుట్టముతో నంగములు ముఱికి గ్రమ్మ నానందముదూలి పాతివ్రత్యమునుమాత్రము దృఢముగా నవలంబించి యుండెను. నేను యథావిధి నాబిడను సందర్శించి యనిందితయైన యాసుందరివృత్తాంతము నంతయు నడిగి తెలిసికొని గుఱుతునకై రాముఁ డిచ్చిన యుత్తమ మయినయంగులీయకము నొసంగితిని. సీత నన్నుఁ జూచి మరలఁ బ్రతుకునం దాశగొన్నదయ్యె) సీత నాకు మిక్కిలియుఁ గాంతిదళ్కొత్తుచున్న దన చూడామణిని రామున కానవాలుగా నొసంగెను. (నే నపుడు రావణుని మనసునకు మిక్కిలియుఁ గూర్పు నశోకవనికను ధ్వంసముగావించి రాక్షసోత్తములను యుద్ధమున వధించి లంకను భస్మము సేసి మవం బుబ్బునఁ జెలంగ నానవాలుగాఁ జూడామణిని దీసికొని కృతార్థుఁడనై వచ్చితిని.) నేను మరల వచ్చి యెట్టి కార్యమును

జుల్కఁ జేయునట్టి రాముని సందర్శించి యతనికి నానవాలు గా సీత యొసంగినయ మ్మహామణిని కాంతి మిక్కిలిదళు కొత్తుచున్న దానిని నిచ్చితిని. రోగము ముంచుకొని ప్రాణములు వెడలనుండునపుడు అమృతపానంబు చేసి రోగి మరల బ్రదుకునట్టు లింతకు ముందు జీవితముపై నిరాశ గలిగియుండినరాముఁడు సీతక్షేమవృత్తాంతమును విని యెంతయుసంతుష్టుం డై మరల జీవితమువయి నాశం బూనెను. రాముఁ డంత లంకకుఁ బోవుప్రయత్నము సేసి మనంబున రావణుని వధింప నెంతయుఁ దమకంబు మీఱ ప్రలయకాలమున ముల్లోకములను సంహరింపఁ గోరి చిమ్మి రేఁగిన కాలాగ్నివలె న య్యెను. అంత రాముఁడు సముద్రమును జేరి నళునిచే సేతువును గట్టించెను. ఆ సేతువు మీఁదనే వానరసైన్య మంతయు సముద్రము దాఁటెను. నీలుఁడు ప్రహస్తునిఁ జంపెను. రాముఁడు కుంభకర్ణునివధించెను. ఇంద్రజిత్తును లక్ష్మణుఁడు పరిమార్చెను. రావణుని రాముఁడు తానే వధించెను. అంత నింద్రుఁడును యముఁడును వరుణుఁడును శివుఁడును బ్రహ్మయు స్వర్గమం దున్నదశరథుండును శ్రీమంతుఁ డై నపరంతపుఁ డగురామునొద్దకు వచ్చి యతనికి వరము లొసంగిరి. ఋషులును దేవర్షులును వచ్చి రామునకు వరము లిచ్చిరి. రాముఁడట్లు దేవతలవలన వరములొంది దానం జేసి మృతులయినవానరులం బ్రతికించి వారలతో సంతోషమునఁ గూడి పుష్పకవిమాన మారోహించి కిష్కింధకు వచ్చెను. అతఁ డిపుడు మరల గంగాతీరమునకు వచ్చి భరద్వాజాశ్రమంబున నమ్మునిసన్నిధానమున నున్నాఁడు. రేపు పుష్యనక్షత్రంబున నీవతని నిర్విఘ్నముగాఁ జూడఁగలవు (పుష్యయోగము లభించుటకే యిపుడు గంగాతీరమున నున్నాఁడు)' అనెను. అంత భరతుండు సత్యమును సుహార్థంబు నగుహనుమంతునివచనమును విని హర్షించి యంజలి గీలించి 'చిరకాలమునకు నామనోరథ మీడేఱినది' యని మనస్సున కెంతయుసంతసము గూర్చుపలుకు పలికినవాఁ డయ్యె. ఇది నూటయిరువదితొమ్మిదవసర్గము.

---

భరతుఁడు సమస్తపురవీథిగోపురాదుల నలంకరింప నాజ్ఞ సేయుట అంతఃపురజనపటవర్తక రాజపరివారాదులు మొదలుగా నగరజనులెల్ల రామునిఁ జూచుటకై శత్రుఘ్నుఁ పంపున నందిగ్రామమును బ్రవేశించుట. అందఱితోడ భరతుఁడు రామునిఁగూర్చి పోవుట. భరతుండు రామునిఁ గలియుట. అందఱును భరతాశ్రమమునకు వచ్చుట. రాముఁడు పుష్పకమును గుబేరున కిచ్చి భరతాశ్రమమున వసిష్ఠాదులతో నుచితాసనంబునం గూర్చుండుట.

శత్రువీరుల నుఱుమాడుసత్యపరాక్రముం డగుభరతుఁడు పరమానందకరమయినహనుమంతునివచనమును విని సంతుష్టుఁ డగుశత్రుఘ్నునిఁ జూచి 'పురు

షులు కుచు లయి సమస్తదైవతములను పట్టణమందలి చతుష్పథమంటపములను మంచిగంధములచేతను పుష్పమాలికలచేతను వాద్యములచేతను బూజింతురుగాక. స్తోత్రములందును బురాణకథలందును బ్రాజ్ఞు లయిన స్తుతిపాఠకులును, పట్టణంబునఁ గలవైతాళికు లందఱును, వాద్యములు వాయించుటయందు నేరుపు గలవారెల్లవారును వేశ్యాసమూహములును చందురునివంటి రాముని నెమ్మొగమును జూచుటకు బయలువెడలుదురు గాక' అని యాజ్ఞాపించెను. భరతుఁడు చెప్పినది విని శత్రువీరుల నణఁచువాఁడు వీర్యశాలి యగు శత్రుఘ్నుఁడు కూలివాండ్రను పెక్కువేలమందిని రప్పించి వారితో 'నందిగ్రామమునుండి యయోధ్యవఱకుఁ బల్లములందు మట్టిద్రోసియు మిట్టపల్లములను సరిచేసియు మిట్టలను ద్రవ్వి యెత్తివైచియు భూమియంతయు సమముగాఁ జేయవలయును. మఱికొందఱు, భూమినంతటిని మంచువంటిచల్లనినీటిచేఁ దడిపి యంత నంతటను గలయఁ బేలాలును బూలును జల్లుదురు గాక. సూర్యుఁ డుదయించునంతకు, పట్టణంబులం దెల్ల మేటి యయినయయోధ్యయందలి, పెద్ద మార్గములందును ధ్వజము లెత్తుదురు గాక. పూదండలవరుసలను గట్టి దారముల గ్రువ్వంబడనితామరలు కలువలు మొద లగువిడిపువ్వులను జెరివి గృహముల నలంకరింతురు గాక. విశాల మగురాజమార్గమందు వందలకొలఁది మనుష్యులు మంచివాసనలు గుబాళించు నయిదువన్నెల ముగ్గుఁబిండ్లచే ముగ్గులు పెట్టి యలంకారము సేయవలయును' అని యాజ్ఞాపించెను. రాజభార్యలును, మంత్రులును, సైనికులును, సైనికులభార్యలును, బ్రాహ్మణులును క్షత్రియులును సంఘములలో ముఖ్యు లయినవారును ఆసమూహములును రాముని దర్శింప వెడలిరి. ధృష్టియు జయంతుఁడును విజయుఁడును సిద్ధార్థుండును అర్థసాధకుఁడును అశోకుఁడును మంత్రపాలుఁడును సుమంత్రుఁడును సువర్ణాభరణాలంకృతము లయినమత్తగజములును నుత్తమాశ్వములును వేలకొలఁదిని ముందును వెనుక నలంకరింప బయలుదేఱిరి. రాజున కంతరంగు లయిన వేఱుకొందఱు నడుమునకు బంగారుమోకు గట్టంబడి మగయేనుంగులతోఁ గూడియున్నయాఁడుగజముల నారోహించి వెడలిరి. మఱికొందఱు మిక్కిలిమహారథు లగువారు మంచిగుఱ్ఱములు పూన్చినరథముల నెక్కి వెడలిరి. శక్తులను అష్టులను బ్రాసములను దాల్చి రౌతులు ధ్వజములను బతాకలనుంగొని యెక్కియున్న వేలకొలఁది గుఱ్ఱపుదళములును, మేటి పురుషులతోఁ గూడియున్న మంచి పదాతులు వేలకొలఁదియుఁ, బరివేష్టించి రా వీరులు వెడలిరి. అంత దశరథుని భార్యలందఱును పల్లకీల నారోహించి కౌసల్యను సుమిత్రను ముందిడుకొని బయలువెడలిరి. *కైకేయీసహితముగా దశరథునిభార్య లందఱును నపుడు నందిగ్రామమునకు వచ్చిరి. అయోధ్యానగరములోనివార లందఱు నపుడు నందిగ్రామమునకు వచ్చిరి. అంతఁ జతు

---

* ఇట భరతుఁడు కైక నుపేక్షించి పిలువకుండుటచే నాబిడ కౌసల్యాదులతో బయలువెడలక పిమ్మట బయలుదేఱి నందిగ్రామమున నంపతితోఁ గలసి చేరెనని తెలియునది.

రంగసైన్యములు నడచునపుడు గుఱ్ఱంబులగొరిజలచప్పుళ్లును రథనేమిధ్వనులును, శంఖభేరీనాదములును భూమిని నల్లలాడించునవియుంబోలెఁ జెలంగినవి. భరతుండు మహాత్ముండును బహుధార్మికుఁడును సమస్తధర్మంబులఁ బ్రాజ్ఞుండు నగుటవలన నన్నకై యుపవాసంబులఁ గృశించి కుందుచు నారచీరలును గృష్ణాజినమును ధరించియుండెను. మఱి యంతకు మునుపు రామునిరాక హనుమంతునివలన విని హర్షము నూనియుండెను. అట్టిభరతుఁ డపుడు బ్రాహ్మణోత్తములును వర్తకులును నయ్యోసంఘముల ముఖ్యు లగువారలును బరివేష్టించి నడువ, వసిష్ఠాదిమంత్రులు మాల్యములను గుడుములను జేకొని వెంబడింప, శంఖభేరీధ్వనులు బోరుకొన వందిజనులు కైవారములు సేయ, రామపాదుకలు శిరసున వహించి తెల్లని పూలదండలచే నలంకృత మయిన శ్వేతచ్ఛత్రమును బంగారుకాఁడలతో రాజార్హములై యొప్పుచున్న తెలిచామరములను దీసికొని సుమంత్రాదిసచివులతోడ రాముని నెదుర్కొనఁ బోయెను. భరతుఁడు కొంతసేపు నిరీక్షించి యంత హనుమంతునిఁజూచి 'నీకు వానరులకు సహజ మయినచిత్తచాపల్యము కలుగదు గదా. ఆచాపల్యమున నూరకనే రాముఁడు వచ్చుచున్నాఁడని చెప్పవు గదా! ఏల యనఁగా కాకుత్స్థతిలకుండును బూజ్యుండును బరంతపుఁడు నగురాముఁ డింకను గనఁబడలేదే! అతఁడు దూరమున నున్నను నతనిసేన మొగమున వచ్చువానరులయినను గనఁబడవలయునే! వారును గనఁబడలేదుగదా! వారు కామరూపులు కావున స్వరూపముతోఁ గనఁబడకున్నను మఱి వేఱురూపమున నయినను గనఁబడలేదేమి?' అని యడిగెను. భరతుం డిట్లు చెప్పఁగా హనుమంతుఁడు సత్యపరాక్రముఁ డగునతనికి రాముఁడును వానరులును వచ్చుటకు జాగయినకారణమును విన్నవించువాఁడై 'భరద్వాజునియనుగ్రహమునం జేసి వృక్షము లన్నియు నెప్పుడును ఫలములు గలిగి పుష్పములు పూచుచు తుమ్మెదలు మత్తిల్లి ఝుంఝు మ్మని రవళిసేయం దేనియలు దొరఁగుచున్నవి. వానిని బొంది వానరు లుబ్బుచు నున్నవారు. పరంతపా! దేవేంద్రుఁ డారామునకు వానరు లున్నచోట్ల వృక్షము లెల్ల నకాలమున ఫలించి యుండునట్లు వర మొసంగెను. అట్లె భరద్వాజమహర్షియు రామునకును నతనివానరసైనికులకును వృక్షము లెల్లఁ దేనియలు దొరఁగుచుండునట్లు సర్వగుణసంపన్న మయినయట్టి యాతిథ్యము(విందు)నొసంగినవాఁడయ్యెను. కాఁబట్టి వనంబునందు వృక్షము లకాలమున ఫలించుటయు దేనియలు దొరఁగుటయు యుక్తమే. కావుననే యీలాగున వానరులు మిక్కిలియుబ్బునఁ గావించుభయంకర మగుకోలాహలధ్వని యదె వినఁబడుచున్నది. కాన యిప్పుడు వానరసేన గోమతీనదిని దాఁటుచుండు నని తలంచెదను. కనుకనే యీధ్వని యింత బెట్టిదముగా నున్నది. ఆనదిని దాఁటుటే కాదు. పయికెఁ జిమ్మి రేఁగి దొరఁగుచున్నదుమ్ము ముంపును జూఁడు. దీనినిబట్టి వానరులు వాలుకినీనదియందు పోవుచుండు రని తోఁచుచున్నది. వానరు లిపుడు రమణీయ మయినసాలవనంబున వృక్షములు గదలించు

చు విహరించుచుందురని తలంచెదను. కావున వారియీవిలంబము. అదిగో దూరమునఁ జంద్రునివలె నిర్మలమై పుష్పకమనుదివ్యవిమానము చూపట్టుచున్నది. దీనిని బ్రహ్మదేవుఁడు మనస్సుచేతనే నిర్మించినాఁడు. మహాత్ముం డగురాముఁడు రావణుని బంధుసహితముగాఁ జంపి దీనిని బడసినాఁడు. బాలసూర్యునివలె వెలుంగుచున్నదె రాముఁ డెక్కి వచ్చుచున్నయీదివ్యవిమానము బ్రహ్మదేవుని ప్రసాదముచేఁ గుబేరునికి లభించినది. మనోవేగమునం బోవునది. ఇందు వీరు లయినయన్నదమ్ములు రామలక్ష్మణులును సీతయు మహాతేజుం డయినసుగ్రీవుఁడును రాక్షసరాజగువిభీషణుఁడును గూర్చుండియున్నవారు' అనెను. అంత 'వీఁడుగో రాముఁడు వచ్చినాఁ' డన్నంతనే స్త్రీలు బాలురును వయసుకాండ్రును వృద్ధులును నుబ్బి చెలరేఁగి కావించుకోలాహలధ్వని నింగి ముట్టినదయ్యె. ఆమనుష్యులందఱును రథములు గజములు గుఱ్ఱములు మున్నగువాహనములనుండి డిగి నేలపయి నిలుచుండి యాకాశంబునఁ జంద్రునింబోలె పుష్పకవిమానంబునఁ దేజరిల్లుచున్న రామచంద్రునిం గాంచిరి. భరతుఁ డంత మిక్కిలి సంతోషమున రామున కెదుర్కొని నిలిచి చేతులుమోడ్చి 'పదునాలుగేండ్లు నిండఁగా మరలఁ దప్పక వత్తునని యాడినమాటఁ దప్పక రాముఁడు విజయంచేసినాఁ'డని యతనిని గొనియాడెను. భరతాగ్రజుం డగురాముఁడు, విశాలము లయిననిడువాలు కన్నుంగవతో బ్రహ్మ మానసముచే సృజించిన యాదివ్యమానంబున నధివసించి రెండవ దేవేంద్రునివలె శోభిల్లెను. అంత నపుడు భరతుఁడు మేరుపర్వతముపయి నున్నసూర్యునికి నమస్కరించునట్లు పుష్పకవిమానపయి నున్నరామునకుఁ బరిశుద్ధహృదయమున నమస్కరించెను. అంత హంసాకారము లయినప్రతిమలతోఁ గూడి, మహావేగమును మిక్కిలియుత్తమంబు నయినయవ్విమానము రామునను మతిమీఁద నేలకు వ్రాలెను. రాముం డందఱకును జూపుటకై సత్యపరాక్రముం డగుభరతుని పుష్పకవిమానముపయి నెక్కించుకొనఁగా నతఁడు రామసాన్నిధ్యము నొంది ముదం బంది మరల రామునకు నమస్కారము గావించెను. రాముఁడు చిరకాలమునకుఁ గన్నులకు విందుగా నగపడినవాఁ డయినతమ్ముని భరతుని నెత్తి, తనతొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని ముదం బెంతయుఁ బొదల బిగ్గఁ గౌఁగిలించుకొనెను. అంత భరతుఁడు తనకు మ్రొక్కిన లక్ష్మణునిని సంభావించి * సీతాదేవికిని నమస్కరించి సంతోషమునఁ దననామము గూడ వచించెను. భరతుఁడు సుగ్రీవుని జాంబవంతుని, నంగదుని, మైందద్వివిదులను, నీలుని, ఋషభునిఁ, గౌఁగిలించుకొని సంభావించెను. భరతుఁడు మఱియు నలుని, గవాక్షుని, గంధమాదనుని, శరభునిఁ, బనసునిఁ, గౌఁగిటం జేర్చి గౌరవించెను. ఆవానరు

---

* ఇట లక్ష్మణుండు చేయు నున్ననమస్కారమును భరతుఁడు రామసన్నిధియందు గలదని వారించినట్లును గొందఱు చెప్పెదరు. భరతుఁడు లక్ష్మణుని సంభావించినపిదప సీతాదేవికి మ్రొక్కుటను జెప్పుటచే, సీత రామునిసమీపముననే తారాదులతోఁగూడఁ గొంతయవ్వలగా నుండెనని తెలియుచున్నది. గోవిందరాజులు.

లందఱును గామరూపులు గావున మున్నే మనుష్యరూపము ధరించి యుండిరి. కాన వారలపుడు భరతుం జూచి మిక్కిలిసంతుష్టులై కుశలము నడిగిరి. అంత మహాతేజుండును ధార్మికోత్తముండు నయినయారాజకుమారుఁడు వానరేంద్రుని సుగ్రీవుని మరలఁ గౌఁగిలించుకొని, 'సుగ్రీవా! నీవు మాకు నలువురకును నయిదవతోడంబుట్టు వయితివి. లోకమున మంచిమనస్సున నుపకారము సేయువాఁడు మిత్త్రుఁ డగును. అపకారము చేసినవాఁడు శత్త్రుఁ డగును. అపకారమే శత్త్రులక్షణము' అనెను. పిదప భరతుఁడు విభీషణునిఁ జూచి సామవచనములతో నాభాగ్యవశమున నీవు రామునకు సహాయుఁడవై యుండి మిక్కిలియుఁ జేయనలవి కానికార్యము చేసితివి ' అనెను. అప్పుడు శత్రుఘ్నుఁడును రామునకును లక్ష్మణునకు నమస్కారము గావించి, పిదప సీతాదేవిచరణములకు వినయంబుతోడఁ బ్రణమిల్లెను. రాముఁడు శోకంబునఁ గృశించి యెంతయు దురపిల్లు చుండినతనతల్లి కౌసల్యయొద్దకుఁ బోయి, 'మనువు నీవు వలదన్నను వినకపోయినందులకు మనస్తాపము వల'దని యామెమనసు కలంక దేర్చుచు, నామెపాదంబులు పట్టికొని నమస్కారము గావించెను. రాముఁడు సుమిత్త్రకును * కీర్తిమతియగు కైకేయికిని దక్కినతల్లులకందఱకును నమస్కరించి యంతఁ బురోహితుం డగువసిష్ఠుకడకు వచ్చి మ్రొక్కెను. పురజనులందఱును రామునిం జూచి'మహాభాగా! కౌసల్యకానందము వర్ధిల్లఁజేయువాఁడా! నీకు స్వాగత మగుఁగాక' యనిరి. ఆపౌరు లట్లు తామరమొగ్గలవలెఁ గావించినపెక్కువేలచేమోడ్పులను రాముఁడు చూచి యాదరించెను. భరతుఁడు ధర్మవిదుండు గావునఁ దొల్లి తనయొద్ద రాముఁడొసంగినయాపాదుకలను జేకొని నరనాథుం డగురామునిపాదములకుఁ దానే తొడిగెను. అప్పుడు భరతుఁ డంజలి గీలించి రామునితో'రాజా! నే నిల్లడ గా రక్షించుచుండినయీనీదురాజ్యమును నిదిగో నీ కప్పగించివైచితిని. నీవు మరల నయోధ్యకు వచ్చి రాజుగా నుండుటను జూచుచున్నాఁడను గాన యిపుడు నాజన్మముకృతార్థమయినది. ఇప్పుడు నాకోర్కి యంతయుఁ బండినది. నీవు, బొక్కసమును ధాన్యశాలను, పట్టణమును, సైన్యమును, జూచుకొనుము. నీప్రభావంబున సమస్తమును నీవు పోవునప్పటికన్న నిప్పటికిఁ బదిమడుంగులుగా వృద్ధిఁ బొందియున్నవి.' అనెను. అట్లు పలుకుచున్న భరతునికిఁ దనయన్నయందుఁ గలభక్తిపారతంత్త్ర్యమును జూచి తమకులమువారియం దిటువంటితోఁబుట్టువనము లేమికి వానరులందఱును రాక్షసుఁ డయినవిభీషణుఁడుకూడఁ గన్నీరు విడిచిరి. అంత రాముఁడు సంతోషమునఁ దనతోడపయిని భరతునిఁ గూర్చుండఁబెట్టుకొని సైన్యసమేతముగా నాపుష్పకవిమానముతోనే భరతాశ్రమమగునందిగ్రామమునకుఁ బోయెను. రాముఁడు నందిగ్రామము చేరినపిదప నపుడు సైన్యములును దానును బుష్పకవిమానముపయినుండి భూమికి దిగెను. రాముఁడపుడు

* ఇట కైకను కీర్తిమతి యనుట రావణాదివధరూపమయిన దేవతాకార్యమును జరిపించుట కావిడ హేతువగుటంబట్టి యని తెలియునది.

మిక్కిలియుత్తమ మగునావిమానమును జూచి 'నీ విఁకఁ గుబేరునకు వాహనముగా నుండుము. అనుజ్ఞయొసంగితిని, పొమ్ము' అనెను. అంత నుత్తమం బగునావిమానము రామునియనుజ్ఞ నొంది యుత్తరదిక్కుగాఁ బోయి కుబేరునిభవనమును జేరెను. దేవేంద్రుఁడు బృహస్పతిచరణములకు మ్రొక్కినట్లు రాముఁడు తన కనురూపుఁ డగుపురోహితుని వసిష్ఠునిపాదములను బట్టికొని మ్రొక్కి యతఁడును దానును సాగ సయిన యాసనంబుల వేఱువే ఱయినవానియం దేకకాలంబునఁ గూర్చున్నవాఁ డయ్యె. ఇది నూటముప్పదియవసర్గము.

---

* భరతుఁ డంజలిబంధపూర్వకముగా రాముని రాజ్యముగ
యికొనఁ బ్రార్థింపఁగా నతం డంగీకరించి లక్ష్మణాదిసహిత
ముగా జటలు విడిచి మంగళస్నానముచేసి సుగ్రీవాదు
లతో దివ్యరథమున నయోధ్యను బ్రవేశించుట. అందు
మాణిక్యమంటపమున దివ్యసింహాసనమున జాంబవ
ద్ధనుమదాదులు రత్నకాంచనకలశంబులం దెచ్చిన
తీర్థోదకములచే వసిష్ఠాదులు శ్రీరామున కభి
షేకముగావించుట. రాముఁడు విభీషణసు
గ్రీవాదులందఱకును సమ్మానములు సేయు
ట. సుగ్రీవాదులు తమతమనగరములకుఁ
బోవుట. భరతునియావరాజ్యము
నకుఁ బట్టముగట్టుట. రామరాజ్యపా
లనవైభవము. శ్రీరామాయణప
ఠనశ్రవణాదిఫలశ్రుతి.

భరతుఁడు శిరమున నంజలి గీలించి కైకకానందము పెచ్చువెరుఁగుచుండ, సత్యపరాక్రముఁ డగుతనయన్నను రామునిఁ జూచి "నీవు రాజ్యమును దిగవిడిచి వనవాసము నంగీకరించుటచే నాతల్లిని సంతోషపెట్టితివి. పిదప నీరాజ్యమును జిత్రకూటమున నా కొసంగితివి. నీ వేవిధంబున నిల్లడగా నాయొద్దరాజ్యము నుంచితివొ

* ఇట పుష్పకము కుబేరునొద్దకుఁ బంపి వసిష్ఠునితోఁ గూడికొని భరతునియనుజ్ఞ లేక యయోధ్యను బ్రవేశింపరాదని రాముఁడు నందిగ్రామమందే యాసనమునఁ గూర్చుండి యుండుటయు పౌరవర్గము నల్లె కూర్చుండుటయు తల్లులును సమీపముననేయుండుటయును జూచి యప్పటిసూక్ష్మేంగితములను నిపుణుండు గాఁ భరతుఁడు గనుఁగొని రామునకుఁ దనహృదయమును నివేదించుచున్నాఁడు. ఇట 'శిరస్సునం దంజలి గీలించి' యనుట పూర్వకృత మయినప్రపత్తిని తలఁపించుచున్నది. అనన్యగతికత్వమును సూచించుముద్రయే కదా యంజలి. గోవిందరాజులు.

యావిధముననే యీరాజ్యము మరల నీకొసంగి యాబరువు తీర్చుకొనుచున్నాను. ఈహేతువునుబట్టి నీవు మరల నంగీకరింపక తీఱదు. 'అయోధ్యయందు రాజ్యభోగముల నిచ్చకొలఁది ననుభవించెద. రాజ్యమును నీవే పాలింపు' మందువా? లేక 'నీవు మరల నడుగువఱకు నిల్లడను నేనుబెట్టుకొనియున్న దోషము లేదు. అడిగినవు డి' మ్మందువా? బలిష్ఠం బయినయొకగొప్పవృషభము తా నొక్కటి మోయుబరువును లేదూడపయిని వైచినయెడ నది యాపెనుబరువును మోయఁజాలనట్లు మహాబలవంతుం డగునీ వెక్కుఁడు పూనఁదగినయీరాజ్యభారమును నాపయి నుంచినయెడ నాపెనుభారము నేను వహింపశక్తుఁడనుగాను. 'అయిన నింతవఱకు నెట్లువహించియుంటి' వందువా? గొప్ప దయినజలప్రవాహములచేఁ దెగి నీరు కాఱుచున్నయనకట్ట, గడ్డియాకుమండెలు మొదలగునవి వేసి కప్పిపుచ్చనిచో దాని నిలుపుట కష్ట మగునట్లు, పెక్కుఛిద్రములు గలరాజ్యమును మంత్రగోపనము మొద లయినరాజగుణములచే ఛిద్రములను గప్పిపుచ్చనిచో దాని నిలుపుట యశక్యము. అంతటిశక్తి నాకుఁ గల దా? 'నావలెనే, నీవు గుణములచే లోకమును వశీకరించుచున్నా' వందువా? అరిందమా! మంచియశ్వమువలె గర్ధభము పరుగెత్తంజాలనట్లు, హంవలెఁ గాకి యెగురఁజాలనట్లు, నీవలె రాజ్యభారమును నడపుటకు నే నోపఁజాలను. 'అప్పటికి నాయుపోద్బలముక్రింద నీవేరాజ్యమును బాలించుచుండు' మందువా! మహాబాహూ! ఇంటిలోపల నొకవృక్షము నాటఁగా మిక్కిలివెద్దది యై యెక్కుట కెంతమాత్ర మవి గానట్లు గొప్పబోదెయును బెనుగొమ్మలును గలిగి పువ్వులును బూచి ఫలింపక యే నశించెనేని, అదియెందులకు నాటంబడినదో యాఫలము నాటినవానికిఁ గలుగక యే పోవునుగదా. *దశరథుఁడు, పుత్రకామేష్టి మొదలయినవి చేసి నిన్నుఁ బడయఁగా, నీవును బెద్దపెరిఁగి మహాపరాక్రమశాలి వై బంధువులును మిత్రులును గొప్పవారునుగలిగి,కల్యాణగుణము లెల్లఁ బొంది వెలయుచున్నావు.అట్టినీవు నిన్నుఁ బడసినందులకు ఫలముగా రాజ్యమును బాలించి భక్తులును భృత్యులు నగు మమ్ము నేలుకొనవేని, మున్ను దాహరించినవృక్షముపోలిక యగును.ఈపోలిక నీకొఱకె చెప్పఁబడిన దని తెలియఁదగును. ఇప్పుడు నీవు పట్టాభిషిక్తుండ వై పట్టపగలింట మిక్కిలి జ్వలించుచున్నసూర్యునివలె, తేజంబు నలుగడల వెలుంగుచుండఁగా నిన్ను లోక మంతయుఁ జూచునుగాక. రామా! నానావిధవాద్యధ్వనులు, మేలుకొలుప నర్తనము గావించువారలకాంచీనూపురధ్వనులును లలితనృత్తధ్వనులును,రమణీయములయినగీతికలధ్వనులును,వీనులఁ జెలంగ మేలుకొనుము. ఇట్లు సమస్తరాజభోగముల ననుభవింపుము. జ్యోతిశ్చక్ర మెంతకాలము తిరుగుచుండునో, భూమి యెంతవఱకు నుండునో,యంత

* విత్తునాటుటకును పుత్రకామేష్టి మొదలయినవి సేయుటకును, గొప్పబోదెకును తోఁబుట్టువులు కలిమికిని, కొమ్మలకును సుగ్రీవాది మిత్రగణమునకును, పుష్పములకును కల్యాణగుణములకును, ఫలింపక పోవుటకును రాజ్యము పాలింపకపోవుటకును, సామ్యము తెలియునది.

కాలము నీవిచట సమస్తరాజ్యమున కేలికవై యుండుము. నడుమఁగూడ నాకు రాజ్యముమీఁదియపేక్ష గలుగదు'' అనెను. శత్రుపురములను జయించువీరుఁడు రాముఁడు, భరతుఁడు చెప్పినది విని, వల్లె యని యంగీకరించెను. అంత నిలుచుండినభరతుఁడును శుభ మగునయాసనమునఁ గూర్చుండెను. అంత శత్రుఘ్నుఁ డాజ్ఞాపింపఁగా, పట్టాభిషేకముహూర్త మతిక్రమింపకుండ నతిశీఘ్రముగాను హస్తలాఘవముచే సుఖముగాను బని చేయఁ గలనిపుణు లగుక్షౌరకులు, గడ్డమును మీసలను గత్తిరించునట్టివారు, రామునకు భరతునకును లక్ష్మణునకును మీసలను గత్తిరించిరి. *మొదట భరతుఁడు స్నానము చేసెను. అంత మహాబలుఁ డగులక్ష్మణుఁడు స్నానము గావించెను. అంత వానరరాజగుసుగ్రీవుఁడును, రాక్షసరాజగువిభీషణుఁడును స్నానము గావించిరి. పిదప రాముఁడు జటలువిడఁదీసి నున్నగా సవరింపఁబడినతలవెండ్రుకలతో స్నానము గావించి నానావిధము లయినపూవులు గ్రువ్వంబడుటచే వింత లగుపూదండలచేతను మంచివాసనలు గుబాళించుచు కర్పూరకస్తూరీకుంకుమాదిమిళిత మయినచందనముచేతను నలంకృతుఁడై మేలయినపీతాంబరములు గట్టి మిక్కుటమగు తేజస్సుచే జ్వలించుచు సింహాసనమునఁ గూర్చుండెను. వీర్యవంతుఁడును నిక్ష్వాకుకులవర్ధనుండు నగుశ్రీమంతుఁడు శత్రుఘ్నుఁడు, రామునకును లక్ష్మణునకును భరతునకును హారకేయూరాదులఁ దొడిగించి యలంకారము సేయించెను. అంతనవుడు దశరథభార్యలు, మంచియగుమనంబున, నందఱును జేరి సీతాదేవికి, తామే తమచేతులార మనస్సును హరించునట్టియలంకారము గావించిరి. అంతఁ గౌసల్యాదేవి పుత్త్రునియందు మిక్కిలిమక్కువ గలది గావున, మిక్కిలియు నుబ్బు నొంది, యతనిమిత్త్రము లయినవానరులభార్యల కందఱకును బ్రయత్నపడి మనోహర మయినయలంకారము గావించెను. అంత శత్రుఘ్నునాజ్ఞవలన సుమంత్రుఁ డనుసారథి, యన్నియవయవములును సొగసు గులుకుచున్నయుత్తమ మగురథమును, మే లయినయశ్వములం బూన్చి తెచ్చెను. మహాబాహుండును సత్యపరాక్రముండు నగురాముఁడు సూర్యమండలమువలె వెలుంగుచు దివ్యం బగునమ్మేటిరథము వచ్చుటనుజూచి దాని నారోహించెను. సుగ్రీవుఁడును

* 'న మే స్నానం బహుమతం తం వినా కైకయీసుతం' 'కైకకొడుకు భరతుఁడు స్నానముచేయక నేను స్నానముచేయుట కొల్లను' అని రాముఁడుమున్ను చెప్పియున్నచొప్పున, ప్రథమస్నానము భరతుఁడుచేసెను. సుగ్రీవుఁడును కిష్కింధనుండి వెడలివచ్చినదాదిగా స్నానములేనందున నతనికప్పుడు స్నానము. అట్లె లంకను విడిచివచ్చినదిమొదలుగా స్నానములేనందున విభీషణునకును నప్పుడుస్నానము. శత్రుఘ్నుఁడు స్నానముచేసినట్లు చెప్పమిచే, నపుడతని కవసరము గాదు. మఱి పూర్వ మతఁడు వ్రతము పూనినట్లును జెప్పఁబడలేదు 'నన్దిగ్రామే జటాం హిత్వా భ్రాతృభి స్సహితోఽనఘః' అని నందిగ్రామమున తమ్ములతోఁగూడ జడలు విడఁదీసికొన్నట్లు సంక్షేపముగా చెప్పఁబడియుండుటంబట్టి, శత్రుఘ్నుఁడు స్నానముచేసెనని యర్థసిద్ధముగాఁ దేలుచున్నది.

హనుమంతుఁడును స్నానముఁ జేసి దేవలోకమందలివస్త్రములుం బోనివస్త్రములను గట్టి బాగ నయినకుండలములు దళుకొత్త, దేవేంద్రునివలెఁ గాంతిఁ దేజరిలుచు నయోధ్యకుం బోయిరి. సుగ్రీవునిభార్యలును సీతాదేవియు, మే లయినయాభరణములం గయిసేసి, మంచికుండలములను దాల్చి యయోధ్యాపురమును జూడఁ దుకతుకపడుచుఁ బోయిరి. దశరథమహారాజుమంత్రు లగువారు ముందే యయోధ్యకుఁ బోయి, పురోహితుఁ డగువసిష్ఠుని మున్నిడికొని రామునిపట్టాభిషేకమునకుఁ గావలసినమంగళద్రవ్యములను సమకట్టువిషయమై పసమీఱ నాలోచనము సేసిరి. అశోకుఁడును విజయుఁడును సుమంత్రుఁడును జేరి, పట్టాభిషేకము రామునకును నగరమునకును వృద్ధికరముగా నుండునట్లు జరుపుటకై వసిష్ఠునితో నాలోచనము సేసి యతనితో 'మహాత్ముం డగురామునికి జయార్హుం డగువానికి నభిషేకము సేయుకొఱకు మంగళకరము లయినవాని నన్నిటిని మీరు చక్కఁగా సమకట్టఁదగువారు' అనిరి. ఆమంత్రు లందఱు నిట్లు పురోహితుఁ డగువసిష్ఠునికిఁ జెప్పి, యంత రామునిఁ జూచుమనంబులతో మరల పురము వెలువడి రామున కెదురుగాఁ బోయిరి. వేయికన్నులు గలయింద్రుఁడు పచ్చనిగుఱ్ఱములు పూన్చినరథము నారోహించి పోవునట్లు, అనఘుఁడు రాముఁ డుత్తమ మయినరథము నధిరోహించి పట్టణమునకుఁ బోయెను. రామునకు భరతుఁడు పగ్గములు పట్టి సారథ్యము గావించెను. శత్రుఘ్నుఁడు ఛత్రము పట్టెను. లక్ష్మణుఁడు ముందట నిలుచుండి రామునిశిరస్సుపయి వీవనతో విసరుచుఁ దెల్లనివింజామరమును *గూడఁ బూనెను రాక్షసరాజగువిభీషణుఁడు చంద్రబింబసమాన మయినమఱియొకతెల్లని వింజామరమును బట్టుకొనెను. ఆకాశమున నపుడు ఋషులును వాయుగణములును దేవతలును రాముఁడు గావించిన వీరకృత్యములను ముచ్చటించుచుండఁగా ఆధ్వని మధురమై వినంబడెను. అంత మహాతేజుం డగువానరసింహుఁడు సుగ్రీవుఁడు పర్వతాకార మయినశత్రుంజయ మనుకుంజరమును నారోహించి పోయెను. వానరులు మనుష్యరూపములను దాల్చి సర్వాభరణభూషితు లయి, తొమ్మిదివేలయేనుంగుల నారోహించి పోయిరి. పురుషలలాముఁడు రాముఁడు శంఖధ్వనులును జనులుబ్బునఁ గావించుకోలాహలధ్వనులును భేరులఝాంకృతులును బోరుకొన మేడలవరుసలచే మురువు గులుకుచున్నయయోధ్యాపురమునకుఁ బోయెను. అంత నపుడయోధ్యకుఁ బోయియుండి రామాభిషేకమును గుఱించి యాలోచించుకొని మరలి యెదుర్కొన వచ్చినసుమంత్రాదిమంత్రులు, అతిరథుం డగురాముఁడు పరివారసహితుఁడై నిజదేహకాంతిచేఁ దేజరిల్లుచు రథమున వచ్చుచుండఁగాఁ జూచిరి. వారు రాముని జయ జయ యని యాశీర్వదించి యతఁడు బదులున కెంతయు నున్నింపఁ

* 'అహం సర్వం కరిష్యామి' రామునికన్నికైంకర్యములు నేనే చేయుదును. అని లక్ష్మణుఁడు మున్ను చెప్పినట్టివాఁడు గాన యందులకై త్వరపడి యూరెంటిని గ్రహించె నని తెలియునది. గోవిందరాజులు.

దమ్ములు పరివేష్టించి వచ్చుచున్నయమ్మహాత్ముని వెంటఁ బోయిరి. మంత్రులును బ్రాహ్మణులును బ్రజలును బలసి కొలువ రాముఁడు నక్షత్రపరివృతుఁ డగుచంద్రునివలె నెంతయుఁ గాంతిసొంపున వెలింగినవాఁ డయ్యె. అతండు వాద్యముల వాయించువారును తాళికులును స్వస్తిక వాద్యములవారును మంగళపాఠకులును ముందుఁబోవఁగాఁ, దాను బోయెను. మఱియు బంగారక్షతలు దాల్చినవారును గోవులును, కన్యలును, బ్రాహ్మణులును, కుడుములు చేతఁదాల్చిన మనుష్యులును రామునికి ముందుపోయిరి. రాముఁడు సుగ్రీవునకుఁ దనయందు గలస్నేహమును, వాయుపుత్త్రుం డయిన హనుమంతుని ప్రభావమును, యుద్ధమున వానరులు గావించిన వీరకర్మములును, రాక్షసుల బలవిశేషమును, విభీషణుఁడు తన్ను శరణొందుటయు, మంత్రులకుం జెప్పెను. అయోధ్యాపురవాసు లందఱు నా వృత్తాంతమును విని యాశ్చర్యము నొందిరి. మహాతేజుం డగురాముఁ డీవృత్తాంతమును జెప్పుచు,మనంబునఁ దుష్టియు ధనాదులచేఁ బుష్టియు గలజనులు నెరసి బెసి యుండునయోధ్యాపురమును వానరసహితముగాఁ బ్రవేశించినవాఁ డయ్యె. అతఁడు ప్రవేశింపఁగానే పురజను లెల్లఁ బ్రతిగృహమునను బొడవుగా ధ్వజము లెత్తి నిలిపిరి. రాముఁ డిక్ష్వాకువంశపురాజులు వాసముసేయునట్టిదియు రమణీయ మయినదియు నగుతనతండ్రిగృహమును సమీపించెను. అంత రఘుకులానందకరుం డగురాజకుమారుఁ డారాముఁడు మహాత్ముఁ డయినతండ్రిగృహమును బ్రవేశించి కౌసల్యకును సుమిత్రకును గైకేయికిని నమస్కరించి ధార్మికాత్మ మగుభరతునిఁ జూచి మహార్థవంతం బగుమాటల మధురముగా 'ముత్తెములచేతను వైడూర్యములచేతను బొదుఁగంబడిన నాపెద్దమేటిగృహమును దానియంతఃపురోద్యానముతోఁ గూడ సుగ్రీవునకు విడిపట్టుగా నిమ్ము' అనెను. అమోఘపరాక్రముఁ డగుభరతుఁడు రాముఁడు చెప్పినది విని, సుగ్రీవునిఁ జేయి పట్టుకొని యారామగృహమునకుఁ దీసికొనిపోయెను. అంత శత్రుఘ్నునియాజ్ఞవలనఁ బరిచారకులు తైలదీపములును మంచములను పఱుపులను దీసికొని శీఘ్రమున నాగృహమును బ్రవేశించిరి. సుగ్రీవుఁడు వీడుఁబట్టులో సుఖముగాఁ జొచ్చినపిదప మహాతేజుం డగుభరతుఁ డతనిని జూచి 'ప్రభూ! రామునిపట్టాభిషేకమునకై దూతలం బంపుము. అందులకు నీవు సమర్థుండవు' అనెను. అంత సుగ్రీవుఁడు శీఘ్రముగా సమస్తరత్నఖచితము లయిననాలుగుసువర్ణకలశములును నలుగురువానరోత్తములచేతి కొసంగి వారితో 'వానరులారా! మీరు రేపుతెల్లవాఱునంతకు నాలుగుసముద్రములయుఁ బుణ్యానదులయు జలంబులు నించుకొని యీకలశములం గొని యిచటికి వచ్చి మమ్మెదురుచూచుచుండవలయును' అని యాజ్ఞాపించెను. సుగ్రీవుఁ డిట్లు చెప్పఁగా నేనుంగులంతేసియాకారములు గలమహాత్ములావానరులు గరుడునివలె మహావేగము గలవారలు గావున శీఘ్రముగా నాకా

శమున కెగసిపోయిరి. అంత *జాంబవంతుఁడును హనుమంతుఁడును వేగదర్శి యను వానరుఁడును ఋషభుఁడును జలములతో నిండినకలశములను దెచ్చిరి. జాంబవంతుఁడు మొదలు గాఁ గలయావానరులు నలువురును నయిదువందలనదులనుండి జలమును కలశములం బట్టి తెచ్చిరి. పిదప బలసంపన్నుఁ డగుసుషేణుఁడు తూర్పుసముద్రమునుండి సర్వరత్నములు దాపినసువర్ణకలశమున జలమును దెచ్చెను. ఋషభుఁడు దక్షిణసముద్రమునుండి బంగారుకలశమున జలంబు నించి యచ్చటి రక్తచందనపురెమ్మలచే దానిని గప్పి వేగమునఁ దెచ్చెను. గవయుఁడు వాయువేగుఁడు గావున పడమటిసముద్రమునుండి చల్లనిజలమును గొప్పరత్నకలశమునం దీసికొనివచ్చెను. సమస్తగుణసంపన్నుఁడును గరుడవాయువేగుఁడును నగుధర్మాత్ముఁ డానలుఁడు శీఘ్రముగా నుత్తరసముద్రమునుండి జలమును దెచ్చెను. అంత శత్రుఘ్నుఁడు తానును మంత్రులు నామేటివానరులు దెచ్చినజలమును జూచి రామునియభిషేకమునకై పురోహితశ్రేష్ఠుం డగువసిష్ఠమహర్షికిని బంధువులకును సముద్రాదిజలములు వచ్చి యుండుటను దెలిపెను. అంతఁ బరిశుద్ధుఁడును వృద్ధుండు నగువసిష్ఠుఁ

## శ్రీరామునిపట్టాభిషేకమహోత్సవము.

డు బ్రాహ్మణులతోడం గూడి రాముని సీతాసమేతముగా రత్నమయపీఠంబునఁ గూర్చుండఁబెట్టెను. అంత నష్టవసువులు దేవేంద్రు నభిషేకము గావించునట్లు వసిష్ఠుఁడును వామదేవుఁడును జాబాలియుఁ గాశ్యపుఁడును గాత్యాయనుఁడును సుయజ్ఞుఁడును గౌతముఁడును విజయుఁడు ననెడియీయెనమండ్రును నిర్మలమును సుగంధియు నయినజలముచేఁ ఋషరులలాముఁ డగు రామున కభిషేకము చేసిరి. అంత వసిష్ఠాదులు తా మభిషేకము చేసినపిదప, మిక్కిలిహర్షమున తొలుత ఋత్విజులచేతను, పిమ్మట బ్రాహ్మణులచేతను నంతఁ గన్యలచేతను మంత్రులచేతను పురజనులచేతను యోధులచేతను రామున కభిషేకము చేయించిరి. వసిష్ఠాదులచే నాహ్వానితు లయి లోకపాలుర నలువురును, దిక్కులదేవత లందఱును నొకటిగాఁ జేరి, యాకాశమునం దుండి, దివ్యము లయినసమస్తౌషధిరసములచే రాము నభిషేకించిరి. (తొల్లి బ్రహ్మచేత నేది నిర్మితమైనదో, మనువు తొల్లి దేనిచేత నభిషిక్తుఁ డయ్యెనో, అతనివంశపురాజులు క్రమమున దేనిచేత నభిషేకము గావింపఁబడిరో, రత్నములచే వెలయుచు తేజస్సు వెలుంగుచున్న యాకిరీటమును, బంగారువర్ణమై వెలపొడు గయినవస్తువులచే శోభితమై మిక్కిలిసుందరములైననానావిధరత్నములచే చిత్రింపఁబడి యున్నసభయందు, నానామణిమయమైనపీఠమునందు నుంచి విధ్యుక్తముగాఁ బూజించి పిదప మహాత్ముం డగువసిష్ఠుఁడును

* జాంబవంతుఁడు మొద లగునలువురు నదీజలములను సుషేణుఁడు మొద లయినలువురు సముద్రజలములను దెచ్చుటకు నియోగింపఁబడి రని తెలియునది. జాంబవదాదులలోఁ జేరినఋషభునకంటె సుషేణాదులలోఁ జేరినఋషభుఁడు వేఱని తెలియునది.

ఋత్విజులును ఋషులును నా కిరీటముతో రాము నభిషేకించిరి )అప్పుడు రామునకు శుభ మయిన శ్వేతచ్ఛత్రమును శత్రుఘ్నుఁడు పట్టెను. వానరరాజయినసుగ్రీవుఁడు తెల్లనివింజామరవీచెను. రాక్షసేంద్రుఁ డగువిభీషణుఁడు చంద్రునివలెఁ దెల్లనై మెఱయుచున్న మఱియొకవింజామరను బట్టి సంతుష్టిమీఱ వీచెను. వాయుదేవుఁడు దేవేంద్రునిపనుపున నిజకాంతిచే నెంతయు వెలుంగుచున్న దై నూఱుదామరలతోఁ గొమరారుచున్న బంగారుహారమును దెచ్చి రాముని కొసంగెను. వాయుదేవుఁడు మరల నింద్రుఁడు ప్రేరింపఁగా, సర్వరత్నములతోఁ గూడినదియు నాయకమణిచే నడుమ నలంకృత మయినదియు నగుముక్తాహారమును రామున కొసంగెను. పట్టాభిషేకమున కర్హుం డయినయారామునియభిషేకసమయమున సంతోషమున దేవగంధర్వులు పాడిరి. అప్సరోజనము లాడిరి. ఆయభిషేకసమయమున భూమియందు *లెస్సగాఁ బైరులుపండెను. వృక్షములు మంచిఫలములతో నొప్పెను. పుష్పములు మే లయినవాసనలు గుబాళించుచుండెను. పురుషలలాముఁ డగు రాముఁడు తొలుత లక్షగుఱ్ఱములను క్రొత్తగా నీనినలక్షయావులను నూఱాఁబోతులను, బ్రాహ్మణుల కొసంగెను. రాముఁడు మరల, ముప్పదికోట్లబంగారునాణెములను మఱియు నమూల్యము లయిననానావిధవస్త్రాభరణములను బ్రాహ్మణుల కొసఁగెను. ఆపురుషతిలకుఁడు సూర్యకిరణములంబోలె వెలుంగుచు మణులు మెండుగాఁ బొదిఁగియున్న దివ్యమయిన బంగారుహారమును సుగ్రీవున కొసంగెను. రాముఁడు మిక్కిలి ప్రీతి గడలుకొన వాలికుమారుఁ డగునంగదునకు వైడూర్యమణులును వజ్రములును బొదుగఁబడి వింతపొలుపు గులుకుచున్న బాహుపురులను నొసంగెను. రాముఁడు సీతకు, మే లయినరత్నములతోఁ గూడినదై చంద్రకిరణములవలె మెఱుంగులఁ దుఱఁగలించుచున్నదియు సీడుంజోడు లేనిదియు నగునొకముక్తాహారమును (హనుమంతునకియ్యందగు ననుతలంపున) నొసంగెను. అంత, సీత, స్త్రీల కేదిచేయుటకును స్వాతంత్ర్యము లేనందున, భర్తయనుజ్ఞ నెదురుచూచుచు నతనియనుమతిఁ గనుఁగొని, నిర్మలములును దివ్యములు నయిన రెండువస్త్రములును, సుందరము లయినయాభరణములును వాయుపుత్త్రుం డగుహనుమంతున కొసంగినదయ్యె. మఱియు నాబిడ రాముఁడు తన కొసంగిన †ముక్తాహారమును మెడనుండి తీసి వానరుల కెవ్వరికి నియ్యందగునో యని సమస్తవానరులఁ జూచుచు, నెవ్వని కియ్యఁదగునని భర్తయభిప్రాయమో యనుచు యతనిని

---

* పూర్వము 'విషయే తే మహారాజ రామవ్యసనకర్శితా॥ అపి వృక్షాః పరిమ్లానా స్సపుష్పాంకురకోరకాః' అని వాఁడి దూలినట్లు చెప్పఁబడినవస్తువులన్నియు నిపుడు రామసంశ్లేషమువలన నప్పటిదశను విడిచి మిక్కిలి సంతుష్టము లయినవని యిందుఁ జెప్పఁబడియె.

† సీత, రాముఁడు తనకాసనస్సునందు ముక్తాహారమిచ్చుట తనచేతులార నెవ్వనికో యిప్పింపఁదలఁచియేయని యభిప్రాయమును గనుఁగొని పిదప నెవ్వరికది యియ్యఁదగునో యని యెల్లవానరులను, భర్త యభిప్రాయ మెవ్వనియందో యని భర్తను, మాటికిఁ జూచినదని తెలియునది.

మాటిమాటికిం జూచెను. రాముండింగితజ్ఞుండు గాన సీతాదేవియభిప్రాయమును దెలిసి యాబిడతో 'సుందరీ! కాంతా!*ఎవ్వనియందు బలమును బరాక్రమమును బుద్ధియు మొదలుగా సమస్తకల్యాణగుణములు నున్నవో, మఱెవ్వండు, వాండెట్టివాండయినను నీకు సంతోషము గావించినాండో, యట్టివానికి నీహారము నొసంగుము' అనెను. అంత నల్లనివాలుంజూడ్కులు గలయాసీత ఆముక్తాహారమును హనుమంతున కిచ్చెను. తెల్లని మేఘముతోం గూడి పర్వతము దేజరిల్లుచున్నట్లు, చంద్రకిరణసమూహమునలె మిక్కిలియుం దెల్లనయినయాహారమును దాల్చి హనుమంతుండు ప్రకాశించెను. అంతం బరంతపుండయిన యాభూవరుండు రాముండు, ద్వివిదునకును మైందునకును నీలునకును వారు వారు కోరినట్లు గుణములుగలవస్తువిశేషముల నన్నిటిని బహూకృతిగా నొసంగెను. సమస్తవానరులలోపల వృద్ధులగువారలకును మఱియు నితరవానరోత్తములకును, రాముండు వారివారియంతరువులకుం దగినట్లు, వస్త్రములను భూషణముల నిచ్చి గౌరవించెను. అంత నెట్టికార్యమునేని చుల్కంజేయు రాముండు †విభీషణునకును సుగ్రీవునకును హనుమంతునకును జాంబవంతునకును మఱియుం దక్కినసకలవానరముఖ్యులకును వారివారి పరువులకు దగినట్లు సమృద్ధములుగా రత్నములు మొదలయిన కామితపదార్థముల నొసంగంగా, అందఱును మనంబుల మిక్కిలి సంతుష్టులయి తమతమపట్టులకుం బోయిరి. అంత వానరసింహులందఱును మహాత్ముం డగు రామునిపట్టాభిషేకమహోత్సవమును జూచి రాజేంద్రుం డగు రాముని యనుజ్ఞనొంది కిష్కింధాపురమునకుం బోయిరి. వానరశ్రేష్ఠుం డగు సుగ్రీవుండు రాముని యభిషేకమును జూచి(యతనివలనం బూజలంది కిష్కింధాపురమునకుం) బోయెను. (రాముండు కోరినపదార్థములనెల్లం బూజింపంగా) రాక్షసరాజగు విభీషణుండు§ఇక్ష్వాకుకులధన మయిన శ్రీరంగవిమానమును గొని లంకకుం బోయెను. ఆరాముండు

* బలము సముద్రమును దాటుటచేతను, పరాక్రమము లంకను దహించుటచేతను, బుద్ధి యశోకవనికను బ్రవేశించుటచేతను గలవాండు హనుమంతుండే యని రాముండు సూచించి మరల నితరులను దెక్కపఱిచినట్లు దానివలనం దోంచుచున్నది గాన 'నీ కెవ్వనియందు సంతోషము గలదో వాని కిమ్మ' న్నాండని తెలియునది.

† ముందు విభీషణుని బహూకరించుట చెప్పంబడకున్నను నపుడట్లు సంభావింపంబడినవారిని మరల గణించునపుడు విభీషణుండు మొదటం జెప్పంబడుటచే విభీషణుండును, సుగ్రీవాదులకుం బూర్వమే సంభావింపంబడినాండని యర్థసిద్ధముగాం దెలియుచున్నది. గోవిందరాజులు.

§ ఇది గోవిందరాజమతము. ఇక్ష్వాకుకులధన మనంగా వారికులదైవతమయిన శ్రీరంగవిమానమని సంప్రదాయము. మహేశ్వరతీర్థులిట్లు 'కులధన మనంగా రాముండు పూర్వమిచ్చెదనని ప్రతిజ్ఞ చేసియున్న రాక్షసకులధన మగు లంకారాజ్యము గాని శ్రీరంగవిమానము గాదు. ఏలనంగా రాముండు తనయవతారసమాప్తికాలమందు విభీషణునకు శ్రీరంగవిమానము నిచ్చినట్లుత్తరకాండమునం జెప్పంబడెను; కాన పట్టాభిషేకసమయమందు విభీషణుండు రంగవిమానమును బొందుట కయుక్తి లేదు. అట్లుత్తరకాండమున 'కించాన్యద్వక్తుమిచ్ఛామి రాక్షసేంద్ర మహాబల । ఆరాధయ జగన్నాథమిక్ష్వాకుకు

శత్రువులనందఱిని వధించి మహాయశమునొంది సర్వోత్కృష్టుఁడయి దుష్టుల శిక్షించుచు సమస్తరాజ్యమును మిగుల సంతోషమునఁ బాలించెను. రాముఁడు ధర్మజ్ఞుండగు లక్ష్మణునిఁ జూచి తాను *ధర్మపరాయణుఁడుగావున 'లక్ష్మణా! నీవు ధర్మజ్ఞుఁడవు. కాననీకుఁ జెప్పనక్కఱలేదు. మనువు మొదలయినపూర్వరాజులు, బలసంపత్తిని బాలించుచుండినయీభూమండలమును నీవు నాతోడంగూడి పరిపాలింపుము మన తాతలు ముత్తాతలు మొదలగుపూర్వులు పూనియుండినయీరాజ్యభారమును నీవు యౌవరాజ్యము నవలంబించి నాతోఁ బాటిగా వహింపుము' అనెను. రాముఁడు యౌవరాజ్యమును గయికొను మని నియోగపూర్వకముగా నెంత చెప్పినను, అనునయవచనంబుల నెంత యడిగికొన్నను,లక్ష్మణుఁడు దానినెంతమాత్రము నంగీకరింపఁ డయ్యె.అంత మహాత్ముఁడు రాముఁడు యౌవరాజ్యమునందు భరతు నభిషిక్తుఁగావించెను. రాజలలాముం డగు రాముఁడు, పౌండరీకమును, అశ్వమేధమును వాజపేయమును, మఱియు నితరము లయిన నానావిధయజ్ఞములను బలుమాఱు గావించెను. రాముఁడు పదివేలసంవత్సరములు రాజ్యము గావించి యుత్తమాశ్వములతోను,

---

లదైవతమ్' 'మహాబలుం డగురాక్షసరాజా! మఱియు నింకొకటి నీతోఁ జెప్పఁదలఁచుచున్నాను. ఇక్ష్వాకుకులదైవత మయినజగన్నాథు నారాధింపుము' అని రాముఁ డవతారము ముగియునపుడు విభీషణునితోఁ జెప్పెనఁట. అట్లె పద్మపురాణమందును 'యావచ్చన్ద్రశ్చ సూర్యశ్చ యావత్తిష్ఠతి మేదినీ। తావద్రమస్వ రాజ్యస్థః కాలే మమపదం వ్రజ। ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై స్వవిశ్లేషాసహిష్ణవే। శ్రీరఙ్గశాయినం స్వస్థ మిక్ష్వాకుకులదైవతమ్। రఙ్గంవిమానమాదాయ లంకాం ప్రాయాద్విభీషణః' "చంద్రసూర్యు లుండువఱకును భూమియుండువఱకును నీవు రాజ్యమును బాలించుచు సుఖముగానుండుము.అపిమ్మట మహాప్రలయమపుడు నాపదమును బొందుము.' అని రాముఁడు చెప్పి తనవియోగమునకుఁ దాళఁజాలని విభీషణునకు నిక్ష్వాకుకులదైవత మైనకడనున్న శ్రీరంగశాయి నిచ్చెను. విభీషణుఁడు రంగవిమానమును దీసికొని లంకాపురికిఁ బోయెను" అని రామావతార సమాప్తికాలమునందు వచ్చిన విభీషణునకు రాముఁడు రంగవిమానము నిచ్చినట్లు చెప్పంబడియున్నది. కాఁబట్టి రాముఁడు పూర్వము చెప్పిన లంకారాజ్యమును నిచ్చుటయే యిపుడు మరలఁ జెప్పఁబడినదిగాని వేఱుగాదు' అనుచున్నారు. ఇందులకు సమాధానమెట్లన —'కించాన్యద్వక్తుమిచ్ఛామి' అనెడిశ్లోకములు రెండును ప్రక్షిప్తములనికొందఱు చెప్పినట్లు మహేశ్వరతీర్థులే చెప్పియున్నారు. అవి ప్రక్షిప్తములు గాఁదలంచినచో, పాద్మపురాణవచనములను గల్పాంతరమును గూర్చినవిగా నెన్నినచో, పూర్వమే ప్రాప్త మయినలంకారాజ్యమును మరలఁబొందెననుట వ్యర్థమగుటను దెలిసినచో, ఈదోషమునకుఁ బరిహార మేర్పడుచున్నదని తెలియునది. కాన గోవిందరాజ మతానుసారముగా కులధనమనఁగా శ్రీరంగవిమానమే యని తెలియునది.

* రాముఁడు, తనతండ్రి పూర్వము తనకు పట్టాభిషేకముసేయఁ బ్రయత్నించినపుడు, భరతుని యసన్నిధానమున లక్ష్మణునితో 'లక్ష్మణేమాం మయాసార్ధం ప్రశాధిత్వం వసున్ధరామ్' 'లక్ష్మణా! నీవు నాతోఁగూడ నీభూమిని బాలింపుము' అని చెప్పెను. 'రామోద్విర్నాభిభాషతే' అన్నట్లు రాముఁడు మొదట నొకటిచెప్పి మఱల వేఱొకటి చెప్పఁడు గావ యామాటచెప్పిన లక్ష్మణునికంటె జ్యేష్ఠుఁడైన భరతుఁడున్నను, లక్ష్మణునే యౌవరాజ్యమునఁ బట్టముగట్ట నియోగించెనని తెలియునది.

భూరిదక్షిణలతోడం గూడినయశ్వమేధయాగములు నూఱు గావించెను. ఆజానుబాహువులును బలుమూఁపులును గలరాముఁడు లక్ష్మణుండు సహాయుండై యొప్ప, మిక్కిలియుఁ బరాక్రమము మెఱసి భూమిని బరిపాలించెను. ఆప్రజలభాగ్య మేమి చెప్ప! ధర్మాత్ముఁడగురాముఁడును మిక్కిలియుత్తమ మయినరాజ్యమును బొంది మిత్రులను జ్ఞాతులను బాంధవులనుం గూడి బహువిధయజ్ఞములను గావించెను. రాముఁడు రాజ్యము పాలించుచుండునపుడు, స్త్రీలు వైధవ్యదుఃఖమే తెలియరయిరి. దుష్టమృగములవలనిభయముగాని రోగభయముగాని యెంతమాత్రముగలుగదయ్యె. లోకమునందు దొంగలే కలుగరయిరి. ఏయనర్థమును నెవ్వనినిగాని ముట్టనుగూడ ముట్టదయ్యె. వృద్ధులకు ముందు బాలుగు మృతిఁ బొందుటయు లేదు. కాన వృద్ధులు బాలురకు ప్రేతకార్యములు గావించుట గానరాదు. సమస్తమును నెప్పుడును సంతోషము నొందియుండెను. సమస్తజనులును ధర్మపరాయణులై యుండిరి. జను లొకరియెడ నొకరు వైరముపూనుటకు నయితికలిగియుండునపుడు రామునిఁ జూచి యతనిమొగమందులకు వాఁడునస యావాఁడుటకు సైఁపఁజాలమిచే నొండొరుల హింసించుకొనక వైరము మానుకొనియుండిరి. రాముఁడు రాజ్యము పరిపాలించునపుడు జనులు వేయిపుత్రులం బడసి, అరోగులయి, శోకదూరులయి, పుష్టియుఁ దుష్టియుఁగలిగి, పెక్కువేలసంవత్సరములు జీవించియుండిరి. రాముఁడు దొరతనము సేయునపుడు, జనులు, 'రాముఁడురాముఁడు రాముఁడు'అని రాముని ముచ్చటలే చెప్పుకొనుచుందురు. జగమంతయు నెచ్చటను, నేన్యవహారమును రామమయము గానే యుండెను. వృక్షము లెప్పుడును బుష్పించుచు నెప్పుడును ఫలించుచు మిక్కిలి తనరుపు గలబోదెలు గలిగి వెలయుచుండెను. మేఘములు కాలముదప్పక వర్షించుచుండెను. వాయువు సుఖముగా వీచుచుండెను. బ్రాహ్మణులును క్షత్రియులును శూద్రులును నెంతమాత్రమును లోభము లేనివారలయి తమకు విహితములగుకర్మములందే తృప్తికలిగి వానిని దప్పక యనుష్ఠించుచుండిరి. రాముఁడు పాలించుచుండఁగా జనులందఱును, ధర్మరతులై ధర్మపరాయణులై, సత్యవాదులై యందఱును శుభలక్షణసంపన్నులయి యుండిరి. రాముఁడు తమ్ములంగూడి సిరి దొలఁకాడ పదునొకండువేల సంవత్సరములు రాజ్యము చేసెను. ఈరామాయణము మున్ను వాల్మీకిమహర్షిచే రచింపఁబడినది; కావ్యంబులందెల్ల మొదటిది. కాన ధనప్రదమును యశస్కరమును ఆయుర్వృద్ధికరము నయినది; రాజులకు జయప్రదమయినది; వేదార్థప్రకాశమయినది. కాన దీని నెవఁడు చదువునో వినునో యామనుష్యుఁడు సమస్తపాపములనుండి విడివడును శ్రీరాముని పట్టాభిషేకమును విన్నయెడఁ, బుత్రులుగోరువానికి సత్పుత్రులుగలుగుదురు; ధనముగోరువానికి ధనముగలుగును. రాజయినవాఁడు వినునేని, శత్రువులనుజయించి భూమిని గయికొనును. స్త్రీలు విందురేని, రామునిని కౌసల్యయు, లక్ష్మణునిని సుమిత్రయు, భరతునిఁ గైకేయియుఁ గన్నవిధమున దీర్ఘాయువు లయినసుపుత్రులం బడయుదురు;

ఎవ్వరికిని క్లేశముగలుగనట్టికార్యములం జేయు రామునివిజయము నంతయుం బ్రతిపాదించెడి యీరామాయణమును విన్నవాఁడు దీర్ఘాయువును బొందును. వాల్మీకిమహర్షిచే రచితమయి వేదోపబృంహణమై యొప్పు నీయాదికావ్యము నెవ్వఁడు శ్రద్ధగలిగి కామక్రోధంబుల నిగ్రహించి వినునో యతఁడు, దారిద్ర్యాది సమస్తకష్టంబులను గడచిపోవును మఱియు దేశాంతరమునకుం బోయియున్నను నది ముగిసి మరలఁ దనబంధువులతోఁ గూడికొనును. ఈలోకముననే రాముని యనుగ్రహమువలన, కోరినవరముల నన్నింటిని బ్రాపించును. ఈరామాయణమును జక్కఁగా వింధు చేసి, దీనంజేసి సమస్తదేవతలును సంప్రీతినొందుదురు. మఱియు గృహమునందు విఘ్నకారులగు భూతములును శాంతములగును. ఈరామాయణమును విన్నయెడ, రాజు భూమండలమునంతయు జయించును. దేశాంతరమునకుం బోయినవాఁడు క్షేమముగా స్వస్థానముఁ జేరును. పుష్పవతు లగుస్త్రీలు మిక్కిలి యుత్తము లయినపుత్రులం బడయుదురు. పురాతన మయినయీయితిహాసమును మనుష్యులు పూజించినను జదివినను, వారి సమస్తపాపములును నశించును. దీర్ఘమయిన యాయువును గలుగును. ఈరామాయణమును క్షత్రియు లెప్పుడును శిరసు నేలసోఁక నమస్కరించి బ్రాహ్మణునివలన వినవలెను. వారలకైశ్వర్యమును, సుపుత్రలాభమును దప్పక కలుగును. సందేహము లేదు. ఈరామాయణమును సంపూర్ణముగా నిత్యమును వినువానియందును జదువువానియందును రాముం డెప్పుడును బ్రీతుండై యుండును. ఏలన, నారాముఁడే సనాతనుండును ఆదిదేవుండును, మహాబాహుఁడును సర్వేశ్వరుఁడు నారాయణుండు నగువిష్ణుండు; కాన యాతఁడు ప్రీతుం డయినచోఁ గొఱంత యేమి? కనుక నతఁ డాయురారోగ్యములను అతిదుర్లభ మయిన ముక్తినిగూఁడ నిచ్చును. మహార్థవంతమైన యీశుభకావ్యమును వినువాఁడు కుటుంబవృద్ధిని ధనధాన్యవృద్ధినిం బడయును; మేటిపడంతులను జేపట్టును; ఉత్తమ మయినసౌఖ్యమునొందును; కోరినకార్యము సిద్ధినొందును; భూమియందలి సమస్తములను బ్రాపించును. ఈపుణ్యచరిత్రము ఆయుష్కరమును ఆరోగ్యకరమును యశస్కరమును మంచి తోఁబుట్టుఁదనము గలిగించునదియు బుద్ధివర్ధకమును సుఖప్రదమును తేజస్కరము నయినది గావున, నభ్యుదయము గోరునట్టి సత్పురుషులు నియమముతో దీని నవశ్యము వినవలయును. జనులారా! ఇట్లిది మున్దుజరిగిన చరిత్రము. మీకు భద్రమగుఁగాక. దీనిని శ్రద్ధతోఁ బఠింపుఁడు. విష్ణుదేవుని మహత్త్వము వర్ధిల్లుఁగాక. రామాయణము విన్నను దానియర్థము గ్రహించినను సమస్తదేవతలును సంతోషింతురు. రామాయణమును వినుటవలనఁ బితృదేవతలును దృప్తిఁ బొందుదురు. మఱియు భక్తి గలిగి యెవరు వాల్మీకిమహర్షికృత మగు శ్రీరామదివ్యచరిత్రప్రతిపాదకమైనయీసంహితను నితరులచే వ్రాయించుదురో తాము వ్రాయుదురో వారలు

